# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

అను

# (నవ్యసాహిత్యచరిత్రము)

## (1827 - 1942)



రచయిత :

కురుగంటి సీతారామయ్య, ఎం.ఏ.,

సంపాదకులు :

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య



**తెలుగు విశ్వవిద్యాలయం**

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి

హైదరాబాద్ - 500 004

NAVYANDHRA SAHITYA VEETHULU
BY: KURUGANTI SEETHARAMAIAH M.A.,

---

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు


ప్రచురణ సంఖ్య - 159
ప్రతులు : 2000
తృతీయ ముద్రణ : 1994

వెల : సాదాప్రతి రూ. 85/-
లైబ్రరీప్రతి రూ. 95/-

ప్రతులకు :

రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 500 004

ముద్రణ

ఫిన్‌ఫాస్ ప్రింటర్స్,
బాగ్ అంబర్‌పేట్,
హైదరాబాదు - 500 013
✆ : 614507

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు - 4.

# ముందుమాట

ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రను ప్రథమంగా ఒక విశిష్టమైన సమగ్రమైన పద్ధతిలో రచించిన ఘనత శ్రీ కురుగంటి సీతారామయ్య గారికి దక్కుతుంది. 1942 నవ్యసాహిత్యం విస్తృతంగా రూపుకట్టుతున్న దశలో, ఆ సాహిత్యస్రష్టలు చాలామందితో సన్నిహితంగా మెలగిన శ్రీ కురుగంటివారు ఆత్మీయభావంతో రచించికూడా సమబుద్ధితో చిత్తశుద్ధితో ఈ గ్రంథాన్ని రచించినారు.

1949 - 51 లలో ఈ గ్రంథాన్ని శ్రీ పిల్లలమర్రి వెంకట హనుమంతరావుగారి సహకారంతో దీనిని పరిష్కరించి చాలా విస్తరించి ఆనాటి వరకు ఉన్న సాహిత్య ధోరణులను ఉద్యమాలను సమీక్షించి ప్రకటించినారు. ఈ గ్రంథం స్థాయిలో ఆధునికాంధ్ర సాహిత్యాన్ని గూర్చిన సమగ్రమైన సాధికార గ్రంథం తరువాత వెలువడలేదంటే అతిశయోక్తి కాదు.

ఆనాటికి శ్రీ కురుగంటివారు, శ్రీ పిల్లలమర్రివారు గ్రంథ రచనలో శాస్త్రీయమైన మార్గాన్ని అవలంబించినారు. అనేక పత్రికలను పరిశీలించి వానిలో ప్రచురితములైన వ్యాసాలు ఉపన్యాసాలు, వార్తాంశాలు, చర్చలూ పరిశీలించి ఆ ఆధారాలను అధస్సూచికలలో విస్తృతంగా సూచించినారు.

నవ్యాంధ్ర సాహిత్య వీధులలో వారు చేసుకొన్న నిశ్చయాలు ఇప్పటికీ పెద్దగా మారలేదనే చెప్పవలసి ఉన్నది. కొన్ని అంశాలు యింకా పరిష్కరించవలసి ఉన్నది. ప్రయోగవాదులను గూర్చి వారి భావాలు అందరూ ఆమోదించేవి.

ఈ గ్రంథంలో సాహిత్య రంగంలోని అన్ని ప్రక్రియాలనూ స్పృశించటంవల్ల ఇంకా చాలినంతగా చెప్పడం జరుగలేదేమోననిపిస్తుంది. ఇప్పుడు కవిత్వము, నవల, నాటకము, విమర్శయిత్యాదిగా ప్రక్రియలు, వేరువేరుగా విచారణచేసి వాని వాని చరిత్రను శాస్త్రీయంగా రచించవలసిన అవసరాన్ని సూచిస్తూవున్నది. ఆ ప్రయత్నానికి కూడా నవ్యాంధ్ర సాహిత్య వీధులు ప్రధానమైన ఆధార గ్రంథంగా కానవస్తున్నది.

ఈ గ్రంథంలో శైలి ఒక పరిశోధనా గ్రంథంవలెకాకుండా మనకు కనుల ఎదుట ఆనాటి సాహిత్య దృశ్యాలను చలనచిత్రంగా చూపించినంతగా ప్రత్యక్షీకరించటం దాని విశిష్టతగా గోచరిస్తుంది. కొన్నాళ్ళక్రితం ఈ గ్రంథం విస్తృతమైన ప్రచారంతో చర్చలో ఉండేది.

సాహిత్య చరిత్రను పరిశీలించేటప్పుడు దానికి ఆధారపీఠమైన జాతి, సంస్కృతి, సంప్రదాయాలను పరిశీలించడం ఎంత అవసరమో, దాని వల్ల మన అవగాహన ఎంతగా స్పష్టపడుతుందో నవ్యాంధ్రసాహిత్య వీధులు తెలియజేస్తుంది.

అరుదైన ఈ గ్రంధాన్ని మళ్ళీ ప్రచురించటానికి అంగీకరించిన శ్రీ కురుగంటి వారి కుమారులు శ్రీ. కె. కృష్ణమూర్తి గారికి మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ఈ గ్రంథాన్ని పరిష్కరించి చక్కని సంపాదకీయాన్ని రచించిన సుప్రసిద్ధ కవిపండితులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు గారికి మా కృతజ్ఞతాభివందనాలు.

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాదు,

తేది: 26.12.1994.

The Hyderabad Telugu Academy Publication 3.

# NAVYĀNDHRA SĀHITYA VĪDHULU

(A History of Modern Telugu Literature)

(1827 — 1942)

"Authors,—essayist, atheist, novelist, realist, rhymester, play your part,
Paint the mortal shame of nature with the living hues of art,
Rip your brother's vices open, strip your own foul passions bare
Down with Reticence, down with Reverence—forward—naked—let them stare"

(LOCKSLEY HALL)

K. Sitaramaiya, M A.,
Nizam College, Hyderabad (Dn.)

# సంపాదకీయము

నవ్యాంధ్రసాహిత్య వీధులు రచించిన శ్రీ కురుగంటి సీతారామయ్య, శ్రీ పిల్లలమర్రి వెంకట హనుమంతరావులు మామా అల్లుళ్ళు. శ్రీ సీతారామయ్య ఒకరే రచయితగా ఈ గ్రంథం తొలి ముద్రణ 1942లో ప్రకటితమైంది. అదే వృద్ధిపొంది 1949 - 51ల మధ్య నాల్గు భాగాలుగా రెండవ ప్రచురణ వెలువడినప్పుడు శ్రీ హనుమంతరావు దాని రచనలో సహకర్తృత్వం వహించినారు. ఈ గ్రంథం తొలి ప్రచురణ (1942) ది హైదరాబాదు తెలుగు అకాడమీ వారి మూడవ ప్రచురణగా వెలువడింది. ఈ సంస్థనే హైదరాబాదు ఆంధ్రసాహిత్య పరిషత్తు అని వ్యవహరించే వారు. అప్పటికి వెలువడిన గ్రంథాలలో శ్రీ సీతారామయ్య 'ఆదర్శప్రభువు' ఏడవ నిజాం ప్రభువు పరిపాలనను, ఆయన గుణగణాలను ప్రశంసించే గ్రంథం. రెండవ గ్రంథం మహమ్మద్ ఖాసింఖాన్ రచించిన ఖురాన్ షరీఫ్ ఆంధ్రానువాదం.

రాబోయే ప్రచురణలలో లీడర్స్ అండ్ లాండ్‌మార్క్స్ ఇన్ తెలుగు లిటరేచర్ అనే శ్రీ రాయప్రోలు సుబ్బారావు గ్రంథము, శ్రీ కురుగంటి సీతారామయ్య వ్యాసావళి, శ్రీ తూములూరి శివరామకృష్ణ నరసభూపాలీయవివరణము, మహమ్మద్ ఖాసింఖాన్‌గారి ఖురాన్ షరీఫ్ రెండవభాగము ఉన్నట్లు నవ్యాంధ్ర సాహిత్య వీధులు తొలిప్రచురణ టైటిల్ చివరిపేజీ పేర్కొంటున్నది. శ్రీ రాయప్రోలువారు ఆ పేరుతో త్రివేణిలో కొన్ని వ్యాసాలు ప్రకటించినారు కాని అవి గ్రంథరూపాన వెలువడినట్లు తెలియరావడం లేదు.

తొలి ప్రచురణలో ఈ గ్రంథం కేవలం 608 పుటలు మూడు భాగాలుగా ఉండగా, రెండవ ప్రచురణలో నాల్గు భాగాలుగా 851 పుటలు ఉన్నాయి. మొదటి ప్రచురణలో 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు అను నవ్యసాహిత్య చరిత్రము' అని ఉండగా రెండవ ప్రచురణలో, 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు' అని క్రింద కుండలీకరణంలో 'నవ్య సాహిత్య చరిత్ర' అని ఉన్నది. వేదాలవారి ఆంధ్ర ధ్వన్యాలోకము, డాక్టర్ టోపాగారి 'ఇస్రారెహయాత్' (వేమన తత్త్వము)లు కూడ హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్ ప్రచురణములే.

శ్రీ కురుగంటి సీతారామయ్య డిసెంబరు 15, 1890లో గుంటూరు జిల్లాలోని వేమూరులో జన్మించారు. మదరాసు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. చేసి సంస్కృతాంధ్రోపన్యాసకులుగా నిజాం కళాశాలలో చాలాకాలం పనిచేసి విశ్రాంతి పొందినా రు. అంతకు పూర్వం కొంతకాలం బెజవాడ జాతీయ పాఠశాలలోనూ, కొవ్వూరు సంస్కృతాంధ్ర కళాశాలలోనూ, తంజావూరు తాళపత్రగ్రంథాలయంలోనూ పనిచేశారు. న్యాయవిద్యనేర్చినవారు. కర్మిష్ఠి, వేద విద్వాంసులు. స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నవారు. నిజాం కళాశాలలో చాలాకాలం సంస్కృతాంధ్రోపన్యాసకులుగా పనిచేసి చివరకు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత అకాడెమీ అనే పరిశోధన సంస్థలో ఉద్యోగం చేస్తూ ప్రశాంతచిత్తులై జీవిస్తూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారి పారిభాషిక పదకోశం నిర్మాణ కమిటీలో సభ్యులై ఒక సమావేశంలో పాల్గొని వచ్చి రాత్రి ఆయాసంతో మరణించినారు. శ్రీ సీతారామయ్య ప్రత్యేక వ్యక్తిత్వం గలవారు. సంస్కృతాంధ్రాలలో విద్వాంసులు, చరిత్రపరిశోధకులు, సాహిత్య వివాదాలలో పాల్గొన్న నిర్భీక చిత్తవృత్తి గల ధీరుడు. శ్రీ రామలింగారెడ్డి కవిత్వ తత్త్వవిచారాన్ని ఖండిస్తూ 1914లో 'అలంకార తత్త్వవిచారం' ప్రకటించారు. తంజాపురాంధ్రనాయకరాజుల ఇతిహాసాన్ని 'తంజాపురాంధ్రనాయక రాజ చరిత్రము' 1932 లో ప్రకటించారు. వారి రచనలలో కథాత్రయి (1952) అనే కథల సంపుటి ఉన్నది. నవ్యాంధ్ర సాహిత్య వీథులు కాక ఇంగ్లీషులో 'హాండ్‌బుక్ ఆఫ్ తెలుగు లిటరేచర్' అని ఒక గ్రంథం 1941 లో ప్రచురించినట్లు తెలుస్తున్నది. వీరి మరో గ్రంథం 'కొందరు తంజావూరు కవులు, పండితులు' అనేది.

శ్రీ సీతారామయ్య ఉద్యోగ జీవితంలో ప్రధాన భాగం నిజాం సంస్థానంలో జరగటం వలన ఆయన చాలామంది ఉద్యోగస్థుల వలె నిజాం ప్రభుత్వం పట్ల వినయ విధేయతలతో ఉండేవారు. అప్పుడు నిజాం సంస్థానంలో ఆంధ్ర మహాసభ, స్టేట్ కాంగ్రెస్, నిజాంరాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు వంటి సంస్థలు నిర్వహించే జాతీయ విముక్తి పోరాటాలతోగానీ, సాహిత్యోద్యమాలతో గాని వారికి సామరస్యం ఉండేది కాదు. రాయప్రోలు వారు, ఈయనా, మహమ్మద్ కాశింఖాన్, మరి కొంతమంది హైదరాబాదు సాహిత్యరంగంలో ఒక వర్గం కాగా, శ్రీ సురవరం

ప్రతాపరెడ్డి, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ దేవులపల్లి రామానుజ రావు, శ్రీ కాళోజీ ప్రభృతులు మరొక వర్గంగా ఉండేవాళ్లు. వీరి పరిషత్తును వారు నిరాశాపరిషత్తు అని పేరు పెట్టగా, వారి సంస్థను వీరు శ్రీ రాయప్రోలు, శ్రీ మహమ్మద్ కాశిం ఖాన్, శ్రీ సీతారామయ్యల పేర్ల ఆధారంగా రాకాసి పరిషత్ అని పిలిచేవారు. నిజాంకు వ్యతిరేకంగా ఒక వైపు పోరాటం నడుపుతూ ఉండగా, అతన్ని ఆదర్శ ప్రభువని ప్రశంసిస్తూ గ్రంధాలు రాసే ధోరణి హైదరాబాదు సంస్థానంలోని తెలుగువారికి బాధ కలిగించే విషయంగా ఉండేది.

అయితే శ్రీ సీతారామయ్య నిత్యమూ తెల్లని ఖద్దరు ధరించేవారు. పరిస్థితుల ప్రాబల్యం ఆయనచేత అల్లా చేయించి ఉండవచ్చును. శ్రీ రాయప్రోలు వారు ఆంధ్రకవిత్వంలో జాతీయోద్యమ ప్రవర్తకులే అయినా తెలంగాణములో ఆయన నిజాం ప్రభుత్వ సమర్థకులుగానే ఉండేవారు.

శ్రీ రాయప్రోలువారికీ, శ్రీ సీతారామయ్యగారికీ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో నిర్వహించిన ఒక తెలుగు సారస్వత సమితి సమావేశంలో శ్రీ శివశంకరస్వామి 'భట్టాచార్యులు' అని బిరుదుప్రదానం చేసినారట. అందువల్లనే రెండవముద్రణలో కురుగంటి సీతారామభట్టాచార్యులు అని మారిపోయింది.

శ్రీహనుమంతరావు గుంటూరుజిల్లా బ్రాహ్మణకోడూరులో 31-12-1898లో జన్మించారు. శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, కురుగంటి వారి శిష్యులై విశాఖపట్టణంలో ఎం.ఏ. చేసినారు. కవితలు, కథలు, నాటికలు రచించడమే కాక సాహిత్య విమర్శలో విద్యార్థులకు మంచి శిక్షణ యిచ్చిన వ్యక్తి. గుంటూరు హిందూ కళాశాలలో అధ్యాపకుడుగా పనిచేశారు. ఈయన యిల్లును శారదాపీఠంగా వ్యవహరించేవారు.

శ్రీ హనుమంతరావు విద్యాభ్యాసం కొంత భాగం హైదరాబాదులో సాగివుండటం వల్ల ఆయన యిక్కడ సాధనసమితి స్థాపకులలో ఒకరైనారు (1939). తెలంగాణంలోని కవిపండితులతో పరిచయము, నాటి యిక్కడి సాహిత్యోద్యమాలతో సాన్నిహిత్యమూ ఏర్పడ్డవి. గురువుల అనుగ్రహం పొందిన వారు కావటం వల్ల సాహిత్యరంగంలో నిరంతరమూ దోహదశీలమైన ప్రయత్నాలు కొనసాగిస్తూ వచ్చారు.

ఆధునిక రూపాన్ని సంతరించుకొన్నది. ఒక విధంగా తరువాతి సాహిత్య చరిత్రకారులకు శ్రీ వీరేశలింగం గ్రంథం ప్రాథమికాధార పీఠం. ఇంతవరకు చారిత్రకులకు కవుల దేశ కాలాలను, కర్తృత్వాన్ని నిర్ణయించటమే సరిపోయింది. ఈ ప్రయత్నాల ఆధారంగానే తరువాతి కాలంలో సాహిత్యవిమర్శలలో పూర్వాపర సాహిత్యపరిణామ పరిశీలనమునకు స్థానం లభించింది.

కవుల చరిత్రలనుంచి సాహిత్య చరిత్రను నిర్మించే ప్రయత్నం ఆరంభమయింది. కవుల దేశ కాలాలకు ప్రాధాన్యం తగ్గి, వారి రచనలకు, వస్తు భావ విన్యాసాలలో వచ్చిన మార్పులకు, ప్రక్రియాదులలో వచ్చిన నూతన ప్రయోగశీలతకూ ప్రాముఖ్యం కలిగింది. దీని అనంతరం వెలువడిన సాహిత్య చరిత్ర శ్రీ కె. వెంకట నారాయణ 'కవిత్వ వేది'ది. ఈ గ్రంథం స్పష్టమైన ఆధునిక అభివ్యక్తితో వెలువడింది. ఆ యా యుగాల సాహిత్య చరిత్రలకు ఆధారముగా దేశ చరిత్ర, సామాజిక చరిత్రలు స్వీకరింపబడ్డాయి.

శ్రీకాశీనాధుని నాగేశ్వర రావు పంతులు ఆంధ్ర వాఙ్మయ సూచిక (1929) కు పీఠికగా సంతరించిన ఆంధ్ర సాహిత్య చరిత్ర చిన్న ప్రయత్నమేమీ కాదు. శ్రీకాశీనాధునివారి పరిణామపరిశీలనం ఎంత నిశితమైందో ఈ క్రింది ఉదాహరణం తెలియజేస్తుంది.

'ఆంధ్ర వాఙ్మయ స్వరూప స్వభావములను ప్రత్యక్షముచేసి వాఙ్మయ వికాసమునకవసరమైన విధానమును సారస్వతోపాసకులు నిర్ణయించుట కాంధ్ర వాఙ్మయసూచిక ప్రకటింపబడింది. ... ఆది యుగమునందు పండితారాధ్యమైన వాఙ్మయము వర్తమాన యుగము నందు ప్రజారాధ్యమగుచున్నది. సంస్కృత ప్రాయమైన వాఙ్మయము తెలుగురూపము తాల్చుచున్నది. వైదికకర్మపరమైన వాఙ్మయము భక్తిపరమగుచున్నది. పద్యాత్మకమైన వాఙ్మయము గద్యస్వరూపమును పొందుచున్నది. వాఙ్మయమునకు విజ్ఞాన వ్యాపనము, రసానందము పరమార్థములుగ పరిగణింపబడుచున్నవి.'

అయితే మళ్ళీ కొత్త చారిత్రకసామగ్రి రావడం, పూర్వ నిర్ణయాలు పరిశీలింపబడవలసిన పరిస్థితీ, మళ్లీ కవుల చరిత్రల క్రమాన్ని పరిశీలించడానికి

ప్రోత్సహించింది. ఈ ప్రయత్నంలో బృహత్కృషి చేసింది ఆంధ్రకవితరంగిణి వెలువరించిన శ్రీ చాగంటి శేషయ్య. ఈ మహాప్రయత్నంలో కవుల కాలాన్నీ, వంశక్రమాన్నీ, నివాస స్థానాలనూ, సమకాలీన జీవన పరిస్థితులనూ విపులంగా చర్చించి నిర్ణయించేసే అవకాశం లభించింది.

అయితే తరువాత వెలువడిన ఆంధ్ర సాహిత్య చరిత్రసంగ్రహము (శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం), ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యము, శ్రీశిష్టా రామకృష్ణశాస్త్రి అసంపూర్ణంగా కవిత్రయ యుగం వరకు రచించిన వాఙ్మయ చరిత్రము, శ్రీ నిడుదవోలు వెంకటరావు అసంపూర్ణంగా రచించిన తెలుగు కవుల చరిత్రలు ముఖ్యమైన గ్రంథాలే.

ఇవికాక శ్రీ వంగూరు సుబ్బారావు శతకవాఙ్మయ చరిత్రము, శ్రీ నిడుదవోలు వారి వచన వాఙ్మయచరిత్రము, ఉదాహరణ వాఙ్మయ చరిత్రములు పేర్కొనవలసినవి. తరువాతికాలంలో విశ్వవిద్యాలయాలలో పరిశోధనలుగా వెలువడిన యక్షగానవాఙ్మయ చరిత్ర (శ్రీయస్వీజోగారావు) తెలుగు నాటక వికాసము (శ్రీ. పి.యస్.ఆర్. అప్పారావు) తెలుగు జానపదవాఙ్మయము (శ్రీ బి. రామరాజు)తెలుగు నవలా వాఙ్మయం మీద శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ, శ్రీ మొదలి నాగభూషణ శర్మల గ్రంథాలు, శతక వాఙ్మయం గూర్చి శ్రీ కే. గోపాల కృష్ణారావు గ్రంథం వాఙ్మయరంగంలోని అనేక కోణాలపైన కొత్త వెలుగులు ప్రసరింపజేసినాయి. యింకా హరికథా వాఙ్మయం గూర్చి (శ్రీ దోణప్ప) గ్రంథం కూడా ముఖ్యమైందే.

అయితే ఆధునిక వాఙ్మయాన్ని గూర్చిన కృషి ఇటీవల ప్రారంభమయిందే. విశ్వవిద్యాలయాలలో ఆంధ్ర వాఙ్మయ చరిత్ర బోధనకు రూపకల్పన చేసిన శ్రీ పింగళి లక్ష్మీకాంతం ఆధ్వర్యములో భావ కవిత్వం మీద పరిశోధన చేసిన శ్రీ పాటిబండ మాధవ శర్మ ఎం.లిట్. పరిశోధన గ్రంథం ఒక విధంగా ఈ మార్గంలో ప్రథమ ప్రయత్నం కావచ్చు. అయితే అంతకు పూర్వమే ప్రకటితమైన శ్రీ ఉమా కాంత విద్యాశేఖరుల నేటి కాలపు కవిత్వం (1928) విమర్శనాత్మకమే కాని చారిత్రకమైన తీర్పు చెప్పే లక్షణం గలది కాదు.

శ్రీ పాటిబండ మాధవశర్మ గ్రంథం ఇంకా ప్రకటితం కాలేదు కాని ఇది అపూర్వవిషయాలను స్పష్టంగా చర్చించినట్లు వింటున్నాము. తరువాతి ఆధునికాంధ్ర కవిత్వ చరిత్ర నిర్మాతలకు ఇది పురోగామిగా ప్రవర్తించిందని తెలియవస్తున్నది.

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి ఆంధ్ర రచయితలు (1950) వర్తమానకాలంలోని ప్రముఖరచయితల జీవన చరిత్రలను సాహిత్యకృషినీ తెలియపరచి అంచనావేసిన గ్రంథం. దీని తరువాత ఆధునికాంధ్ర కవిత్వం గూర్చి వెలువడిన గ్రంథం శ్రీ సి. నారాయణరెడ్డి రచన ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయము, ప్రయోగములు అనేది (1967). తరువాత శ్రీ వెల్చేరు నారాయణరావు 'తెలుగులో కవితావిప్లవాల స్వరూపం' (1978) గ్రంథం కూడా ముఖ్యమైన రచనయే.

అయితే శ్రీ కురుగంటి వారి గ్రంథం పాటిబండ వారి రచన వెలువడక ముందే, దాని ప్రభావంతో నిమిత్తం లేకుండా 1942లో ప్రకటింపబడిన తొలి ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర గ్రంథం. దీని రెండో ప్రచురణ పూర్తిగా వెలువడక ముందే మధునాపంతుల వారి 'ఆంధ్ర రచయితలు' (1950) వెలువడింది.

- 3 -

శ్రీ కురుగంటి వారి నవ్యాంధ్ర సాహిత్యవీధులు ఒక అద్భుతమైన ప్రయత్నం. ఆయన స్వయంగా ఆధునికాంధ్ర సాహిత్యం పునాదుల నిర్మాణం దగ్గర నుంచీ పరిశీలన చేస్తూ దాని బాగోగులను గూర్చిన అంశాలలో పాల్గొంటూ వచ్చారు. ఆయన ఒక విధంగా ఆధునికాంధ్ర కవిత్వానికి బంగారు దశాబ్దమయిన 1891-1900 కాలానికి అతి సన్నిహిత పూర్వ దినాలలో పుట్టినవారు. వ్యక్తిగతంగా ప్రముఖులైన రచయితలతో సంబంధాలు ఉండేవి. ఇలాంటి స్థితిలో సాహిత్య చరిత్ర రచనలో రచయితకు ఎన్ని సదుపాయాలు ఉంటవో, అన్ని ఇబ్బందులు ఉంటవి. ఇంత సన్నిహితమైన కాలాన్ని గూర్చి వ్రాయటంలో. అప్పటికి ఆ రచయితలలో ఎక్కువ మంది రచనా రంగంలో అత్యంతక్రియాశీలంగా ప్రవర్తిస్తున్న వాళ్లు. ఈ సన్నిహితులైన క్రియాశీలురైన మిత్రులైన కవుల రచనలను గూర్చి, అంచనా వేయటం, మొగమాటం లేకుండా చెప్పటం ఎంతో క్లిష్టమైన అంశం.

మరొక విశిష్టమైన అంశం - హైదరాబాదులో ఉంటూ పత్రికలూ, పుస్తకాలూ సేకరించి, ఆకరాలను సూచిస్తూ ఈ గ్రంధరచన ఒక తీవ్రమైన పరిశోధనాంశంగా తీర్చిదిద్దటం - వేరొక వైపు అత్యంతమూ సరళమైన శైలిలో పాఠకుల ఆసక్తి ఏ క్షణాన తగ్గకుండా ఒక నవల లాగా - ఆత్మీయమైన శైలిలో ఈ రచనను కొనసాగించటం. ఈ విధమైన సాఫల్యాన్ని సాధించినవాళ్లు తెలుగు సాహిత్యచరిత్ర నిర్మాతలలో ఒకరిద్దరు ఉన్నారేమో వెదుక్కోవలసిందే. అయితే రెండవ ముద్రణ అయ్యేసరికి కూడా రచనలోకి విద్యైకవిషయాల విస్తరణ పెరిగీ ఈ లక్షణం లోపించకపోవటం మనం గమనించవచ్చు.

అయితే ఈ గ్రంధ నిర్మాణానికి ఆయనకు ప్రేరణగా పనిచేసింది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ నవ్యసాహిత్యపరిషత్తు సప్తమవార్షికోత్సవంలో బెజవాడలో చేసిన అధ్యక్షోపన్యాసం (1940). ఆయన దానిలో నవ్య సాహిత్యాన్ని ఐదు దశలుగా వింగడించి వాటికి కలిగిన సాహిత్య పరిణామాన్ని భాషా కవిత్వ వచనాది ప్రక్రియలలో విశ్లేషించి చూపించారు. (ఈ ఉపన్యాసాన్ని ఈ గ్రంథం చివరన అనుబంధంగా చేర్చడం జరిగింది.)

ఈ ఉపన్యాసంలో విశ్వనాథ నవ్య సాహిత్యాన్ని నిర్వచించారు. 'సాహిత్యం అంటే ఒక జాతియొక్క సంస్కారం. మన జాతి పూర్వం ఒక గొప్ప సంస్కార దశను పొందింది. సృష్టిక్రమంలో సృష్ట్యాదికాల నిర్ణయంలో, భిన్న రాజవంశ నిర్ణయంలో, సంఘ ధర్మనీతులలో, ఆర్థిక రాజకీయాలల్లో, సారస్వత పథాలల్లో, ఒక విశిష్టమైన సంస్కారంతో కూడిన సిద్ధాంతాల మీద మన జాతి నడిచింది. ఇన్నాళ ఆంగిలేయులు మన్ని ఆక్రమించటం చేత మనలో సంస్కారం మీద అభిమానం పోయింది. పాశ్చాత్య దేశీయుల సంస్కారం మీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్ర నిర్మాణం, సృష్ట్యాదికాల నిర్ణయం, సంఘ ధర్మాలు వీటిని ఏఏ గ్రంధం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం.'

ఈ నిర్వచనం చేయటమేకాక ఆ పాశ్చాత్య సాహిత్య సంస్కారం చేత మనదేశంలో కొత్తగా పుట్టిన ప్రక్రియలు - ఖండకావ్యం, నవల, నాటకం, చిన్న కథ,

గేయాలు, చిన్న నాటకం, హాస్యరచన అనే ఏడు అని నిర్ణయించారు. పారడీల ప్రసక్తి కూడా తెచ్చి అదీ ఒక ప్రక్రియ అన్నారు ఆయన. భవిష్యత్తును గూర్చి చెప్తుంతూ 'ఇందులో ఏది ఎట్లా జరిగినా, నవ్యసాహిత్యం అట్లాంటి మార్పును పొందుతుంది. తక్కిన భావాలెట్లా ఉన్నా క్రొత్తగా తెచ్చుకున్న కావ్యభేదాలు సారస్వతంలో నిలుస్తాయి' అంటారు విశ్వనాధ.

ఈ ఉపన్యాసంలో ప్రేమ్‌చంద్‌ను గూర్చి చెప్పి, పి.ఇ.ఎన్. సంస్థను ప్రస్తావించీ నవ్యసాహిత్య చైతన్యం భారతదేశం నిండా వ్యాపించి ఉందని చెప్పి విశ్వనాథ ఆధునిక భారతీయ సాహిత్యమన్న ఏకాత్మభావాన్ని సూచించారు.

ఈ ఉపస్యాసం వ్యావహారిక భాషావాదాన్నీ, పాశ్చాత్య సంస్కారం వల్ల కలిగిన నూతన భావ చైతన్యాన్నీ, నూతన ప్రక్రియా విశేషాలనూ ప్రస్తావించి నవ్యసాహిత్యానికి ఆధారభూతమైన అంశాలను ప్రముఖంగా చారిత్రక క్రమంలో ప్రకాశింపజేసింది.

1940లో వెలువడిన ఈ ఉపన్యాసం ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శ్రీ కురుగంటి సీతారామయ్య నిర్మాణానికి ప్రేరణ యిచ్చి ఉండటంలో ఆశ్చర్యం లేదు. అయితే ఈ పునాది మీద అత్యంత సుందరమైన మహాసౌధ నిర్మాణం చేశారు శ్రీ కురుగంటి వారు.

మొదటి ప్రచురణ ముందుమాటలో 'విన్నపము'లో రచయిత ఇలా పేర్కొన్నారు. 'ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయ సమ్మేళనం చేసి విమర్శనం సాగించాలని నా ఆశయం. సంప్రదాయం నాకు చాలా పవిత్రం. నాకే కాదు సారస్వతోద్ధారకుల కందరికీ అంతే! రచనా విమర్శనమూ కూడా దాన్ని నిరసించటం వలన సార్థక్యాన్ని కోల్పోవడం. ఈ ఆశయంతో సానుభూతినీ, సహృదయత్వాన్నీ ఊతగా చేసుకుని రాశాననుకుంటున్నానీ గ్రంధం. నా సహృదయత్వానికి బాగుండనప్పుడు వ్యక్తి గొప్పతనం తలవకుండా నిర్మొగమాటంగా హృదయంలో సంగతులు చెప్పాను. ఈ నవ్యసాహిత్య రంగంతో సాక్షాత్తుగానో, పరోక్షంగానో, నాకు కూడా సంబంధం ఉండటం చేతా, వ్యక్తులు నాకు సమకాలికులై అనేకులు నాకు తెలిసిన వాళ్లవడం చేతా అనేక స్థలాలలో నా స్వానుభవాలు, వ్యక్తుల గూర్చిన వాక్చిత్రాలూ ఉన్నవి.' ఇదీ

రచయితకు పరిమితిని విధించే అంశమే [illegible] నిర్ధారణ చేసే లక్షణం ఉండటం వలన ఆయన ఒక [illegible] చరిత్ర గ్రంథాన్ని నిర్మించగలిగినారు.

నవ్యాంధ్ర సాహిత్యవీధులు పేరిట [illegible] ప్రణాళికకూ అంతర్యంలో తత్త్వ దర్శనంలో - [illegible] లేదనే చెప్పాలి. అయితే గ్రంథం కొంత పెరిగినది, [illegible] మారినది. రచయితల చిత్రాలను చేర్చటం దీనిలో ఒక్క విశేషం. 1942 నుంచి 1950 వరకూ ఉన్న అంశాలు దీనిలో చేర్చటం జరిగింది. రెండవ ముద్రణ నాల్గవ భాగంలో ముందుమాట వ్రాస్తూ శ్రీ హనుమంతరావు ఇలా చెప్పినారు.

'ఈ ద్వితీయ ముద్రణము [illegible]. ప్రథమ ముద్రణమందు విషయమునే గ్రహించి - [illegible], శ్రీ కురుగంటి వారి అభిప్రాయములకు భంగము వాటిల్లకుండునట్లు [illegible] - వారితో సంప్రదించుచు, ప్రకరణములకు ముందు వెనుకలు మార్చి, అనేక నూతనాంశములను చేర్చి (సంప్రదాయముపై ప్రకరణము వారు వ్రాసినదే) భాష [illegible] గ్రాంథికము చేసి ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములుగా విభజింపజేసితిని. ఇంక 1940 నుంచి నేటి వరకు వివిధ సాహిత్య రీతుల కథనమునకు (అత్యాధునిక ధోరణిలో కొద్ది భాగము తప్ప) సంపూర్ణముగా నేనే బాధ్యత వహించి చతుర్థ భాగముగ నందించితిని.'

ఈ వివరణమువల్ల తేలే అంశాలు రెండు - రెండవ ముద్రణములో కర్తృత్వ సమస్యలు. గ్రంథము యొక్క భాషా ధోరణిలో కలిగిన మార్పు. మొదటి మూడు భాగాలు వస్తుతః మార్పు లేనివే. అయితే వాటిలో అక్కడక్కడా నూతనాంశాల చేర్పులు, కొన్ని వెనుకకు ముందుకుగా వచ్చిన మార్పులు శ్రీ హనుమంతరావు చేసినవే. అయితే నాల్గవ భాగము మాత్రము దాదాపు పూర్తిగా శ్రీ హనుమంతరావు రచనయే.

రెండవ ముద్రణలో ప్రథమ భాగములోని సాహిత్యమూలసూత్రములు అన్న ఏడవ అధ్యాయం అంతా శ్రీ హనుమంతరావు రచనగానే తోస్తున్నది. అది ఒక

రేడియో ఉపన్యాసమనీ, సాహిత్య సమాలోచనమన్న ఆయన గ్రంథంలో భాగమనీ అధస్సూచికలో ఒక సూచనమున్నది.

అట్లాగే కొన్ని నాటకములు అన్న భాగము విపులంగా మొదటి భాగంలో నాల్గవ అధ్యాయంగా రూపొందింది. ఇది తొలి ముద్రణలో లేదు. దానిలోని మొదటి భాగంలో పదో అధ్యాయంలోనూ, రెండవభాగంలో ఏడవ అధ్యాయంలోనూ నాటక ప్రసక్తి ఉన్నది. అయితే ఇక్కడ దాదాపు అంతా కొత్త రచనయే. ఇదీ శ్రీ హనుమంతరావు రచనగానే భావించవలసి ఉన్నది.

మొదటి ముద్రణలోని తొలి మూడు అధ్యాయాలే (నాల్గులో కొంచెం) రెండవ ముద్రణలో ప్రథమ భాగంగా విస్తరించింది. రెండవ ముద్రణలో రెండవ భాగంలో సాహిత్యములో సంప్రదాయసంస్కృతులు అన్న విపులమైన సంప్రదాయ నిర్వచనం శ్రీ కురుగంటి వారి రచనయని ఆయనే చెప్పుకోవడంవల్ల పేచీ లేదు. తొలి ముద్రణలోని మిగతా భాగం రెండవ ముద్రణలో రెండవ భాగమయింది. రెండవ భాగంలో తొలి ముద్రణలోని రెండవ భాగంలోని కొన్ని అంశాలు చేరినవి. దీనిలో కొన్ని తిరుగుబాటు ఉద్యమాలు అన్న అధ్యాయం, పరిశోధనము అన్న అధ్యాయము బీజభూతంగా మొదట ఉన్నా కొత్తగా చేర్చినట్లే. మిగిలిన అంశాలు కూడా విపులీకరింపబడ్డవి. తొలి ముద్రణలో రెండవ భాగంలో చేరిన గుణదోష నిరూపణ రెండవ ముద్రణలో మూడవభాగంలో ఏడవ అధ్యాయమైంది. చాలా భాగం కొత్త అంశాలతో నిండి ఉన్నది.

చేర్చిన అంశాలలో అధస్సూచికలలో ఎక్కువ వివరాలు యివ్వటం ఒక ముఖ్యమైన అంశం. అట్లానే తొలి ముద్రణలో మరచినరచయితలనుపేర్కొనటం, వారి రచనల వివరాలు వెల్లడించడం జరిగింది. ఈ విషయంలో ఉదాహరణగా ఎన్నో విషయాలను పేర్కొనవచ్చును.

తొలి ముద్రణలో అముద్రిత గ్రంథ చింతామణిని పేర్కొన్న సందర్భంలో సంగ్రహంగా చెప్పడం జరిగింది. రెండవ ముద్రణలో దాన్ని గూర్చి విస్తృతంగా వివరించినారు.

అట్లాగే తొలి ముద్రణలో కొన్ని పత్రికల వివరాలే ఉండగా, మలి ముద్రణలో దానికి అదనంగా మరికొన్ని పత్రికల పేర్లు చేరాయి. వీటిలో తెలంగాణం నుంచి వెలువడుతూ వున్న ఆంధ్రాభ్యుదయం, నీలగిరి, గోలకొండ పత్రిక దేశబంధు మొదలైనవి ఉన్నాయి. (కాని ఇనుగుర్తి నుంచి 1922-28ల మధ్య ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావులు సంపాదకులుగా వెలువడిన తెనుగుపత్రిక అనే వారపత్రిక ప్రసక్తి లోపించింది.)

మలి ముద్రణలో వరంగల్లు నివాసియైన తూము రామదాస కవి (1856-1904)ని గూర్చి చేర్చటం జరిగింది. ఈయన ఆంధ్ర పదనిధానమనే పద్య నిఘంటవును శబ్దరత్నాకరం ఆధారంగా నిర్మించారు. అట్లాగే మరొక అధ్యాయంలో సికింద్రాబాదులో నివసిస్తూ 'దివ్యవాణి' అనే వారపత్రికను నిర్వహించిన చివుకుల అప్పయ్య శాస్త్రి గారిని గురించి తెలుపడం జరిగింది. ఈయన గర్గభాగవతం అనే పేర సంస్కృత గర్గ సంహితను తెలుగులో పద్యపురాణంగా రచించారు.

రెండవ ముద్రణలో 1950 నాటికి సాహిత్య రంగంలో ఉన్న పరిస్థితుల దృష్ట్యా తొలిభాగంలో ప్రాముఖ్యం పొందని, పేర్కొనబడని అనేక మంది రచయితల సాహిత్య కృషికి తగిన ప్రాధాన్యం లభించింది. మొదటి ముద్రణ వెలువడగానే దీనిలో తెలంగాణములోని కవుల ప్రసక్తి అంతగా లేదని వివాదము చెలరేగినట్లు వింటున్నాము. అప్పటికే 'నిజాం రాష్ట్రమున తెలుగు కవుల సంఖ్య పూజ్యము' అని ఎవరో ఆంధ్ర ప్రాంత పండితుడు వ్యాఖ్యానించినాడనీ, దానికి కినిసిన శ్రీ సురవరం ప్రతాపరెడ్డి అప్పుడు జీవించి రచిస్తూ వున్న వందలాది తెలుగు కవుల రచనలతో, తెలంగాణములోని ప్రాచీన కవుల సాహిత్య కృషి వివరాలతో గోలకొండ కవుల సంచిక ప్రచురించినారనీ తెలియవచ్చింది. అయినా నవ్యాంధ్ర సాహిత్య వీధులు తొలి ముద్రణలో తెలంగాణంలోని కవుల ప్రసక్తి దాదాపు లేదనే చెప్పవలసి ఉన్నది. జనమంచి, రాళ్లపల్లివారు ఏ ఒకరిద్దరినో మినహాయించితే రాయలసీమ కవుల ప్రసక్తి కూడ దానిలో మృగ్యమే.

రెండవ భాగం ఒక విధంగా ఈ లోపాన్ని సరిదిద్దే ప్రయత్నం చేసింది. శ్రీ హనుమంతరావు కృషి వల్ల ఆనాటికి రాస్తూ వున్న యువ రచయితల పేర్లు, ప్రముఖ రచనలు నాల్గవ భాగంలో చోటు చేసుకున్నాయి.

భాషా విషయంలో తొలి ముద్రణలో ఉన్న శిష్ట వ్యావహారిక భాష దాదాపు సమీప గ్రాంధికానికి ఎందుకు మారిందో ఊహించవలసే ఉన్నది. తొలి ముద్రణములోనే శ్రీ గిడుగువారి ఉద్యమాన్ని ఉత్సాహంతో ప్రశంసించిన శ్రీ కురుగంటి వారు ఇలా అన్నారు.

"ఇటీవల ఆయన నాదాన్ని మించి అతిక్రమించే యువకుల విషయంలో మనస్తాపం అనుభవించినట్లు కనబడుతుంది. విశృంఖలత్వం ఆయన స్వభావంలో లేదు. ఉపాధ్యాయుడు కాబట్టి క్రమశిక్షణ ఆయన పద్ధతి. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారితో వకమారీ విధంగా అన్నారట".

"ఆధునికులు పెక్కుండ్రు వ్రాసిన చిన్న చిన్న గ్రంధములు చదివి పంతులుగారు వకటి రెండు సందర్భములలో 'ఇంత తెగబడి వ్రాయవలెనని నా ఉద్దేశ్యము కాదు. అయితే యిపుడెవరిని నిర్బంధించగలము? ఇది సంధికాలము. కొత్త యేటి నీరు పలుచగా నుండును. శరత్కాలము రాగానే తేటవడును. అట్లే యిదిన్ని కొంతకాలమునకు చిక్కబడును' అని నాతో ననియున్నారు" అని మల్లాది వారి వ్రాతను ఉద్ధరించి కురుగంటి వారిలా అన్నారు.

- "నవ్యలలో నవ్యులైన నవ్యాంధ్ర భాషాకుమారులు పంతులువారి విచారాన్ని స్వర్గంలో యినుమడించకుండా చేయుదురుగాక" (పే.80 మొదటి ముద్రణ)

ఈ ధోరణి ఉండటము వల్ల నవ్యసాహిత్య పరిషత్తులో తొలి రోజుల్లో ఉన్నంత వాద తీవ్రత తరువాత లేనట్లుగా కనబడుతున్నది. శ్రీ శివశంకర స్వామి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ నోరి నరసింహశాస్త్రి మొదలైన వాళ్లందరూ క్రమంగా వ్యావహారికం నుంచి సరళమైన గ్రాంధికం వైపుగా మళ్లినట్లుగా గోచరిస్తుంది. నవ్యాంధ్ర సాహిత్య వీధులు తొలి ముద్రణలో 'ఒక' బదులు 'వక' అని వాడిన శ్రీ కురుగంటి వారు క్రమంగా మారిపోవడంలో ఆశ్చర్యం లేదు. ఈ రచయితలు

బాల వ్యాకరణాన్ని అతిక్రమించవచ్చును గాని, మరొక వ్యాకరణం ఆధునిక భాషకు నియామకమైంది ఉండాలని భావించి విశ్వసించినవారు. అందువల్లనే శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి ఆంధ్రభాషానుశాసనం కూడా నవ్యసాహిత్యంలో భాగమేనని విశ్వనాధ పేర్కొన్నారు.

1954లో భారతిలో శ్రీ కురుగంటి వారు ఒక వ్యాసం ఆధునికాంధ్ర కవిత్వంలో భాషాదోషాలను, పరిమితులను విమర్శిస్తూ వ్రాశారు. దాని మీద చాలా వివాదం నడచింది. ఆధునిక కవులు అవి దోషాలు కావని సమర్థించుకున్నారు. ఇదే సందర్భంలో ఆయన ఆధునిక కవుల రెండు గేయాలలోని అభివ్యక్తిని గూర్చి కూడ విమర్శించారు. అదీ వివాదానికీ, చర్చకూ కారణమయింది.

అందువల్ల వ్యావహారిక భాషావాదాన్ని అంగీకరించి సిద్ధాంతాలు చేసినవాళ్లలో కొందరు నియమబద్ధమైన సర్వమండల సామాన్యమైన భాషా ప్రయోగాన్ని వాంఛించినవారే. అందువల్ల నాడు కొన్ని సూర్పులతో, సర్దుబాట్లతో లాక్షణికాంధ్రం మళ్లీ యించుమించుగా వ్రాసేవాళ్ల సంఖ్య పెరిగిపోయింది.

శ్రీ కురుగంటి వారి గ్రంధం వెలువడిన తరువాత అనేక విమర్శలు వచ్చాయి. 'సాహిత్య చరిత్ర రచయితకు సర్వవిధాలా సహాయము చేసే చిత్తవృత్తి మనవారిలో కలగలేదు. రచించిన తరువాత రంధ్రాన్వేషణము చేసే వారసంఖ్యాకులు. సానుభూతితో విమర్శిస్తే సంతోషమే. ఒకమారాంధ్ర పత్రికలో నా గ్రంథాన్ని విమర్శిస్తూ నాకు నవ్య సాహిత్యమంటే అర్థమే కాలేదని వ్రాసినారు 'శ్రీవత్సుడు'. నా గ్రంథము రచయితల గ్రంథాల క్యాటలాగన్నాడు మరి ఒక విమర్శకుడు. మన గ్రంథ సంచయాన్ని చూచి ఏదో పుస్తకము రచించి భట్టాచార్యుడనైనానని ఒక కధక చక్రవర్తి గ్రంథస్థము చేసినాడు. వీటన్నిటికి నేను సమాధానమియ్యదలచలేదు.' అని తన ఆవేదన వ్యక్తం చేసినారు రచయిత రెండవ ముద్రణ పీఠికలో. (ఇందులోని శ్రీవత్సుడు తరువాతి కాలంలో 'శ్రీవాత్సవ'గా ప్రసిద్ధులైన శ్రీ, యండమూరి సత్యనారాయణ కావచ్చునేమో పరిశీలించాలి. అట్లాగే కధక చక్రవర్తి ప్రసిద్ధులైన శ్రీ చింతా దీక్షితులేమో వెదకి చూడాలి).

శ్రీ కురుగంటి వారి ఆవేదన మరొక విధమైంది కూడా. తన గ్రంథాన్ని తరువాతి గ్రంధకర్తలు పేర్కొనలేదని, కొందరు దీనిలోని భాగాలను మార్చకుండా తమ తమ రచనలలో వాడుకున్నారని ఈ పీఠికలోనే పేర్కొన్నారు.

- 4 -

నవ్యాంధ్ర సాహిత్య వీధుల వైశిష్ట్యం దానికి ఈనాటికీ ఉన్న తాజాదనం (freshness) అంతటి సన్నిహితకాలంలో ఉండి కూడా ఆత్మీయంగా దానిని స్పృశించాలని మనకు రూపు కట్టిస్తూ వర్ణించే వైఖరి - సాహసోపేతమైన ఆలోచనలు, విశేషాంశాలు. ఆయా రచయితల సాహిత్యౌన్నత్యాన్ని ప్రశంసిస్తూనే వేరొకప్రక్క వారిలోని లోపాలను తెలియజేయడం, వస్తుపరమైన దృష్టితో శుష్కంగా అనాకర్షంగా కాక విపులంగా ప్రసంగరీతిలో వర్ణించడం - ఇవీ ఈ రచనకు ఉన్న గొప్పతనాలు.

శ్రీ కురుగంటి వారు సాహిత్య చరిత్ర ప్రవాహాన్ని వర్ణిస్తూనే సుష్టు సుష్టుంగా వీరేశలింగం మొదలుకొని అత్యంతాధునికుల వరకూ వదలిపెట్టకుండా వివరిస్తూ విభేదిస్తూ రచనను కొనసాగించారు.

ఇప్పుడు నవ్యాంధ్ర సాహిత్య వీధులను సమగ్రంగా సమీక్షించటం కాదు కాని రచయిత తన గ్రంథంలో ప్రతిపాదించిన అంశాలు వాటి వల్ల తరువాతి కాలంలో సాహిత్య చరిత్రకారుల అంచనాలు ఎలా ప్రభావితమైనవీ మనం విశదీకరించుకోవచ్చును.

ఆధునిక సాహిత్యానికి ప్రేరణ మన జీవితంలో వచ్చిన అసాధారణమైన అతి వేగవంతమైన మార్పులు. '(వీరేశలింగం) తన భావాలను వ్యక్తం చేసే సాహిత్య సారస్వతాన్ని గ్రహించాడు. హిందూ సంఘములో ఉన్న బాల్య వివాహము, విధవా వివాహ నిషేధము, రండాముండనము, వృద్ధ వివాహము, విగ్రహారాధన మొదలైన ఆచారాలు ఆయనకు ఏహ్యముగా కనబడినవి. బ్రహ్మసమాజ మత వ్యాపనకు మాత్రము నాయుడుగారితో కలిసి పనిచేస్తూ మిగిలిన కాలాన్ని, ధనాన్ని, ప్రతిభను వీటి ఖండనములో వినియోగించినాడు. ఆయన మత సంఘ సంస్కారము

మంచిదా చెడ్డదా అని కాదు యిక్కడ విచారణ. ఆయన చేసిన పని యొక్క పరిణామమేమిటీ అనేది మనకు కావలసింది' ఇదీ కురుగంటి వారి విచారణామార్గం. పంతులుగారి వల్ల భాషకు కలిగిన మహోపకారాలు మూడు.

1. భాషాసౌలభ్య కల్పనము
2. వివిధ సారస్వత వ్యాప్తి
3. పరభాషా వాఙ్మయానువాదము

భాషకు వైశద్యం తెచ్చిపెట్టింది వీరేశలింగం రచనామార్గం. సడలించిన గ్రాంధికం. నూతన భావ పరివ్యాప్తికి హేతువుగా వాక్యనిర్మాణ చాతుర్యాన్ని పెంచుకున్న రచనా ధోరణి. నవల, వ్యాసము, జీవితకధ, ఆత్మకథ, శాస్త్రరచన మొదలైనవన్నీ ఆయన భాషలో ప్రవేశపెట్టిన నూతన ప్రక్రియా మార్గాలు. ఇతర భాషలలో నుండి విజ్ఞానాన్ని త్రవ్వి తెచ్చి తెలుగు భాషా వాఙ్మయాలను సంపన్నం చేసి దాని ద్వారా తెలుగు భాషాపాఠకుల విజ్ఞాన స్థాయిని పెంచడం మూడవ కార్యం. భారతీయ సారస్వత పునరుజ్జీవన దశలో తొలిపార్శ్వం స్వతంత్రమూ సృజనాత్మకమూ కాక ఇలా సంస్కృతాంగ్ల భాషాసారస్వత భాండాగారాన్ని దేశ భాషలలోకి పరివర్తింపజేయడం అన్న అత్యద్భుతమైన కృషి. సంస్కృతంనించి ఇతిహాస పురాణాలు, కావ్య నాటకాలు దాదాపు అన్నీ యథాతథంగా తెలుగులోకి వచ్చాయి. అట్లాగే ఇంగ్లీషులో నుంచి వ్యాసాలు, భౌతికాది శాస్త్ర గ్రంథాలు, చరిత్రలు, నాటకము, నవల, కథ వంటి గద్యసాహిత్య ప్రక్రియలు తెలుగులోకి ప్రవేశించడం జరిగింది.

ఈ విధంగా వీరేశలింగం సాహిత్యకృషిని ప్రశంసిస్తూనే ఆయన సాంఘిక భావాలను రచయిత విమర్శించటం గమనించవచ్చు. శ్రీ సామినేని ముద్దు నరసింహం నాయుడు 1862లో రచించిన హితసూచని అనే రచనలో సామాజిక సంస్కారాంశాలు ఎన్నో ఉన్నాయనీ, ఆయన వ్యాసానికి ప్రమేయమని శాస్త్రీయ శబ్దాన్ని వాడారని శ్రీ కురుగంటి వారు పేర్కొన్నారు. వారి దృష్టిలో 'నవ్యయుగ ప్రారంభానికి సంధ్యా దేవత అయినాడు' వీరేశలింగం పంతులు.

జాతీయోద్యమం మన ఆధునిక సాహిత్య నిర్మాణానికి ప్రాధమికమైన ప్రేరణల్లో రెండవదిగా శ్రీ కురుగంటివారు భావించారు. శ్రీ వీరేశలింగం సంస్కరణము, తరువాత వచ్చిన జాతీయోద్యమమూ రెండూ జమిలిగా నూతన సాహిత్య నిర్మాణానికి 'కారణంబులు - ఉద్బోధకములుగా' ప్రవర్తించిన అంశాలు. శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి 1906 నాటికే భారతదేశాన్ని పరిపాలిస్తున్న ఆంగిలేయుల దుర్మంత్రాలను వెల్లడించటం తెలుగు సాహిత్య విషయంగా ఒక ప్రధానాంశం. (ప్రసక్తాను ప్రసక్తంగా శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యను గూర్చి వ్రాస్తూ 'ఆంధ్ర దేశ దురదృష్టం చేత అనేక సంవత్సరాలీయన కాంగ్రెసు నాయకుడై ఆంధ్రదేశానికి ముఖ్యంగా కావలసిన రాష్ట్రోద్యమానికి కారకుడైనాడు. కాంగ్రెసు ప్రెసిడెంటైనా కాలేదు' అన్నారు. కాంగ్రెసుకు స్వాతంత్ర్యప్రాప్తి అనంతరం 1948లో శ్రీ పట్టాభి అధ్యక్షులైనారు).

నవ్యసాహిత్య నిర్వచనం విషయంలో రచయిత శ్రీ విశ్వనాధవారి నిర్వచనాన్నీ, శ్రీ పంచాగ్నుల వారి నిర్వచనాన్నీ గ్రహించి విచారించటం వల్ల దానికొక విశిష్టత వచ్చింది. పాశ్చాత్య సంస్కృతి, విద్య మొదలైన వాటి ప్రభావం చేత మన ఆలోచనలలో, రచనా వైఖరిలో, అనుభూతుల విశ్లేషణలో, నూతన ప్రక్రియలు నిర్మించుకోవటంలో వచ్చిన మార్పులను ప్రతిఫలించేది ఆధునిక సాహిత్యమని చెప్పుకోవటమే కాకుండా శ్రీ పంచాగ్నుల వారి నిర్వచనంలో ఆ ప్రభావం వల్ల మనలో కలిగిన బాగోగులను గూర్చిన ప్రస్తావన ఉన్నది. అయితే ఈ నిర్వచనాలు జాతీయ చైతన్య పునరుత్థానం వల్ల కలిగిన ఆత్మవిశ్వాసంతో జాతి తన స్వత్వాన్ని అందుకోవటం కోసం చేసే విశిష్టమైన ప్రయత్నము కూడా ఆధునిక సాహిత్యమేనన్న అంశాన్ని ప్రస్తావించడం లేదు.

నిజానికి ఇవి రెండు పార్శ్వాలు. వీటి పరస్పర సంఘర్షణ, సమాధానపడే లక్షణాలలో నుంచి ఆధునికసాహిత్యం పెరుగుతూ వస్తున్నది.

అందువల్లనే రచయిత బెంగాలు విభజన ఉద్యమాన్ని ప్రస్తావించి అప్పుడు కలిగిన స్వరాజ్య వాంఛ, స్వదేశ వస్తు ప్రీతి - విదేశ వస్తు బహిష్కారము, జాతీయ విద్యావశ్యకత ఈ మూడూ తరువాతి ఉద్యమాలకు ప్రేరక ద్రవ్యాలుగా పేర్కొన్నారు. (187 పే)

అయితే 1942 వరకు సాహిత్యాన్ని పరామర్శించిన శ్రీ కురుగంటి వారు ఈ క్రింది అంశాలను నవ్య సాహిత్యానికి ప్రేరకాలుగా తెలిపినారు. (పే. 182)

"1. గిడుగు రామమూర్తిగారి భాషాసంస్కారవాదము

2. రాయప్రోలు గురజాడల ఉపజ్ఞకమైన ఖండకావ్య గీతికా రచన

3. కట్టమంచి రామలింగారెడ్డి గారి కవిత్వతత్త్వవిచార రచన

4. సాహితీసమితి పత్రికా ప్రకాశనము"

ఈ నాల్గింటినీ నవ్యసాహిత్య ఉద్యమానికి నాల్గు మూలస్తంభాలుగా వారు నిశ్చయించినారు.

ఒక విధంగా గిడుగువారి వాదం ఆధునికాంధ్ర సాహిత్యం భాషా విషయకంగా స్పష్టమైన నూతన మూర్తిమత్త్వాన్ని సంతరించుకోవటానికి దోహదమైంది. శ్రీ తిరుపతి వెంకటకవుల దగ్గర నుంచి పద్యం సడలించుకొన్న భాషతో నూతనావతారాన్ని పొందింది. మన సంభాషణ వైఖరి, కాకువు, నూతనాభివ్యక్తులు ఇవన్నీ పద్యాలకు నూతన ప్రాణప్రతిష్ఠ చేశాయి.

సాహితీ సమితి పత్రిక నెలకొల్పి కొత్త రచయితలకు ప్రోత్సాహమివ్వటం, రచయితలు ఒక సమష్టి భావంతో అప్పుడప్పుడు కలుస్తూ పరస్పరం రచనలకు శ్రోతలై, చర్చించటం, సభావేదికల మీద ఆధునిక కవిత్వాన్ని శ్రోతలకు మనోహరంగా వినిపించటం ఇవన్ని ఆధునిక సాహిత్య వ్యాప్తికి దోహదాలైన అంశాలు.

సాహితీ సమితి వికసిస్తూన్న దశలోనే మాలపల్లి రచన వెలువడింది. ఆధునికాంధ్ర సాహిత్యంలో తొలి ఆధునికేతిహాసంగా ప్రసిద్ధమైంది. మాలపల్లిలో సామాజిక పార్శ్వమూ, రాజకీయ పార్శ్వమూ, ఆధ్యాత్మిక పార్శ్వమూ అపూర్వంగా సమ్మేళనం పొందాయి. భాష వ్యావహారికతను సంతరించుకుంటూ సజీవమైన మాండలికమును ప్రయోగిస్తూ ఆధునిక నవలాభాషకు మార్గదర్శి అయింది.

అయితే శ్రీ కురుగంటి వారు ఆధునికాంధ్ర కవిత్వానికి ఆద్యులెవరు అనే అంశాన్ని చర్చకు పెట్టి రాయప్రోలు వారేనని నిరూపించారు. దీని కోసం ఆయన

తేదీలు మొదలైన అంశాల ప్రసక్తి తెచ్చారు. ఈ విషయంలో ఆయన నిర్ణయం తరువాత సాహిత్యరంగంలో ఎన్నో చర్చలకు కారణమయ్యింది.

1944 మార్చిలో 'అభ్యుదయ రచన సంపుటి'లో ప్రకటించిన 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు' సమీక్షలో శ్రీ మద్దుకూరి చంద్రశేఖర రావు ఈ వాదాన్ని ఖండించారు. 'గ్రంథకర్తగారు గురజాడ వారి ముత్యాలసరాలను రాయప్రోలు సుబ్బారావు గారి తృణకంకణంతో పోల్చి రెండోదే నవ్యకవిత్వానికి ప్రమాణమని వ్రాశారు. (145 పేజి) ఈ పోలిక రచయితకు సుబ్బారావు గారి యెడల గల అభిమానాన్నీ, గురజాడ చూపిన విప్లవ పంథాను అంచనా వేయడంలో సంకుచిత భావాలను మాత్రమే చూపుతుంది గాని సరియైన అంచనాను తెలుపదు. (చంద్రం వ్యాసావళి, పేజి 56; (1974)) ఈ విమర్శలో శ్రీ చంద్రశేఖరరావు అభిప్రాయమే తెలుస్తుంది కాని హేతువులు వివరించలేదు. కాని ఈ వివాదంలో శ్రీ సుబ్బారావు యెడల శ్రీ కురుగంటి వారు మొగ్గుచూపినా శ్రీ గురజాడను తక్కువగా చూడలేదు. రెండూ రెండు మార్గాలని ఆయన నిశ్చయించారు. శ్రీ సి. నారాయణరెడ్డి 'ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయము - ప్రయోగములు' (1967)లో ఈ మార్గమునే దాదాపు అంగీకరించటం జరిగింది. ఆయన ఇద్దరు యుగకర్తలు అని రాయప్రోలు గురజాడలకు సమానస్థానమే యిచ్చినారు.

వేదం గురజాడల నాటకాలు ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కాలను తులనాత్మకంగా పరిశీలించి ప్రతాపరుద్రీయమే మెరుగైన రచనయని తేల్చినారని శ్రీ మద్దుకూరి వారి ఆరోపణ. 'అసలు రెండు వేరు వేరు విషయాలపై వ్రాయబడిన ఉత్తమ రచనలను పోల్చడం సరికాదేమో' అన్నారు. ప్రతాపరుద్రీయం వస్తు విన్యాసం దృష్ట్యా, నిర్మాణ శిల్పం దృష్ట్యా, ప్రదర్శన యోగ్యత దృష్ట్యా కన్యాశుల్కం కంటే మెరుగైన రచన అనడం స్థితిస్థాపనయే. అంతేకాక ప్రతీకాత్మకంగా నాటి జాతీయోద్యమంలో పరాయి ప్రభువుల నుండి కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని సంపాదించటం దీనిలో వ్యక్తం అయింది. ఈ మహానాటకంలో భాషలో ఎన్నో రకాల ప్రయోగాలు ఉన్నాయి. గురజాడ కన్యాశుల్కం తొలిముద్రణలో ఈ వైశిష్ట్యం లేదు.

మలి ముద్రణలో రచనను విస్తరించుకుంటూ పోవడం వల్ల నాటకానికి ఒక సుస్థిర స్వరూపం ప్రాప్తించలేదని ఇటీవల విమర్శకులు భావిస్తున్నారు.

నవ్యాంధ్ర సాహిత్య వీధులలో ప్రసక్తమయిన మరొక అంశం కవిత్వ తత్త్వ విచారమును గూర్చిన చర్చ. శ్రీ చంద్రశేఖరరావు ఈ విషయంలో - 'ప్రబంధ సాహిత్యాన్ని 'కవిత్వ తత్త్వ విచారం'లో కట్టమంచి రామలింగారెడ్డి గారు ఘాటుగా విమర్శించడం రచయితకు వెగటుగా తోచింది. తక్కిన విమర్శకులంతా రెడ్డిగారి పదవికి దాసులై ఆయన గ్రంథాన్ని పొగిడారని ఈయన వాపోయారు.' (చంద్రం వ్యాసావళి పే.56)

శ్రీ కట్టమంచి వారి విమర్శను గూర్చి తరువాత విమర్శ వాఙ్మయాన్ని తడిమి పరామర్శించిన శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి (జయంతి 1958-59) శ్రీ యస్వీ రామారావు, శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు తమ సిద్ధాంత గ్రంథాలలో చర్చించారు. శ్రీ కట్టమంచి వారు తిరస్కరించిన భారతీయాలంకారిక శాస్త్రాంశాల మౌలిక విలువలను వీరు చర్చించి అవి ఎలా ఈనాటికీ సరిపోతనీ అనే అంశం స్థాపించినారు. పుస్తకం రాగానే దాన్ని విమర్శిస్తూ ఖండన గ్రంథాన్ని వెలువరించిన రచయిత సహజంగా దాని బాగోగులను తెలుపడం జరిగింది.

ప్రబంధ వాఙ్మయాన్ని శ్రీ కట్టమంచివారు సరియైన మార్గంలో అంచనావేయలేదనే తరువాతి విమర్శకులంతా ఏకగ్రీవంగా నిర్ణయించారు. ఆయన రచనలో తెలుగు విమర్శకు కావలసిన నూతన దృక్పథం చోటు చేసుకున్నది. ఆయన భావనాశక్తికి ప్రాధాన్యం యిచ్చారు. అప్పటికి భారతీయాలంకార శాస్త్రాంశాలు కూడ ఆధునిక వాఙ్మయానికి గానీ, ప్రాచీన వాఙ్మయానికి గానీ సమన్వయించిన విమర్శధోరణులు సరిగా లేకపోవడం - తెలిసీ తెలియని అంశాలు ఆధారంగా పీఠికలలో, మరి యితర స్థలాల్లో ఆ అంశాలను ప్రస్తావించటం వల్ల వాటికి సరియైన అన్వయం లభించలేదు. సహజంగా ఉద్విగ్న ప్రకృతియైన కట్టమంచి వారి రచనలో అక్కడక్కడా చోటు చేసుకున్న కటు వాక్యాలు కూడ ఈ నిరసనకు కారణమయ్యాయని తోస్తుంది.

కులాలపోరాటాలు కారణంగా సాహిత్యంలో వచ్చిన ప్రతిక్రియాత్మక సాహిత్యం విషయంలో కూడా శ్రీ కురుగంటి వారి రచనలో అంచనాలు తాత్కాలికాలే. సాంఘిక పరిణామం దృష్ట్యా సమాజ చైతన్యపు లోతుల్లోకి ప్రవేశించ్తే కాని ఈ అంశాలు మనకు హేతుబద్ధంగా అన్వయం కావు.

నవ్యసాహిత్య గుణదోష విచారణము చేయటం ఈ రచయితకు ఉన్న సమదృష్టిని వివరిస్తుంది. గుణదోష నిర్ణయంలో శ్రీ కురుగంటి వారి అభిప్రాయాలతో కొన్నిచోట్ల మనం ఏకీభవించలేకపోవచ్చును కాని ఆయన సాహిత్యానుభవాన్ని హేతుబద్ధంగా విశ్లేషించుకునే రీతిని మాత్రం మనం ఎప్పుడూ కాదనజాలము.

అట్లాగే వ్యక్తిగతమైన యిష్టానిష్టాలు చూపే విషయంలో కూడా కురుగంటి వారు ఖండితంగా ఉంటారు.

నవ్యాంధ్ర సాహిత్య వీధులలో మరొక వివాదాస్పదమైన అంశం నవ్యాంధ్ర సాహిత్యాన్ని సమీక్ష చేస్తూ శ్రీ కురుగంటి వారు చేసిన మరో అంచనా.

'విశ్వనాధ రాయప్రోలులిద్దరూ నవ్య సాహిత్యానికి సూర్యచంద్రుల వంటివారు. ఒకరు దుర్నిరీక్ష్యుడు. రెండవ వారాహ్లాదకరుడు. ఒకరు మిరుమిట్లు గొలుపుతారు. రెండవవారు చల్ల జేస్తారు. ఒకరు శాసిస్తారు. రెండవవారు మిత్రుడల్లే ఒప్పిస్తారు. ఒకరి వ్రాతలు మహోదధి తరంగ పరంపరలు. రెండవ వారివి అచ్ఛోద సరోవరనీరోపమానములు. వీరిద్దరూ ఆద్యంతరక్షకులై నవ్యసాహిత్యాన్ని రక్షిస్తున్నారు. ఒకరిది ఉపక్రమ ప్రాబల్యము. రెండవవారిది ఉపసంహార విజయము. ఒకరి వద్ద మొదలుపెట్టిన ధర్మము యెన్నో విధాల సంచరించితుదకు రెండవవారిలో సాఫల్యము పొందినది కాబట్టి నవ్యసాహిత్యమంతా యీ యిద్దరి మధ్య ఉయ్యేల లూగి యే ధర్మంలో బయలుదేరిందో అదే ధర్మంలో వచ్చి ఆగింది. (తొలి ముద్రణ 507-508 పుటలు)

ఈ వివాదాస్పదమైన అంచనాలో నవ్యసాహిత్యం నవ్యసంప్రదాయ మార్గంగా రూపొందినట్లు సూచించటం జరిగింది. అతినవ్యమార్గమనే పేర సర్రియలిజం మొదలైన ధోరణులనూ, ప్రగతివాద సాహిత్యాన్నీ పరామర్శించారు వేర్వేరుగా రచయిత.

నాల్గవ భాగంలో శ్రీ పిల్లలమఱ్ఱి వారు ప్రగతివాద సాహిత్యాన్ని విపులంగానే సమీక్షించారు. అయితే ఈ కాలంలోనే సమాంతరంగా వెలువడిన సంప్రదాయ ధోరణులకు, నవ్యసాహిత్య ధోరణులకూ తగిన ప్రాధాన్యం యిచ్చి చర్చించారు.

రాయప్రోలు విశ్వనాథల విషయంలో వారి అంచనాను ఇప్పుడు కాదనే వీలులేదు. అయితే నాటికి అప్పటికే కవితారంగంలో ప్రసిద్ధి పొందుతూ వున్న అభ్యుదయ కవిత్వ మార్గదర్శకుడు శ్రీరంగం శ్రీనివాసరావు విషయం దీనిలో ప్రాముఖ్యాన్ని వహించకపోవటం చారిత్రకమైన పరిమితి వల్ల సంభవించిన లోపమే.

అభ్యుదయ కవిత్వోద్యమం 1943లో కాని ఒక ఉద్యమంగా రూపుకట్టలేదు. అయితే ఈ ఉద్యమం క్రియాశీలంగా ఉన్నది 1948 వరకే. తరువాత 1955 వరకు దాదాపు క్షీణతను పొందింది. అభ్యుదయ కవిత్వోద్యమంలోని ఉత్థాన పతనాలను గూర్చి శ్రీ చలసాని ప్రసాద్ 'ఇలా మిగిలేం' (1991)లో స్పష్టంగా 'గతమెంతో ఘనకీర్తి' అన్న వ్యాసంలో వివరించారు.

నవ్యసాహిత్యానికి విశ్వనాథ, రాయప్రోలులు సూర్యచంద్రులన్న అంశాన్ని ఆ రోజుల్లో నెల్లుట్ల రామకృష్ణకవి ఆక్షేపించి ఇది కేవలం రచయిత వైదికులనే అభిమానంతో అన్నారనీ నిజంగా నవ్యసాహిత్యానికి సూర్యచంద్రులు తుమ్మల, జాషువాలని పేర్కొన్నారు.

- 5 -

నవ్యాంధ్ర సాహిత్య వీధులు రెండవ ముద్రణ వెలువడి యిప్పటికి నలభై సంవత్సరాలు దాటింది. ఆధునికాంధ్ర సాహిత్యం బహుముఖీనంగా అనంతంగా విస్తరించుకుంటూ పోతూ వున్నది. నాటికీ సాహస ప్రయత్నం అయితే చేయగలిగినారు కాని ఈనాడు ఒక సంపుటంగా - ఒక గ్రంథంగా నవ్యసాహిత్యాన్ని గూర్చి తెలుపటం సాధ్యమయ్యే అంశం కాదు.

బహుప్రక్రియలు దేనికది విడివిడిగా పరిశీలననూ, పరామర్శనూ, సర్వేక్షణాన్నీ

విస్తృతమైన మౌలిక విచారణనూ కోరుతూ వున్నవి. బహుసిద్ధాంతాలు ఎప్పుడూ సంఘర్షిస్తూ వున్నవి. ఒక ఆత్మీయమైన దృష్టితో అన్నింటిని అవలోడన చేయడం గానీ, నిశ్చయాలు చేయటం కానీ ఈనాడు సాధ్యమయ్యే అంశం కాదని తోస్తుంది.

రచనా రంగంలోకి ఎప్పటికప్పుడు కొత్తతరంగాలు వస్తూ వున్నవి. మనచుట్టూ జరుగుతూ వున్న జాతీయాంతర్జాతీయ సంఘటనలు సాహిత్య రంగాన్ని ప్రభావితం చేస్తూ వున్నవి.

సాహిత్య రంగంలో సామ్యవాద దళం ప్రధానంగా పట్టు కోసం ప్రయత్నం చేసింది. తొలుత అభ్యుదయ రచయితల సంఘం తరువాత విప్లవ రచయితల సంఘం ఈ దిశలో తమ కార్యధోరణిని కొనసాగిస్తూ వచ్చాయి. ఆధునిక చైతన్యం, ప్రజాస్వామ్య భావన, జాతీయత పునాదిగా వ్యక్తి యొక్క సర్వతోముఖాభివృద్ధిని కాంక్షించే చేతనావర్తంలాంటి ఉద్యమాలు నిశ్శబ్దంగా ప్రవర్తిస్తూ వస్తున్నవి.

ఇటీవలి కాలంలో సామ్యవాద దేశాలలో వచ్చిన ఆశ్చర్యాన్ని కలిగించిన మార్పులు సాహిత్య రంగంలో సృజనాత్మకంగా విమర్శనాత్మకంగా చాలా మార్పులు తీసుకువచ్చాయి. అంచనాలు త్వరత్వరగా మారిపోతున్నాయి.

సాహిత్యానికి మార్గదర్శకమైన విమర్శ రంగంలో చెప్పుకోదగిన మౌలికమైన కృషి కొనసాగుతూ వున్నది. భారతీయ భాషా సాహిత్యాల నుంచి లభ్యమౌతున్న అనువాదాలు, అంతర్జాతీయ రంగంలో ముఖ్యంగా మూడవ ప్రపంచంలోని సాహిత్యంతో మనకు సాన్నిహిత్యం ఏర్పడటం కొత్తలోకంలోకి ప్రవేశించినట్లవుతున్నది.

సాహిత్య చరిత్ర నిర్మాణం ఎప్పటికప్పుడు కొత్తగా చేరుస్తూ మారుస్తూ పునరాలోచన చేస్తూ పోవలసిన అంశం. ఏ బిందువు దగ్గరా ఈ ప్రక్రియ ఆగిపోకూడదు.

ఈనాడు తెలుగు సాహిత్యంలో వెలువడుతున్న ధోరణిలో ప్రధానమైన వాటిని ఈ విధంగా అంచనా వేసుకోవచ్చును.

I. కవిత్వం

1. సంప్రదాయ కవిత
2. నవ్యసంప్రదాయ కవిత
3. వచన కవిత
4. గేయకవిత

II. కథన వాఙ్మయం

1. నవల
2. చిన్నకథ

III. సాహిత్య విమర్శ

1. భారతీయాలంకార శాస్త్ర వివరణలు, వ్యాఖ్యలు, అనువాదాలు
2. పాశ్చాత్య సాహిత్య శాస్త్ర వివరణలు, వాఖ్యలు, అనువాదాలు
3. తెలుగు సాహిత్య విమర్శ (ప్రాచీన, ఆధునిక). పరిణామం
4. మనస్తత్వ శాస్త్ర విమర్శ
5. జానపద సాహిత్య విమర్శ

IV. వచన వాఙ్మయం

1. జీవిత చరిత్రలు - ఆత్మకథలు
2. దేశ చరిత్రలు - సమకాలీన సమీక్షలు
3. వ్యాసము
4. సంకలన గ్రంథాలు
5. విజ్ఞాన సర్వస్వాలు, కోశాలు
6. లలితకళలు

ఇలా విభజించుకొంటూ పోతే ఇంకా ఎన్నో అంశాలు చేరుతవి.

అయితే ఈ బృహద్వాఙ్మయాన్ని అంతా విభజించి విశ్లేషణ చేయటానికి తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు పూనుకోవాలనిపిస్తుంది. తెలుగు సాహిత్య

సర్వస్వమనే పేర కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం వారి కంపానియన్ టు ఇంగ్లీష్ లిటరేచర్ పద్ధతిలో నిర్మించవలసి ఉన్నది.

ఇంచుమించు అర్ధ శతాబ్దం పూర్వం రచింపబడిన నవ్యాంధ్ర సాహిత్య వీధులు తన విస్తృతమైన సర్వేక్షణ చేత, విలువైన అంచనాల చేత, ఆయా స్థలాలలో పొందుపరచిన అరుదైన సమాచారం చేత ఎంతో అమూల్యమైన గ్రంథం. చాలాకాలంగా అది అందుబాటులో లేదు.

తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం ఈ అవసరాన్ని భావించి ఇలాంటి అరుదైన గ్రంథాలను మళ్లీ ప్రకటించాలనే ప్రశంసనీయమైన నిర్ణయం తీసుకున్నారు. వారికి నా యందు గల మైత్రి చేత ఈ గ్రంథ సంపాదకీయ బాధ్యతను నా కప్పగించినారు. ఇందుకు వారికి నేను కృతజ్ఞుణ్ణి.

24.11.'94

వరంగల్

- కోవెల సుప్రసన్నాచార్య

# విన్నపము

తెనుగుసారస్వతానికి సమగ్రసాకార చరిత్ర లేదు. ఎప్పుడది రచింపబడుతుందో చెప్ప లేము. పూర్వ వాఙ్మయ చరిత్ర రచనానికి సామగ్రి సేకరింపబడి ఉంది. కొందరు యేదో తమకు తోచినట్లు చరిత్రను రాయ సాహసించారు. అట్లా కొన్ని గ్రంధాలు వెలువడ్డవి. నవ్యసాహిత్యాన్ని గూర్చి చారిత్రకంగా అవలోడనం చేసిన స్థలాలు లేవు. ఇప్పటి కింకా చాలామట్టుకు ప్రచారం చేసుకునే స్థితిలోనే వుంది. దాని లక్షణా లేవో, పరిమితి యెంతో, యే క్రమ పరిణామాలను పొందిందో, మొదలైన విషయాలను యధాశక్తిగా చర్చించి తచ్చరిత్రకు వక అనిర్దిష్టమైన ఆకారా న్నిచ్చింది మొదటి మాటు విశ్వనాధ బెజవాడ పరిషదధ్యక్షోపన్యాసం. చాలా కాలంనించీ యేతచ్చరిత్ర రాయాలని నాకు వుండె. ఈ ఆసక్తిని పురికొల్పి యీ వుపన్యాసం నాచేత యీ గ్రంధం రాయించింది. తద్వ్యాసానికీ, తద్రచయితకూ నా ధన్యవాదాలు. నా తంజావూరాంధ్ర నాయక రాజచరిత్రవలెనే యీ నవ్యసాహిత్య చరిత్రకుకూడా నాదే ప్రధమ గ్రంధమైనందుకు గర్వపడుతున్నాను. ఇక పొరపాట్లకా, "ప్రమాదో ధీమతామసి."

ప్రాచ్యపాశ్చాత్యసంప్రదాయ సమ్మేళనం చేసి విమర్శనం సాగించాలని నా ఆశయం. సంప్రదాయం నాకు చాలా పవిత్రం. నాకేకాదు. సారస్వతోద్ధారకులకందరికీ అంతే! రచనా, విమర్శనమూకూడా దాన్ని నిరసించటం మన పార్థక్యాన్ని కోల్పోవడం. ఈ ఆశయంతో, సానుభూతినీ, సహృదయత్వాన్నీ, ఊతగా చేసుకుని రాశా ననుకుంటున్నా ఈ గ్రంధం. నా సహృదయత్వానికి బాగుండనప్పుడు వ్యక్తి యొక్క గొప్పతనం తలవకుండా నిర్మొగమాటంగా హృదయంలో సంగతులు చెప్పాను, నా కర్తవ్యమని యెంచి అట్లా చేశానేగాని వ్యక్తులను అగౌరవపరచాలని నా ఉద్దేశ్య మెప్పటికీ కాదు. ఈ నవ్యసాహిత్యరంగంతో సాక్షాత్తుగానో, పరోక్షంగానో, నాకుకూడా సంబంధముండడం చేతా, వ్యక్తులు కూడా నాకు సమకాలికులై అనేకులు నాకు తెలిసినవాళ్లవడంచేతా, అనేక స్థలాల్లో నా స్వానుభవాలూ, వ్యక్తులను

గూర్చిన వాక్చిత్రాలూ, ఉన్నవి. వాటిలోకూడా అసభ్యాలుగానూ, అసత్యాలుగానూ యేమీ రాయలేదని నా నమ్మకం. ఒక్కొకప్పుడు సత్యకథనంకూడా కోపకారణం కావచ్చు. అట్టి విషయాల్లో క్షంతవ్యుణ్ణి. సారస్వతం ముఖ్యంగా చేసుకుని అందులో ప్రతిబింబించే యీ కాలపు యావదాంధ్ర జాతీయ జీవనమూ స్పృశింపబడ్డ దీ గ్రంథంలో. ఈ గ్రంథ భాగాలు విని నాకు సలహాల నిచ్చిన మిత్రులందరికి నా వందనములు.

నేను పేదవాడను. ఇంత పెద్ద గ్రంథం స్వయంగా అచ్చు వేసుకునే సామర్థ్యం లేదు. వ్రాత పూర్తై అచ్చు సంగతి తలుచుకున్నప్పుడు జ్ఞాపకానికి వచ్చారు, నా తంజావూరాంధ్రనాయక రాజ చరిత్ర నచ్చేసిన విశ్వదాతగారు. చల్లని మహారాజు ! ఈ విషయంలో ఆయన దృష్టి వర్తకదృష్టి కాదు! సిగ్గు విడిచి ముగ్గురిని సహాయం కోరాను. మొదటివారు "సాహిత్య సామ్రాట్టు", రెండోవారు "భాషోద్ధారకులు", మూడోవారు లక్ష్మీపుత్రుడైన మాజీమంత్రి. మొదటి వారు "తమ రా సంవత్సరానికి అచ్చు వేయించదలచిన గ్రంథాలన్ని అయిన తర్వాతగాని దీనిసంగతి ఆలోచించలే" మని సెలవిచ్చారు. రెండోవారు "తా మచ్చు వేయటాని కెట్టి అభ్యంతరం లేదనీ, కొన్ని ప్రతుల నియ్యగలమేగాని రచించినందులకు పారితోషిక మియ్యలే" మనీ ప్రత్యుత్తరం రాశారు. మూడో వారు జవాబే లేదు! దేశం గొడ్డుపోలేదు! ఇంతలో ఏలూరు సాహిత్య మండలి వారు నన్ను ఉపన్యాసాలియ్యమని ఆహ్వానం చేశారు. వాటి తర్వాత "ఒక్కొక్కరు 10 రూపాయల నియ్యగల వ్యక్తులను 100 మందిని అచ్చువ్యయాలకు ద్రవ్యాన్ని అడిగి వారి పేర్లు పుస్తకంచివర అచ్చు వేయిస్తానని" విన్నపము చేయగా యధాశక్తి సహాయం చేస్తామన్నారు యేలూరు ప్రజలు. అందుకోసమై యింటికి వచ్చిన వెంటనే గుప్తంగా పది రూపాయలు ఇప్పించి పెట్టారు కుప్పా విశ్వపతిశాస్త్రిగారు. అదే శంకుస్థాపన యీ పుస్తకం ముద్రణానికి. ఆయన్ను నే నెంత కొనియాడినా తక్కువే. వాళ్ళు రెండో పది యెవ్వరినీ అడగ లేదు; యెవ్వరూ యివ్వలేదు! పుస్తకం అచ్చుఅయింది. శాస్త్రిగారికి

వందనశతాలు! ఆయన సిద్ధసంకల్పుడు! అనేక రచయితలనూ, అనేక గ్రంధాలనూ వదలి ఉండవచ్చును. సారస్వతవీధీవిన్యాసమూ, వానిలోని ముఖ్య సంచారులూ, తెల్పడం నాకర్తవ్యం. కాబట్టి వారందరు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. సభాపతి మొదలైనవాళ్ళు "గాధాసప్తశతి" మొదలైన మహాకావ్యాలు రాస్తున్నట్టు నినికిడి. అముద్రితాలవి. అంచేత నాటిని పరామర్శించడానికి వీల్లేకపోయింది.

లక్ష్మీ పవర్ ప్రెస్సులో ఉన్న వాళ్లంతా, తత్రాపి, యజమాని పిల్లలమఱ్ఱి లక్ష్మీ నారాయణగారి సానుభూతికీ, సౌహార్దానికీ మేర లేదు. ఎప్పుడూ చిరునవ్వేగాని విసుగు లేదు. ముద్రణ విషయంలో యెన్ని ఆటంకాలు వచ్చినా, ద్రవ్యాన్ని గూర్చి తలవకుండా, పనే ప్రధానంగా ముద్రణ సాగించారు. ఎన్ని వందనా లాయన కిచ్చినా చాలా తక్కువే! నా దస్తూరి, నాగుర్తులు, తెలుసుకొని అతిశ్రద్ధతో కూర్చిన, ప్రూపులు దిద్దిన వాళ్ళందరికీ నా వందనాలు. ఇందులో గుణదోషాలకు సహృదయులే ప్రమాణం.

ఈ మాటలు రాసిన తర్వాత విద్యాశేఖర ఉమాకాన్తపండితుడు పరమపదించినట్టు తెలిసింది. ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక! భాషకు తీరని నష్టము!

డాక్టరు పిశుపాటి వెంకటరమణయ్యాది మిత్రబృందం యొక్క ప్రోత్సాహమమూల్యము.

హైద్రాబాదు, దక్కను<br>4-5-'42

విధేయుడు,<br>కురుగంటి సీతారామయ్య.

# ద్వితీయ ముద్రణపు పీఠిక

మొదట ఈగ్రంధము 1942 సంవత్సరములో ప్రచురితమైనది. అప్పుడు గ్రంధానికి దేశములో ప్రచారముంటుందో ఉండదో అనే భయమువల్ల 500 ప్రతులే ప్రచురించినాను. కాని 6 మాసాలలోనే ప్రతులైపోయినవి. తర్వాత గ్రంధముకోస మనేకులు వ్రాసినారు. ద్వితీయ ముద్రణము చేయవలసిన అవసరము వచ్చినది.

వెనక వ్రాసేటప్పుడు నేనొక్కడనే శ్రమపడినాను. అనేక లోపాలున్నట్టు ఇతరులు చూపటమే కాకుండా నాకే తట్టినవి. సాహిత్యము విశాలముగా పెరుగుచున్నది. కాబట్టి నాకు సహాయము కావలసి చిరంజీవి పిల్లల మఱ్ఱి వేంకట హనుమంతరావును కోరగా, ఆతని సహజ సాహిత్యాభిరుచి ననుసరించి పని ప్రారంభించి కృషి చేసినాడు. ఇద్దరము గ్రంధాన్ని యధాశక్తిగా పూర్తి చేసినాము. అందుచేత గ్రంథకర్తృ పదవి అతనికి కూడా పంచి యిచ్చినాను.

ధారావాహికగా ప్రవహించు జీవత్సాహిత్యానికి సమగ్ర చరిత్ర వ్రాయడ మసంభవము. ఈ సంగతి ప్రథమ ముద్రణములోనే మనవిచేసినాను. అందులో . ఇప్పటి మన సాహిత్యము అనంత ముఖాల విస్తరిస్తున్నది. చిట్టి, చిన్న, పెద్ద సాహిత్యోపాసకుల సంఖ్య లెక్కకు మిక్కిలిగా పెరుగుతున్నది. పత్రికలు కుప్పతిప్పలుగా వెలుస్తున్నవి. అనేక సాహిత్య ప్రక్రియలు సాధనలో ఉన్నవి. వీటినన్నిటిని క్రోడీకరించి సమగ్రముగా విమర్శించడము సులభసాధ్యము కాదు. అయినా యధాశక్తిగా యత్నించినాము. ఎంతవరకు కృతకృత్యులమైనది సాహిత్యలోకమే ప్రమాణము. ఒక్క సంవత్సరము తీసుకుని ఆ కాలములో ప్రచురింపబడిన యావత్సాహిత్యాన్నీ, అందరు రచయితలనూ వదలకుండా పేర్కొంటే, అట్టివానికి పాదాక్రాంతుడనవుతానని నేను బద్ధపడుతున్నాను. మరి ఒక అంశము. నేనొక నవ్య సాహిత్య చరిత్ర రచించినానని దేశానికి తెలుసును. కొందరివలె

సాహిత్య చరిత్ర రచిస్తానని ప్రకటించి గ్రంథాలు తెప్పించుకుని నేను దాచుకోలేదు. తెలియనివారిని గూర్చి నేనేమీ అనను. ద్వితీయ ముద్రణ రానున్నదని తెలిసిన రచయితలు కూడా తమ గ్రంథాలను నాకు పంపలేదు. అన్ని పత్రికలను తెప్పించుకుని, అన్ని గ్రంథాలను నేనే కొని చదివి చరిత్ర వ్రాయవలెనా? ఈ ప్రశ్నకు సమాధానము పైన నాకృషి ఆధారపడి ఉన్నది. సాహిత్య చరిత్ర రచయితలకు సర్వవిధాలా సహాయముచేసే చిత్తవృత్తి మనవారిలో కలగలేదు. రచించిన తర్వాత రంధ్రాన్వేషణము చేసేవా రసంఖ్యాకులు. సానుభూతితో విమర్శిస్తే సంతోషమే! ఒకమారాంధ్ర పత్రికలో నా గ్రంథాన్ని విమర్శిస్తూ నాకు నవ్య సాహిత్యమంటే అర్థమే కాలేదని వ్రాసినాడు "శ్రీవత్సుడు". నాగ్రంథము "రచయితల గ్రంథాలక్యాటలా' గన్నాడు మరి ఒక విమర్శకుడు. మన గ్రంథసంచయాన్ని చూచి ఏదో పుస్తకము రచించి భట్టాచార్యుడ నైనానని ఒక కథక చక్రవర్తి గ్రంథస్థము చేసినాడు. వీటికన్నిటికీ నేను సమాధాన మియ్యదలచలేదు. దేశమువైఖరిని మనవి చేసినాను. కాబట్టి సానుభూతితో విమర్శించమని నా మనవి..

సంఘ చరిత్రగాని, రాజకీయ చరిత్రగాని, సాహిత్య చరిత్రగాని సాహిత్య వేత్తలను నియమించి రచియింపించ వలసిన బాధ్యత విశ్వవిద్యాలయము వంటిసంస్థలది. ఆంధ్రులు ఆనోము నోచుకోలేదు. మనకు అహంకారానికి తగిన కార్య శూరత్వము లేదు. నా యథాశక్తి రచించినాను. నాకు మార్గదర్శకమైన గ్రంథమూ లేదు. తర్వాతనైనా గ్రంథములోని లోపాలను దిద్ది ప్రచురితమైన గ్రంథమూ లేదు. తుదకు ద్వితీయముద్రణము కూడా నా పాలనే పడినది.

ఈప్రతిని సిద్ధముచేసి దాదాపు మూడు సంవత్సరాలైనది. ఇంతకాలము ప్రపంచాన్ని చూచే భాగ్యము దీనికి లభించలేదు. ఇందు కనేక కారణాలున్నవి. మొదటిది నా పేదరికము. రెండవది సహాయము లభింపకపోవడము. మూడవది ముద్రణ సౌకర్యాలు లేకపోవడము; ఈమారు కూడా యెవ్వరని తెలిసే యేమో

యేలాగుండునో అని కొందరిని సహాయము కోరినాను. అనుకున్నట్టే అయినది; సాహిత్య సామ్రాట్ శ్రీజయపురం మహారాజులు, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ, తణుకు తాలూకా వీరభద్రా బ్రదర్సు వంటి కొందరు వదాన్యులు కొంత సహాయము చేసినా, అది చాల లేదు. తుదకు హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తువారు ముద్రణ వ్యయానికి కావలసిన మొత్తము అప్పుగా యివ్వటానికి అంగీకరించినారు. గ్రంథము ప్రచురింపబడుతున్నది. వారికి నా వందనాలు. వారి సహాయానికి కృతజ్ఞుడను.

ఇక ముద్రణాసౌకర్యాలను గూర్చి నేను చెప్పనవసరములేదు. కంట్రోలున్నప్పుడు కాగితము కొంతైనా దొరికినది. కాని కంట్రోలు సడలిస్తే చీకటి బజారు పెరిగినది. అందుచేత ఆలస్యమవుతుందని అచ్చైనంతవరకు ప్రచురించటానికి నిశ్చయించినాము. నాలుగు సంపుటాలుగా ప్రచురించదలచినాము. మొదటి సంపుటాన్ని ఇందులో సమర్పిస్తున్నాము. త్వరలోనే మిగిలిన మూడు సంపుటాలను కూడా సమర్పించగలము.

ఈ ముద్రణములో అనేక నూతన విషయాలను చేర్చినాను. వెనకటి విషయాలలో లభించిన కొన్ని వివరాలనుకూడా యిచ్చినాను విషయ విభాగములో అనేకములైన మార్పులు చేసినాము. భాషా విషయములో కూడా కొంత సంస్కరించినాము. అనేకుల బొమ్మలను ప్రచురించినాను. ఎన్నిమార్లు అడిగినా, ఉత్తరాలు వ్రాసినా, సహాయపడని మహానుభావులకు ఒక్క నమస్కారము.

సంప్రదాయాన్ని గూర్చి ఒక ప్రత్యేకాధ్యాయము రచించినాను వెనకటి ముద్రణము కొందరి విమర్శనము సంప్రదాయ సిద్ధముగాలేదని చెప్పినానేగాని, ఆసంప్రదాయమంటే యేమిటో, అది ఎలా సాహిత్యములోకి వచ్చినదో తెల్పియుండలేదు. ఇప్పుడు దీనిలో అది యత్నించినాను.

నా వెనకటి ముద్రణము వచ్చిన ఎన్నాళ్లకో P.E.N. గ్రంథమాలికలో ప్రకటితమైన "తెనుగు సాహిత్య చరిత్ర" లో నా గ్రంథాన్ని ఉల్లేఖించలేదు. మన రచయితలలో ఇతరుల రచనలను, అభిప్రాయములను, తమ స్వంత వాటినిగానే ప్రకటించట మొక పరిపాటి అయిపోయినది. అదివరకు ప్రచురింపబడని, నేను వ్రాసిన, అనేక విషయాలను ఎత్తి వ్రాసుకుని తమ స్వంతవిగానే అనేకులు ప్రకటించటమూ, ఉపన్యాసాలలో ఉల్లేఖించటమూ, కుప్ప తిప్పలుగా కనపడతవి. నేను సర్వజ్ఞుడనని చెప్పుకోను. కాను కూడాను. కాని ఇతరుల అభిప్రాయాల్ని తీసుకున్నప్పుడు దానికి కృతజ్ఞత చూపటము, రచయితవిధి. కొన్ని రచనలలో నా రచనల ప్రతిబింబాలుకూడా కనపడుతున్నవి. అది నాకు గౌరవమే.

నా వెనుకటి గ్రంథానికి ఆంధ్రదేశము చూపిన ఆదరాభిమానాలకు మిక్కిలి కృతజ్ఞుడను. ఈ ముద్రణానికి కూడా అట్టి అభిమానాన్నే చూపుతారని విశ్వసిస్తున్నాను. తమరిని దీనిలో పేర్కొనలేదని యేరచయిత కూడా కోపించనద్దు. తాము రచించిన గ్రంథాలను చూచే అవకాశము కల్పించనప్పుడు వారి ఆగ్రహానికి తావులేదు. ఎంత గొప్పవారైనను నిర్మొగమాటముగా వారి రచనలను విమర్శించినాను గాని దూషణ భూషణ తిరస్కారాలకు లెక్కచేయలేదు. చారిత్రకుడలా లెక్కచేయకూడదు.

ఇంతటితో గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

హైదరాబాదు

15-1-1949

కురుగంటి సీతారామ భట్టాచార్యులు

# విషయసూచిక

# విషయసూచిక

ప్రకరణము | పుట

# నవ్యాంధ్ర సాహిత్యవీథులు

## తృతీయభాగము

(నవ్యసాహిత్య విస్తరణము)

# విషయసూచిక

# నవ్యాంధ్ర సాహిత్యవీథులు

## చతుర్థభాగము

### వివిధ కవితోద్యమాలు : సాహిత్య వికాసము

[1940-1950]

# అప్పగింత

ఈ గ్రంధ రచనమందేమి, ముద్రణమందేమి కలిగిన అవాంతరముల నన్నిటి నధిగమించి యిప్పటికి పూర్తిగ గ్రంధమును పాఠకలోకమున కందింప గల్గినాము.

ఈ ద్వితీయ ముద్రణము నూతన నిర్మాణమే యనవలె. ప్రథమముద్రణమునందలి విషయమునే గ్రహించి - మూలసూత్రములకు శ్రీ కురుగుంటివారి యభిప్రాయములకు, భంగము వాటిల్లకుండునట్లుజూచుచు - వారితో సంప్రదించుచు - ప్రకరణములను ముందు వెనకలకు సర్ది, అనేక నూతనాంశములఁనుజేర్చి (సంప్రదాయముపై ప్రకరణము వారు వ్రాసినదే) భాషను సమీప గ్రాంధికముజేసి ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములుగా నవతరిలజేసితిని. ఇంక 1940 నుంచి నేటివరకుగల వివిధసాహిత్యరీతుల కధనమునకు ['అతివాస్తవిక ధోరణి'లో కొద్దిభాగము తప్ప] సంపూర్ణముగ నేనే బాధ్యత వహించి రచించి చతుర్థభాగముగ నందించితిని. సహృదయులు ఇట్టి కృషియందుండు లోపముల మన్నించి ఇందలి గుణములనే గ్రహింతురని విశ్వసింతును.

తమ గ్రంథము నాధారముగ జేసికొని యీ రూపముగ కొంత సాహిత్య కృషి నేను చేయుట కనుమతించి నన్ను చేరదీసిన మద్గురువులు శ్రీ కురుగంటివారికి కృతజ్ఞుడను.

ఈ గ్రంధ రచనోద్యమములో నాకు సహాయపడిన మిత్రులెల్లరకు, నాపెట్టిన శ్రమకోర్చి యీ గ్రంధమును ముద్రించిన "ప్రెస్సు" వారలకు నా ధన్యవాదములు.

శారదాపీఠము,
గుంటూరు.
28-3-1951

పిల్లలమర్రి వేంకట హనుమంతరావు

# విషయసూచిక

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

# 1

# పూర్వరంగము

## ప్రారంభము :

నవ్యాంధ్ర సాహిత్యానికి పునాది 19 శతాబ్దపు ఉత్తరార్ధము లోనే పడినదనవచ్చును. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఈ సాహిత్యానికి బీజావాపన చేసిన వాడనడంలో తప్పుండదు.* ఆయన సాహిత్య రంగములోకి వచ్చేటప్పటికి తెనుగుభాషా సారస్వతాలు ఎలా గున్నవో చెప్పడం అవసరము. "క్రొత్తగా యీ దేశమువచ్చిన ఆంగ్లేయోద్యోగులకు దేశభాషలు నేర్పడానికీ, దేశాచార వ్యవహారాలను గురించి బోధించడానికీ, చెన్నపట్టణములో ఫోర్టు సెంటుజార్జి కోటలో 1812 లో ఒక కాలేజీని స్థాపించారు. ఈ కాలేజీలో ఉదయగిరి వెంకట నారాయణగారు హెడ్ ఇంగ్లీషు మాష్టరుగాను, పట్టాభిరామశాస్త్రి గారు ప్రధాన సంస్కృతాంధ్ర పండితులుగాను ఉండేవారు. 1919లో రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు ప్రధానాంధ్ర పండితులైనారు. ఈ కాలేజీకి అంటి ఒక ముద్రాక్షరశాల, ఒక పుస్తకాలడిపో కూడా స్థాపించినారు. అనేక గ్రంధాలు అచ్చువేయించినారు. ఆ కాలములో కావలి వెంకటబొఱ్ఱయ్య, లక్ష్మయ్యగార్ల సహాయముతో మెకంజీ దొర గారు సేకరించిన అమూల్య ప్రాచీన తాళపత్ర గ్రంథాలు, తరువాత సి.పి. బ్రౌన్‌దొరగారు సేకరించిన గ్రంధాలు, ఈ కాలేజీ గ్రంధాలయములోనే భద్రపరిచినారు. ఈ కాలేజీలో ఒక

---

* "*Modern* being a word of extremely elastic meaning I may explain that it is used here of poetry written by men and women who were still alive when King George V came to throne (1910) or whose work was published in book form for the first time after that date. This is not meant to be the definition of the word, but is an indication of the limits within which the choice of the poems had been made "

ఖగోళ శాస్త్రజ్ఞుడుండేవాడు. ఇతన్నే "కాలేజీ సిద్ధాంతి" అని ఏనుగుల వీరాస్వామయ్య గారు పేర్కొన్నారు.

"ఈ కాలేజీ స్థాపించే నాటికి తెనుగులో అచ్చుపుస్తకాలు లేవు. అప్పటికి దేశీయుల విద్య అధోగతిలో ఉండేది. అప్పటికి ఉన్న వీధి బడులలో పాఠాలు చెప్పడానికి ఉపయోగించే పుస్తకాలే లేవు. క్రొత్తగా తెనుగు నేర్చుకునే దొరలకు పుస్తకాలు అవసరమైనందువల్ల యీ బోర్డు వారు ఉపయుక్తమైన తెనుగు పుస్తకాలు సంపాదించడానికి ప్రారంభించినారు. బందరులో మామిడి వెంకయ్యగారి 'ఆంధ్రదీపిక' వీరు క్రయం పొందిన మొదటి పుస్తకము. దీనికి వీరు 1000 వరహాలిచ్చారు."*

పైదాన్నిబట్టి 1812వ సంవత్సర ప్రాంతములో తెనుగు అచ్చు ప్రారంభమైనట్టు కనపడుతున్నది. ఏ దక్షిణదేశ భాషా సారస్వతాలైనా మార్పు-అభివృద్ధి పొందటం యీ కాలములోనే ప్రారంభమైనది. ప్రథమములో అన్ని దేశభాషలలోనూ శ్రమచేసినది దేశీయుల సహాయముతో పాశ్చాత్య పండితులే! అప్పటినుంచి 19వ శతాబ్దాంతము వరకు కూడా భాషా సారస్వత సిద్ధాంతాలూ, గ్రంథ ప్రచురణమూ ఎలాగున్నదో మనవిచేస్తాను.

## భాష :

"సంస్కృతం బాద్యప్రకృతి, ప్రాకృతంబు ద్వితీయప్రకృతి, ఆంధ్ర భాష వికృతి." ఇది అప్పటికి భాషా సిద్ధాంతము. ఇప్పటికి దీన్నే విశ్వసించే వారున్నప్పటికీ, తర్వాత కొంత చర్చ జరగటం తటస్థించినది. ఈ సిద్ధాంతము నన్నయభట్టు ప్రారంభించినాడు. పండితులంతా విశ్వసించినారు. ఈ కాలమునాటికి[1] చిన్నయసూరి (1806-1869) ప్రెసిడెన్సీ కాలేజీలో తెనుగు పండిత పదవి నలంకరిస్తున్నాడు. ఈయన మంచి వైయాకరణి, ఈయన "బాలవ్యాకరణ"మని (1855) ఒక

---

* 28-11-43 ఆంధ్రపత్రికలో దిగవల్లి వెంకటశివరావుగారు వ్రాసిన వ్యాసము.

1 చిన్నయసూరి రచనలు :-
చింతామణి వృత్తి (1840), పద్యాంధ్ర వ్యాకరణము (1840),
సంస్కృత సూత్రాంధ్రవ్యాఖ్య (1844), ఆదిపర్వవచనము (1847),

వ్యాకరణమూ "నీతి చంద్రిక" అని (1853) ఒక గద్య గ్రంథమూ రచించినాడు. ఈ వ్యాకరణమూ యీ గద్యగ్రంథమూ భాష విషయములోనూ శైలివిషయములోనూ వరవడి గ్రంథాలై పోయినవి. ఇంతకు పూర్వము కొన్ని గద్య గ్రంధాలు వ్యావహారిక భాషారచనతో ఉన్నప్పటికీ[1] చిన్నయ్య సూరి తర్వాత, అది కొంచెము వెనకపడిన దనవచ్చును. ఈయన 1862లో పరలోక గతుడైనాడు.[2] తర్వాత యెవరు రచించినా "నీతి చంద్రిక" భాషే కనుపడుతుంది. భాషయొక్క స్థితియిది.

# సారస్వతము:

ఏవైపునుంచి చూచినా వెనక యుగములో లాంటి శైలినీ, భాషనూ, వర్ణనాంశాలనూ అనుకరించటమే కనపడుతున్నది. శ్లేష బంధ కవిత్వాలకే ఆదరణ కలుగుతున్నది. అప్పటి రచయితలు మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు (1833-1897)[3] మొదలైనవారు వెనకటి ప్రబంధవీధుల్లోనే సంచరిస్తున్నారు. క్రమముగా ప్రజలలో కొంచెము జిజ్ఞాస కలిగినట్టు తెలుస్తున్నది. మిషనరీల మత ప్రభావము కూడా దీనికి కొంత సహాయము చేసినది. పెద్దలకు కూడా హిందూమతజ్ఞానము ప్రజలలో వెదజల్లుట అవసరమని తోచినది. దానిని అరికట్టడ మవసరమయ్యే సరికి యీ అవసరము కల్గినది. అందుచేత పద్యరూపములో ఉన్న భారత భాగవత

---

శబ్దలక్షణసంగ్రహము (1853), నీతి చంద్రిక (1853),
నీతి సంగ్రహము (1855) బాలవ్యాకరణము (1855).

1 ఏనుగుల వీరాస్వామి గారి "యాత్రాచరిత్ర", ముద్దు నరసింహనాయుడు గారి "హితసూచని".

2 ఆంధ్రసర్వస్వము సం. 2. సంచిక 3.
1869 అని మధునాపంతుల 'ఆంధ్రరచయితలు' అనే గ్రంథంలో వ్రాశారు.

3. భారతి, జూన్ 1930.

"అభినవాంధ్ర కవితా పితామహులగు పార్వతీశ్వర కవిగారి చరిత్రము, ప్రత్యేక గ్రంథముగా వారి పౌత్రులగు పార్వతీశ్వరశాస్త్రిగారు వ్రాసియున్నారు."

(భారతి, డిసెంబరు 1935.)

ఈయన రచించిన ఒక గ్రంథము యొక్క పేరు "ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము."

రామాయణాది గ్రంధాలూ, కొన్ని తద్గ్రంథాంతర్గత భాగాలూ, అచ్చువేయించి ప్రజలకు సులభముగా అందుబాట్లో ఉంచే యేర్పాట్లు జరిగినవి.

ఎప్పుడైతే గ్రంథాల ఆవశ్యకత కల్గినదో అప్పుడే ప్రచురణానికి అవసరము కల్గినది. ఈ విషయములో మొదట కృషి చేసినవాళ్ళలో యద్దనపూడి సంజీవయ్య, బరూరు త్యాగరాయశాస్త్రి మొదలగు వార్లను ఎన్నవలసిఉన్నది. చాలా గ్రంధాలు ప్రచురింపబడినవి.[1] కాని యీకాలపు మనదృష్టితో చూస్తే అవి మనకెంతమాత్రమూ నచ్చవు. కాగితపు పరిశ్రమలోగాని, అచ్చుఅక్షరాల పొంకములోగాని, కూర్పు నేర్పులోగాని, చిత్రముల విషయములోగాని, నూతన పద్ధతులలోకి అభివృద్ధి అప్పట్లో లేదు. అవి మొదటిరోజులు. ఇప్పటికీ ఆపుస్తకాలు అక్కడక్కడా ప్రచారములో ఉన్నవి. ఆదినాలలో అంతమాత్రము శ్రమ చేసి తెనుగు గ్రంధాలు ప్రచురించినందుకు మనము కృతజ్ఞులమై ఉండవలసినదే! ఇప్పటికీ కొన్ని గ్రంధాలు ఆ అచ్చులోనే దొరుకుతవి. అప్పటి పండితులను కొందరిని ఈ ముద్రాలయాలు పోషిస్తూ ఉండేవి. భారత సావిత్రి, దాశరధీశతకము, మొదలైన గ్రంథాలు ఆవిధమైనవి బజారులో ప్రచారములో ఉన్నవి. ఏవిషయములోనైనా ప్రధమదినాలలో అంతకంటె అభివృద్ధి చూపటం కష్టము.[2]

## ఇద్దరు విదేశీయులు

రాజ్యము చెయ్యటమునకు వచ్చిన పాశ్చాత్యులు కొందరు, మత ప్రచారము

---

1 1883 నాటికి హిందూ దేశీయులు స్థాపించిన అచ్చుకూటాలు 8.
ఆంధ్రపత్రిక (28-11-43,)

2 "తెనుగులిపిలో పుస్తకాలు అచ్చువెయ్యడం 1806 లోనే ప్రారంభమైనా, 1830 వరకూ అది బాగా అభివృద్ధి చెందలేదు " ఆంధ్రపత్రిక (28-11-43,)

"1850 ప్రాంతములో 'బ్రహ్మవిద్యావిలాస' మనే పేరుతో వనపర్తిలో శ్రీరాజా ప్రథమరాజేశ్వరరావు బహిరీ బల్వంత్ బహద్దరు గారు ఒక తెనుగు ముద్రాయంత్రము స్థాపించిరి. "సాహిత్య విద్యా ముకుర" మనే పేరుతో ఒక ముద్రాలయము గద్వాలలో కాణాదము పెద్దన్న గారనే ఆయన స్థాపించి "అధ్యాత్మరామాయణము, ముకుందవిలాసము" మున్నగు గ్రంథములను 1875 నాటికి ముద్రించెనట! గోలకొండ పత్రిక, 26-5-43),

కోసము వచ్చినవాళ్ళు మరికొందరు. మొదట యెవరు వచ్చారా అనే విషయము మనకక్కరలేదు. ఈ రెండు తెగలు కలసి పని చేసేవాళ్ళు. ఒకరి ఉద్దేశ్యము రాజ్యపాలనము. రెండవవారిది మతప్రచారము. ఇద్దరి ఉద్దేశ్యము వైజ్ఞానికవిషయము. అందుచేత చేదోడు వాదోడుగా పనిచేయటము వాళ్ళకు అవసరము. మత ప్రచారకులకు బైబిలు గ్రంథపరివర్తనము చాలా అవసరమైన పని.[1] అది జరిగితేనేగాని ప్రజలలో మతవ్యాపనానికి వీలులేదు. పరివర్తనానికి భాష అవసరము. ఇంక ప్రార్థనాలయాలలోనూ, ప్రచారకాలమందూ, పాడడానికి కీర్తనలు కావలసివచ్చినవి. ఇందుకు వాళ్ళు దేశీయులవద్ద భాషా సారస్వతాలు చదువుకోవలసి వచ్చినది. ఈసందర్భములో ఒక నిఘంటువు యొక్క ఆవశ్యకత కలిగినది. అధికార్లకు, పాఠశాలోపయోగానికి కూడా ఒక నిఘంటువు అవసరంగానే కనపడినది. అటువంటి దానిని తయారు చెయ్యటానికి సర్కారు వారు కాంబెల్ గారిని నియోగించినారు. ఆయనకు సహాయము చెయ్యటానికి యిద్దరు తెనుగుపండితులను నియమించినారు. కాంబెల్ గారు అందుకోసం ప్రత్యేకముగా బళ్ళారిలో మ కాంగా ఉన్నారు.[2]

తర్వాత "ఆంధ్రబాషా పోషకులని" ప్రఖ్యాతిచెందిన సి.పి. బ్రౌన్‌దొరగారు[3] ఆ కాలములోనే చెన్నపట్నానికి ఉద్యోగిగావచ్చి, చెన్నపట్నము కాలేజీలో తర్ఫీతు పొందగా, అప్పుడు చెన్నపట్నము గవర్నరుగా ఉండిన సర్ థామస్ మన్రోగారు ఆయనను తెనుగుజిల్లాలలో పనిచేయమని నియోగించినారు. అప్పటి లగాయితు 12 సంవత్సరాలు బ్రౌన్‌గారు తెనుగుజిల్లాలో మేజస్ట్రీట్‌గానూ, జిల్లా జడ్జీగానూ పనిచేస్తూ, తెనుగు భాషలో పాండిత్యం సంపాదించి, అనేక పుస్తకాలు రచియించి

---

1 బైబిలు పరివర్తనా కాలములో (1853) మొదటి హిందూక్రైస్తవులైన ధన్నవాడ అనంతం, మల్లాది వెంకటరత్నం మొదలైనవాళ్ళు పాల్గొన్నారు. కొస్తా జిల్లాలలో నోబిల్ అనే మిషనరీ చాలామందికి మత దీక్ష యిచ్చినాడు. (అనంతంగారు 1887 లో "సత్యదూత", 1905లో "హితవాది" అనే మాసపత్రికలు స్థాపించి మతప్రచారము చేసినారు

2 ఈ నిఘంటువు 1821లో ప్రచురింపబడినది. కాని దీనికంతగా ప్రచారం కలగలేదు అక్షరక్రమంలో యిది 'ప్రథమనిఘంటువని జయంతి రామయ్య గారంటారు.
(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక పరీధావి మార్గశిర.)

3 1798 - 1885 చూ. ఆంధ్రపత్రిక 21-1-45

అచ్చు వేయించటమే కాకుండా అనేక పురాతన గ్రంధాలను ఉద్ధరించి ప్రకటించారు.[1]

నిఘంటువు పుట్టిన ఉద్దేశ్యమెట్లాఉన్నా తెనుగుభాషకు చాలా ఉపకారమైనది. ఆంగ్లములో కూడా జాన్‌సన్ కాలందాకా నిఘంటువే లేదు. నూతన ఫక్కీ మీద ప్రధమాంధ్ర నిఘంటువు రచించిన గౌరవము బ్రౌన్ దొరగారికి దక్కినది. ఆంధ్రభాషకు బ్రౌన్ అమరసింహుడు. ఈయన తెనుగు-ఇంగ్లీషు, ఇంగ్లీషు - తెనుగు (1852) రెండు నిఘంటువులు రచించి ప్రచురించినాడు.[2] ఇవిగాక ఈయన 1833 నాటికి తెనుగు సారస్వతముమీద ఒక వ్యాసమును, 1840 నాటికి ఒక తెనుగు వ్యాకరణమును, కూడా రచించినారు. వీరేశలింగముగారి "రాజశేఖర చరిత్రకు" ముందే (1829) బ్రౌన్ దొరగారు "వేమనశతకము"ను ఇంగ్లీషులోకి తర్జుమా చేసినారు. 1817 నాటికే ఇంగ్లీషులో ఒక తెనుగు వ్యాకరణాన్ని దొరల ఉపయోగము కొరకు రచించి ముద్రింపించినారు. ఆంగ్లేయులు మొదట తెలుపుకున్న తెనుగు వేదాంతకవి వేమనయోగి. వేమన పద్యాలు చక్కని సులభశైలిలో, జాతీయాలతో, ఉదాహరణాలతో, జ్ఞానబోధకాలుగా ఉంటవికాబట్టి అవి ఆయనను ఆకర్షించినవి. తెనుగు పుస్తకముయొక్క గొప్పతనాన్ని వైదేశికులకు చెప్పిన మొదటివాడు బ్రౌను. దీనిచేత ఆయనకు తెనుగంటే ఎంత అభిమానమో, గౌరవమో తెల్లమవుతున్నది.

ఓపవ్ కాల్ డ్వెల్ మిషనరీ. ఈయన దక్షిణ దేశభాష లన్నిటిలోనూ కృషి చేసినాడు. పాశ్చాత్యులిక్కడికి వచ్చి సంస్కృతభాషను చదువుకునేటప్పటికి వారికండ్లకీ భాష అంజనమైపోయినది. వారు గొప్పవనే "లాటిను, గ్రీకు" భాషలలో రూపాలకు పూర్వరూపాలే సంస్కృతములో కనుపించినవి. పరిశోధనలు ప్రారంభించినారు.

---

1 ఆంధ్రపత్రిక 28-11-43
తాళపత్రస్థమయిన ప్రాచీన తెనుగు గ్రంధాలను ఉద్ధరించి మొట్టమొదట అచ్చు వేయించినాడు .... ఆయన బైబిలు లూకా సువార్త 1830లో అచ్చు అయినది. ఈనాడు అచ్చులిపిలోని వత్తులు కొన్ని ఆయన కనిపెట్టినవే!
(ఆంధ్రపత్రిక, 22-1-45)

2 శంకరనారాయణగారి రెండు నిఘంటువులకూ బ్రౌన్ నిఘంటువులే మాతృకలు.

భాషాశాస్త్రము పుట్టినది. దీనిని "ఫైలాలజి" అంటారు. అప్పటినుంచీ అనగా దాదాపు 100 సంవత్సరాలనుంచీ భాషాపరిశోధనము జరుగుతూనే ఉన్నది. ప్రస్తుతము యూరపు ఖండములో ప్రచారములోఉన్న దాదాపు అన్ని భాషలకూ సంస్కృతానికి పరస్పర సంబంధమున్నట్టు నిశ్చయింపబడి, భాషాశాస్త్రము గట్టి పునాదులపై రచించిపబడినది. క్రమముగా ప్రపంచభాషలన్నీ పరిశోధనకిందికి తేబడి, సన్నిహితసంబంధాన్ని బట్టి కొన్ని కుటుంబములుగా నిర్ధారణ చేయబడినవి. వీనిలో ద్రావిడభాషా కుటుంబము ఒకటని తత్వజ్ఞులు నిర్ధారణచేసినారు. ఈ కుటుంబములోని భాషలన్నింటిని మథించి సూత్రాలను ఏర్పాటుచేసి ద్రావిడభాషా శాస్త్రాన్ని వ్రాసినాడు కాల్డ్వెల్. తర్కమూలముగాను, పదరూపమూలముగాను, వ్యాకరణాది పద్ధతులమూలముగాను, తన సిద్ధాంతాన్ని సాధించినాడు. అరవము, తెనుగు, కన్నడము, మళయాళము, తుళు యీ కుటుంబములోని ముఖ్యభాషలని తేల్చినాడు. ఆర్యభాషలకూ ఈ కుటుంబభాషలకూ, తత్వములో భిన్నత ఉన్నదని నిరూపించినాడు. ఇది నన్నయభట్టారకునివద్దనుంచి అనూచానముగా వచ్చే వ్యాకరణసిద్ధాంతానికి విరుద్ధము, కాబట్టి పండితలోకములో కొంతఅలజడి జనించింది. ఆంగ్ల విద్యాసంపర్కము కలవాళ్ళందరూ కాల్డెల్వ్ సిద్ధాంతాన్ని దాదాపు అంగీకరించినారు. ఈ చర్చ యిప్పటికీ జరుగుతూనే ఉన్నది.[1] కాల్డ్వెల్సిద్ధాంతమే ప్రబలముగా విశ్వవిద్యాలయాలలోనూ యితరత్రా కూడా చెలామణిలో ఉన్నది.[2] దక్షిణ భారతదేశములో ఉన్న అన్ని భాషలలోని వ్యాకరణాలు, ప్రకృతి ప్రత్యయ సంబంధాలు, దేశీయపదజాలము, సర్వనామాలు, సంఖ్యావాచక శబ్దాలు, మొదలైనవన్నీ పరీక్షిస్తే ఆయన సిద్ధాంతమే నిజమని కనబడుతూ ఉండటంవల్ల, యింతకంటె ప్రబల సామగ్రి దొరికినంతవరకు అదే ప్రచారములో ఉంటుందని చెప్పవచ్చును.

---

1 చూ. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి "ఆంధ్రభాషాచరిత్ర". ద్రావిడభాషలలో మళ్ళీ తమిళం ప్రాచీనతమమనీ తమిళంలో చాలా ప్రాచీనమైన "సంగవాఙ్మయ" మనేది ఉన్నదనీ ఒకవాదం దీనిని గూర్చి డాక్టరు నారాయణరావుగారి "తమిళభాషా ప్రాచీనత" అనేవ్యాసం చదువదగి యున్నది (ఆం.స. సం. సం. ప్రమాది)

2 ఇటీవల గంటి జోగిసోమయాజులుగారు "ఆంధ్రభాషా వికాసమ"ని ఒక ఉద్గ్రంథాన్ని ప్రచురించినారు

ఈయన సిద్ధాంతాన్ని ఆదరించే కొందరు పెద్దలూ, పిన్నలూ కూడా తెనుగుభాష సంస్కృత శృంఖలలోపడి, విడిపోవటానికి వీలులేనంత చిక్కులోపడి కొట్టుకుంటున్నదనీ, ఆచిక్కునుంచి యేవిధముగానైనా తప్పించటము భాషాకుమారుల కర్తవ్యమనీ, ఒక భావమిటీవల అంకురించినది. అతి నవ్యుల చేతుల్లో యీ వాదము బలవత్తరమై పోయినది. భాషామర్యాదలూ, సారస్వతమర్యాదలూ, తెచ్చుకోటముచేత కొంత స్వాతంత్ర్యము తగ్గితే తగ్గవచ్చును. బొత్తుగా నష్టపడిందనీ, వ్యక్తిత్వము కోల్పోయినదనీ చెప్పడము విశ్వసించదగిన విషయముకాదు. పరభాషాసంపర్కముచే భాషవిస్తృతి పొందుతుందేకాని సంకుచిత మెన్నటికీ కాదు. ఆధునిక విజ్ఞానమువల్ల మన పార్థక్యాన్ని కోల్పోవటము తటస్థిస్తుంది. కాబట్టి ఆవిజ్ఞానాన్ని బహిష్కరించాలనే వాదమెట్లా ఉన్నదో, యిదీ కూడా అట్లాగే ఉన్నది. మతద్వేషము బీజముగా కలదీప్రచారము. బ్రాహ్మణద్వేషమనేకులలో సంస్కృతభాషా ద్వేషముగా మారినది. మరికొందరిలో దేశీయత మితిమీరిపోయి ఇట్టి అభిప్రాయము కల్గినది. తెనుగుభాషకు సంస్కృత సంబంధమువల్ల కల్గిన లాభాలు అనంతాలు. సంస్కృత భాష ప్రపంచమంతటిచేత గొప్పదని యేగుణాలచేత మెప్పుదల వహించుతున్నదో ఆగుణాలన్నీ తత్సంపర్కముచేత తెనుగుకు కలిగినవి. వాటికి తెనుగుయొక్క గుణాలు సాయము చేసి అన్నికలిసిభాషకు చాలా కీర్తి గడించినవి. బ్రౌన్ కాల్డ్వెల్ దొరలకు తెలుగు వారెంతయో కృతజ్ఞులు.

## శబ్దరత్నాకరము:

బ్రౌన్‌దొరగారు సంపూర్ణముగా సారస్వతమంతా అవలోడనము చెయ్యలేదు. అందుచేత ఆయన వాసికంటె సమగ్రమైన, ప్రయోగయుక్తమైన నిఘంటువుయొక్క ఆవశ్యకత ఉండనే ఉన్నది.◆ ఈ అవసరము కూడా దొరలకే కల్గినది. మామిడి

◆ కొన్ని సంవత్సరాలకింద గాలట్టీ అనే ఒకకలెక్టరు వ్యావహారికాంధ్రానికి ఇంగ్లీషు అక్షరాలలో ఒక నిఘంటువు రచించాడు. దానిని శ్రీ బొబ్బిలి రాజావారి కంకితం యిచ్చినాడు. చాలా శ్రమపడినట్లు ద్యోతకమవుతుంది. ఆయన శ్రమకు ఆంధ్రులు కృతజ్ఞులు. తెనుగుభాషపైన ఆయనకు నిజమైన ప్రేమకలందుకు చాలాసంతోషము. ఈనిఘంటువు అంటే మామిత్రుడు కపిల కాశీపతికి చాలా అభిమానము. అతని తండ్రిగారు గాలట్టిగారికి గురువు.

వెంకయ్యగారి ఆంధ్రదీపిక కూడా యీ అవసరము తీర్చలేకపోయినది. అప్పుడు 'మద్రాసు స్కూలుబుక్కువర్నాక్యులరు సొసైటీ' వారు కూడా సంప్రదించి యిట్టి నిఘంటువు తయారు చేయటానికి శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగారిని (1828-1891) నియమించినారు. ఈయన పండితుడు, వైయాకరణి. "ఈయన రాజధానీ కళాశాలయందు ప్రథమ పండితపదవి నలంకరించిన పరవస్తు చిన్నయసూరి గారి కడకేగి వారివద్ద విద్యావిచారణచేయ నారంభించిరి. శ్రీపురాణం హయగ్రీవశాస్త్రి గారితోడను, రేకము రామానుజసూరి గారి తోడను ఆచార్యులవారికి పరిచయము కలిగెను"* ఆయన అందులకు పూని ఇప్పటికిని అధికారపదవి నలంకరించియున్న శబ్దరత్నాకరాన్ని తయారు చేసినాడు, ఈయనకు పూర్వమున్న నిఘంటువులను చూస్తే దీని విశిష్టత తెలుస్తుంది.‡ ఈయన అదివరకే చిన్నయసూరిగారు వ్రాయటానికి

---

* 2 ఆంధ్ర సర్వస్వము.

‡ శబ్దారత్నాకరానికి పూర్వమున్న నిఘంటువులు కొన్ని యీక్రింద ఇస్తున్నాను.

| | |
|---|---|
| 1. ఆంధ్రనామ సంగ్రహము | పైడిపాటి లక్ష్మణకవి. |
| 2. ఆంధ్రనామశేషము | అడిదము సూరకవి. |
| 3. ఆంధ్రభాషార్ణవము | నుదురుపాటి వెంకనార్య. |
| 4. వెంకటేశాంధ్రము | గణపవరపు వేంకటకవి. |
| 5. సాంబ నిఘంటువు | కస్తూరి రంగకవి |
| 6. దేశ్యనామార్థకోశము | రామాయణము కృష్ణయామాత్యుడు. |
| 7. విశిష్టాం (విశేషాం) ధ్రము | చాట్రాతి లక్ష్మీనరసు. |
| 8. ఆంధ్రపదాకరము | పూసపాటి వీరపరాజు. |
| 9. సర్వార్థసారసంగ్రహము | అమలాపురపు సన్యాసి కవి. |
| 10. ఆంధ్రదీపిక | మామిడి వెంకయ్య. |
| 11. ఆంధ్రదీపిక (చౌర్యమ్॥) | చుండూరి రంగనాయకులు శ్రేష్ఠి. |
| 12 బ్రౌణ్య నిఘంటువు | సి.పి. బ్రౌను |
| 13 అక్షర గుచ్ఛము | పరవస్తు చిన్నయసూరి (అసంపూర్ణము). |

తూము రామదాసుకవి అనే అతను డెబ్బది ఏండ్ల క్రిందట ఒక నిఘంటువు వ్రాశాడు. ఇతను హైద్రాబాదులో మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన కవి.

ఆంధ్రదీపికను గూర్చి బ్రౌను యిట్లా అన్నాడు:-

"The Depika is a dictionary of Telugu explained in Telugu written by Mamidi Venkiah, at Masulipatam .. .......... ...... It gives a mere selection of words used in Telugu Poetry, the ordinary Telugu of common life is but slightly noticed." (ఆంధ్ర సర్వస్వము - సం॥ 2. 3-6.)

ప్రారంభించి కొంత వ్రాసిన ఒక నిఘంటువును ఆయనవద్దనుంచి దొంగిలించి తనదిగా అచ్చువేయించుకొన్నాడని ఒకపుక్కిటిపురాణమున్నది. అది యింతదూరాన విశ్వసించదగినదికాదు. ఇటువంటి గాధలు మనకు చాలా ఉన్నవి. ఈయన చిన్నయసూరివంటి పండితుడు. ఆయన వదలిన వ్యాకరణ విశేషాలన్నీ కలిపి "ఆంధ్రలక్షణ శేష" మనే (1885) పేరుతో రచించిన వైయాకరణి. ఇంకా అనేక గ్రంధాలను రచించినాడు.◆ నిన్న మొన్నటివరకు శబ్దరత్నాకరమే ఆంధ్రభాషకు శరణ్యమైన నిఘంటువు.

ధారావాహికగా ప్రవహించే జీవద్భాషకు సంస్కృతానికివలె, మారని కట్టుదిట్టాలుగల వ్యాకరణము వ్రాయట మసంభవము. నన్నయ భట్టు ఆంధ్రశబ్ద చింతామణివద్దనుంచీ, సూర్యానారాయణీయముదాకా చూస్తే యీ సంగతి వ్యక్తమౌతుంది. అలాగా అట్టి జీవద్భాషకు శాశ్వతముగా పనికివచ్చే నిఘంటువుకూడా ఉండటానికి వీలులేదు. "ప్రయోగశరణం వ్యాకరణం" కాబట్టీ, ప్రయోగము మారడమూ క్రొత్త ప్రయోగాలు రావటమూ ఉంటుంది కాబట్టీ, జీవద్భాషలలోవున్న నిఘంటువులకు ఎప్పటికప్పుడు అనుబంధాలు వస్తూఉంటవి. ఆక్సుఫర్డు ఇంగ్లీషు నిఘంటువు మొదలైనవి చూస్తే యీ సత్యము మనకు తెల్లమౌతుంది. ప్రతి నిఘంటువుకు ఒకఅనుబంధము (supplement) కనపడుతుంది. కాబట్టి శబ్దరత్నాకరం పాతపడినదనటము శ్రీ ఆచార్యుల వారిలోపమెంత మాత్రము కాదు. ప్రజాహిత సంస్థలైన విశ్వవిద్యాలయాలు మొదలైనవి యెప్పటికప్పుడిట్టి నిఘంటువులను వ్రాయించటం, అనుబంధాలు ప్రకటించటం, చేస్తూ ఉండవలసినది. కాని ఆంధ్రులు ఆనోము నోచలేదు. ఆచార్యులవారివంటి ఒక్కవ్యక్తి అంతకంటె చేయలేదనటం యెంత మాత్రమూ భావ్యముకాదు, చేసిన మనిషికీ చేసిన పనికీ, కృతజ్ఞతచూపటం ఆంధ్రులింకా నేర్చుకొనవలసిన విషయము. ఇక సంస్థలా స్వార్థపరులైన పెద్దల చేతులలో ఉంటవికాబట్టి వాటినుంచి జాతికి వలసిన సహాయము రాదు. ఒక వ్యక్తి

◆ సుందరరాజ శతకము, వినాయక శతకము, వైకృత దీపిక, బాలచంద్రోదయము, అలఘుకౌముది, నీతిమాల, పదార్థనామకోశము, బాలబోధము, ప్రసన్న పారిజాతము, శబ్దమంజరి (తెనుగు) మొదలైనవి ఆచార్యులు గారు రచించిన కొన్ని గ్రంధములు.

యెంత శ్రమపడినప్పటికి కార్యము సమగ్రముగానూ పూర్ణముగానూ కాదు. శ్రీ కొట్రశ్యామల కామశాస్త్రిగారు ఒక్క చేతిమీద శ్రమతో, నష్టముతో, వాచస్పత్యము మాత్రము వ్రాసి ప్రచురించినారు. ఇదే యిప్పటికీ మనకున్న సమగ్రనిఘంటువు. ఆంధ్రదేశమంతా ఆయనకు కృతజ్ఞము. శ్రీ పిఠాపురం రాజావారి ఆదరణతో "సూర్యరాయాంధ్ర నిఘంటువ" ని ఒకటి ప్రారంభించబడినది. శబ్దరత్నాకరం వాచస్పత్యం మధ్యవచ్చిన నిఘంటువులన్ని బ్రౌణ్య శబ్ద రత్నాకరాల ప్రతిబింబాలే.◆ శ్రీ ఆచార్యులవారు తన భాషా సేవ యిప్పటికీ స్మరణీయముగా చేసుకున్న వ్యక్తి, ఆంధ్రులు మరువరాని భాషాసేవకుడు.*

## అముద్రిత గ్రంథ చింతామణి:

ఏనాడూ తిక్కన మహాభారతాన్ని పదిహేను పర్వాలలో పూర్తిచేసి హరిహర నాథుని కంకిత మిచ్చినాడో, అప్పటినుంచీ నెల్లూరు సారస్వత కేంద్రాలలో ఒకటై పోయినది. ఆ పట్టణములో పూండ్ల రామకృష్ణయ్య గారనే (1860 - 1904) భాషాసేవకుడుండేవాడు. ఈయన "అముద్రిత గ్రంథచింతామణి" అనే పేరుతో ఒక మాసపత్రిక స్థాపించి (జూన్ 1885) దాదాపు యిరువదివత్సరములు నడిపినాడు.‡ ఆయన మరణముతో పత్రిక అంతరించినది. ఈ పత్రికకు వెనకా ముందూ అనేక పత్రికలు వెడలి నడిచినా దీని విశిష్టత దీనిదే!※ సారస్వత సేవకొరకే ఉద్దేశింపబడిన

◆ 1. ఆంధ్రపారిజాతము - ఓగిరాల జగన్నాథకవి గురజాడ శ్రీరామమూర్తి.
2. లక్ష్మీనారాయణీయము - కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రి.
(శ్యామల కామశాస్త్రి గారి తండ్రి)
3. శబ్దార్థచంద్రిక - మహ...ళి సుబ్బారాయుడు.
4. శంకరనారాయణ నిఘం..ద్వయం

* శబ్దరత్నాకరమనే పేరుతో ఎ.వ్యాసశాస్త్రి అనే ఆయన ఒక నిఘంటువు వ్రాసినట్లు కనపడుతుంది, కాని యే కారణం చేతనో ప్రచారంలో లేదు.

‡ కొంత కాలము ఒడయరు వీరనాగయ్యగారి యొక్క, కొంతకాలము సి. వెంకట రామానుజరావు నాయుడు గారి యొక్క సహాయం పొందినారు.

※ ఆ ప్రాంతంలో వచ్చిన పత్రికలను కొన్నిటిని పేర్కొంటున్నాను.

| | | | |
|---|---|---|---|
| 1. సుజనరంజని | మద్రాసు | 1845 | చిన్నయసూరి |
| 2. శ్రీయక్షిణి | బళ్లారి | 1850 | ? |

పత్రికలు కూడా అనేకం వెలువడినవి. కాని దీని **ఉదాత్తత** దేనికీ లేదు. దానిలో వ్రాసే పండితులూ కవులూ ప్రఖ్యాతులు. కొన్ని మతప్రచారము ఉద్దేశ్యముగా కలిగి క్రైస్తవ ఫాదరీలచేత నడపబడేవి. అముద్రిత గ్రంథ చింతామణియొక్క విశిష్టత తెలియుటకై పత్రికాధిపతి వ్రాసిన పద్యాల నీక్రింద నను వదిస్తాను.

---

| | | | |
|---|---|---|---|
| 3. ఉపాధ్యాయోపకారి | గుంటూరు | 1861 | శ్లాండర్ |
| 4. శారద | అత్తిలి | 1865 | సూర్యనారాయణ రాజు, ఆచంట |
| 5. విబుధరంజని | ఏలూరు | 1864 | దామరాజు రామచంద్రరావు |
| 6. గ్రంథప్రదర్శిని | విశాఖపట్నం | 1896 | శ్రీనివాస జగన్నాధశాస్త్రి |
| 7. జనవినోదిని | చెన్నపట్నము | 1880 | ? |
| 8. మహారాణి (సచిత్రము) | చెన్నపట్నము | 1889 | వి. కృష్ణమాచార్యులు |
| 9. లోకరంజని | ? | 1889 | కాకర్ల సుబ్బారావు |
| 10. శారద | బుచ్చిరెడ్డి పాలెం | 1870 | ఎడవల్లి కామశాస్త్రి |
| 11. వర్తమానతరంగిణి | ? | 1895 | బెజవాడ బాలకృష్ణారెడ్డి |
| 12. వాగ్వల్లి | ? | 1895 | కె సి. రామానుజశర్మ |
| 13. సూర్యాలోకము | చెన్నపట్నం | 1895 | జి.సి.వి శ్రీనివాసాచార్యులు |
| 14. సుమనోభిరంజని | ? | 1888 | కృష్ణమూర్తి |
| 15. కళాభివృద్ధి | విశాఖపట్నం | 1890 | ప. వెంకటరంగనాధ స్వామి |
| 16. విద్యార్థి కల్పభూజము | నెల్లూరు | 1882 | ఉ. రామచంద్రరావు |
| 17. ఆంధ్రభాషాసంజీవని | రాజమండ్రి | ? | కొక్కొండ వెంకటరత్నము |
| 18. వివేకవర్ధని | రాజమండ్రి | ? | వీరేశలింగంపంతులు |

('వివేకవర్ధని' అనే పత్రిక 1878 లో మొదలిడి వీరేశలింగము గారిచే రాజమండ్రినుంచి వెలువరింప బడుచుండేది. తర్వాత మళ్ళీ 1891 లో పంతులుగారు న్యాయపతి సుబ్బారావుగారూ కలసి "చింతామణి" అనే మాసపత్రిక నడిపినారు.)

| | | |
|---|---|---|
| 19. సుజనమనోల్లాసిని | చెన్నపట్నము | ఏ. ముత్తయ్య |
| 20. హిందూజన సంస్కారిణి | ? | మన్నవ బుచ్చయ్య |
| 21. యథార్థవాది | విశాఖపట్నం | గ. కూర్మయ్య |
| 22. తెలుగుహార్పు | విజయనగరము | వెంకటరామయ్య |
| 23. ఆంధ్రప్రకాశిక | మద్రాసు | ఎ.సి. పార్థసారధి నాయుడు |

(ఇది 1885-1895 వరకు 40 యేండ్లు అవిచ్ఛిన్నముగా నడచినది.)

| | | |
|---|---|---|
| 24. శశిరేఖ | మద్రాసు | గట్టుపల్లి శేషాచార్యులు |
| 25. జ్ఞానోదయము | ఏలూరు | దాసు కేశవరావు |
| 26. దేశాభిమాని | గుంటూరు | దే. శేషాచలపతిరావు |

('ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలు' భారతి 1929 మే) ('వార్తాపత్రికలు' భారతి 1930 జూన్)

"జతనము మీఱఁగ నము
ద్రిత సద్గ్రంధముల సేకరించి కడుఁబరి
ష్కృతములు గావించి యధా
మతిఁ బత్రికఁ గూర్చెదము క్రమంబుగ వానిన్
తోరపు నూలుదారములతోఁ బదిలంబుగఁ గట్టిపెట్టియుం
జేరుపనందు జీర్ణదశఁ జెంది మొగిం గ్రిమికీటకచ్ఛటా
పూరితమై వృధాసెడు నముద్రిత పుస్తకపంక్తి నెంతయున్
గూఱిమి మీఱ నచ్చునను గూర్చుట సెల్లదె పత్రికాకృతిన్
ఒనర మా పూన్కి రసికజనోపయోగ
మగు కతంబున నిజకార్యముగఁ దలంచి
గైకొనుడు పోషకాద్యధికారములను
శాశ్వతంబుగఁ బత్త్రిక జరుగుకొరకు"

పై అనువాదమువలన గ్రంధప్రచురణము పత్రికోద్దేశములలో ముఖ్యమైన దని తెలుస్తున్నది. మరియు గ్రంథవిమర్శనము కూడా దీని ముఖ్యోద్దేశము.◆ ఈ పత్రికోద్దేశాన్ని గూర్చి వ్రాయబడిన యీ క్రింది వాక్యాల ననువదిస్తాను.

"ఈ పత్రికయందు వార్తలు మొదలగునవి ప్రకటించినగాని వ్యాప్తము కాజాల దనియు, పత్రిక కొనసాగుట దుర్ఘటమనియుఁ గొంతమంది యీ పత్రికాధి పతులకు వ్రాయగా, వీరీ విషయమునుగూర్చి కీర్తిశేషులైన విద్యావినోది పనప్పాకం ఆనందాచార్యులవారితో ప్రస్తావించి రనియు, వారీ పత్రికయందట్టివి ప్రకటింప నవసరములేదనియు, వానికి వేఱు పత్రికలు కలవనియు, నిది ఇంగ్లీషునందు ప్రకటింపబడు "ఎథేనియమ్" (Atheneum) పత్రిక వలె భాషా వాఙ్మయ విషయమునే ప్రధానముగ నెంచి వెలయవలయుననియు పక్కాణించిరట."

(భారతి; ప్రమోదూత శ్రావణము.)

విమర్శనానికి నిజముగా పునాదివేసినది యీ పత్రికే నని చెప్పవచ్చును. కాని యిందులో ప్రకటింపబడే విమర్శనలుకూడా కొంతవరకు భాషాప్రయోగ ప్రాధాన్యము కలిగి రంధ్రాన్వేషణపరములై యున్నవి. అయినప్పటికి యీ పత్రిక యెన్నదగిన భాషాసేవ చేసినదని చెప్పటానికెట్టి యభ్యంతరము లేదు. శ్రీ వేదం వెంకట్రాయశాస్త్రి గారివంటి పండిత ప్రకాండుల వ్రాతలకిది స్థానముగా ఉండేది.

---

◆ 'నెల్లూరఁ బత్రికాప్రచారము' (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 10-4-239)

ఈ పత్రిక విమర్శనానికి మిక్కిలి విలువ ఉండేది. శాసన పరీక్షలు మొదలైనవి కూడా యీ పత్రికలో ఉండేవి.‡ ఇలా ఉండగా శ్రీ వీరేశలింగంపంతులు గారు సాహిత్య రంగముమీద తమ ప్రభావాన్ని ప్రారంభించినారు.

## పరిశోధనము

ఈ కాలములోనే చరిత్ర పరిశోధమునకూడా తెనుగువారు బీజమునాటినట్లు కనబడుతున్నది. తల్లాప్రగడ సుబ్బారావుగారు అచ్చమైన ఆంధ్రుడు. ఆయన బ్రతికినది కొద్దిసంవత్సరాలైనా (1856-1890) అత్యంతకీర్తి గడించినాడు. బరోడాలో గొప్ప ఉద్యోగము చేసినాడు. "రాజకీయములందును, సంఘసంస్కారమునందును, మతవిషయములందును, చరిత్ర పరిశోధనలందును, తరువాత కలిగిన వికాసమునకును, జాతీయ చైతన్యమునకును దారితీసిన ఆంధ్రమహాపురుషు" డనే కీర్తి ఆయన గడించినాడు. ఈయన భగవద్గీతోపన్యాసములు ఆంగ్లములో ప్రకటింపబడినవి. ఈయన చేసిన చరిత్ర పరిశోధనములలో ముఖ్యమైనవి.

(1) బుద్ధనిర్వాణకాలము క్రీ.పూ. 477 అని పాశ్చాత్యచారిత్రకు లనగా, తప్పుగాక క్రీ. పూ. 543 అని నిర్ణయించుట

(2) ఖారవేల శాసనముయొక్క కాలనిర్ణయము చేయుట. (ఇదియే అంగీకరింపబడినది)

(3) శంకరాచార్యులకాలము క్రీ.పూ. 200 అని సహేతుకముగా నిర్ణయించుట

దివ్య జ్ఞానసమాజము స్థాపించిన కల్నల్ అల్కాటుగారీయనను గూర్చి యీ క్రింది మాటలు వ్రాసినారు;

‡ 'సాహిత్య విమర్శనమునందీ పత్రిక యాంధ్రదేశపత్రిక లన్నిటికన్న మిన్నగ సేవచేసినదని చెప్పుట యతిశయోక్తి కానేరదు." - నిడదవోలు వెంకట్రావు.

* క్రిందివి యీ పత్రికలో ప్రకటింపబడిన కొన్ని విమర్శనములు.

1. [illegible] కృతివిమర్శనము.
2. శ్రీ [illegible] కృతివిమర్శనము.
3. విక్రమార్కచరిత్ర ముద్రణ విమర్శనము.
4. మనుచరిత్ర దోషారోపణ ఖండన గ్రంథము

"ప్రాచీన విజ్ఞాన రహస్యములను గ్రహించుటలో తల్లాప్రగడ సుబ్బారావు గారితో సమాన ధీశక్తి కలవారు మాత్రము నాకు కనబడలేదు. ఆయన మద్రాసులో నుండుటయే మేము మాకార్యస్థానము నారాజధానిలో స్థాపించుటకు గల మూలకారణములలో నొకటి."* ఈయన "ఆనాడు చెన్నపట్టణమున మహామహులుగా నుండిన సర్. టి. మాధవరావు, దివాన్ బహద్దరు ఆర్ రఘునాధరావు, కల్నల్ ఆల్కాట్, మదాంబ్లావట్ స్కీ మొదలగువారివలన మన్ననల నందినారు."

ఇంత గొప్పవాడైనా ఈయన వ్రాతలన్నీ దాదాపు ఇంగ్లీషులో ఉన్నందుచేత దేశీయులకు తెలియటం తటస్థించలేదు. ఎన్నదగిన ఆంధ్రుడు.

* భారతి. 1945 మే.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 2

# సంధ్యాకాలము - వీరేశలింగం పంతులు

ఏదైనా చాలకాలముంటేగాని, అనుభవించగలిగినదానికంటె ఎక్కువైతేగాని, విసుగువేస్తుంది. 'కడుపునిండితే గారెలు చేదు'. పందొమ్మిదో శతాబ్దాంతానికి ఆంధ్రప్రబంధ కవిత్వస్థితి అట్లా ఉన్నది. మొదటి ప్రబంధకవులు ఒక్కొక్కరు ఏదోఒక విశేష గుణము కవిత్వానికి అలవడజేసినారు. 'అల్లసానివాని అల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు, పాండురంగవిభుని పదగుంభనంబు...' ఈ ప్రకారముగా పెరిగి ఆహ్లాదము కలిగించిన ప్రబంధకవిత్వము బూజు పట్టినది. చర్వితచర్వణమూ గతానుగతికమూ అయిపోయినది. తరువాతి ప్రబంధాలు ఒక్కటి చదివితే మరి చదవనక్కర లేదు. అవే సన్నివేశాలు, అవే వర్ణనలు, అదే పరిణామము. అందాకాఎందుకు? జనబాహుళ్యము రుచి మారినదేగాని, ప్రబంధాలు వ్రాసేవారూ, చదివి ఆనందించేవారూ, ఈకాలంలో మాత్రము లేరూ? అన్నిరుచులు అన్ని కాలాలలో ఉంటవి. కాని అటువంటి వాళ్ళ సంఖ్య ఇప్పుడు చాలా తక్కువ.

ప్రబంధయుగము 19వ శతాబ్దములోకి అనువృత్తమైనది. ఈపందొమ్మిదవ శతాబ్దపుటుత్తరార్ధము మన దేశానికి చాలా ఉపద్రవకరమైన కాలమేకాక అన్నివిధాల మార్పుకు పునాది వేసినకాలము. 1857వ సంవత్సరానికే ఇంగ్లీషువారి రాజ్యము గట్టిపడినది. ఇంగ్లీషు రాజభాష అయినది. ఆభాషను మనప్రముఖులు కొంతమంది చదువుకున్నారు. పరదేశీయ భాషాసంపర్కము మనవాళ్ళ చిత్తవృత్తులలో మార్పు కలగజేసినది. ఆంధ్రదేశానికి పైనా క్రిందా కూడా యీ పరివర్తనాగ్ని అంటుకున్నది. ఈగాలి బెంగాలుకు, మద్రాసుకు ముందు కొట్టినది. మద్రాసు సులభముగా మారే ప్రకృతి కలది కాదు. ఒకమూల మిషనరీలు క్రైస్తవ మతాన్ని అత్యంతము ప్రచారము

చేయటం మొదలుపెట్టినారు.* వర్ణాశ్రమ ధర్మముమీద కొందరికి ఏహ్యతకలిగినది. మానవులందరు ఒకటేననే సూత్రము బయలుదేరినది. తుదకు సనాతన మతము లోపభూయిష్ఠమనే అభిప్రాయము ప్రబలినది. ఈ అసంతృప్తి కారణముగా కొందరు పరమతాలలో చేరడం తటస్థించినది. ఈ ఆపత్తు కొందరు మహాశయులు కనిపెట్టి, క్రొత్తమతాలు లేవదీసినారు. వాటిలో బ్రహ్మమతము ఒకటి. ఈమతము క్రైస్తవమతానికి ప్రతిబింబము. పంజాబులో సిక్కు ఆర్య సమాజ మతాలెలా ముసల్మానుల మతపరివర్తనాన్ని ఆపడానికి పుట్టినవో, బెంగాలులో ఈ బ్రహ్మసమాజము క్రైస్తవుల మతపరివర్తనాన్ని అడ్డుతగలడానికి పుట్టినది.

ఎప్పుడైతే మతప్రచారాని కడ్డు తగిలినదో,ఇంగ్లీషువారాలోచించినారు. రాజకీయముగా గెలిచినదేశము మతపరివర్తనముతో నిలబెట్టుకోవడం కష్టమని గ్రహించినారు. వైజ్ఞానికముగా విజయముగనుక పొందితిమా, మన రాజ్యము చిరస్థాయిగా ఉంటుందని నిశ్చయించినారు.◆ ఇందుకు ఇంగ్లీషు భాషాపరనను ప్రవేశపెట్టడమే మార్గమని ఊహించినారు. ఈ దూరదర్శిత్వము కొంతవరకు ఫలించినదని అనుకోడానికి యిప్పటి పరిస్థితులే తార్కాణము. మెకాలే మహాశయుడు ఇంగ్లీషు విద్యా ప్రణాళికను తయారుచేసినాడు. ఇంగ్లీషు పాఠశాలలు స్థాపింపబడినవి. కొన్ని వీటిలో మిషనరీలు నడిపేవి. ఇంగ్లీషు క్రైస్తవవిజ్ఞానాలు పెరిగి పోయినవి. అవి చదివిన మనవాళ్ళకు మనదంతా అసహ్యముగా కనపడినది. బంగాళీలు కొందరీ అవకాశమును తీసికొని సారస్వతానికి నూతనవికాస మీయడానికి పూనుకున్నారు. బంకించంద్రుడు మొదలైనవారట్టివారే! ఏవంక చూచినా యింగ్లీషువాతావరణమే! మాట్లాడితే యింగ్లీషే మాట్లాడవలె! వ్రాస్తే యింగ్లీషే వ్రాయవలె! ఇది ఆనాటి స్థితి.

క్రమముగా ఈపరిస్థితు లాంధ్రదేశానికికూడా ప్రాకినవి. ఇద్దరు వ్యక్తులు వీటికి పాలైనారు. కాకినాడలో నాయుడుగారూ, రాజమహేంద్రవరములో వీరేశలింగముగారూ. నాయుడుగారిలో సంస్కృతాంధ్ర భాషాసంస్కారము

* 1857-60లో తెలుగులో బైబిల్ అచ్చైనది. 1871లో కూడా ఒకప్రతి అచ్చైనది. 1830 ప్రాంతములో బ్రౌను 'లూకా సువార్త'ను తెనిగించి ప్రచురించినాడు.

◆ 1857 లో కలకత్తా, బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయాలు స్థాపించినారు

తక్కువై ఆయన కేవల మాంగ్లపండితుడు కావడం చేత ఆయనప్రతిభ కేవల మతవ్యాపనమే పరిణామముకలదైపోయినది. కాని వీరేశలింగము పంతులుగారు (1848-1919) దేశీయసంస్కారములుకల మనిషి. ఈయన మతవ్యాపనము దేశభాషమూలముగా సాగించినాడు.‡ రాజమహేంద్రవరము పూర్వమాంధ్రభాషకూ, కవిత్వానికీ కేంద్రము. పూర్వయుగములో నన్నయ ఎలా ఆంధ్రకవిత్వానికి మూలకందమైనాడో, వీరేశలింగము పంతులుగారు నవ్యాంధ్ర సారస్వతానికి మూలపురుషుడైనాడు. మతావేశము ఆయన హృదయములో గాఢముగా నాటుకొని పోయినది. ఆయన తాను పరమేశ్వరుడిచేత సంఘాన్ని బాగుచేయడానికి పంపబడిన దూత అనుకున్నాడు. అలా అనుకుంటే తప్ప ఆయన యింతపని చేయగలుగుతాడా? ఒక దేశము సాంఘికముగాగాని, మతవిషయముగాగాని, రాజకీయముగాగాని అలజడికి పాలైనప్పుడు మనుష్యుల హృదయాలు ఒకవిధముగా కలత చెందుతవి. ఆ కలత చిత్రకారుల చిత్రాలలోనూ, కవుల గ్రంథాలలోనూ ప్రతిబింబిస్తూ ఉంటుంది. అందులో వాదోపవాదాలు బయలుదేరేటప్పటికీ, అసలువిషయ మెలాగున్నా, సాహిత్యానికిమాత్రం ఉపకారం జరుగుతున్నది. అందుచేతనే జాతీయజీవనము సారస్వతములో ప్రతిబింబితమై ఉంటుందని అంటారు. ఎలాగైతే నన్నయకాలములో 'కథా కవితార్థ యుక్తి' కిన్నీ 'అక్షర రమ్యత' కున్నూ జరిగిన పోరాటము ఆయన గ్రంథములో కనపడుతున్నదో; ఎలాగైతే తిక్కనకాలములో జరిగిన చిన్న యుద్ధరాయబారాలు ఆయన గ్రంథములో ప్రతిబింబిస్తున్నవో, ఎలాగైతే శ్రీనాధుడి కాలములో కవుల జీవితము వగైరాలు ఆయన చాటుధారలలో వ్యక్తమౌతున్నవో, ఎలాగైతే ప్రబంధకాలములో కడుపులో చల్ల కదలకుండా రాజపోషణవల్ల కలిగిన ఐశ్వర్యము, సౌఖ్యము ప్రబంధాల్లో మూర్తిభవిస్తున్నదో, అల్లాగే వీరేశలింగముగారి వివిధ కృతులలో ఆయన హృదయవేదన, సంస్కరణాభిలాష అచ్చుగుద్దినట్టు కనబడుతున్నవి.

‡ వీరేశలింగము పంతులుగారిని మార్చినది ఆంగ్లవాఙ్మయము వారిరచన లన్నింటిలోనూ కళాప్రియత్వముతో బాటు సంస్కరణ ఎక్కువపాళ్ళు కలదై కనిపిస్తుంది

- ఆంధ్రపత్రిక, 22-9-40.

తన భావాలను వ్యక్తంచేసే వాహికగా సారస్వతాన్ని గ్రహించినాడు. హిందూ సంఘములో ఉన్న బాల్యవివాహము, విధవావివాహ నిషేధము, రండాముండనము, వృద్ధవివాహము, విగ్రహారాధన మొదలైన ఆచారాలు ఆయనకు ఏహ్యముగా కనబడినవి. బ్రహ్మసమాజ మతవ్యాపనకు మాత్రము నాయుడుగారితో కలిసి పనిచేస్తూ, మిగిలిన కాలాన్ని, ధనాన్ని, ప్రతిభనూకూడా వీటి ఖండనములో వినియోగించినాడు. భాషకు మహోపకారమైనది. ఆయన మతసంఘ సంస్కారము మంచిదా చెడ్డదాఅనిగాదు ఇక్కడ విచారణ. ఆయనచేసిన పనియొక్క పరిణామ మేమిటీ అనేది మనకు కావలసినది. అప్పుడు రాజమహేంద్రవరం పండితులకూ, కవులకూ, నిలయమైఉండేది. వీరిలో చిన్నా పెద్దా ఉండేవారు. వీరిలో వీరేశలింగం పంతులుగారున్నూ, కొక్కొండ వెంకటరత్నం పంతులుగారున్నూ, మతసాహిత్య విషయాలలో బద్ధశత్రువులు. కాశీభట్ల బ్రహ్మయ్యగారుకూడా అటువంటివాడే!* ఇంగ్లీషు చదువుకున్న, చదువుతున్న విద్యార్థులంతా వీరేశలింగంగారి అనుయాయులు. వీళ్ళ సహాయముతో పంతులుగారు అనేక విధవలకు వివాహాలు చేసినాడు. ఆ దంపతులను ఏనుగులమీద ఊరేగింపజేసినాడు. అనేక బాల్యవివాహాలను ఆపినాడు! దేశములో వైజ్ఞానికముగా యువకుల చిత్త వృత్తుల్లో చాల పరివర్తనము కలుగజేసినాడు. నాయుడుగారికి కూడా యిట్టి శిష్యగణమే ఉండేది కాని, వాళ్ళంతా ఇంగ్లీషు పండితులు. ఇద్దరిశిష్యులలో యిప్పటికీ కొందరున్నారు. బ్రహ్మసమాజమతమీ శిష్యగణములో లీనమైఉన్నది. వీరి ప్రచారమూ, దేశకాల సహాయమూ, కలిసి మతాచారాలను కొంచెము సడలించిన దనక తప్పదు. ఏది ఎల్లా ఉన్నా వీరేశలింగంగారి కృషి, భాషకూ సారస్వతానికీకూడా అత్యంతోపకారకమైనది.

పంతులవారి సేవవల్ల భాషకు జరిగిన ముఖ్యమహోపకారాలు మూడనవచ్చును.

(1) భాషా సౌలభ్యకల్పనము.

---

* "They were inevitably dazzled by the splendour and variety of the treasures laid bare to their view. They compared them with their own much to the disadvantage of the latter. They were impressed almost by the total absence in Telugu of a great prose literatutre and the singular lack of variety in its literary forms. - K.R. in Triveni, Jan.1928

(2) వివిధ సారస్వతవ్యాప్తి.

(3) పరభాషా వాఙ్మయానువాదము.

# 1. భాషాసౌలభ్యకల్పనము:

వీరేశలింగం పంతులవారి ఉద్దేశము సంఘసంస్కారము, మతబోధ. వీటికి ప్రాప్యులెవరు? సామాన్యప్రజలు. అందరికీ అర్థమయ్యే భాష వ్రాయటం అవసరమైనది. వీరశైవ మతవ్యాప్తికోసము రచిస్తూ, పాల్కురికి సోమనాథుడు "ద్విపద"లో రచించినాడు. జనబాహుళ్యాన్ని ఉద్దేశించే ప్రతిగ్రంథమూ, సులభశైలిలో ఉండవలెనుగాని, గిడుగు రామమూర్తి పంతులు చెప్పినట్లు "కృతకభాష"లో ఉండరాదు. వీరేశలింగం పంతులుగారీ రహస్యాన్ని కనిపెట్టినారు.

17, 18 శతాబ్దాలలో తుపాకుల అనంతభూపాలుడు, సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు, కళువె వీర్రాజు, వగైరాలు వ్రాసిన తెలుగు వచనము చూస్తే చాలా సహజముగా ఉండి, సర్వజన పఠనయోగ్యముగా ఉంటుంది. శైలికూడా సంభాషణ శైలిగా ఉంటుంది. ఇప్పుడు ఓరియంటల్ లైబ్రరీలో ఉన్న గ్రామకైఫీయతులుకూడా ఆభాషలోనే ఉంటవి. ఇవేగాకత్రైలరు భాషాంతరీకరించిన చారిత్రక గ్రంథాలుకూడా అలాగే ఉంటవి.

1827 సంవత్సరములో, అనగా చిన్నయసూరికి అవ్యవహిత పూర్వముగా ఉన్న యీక్రింది గద్య చూడండి:

"తమరు-అబద్ధములు లేకుండా శోధించుమని మావద్దయిచ్చిన శబ్దమంజరి యొక్క ప్రథమ ద్వితీయభాగములైన-అక్షర గుచ్ఛము, సంధి వృంతము - ఈ రెంటి నిన్ని - మేము నలుగురమున్ను - బాగా శోధించితిమి. ఇందులో మాకు చూడగా అబద్ధములు లేవనిన్ని, యిది బాలులకు చదువనుపయోగించుననిన్ని తోచుచున్నది."◆

◆ "ఒకనికి యిద్దరు కుమాళ్ళుకలరు. వాండ్లలో చిన్నవాడు తండ్రినిచూచి, వో తండ్రీ! నాకు వచ్చేవంతు యిమ్మని చెప్పినందున వాడు తమ పుత్రులకు జీవనోపాధి పంచిపెట్టెను, కొన్నాదినములైన తరువాత చిన్నకుమారుడు సమస్తం కూడజేసుకొని దూరదేశానకు వెళ్ళిపోయి అక్కడ దుర్మార్గులయందు నడచి ఆస్తిక్షయము చేసుకొనెను. అయితే అంతా సరిపడిన తరువాత ఆదేశమందు మహాక్షామం కలిగివుండెను అయినందున వానికి లేమి వచ్చెను."

- బ్రౌను బైబిలు పరివర్తనం, ఆంధ్ర పత్రిక 22-1-45.

ఎంత చక్కగ ఉన్నదో, దీనికన్న గ్రంధాలలో వచనాలలో భాషకున్నూ, యెంతభేదమున్నదో చూడండి! పద్యముకంటె గద్యము వైశద్య ప్రధానము. సంహితకంటె బ్రాహ్మణ మెంత విశదముగా ఉంటుందో చదివితే తెలుస్తుంది. చ్యుతసంస్కారము కానట్టి, చిన్నయసూరి ప్రభృతుల "కృతకభాష" కాక సులభ గ్రాహ్యమైనట్టి, ఒక ప్రత్యేక శైలిని కనిపెట్టారు వీరేశలింగం పంతులుగారు.* చ్యుతసంస్కారము కాకుండా అటువంటి భాషైతే పండితులుకూడా ఆదరిస్తారు. ఈభాష మిక్కిలి సులభమై, అందరికి గ్రాహ్యమై, పంతులవారి అభిప్రాయ ప్రచారానికి మిక్కిలి సాయపడటమేగాక, ఒక నూతన జీవము కల్పించినది.

## 2. వివిధ సారస్వతవీధివ్యాప్తి:

ఆంగ్లసారస్వతములో ఉన్న వీధులన్నీ చూచేటప్పటికి, మనభాష బీదతనము పంతులుగారికి తేటపడి వాటిలోకూడా వ్యవసాయము చెయ్యాలని గట్టిగా తట్టినది. అదివరలో ఏవోకధలూ కధానికలూ ఉండేవేగాని, పాత్రలశీలము ముఖ్యముగా కలిగీ, కథాభవన నిర్మాణము కలిగీ, సంభాషణ పూరితాలైన గాధలు లేవు. వాటిని యింగ్లీషులో "నావెల్సు" అంటారు. దానినే యిప్పుడు తెనుగు సారస్వతములో "నవల" అంటున్నారు. ఇప్పుడాపదానికి ఆ అర్థము రూఢమైనది కాబట్టి నామచర్చ అనవసరము◆ ఇటువంటి నవలారచనకు వీరేశలింగం పంతులుగారే మార్గదర్శకుడని ఒక ప్రతీతి. ఆయన "రాజశేఖర చరిత్ర" అనే సాంఘిక నవలను రచించినాడు (1878)‡ అందులో మన సంఘములో ఉన్న దురాచారాలను తూర్పారపట్టినాడు. ఈనవల ఇంగ్లీషులోనికికూడా పరివర్తనమైనదంటే దాని ప్రాశస్త్యానికి వేరే సాక్ష్య మక్కరలేదు. ప్రథమాంధ్ర నవలారచయిత పంతులుగారేననే కీర్తి గడించినారు.

---

* వచనము సర్వోపభోగ్యమైన వస్తువుగాజేసి కేవలమాధునికమగు వచనమునకు మార్గదర్శియయ్యెను. - పిల్లలమర్రి (హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్పత్రిక)

◆ నరహరి గోపాలకృష్ణ శెట్టి గారు "శ్రీరంగరాజ చరిత్ర" అనే నవలవ్రాసి 1872 లో ప్రచురించునట్టు టేకుమళ్ల వ్రాసినాడు. (ప్రబుద్ధాంధ్ర జనవరి 1924) (ప్రతిభ సం.1 సం.3)

‡ "రాజశేఖరచరిత్ర మనే నవల విపరీతస్థితిలో నడచినందున, లోకములో నిట్టి గ్రంధములు పుట్టిన సారస్వత మంతయు పాడగునని విమర్శింప బూనితిని." - కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి

ఇది గోల్డుస్మిత్ "వికార్ ఆఫ్ వేక్ఫీల్డు"కు పరివర్తనమని అంటారు. అది అనుసరణము గాని పరివర్తనముకాదు.

తెనుగులో బొత్తుగా నాటకములేదని చెప్పటానికి వీల్లేదు. తంజాపూరు లైబ్రరీలోనూ, చెన్నపురి ఓరియంటల్ లైబ్రరీలలోనూ కూడా, నాటకాలు, యక్షగానాలు, సంఖ్యకుమించి ఉన్నవి. అవిఅన్నీ చూస్తేనూ, చదివితేనూ, తోలుబొమ్మలాటలవలె పామర జనోపయోగముగా కనిపిస్తవి. వాటిని ఇప్పుడు అందరూకూడా చాలా గొప్పవని అనుకోడం ఒక అలవాటైపోయినది. మరీ నవ్యసాహిత్య వేత్తలకవి వేదభాగాలవలె కనబడుతున్నవి! వాటిలో భాష సులభమైనట్లు కనబడినా మాండలికాలతో నిండి, సహృదయుడికి కావలసిన పాత్రపోషణము, రసము, కథాసంవిధానము మొదలైన వేమీ ఉండవు. వాటినిమాత్రము తోసి రాజనటానికి వీలులేదు. అవి మన సహజవిజ్ఞాన చిహ్నాలు కాబట్టి మిక్కిలిగా మనకాదరణీయాలే! 'మన్నారుదాస విలాస' మనే నాటకాన్ని ఒక దానిని ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించినారు. ఇవన్నీగనక ప్రచురిస్తే ఆంధ్రభాషావాఙ్మయ చరిత్ర రచనానికి చాలా ఉపకారమౌతుంది.

అప్పటికాలానికి సమీపాన్నే బళ్ళారిలో ఇద్దరు వ్యక్తులు, తెనుగులో సంస్కృత ఫక్కీ నాటకము లేకపోవటముచూచి, ఆలోటు భర్తీ చెయ్యాలని సమకట్టినారు. వీరు ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1843-1911) కోలాచలం శ్రీనివాసరావు గార్లు (1854-1919). ఇద్దరూ వకీళ్ళే! మంచి ప్రాక్టీసుకలవారే. కాని వృత్తితో పాటు సారస్వతసేవకూడా మరవలేదు. వీరిలో రావుగారికి ఆచార్లవారివలె పౌరాణిక నాటకాలంటేనే కాకుండా చారిత్రకాలంటేనూ చాలా యిష్టము! వీరిద్దరూకూడా స్వతంత్ర వ్యక్తులే! వీరిలో ఆచార్లవారి నాటకాలు ఎక్కువ ప్రచారముకావడము చేత ఆంధ్రదేశము వారికి "ఆంధ్రనాటక పితామహ" బిరుదిచ్చి గౌరవించినది. ఇద్దరూ గ్రంథకర్తలే కాకుండా స్వయంనటులై, రంగప్రసాధనము, యవనికావిక్షేపము, నేపథ్యవిధానము మొదలయిన వాటిలో దిట్టలు. వీరు స్వంత నాటక కంపెనీలను స్థాపించినారు. కళోపాసనే వీరి ఆదర్శము.

*వీరితోబాటు బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు కూడా కొంత కాలము తరువాత 1905 ప్రాంతములో 'హరిశ్చంద్ర' బహురసవంతముగా రచించినాడు. ఇప్పటికిది ఉత్తమాంధ్రనాటకాలలో ఒకటని చెప్పటంలో ఏమీఅతిశయోక్తిలేదు.◆ శంకరకవి గ్రంధానికి మెరుగు పెట్టాడనవచ్చును. ఈయనకూడా నటుడే! ఈయన పై బళ్ళారివారి కెంతమాత్రము తీసిపోనివారు. వేదం వేంకట్రాయశాస్త్రిగారు తమ అభిజ్ఞాన శాకుంతలాన్ని కూడా అప్పటికే రచించినాడు. వీరేశలింగం పంతులు గారు కూడా ఆంధ్రనాటక వాఙ్మయానికి తమవంతు సమర్పిస్తూ అభిజ్ఞాన శాకుంతలాన్ని సంస్కృతములోనించి తెనుగులోనికి పరివర్తనముచేసినాడు.‡ ఎందరెన్ని పరివర్తనాలు చేసినా యిదే ఉత్తమమైనదై, ప్రదర్శనాల కుపయుక్తమై,

---

* In June 1891 this society (Sarasa Vinodini Sabha) of amatures gave, if I am not mistaken, 4 performances in the V.P. Hall.

(P. Sambandam in the Hindu 9-11-41)

◆ ఈయన చీనాచరిత్రకూడా వ్రాసినాడు.

‡ ఈ పరివర్తన చేసిన కొందరిని ఉదాహరిస్తున్నాను.

1. పరవస్తు వెంకటరంగాచార్య
2. దాసు శ్రీరాములు
3. కందుకూరి వీరేశలింగం
4. రాయదుర్గం నరసయ్యశాస్త్రి
5. వడ్డాది సుబ్బారాయుడు
6. వేదం వేంకట్రాయశాస్త్రి
7. రాజా వత్సవాయి వెంకటనీలాద్రిరాజు
8. కాంచనపల్లి కనకమ్మ
9. త్రిపురాన సూర్యప్రసాదరావు
10. పంగనామములు రామచంద్రరావు

"సుప్రసిద్ధ కావ్యకర్త నాటకకర్తయైన కాళిదాసు విక్రమార్కుని కాలము వాడని నిర్ణయము చేయబడియున్నది వారు వ్రాసిన నాటకములలో అభిజ్ఞాన శాకుంతలం చాలా ప్రఖ్యాతిగాంచినది. దానికి పెక్కు అనువాదములు తెలుగులో బయలు దేరినవి గాని అందు శ్రీ వీరేశలింగంగారి అనువాదమే ఉత్తమమైనదనవచ్చును! ఈ సందర్భమున 'అనాఘ్రాతం పుష్పం' అనే శ్లోకమునకు ఉపన్యాసకులు శ్రీ వీరేశలింగం పంతులుగారి అనువాదమును తమ (త్రి.సూ.ప్ర. దొరవారు) అనువాదమును సభ్యులకు ప్రసంగవశమున చదివి వినిపించిరి." (ఆంధ్రపత్రిక)

తుదకు సినిమారంగానికి కూడా పనికివచ్చినది. ఇదిగాక మాళవికాగ్ని మిత్రాదులను కూడా తెనిగించినాడు. ఈవిధముగా సంస్కృతనాటక ఫక్కీ ప్రకారము పరివర్తనాలూ* స్వతంత్రాలూ కూడా యీ కాలములోనే బయలు దేరినవి అనవచ్చును. వీటికీ వెనకటి నాటక యక్షగానాలకూ చాలా భేదమున్నది.

ప్రహసనము పంతులు గారి చేతిలో మంచి ఉన్నతికి వచ్చినది. వారి సాంప్రదాయదూషణాదులకు దోహద మిచ్చినది. పూర్వ సాంప్రదాయాలమీద నైరాస్యము కలిగించడానికి ప్రహసనము చాలా ఉపకరించినది. బాల్య వివాహాదులు మొదలైన ఆచారాలను ప్రహసనాల ద్వారా విమర్శించినాడీయన.

విద్యార్థుల ఉపయోగార్థమీయన అనేక గ్రంథాలు రచించినాడు. ఇంగ్లీషు భాషలో "స్విఫ్ట్" అనే మహాకవి, తన కాలమునాటి పరిస్థితులను విమర్శస్తూ వ్రాసిన "గల్లివరుయాత్రల"ను గ్రంథము పంతుల వారి నాకర్షించి, ఆ నమూనా ప్రకారం "సత్యరాజాపూర్వయాత్రలు" అనే గ్రంథము తయారైనది. ఇంకా చిన్నకథలు, వ్యాసాలు, మొదలైన అనేక వాఙ్మయ వీధులందు సంచరించి వన్నె తెచ్చినాడు. తెనుగులో మొదటి స్వీయచరిత్ర వ్రాసి, ఆదర్శప్రాయమైన తమ జీవితచరిత్రను మిక్కిలి సులభశైలిలో అందరికి అందజేసినాడు. తుదకు పాఠశాలా తరగతులలో పఠనీయగ్రంథాలనుకూడా- సంగ్రహ వ్యాకరణముసహా-వ్రాసినాడు. వ్రాసి దాదాపు 40 సంవత్సరాలైనా, యిప్పటికికూడా ఉపయోగార్హాలుగానే ఉన్నవి.

---

* భవభూతియొక్క ఉత్తర రామ చరితమును ఈ క్రిందివారు తెనిగించినారు.

| | |
|---|---|
| 1. వావిలాల వాసుదేవశాస్త్రి | 1883 |
| 2. వాసు శ్రీరామ పండితుడు | 1909 |
| 3. మల్లాది సూర్యనారాయణశాస్త్రి | ? |
| 4. వెంకటరామకృష్ణ కవులు | 1913 |
| 5. వేదుల బ్రహ్మానందశాస్త్రి | 1914 |
| 6. మంత్రిప్రగడ భుజంగరావు | 1918 |
| 7. నిడమర్తి జలదుర్గాప్రసాద రాయుడు | 1919 |
| 8. వేదము వేంకట రాయశాస్త్రి | 1920 |
| 9. బలిజేపల్లి లక్ష్మీకాంతము | 1924 |
| 10. జయంతి రామయ్య | ? |

## 3. పరభాషావాఙ్మయానువాదము:

ఒకజాతి వాఙ్మయము వృద్ధిపొందాలంటేనూ, లోకవిస్మృతి చెందాలంటేనూ, సృష్టిగాక రెండుమార్గాలున్నవి. వాఙ్మయములో ఉన్న ఉత్తమ గ్రంథాలను, ఇతర వాఙ్మయములోకి పరివర్తనముచేసి పరభాషా కుమారులకు అర్పించడము;◆ పరభాషా వాఙ్మయములో ఉన్న సాహిత్యాన్ని పరివర్తనముచేసి తెచ్చుకోవడము. ఈ రెండు పద్ధతులలో సాహిత్యము విస్తరించడమేగాక యితరులను ఆకర్షిస్తుంది.✻ ఈ రెంటిలో విరివిగా రెండోపద్ధతి జరుగుతున్నదిగాని మొదటిదంతగా ఎవరూ పాటించినట్టుగాని, అసలు గమనించినట్టుగాని తోచదు. రెండవద్దైనా జరుగుతున్నందుకు సంతోషము! ఈ పద్ధతి యిదివరలో సంస్కృతముతో పుట్టి దానితోనే వెళ్ళపోతున్నది. ఇప్పటికీ సంస్కృతములో ఉన్న ఉద్గ్రంథాలన్నీ తెనుగులోకి రానేలేదు. దగ్గిరున్నవికాబట్టి మనతంటాలు మనము పడవచ్చును. ఎప్పుడోఒకప్పుడు వస్తవి! కాని పంతులవారిని ఇంగ్లీషు సారస్వతము ఆకర్షించినది. ఇంగ్లీషులో ఉన్న "లాంబు" షేక్స్పియర్ నాటక కథలుకొన్ని తెనుగులోకి తెచ్చినాడు. ఈ విధముగా అనేక ఇంగ్లీషు గ్రంథాలు తెనిగించినాడు.‡ తుదకు వృక్షశాస్త్రము, జంతు శాస్త్రము, మొదలైన శాస్త్రాలు సంస్కృతములో అందరికీ అందుబాటులో లేవని తెలుగులోకి ఇంగ్లీషుభాషలోనుంచీ తెచ్చి నాటినాడు.

ఈ విధముగా నవ్యవాఙ్మయవ్యాప్తికి మూలపురుషుడైన పంతులుగారు

---

◆ టేకుమళ్ళ అచ్యుతరావుగారు పింగళి సూరననుగూర్చి ఆంగ్లములో ఉద్గ్రంథ మొకటి రచించి ప్రచురించినాడు. ఇటువంటి గ్రంథాలెన్నైనా రావలసి ఉన్నవి

✻ "ఇతర భాషలలోని సాహిత్యశాస్త్రగ్రంథాలను ఆంధ్రములోనికి అనువదించినగాని ఆంధ్రభాష సమగ్రము గాదు." శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవ వర్మ.

‡ కొన్ని యీ క్రింద ఇస్తున్నాను.

| | | |
|---|---|---|
| Comedy of Errors | - | చమత్కార రత్నావళి. |
| Sheridan's Duena | - | రాగమంజరి (1883) |
| Do Rivals | - | కళ్యాణకల్పవల్లి (1885) |
| Cowpers' John Gilpin | - | దుర్మార్గచరిత్రము |
| Vicar of Wakefield | - | రాజశేఖర చరిత్ర |

చేసిన పనిలో శతాంశము చెప్పినాను. ఆయన త్రొక్కనిదోవ లేదు. కొన్నివేలపేజీల గ్రంథాలువ్రాసి భాషకమూల్యమైన సేవచేసినాడు. వీటి అన్నిటికంటె ఒక్కపనిమాత్రము ఆయనను ఎవ్వరూ చేరవీలులేని స్థానములో పెట్టినది. అది "ఆంధ్రకవుల చరిత్ర' ' రచన. ఆంధ్రవాఙ్మయానికి - అప్పటికి - యిప్పటికీకూడా-సమగ్రమైన చరిత్ర లేదు. గురజాడ శ్రీరామమూర్తి పంతులవారి కృతి పుక్కిటిపురాణాలతో నిండినదేగాని, చారిత్రకదృష్టి తక్కువ. మనకు పౌర్వాపర్యప్రశంస అనవసరము. ఏవో చిల్లరపుస్తకాలు ఇటీవల వచ్చినవిగాని, చారిత్రక దృష్టితో, నిష్పక్షపాతముగా, వ్రాసినవిలేవు. ఆంధ్ర విశ్వవిద్యాలయస్థాపన అయిన తర్వాత అది వ్రాయడము జరుగుతుందని చాలా ఉవ్విళ్ళూరినాము. ఇదివరకు జరుగలేదుగదా? ఇప్పట్లో జరిగే సూచనలుకూడా యెక్కడా కనపడటములేదు! వ్యక్తులకు వార్ధక్యములో సుఖజీవనానికో, ఇతరోన్నత పదవులకు మెట్లుగానో, ఉపయోగపడుతూవుంటవి ప్రజాహిత సంస్థలు! సమగ్రాంధ్రుల చరిత్ర, సమగ్రాంధ్రసాహిత్యచరిత్ర, ఉత్తమాంధ్ర నిఘంటువు, ఆంధ్రదేశములోఉన్న తాళపత్ర గ్రంథాలను సేకరించటము, ఈపనులుచేస్తే, ఆంధ్ర విశ్వవిద్యాలయము తన కనీస కర్తవ్యము నిర్వర్తించినట్లౌతుంది. భవన నిర్మాణముమీదా శాస్త్ర పరిశ్రమలమీదా యెంతద్రవ్యము వెచ్చించినా, సంస్కృతీ, విశిష్టతా, నిలిచి ఉంటేనే వ్యక్తిత్వము నిలుస్తుంది. పంతులవా రా లోటును తీర్చాలని "ఆంధ్రకవుల చరిత్ర' వ్రాసినాడు. దీనిలో పొరబాట్లున్నవని అనడము పరిపాటిగా ఉన్నదేగాని, విషయము వచ్చినప్పుడు అదే శరణ్యమైన పుస్తకము! ప్రత్యేక కవులమీద దీనికంటే ఎక్కువ సామగ్రిగల గ్రంథాలుండవచ్చును గాని, ఇంత విశాలమైనది మరొకటి లేదు. పంతులుగారి కీర్తినీ, సేవనూ, చిరస్థాయిగా చెయ్యడానికిది ఒక్కటిచాలు. ఈ విధముగా వారు వ్యవసాయము చెయ్యని సాహిత్య క్షేత్రము లేదు.!*

పంతులుగారి పనిని గూర్చి చెప్పవలసినప్పుడు, ఒక్కటిమాత్రము చెప్పవలె. సాహిత్యక్షేత్రములో వారి కృషికి విలువే లేదు. కాని మతవిషయములో వారివ్రాతలు యువకుల హృదయాల్లో అసంతృప్తిబీజాలు నాటినవి. అనేక సనాతన సాంప్రదాయాల మీద వాళ్ళకు నైరస్యము కల్గించినవి. ఒకవైపు ఇంగ్లీషు విద్యాపరనము, మరొకవైపు

* ఈయన బ్రహ్మసమాజ విధవావివాహోద్యమ చరిత్ర కూడా వ్రాసినాడు.

క్రైస్తవ మతబోధ, ఇంకొకవైపు సంప్రదాయ విమర్శచేసే పంతులవారి వ్రాతలూ ఆంధ్రదేశము నాలుగుమూలలా, పెద్దలకూ పిన్నలకూమధ్య ఒక అంతరము కలుగజేసినవి. కొక్కొండ వెంకటరత్నం, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి మొదలైన మహామహులు ఎంత వ్యతిరేక ప్రచారముచేసినా ధ్వంసం జరిగినంత త్వరగా నిర్మాణము జరుగదుకదూ! వాటివల్ల ప్రయోజనమాట్టేలేకపోయినది.‡ ఈ అసంతృప్తి బీజాలిప్పటికీ ఉన్నవి. వెనకటి దానిలోనా నైరస్యము కలిగినది. దానిచోటు తీసుకోగల కొత్త భావాలా కనపడలేదు. పోనీ! బ్రహ్మమతములోనైనా సమగ్రముగా ప్రచారముకలిగి, అది దేశములో పాతుకునిపోయినదా అంటే అదీ నామావ శిష్టముగానే ఉన్నది అనవచ్చును.* పూర్వసంప్రదాయ నైరస్యము మాత్రము మిగిలినది. కాని భగవంతుడు ప్రతిదానిని మంచికే చేస్తాడనే నమ్మకముతో మనము పనిచెయ్యవలె.◆ ఈ విధముగా చూస్తే వచ్చే యుగధర్మానికి పరిస్థితులు పునాదులను కల్పించినవి అనవలె. చావు పునర్జన్మకు పూర్వరంగము! ఈ అసంతృప్తి నైరాస్యమూ, కొందరిలో మిన్నుముట్టినది. కొందరిలో తత్వాన్వేషణానికి మార్గము వేసినది. కొందరిలో

‡ 1862లో ముద్దు నరసింహనాయుడుగారు "హితసూచని" అని వ్యాసగ్రంధము ప్రకటించినారు. అప్పటికి వ్యాసమనే పేరు లేకుండవచ్చును. ఏలన ఆయన వ్యాసమనే పదానికి "ప్రమేయ" మని నామకరణము చేసినాడు. ఈపదం శాస్త్రపరిభాషా పదము. సంఘసంస్కార బీజాలు ఈ గ్రంథములో కనపడతవి. ఇది పంతులవారి రచనలకు పూర్వమే అయినా ప్రచారంలోకి రాకపోవటము ఆశ్చర్యము.

"తనకంటే ముందు అద్భుతమైన సాంఘికవ్యాసాలను వ్రాసిన నాయుడు సంగతి యెక్కడా యెత్తుకోకపోవడం చాలా ఆశ్చర్యకరమైన సంగతి." - ప్రతిభ, సం 1. సం. 3

* ఎక్కడైనా ఒకవ్యక్తి దాన్ని పట్టుకుని వేళ్ళాడే ఆయన కనబడుతూ ఉంటాడు. అటువంటి వాళ్లలో పాలపర్తి నరసింహంగారొకరు. ఇటీవల "భక్తాంజలి" అనే పేరుతో బ్రహ్మసమాజ ప్రసంగాలను అనువదించినాడు. ఇపుడు "ధర్మసాధని" అనే మాసపత్రిక సంపాదిస్తున్నాడు. మన్నవ బుచ్చయ్య పంతులు కొన్ని ఉపనిషత్తులకు టీకలు వ్రాసినాడు.

◆ "వీటిని (గుణదోషాలను) మనలో నాటుకునేటట్లు చేయడానికై మన కుల పతులున్నూ, బలాత్కారంగా మనలను ఆంగ్లభాషా పఠనానికి పురికొల్పి దాన్ని మనలోకి యెక్కించడానికి, తలిదండ్రులున్నూ చాలా యత్నం చేశారు. ఎవరెంత చేసినా దాని ఫలితం యెలావున్నా, అది మన మంచి కోసరమే అని మనము యిప్పుడనుకోవాలె"

- పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

యత్నమే స్తంభించినది. కాని భాషాసారస్వతాల కుపకరించినది. ఈ విధముగా పంతులుగారీ నవ్యయుగప్రారంభానికి సంధ్యాదేవత అయినాడు. ఈయనలేఖిని చాలా నిశితమైనది. ఈయన వ్రాతలో మెత్తని హాస్యము గోచరిస్తూఉంటుంది. సమయము వస్తే గుచ్చుకునేటట్టుకూడా చేయగలశక్తి ఉన్నది. ఈయన మత సాంప్రదాయాలను నిరసించి యువకమండలిలో నైరాస్యము ఉత్పత్తిచేసినా, భాషాసౌలభ్యానికి శ్రమపడినాడేగాని, భాషాసంప్రదాయాలను నిరసించలేదు. కాని ఈయన చేసిన మతసంప్రదాయ నిరసనము, వాళ్ళలో భాషాసంప్రదాయ నిరసనానికి కూడా బీజాలను నాటినది. ఈయన భాషా సంప్రదాయానికి ఒక్క ఉదాహరణమిస్తాను. "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధ" మనేగ్రంధ మొకటి వ్రాసినాడు. ఎన్ని నిర్బంధాలతో వ్రాసినాడో చూడండి! ఇంతకంటె భాషాసంప్రదాయ పోషణానికి తార్కాణమెందుకు? ఇక్కడ కూడా ఈయన భాషాసౌలభ్యం కోసమే పాటుపడినాడు. కూచిమంచి తిమ్మకవి అచ్చుతెనుగుకూ, ఈయన వ్రాసినదానికీ చాలా అంతరమున్నది. కూచిమంచి తిమ్మకవి వ్రాసిన అచ్చాంధ్రమంతా కృతకభాషామయము. ఇది అల్లాగకాక జనబాహుళ్యము ప్రతిదినము వాడుకునే భాషలోనే వ్యాకరణ సాంప్రదాయాలను పాటిస్తూ వ్రాసినది. ఈయన పరిశోధన చేసి అచ్చొత్తించిన ముద్రిత గ్రంథాలు అసంఖ్యాకాలు. అనేక గ్రంధాలకీయన తర్వాత ద్వితీయ ముద్రణాలు కూడా జరుగలేదు. ఈయన ధన్యజీవి! యశఃకాయుడు! ◆

---

◆ "తెనుగులో వచనప్రబంధమును నేనేచేసితిని. మొదటి నాటకమును నేనే తెలిగించితిని. మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే రచించితిని స్త్రీలకు మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని".

- స్వీయచరిత్ర

సామ్యవాదుల కిటీవల పంతులుగారిపైన గౌరవమూ ప్రత్యయమూ కుదిరినది. "ప్రజాసాహిత్యం" అనే పేరుతో వ్రాయబడే దానికంతకూ ఈయనను మూలపురుషుడుగా భావిస్తున్నారు. విదేశీయుడై సంప్రదాయదూరుడైన మార్క్సుతో పాటీయనను కూడా గౌరవించటము కొంతవరకు సంతృప్తికరమే! ఆయన ఆస్తిక్యంలో శతాంశము వీళ్లకు పట్టుబడితే దేశానికి ఉపకారమౌతుంది. లేకపోతే క్షేమము లేదు.

చూ. "కాప్రేడు వీరేశలింగం" (ఆంధ్రపత్రిక, మే, జూన్).

# తిరుపతి వెంకటేశ్వరులు :*

ఒక వంక భాషావిషయములో సౌలభ్యము కోసము వీరేశలింగము పంతులుగారు పాటుపడుతూ ఉంటే, మరో ప్రక్కనించీ అటువంటి సేవే చేయటము ప్రారంభించినారు తిరుపతి వెంకటేశ్వరులు. వీరిద్దరు జంట కవులు. ఇద్దరూకూడా సంస్కృతాంధ్రాలు రెంటిలోనూ మంచి ప్రజ్ఞ కలవారు. రెండు భాషల్లోనూ మంచి కవితాధార కలవారు. "దోస మటంచెరింగియును దుందుడుకొప్పగ బెంచినారమీ, మీసము రెండు బాసలకు మేమె కవీంద్రులమంచు" హాస్యప్రధానముగా చెప్పుకున్నారు. పెద్దనాదులకెట్లా కృష్ణరాయడు దొరికాడో, అట్లాగే పోలవరము భూపతికృష్ణారావు దొరికినాడు వీరికి ప్రాపు. ఈయన పరిపోషణఛత్రము క్రిందా, తర్వాతా, ఈ జంటకవులు చేసినపని దాదాపు వీరేశలింగము గారు చేసినంతా ఉన్నది. వీరు స్థావరమేర్పరచుకోవడానికి పూర్వము శతావధాన◆సంచారముతో ఆంధ్రదేశములో అన్ని సంస్థానాలూ పరిచయము చేసుకొని బహుమతులను పొందినారు.‡ ఏనుగుల మీద ఊరేగినారు. రాజులమీద పద్యాలు చెప్పినారు! అడ్డువచ్చిన పండితులనూ, కవులనూ, ఢీకొన్నారు! చర్చల్లో పాల్గొన్నారు. ఆదరించని రాజులను తిట్టి సుముఖులను

---

* యుగ సాంప్రదాయాలను మళ్లించినవారు వీరేశలింగం పంతులు గారు. పక్కపక్కలనే తిరుపతికవులు కూడ కొత్త కొత్త మార్గాలను వెతుకుతూ పట్టిందల్లా బంగా రం చేసే పరుసవేదిని సిద్ధింపచేసుకున్నారు. (ఆంధ్రపత్రిక 22-9-40)

వెంకటశాస్త్రిగారు (1870 జననము)

తిరుపతిశాస్త్రిగారు (1871-1919)

◆ "తిరుపతి వేంకటకవులు ఎక్కడేని యవధానము చేసిరనగా నా చుట్టుపట్టుల వారనేకులు ప్రతిభాసాధమున పడి మెట్టులెక్కిరన్నమాటే ....... ఆసమయములందు వేంకటశాస్త్రిగారు విశ్వమూర్తులు. సభ్యులు వెంటాడు భక్తులు."

- శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

‡ చరిగొండ ధర్మన్నట యీపద్ధతికి మొదటివాడు. హైద్రాబాదులో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి అనేపేరుగల ఒక విద్వత్కవి ఉన్నాడు. ఆయన స్వగ్రామము కృష్ణా జిల్లా కలవపాముల. ఆయన "సహస్రావధానమనే" ఒక ఫక్కీని కనిపెట్టినాడు. ఇది ఒక అద్భుత కార్యము! ఈయన "ఆంధ్రుల చరిత్ర"ను పద్యకావ్యముగా రచించడానికి ప్రారంభించినాడు. చాలా హృదయంగమముగా ఉన్నది! ఈయన గద్వాల సంస్థానములో ఒక ఆస్థానకవి

చేసుకున్నారు! కవితా దిగ్విజయము పొందినారు! ఎదిరించిన శిష్యులపైన గ్రంధాలు వ్రాసి శిక్షించినారు.‡ మృచ్ఛకటిక ముద్రారాక్షసాలను పరివర్తనము చేసినారు! శ్రవణానందాది స్వతంత్ర ప్రబంధాల రచించినారు! "లైట్ ఆఫ్ ఏషియా" ననుసరించి బుద్ధచరిత్రాన్ని వ్రాసినారు. దేవీభాగవతాన్ని పురాణశైలిలో చాలా హృదయంగమముగా రచించినారు! "మీరు తెనిగించిన దేవీభాగవతము ప్రాచీన మహాకవి విరచితములైన కావ్యపురాణముల కెంతమాత్రమును తీసిపోవక, ఆంధ్రసరస్వతికి సాటిలేని నవీనాలంకారమై విరాజిల్లుచున్నది" అని రాజమహేంద్రవర ప్రజలు సప్తతి సంవత్సరాభినందన పత్రములో అభినందించినారు. వీరేశలింగము పంతులు స్వీయచరిత్రను వ్రాసినట్టే జాతక చర్య కామేశ్వరీశతకాలను రచించినారు. భారతానికి దీటుగా గీరతము వ్రాసినారు. ఇప్పటికీ ప్రబంధాలను రచిస్తూనే ఉన్నారు. నానారాజ సందర్శనంలో "స్వానుభవభాష్యాలను విప్పి" చెప్పినారు. వీరేశలింగము పంతులు వచనానికి చేసిన సేవ వీరు పద్యానికి చేసినారు. పద్యాన్ని 'కృతక' భాషనించీ సాధ్యమైనంతవరకు తప్పించడానికి ప్రయత్నించినారు. భాషా సంప్రదాయాలు, వ్యాకరణ సంప్రదాయాలు, నిరసించకుండా కవితను వ్యావహారికభాష కెంతదగ్గరికి తీసుకురావటానికి వీలున్నదో అంతదగ్గరికి తెచ్చినారు. సామాన్యసంభాషణలో ఉన్న అనేకపదాలను పద్యాలలో కెక్కించి వాటికి గౌరవమిచ్చినారు. భాషాసౌలభ్యానికీ, అర్థసౌలభ్యానికీ, రసవత్తకూ దగ్గిరసంబంధము కల్పించి, భాషకూ సారస్వతానికీ అమూల్యమైన సేవచేసినారు. "సరస్వతి" అనే మాసపత్రిక పెట్టి తమవేగాక అనేకాముద్రిత గ్రంధాలను ప్రచురించినారు.

వీరి శిష్యకోటి చాలా విపులముగా వ్యాపించి ఉన్నది.◆ ఆంధ్రదేశము

---

‡ శ్రీ వేంకట రామకృష్ణ కవులు (1883-1939) (1889-1918) పిఠాపురము నుంచి 1910 లో మొదలిడి "కవిత" అనే పత్రికను సంపాదిస్తూ ఉండేవారు. ఇది తిరుపతి వేంకటేశ్వర, వేంకట రామకృష్ణకవుల వాగ్వివాదమునకు నిలిచినది.

◆ విశ్వనాథ వారన్నవిధం చూడండి :

"తన యెద యెల్ల మెత్తన కృతిప్రతిపద్యము నంతకంటె మె
త్తన తన శిష్యులన్న నెడదం గల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రుపర్వతశతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
కన గురువంచు చెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాడునన్"

అన్నిమూలలా శిష్యగణముద్వారా స్థావరమేర్పరచుకున్నారు. దానితోపాటు ఆంధ్ర సాహిత్య చరిత్రలో శాశ్వతస్థాన మమిరినది. ఒక కాలములో వీరి శ్రవణానందాదులలో పద్యాలు విద్యార్థిగణము కంఠస్థాలు చేసుకునేవారు. వీరు పద్యము చదివేఫక్కీ అనుసరించని యువకుడు లేడనవచ్చును. వీరి శిష్యగణములో ఇప్పుడు పేరుపడ్డ అనేకమంది కవులూ, పండితులూ ఉన్నారు. పింగళివారు, కాటూరువారు. వేటూరువారు, వేలూరివారు, విశ్వనాథవారు, త్రిపురనేనివారు మొదలైనవారు చాలామంది వీరి శిష్యులే! వీరిద్దరిలో* తిరుపతి శాస్త్రిగారు స్వర్గస్థులైనారు. వెంకటశాస్త్రిగారు‡ కుటుంబవంతుడై, ద్రవ్యము గడించి చిన్నలకు విజ్ఞానమిస్తూ, తమ సారస్వత భాషానుభవాలను వెదజల్లుతునే ఉన్నారు. వ్యావహారికభాష ఎలా ఉండాలో వీరి వ్యాసరచనలను చూస్తే తెలుస్తుంది. మాండలికపదాలు వాడకూడదనే వారు వీరు రచించే వ్యావహారిక భాషచదివితే వద్దనరు. వీరివ్రాతలలో సర్వప్రాంతీయ వ్యావహారికమూ ఉన్నట్టు కనపడుతుంది. మళ్ళా సులభముగా అర్థమౌతూ ఉంటాయి.◆

వీరి రచనలలో "గీరతము" ఒక విశిష్టత గల కావ్యము. 'అధిక్షేప కావ్యము' **(Satire)** తెనుగులో చాలా అరుదు. ఎక్కడైనా చాటుధారల్లో కనపడుతుంది! ఇటీవల వెలువడిన యిటువంటి చిల్లర కావ్యాలకీ గీరతమే మాతృక. వెంకటకవిగారి

---

* తిరుపతి శాస్త్రి గారి కుమారుడు దివాకర్ల వెంకటావధాని కూడా కవియై కొన్ని కావ్యాలను వ్రాసి తండ్రి పేరు నిలబెట్టుతున్నాడు.

‡ 'ఈనాడు, తెనుగుగడ్డ మీద యింత సాహిత్య పిపాస ఉందంటే - దానిక్కారణం వెంకటశాస్త్రి గారి చేతిచలవ.' - ఆంధ్రవారపత్రిక 18.2.'48

◆ ఈ కాలములో జంటకవులుగా ఉండి అవధానాలు చేయడమూ, గ్రంథరచన చేయడమూ ఒక ఫాషనైపోయినది. రామకృష్ణకవులు, వెంకటపార్వతీశ్వరకవులు, శేషాద్రిరమణకవులు మొదలైన జంటలు ఉదాహరణలు. ఈపద్ధతిని వీరిశిష్యులైన పింగళి కాటూర్లుకూడా గ్రహించినారు. ఇంతేగాక ఈ కాలములో శతావధానాలు చేయడము ఒక జాడ్యముగా పాకిపోయినది. ఏమూల చూచినా శతావధానులే. ఇప్పటికీ అక్కడక్కడా యీవిధమైన రంగాలు కనపడుతూనే ఉంటవి. వేలూరి శివరామశాస్త్రియేమి, తిపురనేని రామస్వామి చౌదరియేమి, కాశీ కృష్ణాచార్యులేమి, పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులేమి, పిశుపాటి చిదంబరశాస్త్రియేమి, రామకృష్ణ సీతారామసోదరకవులేమి, యీ విధమైన తత్వానికి ఉదాహరణభూతులు. వీరందరు పండితులు, కవులు.

శిష్యుడొకడు తాను శిష్యుణ్ణికాదనగా వెలువడ్డదీ గ్రంధము.* భారతపర్వాలల్లే దీనిలో కూడా "మేకు బిగింపు పర్వం" "చప్పట్ల పర్వం" మొదలైన యితివృత్తానికి తగిన పర్వవిభాగము చాలా రసవంతముగా ఉన్నది. గ్రంధనామ నిర్వచనము చేస్తూ యిట్లా గన్నారు.

గీర్షు యే తు రతాస్తే వై గిరతాః పరికీర్తితాః
తానుద్దిశ్య కృతం కావ్యం గిరతం పరిచక్షతే.

గిరతంలో కవిత్వము మిక్కిలి సరళమై, రసవంతమై, సంభాషణ భాషకు చాలా దగ్గిరగా ఉన్నది. మొత్తము మీద వీరు కూడా భాషకు సౌలభ్యము కలుగజేసినారు. ప్రసాదగుణము వీరిసొమ్ము! ఒక్కొక్కచోట తాము ప్రౌఢముగా వ్రాయగలమని చూపినారు. సంధియుగములో వీరు కూడా ముఖ్యులే!

మరొకవిషయము, ప్రథమయుగములో శ్రీనాధుడు చాటు పద్య చక్రవర్తి. ద్వితీయయుగములో కృష్ణరాయల కాలానికి సమీపములో మళ్ళీ యీ చాటుధారాకవిత్వము తలయెత్తినది. రామరాజు భూషణుడు శతలేఖనీ పద్యసంధాన నిపుణుడనని చెప్పుకొనినాడు. ఈ రెండు పనులలో ఈ జంటకవులు మళ్ళీ వెనకటియుగాన్ని తలపింపజెయ్యడమే కాకుండా మించారని చెప్పవచ్చు. "కలముతో కాగితముమీద పద్యాలు రచిస్తూ ఉంటే చెయ్యిగనక ఆగితే దాన్ని తెగవెయ్యవచ్చు' నని శపధము చేసినారు. చాటువులూ, శతావధానపద్యాలూ, కేవలపూరణమాత్ర ప్రయోజనముకలవేగాక రసవంతముగాకూడా ఉంటాయని చెప్పడములో యెట్టి ఆక్షేపణా లేదు. కొందరు వీరిని యుగకవులుగా భావిస్తున్నారు. ఒకకాలములో యెక్కువమంది యేకవి నెక్కువగా అనుకరిస్తారో వారినా యుగకవి అనవచ్చు. పెద్దనను చాలామంది అప్పటి కవులనుకరించినారు. కాబట్టి ఆయుగాన్ని పెద్దనయుగము అంటున్నాము. ఈ పరీక్షతో చూస్తే 15 సంవత్సరాల క్రిందటివరకూ వీరి ననుకరించిన కవుల సంఖ్య చాలా తక్కువే! ఇప్పటి నవ్యకవికుమారుల్లో

* రామకృష్ణకవులలో కృష్ణకవి. వీరుకూడా ప్రతిభావంతులైన కవిద్వయమే! "వెంకట రామకృష్ణ గ్రంధమాల" అనే పేరుతో కొన్ని సంపుటాలు ప్రచురించినారు. 'కథా సరిత్సాగరం' పిఠాపురములో ఉండే తమ ముద్రాక్షరశాలలో ప్రచురించినారు. అయిదు సంపుటాలైనవి.

కొందరు వీరి శిష్యులని వెనక చెప్పినాను. వాళ్ళ గురువులను యుగకవులనటములో యేమి తప్పు కనుపించటము లేదు. పింగళి కాటూర్లు తమ "సౌందరనంద" కావ్యాన్ని వెంకటకవిగారికి సమర్పించి 'అద్యత నాంధ్ర కవి ప్రపంచ నిరాత్మ' అని వారిని సంభావించినారు. వీరిని యుగకవులనడములో కొందరి కభిప్రాయభేదము ఉన్నది.*

వెంకటకవిగారికి "కళాప్రపూర్ణ" బిరుదును ఇచ్చినారు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు. ఆయన షష్టిపూర్తి మహోత్సవము జరిపిన దాంధ్రదేశము! తిరుపతి వెంకటేశ్వరులు రచించిన గ్రంధాలన్నీ 8 సంపుటాలుగా ప్రకటింపబడినవి! వీరు ధన్యజీవులు! షష్టిపూర్తి సందర్భములో 'భారతి' పత్రిక యీ క్రిందివిధముగా వ్రాసినది.

'వీరి సరసశిల్ప నైపుణిచే, కవితాలతాంగి, నవ్యాలం కారభూషితయు, నూతనోత్సవ భరితయునై, క్రొత్తపోకడలతో సహృదయ హృదయరంగములకెక్కి, నర్తనము చేయదొడగినది. ఆంధ్రదేశమున పలువురీమహామహులకు పరిచర్య సలిపి, తదనుగ్రహమున కవులు, పండితులునై, పేరునకెక్కిరి. నేడీనాట శతావధానుల శిష్యులు, ప్రశిష్యులు, నసంఖ్యాకులు కలరు. ఇట్లాంధ్రవాణికి పుష్టినిగూర్చి, ఆంధ్రులకు సాహిత్య కవిత్వ సంపదల ననుగ్రహించి, శకపురుషులను మించిన శ్రీ తిరుపతి వేంకటకవుల పవిత్రనామము లాంధ్రుల కెల్లరకును నిరంతర స్మరణ మననయోగ్యములు.'

వెంకటశాస్త్రిగారు గొప్పవక్త◆ ఈయన వేలకువేలున్న సభలలో ఉపన్యాసవేదికనెక్కి మాట్లాడుతూ, పద్యాలను విసిరివేస్తూ ఉంటే ముగ్ధులైపోయేవారు

---

* 30-7-40 ఆంధ్రపత్రిక సంచికలో యీవిషయములో వాదోపవాదాలు జరిగినవి. "పద్యకవిత్వములో ఆధునికులలో, ప్రబంధకవుల పోకడలూ, ఆధునిక కవుల ఫక్కీని శాస్త్రిగారు అనుసరించిన తిరుపతి వెంకటకవులు ఈయుగపురుషులనదగు" నని రామానుజరావునాయుడు గారన్నారు. "తిరుపతి వెంకటకవులు శతావధానముల మూలమున విద్యాభిలాష కలిగించినందులకు వారు వంద్యులేగాని వారు యుగకవులనుటకు నేనామోదించ" నని తల్లావఝులవారన్నారు. "వారిలో తిరుపతి వెంకటేశ్వరులు పూర్వాంధ్ర కవిశిఖామణులలో చివరవారనీ, నవ్యాంధ్రకవులలో మొదటివారనీ నా ఉద్దేశం" అన్నారు నోరి నరసింహశాస్త్రిగారొకమాటు.

"ప్రాచీన మార్గమునకు భరతవాక్యము, నవ్యమార్గమునకు నాందీవాక్యము వీరిలో ప్రతిగొన్నవని తెలియుదుము" - పిల్లలమఱ్ఱి (సాహిత్య సమాలోచనము)

చూ. ప్రయాగ వ్రాసిన వ్యాసం - 'అభ్యుదయ' నవంబరు 1946.

సభ్యులు! 1907 సంవత్సర ప్రాంతాలలో అలాంటి సభలకు వెళ్ళేభాగ్యం నాకు లభించింది. ఆదినాలెన్నటికీ మరువను. నవ్యుడైన, జ.రు. శాస్త్రి వీరిని గూర్చి వ్రాసినదాన్ని చూడండి :

శాస్త్రిగారు ప్రసంగం చేస్తూ ఉంటే జనం విరగబడతారు... సరస్వతీదేవి మాట్లాడుతున్నట్లు వుంటుంది ... 'తెనుగుకున్న వ్యాకరణదీపం చిన్నది.' ఏనాటిదో శాస్త్రులవారిమాట. నాటికీ నేటికీ కూడా తెనుగులో వ్యాకరణదీపం చిన్నదిగానే ఉంది శాస్త్రులవారే ఆలోటును పూర్తిచెయ్యాలి కూడాను. ఇటీవల శాస్త్రులవారి రచనల్లో కావలసినన్ని వ్యాకరణ విశేషాలు దొర్లుతూ ఉన్నవి. సూత్రించడమే తరువాయి. శాస్త్రుల వారు, యేమరక, వొకకొంత శ్రద్ధపడితే సమగ్రవ్యాకరణం తెనుగులో ఆయన చేతి మీదుగనే రావీలౌతుంది."

18-1-1948 తేదీనాడు బెజవాడ ఆంధ్ర నాట్యకళా పరిషత్సమావేశ సందర్భాన శ్రీ వెంకటశాస్త్రి గారికి మహావైభవముగా 'పాద పూజ' జరిగినది.◆ ఇది నాట్యకళా పరిషత్తుకు గౌరవము.

ఈకాలములో స్వతంత్రరచనలు సాగించిన కొందరిని గూర్చి వ్రాస్తాను :

---

◆ ఆ సందర్భాన శ్రీ విశ్వనాధ చదివిన పద్యాల్నిక్రింద ఉదాహరిస్తున్నాను :
తొలికవులెల్ల గష్టపడి తూచిన యెల్ల పదార్థముల్ కడున్
సులభముగాఁగఁ జూరగొను శుద్ధమహామతయే నమో నమః

*　　　*　　　*

తలచిన యెల్ల శబ్దమును దానును మెత్తన రూపమూని మం
జులమయి సేవ సేసెడు విశుద్ధమహావచసే నమో నమః

*　　　*　　　*

ప్రవిమలమైన చెళ్లపిళవంగసమన్ మనుపావెల్లి కా
లువ కను చందమామ ! కవిలోక మహాగురవే నమో నమః

*　　　*　　　*

తొనతుదిరేక మెత్తనలు దూసినసోగ తెలుంగు లొ పదా
లు వెలలు తేనెవాక కవిలోకమహాగురవే నమో నమః

*　　　*　　　*

కోనలలోన మిన్నొరయు కొండలలోన హిమాంబుదాళిలో
గానలలో వినిర్భరముగా బ్రవహించెడు నాంధ్రశారదా
మూన సురాపగన్ మృదుల నూతనసాధు సమప్రసార ధా
రానతరేఖ తీర్చిన ధురాప్రతిభానిధయే నమో నమః

# కొక్కొండ వెంకటరత్నం పంతులు :

ఈ కాలములో ప్రౌఢరచనలు సాగించిన వాళ్ళలో కొక్కొండ వెంకటరత్నము (1842-1915) గారిని గూర్చి వెనక కొంచెము ముచ్చటించినాను. ఈయన చాలా పొట్టిమనిషి. ఎంత పూర్వాచార పరాయణుడో, అంత స్వతంత్రుడు కూడాను. అద్వైతిగా పుట్టి ద్వైతము స్వీకరించినాడు. 'సీస'మని లోహము పేరు ఛందస్సు కున్నప్పుడు మరొక లోహము పేరెందుకుండకూడదూ అని "వెండి" "బంగారం" అని ఛందస్సులను సృష్టించి, వాటిని తన గ్రంధాల్లో వ్రాసినాడు. ఈయన స్వాతంత్ర్యము దీనివల్లనే వ్యక్తమౌతున్నది. ఈ పండితులతో మాట్లాడడమే విజ్ఞానదాయకము. ఈయన తాను వ్రాసిన ప్రహసనములో "వీరిగాడని" ఒక పాత్రను సృష్టిస్తే, వీరేశలింగముగారు ఒక నత్తివాడిని సృష్టించి, వాడిపేరు, కొ-క్కొ-కొ-క్కొండ వెంక డనిపించినారు. ఇద్దరూ చల్లని హాస్యమును వ్రాయగలవాళ్ళే!

ఈయన భాషకు చేసిన ఒక గొప్ప సేవ యెవ్వరూ ఆకాలములో చేయలేదు. అది యింగ్లీషుకాలము. ఇంగ్లీషుతప్ప ఉపన్యాసాలకు యితర దేశభాషలు పనికిరావనీ, అందులో తెనుగులో గ్రాంధికశైలిలో ఉపన్యాసమియ్యడము కష్టసాధ్యమనీ, అభిప్రాయ ముండేది. ఇంగ్లీషు భాషా పండితులలో ఈ అభిప్రాయము ఘనీభవించి ఉన్నది ఆకాలములో. అప్పుడు సలక్షణమైన గ్రాంథికాంధ్రములో ఒకప్పుడు ప్రాసతోకూడ గంటలు గంటలు అనర్గళముగా ఉపన్యాసాలిచ్చి ఆ దురభిప్రాయాన్ని ఈయన తొలగించినాడు. "తండులంబులు నిండుకొనియె, నేడు పొండు, రేపురండు" అని బిచ్చగాడితో అనేమాటలూ, "కొమ్మా! పానీయంబులదెమ్మా" అనేవీ, యిప్పటికీ కథలుగా చెప్పుకుంటూ ఉంటారు. సలక్షణమైనా, వ్యాకరణయుక్తమైనా, యింగ్లీషు భాషలో మనవాళ్ళు కొందరు అనర్గళముగా ఉపన్యాసాలియ్యటములేదూ? కాబట్టి ఆ తర్కము చొప్పదంటుతర్కమే. కొక్కొండవారికి రెండు పనికి రావు : సంఘసంస్కారమూ, వ్యావహారికాంధ్రమూ. ఈ రెండంటే వారికి తలనొప్పి. పండితుడికి అందులో సంస్కృతాంధ్రభాషలలో పూర్వ సంప్రదాయ ప్రకారము చదువుకున్న వాడికి-గిట్టక పోవడములో యేమీ ఆశ్చర్యము లేదు. ఈయన చాలా

ప్రౌఢముగా వ్రాసేవాడు. నారికేళపాక మీయనసొమ్ము. పెచ్చుతియ్యడములోనే బేజారైపొయ్యేవాడు పాఠకుడు. "పానకం" "బిల్వేశ్వరీయం" "నరకాసుర విజయవ్యాయోగం" మొదలైనవి సులభముగా కొరుకుడుపడేవి కావు. ఈయనకు భాషాసేవకులలో ఒక అగ్రస్థాన మియ్యవలసినదే.

## దాసు శ్రీరామపండితుడు:

ఈయన (1846-1908) గొప్పపండితుడు. ఏకసంధగ్రాహి. బహుగ్రంధకర్త. తన 12వ ఏట 'సోమలింగేశ్వర శతకము' ను, 14వ ఏట 'సాత్రాజితి విలాసమ'ను యక్షగానాన్ని వ్రాసినారు. పంచనృసింహ క్షేత్రము, శుకరంభా సంవాదము, కృష్ణార్జున సంగరము, సారసంగ్రహ గణితము మొదలైనవి వీరి గ్రంధాలు. తర్కశాస్త్రములో పనిచేసి 'న్యాయబోధ' అనీ, ధర్మశాస్త్రాల్ని అవలోడనచేసి 'వైశ్యధర్మ దీపిక' అనీ గ్రంథాల్ని వ్రాసినారు. జ్యోతిషములో, సంగీతములో, అభినయములో, శాస్త్రజ్ఞాన మార్జించిన విద్వన్మణి. వీరు 1880 సంవత్సరములో "కల్పవల్లి" అనే పత్రిక ప్రకటిస్తూ, సంఘసంస్కరణ విషయాలలో కృషి చేసినారు. ఇంతేకాక రత్నావళి, ఉత్తరరామ చరిత్ర, మాలతీ మాధవము, అభిజ్ఞాన శాకుంతలము మొదలైన సంస్కృతనాటకాలను తెలుగులోకి అనువదించి, చక్కని భాషాసేవ చేసినారు. 1908 లో దేవీభాగవతాన్ని తెనిగించి సాహిత్య చరిత్రలో శాశ్వతస్థానాన్ని పొందినారు.*

---

* ఈ గ్రంధకర్తకు ప్రపితామహులైన కురుగంటి వెంకటరామశాస్త్రులను గూర్చి వారివంశాన్ని గురించి వారి పాండితీగరిమను గూర్చి యీ క్రింది పద్యాలను వ్రాసినాడు·

శాలివాహనశక సంవత్సరంబులు పదియేడువందల పైనొక్క
వర్షంబునను గోనవారి పాలెమున నెల్లూరుసీమను సదాచారవృత్తి
చణుడు రామస్వామి శాస్త్రి యజుర్వేది సుమహితాపస్తంబ సూత్రయుతుడు
కలడు శాయమ సాధ్విలలితాంగి తనుగొల్వ నన్నదాన పరత్వమమర నతని
కొమరుడై పుట్టి దొంచి గౌతముడు తర్క శాస్త్ర కుత్సితహేతు పక్షప్రమాద
వాజి దొలగింప వెంకటరామశాస్త్రి వినుత దుర్హేతువాద విభేదశస్త్రి.
అతడు హారీతకులజాతు డనుగ మాధ్య మైన క్రోడంబు రచియించి యధికకీర్తి
బడసె దిగ్విజయము గాంచె బరులు సాటి రారు కురుగంటి వెంకట రామమణికి

ఈ గ్రంథము యొక్క ఉపోద్ఘాతములోనుంచి వెంకటశాస్త్రి గారి వాక్యాల్ని అనువదిస్తాను.

"ఇటీవల ననగా నాంగ్లప్రభుత్వ మారంభమైన పిమ్మట నుద్భవించిన కవులలో నందు నించుమించుగ మా సమకాలికులగు కవులలో బ్రాచీన సంప్రదాయముగ గని సామగ్రిని సేకరించి రచనకుంగడంగువారు వీరిదిక్క లేరు."

ఈయనది చక్కనిశైలి. "తెనుగునాడు" అనే పేరుతో ఆంధ్రదేశములో ఉండే అన్ని బ్రాహ్మణశాఖలు మాట్లాడే వ్యావహారికాన్ని అనుకరిస్తూ చక్కని కావ్యము రచించినారు. మచ్చుకు -

'అప్షే సూస్నివషే బలే చౌడషే కాదషే, నిస్నానర్ఘులవారి బుర్రినష యా విస్నాయ కిస్నారషే' - ఇది శుద్ధివైదికుల ధోరణి.

వీరు కొన్నికృతులను, జావళీలను, పదములను కూడ రచించినారు. వీరి పుస్తకాలన్నీ ముద్రితాలు కాకపోవడము చాలా విచారము. వీరి కుమార్తె శాగదాంబ సంగీతసాహిత్యాలలో విదుషీమణియై 'నాగ్నజితీ పరిణయ' మనే గ్రంధాన్ని రచించి చిన్నతనములోనే మృత్యువాత పడినది. వీరు తమ వంశములో పుట్టిన పురుషులకు కేశవాదినామాలను పేరులుగా పెట్టినారు. ఇప్పటికి ఆప్రకారముగా సాగుతూనే ఉన్నది.

# కోరాడ రామచంద్రశాస్త్రి :

ఈయనది (1815-1900) అమలాపురము, బందరు నోబుల్ కళాశాలలో

కాశిగద్వాల పునహానగర జయపుర నాగపుర కాళీఘట్ట తంజాపుర మిధి
లాపురానంతశయన కొల్లాపుర మహిశూరపురముల గురుగంటిసూరి గెలిచె.

అనుగను భట్టాచార్యుండనికొందరు తర్కసింహమని కొందరునుం
గని యపరగౌతముండనియును గొందరు పిల్చిరతని నుర్వీస్థలిపై.

పడుచుదనమునవె తనయున్ విడచెను ధా బ్రొద్దునాక పీటనుబాలున్
విడిదిగను గైకలూరుం బడసెను దానంద యుండె బహువర్షంబుల్

కొల్లేటి యొడ్డునంగల ఘుల్లీలో గైకలూరు చక్కనియూర్మా
యల్లూరికి గ్రోశత్రయి నుల్లసిలుం బ్రొద్దునాక యొక క్రోసు నుడీ

బహుకాలము పనిచేసినాడు. ఈయన సుప్రసిద్ధ భాషాసేవకుడని పేరు వహిస్తున్న కోరాడ రామకృష్ణయ్యగారికి తాత.◆ వీరు తాతగారి "రధాంగదూత" "మంజరీమధుకరీ ఘనవృత్తాది"✻ గ్రంధాలను చాలా ప్రచారము లోనికి తెచ్చినాడు. శాస్త్రిగారిది కూడా కొక్కొండవారి శైలివలె మిక్కిలి ప్రౌఢము. ఒక్కొకస్థలములో టీకతో కూడా అచ్చు వెయ్యవలసివచ్చినది. ఇటీవల ఆంధ్ర, మద్రాసు విశ్వ విద్యాలయాలలో ఈయన గ్రంధాలు కొన్ని పఠనీయాలుగా నియమించి యీ ప్రౌఢకవిని గౌరవించినారు. ఈయనకూడా సంస్కృతాంధ్రాలలో రెంటిలోనూ అనేక గ్రంధాలు వ్రాసినాడు. ఎన్నతగినవాడు!

## తూము రామదాసకవి:

ఈయన (1856-1904) కాపువంశస్థుడు. వైష్ణవుడు, వరంగల్లు నివాసి, ప్రతాపరము రంగాచార్యులనే పేరుపొందిన విద్వాంసుడివద్ద సంస్కృతాంధ్రాలను నేర్చుకొన్నాడు. చిన్నతనంనుంచే కవిత్వం వ్రాయడము ప్రారంభించి, రుక్మిణీకల్యాణ కధను గేయాలలోనూ, గోపికావిలాసము, మిత్రవిందోద్వాహము అనే ప్రబంధాలనూ, రచించినాడు. కాళీదాసు నాటకము అని ఒక నాటకాన్నికూడా వ్రాసినాడు. అన్నిటికన్నా ఎన్నదగినది ఈయన వ్రాసిన 'ఆంధ్రపదనిధానమ'నే పద్యనిఘంటువు. ఈ నిఘంటువును కవి తన 40వ యేట ప్రారంభించి అంత్యకాలానికి పూర్తిచేసినాడు. తరువాత చాల కాలానికిగాని ఇది ప్రకటితము కాలేదు. ఈ నిఘంటువు శబ్దరత్నాకరాన్ని ఆధారం చేసుకొని వ్రాసినట్లు కన్పిస్తుంది. ఇందులో 1565 పద్యాలున్నవి; నిజాం రాష్ట్రంలో వ్యవహారంలో ఉన్న దేశ్యపదాలనుకూడా చేర్చడము ఈ నిఘంటువుయొక్క ప్రత్యేక విశిష్టత అని చెప్పవలె! కొన్ని పనిముట్ల పేర్లు

---

◆ "శ్రీ రామచంద్ర కృతినం, ద్వంద్వాతీతం గురోర్గురుమ్,
యోగీశ్వరం జ్ఞానధనం, వందే నాగేశ్వరం గురుమ్"

- ఆంధ్రభారత కవితావిమర్శనము

✻ వీరి ఘనవృత్తం కాళిదాస మేఘదూతలాంటి కావ్యము. మందాక్రాంతా వృత్తములోనే ఉన్నది. దీనికి మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు తెనుగులో పరివర్తనము రచించినారు.

జాతీయ వాచకములు, వస్తునామములు స్వయముగా కల్పించినాడు. కొన్నిటికి సంస్కృతపదాలను సృజించినాడు. ప్రశంసింపదగిన సాహిత్య సేవజేసిన ధన్యజీవి!

## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి :

ఈయన (1863-1940) కాకినాడ వాస్తవ్యులు. ఈయన వీరేశలింగం పంతులు గారికి బలవత్ప్రత్యర్థి. గొప్ప పండితుడు. వ్యాసరచనములో మార్గదర్శి అనతగినవాడు. ఈయన పరిశోధనలలో కూడాదిట్ట. పరిశోధనానికీ, వ్యాసానికికూడా బీజావాపము చేసినవాడనవచ్చు. బ్రహ్మమతాన్ని అందులో వీరేశలింగముగారి వాక్యాలనూ నిర్మొగమాటముగా ఖండించేవాడు. ఈ పనిలో కొక్కొండ వెంకటరత్నము పంతులుగారిని కూడ ఈయనతో పాటు చేర్చవచ్చు.

## వీథినాటకాలు :

ధేనువకొండ, తమ్మవరం, అని ఒంగోలుతాలూకాలో రెండు గ్రామాలున్నవి. ధేనువకొండలో ఆ యింటిపేరాయనే వెంకయ్యగారని ఉండేవాడు. ఆయనది మంచి విద్వత్కుటుంబము. ఆయన భారతకథలో ఉత్తరగోగ్రహణము మొదలైనవి కొన్ని ఘట్టాలూ, భాగవతములో "వామనచరిత్ర" మొదలైనవికొన్నీ, తీసుకుని గేయాలుకలిపి చక్కని రసవచ్ఛైలిలో, హరికథారూపముగా చెప్పటానికీ, నాటక రూపముగా ప్రదర్శించడానికీ కొన్ని గ్రంథాలు రచించినాడు. ఇవి ఆకాలములో చాలా ఆకర్షించినవి. తమ్మవరం కాపురస్తుడు వెంకటస్వామి అనే ఆయన కొందరు స్త్రీలను కూడా తయారుచేసి, వారితో కలిసి నాటకాలాడేవాడు. ప్రజలు సహస్రాలుగా వెళ్ళి ఆహ్లాదించేవారు. స్త్రీలు స్త్రీపాత్రలు ధరించడము ఈ వెంకటస్వామీ, సురభికంపెనీవారూ ప్రచారములోకి తెచ్చినారు. ఈ వాదము రాఘవాచార్లుగారితోనే పుట్టినదని భ్రమపడవద్దు.

ధేనువకొండ వెంకయ్యగారి తమ్ముడు చిన్నయ్యగారు గొప్ప సంగీత విద్వాంసుడు. ఆయన కొడుకు ధేనువుకొండ సుబ్బారావు యిదివరిలో నాటకాలలో

---

* 1908, 1909 ప్రాంతాలలో యీకథలూ, నాటకాలూ నేను చాలా ఆదరణతో చూచినాను.

అర్జునాది పాత్రలు ధరించడములో ప్రవీణుడై కొంతకాలము సినిమారంగ మెక్కినాడు. చక్కగా పాడి శ్రోతలనానందింప జేయగల సమర్థుడు. శాస్త్రీయనాటకాలు వచ్చి పై వాటిని ముంచివేసినవి! సినిమాలు వచ్చి నాటకాలను ముంచివేసినవి! నరసింహశాస్త్రి గారుల్లేఖించిన దొడ్డవరపు వెంకటస్వామి యిలాగా జానపదులనాకర్షించిన "బుర్రకధకుడు."

## గ్రంథప్రచురణము :

వెనకటికంటె మంచిపద్ధతులమీద ముద్రాలయాలు స్థాపింపబడినవి. వాటిలో ఒకటి స్థాపించినారు (1812) వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారు దానిపేరు "ఆది సరస్వతీ నిలయముద్రాక్షరశాల" అని నాకు జ్ఞాపకము.✻ వెనకటి కాగితాలు అచ్చు వగైరాలు మార్చి, అంతకంటె అభివృద్ధి కనపరిచినారు శాస్త్రులుగారు. వీరు స్వయముగా సంస్కృతాంధ్రాలలో పరిశ్రమ చేసినవారు కాబట్టి, తప్పులు తక్కువగా అచ్చు పడటము తటస్థించినది. వీరు వ్రాసిన మనుచరిత్ర టీక యిప్పటికీ ప్రచారములో ఉన్నది. చక్కనిశైలిలో బాగుగా ప్రచురింపబడి పాఠకులకు మిక్కిలి ఉపయోగముగానే ఉన్నది. వారి తర్వాత వారి కుమాళ్ళు వెంకటేశ్వరశాస్త్రిగారి సేవకు పరిమితి లేదు. వారి తండ్రి గారు చేసినపనిని సహస్రముఖాలుగా అభివృద్ధిచేసినారు. అచ్చేమి, బైండేమి, ప్రశస్తముగా ఉండటమే కాకుండా, తప్పులు చాలా తక్కువగానూ, గ్రంధాలు భిన్నభిన్న విషయాలమీదనూ ఉండి, సర్వాంధ్రదేశాదరణాన్ని పొందినారు. వీరు చెన్నపట్నములో యే ఆంధ్రుల ఉద్యమమైనా ప్రధమస్థానములో ఉండి, దానికి చేయూత యిస్తూ ఉంటారు.◆ ఈ విధముగానే మద్రాసులో ఉన్న తెనుగు ప్రకాశకులలో వేమూరు వెంకటకృష్ణమ్మ శెట్టిగారొకరు. వారి ఆనంద ముద్రాక్షరశాల కూడా ప్రసిద్ధమైనదే! భాషా సేవకు కవియెంత అవసరమో ప్రకాశకుడు కూడా అంత

---

✻ ఇంతకు పూర్వము కన్న డాంధ్రాలలో చిన్న చిన్న ముద్రాలయ స్థాపనము జరిగించారట. (వావిళ్ళ సంచిక : ఉపోద్ఘాతము)

◆ నెల్లూరులో ఒకమారు పౌరులు వీరి సారస్వత సేవకు వీరి కభినందన పత్రము సమర్పించి కొనియాడినారు.

అవసరమైనవాడే! కాబట్టి వీరిసేవ మరవ తగ్గదికాదు. ఏలూరులో మంజువాణీ ముద్రాక్షరశాల, కాకినాడలో సుజనరంజనీసరస్వతీ ముద్రాక్షరశాల మొదలైనవి ఇట్టివే.

## మరికొందరు పండితులు :

ఈ ముద్రాలయముల పోషణలో కొందరు పండితులుండేవారు. వారు పుస్తకాలకు పీఠికలు మొదలైనవి వ్రాస్తూ యధాశక్తిగా భాషా సేవ చేసేవారు. వీరందరు సామాన్యముగా గద్యరచయితలు. వీరి చేతిలో గద్యము మరిప్రౌఢముగాక, అతిసులభముగాక, మధ్యరకముగా ఉండేది. శతఘంటం వెంకటరంగశాస్త్రులు, దండిగుంట సూర్యనారాయణ శాస్త్రులు, చదలవాడ సుందర రామశాస్త్రులు, పురాణం హయగ్రీవశాస్త్రి, నోరి గుర్లింగశాస్త్రులు* (1858-1912) తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య,◆ మొదలైనవారు పండితులూ, వ్యాకరణ వేత్తలూనూ, వీరు రచించినవానిలో ఉపోద్ఘాతాలూ, పీఠికలూ గాక భారత భాగవత రామాయణ వచనాలు చాలా ప్రశస్తముగా ఉంటవి. వీరందరూ కూడా మనకు వంద్యులే! వారి పీఠికలు వారి పాండిత్యాన్ని తెలుపుతూనే ఉంటవి. అప్పటి విమర్శనా సాంప్రదాయాలు

---

* ఈయన భగవద్గీతకు వ్యాఖ్యవ్రాసినారు. భారతము వచనముగా వ్రాసినారు. ఈయన అన్నకొడుకే కవి సమ్రాట్ నోరి నరసింహశాస్త్రి.

◆ జననము 1872. వ్యవహార నామము తేవప్పెరుమాళ్ళయ్య
దాస్య ,, దేవరాజసుధీమణి.

'కవి జీవితము వ్రాసిరి. రామాయణ భాగవతము వచనశైలిని వ్రాసి ముగించిరి. భారతమును గొన్నిపర్వముల వచనకావ్యముగ రచించిరి. .....''

తేవప్పెరుమాళ్లయ్యగారి గ్రంధములు:-

| | |
|---|---|
| 1. భగవద్గీత అర్థసహితము | 5 వచన భాగవతము. |
| 2. వచన రామాయణము | 6. వచన భారతము. |
| 3 మనువసుచరిత్రలకు మఱియు ననేకములకు ఉపోద్ఘాతములు | 7 నన్నయచోడుడు (జీవితము) |
| | 8. కర్ణ చరిత్రము (అముద్రితము) |
| 4 సర్వధర్మ సంగ్రహము. | 9. చాటుపద్యములు, శ్లోకములు |

- చూ. ఆంధ్రసర్వస్వము సం.1. సం. 7

పేడు. అందుచేత ఆంగ్లవిమర్శనా పద్ధతులు వారిలో కనపడవు. అందుకాకాలమే ఉత్తరవాదిగాని వారి లోపముగాదు.

వీరేకాక కాలేజీలలోను, ఉన్నత పాఠశాలలలోను పండితులనేకులు తమకు తీరిక ఉన్న కాలములో యథాశక్తిగా భాషాసేవ చేసేవారు. వేదము వేంకటరాయశాస్త్రి గారు (1853-1929)* క్రిస్టియన్ కాలేజీలోఉండి తమ రచనలను సాగిస్తూవచ్చినారు. జానపాటి కామశాస్త్రిగారు బెజవాడ హైస్కూలులో పండితులుగా ఉండి కాదంబరి పద్యకావ్యముగా రచించినారు. ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (1860-1916) బహు గ్రంథకర్త.◆ సర్కారు నౌకరీచేస్తూ వావిలాల వాసుదేవశాస్త్రిగారు‡ ఉత్తర రామచరిత్ర, మృచ్ఛకటికలు రచించి భాషాసేవచేసినారు.* కల్లూరి వెంకటరామశాస్త్రి గారు (1857-1928) వైయాకరణి అయి 'బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక' వ్రాసి తన పేజ్ఞానము వెదజల్లి కీర్తి శేషుడైనాడు. పాడి వెంకటస్వామిగారు 'ఆంధ్రాక్షరతత్వా'న్ని రచించి పరిశోధనాన్ని మనకిచ్చిపోయినాడు. వ.సు.రాయకవి తమభక్త చింతామణి మొదలైన వాటిని వ్రాయటము సాగించినారు. పనప్పాకము అనంతాచార్యులుగారూ §

* ఈయన మనుమడు వెంకటరాయశాస్త్రి వీరి జీవితచరిత్రమును రచియించినాడు.

◆ వీరి గ్రంథాలు: మయూర సూర్యశతకము, భామినీవిలాసము; గంగాలహరి అనర్ఘ రాఘవము, ప్రబోధచంద్రోదయములు (నాటకములు), పరాశరస్మృతి, ఋతుసంహారము (పూర్వార్ధము), భారతఫక్కీ, భారతము (13 పర్వాలు), నైషధాంధ్రీకరణము (అసంపూర్ణము)
- భారతి, డిశంబరు 1930

వీరి శైలి నిర్దుష్టమై కఠినముగనుండి నారికేళపాకమే యనిపించుకొనినది.

‡ వీరి మాతామహులు వర్యం అద్వైత బ్రహ్మశాస్త్రిగారు బ్రౌన్‌దొరకు విద్యాగురువులు. వీరు ఉత్తరరామచరిత్రాంధ్రీకరణమేగాక ముముక్షుతారకము' 'జూలియస్ సీజరు' ఆంధ్రీకరణము, సీతారాధనము (తండ్రిగారినిగూర్చి), మాతృస్వరూపస్మృతి (కౌపర్‌కవి అనుకరణము), నందకరాజ్యము (నాటకము), రుక్మిణీస్మరణము (భార్యనుగూర్చి), రఘువంశాంధ్రీకరణము, మొదలగునవి రచించిరి. వీరి శిష్యులలో సుసర్ల అనంతరావు పచ్చయ్యప్ప కళాశాలయందాంధ్రోపాధ్యాయులుగానుండి బేకను ఉపన్యాసములు (ఆంధ్రీకరణము) ముద్రారాక్షసాంధ్రీకరణము గావించినాడు. దుగ్గిరాల సూర్యప్రకాశరావు, సర్.బి.యన్. శర్మగార్లుగారి పుత్రికలైన చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు వీరి శిష్యులు! -భారతి, ఆంగీరస

* 1920లో ఆంధ్రసారస్వతసభ వీరికి మహోపాధ్యాయబిరుదము నిచ్చినది

§ ఆంధ్రులలో కాంగ్రెసు అధ్యక్షపదవి నలంకరించినది వీరొక్కరే!

వారి కుమాళ్ళు శ్రీనివాసాచారిగారూ మద్రాసు నుంచి (1897) 'వైజయంతి' అనే మాసపత్రికద్వారా మంజువాణీ విజయాదుల రచించి యథాశక్తిగా భాషాసేవ చేసినవారే! పట్నములో ఓ.వై. దొరస్వామయ్యగారనే◆ ఆయన అనేక కథాపుస్తకాలు వ్రాసినాడు. విశేషించి బంకించంద్రుడి 'ఆనందమఠం'భాషాంతరీకరించినాడు.ఇప్పుడు తెలుగులో ప్రచారములో ఉన్నదిదే!

## రాజకవులు:

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవ వర్మగారూ (జననము 1869), రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారూ, బొబ్బిలి రాజాగారు ఎన్నదగినవారు. శ్రీ విక్రమదేవవర్మగారు మానవతీ చరిత్రాది గ్రంథాలు, శ్రీకృష్ణార్జునీయాది ద్వ్యర్థికావ్యములు, శ్రీనివాస కళ్యాణాది నాటకములు రచించి మహాకవి యనిపించుకున్నారు. శ్రీజగన్మిత్రా నాటకశాల నిర్మించి నాటకకళా పోషకుడైనాడు. సాహిత్యసమ్రాట్, కళాప్రపూర్ణ, డి. లిట్ అనే బిరుదనామాలతో విరాజిల్లుతూ ఉన్న మహాపండితులు వీరు. ఆంధ్ర, ఉత్కళ, విశ్వవిద్యాలయాలకు భూరివిరాళాలిచ్చిన వదాన్యుడు! లక్ష్మీకటాక్షము కలిగి జయపురము మహారాజులు కావడమే కాక, కవిపండిత పోషకులై ఉన్నారు. చాల నిరాడంబరులు.

కీ.శే. రాజా మంత్రి ప్రగడ భుజంగరావుగారు బహుగ్రంథ నిర్మాతలు, 1903 లో 'గృహలక్ష్మి' అనే మాస పత్రికను, 1914 లో 'ఇండస్ట్రీ' లనే మాస పత్రికను, 'మంజువాణి' అనే మాసపత్రికను నడిపినాడు. అనర్ఘరాఘవాద్యనేక నాటకాలను, క్రీస్తు చరిత్రాది పద్య ప్రబంధాలు రచించినాడు. ఈయనకు క్రైస్తవ మతమంటే చాల అభిమానము. పి. చెంచయ్య గారితో ఈయన కలిపి 'Heritage of India' గ్రంథమాలలో ఆంధ్ర వాఙ్మయ చరిత్రను ఆంగ్లములో రచించినాడు. సంపన్నుడయ్యు నిరాడంబరజీవి!* బొబ్బిలి మహారాజుగారు అనగా యిప్పటి వారి తాత, తన దేశ

◆ "విద్యావతి" అనే విద్యావిషయక మాసపత్రికను చెన్నపురినుండి నడిపిరి.

* ఈయనకు నందిరాజు చలపతిరావు గారికిని మిక్కిలి మైత్రి. నందిరాజువారు 'మంజువాణీ' ముద్రణాలయము ద్వారా భాషాసేవ చేసినారు. వీరు వ్రాసిన 'ఉపన్యాస దర్పణము' విద్యార్థుల కత్యంతోపకారిగా ఉన్నది. 'రాజకళింగగంగు' మొదలైన నాటకాలను రచించిన ప్రతిభాశాలి!

యాత్రానుభవాలను "యాత్రాచరిత్ర" అని ఒకదాన్నీ, యింకా యితర చిన్న గ్రంధాలనూ రచించినారు. ఇంతకు కొంచెము దగ్గరగా జటప్రోలు సంస్థానాధీశులగు శ్రీ రాజా సురభి మాధవరాయలు చంద్రికా పరిణయమనే ప్రౌఢ ప్రబంధానికి విద్వట్టీకను వ్రాయించి ప్రచురించి తెనుగు కవుల కుచితముగా పంచి పెట్టినారు. ఈయన సోదరులే వెంకటగిరి బొబ్బిలిరాజాగార్లు! వెంకటగిరి మహారాజాగారగు వెలుగోటిగోపాలకృష్ణయాచేంద్రులవారు పండితులూ రసజ్ఞులూనూ, గోపీనాధ రామాయణం వ్రాసిన వెంకటకవి యీ వెంకటగిరి ఆస్థానంలోనివాడే! ఈ యాచేంద్రుల వారు వెలుగోటివారి చరిత్రను వ్రాయించి భాషాచరిత్రలకు మిక్కిలి సేవజేసినారు. దీనిని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు విలువైనపీరికతో ప్రచురించినారు. పీఠికాపురము కూడా పండితులకూ కవులకూ పోషణ యిస్తూ వచ్చినది. ఇంతకు కొంచెము పూర్వము ఆనందగజపతి హయాములో విజయనగరము పండితులకూ, కవులకూ రంగస్థలముగా ఉండేది. ముడుంబ నరసింహాచార్యులుగారి (1840-1927) రంగములో ఉన్న నటుడే!

ఈ కాలానికి దగ్గరగా బందరులో కృష్ణా జిల్లా సంఘమొకటి కొందరు పెద్దలు కలిసి స్థాపించినారు. వారు 'కృష్ణా పత్రిక'అనే ఒక వారపత్రికను నడపటము ప్రారంభించినారు. అది శ్రీ ముట్నూరి కృష్ణారావు గారి చేతిలోనికి వచ్చి సాంఘిక, రాజకీయ, భాషాసేవ అమోఘముగా చెయ్యటము మొదలుపెట్టినది. ఆంధ్ర సంస్కృతికి పనిచేసిన పత్రికలలో కృష్ణా పత్రిక ◆ అగ్రస్థానము వహిస్తున్నది. జాతితో కూడా ప్రక్కన నడుస్తూ జాతిని కూడా నడిపిస్తూ అన్యోన్యముగా ఉండి జాతీయ జీవనములో పాల్గొన్నదీ పత్రిక. ఈ పత్రిక చేసిన సేవను గూర్చి మళ్ళీ ముచ్చటించుకొనే అవకాశము వస్తుంది. ఈ శతాబ్దానికే వావిలకొలను సుబ్బారావుగారు "ఆంధ్రవాల్మీకి రామాయణము", జనమంచి శేషాద్రిశర్మ గారు "బ్రహ్మాండపురాణము", శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు "శ్రీకృష్ణభారతము" వ్రాయడము సాగించినారు. పానుగంటి

---

◆ 1902లో కొండా వెంకటప్పయ్య పంతులు గారిచేత పక్ష పత్రికగా స్థాపింపబడి తర్వాత వార పత్రిక అయి ముట్నూరి కృష్ణారావుగారితో ఐక్యం పొందింది. ఇప్పటికీ అవిచ్ఛిన్నముగా సాగుతూ జాతి జీవనానికి తోడ్పడుతున్నది.

లక్ష్మీ నరసింహారావుగారు తమ హాస్యపూరితాలైన విమర్శనలూ, నాటకాలూ ప్రారంభించినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు తమ నవలా రచన కూడా మొదలు పెట్టి కొన్ని వ్రాసి బహుమతులు కూడా పొందినారు.

## పరిణామము : *

ఈవిధముగా 20 శతాబ్దము ప్రథమ సంవత్సరాల వరకు భాషా సారస్వతాలలో పరివర్తనము కలుగుతూ వచ్చినది. వెనుకటి శతాబ్దము చూస్తే ఉన్న నిరుద్యోగానికీ, ఈ అభివృద్ధికీ తారతమ్యము చెప్పనలవి కాకుండా ఉన్నది. భాషాసేవకులు బయలు దేరినారు. ప్రచురణము బాగా సాగుతున్నది. పత్రికలు స్థాపింపబడినవి.

నవల, నాటకాలు తలలెత్తినవి. తెలుగు శైలికి సౌలభ్య మలవడినది. స్వీయచరిత్ర బయలుదేరినది. వచనరచన విరివి అయినది. అభివృద్ధితో పాటు అసంతృప్తిబీజాలు కూడా దేశీయుల హృదయ క్షేత్రాలలో పడినవి. ఇవి యెట్టి పరిణామాన్ని పొందినవో చూదాము!

---

* The period from 1840 to 1900 was marked by the increasing activity of a band of scholars who in addition to original productions of great value helped to conserve all that was best in Telugu literature, and brought it within the reach of an ever growing circle of readers.

(K.R. in Triveni, Jan.-1929).

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

## 3

## 20 శతాబ్ద ప్రథమవింశతి వత్సరములు :

వెనుకటి సంధికాలపు పరిస్థితులీ శతాబ్దములోనికి అనువృత్తాలయినవి. ఈ కాలములో మొదటి సంవత్సరాలలో జరిగిన కొన్ని విషయాలు వెనుకటి అధ్యాయములో వచ్చి ఉండవచ్చును. సారస్వత వీధులను నిష్కర్ష చేయడము నా పని. ఒక్కొక్కప్పుడొక కావ్యరచనా కాలము 5,10 సంవత్సరాలు వెనక ముందుఅయినా, నా ఆశయానికి భంగ మెంత మాత్రము కాదు.

20 శతాబ్ద ప్రవేశము నాటికి భాషా విషయములో, సారస్వత విషయములో, అనేక నూతన సన్నివేశాలు కలిగినవి. వాటిని మనవి చేసినాను. వాటి పరిణామాలను ఆనుపూర్విగా మనవి చేయ్యాలని సంకల్పము. ఈ ప్రథమ సంవత్సరాలు భాషకూ, సారస్వతానికీ, గొప్ప కాలము. చలనము అభివృద్ధి సూచకము. భాషా సారస్వతాలలో తర్వాత యెన్ని త్రోవలు కనుబడుతున్నవో, వాటికన్నిటికీ బీజాలు యీ కాలములోనే పడిన వనవచ్చును.

సంఘ, భాషా, సారస్వత సంస్కరణముతో పాటు అనేక ఉద్గ్రంథాలను రచించడము కూడా ఈవత్సరాలలోనే జరిగినది.

## మతవిప్లవము : సంఘసంస్కారము :

కందుకూరివారి బ్రహ్మమత ప్రచారము, పూర్వాచార విమర్శనము, ప్రజల హృదయాలలో కల్లోలము కలుగ జేసినప్పటికీ, మత మనేది వదలటము సులభముగా జరిగేది కాకపోవడముచేత, బ్రహ్మమత ప్రచారముకంటె, సంఘ సంస్కారము ప్రజలను ఆకర్షించినది. మతము మార్చుకోకుండా సంఘము అభివృద్ధిపొందే మార్గాలాలోచించినారు పెద్దలు. వీరేశలింగముగారు చూపించే

లోపాలలో ముఖ్యమైన వాటిని సవరించుకొంటే సరిపోతుందని తోచినది. విగ్రహారాధన నిరసనం మాత్రము అందరికీ నచ్చలేదు. పురుషుల కెలా ఉన్నా, స్త్రీలకు మాత్రము అది పెద్ద విప్లవముగా కనిపించినది. పురుషులు సంస్కార చికీర్షువులైనా స్త్రీలు కూడా ఆచిత్తవృత్తులు కలవాళ్ళయితేనేగాని ఆ సంస్కారము అమలు కాదు. జన సంఖ్యలో సగము వంతు స్త్రీలే! ప్రకృతి కన్ను తెరిస్తే పురుషుడేమీ చేయలేడు! ప్రకృతి స్వరూపిణి స్త్రీ! ఆమె యింటింటా అవతరించినప్పుడు ఆమె వీలులేదంటే యే పరివర్తనము సాగుతుంది? స్త్రీలు పూర్వాచారాన్ని ఇంకా పురుషులంత ఉల్లంఘించటము లేదు. కాబట్టే మన సంస్కృతి నిలిచి ఉండటమైనది. స్త్రీలు కూడా ఇంగ్లీషు విద్యాపరనముచేత తమ నమ్మకాలను మరచినట్లయితే, ఇప్పటికప్పుడే భారతదేశము యూరపు యొక్క ప్రతిబింబమయ్యేదే ! * వీరేశలింగము గారి మత పరివర్తనము సంఘ సంస్కారముగా మారడము స్త్రీలవల్లనే! వాళ్ళు చూచీ చూడనట్టున్నారు కాబట్టి మగవాళ్ళు చేసే పని సాగినది! బాల్యవివాహ నిరసనము, స్త్రీ విద్య, తప్పక ఆందోళన చెయ్యవలసిన అంశాలే అని పెద్దలు చాలామంది నిశ్చయించినారు. వీటికి విధవా వివాహము కూడా- మనస్ఫూర్తిగా కాకపోయినా - కలిపినారు. కాబట్టి యీ మూడు కార్యాలనూ సాధించటానికీ సంఘ సంస్కరణ సభను స్థాపించినారు. ఆ కాలములో ప్రతి సంవత్సరము ఒక ఊళ్ళో రాజకీయ సభ జరిగేది. దానికి అనుబంధముగా ఒక సంఘ సంస్కరణ సభా, చెదరి అక్కడక్కడా ఉన్న వాళ్ళంతా కలిసి ఒక ఆస్తిక సభా, స్త్రీల సభ, జరుగుతూ ఉండేవి. ఈ మూడు సభలు ఏక కాలములో జరుగుతుండడముచేత జనము కనబడేవాళ్ళే గాని ఆచరణ దగ్గిరకి వచ్చేటప్పటికి చాలామంది జారిపోయేవాళ్లు! మళ్ళీ సంవత్సర సభ నాటికే

---

* ఈ సందర్భములో కృష్ణా పత్రిక ద్వారా ముట్నూరి కృష్ణారావుగారు చేసిన పని చాలా గొప్పది. బ్రహ్మ సమాజము ద్వారా జరిగే మనవాళ్ళ సాంప్రదాయ నిరసనాన్ని సత్సంప్రదాయ ప్రదర్శనము ద్వారా వాళ్ళ కళ్ళ యెదుట చూపి, దాన్ని అరికట్టడానికి మిక్కిలి పరిశ్రమ చేసినాడు. బాహ్యతంత్రాల మీది నుంచి దృష్టిని మళ్ళించి స్వచ్ఛ భారతీయ సంప్రదాయాల మీదికి యువకుల దృష్టిని నిగిడించేటట్టు చెయ్యడములో సనాతనుల మనుకునే వాళ్ళ కంటే యీయన కృషి చాలా కార్యకారి అయినది. ఈయన 23-6-45 తేదీని పరమపదించి ఆంధ్రదేశమునకు అత్యంత దుఃఖము కలిగించినాడు. ఈ కొరత ఆంధ్రదేశానికి తీరనిది.

ఉత్సాహము! ఇట్లా ఉండీ ఉండకుండా జరిగినది శ్రీ పంతులవారి చికీర్షిత పరివర్తనము.

## చిలకమర్తి లక్ష్మీనరసింహం : ⁕

ఈ సంస్కర్తలు ఇంగ్లీషు పండితులుగాన మహామహులలో కొంద రాంధ్రభాషాభిమానులున్నారు. వీరిలో చిలకమర్తి లక్ష్మి నరసింహంగారు (1867-1946) ముఖ్యులు.◆ చిలకమర్తి వారు సుప్రసిద్ధ పండితులు. పురాణ పండ మల్లయ్య శాస్త్రిగారి మేనల్లుడు. వీరి కలము చాలా చలాకీ కలది. లెక్కించి చూస్తే ఈయన వ్రాసిన పేజీలు దాదాపు వీరేశలింగంగారు వ్రాసినన్ని, ఉన్నవి. వీటిలో నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, కథలూ, ప్రహసనాలూ, లెక్కకు మిక్కిలిగా ఉన్నవి. ఈయన ప్రథమాంధ్ర నవలా రచయితల్లో ఒకరు. 'అహల్యాబాయి' 'సౌందర్యతిలక', 'రామచంద్ర విజయము', 'హేమలత', 'కర్పూరమంజరి', 'గణపతి' మొదలైన చక్కని నవలలను రచించినారు. నవలా రచనములో యీయనకు "స్కాటు" ఆదర్శకుడు. ఆయన నవల వలె వీరివి చారిత్రక పునాదులుగలిగి, హరాత్సన్నివేశాలతో కూడి, మొదటి చిక్కు తుదకు విడడము మొదలైన లక్షణాలు కలిగి ఉంటవి. ఈయనను "ఆంధ్రస్కాటు" అని పిలిచే వారు!

⁕ 1906 లో 'మనోరమ' అనే మాసపత్రిక 1907 లో 'దేశమాత' అనే వారపత్రిక, 'సరస్వతీ' పత్రిక నడిపినాడు, రాజమండ్రి నుంచి ప్రహ్లాద నాటకం, కర్పూర మంజరి(2భా) ఈయనచేత పూర్తి చేయించి తర్వాత 1928 లో షష్టి పూర్త్యుత్సవము చేసినారు వేమూరి విశ్వనాథశర్మ, పాలకోడేటి గురుమూర్తిగారలు.

చూ: విస్సా అప్పారావుగారి వ్యాసము. భారతి, జులై, 1946.

◆ వీరి జీవితములో చేసిన మహత్కార్యాల నీవిధంగా విభజింపవచ్చు:-

పాఠశాల నిర్మాణము - పత్రికా నిర్వహణము - హరిజన సేవ - (1909 - 22) రామమోహన పాఠశాల స్థాపన - సంస్కరణోద్యమము - స్త్రీ విద్య ప్రోత్సాహము - దేశీయోద్యమము - సారస్వత - నాటక సమాజ స్థాపనము.

చిలకమర్తి వారి గ్రంధములలో : కీచక వధ (వచనము) - మొదటి నాటకము.

ద్రౌపదీ పరిణయము, శ్రీరామజననము, గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, ప్రసన్న యాదవము - ఇత్యాది వీరి నాటకములు ఆంధ్రుల మన్ననలందినవి.

ఇదిగాక యీయన ప్రథమాంధ్రనాటక రచయితల్లో కూడా ఒకరు. "ప్రసన్నయాదవ, ప్రచండయాదవ, పారిజాతాప హరణాలూ" స్వతంత్ర నాటకాలు, మొదట మొదట బాగా ప్రజలను ఆకర్షించినవి. ✻

వీటన్నిటికంటె "రాజస్థాన కథావళి"◆ వ్రాసి యువకులలో దేశభక్తిని ఆకాలములో పురికొల్పినవాడీయన. ఇది ఒక గొప్ప కార్యము.వీరి శైలి చక్కని వైదర్భీరీతి కలది. అప్రయత్నలబ్ధమై రసవంతముగా ఉంటుంది. ఈయన నాటకాలలో సందర్భోచితముగా తన విగ్రహారాధన నైరస్యము ప్రకటిస్తూ వచ్చినాడు. సన్నివేశానికి తగ్గట్టే వుంటుందీయన దూషణము. శ్రీకృష్ణుడిని నరకాసురాదులచేత దూషింపిస్తాడు. పారిజాతాపహరణములో సవతుల పోట్లాట చాలమనోహరముగా ఉంటుంది. ఈయన సీస పద్యాలు శ్రీనాధుని వాటివలె చాల వరకూ సమత కలిగి రసవంతముగా ఉంటవి! ఒకొక్క చోట చక్కని ప్రబంధ కవిత్వ పోకడలూ కనబడుతూ ఉంటవి ! వీరేశలింగముగారి శైలివలె ఈయనిది కూడా సౌలభ్యముతో కూడి ఉంటుంది. ప్రసాదగుణము కలిగి ఉంటుంది. "లులాయశతక" పరివర్తనము చక్కనిపాకములో ఉన్నది. ఉద్గ్రంథరచయితల్లో చేర్చతగినవారు.

ఈయన నెఱిగినవారు ఈయనను ప్రేమించకుండా ఉండలేరు. రాజమహేంద్రవరము హిందూసమాజములో◆ గంగరావి చెట్టు క్రింద కూర్చున్నప్పు డీయన సంభాషణ చాలా ఆనందకరము. ఈయనను జాన్‌సన్‌తో పోల్చవలె

---

✻ నాటక సంఘాలు కూడా చాలా విరివిగా ఆడేవాళ్ళు. బందరులో "రామమోహన థియేట్రికల్ కంపెనీ" వారు తప్పక నరకాసురవధను నరకచతుర్దశినాడు ఆడేవారు. ఇదియొక ఆచారముగా పెట్టుకొనినారు. కొందరు ఈయన వ్రాసిన నాటకాలాడడములో చాలా పేరుమ్రోగినారు. బెల్లంకొండ సుబ్బారావుగారు శ్రీకృష్ణ పాత్రధారిగా చాలా కీర్తి పొందినాడు. సామాన్యముగా ప్రతి విద్యార్థి యితరుడు కూడా ఈ నాటకాల్లోనించీ కొన్ని పద్యాలైనా కంఠతా పెట్టేవాడు."అల్లుడా రమ్మని" సామాన్యముగా అందరి నోళ్ళలోనూ ఉండేవి! ఈవిధముగా ఆకాలంలో యేవో "హరిశ్చంద్ర" మొదలైనవి కొన్ని తప్ప వీటివలె ప్రజలనాకర్షించలేదు ఇప్పటికి "గయోపాఖ్యానము" అక్కడక్కడా ప్రదర్శింపబడుతూనే ఉంటుంది "

◆ ఇంగ్లీషులోని ట్రాడ్ అనే దొర వ్రాసిన గ్రంధానికిది అనువాదము.

◆ స్థాపనము, 1889. ఆ సంవత్సరమే "కీచకవధ" అనే వచన నాటకము కూడా వెలసినది.

ననిపిస్తుంది అప్పుడు. ఈయన కంఠస్వరము విని మనుష్యులను§ గుర్తిస్తాడు. ఈయన ఒక వ్యక్తి కాడు. ఒక సంస్థ అనవచ్చును. ఈయనతో కూడా ఎప్పుడూ పదిమందికి తక్కువ ఉండరు. పరమేశ్వరుడు నేత్రాన్నే ప్రసాదించినట్లయితే ప్రపంచానికి అత్యుపకారముగా ఉండేది. ఈయన బ్రహ్మసమాజము అవ్యక్తముగా ఉన్నా, సంస్కార ప్రియత్వము, సహృదయత్వము, విశ్వ ప్రేమ, ప్రతి వాక్యములోనూ వ్యక్తమౌతూ ఉంటవి. ఈయన హృదయము ప్రపంచమంత విశాలము. వీరిది సహజ ప్రకృతి ప్రేమ. 'గొప్పదయాశాలి' 'ఆపద్బాంధవుడు' చిన్నపిల్లవాడు కూడా ఆయనవల్ల ఆనందము పొందుతాడు. ఈయన గొప్పవక్త. పట్టుకుని తీసుకుని వెళ్ళి వేదిక యెక్కిస్తే అనర్గళధారల గంగాలహరివలె యీయన వాణి విజృంభించి శ్రోతలకు కర్ణపేయము చేసేది. ఈయన గద్య పద్య శైలి కూడా గంగాలహరి వలె అనర్గళము. వీరేశలింగముగారి నడకలో నడుస్తూ ఆయన పనిని సాగించటానికి ప్రయత్నించిన వారిలో ముఖ్యుడు!*

## మంగిపూడి వేంకటశర్మ :

మంగిపూడి వేంకటశర్మగారి (1882 జననం) వాణీ, లేఖినీ కూడా, అనాధుల కొరకూ, అనాధలకొరకూ పొంగిపొర్లిపోయినవి. ఈయన "బాల వితంతువిలాపము" చదివితే ప్రతి వాడికంటా నీరుగారవలసినదే! ఈయన ముందు రాబొయ్యే భావ కవిత్వాన్ని తాడుకట్టిలాగి నూతన యుగాన్ని దగ్గరకు తెచ్చినాడు. ఈయన వ్రాసిన ప్రబోధ గీతాలచేత దేశం ఉత్తేజితమైంది.

"మద్దుకత" చదువుతూ ఉంటే ఒళ్ళు జలదరిస్తూ సానుభూతితంత్రి చదువరులలో మ్రోగుతూ ఉంటుంది. అగ్ని పరీక్ష, పశ్చాత్తాపమూ, యెంతటి కఠిన

§ ఒకమారు నా కంఠ స్వరం విని "ఓహో! సీతారామయ్యగారా! మీ తంజావూరు చరిత్రమంతా చదివినానండోయి; బాగా ఉంది" అన్నారు. నేను ధన్యుడనని నమస్కరించినాను.

* 1944 సంవత్సరము డిసెంబరు నెలలో ఆంధ్రదేశ అభ్యుదయ రచయితల సంఘమువారు ఈయన స్వీయచరిత్రను ప్రకటించి వెయ్యారులతో సన్మానించినారు. ఆంధ్ర కవిలోకాన్ని దుఃఖములో ముంచి 1946 లో దేహాన్ని వదలినారు.

హృదయాన్ని అయినా కరిగిస్తవి. ఆంధ్రదేశంలో యెవ్వరూ కళ్ళు తెరవక పూర్వము హరిజన సమస్యను లేవదీసి, అస్పృశ్యత కోసము, నిమ్నజాత్యుద్ధరణము కోసము, కష్టించిన వ్యక్తి ఈయన. ఈయన "నిరుద్ధ భారతం" అనే గ్రంధాన్ని వ్రాసినాడు.◆ అది చదువుతుంటే గాంధీగారి హరిజన పత్రిక చదువుతున్నట్టు ఉంటుంది. ఈయన బంధువు లీయన సంస్కరణాన్ని చూచి సహించలేక వెలి వేసినారు. ఈయన అత్యంత త్యాగి. ఈయన "సానుభూతి" అనే కావ్యంలో

"వస్తువులన్నియు పోనీ
పస్తుండగ వచ్చుగాని, ప్రాణపదములౌ
పుస్తకములు తడియగ గని
వాస్తవ వాస్తవ్యుడగు నెవండు సహించున్"

అని చెప్పి స్వీయ చరిత్రను వ్రాసుకున్నట్టు కనపడుతుంది. వందేమాతరం, చమత్కార చంద్రిక, గోకలాపము, దుర్గావతి మొదలైన పద్య కావ్యాలు రచించినాడు. దారిద్ర్యాన్ని ఒడిగట్టుకుని సాహిత్యానందములో తేలుతున్న వ్యక్తి! మనుష్యుడు ఆహారమువల్లనే జీవించడు, విజ్ఞానము వల్ల కూడా జీవిస్తాడనే గట్టి నమ్మకము కలవాడు. ఈయనకు స్త్రీ విద్య అంటే అమిత అభినివేశము. "నీతి కధామంజరి' ' "స్త్రీ ధర్మబోధిని" అందుకని వ్రాసినవి. సరసమైన శైలిలో పరిణతప్రజ్ఞుడు.

## రాయసం వెంకటశివుడు :

ఈయన (జననం 1870) వార్ధక్యంలో తన అనుభవాలను ప్రపంచానికి గ్రంధాల మూలముగానూ, వ్యాసాల మూలముగానూ, అందజేస్తూ ఉన్నాడు. తమ గురువుగారైన వీరేశలింగముగారి చరిత్ర వ్రాసి గురు ఋణం తీర్చుకొనినాడు. చదువుతూ ఉంటే ఉదాత్తముగా హృదయంగమముగా ఉంటుంది. స్త్రీ విద్య యీయనకు అభిమాన విషయము.

---

◆ 'వీరమతి', 'పుష్పవేణి', 'కర్మదేవి', 'మార్కండేయ' మొదలైన అనేక నాటకాలను, 'గాంధీ శతకము', 'భరతమాతృశతకము', 'ఆంధ్రమాతృశతకము', 'హరినాథ శతకము' మొదలుగా అనేక శతకాలను రచించినాడు. ఈవిధముగా శతాధిక గ్రంధకర్త అనిపించుకొనినాడు.

ఈ విధముగా ఎందరిని గూర్చి ప్రజా సంఘము అనుకొనటానికి పిలుస్తుదో చెప్పలేము!

## కవుతా శ్రీరామశాస్త్రి :

ఈయన కూడా పైవారి వంటివాడే. సంస్కార ప్రియుడు. స్వయముగా సంస్కరణా న్నాచరించినాడు. ఈయనను సుప్రసిద్ధ దేశభక్తులలో చేర్చవలె. ఈయన గొప్పవక్త. బంగళా విభజనాందోళనములో ఈయన చేసిన సేవ అప్రతిమానము. బంకించంద్రుని "వందేమాతరం" గీతము పాడడములో ఈయన మిక్కిలి సమర్థుడు. ఏ సభలోనైనా ఈయనే ప్రథమములో గీతము పాడేవాడు. ఈయన మంచి భక్తుడు. సుప్రసిద్ధ భక్తుడైన అశ్వినీ కుమారదత్తుగారి గ్రంథాలనీయన అనువదించి బందరులో "సరస్వతీ నికేతన" మనే పేరుగల స్థలాన్నించి ప్రచురించినాడు. ఇంతేకాక 'భారతీ' స్థాపనానికి పూర్వం ఈయన తన సర్వస్వమంతా ఖర్చు పెట్టి బందరులో "శారద" అనే మాసపత్రికను 1923 లో స్థాపించి నడిపినాడు. పత్రిక మిక్కిలి ఉత్తమ శ్రేణిలో చేర్చతగినది. వ్యాసాలేమి, చిత్రాలేమి, మిక్కిలి ఆదరణీయాలుగా ఉండేవి. పాపము లక్ష్మీ పుత్రుడు చెయ్యవలసిన పని బీదవాడు చేస్తే ఆదరము వస్తుందా? చెప్పకూడదు గాని విశ్వదాతవంటి ధనికుడు ఈయనకు ఏ మాత్రము చేయూత యిచ్చినా మనిషి తట్టుకునేవాడే! విశ్వదాత యీయన విషయములో వైముఖ్యము వహించటము విషాదకరము. పత్రిక అంతరించినది. భక్తి ప్రధానాలుగా అనేక గ్రంథాలు రచించినాడు. స్త్రీలకు పనికివచ్చే గ్రంథాలు కూడా వ్రాసినాడు. ఇటీవలే 1947 లో స్వర్గస్థుడైనాడు.

## కొందరు స్త్రీలు :

కొందరు స్త్రీలు వీరేశలింగముగారు స్త్రీ విద్యకు చేసిన పనిని అందుకొని నిర్వర్తించినారు. వీరిలో పులుగుర్తి లక్ష్మీనరసమాంబ,◆ కొటికలపూడి సీతమ్మ,

◆ 1. మహిళా కళాబోధిని, 2. పాతివ్రత్యము, 3. మంగళహారతులు రచించినది. "సావిత్రి" పత్రిక నడిపినది. 1925లో స్థాపితమైనది.

§బాలాంత్రపు శేషమ్మ, మాడభూషి చూడమ్మ, కళ్ళేపల్లి వెంకటరమణమ్మ, మొసలిగంటి రామాబాయమ్మ✻ గార్లు యెన్నదగినవారు. వీరు రచనల ద్వారా, పత్రికల ద్వారా, స్త్రీ విజ్ఞానం చాలా ప్రచారం చేసినారు. వీరే గాక శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి శ్రీమతి బండారు అచ్చమాంబగారు స్త్రీల ఉద్యమముకోసము చాలా పాటుపడినారు. ఆదర్శ స్త్రీల కథలను "అబలా సచ్చరిత్ర రత్నమాల" అనే పేరుతో ఆమె రచించినది. ∫ అనురూపులైన సోదరున కనురూపమైన సోదరి! గుండు అచ్చమాంబ † అనే ఆమె పాటలు పద్యాలు వ్రాసి స్త్రీ విద్యకు తోడ్పడినది.◆ ఈవిధముగా వీరేశలింగముగారి పనిని వీరంతా కొనసాగించినారు. వీరి యొక్క, యితరులయొక్క, కృషికొంతవరకు ఫలించినదిగాని, అనాదిసిద్ధముగా సంఘములో ఉన్న బాల్య వివాహదురాచారాదులను రూపుమాపటము సామాన్య కార్యము కాదు! శారదా చట్టము ప్యాసైన తర్వాత కూడా యిప్పటికీ ఆగకుండా ఉన్నది యీ ఆచారము. కట్నపిశాచము కూడా ఆడపిల్లల తండ్రులను పీక్కు తింటూనే ఉన్నది. చదువుకున్న తండ్రి కుమాళ్ళలోనే యిది యెక్కువగా ఉన్నదనటానికి సిగ్గు వేస్తున్నది! ప్రజల మనస్సులలో పరివర్తనము అన్నిటికంటె అవసరము. అది కలగడము అతికష్టము. స్త్రీ విద్యను గూర్చి మాత్రము కందుకూరివారి కృషి సఫలమైనది. మిగిలిన ఆశయాలు ప్రజలలో అంతగా ఫలవంతాలు కాలేదు. కాని

§ "సాధు రక్షణ శతకము రచించెను. అంతేకాక లేడీ జేన్‌గ్రే అను ఆంగ్ల కావ్యము ననుసరించి 1915 లో ఆంధ్రకావ్యమును, అహల్యాబాయి, ఉపన్యాసమాలిక, ఉన్నత స్త్రీ విద్య, కందుకూరి వీరేశలింగము చరిత్ర మొ॥ నవీన గ్రంథములను రచించెను."

ఆంధ్ర సర్వస్వము

✻ హిందూసుందరి 1902 లో స్థాపితము. ఇప్పటికి నడుస్తూనే ఉంది.

∫ "బీదకుటుంబము" అనే వచనమును కూడా రచించినది.

† అచ్చమాంబగారు రచించిన యితరములు: శమంతకమణి, రామేశ్వరయాత్ర చరిత్ర, సత్కథామంజరి.

◆ వీరేకాక కాకాణి వెంకటనరసమ్మ, కళ్లేపల్లి వెంకట రమణమ్మ, జూలూరు తులశమ్మ, మామిడన్న సుభద్రమ్మ, బుర్రా సూరమాంబ మున్నగు కవయిత్రులున్నారు. కె లక్ష్మమ్మ "వీరమాతలు" అనే గ్రంథాన్నిరచించినది. దొల్తాబాదు హనుమాయమ్మ అనే ఆమె 'మన్వంతరము' లనే గ్రంథము రచించినది.

ఒక్కటి మాత్రము కలిగినది. అటువంటి పనులు చేసినవాళ్ళను చూస్తే అసహ్యించుకోవడము, బహిష్కరించటము, మొదలైన పనులు మాత్రము ఆగినవి. సముద్రయానము వలెనే, శిష్టుల యిండ్లలోనే ఇటువంటి పనులు జరగటమంటేనూ, వాటి కంతగా ప్రాముఖ్య మియ్యటము లేదంటేనూ, పంతులవారికీ జయమన్న మాటే! వెనుక చెప్పినట్టు పూర్వ సంప్రదాయాలమీద, ఆచారాలమీద, ప్రత్యయము చాలా సళ్ళినది. అభిప్రాయ స్వాతంత్ర్యము ఎక్కువైనది. అపనమ్మకము ప్రబలిపోయినది. ఇంగ్లీషు గ్రంధాలూ, వ్రాతగాండ్లూ అంటే ప్రీతి క్రమముగా హెచ్చినది. ఆంగ్లేయులు చేదా మనుకున్న వైజ్ఞానికవిజయచిహ్నాలివి!

## ఉద్గ్రంథరచనము - వాఙ్మయవిస్తృతి :*

ఒక వైపున సంఘసంస్కార ప్రచారము, పూర్వాచార నైరస్యము, జరుగుతూ ఉండగానే ఉద్గ్రంధ రచనం కూడా జరుగుతూ వచ్చినది. వెనుకటి శతాబ్దములోనే వ్రాయటము ప్రారంభించిన కొందరు మహామహుల వ్రాతలు సాగుతూనే ఉన్నవి.

## వావిలకొలను సుబ్బారావు :

వావిలకొలను సుబ్బారావు (1863-1936) గారిది నెల్లూరు. ఈయన తన ఆంధ్రవాల్మీకి రామాయణాన్ని పూర్తి చేసి "ఆంధ్ర వాల్మీకి" అనే బిరుదును పొందినాడు! ఈయన రామాయణాన్ని వాల్మీకి మల్లేనే దత్త మండలాల్లో పారాయణ చేస్తూ ఉంటారు. మడికి పనికి వచ్చేటట్టుగా భగవద్గీతల వలె కిత్తాని బైండుచేసిన గ్రంథాలున్నవి. ఈయన శరీరచ్ఛాయలో, నేత్రవిన్యాసములో, యెంత వికృతముగా కనపడే వాడో,అంత ప్రతిభాశాలి. ఎల్లప్పుడు పుస్తకవ్యాసంగం తప్ప వేరే పనిలేదు. అంతర్ముఖుడు. అఖండ రామభక్తుడు.◆

ఈయన పూర్వఫక్కీని కుమారాభ్యుదయము మొదలైన ప్రబంధాలు వ్రాసినాడు.

---

* "కొందరు తెలుగు కవులు" (జొ.స) భారతి 1939 సెప్టెంబరు

◆ "శ్రీ భారతి" (1900) 'భక్త సంజీవని' (1919) అనే మాస పత్రికలను స్థాపించి నడిపినాడు.

సుభద్రా పరిణయమనే నాటకము చాలా ప్రదర్శనానుకూలముగానూ, రసవంతము గానూ రచించినాడు. ఈయన తన రామాయణాన్ని ఒంటిమిట్ట కోదండరామస్వామికి అంకితమిచ్చినాడు. పోతన్నగారి గ్రామము ఒంటిమిట్టని ఈయన గట్టి నమ్మకము. అది కాదనే వాళ్ళను సహించేవాడు కాదు. ఆ కోదండరామస్వామికి అంకితమిచ్చిన పోతన, అయ్యలరాజు రామభద్రులు ఈయనకు ఆదర్శ పురుషులు. పోతన కవిత్వంలో భక్తి ప్రధానరస మౌటచేతా, తాను మహాభక్తుడగుటచేతా, ఆయన్నే తనకు ఆదర్శంగా పెట్టుకొని వ్రాసినాడు. పోతన్నను లాక్షణికకవిగా అంగీకరించని అప్ప కవిని 'తుచ్ఛ' డన్నాడీయన. ఈయన రామాయణము, ఈయన పేరును (వాసుదాసు) ఆంధ్ర సారస్వతములో చిరస్థాయి చేసినది. ఈయన భాషాంతరీకరించిన మార్గము యధామాతృకం. మాతృకలో శ్లేష ఉంటే పద్యంలో శ్లేష పెట్టును. మాతృక యెంత రసవంతంగా ఉన్నదో అంత రసవంతంగానూ ఉన్నది భాషాంతరీకరణం. అందులో ఉపోద్ఘాతములో తాను గ్రంధకర్తృత్వానికి పూనిన కారణములు చెప్పడములో మిక్కిలి రసవంతముగా వ్రాసినాడు. తాను రామాయణాన్ని రచించబూనటం 'కవిననే గాఢ గర్వం' వల్ల కాదనిన్నీ, 'పాండితి' వల్ల కాదనిన్నీ, 'నాథుని చరణారవింద సేవ చేయాలననే ఆశ' వల్ల మాత్రమే అనిన్నీ, అట్టి పనిని 'దంతములూడక మునుపు', 'కనుదోయి మసకలు గనక మునుపు' అనగా వార్ధక్యము వచ్చే లోపుననే చేయటము తగుననిన్నీ, చెప్పిన భాగం చాలా హృదయంగమముగా ఉంటుంది. సుందరకాండ మిక్కిలి సుందరంగానే వ్రాసినాడు. * ఇవన్నీ గాక ఈయనకు ఆర్య సంస్కృతి అంటే అత్యంత ఆదరం. ఈ సంస్కృతిని చిన్నప్పటినుంచీ బోధ చేస్తేగాని పిల్లలకు పట్టుపడదని 'ఆర్య కథానిధి' అనే పేరుతో బాలుర ఉపయోగార్థం ఒక గ్రంధమాల స్థాపించినాడు. దీనిలో ఆర్యసంస్కృతికి సంబంధించిన గొప్ప రాజులు, ఋషులు, పతివ్రతలు మొదలైన వాళ్ళ చరిత్రలు, జీవితాలు, కథలు; సత్యము, అహింస, రాజగురుభక్తులు మొదలైన గుణగణాలకు సంబంధించిన కథలు మొదలైనవి తరగతి వారీగా అత్యంత సులభముగాను, వ్యాకరణయుక్తమైన

* 'మందరమనే పేరుతో తాను రామాయణ వ్యాఖ్యను కూడా రచించి దాని అంతరార్థము నిరూపించినాడు. ఈ వ్యాఖ్య చాలా విశేష విషయాలతో నిండి ఉంటుంది.

శైలిలోనూ, వ్రాసినాడు. అట్లే భావికవుల కుపయుక్త మయేటట్లుగా కూడా సులభ వ్యాకరణాన్ని వ్రాసినాడు.

ఈయన సర్కారుద్యోగము చేసినాడు. ◆ తుది దినాలలో సన్యసించి 'వాసుదాసు' అనే పేరు గ్రహించి ఒంటిమిట్ట దేవాలయాన్ని జీర్ణోద్ధరణము చేసి, అక్కడ నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవాలు జరిగడాని కేర్పాట్లు చేసి, దానిని మంచి స్థితిలో పెట్టినాడు. అంతే గాకుండా దేశమంతా సంచరించి 'శ్రీరామ భక్తమండలి' ఏర్పరచి శ్రీరామ భక్తిని దేశంలో అన్ని మూలలా నాటినాడు. రాయలసీమలో ఈయన నెరిగినట్లు ఏకవినీ ఎరుగరు. సారస్వత సేవతోను, రామభక్తి తోను, ధన్యతచెందిన పవిత్రచరిత్రుడు.

# శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి :

ఈయనది రాజమహేంద్రవరం. ఈయన సంస్కృతాంధ్రాలలో నిష్ణాతుడు. తిరుపతి వేంకటేశ్వర కవులలో వేంకటశాస్త్రి గారీయనవద్ద కొన్నాళ్ళు శిష్యత్వంకూడా చేసినాడు. ఈయనను అపర 'తిక్కన' అనవచ్చు. తిక్కన పదిహేను పర్వాల భారతం మాత్రమే రచిస్తే, ఈయన భారతం* యావత్తూ రచించి, కవిత్రయం వారు ముగ్గురు చేసిన పనిని ఒక్క చేతిమీద చేసినాడు. ఈ కృష్ణ భారతం మంచి రసవంతమైన పాకములో పడ్డది. ఎక్కడైనా కొన్నిచోట్ల తిక్కనకుండే కళాసృష్టి తరుగైనా, చక్కని నిర్దుష్టమైన భాషలో సాధ్యమైనంతవరకు యధా మాతృకముగా వ్రాసినాడు. తిక్కన అనేక స్థలాలలో కుదిస్తూ పెంచుతూ తన రచన సాగించినాడు.

---

◆ మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెలుగు పండితుడుగా ఉన్నపుడు ఈయన దగ్గర శిష్యుడుగా ఉండే భాగ్యం నాకు లభించినది నా కించిదాంధ్రభాషాజ్ఞానం వారి ప్రసాదమే!

భక్త సంజీవని అని ఒక పత్రిక స్థాపించి భక్తిని ప్రచారము చేసినాడు.

* తాడూరు లక్ష్మీనరసింహారావనే అయనకూడా భారత భాగాలు కొన్ని ఆంధ్రీకరించినాడట! ఈయన కొన్ని నాటకాలుకూడా వ్రాసినాడు. ఈతని కృతులలో 'ఆంధ్ర చంద్రాలోకం' ఎన్న దగినది.

చూ. వానిలికొలను పై వ్యాసము.

-ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం.25 సం.5

శ్రీపాదవారట్లాగాక మాతృకననుసరించి నడిచినాడు. దాదాపు అంతా పూర్తికావడానికి 20 సంవత్సరాల కాలం పట్టినట్టున్నది. ఇంత పెద్దగ్రంథము ఇతర పనులలో ఆ మాత్రం పట్టినదంటే ఆశ్చర్యమే లేదు. అక్కడక్కడా తిక్కన కంటె బాగా వ్రాసినాడని కూడా అనవచ్చును. శ్రీకృష్ణభారతమని వ్యంగ్య ప్రధానముగా కవిగారి పేరుకూడా వచ్చేటట్టు నామకరణము చేసినాడు.

ఈ కాలపు కవులలో మహాగ్రంథ నిర్మాతలలో, ఈయన నొక అగ్రస్థానములో ఉంచదగినవాడు. ఇదేగాక యీయనవి చాలా యితర గ్రంథాలున్నవి. బొబ్బిలి యుద్ధనాటక మీయన వ్రాసినది ఒకటి చాలా ప్రసిద్ధి కెక్కినది. రంగస్థలముమీద యిప్పుడాడేది అదే! వీరిది చక్కని కవిత్వమూ శైలీని! నాతి కఠినమైన కదళీపాకములో ఉంటుంది. ఈయన కూడా కొన్ని అధిక్షేప (Satirical) ఖండకావ్యాల రచించినాడు.

చళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారికీ ఈయనకూ పోరాటము కలిగి భాషకు సహాయము చేసినది. మంచి సరసమైన హాస్యరసము చిలుక గల సమర్థుడు. సామాన్యముగా కవికి ప్రేరణ ఉంటేనేగాని కవిత బహిర్గతముకాదు. అటువంటి ప్రేరణానికి పోట్లాట మూలమైనప్పుడు భావోద్రేకము చేత మంచి పాకానపడుతుంది కవిత. ఈయనకు ప్రజలు 'కవిరాజ'ను బిరుదిచ్చినారు. ఈయనకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు 'కళాప్రపూర్ణ' బిరుదిచ్చి తమకు గౌరవము తెచ్చుకున్నారు. బొబ్బిలి యుద్ధనాటకమేగాక అనేక ఇతర నాటకాలను రచించినాడు. ఈయన కూడా వేణీసంహారము పరివర్తనము చేసినాడు. మంచివక్త. వీరియిల్లు ఒకపాఠశాల. అనేకులు ఉదయంనుంచి సాయంకాలము వరకూ వస్తూ పోతూ తమ సందేహాలను తీర్చుకుంటూ జ్ఞానాన్ని పొందుతూ వెళ్ళుతూ ఉంటారు. ఈయనకూడా బహు శిష్యగణము* కలవాడు. భారతము విషయమైన యేసంగతికైనా యీయన ప్రమాణ మనవచ్చు. కురు పాండవదాయ భాగాన్ని గూర్చి చాలా చర్చించినాడు. వార్ధక్యంలో విశ్రాంతిననుభవిస్తున్నాడు.◆ ప్రభుత్వమువారీయనకు 'మహామహో

* శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి యీయన శిష్యుడే!

◆ చూ. ఆంధ్ర సర్వస్వము అనే పత్రిక. ఈ పత్రికలో శ్రీ పాదవారే తమ చరిత్రము వ్రాసుకొన్నారు.

పాధ్యాయ' బిరుదాన్నిచ్చారు. అనేక స్థలాలలో సమ్మానాలు పొందినారు. ఇటీవల వాల్మీకి రామాయణాన్ని తెలుగులో నిర్మించినారు. ఈదర వెంకట్రావుగారు దీనిని అంకితముగా గ్రహించి ధన్యత పొందినారు. కృష్ణమూర్తిశాస్త్రి గారు భాగవతాన్ని ఆంధ్రీకరిస్తున్నట్లుకూడా వింటాము. ఈయన శక్తికి అవధి నిర్ణయించలేము!

## వడ్డాది సుబ్బరాయకవి:

రాజమహేంద్రవరము అదృష్ట మేమనవచ్చు! ఇంతమంది కవులు, సంస్కర్తలు, పండితులు, ఏక కాలావచ్ఛేదకముగా అక్కడ ఉండడము నిజముగా అదృష్టమే అనవలె. ఒకరికొకరు తీసిపోరు. ఏది చూచినా దిగ్గజమే! వడ్డాది సుబ్బ రాయకవిగారు వెనకటివారి కెందునా తీసిపోడు. ఈయన రాజమహేంద్రవర కళాశాలలో చాల సంవత్సరాలు సంస్కృతాంధ్రాధ్యాపకుడుగా పని చేసినాడు. వీరి కలము కూడా సరసమైన సారస్వతవీధులలో ప్రవర్తించినది. వీరి యిల్లొక విశ్వ విద్యాలయ' మనవచ్చు. యువకులనేకులలో విజ్ఞానము వెదజల్లి, తెనుగు సహృదయత్వము వాళ్ళకలవడ జేసినాడు.

మేఘసందేశము, ప్రబోధ చంద్రోదయ నాటకము, అభిజ్ఞాన శాకుంతలము, విక్రమోర్వశీయము, సూర్యశతకము, భామినీవిలాసము, మొదలైన సంస్కృత గ్రంథాలకు సరసమైన ఆంధ్రానువాదాన్ని చేసి సహృదయ లోకానికి అందించినాడు. ఇవిగాక మల్లికామారుత ప్రకరణము, చండకౌశిక నాటకము, అనే నాటకాలను రచించి విశ్వ విద్యాలయాల మన్ననలను బడసినారు. భక్తచింతామణి, భగవత్కీర్తనలు, నందనందన శతకము మొదలైనవి రచించి భక్తబృందానికి పరిచితుడైనాడు.

ప్రక్కనున్న ట్రైనింగు కాలేజీకి ఉజ్జీగా ఉండేది వీరి యిల్లు! ఈయన జీవితములో ఆపత్తు వచ్చినప్పుడల్లా ఒక కావ్యనిర్మాణము జరిగింది. కుమారుడు చనిపోయినపుడు 'సుతస్మృతి', భార్యపోయినపుడు 'సతీస్మృతి' మిక్కిలి కరుణ పూరితములుగా వెలువడినవి. ఈయన, పాఠశాలా బాలురకు మిక్కిలి ఉపయోగ పడేటట్టు కొన్ని గ్రంథాలు వ్రాసినాడు. 'సుమనోమనోజ్ఞం' 'సుగుణ ప్రదర్శనము' , 'శ్రీసూక్తి వసు ప్రకాశిక' మొదలైన వట్టివే. ఈయన వ్రాసిన 'భక్తచింతామణి' చాల

ఉత్తమ కావ్యము. దాశరథీ శతకము మొదలైన గ్రంధాలవలె ఎక్కువ ప్రచారములో ఉన్నది. దీనిలో ఒక పద్యమైనా తప్పక ప్రతి ఆంధ్రబాలునికీ వచ్చిఉంటుంది.

ఈయన చాల నాటకాలు వ్రాసినాడు. 'వేణీసంహారము' ఈయనకత్యంత కీర్తిని తెచ్చి పెట్టిన నాటకము! తెనుగులో ఉత్తమ నాటకాలలో సంఖ్యేయమైనది.*

బళ్లారివారి 'చిత్రనళీయము', వీరేశలింగముగారి 'శకుంతల', లక్ష్మీకాంతముగారి 'హరిశ్చంద్ర', శ్రీపాదవారి 'బొబ్బిలి', తిరుపతి వెంకట కవుల 'పాండవోద్యోగములు', వేదమువారి 'ప్రతాపరుద్రీయము', పానుగంటివారి 'రాధాకృష్ణ' - వీటితో పాటు స్థానాన్ని 'వేణీ సంహార' మాక్రమించుకుంటుంది. భట్ట నారాయణుడి గౌడీపాంచాలీ రీతు లీయన పరివర్తనములో కూడా అచ్చముగా అట్లే ఉండిపోయినవి. అనురూప కావ్యానికి అనురూప పరివర్తకుడు దొరకడము భాష యొక్క అదృష్టము. మూలము మాదిరే యీయన 'వేణీసంహారము' అష్టరసభరితము! వీరమా, రౌద్రమా ముఖ్యరసం? అని ఆలోచించేటంత చక్కగా వ్రాసినాడు; 'వసురాయ చాటూక్తి ముక్తావళి' లోని యీయన పద్యాలు రమ్యమైనవి. 'శ్రీ సూక్తి వసుప్రకాశిక' లో ప్రతి పద్య సూక్తులు హృదయంగములు. ఈయన ప్రకృతి పరిశీలనము, మనస్తత్వ రహస్య జ్ఞానము, వ్యక్తమౌతూ ఉంటవి. వ.సు. రాయలు అని వ్యవహారములో నలిగినది ఈయన పేరు. లబ్ధ ప్రతిష్ఠుడు. ◆

## జనమంచి శేషాద్రిశర్మ :

ఈయన రాయలసీమకు చెందినవాడు; వావిలికొలను వారివలె పండితుడు, కవి, భక్తుడు. ఆయనవలె ఒటిమిట్ట ప్రియుడు. ఈయన బ్రహ్మాండపురాణాన్ని, భారత రామాయణ శైలిలో బ్రహ్మాండముగా తెల్గించి కీర్తి పొందినాడు.* సమస్త

* "వీరు రచించిన గ్రంధములిరువదింటికి మీదగలవు. గాని వానిలో వేణీ సంహారమునకును, భక్త చింతామణికిఁగల్గిన కీర్తి తక్కిన పెక్కింటికి లేదు."
-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 26 సం. 6 సంచిక.

◆ ఈయన 1938 మార్చి 2వ తేదీనాడు మరణించినాడు

* నిర్వచనములో ఆంధ్ర శ్రీ మద్రామాయణము, తాండవకృష్ణ భాగవతము, ధర్మసార రామాయణము, మొదలైన ఉద్గ్రంధాలను రచించినాడు.

పురాణేతిహాసాల్లోనుంచి క్రోడీకరించి శ్రీ కృష్ణావతారతత్త్వాన్ని దాదాపు 12 సంపుటాలుగా రచించినాడు. సర్వమంగళా పరిణయము, లలితో పాఖ్యానము, హాలాస్యమాహాత్మ్యము మొదలైన ప్రబంధాలను వ్రాసినాడు. శంకర విజయధ్వజం తెనుగులో రచించినాడు. ఈయన రచించిన పుస్తకాలన్నీ ఒక బీరువాకు సరిపోతవి! ఈయినకు గద్య పద్యాలు చాల సహజముగా వస్తవి. చక్కని వైదర్భీరీతి. ఈయన కూడా యీ కాలపు బహుగ్రంథనిర్మాతలలో పేరెన్నిక వహించినవాడు. నిరాడంబరజీవి. కళాప్రపూర్ణ బిరుదాంచితుడు!

ఈయనకు నెల్లూరులో విద్యార్థులిచ్చిన సన్మానపత్రంలో ఈ వాక్యాలను గ్రహించండి:

"సంస్కృతాంధ్రములయం దసమాన పాండిత్యము గడించి శ్రుతినయన త్రిభాగి గోచరులై, మంత్రఖండ సర్వస్వవేత్తలై, యోగశాస్త్ర మర్మజ్ఞులై, కావ్యస్మృతి తీర్థులైన ... .. ... మీ యద్భుత జ్యోతి శ్శాస్త్ర విజ్ఞానమునకు పంచాంగ నిర్మాతలగు మీశిష్య కోటియు, అన్యజన దుర్లభ మంత్రశాస్త్ర వైదుష్య ప్రచురణమునకు మిమ్మనవరత మాశ్రయించియుండు భక్త బృందమును, ప్రబల నిదర్శనములు."

## వేదము వేంకటరాయశాస్త్రి :

ఈయన (1853-1929) ఉత్తమాంధ్ర పండితులలో ఒకడు.* మద్రాసు లోని క్రైస్తవ కళాశాలలో ఆంధ్రపడితులుగా ఉండేవాడు. సంస్కృతాంధ్ర పాండిత్యముతో పాటీయన ఆంగ్లములో కూడా ప్రవీణుడు. అందుచేత ఆంగ్ల సంప్రదాయాదులు కూడా యీయనకు తెలుసు. ఈయన గ్రంథాలలో పరివర్తనాలు. వ్యాఖ్యానాలు ఎక్కువ. వ్యాఖ్యానాలవల్ల గ్రంథపరనము మీద అభిరుచి కలిగి సహృదయత్వము కలుగుతుందని యీయన ఆశయము.◆ అందుచేత తెనుగులో

---

* చూ: 'Triveni ' May,June 1929 లో గుఱ్ఱం సుబ్బరామయ్యగారి వ్యాసము. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం 18. సంచిక 2

◆ సాహిత్యాభివృద్ధిని చేయునవి, విమర్శనములు, భాషాంతరీకరణములు, వ్యాఖ్యానములు, నను నీమూడునునై యున్నవి. -కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి

ఉన్న ఉత్తమ గ్రంథాలకు కొన్నిటికి వ్యాఖ్యానాలు వ్రాయటానికి సమకట్టినాడు. విజయవిలాసం, శృంగారనైషధం, ఆముక్తమాల్యద, వీటికి ఉత్తమ వ్యాఖ్యానాలు రచించినాడు.* వేదంవారి వ్యాఖ్యానాల్లోకి ఆయన పాండిత్యంయొక్క సర్వతో ముఖత్వం వెల్లడిఅవుతుంది. వృక్షశాస్త్రం, వాస్తుశాస్త్రం, దగ్గరినుంచికూడా ఆయనకు తెలిసినట్టు వ్యక్తమౌతుంది. ఈయన కూడా వావిలికొలను సుబ్బారావుగారి వలె ఆంధ్ర వైయాకరణి. వ్యాఖ్యానాలు పాండితీపూరితాలుగానూ విజ్ఞానం యెక్కువ చేసే విశేషాలతో నిండిన్నీ ఉంటాయిగాని, కవియొక్క ఉదాత్త భావాల్ని, విశదీకరించి, వైశిష్ట్యాన్ని చెప్పి, పాఠకుడికి కవి యందు ఆదరం కలిగించేటంత ఉండవు. ఒక్కొక్కప్పుడు విసుగు కూడా కలిగిస్తవి. ఎల్లాఉన్నా యీయన చాలా గొప్ప భాషా సేవకుడు. ఈయన పరివర్తనాలు కొన్ని చదవడమే కాకుండా పాఠం చేప్పే భాగ్యం కూడా నాకు లభించినది. మాతృకకంటె జటిలంగా ఉంటవి. కాళిదాసునీ, శ్రీహర్షునివీకూడా నాటకాలు పరివర్తనం చేసినాడు. మాతృక కదళీపాకంలో ఉంటే ఈయన పరివర్తనం నారికేళ పాకంలో ఉంటుంది. ఈయనది సంక్షిప్త శైలి.◆ తక్కువ పదాలతో ఎక్కువ అర్థం తెప్పించడానికి ప్రయత్నిస్తాడీయన. కొక్కొండ వెంకటరత్నంగారి శైలికంటె నారి కేళత్వం కొంచం తక్కువ. ఒక్కొక్కప్పుడీ సంక్షిప్తశైలి భావ వైశద్యాని కడ్డంవస్తుంది. ధారకూడా ధారాళంగా ఉండదు. అప్రయత్నంగా వచ్చినట్టుండదు. ప్రతాపరుద్రీయ నాటకంలో నాంది పద్యంలో "దొంగిలి" అంటే కృష్ణావతారమన్నమాట. "లేదటంచు" అంటే దేవుడు లేడనే బుద్ధావతారమన్న మాట. ప్రక్రమంనించీ పద్యం దశావతార ద్యోతకమని తెలిస్తేకాని యీమాటల కీయర్థమని మనం చెప్పలేము. విజయవిలాసవ్యాఖ్య బాగానే ఉన్నది.#

---

* నాగపూడి కుప్పుస్వామయ్యగారుకూడా వేదంవారి ననుకరిస్తూ పారిజాతాపహరణానికి పరిమళమనే వ్యాఖ్య వ్రాసినాడు.

◆ "Succinctness, precision, transparent lucidity, avoidance of superfluous ornament, and the consequent strength and beauty are the chief merits of his style". -G.V. Subbaramayya.

# తాపీ ధర్మారావుగారు తా మొక విజయ విలాసవ్యాఖ్య వ్రాసినట్టూ, వెంకట్రాయ శాస్త్రి గారు కూడా కొన్ని స్థలాలువిని తనదానికంటె బాగున్న దన్నట్టూ, శాస్త్రిగారి తదనంతరం వ్రాసుకున్నారు. ప్రచురించిన యే కొంచెంతప్పు యీ ధర్మారాయ వ్యాఖ్యానాన్ని సమగ్రంగా ఆంధ్రప్రపంచ మెరగదు. ప్రచురించి పుణ్యం కట్టుకుంటే బాగుండును. ఈధర్మా రావుగారికి సారస్వతప్రీతి తగ్గి పత్రి కారచనప్రీతీ సంప్రదాయనిరసన ప్రీతీ, ఉపన్యాసదాన ప్రీతీ యెక్కువైనట్టు కనబడుతుంది

వేంకట్రాయశాస్త్రిగారి కృతులలోకల్లా ఉత్తమమై, సర్వజనా దరణీయమై, సారస్వతంలో ఆయనకు శాశ్వతస్థాన మిప్పించేది. "ప్రతాపరుద్రీయ నాటకం"* ఆంధ్రభాషలో ఉన్న ఉత్తమ నాటకాలలో అగ్రశ్రేణిలోనిది, ఇందులో పిచ్చి వాడి పాత్రను చిత్రించటం అసమానమన వచ్చు. దానిని అభినయిచటానికే ప్రతిభ కావాలె. పిచ్చిమాటల్లో, అంతరార్థం! "తెలిసిన వాళ్ళకు సార్థకం; తెలియనివాళ్ళకు నిరర్థకం' అయినట్టుగా సంభాషణను కల్పించి, పాత్రను "పరాకోటి" కెక్కించినాడు. నిజంగా యుగంధరుడి రాజ్యతంత్రంలో రహస్యం గ్రహిస్తేనే గాని అట్లా చెయ్యలేడు. మిగిలిన నాటకమంతాకూడా తగినట్టే రచించినాడు. పాత్రోచితభాష మొదలైనవానిలో అందెవేసిన చెయ్యనిపించుకున్నాడు. ఆంధ్రతురుష్కపద సమ్మేళనం, ఆంధ్ర ముసల్మానుల తెనుగు సంభాషణ అచ్చుగుద్దినట్టు వ్యక్తం చేస్తున్నది. "హాపు యె క్యా మీకీ మనిసీ తక్వా" "ఆయన బాత్వింటు వుంటె అదె సాల్నాకీ" "క్షవ్రం సిద్ధం" మొదలైన వాక్యాలు యెన్నటికీ మరపురానివి. ఈయనతో పాటీపనిలో సమర్థుడు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. ప్రతాపరుద్రీయంలో పాత్రపోషణం, కథాసంవిధానం, మిక్కిలి రమణీయాలుగా ఉంటవి. ప్రేక్షకుల్లో, నటుల్లోకూడా పునః పునర్దర్శన ప్రయోగ ప్రేరకమని చెప్పడంవల్లనే దాని యొక్క ప్రాశస్త్యము గ్రహించవచ్చు.◆

ముఖ్య స్త్రీపాత్ర లేకుండా, శృంగారవీరాల్లో ఒకటి ముఖ్య రసంకాకుండా, ఇంత రసవంతంగా నాటకం రచించడంలో మాత్రం కన్యాశుల్కంకంటె విశేషమనవచ్చు. కేవలం సంఘంలోఉండే లోపాలను చూపి, పాఠకులకు ప్రతిబింబాలను తయారుచేసి, మనస్సుకానందం కొల్పింది, కన్యాశుల్కం.* ప్రతాపరుద్రీయంయొక్క కథా పరిణామం దీనికంటె మిక్కిలి ఉదాత్తమైనది. హాస్యరసంలోకూడా కన్యాశుల్కంలో

---

* "1909 నాటికే వ్రాసినాడు."

◆ ఒకప్పుడు తెనాలి "రామవిలాస సభ" వారే ఈ నాటకం ఆడాలని పేరు పొందినారు. నెల్లూరిలో కవిగారే ఒక నటమండలి నాటక ప్రదర్శనాకి తయారు చేసినారు. పిచ్చివాడి పాత్రధారణంలో తెనాలి డాక్టరు గోవింద రాజుల వెంకటసుబ్బారావుగారు యేలూరు ముంజులూరి కృష్ణరావుగారు చూపిన, ప్రతిభ మరెవ్వరూ చూపలేదనటంలో పొరబాటు లేదు.

* 1897 నాటికి ఇది వ్రాసినాడు, గురజాడ.

పేలవత్వం దీనిలోలేదు. అందుచేత ఈనాటక మొక ఉత్తమకక్ష్యలోదనకతప్పదు. ఈఒక్కటేచాలు శాస్త్రిగారికి సారస్వతంలో శాశ్వతస్థాన మివ్వడానికి. ఈయన గ్రాంథిక వ్యావహారిక భాషాచర్చలో చాలా జోక్యం కలుగజేసుకున్నాడు. కథాసరిత్సాగరం తెనిగించినాడు. ఈయన వద్దకూడా చల్లని హాస్యరసం ఉన్నది. ఉద్గ్రంథరచయితలలో ఈయన ఉన్నతస్థాన మేర్పరచుకున్నాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయం వారీయనకు "కళాప్రపూర్ణ" బిరుదునివ్వడం తమ్ము తాము గౌరవించుకోవడమే! నెల్లూరులో వీరి విద్వత్తుకుమెచ్చి ఒక పీఠాధిపతి 'మహోపాధ్యాయ' బిరుదిచ్చినారు. ◆

# పానుగంటి లక్ష్మీనరసింహారావు:

వీరేశలింగంగారు యువకులలో కలగజేసిన సంప్రదాయనైరస్యాన్ని ఆపటం కొందరికి అవసరమని తోచినది. దానితోబాటు సంఘంలో ఉన్న కొన్ని దురాచారాలు కూడా విమర్శిస్తేగాని పూర్వసంప్రదాయాలమీద సరియైనప్రత్యయం కలగడానికి వీలులేదు. అంతేగాక పూర్వసంప్రదాయాలను మూఢవిశ్వాసంతోకాకుండా, తర్క మూలంగా, నమ్మజెయ్యడంతో, వాటిమీద అభినివేశం సకారణమై, చిరస్థాయి అవుతుంది. మన పూర్వాచారాలకు అంతరార్థంచెప్పి ప్రత్యయం కలగజేయడం సామాన్యమైన పనికాదు. దానికి సమస్తశాస్త్ర జ్ఞానమేకాకుండా ప్రతిభకూడా కావాలె. చెప్పేపద్ధతి రసవంతంగా ఉండవలెకూడా. ఇంతపని సామాన్యవ్యక్తి చేయలేడు.

ఈపని పానుగంటివారు (1865-1940) పూనుకున్నారు. ఈయన ఆంగ్లాంధ్ర సంస్కృతభాషలలో మంచి నిశితమైనజ్ఞానంకలవాడు. సరస్వతి

---

◆ 'నీ విమర్శన మహానిపుణతకుం బ్రసన్నరాఘవ కృతివిమర్శనము సాక్షి
నీ నాటకరచన నిపుణతకుం బ్రతాపరుద్ర సత్కావ్యచిన్ముద్ర సాక్షి
నీదు గీర్వాణవాఙ్నిపుణత కలమేఘదూతబోధన సువైదుషియె సాక్షి
నీ యాంధ్రవాఙ్మయనిపుణతకు నైషధాదికృతివాఖ్యలలరుసాక్షి
నీ యుపన్యాసవిస్ఫూర్తినిపుణతకును వీనులను నేటికిన్నిన్నువినుచునున్న
నీదు శిష్యనికాయమే నెగడుసాక్షి! రమ్యసత్కీర్తి! వేంకటరాయశాస్త్రి!'

- దోమా వెంకటస్వామిగుప్త

యీయనకు వశ్యఅయినది. సహజంగా హాస్యరసప్రధానమైన చిత్తవృత్తి కలవాడు. ఈయనతో కొన్ని దినాలు ఉండేభాగ్యంనాకుకలిగినది. ఈయన మాట్లాడినంతసేపు మనంనవ్వుతూ ఉండవలసినదే! హాస్యరసానికి హద్దూఆజ్ఞాలేదు. అకారాదిక్షకారాంతం ప్రవర్తించవలసిందే! కొందరికీ హాస్యరసమొక్కొక్కచోట పచ్చిగా ఉన్నట్టుతోస్తుంది. కాని ఆయున సమకట్టిన పని యెటువంటిది? జాడ్యానికొద్దీమందు. అసామాన్యజాడ్యానికి మంచి ఘాటుగల మందుకాని పనిచెయ్యదు. ప్రతిపాఠకుడూ ఈయన వ్రాతల్లో యెక్కడో ఒకక్కడ తనప్రతిబింబాన్ని చూచుకొని నవ్వుకోటమో, యేడ్చుకోటమో చెయ్యవలసినదే! అయినా కలిగేది ఆనందమే!

ఈయన పీఠికాపురాధీశ్వరుడికి ఆస్థానకవి. ఈయన వ్రాసిన సమస్త గ్రంథాలూ ఆయనే అచ్చువేసినాడు. అటువంటివాడుండబట్టే ఈయనవ్రాసిన గ్రంధాలన్నీ ప్రచురణఅయినవి. ఈయన వ్రాయటంలో "త్వర" చాలామంది వ్రాయసగాళ్లకులేదు. దినైకగ్రంథం రచించగల సామర్థ్యమున్నది. ఈయన అనేక నాటకాలు రచించినాడు. వానిలో అధికసంఖ్యాకాలు హాస్యరస ప్రధానాలు. హాస్యప్రకృతి కాబట్టి మిగిలిన రసాలు చిత్రించటంలో శక్తిలేదని యెంతమాత్రం అనుకోటానికి వీలులేదు. ఈయన యెంతహాస్యగాడో అంత భక్తుడు. ఈయన రాధాకృష్ణనాటకం భక్తిసిద్ధాంతంలోఉండే శేషశేషిభావానికి పరమాధి అనవచ్చు. "పాదుక" కూడ సర్వ జనాదరణాన్ని పొందినది. హాస్యరస ప్రధానమైన వాటిలో వృద్ధవివాహం, కంఠాభరణం మొదలైనవి ప్రశస్తాలు. కరుడుగట్టిన ఛాందసం, మూఢవిశ్వాసాలు, ఆధునికుల సర్వజ్ఞత్వంమన్యాలూ, మతానికీ ప్రవర్తనకూ సంబంధం లేదనుకోడాలూ, మతం చాటున జరిగే నీతిబాహ్యచేష్టలూ, పాశ్చాత్యులదంతా బాగుందనే తెలివితక్కువతనాలు, మొదలైనవి యీయన విమర్శనానికి గురిఅయినవి. వాటిని పండితపామరజనులకు హృద్యమైన విధంగా విమర్శించినాడు.

అంగ్ల సారస్వతంలో 'ఎడిసన్' అనే ఒకకవి సంఘంలో ఉన్న విషమాలన్నిటిని "స్పెక్టేటరు" అనే పేరుతో పత్రికలో విమర్శించేవాడు. అది పానుగంటివారి నాకర్షించినది. ఆవిధంగా మనసంఘానికి, సారస్వతానికీ, సేవ చెయ్యాలనుకు న్నాడు. "సాక్షి" అనే పేరుతో ఉపన్యాసా[illegible] అవి ఆంధ్ర

పత్రికలో పడేవి. కొన్నిదినాలీ ఉపన్యాసాలాంధ్రపత్రికకు ప్రచారం కలుగజేసినవి అనడంలో తప్పేమీ లేదు. పాఠకులు నోళ్ళుతెరచుకొని చదివేవాళ్లు! ఈ సాక్షి ఉపన్యాసాలకు సర్వకాలంపనికివచ్చే విలువ ఉన్నది. మనస్సుకు ఎంతమాత్రం నొప్పి కలుగజెయ్యకుండా విషయబోధనం చెయ్యడంలో వీనికి సరిఅయినవి ఆంధ్ర సారస్వతంలో లేవు. వీనిలో ఆయన స్పృశించని విషయం లేదు. వేదాంతందగ్గిరనించీ "సోషలిజం" దాకా సర్వవిషయాలూ చర్చించినాడు. ప్రతిఆంధ్రునివద్ద ఉండవలసిన గ్రంథమిది. ఒక్కమారు పుస్తకంపట్టుకుంటే వదలబుద్ధిపుట్టకపోవడమే కాకండా, మళ్ళీ మళ్ళీ చదవాలనికూడా బుద్ధిపుడుతుంది. ఇంక పుస్తకం ప్రశస్తమనివేరేచెప్పవలెనా? జంఘాలశాస్త్రి అనేపాత్ర కవిగారి ప్రతిబింబమే! ఏదిచెప్పినా శాస్త్రినోట చెప్పించినాడు. స్త్రీస్వాతంత్ర్యవాదం, గ్రంథవిమర్శనా పద్ధతి, గ్రామ్యగ్రాంథిక భాషావాదం మొదలైన సాంఘిక సారస్వతవిషయాలన్నీ కూడా యీయన విమర్శకు గురైనవి! తోలుబొమ్మలు మొదలైనవాట్లో హాస్యం కొంచెం ముదురుపాకమని అంటారు. కాని విషయాలు ఊహామాత్రాలు కావు. ఒక్కొక్కప్పుడు కవిచిత్రం కంటె సాక్షాత్తు జరిగిన సంగతి సామ్యానికి పోలిలేకుండా ఉంటుంది! అంతేగాక అసత్యం మొదలైనవి, సంఘంలో అతిగా పాకిపోయినవి. వానినిగూర్చి ఎంత చెప్పినా, ఎలా చెప్పినా తక్కువే అనవలె! మొండివాడికి మొండిమాటలతోనే సమాధానంచెప్పవలె!* ఈయన సప్తతి మహోత్సవం జరిపిందాంధ్రదేశం. తుదివరకు ఈయనను పీఠకాపురాధీశ్వరుడు పోషించి చిరకీర్తిని పొందినాడు. ఈయన యీ శతాబ్దంలోఉన్న గొప్పవ్యక్తులలో ఒకడు.#

* ఈయన వ్రాతలవల్ల సారస్వతానికి రెండు ఉపకారాలు జరిగినవి.

** మలయాళంలోకూడా యీపద్ధతిలో సంఘవిమర్శనాన్ని చేశాడు కుంజన్ నంబియారనేకవి.

"He has woven very cleverly into the fabric of his poems some excellent didacticism, splendid spiteful stuff, satirically humourous. While applies the lash to the evils of contemporary society, effectively, without leaving however any lascerating wound behind. - Hindu 5-1-40

# చూ: శ్రీ కౌతులపట్టిక మొ॥ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. 28. సం. 5.

* 'పానుగంటివారి నాటక రచనాపాటవము' నండూరు బంగారయ్య - భారతి 1935 అక్టోబరు.

(1) నాటకరచనాపద్ధతిలో మార్పు మొదటిది. పాత్రోచిత భాష వ్రాయటమేగాక సందర్భంలో గద్యపద్యావశ్యకతను నిర్ణయించడం యీయన త్రొక్కిన క్రొత్తత్రోవ. ఇంతకు పూర్వం నాటకంలో గద్యానికంటె పద్యాని కెక్కువ స్థానముండేది. ఈ కాలంలో వ్రాసే ఆంగ్లనాటకాలు చూస్తే వానిలో పద్యానికంటె గద్యాని కెక్కువ స్థాన మిచ్చినట్టు కనబడుతుంది. కొన్ని కేవల గద్యనాటకాలే? పద్యమనగానే మననాటకాలలో సంగీతానికి తావుకలుగుతుంది. నటులకు సంగీతంమీద బుద్ధి యెక్కువగా పోతుంది. నాటకానికి ఎంత సంగీతం కావాలా అనేది ఇప్పటికీ నిర్ధారణ కాలేదు. సినిమాలు వచ్చి ఈసమస్యను చాలా క్లిష్టం చేసినవి. సంగీతం ప్రధానంకాక, కేవలపరనమే పరమావధిగాగల శ్రవ్యప్రబంధాలే రసోత్పత్తికి తోడ్పడి పాఠకుల కానందం కలుగజేస్తూఉంటే, సంగీతం ఉంటేగాని నాటకం రక్తికట్టదనే, వాదం యెంతమాత్రం విశ్వాసార్హంకాదు. కాబట్టి తగుమాత్రమైన సంగీతముంటే చాలును అని తేలుతుంది. కీర్తనలు నాటకాని కావశ్యకములా అనేదికూడా క్లిష్టప్రశ్నే. పద్యం అవసరమైతే కీర్తనా అవసరమే! "పద్యభావ గ్రహణాని కవసరమైన సంగీతమే నాటకానికి చాలుననీ, అలాగే కీర్తనకూడా అనీ" పానుగంటివారి వాదం. అందు చేత ఈయన వ్రాసిన తర్వాత నాటకాల్లో పద్యంకంటె గద్యానికెక్కువచోటిచ్చినాడు. ఈయన వానిలో గీతపద్యంచాలాయెక్కువగావాడినాడు. "గీతకవి" అని యీయనకు కొందరు పేరుపెట్టినారు.

(2) రెండవది ఆంధ్రగద్యశైలీపరిణామం. గద్యవలన రసోత్పత్తి కలుగచెయ్య వచ్చునని యీయన ధృవపరిచినాడు. ఈయన చేతిలో గద్య ఒక కొరడావంటిదైనది; ఒక్కొక్కప్పుడు ఈయన గద్యశైలి గంగాప్రవాహంవలె నిరంతరపదధారాసంకలితం. పదాలు ప్రవహిస్తవి. సమాసాలు ఉప్పొంగుతవి. ఒక్కొక్కప్పుడొక్కవాక్యంలో సమాసాలు కుప్పలుగా పడిపోతవి! పెద్దసమాసంకూడా సులభంగా అర్థం స్ఫురిస్తూ ఉంటుంది. చదువుతూఉంటే యెంతమాత్రం విసుగు కలిగించదు. ఈయన గద్యశైలి ఇట్టి విశిష్టగుణాలు కలిగిఉన్నది. ఇంగ్లీషుభాషలో ఉండే భావాన్ని మిక్కిలి హృదయంగమంగాపెట్టి అంతకంటె వన్నె తెప్పించటంలో ఈయన కపరితమైన శక్తి ఉన్నది. పదచిత్రాలు, వాక్యచిత్రాలు కల్పించి, పాఠకుడి హృదయంలో భావచిత్రం

కల్పించడంలో, ఈయన ప్రజ్ఞ అసమానం. మశకమహాసభలో వివిధమశకస్కంధావారాలు వర్ణించడం చదువుతూఉంటే వాటిని చూస్తూఉన్నట్టే ఉంటుంది. ఈయనకున్న భావనాశక్తి చాలా తక్కువమందికి ఉన్నది. బహుగ్రంధరచయిత అయి, యెన్నింటినైనా, ఒకదానిని మించేటట్టు ఇంకొక దానిని రచియించటములో ఈయనతో సమానులెవ్వరూ లేరనవచ్చు.

ఈవిధంగా ఇంకా కొందరు పండితులై, కవులై, అనేక గ్రంథాలను రచించినారు. మధిర సుబ్బన్న దీక్షితులనే ఆయన ప్రచారంలో ఉన్న కథల నన్నిటిని సేకరించి గుదిగూర్చి కాశీమజిలీలనే పేరుతో కొన్నిసంపుటాలుగా ప్రకటించినాడు. రాయజగపతివర్మగారు పెద్దాపుర సంస్థానచరిత్ర వ్రాసినాడు. దానికి విమర్శనముగా కూడా ఒక గొప్ప గ్రంధము వెలువడినది. ఈ విధముగా ఈ కాలంలో ఉద్గ్రంథ రచన జరిగినది.

## మరికొందరు రచయితలు:

పైవారుగాక యీ కాలంలోకూడా అక్కడక్కడ వెనుకటి ఫక్కిని ప్రబంధములు, ఆంధ్రీకరణములు, శతకములు, వేదాంతగ్రంధములు వ్రాసినవారున్నారు. కొందరి నీక్రింద తెలుపుతాను:-

| పేరు | నివాసము | గ్రంధములు కొన్ని |
|---|---|---|
| క్రైప శేషశాస్త్రి, (1882) | కడప జిల్లా, కమలాపురం | ధనలక్ష్మీస్తవము.<br>వేంకటేశ్వర శతకము.<br>దృగ్దృశ్య వివేకము. |
| పోలికి చిదంబర కవి | | వాసవీ విలాసము<br>(ద్వ్యర్థి కావ్యము). |
| అబ్బరాజు హనుమంతరాయకవి. | చావలి. | సుగ్రీవ పట్టాభిషేకము. |
| అన్నప్ప కవి | అనంతపురం | సౌగంధక పుష్పాప హరణము.<br>శశిరేఖాపరిణయము. |

| | | |
|---|---|---|
| రొద్దము హనుమంతరావు. | హిందూపురము. | స్వప్నవాసవ దత్త (పద్య కావ్యము) |
| పనుమర్తి సుబ్బరాజు | రాతన, ప్రత్తికొండ తాలూకా | మాఘపురాణము (పద్యకావ్యము) |
| గంగనపల్లె శంకరరావు | | మోక్షమార్గ ప్రదీపిక. (గద్యము) (భారతసారము) (గద్యము) |
| కనులపురి సీతారాయ కవి. | బద్వేలు | హనుమద్విజయము (పద్యము) |
| గాడేపల్లి వీరరాఘవశాస్త్రి | కర్నూలు. | అహోబిలమాహాత్మ్యము. (పద్యకావ్యము) |
| మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి | నంద్యాల | సత్యనారాయణవ్రత మాహాత్మ్యము (పద్యకావ్యము). |

పైన చెప్పినవారుగాక యింకా శతకకర్తలు లెక్కకు మిక్కిలిగా ఉన్నారు.

పాల్కురికి సోమనాథుడు, బమ్మెరపోతన మొదలగు మహాకవులకు ఆటపట్టు అయిన తెలంగాణంలోకూడా యీ కాలంలో గొప్ప కవులుండేవారనటములో అభ్యంతరం లేదు. కాని యిక్కడి కవులు, పండితులు, ప్రకటన సౌకర్యాలు లేకపోవటముచేతనో, సహజ నమ్రతవలననో, తమనుతాము ప్రకటించుకోలేదు.* యామవరపు రామశాస్త్రి◆ ఒద్దిరాజు సోదరులు#, వరకవి రామదాసు $,

* "మా నిజామాంధ్రులందరికీ వలెనే మాకవి పండితులందరికీ ఒక లోపమున్నది. వారు 'కవి గండభేరుండాలైనా', 'కవి శరభాలైనా, అష్టభాషాకవులైనా', తమ శక్తిని ప్రశంసించుకొనరు... వారిని తడవు కొనేవరకు పలుకరు. వారికి స్వయం ప్రకటన సరిపోదు. వారికి ప్రకటించే వారున్నూలేరు. ఈ కారణాలచేత ఇది అజ్ఞాతదేశమై పోయింది." (29-10-42 గోలుకొండ పత్రిక)

◆ "శ్లేష యమక చక్రవర్తి, అభినవ తిక్కన్న" తిక్క వదిలించే కవిప్రకాండులు

# 'శైలిలో మంచి ఖదంతొక్కే జోడుగుర్రాలు. (వీరిలో ఒకరు) శ్రీ నాథుని కవితను ఢీకొనే సాహసుడు".

$ "రామదాసును మించిన కవిత నల్లినాడు."

శేషభట్టర్ వెంకట రామానుజాచార్యులు @, బి.వి. శ్యామరాజు, రామరాజు సోదరులు❑ ఉదయరాజు శేషగిరిరావు✸ లటువంటివారు.

## చివుకుల అప్పయ్యశాస్త్రి :

చివుకుల అప్పయ్యశాస్త్రి గారు ఒక యెన్నదగిన వ్యక్తి. ఈయనకు సనాతన ధర్మమన్న ప్రాణము. దానికి తన ధనప్రాణాలు ధారపోస్తున్నాడు. "దివ్యవాణి" అనే పేరుతో ఒక ధార్మికవారపత్రికను నడుపుతున్నాడు. పండితుడు. కవి. గర్గ భాగవతమును సంస్కృతంనుంచి తెనుగులోకి చక్కని ఉదాత్తరసవచ్ఛైలిలో భాషాంతరీకరించినాడు. చాలా శ్రమచేసి శ్రాద్ధతత్వమును సప్రమాణముగా నిరూపించి వాటిపై ప్రత్యయమును నెలకొల్పినాడు. ఈ కాలపు దురాచారములన్నిటిని ఉపదేశిస్తూ పరమేశ్వరునిపేర ' వెంకటేశ విన్నపము' లని శతకశ్శైలిలో రచించినాడు. ఇంకా బాలబాలికలకు ఉపయుక్తమయ్యే పద్యములను సేకరించి ప్రచురించినాడు. 'పురాణము' లనే గ్రంధము వ్రాసినాడు. గద్యరచనలో కూడా మంచిదిట్ట.

## పత్రికలు - అనువృత్తి :

వెనకటికాలపు పత్రికలు చాలా యీ కాలంలోకి అనువృత్తాలయినవి. అవిగాక కొన్ని నూతనంగాకూడా బయలుదేరినవి. ఈ పత్రికాసంచలనం ఆంధ్రదేశంయొక్క అన్ని భాగాలనుంచీ కలిగినట్టు కనపడుతున్నది. రాయలసీమలో, తెలంగాణంలో కూడా యీ పత్రికా ప్రచారము వెలువడినది. వీనిలో మాసపత్రికలు, పక్షపత్రికలు మొదలైన అన్నిరకాలు ఉన్నవి. కొందరు దూరదర్శులు తెనుగువారికి ఒక దినపత్రిక ఉంటే బాగుండునని హృదయాలలో ఉవ్విళ్ళూరుతున్నారు. అటువంటి పనికి దేశకాల పాత్రాలుకూడా కావలెనుకదా? అందులకు గొప్ప మనోబలముకల వ్యక్తికూడా కావలసి ఉన్నాడు. అట్టి దిన పత్రిక దాని స్థాపనోదంతము, తరువాత

@ "చక్కని హాస్యకవిత్వము వ్రాసినాడు".

❑ "హరికథలలో ప్రవీణులు".

✸ "అపర చేమకూర".

(Ibid).

ముచ్చటిస్తాను. ఈ కాలంలో వరలిన * కొన్ని పత్రికలను క్రింద పేర్కొంటాను:-

| | | |
|---|---|---|
| ప్రాచి | 1909 | యన్. వి. రాయచంద్రయ్య అయ్యర్, మద్రాసు |
| అభినవభారతి | 1911 | అబ్బరాజు హనుమంతరావు, వేజెండ్ల |
| అనసూయ | 1917 | వింజమూరి వెంకటరత్నమ్మ, కాకినాడ. |
| అభినవసరస్వతి | 1908 | జానపాటి పట్టాభిరామశాస్త్రి, జానపాడు. |
| ఆంధ్రభారతి | (1910-12) | అయ్యంకి వెంకటరమణయ్య, బందరు. |
| ఆంధ్రకేసరి | 1913 | చిలుకూరి వీరభద్రరావు. |
| ఆంధ్రచంద్రిక | 1914 | బి.యన్. స్వామి,ప్రొద్దుటూరు. |
| ఆంధ్రజనని | 1919 | బి.వి. కృష్ణరావు. |
| ఆంధ్రదేశోపకారి | 1918 | నేలటూరు రాఘవయ్యంగారు. |
| ఆంధ్రవారపత్రిక | 1911 | కాశీనాధుని నాగేశ్వరరావు, బొంబాయి. |
| సుదర్శిని | (1906-28) | కస్తూరి శివశంకరరావు, నరసాపురము. |
| ఆంధ్రసంరక్షణి | 1913 | గోవిందరాజు హరిశ్చంద్రరావు |
| ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక | 1912 | జయంతి రామయ్య |
| ఆంధ్రసేవ | 1913 | అద్దంకి బిందుమాధవరావు |
| ఆంధ్రసేవ | 1917 | ఏ. మాధవశాస్త్రి |
| రామకథాసుధ | 1918 | పి. సుబ్రహ్మణ్యాఅయ్య, చిత్తూరు |
| విజ్ఞానవల్లరి | 1915 | శంకరరావు |
| విద్యానిధి | 1915 | అప్పయ్యశర్మ |
| సాహిత్యప్రకాశిని | 1912 | జి. సోమయాజివర్మ |
| హితబోధిని | 1913 | చి. శ్రీనివాసశర్మ |
| ఆంధ్రమాత | 1917 | స్వామి వెంకటరావు |

ఈ వింశతి సంవత్సరాల తర్వాత పుట్టినట్టి, అంతమొందినట్టి పత్రికలకు లెక్కలేదు. అవన్నీ వ్రాయవలెనంటే గ్రంథ విస్తరమౌతుంది. నవ్యసాహిత్యం కొరకు మాత్రమే పుట్టినవానిని అచ్చటచ్చట పేర్కొంటాను. ఇంకా యే విశిష్టతకలవైనా అయితేకూడా అవసరంకొద్దీ ఉల్లేఖిస్తాను. తర్వాత పుట్టినవాటిలో ఎన్నిదగినవాటిని కొన్నిటిని యిక్కడ స్పృశిస్తాను :

| | | |
|---|---|---|
| పినాకిని | 1922 | పప్పూరి రామాచార్యులు |
| సాధన | 1955 | డిటో |

* భారతి, మే, 1929 - జూన్, 1930

◆ భారతి, మే 1929; జూన్ 1930

| | | |
|---|---|---|
| బాలభారతి | 1922 | అనంతగిరి పేరనార్య |
| గోలకొండ పత్రిక | 1926 | కపి |
| దేశబంధు | 1926 | వెల్లంకొండ నరసింహాచార్యులు |
| నీలగిరి | (1922-29) | నరసింహాచార్యులు |
| ఆంధ్రాభ్యుదయము | (1929-28) | కోటి సీతారామశర్మ, నెల్లూరు* |
| జమీ రైతు | ... | .. |

ఈవిధంగా పత్రికలు వెలసినవి. ఇందులో కొన్ని ప్రత్యేక విషయముల కొరకు పుట్టినా వాఙ్మయానికి స్థానమియ్యని పత్రిక లేదు. కాబట్టే యివి అన్నీ సారస్వతసేవ చేసినట్లే భావించవలె.

* Ibid

ఇప్పుడు చిత్రనళీయ ప్రదర్శనము మోటు అయిపోయినది. దాన్ని ఆడి రక్తికట్టించగల నటకులూ మృగ్యమైపోయినారు. ఒకకాలంలో చిత్రనళీయానికి చాలా గౌరవం ఉండేది. బాహుక పాత్రధారణం నాట్యశక్తికి పరమావధిగా ఉండేది.* బాహుక విలాపఘట్టము చాలా గంభీరము. కాని హరిశ్చంద్రలోఉండే కరుణరసముతో పోల్చటానికి వీలులేదు. కధావస్తువులో పూర్వాపరాలకు ఒకవిధమైన వైధర్మ్యం ఉండటమూ, తత్పోషణమూ నాటకానికి ఉదాత్తత నిచ్చి రసవంతం చేసి సామాజికులలో ఉండే సానుభూతితంత్రులను మ్రోగించి వారిని తన్మయులను చేస్తుంది. ఉత్తమనాటకాలన్నీ అంతే! మన భాషలోనే కాదు. ఇతర భాషలో కూడా అంతే!

పై నాటకాలుగాక తిరుపతి వేంకటేశ్వరుల 'పాండవవిజయాది' భారత నాటకాలు, వసురాయల 'వేణీసంహారం' భారతకథ ననుసరించి రచింపబడినవి. కాని వీటిలో వేణీసంహారం భాషాంతరీకరణం. దీనిని కూడా వీరెశలింగంగారి అభిజ్ఞాన శాకుంతలంతో చేర్చవచ్చు. ఉత్తమమైన భాషాంతరీకరణము. వీటి రెంటిలో తారతమ్యచర్చ చేస్తే వేణీసంహారమే కొంచెముమించినదని చెప్పవలె! కాళిదాసుకంటే భట్టనారాయణకవి సామాన్యకక్ష్యకు దగ్గిరవాడు! అందుచేత అతడు వ్రాసినది సులభముగా పరివర్తనము చెయ్యటానికి వీలు అయినది. కాని కాళిదాస వాక్యాలక్రింద ఉండే విశేషాలు పరివర్తనకు అందేవికావు! వానిని మాతృకలో చదివి ఆనందించవలసినదే!

భాషను పరివర్తనము చెయ్యడానికి వీలున్నదిగాని, తద్విశిష్ట చమత్కారము పరివర్తనంలో ఎలా వస్తుంది? ప్రతి భాషాంతరీకరణానికీ ఉన్న లోపమిదే! కాని మాతృకను వ్రాసినకవి ఉత్తమకక్ష్యకు చెందక, మనకు సమీపముగా ఉంటే కొంచెం సులభము! షేక్సిపియరు నాటకాన్ని ఒకదానిని దానిలో ఉండే సమస్తరసము వచ్చేటట్లు భాషాంతరీకరించమనండి! అది మరీకష్టం! మన తెనుగులోనికి వచ్చిన సంస్కృత గ్రంథభాషాంతరీకరణాలకు ఒక ప్రత్యేక సౌకర్యం ఉన్నది. అదేమిటంటే పదజాలం మాతృకదే అనుసరించవచ్చు! ఇతర భాషల సంగతి అలా కాదు.

* ధర్మవరమువారే బాహుకపాత్రధారణము చేసేవారట.

అనువాదాలలో ఉన్న వైశిష్ట్యమది. అందుచేతనే తిక్కన పోతనాదులు చేసిన భాషాంతరీకరణాలు యధామాతృకాలు కాకుండా స్వేచ్ఛానువాదాలు! అక్కడనే వాళ్ళ ప్రతిభ చూడవలె!

పాండవవిజయం ఇతివృత్తం సూత్రం భారతంలోనిదే! కాని నాటకానికి వలసిన స్వల్పమార్పులను చేసి తిక్కన భారతరచనలో ఎంత ప్రతిభా, కళాకౌశలమూ చూపించినాడో అంత ప్రతిభా చమత్కారాలనుపయోగించి రచించారు ఈ కవులీ నాటకం. పాండవవిజయనాటకం ఆంధ్రభాషకు ఒక అమూల్యాలంకారము. వారి సారస్వతసంచారానికి మకుటాయమానమైన గ్రంధం! దీనిలో రసవంతం కాని ఘట్టము లేదు! ఎట్టి మార్పు చెయ్యకుండా, యేమాత్రము వదలకుండా రంగంమీద నాట్యమాడడాని కనువైనది! ఇదే చాలు కవులు చూపిన కౌశలానికి ఉదాహరణము!

ఇక శ్రీపాదవారి బొబ్బిలి, వేదంవారి ప్రతాపరుద్రీయం, రెండూకూడా చారిత్రక నాటకాలు. దేశంలో ప్రచారంలో ఉన్న చారిత్రక విషయాలను సంగ్రహించి, వానికి నాటకవాతావరణ మిచ్చి చక్కని నాటకాలుగా ప్రదర్శనయోగ్యాలుగా, రచించడము సామాన్యకార్యము కాదు. వీనిలో బొబ్బిలి వీరగాథ ననుసరించినది. ఆంధ్రులకు, పల్నాటి వీరగాధ, బొబ్బిలిగాథ, ఇంకా ఇటువంటి స్థానిక గాథలు చాలా ప్రియమైనవి. ఇవి హృదయోత్సాహ జనకాలు. తత్రాపి జానపదులకు చాలా ఆకర్షకాలు. అట్టి వాటిని నాటకాలుగా రచించడము ఈ వీరగాథలను సారస్వతంలోకి తేవడమన్నమాట! పట్టణవాసులు ఈ వీరగాధల నెక్కువగా ఎరుగరు. వానిని వీరు చదవడానికీ, ప్రదర్శించడానికి యోగ్యమైన సారస్వతవీధిలోకి తేవడం వీరు చేసిన విశేషము. నవలలు, నాటకాలు, జాతిచరిత్ర ప్రతిబింబకాలైనప్పుడు వానికీ విలువ చాలా హెచ్చు. బొబ్బిలిపాటను నాటకంగా రచించి సారస్వతశోభ కలగజేసినందుకు శ్రీపాదవారికి యావదాంధ్రదేశమూ కృతజ్ఞం. ఇట్టి నాటకాలింకా వెలువడవలె! వేదంవారి ప్రతాపరుద్రీయం కాకతీయ సామ్రాజ్యానికి సంబంధించి, చాణక్యుడి తర్వాత రాజనీతికి గురుపీఠమైనట్టీ, ఆంధ్రుడైనట్టీ యుగంధరుడి ప్రతిభనూ, రాజనీతినీ, ప్రతిబింబింపజేసిన నాటకం. దీనిలో ఉన్న కొన్ని విశేషాలు వెనక మనవి చేసినాను,

పైవిగాక యిక యీతరంలో ఆంగ్లాంధ్రులకు చాలా ప్రియమైనది ఒకటి ఉన్నది. కన్యాశుల్కం* చాలా గొప్ప సాంఘిక నాటకం. ఇందులో కవి ఉద్దేశ్యం, పరిస్థితులను ఉన్నవాని నున్నట్టు చిత్రించటం! ఈపని చాలా గొప్పగా నిర్వర్తించినారు. అప్పట్లో తనవంటి ఆంగ్లాంధ్రులకు సంతోషదాయకం "గిరీశం" పాత్రను సృష్టించినాడు! ఆంగ్లం చదువుకున్న - అందులో గోదావరి దాటిన - ఆంధ్రులకు గిరీశం ఉపలక్షకుడు. వారు పూర్వాచారపరాయణులను హేళన చెయ్యటం, అకార్యకరణాలకు వెనుదీయకపోవటం, వ్యభిచారం, ధనార్జనలో మోసం చెయ్యటం, సంఘసంస్కార మనేపేరుతో పాపకార్యాచరణం, స్వార్థపరత్వం, అంతరాత్మను జేబులో దాచుకొనటం, తుదకు దేవుడిని హేళన చెయ్యటం, మొదలైన అనేక గుణాలను చాలా హృదయంగమం గానూ, అభిమానవంతునికి మనస్సు గుచ్చుకునేటట్టూ, సహజముగానూ వర్ణించినాడు.◆ ఇది గొప్ప హాస్యప్రధానమైన సాంఘిక నాటకం. కాని ప్రతాప రుద్రీయాన్ని, దీన్నీ తారతమ్య చర్చ చెయ్యవలసివస్తే కొన్ని విషయాలు చెప్పవలె. కన్యాశుల్కం మొదటి భాగమంత ఉత్తేజకరంగానూ, రసవంతంగానూ లేదు తుదిభాగం. పరిణామంలో కొంత అల్లరి ఉన్నది. ప్రతాపరుద్రీయ (1897) మల్లాకాదు. ఆమూలాగ్రంగా ఉత్తేజకరమూ రసవంతమూనూ! తుది వరకు కథలో యెక్కడా తీవ్రతగాని, రుచిగాని, తగ్గదు! నీతిదాయకత్వ విషయంలో ఒకటి సంఘ నీతికీ, రెండోది రాజనీతికీ ప్రాముఖ్య మిచ్చినవి. కాని కన్యాశుల్కము నిర్వహించిన సంఘనీతికంటె, ప్రతాపరుద్రీయము నిర్వహించిన రాజనీతి సమంజసమూ, సమగ్ర పరిణామవంతమూను! ప్రదర్శనమంతా చూచిన వారి హృదయాలలో ప్రతాప రుద్రీయము కలుగచేసే ప్రాభవము కన్యాశుల్కము కలగచెయ్యదు. పై అన్నిటికంటె విశేషమింకొకటి ఉన్నది. కన్యాశుల్కాన్ని సకలాంధ్రజనమూ చూచిగాని చదివిగాని

---

* ఈ నాటకము కన్నడభాషలోకి పరివర్తితమైనది.

◆ "ఆంధ్రుల హృదయముల నాకర్షించిన నాటకములలో కన్యాశుల్కము అగ్రగణ్యము... 'గిరీశము' పేరు ఆంధ్రదేశములో జనరూఢమైనది. ఏయే గుణములు కన్యాశుల్కములోని గిరీశమునకు కలవో, అందులో డంబములు పల్కుతూ నలుగురిని మోసపుచ్చి వేషమును వేస్తూ ఉండే లక్షణములు గలవానిని గిరీశమనడం వాడుకలోనికి వచ్చినది కన్యాశుల్క నాటకము మూలబడినా గిరీశం పేరు మాత్రం శాశ్వతంగా నిలిచి ఉంటుందని చెప్పవచ్చును." -భారతి.

ఆనందించలేరు. అది ఆంధ్రాంగ్ల మిశ్రం! అందుచేత ఆంగ్లంరాని ఆంధ్రులు రసాస్వాదనం చెయ్యలేరు. ఇది ఒక గొప్పలోపం. ఈ కాలములో కావ్యాలనూ, నాటకాలనూ, వ్రాసేవారు దృష్టిలో లేరు. మళ్ళీ చెప్పుకోటం సామాన్య ప్రజాజీవనం వెనుకటి సారస్వతంలో ప్రతిబింబించటం లేదని! ఆంగ్లవిద్య తెలిసినవారు చాలా తక్కువ. ఇంతకంటె సంస్కృతమాటలు అర్థం చేసుకోగలవారి సంఖ్య చాలా యెక్కువ. ఈవిషయం వెనక ఒక సందర్భములో మనవి చేసినాను. నాటకమంతా యిలా లేదే అనవచ్చు! ముఖ్యపాత్ర ఐన గిరీశ పాత్రనే అర్థం చేసుకుని రసాస్వాదనం చెయ్యలేకపోతే ఇకనేమున్నది? పానుగంటివారి హాస్యప్రధాననాటకాలు ఇంతకంటె అధిక సంఖ్యాకులను తృప్తిపరచగలవు. కంఠాభరణం చూడండి. అందులో ఉన్న హాస్యాన్ని, నవ్యులూ, పురాతనులూ అందరూ ఆస్వాదించగలరు. కాబట్టి యీ సంకుచితత్వం, ఏకదేశిత్వం దానికి చాలా విలువ తగ్గించినదని గట్టిగా చెప్పవచ్చు.*

పానుగంటివారి "రాధాకృష్ణ" భక్తి రసప్రధానమైన నాటకం. ఇందులో గ్రంథకర్త భక్తిరసాన్నీ శేషశేషిభావాన్నీ పరాకోటి కెక్కించినాడు. "రాధాకృష్ణ" లో కొన్ని పద్యాలు చదువుతూ ఉంటే గ్రంథకర్తగారికే ఆనందబాష్పాలు వచ్చేవి. ఆయన తాను రసాన్ని అనుభవిస్తూ వ్రాసినాడు. ధన్యుడైనాడు. కృష్ణునకు ఇతర నాయికా సంగమంతో కలిగిన శృంగార చిహ్నాలు చూచినప్పుడు రాధ కండ్లు మూసుకుని చూడలేకపోవటం

---

* విక్రమభాద్రపదం భారతిలో ఒక విమర్శకుడు కన్యాశుల్కాన్ని సమీక్షస్తూ యిలా అన్నాడు:-

"నిస్సందేహంగా, ప్రాపంచిక వ్యాపారాలను, మానవ చిత్త వృత్తులను చూపరకు సరియైన దృక్పథంలో నిలిపి నిరూపించడమే సారస్వతానికి ముఖ్య ఆదర్శం కదా?"

కన్యాశుల్కం దృక్పథం సరియైనదేనా? ఈ విమర్శక వాక్యాలు "రియలిజం"కూ మనస్తత్వానికీ సంబంధించినవి. ఇంకా యిలా అన్నాడు :-

"అందరిని రంజింపజేయడమే సారస్వతం యొక్క ముఖ్యధర్మమని మనం వప్పుకుంటే, కన్యాశుల్కం - పండితులను, పామరులను, స్త్రీలను, పురుషులను, ఆబాల గోపాలాన్ని ఆనంద పరిచింది. పరుస్తున్నది, యికముందు పరుస్తుంది." ఇది తప్పక అతిశయోక్తి. "ఇంగ్లీషు తెలిసిన" అనే విశేషాన్ని వెనకటి దానికి కలిపితే ఈ విమర్శకుని సంఖ్య సగంకంటె తగ్గిపోతున్నది! ఈ విమర్శకునకు ఇంగ్లీషు రానివారు బుద్ధిలో లేరు!

దగ్గిర ఆధునిక కవి కుమారుని ప్రేమ పావిత్ర్యమూ, అమలిన శృంగారమూ తలపునకు వస్తుంది. రాధకు శృంగారార్చనమే పరమావధి అయినట్టు కనపడుతుంది. ఇక 'చింతామణి' నాటకంలో వస్తువు చాలా రసవంతమూ, హృదయంగమమూనూ. భావచిత్రణంతో ఎక్కువ కౌశలం చూడకపోయినా కథావస్తువులో ఆద్యంతాలకు ఉండే వైధర్మ్యమూ, తత్సహకారవిషయాలూ, నాటకరసపోషణంలో చాలా ఉపకరించినవి. ప్రథమ శృంగారమూ తర్వాత భక్తీ ప్రజాజీవితానికి చాలా సన్నిహితాలు. మనజాతి చిత్తవృత్తికి స్వభావసిద్ధమైన మతాభిమానమూ, ఆస్తిక్యమూ, చిన్నతనంలో కొరవడినా భగవత్కటాక్షంచేత వెనుకకు తిరిగి సంపూర్ణభక్తి కలగటమూ, మొదలైనవి నాటకానికి ఆహ్లాదకరత్వ మిస్తున్నవి. వాని ద్వారా ప్రజలాకర్షింపబడుతున్నారు. ఈ విషయంలో "సక్కుబాయిని" కూడా యెన్నవచ్చు. ప్రహసనాలను ఎక్కువగా ఉల్లేఖించ నవసరం లేదు. అవి ఫలహారాలవంటివే గాని కడుపునింపి శరీరాన్ని పోషించే భోజనం వంటివి కావు. ఈ కాలం తర్వాత నాటకాలపోకడ చాలా మారింది. ఆ మార్పును తర్వాత కనుగొందాము.

## నాటకప్రదర్శనం : కొందరు నటులు :

నాటకవీథి సాహిత్యక్షేత్రంలో ఉత్తమ వీధి. "కావ్యేషు నాటకం రమ్యం" అనినాడు లాక్షిణికుడు. ఆంగ్ల సారస్వతంలో కూడా పురాణేతిహాసిక కావ్యాలకు ఎట్టి స్థానమున్నదో అట్టి స్థానమే నాటకానికి కూడా ఉన్నది. నాటకమనగానే అది నటించ వలసినది కాబట్టే వెంబడే ప్రదర్శనం కూడా వస్తుంది. ఉత్తమ నాటకాలు ఉత్తమ నటులచేత ప్రదర్శింపబడితే, నాటక పఠనమేగాక తద్దర్శనము కూడా సామాజికులను రసనిమగ్నులను చేసి చిత్తవృత్తిని మార్చివేయ శక్తి కలిగి ఉంటవి. దృశ్యకావ్యాల ఉద్దేశమే ఇది. "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం'' అనినాడు కాళిదాసు. ఈ విధమైన దృశ్యకావ్యగ్రంథరచన యెప్పుడు విరివిగా సాగుతుందో అప్పుడే యీ ప్రదర్శనాలు కూడా విరివి అవుతవి. ఈ కాలంలో అలాగే

అయింది.◆ వెనుకటితరంలో కూడా కంపెనీలు ఉండేవి. 1902 [illegible] చదువుకునే కొల్లూరనే గ్రామంలో విజయనగరమునించో [illegible] కంపెనీ వచ్చినది. అది నా చిన్నతనం అవటంచేత అంత జ్ఞాపకం [illegible] అంబడిపూడి కోటయ్య, కీ॥శే॥ ముప్పిడి జగ్గరాజుగార్లు ముఖ్యపాత్రధారులు [illegible] జగ్గరాజుగారి స్త్రీపాత్రధారణం అత్యద్భుతం. పాతివ్రత్యం [illegible] అభినయించటంలో ఆయనకుసాటి ఆంధ్రదేశంలో లేరు. ఆయన [illegible] హస్తం, ముఖవిన్యాసం, శిరఃకుంచనం మొదలైనవి నా హృదయంలో [illegible] గ్రుద్దినట్లున్నవి! చంద్రకాంత, హరిశ్చంద్ర, చిత్రనళీయం మొదలైన [illegible] ఆయన స్త్రీపాత్రధారణం అప్రతిమానం. రాజమహేంద్రవరంలో [illegible] కంపెనీ, గుంటూరులో ఫస్టుకంపెనీ, బందరులో బుఱ్ఱావారి [illegible] కంపెనీలు, బెజవాడలో కొన్ని యిలా ఉండేవి. ఒక్కొక్క [illegible]

---

◆ "తాళ్లూరి నరసింగరావు పంతులుగారు ఆంధ్రదేశంలో [illegible] నుంచీ వాటికి తన సేవ నిచ్చినాడు. ఈయనకు 'ఆంధ్రనట [illegible]' మనవారు ప్రసాదించినారు. వీరిని 'దాదాజీ' అని పిలుస్తారు. ఈయన [illegible] గారి మన్నన పొందినాడు. వీరిది కూడా మొదట బళ్లారి పురమే! [illegible] దాదాపు 60 సంవత్సరాలకు పూర్వం నించీ యీయన అభినయించారు. [illegible] నాటకంలో పాత్రధారణం చేశాడు. మొదట వీధినాటకాల్లో వేషం [illegible] తర్వాత ధార్వాడ కంపెనీ ఫక్కిన హిందీనాటకాల్లోనూ, తర్వాత తెలుగు [illegible] ఈయన ఈమని లక్ష్మణస్వామిగారికి సమకాలికుడు. ఆయనంత [illegible] లో కలవాడు. ఆయనతో కూడా 'శివాజి', 'రసపుత్రవిజయం', '[illegible] నారాయణరావు', 'విశ్వామిత్ర తపోభంగం' మొదలైన వాట్లో [illegible] ఆంధ్రదేశంలో అన్నిప్రాంతాలు తిరిగి నాటక కంపెనీలను స్థాపింపజేసి [illegible] బళ్ళారి కృష్ణమాచార్యులుగారిని కూడా నాటక రచనకు ప్రోత్సహింపజేసి [illegible] ఇమ్మానేని హనుమంతరావునాయుడు (1854-1913) [illegible] హరిప్రసాదరావుగారు మొదలైనవారు వీరివద్ద నేర్చుకొనిరి. [illegible] అసమానుడు. దేవులపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు కూడా [illegible]

— [illegible]

సుప్రసిద్ధ నటులుండేవారు.* అప్పట్లో నే నెరిగినంతవరకు నటులలో ఈమని లక్ష్మణస్వామి, హరి ప్రసాదరావుగార్ల పేర్లు చెప్పి మరో పేరు చెప్పవలసినదే ! లక్ష్మణస్వామిగారు నటుడేగాక దేశభక్తుడు. హిందీభాషలో గొప్ప విద్వాంసుడు. హిందీ సర్వభారత భాషగా ఉండవలెనని మొదట కనుక్కున్న వాళ్ళలో ఈయన ప్రథముడనవచ్చు! దీనితోనే ఆయన దేశభక్తి తెలుస్తుంది. అప్పటికి హిందీ ఉద్యమం లేదు. ఈయన చారిత్రక నాటకాలలోనే పాల్గొనేవాడు. సంగీతం బొత్తుగా రాదు. అందుచేత హిందీ నాటకాలు తాను రచించి అవి అభ్యాసం చేయించి వానిని ఆడేవాళ్లు "పీష్వా నారాయణరావు వధ" "శివాజీ" మొదలైన నాటకాలు ఆడితే జనం అసంఖ్యాకంగా వచ్చి చూచేవాళ్ళు. "పీష్వా నారాయణరావు వధ"లో "సుమేర్‌సింగు" వేషంవేసి ఆయన నటిస్తే ప్రపంచం మరిచేవాళ్ళు. రౌద్ర వీరరసాలు చూపించటం, నాటకం చూచినతర్వాత కొన్ని దినాలదాకా మరవటానికి వీలుండేది కాదు! ఒక్క కంటితిప్పులో శృంగారంనించి వీరం, వీరంనించి శృంగారం మారేది ! ఒకమారు అనగా 1907 సంవత్సరంలో బందరు బిపిన్ చంద్రపాల్‌గారు వచ్చినపుడు శివాజీనాటకమాడినారు. దానికి పాల్‌గారు కూడా వచ్చారు. దేశభక్తిని గూర్చి లక్ష్మణస్వామిగారు హిందీలో ఉపన్యాసమిచ్చేటప్పటికి, అది విని ఆయన ఆశ్చర్యపడినాడు. మళ్లీ ఆయన తర్వాత యెంతమంది ప్రయత్నించినా నటించినా, ఆయన ప్రతిభా, నిర్వహణమూ, రాలేదు. ధన్యజీవి !

హరిప్రసాదరావుగారు 1936 వరకు జీవించినాడు.◆ హరిశ్చంద్రపాత్ర ఈయన ధరించి నటిస్తూఉంటే "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం' ' అనవలసినదే. ఎంతగుండె ధైర్యమున్నవాళ్ళు కూడా ఏడువ వలసినదే! నలుడు,

* బళ్ళారి సరసవినోదినీసభ ఇంకానే ఉన్నది ఇది కృష్ణమాచార్యులగారిచే స్థాపింపబడినది. ఈ పట్టణాన్ని అంతకుపూర్వం 20 సంవత్సరాలనించే నాటక కంపెనీలుండేవని వినికిడి. బందరులో [illegible] ఒక కంపెనీ ఉండేదిట ! అందులో మా మామ [విష్ణుభొట్ల [illegible]] గారు కూడా నటించేవాడని ఆయన చెబుతూ ఉండేవాడు. రాజమండ్రిలో [illegible], బందరులో కాశీనాథుని నాగేశ్వరరావుగారు [illegible] యాములైనట్టు [illegible] !

◆ హరి[illegible] జీవితాన్ని ప్రజామిత్రలో శ్రీ [illegible] ము.

సారంగధరుడు, హరిశ్చంద్రుడు, ఈయన అభిమాన పాత్రలు, బహుస్వల్పాంశములు అనగా, నిలువటం, చేతిని కదల్పటం. అడుగు వెయ్యటం మొదలైన వానినించీ కూడా యేసన్నివేశంలో యెలా చెయ్యవలెనో అక్కడి సందర్భాన్నిబట్టి సమంజసమైన పద్ధతి ననుసరించి నటించేవాడు. వీనిలో ప్రతిదఫా భేదం ఉండేది. కళాభిజ్ఞుడికి వీనిలో మార్పు తట్టుతూ ఉంటుంది. ఇక్కడ ఒక రహస్యమున్నది. కొందరు తమ పాత్రను బాగా చదివి ఆలోచించి ఎప్పుడెలా అభినయించవలెనో యేర్పాటు చేసి పెట్టుకొని వాని ప్రకారం అభినయిస్తూ ఉంటారు. ఎప్పుడు చూచినా ఆసన్నివేశంలో అదే అభినయం సినిమా చిత్రం క్రిందికి దిగుతుంది ! "వన్సుమోర్" అని ప్రేక్షకులు కేకవేస్తే తెలుస్తుంది వీరి తెలివి! అట్టి దానిలో జీవం ఉండదు! గ్రామఫోను ప్లేటు పాటూ, సినీమా చిత్రమూ, ఎటువంటివో అదీ అటువంటిదే ! కాని ఉపజ్ఞ, ప్రతిభ గల నిజమైన నటుడికి అలా ఉండదు. ప్రతిప్రదర్శనములోనూ, కొన్ని స్థలాలలో మార్పు కనుపడుతుంది. ప్రతి లలితకళా సాధకుడికి ఉండేదే ఇది ! హరినాగభూషణంగారి పాటవిన్నవాళ్ళ నడిగితే ఒకప్పుడున్నట్టు మరి ఒకప్పుడుండదని చెబుతారు. ఎప్పుడూ ఆనందమే కలుగుతుంది. కాని దానిలో తారతమ్యమున్నది ! "రక్తికట్టింది" అనే మాటలో అర్థమిదే! ఇట్టికళ సజీవం! కాబట్టి నటకులలో కూడా యిలా "రక్తి కట్టించే" వాళ్ళు చాలా తక్కువ సంఖ్య. సినిమాకళకూ సాక్షాదభినయానికీ భేదమెట్టిదంటే ఒకటి నిర్జీవమూ, రెండవది సజీవమూను! లక్ష్మణస్వామి, హరిప్రసాదరావు గార్ల* అభినయం అట్టిది! ఉపజ్ఞసహితమైనది! కొందరు మనవాళ్ళు నాటకములో పాత్రధారి, పాత్రయొక్క సుఖదుఃఖాల్లో ఐక్యమైతే తప్ప సరిగా నటించడని అంటారు. ఈ విషయం మన పూర్వలాక్షణికులు చర్చించి రసం సమాజిక నిష్ఠమే కాని నటనిష్ఠ మెంతమాత్రం కాదని సిద్ధాంతీకరించినారు. నటుడు రసాన్ని అనుభవించేటట్టు

---

* "... కోర్టులో ఉద్యోగిగా ఉంటూ ఉండేవారు. ఎప్పుడూ బీదతనమనుభవిస్తూ ఉండేవారు, డబ్బు సంపాదిస్తూ కూడా .....

... పద్యాన్ని ఏవిధంగా యెక్కడ విరవాల్నో, యేరాగాన్ని యెంతగా దానికి ప్రయోగించాల్నో ఆమహానుభావుడికి ఒక్కడికే తెలుసును. ఔచిత్యమంటే ఏమిటో ఆయనే రుచి చూపించియున్నారు ఆంధ్రనాటకలోకానికి. నామనోవీధిని, లక్ష్మణస్వామిగారి తర్వాత, ఉత్తమ నటులలో ప్రసాదరావుగారే గోచరమౌతూ ఉంటారు." - గోవిందరాజుల, నవోదయ, 3-4-1946

అయితే నృసింహస్వామి హిరణ్యకశిపుడి పొట్ట చీల్చవలసినదే! హరిశ్చంద్రుడు చంద్రమతిని చంపవలసినదే! నటుడు తాను నటిస్తున్నాని యెన్నటికీ మరవకూడదు! ఆయా సన్నివేశాలలో తాదాత్మ్యం పొందినట్టు నటించవలసినదే! కాని పాత్రయొక్క అంతస్సును మాత్రం ప్రవేశించి తన అభినయాన్ని సంస్కరించుకొనవలె.*

కంపెనీలు ప్రథమదశకంలోనివి రెండోదశకంలోనికి కొన్ని అనువృత్తి వచ్చినవి. కొన్ని నూతనంగా బయలుదేరినవి. క్రొత్తవానిలో రాజమండ్రిలో నాగేశ్వరరావుగారి కంపెనీ, బెజవాడ మైలవరంరాజా గారి కంపెనీ, తెనాలి రామవిలాససభా, ఏలూరు మోతేవారి కంపెనీ కొన్ని ముఖ్యమైనవి. ఇవి ప్రత్యేకంగా నటులకు వేతనాలిచ్చి పోషించిన సంస్థలు. నాటకకళకు చాలా దోహదమిచ్చారీ సంస్థాపకులు. మోతేవారికేమి, మైలవరంవారికేమి, జమీందార్లు! పాపం! భాగవతుల రాజగోపాలంగారు◆ తమ నిజమైన కళోపాసనతో గరీబైపోయినాడు. సరస్వత్యుపాసన చేసేటప్పటికి లక్ష్మి

* ఈ సంగతినిగూర్చి హరిప్రసాదరావుగారి అభినయం నుంచీ ఒకడుదాహరణ మిస్తాను. ఒకమారు బెజవాడలో నాటకపోటీ జరిగినది. అనేక కంపెనీలు పోటీ చేసినవి ఎవ్వరి అభినివేశంగల నాటకం వాళ్ళు ఆడినారు హరిప్రసాదరావుగారుకూడా తమ కంపెనీతో పోటీ చేసినారు. నాటకప్రదర్శనం మొదలుపెట్టినారు. హరిశ్చంద్రనాటకం కాటి 'సీను' వచ్చింది. చంద్రమతి తనతొడమీద లోహితాస్యుని తలబెట్టుకొని ఏడుస్తున్నది. సందర్భమిది! చంద్రమతి పాత్రధారికి కన్నీళ్ళు రావటం ప్రారంభించినవి. మాట గద్గదిక కలిగినది. ఎంతసేపు ప్రయత్నించినా మాటపెగిలిరాదు. అంతేహరిప్రసాదరావుగారు పాడేపద్యాల్లో రసంఅనుభవించి రసాస్వాదనపరులైన సామాజికులలో ఒకడై పోయినాడు. స్త్రీపాత్రధారి. ఎప్పుడైతే సామాజికత్వ మాయ్యనలో కలిగినదో నటత్వం భ్రష్టమైనది! అందుచేత ఆట స్తంభించినది! కాబట్టి చూచేవాళ్ళుగాక నటించేవాళ్ళు రంగస్థలంమీద శృంగారాదిరసాలను అనుభవించటం మొదలుపెడితే కొంప మునిగిపోతుంది!* హరిప్రసాదరావుగారి అభినయసామర్థ్యం ఆరోజు పరాకోటికెక్కినది. తనతోకూడా అనేకమార్లు పాత్రధరించి నటించిన వ్యక్తికి ఆదినమభినయం, రసానుభవం కలగజేసినది! ఇట్టి నటుడు హరిప్రసాదరావు!

"కళలకు కళాత్వము లోపించునంత తన్మయత్వము జెందినయెడల నాక్కొక్కప్పు హాస్యమునకు కారణమగునని మాత్రము మరవరాదు."-లక్ష్మణరాయ వ్యాసావళి, 296 పుట

పుష్పాల శేషగిరిరావు, కోపల్లె లక్ష్మీకాంతం మొదలైనవారీయన జట్టులో వారే.

◆ ఆయన ద్రవ్యం తిని తుదిదినాల్లో ఆయనను కళ్ళచూడని మిత్రులిప్పటికీ తలయెత్తుకుని తిరుగుతున్నారు. పాపము శాంతించుగాక! తలుచుకొని ఎప్పుడైనా ఒక్క అశ్రుబిందువు వదలి పాపవిముక్తులు కమ్మని నా విన్నపం!

తొలగిపోయింది. ఆస్తి అంతా పోగొట్టుకొని దారిద్ర్యంలో [illegible] కళాప్రియుడు, కీర్తికాయుడు.

‡ఈ కంపెనీలప్రాపున కొందరు సుప్రసిద్ధ [illegible] ◆బెజవాడలో మైలవరం రాజాగారి ప్రాపున వరలినవారిలో యడవల్లి [illegible] సంజీవరావు, గురజ నాయుడుగార్లు ముఖ్యులు. సావిత్రి, ప్రొపదీ [illegible] వీరు అభినయిస్తూ నాటకం వేసినప్పుడు దూరాలనించి అనేక [illegible] పడమర హైద్రాబాదు, తూర్పు విజయనగరంనించీ, ముందు టిక్కెట్లు [illegible] సీట్లు రిజర్వు చేసుకునేవారు ప్రేక్షకులు. ఆరోజున యేవో [illegible] టిక్కెట్లు దొరికేవి కావు. సంజీవరావుగారి కీచు స్త్రీకంఠం ప్రేక్షకుల [illegible] ఆనందపరిచేది. కాని జగ్గరాజుగారితో ఈయనను పోల్చడానికి [illegible] ఈయనను నిరసించటంగాదు సుమా! జగ్గరాజుగారు సహజమైన [illegible] కావలసిన లక్షణాలు యెక్కువగా కలవాడు. అభినయంకూడా [illegible] ఉండేది. పాతివ్రత్య ప్రదర్శనంలో జగ్గరాజుగారికి చాలామందిలో [illegible] సంజీవరావుగారు.

యడవల్లి నిజమైన సహజమైన రాజఠీవి గలవాడు. ఆయనకు [illegible] మంచికీ చెడ్డకు కూడా వచ్చేది. అది వదిలిపెడితే మంచి నటుడనే [illegible] హిరణ్యావేత్రం బహుమతి పొందినాడు. దుష్యంతుడు పాత్రధరించి [illegible] "అనాఘ్రాతం పుష్పం" మొదలైన శ్లోకా లభినయిస్తూ ఉంటే [illegible]

---

‡ ఈ కాలంలో బందరులోకూడా యీ కంపెనీల అభినయం [illegible] సుబ్బారావుగారు కాలేజీలో అధ్యాపకుడిగా ఉండి తులాభారం [illegible] నాటకాలకు [illegible] నటకులను తయారుచేసి, నాటకకళకు దోహదం చేసినాడు. కోట ఆంజనేయులు [illegible] ఈయనక్రింద తర్ఫీతైనారు.

◆ అప్పట్లో రాజమండ్రి కంపెనీలు గయోపాఖ్యానం [illegible] హృదయంగమంగా అభినయించేవారు. వీరిలో అంకరాజు [illegible] చాలా చక్కగా అభినయించి కవికీ, నాటకానికీ ప్రశస్తి తెచ్చినాడు. [illegible] ఆంధ్రదేశం అన్ని మూలలలోనూ అభినయిస్తూ ఉండేవారు.

ఉండేది. తర్వాత ఈయన సినిమాలో కూడా అభినయించాడు. ద్రౌపదీ వస్త్రాపహరణంలో దుర్యోధనుడు పాత్ర ధరించి నటించినాడు. బాగానే ఉన్నదనవచ్చు.

ఇక గురజనాయుడుగా◆రనటమేగాని ఈయన అసలుపేరు చాలామంది ఎరుగరు. ఈయన యముడు, భీముడు పాత్రలలో ఆరితేరినవాడు. నాయుడుగారి పాత్రధారణం చూచినవారది యెన్నటికీ మరవరు. ఏలూరులో ఆరితేరిన వారిలో ఎన్నదగినవారు ముంజులూరు కృష్ణారావు, కొచ్చర్లకోట రంగారావుగార్లు. ✻కృష్ణారావు గారు (మరణము 1944) సహజంగా ప్రతిభగల నటుడు. ఆయన ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడుగా చేసే అభినయం ప్రతిభావంతం. ఈయనకు రాయలసీమలో సమ్మానం చేసినారు. నిజంగా దానికి దగినవ్యక్తి. రంగారావుగారు హాస్యపాత్రలకు తప్ప భావపూర్ణమైనవాని కంతగా ఒప్పడు. రంగూన్‌రౌడి, మధుసేవ మొదలైనవానిలో త్రాగుబోతువాడుగా బాగా అభినయించినాడు. ఈయన కూడా "సినిమాయాక్టరు" అనిపించుకున్నాడు. తెనాలి రామవిలాససభవారి నటబృందం పండిత నటులూ, సహజనటులూ కలిసినది. దీనిలో ఉన్నపేర్లు కొన్నిచెబితే పాఠకులకు తెలుస్తుంది. ‡"స్థానం" ముఖ్య స్త్రీపాత్రధారి. ఆంధ్రదేశంలో నిజంగా స్త్రీ పాత్రని ప్రతిభతో, వివేచనతో, పాత్రానుకూలాభినయంతో చేయగల సమర్థులు ఈయనతో ముగ్గురు మాత్రమే అని చెప్పవలె. నేను చెప్పే కాలాని కింకా ఒక్క సురభికంపెనీలో తప్ప స్త్రీలు స్త్రీపాత్రలను ధరించే కాలం రాలేదు. స్త్రీలు స్త్రీపాత్రలను ధరించి బాగా అభినయించా రనిపించుకోటంలో గొప్పేమీలేదని కొందరనుకుంటారు. కాని అది నిజంకాదు. తన్మయత్వంపొంది పాత్రను పాడుచేయటానికి వీలున్నది. తాను స్త్రీనని జ్ఞానం ఒకప్పుడు నటనాని కభ్యంతరం కలగజేస్తుంది. "నటి" అనేమాట అనుకరణంగా వారికీ కొంత వర్తించదు.

---

◆ ఇప్పుడు అందరిచేతా మెప్పు పొందుతున్న వేమూరి గగ్గయ్య అభినయం చాలా వరకు ఈయన అనుకరణమే.

✻ ఈయనది స్వగ్రామం బందరు. అక్కడి రాయల్ థియేటరులో మొదట సభ్యుడు. వివిధ పాత్రధారణం సమర్థతతో నిర్వహించగల సమర్థుడు. (ఆంధ్రపత్రిక 16-7-44)

‡ శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ నాటకోపన్యాసాలలో ఈవిషయం కూలంకషంగా విమర్శించినాడు. వారుకూడా రెండుపక్షాలూ చర్చించి స్థానంవారికే సర్టిఫికెట్టు నిచ్చినారు.

స్త్రీపాత్రధారులలో స్త్రీలను వదిలితే, స్థానం, జగ్గరాజు, సంజీవరావుగార్లు వినుతికెక్కిన ప్రతిభాశాలురు. స్థానం నరసింహారావు (1901లో జననం) ఆంధ్ర నటులలో విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకున్నాడు. పై రామవిలాస సభాధ్వర్యాన అనేక స్థలాలలో అనేక ప్రదర్శనాలలో పాల్గొని 26 సంవత్సరాలు తన అపూర్వ అభినయ కౌశల్యాన్ని చూపినారు. ఆంధ్రరసికుల మన్ననల్ని పొంది అనేక స్థలాల్లో సమ్మానాలను* గ్రహించినాడు. నరసాపురంలో వచ్చిన, 'నటకావతంస' అనే బిరుదు ఆయనయందు అన్వర్థనామమైనది. హరీంద్రనాథ చట్టోపాధ్యాయుడు సత్యవేషాన్నెలా మెచ్చినాడో చూడండి.

"I caught in your voice, the movements of your feet and the little tricks of your head-jerks the fire of genuine genius, I loved most of all the reticence in your acting the quiet control, how few actors understand the value of pause."

తన రంగస్థల అనుభవాల్ని గుచ్చిఎత్తుతూ పలుచోట్ల అనేక ఉపన్యాసాలు కూడా ఇచ్చి ఆంధ్ర రంగస్థలాభ్యుదయానికి తోడ్పడినాడు స్థానం!

స్థానంవారు చిత్రాంగి, దేవదేవి, పాత్రలను ధరించి చేసే అభినయము అతిప్రమానం. కాని ఆయన పాతివ్రత్యం కావలసిన పాత్రలకు పనికిరాడని చెప్పవచ్చు. కులుకుబెళుకులు కావలసిన పాత్రలకప్రతిమానుడు.◆

పాపం! స్త్రీలమీదే మోజుకలిగి, పురుషులను స్త్రీపాత్రలకు పిలవని సినిమా దినాలలోనూ, నాటకాలకన్న సినిమా ప్రదర్శనాల కెక్కువ ప్రాముఖ్యమిచ్చే కాలంలోనూ, నిజమైన ప్రతిభాశాలురైన నటులగతి, సినిమా కంపెనీలో చేరితే తప్ప మోక్షం లేకుండా ఉన్నది !

---

* ఏలూరు పౌరులు సమ్మానించి వీరికి 'బంగారుషీల్డునిస్తే' తిరిగి దానిని ఆంధ్రనాటక కళాపరిషత్తుకు బహూకరించి ఏటేటా ఉత్తమనాటక ప్రదర్శనానికి 'రోలింగ్ షీల్డుగా' ఇయ్యడం ప్రశంసింప దగిన విషయం.

◆ "ముదుసలి రాజుయొక్క ముద్దుల చిత్రాంగి, మానవ జగత్తును మురిపించిన మోహిని, వీరరసాధి దేవతయగు చండిక, అభిమాన స్వరూపిణి సత్యామానిని, ముఖ్యముగ ప్రణయాంబురాశి రోషనార, మరపురాని మధురవాణి - ఈ పాత్రలన్నియు నీకై పుట్టినవి . . వలపు బులుపులతో నడక ఒడుపులలో నగవు సొగసులలో చూపుకోపులలో గణికజాతికే నీవొరవడివికద !"

- విజ్ఞాన పరిషత్తు, బందరు.

ఫోటోగ్రాఫు, గ్రామొఫోను, సినిమా ఈమూడూవచ్చి, చిత్రకళలకు దెబ్బ తగిలినది! దీనికికాలమే ఉత్తరవాది.* ప్రకృతిశాస్త్రప్రోద్బలంకల దినాలలో జీవాలకన్న నిర్జీవాల ప్రభ వెలిగిపోవటంలో ఆశ్చర్య మేమున్నది? యుద్ధమంటే శౌర్యంకావాలా? పరాక్రమం కావాలా? మోటారు టాంకులు, విమానాలు, పెట్రోలు, ఎవరికి ఎక్కువగా ఉంటే వాడు గెలవటం! అంతే! మనిషిని మనిషి ఎదుర్కొని శౌర్యంచూపి, యుద్ధ కౌశలంతో జయించే రోజులుకావివి. ఈ పరిస్థితులే సర్వమానవ కార్యాలలోనూ అనుస్యూతాలైనవి! తుదకు రాఘవాచారివంటివాడు సినీమాకంపెనీల నాశ్రయించవలసి వచ్చినది !

స్థానాన్ని వదిలితే, గోవిందరాజుల వెంకట సుబ్బారావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, పిల్లలమర్రి సుందరరామయ్య, ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి, దెందుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, పెద్దిభొట్ల వెంకట చలపతిరావు, నండూరు శేషాచార్యులు, అంజి◆ గార్ల పేర్లు జగద్విఖ్యాతాలు. వీళ్ళందరూకూడా సహజంగా నటనశక్తిగల్గి, విద్యార్థిదశలో నుంచీ కూడా కళను సాధించిన నటతపస్వులు! వీరందరూ కలిసి నటిస్తూ ఉంటే "దేవానాం కాంతంచాక్షుషంక్రతు"వుగా ఉండేది! అప్పట్లో పౌరాణిక చారిత్రక నాటకాల మీద అభిరుచి యెక్కువగా ఉండేది. సాంఘిక నాటకం అంటే క్వాచిత్కంగానూ ప్రహసనరూపంగా అప్పుడప్పుడూ!

గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారిని‡(1896 జననం) గూర్చి ఎంత

* టాకీకళయందు రసోద్దీపనశక్తి యేవిధంగా లోపిస్తున్నదో, టాకీకంటే నాటకరంగ మెందుచేత రసవత్ప్రధానమైనదో, నేటిటాకీలలో వ్యాపారవాంఛ వలన ఆత్మోద్దీపనంకంటె ఇంద్రియతోషణమే యెలా లక్ష్యంగా ఉన్నదో, కళకు ఉండదగిన ప్రామాణ్యం యేమిటో విపులంగా సోదాహరణంగా కజిన్సు పండితుడు వివరించినాడు. --ఆంధ్రపత్రిక 2-10-40

◆ "అందరూ వకెత్తు మాస్టర్ అంజి వకెత్తు.
1934 భారతిలో ఈయన స్వీయచరిత్ర కొంత వ్రాసుకొనినాడు.

‡ "చరిత్రకారుడై ఆహార్యనిర్మాణం చేయడంలో వెనకకు తిరిగి చూస్తాడు. విమర్శకుడై ఔచిత్యాన్ని, రసాన్ని, విమర్శకులు ఆహా అనేటట్టు, పాటిస్తాడు. పండితుడై కవి హృదయాన్ని పరిశీలించి భాషలోని లాలిత్యాన్ని, గాంభీర్యాన్ని అందుకుని భాషకు జీవము పోస్తాడు ...... తెలుగు నాటకవాణిలో సుబ్బారావు కళాజీవితం, యోగ్యతాముద్రను పొంది ఒకవిశిష్ట సాంప్రదాయాన్ని నిర్మించినది." -తుమ్మలపల్లి సీతారామారావు, 'ఆంధ్రరాష్ట్రం' 28-2-1948

చెప్పినా తక్కువే. ఆయన యుగంధర (పిచ్చి) బుస్సీ, గిరీశంపాత్రలు చారిత్రకాలై పోయినవి. ఆయన సినిమా రంగానికెక్కి, ఎడారిలో పచ్చిక బయలువలె ప్రకాశించినాడు. తెనుగు వాళ్ళలో కూడా 'హాలీవుడ్డు' నటులవంటివారు అల్పసంఖ్యాకులు ఉన్నారని ప్రపంచానికి చాటినాడు. దేశానికి కీర్తి తెచ్చినాడు. నటనం అతనిలో ఒక పిచ్చి అయిపోయినది. అది చూపాలని బుద్ధి పుట్టినప్పుడు వృత్తిగిత్తి జ్ఞాపకమురాదు! తుదకు తన ఆరోగ్యాన్నికూడా మరుస్తాడు. ఇతనికి నటనం రెండో ప్రకృతి! ఇతని నటనంలో రమణీయత ఉన్నది! "క్షణక్షణనవ్యత" ఉన్నది.

పిల్లలమర్రి సుందరరామయ్య రసపిపాసి. అతని రౌద్రరసప్రదర్శనం అద్భుతం! పిల్లలు తల్లులను కౌగలించుకునేవారు. అంత భయంకరం! గొప్ప ప్రతిభ కలవాడు. అతనిది విజ్ఞానంతో కూడిన అభినయం. చాలా చిన్నతనంలో పరమేశ్వర సాన్నిధ్యాన్ని పొందినాడు. అతనికి నాట్యమంటే ఊపిరి పీల్చుకోటం వంటిది. అతని కంఠస్వరాన్ని పరమేశ్వరుడు రౌద్రరసంకోసమే ప్రసాదించినాడు! "వందేమాతరం గీతం" పాడుతూంటే యుద్ధంకోసం పిలిచినట్టే ఉండేది! కీర్తికాయుడు! బొబ్బిలి, ప్రతాపరుద్రీయాభినయాలలో ఈయన ప్రతిభ స్థిరప్రజ్ఞ గలది. మాధవపెద్ది వెంకట్రామయ్య వల్లీఖాను, విజయరామరాజు పాత్రలనూ, ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి విద్యానాథుడి పాత్రా, దెందుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి చెకుముకిశాస్త్రిపాత్రను, పెద్దిభొట్ల చలపతిరావు హైదరుజంగు, పేరిగాడి పాత్రలూ ధరించి నటిస్తూ ఉంటే ఇప్పుడు సినిమాలో నటించే పాత్రలను తలుచుకోము. అట్టి కాలం మరల రాదు.

ఈ పేర్కొన్న వారుగాక చెదరువాటుగా వెనుకటితరంలోనూ, తర్వాతా అక్కడక్కడా కొందరున్నారు. నెల్లూరులో దొరస్వామయ్యంగార్ని ఉండేవాడు. ఈయన ఆకాలంలో చాలా సుప్రసిద్ధుడు. వేదం వెంకట్రాయశాస్త్రిగారి చేతిక్రింద తయారైన మనిషి. నెల్లూరికీ, ఆంధ్రదేశానికీ కీర్తి తెచ్చిన నటుడు. శాకుంతలలో దుష్యంతు డీయన నటించినట్టు 'నభూతో నభవిష్యతి' అంటారు. నెల్లూరు నాగరాజారావుగారు కూడా గొప్పనటులలో చేర్చవలసినవాడే! నరసరావుపేటలో వంగల ఆంజనేయులు, దాశరధి, బెల్లంకొండలు పేరుమ్రోగినారు. బెల్లంకొండవంటి

స్వతంత్రవృత్తి ఉన్నవాడైతే, దాశరథిగారు చాలా వృద్ధికి వచ్చేవాడు. బెల్లంకొండవారి శ్రీకృష్ణుడు జగద్విదితుడే! ఈయన పద్యం చదవడంలో "పడుగుపేక" పద్ధతి చాలామందికి అంటువ్యాధి అయినది.

బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు కవి, పండితుడు. ఈయన వ్రాసిన హరిశ్చంద్ర, ఉత్తమాంధ్రనాటకాలలోనిగని పాఠకులకు తెలుసు. మంచి నిర్దుష్టమై, హృదయోత్సాహ కరమైన రచన అలవడినదీయనకు. చిన్నప్పటినించీ కూడా నాటకాలలో అభినయించిన వ్యక్తి. ఇతను హరిశ్చంద్రలో నక్షత్రకపాత్రవేస్తే హరిప్రసాదరావుతోపాటు అభినయంలో "నీవా నేనా" అన్నట్టు ఉండేది. ఇతను బహునాటకాలను రచించినాడు. ఇప్పుడు సినిమారంగాల కెక్కి సినిమానాటకాలు వ్రాసినాడు. వానిలో అభినయించినాడు.

దొరస్వామయ్యంగారిని గూర్చి అనేకమంది చాలా అద్భుతమైన నటనమంటూ ప్రశంసించినారు. పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు అభినవ రామదాసు. ఈయన ఈ పాత్రాభినయానికి మాత్రం ఆంధ్రదేశమంతా చాలా పేరుమ్రోగాడు. రాఘవాచార్యులుగారు కూడా రామదాసపాత్ర ధరిస్తాడు గాని ప్రేక్షకులు రెడ్డిగారికే యెక్కువ ఓట్లిస్తారు. ఈ ప్రకారంగా నెల్లూరు, నటకుల విషయములో చాలాపేరు మ్రోగినది. సింహపురీనాటక సమాజమని చాలా ప్రసిద్ధిగా ఉండేది! ఘంటసాల రాధాకృష్ణయ్యగారీ నెల్లూరివారిలో నొకడే. పింగళి లక్ష్మీకాంతంగారు కూడ యీ విద్యలో సాధకుడే!

పారుపల్లి సుబ్బారావు, దైత గోపాలం, సి.యన్. కృష్ణమాచార్యులు (సూళూరుపేట), మంగిపూడి కామేశ్వరరావు (విశాఖపట్నం), యరగుడిపాటి రామయోగి (నెల్లూరు), యస్. యం. కామాక్షిసుందరశాస్త్రి (మద్రాసు), యం. రామలింగశాస్త్రి మొదలగువారనేకులున్నారు.* నెల్లూరులో చెంగారెడ్డి అనే మహనీయుడు షేక్స్పియరు నాటకాలను తానొక్కడే కంఠంమార్చి అన్నిపాత్రలను చదివి సభ్యులను మెప్పించేవాడు.

బళ్లారి రాఘవాచార్యులు గారిని గూర్చీ, ఈయన విజ్ఞానాన్ని గూర్చీ,

---

* ఈ విషయమై సమగ్రంగా తెలియగోరేవారు శ్రీపురాణం సూరిశాస్త్రిగారి "నాట్యాంబుజం" చదవమని మనవి చేస్తున్నాను.

ఖండాంతర విజ్ఞాన గ్రహణాన్ని గూర్చి, అభినయ సామర్థ్యాన్ని గూర్చి, ప్రతిభను గూర్చి, స్త్రీలే స్త్రీపాత్ర ధరించాలనే మొదలైన అభినివేశాలను గూర్చి, నాటక సినీమారంగాలమీద ఈయన చూపిన నటనా కౌశలాన్నిగూర్చి, నాట్యంకొరకు ఈయనచేసిన సేవను గూర్చి, ఆంధ్రదేశం బాగా తెలుసుకొబట్టి నేను ఎక్కువగా చెప్పను. ఈయన కూడా నిండుహాళ్ళను ఆకర్షించినాడు! ప్రతిభ చూపినాడు! కీర్తిని పొందినాడు! విద్యాధికులు నాటకరంగంమీదికి రావటంలేదనే అపకీర్తిని పోగొట్టినాడు. వస్తే రంగం నైతికంగా అభివృద్ధి పొందుతుందనే ఆశ మొత్తంమీద పది సంవత్సరాల అనుభవంతో అడుగంటిందనుకుంటాను! ఈయన రంగంమీద దాదాపు వింశతి వర్షాలు తమ ప్రోద్బలాన్ని చూపిన వ్యక్తి.*

డివి సుబ్బారావుగారు◆ లక్ష్మణస్వామిగారి శిష్యకోటిలోనివాడు. ఈయన వెనుకటి తరంవారిలో ఉపజ్ఞగల నటకులలో మిగిలిన చెయ్యి. పెద్దవాడైనా ఇప్పటికీ వెనుకటి చిత్రనళీయాదులను రక్తికట్టేటట్టు నటించగల సమర్థుడు. హరిశ్చంద్ర వేషాన్ని నిర్వహించడములో హరిప్రసాదరావుతో సమానమైన చేయి అనిపించుకున్నాడు చాలాదినాలు సినిమారంగములోకి దిగకుండా ఉన్నాడు. కాని ఇటీవలే "వింధ్యరాణి"లో నటించి పొరపాటున అక్కడ అడుగు పెట్టినా డనిపించుకున్నాడు. అదే నాటకం స్టేజిమీద ఆడి మెప్పువహించినాడుమరి! నాటక రంగానికీ సినిమా రంగానికీ తేడా అక్కడ ఉన్నది!‡

---

* ఆంగ్లనాటక నటనంలోకూడా చాలా ప్రఖ్యాతి పొందినాడు. ధర్మవరం కృష్ణమాచార్యులుగారి మేనల్లుడని ప్రతీతి. ఈయన "పరిపడని సంగతులు" మొదలైన సాంఘిక నాటకాలను కూడా రచించి నటించినాడు ఆంధ్రుల్ని దుఃఖంలో ముంచి నిర్గమించినాడు.

◆ ఈ మధ్య "వింధ్యరాణి" అనే నాటకంలో పాత్రధారణం చేసి కొంత దేశసంచారం చేసినాడు. బందరు పౌరులు ఈయనను సమ్మానించి బిరుదునిచ్చారు.

‡ "రాయలసీమ అంటే నటకులకు ప్రసిద్ధి బళ్ళారిలో మాత్రమే కాక కర్నూలు, కడప, అనంతపురములలో బహుప్రసిద్ధ నటకులుండిరి ఉన్నారు.. ..నిజాం రాష్ట్రములో చాలా నాటక కంపెనీలు ఉండేవి. కాని అవి అంతప్రసిద్ధి పొందినవి కావు. .. . సికింద్రాబాదులో జగదీశ నాట్యమండలి కలదు . ఈ నాట్యమండలికి ముఖ్యుడు శ్రీ బుచ్చయ్యగారు.. అభినయశక్తి సిరిలో మూర్తీభవించినది." --గోలకొండ పత్రిక 5-11-42.

## నాటక రచన :

ఈ సందర్భంలో ఒక్క విషయం చెప్పి యీ భాగాన్ని విరమిస్తాను. ఇప్పుడు సారసత్వంలో వ్రాయబడిన నాటకాలన్నీ ప్రదర్శనార్హాలా అంటే అన్నీ కావని చెప్పవలసివస్తుంది. ఇప్పుడందులో వెనకటి చిత్రనళీయాదులమీద అభిరుచి పోయినది. ప్రసన్నయాదవాదులు దాదాపు అదృశ్యాలైనవి. పాండవవిజయాదులు ఇంకా అక్కడక్కడా కొంచెం ఉన్నామంటున్నవి. ముఖ్యకారణం వీనిని భావగుంఫితాలుగా నటించటం చాలా కష్టం. అందుచేత నటులూ, ప్రేక్షకులు కూడా చిల్లర నాటకాలమీద పడినారు. ఉన్నత నైతికాదర్శం తగ్గి, ప్రతిదిన ప్రజాజీవనంమీదికి ప్రజల బుద్ధి పోతున్నందున కవులకూ, నటులకూ అదే ఉపాదేయమై పోయినది. ఇంకా పౌరాణికాలకు బొత్తుగా ఆదరం తగ్గలేదు. ఇది కాలాన్నిబట్టి సమంజసమే! పూర్వాచారపరాయణులు దుఃఖింప పనిలేదు. వెనుకటి దినాలలో ఈ కంపెనీలను ఆశ్రయించుకుని నాటకకర్త లుండేవాళ్ళు. అట్టి వారిలో బెజవాడలో మల్లాది అచ్యుతరామశాస్త్రి, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, కాశీనాథుని వీరమల్లయ్య, సోమరాజు రామానుజరావు, మొదలైనవారు ఎన్నదగినవారు, కంపెనీలో నటించేవారి అభిరుచినిబట్టి వారు ఎట్టి నాటకం కావాలంటే పాటలతోనూ, పద్యాలతోనూ, వ్రాసి యిచ్చేవారు వీరు. వీరంతా కూడా నాటకరచనలో గట్టివారే! కాని వీరి నాటకా లుత్తమకక్ష్యకు చెందినవి అనడానికి వీలులేదు. నాటకాన్ని అనేక దృక్పధాలనుంచి చూడవచ్చు. సారస్వతంగా, ప్రదర్శనార్హంగా, భావపూర్ణంగా, పాత్రపోషకంగా, ఈవిధంగా ఒక్కొక్కటి ఒక్కొక్కగుణం గలిగి ఉంటుంది. ఇటీవల ✻సచ్చిదానంద శాస్త్రి గారు "లలిత' అనే పేరుతో సనాతనాచార పోషకమైన నాటకాన్ని ఒకదానిని రచించినాడు. చాలా బాగున్నది.◆ వీరేగాక మహాకవి ●కాళ్ళకూరి నారాయణరావు గారు 'వరవిక్రయచింతామణ్యాదులనూ,' కాళ్ళకూరి సాంబశివరావుగారు "రంగరాయ

✻ "బృంద" అనే ఒక భక్తిప్రధానమైన నాటకాన్ని కూడా వ్రాసినాడు.

◆ ఈయన సినిమాకు సంభాషణలు వ్రాసిపెట్టున్నా డిటీవల.

● ఈయన కాకినాడనుంచి మనోరంజని అనే మాసపత్రిక 1910లో స్థాపించి సారస్వతసేవ చేసినాడు.

కదన సమవాకారము" అనే పేరుతో బొబ్బిలినీ, యీవిధంగా కొందరు రచించినారు. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి 'రసపుత్రవిజయం' చాలా పేరుప్రోగినది. ద్రోణంరాజు సీతారామారావుగారనే ఆయన రాత్రైక ప్రబంధరచనా ధురీణుడు; సాయంకాలం యేదైనా చిత్తైకాగ్ర్యానికి సదుపాయం చేసి ఫలానా నాటకం కావాలె నని చెప్పితే తెల్లవారేటప్పటి కొక నాటకం తయారయ్యేది. పట్టిక చూస్తే 1921 సంవత్సరానికి పూర్వం 32 నాటకాలు దాదాపు వ్రాసినట్టు కనబడుతున్నది. ఇన్ని నాటకాలు వ్రాసినవారు చాలాతక్కువ. వీనిలో ఒక్కదాన్ని కూడా ఇప్పుడెవ్వరూ ప్రదర్శించటంలేదు ! చూచేవారుకూడా లేరు! బేతపూడి భగవంతరావు గారు 'మనుసంభవం' 'రుక్మాంగద' మొదలైన అనేక నాటకాలు రచించినాడు.★ ఈవిధంగా ఒకటిరెండు చొప్పున నాటకాలు రచించిన వారు లెక్కకుమిక్కిలిగా ఉన్నారు. రైల్వే వాఙ్మయాన్ని పరిశీలిస్తే బద్దిరెడ్డి కోటేశ్వరరావుగారనే ఆయనకూడా సీతారామరావు గారిని మించిపోయినట్టు కనపడుతున్నది. పూర్వం "నాటకాంతం హి సాహిత్య" మనేవారు. ఇప్పుడో "నాటకాది సాహిత్యం" అనవచ్చు.◆ కొంచెం గణాలు తెలిసి పద్యం వ్రాయగలవారంతా నాటకరచయితలే. ఈవిధముగా నాటక నవలారచనలు మిక్కిలి విరివిగా సాగినవి.

ఇప్పు డీసందర్భంలో ఒక నూతనవిషయం వచ్చినది. ఇవి మత కుల కక్షదినాలు. అందుచేత మతాలకూ, కులాలకూ అంతఃకలహాలు. "ప్రతాపరుద్రీయ' ' ప్రదర్శనం, "శివాజీ" ప్రదర్శనం కొన్ని ప్రాంతాలలో పనికిరావు. సారస్వతానికీ,

---

★ ఈయన సంగీతగ్రంథా ః కూడా వ్రాసినాడు. "కవిమిత్రమ"ని అర్ధానుస్వార శకటరేఫలుగల మాటలపట్టిక ఒకటి తయారు చేసినాడు.

శృంగారకవి సర్వారాయుడుగారు ఇంటిపేరును సార్థకం చేసుకున్న మంచి వ్రాయసగాడు. ఈయన యెంతకవో అంత వైయాకరణి. శ్రీరాం వీరబ్రహ్మంగారనే బందరు వాస్తవ్యుడు చాలా నాటకాలూ, కొన్ని ప్రబంధాలు కూడా రచించినారు.

◆ "ఇప్పుడు చాలామంది దృష్టి 'నాటక రచనాంతం పాండిత్యం' అనే దారిలో పడింది. .ఇప్పటి లోకంలో చాలామందికి దేవుళ్ల మీదా పురాణాలమీద నమ్మకం తగ్గడంవల్ల, అలాంటి నాటకాలెంతటి మంచివైనా వెకటిస్తున్నాయి.

- దువ్వూరి సూర్యనారాయణమూర్తి , ప్రబుద్ధాంధ్ర - డిసెంబరు, 1934.

చరిత్రకూ మతకులకక్షలకూ లంకెవెయ్యటం చాలా విచారకరం. సారస్వతాన్ని కులకక్షల దృష్టితో పరిశీలించి, కథలో యిలా ఉండకూడదనటం కంటె విచారకరమైన విషయం ఉంటుందా? నాటకకర్త వెనక చరిత్రను ఊతగా పెట్టుకొని చిల్లర విషయాలలో అనేక మార్పులు చేస్తాడు. పురాణ కథలను ప్రబంధ కర్తలు కావ్యానికి అనుగుణంగా మార్చలేదూ? "రోషనార" నాటకం మొదట యెంత విరివిగా ప్రదర్శింపబడేదో తర్వాత యీకారణాలచేత ప్రదర్శన బాహ్యమైనది. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి "రసపుత్ర విజయం" కూడా ఇంతే! ఇది ఒక విచిత్ర సన్నివేశం. ఈనిషేధం హిందూకథలకు లేదు. ఏల? హిందువులే హిందువులనే తిట్టుకుంటున్నారు కాబట్టి. "మొగుడు ముండా అంటే ముష్టికి వచ్చినవారంతా ముండా అన్నారట." ఏనాడు వీరేశలింగముగారు హిందూమత నిరసనం ప్రారంభించినారో, అప్పటినుంచీ ప్రతి అప్రయోజకునికీ, నీచాచార వర్తికీ, ఉచ్ఛృంఖల వృత్తికీ, వ్యభిచారికీ, నిరసన కేంద్రమైపోయినది. ఏసినిమా అయినా చూడండి! హిందూధర్మ నిరసనం కొంచెమో గొప్పో తప్పకుండా ఉంటుంది. సినిమాలువచ్చి ధర్మప్రత్యయానికి చాలా దెబ్బకొట్టినవి అనవలె.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 5

# ఆంధ్రోద్యమం

## వక్తృత్వము: దేశాభిమాన కవిత్వము:

వెనుక కొక్కొండ వెంకటరత్నంగారి వక్తృత్వాన్నిగూర్చి ముచ్చటించినాను. అది ప్రతివాడూ చెయ్యలేని అద్భుతకార్యం. కాని వ్రాతమూలంగాగాని ఉపన్యాస మూలంగాగాని ప్రజల్లో ప్రచారం చెయ్యవలెనంటేనూ, విషయాలను గూర్చి వారికి తెలుపవలెనంటేనూ సంభాషణకు దగ్గరగా ఉన్న శైలి వ్రాయవలెను; మాట్లాడవలెను.

ఈశతాబ్ద ప్రథమ దశవర్షాలలో అట్టి అవసరం కలిగినది. వెనుక బంగాళా విభజనాందోళనాన్నిగూర్చీ, అది జాతీయోద్యమంగా ఎలా పరిణమించినదీ మనవిచేసినాను. ఆజాతీయోద్యమకాలంలో బందరునుంచి ఒక వ్యక్తి బంగాళాదేశం వెళ్ళి అక్కడి పరిస్థితులను చూచేటప్పటికి, ఆ ఉద్రేకం సరియైనదనీ, దానిని ఆంధ్రదేశంలో కూడా వ్యాపింపజేస్తే బాగుండుననీ, ఆయనకు తోచినది. ముట్నూరు కృష్ణారావుగారు ఎప్పుడైతే వారు ఆంధ్రదేశం రమ్మని ఆహ్వానం చేసినాడో, వెంటనే దానిని గ్రహించినారువారు. ఆయనతో బిపిన్ చంద్రపాల్ గారు తదాందోళనా ప్రచారంకోసం దక్షిణదేశం* వచ్చినారు. అది 1907 సంవత్సరం.

అదివరకే కృష్ణాజిల్లా సంఘం అక్కడ స్థాపింపబడి ఉండటం చేతా, ఉద్యమాన్ని నడిపింపగల సమర్థులగు పెద్దలంతా అక్కడ ఉండటంచేతా, ఉద్యమానికి బందరు కేంద్రమైన పాల్‌గారు ఆంధ్రదేశంలో ఇతరత్రా కూడా పోయి ప్రచారం

* నేనుబందరులో చదువుకుంటూ ఉండేవాడను. పాల్‌గారు బందరు వచ్చినప్పటి దృశ్యం ఎన్నడూ మరవను. పట్టణమంతా పని స్తంభించిపోయినది. యావత్పట్టణం పాల్ గారిఊరేగింపుతో ఉన్నది. విద్యార్థులు పాఠశాలలకు పోలేదు. సభలకు హాజరు కావటం! నేను వందేమాతర గీతమూ, కేకా, కూడ మొదటిమారు అప్పుడే విన్నాను

చేసినా, అది బందరులో జరిగినంత తీవ్రంగా ఇతరత్రా జరగలేదు. కొన్నాళ్ళు బందరు ఆంధ్రదేశానికి ప్రచారకేంద్రమైనది. ఆయన రగిలించిపోయిన అగ్ని ఆంధ్రయువకులు అందుకుని ప్రచారానికి వైశాల్యం కల్పించినారు. దీనికి తెనుగు వక్తృత్వం అవసరమైనది. 'డిమాండు సప్లైలు' అన్యోన్యాశ్రయాలు కాబట్టి డిమాండు వచ్చేటప్పటికి యువకులు సప్లయి అయినారు.

ఒక్కమారు వారిపేర్లు చెప్పితే పాఠకులు 'వీరు చిరపరిచితులైన పెద్దలేనే' అని ఆశ్చర్యపడతారు. "మౌనముద్రాలంకారుడై"న ముట్నూరి కృష్ణరావుగారు అంతశ్శక్తి సప్లయిచేసేవాడు. ఆయనకుతోడు చిట్టా సుందరరామయ్యగారు నివురుకప్పిన నిప్పుగా ఊహలిచ్చేవాడు. కోపల్లె హనుమంతరావుగారూ, పట్టాభిగారూ, ఆ ఊహల మీద హర్మ్యాలు నిర్మించేవారు. కొండా వెంకటప్పయ్యగారు సలహాదారుగా ఉండేవారు. చిల్లరిగె శ్రీనివాసరావు, ✻అవటపల్లి నారాయణరావు వగైరాలు పత్రికలలో వ్రాసేవారు. ◆గాడిచర్ల హరిసర్వోత్తమరావు, బోడి నారాయణరావు, చెరుకువాడ నరసింహం, కవుతా శ్రీరామశాస్త్రిగార్లు ప్రచారం చేసేవారు. కోన సీతారామారావు, ఉన్నవ లక్ష్మీనారాయణరావుగార్లు ప్రచ్ఛన్నంగాఉండి మంచి ఊతయిచ్చేవారు. చెన్నాప్రగడ భానుమూర్తిగారు మొదలైనవారు దేశభక్తి కవిత్వం వ్రాసి హృదయాలలో ఉద్రేకం జనింపచేసేవారు.§

## ఆంధ్ర జాతీయ కళాశాల :

అప్పటి ఉత్సాహముయొక్క ఫలమే బందరులోఉన్న ఆంధ్ర జాతీయ కళాశాల. ఆంధ్రదేశములో అప్పటినుంచీ అవిచ్ఛిన్నముగా జరుగుతూ కాలానుసారంగా నడుస్తున్నదీ ఒక్క సంస్థ! కృష్ణాపత్రికా,‡ జాతీయకళాశాలా అన్నా చెల్లెళ్లనవచ్చు!

✻ 'కార్మిక పత్రిక' అనే వారపత్రిక 1925లో స్థాపించి రంగూన్‌లో కృషి సల్పాడు.

◆ శ్రీనివాసరావుగారు పుళిందాసుశీలము, ఆంధ్రదేశపు చరిత్ర మొదలైన గ్రంథాలు కూడా రచించినాడు.

§ వీరిలో పట్టాభిగారూ, భానుమూర్తి గారూ మాకు నోబిల్ కాలేజీలో గురువులు

‡ 1902లో శ్రీ కొండా వెంకటప్పయ్యపంతులు, దాసు నారాయణరావుల సంపాదకత్వాన పక్షపత్రికగా బయలుదేరినది. తర్వాత వారపత్రిక అయినది ముట్నూరి వారిచేతులలో పడినది.

రెండిటికీ పునాది పురుషులొక్కరే! ఈ కళాశాల చేసిన పని అంతా మనకక్కర లేదుగాని దీనితో ఆంధ్రదేశంలో కొందరు వ్యక్తులకు సంబంధం ఉన్నదనటం మనకు కావలసినది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కోలవెన్ను రామ కోటేశ్వర రావు, విశ్వనాధ సత్యనారాయణ, అడివి బాపిరాజు, కాటూరు వెంకటేశ్వర రావు మొదలైనవారు ఎప్పుడో ఒకప్పుడాసంస్థతో సంబంధం కలిగి ఉన్నారు.

ఈ సంస్థ అనేకులకు, డ్రైవర్లుగా, వడ్రంగులుగా, వాచి రిపేరర్లుగా ఇంకా ఇతర విధాలుగా స్వతంత్రజీవనం చేసుకోగలశక్తి కలిగించినది. జాతీయభావాన్ని ఆంధ్ర దేశంలో పెంపొందించటంలో ఈసంస్థ చేసినంత పని యేదీ చెయ్యలేదు. గోపాల రెడ్డి గారి వంటి దేశ భక్తుడినీ, రాజ్యతంత్ర వేత్తనూ, పాలనాకుశలుడినీ, విజ్ఞానవంతుడినీ, తయారుచేసినది. శంభు ప్రసాదుగారి వంటి పత్రికాసంపాదకుడిని తయారు చేసినది. వీటన్నిటికంటె ఒక్క విశేషమున్నది. ఈ సంస్థలోనికి బెంగాలునుంచి ప్రమోద ఛటర్జీ అనే చిత్రకారుడిని పిలిపించినారు. ఆయన గొప్ప చిత్రకళాకుశలుడు. ఇప్పుడాంధ్రదేశంలో ఉన్న చిత్రకారులు, అనగా అడివిబాపి రాజు వంటి◆ వారంతా ఆయనకు సాక్షాత్తుగా గాని, పరంపరగాగాని శిష్య కోటిలో వారని అనవచ్చు. ఈ చిత్రకళకూడా సాహిత్యానికి అనుబంధమే! ✻

జాతీయ భావంతో, జాతీయ విద్యోద్యమం రేకెత్తిన తర్వాతా అంతకు ముందూ ప్రచ్ఛన్నంగా ఉన్న ఆంధ్ర వ్యక్తిత్వం బయటికి వచ్చి ఆంధ్రోద్యమంగా పరిణమించినది. కాని ఒక్క మార్పు జరిగినది. బందరులో పుట్టిన జాతీయోద్యమ బీజం గుంటూరుదాకా వేళ్ళుపాకి ఆంధ్రోద్యమంగా పరిణమించినది. ఈ సందర్భంలో

---

◆ బాపిరాజు యెంకిపాటలకేమి, కిన్నెరసాని పాటలకేమి, మధుకలశానికేమి, తన గోధూళికేమి, వ్రాసిన చిత్రాలు కూడా, నవ్య సాహిత్యాలంకారాలే! ఇందులో ఈయన అప్రతిమానుడు రెండు లలితకళల్లోకూడా సమాన ప్రజ్ఞగల ప్రతి భాశాలి. గుంటూరులో ఉండి కొందరు యువకుల్ని చిత్రకళలో తరిబీదు చేసినాడు; కళాపీఠమనే పేరు పెట్టుకొని.

✻ ఇంతేగాక రాజమండ్రిలో దామెర్ల (1897-1925) రామారావనే ఒకప్రతిభాశాలి ప్రత్యేక చిత్ర కళాకౌశలాన్ని సృష్టించి తదనుసారంగా తాను చిత్రించి కొందర్ని తరిబీదు చేసినాడు. ఈయన కొంత కాలంకింద రాజమండ్రి కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉండి గొప్ప చిత్రకారుడైన, ఓ జే. కూల్డ్రేగారి శిష్యుడు. ఆంధ్రభారతీయ కళాపరిషత్తు అక్టోబరు 1923లో స్థాపితమైనది.

◆జొన్న విత్తుల గురునాథంగారు చిరస్మరణీయులు. దీనికి కారణం ఒకటుంది. కొండా వెంకటప్పయ్యగారు బందరునుంచి గుంటూరుకు బసమార్చినాడు. ఈ ఆంధ్రోద్యమ మనేఅంటుకు దోహదం చేసినాడు. ఈ ఉద్యమానికి కూడా వెనకటివారే మూలస్తంభాలు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆందోళన మొదలైనది. ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో జరిగినది.‡

న్యాపతి సుబ్బారావు, ముట్నూరి ఆదినారాయణయ్య, కొండా వెంకటప్పయ్య, శేడింబి హనుమంతరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, మోచర్ల రామచంద్రారావు, డాక్టరు లక్ష్మీపతి మొదలైన మహామహులున్నారా సభలో.

ఆంధ్రోద్యమానికి సంబంధించిన అంకెలలో పట్టాభిగారు దిట్ట, జాతీయవిద్యా తర్కంలో కోపల్లె హనుమంత రావుగారు సమర్థుడు. వారిద్దరు కలిసి ఒక గ్రంథం వ్రాశారు. "Andhra Province—for and against" దాని పేరు. ఇది ఆంధ్రోద్యమానికే "భాషాభేషజం" వంటిది. అది చదివితే ప్రత్యేకాంధ్ర రాష్ట్రావశ్యకత ఒప్పుకోవలసినదే! అప్పటి నుంచి ఏటేటా ఒక చోట ఆంధ్ర మహాసభ జరిగి ఉద్యమప్రచారం చేసినది. అప్పుడు 2,3 ఏండ్లలోనే రాష్ట్రం వస్తుందనే నమ్మకం ఉండేది. పెద్దది హిందూదేశ స్వరాజ్యోద్యమం! దానిలో అంతర్భూతం ఆంధ్రోద్యమం! రెండూ ఏక కాలావచ్ఛేదకంగా జరుగుతూ ఉండేవి.

తర్వాత ఆంధ్రులు విశ్వభారత సమస్యలో మునిగిపోయినారు. స్వార్థం వదిలివేసి గాంధిగారికి ప్రియశిష్యులైనారు. ఆంధ్రమహాసభ ప్రాభవ మడుగంటినది. తమిళుల బలం యెక్కువైనది. స్వరాజ్యంతో పాటు ఆంధ్రరాష్ట్రంకూడా వస్తుందని మన పెద్దలు ప్రజలకు నచ్చ చెప్పినారు. కాంగ్రెసువారు తమ వ్యవహారాలలో "ఆంధ్ర రాష్ట్ర"న్నిచ్చి పాలపీకను నోట్లోపెట్టి పిల్లవాడిని నిద్రబుచ్చినట్లు

◆ చాలా చిన్న వయస్సులో పరమపదించినాడు. భాషాప్రయుక్త రాష్ట్ర విభజనబీజం ఆయన బుర్రలో పుట్టినది.

‡ 1913 మే.బయ్యా నరసింహేశ్వరశర్మ ఇంగ్లీషులో అధ్యక్షోపన్యాస మిచ్చినాడు. ఆ సభాకాలంలో రైల్వే సమ్మెవచ్చి ప్రతినిధులకు చాలాకష్టంకలిగించినా, ఉత్సాహం యెంతమాత్రం తగ్గలేదు.

నిద్రబుచ్చినారు. స్వరాజ్యంకోసం ఒక్క యింగ్లాండును తృప్తి పరిస్తే చాలు! ఆంధ్ర రాష్ట్రాని కోసం యింగ్లాండును, కాంగ్రెసును, తమిళులను, గుజరాతీలను కూడా తృప్తి పరచవలసివచ్చినది. స్వరాజ్యము వచ్చినదిగాని ఆంధ్రరాష్ట్రం మాత్రం వెనకపడింది! 1941 వ సంవత్సరం నవంబరులో, విశాఖపట్నములో జరిగిన ఆంధ్ర మహాసభా, డిసెంబరులో చెన్నపట్నంలో జరిగిన ఆంధ్రవిజయోత్సవాలూ చాలా ప్రచారం చేసినవి. 1908 స్థితికి మళ్ళీ వచ్చినాము. దేశంలో కాంగ్రెసు నాయకులంతా స్వరాజ్యసంపాదన మహాకార్యనిమగ్నులై కాంగ్రెసువారికి అనవసరంగా మనస్తాపం కలిగించకూడదనే ఉదారులైపోయినారు. రాష్ట్రంపట్ల ఉదాసీనులైపోయినారు. గుమ్మిడిదల సుబ్బారావు, పంద్రంగి కేశవ రావు,* శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి గార్లు గొంతెత్తి అరవడం యెవ్వరికీ వినపడలేదు.

## సారస్వతము:

ఇంతటితో యీఉదంతం చాలించి ఈ సంబంధమైన సారస్వతానికి వస్తాను. ఈ సందర్భంలో కృష్ణాపత్రిక చేసిన సేవకు విలువ లేదు. 'యంగుయిండియా' పత్రికను సహాయ నిరాకరణోద్యమం రోజులలో ఎలా వేదం చదివేవారో, కృష్ణాపత్రిక నలా చదివేవారు. దుగ్గిరాల రామమూర్తి, చెన్నాప్రగడ భానుమూర్తి, క. భాస్కర రావు నాయుడు మొదలైనవారు కొన్ని గ్రంథాలు వ్రాసినారు. ఉద్యమం బెంగాల్ నుంచి వచ్చినది కాబట్టి కొంత ఆ విజ్ఞానమే మనభాషలోనికి కూడా రావటం తటస్థించినది. దేశభక్తిని పురికొల్పటం అప్పటి వాఙ్మయంయొక్క పని.

అట్టి వ్రాతలన్నిటిలో పీష్వా నారాయణరావు, భానుమూర్తి గారి "భారత ప్రదర్శనం" భాస్కర రావు నాయుడుగారి "ప్రఫుల్లముఖి" దుగ్గిరాల రామమూర్తి గారి "స్వాతంత్ర్యప్రదర్శనము" (Mills' liberty) కొండిపర్తి వీరభద్రాచార్యులుగారి "భారతదర్పణము" మొదలైనవి ముఖ్యమైనవి. "ప్రఫుల్లముఖి" మంచి ఉదాత్తంగా ప్రారంభమై దేశభక్తి స్ఫోరకమై వరలినది. దీనికే "దేవీ చౌధురాణి" అని మరిఒక

* ఇతని సోదరుడు రామారావు "పుష్కరిణి" అనే మాసపత్రిక పెట్టి 1925లో సారస్వతసేవ చేసినాడు.

పేరు. రామమూర్తిగారి శైలి సజీవమైనది. చెప్పదలచిన విషయమును సమ్మెట దెబ్బల వలె చెప్పగల సమర్థుడు ఆయన. వీరభద్రాచార్యులు అధ్యాత్మచింతగలవాడు. తుదకు సన్యసించి సంఘసేవ చేసినాడు.

ఇక భానుమూర్తిగారు§ (1868-1945)విద్యార్థులచిత్తాలలో కలగజేసిన దేశ భక్త్యుద్రేకము చాలాగొప్పది. "భారతధర్మదర్శనం" మిక్కిలి ఉత్తేజకరమైన గ్రంథము. సాంఘిక, ఆర్థిక, రాజకీయసమస్యలు దానిలో చక్కగా రసవంతంగా ఉగ్గడించబడినవి. "ఒక నూటన్ పదికైన లేదు తిననయ్యోతల్లి ముప్పొద్దులన్", "ఆపద్ధర్మములుండవే శృతులఁదద్వ్యాప్తార్థ కాలంబు దేశాపత్కాలముకంటె నొందు గలదే" "ఇది యార్యశ్రేష్ఠ ధర్మం బొకొ!" అనే భాగాలు తార్కాణాలు. "భరత ఖండంబు చక్కని పాడి యావు" అనే చిలకమర్తి వారి పద్యభావానికి సమాధానముగా ఈ క్రింది పద్యము చెప్పినాడు.

"దురుసుదనమున దీరదీ గడుసుదనము
గాన తాపులు పోటులు కార్యమనక
లేగ లన్నిట నేకమౌలా గొనర్చి
నేర్పుతో తల్లి యొగజేప నేరవలయు"

1907-8 సంవత్సరములోనే ◆సహాయ నిరాకరణాన్ని ఈపద్యమూలముగా నిరూపించిన మహామహుడు భానుమూర్తిగారు. ఈయన భరతమాతను గూర్చి వ్రాసిన మాలికాస్తవము✻సారస్వతములో "పూతమెరుంగులు " వలె శాశ్వతముగా ఉండవలసినంత గొప్పది.

---

§ చూ॰ ఉపేంద్రశర్మ గారి వ్యాసము - భారతి, సెప్టెంబరు 1945.

భానుమూర్తి గారి కృతులు: జయదేవ పద్మావతుల చరితము, ఒకమహాపురుషుని చరితము, బాలచంద్ర చరితము, పరమార్థ తత్త్వసారము, సత్యహరిశ్చంద్ర చరితము, దేవయానికథ, ప్రియదర్శిక (తెనుగుసేత), వదాన్యుని చరిత్రము మొదలైనవి.

◆ ఓ.వై. శ్రీదొరసామయ్యరుగారి ఆనందమరమీ కాలానిదే! అందులోదే వందేమాతరగీతం.

✻ "శరదభిరామచంద్రికలు చారువసంత సుమోత్కరంబులున్
సరసిజసౌరభంబు వెదజల్లెడు వేకువ కమ్మ తెమ్మెరల్
పరిమళముల్ దిగంతముల బర్వగవీచెడు సంజపయ్యెరల్

గాంధీగారికి పూర్వమే రాజకీయానికీ నైతికానికీ వంతెన గట్టిన వాడు ముట్నూరి కృష్ణారావుగారు! గాంధీగారు నిర్మాణ కార్యక్రమము ప్రారంభించనపుడు వీరందరూ* హరిజన సమస్యను తీర్మానించిన మహనీయులు! డాక్టరై సమస్త విషయాలలో అంకెలు జిహ్వాగ్రమందున్న సర్వతో ముఖ ప్రతిభాశాలి పట్టాభిగారు!

శ్రీ గాంధీగారు న్యాయవాద వృత్తిని వదలమనకపూర్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కోసం వృత్తిని వదలిన న్యాయవాదిధీరుడు కొండా వెంకటప్పయ్యగారు!

ఈయన కొంతకాలం 'ఆంధ్రోద్యమం'లోనూ కొంతకాలం 'భారత

---

వరఫలపుష్పసంతతుల భాసిలు రమ్యలతాద్రుమావళుల్
సరసరసాలపల్లవఫలంబులు మేసి యెలుంగులిచ్చెడున్
బరభృత కీరశారికలు పాడెడు మత్త మధువ్రతంబులున్
ఖరకిరణుందివింబొదవి కార్కొనుమబ్బులు గ్రొమ్మెరుంగులున్
సురుచిరరత్న కాంతులను చూడ్కుల కింపగు నింద్రచాపముల్
తరణికరంబులం ధరణి దాకగనీక తనర్చు వల్లకీ
సరళతమాలసాల పనసక్రము కాంమపటీర కేతకీ
కురవకకింశు కాదికుజకుంజసమంచిత కాననంబులున్
హరితతృణాగ్రముల్ మెసవి యంబరవీధిని గ్రేళ్ళు దాటుమేల్
హరిణ చయంబు నృత్త సమయస్ఫుటపింఛములౌ మయూరముల్
సరసిజలక్ష్మి జెన్నెసగుసారసభృంగమరాళ చక్రబం
ధురనినదంబులం బొదలు తోయరుహాకము ల్ల సచ్ఛవి
స్ఫురదురువిద్రుమంబులును శుభ్రవినిర్మల మౌక్తి కంబులున్
తరళతరంగమాలికల దద్దయు నొప్పెడు సాగరంబులున్
స్ఫురదమలాంశుజాలముల బొంపిరివోయెడు రత్నసానువుల్
పరగు గిరివ్రజం బమలవార్లహరీరమణీయవాహినుల్
ధరపై స్వర్గసౌఖ్యమిడు తల్లిరో! నీప్రజ కెల్ల కాలముఁ'
"మతముల సొచ్చి నిల్లు జనమాన్య చరిత్రుల పుట్టినిల్లు న
ప్రతిమదయాశమాది గుణరత్న సమృద్ధికి రోహణాద్రి శా
శ్వతనిరపాయసౌఖ్యఫలభాసురవల్లికి నాలవాలమై
యతులవిభూతి బొల్తు విల నంబరో! నీ సరిధన్యులుఁయరే!"

* వీరిలో భానుమూర్తి, భాస్కర రావు నాడు [illegible] సర్కారు నౌకరిలో చేరి 'గవర్నమెంటు ట్రాంసులేటర్లు' అయినారు.

స్వరాజ్యోద్యమం'లోనూ దేశసేవ చేసినారు. ఒక మారు అఖిల భారత కాంగ్రెసు సభకధ్యక్షుడు అయినాడు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని అనేకమార్లు శ్రీ కృష్ణ జన్మస్థానం అలంకరించినాడు. అఖిలభారత నాయకులలో ఒకడు ఇప్పటికిని వృద్ధులైనను శరీర దార్ఢ్యము లేకపోయినను దేశసేవకై జీవితమును వ్యయిస్తున్నాడు. 1943 వ సంవత్సరములో తటస్థించిన రాయలసీమ క్షామసందర్భాన దూరదేశమునకు ధనార్జనమునకై పోయి ధనము సంపాదించి దానిని బీదజనుల కందజేయడంలోను, ఇతర విధాల సహాయ పడుటలోను, స్వయంగా కష్టించినాడు; అందుకోసం కృతజ్ఞతను తెల్పుతూ, జూన్ 44లో అనంతపురంలో అఖండ సన్మానం చేసినారు ప్రజలు.

ఈ విధంగా జాతీయ సారస్వతం వచ్చిన తర్వాత సంఘ సంస్కారోద్యమం వెనుకకు పట్టినది. క్రొత్తనీరు పాతనీటిని కొట్టివేసినది. కాని సంస్కారమున్న చిత్తవృత్తులు కాబట్టి ఈజాతీయ బీజాలు ప్రజా హృదయాలలో నాటుకొనిపోయినవి. త్వరలోనే కందళించినవి. యువకులనేకులు గొప్ప వక్తలైపోయినారు. హరిసర్వోత్తమ రావుగారూ, బోడి నారాయణ రావుగారూ, కవుతా శ్రీరామశాస్త్రి గారూ చరిత్రాత్మకంగా జాతీయోపన్యాసాలిస్తూ ఉంటే వేలకు వేలు ప్రజలు చీమ చిట్టుక్కుమనే శబ్దం కాకుండా వింటుండేవారు.◆

ఈవిధంగా మంచిరసవంతమైన శైలిలో ఉపన్యాసాలిచ్చే పద్ధతి యీకాలపు విశేషాలలో ఒకటి. సంఘసంస్కరణ దినాలలోకంటె యీకాలములో ఉపన్యాసకుల సంఖ్య యెక్కువై పోయినది. జాతీయకవిత్వం, వక్తృత్వం ఈకాలము సారస్వతాని కిచ్చిన ప్రయోజనాలు.✻

అప్పటి కాలపు మహాపురుషు లిప్పటికీ ఉండి ఈ వక్తృత్వాన్నప్పుడప్పుడూ అవసరంవచ్చినప్పుడు ప్రసాదిస్తూనే ఉన్నారు. ముట్నూరు కృష్ణారావు వేదిక పైన

◆ హరిసర్వోత్తమరావు నారాయణ రావుగార్ల పైన కేసు పెట్టినారు. సర్వోత్తమ రావు గారి ఎం.ఏ. పట్టంపోయినది. అప్పటినించీ "ముద్రవేశిన" దేశభక్తుడై జీవితమంతా దేశం కోసమే వినియోగించినాడు. 'స్వరాజ్' అనే వారపత్రికను 1912లో పెట్టి నడిపినాడు.

✻ ఈ ఆంధ్రవక్తృత్వశక్తి సహాయనిరాకరణోద్యమంలో గొప్ప ఉన్నతికి వచ్చినది. ఆంధ్ర రత్నంలో అది సంపూర్ణ పరిణామం పొందినది.

మూకుడల్లా వాచాలుడౌతాడు! అనర్గళధార! ఉదాత్తభావాలు! వేదాంతం సంసారానికి అన్వయింపచేసే ప్రతిభ! కృష్ణాపత్రిక సంపాదకీయాలు చదివితే ఆయన ఉపన్యాసధోరణికూడా బోధపడుతుంది. నోరూ కలమూకూడాఒక్కబిగిన బుద్ధి వైభవంతో ఆడే ప్రజ్ఞావంతుడీయన.‡ ప్రవర్తనలో ప్రహ్లాదుడు! వంచినతలను ఆఫీసుకు వెళ్ళినదాకా ఎత్తడు. వంకతేరి పొడుగాటి తోకగల తలగుడ్డ, గోచీ కుచ్చెళ్ళు కలిపి పట్టుకునే ఎడమచెయ్యి, గొడుగుపిడి చేతిలో పట్టుకొని కొస భుజానికి తాకేటట్టుగా పెట్టుకునే విన్యాసం, శిరఃకుంచనం.ు. ఆలోచనామగ్నమై ముఖం, చూస్తే ఆయన ప్రపంచంతో సంబంధంలేని ఒక ఆధ్యాత్మిక వ్యక్తిగా తోస్తూ ఉండేది. ఈయన దృష్టు్లు అతి తీక్ష్ణాలు.●

ఈయనకు సరిగా వ్యతిరేకం పట్టాభిగారు, (జననం 1880) ఆయన యెంతమూకుడో యీాయన అంత వాచాలుడు. ఎల్లప్పుడూ వాక్కు జీవనదిగా ప్రవహిస్తూ ఉంటుంది. ఈయన కూడా ఆంధ్రాంగ్లాలలో అనర్గళంగా ఉపన్యాసం ఇయ్యగల సమర్థుడు. ఈయన బుఱ్ఱ ఎట్టిదోగాని దానిలో ప్రపంచమంతా ఉన్నది. ఈయన కచుంబితవిషయమంటూ లేదు. తర్కం సహజంగా వస్తుందీయనకు! వాదనలో యీాయనను మించటం సులభసాధ్యం కాదు. గాంధిగారి తత్వానికీయన వ్యాఖ్యాత అయినాడు. మంచి వ్యావహారికాంధ్రం మాట్లాడుతాడు. హిందీలోకూడా ఉపన్యాసధోరణి అలవాటుచేసి సిద్ధప్రజ్ఞుడైనాడు. అత్యంతమైన ప్రపంచ జ్ఞానం కలవాడు. ఈయన మాట్లాడుతూ ఉంటే క్లుప్త లేఖకులుకూడా వ్రాయటం కష్టమే! ఆంధ్రదేశ దురదృష్టంచేత అనేక సంవత్సరాలీయన కాంగ్రెసునాయకుడై ఆంధ్రదేశానికి ముఖ్యంగా కావలసిన రాష్ట్రోద్యమానికి దూరుడైనాడు. కాంగ్రెసు ప్రెసిండెటైనా

---

‡ సర్వవిషయాలలోనూ, సర్వశాస్త్రాలలోనూ సామాన్య జ్ఞానంతో కాక, కూలంకష పరిజ్ఞానంతో విమర్శించేవారు. గిరీశం చెప్పినట్లు కృష్ణా రావుగారితో మాట్లాడటమే వారి సాహచర్యమే ఒక ఎడ్యుకేషన్. - భారతి, జులై 45.

● రసాస్వాదనకు రెక్కలువిప్పి వెలార్చే విహంగమవ్యక్తి కృష్ణారావుగారు రససిద్ధిని బడయుదానికి విసువు లేకుండా అంచనాలు వేసే రసికమూర్తి.... భారతి 1936 ఏప్రిల్

వీరికి సంతాననష్టం గలిగినందుకు ఆంధ్రదేశమంతా దుఃఖించినది.

కాలేదు. కాని గొప్ప ఆంధ్రవక్తల్లో చేర్చదగినవాడు. ఒక గ్రాంధికత్వం వదిలితే కొక్కొండ వారితో సమానుడనవచ్చు వక్తృత్వంలో.

చెరుకువాడ నరసింహం, అవటపల్లి నారాయణ రావుగార్లున్నారు. వీరిలో నరసింహంగారు ఎంతవక్తో అంత వ్రాతగాడు.◆ కృష్ణాపత్రికలో హాస్యప్రధానాలైన విమర్శలూ అవ్వీ చదివేవారికి ఆయన సంగతి బాగా తెలుస్తుంది. ఆంధ్రదేశంలో ఉన్న గొప్పవక్తల్లో ఒకడు. ●ఇన్స్యూరెన్సుమీద ఉపన్యాసాలిచ్చినా అవికూడా వివృతవక్త్రాలతో వినవలసినదే! గొప్పవ్యక్తి.

ఇక నారాయణ రావు గారు (1878 - 1945) దేశ సేవకై అవివాహితుడై పోయినవ్యక్తి. ఈయన కలమూ, నాలుకాకూడా బెత్తాలవంటివి. ఈయనను రంగూనుకు పంపిచ్చినాము.✻ అక్కడ ఆంధ్రులకోసం చాలా పాటుపడ్డాడు. ఆంధ్రమహాపురుషులను గూర్చి "విశాలాంధ్రము" అనే పేరుతో ఒక గ్రంధం వ్రాసినాడు. కొందరు ఆంధ్రమహాపురుషుల జీవితాలందులో ఉన్నవి. యీయన్ని గూర్చి భారతి ఇలా వ్రాసింది :-

"వీరు తొలిజీవితమునందు దేశోపకారి, కృష్ణాపత్రికలకు సంపాదకులుగాను, ఆంధ్రపత్రికకు సహాయసంపాదకులుగాను, ఆంధ్రజాతీయ కళాశాలలో ఆచార్యులు గాను కొన్నాళ్ళపాటు మాతృదేశములోనే గడపి, పిదప బర్మా ఆంధ్రుల సేవకై అక్కడికి పని కట్టుకొని వెళ్ళి, అక్కడి కార్మికుల కష్టనిష్ఠురములలో ఇనుమిక్కిలిగా అదుకొని, వారికి ఆప్తబంధులై పోయినారు.......... బ్రతుకంతయు బ్రహ్మచర్యముతో గడిపిన నైష్ఠికుడు!"

ఈ కాలంలో బందరులో ఉన్న ఒక మహామహుడిని ప్రశంసించ వలసివస్తున్నది. ఇదివరకు పరిచితుడైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు. ఈకాలంలో ఆయన బందరు హిందూహైస్కూలులో తెనుగు పండితుడుగా ఉండి సంస్థకు గౌరవం తెచ్చినాడు. ఆయనకు కోపంవస్తే స్కూలులోనించీ వెళ్ళి పోతాడేమోనని భయపడుతూ ఉండే వారు స్కూలు అధికారులు! పింగళి వారికీ, కాటూరు వారికి

---

◆ఈయనకు"ఉపన్యాసకేసరి" అని బిరుదునిచ్చిన దాంధ్రదేశం. దానికి తప్పక తగినవాడు.

● 'కలియుగ' అనే పక్షపత్రిక 1929లో మొదలిడి బందరునుంచి ప్రచురించేవాడు.

✻ 'కార్మికపత్రిక (1925) స్థాపించి రంగూన్ లో కృషిచేసినాడు తిరిగివచ్చి యిక్కడనే కొంతకాలం పనిచేసి గతించినాడు.

కూడా అప్పుడే వారి శిష్యత్వం లభ్యినది. ఆయన ఉపన్యాసధోరణి చెబితే తేలేదికాదు. సభలో వాళ్ళందరూ ఒక్కమాటు అల్లరి చేస్తున్నారనుకోండి. శాస్త్రిగార్ని వేదిక మీదికి ఎక్కిస్తే ఒక్క పద్యం విసిరి వేసినాడా అంటే అంతా నిశ్శబ్దమే! అక్కడినుంచీ ఘంటలు ఘంటలు! కిక్కురు మంటే ఒట్టు! మాటలాడితే ఎక్కడ మాటపోతుందేమో అని భయపడే వారు సభాసదులు. ముక్కుతో పద్యాలు చదువుతూఉంటే ముద్దులు మూటకట్టినట్టుండేవి.

అందరూ అన్ని ముత్యాలు - గుంటూరులో శనగపల్లి రామ స్వామిగుప్త◆ అని ఒక వైశ్యశిఖామణి ఉండేవాడు. బొంగురుపోయిన గొంతు. అనర్గళంగా మాట్లాడేవాడు. కాని ఆయనను నవ్వులాటగా హేళనచేస్తూండేవారు అంతా. వద్దన్నా సమయం చూచుకుని వేదిక మీద గభిక్కిన యెక్కి ఉపన్యాసము ప్రారంభించేవాడు.✻

ఈవిధముగా ఆంధ్రోద్యమము ప్రారంభము కావటము, తత్ఫలితముగా వక్తలు పలువురు తయారవడము జరిగినది. దేశాభిమానము ప్రోత్సహించగా కవిత్వము తెలుగునాట వృద్ధి చెందినది కూడా! ఇట్లా ఆంధ్రోద్యమము-వక్తృత్వము - ఒండొంటితో పెనవేసుకుని కవిత్వానికి మంచి దోహదముగా పరిణమించినవి.

---

◆ ఈయన 'ఆర్యవైశ్య' అనే వారపత్రిక 1911లో స్థాపించి వైశ్యోద్ధరణకై పూనినాడు. ఇతని తర్వాత యీపత్రిక కొప్పరపు సుబ్బారావు సంపాదకత్వాన కొన్నాళ్లు నడిచింది.

✻ ఒకమారు గుంటూరుకు గవర్నరుగారు వస్తున్నారు. ఈగుప్త గారిని ప్లాటుఫారం మీదికి రానియ్యవద్దని కలెక్టరుగా రుత్తురువిచ్చినాడు. గుప్తగారు ముందు రైలులో బెజవాడవెళ్ళి అక్కడినుంచి గవర్నరుగారి స్పెషలు బండిలోనే గుంటూరువచ్చి, ఈయనతోపాటుదిగి, "ఈయనే కలెక్టరు" అని కలెక్టరుగారిని గవర్నరుగారికి పరిచయం చేశాడట! అందరూ ఆశ్చర్య నిమగ్నులైనారట!

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

# 6

## ప్రజల్లో విజ్ఞానవ్యాప్తి - నవల - పరిశోధన:

ఒకవంక కృష్ణారావు పట్టాభిత్యాదులు రాజకీయవాతావరణంలో పనిచేస్తూఉంటే మరొకవంక ఇతరులు విజ్ఞాన వాతావరణానికి ప్రాముఖ్యమియ్యటము మొదలుపెట్టినారు. జాతి సర్వతోముఖముగా అభివృద్ధి కావలెనంటే అన్ని విధాల విజ్ఞానములవడ జేసుకొనవలె. బంగాళా దేశానికి మొట్టమొదట ఆంగ్లవిజ్ఞానసంపర్కము కలిగినది. అందుచేత వాళ్ళు సమస్తశాస్త్రాలు, కళలు, మొదలైనవాటిలో జ్ఞానము పెంచుకున్నారు. ప్రక్కనున్న మహారాష్ట్రులకు కూడా యీ గాలి తగిలినది. వారుకూడా తమవిజ్ఞానము అభివృద్ధి చేసుకోటానికి కృషి చేస్తున్నారు. అసలు మహారాష్ట్రులకూ ఆంధ్రులకూ సంబంధమెక్కువ. ఇద్దరూ పంచద్రావిడులలోవారే! లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుడు వెనకకాలములో, ఇటీవల సర్కారుగారూ కూడా, మహారాష్ట్రులు రాజ్యాంగమంతా ఆంధ్రుల దగ్గిరనుంచి గ్రహించినారని చెప్పినారు. ప్రాచీనాంధ్రులు పైఠను పట్టణము రాజధానిగా ఏలినారు. ఆంధ్రులయొక్క కళాకౌశలాన్ని తెలియచేసే ఎల్లోరా అజంతాచిత్రాలు మరాట్వాడాలో ఉన్నవి. మరాట్వాడకు వలస వచ్చినారు ఆంధ్రచాళుక్యులు. రెండుజాతులు [illegible]. మహారాష్ట్రులు ఈశతాబ్దాదికే ఒక విజ్ఞానకోశము తయారుచేసుకుంటూ, ఇతర శాస్త్రాలలో గ్రంధాలు విరివిగా రచించుకుంటున్నారు. బంగాళావారు అంతకు పూర్వము పాఠశాలలో చెప్పే హిందూదేశచరిత్ర తప్పులతో నిండి ఉన్నదని గ్రహించి నిజమైన చరిత్రను వ్రాసుకొన్నారు. ఇంకా వ్రాస్తున్నారూను! రమేశచంద్రదత్తు; బి.డి.బాసూ; జడూనాథ్ సర్కారు గార్లు చరిత్రపరిశోధన చేసినారు. ఇప్పుడుకూడా మరికొందరు చేస్తూ ఉన్నారు. మహారాష్ట్రులలోకూడా లోకమాన్యుడు, డాక్టరు భండార్కరు, సర్దేశాయి, మొదలైనవారు చరిత్రను పునర్నిర్మాణము చేయుటానికి గట్టి ప్రయత్నాలు చేస్తూ చాలామట్టుకు వ్రాసినారు.

ఈ కాలానికి పూర్వమే చాలా ఆంధ్ర కుటుంబాలు మధ్య రాష్ట్రాలకు వలస పోయి అక్కడ స్థావరా లేర్పరచుకున్నవి. అట్టి కుటుంబాలకు కొన్నింటికి ఆయా రాష్ట్రములయొక్క సంపర్కముచేత తమ స్వంత విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలని ఇచ్ఛ జనించినది. అట్టి కుటుంబాలలో కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారి మేనమామగారి కుటుంబం ఒకటి.

## కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు:*

వీరిది నిజాంరాష్ట్ర సరిహద్దులలో పెనుకంచిప్రోలు అనే గ్రామం. వీరి కుటుంబం వారిప్పటికీ ఆ ఊరిలో చాలా ప్రాభవంతో ఉన్నారు.◆ ఈయన† ఆంగ్లములో యెం. ఏ. పరీక్ష ప్యాసైనాడు. ఈయన చిన్నప్పటినుండి [illegible] ప్రాంతాల్లో ఉండేవాడు. క్రమంగా మళ్లీ ఆంధ్రదేశానికి వలస వచ్చినాడు. [illegible] రాష్ట్రంనుంచీ రావటంచేత అక్కడి సంస్కారంతో వచ్చినాడు. [illegible] స్వదేశభాషాభివృద్ధుల కుపయోగించవలెనని సమకట్టినాడు. మునగాల రాజాగారు కూడా విజ్ఞానవంతుడు కాబట్టి, విజ్ఞానంగల ఈయన, ఆయన కంటబడినాడు. ఆయన ఈయనను దివానుగా పెట్టుకున్నాడు. దివానుపదవి [illegible] కొరకేతప్ప మిగిలిన యావత్తు కాలము దేశభాషాసేవలకోసము [illegible]. రాజులంతా తమ రాజ్యాలు వదలి పట్టణాలలో ఉంటూఉండటం [illegible]. ఆవిధముగా చెన్న పట్టణములో ఈయనకుకూడా ఉనికి లభించినది. ఈయన ఆశయాలవంటి ఆశయాలు కలవారు అన్యోన్యము ఆకర్షింపబడినారు. [illegible] మండలిగాచేరి, ఆంధ్రభాషలోనికి చరిత్రలు, శాస్త్రాలు, ఇంకా ఇతర [illegible] తెచ్చుకోవాలనీ, వీలైతే మహారాష్ట్ర విజ్ఞానకోశములాంటిది ఒకటి తయారు చేయాలని సంకల్పించినారు. ఏనాడా సంకల్పము కలిగినదో భాషకూ జాతికీ [illegible].

---

* చూ. సేవావ్రతి శ్రీ కొమఱ్ఱాజు - మల్లంపల్లివారి వ్యాసము [illegible]

◆ బెజవాడలో వైద్యవృత్తిలో ఉన్న కొమఱ్ఱాజు అచ్యుతరామారావుగారు [illegible]

† ఈయనకు ఆంధ్రాంగ్ల, సంస్కృత, మహారాష్ట్ర, బంగాళీ, [illegible] ఉండినది. 1944 జూన్ 13 తేదిన యావదాంధ్ర దేశంలో ఈయన [illegible] జరుపబడినవి. బెజవాడలోని అభ్యుదయ రచయితల సంఘం [illegible] ఉదాత్త వ్యాసములతో ప్రకటించినారు. చూ: 'తెలంగాణా [illegible]'

తాను స్వయముగా చారిత్రకుడౌటచేత తాను చరిత్రను గ్రహించినాడు. ఇతరులకు వారి రుచినిబట్టీ, యోగ్యతనుబట్టీ విషయాలను ఏరి ఇచ్చినాడు. "విజ్ఞాన చంద్రికాగ్రంథమండలి" అని ఒక సంస్థ స్థాపించినాడు.

ఈసంస్థ దేశభాషలకు చాలా ఉపకారము చేసినది. చరిత్రపుస్తకాలు ప్రకటించినది. నవలలను ప్రచురించినది. ఆంధ్రులచరిత్ర రచన చిలుకూరి వీరభద్రరావుగారికి * లభించినది. రసాయనశాస్త్రం వేమూరి విశ్వనాథ శర్మగారు, పదార్థ విజ్ఞానశాస్త్రం మంత్రిప్రగడ సాంబశివరావుగారు, ఆరోగ్యవిషయాలన్నీ డాక్టరు లక్ష్మీపతిగారు, ఈవిధంగా గ్రంథాలువ్రాశారు, కొన్నాళ్ళకు అర్థశాస్త్రము కట్టమంచి రామలింగా రెడ్డిగారి పాలబడినది. ఇవిగాక చరిత్రాత్మకమైన నవలలు, రాయచూరు యుద్ధము, విమలాదేవి, విజయనగరసామ్రాజ్యము మొదలైనవి రచింపబడినవి. అనేక విజ్ఞానవిషయాలు ఈసంస్థ అవలోడన చేసినది. పుస్తకాలు కూడా మంచిఅచ్చు, మంచిబైండుతో ఉండేవి. లోపలి విషయానికి వంకలేదు. కాబట్టి చాలాప్రచారము చెయ్యగలిగినదీ సంస్థ. చందాదారులనుచేర్చి వారికి సంవత్సరానికి కొన్ని వందల పేజీలు లభించేటట్టు చేసి విజ్ఞానప్రచారం చేసినది.

లక్ష్మణరావుగారు (1877 - 1927) గొప్ప వ్యక్తి. ◆

ఆయనబుద్ధి యెంత నిశితమో విజ్ఞానమంత విశాలం*f*. ఆయనకు రాని విషయం లేదు. వేదాల దగ్గిరనుంచీ చీట్లాటదాకా సమస్తసంగతులు ఆయనకు జ్ఞాతాలే!

---

* ఈయన 'ఆంధ్రకేసరి' అనేవారపత్రికను 1913లో స్థాపించి ప్రకటించినాడు కొన్నాళ్ళు.

◆ ఆయనను కనుక్కొని, అవసరమైన యెస్టేటుపనిని జాస్తీగా ఆయనకియ్యకుండా, దేశభాషాసేవకు సంపూర్ణావకాశం కలగజేసినందులకు మునగాల రాజాగారికి వందనాలు. అలాకాకపోతే లక్షణరావుగారి మేధఅంతా బీటగాచిన వెన్నెల అయ్యేది.

*f* "మహారాష్ట్రేతిహాసిక పరిశోధకమండలితో వాదించి పంచవటిని నాసికనుండి భద్రాచలమునకు సాధించినారు తెలుగునుండి త్రిలింగము నోడ్చినారు."

-మున్నంగి లక్ష్మీనృసింహశర్మ.

ఈమున్నంగి మహాపురుషుల జీవితాలు కొన్ని వ్రాసినాడు. భారతం కొంత పరిష్కరించినాడు ఆయన అనేక వాక్చిత్రాలు రచించినాడు. 'యుంగంధర' అనే వారపత్రిక 1927లో స్థాపించి కొంత కృషిచేసినాడు. ఈపత్రికను తర్వాత యన్. తిరునారాయణ స్వామిగారు నడిపినారు.

అందులో ఎలా? ఆమూలాగ్రంగా! ఆయన మనిషినిచూస్తే ఇంత విజ్ఞానవంతుడని కనపడడు. సామాన్యంగా ఎప్పుడూ మహారాష్ట్రులనేపథ్యమే అవలంబించేవాడు. మెడమూసిన పొడుగుకోటూ, నెత్తిన తలగుడ్డా, కుడిచంకకిందినించీ యెడమభుజం మీదికి ఉత్తరీయం అవసరమొస్తే లాగూ లేకపోతే పింజపెట్టి కట్టిన ధోవతీ, ఇది ఆయన దుస్తులవివరం. ముఖం ప్రశాంతంగా సత్వప్రధానంగా ఉండేది. తొందరనేదిలేదు మనిషిస్వభావంలో! ప్రతివిషయము పూర్వాపరాలాలోచించేవాడు. విషయచర్చలో ఆయనతోసమానులు చాలమంది ఉండరు. కారణం లేకుండా మాట్లాడేవాడుకాడు, వ్రాసేవాడుకాడు. విషయచర్చలో ఆయనతో సమానులు చాలమంది ఉండరు.

ఇప్పటి పరిశోధకులు చాలామందివలె ఆయన గప్పాలెప్పుడూ కొట్టేవాడుకాడు. ఆయనకు సామాన్యంగా నిర్దుష్టమైన దోనేస్ఫురించేది. ఆయన వ్రాసిన హిందూమహాయుగం,మహమ్మదీయ మహాయుగం, సర్వకాలాలకూ పనికివచ్చే గ్రంధాలు. బ్రిటిషుమహాయుగం వ్రాయటానికి భగవంతుడు ఆయురారోగ్యం ఇయ్యలేదు. ఆయనకు మనుష్యులను కనిపెట్టి వారికి కర్తవ్యం పంచిపెట్టటంలోనూ, తగిన పనులకు తగిన వ్యక్తులనే నిర్ణయించడంలోనూ, చాలా సూక్ష్మదృష్టి ఉండేది. ఆయన నిరాడంబరజీవి◆! ఆంధ్రుల చరిత్రను పరిశోధించి వ్రాసిన చిలుకూరి వీరభద్రరావుగారు కొవ్వూరుచేరి పల్లెటూరి జీవనము గడపి అత్యంత నిరాడంబరముగా చివర దినాలు వెళ్లబుచ్చినాడు. అందరూ ఆయన్ను తలచుకునే దినాల్లో కూడా హాళ్ళూవెళ్ళూ లేకుండా "ఈయనా వీరభద్రరావుగారూ!"§ అనిపించుకున్నంత నిగర్వి! శాస్త్రవాఙ్మయం, రసాయనశాస్త్రం వ్రాసిన వేమూరి విశ్వనాధశర్మగారు ఉద్యోగంలో ఉన్నా ఆడంబర మెంతమాత్రం లేకుండా విశ్రాంతికాలంలో విజ్ఞానార్జనం, దేశభాషాసేవా, చేస్తున్న వ్యక్తి.✻ పదార్థ విజ్ఞానశాస్త్రం వ్రాసిన మంత్రిప్రగడ సాంబశివరావుగారు గుంటూరు కాలేజీలో ఉపాధ్యాపకవృత్తిలో ఉండిరి.

◆ అందుచేత ఈయన సంపర్కం కల్గినవారంతా చాలామట్టుకు నిరాడంబర జీవులే!

§ ఈయన తిమ్మరసు, తిక్కన, రామరాజు చరిత్రలు వ్రాసినాడు.

✻ ఈయన ఉపాధ్యాయబోధిని' అనే పత్రిక 1918-27 లలో నడిపి విద్యా విషయకమైె చాల కృషి సలిపినాడు.

ఆరోగ్యశాస్త్రగ్రంధాలు రచించిన డాక్టరు లక్ష్మీపతిగారు.† ఒక ఆదర్శజీవి. మత, సంఘిక, రాజకీయ సంస్కారాలను జీర్ణింపచేసుకొని ఆచరించిన మహామహుడు, దక్షిణదేశంలో దేశీయ వైద్యానికి పండిత డి. గోపాలాచార్యులుగారి తర్వాత ప్రవక్త. ఆలోపలిలోనించి ఆయుర్వేదానికి వచ్చినవాడు. నిరాడంబరజీవి. ఈయన అఖిల భారతవ్యక్తియైనాడు. దేశీయవైద్యవిషయంలో ప్రామాణికులలోని అగ్రగణ్యులలో ఒకరు. అనేక ఆయుర్వేదగ్రంధాలు ప్రచురించినాడు. ఈయనకు పూర్వం పండిత డి. గోపాలాచార్యులుగారు మాధవనిదాన, చరక, శుశ్రుతాది వైద్యగ్రంథాలను సటీకలుగా ముద్రించి ఆంధ్రవిజ్ఞానానికి మహోపకారం చేసినాడు, మద్రాసులో ఆయుద్వేదకళాశాలను స్థాపించి దానికి అనుబంధంగా ఆసుపత్రిని నెలకొల్పినాడు. ఆ భారమంతాఆయనతర్వాత లక్ష్మీపతిగారిమీద పడినది. నిర్వహించడంలో ఎట్టి పొరబాటూ లేకుండా ఔననిపించుకుంటున్నాడు! ఏ దేశక్షేమకరోద్యమంలోకూడా మొదటిశ్రేణిలో ఉంటాడు.

రెడ్డిగారినిగూర్చి నేను చెప్ప సాహసించను. ఈయన గొప్ప విజ్ఞాని, చరిత్ర వేత్త, బుద్ధికుశలుడు, వక్త. ఈయన వ్రాసిన గ్రంథాలలో అర్థశాస్త్రం (విజ్ఞానచంద్రికా ప్రచురణం) గొప్పగా రచించినాడు. వర్ణాశ్రమ వ్యవస్థపైన ఈయన కున్న అసహ్యత అర్థశాస్త్రం ప్రతి పుటలోనూ కనపడుతూ ఉంటుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి 12 సంవత్సరాలు వైస్ ఛాన్సెలరుగా ఉన్నాడు. ఈయనకాలంలో చెప్పుకోతగ్గ మార్పేమీ జరగలేదు*. కాని మైసూరు, ఉస్మానియా విశ్వవిద్యాలయస్థాపనంలో ఈయన సలహాలను స్థాపకులు తీసుకొనినారు. పెరటి చెట్టు మందుకురాదనే సామెత

---

† 'శ్రీ ధన్వంతరి' అనే పక్ష పత్రికను 1915లో స్థాపించి ఆరోగ్యానికి పాటుపడినాడు. రాజకీయరంగంలో ఉండి మద్రాసు మంత్రిణియైన ఆచంట రుక్మిణమ్మ గారీయన భార్యయే. ఆలిండియా రేడియోలోఉన్న ఆచంట జానకిరాం, నవ్యసాహితీ పిపాసీ, సాధకుడూ లక్ష్మీపతిగారి కుమారుడే!

* "విక్రమదేవ టెక్నికల్ కాలేజీ" సర్. రాధాకృష్ణన్ గారి హయాంలోది. రెడ్డిగారిహయాంలో ఎర్స్కిన్ కాలేజి అని 'నాచురల్ సైన్సుకు' భవననిర్మాణము జరిగినది

"కాని 1926లో ఏర్పడిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తు శ్రీ రెడ్డిగారి యాధ్వర్యమున చెప్పదగినంత ఉన్నతస్థితికి రాలేదని చెప్పుట సాహసముకాదు." - విజయవాణి 17-3-48

ఈయనకు వర్తిస్తుంది. ఇంగ్లాండులో చదివిన భారతీయులకందరికీ పేరు తెచ్చినాడు. ప్రపంచమంతా సంచరించి విద్యాపద్ధతులన్నీ గమనించాడు. యువకుల కుద్బోధం కలిగిస్తూ స్నాతకోపన్యాసాల నిచ్చినాడు. జస్టిసుపక్షంతో శరీకరించి వారి పతనానికి హేతుభూతుడైనాడు. కాంగ్రెసుతో తత్కార్యాలను విమర్శించినాడు◆. ఒక కాలు రాజకీయంలోనూ, రెండో కాలు విద్యాశాఖలోను పెట్టుకొని నాట్యమాడుతున్నాడు! ఆంధ్రములో నిష్ణాతమైన ప్రజ్ఞ కలవాడు. ఆంధ్రాంగ్లాలలో రెంటిలోను చక్కగా హృదయంగమంగా మాట్లాడకలిగిన వక్త. ఇంగ్లీషులోకూడా ఈయన వలె మాటలాడగలవారు చాలామంది లేరు! గొప్ప ప్రతిభాశాలి. ఇతర విషయాలలో ఎంతవాడైనా ఈయనపేరు శాశ్వతంగా నిలిపేది ఈయన సారస్వతసేవే. దాన్ని వేరే విపులముగా ముచ్చటించుకుందాము!

గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు కూడా కొమఱ్ఱాజుతో సంపర్కము కల్గిపనిచేసినవాడే ! ఈ కాలమునాటికే ఆయన "విస్మృతరాజ కవి" (Forgotten Emperor Poet) "అబ్రహం లింకను" మొదలైన గ్రంధాలు రచించి ఉన్నాడు. హిందూదేశ చరిత్రతో పాటు ప్రజలకు ప్రపంచ చరిత్రకూడా చెబితే వారి దృష్టి విశాలమౌతుంది. ఆ ఉద్దేశముతో ఈయన "ప్రపంచ చరిత్ర" ను సంపుటాలుగా ప్రచురించ మొదలుపెట్టినాడు. కొన్ని సంపుటాలు ప్రకటించే టప్పటికే ప్రయత్నము కుంఠీభవించినది. దేశంతోడ్పడలేదు. ఇంతలోనే ఆంధ్రపత్రిక దినపత్రిక అయి దానికి సంపాదకుడుగా వెళ్ళినాడు. కొన్ని సంవత్సరాలక్కడ ఉన్నాడు.✻

ఈయనకూడా ధోవతీ, ఉత్తరీయం, చొక్కా, తప్ప యితర దుస్తులు వేసుకోడు. బహుక్లిష్టజీవి. ఈయన వక్తృత్వాన్నిగూర్చి యిదివరకే చెప్పినాను. ఇప్పటికీ ఇంగ్లీషూ తెనుగూ సమానంగా మాటలాడగల వ్యక్తులలో ఒకడు. దేశసేవ చేస్తూనేఉన్నాడు. లక్ష్మి ఆయనదగ్గిరికి పోకుండా తొలిగిపోయినది. అయితే

---

◆ ఈయన రాజకీయోపన్యాసాలను ప్రకటించినది మద్రాసు ముస్లింలీగు.

✻ "మాతృసేవ" అనే వారపత్రిక (1923-27) నంద్యాలనుంచి నిర్వహించినాడు ఈయనా క్రైప సుబ్రహ్మణ్యశర్మ అనే ఆయనా కలసి 'కౌమోదకి' అనే పక్షపత్రిక వైద్య విషయికమైన విషయాలను గురించి చర్చించేటందుకు 1929లో ప్రారంభించి నడిపినాడు.

సరస్వతీ సేవ చేస్తూ చిరకీర్తిని సంపాదించుకున్నాడు. దేశభక్తుడు. కొన్నాళ్ళు రాజకీయంలో పూర్తిగాదిగి శాసనసభ్యుడుకూడా అయినాడు. గ్రంథాలయోద్యమానికి ఈయన చేసిన సేవ అమోఘమైనది. పవిత్రజీవి.

ఈ విజ్ఞానచంద్రికామండలివారు కొన్ని నవలలు వ్రాయించినారు. వానిలో భోగరాజు నారాయణమూర్తిగారు వ్రాసిన "విమలాదేవి" కేత వరపు వేంకట శాస్త్రిగారు వ్రాసిన "రాయచూరుయుద్ధం" యెన్నదగినవి. వీనిలో రెండవది ఆంధ్రులచరిత్రకు సంబంధించినది. "విజయనగర సామ్రాజ్య" మనే మరో నవలకు 500 రూపాయల బహుమతివచ్చినది.◆ పాత్రపోషణలోగాని, కావ్యనిర్మాణంలోగాని, భావవిజృంభణంలోగాని, శైలీవర్ణనలలోగాని యెన్నదగిన విషయం ఇందులో లేదు. సంభాషణా, శైలీ, కుంటుతూఉంటని. "విమలాదేవి" ఇప్పటికీ ఎప్పుడైనా కంటబడితే కొన్ని భాగాలు చదవ బుద్ధిపుట్టుతుంది. "రాయచూరు యుద్ధం" మళ్ళీ చదివితే బాగుండును, అనిపిస్తుంది. "విమలాదేవి"లో ఉన్న "నిన్ను గాదురా! నన్నే రమ్మనెన' అనే చిత్రమూ మాటలూ సర్వకాలము జ్ఞాపకం ఉండదగినవి! భోగరాజు నారాయణ మూర్తిగారు ఒక వాఙ్మయచరిత్రకూడా వ్రాసినారు. 'ఆంధ్రరాష్ట్రము' నే నవల వ్రాసినారు. వీరు దివంగతులై ఆంధ్రభారతికి కన్నీరు కల్పించినారు. కీర్తి శేషుడు! ఈ సందర్భంలోనే ఎ.వి. నరసింహంపంతులుగారి "పాతాళభైరవి" అనే నవలకూడా యెన్నదగినది. ఇది "విజయనగర సామ్రాజ్యం" కంటె అన్నివిధాలా ప్రశస్తతరం. పేరుమాత్రం బాగుండలేదు. లోపలి విషయాన్ని ఇంతకంటె మెత్తగా తెలియ జేసే పేరుంటే బాగుండేది! ఈవిధముగా నవలావాఙ్మయాన్ని పెంపొందించినదీ సంస్థ.

లక్ష్మణరావుగారు ఆంధ్రసాహిత్యానికి చేసిన సేవ అపారము. విజ్ఞానసర్వస్వ నిర్మాణానికి సంకల్పించినాడు. తాను ఒక్కడే నిర్వహించడానికి సమర్థుడేకాని, వయస్సు మీరుతున్నది. అందుచేత తమ పనిలో సహాయముచేయగల యువకులను ఏరినాడు. మల్లంపల్లి సోమశేఖరశర్మ,రాయప్రోలు సుబ్బారావుగార్లాయనకు కనపడినారు. చూడండి ఆయన వివేచనాశక్తి! ఈ ఇద్దరుకూడా భావికాలములో

---

◆ అది దు.రా సచ్ఛాస్త్రిగారి అదృష్టమేకాని వేరేకాదని నా అభిప్రాయం.

ఆంధ్రాభ్యుదయానికి అత్యంతంగా తోడ్పడిన వ్యక్తులు! వీరిలో ఉన్న తేజస్సు ఆయనను ఆకర్షించినది. వీరి యిద్దరిచేత పనిచేయిస్తూ ఉండేవాడు. విషయావలోడనం, విషయపరీక్ష, విషయవివేచనం, విషయానుకూలపదజాలనిర్మాణం మొదలైన పనులన్నీ తాను సలహాలనిస్తూ వీరిచేత చేయించినాడు. మెల్లగా మొదటి సంపుటము ప్రకటించినాడు. దేశముయావత్తు దిగ్భ్రమచెందినది. ఎంత విషయ వివేచనం! ఎంత పరిశోధన!* అప్పట్లో ఈ సంపుటముమీదే అందరికండ్లు పడినవి. ఇంతలో పరమేశ్వరుడు తన సాన్నిధ్యానికి తీసుకొనిపోయినాడు ఆయనను. ఆంధ్రదేశం ఒక గొప్ప వ్యక్తిని కోల్పోయినది! ధన్యజీవి!

ఈ విజ్ఞానసర్వస్వం విశ్వదాతచేతిలో పడినది. సోమశేఖరశర్మగారు ఆపనిమీదనే ఉన్నాడు కొన్నాళ్ళు. సుబ్బారావుగారు 1918 సంవత్సరంలోనే తెలంగాణం దోహదంచెయ్యడానికి ఆంధ్రమాత పిల్చినది. వెళ్ళినాడు! శర్మగారు ఒక్కచేతిమీదనే తత్కార్యమంతా చేస్తూండే వాడు. మార్పులు కావించినాడు. ప్రచురించినంతవరకు నూతనవిషయాలను చేర్చినాడు. తరావాత రెండో సంపుటం కూడా ప్రచురించినాడు. ఇంతవరకు పూర్తిగా 'అ' కారం అయినది.

విశ్వదాతగారికి ఒక్కపనా! ఒక్కవిషయమా! భాష, దేశం, మతం, దగ్గిరినించీ తోలుబొమ్మలాటదాకా ఆయన కక్కరలేని విషయం లేదు. వాటిలో సర్వస్వకార్యం ఒకటి! పోనీ అలాగైనా కొంతవరకు సాగుతుందేమో అంటే! అదీ జరగలేదు.◆ విశ్వదాతకూడా శివైక్యం చెందినాడు. సర్వస్వకార్యం ఆగిపోయింది.

విజ్ఞానచంద్రికా గ్రంథమాలవల్ల సాహిత్యానికి అలవడిన క్రొత్తవిషయాలేమీ అని అడగవచ్చు! అవి రెండుగా కనపడుతున్నవి. మొదటిది పరిశోధనా పద్ధతి నెలకొల్పబడటం. పరిశోధనమంటె యెలా ఉంటుందో దానికి సరియైన మార్గాలెవో వెనకటివారు సక్రమంగా వదిలిపోలేదు. చారిత్రకుడైన లక్ష్మణరావుగారు ఇంగ్లీషులో

---

* తుదకు "అలంకారము" అనే అంశంక్రింద యీ అల్పజ్ఞుడి పుస్తకంగూడా పేర్కొనినాడు.

◆ ఆంధ్రపత్రికా కార్యాలయమువారు మిగిలిన సంపుటములను (ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము) గూడఁ ద్వరలోఁ బ్రకటించినచో వీరి యాశయము సఫలము కాఁగలదు.

- ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం.27, సం.1.

పరిశోధనాన్ని తెలిసిఉండటంచేతా, ఆ పరిశోధనం మహారాష్ట్రంలోనూ, బెంగాలులోనూ యోలా సాగించారో బాగాచూచి ఉండటంచేతా, దాన్ని మనభాషలోకి తెచ్చినాడు. విషయాలను పౌర్వాపర్యప్రకారం నిర్ణయించటం, విషయాలలో దేని కెంత ప్రాముఖ్యమియ్యాలో తేల్చటం, తర్కం యేవిధంగా ఉపయోగించాలో చెప్పటం మొదలైనవన్నీ భాషలో సక్రమంగా నెలకొల్పినవాడు లక్ష్మణరావుగారు*. అదివరలో శల్యపుంజమై, పాశ్చాత్యులు తమ అవసరంకోసం వ్రాసిన చరిత్రను, పరిశోధనచేసి సత్యానికి దగ్గిరగా తేవటమూ, సారస్వతంలో ఒక భాగంగా ఉండడానికి తగినట్టు రచించటమూ ఈయన మనకిచ్చినధనం! 19 శతాబ్దంలో చరిత్రను సాహిత్యంలో చేర్చాలా వద్దా అనే ఒక ప్రశ్న కల్గింది, యింగ్లీషుసారస్వతచరిత్రలో. కవులంతా వీలులేదన్నారు. చారిత్రకులంతా చేర్చవలెనన్నారు. తుదకు మెకాలే, ఫ్రూడు మొదలైనవారు వ్రాసినచరిత్రలను సారస్వతభాగంగా ఒప్పుకున్నారు. ఆ విధంగానే విజ్ఞానచంద్రికా మండలివారు రచించిన చరిత్రగ్రంధాలన్నీ సాహిత్యాంతర్భూతాలేనని [illegible]. ఆయన రచించిన "వ్యాసావళి" మొదలైనవానిలో వారి పద్ధతులు చూడవచ్చు. ఇట్టి నిర్దుష్టమై, పరిశోధనా ఫలమైన చరిత్రరచనకు మూలపురుషుడు లక్ష్మణరావుగారు.

◆ ఇక రెండోది శాస్త్రరచనకు పనికివచ్చే పరిభాషాపదజాల నిర్మాణం. మహారాష్ట్రంలో అప్పటికే వ్యవహారకోశం పుట్టి పదజాలం స్థిరపడుతున్నది. ఆ

---

* ఈపద్ధతులే యిప్పుడు ఆంధ్రచారిత్రక పరిశోధకమండలివారు అనుసరించే..

◆ మద్రాసుగవర్నమెంటువారు, రై. అ. శ్రీనివాసశాస్త్రిగారి ఆధిపత్యముకింద ఒక [illegible] ఇందుకోసము ఏర్పాటుచేసినారు. వారు కొన్ని సలహాల నిచ్చినారు.

"(1) ఇప్పుడూ శాస్త్రీయపదాలకు సమానార్థకాలుగా దక్షిణదేశభాషల్లో ఉపయోగిం[illegible] స్థిరమైపోయినవై కాబట్టి వాటినే ఉంచడం మంచిది.

(2) దక్షిణదేశభాషలన్నిటిలో అవే ఉపయోగించడానికి ఒక శాస్త్రీయశబ్దాల పట్టిని తయారుచెయ్యవలె.

(3) వీలులేనిస్థలాల్లో ఇంగ్లీషుపదాలే ఉపయోగించటం మంచిది.

ఈసూత్రాల ననుసరించి ప్రతిభాష కొక ఉపసంఘం ఏర్పరచి [illegible] తయారుచేయించవలెను. తెనుగులోని ఉపసంఘం పట్టికను ప్రచురిస్తున్నాను." చూ. [illegible] ఈ సలహాలు కొమఱ్ఱాజువారు 30 యేండ్ల క్రిందటనే ఆచరణలో పెట్టినారు.

పద్ధతినే మన సాహిత్యంలో నెలకొల్పినాడు లక్ష్మణరావు గారు. పదార్థవిజ్ఞానశాస్త్రం మొదలైన ఒక్కొక్క శాస్త్రానికీ, వేర్వేరు పారిభాషికపదాలు అవసరం. ఈ శాస్త్రాలు సంస్కృతభాషలో కొన్ని ఉన్నవి! వానిలో కొన్ని పదాలున్నవి! కాని ఈ శాస్త్రాలు పాశ్చాత్యుల నూతన పరిశోధనలతో అపారముగా పెరిగిపోయినవి. అందుచేత వెనకటి పదజాలము చాలదు. అసలు ఏ పదజాలము ఉన్నదో పరిశోధన చెయ్యటం మొదటి పని, ఆ పదజాలముగాక అవసరమైన మిగిలిన పదజాలము సృష్టించడం రెండవపని. ఈ రెండుపనులూ కూడా చక్కగా నిర్వహించినారు లక్ష్మణరావుగారు. ఇవిగాక వీరుచేసిన మరిఒక మార్పు చాలా గొప్పది. కొన్ని ఇంగ్లీసుపదాలు సామాన్యంగా ప్రజల వాడుకలో ఉన్నవి. అటువంటివాటికోసం మళ్ళీ సృష్టి ప్రారంభిస్తే కష్టమే కాకుండా వాడుకలో లేకపోవటంచేత అర్థంకూడా కావు. కాబట్టి అట్టిపదాలకు యింగ్లీషుపదాలనే వాడటం వీరు నిర్ధారణ చేసినారు. ఈవిధమైన పనిమూలంగా వారు భాషకు మహోపకారము చేసినవారిలో ఒకరు. వీరి పరిశోధనలవల్ల పూర్వ పండితులూ, తెలిసీ తెలియనివారూ, అనుకునే కొన్ని భావాలు తప్పులని నిర్ధారణ అయినవి! ఒక ఉదాహరణం, త్రిలింగశబ్దభవం తెలుగు కాదని లక్ష్మణరావుగారు సకారణముగా రుజువు చేసినారు. వీరు శివాజీచరిత్రనుకూడా రచించినారు.

లక్ష్మణరావుగారు చేసిన ఇంకొక గొప్పపనికూడా స్పృశించటం అవసరము. ఆయన నిజాంరాష్ట్రాంధ్రుడు. అందుచేత తెలంగాణాన్ని కూడా విజ్ఞానవంతము చెయ్యడానికి సమకట్టినాడు. ఇప్పుడు "కృష్ణదేవరాయాంధ్రభాషానిలయ"మనే పేరుతో ఏసంస్థ హైదరాబాదులో స్థిరముగా పనిచేస్తున్నదో, అదికూడా లక్ష్మణరావుగారి ప్రోత్సాహములో 1-9-1901 లో* స్థాపించబడినది! రావిచెట్టు రంగారావుగారనే దేశముఖు ఉండేవాడు. ఆయన గొప్ప సారస్వతప్రియుడు. ఆయన సతీమణి కూడా దేశసేవాపరాయణ. ఆయనా లక్ష్మణరావుగారూ మునగాల రాజాగారూ,

---

* ఈ విషయ ముల్లేఖిస్తూ ఆదిపూడి సోమనాధరావు గారు కృష్ణరాయల చరిత్రమును ప్రబంధముగా రచించి శ్రీ మునగాల రాజాగారికి అంకితము చేసినారు.

చూ: ఆదిరాజు వీరభద్ర రావుగారి అధ్యక్షోపన్యాసము, లక్ష్మణరాయ వర్ధంతి హైదరాబాదు. 13-7-44.

సంప్రదించి యీ గ్రంధాలయాన్ని స్థాపించినారు. ఇదే నైజాం రాష్ట్రములో ప్రాచీనగ్రంధాలయం. తెలంగాణాంధ్రుల సేవ నిరంతరంగా చేస్తున్నది. ఈ సందర్భములో మాడపాటి హనుమంతరావుగారినికూడా పేర్కొననలె. ఆయనకూడా లక్ష్మణరాయ సంపర్కము కల్గి పని చేస్తున్నవారే! ఆయనకూడా ఈ గ్రంధాలయము కొరకై పనిచేసినాడు. చేస్తున్నాడు. హైదరాబాదులో ఉన్న ఆంధ్ర సంస్థలలో ఇది అగ్రగణ్యము. తెలంగాణాంధ్రులకు ప్రాచ్యాంధ్రులకు సమ్మేళన స్థలము. శ్రీ లక్ష్మణరావు గారి దూరదర్శిత్వం దీనివల్ల తెలుస్తుంది.

తరువాత కొన్ని సంవత్సరాలు విజ్ఞానచంద్రికా గ్రంథమాలయొక్క స్థితి గతులు ప్రచ్ఛన్నం అయిపోయినవి. మరల కొన్నిదినాలకు ఈసంస్థ పునరుజ్జీవితమై బెజవాడకు వచ్చినది. వెనుకటి లక్ష్మణరాయ సంపర్కం ఉండి పనిచేయు సంకల్పంతో అయ్యదేవర కాళేశ్వరరావు గారు దీనికి నూతన జీవనము కల్పించినారు. అప్పుడు కూడా మరికొన్ని చరిత్ర గ్రంధాలు పరిశోధించి వ్రాయటమైనది. "అమెరికా సంయుక్త రాష్ట్రములు" "ఫ్రెంచిస్వాతంత్ర్యవిజయం" మొదలైన కాళేశ్వర రావు గారి గ్రంథములు, వేలూరు సత్యనారాయణ గారి "ఫాహియాన్ భారత వర్షయాత్ర" 'బౌద్ధ మహాయుగం' మొదలైనవి ఎన్నదగినవి. ఇప్పటికి ఈ సంస్థ కార్యాలయం బెజవాడలోనే ఉన్నట్లు తెలుస్తుంది.

వేలూరి సత్యనారాయణ* గారు విజ్ఞాన చంద్రికా మండలి చిత్త స్వతంత్ర సంస్థాపకుల నిరాడంబర జీవనం కలవాడు. కాబట్టే ఈ సంస్థ ఆయనను ఆదర్శించినది. ఆయన చాలా విజ్ఞానవంతుడు. సహాయ నిరాకరణోద్యమంలో శ్రీ కృష్ణ జన్మ స్థానానికి వెళ్ళివచ్చిన పవిత్ర శీలి. చాలా ఉదారహృదయుడు. కాకినాడ కాంగ్రెసు సందర్భములో ఈయనతోనూ, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారితోనూ కలసి పనిచేసే ఆనందం కలిగింది నాకు. ఈయన గొప్ప ధనవంతుడు కాకపోయినా, నిరాశలేని తృప్తిజీవి! ఈవిధముగా ఈ సంస్థ దేశభాషాసేవలు చేసి ధన్యమైనది. ఎల్లకాల మొక్క సంస్థయే చెయవలె ననటం న్యాయంకాదు కాలము మారిన కొలది మనుష్యుల చిత్త వృత్తులు మారుతూ ఉంటవి! దానితో సేవా పద్ధతులు కూడా

* బ్రిటిషిండియా చరిత్ర రచించినాడు. ఇటీవలనే పరమపదించినాడు.

మారవలె! తత్కాలములో ఆంధ్రదేశములో విజ్ఞానం వెదజల్లినదీ సంస్థ. అనేక శాస్త్రాలను వాఙ్మయంలోనికి తెచ్చినది. చరిత్రకు నూతన జీవనము కల్పించినది. పరిశోధనకు త్రోవచూపినది. చిలుకూరి వీరభద్ర రావు గారి "ఆంధ్రుల చరిత్ర" ఈ సంస్థచేసిన పనికంతకూ మకుటము. వీరభద్రరావుగారు◆ జీర్ణకర్ణాట సామ్రాజ్యము, తిమ్మరుసు, తిక్కన, శ్రీనాథుడు, శివాజీ, కర్ణసామ్రాజ్యము నాయకురాలు మొదలైన రచనలను చేసి పేరు పొందినారు. ఆంధ్రమహాసభవారు వీరి పరిశోధనలకు మెచ్చి 'చరిత్ర చతురానన' అనే బిరుదమునిచ్చినారు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో (28 సం, 1 సం.) వీరిని గూర్చి యీ క్రింది విధముగా వ్రాసినారు:

"ప్రథమము నుండియు వీరు సంస్కరణాభిలాషులు, ఆంధ్రభాషా, చరిత్రాభిమానులు, దేశోపకారి, ఆంధ్ర కేసరి,పత్రికాసంపాదకులు. వివిధ గ్రంథ రచయితలు. వీరి లేఖిని వాదోపవాదముల బ్రళయతాండవమునుదలపించుననుట యతిశయోక్తి కాదు.. వీరి గ్రంథములతోడను వ్యాసములతోడను నాంధ్రులకొక నూతన యుగము ప్రారంభమైనది."

అది ప్రథమ యత్నము కావటం చేత నిర్దుష్టముగా ఉండటానికి వీలులేదు. చారిత్రక పరిశోధకు లంతా దానిలో లోపాలను చూపించక, తమ పరిశోధనా ఫలముగా దానినిదిద్ది, కీర్తి శేషుడైన వీరభద్రరావుగారు శ్రమపడి చేసిన పనికి పరిణామాన్ని ఇచ్చి, దేశంవందనాలకు పాత్రులౌతారని ఆశిస్తున్నాను.

## ఆంధ్ర చారిత్రక పరిశోధన మండలి :

కొన్ని సంవత్సరాల క్రిందట రాజమహేంద్ర వరంలో "ఆంధ్ర చారిత్రక పరిశోధకమండలి" (Andhra Historical Research Society) అనే ఒక సంస్థ స్థాపించినారు. దాని పక్షమున ఒక త్రైమాసిక పత్రిక కూడా ప్రచురిస్తున్నారు. ఆసంస్థ చేసే పని అంతా ఇంగ్లీషులో జరుగుతున్నది. రాళ్ళభండి సుబ్బారావు, భావరాజు వెంకటకృష్ణారావు, ✻ మారేమండ రామారావు, మొదలైన వారాసంస్థకు

◆ చూ: మల్లంపల్లి వారి వ్యాసము - ఆంధ్రపత్రిక 17-5-1939

✻ ఇటీవల మారేమండ రామారావు 'Journal of Andhra History & Culture' అనే ఆంగ్ల త్రై మాసిక పత్రిక పెట్టిసేవ చేస్తున్నాడు. ఇది గుంటూరులోని ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలి పక్షాన ప్రకటితమౌతున్నది.

పట్టు కొమ్మలు. వీరిలో కృష్ణారావు రామారావుగార్లు సామాన్యంగా తెనుగులోకూడా వ్రాస్తూఉంటారు. వారు చాలా చరిత్రగ్రంధాలు పరిశోధించి వ్రాసినారుకూడాను. సుబ్బారావుగారు సామాన్యంగా ఇంగ్లీషులోనే వ్రాస్తూ ఉంటాడు.

ఈ మండలివారు కొన్ని ఉత్సవాలు చేసి కొన్ని సంచికలు ప్రకటించి సాహిత్య చరిత్ర పరిశోధనలకు చాలా దోహదముచేసినారు. మొదట రాజరాజ నరేంద్రుని పట్టాభిషేకోత్సవం చేసి "రాజరాజనరేంద్ర సంచిక" ప్రకటించినారు. ఈ ఉత్సవానికి కట్టమంచి వారధ్యక్షపదవి నధిష్ఠించినారు. తరువాత 'కళింగసంచికా, కాకతీయ సంచికా' కూడా ప్రకటించినారు. కాకతీయ మహాసభ ఎరంగల్లులో జరిగినది. ఈ సందర్భములో పరిశోధకులలో భిన్నత్వము వచ్చినది. పార్టీలైపోయినవి. ఈ సభావిషయములో ఈ మండలి వారు చాలా శ్రమపడినారు. నిజాం కాలేజీ చరిత్రాచార్యులైన శిరుగూరు హనుమంతరావుగా రధ్యక్షత వహించినారు.

## నవల:

వీరేశలింగం పంతులుగారు రచించిన "రాజశేఖర చరిత్ర" ప్రథమాంధ్ర నవల అని వెనక మనవి చేసినాను. తరవాత చిలకమర్తి వారు వ్రాసిన నవలలను పరామర్శించినాను. నవల, నాటకము, ఈకాలపు సారస్వతవీధులలో ముఖ్యమైనవి. ఇవి యే సారస్వతములో ఎక్కువగా ఉంటనో అది గొప్పదని అంటారు. నాటకమెలా ఉన్నా నవల మాత్రము మనకు ఆంగ్లభాషాసంపర్కము వలన కలిగినదిగానే కనపడుతుంది. మనకూ కథలున్నవి. తల్లక్షణాలున్నవి. అగ్నిపురాణ లక్షణం చాలా పురాతనమైనది. సంస్కృతము మాట అలా ఉంచినా, మన ఆంధ్రులకు సహజ ప్రతిభగల కథావీధీ ఉన్నది. కథాసరిత్సాగరం ఆంధ్రుల సాంప్రదాయానికి చెందినదే! ఆంధ్రదేశస్థుడై, అమరావతిలో ఉండి, పైశాచి భాషలో వ్రాసిన గుణాఢ్యపండితుని "బృహత్కథ" యొక్క ఉచ్ఛిష్టం కథాసరిత్సాగరం. నశించగా మిగిలిన భాగములో ఉన్న కథలకు సంస్కృతానువాదము దానిలో కథలు బృహత్కథలోనివి. కాబట్టి ఆ కథలు ఆంధ్రులవి అనే చెప్పవచ్చు. కథాసరిత్సాగరమంతా ఒక్క కథ కాదు. కొన్ని కథల యొక్క సంపుటి. అనేక కథలు అందులో ఉన్నవి.

కాని ఏది నవల అనబడుతున్నదో దానికీ దీనిలోని కథలకూ భేదం కనపడుతున్నది. మన కథలలో కథాకథనమే ముఖ్యకార్యం. కాని నవలలో పాత్రోన్మీలనమూ, నాటకీయతా, మనస్తత్వమూ, సంభాషణ ప్రాముఖ్యమూ మొదలైన గుణాలు తక్కువ. ఈ గుణాలు చేర్చి మొదట కథలో మార్పు కలగజేసినవాడు వీరేశలింగంపంతులు. తరువాత స్కాటును ఆదర్శముగా పెట్టుకుని నవలను రచించినాడు చిలకమర్తి. అప్పటినుంచి కొంచెము నవలావీధి తలయెత్తి దేశము నలుమూలలా నవలాకారులు వెలువడినారు. కాని సంపూర్ణపరిణామముకల నవల తెనుగులో అప్పటికి కాదు ఇప్పటికీ వెలువడలేదనే చెప్పవలసివస్తుంది.

కొందరు ఇరువదవశతాబ్ద ప్రథమదశకాన్ని నవలాయుగారంభ కాల మనినారు. అది కొంతవరకు నిజమే. 1910 సంవత్సరము నాటికి చిలకమర్తి వారి నవలలే గాక కొన్ని గ్రంథప్రచురణసంస్థలు వెలువడి నవలాప్రకటనానికి పూనుకున్నవి. విజ్ఞానచంద్రిక, ఆంధ్రప్రచారిణి, ఆంధ్రభాషాభివర్ధని మొదలగుసంస్థలు పుట్టి నవలకు స్థానములను కల్పించినవి! పైమూడింటిలో ప్రచారిణి కేవలము ఒక్క నవలాప్రచురణమే ఆశయముగా పెట్టుకొని ఉన్నది. నవ్యసాహిత్యవ్యాపనములో నవల ప్రథమసోపాన మనవచ్చును.

ఈ నవలలను వాని కథావస్తువును బట్టి ముఖ్యమైన ఐదువిధములుగా భాగింపనగును.

(1) కేవల ప్రణయనవల

(2) చారిత్రక నవల

(3) సాంఘిక నవల

(4) అపరాధ పరిశోధకనవల

(5) శాస్త్రవిషయ ప్రబోధకనవల

ప్రతిదానిలోకూడా ఏదో ఒక ప్రణయగాథ అంతర్వాహినిగానే ఉంటుంది. కాని మొదటిదానిలో తప్ప మిగిలినవానిలో ఆగాథ కెక్కువగా ప్రాముఖ్యములేదు. పేరునుబట్టి యే విషయము ముఖ్యమో తెలియగలదు. వీనిలో అన్నిరకముల

నవలలు మనభాషలో వెలసినవి. కుప్పతిప్పలుగా నుండి తుదకు మురికినీటి కాలువగా ప్రవహించు గతి పట్టిన దీసారస్వతనీధికి. ఆంగ్లములోనూ యితర ఫ్రెంచి రష్యన్ భాషలలోను గొప్పరచయితలు నవలాకారులుగా కనపడుదురు. ఆప్రకారమే మన భాషలో కూడా నవలాకారులలో గొప్ప పేరులు గలవారున్నారు. ప్రథమ దినములలో పంతులుగారి తరువాత చిలకమర్తి, వేంకటపార్వతీశ్వర, శివశంకరులు; వేలాల సుబ్బారావు, భోగరాజు నారాయణమూర్తి, కేతవరపు వేంకటశాస్త్రి, ఎ.వి. నరసింహంపంతులు, దుగ్గిరాల రాఘవ చంద్రయ్య సచ్ఛాస్త్రి మొదలగు వారున్నారు. వీరి రచనలలో ప్రణయ, చారిత్రక నవలలే కనపడుతున్నవి. రాజశేఖరచరిత్ర తరువాత సాంఘిక నవలకు రచయిత లంతగా ప్రాముఖ్యాన్ని ఇయ్యలేదు.

ఈకాలములో బంగాళీ మహారాష్ట్రుల ప్రాముఖ్యము ఆంధ్రం పైన యెక్కువగా పడటము ప్రారంభించినది. అప్పటికే ఆంధ్రభాషలలో అప్పసిధాల నవలలూ ప్రచారములో ఉన్నవి. అపరాధపరిశోధకనవల కూడా తలయెత్తినది. ఆంధ్రప్రచారిణివారి "లక్షరూపాయలు" ఆ రకానికి చేరిన వాటిలో ఒకటి. కాని ప్రతి నవలలోను ప్రణయము హేతువుగానో మరోహేతువుగానో పాత్రలు ఎత్తుపైయెత్తులు వేయటము ఒక గుణము ఈ అపరాధపరిశోధకతత్వం ఈ ఎత్తుపైయెత్తులలో నుంచే పుట్టినట్లు కనపడుతుంది. మన ప్రథమనవలలు ఇతర భాషాసంపర్కము కలవికాబట్టి సన్నివేశాలు, కథాస్థలులు మన దేశానికి సంబంధించి ఉండవు. పాత్రల పేర్లుకూడా పరాయివానిగానే కనపడుతూ ఉంటవి. వాటిని చూస్తే ఎక్కువ బెంగాలులోనో, మహారాష్ట్రంలోనో, ఆరావళీపర్వతాల్లోనో ఢిల్లీపట్నంలోనో ఉన్న సన్నివేశాలతోనూ, పాత్రనామాలతోనూ, ఆచారవ్యవహారాలతోనూ నిండి ఉండేవి. అప్పటికికాదు కొన్ని ఇప్పటికీ ఆలాగే ఉన్నవి. చదువుతూ ఉంటే కొత్త ప్రదేశాన్ని త్రోవతప్పి గ్రుడ్లు మిటకరించినట్టు ఉంటుంది. ఇటీవల కొన్ని సంవత్సరాలనుం కొంచెము మారినట్లు కనపడుతుంది. ఉన్నవవారి "మాలపల్లి" వచ్చి దృష్టిని [illegible] మరల్చినదని స్పష్టముగా చెప్పవచ్చు. కొంచెము మనవారి దృష్టి [illegible] ఈ పరిస్థితులు నాటకానికి కూడా వర్తిస్తవి. చారిత్రకనాటకాలు కూడా మహారాష్ట్రుల యొక్క, రసపుత్రులయొక్కా, కథావస్తువులతోనే చాలా ఉన్నవి. ఆంధ్రుల [illegible]

గ్రహించి నాటకాలు వ్రాసేవారు చాలా అల్పసంఖ్యాకులు.

నవలవిషయమై చర్చించేటపుడు ఒక విషయాన్ని మనవిచేయవలెను. ఇంత కాలము స్వతంత్రప్రణయము వస్తువుగా గల వృథాప్రచారమెందుకు లేదు? ఈప్రశ్నకు సంస్కృతసాహిత్యము సమాధాన మిస్తున్నది. స్వతంత్రప్రేమ మన హిందూసంస్కృతికి సహజప్రకృతి కాదు. వర్ణాశ్రమధర్మాలు ముఖ్యసూత్రాలుగా గల హిందూసంఘములో స్వయంవరము ఒక్కక్షత్రియులకే చెప్ప బడినది. వివాహాలు అనేకవిధాలుగా ధర్మ శాస్త్రాలలో కనపడతవి. కాని అవి అన్నీ ఆచరణలోనే లేవు. రాక్షసవివాహము పురాణాలలో కూడా క్వాచిత్కముగా కనపడుతుంది. ఏ రుక్మిణీపరిణయమో అటువంటిది. గాంధర్వవివాహము కూడా క్షత్రియకన్యలకే ఉన్నట్లు పురాణాలను చూస్తే తెలుస్తుంది. మన సంస్కృతకవులు నాటకరచన చేసినప్పుడు సామాన్యముగా క్షత్రియులనే నాయికానాయకులుగా చేసినారు.* భాసుడు, కాళిదాసు, మొదలగు ఉత్తమనాటకకర్తల నాటకాలన్నింటిలో కూడా నాయికా నాయకులు క్షత్రియులే!

ధర్మశాస్త్రములు 8 విధముల వివాహములను నిర్ణయించినాయి. స్త్రీపురుషు లేవిధముగా కలిసినా కలవటం జరిగిన తరువాత దానిని గట్టిచెయ్యటమే హిందూ సంప్రదాయము. వివాహము పవిత్రము. అందుచేత అట్టి పవిత్రసంస్థ తల్లి దండ్రులయొక్క సమ్మతిమీద ఆధారపడి ఉండటం ఉభయులకు శ్రేయస్కరము. అన్నివిధముల వివాహములలో పెద్దలు చేసేటువంటి దానికే యెక్కువ గౌరవము.§ తుదకు వైశ్యశూద్రులలో కూడా పెద్దలు చేసే వివాహమే పరమావధి. కాబట్టి

---

* మాలతీమాధవాదులు క్వాచిత్కంగా ఉన్నవి

§"While marriages in which personal inclination is subordinated rank high, those by mutual choice (gandharva). force (Asura) come lower."
- Sir Radhakrishnan, (The Hindu view of life)

"Marriage is not the end of the struggle; but the begining of a strennuou: life where we attempt to realise a larger ideal by subordinating our private interests and inclinations." (Ibid P 85)

"ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే" - (సంకల్పమ్)

స్వచ్ఛందప్రేమ ప్రాచ్యసంప్రదాయానికి కొంచెము విరుద్ధము. కాబట్టే నవల - ప్రణయం వస్తువుగా కల్గినది - యెక్కువగా ప్రచారానికి రాలేదు. మిగిలిన చారిత్రక సాంఘిక, అపరాధపరిశోధక నవలకు కూడా ప్రణయగాథ అంతర్లీనముగా ఉండటంచేత వానికి యిదేమాట చెల్లుతుంది. తెనుగు ప్రబంధాలు కూడా యీ సూత్రములకు బద్ధములే! ఈ కాలం అన్నిటిలోను స్వేచ్ఛకోరేకాలం కాబట్టి ప్రణయానికి కూడా ఆ అనవస్థ పట్టటం న్యాయమే !

ఈ విషయములో మరిఒకమాట కద్దు. నవల సారస్వతభాగము కాబట్టి, నవలలో నీతి అవసరమా అనే ప్రశ్నకు పెద్దవిషయమే సమాధానమిస్తుంది. దాన్ని స్థలాంతరములో చర్చిస్తాను. కాని ఒక్కమాట చెప్పక తప్పదు. కవికర్మ మిక్కిలి గొప్పది. సంఘోద్ధరణం కవికర్తవ్యాలలో ఒకటి. కాబట్టి సంఘములో అవినీతిని ప్రోత్సహించటం మాత్రము కవికి కూడనిపని, అవినీతి ఉండదని కాదు, ఉంటుంది. దాన్ని చిత్రించవలసినప్పుడు తద్వైముఖ్యం కల్గేటట్టు చిత్రించవలెనే కాని యువకహృదయాల్లో అవినీతిబీజాలు నాటడము న్యాయంకాదు.*

తుదకు నవలానాటకకారుల కొక సూచన. తమ గ్రంథాలలో మన జాతి చరిత్రనూ, మన సంఘాన్నీ, జీవితాన్ని గ్రహించి కథావస్తువులుగా చేస్తే జాతికి

---

* "The perfectly ethical marriage is the monogomous one."
(The Hindu view of Life)

"ప్రేమ ధర్మానికి లొంగిఉండాలని అంటారు. (పురాణ పంథావారు) నవ్యమార్గం వారు ధర్మమనేదే ప్రేమకు లొంగివుండవలె నంటారు." - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

కాని ప్రేమవ్యక్తిగతం. ధర్మం సంఘగతం కూడాను సంఘం వ్యక్తి అంతర్వ్యాప్తుడు. ధర్మం సంఘంకంటె కూడా విశాలం. కాబట్టి శతేపంచాశన్న్యాయం చేత వ్యక్తీ, సంఘం కూడా ధర్మానికి లోబడక తప్పదు. ధర్మానికి లోబడని సంఘం ప్రపంచ శత్రువు, సంఘానికి లోబడని వ్యక్తి సంఘశత్రువు.

"while the pursuit of wealth and happiness is a legitimate human aspiration, they should be gained in ways of righteousness (Dharma) if they are to lead ultimately to the spiritual freedom of man (Moksha). Each one of these ends (ధర్మార్థకామమోక్షములు) requires ethical discipline."
(The Hindu View of Life P 80)

భాషకూ కూడా ఉపకారమౌతుంది. వెనకటి యుద్ధానంతరం కొందరు ఈ విషయాన్ని గ్రహించారు. ఈవీధి సంచారం ముందు మనము మరల చెయ్యవలసి వస్తుంది. అప్పుడు మరల ముచ్చటించుకుందాము.

# ఇతర గ్రంథమాలలు :

విజ్ఞానచంద్రికా గ్రంథమాలతోపాటు ఇంకా కొన్ని గ్రంథమాలలు లేచినవి, బందరులో "ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమాల", 1908 ప్రాంతములో స్థాపింపబడినది. ఈ గ్రంథమాలలో కొన్ని గ్రంథాలు ప్రచురింపబడ్డవి. వివేకానందస్వామి జీవితం, మొదలైనవి గొప్ప గ్రంథాలే!◆ కాని ఈ గ్రంథమాల యెక్కువకాలము పని చెయ్యలేదు. బందరులో ఉండే రాజకీయవాతావరణమే దానికి కారణము. వ్రాసేవారూ చదివేవారూకూడా ఉద్రేకపూరితులై రాజకీయరంగంలో పనిచేయటం వచ్చేటప్పటికి గ్రంథమాల మూలపడినది. ఈమాదిరిగా స్థాపింపబడిన గ్రంథమాలలో "ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల" చెప్పదగినదిన్నీ, చాలా భాషాసేవ చేసినదిన్నీ అని చెప్పవచ్చు.

కొవ్వూరు చంద్రారెడ్డిగారు సారస్వతప్రియుడు; ఉత్సాహవంతుడు. ఆయనకు వెంకటపార్వతీశ్వరకవులు (బాలంత్రపు వెంకటరావు, ఓలేటి పార్వతీశం) దొరికినారు. ఈ జంటకవులు మంచి కవితాపాటవం కలవారు. ఉదాత్తమైన కవిత్వం చెప్పగల సమర్థులు. ఈ గ్రంథమాల మొదట తణుకులో అయ్యగారి నారాయణమూర్తిగారి సంపాదకత్వములో స్థాపింపబడి తరువాత నిడదవోలు చంద్రారెడ్డిగారి ఆధిపత్యం క్రిందికి వచ్చినది. కవులుకూడా అప్పుడు మంచి యౌవనంలో ఉన్నారు. మంచి [illegible]కా, పట్టుదలా కలిగిఉన్నారు. పోషకుడూ, వీరూ కూడా రైలుబండివలె నడిపినారు గ్రంథమాలను. "వసుమతీ వసంతం" "దుర్గేశ నందని" "చతుర చంద్రహాసం" మొదలైన నవలలు* రైలుపట్టాల మీద బండి

---

◆ వివేకానందుని పవిత్రవాక్యాలని కంభంపాటి విశ్వనాథంగా రొక గ్రంథం వ్రాసినారు. మైలాపూరు రామకృష్ణాశ్రమంవారు ఇటువంటి గ్రంథాలు కొన్ని తెనుగులో వ్రాయించి ప్రకటించినారు.

* "నవలారచన: తెలుగు, ఇతర భాషలు" - ఆంధ్రపత్రిక 26-1-41, 2-2-41 "శారద" లో నవలపై దర్భా యజ్ఞేశ్వర సోమయాజులు.

తర్వాత బండి నడిచినట్లు ఒకదానివెంబడి ఒకటి చొప్పున నిరంతరంగా వచ్చినవి. పాఠకులు ఎప్పుడు వస్తుందా పోష్టు అని కనిపెట్టుకుని ఉండేవాళ్లు. "వసుమతి వసంతం" మొదట చదివి మోహితుడనై పోయినాను నేను. ఏమి వర్ణనలు! ఏమి ప్రేమాలాపాలు! ఏమి భావశబలతలు ! ఏమి క్రియాప్రతిక్రియలు ! నవల మిక్కిలి రసవంతంగా ఉన్నదని తోచినది.◆

ఈ గ్రంథమాలలో నవల లీ దేశములో వ్రాసినవారికందరికీ ప్రేరకాలని నానమ్మకం ! పెద్దవికాక అనుబంధాలని చిన్నవికూడా ప్రకటితాలైనవి. 'లక్షరూపాయలు' మొదలైనవికూడా రసవంతాలుగానే ఉండేవి. అపరాధ పరిశోధకనవలకు కూడా బీజమిక్కడనే పడినదని నా నమ్మకము. మొత్తంమీద యీ గ్రంథమాలవారు నవలా వాఙ్మయాన్ని చాలా అభివృద్ధిచేసినారనక తప్పదు. దీనిలో ప్రచురించినవన్నీ దాదాపు పరివర్తనాలే. ఆ పరివర్తనాలూ ఎక్కువగా బంగాళీ, కన్నడ భాషలనుంచే ! కొన్ని "Les miserables", "Faust" వంటివి ఇంగ్లీషులోనుంచి కూడాను.* స్వతంత్రాలు చాలా తక్కువ. విజ్ఞానచంద్రిక వారు ప్రకటించిన 'విమలాదేవి' త్యాదినవలలకూ, వీనికీ ఇది ముఖ్యభేదము. ఈ భేదము సామాన్యమైనది కాదు. దాదాపు వీనిలో ముష్పాతికపాలు, అక్కడక్కడా జాతీయభావాలూ ప్రకృతిచిత్రవర్ణనలూ ఉన్నా, శృంగారరసప్రధానాలై తద్రసనిర్వహణములో ఉపయోగించే సంభాషణలు ప్రేమపూరితాలౌటచేత ఈనవలలు ప్రజల నాకర్షించినవి. ఆడవాళ్ళకు అందులో ఉద్యోగస్థుల భార్యలకు కాలక్షేపానికి చాలా ఉపకరించినవి. వీనిలో ఎక్కడనో కొన్ని "ప్రమదావనం" మొదలైనవి ఆంధ్రచరిత్రకు సంబంధించినవి

◆ ఆ నమూనాలో ఒక నవల వ్రాసినాను కూడాను. నా అదృష్టంచేత ప్రచురించలేదు. దానికి కారణం ఉన్నది. నేను "లవంగి" అని పేరు పెట్టినాను. నేను చదువుకుంటూ, నా స్నేహితులకు చదివి వినిపించి "బాగా ఉందా" అని వారిచేత చెప్పించుకుంటూ, కొన్నిచోట్ల చిన్నమార్పులుచేసి, మళ్లీ చదువుకుని, ఇక ప్రచురించుదామని అనుకుంటూ ఉండగా, "లవంగి" అనే పేరుతో ఎవరో ఒక పుస్తకం ప్రచురించినారు దానితో నాది నిరుపయోగమై పోయింది దానిలో రెండు అధ్యాయాలుమాత్రం ప్రత్యేకంగా ఒకచిన్నకథచేసి 1913-14 సంవత్సరంలో కృష్ణాపత్రికలో ఒక "చిన్నకథ" అనే శీర్షిక ప్రచురించినాను

* "Though many of these books published in this series are either translations or adaptations of Bengali or Canarese novels there are a few that claim to be original and the present book is one of them "

- 'మాతృమందిరం' పీఠిక, కొమఱ్ఱాజు లక్ష్మణరావు.

ఉన్నవి. మొదట మొదట ప్రేమ ప్రధానముగా ఉన్నవి తర్వాత తర్వాత అపరాధ పరిశోధకాలుగా మారినవి. జిత్తులు! ఎత్తుపై ఎత్తులు! ఒక్కొక్కప్పుడు నమ్మటానికి వీలులేని విషయాలు! హరాత్సమావేశాలు! ఈ విధముగా ఈ రెండు రకాల నవలలూ, గతానుగతికా లైపోయినవి! వీనినిచూచి ఆంధ్ర దేశములో అన్ని మూలల నవలాకారులు బయలుదేరారు, హత్యలేకుండా● నవలే లేదనిపించినవి, కొన్నాళ్ళు.※

చంద్రారెడ్డిగారు కొన్ని సంవత్సరాలకు కీర్తిశేషుడైనాడు. గ్రంథమాలకూడా విజ్ఞానచంద్రికవలె ప్రచ్ఛన్నముగా ఉన్నదని నా ఊహ. కొన్నాళ్ళు రాజమహేంద్రవరములో లక్ష్మీపుత్రుడై, సారస్వతప్రియుడైనఅద్దేపల్లి లక్షణస్వామిగారిచేతులలో ఉన్నది.◆

కొంతకాలానికి ఈ గ్రంధమాల మళ్ళీ కొంచెము విజ్ఞానచంద్రిక పలెనే తలెత్తినది. కాకినాడ కార్యస్థానమైనది. కొన్నిగ్రంధాలుకూడా ప్రచురణమైనవి. ఈ "గ్రంథమాల" వారు ఆంధ్రభాషకు నవలాప్రచురణము మూలముగా అమోఘమైన సేవ చేసినారు తెనుగులో ఉన్న నవలలలో ముప్పాతికవంతు వీరి ప్రచురణాలే. వీరిద్దరు కవులు† కూడా ప్రతిభావంతులు. ఈ జంటకవులు వెనుకటి సంప్రదాయములో భాషవ్రాసినప్పటికీ [illegible] నూతనభావాలతో గీతావళి వ్రాయటములో చాలా సమర్థులు వీరి 'ఏకాంతసేవ' చాలా ఖ్యా

---

● రైళ్ళల్లో అమ్ముతూండేవారు ! పైన "వెల ఎనిమిదణా" ఉండటం, ఇక [illegible] పిల్లలు - పెద్దలు, ఆడవారు - మొగవారు భేదం లేకుండా వీనిని కొనటం! ప్రతి వారి [illegible] ఇవే ! చిత్రవిచిత్రాలై ఆకర్షించే పేర్లు ! అవెంత ఆశ్చర్యకరంగా ఉంటే అంత ఖుషీ తుదకి నవలావాఙ్మయం చెత్తకిందికి దిగినది

※ ఈ యుగానికి వీరే (వెంకటపార్వతీశ్వరకవులు) కవులనికూడా కొందరంటారు (ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహం). 194[illegible] డిసెంబరు నెలలో వేంకటపార్వతీశ్వరకవులకు రాజమండ్రిలో అఖండసన్మానం చేసినారు. వారి కృతులన్నీ ప్రచురించవలెనని సంకల్పించి కొన్ని ప్రచురించినారు. ఆంధ్రదేశమంతా వారికి ప్రణతులు సల్పినవి. ఈ ఉత్సవసందర్భములో [illegible] తల్లావఝులవారు చేసిన కృషికి వారు వందనీయులు. ఆంధ్రప్రచారిణీ సంఘం ప్రస్తుతం [illegible] గ్రంథప్రచురణాదికం జరుపుతున్నది.

◆ "We have to congratulate the organisers of this series and their noble patron M.R. Ry Addepalli Lakshmanaswamy Naidu Garu . . . "

† బాలాంత్రపు వేంకటరావు (జననము 1881)
ఓలేటి పార్వతీశం (జననము 1882)

గుంభితముగా ఉంటుంది. వీరి కవిత్వములోఉన్న ఒక విశేషమేమిటంటే పద్య పాదాలూ, భావమూ తీగెలవలె సాగుతవి. భావములో పౌనఃపున్యము ఉంటుంది.* నవలలో వర్ణనలు కూడా చాలా పొడుగు. ఎంత వ్రాసినాతనివి లేదు. ప్రమదావనము చూడండి! కథ చాలా చిన్నది! ఎందుచేత? ముప్పాతికకుపైగా వర్ణనలే! కేవల దృశ్యాలవర్ణనలే కాదు. చిత్తవృత్తులయొక్క, మనస్తత్వముయొక్క, విషయాలయొక్క, విషయసాంకర్యముయొక్క సన్నివేశాలయొక్క వర్ణనలు హృదయంగమముగానే ఉంటవికాని తీపికూడా ఎంత తినగలము? భావవృత్తవైవిధ్యము పరన ప్రేరకము! ఈ లోపము ఇటీవల వ్రాసిన నవ్యకావ్యాలకన్నిటికీ ఉన్న లోపమే! కాని, అదే గేయమైతే కొంతవరకు ఆలోపము కనిపించదు. బాలనాగమ్మకథా, బొబ్బిలికథా ఇందుకు ఉదాహరణములు.

## రామవిలాస గ్రంథమాల:

ఆకాలములోనే పిఠాపురము దగ్గర చిత్రాడలో చెలికాని లచ్చారావుగా రుండేవారు.◆ ఈయన దగ్గర ఆస్థానకవి§ వంగూరు సుబ్బారావుగారు! ఈయన సామాన్యుడు కాడు! ఆంధ్ర సారస్వతోత్సాహము ఆయనకు ఉన్నంత నేనెవ్వరిదగ్గర చూడలేదు. ఆయన ప్రేరణముచేత "రామవిలాస గ్రంథమాల" ఒకటి స్థాపితమైనది. అప్పటి యుగధర్మము నవలారచన. గ్రంథమాలలో కూడా కొన్ని యెన్నతగిన నవలలు ప్రచురింపబడినవి. వంగూరి "ప్రభాతము" ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన నవల. ఈ సుబ్బారావుగారు కొన్ని చిన్నకథలే కాకుండా 'ఆంధ్ర వాఙ్మయ

---

* ఒకే భావము అనేక విధాలుగా చెప్పడముంటుంది

◆ కొన్నాళ్ళు చిత్రాడ సారస్వత కేంద్రాలలో ఒకటిగా ఉండేది లచ్చారావు గారు గొప్ప భాషాసేవకుడు, పోషకుడూను కవులు, పండితులు అనేకనుందీయన పోషణలో ఉండేవారు. ప్రతిసంవత్సరము కవిసమ్మేళనాలను జరిపేవాడు. చాలా ఉత్సాహవంతుడు. 'ఆంధ్రభాషావిలాసిని' మాసపత్రికను 1923లో స్థాపించి సారస్వతసేవ చేసినాడు.

'కే.వి లక్ష్మణరావుగారు, చెలికాని లచ్చారావుగార లారంభించిన పరిశోధనోద్యమములు బెంపొందించుట విద్యావంతుల విధ్యుక్తధర్మమై యున్నది. - కవిత్వవేది.

§ ఇతను 'వసుంధర' అనే పక్షపత్రిక 1915లో పెట్టి విజ్ఞానానికి తోడ్పడినాడు.

చరిత్ర'* 'వేమన యోగి' 'శతకకవులచరిత్ర' అనే గ్రంధాలు రచించినాడు. ఈ ఆంధ్రవాఙ్మయ చరిత్రను ఆంధ్రపరిశోధకమహామండలి అని ఒకటి స్థాపించి తత్పక్షాన ప్రచురించినాడు. ఇది ఒక నూతనముగా నూతనపద్ధతులమీద రచించ వలెనని ఉద్దేశించినాడు. కట్ట మంచివారు దీనికి పీఠిక రచించినారు. ఆకాలములో నూతన త్వానికీ కట్టమంచివారికి అవినాభావసంబంధము.

"కవుల జీవితములుమాత్రము పరిశీలించినచో భాషాసమిష్టి యొక్క చరిత్రము చక్కగా వేద్యము కానేరదు. వ్యష్టికన్న మొత్తము మీద సమిష్టి ప్రధానము. వాఙ్మయసర్వస్వము యేకసత్తుగాగొని చరిత్ర శోధనము చేసినవారిలో ఏంగూరు సుబ్బారావుగారు ప్రథములు. ఈ చరిత్రలోని విషయము లితరగ్రంధములలో గన్పట్టినప్పటికిని, కర్తగారిదృష్టియు నవి కూర్చబడినతీరును నేటు. దీనికి మార్గదర్శకములైన గ్రంధములు పాశ్చాత్యభాషలలో వేనవేలున్నవి. మన భాషయందు నా కవి యగోచరములు." అన్నారు రెడ్డిగారు పీఠికలో!

రెడ్డిగారి సర్వదృక్పధమూ, సుబ్బారావుగారి గ్రంధగుణ దోషాలూ పైనావాక్యాలలో ఉన్నవి. సుబ్బారావుగారి గ్రంధముమాత్రము నూతనదృక్పధముతో ఉన్నా, సంపూర్ణముగాగాని, చాలావరకుగాని మన అవసరాన్ని నిర్వర్తింపలేదనీ,

---

* ఈయనకు ఆంధ్రాభిమానము చాలాయెక్కువ. ఈయనా తల్లాప్రగడ సూర్యనారాయణ గారూ, భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారూ, నేనూ, 1909 ప్రాంతములో పూనాలో జరిగిన "ప్రథమ ఓరియంటల్ కాన్ఫరెన్సుకు" పోయినాము. మాకు ఫెర్గూసన్ కాలేజీహాస్టలుబస ఇచ్చినారు. డాక్టరు గుణేగారువచ్చి మాకు బస నగైరాలు చూపి సహాయముచేసినారు. ఆ భవనములో కొంతభాగము "మద్రాసు ప్రతినిధులు" అనే శీర్షికతో మద్రాసువారికీ మాకూ కలిసి ప్రత్యేకించినారు. అది సుబ్బారావుగారికి కంటకమైనది. గుణేగారిని పిలచి వగంవచ్చిన యింగ్లీషులో "మాకు మద్రాసు వారనిపించుకోటము సిగ్గు, మేము ఆంధ్రులము! ఆంధ్రప్రతినిధులని వేరే బల్లకట్టినదాకా మేము ఆగదులలో ప్రవేశించము" అని గట్టిగా చెప్పినాడు. ఆయన అప్పుడు మార్పించి తెప్పించి కట్టినతర్వాత మేమాభవనములో ప్రవేశించినాము. చూచినారా సుబ్బారావుగారికి ఎంత పట్టుదలో?

తల్లాప్రగడ సూర్యనారాయణ "సువర్ణలేఖ" అనే వారపత్రికకు తణుకునుంచి 1917 ప్రాంతాలలో సంపాదకుడుగా ఉండేవాడు

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి, కొండా సుబ్బారాయుడు కలిసి 'యాజ్ఞవల్క్య' అనే మాసపత్రిక తెనాలినుంచి 1923లో ప్రారంభించి,యాజ్ఞవల్క్య సంఘోన్నతి కొరకు పాటుపడినారు.

పట్టిచూస్తే మరొకచోటికి వెళ్ళకుండా అధికారికముగా తీసుకోదగిన అభిప్రాయాలు లేనని, కాని ఆయన చేసిన పనికి మాత్రము మనము ఆయనకు కృతజ్ఞులమై ఉండవలసిన దేనని, నా మనవి. ముఖ్యవిషయానికి అప్రస్తుతాలైన ప్రసంగాలనేకాలిందులో ఉన్నవి! ఆంధ్రవాఙ్మయముయొక్క విశిష్టగుణాలేమిటి అంటే దీనివల్ల తెలుసుకోటానికి వీలులేదు. అంతేగాక 1914 సంవత్సరములో ప్రచురించిన రెడ్డిగారి "కవిత్వతత్త్వవిచారము" లో చెప్పిన కొన్ని విషయాలయొక్కా పద్ధతులయొక్కా ప్రతిధ్వనులిందులో వినిపిస్తున్నవి!

ఆయనకు ఆంధ్రదేశసేవ చెయ్యటానికి భగవంతుడాయుర్భాగ్యమియ్యలేదు. పొడుగాటి కాయం, మంచి మీసం, శాస్త్రభూషణాలతో కూడిన మాటలు, గోదావరిజిల్లా ఉచ్చారణ, శరపరంపరగా వచ్చే సంభాషణ, నాకు ఇప్పటికీ హృదయములో చిత్రితాలై పోయినవి! *

## సరస్వతీగ్రంథమండలి:

కొన్ని సంవత్సరాల తర్వాత అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు రాజమహేంద్రవరములో 'సరస్వతీ పవర్ ప్రెస్' అనే ఒక ముద్రణాలయాన్నిపెట్టి ఒక గ్రంథ మండలిని స్థాపించినారు. దాని పేరు "సరస్వతీ గ్రంథమండలి". దాని ఉద్దేశ్యముకూడా నవలాప్రచురణమే! దాని పక్షానకూడా కొన్ని నవలలు ప్రచురించబడినవి. తల్లావఝ్ఝల వంటి మహానుభావులు ఈమండలిలో నవలలు వ్రాసినారు. ఆయన కుమారుడు కొన్నాళ్ళు సంపాదకుడుగా ఉన్నాడు. వీటిలోకూడా చాలాభాగము పరివర్తనాలే అనవలసి వస్తున్నది. ఈ గ్రంథమండలికూడా ప్రచారిణీగ్రంథమాల్నే అనుకరించినది. ఈ విధముగా ఆకాలములో అనేక గ్రంథమాలలు స్థాపితాలైనవి. నవలా ప్రచురణములో ఈ గ్రంథమాలలు చాలా కృషిచేసి మొత్తముమీద సారస్వతసేవ చేసినవనే చెప్పవలె!

---

* "వేగుచుక్క గ్రంథమాల" ఒకటి బరంపురములో స్థాపితమైనది. దానికి [illegible] గారు సంపాదకుడు. ఈ మాలవారుకూడా కొన్ని నవలలు ప్రచురించినారు.

## ఆంధ్రగ్రంథమాలః

కొన్ని సంవత్సరాలనించీ విశ్వదాతగారు "ఆంధ్రగ్రంథమాల" అని స్థాపించి ఎన్నో గొప్ప గ్రంథాలు ప్రచురించినారు. దీనికీ వెనకటి గ్రంథమాలలకూ చాలా భేదము ఉన్నది. ఇది వర్తకపద్ధతిమీద స్థాపితమైనది. వెనకటివి జనాదరణముమీద ఆధారపడి స్థాపించినవి. ఈ గ్రంథమాలలోకూడా "పండితారాధ్య చరిత్ర", 'బసవపురాణము' వంటి ప్రాచీన గ్రంథాలు ప్రచురితాలైనవి. వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు గారలు వీటికి వ్రాసిన పీఠికలు విశిష్టమైనవి!

## ఆంధ్రపత్రికా స్థాపనముః

ఈ గ్రంథమాలవారు ఆంధ్ర వాఙ్మయ సూచిక (ముద్రితా ముద్రిత గ్రంథ పట్టిక) యొకటిప్రచురించినారు. ఈ గ్రంథకర్త వ్రాసిన 'తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్ర' వంటి పరిశోధక గ్రంథాలను అచ్చువేసినారు. వేలూరివారు అనువదించిన 'గాంధీగారి ఆత్మకథ' ఈ గ్రంథమాలలోనే ప్రచురితమైనది. విశ్వదాతగారు 'భగవద్గీతా వ్యాఖ్య' వ్రాసి ఈ గ్రంథమాలలో చేర్చినారు. అంతకు పూర్వమే బెల్లంకొండ రామారావుగారి భగవద్గీతవ్యాఖ్య ప్రచురించినారు. యోగశాస్త్ర గ్రంథములు, నాటకములు, నవలలు, చరిత్రలు అనేకము ప్రకటించినది గ్రంథమాల!

కాశీనాధుని నాగేశ్వరరావుగారు (1867-1938) మొదట బొంబాయిలో వైద్యక్రియలను తయారుచేస్తూ "విలియం కంపెనీ' అనేపేరుతో మందుల వర్తకము మొదలుపెట్టినారు.* క్రమముగా ద్రవ్యవంతుడైనాడు. మొదటినించీ లేని దినాల్లో కూడా యీయన హృదయము చాలా ఉదారమైనది. ఈయన బొంబాయిలో ఉన్నకాలములో మనవారెవ్వరు బొంబాయిపోయినా వీరి ఇల్లేబస. ఒక

---

* ఈవిలియం కంపెనీవారి "తామరమందు" చాలా ప్రసిద్ధికెక్కినది ఆ మందు పేరే విశ్వదాతగారికి "లక్ష్మితామర" వ్యాపించటము మొదలుపెట్టినది

పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు సువర్ణోత్సవానికి వ్రాసిన (ఆంగ్ల) కాంగ్రెసు చరిత్రకు అనువాదము కొడాలి ఆంజనేయులు చేసినాడు. ఈ గ్రంథమాలవారు దీనిని ప్రచురించినారు

1945 ఏప్రిల్ 11 తేదీన నాగేశ్వరరాయ వర్ధంత్యుత్సవాలు ఆంధ్రదేశమంతటా జరిగాయి

సత్రంలాగుండేది. "త్యాగాయభోగాయచ" అన్నట్టు రెండూ కూడా చేసినాడు మహానుభావుడు! ఆ "విలియం కంపెనీ" ప్రచారము కోసము "ఆంధ్ర పత్రిక" పుట్టినది. మొదట మొదట ప్రకటనలూ, మందులను గురించిన పాటలూ ఉండేవి! క్రమముగా అది వారపత్రిక అయినది.* కాని అంత యెక్కువగా ప్రచారములోనికి రాలేదు. చందాదారులుమాత్రము కొంతమంది ఉండేవారు. ఈ పత్రికకయ్యే ఖర్చంతా మందులదుకాణము భరించేది. ఇలా వర్తకమూ పత్రికా ఆస్తిగా బొంబాయిలో చక్కగా కాలక్షేపము చేస్తూ ఉండేవాడు విశ్వదాత.

ఈ దినాల్లో ఆంధ్రోద్యమము వచ్చినది. ఉద్యమ ప్రచారము కోసము ఒక తెనుగు దినపత్రికా, ఒక ఆంగ్ల దినపత్రికా ఉండవలెనని మద్రాసులోని ఆంధ్రమహా మహులంతా నిశ్చయించినారు. ◆

---

* ఆంధ్ర వారపత్రికకు కోపల్లె వెంకటరమణరావు గారు సహాయసంపాదకుడుగా ఉండేవాడు. ఈయన ఒంగోలునుంచి 1890లో 'కల్పవల్లి' అనే మాసపత్రికను పెట్టి కొన్నాళ్ళు నడిపినాడు. ఈయన మనుచరిత్ర ప్రథమ పీఠికా కారుడు ఇది చాల చక్కగా ఉన్నది. ఇతను న్యాయబోధిని అనే మాసపత్రిక 1899లో పెట్టి నిర్వహించినాడు. దీని తర్వాత ఆంధ్రపత్రికకు సహాయసంపాదకుడుగా వెళ్ళినాడు.

◆ ద్రవ్యమెలా అనే చర్చవచ్చినది. లిమిటెడ్ కంపెనీ పెడదామని తేల్చుకున్నారు. షేరు నూరురూపాయలన్నారు. నేను కొన్ని షేర్లు తీసుకుంటానని గంభీరంగా పలికినారు, బయ్యా నరసింహేశ్వరశర్మ గారు,ప్రధమాంధ్ర మహాసభాధ్యక్షుడు! అక్కడినుంచి వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రి గారు, కవుతా సూర్యనారాయణగారు, గంటి వెంకట్రామయ్యగారు, పేరి నారాయణమూర్తిగారు, న్యాపతి సుబ్బారావుగారు, భూపతిరాజు వెంకటపతిరాజుగారు, ముట్నూరు ఆదినారాయణయ్యగారు, టంగుటూరి ప్రకాశంగారు మొదలైనవారూ యింకా చెన్నపట్నంలో ఉండే ఆంధ్రవైశ్యులూ కలిసి షేర్లు వేయించడానికీ బయలుదేరినారు. అధమం రెండులక్షల రూపాయలుంటేనే గాని దినపత్రిక సాగుతుందా! ఈ సంగతినంతా కనిపెడుతూ కూర్చున్నాడు నాగేశ్వరరావుగారు.

అప్పటికే అమృతాంజన ప్రకరణము ఎలా ఎవరి దగ్గరినించి తెలుసుకున్నాడో తయారుచేసి అమ్మటం మొదలుపెట్టినాడు. దాని ప్రచారం ఆంధ్రపత్రిక వారసంచిక ద్వారా జరుగుతూ ఉన్నది. అమృతాంజనం డిపో వెలిసినది. దానికి ఒక బ్రాంచి మద్రాసులో స్థాపించినాడు. క్రమక్రమముగా ఈ అమృతాంజనము అమ్మకం యెక్కువైనది. అది ఒక గొప్ప ఆదాయవిషయమైనది. ఈ సందర్భములో మద్రాసుకు తరుచూ రావలసి వస్తూఉండేది నాగేశ్వరరావుగారు. బొంబాయిలో ఒక కాలూ మద్రాసులో ఒక కాలూ అయినది. తెనుగుపత్రిక బొంబాయిలో ఉండటంకంటె మద్రాసులో ఉంటే తెలుగుదేశ ప్రచారము బాగా జరుగుతుందని నిశ్చయించి బొంబాయినుంచి పత్రికను మద్రాసుకు మార్చినాడు. అప్పటినుంచి ఆంధ్రపత్రిక వారసంచిక మద్రాసునుంచీ వస్తూఉండేది. ఈ స్థితిలో మనవారంతా దినపత్రికకోసం ప్రయత్నిస్తున్నారు.

అప్పుడే నాగేశ్వరరావుగారి బసకూడా చెన్నపట్నానికి మార్చి ఇక్కడ యెక్కువగ ఉంటూ అప్పుడప్పుడూ వర్తకరీత్యా బొంబాయినెళ్ళటము మొదలుపెట్టినాడు. మద్రాసే వారికి స్థావరమైపోయినది. పట్టాభిగారంటే విశ్వదాతగారికి మొదటినించీ చాలా ఆదరము. పట్టాభిగారితో సలహాచేసినారు; ఇద్దరూ కృష్ణాజిల్లావారే! పట్టాభిగారు సలహాఇయ్యడములో చాలా సమర్థుడు. నాగేశ్వరరావుగారిని ప్రోత్సహించినాడు. ఇప్పటి పరిస్థితులు ఒక్కమారు గమనిస్తే అప్పటి ఈ సలహా ఆంధ్రదేశానికి ఎంత ఉపకారమైనదో ఆశ్చర్యము అవుతుంది! వెంటనే పట్టాభిగారి సలహాను విన్నాడు. ఇప్పుడే భవనములో "ఆంధ్రపత్రిక" ఉన్నదో ఆ భవనాన్ని పట్టాభిగారివద్ద అప్పుతీసుకుని కొన్నాడంటారు! అదే ఐశ్వర్యము ఎక్కువకావడానికి పునాది. "స్థలభోగము" సాగినది. విశ్వదాత పట్టినదల్లా బంగారమైనది. ఆయన జీవితమంతా ఆంధ్రసంస్కృతి యొక్క సర్వతోముఖసేవతో ధన్యమైనది. ఆంధ్రజాతికి మితిలేని ఉపకారమైనది. ఆంధ్రచరిత్రలో శాశ్వతమైనా, ఉన్నతమైనా, స్థానమేర్పరుచుకున్నాడు విశ్వదాత!

దినపత్రిక * ప్రచురణమైనది. ఆంధ్రప్రముఖులంతా కలిసి యెన్ని దినాలనించో ఆలోచించి, చేయలేనిపని ఒక్కవ్యక్తి చేసినాడు! పెద్దలంతా పాపము విశ్వదాత యెడల సానుభూతిని కనపరచినారు. ఆయన యెంతమాత్రము వినలేదు. ఆయనదోవే ఆయనది. పట్టాభిగారి వాక్యము వేదవాక్యమై పోయినది. విశ్వదాతగారి కీర్తి వ్యాపించటము ప్రారంభించినది. దేశమంతటా వార్తలయం దభిలాష హెచ్చినది. ఆంధ్రపత్రిక దేశము మూలమూలకూ వ్యాపించినది. పత్రికాపాఠకుల సంఖ్య హెచ్చినది. భోజనముతో పాటు పత్రిక అవసరమైపోయినది. విశ్వదాత గారి అదృష్టముపండినది. అమృతాంజనముకూడ విరివిగా ఖర్చుకావడము తటస్థించినది. అమృతాంజనాదాయము ఎక్కువైనకొద్దీ ఆంధ్రపత్రిక సైజు పెరగటము మొదలుపెట్టినది. వారపత్రిక వదలిపెట్టలేదు. అదికూడా కొందరికి అవసరము తీరుస్తూనే ఉన్నది; వారానికొకమారు సారస్వతానుబంధము వచ్చేది. కొన్నినాళ్ళీ

---

* "శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు 1914న సం చెన్నపురికి అరుదెంచి ఆంధ్రదైనిక పత్రికను స్థాపించినారు "

ఆంధ్రమహాసభ - స్వాగతోపన్యాసము - గద్దె రంగయ్య నాయుడు.

సారస్వతానుబంధములో 'సాక్షి' ఉపన్యాసాలు వస్తూఉండేవి. ఇదీ అదీ అన్నీ కలిసి ఆంధ్రపత్రికను స్థాయిగా చేసినవి. కొన్నినాళ్ళు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సంపాదకుడుగా ఉన్నాడు. చాలా సమర్థతతో నిర్వహించినాడు. తర్వాత చల్లా శేషగిరిరావు వచ్చినాడు. సంపాదకీయవర్గములో కొడాలి శివరామకృష్ణారావు, వెదురుమూడి శేషగిరిరావు* వగైరాలు ఉండేవారు.

విశ్వదాతగారికి◆ ధనార్జనతోపాటు, వదాన్యతా, దానితో కీర్తీ పలుకుబడీ హెచ్చిపోయినది. ప్రచురణలోనూ, వార్తలలోనూ, అచ్చులోనూ, పనితనములోనూ చాలా అభివృద్ధికలగజేసినాడు. అమృతాంజనము డిపో, పత్రికాకూడా ఒక్క స్థలానికే వచ్చినవి! ఎప్పుడూ ఈగలు ముసిరేటట్టు పని! విశ్వదాతగారి ఇల్లూ, ఆంధ్రపత్రికాకార్యాలయమూ కూడా చెన్నపట్నములో ఆంధ్రులకు కేంద్రాలైపోయినవి. ఈఉద్యమానికీ విశ్వదాత మూలపురుషుడైనాడు. కాంగ్రెసు క్రమముగా బలవంతమైనకొలదీ విశ్వదాతగారికీర్తీ, ఆంధ్రపత్రిక ప్రచారమూ, మిన్నుముట్టి పోవటము ప్రారంభించినది. ఈ విధముగా ఆంధ్రపత్రిక తన విధిని నిర్వర్తించినది. భాష, సారస్వతము, రాష్ట్రము, అన్నీకూడా ఆంధ్రపత్రిక ప్రచారానికి విషయాలైనవి! ఎంతకాలమునించో కలవరిస్తున్న కార్యము ఒక్క వ్యక్తి తన స్వశక్తి మీద మోసినాడు. విశ్వదాతయొక్క శాశ్వత కీర్తికి ఇంకేమి కావలె?◆ క్రమముగా దుర్గావిలాస్, దుర్గాకళామందిరము, గ్రామాలుకొనటము, కుమార్తెపెండ్లి దేవేంద్ర వైభవముతో చెయ్యడము, అన్నీ తటస్థించినవి. కాని ఆయన ఆరోగ్యము, ఆహారము చాలా

---

* యుద్ధము తర్వాత సహాయనిరాకరణోద్యమము వచ్చి ఇంకా పత్రిక కార్యాలయ విస్తృతాలను చేసినది.

◆ చూ: కాశీనాధుని వారిపై సముద్రాల వేంకటరాఘవాచార్యుల సహోదయలో 24 3-1946 నుంచి కొన్ని వ్యాసములు

వేటూరివారి వ్యాసము, జనవరి 1946 సహోదయలోను;

పిల్లంపల్లివారు వ్రాసిన వ్యాసము, ఏప్రిల్ 1947 భారతిలోను,

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 27సం. 1 సం.

◆ ఈయన హిజాన్ పత్రికలో కొద్దికాలము పనిచేసి 1944 లో గతించినాడు

సున్నితాలైపోయినవి. పండూ, మజ్జిగా తప్ప ఆహారము ఇతరములేదు. దానానికి అంతులేదు. చేతికి నరములేదు! పోషణకు మితి లేదు! రెండులక్షలరూపాయలు ఖరీదుచేసే శ్రీబాగ్ నివాసిఅయినాడు. ఆంధ్రదేశము భాగ్యము పండినది. ఆయన ఐశ్వర్యము పెరిగినకొద్దీ దేశ సేవయే ఫలము. ఆయన సహాయము కాస్తో కూస్తో పొందని సంస్థలేదు. ఆయన దానానికి విచక్షణలేదు. మంచిశైలి వ్రాయగల వ్రాయసకాడు.* దైవభక్తి పాపభీతి మెండు. ఔదార్యానికి అవధిలేదు. ప్రశాంతమైన ముఖము, తేజోనంతాలైన దృష్టులు, మెత్తని జిహ్వా, మరపునకురావు.

భారతి స్థాపించకపూర్వము ఆంధ్రపత్రిక సమస్త సారస్వతసేవ చేస్తూఉండేది. పద్యాలు, వ్యాసాలు, కథలు, ఇతరవిషయాలు, అన్నిటికీ అదే స్థానము. ఆంధ్రదేశములోకల్లా అప్పటికీ ఇప్పటికీకూడా రెండే పేరుగాంచిన పత్రికలు - ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక. ఆంధ్రదేశము, దానిలో మధ్యకృష్ణానది! ఈ రెండుపేర్లు రెండు పత్రికలతో శాశ్వతమయిపోయినవి! ఏమి విశ్వదాత! కీర్తి కాయుడైనాడు! వారసులకు దేశసేవ చెయ్యడానికీ తానునుభవించడానికీ సంపూర్ణావకాశాలు కలుగజేసి పోయినాడు. స్వర్గమునుంచి తమ కార్యాలు నిర్విఘ్నముగా జరగడము చూస్తూ ఉన్నాడు.

ఇంగ్లీషులో కూడా దినపత్రిక అవసరమే! అందరూ ఆందోళన పడుతూనే ఉన్నారు. ప్రకాశంగారు స్వరాజ్యపత్రిక స్థాపించి తాను మునిగినాడు. విజ్ఞానము, దేశభక్తి, వదాన్యత, సేవాచికీర్ష ఉండి గొప్పత్యాగిఅయినా అదృష్టముకూడా కలిస్తేనేగాని ఉద్దేశితకార్యము సఫలముకాదు. అదివరలో న్యాపిస్తున్న పత్రికావాఙ్మయానికి దోహదము ఇచ్చిన దాంధ్రపత్రిక. ఏతత్ స్థాపనతో దేశీయప్రజలలో విజ్ఞానము పెరిగినది. పరనేచ్ఛ హెచ్చినది. వివేచనాజ్ఞానము కలిగినది. అన్నిటికంటె యెక్కువగా భాషలో ఒకవిధమైన సౌలభ్యము కలిగినది. శైలిలో మార్పుకలిగినది. వార్తావాఙ్మయభాష ఒకటి స్థిరమైపోయినది. అది సర్వజనాదరణీయమైనది. కొన్ని మాటలు అసలు అర్థాలు వేరే అయినా, కొన్ని అర్థాలలో రూఢమైపోయినవి. ఇప్పుడు

* నేను రచించిన "తంజాపు రాంధ్రనాయక రాజ చరిత్రను" తనురు ప్రకటించిదానికి తాము స్వహస్తాలతో తొలిపలుకు రచించి నన్ను గౌరవించినారు.

అవి తప్పు అనడానికి ఎంతమాత్రము వీలులేదు. "పరిస్థితులు" "వాతావరణం" "విశాలవిశ్వమానవజాతి" మొదలైన చాలామాటలు అక్షరాస్యులు కానివారికికూడా అర్థమయ్యేటంత సులభాలైనవి!

ఇంగ్లీషు వాఙ్మయ చరిత్ర చదివితే 18 శతాబ్దమునుంచీ పత్రికలు వాఙ్మయాభివృద్ధిలో చాలా పాల్గొన్నట్టు కనపడుతుంది. ఒక్కొక్క పత్రిక కృతులను విమర్శిస్తూ ఉంటే కవులు గజగజ వణికేవారు. తాను వ్రాసిన కావ్యాన్నిగూర్చి" యెడింబరో రివ్యూ" అనే పత్రికలో చేసిన విమర్శనాన్ని చూచి గుండెలు పగిలి చచ్చినాడు కీట్సు మహాకవి! చూచినారా పత్రికల పలుకుబడి! మనదేశములో కూడా వాఙ్మయ ప్రచారానికి పత్రికలు చాలా తోడ్పడుతున్నవి. ఆంధ్ర, భారతీ, కృష్ణాపత్రికలు మొదలైనవి నవ్యసాహిత్యానికి ప్రోత్సాహ మియ్యకపోతే అది ఇంత అభివృద్ధికి వచ్చేదికాదు. నవ్యసాహిత్యవిశారదులు ప్రచారముకోసము పెట్టిన పత్రికలన్నీ మఖలో పుట్టి పుబ్బలో ఆరిపోయినవి. వెనుకటి సారస్వతాన్ని కలుపుకొని పోతూఉండవలెనుగాని దానిని బొత్తుగా విడువకూడదు. అలా విడవకుండా ప్రోత్సాహ మిచ్చినవి కాబట్టి యీపత్రికలు నిలచి ఉన్నవి. అలా చెయ్యలేదు కాబట్టి కొన్ని అంతరించినవి. మిగిలినవి యెలాగున్నా"సాహితి" అంతరించటము చాలా విచారకరము. సంప్రదాయము మరవకుండా, పుట్టుక మరచిపోకుండా గౌరవముచేస్తూ ముందుకు వెళ్లేవారిదే నిజమైన అభివృద్ధి. అలాగాక పుట్టుకను మరిచిపోయే నడక అభివృద్ధివలె కనబడుతుందే కాని నిజమైన అభివృద్ధికాదు. కొంత కాలానికి పతన హేతువు అవుతుంది. ఈ విషయము మరవరాదు!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 7

# సాహిత్య మూలసూత్రములు

## సాహిత్యము-సారస్వతము-వాఙ్మయము:*

సాక్షాద్విమర్శనమునుగూర్చి ముచ్చటించదానికి పూర్వము కొన్ని పదాలను గూర్చి, విషయాలను గూర్చి ముచ్చటించటము అవసరము. వాఙ్మయము, సారస్వతము, సాహిత్యము అనే మూడుపదాలు దాదాపు సమానార్ధకాలుగా వాడుతున్నారు. కాని అది సమంజసము కాదు. శబ్దములే భేదాన్ని సూచిస్తూ ఉన్నవి. వాగ్రూపమైన-అనగా వ్రాయబడే, పఠింపబడే, మాటలాడబడే సమస్త వాగ్జాలమునకు వర్తిస్తుంది వాఙ్మయపదము. ఇక్కడ విద్వదవిద్వ ద్భేదమేమీ లేదు. అనగా ప్రపంచములో వ్యవహారములోఉన్న వాగ్లిఖిత రూపపదవాక్యజాలమంతా సమస్త గ్రంథజాలానికి వర్తిస్తుంది. సాహిత్యము రసాత్మకమై, గద్యపద్యరూపమైన కావ్యజాలానికి వర్తిస్తుంది. దీనివలన వాఙ్మయము చాలా విశాలమైన పదమనీ, సారస్వతపదమంతకంటె తక్కువ విశాలమనీ, సాహిత్యము దానికంటె పరిమితమని తేలుతున్నది. సారస్వతము వాఙ్మయాంతర్భూతము. సాహిత్యము సారస్వతాంతర్భూతము. విద్యానాధ మహాకవి యీ భేదాన్ని ప్రతాపరుద్రీయ ప్రథమ శ్లోకములో వ్యక్తము చేసినాడు.

. ........ ....... "సారస్వతప్రక్రియా
బీజన్యాసభువో భవంతి కవితానాట్యైక జీవాతవః"

దీనివలన సారస్వతప్రక్రియలో కవితానాట్య మంతర్భూతమని స్ఫురిస్తున్నది.

---

* పిల్లలమఱ్ఱివారి రేడియో ఉపన్యాసము. (చూ : సాహిత్య సమాలోచనము) 1947 అక్టోబరు భారతిలో, పి. వేం. హ. వ్రాసిన వ్యాసము.

కాబట్టి ఈమూడుపదములు ఇంత భిన్నార్థకాలుగా ఉన్నప్పుడు సమానార్థకాలుగా వాడటము సమంజసముకాదు.

ఇక అధికారినిగూర్చి చెప్పవలసివచ్చినప్పుడు వాఙ్మయానికి సమస్త ప్రజలు అనగా ఒక భాష మాటలాడే వారంతా అధికారులే. దీనికి విశిష్టత చాలాతక్కువ. వైశాల్యములో విశిష్టత కోల్పోయినది వాఙ్మయము. సాహిత్య సారస్వతాలు వాఙ్మయములో అంతర్భూతాలన్నప్పుడు, దీనిలో కొంతభాగము సారస్వత లక్షణాలు కలదిగానూ, మరికొంత సాహిత్యలక్షణాలు కలదిగానూ ఉండవచ్చు. అంతమాత్రము చేత రెండు పదాలచేత నిర్వచింపబడేది ఒకటి అని చెప్పవచ్చునా? ప్రాణులలో మానవుడంతర్భూతుడు. మానవులలో హిందువులంతర్భూతులు. ఈవిధముగానే పైమూడుపదాలు పూర్వపూర్వ వైశాల్యము కల పదాలు. ప్రాణులన్నీ మానవులెలాగా కారో, మానవులందరు హిందువులెలాగా కారో, ఆవిధముగానే వాఙ్మయమంతా సారస్వతమూ కాదు. సారస్వతమంతా సాహిత్యమూకాదు. హిందువులు మానవులూ, ప్రాణులూ కూడాను. అలాగే సాహిత్యము, సారస్వతమూ వాఙ్మయమూ కూడా అవుతుంది. కాబట్టి సాహిత్యాధికారులూ, సారస్వతాధికారులూ కూడా వాఙ్మయాధికారులు అవుతారు.

ఇక సారస్వతాధికారి పండితుడూ కళాభిజ్ఞుడూను. "కవి సారస్వతాధికారి అవుతాడు కాని ప్రతికళాభిజ్ఞుడు కవి కానేరడు. ప్రతి పండితుడు కవికానేరడు. ఒక్కొక్కప్పుడు పాండిత్యమూ, కవిత్వమూ ఒక వ్యక్తిలో ఉండవచ్చును. అట్టివాడు పండితకవి. శిల్పి, చిత్రకారుడు మొదలైనవారు కవులను నిర్వచనము సాక్షాత్తుగా చేయతగినవారుకారు. లలితకళలన్నీకూడా రసప్రవణాలే కాబట్టి అట్టి రసనన్నిర్మాణ కుశలులైన శిల్పి చిత్రకారులు కూడా కవులేనని లాక్షణికముగా చెప్పనచ్చును. కాని అట్టి నిర్వచనము పరీక్షకు ఆగదు.

మూడవది అయిన సాహిత్యానికి అధికారులు కవి, సహృదయుడు. కవి కర్త; సహృదయుడు వ్యాఖ్యాత. కవిలక్షణాలు, సహృదయ లక్షణాలు కొన్ని ఏకీభనిస్తవి.

"శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణం
కావ్యజ్ఞశిక్షయాభ్యాసః ఇతి హేతుస్తదుద్భవే"

కవికి ఎలాగా శక్తిమొదలైనవి అవసరమో అలాగే శక్తి సహృదయుడికికూడా అవసరమే. దీనిలో చాలా గుణాలు సహృదయునికి కూడా కావలె. కాబట్టి సాహిత్యరసాస్వాదనానికి కవి సహృదయులిద్దరు సమాన భాగస్తులు.

వాఙ్మయమంతా సాహిత్యము అని కాని సారస్వతమంతా సాహిత్యము అని కాని అనుకోవటము భ్రమ. ఇంగ్లీషులో "పొయిట్రీ" అనే పదానికెట్టి నిర్వచన మున్నదో మనభాషలో సాహిత్యానికట్టి నిర్వచనమే ఉన్నదని దాదాపు చెప్పవచ్చును. "లిటరేచర్" అనే పదము "పొయిట్రి" అనే పదముకంటె విశాలము. అలాగే సారస్వతమనే పదము సాహిత్యపదముకంటే విశాలము. "పొయిట్రి" అనటంతోనే ఛందోబద్ధత జ్ఞాపకానికి రావచ్చు. కాని "పొయిట్రి" చందోబద్ధంగానే ఉండనవసరము లేదని ఆ నిర్వచనమే చెప్పగలదు.

"Poetry is the expression in melodious words, of thoughts which are the creations of feelings and imagination"

"A poem is a composition of high beauty of thought or language although not inverse."

పాశ్చాత్య విమర్శకులందరు ఈ అభిప్రాయమే కలిగి ఉన్నారు. దీనివల్ల కవిత్వానికీ సాహిత్యానికీ సన్నిహితసంబంధము ఉన్నట్లు స్పష్ట మవుతున్నది. మన లాక్షణికులు కూడా కావ్యనిర్వచనముచెప్పి అట్టికావ్యము గద్యపద్య ఉభయాత్మకముగా ఉండవచ్చునని చెప్పినారు.

ఇంగ్లీషుభాషలో "లిటరేచర్" పదమూ మన సారస్వతపదమూ దాదాపు సమానార్థకాలని ఈ నిర్వచనమువల్ల తెలుస్తున్నది.

"Literary=Belonging to letters or learning"

"Literature is the whole body of literary compositions in any language."

కాని ఇంగ్లీషు నిర్వచనానికీ మనదానికీ ఒకభేదము ఉన్నది. వారి "లిటరేచర్" లో ప్రకృతి శాస్త్రాలకూ, కళలకూ స్థానము ఉండకూడదని కొందరి వాదము. ఉండవచ్చునని మరికొందరు. కాని మన సారస్వతములో సమస్త కళలకూ శాస్త్రాలకూ స్థానమున్నది.

పై దాన్నిబట్టి సాహిత్య సారస్వత వాఙ్మయాలు ఉత్తరోత్తర వైశాల్యము కలిగి ఏకకేంద్రముగాకల మూడు గోళాలవలె ఉన్నవని స్పష్టమవుతున్నది. దినపు పత్రికలలో కనపడే, వాఙ్మయము అని పిలవబడే సమస్తమూ సారస్వత సృష్టి కాదు సాహిత్యము కాదని స్పష్టము. సాహిత్యాస్వాదనానికి సహృదయుడు ఉండవలెను. ప్రజలందరు (అక్షరాస్యులూ, నిరక్షరాస్యులూకూడా) సహృదయులనటానికి వీలులేదు. ప్రతివ్రాయసకాడు కవిఅయి ప్రతిపఠిత సహృదయుడు అయితే మన ప్రజ చెప్ప శక్యముకాని సంస్కృతి కలదనటంలో ఎట్టి అభ్యంతరమూలేదు. కవి ఎట్టివాడో సహృదయుడు ఎట్టివాడో విచారింతాము.

## కవి : సహృదయుడు :

కవికి ప్రాచ్యలాక్షణికులేగాక పాశ్చాత్య లాక్షణికులుకూడా చాలా గౌరవాన్ని ఇచ్చినారు. తుదకు మనవాళ్ళు "నానృషిఃకురుతే కావ్యం" అన్నారు.* కవికి ఋషికి ఇచ్చినంత గౌరవాన్ని యిచ్చినారు. ఆయన సృష్టికర్త. ఆయన సృష్టి బ్రహ్మసృష్టికంటె విలక్షణము. లాక్షణికుడీ విధముగా అన్నాడు :

"నియమకృత నియతిరహితాం
హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవే ర్జయతి" (మమ్మటుడు)

పై శ్లోకములో కవి సృష్టివైలక్షణ్యము చెప్పబడినది. బ్రహ్మసృష్టి సుఖదుఃఖ ఉభయాత్మకము. కాని కవిసృష్టి "హ్లాదైకమయి" ఈ ఒక్క వైలక్షణ్యము చాలదా? సమస్తకాలాలలో సహృదయునికి ఆనందమే కలుగచేసేవాడు కవి. కొందరు "నిరంకుశాః కవయః" అన్నారు. కవి స్వతంత్రుడు. నిగ్రహానుగ్రహ సమర్థుడు. సాధారణ వస్తువును అసాధారణముగా చూపుతాడు. అసాధారణ వస్తువును మనకండ్లముందు తెచ్చిపెట్టుతాడు. మనము ఎన్నడైనా హంసల నెరుగుదుమా?

---

* "To the Ancient Hindus and the Greeks the poetic exercise is a religious act and the poet invokes the nurse and begins with prayer "
— An Idealistic view of Life, p 186

కొంగల నెరుగుదుము. కాని కాళిదాసు మేఘదూతలో "ఆకైలాసాద్బిసకిసలయచ్ఛేద పాథేయవంతః" అనినప్పుడు ముక్కులలో బిసకాండములను పెట్టుకున్న హంసలు పాఠకుని మనశ్చక్షువులకు గోచరము కావటము లేదూ? మనము ఎన్నడైనా వైకుంఠోద్యాన మెరుగుదుమా? కాని పోతన్నగారు "మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలోత్పల పర్యంక రమావినోది" అని ఒక్కత్రుటిలో వైకుంఠము చుట్టూ ఉన్న మందారవనాన్నీ, దానిలోఉండే అమృతసరస్సునూ, దానిఒడ్డునూ, అక్కడ ఉన్న ఇందుకాంతోపలాన్నీ, దానిపైన ఉన్న ఉత్పలపర్యంకానీ మన మనశ్చక్షువులకు గోచరించేటట్టు చేసినాడు. కాబట్టి ఎన్నడూ మనుష్యుడు ఎరుగని వస్తువులనూ, సన్నివేశాలనూ సహృదయునికి చూపి దాసుని చేసుకుంటాడు కవి. ఇట్టిపని ప్రతివాడూ చెయ్యగలడా?✻ మనవారిప్పుడు కవి పదాన్ని చాలా నిరర్థకంగానూ, ఒక్కొక్కప్పుడు అనర్థకంగానూ కూడా వాడుతున్నారు. ఇప్పుడు కవి కావటానికి "కందం" కూడా వ్రాయనవసరములేదు. కార్లైలు మహాకవి కవిని "Prophet" అనినాడు. అంటే ద్రష్టఅన్నమాట. ఇది మన ఋషి శబ్దము వంటిది. అందరకున్నదానికంటె చిత్తసంస్కారము కవికి సహజముగా ఉంటుంది. దానికితోడుగా ప్రతిభ ఉంటుంది. భావనాశక్తి ఉంటుంది. ఇన్నిశక్తులు ఉండబట్టే అతడు నూతనసృష్టిచేయకలుగుతాడు. ఆయన చేసేపని "ఉన్నది ఉన్నట్టు" వర్ణించటమూకాదు. "కన్నది కన్నట్టు" వర్ణించటమూకాదు.◆ "భావించినది భావించినట్లు చెప్పుతాడు" పైరెండువిధముల వర్ణనమూ చాలాపేలవమూ, సామాన్యమూను. అది కోర్టులో అబద్ధము కాకుండా

---

✻ కేవలము మనకు సామాన్యానందము కలుగచేసేవాడు ఉత్తమకవికాదు. తన చిత్తవృత్తితోపాటు మనదాన్నికూడా స్పందింపచేసేవాడు నిజమైనకవి.

"The great poet is he whose nature it is to represent his experience through words winged with magic capable of evoking the experience."

(Idealistic view of Life P 188)

◆ "సదాతద్భావ భావితః"

"When all is said and done art is an accident, which depends upon what we make of conditions and not of what they make of us. The genious of the artist is the determining factor.

"కనటం" బాహ్యదృష్టితోకాక అంతర్దృష్టితో అయితే "కన్నది కన్నట్టే" అని కొంతవరకు అనవచ్చు

నిజము చెప్పడము వంటిది. కాని కవి సాక్ష్యము చెప్పుతున్నాడా? ఆయన సాక్షికాదు. ద్రష్ట. అవేక్షిస్తాడు, తన్మయుడౌతాడు. పలుకుతాడు. చిత్తస్పందనము కవికి విలక్షణ శక్తి నిస్తుంది. ఈస్పందనమువల్ల ఉద్రేకపూరితుడై ఆపుకోలేక గానము చేస్తాడు.◆

కవికి ఉద్భవించటానికి కావలసిన సామగ్రిని వెనుక నిర్వచించినాను. వానిలో మొదటిది "శక్తి'. ఇదే సంస్కారమనికూడా పిలవబడుతున్నది. ఒక్క కవితకేగాక యీ "శక్తి" సమస్త లలితకళలకూ అవసరమైన సంస్కారము. ఇది లేకపోతే ఎంత యత్నమువల్లకూడా కవిగాని, చిత్రకారుడుగాని, శిల్పిగాని కానేరడు తిర్యగ్జంతువులకు సహజముగావచ్చే ఈత వంటిదీ శక్తి. నేరిస్తేవచ్చే విద్యవంటిదికాదు. ఒకవేళనేర్చుకున్నా ఆశక్తి "పద్యనిర్మాణశక్తే" అవుతుంది కాని కవితాశక్తి ఎంతమాత్రము కాజాలదు. కాబట్టి కవితాశక్తి ఒక విలక్షణమైనశక్తి.✳

శక్తి ఉన్నంతమాత్రాన ఉత్తమకవి కానేరడు. అట్టివాని కవిత యందు సార్వకాలీనతా సార్వజనీనత లుండవు. వాల్మీకి రామాయణము సార్వకాలీన సార్వజనీన కావ్యము. దానికి క్షతి ఎప్పటికీ కలగదు. ఇన్ని వేల సంవత్సరాలు కాలాన్ని గెలిచి నిలిచి ఉన్నది అంటే దాని సార్వకాలీనత కది ఒక తార్కాణము. సమస్త ప్రపంచముచేత కొని యాడబడుతూ ఉన్నది అంటే దాని సార్వజనీనత కది ఉదాహరణము. ప్రపంచములో ఉన్న అన్ని ఉత్తమ కావ్యాలు అట్టివే!‡ కాళిదాసు,

---

◆ "In poetic experience we have knowledge as distinct from knowledge by knowing. (Ibid P 184)

"So long as we are lost in the details of sense and intellect our soul is inactive. It is then (when we see into the life of things) that one passes into the object, flings one's self on it, lives in its rhythm and sees into it" (Ibid P 185)

✳ ఈశక్తి రెండుమెట్లుగా ఉండవచ్చు క్రిందిమెట్టు ప్రతిభ. "నవనవోన్మేషశాలి అయిన ప్రజ్ఞ" ప్రతిభ. ఎప్పటికప్పుడు నూతన వికాసాన్ని పొందే ప్రజ్ఞ. దీనికంటే పైమెట్టు "ఊహాప్రతిభ" సహజంగా, అకారణంగా నిజమే స్ఫురించేశక్తి ఇది. ఈశక్తి ఉన్నవాడికి అది ఉన్నట్టు తెలియకపోవచ్చు, ఇది ఉత్తమశక్తి. ద్రష్టల కందరికి ఉండే శక్తి ఇదే! దీనినే 'ఇన్ట్యూషన్' 'Intution' అని ఆంగ్లంలో అంటారు.

‡ "Poetry then is a form of life a realisation of the meaning of common life by living it more intensely.

"Deepest poetry has the widest appeal". - Sir S. Radhakrishna

భవభూతి, తిక్కన, పోతన, షేక్స్పియరు, మిల్టను, హోమరు, డాంటి, మొదలగు మహాకవుల కావ్యాలలో ఉన్న ఈ రెండుగుణాలే వాని ప్రాశస్త్యానికి కారణాలు. అవి దేనిలో కొరవడుతవో అది మహాకావ్యముకాదు. ఇట్టి సార్వజనీనతా సార్వకాలీనతలు సమస్త లలితకళలకూ సామాన్య గుణాలు. ఎల్లోరా అజంతా చిత్రములు, లియొనార్డో అవిడ్సి మొదలగు చిత్రకారుల చిత్రములూకూడా ఇట్టిగుణాలు కలవే! ఇవి అన్నీకూడా మానవుని మనస్సుకు ఆనందమును చేకూర్చె విషయాలు. వానిలో ఉండే ఆగుణాలవల్ల కలిగే ఆనంద సంధాయకత్వమే వానికి శాశ్వతత్వాన్ని ఇచ్చేది. ఈగుణమే మమ్మటుని "హ్లాదైక మయీం" అనే వాక్యములో అంతర్భూతమైనది. కీట్సు మహాకవి అట్టి భావాన్నే "A thing of beauty is a joy for ever" అనే వాక్యములో చెప్పినాడు.

ఈ గుణాలు కవి కర్మకు ఎలా వస్తవి? "నిపుణతా,లోకశాస్త్రకావ్యాద్య వేక్షణమ్, కావ్యజ్ఞశిక్షయాభ్యాసః" అనే వాటివలన కలుగుతవి. ఇవిఅన్నీ కూడా శక్తి ఉన్న కవికి ఆయన జ్ఞానాన్ని విశాలముచేసి, ఆయన కావ్యాలలో సార్వకాలీనతా సార్వజనీనతలు కలుగచేస్తవి. అవి ఉన్న కవికర్మ ఉత్తమమైన దంటిమే కాని అవి లేకపోతే కవికర్మ కాదనలేదు. అగును. కాని అట్టికర్మ శాశ్వతముకాక తాత్కాలికమే అవుతుంది. ఇద్దరికీ ఉండే భేదమిది. అప్పుడు కవికర్మకు సంకుచితత్వము కలగటమువల్ల విలువ తగ్గుతుంది.

సహృదయుడిని* గూర్చి చెప్పుకుందాము. సామాన్యార్థము హృదయము కలవాడు. ప్రతివానికి హృదయము ఉన్నది కాబట్టి ప్రతివాడు కూడా సోదరులకు కలిగే సుఖదుఃఖాలలో కూడా పాల్గొని, సానుభూతి కనపర్చటానికీ అర్హత కలిగి

* ఇది చాలా విచిత్రమైన శబ్దము. దీనికి సరిఅయిన శబ్దము ఆంగ్లసారస్వతంలో లేదు. "క్రిటిక్" అనేపదము "విమర్శకుడు" అనే అర్థము వస్తుంది. విమర్శించేవాడు సహృదయుడై ఉండవలెనే గాని విమర్శకుడే సహృదయుడనటానికీ వీలులేదు మరిన్నీ మన భాషలో విమర్శకుడంటే లోపాలను చూసేవాడని సామాన్యంగా గ్రహింపబడుతున్నది సరిపెట్టుకోవలెనంటే "క్రిటిక్" అనే పదంతో తృప్తిపొందవలె రససామగ్రికి సంబంధించిన పరిభాషా పదాలన్నీ భాషాంతరీకరణానికి అందనివే అని కూడా చెప్పవచ్చు. రసశబ్దం కూడా అట్టిదే. ఒక భాషలో ఉండే పారిభాషిక పదాలు మరియొక భాషలోకి తీసుకురావలెనంటే ఉండే చిక్కు ఇదే!

ఉంటాడు. ఇది సామాన్య సహృదయత్వము. వాఙ్మయాస్వాదనానికి కావలసిన సామాన్య సహృదయత్వము ఇది. ప్రజా సారస్వతానికి అధికారి ఇట్టి సహృదయుడే. కాని సాహిత్య రసాస్వాదనానికి ఈసహృదయత్వము చాలదు. ఇక్కడనే అనేకులు మనవారుచేసే పొరబాటు. సోదరుని ఇంటిలో ఎవరైనా మరణిస్తే దుఃఖములో పాల్గొనే సహృదయత్వము మనకందరికీ ఉన్నది. కాని "ఎండినకొమ్మ చెట్టుమీదినించి పడినప్పుడు చూస్తూ" ఉన్న కవి వ్రాసిన వాక్యాలలో, భావాలలోఉండే రసాన్నిగ్రోలి ఆనందించవలె నంటే సామాన్య సహృదయత్వము చాలుతుందా? కవికర్మ అయిన కావ్యము చదివితే ఆనందింపగల సహృదయత్వము కావాలె దానికి. ఇది సాహిత్యానికి సంబంధించిన సహృదయత్వముయొక్క విశిష్టత. అసలు సామాన్యుడికి ఇట్టి విషయమే అచుంబితము. ఆహారము నిద్రలేకుండటము, శరీర పరిశ్రమచేసి కష్టించటము, రోగమువస్తే బాధపడటము, ఆప్తుల మరణమువల్ల దుఃఖించటము మొదలైనవి పశుపక్ష్యాదుల కన్నిటికీ సహజములు. ఇట్టివానిలో సానుభూతిచూపే సహృదయత్వమే సామాన్యుల కుండునది. కాని సాహిత్య రసాస్వాదనానికి వలసిన సహృదయత్వము కలవాడు వెనక చెప్పిన విషయాలలో సానుభూతి చూపటమే కాకుండా కవి హృదయప్రవేశముచేసి కవిచెప్పే విషయాన్ని విమర్శించి కవికర్మ అయిన కావ్యముతో ఉండే రసాన్ని ఆస్వాదించి కవితో సానుభూతిని పొందుతాడు.* రెండుశక్తులను ఒకటే అనుకోటము చాలా పొరబాటు. మొదటి సహృదయత్వము సహజము. మానవునిలో ఉండే పశుత్వమే ఆధారముగాకలది. రెండవది సహజమే కాకుండా శ్రమచేసి తెచ్చుకున్న చిత్త సంస్కారమేకాక చిత్తపరిణామము. నిరంతర పఠనముచేత సంస్కృతిచేత క్రమవైశాల్యము పొందుతూ ఉంటున్నది. మొదటిదే దీనికి బీజం కూడా అని చెప్పవచ్చు. మొదటిదానివలె సహజమేకాక ఇది శ్రమసాధ్యము కూడాను. లాక్షణికుడంటున్నాడు,

"బుద్ధిర్యేషాం పరిణతా
కావ్యాభ్యాసాన్నిరంతరమ్

---

* "By means of the work of art, the experience is released afresh, in the spectator or the auditor. The enjoyer becomes the secret sharer of the creator's mind".

Sir S. Radhakrishna.

వాచ్యా స్సహృదయ శబ్దేన
రసాస్వాదన తత్పరాః"

మరియొక లాక్షణికు డిలాగ అంటూ ఉన్నాడు:

"నిరంతరకావ్యానుశీలనాభ్యాస వశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభవన యోగ్యతా సహృదయత్వం".

- అభినవగుప్తపాదుడు

ఇప్పుడు ఆలోచించండి ఇది ఎట్టి శక్తో? ఇది అవధి లేనిది. ఇంత అని చెప్పటానికి వీలులేనిది. ఇట్టి సహృదయత్వము కలవాడే కావ్యాస్వాదనము చేయటాని కర్హుడు. కవిలో అధికారి భేదము ఉన్నట్లే సహృదయత్వములో అధికారి భేదము ఉంటుంది. "నేను సహృదయుడిని. నేను ఆనందించలేకపోతే ఇది నిజమైన కావ్యము కాదు" అని ఎవ్వడూ అనుకోటానికి వీలులేదు.

ఒక్కొక కవి కర్మలోఉండే రసాన్ని ఆపాతతః ఆస్వాదించటానికి సులభ సాధ్యముకాదు. నారికేళపాక మున్నదనుకోండి. దానిలో కారిన్యాన్ని భేదించి ఆస్వాదించవలసి వస్తుంది. ఆ శక్తి లేనివాడు తనకు శక్తి లేదనుకోక అక్కడ రసము లేదనుకోటము పొరబాటు. సముద్రము చాలా గొప్పది. కాని ముంచేచెంబు ఎంతో అంతేనీరు లభిస్తుంది. అలాగే సహృదయత్వముకూడా! షేక్స్పియరు నాటకములో ఉండే రసము ప్రతి సామాన్య పారకుడూ ఆస్వాదించగలడా? లేక పోయినంతమాత్రాన షేక్స్పియరును కవి కాదనటము న్యాయమా? ప్రతివాడు రసాస్వాదన కార్యము చేసేటప్పుడు తన అధికారాన్ని స్మరించుకొనుటము అవసరము. కవులు అనేకవిధాలు. ఒక్కొకప్పుడు కవి పండితుడైతే అదికూడా కవికర్మలోకి సంక్రమిస్తుంది. అంత మాత్రముచేత ఆయనను కవి కాదనీ, కావ్యాన్ని అనవసరముగా క్లిష్టము చేసినాడనీ మనము దూషించవద్దు. ఈ విధముగా వ్రాయమని కవిని శాసించే అధికారము మనకు లేదు. కాని అట్టిదానిని కూడా పరీక్షించి ఆస్వాదించి ఆనంద జుగుప్సలు వెల్లడించే శక్తి, అధికారంగల సహృదయునికి ఉంటుంది.

"శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ
జీవితం వ్యంగ్య వైభవమ్
హారాదివ దలంకారా
స్తత్ర స్యు రుపమాదయః"

కొందరు కవులకు శబ్దమునందు, మరి కొందరికి అర్థమునందూ, ఇంక కొందరికి ఉభయమందుకూడా అభినివేశము ఉంటుంది. ఈరెండు కాకుండా భావముమీదనే దృష్టిగల కవి ఉండవచ్చును. ఆయన ఉత్తముడు.

## భావము - వస్తువు - రచన:◆

కావ్య పఠనము ఆనందజనకము. ఈ ఆనందాన్ని పొందే సామగ్రి మూడువిధాలు. కావ్యానికి శబ్దార్థాలు మూర్తివంటివి. కావ్యచమత్కారమూ, రసోత్పత్తిమూర్తివంటి శబ్దార్థాలమీదనేగాక భావముపైన కూడా ఆధారపడి ఉంటవి. సందర్భాన్నిబట్టి వీటికి ప్రాముఖ్యము వస్తుంది. కవి ఆ సందర్భాన్ని ఆలోచించి ఏది ఉపయోగించవలసివస్తే దాన్ని ఉపయోగిస్తాడు. ఒక్కొకచో శబ్దము కావలసి వస్తుంది. ఆచోట వలసిన ధ్వనిని (సామాన్యార్థము) సమయానుకూలముగా తెచ్చుటకుగాను శబ్దజాలాన్నే ఉపయోగించవలసి వస్తుంది. మరి యొకప్పుడు శబ్దానికిగాక వస్తువునకు ప్రాముఖ్యము ఇయ్యవలసి వస్తుంది. అట్లాకాక పాత్రల చిత్తవృత్తులను చిత్రింపవలసి వచ్చినప్పుడు, కవి స్వానుభవము చెప్పవలసి వచ్చినపుడు, భావానికి ప్రాముఖ్య మియ్యవలసి వస్తుంది. ఈ మూటికీకూడా మనను ఆనందింప జేయగల శక్తి ఉన్నది.✻ పైన యిచ్చినవి దిఙ్మాత్రపు సూచనలు. శబ్దము అర్థాన్ని ఉత్పత్తిచేసి తద్వారా రమణీయతను సంపాదించి రసాన్ని చేకూర్చి సహృదయుడి హృదయాన్ని ఆనందింప చేస్తుంది. శబ్దము-అర్థము-రమణీయత-రసము-ఆనందము- ఇది పరంపర. కాబట్టే లాక్షణికుడు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అనినాడు. శబ్దార్థాలకు రమణీయ తను పుట్టించే శక్తి ఉన్నది. అట్టి గుణాన్ని కొందరు "రసన" అనినారు. "రసన" అనగా రసించుగుణము. ఈ రసన ఎచ్చట ఉన్నది? కావ్యము నందా? ఆస్వాదించే సహృదయుని యందా? ఉభయులయందు ఉన్న దని సిద్ధాంతము. భావ వస్తు రచనలద్వారా కావ్యమందూ, సహృదయత్వముద్వారా

◆ చూ: సారస్వతోపన్యాసములు - రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

✻ It is often asked whether the Power of Poetry is due to the music of words, or the images they suggest or the ideas they express. Each view counts powerful support.

- An Idealistic view of life P 190.

పాఠక సామాజికులయందూ ఆశ్రయించి ఉన్నది. రసాన్ని ఆస్వాదించువాడు సహృదయుడు ఆస్వాదింపజేసేది కావ్యము. ఇద్దరి మధ్యను జరుగు కార్య మాస్వాదనము. ఈత్రిపుటివలన కలిగే పరిణామము రసము. అనగా కావ్యమున రసాన్ని ఉత్పత్తిచేసే గుణము భావ వస్తు రచనలయం దున్నది. ఇవియే శబ్దార్థాలు. రచన అనగా శబ్దము. అర్థ మనగా భావవస్తువులు. అర్థములో ఒకప్పుడు వస్తువు ప్రముఖముగా ఉండవచ్చు, మరి ఒకప్పుడు భావానికి ప్రాముఖ్య ముండవచ్చు.◆

శబ్దార్థాలలో ఉండే యీ గుణాన్ని పురస్కరించుకొని ఉదాహరణాలిస్తాను. పెద్దనగారి క్రింది పద్య మందరెరిగినదే:-

"లట జని కాంచె భూమిసురు డంబర చుంబి శిర స్సరి ఝ్ఝరీ
పటల ముహు ర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనాను రూప పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
కటక చరత్కరేణుకర కంపిత సాలము శీత శైలమున్"

ఈ పద్యములో చాలామంది ఆధునికులకు ఎట్టి రసము కనుపించక పోగా కొందరు సంస్కృత శబ్దాలనువేసి పెద్దన సంచర్భాన్ని పాడుచేసినాడనీ, శబ్దాడంబరముతప్ప ఏమీ లేదనీ, కావ్యము దీనివలన పాడైనదనికూడా అన్నారు. కాని చాలా రసవంతమైనదని నా ఆశయము. "అభంగ తరంగ మృదంగ నిస్వన" అనేచోట మృదంగ నిస్వన స్వారస్యాన్ని స్ఫురింపచేసే బిందుపూర్వక "గ" కారపౌనః పున్యములోనూ, 'స్ఫుటనటన' అనేచోట నాట్య సాదృశ్యద్యోతకము చేసే "ట" కారద్విరావృత్తిలోనూ, శబ్దగతరసన ఉన్నది. "పరిఫుల్ల కలాపకలాపిజాలము" యొక్క నాట్యానికి గంగాతరంగ నిస్వనము మృదంగ నిస్వనముగా పరిణమించినది. నాట్యసాదృశ్యము, మృదంగ నిస్వనసా దృశ్యము, ఉపయోగించిన శబ్దాలచేత సాధ్యాలవుతున్నవి. హిమవత్పర్వతము దానిపై నుంచి గంగ తరంగపరంపరతో దుమకటము ఆశబ్దానికి పించాలెత్తి నాట్యమాడే నెమళ్ళు, ప్రక్కనున్న సాలవృక్షాలు, వాటిని తొండాలతో ఊపే ఏనుగలు కండ్లకు గట్టినట్లు కనపడుతున్నవి. ఏనుగులను సాలాలనూ వదిలితే మిగిలిన పద్యమంతా శబ్దరసనకు ఉత్తమోదాహరణ మౌతుందనటములో ఎట్టి అభ్యంతరము లేదు.

---

◆ చూ 'మాటలలో భావార్థములు' -పిల్లలమర్రి ఇచ్చిన రేడియో ఉపన్యాసము.

ఇంకొకసంగతి: శబ్దము ఆపాతతః శ్రవణసుఖాన్ని ఇస్తుంది. అర్థము తెలియకపోయినప్పటికి సరళాక్షర సమ్మేళనము శ్రవణసుఖాన్ని ఇచ్చి తద్వారా ఆనందము కలుగజేస్తుంది.*

"ఏలా లతా జాల డోలా కలిత కీర బాలా స్ఫుటాలాప లాలితంబు
మందార మాకంద బృందా మిత మరంద సందోహ నంది తేందిందిరంబు
ఝిల్లీ కుచో ల్లీఢ సచ్ఛిచ్ఛ మల్లీ లసల్లీ మతల్లీ ప్రవేల్లితంబు
పారావత నటన్మయూరా తలకిశోర వారాముతోద్ఘిరణాంబు"

పైపద్యములో ఉండే శబ్దాలంకారము చక్కని నడకతో శ్రవణసుఖాన్నిస్తూ, పద్యానికి ఒక విధమైన సంగీతత్వం కల్పించి, ఆపాతతః ఆనందింపచేస్తున్నది. శబ్దాలంకారాలకుండే ఒక విధమైన శక్తి ఇది.

వృత్తులు, రీతులు అని ఒక విభాగము చేసినారు లాక్షణికులు. ఇవి కూడా రసచర్చలో చాలా ముఖ్యమైనవి. ఇవికూడా శబ్దరసనలో సహకారులు. "సముచితార్థ పదన్యాస సౌష్ఠవములు" వృత్తులు. "సందర్భమాత్ర సంగతములు" రీతులు. వృత్తులయందు అర్థమప్రసక్తము. రీతులు రచనామాత్ర సంబద్ధాలు. అర్థానుగుణమైన రచన వృత్తిసందర్భానికి అనుగుణమైన పదజాలాన్ని ఉపయోగించుటము రీతి. కాబట్టి రెండిటికిని రచనతో సంబంధమున్నది. కాని వృత్తికి అర్థంతో కూడా సంబంధము కలదు. పరుషసరళాలనే వర్ణవిభాగము చాలా అర్థవంతమైనది. పరుష భావకథనములో పరుషాక్షరోపయోగము యుక్తము; సరళభావ కథనములో సరళాక్షర సమ్మేళనము యుక్తము. ఈ విధముగా ఇవి కూడా రసనకు ఉపకారకాలు అవుతున్నవి.

తరువాత అర్థము దగ్గిరకు వస్తాను. శబ్దానికి మూడు శక్తులున్నవి. అభిధా లక్షణా వ్యంజనలని వాని పేర్లు. ఈ శక్తుల వల్ల కలిగే అర్థము కూడా త్రివిధము. శబ్ద ముచ్చరించిన వెంటనే స్ఫురించే అర్థము అభిధార్థము. "గోడ" అన్నామనుకొండి. మట్టితోకట్టినా, ఇటుక సున్నముతో కట్టినా, రెండు భూభాగాలను ఒకదానికొకటి

* There is no doubt that rhythmical words exert an enchanting influence on the mind. We restored to music even when we fail to seize the sense.
– Sir S. Radhakrishna.

భిన్నము చేయటానికి కట్టబడ్డ కట్టడము "గోడ" అని అర్థము స్ఫురిస్తుంది. కాని "నీవు చెప్పిన అబద్ధము, గోడ కట్టినట్లున్నది." అన్నామనుకొండి. ఇక్కడ గోడకు వెనక చెప్పిన అర్థము సాక్షాత్తుగా వర్తింపదు. కాబట్టి "వలె"ను ఆధారము చేసుకుని "అబద్ధా"నికి "గోడ" యొక్క గుణాలను అన్వయింప చేసుకొని "తెలియకుండా" అని అర్థము చేసుకోవలెను. ఇలా ముఖ్యార్థము సందర్భానికి సరిపోనప్పుడు దాని మీద ఆధారపడే మరియొక అర్థము లక్ష్యార్థము. ఇతర దార్శనికులు పై రెండర్థాలనే ఒప్పుకున్నారు. లాక్షణికులు ఇంకొక "వ్యంగ్యా" ర్థాన్ని ఒప్పుకోటమే కాకుండా దానికి ఎక్కడ లేని గౌరవాన్ని ఇచ్చినారు. ఈ వ్యంగ్యార్థాన్నే ధ్వన్యర్థమన్నారు. అట్టిఅర్థము ప్రధానముగా ఉండే కావ్యము ఉత్తమమని అనినారు. ఈ ధ్వని అనగా ఏమిటో ముందు మనవి చేస్తాను. లక్ష్యవ్యంగ్యార్థాలు రసనలో చాలా ఉపకారకాలు. ఈధ్వని కూడా పదగతముగానూ, వాక్యగతముగానూ ఉండవచ్చు. పదగతరసన వెన క చెప్పి శబ్దరసన కంటె భిన్నము. వెనకటిదానిలో ధ్వనిలేదు. శబ్దము శబ్దముగానే రసించే శక్తి అది. ఇది ధ్వని మూలముగా రసించేది. అర్థరసన అనగా వస్తుభావ రసనకు ఒక ఉదాహరణమిస్తాను:

"ఆరవిందంబులకంటె కోమలములై యందంబులై యొప్పు నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవగా
నెరియం బోలు నటంచు పొక్కెదము నీయా కర్కశారణ్యభూ
పరిసం చారము కృష్ణ! నీ ప్రియలకున్ ప్రాణవ్యథం జేయదే"

(భాగవతము)

ఈ పద్యములో ఉన్న "చన్నుంగవల్" అనే పదముచేత ఇది శృంగారరసప్రధానమని భ్రమపడకూడదు. గోపికలు భక్తులు, కృష్ణుడు పరమేశ్వరుడు. మానవ శరీరములో పరమాత్మ స్థానాలు మూడు. మొదటిది బ్రహ్మరంధ్రము. రెండవది కనీనిక (నల్లగ్రుడ్డు). మూడవది హృదయము. భక్తలగు గోపికలు పరమేశ్వరుడి పాదద్వయము చేతులలో తీసుకొని ఈ మూడు స్థలములకు గ్రహించినపుడు స్తనపాద సంబంధము కలుగుతుంది. ఆభక్తసేవ ఈ పద్యములో ఉల్లేఖింపబడినది. అట్టిసమయములో ఆ సేవ భక్తి ప్రవణమేగాని శృంగార ప్రవణమెంత మాత్రము కాదు. ఈ సందర్భములో శంకర భగవత్పాదుల ఈ క్రింది శ్లోకమును గమనించవలెను:

"కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రి యుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్,
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుట జలజ గంధాన్ పరిమళాన్
అలభ్యాన్ బహ్మాద్యై ర్ముద మనుభవిష్యామి హృదయే*

పై శ్లోకములో చెప్పబడిన పరమేశ్వర పాదాలయొక్క వక్షోవహనము భాగవత పద్యములో ఉల్లేఖింపబడినది. అశ్లీలము గల పద్యమనువదించినానని పాఠకులనుకొనకుందురుగాక.

పద్మము "కోమలత్వానికీ" "సౌందర్యానికీ ఉపలక్షకము. అట్టి పద్మముకంటె కూడా కోమలాలు సుందరాలు శ్రీకృష్ణుని పాదాలు. స్త్రీ శరీరములో కల్లా కోమలమూ సుందరమూ వక్షః ప్రదేశము. అట్టి ప్రదేశ స్పర్శచేత శ్రీకృష్ణుని పాదాలు కంది నొప్పి పుట్టునని భక్తులు చింతింతురట! ఎంత మధురభావనము. అట్టిపాదాలు కఠినమైన అరణ్యప్రదేశములో సంచరించటమువల్ల వారికి కలిగే దుఃఖము చెప్ప శక్యముకానిది కదా! ఆ దుఃఖాన్ని "ప్రాణవ్యధగా" చిత్రించినాడు కవి. ప్రాణబాధ దుస్సహము. అట్టిబాధతో సమానమైనబాధ భక్తులకు కలుగుతున్నది. ఇప్పుడు ఒక్కమారు వారి బాధ మనసుకు తెచ్చుకుంటే కవి చెప్పినదానిలో రసము సంపూర్ణంగా స్ఫురించగలదు. వక్షః స్పర్శకు దుఃఖించే భక్తులు "కర్కశారణ్యభూస్పర్శ" భరించగలరా! ఆయన బాధకంటే భక్తుల బాధ చెప్ప శక్యముకాకుండా ఉన్నది. మూర్తికికలిగిన ఎంతచిన్న బాధఅయినను భరింపలేరు భక్తులు. సపత్ని సంగమముచేత కలిగిన నఖక్షతాలను భరింపలేదు రాధ. ఇది భక్తికి పరమావధి. ఈవిధముగా శబ్దార్థాలు రసోత్పత్తికి కారణభూతాలవుతవి. కావ్యప్రయోజనాలలో ముఖ్యమైనదానిని గూర్చి ముందు మరిఒకచోట ముచ్చటిస్తాను.

సామాన్యముగా కవి స్వానుభవానికి ఆకారాన్ని ఇచ్చేటప్పుడు తానాభావాన్ని అనుభవిస్తేనేగాని తదనురూప భావాన్ని సహృదయుని హృదయములో ఉత్పత్తి చేయలేడు. కాని శబ్దార్థ సంబంధము వల్ల కవికి వ్రాతకాలములో స్ఫురింపని భావాలు కూడా సహృదయ విమర్శకునకు స్ఫురింపవచ్చును. ఈ విషయము

* శివానందలహరి

పరీక్షకు ఆగునది కాదు. అందును కవి మృతుడైతే సహృదయుడే ప్రమాణము. కాళిదాసు ఎన్నడో మరణించినాడు. ఆయన కావ్యాలకు వాఖ్యానాలు వ్రాసి మల్లినాథుడు సహృదయుడై వానిని విమర్శించినాడు. పాశ్చాత్య సాహిత్య సంపర్కమువల్ల యిప్పటికీ కాళిదాస గ్రంథాలపైన విమర్శనానికి తుదిమాట రాలేదు. ఇప్పటికీ విమర్శకులు క్రొత్త ఊహలను కల్పిస్తూనే ఉన్నారు. మన లాక్షిణికులును మనస్తత్వాన్ని బొత్తుగా మరసలేదు. కాని దానికి ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇయ్యలేదు. శృంగార రసానికి ఎక్కువగా స్థలమిచ్చినమాట నిజమే! శృంగారము సర్వరసబీజ భూతమని కూడా లాక్షణికు లన్నారు: అది నిజమే! ప్రపంచ మూలభూతమైన రసము ప్రధానరసము కావటములో తప్పేమి? దాన్ని నాయికానాయకులలో పరస్పర ప్రవణముగా వర్ణించినారు. మనస్తత్వమనేది వ్యక్తియొక్క సంస్కృతికొద్దీ మారుతూ ఉంటుంది. జానపదుడి మనస్తత్వానికీ, పౌరుని మనస్తత్వానికీ భేద ముంటుంది. కాబట్టి వాఙ్మయములో మనస్తత్వానికీ, సాహిత్యములో మనస్తత్వానికీ భేదముంటుంది. కామాతురులైన స్త్రీ పురుషుల చిత్తవృత్తులు అన్నికాలాలలో, అన్ని స్థలాలలో ఒక్కవిధముగా ఉంటవని చెప్పుటకు ఎంతమాత్రము వీలులేదు. కవి హృదయాన్ని ప్రవేశించటము సహృదయుడైన విమర్శకునకు చాలా అవసరము. అటువంటివానికి సానుభూతి లేకపోతే విమర్శనము సహృదయ ప్రేరితముగాక దుర్హృదయ ప్రేరితమవుతుంది. ఇతర విషయాలు విమర్శనముదగ్గిర ముచ్చటించు కుందాము.

కవి మానవుడు కాబట్టి భౌతికుడు, ప్రాపంచికుడు. అతడు చూచే అనేక సన్నివేశాలు వినే అనేక ధ్వనులు భౌతికాలై ఉంటవి. కాని అతనికి అంతర్దర్శన ముంటుంది. ఇది ఆధ్యాత్మికము. ఋషుల మంత్ర దర్శనానికీ, తాపసుల ఆత్మదర్శనానికీ, కవియొక్క అంతర్దర్శనానికీ యెక్కువగా భేదములేదు.* నిజమైన కవియొక్క అంతరనుభవము తత్వదర్శనమునంటిదే. దానియొక్క ఆకారము ఆయన దర్శించిదానిని వాక్యములలో ఇమిడ్చి చెప్పడానికి యత్నిస్తాడు. ఆదర్శనము

* ఇట్టిదే దివ్యచక్షుస్సు ఇది ఉన్న కవి ఉత్తమ కక్ష్యకు చెందినవాడు. "రవిగాననిచో కవి గాంచునే కదా" అనే వచనము ఇట్టి అంతశ్చక్షువునకు సంబంధించినదే!

స్ఫుటమై దాని అంగాంగీభావము నిర్దిష్టముగా ఉంటేనే గాని దానిని ఇతరుల మనస్సులకు గోచరింపచేయలేడు. ఇది ఉత్తమ కవి లక్షణము. ఒక్కొకప్పుడు తన దర్శనముతో తాదాత్మ్యముపొంది అనుభవించి, లీనుడై, కొంతకాలానికి వెలికివచ్చి తన అనుభవాన్ని ప్రపంచానికి ఇస్తాడు. ఇది ఒక మార్గము. దీనిలోనుండి వెలికిరావటము కనపడుతుంది. ఒక్కొకప్పుడు బయటి సన్నివేశాన్ని చూచి చిత్తము స్పందించి దానిపైన భావన ఉద్భవించి అప్పటి తన అనుభవాలను చెప్పవచ్చు.◆ ఇది రెండోమార్గము. మొదటిది అంతర్మార్గము. రెండోది బహిర్మార్గము. ఉత్తమ కవి ఈ రెండుమార్గాలలో చక్కని నిష్ణాతమైన ప్రజ్ఞ కలవాడుగా ఉంటాడు. ఈ రెండుమార్గాలు కూడా 'ఐడియలిజము' క్రిందికే వస్తవి. రియలిజము అనేది ఇంతకంటె క్రిందిమెట్టు. మనచుట్టు ఉండే ప్రపంచాన్ని ఉన్నదాని నున్నట్టు దర్శించి చెప్పటము 'రియలిజము' క్రిందికి వస్తుంది. ఈ శక్తి చాలామంది కవులకు ఉంటుంది. కాని మొదటి రెండు శక్తులు చాలా తక్కువ మందికి ఉంటవి.

## రియలిజము, ఐడియలిజము :

"బ్రహ్మాండమునం దొక అంశామాత్రమో, ఒక దిక్కో, కేవలము ఉపరిభాగమో యనదగు నీ వాస్తవలోక మే స్థూలదృష్టికి పూర్ణ సత్యముగ గన్పట్టును. కవు లెప్పుడును దాని నతిక్రమించుటకే చూచుచుందురు. దాని కావలనున్న వెలుగు వారి నాహ్వానించు చుండును. వాస్తవలోకాతిక్రమణము భావశబలతకు ముఖ్య లక్షణము. దీనినే పాశ్చాత్యులు "Idealism" అందురు. రసభావస్ఫూర్తిచే బుద్ధియం దంకురించు వ్యక్తిగత సంస్కార విశేషమునే పాశ్చాత్యులు "ఐడియలిజ" మందురు అంతియే కాని వారి కది ప్రత్యక్షానుభవ విషయము కాదు. వారి భావనాశక్తి వాస్తవలోకమును విడిచి ఎక్కువ దూరము పోజాలదు చాలవరకు దాని పొలిమేరలందే విహరించుచుండును. ప్రవృత్తి ప్రధానమగువారి సభ్యతగూడ వ్యావహారిక ప్రపంచమును విడనాడు సాహసమును వారికొసగజాలదు. వారి సభ్యతయందు, సంస్కారమునందు, కొరవడిన యీ "ఐడియలిజం" వారి కవితయందు కొంత గోచరించు ననుటకు సందియము లేకున్నను, అది (Subjective) వ్యక్తి గతమైన చిత్త సంస్కార విశేషమే కాని అంతర్లోకానుభూతి లేదు.

భారత కావ్యజగత్తు దీనికంటె భిన్నమైనది. భారతధర్మము నివృత్తి పూర్వకము గావున, ఆధ్యాత్మిక జ్ఞానసంపద, భారత జాతీయ జీవనమును లోపలను బయటను గూడ

◆ "Poetry" - Idealistic view of life.

తరతరములనుండియు, నావరించి ప్రకృతిగతమై పాదుకొనిపోయినది. భారతకవిత అట్టి జాతీయ సంస్కృతియందు పుట్టి పెరిగినదగుటచే భారతకవుల "ఐడియలిజం" ప్రత్యక్షవిజయము. పాశ్చాత్యుల"ఐడియలిజం"వలెనది ఊహాకల్పితమైనది కాదు భారత కవి రస భావావేశపరుడగుటతోడనే, వాస్తవ జగత్తు నతిక్రమించి ఆనందరససింధువున నిమగ్నుడగును. అప్పుడూర్ధ్వలోకములన్నియు వివృతద్వారములై కవికి అమృతాభిషేచనము చేయును. ఇయ్యది అప్రయత్నోపపన్నము. ఉపాసనాబలముచే సిద్ధించిన ఆత్మప్రతిభ. ఆర్యఋషుల కృపాకటాక్షముచే చేకూరిన నిస్తులభాగ్యము.

భరతవర్షములో గూడ ఆర్యధర్మచ్యుతులైన కుకవులు లేకపోలేదు. జుగుప్సాకరములైన నీచ కావ్యము లెన్నియో యిచటకూడా వెలసినవి. ముద్రణా సౌకర్యములే లేని మొదట నవి యేనాడో మక్షికములకు భక్ష్యము లయ్యెడివి. అంతియే కాని భారతప్రకృతి వానిని జీర్ణము చేసికొనజాలదు...... ....... ఆ నీచ క్యావములయందు గూడ భారతీయుల కాణాచియగు రసానుభము అచ్చటచ్చట కన్పట్టుచుండుటచేతనే వానికి కావ్యశబ్ద వాచ్యత కలిగినది. రసవిచారము ఈ దేశములోవలె నెచ్చటను పరిణతిపొందలేదు. ఇటీవల నీశాస్త్రము బిరుసెక్కి మసిబడిపోయినను రసజగత్తుయొక్క విస్తీర్ణతను గంభీరతను దెలిసికొనవలెనన్న భారతీయుల రసశాస్త్రము కంటె నుపకరించకలిగినది మరియొకటి లేదు ✻

(సమీక్ష - ముట్నూరి కృష్ణరావు)

దీన్ని బట్టి చూస్తే మూడు మెట్లు కనిపిస్తున్నవి! వాటి నీ క్రింది విధముగా చూపుతాను.

1. వాస్తవానుభవము = రియలిజం
◆ 2. భావసంచారము = వ్యక్తి గత సంస్కారము
(పాశ్చాత్యుల - ఐడియలిజం)
3. రసానుభవము = అపరోక్షానుభూతి
- (మన భారతీయకవుల రసజగత్తు.

---

✻ ఈ రసాన్ని యీ విమర్శకు డీక్రింది విధముగా మరొక చోట నిర్వచించినాడు. "రసము ఇంద్రియ రాజ్యమునందు జన్మించి, అతీంద్రియ రాజ్యమున లీలను చూపుచున్నది" కాబట్టే యీ రసమనునది విలక్షణము. సామాన్యమైన యింద్రియానందము వంటిది కాదు. కవిసృష్టిని విలక్షణమన్నాడు లాక్షణికుడు బ్రహ్మసృష్టికంటె విలక్షణమైనదీ కవిసృష్టి. ఈ విషయము వెనక కొంచెముగా మనవి చేశాను.

◆ ఈ 2,3 రకాలనే కలిపి వెనక నేను "కవిహృదయ ప్రవేశము చేస్తే" నని ఉల్లేఖించినది. చూ॰ 'సాహిత్యంలో ఆదర్శకత' పిల్లల మర్రి వ్రాసిన వ్యాసము.
-మాతృసేవ జన్మదిన సంచిక 10-1-1948.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 8

# నవ్యాంధ్ర సాహిత్యము

## నవ్యసాహిత్య మంటే యెట్టిది?:

నవ్యసాహిత్యాన్ని గురించి విశ్వనాథ సత్యనారాయణగారి మాటల్ని గమనించండి.

"సాహిత్యమంటే ఒక జాతిసంస్కారం. మనజాతి పూర్వం నిక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాది నుండి కాలనిర్ణయంలో, భిన్నరాజ చరిత్ర నిర్ణయంలో, సంఘ ధర్మ నీతులలో, ఆర్థిక రాజకీయాలలో సారస్వతపథాలలో వక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాలమీద మనజాతి నడిచింది. ఇవ్వాళ ఆంగిలేయులు మన్ని అక్రమించడంచేత ఆ మహాసంస్కారం మీద అభిమానం పోయింది. పాశ్చాత్యదేశీయుల సంస్కారముమీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్రనిర్మాణం, సృష్ట్యాది కాలనిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, నీటిని యేయే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం."

ఆదినారాయణ శాస్త్రిగారి మాటలు చూడండి: "ఆంగ్లపాలన ఫలితంగా, మనకు ఆంగ్లవిద్యాపరిశ్రమమూ, ఆంగ్లుల ఆచార వ్యవహారాల వాడుకలూ, వారి రాజకీయ సాంఘికపరిజ్ఞానమూ, తప్పో ఒప్పో కొంత స్వదేశ విదేశాలకు సంబంధించిన చరిత్రజ్ఞానమూ, స్వదేశ స్వభాషాభిమానము, తన్మూలాన మన పరాశ్రయస్థితీ, జనసంఘంలో ఉన్న లోపాలూ, వాటిని సవరించుకోడానికిన్నీ విదేశాలతో సాటిగా వుందామనేదానికిన్నీ తగిన యత్నమూ, ఇత్యాదులు మనలో అంకురించినవి ఇంతవరకూ అన్నీ సుగుణాలే అని చెప్పవచ్చు. కాని సుఖదుఃఖాలూ శీతోష్ణాలు

మొదలైన ద్వంద్వాలలాగునే, యీ సుగుణాలతోపాటు కొన్ని దుర్గుణాలు కూడా మనకు అంటుకున్నవి. ఐచ్ఛికంగానో నిర్బంధంగానో అబ్బిన విదేశీయ ఆచారవ్యవహార భాషాసంప్రదాయాలు మంచివనే ఒక వ్యామోహం, స్వజాతి దూషణం, పరజాతి కీర్తనం ఆత్మవిశ్వాసశూన్యతా, నిత్యశంకితానస్థా, వీటినన్నిటినీ మించిన దారిద్ర్యం, ఆ దారిద్ర్యంలో మునిగి పరస్పరావిశ్వాసాలతో నిండిన అప్రయోజకములైన కుల ద్వేషాలు, స్వార్థపరత, అందుకై తన్నుగాని, తన దేశాన్నిగాని, జాతినికానీ బలిపెట్టే అసభ్యమైన త్యాగం, యిత్యాదులు ఆగుణాలతో అంటుకున్న శాశ్వతదోషాలు. వీటినన్నిటిని ప్రతిబింబింప చేసేది నవ్యసాహిత్యం''. శాస్త్రిగారి వివరణము దాదాపు సమగ్రము.

ఈ నిర్వచనాలలో సూచించిన మార్పులు ఉన్నవి అనుకోండి. వానిపైన అభిమానాన్ని అనుసరించి వ్రాసేవానికీ విమర్శిస్తూ వ్రాసే వానికీకూడా ఈ నిర్వచనము వర్తిస్తున్నది. కాబట్టి తదభిమానముతో వ్రాసే వీరేశలింగము పంతులు మొదలైనవారి వ్రాతలూ, మన సాంప్రదాయాన్ని విమర్శించి దానిలో ఉన్న నిగ్గును చూపే వ్రాతలూ కూడా నవ్యసాహిత్యములో చేరునని నామనవి. వ్యావహారిక భాషావాదములో, ఆనిరసనమూ, దానికి సమాధానము కూడా భాగాలు కదా! సంప్రదాయ విమర్శకుల వ్రాతలవలెనే, పూర్వప్రత్యయ రక్షకాలైన వ్రాతలూ కూడా నవ్యసాహిత్యములో చేరునని నా మనవి. వ్యావహారిక భాషావాదములో, ఆనిరసనమూ, దానికి సమాధానము కూడా భాగాలు కదా! సంప్రదాయ విమర్శకుల వ్రాతలవలెనే, పూర్వప్రత్యయ రక్షకాలైన వ్రాతలూ కూడా తదంతర్భాగాలే! మల్లాది సూర్య నారాయణశాస్త్రిగారి వ్యాకరణము నవ్యాంధ్రసారస్వత భాగమైనప్పుడు ఆకాలములో వ్రాయబడిన ఉదాత్తరచన లేలకావు? వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారి 'వైయాకరణ పారిజాతము' కూడా నవ్య సారస్వతాంతర్భూతమేనని నా ఆశయము.

## యువకులు - భావపరివర్తనము :

ఆంధ్రుల చరిత్ర చూస్తే మొదటినించీ ఆంధ్రులు స్వతంత్రులూ, శృంగారకళాప్రియులుగా కనిపిస్తారు. ఈ స్వతంత్ర చిత్తవృత్తి అన్ని శాఖల్లో

కనిపిస్తుంది. స్వాతంత్ర్యము కోసము తల్లిదండ్రులను కూడా విడవటానికి వెనక్కుతీయరు. అట్లాగే తమ సోదరులైన ఆర్యులలోనించీ విడిపోయి వచ్చినారు. తర్వాత ఆర్యుల మతము వదలి దక్షిణ హిందూ దేశమతాలను స్వీకరించినారు. బౌద్ధము అత్యంత వ్యాప్తి పొందినది వీరిలో. మొదటినుంచీ పాడిపంటలు కలవారౌటచేత నదీతీరాలనే నివాసముగా చూచుకున్నారు. అజంతా, ఎల్లోరా, అమరావత్యాదుల్లో తమ కళాభిజ్ఞతను చూపినారు. ఆ స్వాతంత్ర్యమూ, కళాదృష్టి ఇప్పుడు మళ్ళీ తలయెత్తినవి. నవ్యత అంటే ఉప్పొంగిపోయే గుణమాంధ్రులకు సహజము. ఈ నవ్యత ఇప్పుడూ ప్రతి విషయములోనూ వ్యక్తమవుతున్నది. ఎక్కడైనా ఒక నవ్యత కనపడ్డదీ అంటే చటుక్కున పట్టుకుంటారు ఆంధ్రులు.

ఈ క్రింది వాక్యాలను పరిశీలించండి :

"ఆంగ్లభాష ద్వారా మనవారి (కులపతులూ, తల్లిదండ్రులూ) అనుమతితో మనం అనుభవానికి తెచ్చుకున్న స్వదేశీయ విదేశీయ చరిత్రజ్ఞానమూ, మన విద్యాలయాల్లో మన అధ్యాపకులు బోధించి మన మనస్సున కెక్కించిన విదేశీయ సారస్వతాలూ, అందలి కళాసంపదా, కవిత్వశోభా, సాంఘికవ్యవస్థలూ, ఉన్నతసాధనాలూ, ఆత్మజాత్యభిమానమూ, మాతృభాషాప్రీతి, ఇత్యాదులన్నీ కలిసి మన వేషంలో భాషలో, మాటలో మంతిలో, ఆచారంలో వ్యవహారంలో, ఒకటేమిటి, అన్ని విషయాల్లోనూ, ఇంతవీ అంతవీ అనికూడా చెప్పడానికి సాధ్యంకాని మార్పులు తెచ్చిపెట్టినవి. ఈ మార్పులు మాత్రమేగాక, ఇంకా ఖండఖండాంతరాల్లోనివి, క్షణానికి వేలకొద్దీ మైళ్ళవేగముతో అభివృద్ధిపొందిన విజ్ఞానాన్ని గురించిన వార్తలు, మనకెప్పటికప్పుడు తెచ్చి గుమ్మములో వినిపించే దినపత్రికలూ, వారపత్రికలూ మాసపత్రికలూ మొదలైనవన్నీ వెలిసినవి. ఇంకా యెన్నో వెలుస్తున్నాయి. ఏపాటి దృష్టి కలవారికైనా అవి కనిపిస్తవి.

ఇంతటి విశ్వవిజ్ఞానాన్ని గురించి నిరంతరము వింటూ, కండ్లతో కంటూ ఉన్న నేటి యువకజీవితం; తత్రాపి స్వజాతీ, స్వభాషా, స్వీయ విజ్ఞానం, ఏ పరిమితిలో, యేపాటి సుస్థితిలో ఉందో, స్వానుభూతాంగ్ల విజ్ఞానంతో పోల్చి చూచుకొన్న యువక

జీవితం; అఖిల ప్రపంచంలోనూ తమ స్థానం యేదో తేల్చుకోవాలనే ఉత్సాహ వ్యగ్రత గల యువకజీవితం; ఔదాసీన్యం వహించి ఉండగలదా? ఉండజాలదుకదా? పెద్దలు అనుమతించినా, అనుమతింపకున్నా, తమ ప్రయత్నం నెగ్గినా, నెగ్గకున్నా, మనుష్యులై పుట్టినందుకు, అందులో ప్రపంచజ్ఞానాన్ని రుచి చూచినప్పుడు తమ భాషలోకూడా అట్టి విభవాన్ని ఏల నెలకొల్పకూడదు? ఇది యీ యిరవైయో శతాబ్దిలో పడ్డ ప్రధానబీజం." ఈవిధముగా నాటబడిన బీజాలు అప్పటి ఆంధ్రయువకులలో కూడా పాటమరించినవి.

1912 సంవత్సరము నాటికి పూర్వమే మెట్రిక్యులేషన్ పోయి స్కూలుఫైనల్ పరీక్ష వచ్చినది. ఎఫ్.ఏ. పోయి ఇంటర్మీడియేట్ వచ్చినది. ఇదే ప్రకారము యువకుల చిత్తవృత్తులలో కూడా మార్పు వచ్చినది. ప్రతి విషయములోనూ సౌలభ్యము కొరకు యత్నించటము కనపడుతున్నది.

మద్రాసులో విక్టోరియా హాస్టలులో ఉండే విద్యార్థులలో ఒక బృందము ఉండేది. వారు అప్పుడప్పుడూ కలిసి నూతన సారస్వత మార్గాలనుగూర్చి చర్చించుకుంటూ ఉండేవారు. ముఖ్యముగా వీరికి రెండు విషయాలలో మార్పు కావలెనని తోచినది. (1) సలక్షణమైన విమర్శనము తెలుగులో రావడము. (2) భావ ప్రధానముగా ఖండకావ్య నిర్మాణము; విమర్శనము పెరిగితేనేగాని వాఙ్మయవికాసము పెంపొందదనుకునేవారు. ఎప్పుడూ గతానుగతికముగా పద్యాలూ, కావ్యాలూ వ్రాయటమువల్ల సారస్వతమంటే అభిరుచి తగ్గినదనీ అందుచేత చిన్న కావ్యము, దానిలో భావప్రాధాన్యము, కవి స్వానుభవ ప్రదర్శనము, ఈ రెండు మిళితముచేస్తే బాగుండుననీ వీరు వాదోపవాదాలు చేసుకుంటూ ఉండేవారు. ఈవిధమైన చర్చలకు విక్టోరియా హాస్టలులో వింజమూరి రంగాచార్యులుగారి గది కేంద్రముగా ఉండేది. అక్కడ ప్రయాగ రాఘవయ్య, రంగాచార్యులు, నేను, స్వయంపాకుల సీతారామమూర్తి చర్చించుకూంటూ ఉండేవారము. బసవరాజు అప్పారావు, పాటిబండ అప్పారావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు మేమంతా కలుస్తూ ఉండేవారము.# వీరంతా యధాశక్తిగా సారస్వతసేవ చేసిన వారే! చేస్తూఉన్నవారే!

# వేలూరు చంద్రశేఖరంగారు కూడా మాతో సంపర్కము ఉన్నవాడే!

వింజమూరి రంగాచార్యులుగారు ఆనాటి చెన్నపట్నములో చదువుకునేవారికి కొంతవరకు గురుపీఠము. 'ఆంధ్రభారతి'లో అచ్చు అవుతూ అప్పుడే వచ్చిన గురజాడ అప్పారావుగారి పాటలూ ముత్యాల సరాలూ చూస్తే ముగ్ధులైపోయి వానివలె ఆయన కొన్ని పాటలు రచించినాడు.* ఈయన చాలా వ్రాసినాడు గాని ప్రకటించలేదు మేము కలిసి విమర్శన విషయమై చేసిన కృషిని గూర్చి తర్వాత వ్రాస్తాను.

అప్పటికే రాయప్రోలు సుబ్బారావుగారు "లలిత" వ్రాసినాడు. దీనిలో చాలా మందికి నూతనమార్గము పొడకట్టినది. కవిగారి భావాభివృద్ధి యొక్క, భావాదర్శాల యొక్క బీజాలిందులో ఉన్నవి! ఈ గ్రంథాన్ని యువకులంతా పఠించినారు. మామండలిలో స్వయంపాకుల సీతారామమూర్తి కొంచెము కవితాశక్తి కూడా కలవాడు. సుబ్బారావుగారంటే చాలా అభిమానమూ, ఆదరమూను. తాను కూడా ఆయనవలె వ్రాయవలెనని యెన్ని మారులో యత్నించినాడు. ఆంజనేయులే కదా లంకదాటగలడు!

ఇట్లాగు యువకులలో నూత్న చైతన్యము ఆదినములలో అంకురించినది. తరువాత కాలములో రాబోయే నవ్యసాహిత్యానికి బీజమిలా ఆనాటి యువకుల రచనలలో నాటుకున్నట్లు తెలుసుకున్నాము.

---

* కాని నాకప్పటికి నూతన మార్గముమీద ప్రత్యయము కలగలేదు

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

## 1

## నవ్యసాహిత్యానికి మూలస్తంభాలు

ప్రతి ఉద్యమమూ కొన్ని మూల స్తంభాల మీద ఆధారపడి ఉంటుంది. అట్టి విషయాలు దేశకాల పాత్రాలమీద ఆధారపడి ఉంటవి. యువకులలో భావపరివర్తన మెలా జరిగినదో చూచినాము. దానికి ఆంగ్లభాషా సారస్వత సంపర్కము మూలకారణమని కూడా గమనించినాము. పరిస్థితులను అనుసరించి అట్టి ఉద్యమాలకు నాయకత్వము వహించటానికి బయలుదేరుతారు. ఉద్యమము యొక్క నడక వారి తర్కశక్తిపైనా, పట్టుదలపైనా ఆధారపడి ఉంటుంది. తత్కాలములో వారి మాటలూ, చేష్టలూ విప్లవమువలె కనపడతవి. కాని వానిలో ఉన్న నైతిక బలాన్ని అనుసరించి అవి నెగ్గుతవి. ఒక్కొక్కప్పుడు నైతికబలము లేని విషయము కూడా నెగ్గినట్టు అగుపించినా క్రమముగా తిరిగి సంస్కృతిని సంప్రదాయాన్నీ అనుసరించి ఉద్యమము సరి అయిన త్రోవలో పడుతుంది.

ఈ ఉద్యమానికి మూల స్తంభాలు నాలుగు.

(1) గిడుగు రామమూర్తిగారి భాషాసంస్కార వాదము.

(2) రాయప్రోలు గు[illegible]జాడల ఉపజ్ఞకమైన ఖండ కావ్యగీతికా రచన.

(3) కట్టమంచి రామలిం[illegible]గారెడ్డిగారి "కవిత్వ తత్త్వవిచార" రచన.

(4) సాహితీసమితి పత్రికా ప్రచారము

ఈ నాల్గు కాలాన్నిబట్టి ఒకటి తర్వాత ఒకటి వచ్చినవికావు. మొదటి రెండూ దాదాపు ఒకే కాలములో పుట్టి పెరుగుతున్నవి. వీటికి కొంచెము తర్వాత రచింపబడినది "కవిత్వతత్త్వ విచారము". తరువాత వ్యాపనానికి కొన్ని సంవత్సరాలు పట్టినది. తుదకు సాహితీసమితి స్థాపించబడినది. తరువాత కొలది దినాలకు పత్రిక

వెలువడినది. ఈ నాల్గు విషయాలు కలిసి నవ్యసాహిత్యానికి స్థైర్యాన్ని యిచ్చినవి. వీనిని ఆనుపూర్విగా వివరిస్తాను.

## గిడుగువారి భాషాసంస్కారము :

"All new literary movements originate in dissatisfaction of the past and aim at turning over new leaf, which in the case of poetry means an attempt to return to the method and manner of ordinary speech " -Martin Gilkes

మనదృష్టి కొంచెము వెనుకకు మరలించవలె. కాల్ డ్వెల్ వల్ల అప్పటివారిలో కొందరికి ద్రావిడ భాషలు సంస్కృతభవాలుకావని గట్టి అయినది. "కాల్డ్వెలుగ్రామరు చదివి ద్రావిడ భాషల సంప్రదాయము తెలుగుకు వానితోగల సంబంధము, ఒకవైపున భాషాశాస్త్రమనే పేరుతో బయలుదేరినది. "శాస్త్రానికి అచ్చముగా శ్రీ గిడుగురామమూర్తి పంతులుగారు ఆచార్యుడైనాడు,'' అనినారు విశ్వనాధనారు.

భాషా విషయములో పరిశోధనలు దేశమంతటా ప్రారంభించినారు. తమిళ భాష, పదజాలాన్నిబట్టి వ్యాకరణాన్నిబట్టి యీ ద్రవిడ భాషలో వయోవృద్ధగా కనపడినది. కొందరు తమిళ సోదరులు పరిశోధించి తమిళమే సమస్త ద్రవిడ భాషలకు తల్లి అని వ్రాయటము సాగించినారు. వారి తమిళ భాషలో 'సంగం' వాఙ్మయమున్నదనీ, దానిని పరీక్షచేస్తే చాలా ప్రాచీనమనీ, చెప్పటము మొదలు పెట్టినారు.* 1904-5లో బెజవాడలో మాణిక్యనాయకారని ఒక యింజనీరుండేవాడు, ఆయన పరిశోధనచేసి సమస్త ప్రపంచలిపులు తమిళలిపిలో నుంచే వచ్చినవియని ఉపన్యాసాలిచ్చినాడు.◆

ఈ ద్రావిడ భాషాచారిత్రక పరిశోధన చేసిన వారిలో ఒకడు పి.టి. శ్రీనివాసయ్యంగారు. ఈయన 1905-6 ప్రాంతములో విశాఖపట్నము కాలేజీ ప్రిన్సిపాలుగా ఉండేవాడు. ఆయనతో సమావేశము కలిగినది గిడుగు రామమూర్తి

---

* ఈ విషయాన్ని గూర్చి డాక్టరు నారాయణరావుగారు ఆంధ్రపత్రిక ప్రమాది ఉగాది సంచికలో వ్యాసము వ్రాసినారు

◆ అట్టి ఉపన్యాసము నా చిన్నతనములో నేను ఒకటి విన్నాను.

పంతులుగారికి. వీరికి తోడైనాడు$ గురజాడ అప్పారావుగారు. ఈ త్రిమూర్తులు ఏకీభవించినారు. తెనుగు భాషను సంస్కారము చెయ్యవలెనని పూనినారు. గిడుగువారు అప్పటికే (1892) తన సవర భాషా పరిశోధనము సాగించి ఆ భాషకు వాగనుశాసనుడైనాడు.# సవర-తెలుగు, తెలుగు-సవర నిఘంటువులు, సంపాదించి సంప్రతించి సవర కథలు, పాటలు అనేకములు రచించినాడు. 1913లో వీరి సవర గ్రంధాలు ప్రభుత్వమువారు ప్రకటించినారు... వీరినెట్లాగైనా సత్కరించవలెనని తలచి ప్రభుత్వమువారు వీరికి 1913లో 'రావుసాహెబ'న్న బిరుదు అనుగ్రహించినారు.

ఈయనలో భాషాపరిశోధన బీజాలు సహజముగా ఉన్నవి.@ సంస్కృత భాషా సంప్రదాయాలు తెనుగుకు తెచ్చిపెట్టి, వెనుకటి వైయాకరణులు భాషకపకారము చేసినారని ఈయన గట్టిగా నమ్మినాడు. భాషావేత్త కాబట్టి, స్థిరమైపోయిన సంస్కృత భాషా మర్యాదలు గచ్ఛద్భాష అయిన తెనుగుకు పనికిరావనే వాదము లేవదీసినాడు. వెనుకటి గద్య గ్రంథాలన్నీ అవలోడనము చేసినాడు. చిన్నయ్యసూరి నీతిచంద్రికను ఎత్తుకున్నాడు. తర్వాత చిన్నయ్యసూరి ననుసరించి పండితులు వ్రాసిన గద్యనుకూడా పరామర్శించినాడు. వ్యాకరణానికిన్నీ, భాషకున్నూ, అంతరమెత్తి చూపినాడు. తుదకు చిన్నయ్యసూరి వ్యాకరణ ప్రకారము చిన్నయ్యసూరే వ్రాయలేదని రుజువుచేసినాడు. ఈయన దృష్టి గద్యము మీదికి ఎక్కువగా పోయినది.

---

$ "బాల్యావస్థలో శ్రీ విక్రమదేవవర్మగారున్నూ మా తండ్రిగారున్ను కలసి మెలసి ఆడుకుంటూ ఉండేవారు. విజయనగరము బడిలో చదువుతూ ఉన్నపుడే మా తండ్రిగారికి కొందరితో మైత్రి కుదిరినది. అందులో వీరికిని గురజాడ అప్పారావు గారికిని కుదిరిన మైత్రి అత్యధికంగా ఉండేది." -సీతాపతి.

# "రామమూర్తి పంతులుగారు సవర భాషకు నిఘంటువొకటి నిర్మించినారు వాఙ్మయము మాట అటుంచి లిపియేదియులేక బహుముఖములుగానున్న యీమాటలిక భాషలోని శబ్దముల స్వరూపమును అర్థమును నిర్ణయించుట కడు దుష్కరమైన కార్యము. ...గుణదోషములెట్లున్నను యీయుద్యమమే మిక్కిలి ప్రశంస్యము.

-జయంతి రామయ్య పంతులు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం.28 సం.5.

@ గురజాడవారూ, గిడుగువారూ, వారిశిష్యులూ ఒక పది సంవత్సరములపాటు జరిపిన ఘోరసంగ్రామము వర్ణించడానికి ఇది సమయముకాదు. వారు అంతకుముందూ, ఆ పది సంవత్సరములూ పడ్డ శ్రమ, ఖర్చుపడ్డ సొమ్ము, పొందిన పరాభవములూ పరమేశ్వరునికే ఎరుక. అయితేనేమి జయము పొందగలిగారు. -భారతి, 1934 సెప్టెంబరు.

ఈ కాలములో జరుగుతున్న కొన్ని క్రొత్తమార్పులు చెప్పటము అవసరము. సామాన్యవిద్య ప్రజలలో వ్యాపించాలని నాయకులు చెప్పటము మొదలుపెట్టినారు. గోక్లేగారు తమ నిర్బంధ ప్రారంభ విద్యాశాసనాన్ని ఉపపాదించి దేశమంతట ప్రచారము చేసినాడు. మొత్తముమీద సామాన్య ప్రజలలో విద్యావ్యాపనావశ్యకత ప్రతివారి ఆశయమైనది. సామాన్య ప్రజలకు గ్రాంధిక భాషలో వ్రాసే గ్రంధాలకంటె, వారు ప్రతిదినమూ వినే వ్యావహారికములో వ్రాస్తే సులభగ్రాహ్యమౌతని. పండితులైన వారు తమ భాషా ప్రపంచములోనే తాము ఉంటారు గాని వారికి జనసామాన్య విద్య అంటే అంత శ్రద్ధలేదు. పైపెచ్చు పండితులకూ సామాన్య ప్రజలకూ మధ్య అంతరము పెరగటము మొదలుపెట్టినది. విజ్ఞానము అందరికీ అవసరమే! ప్రజాసామాన్యములో ఇప్పుడున్న స్వల్పవిజ్ఞానము వారికి సులభగ్రాహ్యమై, ప్రతిదిన ప్రచారములో ఉన్న పాటలయొక్కా పద్యాలయొక్కా ఫలమని పంతులుగారు కనిపెట్టినారు. అదే వీరి అభిప్రాయాలకు ప్రేరకము. చిన్నప్పటినుంచి అడవిజాతి అయిన సవరులకు చేసిన వీరిసేవ, వీరికి అభిప్రాయాన్ని గట్టిపరిచినది. సవరభాష వదిలి తెనుగుపైన దృష్టిచొప్పించినాడు. కాల్డ్వెల్‌గారి ఆంధ్రభాషాతత్వరహస్యము ఈయన అభిప్రాయానికి తోడ్పడినది. తెనుగు సారస్వతములో జటిల సంస్కృతపద భూయిష్ఠమైన భారతము ఈయన విమర్శనకు గురిఅయినది. కాని బొత్తుగా సంస్కృతాన్ని త్రోసిరాజనటము ఈయన ఉద్దేశ్యము కాదని తలుస్తాను. సామాన్య వ్యవహారములో ఉన్న సంస్కృత పదాలు వాడటానికి ఈయనకెట్టి అభ్యంతరము లేదు. ఈయన వ్రాసినాడు. వ్యాకరణము ఈయనకు భాషను కట్టే శృంఖలగా కనపడినది. వ్యవహారములో ఉన్న తెనుగు భాషా రూపాలన్నీ ఈయనకు గ్రాహ్యాలే!

ఈ కాలములోనే కర్జన్ ప్రభువు బెంగాలు రాష్ట్రాన్ని ద్విధా విభజించేటప్పటికి బెంగాలు ప్రజలకు కోపమువచ్చి ఆందోళనము మొదలుపెట్టినారు. ఆ ఆందోళన మూడు రూపాలు పొందినది.

1. స్వరాజ్యవాంఛ.
2. స్వదేశవస్తుప్రీతి - విదేశవస్తు బహిష్కారము.
3. జాతీయ విద్యావశ్యకత.

వీనిలో మూడవదానికి స్వరాజ్యకాంక్ష దోహదమైనది. దానితో స్వభాషలమీద అభిమానము జనించినది. బంగాళానించి ఈ ఆందోళనము యావద్భారతదేశానికీ వ్యాపించినది. ఆంధ్రదేశము కూడా కలవరము చెందినది. ప్రచారము చెయ్యవలసివచ్చినది. ప్రజాసామాన్యానికి వ్యావహారికములో ఉపన్యాసాలియ్యవలె. ఈ విషయము కూడా తత్కాలములో వీరి ఉద్యమానికి సహాయపడినది.

ఈ ఉద్యమానికి పరిణామముగా ఆంధ్రోద్యమము కూడా పుట్టేబీజాలు పడినవి. ఆంధ్రులు అరవదేశ సంపర్కముచేత సంస్కృతిలోనూ, ఆర్థికముగానూ, నష్టపడుతున్నారని నాయకులంతా గమనించి ఆంధ్ర రాష్ట్రాందోళన ప్రారంభించినారు. దీనికి కూడా ప్రచారము కావలె. అందుకు జనసామాన్యము దగ్గిరికి వెళ్ళవలె. కాబట్టి వ్యావహారిక భాషావశ్యకత కలిగినది. *ఇవన్నీ కారణాలే అయినప్పటికీ పంతులవారిని ప్రేరేపించినది నిజమైన ప్రజాసేవేచ్ఛ అని చెప్పవలె. "ప్రజలలో వ్యాపించవలసిన విద్య, ఈకాలానికి పనికిరాని ప్రాచీన కావ్యాలు, వ్యాకరణాలు చదివించడమువల్ల రాదు" అని వ్రాసినాడాయన ఒకమారు. "ప్రజలలో విద్య వ్యాపిస్తేనేకాని సంఘము వృద్ధిలోకి రాదు" అనినాడు మరి ఒకమారు.

జీవద్భాషకుచుట్టూ కట్ట కట్టడము ఎవ్వరికీ సాధ్యముకాదు. అట్టి భాషకు శాశ్వతమైన వ్యాకరణము వ్రాయటము కట్ట కట్టడము వంటిదే! అంతేగాక మాటలాడే భాషే నేర్చుకోవలసిన భాషైతే, ఆ భాషలో వ్యాకరణాన్ని యెంత రుక్కుపెట్టినా, వ్రాయవలసివచ్చినప్పుడు వ్యావహారిక భాషే సులభముగా వస్తుంది ఈసంగతి నిజమని పంతులవారు పండితుల అందరివ్రాతలలోనుంచి చూపినారు. ఈక్రింది వాక్యము పంతులవారిది.

---

* ఈ ఉద్యమము ఒక్క మన భాషలోనేగాక అనేక దేశభాషలలో కలిగినది. చూడండి.

"The present day literary Bengali is often nothing but Calcutta colloquial, with only a few archaic inflections of the verb, it is freely used in literature especially in poetry, drama and fiction, and there is a strong body of writers who advocate the suppression of old literary language by this living and vigorous form of Spoken Bengali."

(Bengali Phonetics) by Dr. S. K. Chatterjee

"మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నంపంతులుగారికీ, రావు బహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారికీ గ్రాంధికాంధ్రభాష రాదనీ, వారి గ్రంధాలలోవున్న తప్పులు చూపించారు కళాప్రపూర్ణులయిన వేదం వెంకట్రాయశాస్త్రి గారు వారు తప్పులు ఒప్పులుగాను, ఒప్పులు తప్పులుగాను చెప్పారని చూపించి, ప్రాచీన గ్రాంధికాంధ్రభాష వారికి బాగా పట్టుపడలేదని నేను రుజువు చేశాను". ఈవిధముగా పండితులే గ్రాంధికాంధ్రము వ్రాయలేరనీ, అట్టి స్థితిలో పామరులు వ్రాయలేకపోవటము విశేషముకాదనిన్నీ, కాబట్టి వ్యావహారికమే గ్రాహ్యమనిన్నీ, అలా దాన్ని అనుసరించటము సహజమైన జీవద్భాషాసంప్రదాయమనీ, పంతులవారి వాదము. ప్రజాసామాన్యపరనానికి వ్యావహారికములో గ్రంధాలు వ్రాయాలనీ, వారు కూడా ఆ భాషను వ్రాయటానికీ చదవటానికీ సమర్థులుకావాలనీ ఆయన చెప్పినాడు.

ఈవిధముగా అప్పారాయ సహాయముతో ఈ వాదము లేవదీసినాడు. ఆంధ్రదేశములో ఈయన కెట్టి ప్రోత్సాహము కలగలేదు. ఆయనే ఒకచోట, 'మొదట నేను నామిత్రుడగు గురజాడ అప్పారావూ, మాకు తోడుగా మరి యిద్దరు మాత్రమే యీ ఉద్యమము ప్రారంభించాము" అని వ్రాసినాడు. ఒకవైపునుండి పండితబృందము అంతా ఈ "రాక్షస కృత్యాన్ని" ఎదుర్కోడానికి నడుము బిగించినారు. వీరిలో జయంతి రామయ్యపంతులుగారు ముఖ్యుడు. ఆయన అధికారములో ఉన్ననాడు. అప్పటికే తెనుగులో పండితుడూ పరిశోధకుడూ అనిపించుకుంటున్నాడు. ఆయనకు అధికారము ఉన్నది కాబట్టిన్నీ, ఇది సహజముగా తమ కయిష్టమైన సంస్కారము కాబట్టిన్నీ, పండితులందరూ ఆయన పక్షమే అయినారు. రామమూర్తిగారు విశ్వవిద్యాలయాలలోకూడా వ్యావహారికభాషకే ప్రాముఖ్యము ఇయ్యవలెననీ, అట్టి గ్రంధాలే పాఠ్యగ్రంధాలుగా నిర్ణయించవలెనని పట్టుపట్టినాడు. వీరిలో కొంతమంది పాఠ్యగ్రంధనిర్ణయసభలో మెంబర్లుగా కూడా ఉన్నారు. శ్రీనివాసయ్యంగారూ, అప్పుడు విశాఖపట్నములో విద్యాశాఖాధికారిగాఉన్న యేట్సు అనే దొరగారూ వీరికి పట్టుకొమ్మలైనారు. మొత్తముమీద అందరూ ఆలోచించి వేదము వెంకటాచలయ్యగారు వ్రాసిన "విధి లేక వైద్యుడు" అనే వ్యావహారికములో వ్రాసిన షెరిడన్ నాటకపరివర్తనాన్ని పాఠ్యగ్రంధముగా నిర్ణయించినారు. దానిమీద

వాదోపవాదాలు జరిగినవి. శ్రీనివాసయ్యంగారు ఆంగ్లభాషలో "Life or death, a plea for vernaculars" అనే గ్రంధాన్ని రచించి ఈవాదానికి సాయపడినారు. మొదట ఒకరిద్దరైనా తర్వాత విశాఖపట్నము కాలేజీ ప్రాత విద్యార్థులలో ఆంధ్ర భాషాభిమానులూ ఇంకా కొందరూ వీరికి తోడుపడినారు.

1911 "ఆంధ్రసారస్వతసంఘ" మొకటికూడా స్థాపితమైనది. అప్పుడు పనిచేసినవారిలో సెట్టి లక్ష్మీనృసింహముగారూ, బుర్రా శేషగిరిరావుగారూ, (1885-1941) కిళాంబి రామానుజాచార్లగారివంటివారున్నారు. అప్పుడు ఇక ఊరుకోవడము పనికిరాదని రామయ్యపంతులుగారు, ఆంధ్రసాహిత్యపరిషత్తు అని ఒక సంస్థను స్థాపించి ప్రచారముచేస్తేనేగాని వీలులేదని అట్టిదాన్ని ప్రారంభించినాడు. ఈపరిషత్తు ఏటేటా ఒక పట్టణములో సాంవత్సరిక సభచేసి ఈ వాదములో నడుముకట్టుకొని పోట్లాడేది. మొదట "వ్యావహారిక" పదము అంత యెక్కువగా ప్రచారములో లేదు. "గ్రామ్య" పదముతో ఈవాదానికి నామకరణము చేసినారు రామయ్యపంతులుగారు. "గ్రామ్య"శబ్దము చెడ్డది కాబట్టి 'గ్రామ్యభాషా' ప్రచారము ఈ సంస్కర్తల యొక్క ఉద్దేశ్యమని ప్రజలతో చెప్పితే, అట్టి చెడ్డభాషను ఎలాగైనా సంహరించడములో వారెంతో తమకు తోడౌతారని వీరి ఆశయము. వాదము లేవదీసిన గిడుగు వగైరాలు "వ్యావహారికభాష" అంటే, జయంతిప్రభృతులు "గ్రామ్యభాష" అనినారు. ఇప్పటికీ యీవాదానికి అక్కడక్కడా అడ్డము తగులుతూ ఉండేవారంతా "గ్రామ్య"శబ్దమే వాడుతూఉంటారు. కాని వాదము చాలా బలము చేకూర్చుకొనినది. ఈ కాలములో వీరిని బహిరంగసభలో గెలవలేమని పండితులంతా తోకలుముడుచుకొనినారు. ఈ వాదము యొక్క పోకడకూడా చూస్తే మొదట ప్రాభించినప్పుడు ఉన్నంత విప్లవముగా సాగడములేదు. రామమూర్తి అప్పారావుగార్లు మొదట యీ ఉద్యమము ప్రారంభించినప్పుడు వారికి సారస్వతముతోనూ, రసముతోనూ, కావ్యత్వముతోనూ పని యెక్కువగాలేనట్టు తోస్తుంది. భాషే ముఖ్యముగా కనపడినది. గ్రంధాలు మంచివా అనే ఆలోచన అక్కరలేదు. వ్యావహారికములో వ్రాస్తే సరి. అప్పారావుగారు రసికుడు కాబట్టి, తర్వాతనైనా యీ సిద్ధాంతాన్ని కవిత్వానికి పట్టించడానికి ప్రయత్నించినాడు. కాని రామమూర్తిగారు కేవలము "వైయాకరణి" కాబట్టి ఆభాష

వ్రాస్తేసరి, భావముతో పనిలేదాయనకు; ఇదికూడా వెనకటి ఛాందసపండితుల ఫక్కీయే కొంతవరకు. వారూ భాషకే ప్రాముఖ్యము ఇచ్చినారు. రామమూర్తిగారూ అంతే. దొంగను దొంగే పట్టవలె కాబట్టి వారి వాదాన్ని వారి ఉపకరణాలతోనే ఢీకొనినాడు. ఇది సమంజసమే

ఈ వాదాన్ని బాగా పరీక్షిస్తే దీనిలో మూడు అంతస్తులు కనపడతవని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగా రీ సంగతిలో నాకు సాక్ష్యము.

"వారి వాదము మొదటినుంచి కొన్ని సంవత్సరములు దేశములో భాష వాడుకలో నున్నట్లే వ్రాయవలె నన్నంత తీవ్రముగా నడిచినది.'' ఇది మొదటిమెట్టు.

"తరువాత భాషాసంప్రదాయ విమర్శనలగ్నమై, ప్రాచీనార్వాచీన కవి ప్రయోగములకు సరివచ్చు శిష్టవ్యవహారములోని శబ్దములు రచనయందు గ్రాహ్యములనుచు, ప్రమాణ ప్రదర్శనపూర్వకముగా విజృంభించినది."

ఇది రెండోమెట్టు. కాల్డ్వెల్ సిద్ధాంత మిక్కడ పనిచేసినది. వాడుకు నియమాల ననుసరించినది. వాదానికి దారి యేర్పడినది కవి ప్రయోగాలతో, ప్రస్తుత శిష్టవ్యవహారానికీ, కాలానుసారముగా మార్పునూ, పరస్పరసంబంధమును కలిగించి వాదానికి స్థాయిత్వమిచ్చి నారీ మెట్టులో.

"పిదప భాషాసంస్కారము, భాషాసంప్రదాయమును, అను రెంటిని సహేతుకముగా, సోదాహరణముగా విశదీకరించుచు, శిష్టుల వాడుకలోని భాష కెప్పటికప్పుడు ఆనాటి గ్రంథములలోని భాష దగ్గరగా నుండవలెనన్న మతమును స్థాపింపబూనినది.''*

ఇది చారిత్రక పద్ధతి. ఈవిధముగా పెరిగిన వాదానికి ఎప్పటికీ దుర్బలము అనేది ఉండదు. సంప్రదాయానికి కూడా చోటు వచ్చినది. ఈ రెండూ అనగా

* ...all poetry, so long as it remains alive and vital must be in touch with the life of its own day.

"ఆంధ్రశబ్ద చింతామణి రచయితయు, తదుపరి అప్పకవి, మూపినుంచి తిమ్మకవి, అడిదము సూరకవి, వీరందరు తమతమ కాలాల్లో వ్యావహారిక పదములను ప్రయోగించినటుల ప్రబలసాక్ష్యమున్నదనీ" (గి. వేం. సీతాపతిగారు 30-7-40 ఆంధ్రపత్రిక)

చరిత్ర, సంప్రదాయము తెలియనివారు అభినివేశముతో పోట్లాడవలసినదే కాని, భాషాసంప్రదాయ చరిత్రవేత్తలు నిరుత్తరులై పోవలసినదే! మొండిగా వాదించేవారికి సమాధానమే చెప్పలేము. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారివంటి లాక్షణికుడు ఈ వాదము సహేతుకమైనదీ అంటే, యింకేమి కావలె? చూడండి. సూర్యనారాయణ శాస్త్రిగా రేమన్నారో:

"పాతబడ్డ మాటలు రచన కర్హములుకావు. వాటి సంప్రదాయము నేటివారికి తెలియదు. ప్రాచీనకవి ప్రయోగములెన్నో పూర్వ వ్యాకరణములకు విరుద్ధములుగా నున్నవి. దేశ్యశబ్దజాలము మారునట్లే దేశభాషా వ్యాకరణములును మారుచుండవలెను. తదనుగుణమైన రచన పండితపామర రంజకము' అనుచు సంయుక్తికముగా గ్రాంధిక వ్యావహారిక భాషలకు సామరస్యము కలిగింప నుద్యమించినది. ఇది వారి వాదములోని సారాంశము". సూర్యనారాయణశాస్త్రిగారు సహృదయులు కాబట్టి ప్రతికక్షివాదములో హేతువును కనిపెట్టి దాని సత్యము గ్రహించినారు.◆ ఇది నిజమైన భాషా వ్యవసాయము. మొత్తముమీద రామమూర్తిగారి వాదము భాషకు సంబంధించనదనే చెప్పవలె.#

---

◆ "అదివరకప్పుడే (1914 పూర్వము) పండితులని పెద్ద పేరుగల పేరి కాశీనాధశాస్త్రిగారున్ను, మహామహోపాధ్యాయి తాతా సుబ్బరాయుడు శాస్త్రిగారున్నూ, మా వాదము అంగీకరించారు. ... శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారు తెలుగు వ్యాకరణాల ధర్మాన్ని గురించి ప్రసంగించి నేటి వ్యావహారికభాషాలక్షణం కూడా నేర్చుకోవాలన్నారు." - డాక్టర్ గిడుగు సీతాపతి.

"...ఇట్టి మార్పులన్నిటికి ప్రవాహ రూపమున నుండు వ్యవహారమే కారణము ఈ మహాప్రవాహమును నివారింప శక్యముగాదు నివారింప యత్నించుట సమంజసమునుగాదు ఇట్లు మారుచున్న శబ్దములను వాని యర్థములను గ్రహించుచు దీనినిట్టి వ్యవహార బల మన నెట్టిదో వాని పరిగ్రాహ్యతను లోకమునకు బోధించుచు ప్రసంగించుట మాత్రమే భాషాతత్త్వ జిజ్ఞాసువులకు గర్తవ్యము."

-దువ్వూరి వెంకటరమణశాస్త్రి (ఆంధ్ర సంవత్సరాది సంచిక 1925)

పండితులని పేరు పొందిన వారంతా ఇల్లాగు వ్యావహారిక భాషా వాదమును అంగీకరించినారంటే ఇంకా కావలసిన దేమున్నది?

# ఈ సందర్భములో విశ్వనాథవారి నవ్య సాహిత్య పరిషదధ్యక్షోపన్యాసపొట్లాటను చదవమని హెచ్చరిస్తున్నాను

ప్రతిపక్షులంతా ఆలోచించి సాహిత్యానికి ఈవాదమువల్ల ముప్పువచ్చిన దనుకుని, పరిషత్తు స్థాపించినారు. వారి మతము ప్రకారము వారూ భాషా సేవకొరకే దానిని స్థాపించినారనే మనమనుకొనవలె. భాషాసాహిత్యాలను చెడగొట్టవలెనని యిద్దరి ఉద్దేశ్యముకాదు. అభిప్రాయ భేదము. ఇది సహజమే. ప్రతి నవ్యతా, ప్రాచీనులకు విప్లవముగా కనబడుతుంది. అడ్డుపెట్టడానికి ప్రయత్నము జరుగుతుంది. దానికి కూడా సేవయే వ్యాజము. కాబట్టి పరిషత్ స్థాపకులకు దురుద్దేశ్యమని యెంతమాత్రము చెప్పడానికి వీలులేదు. పరిషత్తు కేవలము గ్రామ్య ప్రతికూల ప్రచారము కొరకే పుట్టినట్టు గిడుగువారి అభిప్రాయము. క్రింది వారి వాక్యములు చూడండి.

"సుమారు 30 సంవత్సరములై వర్తమానాంధ్రభాషా ప్రయోజనము గురించి పాటుపడుతూ వున్నాను వ్యావహారికభాషా గౌరవాన్ని నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూవుంటే, దాన్ని పడగొట్టడానికి ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పనిచేస్తూవచ్చారు. . మొదట నేనూ నామిత్రుడగు గురజాడ అప్పారావూ మాకు తోడుగా మరి యిద్దరు ముగ్గురు మాత్రమే ఈ ఉద్యమమును ప్రారంభించినాము తక్కిన తెనుగు వారందరూ ఆంధ్రసాహిత్యపరిషత్తువారితో కలిసి మా ఉద్యమాన్ని యెదిరించినవారే."

కాని పరిషదుద్దేశ్యము కేవలము ఇదేనని చెప్పలేము. తత్కాలములో రామమూర్తిగారి వాదానికి బలముకలగలేదు కాబట్టి, ఒకవేళ ఆపక్షములో కొంచెరు అధికారులున్నా, పరిషత్తుకు ఉండే పలుకుబడి వీరికి లేదు కాబట్టి, పరిషత్తువారి ప్రచారమే ఎక్కువైనది. కాని రామమూర్తిపంతులుగారు ఎంతమాత్రము నిరుత్సాహము కనపరచలేదు. వారి ప్రచారముతోపాటు ఈయన ఉత్సాహము కూడా ఎక్కువైనది. కాని తత్కాలానికి పఠనీయగ్రంథనిర్ణయములో మార్పుకలగకుండా రామమూర్తిగారి ప్రయత్నాన్ని విఫలముచేసినారు పరిషత్తువారు వారి పలుకుబడితో. రామమూర్తిగారే సాక్ష్యము ఇందుకు.

"ఆ కాలంలో ఆంధ్రసాహిత్యపరిషత్తువారి ప్రతిష్ఠా, గౌరవమూ, ప్రాభవమూ, ఎక్కువగా వుండడంవల్లనూ, ఆ పరిషత్తువారి అభిప్రాయము ననుసరించి తెనుగుదేశమందలి పెద్దలందరూ తీర్మానముచేసి, గవర్నమెంటువారి కెక్కువగా ఒత్తిడి కలిగించి, వాస్తవమైన దేశభాష బడిపిల్లలు అభ్యసించకుండా చేశారు "*

* "గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె నొగిజయంతి రామయోక్తి గెల్చె!"
- వద్దాది సుబ్బారాయుడు.

కొంతవరకు ఈ పరిస్థితులు ఇప్పటికీ, అలాగే ఉన్నవి. కాని రెండు మార్పులు కలిగినవి. విశ్వవిద్యాలయములో వాడుకభాషకు దగ్గిరగా ఉండే భాషలో ఉన్న పుస్తకాలు పాఠ్యగ్రంథాలుగా పెట్టడము ఒకటి, నవ్యాంధ్ర సాహిత్యమంటూ ఒకటి ప్రబల స్థావర మేర్పరచుకుని విజృంభించినదనీ, దానికి కూడా విశ్వవిద్యాలయ శిక్షలో స్థానము ఉండవలెననీ, అభిప్రాయము రెండవది. విద్యార్థులు కూడా తమ వ్యాసాలలోనూ పరీక్షా పత్రాలలోనూ అలా దగ్గరగా ఉండే భాష వ్రాస్తే వారిని పూర్తిగా శిక్షించకూడదనే భావము కూడా కలిగినది.◆

విశ్వవిద్యాలయ విషయములో కలిగిన యీ రెండు మార్పులేగాక, ఉన్నత విద్యను గూర్చి చాలా గొప్ప పరివర్తనము జరిగినది. దేశ భాషలలోనే ఉన్నత విద్య గరపాలని నాయకులందరూ ఏకీభవిస్తున్నారు. అందుకని అన్ని పాఠ్య విషయాలలోనూ పాఠ్యగ్రంథాలు కావలెను. కేవల సాహిత్యములో గ్రంథాలను ఎలా వ్రాసుకున్నా, విషయగ్రహణము ముఖ్యోద్దేశముగా కలిగి, బడిపిల్లల కొరకుపయోగించే పుస్తకాలు మాత్రము, సులభ గ్రాహ్యమయ్యే భాషలోనే ఉండాలని నిశ్చయమైనది. ఇప్పుడు సమస్తశాస్త్రాలను గూర్చి పాఠశాలలో ఉపయోగించటానికి వ్రాసే గ్రంథాలలో దాదాపు వ్యావహారిక భాషకు దగ్గరగా ఉండేదే ఉపయోగిస్తున్నారు. ఇక సామాన్య గ్రంథ రచనను గూర్చి ఆలోచిస్తే రామమూర్తిగారి వాదానికి అంతులేని ప్రచారము కలిగినది. ఇప్పుడు సంపూర్ణముగా వ్యావహారిక భాషలో వ్రాసే పుస్తకాలనూ పత్రికలనూ, లెక్కపెట్టలేము! సారస్వతములో యీవాదము తెచ్చిన మార్పును తరువాత ముచ్చటించుకుందాము! రామమూర్తిగారి వాదము జయించినదనవచ్చు. ఆయన కూడా ఆజయము కళ్ళారాచూచి పరమపదించినాడు. సిద్ధప్రతిజ్ఞుడు. కర్మవీరుడు.✻

---

◆ "కవిత్వమనేది, గ్రాంధికవాదులు తమ బిగింపువదలి, వ్యావహారికభాషకు దగ్గరగా వుండేటట్లూ, వ్యావహార భాషావాదులు చెత్తనువదలి, గ్రాంధిక భాషౌన్నత్యాన్నీ చేర్చుకొని, రెండు భాషలకు ఒకవిధమైన సమ్మేళనం కూర్చి, తెలుక్కు దగ్గరగా వుండే సంస్కృత పదాలుపయోగించి కవిత్వం వ్రాయడం మంచిదనిన్నీ" - ప్రసాదరావు దొరవారు 30-7-40 ఆంధ్రపత్రిక.

✻ వజ్ఝలవారి శిష్యుడైన దూసివారి వాక్యాలు చూడండి:

"లక్షణకర్తల పదసాధుతాసాధతలకు సంబంధించిన వాదోపవాదములను గమనించినను, వ్యావహారి కాంధ్రమునకు, లాక్షణికులకును, యుద్ధమేకాలమును జరుగు చుండెడిదే యనుట

ఇంతపనిచేసిన గిడుగు రామమూర్తి పంతులుగారిని (1863-1940) గూర్చి కొంచెము వ్రాస్తాను. వీరు పర్లాకిమిడి రాజావారి కాలేజీలో ఉపాధ్యాయులుగా ఉండేవారు. కుటుంబీకుడు. వీరి కుటుంబము మిక్కిలి దేశభాషాభిమానాలు కలది. వెనక వ్రాసినదానిని బట్టి వారికెంత భాషాభిమానమున్నదో తెలుసుకున్నాము.

ఆంధ్రులు దాదాపు 35 సంవత్సరాలనుంచి మొత్తుకుంటున్నా వారు ప్రత్యేక రాష్ట్రము సంపాదించుకోలేకపోయినారు. పర్లాకిమిడి రాజాగారు రౌండుటేబిలు సభలకువెళ్ళి అక్కడ యేమని ఊదినాడోగాని, నూతన 1935 ఇండియా చట్టములో ఒరియావారికి ప్రత్యేక రాష్ట్రము లభించినది.* ఆరాష్ట్రము విభజించటములో గంజాంజిల్లాలో కొంతభాగాన్ని ఆరాష్ట్రములో కలిపినారు. కొందరాంధ్రులందుకు అసమ్మతి తెలిపినారు. అసమ్మతి తెలిపిన వారిలో గిడుగు కుటుంబమొకటి. జనసంఖ్యనుబట్టి. సంబంధాలనుబట్టి, చరిత్రనుబట్టి అలా కలపటము సమంజసము కాదని సపుత్రులైన వీరు ప్రచారము చేసినారు. రాజావారి కోపాగ్నికి ఆహుతిఅయినారు. ఆంధ్రులందరూ స్వరాజ్యాందోళనములో మునిగిపోయి తాత్కాలికాపత్తును గూర్చి శ్రద్ధవహించలేదు.

అదివరకే రామమూర్తి పంతులుగారు రిటైరైనారు. కాబట్టి ఆయనను యేమీ చెయ్యలేక, ఆయనకుమారునికి ఉద్యోగము తీసివేసినాడు యేదో సాకుపెట్టి రాజాగారు. అప్పుడు చూపినాడు రామమూర్తిగారు తన అస్ఖలితాంధ్ర దేశాభిమానాన్ని! కష్టపడి కట్టుకున్న స్వగృహాన్ని వదలి, రాజవిద్వరము భరించలేక, సకుటుంబముగా, కన్నీరుకారుస్తూ ఆంధ్రభూమధ్యము చేరినారు. ఒరిస్సాదేశములో కలిసి పోయినందున

---

స్పష్టపడును... బాలవ్యాకృతిసింగల కోరంతల నెత్తిచూపుచు, ప్రసిద్ధవ్యవహారములు పద్యగ్రంథము లందును ప్రయోక్తవ్యములేయను శ్రీరావుసాహెబు, జి.వి. రామమూర్తిపంతులుగారి మార్గమును, ప్రచురప్రసిద్ధములకే సాధుత్వము నంగీకరించు పండితలాక్షణికుడైన సూరిగారి పద్ధతియు, సహజములై, తమతమ విధులను దాము నిర్వహించుటలో, గృతకృత్యములే యనుట సత్యదూర ప్రసంగము కాదు." (బాల వ్యాకరణము)

చూ: ప్రజాశక్తి కార్యాలయము ప్రకటించిన గిడుగు వేంకటరామమూర్తి జీవిత చరిత్రము.

* గంజామునుంచి ఆంధ్రభాగము ఉత్కళంలోకి సంక్రమించే ప్రయత్నాన్ని అరికట్టే నిమిత్తము యమ్.వి రమణరావుగారు "భారతీ పత్రిక" బరంపురంలో పెట్టి చాలసేవ చేసినాడు.

స్వగృహము మీద కూడా నైరస్యము కలిగినది. ◆ ఎంత దేశభక్తుడో చూడండి! "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అనే వాక్యము ఈయనకు అన్వర్థమైనది. రాజమహేంద్రవరము చేరినాడు. కుమారునికి ఉద్యోగముపోయేటప్పటికి వృద్ధాప్యములో రామమూర్తిగారు కొంచెము పేదరికము కూడా అనుభవించ వలసివచ్చినది. ఇది కర్మవీర లక్షణము. ఆంధ్ర విశ్వవిద్యాలయ మీయన వాదాన్ని ఒప్పుకున్నట్లు సూచనగా ఆయనకు కళాప్రపూర్ణ బిరుదు నిచ్చినారు. ఆయన షష్టిపూర్తి చేసి ఆయన గ్రంథాలన్నీ ప్రచురించి, వివిధ వ్యాసాలతో నిండిన సంపుటాన్ని ఆయనకు సమర్పించినదాంధ్రదేశము. గొప్ప భాషాతత్త్వవేత్త! వాగనుశాసనుడు! చూడండి యీక్రింది వాక్యాలు :

"ముండారిక్, లేక ఆస్ట్రిక్, లేక కొలేరియన్ భాషాశాఖకు చెందిన సవర భాషలో వారు కావించిన వ్యాసంగము మహత్తరమైనది. సవరభాష సవరలలో వాడుకలో మాత్రమే వున్నది. వారు ఆటవికులు. పండితులుగారు స్వయంకృషిచే బహుశరీర కష్టములకులోనై, కంపారిటివు ఫైలాలజీ శాస్త్రమునకు అత్యవసరమైన ఆభాషను సాధించారు. పదజాలమంతయు ప్రకృతిప్రత్యయ విభాగముజేసి శోధించినారు. వ్యుత్పత్తి సహితములైన రెండు నిఘంటువులను, ఒకబోధినిని వ్రాసినారు. అనేక శబ్దములకు ప్రత్యయములకు సవర, వాని జాతీయభాషలగు, గుటోబ్, పరేంగ్, ఖాసీ భాషలతో పోల్చిచూచి పట్టికలనిచ్చినారు. ఈపనిని పంతులుగారు గాక మరెవ్వరూ చేయలేదు. ఇట్టి శబ్దశాస్త్రపారంగతులు మరెవ్వరును లేరు."

వాగను శాసనత్వానికి ఇంకేమి కావలె? ఒకజాతిని, వారి భాషకు లిపి వాఙ్మయాలను కల్పించి నాగరకము చేసినాడు. ఆంధ్రులలో ఇంతపని చేసినవారు ముమ్మాటికీలేరు. నన్నయ్య భట్టారకుడి తర్వాత ఆంధ్రభాషకు ఈయన చేసినంతపని ఎవ్వరూ చేయలేదు. వ్యాకరణభాషకూ వ్యావహారికభాషకూ అంతరము తగ్గించి, రెంటినీ దగ్గరకు తెచ్చి, భాషాసారస్వతాలకు మహోపకారము చేసి నవ్యాంధ్ర సాహిత్యవాగనుశాసనుడై✻ పట్టము గట్టుకొనినాడు!

---

◆ సాహిత్య సమ్రాట్ శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారి రాజ్యం కూడా ఆంధ్రోత్కళ దేశాల రెండింటిలోనూ ఉన్నది.

✻ "మనభాషలో యిద్దరే వాగనుశాసనులు నన్నయభట్టుగారు, గిడుగు రామమూర్తిభట్టు గారు" అని విశ్వనాథ.

ఆంధ్రసాహిత్య పరిషత్తులో చేరి తమ వాదానికి బలము చేకూర్చుకోవాలని చాలా పాటుపడినాడు. కాని ఈయననుగాని, ఈయన శిష్యులనుగాని చేరనిస్తే కొంప ఎక్కడ మునుగుతుందో అని పరిషత్తువారు ఇట్టి అభిప్రాయము గలవారు పరిషత్తులో చేరటానికి వీలులేని కట్టుదిట్టాలను చేసినారు.◆

రామమూర్తి గారి మాటలు చూడండి :

"దానితో పరిషత్తు పెద్దలు, ఉపద్రవం జరిగిపోయినట్లుగా భయపడి, అటుపైని జరిగే సాంవత్సరికోత్సవములలో, అటువంటి తీర్మానాలు మరి కాకుండా వుండేటట్లున్నూ, వ్యావహారికభాషా వాదులెవరూ తమ పరిషత్తులో సభ్యులుగా చేరకుండా వుండేటట్లున్నూ, కట్టుదిట్టాలు చేసుకున్నారు"

దాదాపు గత 35 సంవత్సరాలనుంచీ రామమూర్తిగారు భాషకు చేసిన కృషీ, సేవా యింతని చెప్పనలవికాదు. ఆయన ప్రచురించిన "గద్య చింతామణి", "బాలకవి శరణ్యము", "భాషాభేషజం" మొదలైనవాటిలో వ్రాసిన విషయముతో గ్రాంధికభాషావాదులు నిరుత్తరులైపోయినారు.✻ పంతులుగారు చేసిన చాలా యితర కృషి అముద్రితముగా నోట్సురూపముగా ఉన్నది. నలుగురు భాషాపండితులు కొన్ని సంవత్సరాలు శ్రమపడితేనేగాని ప్రచురించలేరు.‡

---

◆ చూ: ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం 13-సం 3-8

తణుకులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభలో నేనుకూడా పాల్గొన్నాను. ఆచంట వెంకట్రాయసాంఖ్యాయనశర్మగారధ్యక్షులు. అప్పుడు జయంతి రామయ్య పంతుల వారెందులకో రాలేదు. ఆసభలో వ్యావహారికభాషా తీర్మానాన్ని రామమూర్తి పంతులుగారు ప్రతిపాదించినారు. దాన్ని బలపర్చే భాగ్యము నాకు లభించినది పంతులవారు 'మడికట్టుకున్న పూర్వాచార పరాయణుడవని అనుకుంటున్నాను. అబ్బాయీ! బుద్ధిమంతుడవు' అని దీవించినారు ఆసభలో నన్నూ యింకా యితరులను కొందరినీ పరిషత్తులో గౌరవ సభ్యులుగా చేర్చుకునేటట్టు ఒక తీర్మానం ప్యాసుచేసినారు. కాని పరిషత్తులో తర్వాత మాప్రశంసే యెరుగము!

✻ గ్రాంధిక భాష వ్రాయటము చాలా కష్టమని తాము మాదిరికి "ప్రాఁదెనుఁగు కమ్మ" అని ఒక అధిక్షేపకావ్యము వ్రాసినాడు. దానిమీద మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు 'అంపగమి' అని విమర్శ వ్రాసినారు.

‡ ప్రచురించి పుణ్యాం కట్టుకుంటే బాగుండును. దీనిలో ఒక నిఘంటువు వ్రాయవలెననే ఉద్దేశముతో వ్రాసుకున్న నోట్సు కూడా ఉన్నట్లు తెలుస్తున్నది.

"తెనుగు" అనే వాదప్రచారము చేసినాడు.‡ పట్టుదల మనిషి. చిలకమర్తి వారికి నేత్రము లేనిలోటు బుద్ధిలో తీరినట్టు, రామమూర్తిగారికి చెవిలేనిలోటు బుద్ధివైభవము తీర్చినది. ఆయన విశాలమైన హృదయముకలవాడు. ఒక్క గ్రాంథికాంధ్రముతప్ప ఆయన నిరసించే విషయము ప్రపంచములో లేదు. నిగర్వచూడామణి, పసిపిల్లవానికి కూడా సులభుడు. తనకు అపకారము చేసినవారిని కూడా క్షమించే ఔదార్యముకలవాడు. యువకులకు మార్గదర్శి. వ్యావహారిక భాషాప్రియుడూ అంటేచాలు ఆయన ప్రేమకు పాత్రతకలిగినది అన్నమాటే! ఇటీవల ఆయన వాదాన్ని మించి అతిక్రమించే యువకుల విషయములో మనస్తాపము అనుభవించినట్టు కనపడుతుంది. విశృంఖలత్వము ఆయన స్వభావములో లేదు. ఉపాధ్యాయుడు కాబట్టి క్రమశిక్ష ఆయన పద్ధతి. నుల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారితో ఒక మారీక్రింది విధముగా అన్నారట!

'ఆధునికులు పెక్కండ్రు వ్రాసిన చిన్నచిన్న గ్రంథములు చదివి పంతులుగారు వకటి రెండు సందర్భములలో ఇంతతెగబడి వ్రాయనలెనని నా ఉద్దేశ్యము కాదు అయితే యిపుడెవరిని నిర్బంధించగలము? ఇది సంధి కాలము కొత్తయేటినీరు కలకగానుండును శరత్కాలము రాగానే తేటపడును అట్లే యిదిన్ని కొంతకాలమునకు చక్కబడును అని నాతోననియున్నారు.'

నవ్యులలో నవ్యులైన నవ్యాంధ్రభాషా కుమారులు పంతులు వారి విచారాన్ని స్వర్గములో ఇనుమడించకుండా చేయుదురుగాక!

ఈవిషయము చర్చించేటప్పుడు రెండు సంగతులు మాత్రము చెప్పవలసి వస్తుంది. తెనుగుభాషలో వ్యవహరిస్తూ ఉన్న అనేక సంస్కృత పదాలున్నవి. వ్యావహారికముగా తెనుగు పదాలే మారటము సహజముకాని సంస్కృతపదాలు మార్చటము న్యాయముగాదు. పద ము మార్చటమనేది ఒక్క నిరక్షరాస్యులకే జరిగేది కాదు. అక్షరాస్యులు కూడా అనేకమంది వ్యావహారికములో శబ్దాల సహజ స్వరూపము మార్చడముకద్దు. ఇదీకూడా దేశభేదము చేత కలుగుతూ, ఒక్కశబ్దములోనే వివిధ దేశాలలో వివిధ విధాలుగా మార్పుండవచ్చు. వాటిని ఆ ప్రాంతపు శిష్టులు

‡ మాసపత్రికను పెట్టి 1922లో పర్లాకిమిడినుండి, 1903లో ఏ. కామేశ్వరరావుచే స్థాపితమైన "కల్పలత" అనే మాసపత్రికను విశాఖపట్నంనుండి వీరు సంపాదించినారు.
- భారతి జూన్ 1930.

మాట్లాడుతూ ఉండవచ్చు. అవన్నీ తద్భవాలుగా వ్యావహారిక భాషలోకి గ్రాహ్యములే. నాకేమీ విప్రతిపత్తి లేదు. ఆరూపాలన్నీ బహుళోపయుక్తాలైతే వైకల్పికరూపాలై భాషను విశాలము చేస్తవి. కాని సంస్కృతములోనుంచీ తత్సమాలుగా వచ్చిన పదాలను గూర్చి మాత్రము వ్యవస్థ ఒకటి ఉండవలె!

సంస్కృతము ఒక విశిష్టభాష. దానిపైనగాని దాని వ్యాకరణము పైనగాని మనకేమీ అధికారములేదు. తద్భవాలనుగూర్చి మన యిష్టమువచ్చినట్లు చేసుకోవచ్చు గాని తత్సమాలకు విభక్తులు చేర్చడమే మనము చెయ్యతగినది. అసలు శబ్దములో, వర్ణక్రమములో మార్పు చేయడము మాత్రమే కూడనిపని. ఒకవేళ శిష్టులాపదాలు తప్పుగా గాని, భిన్నముగాగాని ఉచ్చరిస్తున్నా శిష్టవ్యవహారమని ఆతప్పు రూపాలను వ్రాయడము తప్పని నాఅభిప్రాయము. తద్భవము చేసుకుంటే సరిపోతుంది. రెండుదాహరణాలిస్తాను. "పరీక్ష" శబ్దమున్నది. అనేకులు శిష్టులుకూడా యీపదాన్ని హ్రస్వమధ్యముగా "పరిక్ష" అని ఉచ్చరిస్తున్నారు. కాబట్టి ఉచ్చారణ రూఢమైనదని, వ్రాయడములో కూడా "పరిక్ష" అని వ్రాయుదమా? అట్లా వ్రాయకూడదు. వ్రాసినట్లైతే తద్భవమనండి. ఇది మన అధికారానికి మించినపని. ఆప్రకారము గానే 'ఆలస్యం' అలసశబ్దభవం. దీన్ని ఒక 'నవ్యనవ్య' నవ్యాంధ్రకని "ఆలిశ్యం" అని వ్రాసినాడు. ఇత్వమధ్యముగా వ్రాయడమే కాకుండా 'స' కు 'శ' వర్ణము కూడా వాడినాడు. ఇట్టిది కూడదు.

రామమూర్తి పంతులుగారు వ్యావహారికము వాడటాన్ని గూర్చే వ్యవస్థ చేసినారుగాని రెండు భిన్నసంప్రదాయాలుగల భాషలలో మాటలను కలిపి కలగాపులగము తయారు చెయ్యటము గూర్చి యేమీచెప్పలేదు. ఈ విషయములో సమానసాంప్రదాయాలుకల భాషలైనా పరిణామము ఒకటే! ఇందులో రెండనుపపత్తు లున్నవి. గుఱ్ఱాన్ని గాడిదను కలిపికట్టిన బండివలె ఉండడము మొదటిది. తర్వాత ఆనూతనభాషరాని వారికి ఆవిధమైన సారస్వతములోని రసమాస్వాదించలేకపోవడము రెండవది. ఇంగ్లీషు తెలుగు కలిపి వ్రాస్తామనుకోండి. ఇంగ్లీషురాని భాషాకుమారులను ఆ రసగ్రహణమునుంచి బహిష్కరిస్తున్నామన్న మాట! ఏకారణముచేత సంస్కృతము వద్దని అన్నామో ఆకారణానికే మనమూ గురిఔతున్నాము. సంస్కృతమునూటకు

అర్థముచేసుకునే వారి సంఖ్యకంటె యింగ్లీషు తెలిసినవారి సంఖ్య యింకా తక్కువ. కాబట్టి అట్టివ్రాతలకు మనకారణము మరీ యెక్కువగా పడుతుంది. వ్యావహారిక భాషావాదానికి పునాది ఐన ప్రజాసామాన్య గ్రహణమనేదే మన ముల్లంఘిస్తున్నామన్న మాట! ఇది శ్రీ పంతులవారి వాదానికే వ్యాఘాతము కలుగజేస్తుంది. కన్యాశుల్కమే తీసుకోండి. ఆంధ్రాంగ్లమిశ్ర సంభాషణము అర్థమయ్యేవారి నానందపరుస్తుంది. కాని ఆంధ్రదేశములో ఎంతమంది కర్థమౌతుందో చెప్పండి? "ఏమోయ్, మైడియర్ షేక్స్పియర్" -షేక్స్పియరెవరో, అక్కడున్న శ్లేష ఏమిటో యింగ్లీషురాని వాడెంతమాత్రము తెలుసుకోలేడు. తెలుసుకోలేకపోతే, మన ఉద్యమానికే దెబ్బ! ప్రజాసామాన్యాని కుద్దేశింపబడేది, వారిలో నూటికి తొంభైమందికి అర్థముకాకపోతే యింక మనవాదము మట్టిలో కలిసిపోయిందన్నమాటే! భాషాకుమారులలో ఎక్కువమంది అర్థముచేసుకోలేని భాషలో ఎంతమాత్రము వ్రాయటము సమంజసము కాదు. రామమూర్తిగారి ఆశయానికిది విరుద్ధము!

ఈ గ్రాంథికవ్యావహారికవాదోపవాదాలలో కొందరు పండితులు కొన్ని గ్రంథాలు వ్రాసినారు.* ముఖ్యముగా వేదం వెంకట్రాయశాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుగారు, కాశీభట్ల సోదరులు మొదలగువారు ముఖ్యులు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు అప్పట్లో మౌనము వహించినాడు. ఇప్పుడు బాహాటముగా వ్యావహారికము వ్రాస్తున్నాడు. ఇట్లా మౌనము వహించిన పండితులుకూడా చాలామంది ఉన్నారు. వావిలికొలను సుబ్బారావుగారి కీవిషయములో చాలాపట్టుదల. ఆయన వ్రాసినదానిపేరు "ఆధునిక నచనరచనా సుప్రబోధ నిరసనము." ఇందులో ఆవిషయమైన కారణజాతమంతా విమర్శించినాడు. గిడుగు సీతాపతి గారు 'సొడ్డు' అని దీనిపై విమర్శవ్రాసి ప్రచురించినాడు. ఎందరు పండితులెంత యెక్కువగా వాదించినా వాదానికి బలమే చేకూరినది గాని తగ్గలేదు. బంతినిగనక కొడితే మళ్ళీ రెట్టింపు వేగముతో ముఖానికి కొట్టుకున్నట్లు ఈవాదము కూడా ద్విగుణీకృత బలముగలదైనది. రామమూర్తిగారు ప్రతిపక్షులు చెప్పిన కారణాలనన్నిటినీ

* ఇప్పుడు మళ్ళీ రామమూర్తి పంతులు వాదముపైనా పుస్తకాలపైనా తిరుగుబాటు సూచకముగా యలవర్తి రోశయ్య అనే భాషాభిమాని ఒక గ్రంథం రచించినాడని తెలుస్తున్నది

సహేతుకముగా ఖండించినారు. వారివి చొప్పదంటు వాదాలని రుజువుచేసినారు. వేదం వెంకట్రాయశాస్త్రిగారికే గ్రాంధికాంధ్రమురాదని సోదాహరణముగా చూపేటప్పటికి పండితులంతా భయపడి పోయినారు!

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - సంస్కారనిరోధం :

ఈ పరిషత్తు 1911లో స్థాపింపబడినది. వెనక కొంచెము దీనిని గూర్చి చెప్పినాను. భాషాసేవే దీనిస్థాపనానికి కారణము. వీరీపనిని సాగించడాని కవలంబించిన పద్ధతులు మంచివే! మొదట దానికి ప్రాణాధారుడైన జయంతి రామయ్యపంతులుగారు చెన్నపట్నములో ఉద్యోగరీత్యా ఉండేవాడు. కాబట్టి యీ సంస్థకార్యాలయము చెన్నపట్నములోనే ఉండేది. కొత్తపల్లి సూర్యారావుగారు* కార్యదర్శిగా ఉండేవాడు. ఈయనకూడా పండితుడే! కవిత్వముకూడా వ్రాసేవాడే! వీరు పరిషత్తును, గ్రంధాలయాన్నొక దానిని స్థాపించినారు. తాటాకు గ్రంధాలను సేకరించినారు. మానపత్రిక నొకదానిని స్థాపించి నడిపినారు. దానిలో ఉదాత్తమైన వ్యాసాలు పండితులచేత వ్రాయబడుతూ ఉండేవి. గ్రంధ ప్రచురణము కూడా వీరి ఉద్దేశ్యమే! మన్నారుదాసవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, సింహాసన ద్వాత్రింశిక మొదలైన అనేక గ్రంధాలను ప్రచురించినారు. ఈ ప్రకారముగా భాషాసేవ చేయటము సాగించినారు. ఏటేట ఒక స్థలములో సాంవత్సరికోత్సవాలు జరుగుతూ ఉండేవి. రామయ్యపంతులుగా రుద్యోగి కాబట్టి ఉద్యోగస్థుల ప్రాపకమూ,

---

* సూర్యారావుగారు సంస్కృతాంధ్రములఁబండితులై యుండుటయేకాక, ఆంగ్లము, అరవము, కన్నడము, మహారాష్ట్రము, హిందీ, ఉరుదు, భాషలయందు జక్కని ప్రవేశముకల ధీమంతులు. అనేక కృతులను రచించినాడు "దుర్యోధనాభిమానము, కన్యకాపరమేశ్వరి, త్రిలోకసుందరి" అనే నాటకాలు, "గుణమంజరి, హరిశ్చంద్ర మహారాజుకథ, నెట్టికి నేయువిధము, కమలపాలిక, ఆనందసాగరము, రాజలక్ష్మి, నీతిభవనము, ఉదయలక్ష్మి, సిరియాళచరిత్ర, నాశ్వదత్త", మొదలైనవి ముద్రితాలు.

అనేకాముద్రితగ్రంధములున్నవట ఇంకా ఈయన 12-11-1938 తేదీనాడు మరణించి ఆంధ్రసాహిత్యపరిషత్తుకు తీరని లోపము కల్గించినాడు.

- ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, 27 సం 4 సం.

సర్కారు పలుకుబడీ, ఉండేవి. రామయ్యపంతులుగారి కనుకూలులంతా కార్యనిర్వాహకులలో ఉండేవారు. ఇప్పుడు సంవత్సర సభలు మాత్రము తగ్గినవి; పత్రికమాత్రము సంకుచితముగానో యేవిధముగానో వస్తూనే ఉన్నది. కార్యస్థానము ముక్తేశ్వరములో ఉన్న రామయ్యపంతులుగారికి దగ్గిరగా కాకినాడైనది. ఆంధ్రసాహిత్య పరిషత్తు చేసిన పనికంతకూ పరిణామము లేకపోలేదు. రామయ్యపంతులుగారు చాలా పరిశోధన చెయ్యటము కలిగినది. దానికిగాను ఆయనకు ఆంధ్ర విశ్వ విద్యాలయము "కళాప్రపూర్ణ" బిరుదిచ్చినది.◆

సాక్షాత్తుగా పరిషత్తుకు సంబంధించక పోయినప్పటికీ రామయ్యపంతులుగారి పలుకుబడివల్ల ఒక గొప్ప కార్యము ప్రారంభించడమైనది. ఆయన కొంతకాల మిప్పటి పిఠాపురాధీశ్వరునికి విద్యా గురువుగా ఉండేవాడు. అందుచేత ఈయన మీద రాజాగారికి అత్యంత గౌరవము. రాజాగారు సారస్వతసేవకుడని ప్రసిద్ధి. మత విషయాలలో నాయుడుగారూ, విద్యావిషయాలలో రామయ్యపంతులుగారూ యెంత చెబితే అంత అని ప్రతీతి. అందుచేత రాజాగారికి నచ్చచెప్పి, ఒక సమగ్రాంధ్ర నిఘంటువు వ్రాయటానికి ద్రవ్యము మంజూరు పొందినారు. రామయ్యపంతులుగారీ నిఘంటు నిర్మాణము విషయమై చాలామంది సలహానుతీసుకున్నారు. నిజముగా ఒక సమగ్ర నిఘంటువవసరమే! ఇందరినీ సంప్రదించి ఒక ప్రణాళిక తయారు చేసినారు. ఈ ప్రణాళిక* విషయములో వారికీ రామమూర్తిగారికీ తగాదా వచ్చినది.

---

◆ "పంతులుగారు (రామయ్య) తను చిన్నతనమునుండియు పాండిత్య ప్రకర్ష విద్యాగోష్ఠి ఆంధ్ర చారిత్రక శాసన పరిశోధనాసక్తి కలిగి `సనాతనధర్మపరాయణులై యుండిరి.... ఆమరణాంతము ఆంధ్రభాషాయోషకై అస్థిచర్మముల నప్పగించిరి."

-శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, ఆంధ్రపత్రిక 10-4-41

* ఈనిఘంటు నిర్మాణ పద్ధతులు తెలుసుకోవాలంటే రామమూర్తి పంతులుగారు 'ప్రతిభ' లో "సూర్యరాయాంధ్రనిఘంటువు" అని వ్రాసిన బ్రహ్మాండమైన వ్యాసాన్ని చదవండి.

'ఆంధ్ర నిఘంటు నిర్మాణము విషయమున రామయ్యగారికీ రామమూర్తిగారికీ అభిప్రాయ భేదం వచ్చిందట! తాను చెప్పినట్లు చేస్తే తక్కువ ఖర్చుతో యెక్కువపని చేయించవచ్చునని రామమూర్తిగారన్నారట! రామయ్యగారికి నచ్చలేదు పదముల కర్థములు వ్యవహారభాషలో ఉండవలెననీ, ప్రాచీన గ్రంథముల శుద్ధప్రతులు తయారుచేసిన పిమ్మటనే అందలి పదములు గ్రహించవలసి ఉంటుందనీ, రామమూర్తిగారు ఇవేవీ రామయ్యగారికి గిట్టలేదు. అప్పుడు చేశారు

పైన వివరించిన పనులన్నిటితోబాటు పరిషత్తువారు వ్యావహారికభాషావాదాన్ని ప్రతిఘటించి భాషకు మహోపకారము చేసినారు. ఈ సంస్థ యెన్నదగిన సేవే చేసినది. కాని పరిషత్తు గతానుగతిక మార్గాలలోనే ప్రవర్తించినది గాని, భాషకుగాని సారస్వతానికిగాని యెన్నతగిన నూతనాలంకారా లేవీ అలవరించలేదు.

సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణము మాత్రము ఘనమైనది! ఈ నిఘంటు నిర్మాణములో వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, నిడదవోలు వేంకటరావుగారు, మొదలైనవారు కృషిచేసి తమ విద్వత్తుకు మెరుగుపెట్టుకున్న వారైనారు. ఇలాంటి మహత్కార్యములలో పనిచేసేవారందరికీ ఇల్లాగే ప్రసిద్ధికి రావడానికీ, మంచి పాండిత్యాన్ని సంపాదించుకొనడానికీ అవకాశాలు లభిస్తవి. మొత్తముమీద 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' ప్రాచీనగ్రంథ ప్రకటనములో, గ్రాంథికభాషా గౌరవమును నిలపడములో కృషిచేసినదని చెప్పవచ్చు. ముఖ్యముగా సంస్కార నిరోధము కల్పించడములో తీవ్రముగా పాటుపడినదనవలె. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమాన్ని ఖండించిన సంస్థగా మాత్రము బాగా ప్రసిద్ధిపొందినది. పర్యవసానములో ఓటమే సిద్ధించినది. ఒకవ్యక్తి నాధారముచేసుకున్న సంస్థ ఏదైనా ఆవ్యక్తి అనంతరము ఆసంస్థ అంత ఎక్కువ అభినివేశముతో నడువజాలదు. ఎలాగైతేనేమి జయంతివారు గతించిన పిమ్మట ఈ ఆంధ్రసాహిత్య పరిషత్తు కృషి ప్రభావాలు తగ్గినవనే చెప్పుకోవలె!

## రాయప్రోలు, గురజాడలు - ఖండకావ్య గీతికారచన:

రాయప్రోలు (జననము 1892) పేరు తలుచుకునేటప్పటికి "భావ కవిత్వ' మనే మాట స్ఫురణకొస్తుంది. ఈయన విద్యార్థిదశలోనే, నూతన రచనకు ఎత్తులు వేస్తూ ఉండేవాడు. వెనక చెప్పినాను విజ్ఞాన సర్వస్వ రచనలో రాయసను కలుపుకున్నాడు లక్ష్మణరావుగారు అని. ఈ సంబంధముభయులకూ లాభకరమైనది.

---

రామమూర్తిగారు ప్రతిజ్ఞ - మీనిఘంటువులో నేను తప్పులు చూపుతాను మీరు ఒప్పుకున్న తప్పులకు తప్పు ఒకటింటికి పది రూపాయలు నాకు ఇవ్వగలరా- అని. రామయ్యగారు ఈ షరతు ఒప్పుకుంటే, ఎన్నివేలు లేక లక్షలు ఖర్చు చెయ్యవలసి ఉండేదో!

- పంతొ దీక్షితులుగారు.

సుబ్బారావుకు విజ్ఞాన చక్షువిచ్చినాడు లక్ష్మణరావు. ఆయనకు నూతనదృక్పథా న్నిచ్చినాడు సుబ్బారావుగారు. ఈవిధముగా ఉభయతారకులౌతు భాషకు మేలు చేసినారు వీరిద్దరూ !

రాయప్రోలు సుబ్బారావుగారిని గూర్చి రెండు ముక్కలు చెపుతాను. ఈయన ఒక విద్వత్కుటుంబానికి చెందినవాడు. ఈయనకు అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు◆ ఒక వేలువిడిచిన మేనమామ. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నెరగని ఆంధ్రుడుండడు! శాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో గొప్ప ప్రజ్ఞ కల మనిషి.* తిరుపతి వెంకటకవీశ్వరుల శిష్యుడై **శతావధానము** చేయడమూ, ఆశుకవిత్వము చెప్పటమూ, అలవడ చేసుకున్నాడు. ఆగాలి మేనల్లుడు సుబ్బారావుగారికి కూడా కొంచెము సోకినది. ఆయనా, ఈయనా కలిసి జంటకవుల పోట్లాటలలో ఆశుకవిత్వావధానము చేసినారు. లఘువైనా రసవంతముగా ఉండేది వీరి కవిత్వము; "సంపద మరేభ్యులార యో సభ్యులార" అని అప్పుడప్పుడూ కొప్పరపు కవులుపయోగించే మకుటము వీరుకూడా ఉపయోగిస్తూ సభాసదులను హాస్యములో ముంచేవారు. తరువాత సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కొంత అంతర్ముఖుడైనాడు. కొవ్వూరు పాఠశాలలో ఉపాధ్యాయుడుగా కొంతకాలమున్నాడు. ఔచితీ సంపన్నుడు.

సుబ్బారావుగారికి ఇటూఅటూకూడా విద్వత్కుటుంబాలు కావటము ఒక

---

◆ 1935 ఈయన మరణించినారు

* దండికృత "కావ్యాదర్శ"ను తెనుగులోకి పరివర్తనముచేసినాడు. ఉద్గ్రంథము! దీనినిగూర్చి భారతిలో మానవల్లి రామకృష్ణకవిగా రేమన్నారో చూడండి :

"శ్రీ శాస్త్రులవారు దీని నతిశ్రమచేసి యథామూలముగా తెనిగించిరనుట సత్యంశయము. భాషలో నలంకారగ్రంథములు లేమను న్యూనతను వీరు తొలగించి నందులకు వీరికి నెల్లరు కృతజ్ఞులు కావలెను." ధ్వన్యాలోకముకూడా పరివర్తనము చేసినట్లు తెలుస్తుంది ఆంధ్రధ్వని, శివతత్త్వసుధానిధి, జీవన్ముక్తి, విదేహముక్తి, దైవబలము మొదలగునవి రచించినాడు.

"కావ్యనాటకాది పరిశీలనము"నే పేరుతో కొన్ని గ్రంథాలను విమర్శించినాడు కూడా.

విశేషము. ఈయన పినతల్లి విజ్ఞాని;* ఆమె యీయనకు చాలావిషయములలో దారిచూపినది. ఆమెయొక్క ప్రోద్బల మీయనమీద చాలఉన్నది. అనేక విషయాలలో ఆమె యీయనకు వివేచనాచక్షస్సు నిచ్చినది.

శంకరాచార్యులవారి భజగోవిందాన్ని ఆమెకోరిక మీద ఈయన తెనుగులోకి పరివర్తనము చేసినాడు. ఈయనలో సంస్కారము చాలా యెక్కువగా ఉన్నది. "శక్తిర్నిపుణతా చైవ" అనేదానిలో ఉన్నశక్తి యీయనకు సహజముగా ఉన్నది. దానితోబాటు నిశితమైన బుద్ధీ, జిజ్ఞాసా ఉండటముచేత ఈయనలో ఉన్న ఆ సంస్కార కుసుమము వికసించడమైనది. ఈయన 5 ఫారం చదివేటప్పుడు 'హెర్మిట్' అనే ఖండకావ్య మీయనకు పాఠ్యభాగముగా ఉండేది. దాని అందము, అందులో ఉన్న రసము చూచుటప్పటికి దాని అనుకరణము వ్రాయవలెననిపించిన దీయనకు. "లలిత" అనే పేరుతో వ్రాసినాడు వెంటనే. దీనిలో నవ్యసాహిత్యబీజాలు కొందరికి కనపడినవి. రాయప్రోలువారు వ్రాసిన "తర్వాతకావ్యాల" కన్నిటికీ బీజమీ "లలిత"లో ఉన్నది కథా, భావమూ, శైలీ, అన్నీ లలితాలే! ఇది నవ్యకవిత్వములో ప్రథమ గ్రంథాలలో ఒకటనవచ్చు కొందరు తృణకంకణమని అంటారు.◆

కాని అవ్యక్తముగా లలితలో ఉన్న "ఆధునికత్వ" లక్షణాలే తృణకంకణములో వ్యక్తమైనవనవలెను. సుబ్బారావుగారిలో ఉండే సంస్కారము నూతనత్వము కోసము పరితపించినది. ఆ నూతనత్వము మొట్టమొదట 'లలిత' ద్వారా వెలువడినది. ఈ లలిత 1909 నాటికే ప్రచురణమైనది. అప్పటికి 'కన్యాశుల్క'మొ క టే ప్రచురించినారుగాని యింకా 'నీలగిరిపాటలు' 'ముత్యాలసరాలూ' ప్రచురించలేదు

* "ఈకవికి పినతల్లి మీద ప్రీతి చాలా హెచ్చు. ఆమె వాక్యామృతం ఆస్వాదిస్తూ, కొన్ని సందర్భాల్లో ఆమె పలుకులే పద్యాలలో సుబ్బారావుగారు చొప్పించారు. ఆమె అనేక విషయాలు అవగాహన చేసుకున్న విశాలహృదయి. లోకయాత్రలో క్లిష్ట గ్రంథులు విప్పి వేయగల వివేకవతి. ఆమె సూక్తులు యీ కవీంద్రుని కళకు దోహదం చేసినై"

- తృణకంకణ రజతోత్సవ సంచికానీరాజనం.

◆ తల్లావఝులవా రిట్లా అన్నారు :

'ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము.'

- తృణకంకణ రజతోత్సవసంచికా నీరాజనం.

గురజాడ అప్పారావుగారు. 1912 సంవత్సరమునాటి కింకా 'తృణకంకణం' తయారౌతున్నది. ఈమధ్య అనగా 1909 సంవత్సరానికి 1912 సంవత్సరానికి మధ్య యీాయన రెండు ఖండకావ్యాలు "అనుమతి" "కష్టకుమారి" అనే పేర్లతో వ్రాసినాడు. వీటిలో "అనుమతి", "డోరా" యొక్క అనుకరణము. ఈ ప్రకారముగా ఆంగ్లకవిత్వ సంపర్కమూ, సహజసంస్కారమూ, యీాయనలో ఒక నూతనత్వము కలగజేసినది. ఆ నూతనత్వమూ, ఆకళాదృష్టి యీాయన కావ్యాలకు నవ్యత నాపాదింపజేసినవి. వర్డ్సువర్తు, షెల్లీ, కీట్సు, టెన్నిస్, బ్రౌనింగు మొదలైన ఆంగ్ల కవుల కావ్యాలలో ఉండే "జీవకళ"ను వెంటనే పట్టుకొని తన స్వంతము చేసుకో గలిగినాడు. వాళ్ళు వ్రాసేపద్ధతిని తెనుగు సారస్వతానికి అవలంబింపజేసి సారస్వతాని కొకనూతనకళ కలగజేసినాడు.*

ఈ లలితలో ఉన్న విశేష మేమిటో, అది యీాయన తర్వాత వ్రాసిన కవిత్వములో బీజభూతముగా ఎలా ఉన్నదో మనవి చేస్తాను. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి "లలిత" కావ్యములో ఉన్న రసాన్ని గ్రహించి తానుకూడా సారస్వతనిర్మాతలలో ఒక డౌటచేత నిష్పాక్షికముగా ఈ ఖండకావ్యాన్ని గూర్చి ప్రశంసించినారు.

వారి వాక్యాలనుబట్టి వెంకటకవిగారికి దీనియందు కనపడిన నవ్యత తెలుస్తుంది. "ఇతివృత్తము హూణకవికల్పనమునుండి గైకొనబడుట, మాతృకలోకంటె స్వకపోల కల్పితములైన వర్ణనలుండుట, కథాముఖము సనాతన సాంప్రదాయకముల ననుసరింపక నాయికావిలాసములతో ప్రారంభించుట", వీరికి కనపడిన విశేషములు. కవిత లలితపదభూయిష్ఠ మనేది యీాయన కావ్యాలలో ఉండే కవిత్వానికి సామాన్య లక్షణము. కాబట్టి వీరు చెప్పినవాటిలో అన్నిటికంటె కావ్యముఖనవ్యత ప్రశంసనీయము.

ఇదివరలో 'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని ప్రథంతే' అనే వాక్యము కవులలో అమలులో ఉన్నది. అప్పటికి దానికి భిన్నముగా కష్టాదిగా ఈ కావ్యాన్ని ప్రారంభించినాడీకవి. ఇది ఒక నవ్యత. వెనకటి 'మంగళాంత చాదస్తు'ల

* The principal object then proposed (in this kind of poetry) was to choose incidents and situations from common life, and to relate them throughout, as far as was possible, in a selection of language really used by men."
- Wordsworth in preface

వలెగాక ఆధునికులకు "కష్టాదిచాదస్తానికి" మార్గదర్శి అయినాడీకవి. ఈపద్ధతి యీ కవిగారి చాలా కావ్యాలకు అనువర్తించినది. తృణకంకణములో "అడుగుల బొబ్బలతో" ప్రారంభించినది కావ్యము. నవ్యులకూ, పురాతనులకూ ఉన్న భిన్న అభినివేశాలలో ఈ 'మంగళాది కష్టాదిచాదస్తమూ', 'మంగళాంత కష్టాంత చాదస్తమూ' ఒకటి. కాని వెనుకటివాళ్ళ 'మంగళాంతచాదస్త' మెటువంటిదో నవ్యుల "కష్టాంతచాదస్తమో" మరో "వికృతచాదస్తమో" అట్టిదే నంటే వారికి నచ్చదు తమ చాదస్తము సమంజసమని వీరి అభినివేశము!

"లలిత"ను గూర్చి రమాకాంతాచార్యులుగా రింగ్లీషులో ఇలా అభిప్రాయ మిచ్చినారు.◆

'This poem... I believe is the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the sacred passions of love under the direct inspiration of the Votaries of English in use, and as such, marks a *new epoch* in the development of modern Telugu Literature. The author unlike his predecessors (who have enriched the Telugu Literature by translating and imitating the western masters) infused fresh life and blood into the composition by photographing his images direct from nature

The scenes through which the heroine passes on her way to her lord have been described with a keen sense of the Beautiful in nature and a profound admiration of the ways of Providence as reflected in her. The author has reached the highest watermark of poetic excellence in his glowing description of Love, which he idealises and enthrones in the very heart of nature The poem on the whole is a lyrical piece of rare beauty and finish...."

ఈ ఆచార్యులవారి మాటలవల్ల "లలిత"లో చాలాక్రొత్తవిషయాలున్నట్టు కనపడుతున్నది. ఇన్ని నవ్యతాపాదక విషయాలున్నవని యింగ్లీషు సారస్వతపరనమూ, విమర్శనాజ్ఞానమూ, ప్రకృతి రహస్య పరిశీలనమూ, సృష్టి రహస్యగ్రహణమూ, ప్రకృతిలో ఈ పవిత్ర ప్రణయాన్ని చూడటమూ, ప్రకృతిప్రోద్బలముచేత కవిలో కల్గే చిత్తసంస్కారమూ, భావప్రాధాన్యమూ, ఈ మొదలైన నవ్యలక్షణాలన్నీ ఆచార్యుల వారికి "లలిత"లో గోచరించినవి. ఇవే ఆంగ్ల సారస్వతములో వర్డ్స్‌వర్తు, షెల్లీ మొదలైన కవుల వ్రాతలలో ఉన్న లక్షణాలు.

◆ Vide Introduction to Lalita.

ఈ లక్షణాలన్నీ మన వెనకటికవుల వ్రాతలలో లేవా? అని అడగవచ్చు. ప్రకృతికవిత్వాన్ని తీసుకుందాము. వెనకటి గ్రంథాలన్నిటిలో ఋతువర్ణనము సూర్యోదయ సూర్యాస్తమయాదివర్ణనము మొదలైన వర్ణన లున్నవి. కాని వాటిలో తత్కవుల దృక్పథము లేదు. కొందరీ వర్ణనలను అలంకారయుక్తముగా చేసినారు. కొందరు స్వభావసిద్ధముగా చేసినారు. మరి కొందరు వారు చెప్పే కథావస్త్వంత ర్భాగాలుగా చేసినారు. కాని వాటిని ఉన్నదిఉన్నట్టు చెప్పడమేగాని వాటిలో ఉండే అంతరార్థమూ, వాటికీ కవికీ ఉండే పరస్పరసంబంధమూ, వాటికీ సృష్టికీ ఉండే పరస్పరసంబంధమూ, వాటివల్ల కవి నేర్చుకుని పాఠకులకు విప్పి చెప్పే ఉపదేశమూ, వాటికి అంతర్భూతమైన తత్త్వమూ, ఆతత్త్వాన్ని జీవితానికి సమన్వయించడము మొదలైన విషయాలు వెనకటికవులు పరామర్శించలేదు. అంతేగాకుండా ప్రకృతికి కథావస్తువును సంబంధింపచెయ్యడము వెనకటికవు లందరు కూడా చేసిన పనికాదు. ఈనవ్యతే తృణకంకణాదికములో అనువృత్తమై రాటు తేలినది ఆయన చేతులలో. ఈ నవ్యదృక్పథము సుబ్బారావు గారిలో ఒక మతమువంటి సంస్కారాన్ని అభివృద్ధి పరిచి ఆయన తరణోపాయముగా సాధించే తపస్సైనది. ఈవిధమైన పవిత్రత అనేక నవ్యకవులలో లేదు. ఇతరులకూ ఈయనకూ ఉండే భేదాలలో ఒకటిది.

కష్టసుఖాలు జీవికి నిసర్గాలనీ, వాటినిగూర్చి దుఃఖపడ వద్దనీ, ఉత్సాహమే సర్వదాధార్యమనీ, దుఃఖములోకూడా సుఖమే భావించాలనీ, చిత్తము శబలము చేసుకోకుండా స్థిరముగా ఉంచుకోవాలనీ మన అభివృద్ధి బీజాలు మనలోనే నిసర్గముగా ఉన్నవనీ యీ పాఠాలన్నీ ప్రకృతిలో ఉన్నవనీ, ఋతుపరిణామమే యీ పాఠము మనకు తెల్పుతున్నదనీ, అనేక కవిగారి సిద్ధాంతవిషయాలీ లలితలో కనపడతవి. ప్రేమ పావిత్ర్యబీజా లిందులో ఉన్నవి కాని యింకా అమలిన ప్రేమ సిద్ధాంతము కవిగారికిప్పటికి దృఢము కాలేదు.

ఇక సుబ్బారావుగారి సహజమైన కళాదృష్టి, పదలాలిత్యము, పరస్పరపద సమ్మేళన చాతుర్యము, ఇందులో నిసర్గాలుగా ఉండి తర్వాత కావ్యాల్లో బాగా పరిణామము పొందినవి. మొత్తముమీద సుబ్బారావుగారి యీ "చిన్నపొత్తం" నవ్యమార్గాన ప్రవర్తించి, పండితులనూ, విద్యార్థులనూ, ఆంగ్లవిద్యాపారంగతులనూ,

అందరిని కూడా ఆనందింపజేసినది. పండితులను భాష, శైలి తృప్తి పరిచినవి. విద్యార్థులకు వెనకటి కావ్యమర్యాదలను అనుసరించకపోవడము నచ్చినది. ఆంగ్లవిద్యాపారంగతులను దానిలోని నవ్యత ఆకర్షించినది. ఈ విధముగా నవ్యసాహిత్యానికి పునాదివేసినదీ కావ్యము.

"లలిత"తో ప్రారంభించిన ఈనవ్యతను ప్రచారము చెయ్యవలెననే అభినివేశము గట్టిపడి 'తృణకంకణము' నాటికి పాతుకుపోయి "అభినవకవితా మండలి"* స్థాపనముగా పరిణమించినది. "లలిత" అలజడి అంతగా కలిగించకపోయినా "తృణకంకణము" మాత్రము కలిగించినది.◆ ఉత్సాహముతో ఉవ్విళ్ళూరుతూ ఉండే ఆంధ్రయువకులలో "లలిత" కలగజేసిన భావపరివర్తనాన్ని దృఢపరిచినది "తృణకంకణము." కవితా సంస్కారమున్న కొందరు యువకులలో సంకల్ప బీజాలు నాటినది.

సుబ్బారావుగారు మొదట్లో లక్ష్మణరావుగారి వద్ద పనిచేస్తూ ఉండేవాడు. తర్వాత కొన్నిదినాలకు శాంతిని కేతనము వెళ్ళి, అక్కడ కొంతకాలము రవీంద్రసేవ‡ చేసి, ఆ వాతావరణములో సంచరించివచ్చినాడు. ఆంధ్రసారస్వతానికి ఈయన రవీంద్ర సాన్నిధ్యమత్యంత ముపకారమైనది. తృణకంకణములో వ్యక్తమైన యీయన నవ్యతా, మనస్తత్వమూ, కళాదృష్టీ, మొదలైనవన్నీ కలకత్తానుంచి వచ్చినతర్వాత స్వతంత్రాలైనవి. అంతేగాక రవీంద్రుడి గూఢత (mysticism) కూడా కొంత పట్టు పడినది. 'స్నేహలతాదేవి', 'కష్టకమల' మొదలైన కావ్యాలన్నీ వచ్చినవి. ఇట్లు ఒకటి

---

* The Telugu school of Romantic revival.

◆ "ఈ సూర్యాలోకమువల్ల (తృణకంకణకృత) సాహిత్యసీమలో నూతనరుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లు కొలిపింది. కొంతమంది కన్నులు మూతపడ్డవి. కొంత మంది నేత్రపటలాలు నీరైపోయినవి." - రజతోత్సవసంచిక నీరాజనము.

‡ ఒకమారు నేను వ్రాసిన యీ వాక్యాన్ని చూడండి.

"ఇదివరకు గర్భితముగా ఉండే సుబ్బారావు గారి శక్తికి రవీంద్రసాహచర్యము నివురుకప్పిన నిప్పును ఊదినట్లైనది. అప్పటినుంచి యీ నవకవి దివ్యతేజస్సు గోచరించి నట్టై, దైవసాక్షాత్కార మైనట్టు, మారిపోయాడు. ప్రతి వస్తువును పరిశీలించే సామర్థ్యమలవడింది. దృష్టి విశాలమైంది. సకల విద్యలూ నేర్చినవాడల్లే ప్రతి సంగతీ ఆలోచించి తత్వాన్ని తెలుసుకునే శక్తి కలిగింది."

తర్వాత ఒకటి ఆయన కావ్యాలు బయలుదేరి ఆంధ్రభాషామతల్లికి నూతనాలంకారాలైనవి.‡ వీటిని చూచి సంస్కారమున్న మహనీయుల కందరికీ కండ్లు తెరిచి నట్లైనది. ఈ విధముగా రాయప్రోలుగారు నవ్యాంధ్ర సాహిత్యానికి పితృస్థాన మాక్రమించినాడు.※ మీసములు వచ్చీరాని నవ్యాంధ్ర కవులుకూడా ఈయనను తమకు భావనాగురువుగా అంగీకరించినారు.◆

ఈయన ఆస్తికుడు. వాఙ్మయతపస్వి. జిజ్ఞాసువు. తత్వాన్వేషి. మిగిలిన చాలామంది ఆధునికకవులమనుకునేవారివలె పర సాంప్రదాయాలలో కొట్టుకొని పోయ్యేవాడుకాడు. నిర్గుణమైన పరతత్వము సాధించటము కష్టమై సగుణమైన ప్రకృతిని వాఙ్మయము ద్వారా భాషామతల్లిగానూ మనస్సాలలితగానూ ఉపాసించినాడు.§ ఈయనయొక్క హృదయ పావిత్ర్యానికీయన తన కావ్యాలలో చిత్రించిన "అమలినశృంగారమే" సాక్షి. ఈయనకు శీలము చాలా ముఖ్యము. పూర్వుల సాంప్రదాయము పవిత్రము. పూర్వవాఙ్మయము, వారు మన

---

‡ నవ్యసాహిత్యపరిష న్నవమ వార్షికపు టుపన్యాసములో రాయప్రోలు తన రచనలు జరిగిన తర్వాతే తాను శాంతినికేతనము వెళ్ళి వచ్చినట్లు చెప్పినాడు.

※ రాజమహేంద్రవరములో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు కధ్యక్షుడైనాడు, 1940 సంవత్సరము మార్చి నెలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్సభలో వారికి అత్యంతమైన గౌరవము జరిగినది ఉస్మానియా విశ్వవిద్యాలయములో చాలాకాలము ఆంధ్రాచార్య పీఠాన్ని అలంకరించి ఇటీవల వరంగల్లు కళాశాల ప్రిన్సిపాలై అంధ్రులకు గర్వకారణముగా నిలిచాడు.

◆ దేవులపల్లి రామానుజరావు మొదలైనవారున్నారు.

§ "కానబడ కనుమాన ప్రమాణమునకె
అంది యందని పరతత్వ మవల నుంచి;
పంచభూత దృశ్యం బైన ప్రకృతి యొకటి
సన్నిహిత లక్ష్య మనియె వచస్వి నేడు"
"అందు నీవిలక్షణ జీవయాత్ర కైన
పృధివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి
గా సమస్త పరాపర కార్యములకు" - రమ్యాలోకము

కిచ్చిపోయిన మాన్యమని యీయనతలంపు.‡ కాని దేశకాల పాత్రాలననుసరించి, నాగరికతావిజ్ఞానాల ననుసరించి సార్వస్వతక్షేత్రములో క్రొత్త పంటలు పండించి క్షేత్రాన్ని ఫలవంతము చెయ్యవలెనని వీరిమతము. తుదకు తన నవ్యతకూ, తన వాఙ్మయతపస్సుకూ కారణభూతాలైన అంతశ్శక్తులను చెబుతూ తన కావ్యాల కన్వయించే లక్షణ గ్రంథము "రమ్యాలోక"◆ మనే పేరుతో రచించినాడు. ఇట్లా నవ్యాంధ్రకవి బ్రహ్మకీర్తి పొందుతున్నాడు

కాని నవ్యసాహిత్యమంటే ఫలానా అని నిష్కృష్టమైన అభిప్రాయము ప్రబలలేదు. ఇంతవరకిచ్చిన నిర్వచనాలన్నీ దీర్ఘాలు. ఇంకా కొత్త రోజులు కనుక నిష్కృష్టలక్షణ మేర్పడడానికి కాలము పట్టినది. ఇప్పటికీ యిట్టిది నవ్యసాహిత్యమనే విషయములో చాలా అభిప్రాయభేదాలున్నవి.

## భావకవిత్వము:

"భావకవిత్వ"✻ మనే మాటను గూర్చి విచారించుదాము. ~~ఈ~~మాట యెట్లాపుట్టినదో చెప్పటానికి వీలులేకుండా ఉన్నది. మొదట మొదట యీపేరును గ్రహించినారీ రచయితలూ, తత్ప్రోసులూను. రాయప్రోలువారుకూడా యీమాటతోనే తమ కవిత్వాన్ని నిర్వచించే వాడు.§ ఏలాగైతేనేమి యీ మాటకు ప్రచారము వచ్చినది. వేలూరు శివరామశాస్త్రిత్యాదు లీమాటనే వాడి దానిపైన భారతి మొదలైన పత్రికలలో

---

‡ "పరిణతవాక్కు, లస్మదనవద్యకలాకవితాపితామహుల్
స్థిరముగనిచ్చిరీ తెలుగు తీయని మాన్యము, నిందు నూత్నవ
ల్లరులను, క్రొత్త యంట్లను ఫలద్రుమజాతుల నాటి పెంతు సం
బరముగ, నే వనప్రియులు మంచెలపై నెలుగెత్తి పాడగాన్." - తెనుగుమాన్యము

◆ చూ: నేను వ్రాసిన రమ్యాలోక సమీక్ష.-ఆంధ్రపత్రిక ఉగాది సంచిక.

✻ "గానయోగ్యము, ఆత్మనాయకము, వ్యంగ్యప్రధానము, ఏకభావాశ్రయము నగు నొక లఘురచన భావకవిత్వమని తెలియనగుచున్నది"

- పాటిబండ మాధవశర్మ, భారతి - శ్రీముఖ, పుష్యము.

§ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారీమాట పట్టించినారనినారు గిడుగు సీతాపతిగారు.

వ్యాసాలుకూడా వ్రాసినారు.◆ ఇప్పటికీ ఈమాటకు కొంత నీచార్థమొచ్చినది. నిరర్థకమైన అయోమయ కవిత్వాని కీమాటను కొందరుపయోగించటము మొదలుపెట్టినారు. "నేటికాలపు కవిత"లో ఉమాకాన్తపండితుడు వాడిన మాటయిదే! ఈమాట కవిత్వాన్ని తిట్టే ఒక తిట్టుకిందికి దిగినది. అప్పుడీ కవులీ మాటను ఉపయోగించటము మానివేసినారు. దానిని "నవ్యసాహిత్య" మనినారు; "నవ్య కవిత్వ" మనినారు.✳ ఈమాట బాగుందని దీనినే గ్రహించినారందరూ. ఈ పేరుతోనే యిప్పుడీ సాహిత్యమంతా వ్యవహారములో ఉన్నది. "నవ్య కవిత్వము" "నవ్యసాహిత్యము" అనే మాటలలో ఒకవిధమైన అనిర్వచనీయతా, అనవస్థా, అవ్యాప్తి అతివ్యాప్తులూ, అనిష్కృష్టతా, ఉన్నదేమో అంటాను. ఇప్పటికీ దీని పరిమితి యింత అని, లక్షణాలివి అనీ, యెవ్వరూ చెప్పినవారు లేరు. వెనక విశ్వనాథ, పంచాగ్నులవారి నిర్వచనాల లిచ్చినాను. అవికూడా యెంత దీర్ఘములో మీరు చూచినారు. 1850 సంవత్సరము తర్వాత తెనుగులో కలిగిన రచనఅంతా దీనిక్రిందికి వస్తున్నట్టు కనపడుతున్నది. కాబట్టి వెనకటి లాక్షణికుల నిర్వచనము ప్రకారము లక్షణానికి అతివ్యాప్తిదోషము పట్టినది. ఇక "భావకవిత్వ" మనేమాటే కొంతవరకు సమంజసముగా ఉన్నదేమో అనిపిస్తుంది.

ఇప్పటికీ భావకవిత్వాన్ని నిరసించేవారు, 'భావంలేని కవిత్వ ముంటుందా?' అని హేళనగా మాట్లాడటముకద్దు. వారికి సమాధానముగా ఉంటుంది అలాంటిది అంటున్నాను. కావలసివస్తే పెద్దన మొదలైన గొప్పకవులలోనుంచి ఉదాహరణాలు లెక్కకు మిక్కిలిగా ఇస్తాను.‡ భావమంటే సామాన్యముగా అనుకునే అర్థముకాదు.

---

◆ కవికుమారులు భావగీతా
రవళిలో మగ్నంబునొందుచు
భువి మరచి తన్మయతజెందగ
బొంగిపోయెదరు. - పెనుమర్తి వెంకటరత్నం, 'ప్రకృతి' లో.

✳ సుబ్బారావుగారే కష్టకమల సూచికలో 'నవ్యకవిత' అనే పదము ఉపయోగించటముచేత దానినికూడా ఆయనే మొదట వాడినట్లు తోస్తుంది.

‡ "కవి ఆలోచనచే మథించి, గ్రథించి, దర్శించిన యొక రసమయ గోళము భావము.
- పిల్లలమఱ్ఱి.

విషయముకాదు 'భావము' అంటే లాక్షణికు లుపయోగించే 'విభావం' 'అనుభావం' 'సాత్త్వికభావం' 'భావస్థైర్యం' 'భావశబలతా' అనే మాటల్లో ఉండే భావశబ్దానికి యేఅర్థమో ఆ అర్థము! అటువంటి 'భావమును' కవులందరి కవిత్వములో ఉంటుందని చెప్పడానికి వీలులేదు. అటువంటి భావప్రధానముగా వ్రాసిన కవిత్వము కాబట్టి "భావకవిత్వ" మనవచ్చు దీనిని. పూర్వులలోకూడా యీభావానికి ప్రాధాన్య మిచ్చిన స్థలాలు అక్కడక్కడ లేకపోలేదు. దానిని మనవారు ఏ అలంకారము క్రిందికో తెచ్చి దానిని అప్రధానము చేసినారు. చూడండీ క్రింది పద్యము:

"తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యధా
భరవివశాంగి సంగభవుబారికి నగ్గముచేసి క్రూరుడై
యరిగె మహీసురాధము డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణవహించెనో యన నభోమణి దాల్చె కషాయదీధితిన్."

దీనిలో ఉన్న భావప్రాధాన్యాన్ని నిరాదరించి దాన్ని అలంకారము క్రిందికి తెచ్చి "ఉత్ప్రేక్షాలంకారము" అనినారు పెద్దలు. కాని యిది కవియొక్క ప్రకృతి పరిశీలనజ్ఞానమూ, కవి ప్రకృతులకు కల్గిన పరస్పరసంబంధమూ, ప్రకృతి కవికి కలిగించిన చిత్తవృత్తి మార్పూ, కథావస్తువుకూ ప్రకృతికీ ఉన్న సానుభూతీ, మొదలైన అనేక విషయాల కుదాహరణము. వీటిలో ఒక్కదానికైనా ప్రాధాన్యమియ్యరు మన పెద్దలు. నాయికకు కలిగిన చిత్తవికారానికీ ప్రకృతికీ పరస్పరసంబంధము కల్పించి, ప్రకృతి నాయిక అవస్థనుగూర్చి సానుభూతి చూపినట్లు చెప్పడ మీపద్యములో విశేషము. కాబట్టి యీ మొదటి నవ్యకవి అయిన సుబ్బారావుగారి కవిత్వములో కనపడిన యీబహుళాంశమే వెనకటి కావ్యాలకూ దీనికీ వైశిష్ట్యము కల్పించినది.

ఇట్లా భావము ముఖ్యాంశముగా పెట్టుకునే కవిత్వాన్ని "భావకవిత్వ" మనినారు. ఇది సమంజసమే! కాని తర్వాత వ్రాసిన కొందరు కవుల అవ్యక్తపు వ్రాతలతో ఈ మాటకు అపార్థము రావటమువలన ఈమాటను పరిహరించినారు తదనుయాయులు.* ఈ మాటకు సామాన్యముగా "ఇది అర్థం" అని అర్థము

* నోరి నరసింహశాస్త్రిగారు "పండితుల మనుకునేవాళ్ళ ప్రసాదంవల్ల భావకవిత్వమనే మాటకు 'అర్థంలేని పనికిమాలిన ఉల్లాయిపదాలు' అని వక కొత్త అర్థం కూడా లోకంలో ప్రచారానికి వచ్చింది" అన్నారు.

చెప్పటానికి ఎంత మాత్రము వీలులేదు. అది కావ్య విషయములో ఒక పరిభాషాపదము. వస్తువుకు పర్యాయ పదముగా భావశబ్దాన్ని తీసుకొనేటప్పటికి సీచార్ల మొచ్చినది. రెండూ ఒకటే అయితే "భావము" "వస్తువు" అని రెండు పదాలు వాడుకలోకి ఎలావస్తవి? పారిభాషికముగా సామాన్యవ్యవహారములో ఒకవేళ "దీని భావ మేమి తిరుమలేశ" అన్నట్టు "అర్థ" మనే అర్థములో ఉపయోగించినా, యీ సందర్భములో అట్లా ఉపయోగించడము ప్రతిపక్షులు నిరసించడము కోసము చేసినపనే అని గట్టిగా చెప్పవలె.

గురజాడ అప్పారావుగారు (1861-1916) కూడా సుబ్బారావుగారి వలెనే ఒక వంక నుంచి స్వతంత్రముగా వ్రాయడము మొదలు పెట్టినవారే.

"అప్పరాయకవి* బహుపల్చని మనిషి. అతి దుర్బలుడు. వేసవికాలంలో సైతం ఉన్ని చొక్కా మీద కోటు వేసుకొని శాలువ కప్పుకొని, మేజోళ్ళు తొడుక్కుంటేనే గాని ఉండలేక పోయేవాడు. మితభాషి. పెద్దకళ్లు, సొగసైనయవననాసం, అతివిశాలమైన ఫాలం". "పెద్దచెవులు చవుకపు చెక్కిళ్ళు, నిండుగల గడ్డము. ఇంపుగా కొనలు సాగిన మీసం". 'ముఖంలో శాంతం, మాటలో శాంతం, నడివడిలో శాంతం; మెల్లని మాట. మీద పడికొట్టినా తొందరలేని వ్యక్తి; మంచిగంభీర ముఖ లక్షణాలు గలవాడు.

ఈయన 1861 నవంబరు 30వ తేదీన విశాఖపట్టణము జిల్లా రాయవరములో జన్మించినాడు. హైస్కూలులో చదివే దినాలలోనే కవిత్వము వ్రాయడము ప్రారంభించినాడు. కాలేజీలో చదివేనాటికి ఆంగ్లభాషలో కవిత్వము వ్రాయడము, విజయనగరము నుంచి వెలువడే "ఇండియన్ లీజర్ అవర్" అనే పత్రికలో ప్రకటితము కావడము విశేషమే. 'సారంగధర' అనే ఆంగ్ల కావ్యాన్ని, శంభుచంద్రముఖర్జీగారునడుపుతూవుండే 'రీస్ అండ్ రయ్యత్' అనేపత్రిక ద్వారా లోకానికి అందించినాడు. కళాశాలోపాధ్యాయులుగా 1887 నుంచీ 1896 దాకా పనిచేసినాడు. ఆరోజులలోనే 'కన్యాశుల్కం' 'కొండు భట్టీయ' మనే నాటకాలను

* చూ. ముత్యాలసరాల పీఠిక
'నవోదయ'లో గిడుగు సీతాపతిగారి వ్యాసము.
డిసెంబరు 1946 అభ్యుదయలో 'ప్రయాగ' వ్యాసము

రచించినాడు. చరిత్రపరిశోధనము కొంత కాలము చేసినాడు. ఆనందగజపతి మహారాజావారి ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసినాడు. 1910లో 'ముత్యాల సరాలను' ప్రచురించినాడు.

గిడుగు రామమూర్తి పంతులుగారియనకు ఓనమాల తరగతి నుంచి సహాధ్యాయులు కావడము కూడా ఒక విశేషమే. వీరిద్దరూ కలసి మెలసి అన్నదమ్ములవలె ఉండేవారు ఆతరువాత కాలములో ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఉత్తమ స్థానాలను అలంకరించిన మహానుభావులూ అయినారు.

అప్పారాయకవికి సంఘసంస్కారము* వ్యావహారిక భాషా వాదము ప్రధాన విషయాలైనవి. ఒకవంక వీరేశలింగముగారు మరొక వంక గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు! ~~ఈ~~ఇరువురి ఉద్యమాలను ఆకళించుకొని రచన సాగించిన ప్రతిభాశాలి గురజాడ అప్పారావు. దీనికి ఆయన వ్రాసిన కన్యాశుల్కం ఉపోద్ఘాతములో మొదటి వాక్యమే సాక్షి. చూడండి:

".... I wrote it to advance the cause of social reform and to combat a popular prejudice that the Telugu language was unsuited to the stage "

ఆయన ఇంగ్లాండు పోయివచ్చిన హైందవులయొక్క, అధికారములో ఉన్న మనవాళ్ళయొక్క, దొరలయొక్క సహాయముపొంది◆ వ్యావహారిక భాషావాదముతో

---

* ముత్యాల సరాలలో మొట్టమొదటి గీతము సంఘసంస్కరణమును గూర్చి వ్రాసినాడు:
"బరంపురంలో 1910 సంవత్సరమందు ఒకరింట పెద్దవిందు జరిగింది. అప్పుడు నాలుగు జాతులవారు కలిసి పంక్తులు తీర్చి కూర్చుండి భోజనం చేశారు. దాని పైన సనాతన ధర్మం పోషించాలనే పూర్వాచారపరాయణులు విందారగించిన వారిని వెలివేశామన్నారు.
ఆవిందు మనసులో పెట్టుకుని... అనే పద్యము తన ముత్యాల సరములలో చేర్చినాడు. అప్పారావుగారికి సంఘసంస్కరణ విషయంలో ఉదారాశయాలుండేవి. అందుకు నిదర్శనంగా ముత్యాల సరములలో... 'ముత్యాల సరాలు' - 'లవణ రాజు కల' - 'కన్య' - 'డామన్ పితియస్' - 'పూర్ణమ్మ' మొదలైన వానిని ఎత్తి చూపించవచ్చు".

◆ "Since I wrote the preface to the first edition, the spoken dialect has gained ground. My friend, Principal P.T. Srinivasa Iyengar, recently started a Telugu teaching reform Society among the aims and objects of which the cultivation of Venacular Telugu holds a prominent place and Mr. Yates whose name will always be remembered in the Telugu districts for introduction of rational methods of Telugu teaching into our schools, has lent weight to the movement by accepting the Presidentship of the Society"

లోకాన్ని ఢీకొన్నాడు. వ్యావహారిక భాషావాదము - భావకవిత్వము : ఈ రెండూ సోదరోద్యమా లనవచ్చు. ఈ రెంటిలోను భావకవిత్వము బలవత్తరమైనది. దీనికి వ్యావహారిక భాషోద్యమము సహకారి. దానిని త్వరగా వ్యాపింపజేయడములో సహాయపడ్డది.

అప్పారావుగారి 'ముత్యాల సరాలు' సుబ్బారావుగారి 'తృణ కంకణము'తో పాటు నవ్యాంధ్ర కవిత్వానికి ప్రోత్సాహకాలని చెప్పవచ్చు. 'ముత్యాల సరాల' నే నూతన ఛందస్సును సృజించినాడు, గురజాడ కవి◆ ఈయన తరువాత నవ్యకవులైన వారంతా యీఛందస్సును అనుసరించిన వారే. 'దేశభక్తి' ప్రబోధగీతాలు వ్రాసి గురజాడ ప్రశస్తిగన్నాడు.✻ సంఘానికి ఒక ఉపదేష్ట అయినాడు. తన ఉపదేశాలను

◆ గుత్తునాయని, జాతిముత్యాల్
గుచ్చినాడే మేలిసరముల
ఇత్తునాయని తెలుగుదల్లికి
ఇచ్చినాడే భక్తితో !

.

యుగయుగంబుల నుండి మ్రోగెడు
భంగముల నుప్పొంగునాతని
గీత శీకరముల్ - దేవులపల్లి కృష్ణశాస్త్రి

✻ దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టి మేల్ తలపెట్టవోయ్ !

.. ..

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయి;
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయి !

... ...

స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి!

మొదలైన గీతాలు దేశమంతా మారుమ్రోగిపోయినవి.

రచనలద్వారా ప్రజల హృదయాలను హత్తుకొనేలాగు వ్రాసినాడు. ఈయన రెండు చిన్నకథలను కూడ వ్రాసి నవ్యసాహిత్య ప్రక్రియలలో ఒకటైన చిన్నకథకు కూడా మార్గము వేసినాడు. అనేక కథలను వ్రాయడము ప్రారంభించి పూర్తిచేయక వదలి వేసినట్లు ముత్యాలసరాల పీఠికాకారుడు చెప్పుతున్నాడు.

మొత్తము మీద గురజాడ అప్పారావుగారిని నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలలో ఒకరినిగా ఎన్నుకోవలె!

## ఎవరు ముందు?

భావకవిత్వానికి ప్రథములెవరు అనే ప్రశ్న ఒకటి ఉన్నది.◆ రాయప్రోలు, గురజాడలలో ఎవరు నవ్యాంధ్రసాహిత్యవృక్షానికి ముందు బీజావాపము చేసినారు? ఈ విషయములో కొందరి అభిప్రాయాలను ఇచ్చి వాటిని గూర్చి రెండుమాటలు చెపుతాను. 'ఆధునిక కవిత్వము నకు 'తృణకంకణము' ఆదిగ్రంధమని అస్మదాదుల ఆశయము'- అని తల్లావజ్ఝలవారు సెలవిచ్చినారు. 'అప్పారావుగారి' 'నీలగిరి పాటలు; ముత్యాల సరాలు' "కొత్తపాతలకు మేలుకలయిక" కూర్చిన నవ్య సాహిత్యపు తొలికృతులు' - అని నోరి నరసింహశాస్త్రి గారన్నారు. 'అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందుకున్నారు. వీరేశలింగం, తిరుపతికవుల తర్వాతకవి గురజాడ అప్పారావు' అని ఒకనవ్యుడు. 'ఆధునికాంధ్ర కవిత్వ ఫక్కీకి సాంఘిక నాటక రచనకుమార్గము చూపినవారు వాస్తవముగా కీ.శే. గురజాడ వెంకట అప్పారావుగారే అని చెప్పవలెను.' అని గిడుగు వెంకట సీతాపతిగారి వాక్యము. దేనిని ప్రమాణముగా తీసుకోవలెనా అని చారిత్రకులు కళవళపడతారు.

ఇక్కడ రెండు విషయాలున్నవి: "గ్రంధము - పద్ధతి" అని! ఈ రెంటిలోను కూడా గురజాడవారి నీలగిరి పాటల కంటె, ముత్యాల సరాలకంటె రాయప్రోలువారి తృణకంకణము అర్వాచీనము. అప్పారావుగారి నీలగిరిపాటలు -

---

◆ 'అదివర కప్పుడే నేను 'చిలకమ్మ పెండ్లి... మొదలైన పాటలు కొన్ని రచించి వివేకవతిలో ప్రకటించాను' అని గి.వెం. సీతాపతిగారంటారు (చూ: 'నాట్యకళ విక్రమ మార్గ శీర్షము.) బాపిరాజుగారు కూడా ఇలాగే అంటారు.

ముత్యాల సరాలకంటె సుబ్బారావు గారి 'లలిత' ప్రచురణములో ప్రాచీనము. వీరిద్దరూ స్వతంత్ర రచయితలే కాని కొందరన్నట్లు ఒకరి పద్ధతిని ఒకరు అందుకోలేదు.

భావ, వస్తు, రచనల మూడింటిలోకూడా రాయప్రోలు, గురజాడ లిద్దరూ భిన్న మార్గాలు త్రొక్కినవారే! 'లలిత' పండితులలో కూడా ఒకవిధమైన భావపరివర్తనము కల్గించినది. దానికి సుబ్బారావుగారు భాషావిషయములో రామమూర్తి, అప్పారావు గారల మార్గము త్రొక్కక, చ్యుతసంస్కారముకాని భాషవ్రాయడము ముఖ్యకారణము.* అందుచేత రాయప్రోలువారు పండితులకు కూడా ఉపాదేయుడైనాడు. వెనకటి భాషా సారస్వత సంప్రదాయాలు వదలి నూతనత్వము కల్పించడము మంచిది కాదని ఆయన గ్రహించినాడు. పూర్వులను కూడా కలుపుకొనడము నవీనుల కవసరము. కాకపోతే సారస్వతానికి అనువృత్తి లేక సూత్రము తెగిపోతుంది. కొందరాధునికులు దీనిని గమనించడము లేదు.

ఇది యిట్లా ఉంచి యీనవ్యతకు పునాది వేయడమునుగూర్చి మరొక విధముగా చెప్పవచ్చు. తృణకంకణమే మొదట యీ నూతన మార్గానికి పునాది వేసినదనిగాని, నీలగిరిపాటలే పునాది వేసినదని గాని ఒప్పుకొనడానికి ఇంకొక విషయమును చర్చించడ మవసరము. వీరిద్దరిలో సారస్వత క్షేత్రమును దోహదముచేసి ఫలింపజేసిన వారెవరు? ఈవిషయము చర్చించవలసి వచ్చినపుడు రాయప్రోలు వారేనని చెప్పవలె.◆ కాలమునుబట్టి నిర్ణయించవలెనని నపుడుకూడా అప్పారావు గారికంటె సుబ్బారావుగారే మార్గదర్శి అని గమనింపగల్గుతాము.

---

* కాని భావనవ్యతాపాదనా విషయములో ఎంత దీక్ష వహించినాడో చూడండి: "పండితలోకమునకు నూతన భావపక్షపాతముదయించి తీరవలెను. ఆంగ్ల విద్యాభ్యాసకుల కేవల హృదయచ్ఛాయలకు స్వరూప వైచిత్రి నిర్మింపక విడువరాదు" ('స్వప్నకుమారము')

◆ కీ.శే. ఆచంట వెంకట రాయసాంఖ్యాయన శర్మగారు (1864-1933) తమ "కల్పలత' లో "చందమామ" మొదలగు ఖండకావ్యాలు రచించారని తెలుస్తుంది(1903-9)

ఆంధ్ర సర్వస్వము పుట : 306.

ఇట్లే "సరస్వతీ" పత్రిక (1903-8)లో కూడ ప్రకటింపబడినవట! ibid 306

పైవ్యాసములో ఆనుపూర్విని పురస్కరించుకొని అప్పారావుగారే నవ్యసాహిత్య బీజస్థాపకులయినట్లు అర్థము వస్తున్నది. కాని జాగ్రత్తగా చదివిన యడల నావాదనను సర్వస్వమునందలి వ్యాసకారుడు ముట్టలేదు. తత్పూర్వము ప్రకటితమైనను దాని నెత్తకుండుట ఆశ్చర్యం

అప్పారావుగారు సంఘసంస్కర్తే కాకుండా భాషాసంస్కర్త కూడ. సుబ్బారావు గారు కేవల కవితా మార్గ సంస్కర్త. ఈవిషయాన్ని ముఖ్యముగా గమనించవలె.◆ అప్పారావుగారు అభినివేశముతో వ్రాసినది 'కన్యాశుల్కము' గాని 'ముత్యాల సరాలు' గావు. ఆ 'కన్యాశుల్కము' వ్రాసినది వ్యావహారిక భాషావాదప్రచారము కోసమేననడము నిశ్చయము. నవ్యకవిత్వానికి మార్గము చూపవలెననిగాని, ('కొత్తపాతల మేలుకలయిక' అనినప్పటికీ) నేనట్లా చూపుతున్నాననిగాని, అప్పారావుగారికి అహంకారము లేదు. సుబ్బారావు గారట్లాగాక నవ్యత తీసుకరానలెననీ, ఆనవ్యతను ప్రచారము చెయ్యనలెననీ, అభినివేశముతో వ్రాసినారని యిదివరకే తెలుపుకున్నాము.

## రాయప్రోలు: మొదటి మార్గము

భాషావిషయములో రాయప్రోలువారి అభిప్రాయము సౌలభ్యమే, సాక్షాత్తుగా వ్యావహారికము వ్రాయక పోయినా, సామాన్యముగాను, సులభముగాను ఉన్నటువంటీ, అర్ధానుస్వార శకటరేఫ నిబిడము కానటువంటీ - ఒక విశిష్టశైలిని యీాయన వ్రాస్తాడు. ఈయన శైలికి శ్రవణ సుఖమే ప్రమాణము* ఆకారములోను, నేపథ్యములోనూ, ఈయన కళాదృష్టి గోచరమౌతూ ఉంటుంది. 'వాగర్థ ప్రణయము, ఈయనకు తెలిసినట్టు నవ్యులలో చాలమందికి తెలియదు శబ్దజాలాన్ని ఎట్టి సందర్భాలలో ఎట్టిదాన్ని ఉపయోగించవలెనో తెలుసుకొనడములో ఈయన చాల శక్తిమంతుడు. ఈయన వ్రాసిన కావ్యాలను గూర్చి యీాక్రింది వాక్యాలను గమనించండి:

"సుబ్బారాయకవి నైతికముగాను, సాంఘికముగాను, బారమార్థికముగాను రచించుటయేగాక దేశకల్యాణమునకు, విశ్వసౌభాగ్యమునకు తోడ్పడు రచనలుగూడ

---

◆ గురజాడ 'రివల్యూషను' తెచ్చిపెట్టితే రాయప్రోలు 'రిఫర్మేషను' తెచ్చిపెట్టినారని గమనించడము అవసరము — పి.వేం.హ

* మృదుల సరళాక్షరముల సమ్మేళ నాప్తి
నార్ద్ర నవనీత మార్దవమగును నుడువు
శ్రవణసుఖమిచ్చు సలలితోచ్చారణమున
భంగిమయటందు రీ పదబంధసరణి' — రమ్యాలోకము.

నొనరించుచున్నారు పరిశుద్ధంబగు ప్రేమస్వరూపంబును బ్రదర్శించుచు బద్ధానురాగ పరిణామపోషకములైన, "సరసములైన వావివరుసల్ తెలుపంగ సభేదరాగముల్, తిరముగ చాదుకో ప్రణయవీనులు', ఐన వృత్తమును 'వియోగమం దమృతమున్ విసము సమవృత్తులే' **అను** సిద్ధాంతమును వెలిబుచ్చినాడు తృణకంకణములో.

'కడుపు ఉంపపుగోతల ఘటించు, కష్టదైవమునుగూర్చి విలపించు' ప్రేమశాలియగు ముగ్ధబాలిక విషాదగాధ కష్టకమలలో సృజింపబడినది ప్రేరణధర్మమే పితృగృహ రక్షణమునకు దారిచూప శుల్కవాంఛాపరులగు సోదరులకు దివ్యసందేశము సంపుచునాత్మోపహార మొనర్చిన చరిత్రము 'స్నేహలతాదేవి'.✳ యాత్రార్థులూ దేవపూజ ప్రవణులై వెడలు బాలికల కిడిన నివాళింపు ' తెనుఁగుతోఁట'. కుమార ప్రేమ బంధురమతియైన యొక మాతృదేవి యాదేశము 'స్వప్న కుమారము◆ వివిధరస భూయిష్ఠంబై, రసవత్ పుష్పసమన్వితమై, అమృతమధురమైయున్న ఖండకావ్యము 'జడకుచ్చులు', ఈతని కావ్యముల నన్నిటిం బరించిన ప్రత్యేక వైలక్షణ్యము విస్పష్టమగును దేశకళ్యాణమునకు తోరణములు కట్టు పూర్వగాధల వర్ణించు నీతని పద్యములు రసతరంగములు"

- - భారతి. జూలై 1930.

ఇందుతో ఈయన వ్రాసిన దాదాపు అన్నిగ్రంధాలకూ విమర్శనము వచ్చినది. తుది మాటలో "ఆంధ్రావళి" ఉల్లేఖింపబడినది. ఇక మధుకలశ రమ్యాలోకాలున్నవి. శృంగార రసానికీ ఆముష్మికానికీ వంతెన, అన్యాపదేశానికి పరమావధీ అయిన "ఓమరుఖయ్యామున" కనువాదము "మధుకలశము". తన కవిత్వానికి లక్ష్యలక్షణభూతమై, సార్వకాలిక సారస్వత లక్షణాల నుగ్గడించు లక్షణకావ్యము "రమ్యాలోకము".✡

సుబ్బారావుగారు సారస్వతానికి చేసిన కృషిని స్పృశిస్తూ విశ్వనాథ వారిట్లా అన్నారు:

'సుబ్బారావుగారు వారి గీతనూతనత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి భాషను గురించి మాట్లాడడానికి వీల్లేకుండా చేసి, ఆమార్గంలో వున్న కొత్తదనము పండితులచేత కూడా కొత్తదనమని వొప్పించాడు" ఇది సత్యము.

---

✳ వేమూరి వెంకట రామనాధముగారు 'స్నేహలతాదేవి'పైన ఒక విమర్శవ్యాసము ప్రజామిత్రలో వ్రాసినాడు.

◆ గాదిరాజు వెంకటరమణయ్యగారు 'స్వప్నకుమార స్వరూప సందర్శనమ'ని ఒక వ్యాఖ్యా గ్రంధము వ్రాసి ప్రకటించినాడు.

✡ చూ. ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలో నేను వ్రాసిన 'రమ్యాలోకసమీక్ష'

రాయప్రోలును 'కవిబ్రహ్మ' అనవచ్చు. నూతన కవి సమయాలను సృష్టించినాడు.✳ వెనకటి నుంచీ వస్తున్న ఉపమా రూపకాలంకారాది సామగ్రి కాక క్రొత్తదానిని నిర్మించుకున్నాడు. తెనుగు పలుకుయొక్క మార్దవాన్ని చూపుతూ, మామూలుగా వాడుకుంటున్న అందమైన అనేక పదాలను పద్యాలలో పెట్టి వాటికి గౌరవ మిచ్చి భాషాసేవచేసినాడు. నుడికారానికి అచ్చమైన తెనుగుదనాన్ని అలవడచేసినాడు. నూతనత్వాన్ని ఏవగించే పండితులచేత తలలూపించినాడు.

ఇదివరకు సంభోగమే పరమావధిగాగల శృంగార రసానికి పావిత్ర్యము కల్పించి, అమలినముచేసి, సంభోగముకంటె విప్రలంభము అమలినమనీ, దానికంటె తల్లిబిడ్డల మధ్యనూ, సఖులమధ్యనూ ఉండేది శాశ్వతమై, స్వార్థరహితమై, పవిత్రమైనదనీ, అమలినతమమనీ సిద్ధాంతీకరించినాడు◆

ఒక ఉన్నతలక్ష్యం కలిగి, ఒక తత్వరహస్యాన్ని తాను కనుక్కొని సోదరుల

---

✳ 'విరి కన్నెలు సమర్తాడు కాలమందు'. 'దుఃఖరజస్సు స్ఖలనమంద'. 'విశ్వాసాశ్రువులు' 'కసుగందిన కవటాకన' ముదలైనవి కొన్ని.

◆ "విషయమయ మైన సంభోగ విధి జగాన
క్షయమ యయ్యు, రూపాంతర సంగ్రహమున
సుప్రజాతంత్ర నిర్వాహ సూత్రమగుట
తలచెదరు దంపతీ నిష్ఠ ధర్మముగనె
మూఢు లిచ్ఛయించెదరు సంభోగసుఖము,
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప నఙ్హాడెద ననడె యాంధ్ర
రసిక కులరాజు పండితరాజు మున్ను!
తీవెమీద సుతారంపు రీవి నిలిచి,
పగలబడి నవ్వు పువ్వుపై కెగయు అళిని
ప్రియుడు ప్రియురాలినట్లు చేర్చెనొక సుకవి
బిడ్డ తల్లిని భాతి కల్పె మరొకండు-
కులశుభాంగీ వయోధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి;
సాత్విక ప్రేమ కోశపేశలము లయిన
వత్సలామృత రుచులను వలచె నేడు." - రమ్యాలోకము

కియ్యవలెననీ, తనతోపాటు వాళ్ళనుకూడా కూడ గట్టుకుని పోవాలనీ, వ్యక్తిత్వముతో వ్రాసిన వాడీయన. ప్రకృతి తనకు సాక్షాత్కరించినట్లు ఆయన ఆమెను పరిశీలించి, ఆమె తత్వాన్ని గ్రహించి, దాన్ని లోకానికి విప్పి చెప్పినాడు. ఆశ్లీలమంటే పనికిరాని సచ్ఛీలముతో నిండిఉంటాయి కావ్యాలన్నీ. దేశ భాషాభిమానాన్ని వెదజల్లుతూ ఉంటవి. ఉత్సాహమే తప్ప దుఃఖ మెక్కడా కనపడదు. శృంగారార్చనమేగాని శృంగారానుభవముకాదు ఈయనకు ప్రాప్యము!✳ భాషాసేవ యీయన కొక తపస్సువంటిది:◆ ఈయనకు మాతృభాష యందు, మాతృదేశమందు ఉన్న అభిమానమూ ప్రీతీ నవ్యాంధ్రకవులలో చాలామందికి లేదు✡ ఈయన వ్రాసిన ఆంధ్ర ప్రబోధ గీతాలు, పద్యాలు నేటికిన్నీ మంచి ప్రచారములో ఉన్నవి.‡ ఈవిధముగా సుబ్బారావు గారిది ఒక మార్గము.

---

✳ "ఏతదమల సౌందర్యార్చనాతిరేక
మాత్మభావన,నానందమై ఫలించు"

◆ "భాషకంటె నవ్యులకు తపస్సు లేదు"

✡ "ఏ ప్రఫుల్లపుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో యిందు పుట్టినాడ!
కలదయేని పునర్జన్మ, కలుగుగాక
మధురమధురంబైన తెనుగుమాతృభాష"

"తెనుగు దనమే వారియందు మూర్తీభవించినది. ఉత్సాహపూరితమగు నుద్బోధము వారికలమును ఆశ్రయించి ఆనాడు పెన్నానదీ తీరమున ఈర్ష్యాద్వేషములతో కుమిలి పోవుచుండిన యాంధ్రులను కర్తవ్య పరాయణులనుగా జేసినది. జాతిని చైతన్యపూరితముగా చేసిన కవిత్వ మహత్త్వము వారిది." - దేవులపల్లి రామానుజరావు

‡ " ఏదేశ మేగినా ఎందుఁగా లిడిన
ఏపీఠ మెక్కినా యెవ రెదు రయిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గర్వమ్ము ....
అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించు నాడు
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగఁ
బలు శస్త్రశాలలు నిలుపునాఁడు,
విద్యానగర రాజవీధులఁగవితకు
పెండ్లిపందిళ్ళు కప్పించునాఁడు
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించునాడు.

# గురజాడ: రెండవ మార్గము

అప్పారావుగారు రెండవమార్గానికి మార్గదర్శి. ఆయన సంస్కార ప్రియత్వం, వ్యావహారిక భాషాభినివేశము కలవాడయినా చాలా సహృదయుడు. రసవేత్త. కళాభిజ్ఞుడు. మనస్తత్వ మర్మజ్ఞుడు. ఇందులకు ఆయన వ్రాసిన కన్యాశుల్కమే ప్రమాణము. హాస్యరసము ఈయన సొమ్ము చేసుకున్నాడు.

"కన్యాశుల్కం ప్రకృతి సాదృశ్యమూ, కదలికా, వ్యక్తిత్వమూ, పోను పోను గాంభీర్యమూగల అది ఒక తాత్కాలిక దురాచారహేళన నెపంగా రచింపబడినా కధాచమత్కృతీ, భావసారస్యమూ, పాత్ర చైతన్యమూ అందులో కలకలలాడుతూ ఉండడంవల్ల జనహృదయాలకి ఎక్కి నిల్చిన అపూర్వ ఆంధ్రశిల్పం. దానిలో పడ్డ ఒకటి రెండు పుంజీల స్థానిక పదాలవల్ల అది ఆంధ్రలోకాన్ని ఆకర్షింపక పోవడం జరగలేదు, సరిగదా, అట్లాంటివి ఉన్నా అది ఆంధ్రులకి హృదయమై చరితార్థం అయింది. హాస్యరసోత్పత్తికి సూత్రకారులు సూచించిన లక్షణాల కన్నింటికీ లక్ష్యాలు అందులో ఉన్నాయి. దాని స్వారస్యం భాషలోనూ, భావంలోనూ, పాత్రలలోను, సంఘట్టన లోనూ, కూడా చిమ్మి ఉంది. దానిలోని పాత్రలయొక్క గుణసమ్మేళనం, ఎవరినో చూచి ఒక్కొక్క పాత్ర చిత్రించారా అన్నంత స్వభావసిద్ధంగా అతుక్కుని, అటువంటి వాళ్లు మనకి నిత్యకృత్యంలో కనపడ వచ్చుననే విశ్వాసం కలిగిస్తుంది.......

కన్యాశుల్కం కూడా మృచ్ఛకటిక లాంటి సాంఘిక ప్రదర్శనమే గనుక మధురవాణి వసంతసేనని మనజ్ఞప్తికి తెస్తుంది. గిరీశం శకారుణ్ణి జ్ఞప్తికి తెస్తాడు. మధురవాణి వసంతసేనకి మల్లే హృదయం కలది అవడమే కాక, మాటమాధుర్యం కలదై ఇతరుల్ని దిద్ది సన్మార్గాన్ని పడేటట్టు చేస్తుంది. జ్ఞానాజ్ఞానాల కలయిక, సంప్రదాయాలలో గల శకారుడి రాక్షస హాస్యంముందు, అటువంటి కలయికే భాషలోకూడాకల, గిరీశం యొక్క తుంటరి హాస్యం మార్దవం అని తోస్తుంది!"

---

ఆంధ్రసంతతికే మహితాభిమాన
దివ్యదీక్షాసుఖ స్ఫూర్తి తీవరించె
నామహావేశ మర్దించి యాంధ్రులార
చల్లుఁడాంధ్రలోకమున నక్షతలు నేఁడు
మొదలైనవి

ఈయనను జానపదగీతాలు ఆకర్షించినవి. వాటిలో ఉండేనుడికారమూ, హృదయాకర్షకత్వమూ గ్రహించినాడు. మాత్రాఛందస్సులతో ఉండేగీతాలను గ్రహించినాడు. అవి చక్కనిజాతీయాలతో నిండిఉండడము చేత, అదివరకు నిరాదరింపబడుతూ, స్త్రీలకూ, నిరక్షరాస్యులకూ అనుకునే యిటువంటి గీతాలు చిత్తసంస్కారం కలుగుతూ ఉన్న యువకులను బాగా ఆకర్షించినవి. వాటికిచ్చిన 'ముత్యాల సరాలు'# మొదలైన పేర్లుకూడా యీయన ప్రతిభా సృష్టిలోనివే!◆ ఈయన గీతాలుకూడా సుబ్బారావుగారి గ్రంధాలవలెనే యువకులలో భావపరివర్తనము కలుగజేసినవి.

వెనుక నేను మనవిచేసినట్లు ఎవరిది వారి మార్గమే గాని ఒకరినిచూచి ఒకరు వ్రాయలేదు. అప్పారావుగారు సామాన్య గణఛందస్సులను గ్రహించి భావప్రధానముగా ఖండకావ్యాలు వ్రాయలేదు. సుబ్బారావుగా రప్పట్లో గీతాలనూ, వ్యావహారిక భాషనూ తలపెట్టలేదు. రెండు మార్గాలూ క్రొత్తవే!

పౌర్వాపర్యమానుషంగిక మని వదలి, యిద్దరినీకూడా నవ్యసాహిత్య పితృసమాను లనడము సమంజసముగా కనపడుతున్నది. ఈ రెండు మార్గాలూ క్రమముగా అన్యోన్య సహకారులై కలసి నవ్య సాహిత్య నది ప్రవహించినది. ఈ విధమైన రాయప్రోలు గురజాడల ఖండకావ్య గీతికారచనలనే రెండు మార్గాలను తరువాత వారు అనుసరిస్తూ వచ్చినారు. అను యాయు లెప్పుడైతే కన్పిస్తారో అపుడు ఆమార్గాలకున్న గౌరవము స్థిరమైనదనే భావించవలె. ఆ మార్గాలయొక్క ప్రవక్తలుకూడా విశిష్టస్థానము కలవారౌతారంటే విచిత్రమేమీలేదు. ఉండదు. ఇంక యీ రాయప్రోలు గురజాడలకు ఏర్పడిన అనుయాయులను గూర్చి తెలుసుకుందాము.

---

# "క్రొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా"

'ప్రేమకలుగక బ్రతుకుచీకటి' - 'మగడు వేల్పన పాతమాటది' బ్రతికి, చచ్చియు, ప్రజలకెవ్వడు బ్రీతిగూర్చునొ, వాడె ధన్యుడు' మొదలైన వాక్యాలలో దేశికుడువలె కన్పిస్తాడు. ఇతడు ప్రజాకవి.

◆ చూ: వావిళ్ళ సమ్మాన సంపుటములో వ్యాసము.

# ప్రథమానుయాయులు:

రామలింగారెడ్డిగారు మొదలైనవారు సుబ్బారాయ, అప్పారాయ మార్గానుయాయులు కొందరున్నారు. రెడ్డిగారు 'ముసలమ్మ మరణము' అనే ఖండకావ్యాన్ని 1900 సంవత్సరము నాటికే వ్రాసినప్పటికి అది అప్పట్లో ఎవ్వరినీ ఆకర్షించలేదు. కాబట్టి యువకులపైన ఆనాడు దీని ప్రభావము పడలేదనే చెప్పవచ్చు. కాని సుబ్బారావు గారి తృణకంకణ ప్రచురణము తర్వాత ఈ రెడ్డిగారి గ్రంథముమీదికి కొంచెము దృష్టి మరలినది. అంతవరకు రెడ్డిగారి ఖండకావ్యముగాని, 1914లో వ్రాసిన 'అర్థశాస్త్రాంకిత పద్యాలు' గాని యువజన మనస్తత్వ పరివర్తనములో భాగము తీసికోలేదు. అయినప్పటికీ ఈ ఖండకావ్యాలు కొంత నవ్యమార్గాన్ని అనుసరిస్తూ ఉదాత్తముగాను, రసవంతముగాను ఉన్న వనడానికెట్టి అభ్యంతరము లేదు. ఈ విషయాన్ని ఇంతటితో విరమించి, అప్పట్లో యీ సుబ్బారాయ, అప్పారాయ మార్గాలను అనుసరించిన వారిలో ముఖ్యులను గూర్చి తెలుసుకుందాము.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు (జననము 1893) ఈ మార్గాన మొదట కొంతసాధన చేసినవారిలో ఒకరు. విశ్వనాథవారన్న మాటలు చూడండి:

"వారి శమీపూజా, పెనుగొండపాటా, మొదలైనవి తెలుగులో చావవు"

ఇటువంటి గొప్ప మేధావి కవిత్వాన్ని వదలివేసెననగా ఆంధ్రసరస్వతి దుఃఖించవలసిన విషయము. ఇటీవల యీయన 'శాలివాహన సప్తశతి' పరివర్తనము చేసి శ్రీనాథుడి గ్రంధమంతరించినదే అనే లోటును తీర్చినాడు.* ఈయనను గూర్చి భారతి (వృష. కార్తీకము) ఏమని అన్నదో గమనించండి:

"నాటకోపన్యాసములలో శర్మగారు విశదీకరించిన 'లయ' విచారము చాలా పరినిష్ఠితమైనది. 'రాయలనాటి రసికత'యను నుపన్యాస మాతని సారస్వతము కుదాహరణము. 'గాన' మీతని సంగీత పాండితికనుప్రాసము. 'నాచనసోముని' యుపన్యాసము లాతని సాహితీ పటిష్ఠత కన్వాదేశము. 'నాటకోపన్యాసము' లాయన పరీక్షదృష్టికి కర్కశతార్కిక దృష్టికి నిక్షేపములు. 'వేమన' యాతని సర్వస్వము. గద్య

---

* గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి అనే నవ్యుడుకూడ సరళమైన శైలిలో సప్తశతిని అనువదించినాడు

రచనలో శర్మగారిని మించిన వారాంధ్రదేశమున లేరు" ఇప్పుడు మైసూరు విశ్వవిద్యాలయములో ఉన్నాడు.

అబ్బూరి రామకృష్ణరావు (జననము 1896) గారిని గూర్చి యిదివరకు కొంచెము ముచ్చటించినాను. ఈయన సంస్కారము అజన్మముగా ఉన్నవ్యక్తి; ఆంగ్ల కవితారీతులను బాగా పరిశీలించినాడు. ఈయనకు ఉత్సాహము, సంతోషమేగాని, దుఃఖము బాధపెట్టేది కాదు; దుఃఖములోకూడా నవ్వేవ్యక్తి. కాయబారి శరీరము పొట్టి గిరజాలు. మచత చెడని మాటు. ఆకర్షవంతంగా ఉంటాడు. మద్రాసునుంచి మైసూరు వలస వెళ్ళినాడు. అక్కడ కొంతకాలముండి ఆంధ్ర విశ్వవిద్యాలయము లోనికి వచ్చినాడు. ఈయన విద్యార్థిగా ఉన్నపుడే యీయన వ్రాసినకావ్యాలు పరనీయ గ్రంధాలుగా నిర్ణయింపబడినవంటే యీయన ప్రతిభ ఎంతటిదో ఆలోచించండి. 'మల్లికాంబ', 'ఊహాగానం' అనే కావ్యాలు, 'నదీసుందరి' అనే నాటికా ఈయన కృతులు. రాయప్రోలువారి కవిత్వము ఈయనను లోగొన్నది. ఆ ప్రోద్బలమువలన ఈయన కావ్యాలు ఉద్బుద్ధాలైనవి. అబ్బూరి వారివలన దరిమిలా యువకులనేకులు కవితాభిరుచి అలవరచుకున్నారంటే అతిశయోక్తికాదు.

పింగళి లక్ష్మీకాంతం (జననము 1893) కాటూరి వేంకటేశ్వర రావు (జననము 1895) గారలు కూడా యీప్రకృతి కవిత్వము చేత ఆకర్షింపబడినవారే పీరిద్దరూ జంటకవులు. వీరి సంస్కారానికి చెళ్లపిళ్ళవారి శిష్యత్వము వన్నె తెచ్చినది. వీరి హృదయాలుకూడా నవ్యకవిత్వానికి దోవతీసినవి. వీరు 1915 - 1919 లో వ్రాసిన 'సంక్రాంతి-తొలకరి' అనేవి నవ్యమార్గానికి చెందినవే. వీటిని 'జానపద కావ్యా (Pastoral poetry) లనవచ్చు. వీరి యీకావ్యాలు నవ్యాంధ్రసాహిత్యములో కొన్ని తొలకరి గ్రంధాలనడములో ఎట్టి సంశయము లేదు. మళ్ళీ వీరిని గూర్చి ముందు తెలుసుకుంటాము.

ఇంతకు పూర్వమే అడివి బాపిరాజుగారు (జననము 1895) 'తొలకరి' అనే కావ్యాన్ని వ్రాసి 1922 లో ప్రకటించినాడు. చదువుకునే దినాలలోనే యీయన

నవ్యకవిత్వాన్ని సృజించటము ప్రారంభించినాడు. ఈయనకూడా తనచుట్టూ ఉన్న యువకులను ఆకర్షించి గేయాలు, పాటలు అనేకముగా రచిస్తూ ఇతరులచేత వ్రాయిస్తూ ఉండేవాడు. ఇతనిది బాలుని చిత్తవృత్తి. ఆబాలగోపాలమూ ఆనందపరిచే పాటలను వ్రాస్తాడు. అభినయములో వాటిని పాడి వినిపిస్తాడు. ఆర్ద్రహృదయుడు. లోకములో ప్రతి సన్నివేశమూ ఇతని హృదయములో హత్తుకొని పాటరూపేణ తిరిగి వస్తుంది. ఇతని హృదయవీణకున్న తంత్రులు అతిసున్నితమైనవి.

రాజమండ్రిలో 1915 ప్రాంతములో కూర్ల్రేగారికి శిష్యుడుగా ఉండి "అభినవాంధ్ర సాహిత్య" మనేపేరుతో ఒక పత్రిక పెట్టి కొన్ని మాసాలు నడిపినాడు. దీనికి సంపాదకుడుగా కవికొండల వెంకట్రావు గారుండేవాడు. 1912 నాటికే బాపిరాజుగారు గేయాలు వ్రాయడములోను, నవలలు ప్రారంభించడములోను కొంత సాధన చేసి నాడు. అయితే నవలలకు చిలకమర్తి వారి ధోరణి నచ్చిందా లేదా అనే ఆనాటి పరీక్ష! పాటలను పల్లెటూరి పాటల వరుసలలో నడపడమే సరిదా! 'గ్రంథాలయ సర్వస్వము'లో ఆపాటలను ప్రచురిస్తూ వచ్చినాడు ముత్యాలసరాల ప్రభావము బాపిరాజుగారి పైనా లేకపోలేదు. కూర్ల్రే ప్రభావము మాత్ర మితనిపైన అపరిమితముగా ఉన్నదని చెప్పవలె.* అటు చిత్రలేఖనములోను, ఇటు కవిత్వము లోను ప్రతిభను చూపించిన నవ్యుడు బాపిరాజు.

కవికొండల వెంకటరావుగారు (జననము 1892) కూడా ఆదినాలలో కవితారచన ప్రారంభించిన వాడే. మొదట్లో ఇంగ్లీషులో కవిత్వము వ్రాయడము మొదలుపెట్టి తర్వాత తెలుగులో పాటలు, గేయాలు వ్రాస్తూ వచ్చినాడు. జానపద కవిత్వము (Pastoral Poetry) ఎక్కువగా వ్రాయడములో సాధన చేసినాడు కవికొండల. అప్పటినుంచీ ఇప్పటిదాకా అవిచ్ఛిన్నముగా గేయాలు వ్రాస్తూ గురజాడ మార్గాన్ని విస్తృతము చేసినాడీయన అనవలె.

---

* 'నేను చదివిన కళాశాల ప్రిన్సిపాలుగారైన ఆస్వాల్డు కూర్ల్రేగారు, ఉత్తమ కవులు, ఉత్తమ చిత్రకారులు, యమునా గంగా స్వరూపమై, నా యీజీవితాన్ని ప్రయాగను చేశారు.'

చూ: 'బాపిరాజుగారి 'కవిత్వానుభవాలు' - మీజాన్ 13-8-'44

దువ్వూరి రామిరెడ్డి గారు◆ 1917-1919 ప్రాంతములోనే తలయెత్తడము మొదలు పెట్టినాడు. 'నలజారమ్మ అగ్నిప్రవేశం' (1917), 'కృషీవలుడు' (1919) అనేవి యీయన వ్రాసిన ప్రథమ కావ్యాలు. 'కృషీవల కావ్యములో కర్షకుడి జీవితాన్ని బహుసంసపంతముగా చిత్రించినాడు. ✻ 'నలజారమ్మ' కావ్యము పతివ్రతా చరిత్ర. 1920 సంవత్సరానికి 'జలదాంగన' వ్రాసినాడు. కట్టమంచివారి 'ముసలమ్మ మరణము' దువ్వూరి రచనలకు ప్రోద్బలకమైనట్లు తెలుసుకోగలుగుతాము. దువ్వూరి కవి తానే అంగీకరించినాడు దీనిని. 'కవికోకిల' అనే బిరుదాన్నిచ్చి ఈయనను గౌరవించిన దాంధ్రదేశము. కజిన్సు అనే మహాశయుడీయన కవిత్వాన్ని అత్యంతముగా కొనియాడినాడు. ఇతనిని గురించి 'శ్రీవాత్సవ ' వ్రాసిన వాక్యాలను గమనించండి:

"దువ్వూరి రామిరెడ్డి ప్రకృతి ఉపాసకుడు-ఆగర్భ శ్రీమంతుడు అయినా నిరుపేద. నిరాడంబర జీవితము చవిచూచినవాడు. నవనాగరిక పట్టణవాసి. అయినా గాని స్వచ్ఛందమైన గ్రామసౌభాగ్యాన్నే అభిమానించుకొన్నాడు. ఆంగ్లవాఙ్మయాల అమృత మాధురులూ, సంస్కృత సాహిత్యంలోని మేలి తెరగుల అలవరచుకున్నాడు. శాస్త్రము-విజ్ఞానము కూలంకషముగా లరచి-నూతన భావాల సైతము తన జిలుగు నుడికారములో తేనెతోడ రంగరించి తెలుగు జాతీయతకు కొత్తయందము కొని తెచ్చినాడు కొత్తరుచులు నేర్చినా, భావగాంభీర్యాన్ని భాషామాధుర్యంతో పులిమి-అన్వయ దోషంతోనో - అర్ధకారిన్యంతోనో అగమ్యగోచరం చేసే "భావకవుల" చికిలితనం రామిరెడ్డిగారిలో లేదు. తేటతెల్లని సూదిమాటలతో చప్పున మనస్సునకు హత్తుకొనేరీతి చేప్పే చాతుర్యం ఆయన శైలిలో ఉన్నది. అందుకే ఆయన సర్వజన సులభుడు.

---

◆ ఇటీవల ఈయన కాలధర్మము పొందినాడు

కట్టమంచివారు పీఠికలో దీనిని (Pastoral Poetry)లో చేర్చి ఏమన్నారో గమనించండి.

"ఇందు వస్తువూ, వర్ణనాకూడా, స్వాభావికములై కర్షక జీవితమును ప్రతిబింబింప జేయుచు హృదయము నాకర్షించుచున్నవి .. (కవితకు మేలైన యన్యకర్మములు) ఉన్నవి యనుటకు ఈ 'కృషీవలుడు' ను, అబ్బూరి రామకృష్ణారావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన యువకులు విరచించి యుండెడు నవ్యకావ్యములు ప్రమాణములు".

✻ "రామిరెడ్డి కర్షకకవి. ఆంగ్లంలోని Pastoralism అనే ప్రకృతి కవితను - కర్షక జీవితాన్ని యధా తధంగా అమృతప్రాయంగా తెనుగునాట వెలయజేసిన ప్రకృతి కవి. ఈయన లోని జిగి-గాంభీర్యం జిలుగు తనము-సౌకుమార్యము ఎంతమంది ప్రకృతి గీతాలు రాసిన కవులకు అలవడింది? దానికి ముఖ్యకారణం రెడ్డిగారి అనుభవసిద్ధి కావచ్చు అట్లే - కధా కావ్యాలు వ్రాయుటలో రెడ్డిగారిదే అందెవేసిన చేయి."

ప్రజాకవి. కవితా సౌందర్యానికి కావలసినది ఉక్తిచమత్కృతులతో పాటు చిత్తశుద్ధి, వ్యక్తిత్వము, శైలీవాదము. మూడూ కలిగిన కావ్యాలే కలకాలం నిలువ గలిగేవి"

నవ్యమార్గానుయాయులలో దువ్వూరికవి కూడా ఒకడని గ్రహించవలె.

వెంకట పార్వతీశ్వర కవులను కూడా ఈసందర్భములో పేర్కొనవలె. ఈ జంటకవులు సుబ్బారావు, అప్పారావుగారలలో ఎవరినీ అనుసరింపలేదనే అనిపిస్తుంది. అప్పారావుగారి భాషాతత్వాన్ని తమ "హారావళి" లో నిరసించినారు. కాని గీతపద్య 'గుచ్ఛాలలో చక్కని శైలిలో నవీన మార్గాల కొన్ని ఖండకావ్యాలు రచించినారు. కనుక వీరినికూడా నవ్యమార్గ ప్రవర్తకులలో చేర్చవలె. వీరి "ఏకాంతసేవ" నవ్య కావ్యమే. "భక్తుడు ప్రణయినీ స్వరూపమున పరమేశ్వరుని గూర్చి పాడిన దివ్యగానమిది". దీనిలోనిది హృదయాకర్షవంతమైన రచన! వీరి కవిత్వము స్వతంత్రమైన దయినా, ఖండకావ్య గీతికా రచనను బట్టి వీరిని యీ అనుయాయులలో స్మరింపవలసి వచ్చినది.

నింజమూరి రంగాచార్యుల వారిని గూర్చి వెనుక ముచ్చటించినాను ఈయన రచించిన గీతాలు చాలాతక్కువ. కాని ప్రచురించిన రెండు మూడు అచ్చముగా బసవరాజు అప్పారావుగారి నాటిని మరపించేటట్లు ఉంటవి *

తుదకు బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావుగారలున్నారు. వీరిలో బసవరాజు అప్పారావుగారు (1894-1933) భావోన్మాది. అప్పారావు సన్నని దేహము; ఈతనిదేహ మెంత మెత్తనో మనస్సూ, భావమూ అంత మెత్తనిని; మనస్సు పసిపిల్ల వాని దానివలె వంకరలు లేనిది, చిత్తవృత్తి ప్రేమపూరితమైనది, ఎప్పుడు సుఖమేకాని దుఃఖము లేదతని మనస్సులో; ఆశేగాని నిరాశ ఎన్నడూ లేదు. తానెంత ఉదారుడో అందరూ అంతే ననుకునేవాడు. అందుచేత కొందరితనిని పిచ్చివాడనీ, ఇతనికి చిన్నతనమనీ నవ్వేవారు. కాని నిజానికి ఈయన ఎవి కాలానికంటె 15 సంవత్సరాలు ముందు పుట్టినాడని చెప్పవలె! తన కాలానికింకా ఎవి భావాలు క్రొత్తవి!

---

* ఒకటిరెండు రాసి ఉపసంహరించుకున్న వారిలో నే నెరిగియున్నది నింజమూరి రంగాచార్యులుగారే! ఇటువంటి వారెంత మందో ఇంకా దేశంలో ఉండవచ్చును. - విశ్వనాథ

మద్రాసులో చదువుకునే రోజులలోనే గీతాలల్లడను ప్రారంభించినాడు 1916లో పట్టభద్రుడైనాడు. ఈయన కొన్నాళ్ళు విశ్వదాతగారి అనుగ్రహము వలన భారతి-ఆంధ్రపత్రికలకు సహాయ సంపాదకుడుగా ఉన్నాడు. 1925-1926 లలో మద్రాసు లాకాలేజిలో చదివి, 1926లో బెజవాడచేరి న్యాయవాద వృత్తిలో ప్రవేశించినాడు 1932లో ఆవృత్తిని విసర్జించి పత్రికా నిర్వహణోద్యోగములో చేరడానికి ఢిల్లీ వెళ్ళినాడు అనంతరము 1933లో ఆంధ్రదేశాన్ని దుఃఖములోనుంచి వెళ్ళిపోయినాడు.‡ జీవించిన దినాలు కొద్ది అయినా ఆధునిక సారస్వతములో స్థానమేర్పరుచుకొని పోయినాడు.

బసవరాజు అప్పారావు వ్రాసిన గేయాలు అసంఖ్యాలు వీనిలో కొన్నిటిని డిగవల్లి వేంకట శివరావుగారు ఒకచోట చేర్చి 'అప్పరాయ గీతములు' అను పేర (యీయన పోయిన తర్వాత) ప్రచురించి లోకానికి ఉపకారము చేసినాడు. ఈయన వ్రాసిన గేయాలలో చాల ప్రసిద్ధిపొంది ప్రజలకు చిరపరిచితాలైనవే. 'గుత్తివంకాయ కూరోయి బావా', 'కొల్లాయి గట్టి తేనేమి, మాగాంధి కోమటై పుట్టి తేనేమి?' 'ఒంటిగా నుయ్యాల లూగిలివా కృష్ణ' - 'నల్లవాదే గొల్ల పిల్లవాదే" "మామిడి కొమ్మను అల్లుకొన్నదీ మాధవి లతొకటీ" మొదలైన గేయాలు ఆంధ్రుల సొత్తు అయిపోయినవి.§ 'ఆంధ్రకవిత్వ చరిత్ర'మని అప్పారావుగారొక వాఙ్మయ చరిత్ర 1921లోనే వ్రాసినాడు.

‡ బలురు బరువు మోయలేక
చిలికి చినికి డస్సివాడి
ఫికరుపుట్టి పారిపోయి
ఒకటి యేతోటలోనో

పాట బాడుతుండగ నా ప్రాణి దాటి యేగెనా?
ప్రాణి దాటి యేగుతుండ పాట నోట మోగెనా?

దిగులూ విచారము లేకుండ పెదవులమీద కవిత్వము ఉండగా ప్రాణి దాటి పోవాలని తాను పైన కోరుకున్నట్లే జరిగినది

§ ఈయన పాటలు యిపుడు సినీమాల్లో విరివిగా గ్రహిస్తున్నారు 'గుత్తొంకాయ' పాట భరత నాట్యానికి వాడుతున్నారు తుదకు ఈయనవని చెప్పకుండా యీయన పాటలు ఇతరులవని చలామణీ చెస్తున్నారు సినిమాలో! ఇంకా ఇంతకంటె యీయన పాటలకు యోగ్యతాపత్రం కావాలా? - ఆంధ్రపత్రిక 25-10-40.

వ్రాసిని 1932లో వావిళ్ళ వారచ్చు వేయించినారు. అయితే ఏమి లాభము? తాను వ్రాసిన గ్రంధానికి పోలిక లేదని చివరకుదుఃఖించి నట్లు కన్పిస్తుంది.∫ ఇతని 'సెలయేటి గానము' సంపూర్ణముగా గురజాడ వారి మార్గావలంబి. గేయాన్ని గ్రహించి ముద్దులు మూటకట్టే తీరు శియాలుగల వ్యవహారములో ఉన్న భాష వ్రాసినాడు. భాషా, పద్ధతీ కూడా అత్యుత్తమాలు. ఆదర్శకాలున్నూ. † నవ్యసాహిత్య నిర్మాతలలో ఒకడై తనపేరుకు శాశ్వత స్థితి కలుగజేసుకొనినాడు!

ఈ నవ్యమార్గ విషయములో యీ వింశతిసంవత్సరాలలోనే ఒక గొప్ప సంగతి జరిగినది. అది యావదాంధ్ర సారస్వతాన్ని తల్ల క్రిందు చేసినది. "యెంకి పాటల"* నెరగని ఆంధ్రు డుండడని గట్టిగా చెప్పవచ్చు. 'ఇవీ, వీటిని వ్రాసిన నండూరి సుబ్బారాయ కవీ (జననము 1895) సారస్వత క్షేత్రములో ఒక హిమాలయ పర్వతమంత పదవిని సంపాదించి భూమ్యాకాశాలకు వంతెన కట్టినారు. ప్రథమాప్పారా (గురుజాడ) యోపజ్ఞకమైన నవ్యాంధ్ర గీతాస్రవంతి, ద్వితీయాప్పా రాయ (బసవరాజు)హృదయసీమలో పడి, పొంగి, పార్లి, నండూరి సుబ్బారాయ హృదయ

∫ "అబ్బే, నే వ్రాసిన పుస్తకం కాదిది. ఎవరు వ్రాసిందో; ఇదేం గొడవ-అంటూ సణుక్కుంటూ Proof లు దిద్దటం మొదలెట్టాను" - బసవరాజు లేఖ, భారతి 1933 ఫిబ్రవరి.

† 'శ్రీ బసవరాజుగారి వాణి ఆరోజుల్లో మధురంగా వినిపించిన వాటిలో వకటి. ఆయన పలుకుబడి గుండెకు సూటిగా ఉండేది. ఆయన కొన్ని కావ్యాల్లో హృదయాన్నే మాటల్లో పెట్టేవాడు వర్డ్సువర్తు కవి వలె ఒక ఆవేశం వస్తే దివ్యంగా పాడి తక్కినప్పుడు ఛామంగ రాసేవాడు' - విశ్వనాధ సత్యనారాయణ

ఆంధ్రుల జాతీయములైన యాచార వ్యవహారములకు చక్కని రూపుకట్టుటకు బసవరాజు అప్పారాయ కవి మొదట ప్రయత్నించినాడు .. ఆయన వ్రాసిన నాగుల చవితి - వటపత్రశాయి - గుత్తొంకాయ - మొదలైనవి చక్కని ఉదాహరణములు. - పిల్లలమఱ్ఱి.

తన వాణిని గూర్చి తానే అప్పారావిట్లా చెప్పుకున్నాడు: "మా కవితా కన్య చిన్నతనమునుండియు రాగిణి, భావనోద్దీపిత, గానలోల, రసజీవిని" అని!

* ఎంకిపాటలకు అనుయాయులు అనేకులు అగుపిస్తున్నారు 'పిల్లలమఱ్ఱి' కాపు పాటలు అనీ' చిరంజీవి పాటలుకొన్ని, ప్రయాగ నరిసింహారావు వ్రాసినవి, భాగీ నారాయణమూర్తి లంబాడీల మీద వ్రాసినవి' ఇలాంటివే.

ఎంకిపాటలపైన గాలిదుమారం వచ్చినది. దాన్ని అణగ గొట్టడానికి ఆదినారాయణశాస్త్రి, అడవిబాపిరాజు గారలు ప్రయత్నించి ఎంకిపాటలను సారస్వతములో నిలబెట్టినారు.

క్షేత్రాన్ని ఫలవంతముచేసి దానిలోనుంచి శాశ్వత గీతామృతాన్ని ఉద్భవింపచేసినది! ఇప్పటి కిది గురుపరం పర! ఈకార్యములో తృతీయఅప్పారావు (పాటిబండ) చెయ్యికూడా పడింది.

1917-19 నాటికి నండూరి సుబ్బారావుగారు క్రైస్తవ కళాశాలలో చదువుతూ ఉండేవాడు. నల్లగా, గుండ్రనిమొగము; ఏదో కొంచెము సారస్వతప్రేమ ఉన్నవాడనుకునేవారముగాని ప్రథమప్పా రావు, (గురజాడ) ప్రధను సుబ్బారావు (రాయప్రోలు) గార్లాకర్షించినంత మా హృదయతంత్రుల నాకర్షించ లేదు. కాని-

"Full many a gem of the purest ray serene,
The dark unfathomed caves of ocean bear,"

అన్నాడు గ్రే మహాకవి. ఏపుట్టలో యేపామున్నదో! ఆయన వ్రాసుకున్న ఈక్రింది మాటలు చూడండి:

ఈపాటలు నేను మద్రాసులో క్రైస్తవ కళాశాలలో పట్ట పరీక్షకు చదువుకునే దినాలలో (1917-18) వ్రాయ మొదలెట్టినాను. అప్పుడు నా అదృష్టంవల్ల మ రా శ్రీ అధికార్ల సూర్యనారాయణరావుగారి (జానకీపతి) స్నేహభాగ్యం లభించుట, ఆయనతో కలిసి వాసంచేయుట, కలిగింది. నన్నంతకు మునుపే సారస్వత విషయాల్లో అంతో యింతో తరిఫీదుచేయుచున్న మా బసవరాజు అప్పారావు కూడా అక్కడే వుండేవాడు వారితో ముచ్చట్లకు మ. రా. శ్రీ. పాటిబండ అప్పారావుగారును వచ్చుట మామూలు వారందరూ యెవరి రచనలను గురించి వారు సొంపుగా మాట్లాడు కుంటూంటే నే నొకప్రక్క కూర్చుని ఎస్తుపోయి వినటం రివాజు నకనాడు ట్రాంబండిలో కాలేజీనుండి వస్తుండగా, గొంతులో సన్నని రాగం బయలుదేరింది దానిని నాలో నేను పాడుకోవాలని సాహిత్యం చేసుకోబోయాను ఎప్పుడో విన్న పదం లాగున "గుండె గొంతుకలోన కొట్లాడుతాది" అన్న పల్లవి వచ్చింది. అదే మననం చేసుకోగా చేసుకోగా, ఇల్లు చేరేసరికి నేను రాసిన మొదటిపాట చెలింది '

ఇది చదువుతూంటే వాల్మీకి "మా నిషాద" కథ చదివినట్లున్నది. ఎట్లా విశ్వామిత్రుడు పుట్టకోవలోనుంచి ఊదిన "కూ" శబ్దాన్ని విని వాల్మీకి పుట్టలోనుంచి "కూజంతం రామ రామేతి" అంటూ లేచినాడో, అట్లా గొంతులో వినపడిన, మిత్రుల కవితాసల్లాపాలు వింటూ ఉంటే అవ్యక్తముగా ఉండి కాలేజీనించి వస్తూంటే చెవిలో వినబడ్డ "సన్నని రాగం" యెంకిపాటలకు "అ" కారమైనది. ఎట్లా "అకారఉకార మకారాత్మకమైన ప్రణవములోనుంచి సమస్త వేదాలూ పుట్టినవో అట్లాగే యీ

కావ్యవేదము పుట్టినది. ఇది ఒక విధముగా చూస్తే యీ కావ్యానికీ సుబ్బారావు ద్రష్టేగాని రచయిత కాడన్నట్లు కనిపిస్తుంది. ఈ క్రింది మాటల్ని గమనించండి:

"మా జానకీపతికిన్నీ,* అప్పారావుకున్నూ, యీపాట గద్గదికతో వినిపించాను. 'సెబాస్ వ్రాయ'మన్నాడు జానకీపతి 'నీవు నిత్యం వాడే భాష కాదది' యీ భాషసాయమున సత్యాన్వేషణం చేయలేవ' న్నాడు మా బసవరాజు అప్పారావు. ఏ సమయమున వెన్ను చరిచాడో, సూర్యనారాయణ! అప్పటి నుండియు 'యెంకిని' కవితారీతిని స్మరించుట నిముసమైన మనలేదు. అతడును అంత కంతకూ తన అభిప్రాయమును బలపరచుకున్నాడు. మా అప్పారావు రాను రాను తన అభిప్రాయం మార్చుకొని యిటీవల అతడును వల్లె అనుచున్నాడు. పాటలు అప్రయత్నంగా వచ్చేటట్లు ప్రసాదించిన యెంకికి కృతజ్ఞుడనా? ప్రోత్సాహంచేసి వీపు తట్టిన అధికార్లవారికా? కవిత్వ కళా రహస్యాలు తెలియ చెప్పిన మా బసవరాజు అప్పారాయనికా? ముప్వురకును!"

ఈ పైదానిలో బసవరాజు, రాయప్రోలు మార్గమువాడు కాడనీ, గురజాడ మార్గమువాడనీ అంతస్సాక్ష్యముచేత స్పష్టము. "నిత్యం వాడే భాషలో సిద్ధిపొందిన వాడు." గురుజాడప్పారా యోపజ్ఞనందుకున్నవాడు.

మా అప్పారావు (బసవరాజు) నండూరి సుబ్బారావుగారికికూడా "మా అప్పారావే" గాక "కవితా కళా రహస్యాలు తెలియచెప్పిన" వాడైనాడు. గురు శిష్యులు నవ్యాంధ్ర సాహిత్య మేలినవాళ్ళు. ఇప్పుడు బసవరాజు నొక్కమారు తల్చుకోండి! అతనిసేవ యెంతగా తేజరిల్లుతున్నదో! ప్రథమాప్పారావు దగ్గిర నేర్చుకున్నాడు. నండూరు సుబ్బారావును తయారుచేశాడు. ఈ గురు పరంపరలో పరమ గురువును మించిన వాడు గురువు. గురువును మించిన వాడు శిష్యుడు. వాడుక భాషలోనే సిద్ధిపొందినవాడు గురజాడ. వాడుక భాష, జానపద భాషలను రెంటిని గ్రహించి సిద్ధి పొందినవాడు బసవరాజు. వాడుకభాష ఊసు యెత్తుకోకుండా కేవల జానపదభాషలో సంపూర్ణ రససిద్ధిని సాధించినవాడు నండూరి సుబ్బారావు

ఈ సంవత్సరాల ప్రాంతములోనే ఆదినారాణ శాస్త్రిగారు చెన్నపట్నము వచ్చినారు. ఉత్తర దేశము మంచి సర్వవిద్యాపారంగతులై వచ్చి నిగర్వచూడామణై,

---

* అధికార్ల సూర్యనారాయణగారు చాల సహృదయుడూ, భాషాసేవచేసిన వాడునూ, పాటిబండ అప్పారావు సహృదయుడు, ఇతర వృత్తిలో ఉన్నా సరస్వతిని మరచినవాడు కాదు

యిన్ని విద్యలు వీరిలో యెట్లాఉన్నాయా అనుకునేటంత సన్నని శరీరము గలిగి, అనర్గళమైనధారతో మాటాడా వ్రాయా శక్తిగల పంచాగ్నులవారు అద్భుతవ్యక్తి.*

వీరు దక్షిణదేశము రావటము కూడా నవ్యసాహిత్య నిర్మాణానికి సంబంధించిన ఘనకార్యాలలో ఒకటి!

ఈ ప్రథమవింశతి సంవత్సరాంతానికి వీరేకాక ఇతరత్రా కూడా ఈ మాదిరి అవ్యక్త మధురగానము వినబడుతునే ఉన్నది. † కాని దాని కింకా రాజమార్గ మేర్పడలేదు. ఖండకావ్యము తలెత్తి వ్యాపించడము మొదలు పెట్టినది!

---

* ఈయన పరిచయము నాకు 1917 సంవత్సరములో నేను వారివద్ద కౌముది చదివే శిష్యుడుగా ప్రవేశించినప్పుడు కలిగినది.

† చూ॰ 'అభినవకవిత' అనేవ్యాసం భారతి జనవరి 1946

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 2

# సాహిత్యములో సంప్రదాయ సంస్కృతులు

## సంప్రదాయములు - సంస్కృతి

పారంపర్యముగా, అనుశ్రుతముగా, తరతరాలుగా, అనుస్యూతముగా, వచ్చే కొన్ని నమ్మకాలయొక్కగాని, అభిప్రాయాలయొక్కగాని, కర్మలయొక్కగాని, సమూహానికి సంప్రదాయమని చెప్పవచ్చును. ఇట్టివి కొన్ని కుటుంబాలలో, జాతులలో, ఉండనచ్చును. "కుటుంబ సంప్రదాయము" "జాతి సంప్రదాయము" మొదలైన పదాలు సామాన్యముగా వాడుకలో మన మెరుగుదుము. అవి అంటే ఆ కుటుంబాలకు జాతులకు చాలా ఆదరము. వారు వానిని చాలా పవిత్రముగా ఎంచుకుంటారు. కొన్ని ఆచార వ్యవహారాలుకూడా ఈ సంప్రదాయములో అంతర్భూతాలుగా ఉండవచ్చు; ఆ కుటుంబాలయొక్క జాతులయొక్క నిత్యజీవితానికి సంబంధించిన ప్రతి విషయములో సూత్రప్రాయముగా ప్రవహిస్తూ ఉంటుంది. మతానికి సంబంధించినవి మత సంప్రదాయాలు. భాషకు సంబంధించినవి భాషా సంప్రదాయాలు. ఆచారానికి సంబంధించినవి ఆచార సంప్రదాయాలు. సాహిత్యానికి సంబంధించినవి సాహిత్యసంప్రదాయాలు. ఈ సాహిత్య సంప్రదాయాలను గూర్చి వెనక కొంత ముచ్చటించినాను.

ఈ సంప్రదాయాలు ఒక జాతికి సంబంధించినవి అయినప్పుడు ఆ జాతి యొక్క సంస్కృతిపైన ఆధారపడి ఉంటవి. 'సంస్కృతి' అనగా సంస్కారము; ఇంగ్లములో "కల్చర్" అనే మాటకు సమానార్థకముగా ఇప్పుడు వాడుతున్నారు. ఈ సంస్కృతి భిన్నజాతులలో భిన్న రూపముగా ఉంటుంది. ఈ సంస్కృతి వల్ల

సంప్రదాయమువల్ల* జాతికి ఉపకారములున్నవి. కాని చాలాకాలమైపోయిన తర్వాత ఈ సంస్కృతి సంప్రదాయాలు ఘనీభవించి జాత్యభివృద్ధికి ప్రతిబంధకాలు కావచ్చు.

* సంప్రదాయ శవం' అని ఒకనవ్యుడు ఒకపాట రచించినాడు కొన్ని చరణాలను అనువదిస్తాను

సంప్రదాయపు కుష్ఠురోగం
జాతి భేదపు పక్షవాతం
నీకు పెద్దల వారసత్వం
నాకు వద్దని చాటవోయీ.
చచ్చిపోయిన సంప్రదాయపు
శవము కౌగిలి విడువలేవా?
శవము చుట్టూ విప్లవాగ్ని
జ్వాల లవిగో చూడలేవా?
మనిషి నెత్తురు చవులు మరిగిన
మతమునకు చితి పేర్చినామోయ్
కాల కీటక భుక్తశేషపు
తాళ పత్రములని తేవోయ్
విద్యలను బ్లాకు మార్కెటులో
విక్రయించిన నీచ నరులకు
దేవు డెందుకు మతము లెందుకు
దివ్య కాంక్షా స్వప్నమెందుకు? -- మీజాన్ 23-7-44

అనుస్యూతార్థ మున్నది. దీనిలో ఉద్రేకమేగాని విచక్షణ లేదు. కవి తన ఆవేదనను తెలియపరిచినాడే కాని చరిత్ర తెలియని ముక్కుపచ్చలారని వాడని వ్యక్తమౌతున్నది. లోకములో "జాతి భేదపు పక్షవాతం" వాండ్లు "హుష్" అంటే పోయేది కాదు. ఈ భేదము ప్రపంచములో అంతటా ఉన్నది భిన్నరూపాలతో! ఆసంగతి రచయితకు తెలియదు. కనపడే కుళ్లు అంతామతమని భ్రమపడుతున్నాడీయన! ఏదో ఒక మతములేనివాడు సంఘశత్రువు. విద్యలు దాచుకుని స్వలాభము పొందుతున్నారని వ్రాస్తున్నాడు. వెనక ఏమోకాని అచ్చువచ్చిన తర్వాత సమస్తవిద్యలు ప్రపంచపు ఆస్తి అయిపోయినవి. సంప్రదాయము శవమైతే తత్సంప్రదాయాంతర్వర్తి నేమని అనవలె?

[రాధాకృష్ణ పండితుడనినాడు . "Our attitude to those whom we are pleased to call pimitive must be one of sympathy"

"The task of the civilised is to respect and foster the live impulses of backward communities and not destroy them"]

కాని యీ సంస్కృతి సంప్రదాయాలు కూడా కాలానుగుణముగా మారుతూ వస్తవి. మహామహులు తలయెత్తి జాతి సంప్రదాయ సంస్కృతులలో కొంచెము మార్పు తెస్తేనేగాని జాత్యభివృద్ధి నిరోధింపబడుతుందని గమనించి ప్రవక్తలై వాటి మార్పునకు యత్నిస్తారు. కాని ఒక్క రహస్యము. ఈ సంస్కృతి సంప్రదాయాలకు మూలభూతాలైన కొన్ని విషయాలుంటవి. ఏ మార్పు కూడా ఆ మూల సూత్రాలకు భిన్నము కాకుండా ఉంటేనేగాని అవి వర్ధిల్లవు. ఈ మూల సూత్రాలే ఆయాజాతులను ఇతర జాతుల నుండి వేరుచేసి పృథక్త్వాన్ని నిలుపుతవి. ఈ మూల సూత్రాలకు క్షతివస్తే జాతి యొక్క పార్థక్యము నశిస్తుంది. కాబట్టి బుద్ధిమంతులైన నాయకులు ఈ సంగతిని గమనించవలెను. 'తాము భాషా సాహిత్య మత విషయాలలో చేసే, చేయబోయే, చేయవలెననుకునే, మార్పులన్నీ కూడా మూలసూత్రాలకు భిన్నము గాకుండా చేయవలసియున్నది* నశిస్తే ఏమి? అనే నాయకునికి నేనెట్టి ప్రత్యుత్తరాన్నీ ఇయ్య లేను. ఆయన "పాండిత్య ప్రకర్ష" "మూలచ్ఛేది"గా ఉన్నదని మాత్రము చెప్పగలను. ఒక చెట్టుపైన నిలుచుని ఆ చెట్టు మొదలు కొట్టివేయడ మెట్టిదో ఈ సంప్రదాయ మూలచ్ఛేదన మట్టిది!

ఒక జాతి సంప్రదాయ మెప్పుడూ ఒకే విధముగా ఉండదు. ఇతర జాతి మత సంస్కృతి సంఘర్షణమువల్ల, అది అప్పటప్పటికి మారుతూ ఉంటుంది. పూర్వము ప్రయాణ సౌకర్యాలు తక్కువగా ఉన్నప్పుడు ఈ మార్పు చాలా ఆలస్యముగా వచ్చేది. ఇప్పుడు మార్పులు త్వరగా వస్తున్నవి. అసలు ఈ మార్పులకు చాలా కారణాలున్నవి. లోకములో జన సంఖ్య హెచ్చుతున్నది. రాజులకు రాజ్యకాంక్ష పెరుగుతున్నది. జనసంఖ్య పెరగడముచేత దేశము చాలక ఇతరదేశాలను కనుక్కొనడము, వాటిని ఆక్రమించడము తటస్థించినది. రాజ్యకాంక్ష చేత రాజులు

---

ఇటీవల యువకులకు ఎప్పుడూ, పేగులు, శవాలు, అని తగలపడేమంటలు, దానిలోనించీ వచ్చే ధూమం, దానినించీ వచ్చే వాసన, మొదలైనవి తప్ప మనస్సులలో ఆర్ద్రత ఎండిపోయినది!

"Leaders of Hindu thought and practice are convinced that the time requires not a surrender of basic principles of Hinduism but a restatement of them with special reference to the needs of a more complex and mobile order."

Sir S. RADHAKRISNAN

నూతన దేశాలను జయించి తమ సంస్కృతిని అక్కడ వ్యాపింప చేస్తారు. ఈ రెండు పనులు అనాదిగా జరుగుతున్నవి. ఈరెండూ వలసలకు వ్యాఖ్యకారణాలు. కొలంబసు అమెరికాను కనుక్కున్నాడు. అప్పటినుంచి జనసంఖ్య హెచ్చిన ఐరోపాఖండానికి ఊపిరి విడిచినట్టు అయినది. దారయసు, అలెగ్జాండరు మొదలగు చక్రవర్తులు దండయాత్రలు మన దేశము పైకి దండెత్తివచ్చినట్టు మనచరిత్రలు తెల్పుతున్నవి. ఈ దండయాత్రలవలన యవన ప్రోద్బలము మన దేశముపైన పడినది. ఈ విధముగా అనాదినుండి ప్రతిదేశము ఇతర దేశస్థుల సంస్కృతి ప్రోద్బలానికి పాలవుతూనే ఉన్నది. కొన్నిటికి ఒత్తిడి ఎక్కువగా కలిగినది. కొన్నిటికి భిన్నజాతుల ఒత్తిడి కలిగినది. ఈ విధముగా సంస్కృతులలో భిన్నత కలిగినది. కలుగుతున్నది. సామాన్యముగా బలవంతమైన సంస్కృతి దుర్బలమైన దాన్ని ముంచి వేస్తుంది. అదికూడా బలము కలదైతే పరస్పర ప్రోద్బలము కలిగి ఉంటవి. ఈ విధముగా అమెరికాలో అదివరకు ఉండే సంస్కృతి ఐరోపీయుల సంస్కృతి సంపర్కముచేత నశించిపోయినది. దాదాపు ఎక్కడనైనా మారు మూలల ఉన్నా ప్రచ్ఛన్నముగా ఉండవలసినగతి పట్టినది.* రాజవిద్వరముకూడా దానికి ఒక ముఖ్య కారణము. మన దేశములో కొండలలో కొన్ని జాతులున్నవి. అవి ఇతర సంపర్కము తక్కువ కావటముచేత వాళ్ళ అనాగరిక సంస్కృతి ఇప్పటివరకూ అలాగే ఉన్నది. ఇటీవల కొంచెము కొంచెముగా సంపర్కము కలుగుతూ ఉండటముచేత వాళ్ళ దుస్తులు మొదలైన వాటిలో మార్పులు కలుగుతున్నవి. అలాగే మతమూ, భాషలూ కూడాను.

కొన్ని జాతులు బహుకాలము సంపర్కము కలుగటముచేత పరస్పరము కలిసిపోయి, ఒక సంకీర్ణసంస్కృతి పొందుతవి. అలాగే వారి సాంప్రదాయాలలోకూడా సంకీర్ణత వస్తుంది. ఆజాతివారే ఇతరత్రా సంపర్కము లేక వెనకటి సంస్కృతి సాంప్రదాయాలనే కాపాడుకుంటూ ఉండవచ్చు. అప్పుడీ భిన్నజాతులు రెండూకలిసి

* ఆస్ట్రేలియాలోకూడా అంతా ఆఫ్రికా ఖండములో యింకా కొన్ని జాతులు తమ ప్రాచీన సంప్రదాయాలు కలిగి ఉన్నవి అనికూడా మిషనరీ సంపర్కమువల్ల కొంత క్రమముగా మారుతున్నవి.

వచ్చిన సంకీర్ణ సంస్కృతి మరి ఒక మూడవ సంకీర్ణ జాతికి తావిస్తుంది. పశ్చిమ హిందూ ప్రాంతములో "కచ్చిమీమ"నులని ఒకముసల్మాను తెగున్నది. వారి ఆచార వ్యవహారాలు చాలావరకు హిందువులవే! ఒక కాలమందు వీరు హిందువులై మతాంతర గ్రహణముచేత వారి సంస్కృతిసంప్రదాయాలు కొన్ని సంకీర్ణములుగా ఉన్నవి. జాతి సాంప్రదాయాలు నూతనమత సంప్రదాయాలతో కలిసి మెలసి ఉన్నవి. ఐరోపీయులు, హైందవులూ కలసి రెండు జాతుల కంటే రంగు వగైరాలలో భిన్నత కల్గిన ఒక సంకీర్ణజాతికి పుట్టినది. శాస్త్రవేత్తల అభిప్రాయము ప్రకారము వెనక ఎలాగ ఉన్నా ఇప్పుడు మాత్రము సంపూర్ణముగా ప్రత్యేక రకము కల్గిన జాతులు భూమండలములోనే చాల తక్కువగా ఉన్నట్లు అభిప్రాయ పడుతున్నారు. మన హిందూ దేశములో "మాది సంకీర్ణము కాదు" అని చెప్పుకునే జాతి లేదని పండితుల అభిప్రాయము.† ఇలాగ ఉన్నప్పటికి ప్రత్యేక నాగరకతా సంప్రదాయాలు ఉన్న జాతులు ఇప్పుడు కూడా ఉన్నవి

ముసల్మాను ప్రవేశానికి పూర్వమున భారత దేశానికి అనేక కారణాలచేత అనేకజాతులు వచ్చినవి. వారి సంస్కృతి నాగరకతా సాంప్రదాయాల సంపర్కము కలిగి ఉన్నది. మొదటిలో వచ్చిన జాతులలో ఆర్యులు చాలా బలవంతులూ, నాగరతా సంస్కృతులు కలవారున్నూ, వారి సంస్కృతి సంప్రదాయాలు క్రమముగా దేశమంతటా ఆసేతు హిమాచలము వ్యాపించినవి. తుదకు కొండజాతులు కూడా కొంతవరకు వీటికి తోడైనవి; తరువాతవరకు యవనులు, హూణులు, మొదలైన అనేక జాతులు వచ్చినవి. వారి సంస్కృతి సంప్రదాయాలు ఆర్యుల వాటిని జయింపలేదు. కాని కొన్ని మార్పులు మాత్రము కలిగించినవి. మతములో కాకపోయినా శాస్త్రాలలో, కళలలో, భావాలలో, సాహిత్యాలలో చాలామార్పులు కలిగినవి. ఇవన్నీ పరిశోధకులు చూపుతున్నారు. అదివరలో ఉద్భవించిన మతాలన్నీ దేశీయాలు. బౌద్ధము, జైనము, వైష్ణవము, శైవము, శాక్తము, మొదలైన మతాలన్నీ కూడా ఆర్యమతముమీద ప్రోద్బలము కలిగించి తరువాత క్రమముగా దానిలో

† See Risely

లీనమై పోయినవి. తుదకు వీరశైవముకూడా లీనమై పోయినది.,† ఈ సమ్మేళనము కలిగినప్పటికి సంస్కృతి, సంప్రదాయాలూ దాదాపు ఏకముగానే ఉన్నవి. తుదకు బుద్ధుడు అవతారాలలో ఒకటి అయిపోయినాడు. బౌద్ధము యొక్క సత్యాహింసలు కర్మప్రధానమైన ఆర్యమతములో అంతర్భూతాలైనవి. అనార్యమతములో ఉండే విగ్రహారాధన ఆర్యబౌద్ధ మతాలను ముట్టడించినది. తర్వాత పురాణాదులు వ్రాయబడి యావత్తు భారత సంస్కృతి కాశ్మీరము నించీ కన్యాకుమారి దాకా ఏకమై పోయినది. దానికి మూలభూతాలైన సంప్రదాయాలే యావద్భారతములో ఉన్న హిందూసంస్కృతికి మూలభూతాలైనవి.

తర్వాత ఇస్లాము, క్రైస్తవమతాలు వచ్చినవి. ఈరెండూకూడా అదివరకు ఉండే సంస్కృతినీ మతాన్నీ మ్రింగవలెనని యత్నించినవి. చాలాశ్రమపడినవి. కాని కొందరు ప్రజలను తమ సంఘములో చేర్చుకొనడము తప్ప అంతకంటె ఏమి ఎక్కువగా చేయలేక పోయినవి. అమెరికా ఆస్ట్రేలియా ఉండే దేశీయ జాతులవలె ఏమాత్రము అల్పసంఖ్యాకమైనా, హిందూజాతి అయినట్టయితే అది నశించి పోయేదే! రెండు మతాలూ నూతనాలు కావటముచేతా, మతపరివర్తనమే సూత్రముగా కలవగుటచేతా, అనుయాయులలో ఉండే ఉత్కంఠ తీవ్రము కావడముచేత చాలా శ్రమపడినవి. పడుతున్నవి. కాని ఇతః పూర్వపు సంస్కృతి విశాలములు కావడముచేత వ్రేళ్ళు పాతుకొని ఉండడముచేత ఈ పరివర్తన కార్యమంతా పైపైనే జరిగినది. కాని కొంత జనసంఖ్యను మాత్రము లొంగదీసికొని రెండు బహుసంఖ్యాకములగు

---

† ఈ వివిధ మతాలను అధికారభేదం చేత అంగీకరించడము కలిగినది.

"The bewildering polytheism of the masses and the uncompromising monotheism of the classes are for the Hindu the expressions of one and the same force at different levels " (The Hindu view of Life. P. 32)

హిందూమత సంస్కృతిలో అధమం అయిన పశుహత్యనించీ నేనే బ్రహ్మను అనే వరకు అధికారభేదంచేత తరగతులు ఉన్నవి.

"The Aryan and the Dravidian do not exist side by side in Hinduism but are worked out into a distinctive pattern which is more an emergent than a resultant." (Ibid P. 40)

సంఘాలుగా ఏర్పాటు చేయకలిగినారు. రాజ్యము హస్తగతము కావడముచేత ఇంత వరకు చేయగలిగినారు. వీనిలో మళ్ళీ ముసల్మాను హిందూమతాలను కలపటానికి యత్నాలు జరిగి భాగవత సిక్కుమతా లుద్భవించినవి. కొంత సౌకర్యము వచ్చినది. ఈ రెండు మతాలలో పెద్దరెండుమతాల ఆచారవ్యవహారాలు నేపథ్యము సంస్కృతి సంకీర్ణాలైనవి. తుదకు ఈ రెండు నూతన మతాలు ఎక్కువ హిందూ సంప్రదాయాలే కలిగిఉన్నవి. ముసల్మానులలోకూడ హిందూమతా చారములుకల కొన్ని సంఘా లున్నట్టు వెనుక మనవి చేసినాను, క్రైస్తవ మతము కూడా కొంత మార్పు కలగ చేసినది. ఇప్పుడు మూడు మతాలు కలసిన ఒక సంస్కృతి ఉద్భవించ వలెను. అది జరుగునో జరుగదో తెలియదు. ఇస్లాము అనుయాయులు తుదకు హిందువులతో పాటు తాము దేశములో శాశ్వతముగా వసింపవలెను కాబట్టి ఏదో ఒక విధముగా సోదరులవలె మెలగవలసిన ఆవశ్యకత ఉన్నట్టు భావించడ మారంభించినారు. కాని పరివర్తనానికి వచ్చిన క్రైస్తవు లంతా పరివర్తనమే ముఖ్యోద్దేశ్యము కలవారుగా ఉన్నారు. వారు పరివర్తన కార్యమయిన తర్వాత తమ స్వదేశానికే వెడలవలె ననేదే దృష్టి. పాలకులు వీరు ఒకే మతస్థులు కావడముచేత, వారికి కూడా ఇచ్చట చిరస్థావరమేర్పాటు చేసుకో వలె ననే వాంఛ లేక దృష్టి పశ్చిమానికే మరలి ఉండటను చేత ఈ దృష్టి బలపడినది. ఇందుకు వారును పాలకులును కలసి దేశాన్ని వైజ్ఞానికముగా జయించవలె నని రెండు శతాబ్దాలు చాలా కష్టించినారు. సాధ్యము కాలేదు. మొన్నటిదాకా పాలనమే ఆశయము, ఇంకను మత పరివర్తనము ఆగలేదు. జరుగుతూనే ఉన్నది.

భారతీయులలో జ్ఞానవంతుల దృష్టికొంచెము వెనకకు తిరిగినది. భారతీయ సంస్కృతిపైన, సాంప్రదాయముపైన కొంత అభిమానము ప్రబలినది. భారతీయ సంస్కృతియొక్క ఉత్కృష్టతను చెప్పే సంస్థలు వ్యక్తులు దీనికి కారకులు. వారికి భారతీయులు సర్వదా కృతజ్ఞులై ఉండవలెను. రామకృష్ణామఠమువారు సంస్థగాను, ఆచార్య రాధా కృష్ణ పండితుః షు, మదనమోహన మాలవ్యా మొదలగువారు వ్యక్తులు గాను చేసిన చేస్తున్న సేవ అపారము. ప్రాచియొక్క తత్రాపి భారత దేశముయొక్క ప్రాచీన వైజ్ఞానిక వైభవాన్నీ, తాత్త్వికదృష్టినీ, ప్రపంచానికిచాటి, వైభవమూ, సుఖసక్తతా,

తత్సంపాదనకార్యమూ, ద్రవ్యకాంక్షా, తదార్జనయత్నమూ మొదలైనవి మానవాదర్శములు కావనీ, వానికొరకై శ్రమపడటము పరస్పర ద్వేషానికేగాని, సహకారానికి మార్గముకాదనీ, వాటిని వదలి అధ్యాత్మచింత, తన్మార్గాలైన సత్యాహింసలూ, అవశ్యాచరణీయాలనీ, భోగము కాక త్యాగమూ, ఐహికముకాక ఆముష్మికమూ, ఆదర్శాలుగా ఉండవలెననీ, తమ వ్రాతలద్వారా, ఉపన్యాసాలద్వారా పునః పునః ఉగ్గడించినాడు.

ఈ సంస్కృతీ సంప్రదాయాలేమిటీఅని ప్రశ్న? దాని చిహ్నాలను చెప్పవీలగునే కాని దానిని వర్ణించడము కష్టము. అది ఆసేతు హిమాచల మనుసరింపబడే ఆచారాలలోనూ, సేవింపబడే యాత్రాతీర్థాలలోనూ, అవలంబింపబడే మతాలలోనూ, ఉచ్చరింపబడే మంత్రాలలోనూ, అనుష్ఠింపబడే కర్మలలోనూ నమ్మబడే నమ్మకాలలోనూ, ఆచరింపబడే వ్రతాదులలోనూ, కొలువబడే దేవుళ్ళలోనూ, తుదకు కట్టు, బొట్టు, జుట్టు మొదలగు వానిలోనూ ఇమిడి ఉన్నది.

ఉత్తరాన ఉన్న కాశ్యాదిక్షేత్రములు దాక్షిణాత్యుల కెంత పవిత్రాలో, సేవ్యాలో దక్షిణాన ఉన్న వెంకటాచల శ్రీశైల రామేశ్వరాది క్షేత్రాలు ఔత్తరాహుల కంత పవిత్రాలు. ఇక్కడ ఉన్న శైవులదీ, వైష్ణవులదీ మతమూ అర్చనా క్రమమూ ఒకటే. స్నానసంధ్యాద్యనుష్ఠాన మంత్రాలు ముఖ్యమైనవి అంతటా ఒకటే. వివాహోపనయనాది పంచదశ కర్మలు అంతటా ఒకటే. దశావతారాలు మొదలైన నమ్మకాలు ఒకటే. వినాయక వ్రతాదులు అందరికీ సమానాలే. శివ విష్ణ్వాది దేవతలందరికీ ఒకటే. ఏపుణ్య క్షేత్రానికైనా, నదీపుష్కరానికైనా పోతే ఈ ఐక్యత కళ్ళకు కట్టినట్లు కనపడుతుంది. ఇంతకంటే సంస్కృతి సంప్రదాయైక్యము ఎక్కడనైనా ఉంటుందా? ఈ సంస్కృతి సంప్రదాయాలే సమస్త భారతీయులనూ ఏకముచేసే సంస్థలు. ఒకవేళ కాలకర్మవశముచేత, ఇంకా ఇతరకారణాలచేత వీరిలో వీరు కలహించినా, అది అన్నదమ్ముల కలహము వంటిదే కాని బద్ధశత్రువుల కలహము కాదు. ఆకలహము సంస్కృత్యైక్యతకు భంగకరము కాదు.

ఈసంస్కృతి సంప్రదాయాల ఐక్యతకు మూలభూతాలైనవి సూత్రాలేవి అనే ఒక ప్రశ్న వస్తున్నది. వానికి ఈ క్రిందివిధముగా చెప్పవచ్చు:†

(1) చతుర్విధ పురుషార్థ సాధనకు, వేదమే ప్రమాణముగాని అనవస్థకు సరిఅయిన తర్కముగాదు. దీనినే కొందరు ఆప్తవాక్యము, మరికొందరు శబ్దము, అని పరిపరి విధాలుగా అన్నారు. అంతే ఇతః పూర్వ మెవరైతే ద్రష్టలున్నారో వారు దర్శించిన విషయాలయొక్క ఘనీభవించిన ముద్ద వేదము. ఇది భ్రమ ప్రమాదాలకు లోనయ్యే ప్రత్యక్షానుమానాలవలె కాక స్వతఃప్రమాణము.◆ భారతదేశములో ఉండే ధర్మశాలలో రెండుభేదాలు. నాస్తికదర్శనాలు, ఆస్తికదర్శనాలు. వేదప్రామాణ్యాంగీ కారమే వీటికి కొలబద్ధ. ఆస్తిక్య మనగా వేద ప్రామాణ్యాంగీకారము. షణ్మతాలు § ఆస్తిక మతాలు. అర్హత చార్వాకాదులు నాస్తికాలు.

(2)సచ్చిదానంద* రూపుడగు పరమాత్మ ఒక్కడే. బహు దేవతాత్వము చూచి ఇదే భారత సంస్కృతి అని భ్రమ పడకూడదు. ఒక బంగారమనేక నగలుగా పరిణమించినట్లు ఒక్క మృత్తిక అనేక పాత్రలుగా నామకరణము చేయబడినట్లు ఒకటే అయిన పరమాత్మ అనేక రూపాలతో పేర్లతో వ్యవహరింప బడుతున్నాడు.*f*
ఏ పేరుతో కొల్చినా, ఏశక్తి ఉన్నట్టు కీర్తించినా, ఒక పరమేశ్వరుడికే చేరుతుందనటము లోకములో ఏకేశ్వ రారాధనపరు లందరికీ చోటివ్వటము ఎంత విశాలమైనదో భారత సంస్కృతి, అని దీనివల్ల తెల్లమౌతుంది. ఏకేశ్వరారాధనకు బహు ముఖత్వము

---

† Primer of Hinduism — D.S. SARMA

◆ ప్రత్యక్షేణాను మిత్యా వ్యాయ స్తూపాయో న విద్యతే! ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా॥ (సాయనభాష్యం)

"Authoritartianism is useful against the claims of scientific knowledge. There are aspects of reality where Science is insufficient "

(Idealistic view of Life, P. 78)

§ ఆయన సృష్టిస్థితి సంహారకర్త.

* న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, వేదాంత, మీమాంసములు.

*f* "ఏకం సద్విప్రా బహుధావదం త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః" "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" (ప్రతిదినము దీనిని సంధ్యలో జపిస్తారు.)

కల్పించినారు. బహుదేవతా తత్త్వము కలహకారణమైనా వాటిని మనము అతిశయోక్తి చేయనవసరము లేదు. చిల్లర పోట్లాటలు ఏ మతానుయాయులలోనూ, ఏ సంఘాల లోనూ ఉంటవి. తుదకు ఒక కుటుంబములోనే ఉంటవి.*f*

(3) కర్మ సిద్ధాంతము. అనగా మానవుడు తాను చేసుకున్న కర్మఫల మనుభవిస్తాడు. ఈకర్మ సిద్ధాంతము భారతీయ సంస్కృతికి విశిష్ట లక్షణము. "యద్భావి తద్భవతి'' ఏది ఎట్లా జరుగ నున్నదో అది అట్లా జరుగుతుంది. ఇది పురుషకారానికి వ్యతిరేక మెంతమాత్రమూ కాదు, మానవ ప్రయత్నము విఫలమై నప్పుడు, అన్యథా పరిణమించినపుడు, రెండు విషయాలకు కార్యకారణభావము రూఢిగా తెలియనప్పుడు అట్టి పరిణామమునకు తెలియని ఏదో ఒక అమానుష, అనిర్వచనీయమైన శక్తి ఉన్నట్లు భావించటము సహజము. తుదకు ప్రకృతి శాస్త్రజ్ఞులు పరమాణువాద మంతా చెప్పి చెప్పి చివర మెట్టులో ఈ పరమాణువుల నడక సమముగా ఉండదనీ, ఎటు నడుస్తాయో తెలియదని చెప్పినారు. ఒక శాస్త్రవేత్త సాక్షాత్తుగా కర్మ అనే అర్థమువచ్చే "ఫేట్'' (Fate) అనే పదాన్ని ఉపయోగించినాడు

---

*f* "Wars of religion which are the outcome of fanaticism that prompts and justifies the extermination of aliens of different creeds were practically unknown in Hindu India. Of course here and there there were outbursts of fanaticism but Hinduism as a rule never encouraged persecution of unbelief. Its record has been a clean one relatively speaking. It has been able to hold together in peace many and varied communities of men."

"It accepts the obvious fact that mankind seeks its goal of God at various levels and in various directions and feels sympathy with every stage of the search." (S.R.)

£ Eddington suggests that many of the laws of physics are statistical and no predictions about the behaviour of particular electrons can be made but only about their behaviour in the mass. (Realistic view of life - P 20)

"In brief, old age appears to mean nothing to the individual radium atom; it does not die because in some way, FATE knocks at the door."

(The Mysterious Universe-Jean, P.33)

"Thus although we are still far from any positive knowledge, it seems possible that there may be some factor for which we have so far found no better name than fate. (Ibid P.38)

"పురుషకారం" ఎక్కడున్నది అనేది ప్రశ్న. కర్మ మూడు విభాగాలు. ఆగామి, సంచితము, ప్రారబ్ధము. ఆగామి రాబొయ్యేది; సంచితము దాచి ఉంచినది, అనుభవించటమారంభించినది ప్రారబ్ధం; మొదలు పెట్టినందున ఎట్టిదానిని అనుభవించక తప్పదు. కాని ఆగామి సంచితాలు మానవుడు తన సత్ప్రవర్తనవల్ల, భగవత్కటాక్షము వలన, గెలవవచ్చును ఇలా కాకపోతే ఇక ముక్తికి తావే ఉండదు!

(4) మోక్షానికి మూడు మార్గాలు; కర్మమార్గము, భక్తిమార్గము, జ్ఞానమార్గము. కర్మమార్గమంటే ఫలాభిసంధి కాకుండా కర్మాచరణము. దీనినే కర్మయోగ మంటారు అనగా ప్రతి మానవుడు ఫలము సంగతి తలవకుండా స్వకర్మను నిర్వర్తించటము. ఇదే భగవద్గీతలో "తదేత్కర్మసన్యాసాత్కర్మయోగో విశిష్యతే" అనే వచనములో శ్రీకృష్ణుడు చెప్పినది. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" - ఈ సిద్ధాంతము మనస్సుకు స్థాయిత్వమిచ్చి సత్వాన్ని వృద్ధిచేస్తుంది. "యత్నము చెయ్యకుండా ఉండవద్దు. ఫలమపేక్షించవద్దు." ఫలము దైవాధీనము. దైవమనగా కర్మకావచ్చు. భగవంతుడు కావచ్చు. వెనుకటి కర్మవల్ల ఫలము పొందకపోవచ్చు. భగవంతుడు డన్యథా చేయవచ్చు. ఏలాగైనా మనస్తాపానికి తావులేదు.

(5) ప్రవర్తన చాలా ముఖ్యమైనది.† మనోవాక్కాయ కర్మలలో శుచి, ఇంద్రియ నిగ్రహము, సత్యాహింసలు-ఇవి ప్రవర్తనలో అవలంబించవలసిన ముఖ్యవిషయాలు. ఈవిధముగా నియతమైన జీవి తము శుద్ధసత్వాత్మకమై, భగవదనుగ్రహానికి పాత్ర మవుతుంది. ఈ గుణాలూ, దైవభక్తి, పాపభీతి, మొదలైనవీ కలిగి ఉండడము చాల మంచిదనీ, ఈవిధముగా జీవించిన భగవత్కటాక్షము పొందినవారి చరిత్రలూ. భిన్నముగా ప్రవర్తించిన వారి పతనాలూ, సుహృత్సమ్మితాలుగా, కథారూపాలుగా సులభగ్రాహ్యాలుగా చెప్పబడినవి, పురాణేతి హాసాలలో. శాస్త్రవేత్తలకూ పండితులకూ కాక, సామాన్య జనానికి ఉద్దేశింపబడినవి పురాణేతి హాసాలు. వీనిలో గాథలూ

---

† "For what counts is conduct and not belief."

(The Hindu view of Life. P 38)

"After all what counts is not creed but conduct- Religion is not correct belief but righteous living." (Ibid P 51)

మొదలైనవి తాత్కాలికముగా ఏవిషయాన్ని చెప్పదలచినచో తదనుగుణాలుగా ఉపదేశము చేతనూ, ఒక్కొక్కప్పుడు ఇవి పరమేశ్వరుడి లీలలుగా వర్ణింపబడి ఉండుటచేతనూ, నమ్మ శక్యముగా ఉండవు.† అంటే వాటిలో తుదకు చెప్పే సిద్ధాంతాన్నే గ్రహించవలెగాని ఆమూలాగ్రముగా అవి నిజమైన చరిత్రను చెప్పుతున్నవి అనుకొనవద్దు. ఎక్కువ జ్ఞానవంతులు కాని జనులకు ఉదాహరణ పూర్వకముగా చెప్పితే బాగా తెలుస్తుంది. ఏసు క్రీస్తు ప్రభువు కథలలో సత్యాలు బోధించలేదూ? అలాగే ఇక్కడనే!

(6) సంసార తరణమే మోక్షము. సంసార మనగా షడ్భావ వికారాత్మకమై నశ్వరమైన ఈ ప్రపంచము. జీవుడు తన కర్మచేత దీనిలోకి వచ్చి తన జ్ఞానముచేత కర్మను భస్మీభూతముచేసి శాశ్వతానందము పొందటము మోక్షము. ప్రతిజీవుడికీ ఇది ప్రాప్యము. ఆ స్థితినుంచి పునరావృత్తి లేదు.

పై సిద్ధాంతాలు* కాక ఈ క్రిందివిషయాలుకూడా ఈ సంస్కృతి చిహ్నాలు:

(1) వర్ణాశ్రమములు

(2) పురాణగాథలు, అవతారాలు

(3) విగ్రహారాధనము

(4) చతుర్విధ, పురుషార్థాలు

(5) గోపవిత్రత

---

†"Supernatural elemen." కూడా మనస్తత్వానికి వ్యతిరేకము కాదు. స్వల్ప విషయాలు మానవ జీవితాన్ని మార్చటము లోకము లో సామాన్యముగానే ఉన్నది.

జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షయతే, నశ్యతి.

* " These ideas are not the monopoly of the learned, they are shared in great measure by the man in the street. If you talk to a fairly intelligent Hindu about the Paramatma, Karma, Maya, Mukti and so forth -- you will find -- that the terms are familiar to him and that he has formed a rough working theory of their bearing on his own future." (S. Risely)

## వర్ణాశ్రమములు :

ఇది ఆర్య సంస్కృతియొక్క విశిష్ట లక్షణాలలో ఒకటి. ఆర్య సంస్కృతి ఎంతవరకు వ్యాపించినదో ఈ సంస్థ అంత విరివిగా వ్యాపించినది. ఈ సంస్థ మంచిదనీ చెడ్డదనీ వాదోపవాదాలు ప్రబలుతున్నవి, కొంత కాలమునుంచీ, తత్పరిణామము ముందు మనవి చేస్తాను. ఈ సంస్థ * అనేక కులకక్షలకు కారణము కావచ్చు. అయినది. ఒక కాలములో ఇదిచాల గొప్పసంస్థఅయి సంఘానికి చాలా సహకారి అయినది. ఇప్పటి పరిస్థితుల కది తగిఉండకపోవచ్చు. సాహిత్యములో ఇది ఒక స్థానమాక్రమించి ఉన్నది. దానిని తీసివేయటానికి వీలులేదు. చరిత్ర సహాయముతో విమర్శించే సహృదయుడికి ఇదికోపానికీ, అసూయకూ, కారణభూతము కాదు. కాకూడదు; ఒక్క సంఘములో ఉండే వర్ణవైవిధ్యము భిన్న సంస్కృతి సంకీర్ణత్వానికి తార్కాణము. ఒక కాలములో ఈ వర్ణాలన్నీ కలిసి మెలసి ఉన్నవి అంటే అది ఆ సంఘముయొక్క ఉత్కృష్టతను సూచిస్తున్నది. అప్పుడు అవసరమైన సంఘజీవన మిప్పుడు భిన్నమై వ్యక్తిప్రాముఖ్యానికి తావిచ్చిన దన్నమాట. ఈ వ్యక్తి స్వాతంత్ర్య మనే నూతన సిద్ధాంతము వచ్చి సంఘజీవితములో కల్లోలము కల్గించినది. భార్యాభర్తలమధ్య, తండ్రి కుమాళ్ళమధ్య, అన్నదమ్ములమధ్య, స్వామిభృత్యుల మధ్య ప్రజా ప్రభువులమధ్య, పోరాటము పెట్టినది. తుదకేమి గడించినది? స్వాతంత్ర్యేచ్ఛ. పైసంస్థ లట్లే ఉన్నవి. పోరాటమే పరిణామము.

---

* The institution of caste illustrates the spirit of comprehensive synthesis characteristic of Hindu mind with its faith in the collaboration of races and the co-operation of cultures. (The Hindu View of Life,' P. 937)

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" (భగవద్గీత)

"Every society consists of groups working for the fulfilment of the wants of the society - - The cultural and the spiritual, the military and political, the economic classes and the unskilled workers constitute the four-fold caste organisation." (Ibid P. 107)

"The sincerity of the teacher, the heroism of the warrior, the honesty of the businessman, and the patience and energy of the worker all constitute social growth. (Ibid P. 108)

స్వార్థపరులు పైసంస్థల అస్తిత్వాన్ని సృష్టించి పారతంత్ర్యము కల్పించినారని వారు వాదిస్తారు. ఇలావాదించేవారు కూడా పరార్థపరులు కాక స్వార్థ ప్రేరితులుగానే కనిపిస్తారు. ప్రజా సామాన్యానికి తాత్కాలిక కష్టాలుమాత్రము తప్పడము లేదు. వెనుకటి వర్ణవిభాగము సంఘస్వార్థ ప్రేరితమైతే యిప్పటి యీ స్వాతంత్ర్యేచ్ఛ వ్యక్తి స్వార్థ ప్రేరితముగా కనబడుతున్నది.* కాబట్టి ఏసూత్రము మీద ఈ వర్ణాలు పుట్టినవో ఆసూత్రానికి క్షతిలేకుండా మార్పు చేయటము న్యాయము.◆ అంతే కాని విషము వెడలగ్రక్కటము న్యాయముకాదు. దాన్ని కంఠస్థముగా చేసుకొని శివుడిని అనుకరిస్తే ప్రపంచానికి అత్యంత క్షేమము.

## పురాణగాథలు - అవతారాలు

పురాణాలలో వివిధ దేవతా ప్రాశస్త్యమూ, పరమేశ్వరుడు అవసరాన్నిబట్టి అవతారాలెత్తినట్టూ శివ విష్ణు పారమ్యమూ, సత్యాహింస సూత్ర ప్రాశస్త్యాన్ని ఉగ్గడించే గాథలూ, ఇంకా సచ్ఛీలవంతులగు స్త్రీ పురుషుల కథలు చరిత్రలు, మొదలయినవి చెప్పబడినవి.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ,
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"

అని నిర్వచనము. దీని ప్రకారము కొంత చరిత్రకూడా ఈ పురాణాలలో ఉన్నట్టు చెప్పబడినది. ఇది కొంతవరకు నిజమే! మత్స్య వాయు పురాణాల నుంచే

* "We are not so certain today as we were a century ago that the individualistic conception of society is the last word in social theory.

(The Hindu View of Life, P. 115)

◆ వర్ణధర్మము జన్మచేత పూర్వులు నిర్ణయించినారు అలా కాకపోయినా ఆధర్మాలు ఎల్లప్పుడూ ప్రత్యేక సంఘాలను ఆశ్రయించే ఉంటవి

"While we should remove the oppressive restrictions, dispel the ignorance of the masses, increase their self respect and open to them opportunities of higher life, we should not be under the illusion that we can abolish the distinctions of the genius and the fool, the able organiser and the submissive worker" (Ibid 114)

ఆంధ్ర సాతవాహనుల చరిత్ర మొదట బయటకు దీయబడి క్రమముగా చారిత్రకుల చేత అంగీకరింపబడినది. ఈ విషయమలా ఉంచండి. హరిశ్చంద్ర నలుల వంటి చక్రవర్తుల చరిత్రములూ, చంద్రమతి, దమయంతి, సావిత్రివంటి శీలవతుల చరిత్రలూ, జాతియొక్క సొమ్ములయి జాతియొక్క సంస్కృతిలో కలిసిపోయి నిత్య జీవితములో ప్రవహిస్తున్నవి. మానవ ప్రకృతికి పొరపడటము సహజమనీ, కాబట్టి ఇట్టి చరిత్రలు కేవల మబద్ధమనీ, పుక్కిట పురాణాలై నమ్మ శక్యాలు కావనీ, ఆదర్శ మనేది ప్రపంచములో ఉండజాలదనీ, ఏతద్గ్రంధ రచయితలు ఇట్టి కల్పిత గాధలను సృష్టించి మనలను మోసగించినారనీ, అవి ఎంత మరిస్తే అంత మనకు క్షేమమనీ, ఇట్టివి లేని జాతులు మనకంటే అభివృద్ధిలో ఉండటము చేత వానిని అనుకరించడము మంచిదనీ, మనస్తత్వ శాస్త్రమే ప్రమాణమనీ, ఆప్రకారము పాతివ్రత్య మనేది ఏకపత్నీవ్రతమనేది అసంభవమనీ మొదలైన భావాలు దాదాపు 30 సంవత్సరాలుగా పుట్టి ప్రచార మౌతున్నవి. కాని ఈ సంస్కృతికి ఇట్టి వితండవాదాలవల్ల ఎట్టి క్షతిలేదని గట్టిగా చెప్పవచ్చును. చెప్పేవాళ్ళ చిత్తవృత్తులను, "పరప్రత్యయ నేయత' ' నూ, వ్యక్తపరుస్తవి అట్టి అభిప్రాయాలు.

ఆశ్రమాలను గూర్చి ఎక్కువగా అభిప్రాయభేద ముండక పోవచ్చు. విద్యాభ్యాసకాలమూ, తర్వాత గార్హస్థ్యధర్మము నిర్వహించే కాలమూ, బుద్ధికి పరిణతి కల్గి ప్రాపంచిక భోగవైముఖ్యమూ, తుదకు జీవితాన్ని సంఘసేవ కొరకు వినియోగించటమూ, అనే క్రమశిక్షణము ప్రతివాడి జీవితములో ఉండవలెననే దానికి ఎట్టి వైముఖ్యమూ ఉండకూడదు. ఏతదనుసరణము జీవితానికి ఒక విధమైన స్థైర్యాన్ని ఇచ్చి మానవుని శీలానికి పరిణతి కల్పించి మానవుని ప్రపంచానికి ఉపకరించేటట్టు చేస్తవి. విద్యాభ్యాసకాలము విజ్ఞానాన్ని సేకరించటానికి ఉపయుక్తము. ఇహపర సాధకమైన విద్య నిజమైన విద్య. తరువాత "ధర్మప్రజాసంపత్తి" మానవుడి కర్తవ్యాలలో ఒకటి. మానవునికి ఏవయసులో ఏది అవసరమో ఈఆశ్రమ క్రమమువల్ల తెలుస్తుంది. యౌవనములో విషయైషిత్వము సహజగుణము. తత్పూర్తికి

వివాహమవసరము.* కొందరికి హిందూ వివాహమంటే నైరస్యము. అది “పితృజం” కాక “పితృపితామహాజం” అని ఒక మహామహుడు వాపోయినాడు. ఫలము “అమనస్కవివాహములు”ట! ఇలాంటిది స్వచ్ఛందవర్తనుల వాదము. ఒక్కమారు జనాభా తీసుకుంటే స్వతంత్ర వివాహాలెన్ని సత్పరిణామము కలవిగా ఉండి, సుఖగార్హస్థ్యానికి తావలాలుగ ఉన్నవో, పెద్దల అనుమతిచే జరుపబడిన ఎట్లున్నవో తెలుస్తుంది. రుచులలో, చిత్త వృత్తులలో ఆశయాలలో, అవసరాలలో ఇద్దరు వ్యక్తులకు సంపూర్ణముగా ఐక్యత కల్గుట అసంభవమని ఈ స్వచ్ఛందవాదుల కేల తోచలేదో ఆశ్చర్యము.† అట్టి ఐక్యత సాహిత్యములోనే ఉంటుంది అందువలననే ఉత్తమ సాహిత్యములో పాత్రలు సచ్ఛీలాలు కలవిగా చిత్రించబడతవి.

# విగ్రహారాధనము

మొదట ఆర్యసంస్కృతి కర్మకాండ మయముగా ఉండేది. తర్వాత తపస్సు క్రమముగా దానిలోకి ప్రవేశము కల్గించుకున్నది. కర్మకాండ, తపస్సు కూడా ప్రక్కప్రక్క నడుస్తూ ఉండేవి. ఇతః పూర్వమున్న శైవవైష్ణవశాక్త మతప్రభావము వల్ల క్రమముగా విగ్రహారాధన ప్రవేశించినది. అప్పటినుంచి విగ్రహారాధన ఘనీభవించినది. అది ఒక అవసరమైన మెట్టుగా పరిగణింపబడినది. బౌద్ధమువచ్చి సత్యాహింసలను ఆర్యసంస్కృతిని ఇచ్చినది. కాని విగ్రహారాధన బౌద్ధాన్ని జైనాన్ని కూడా ముట్టడించినది. తుదకు “బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః” అని బోధించిన శంకరుడుకూడా మూర్తిధ్యానము చేసి విగ్రహారాధనను అధికారి భేదముతో ఒప్పుకొని నాడు● చిత్తైకాగ్రతకు మూర్తిపూజ ముఖ్య సాధన

---

* "Monastic tendencies were discouraged until one had a normal expression of natural impulses. He who runs back from marriage is in the same boat with one who runs away from battle. Only failures in life avoid occasions fo- virtue. He (man) does not worship a bachelor or a virgin."

(The Hindu view of Life, P 83,84)

† "Except in the pages of fiction, we do not have a pair agreeing with each other in everything, tastes and temper, ideals and interests." (Ibid P 85)

● “భజగోవిందం”
“లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం”

మని పెద్దలంటారు. కన్నుమూసి ప్రార్థన చేయటము సర్వమతాలలో ఉన్న ఆచారము. కన్నుతెరచి ఉన్నంత కాలము ప్రపంచములో ఏదో వస్తువో, వస్తు జాలమో ఇంద్రియముద్వారా చిత్తములో హత్తుతుంది. కాని కన్ను మూస్తే లోపల ప్రపంచమంతా పరిభ్రమించటానికి అవకాశమున్నది. పరిభ్రమిస్తుంది కూడాను. ఈ ఏకేశ్వరారాధన చేసేవారు వారికండ్లు మూసుకొన్నప్పుడు లోపల చిత్తములో శూన్యముగా ఉంటుందో ఏదో ఒక మూర్తి కనబడుతుందో వారి అనుభవాన్ని గుండెపైన చేయివేసుకుని తెలియజేస్తే లోకానికి ఉపకారమవుతుంది. ఆంగ్ల, అరబ్బీ, భాషలు, ఫార్సీ భాష, ఇంకా ఇతర భాషలు విని తెనుగు కూడ విని, సంస్కృతము వినదు కాబోలు భగవంతుడు. కీర్తనలు వినే, గద్యాలు వినే, ఇతర విధ ప్రార్థనలు వినే, భగవంతుడికి సస్వరవేద భాగము తలనొప్పి కలిగిస్తుంది కాబోలు. ఈవిధముగా ప్రార్థనే దేవుడు వింటాడనటము కంటె పొరబాటు వేరే ఉండదు. లోకములో ఎందరు ప్రజలందరి మొరలు విని, వారి వారికి ఉండే దుఃఖాలను తొలగించి సుఖము కలిగించి వారికి మోక్షమిచ్చేటట్టు అయితే ఆయనకు ఎంత ఆఫీసున్నదో తెలియదు. అలాగే పెద్దకార్యస్థానము కలవాడైతే వారు వారు చేసిన పనులు నమోదుచేసి తగిన శిక్ష విధించటములో విప్రతిపత్తి ఏమి ఉంటుంది. సిరెట్టి పశ్చాత్తాపము పడకుండా దినదినమూ అవే పొరబాట్లు చేస్తూ ప్రార్థిస్తూ ఉంటే తృప్తి చెంది వారి పొరబాట్లన్నీ క్షమించటమా ముసలిదేవునిపని! అంతేకాని తప్పు పనులు చేయకుండా ఉండటము మన బాధ్యత కాదుకాబోలు* ఈ విషయములో ఒక మతానుయాయులు ఇతర మతాల వారిని చేసే హేళన లన్నీ నిరర్థకాలు! వీటిని ఎంత తలవకుండా ఉంటే అంతర్జాతీయ సఖ్యతకు అంత యుపయుక్తము. ఈ

---

* "The punishment for a desecrated body is an enfeebled understanding and a darkened soul. If we deliberately fall into sin, shutting our eyes to moral and spiritual light, we may be sure that in God's world sin will find us out and our wilful blindness will land us in the ditch. .. The past guilt cannot be wiped away by the atoning suffering of an outward substitute. Guilt cannot be transferred It must be atoned for through the sorrow entailed by self-conquest God cannot be bought over and sin cannot be glossed over "

Hindu view of Life.... 24-75)

సూత్రాన్ని మరిస్తే మత వైషమ్యము పెరుగుతుంది. ఒకజాతిలో సంఘములో ఘనీభవించిన ప్రాచీన సంప్రదాయాలను నేలుపెట్టి ఇతరులు చూపించటము పొరబాటు. ఆపని తదనుయాయులకు వదలితే మంచిది. అనుయాయులు కూడా ఈవిషయములో చాలా జాగరూకులై వర్తించవలె. ఏకేశ్వరారాధన ముఖ్యసూత్రముగా ఉన్న మతాలు ఎన్నిటితో భారతీయ సంస్కృతికి సంఘర్షణ కలగలేదు? మనవారే వీరేశలింగము వంటివారీ సంప్రదాయము మీద ఎందరు దండెత్తలేదు? పర్యవసాన మేమైనది? ఈవిషయము దిక్సూచికాదా? శూన్యాన్ని ప్రార్థిస్తే మనస్తత్వ శాస్త్ర ప్రకారము శూన్యాన్నే పొందటము తటస్థిస్తుంది. వద్దన్నా కళ్లు మూసుకుని ధ్యానములో భగవంతుడు ఉంటే ఆయనకు ఊహాను గుణమైన ఒక ఆకారాన్ని పొందుతాడు. ఇది తపస్సుచేసే వారికందరికి స్వానుభవము.

# చతుర్విధ పురుషార్థాలు

ఈపురుషార్థకథనము గొప్ప విషయము "ధర్మార్థ కామమోక్షములు" అనే వాక్యములో ఇరుప్రక్కల ధర్మమోక్షాలుండి మధ్య అర్థకామాలను ఉంచినారు. ఈఏరుసలో చాలా అర్థమున్నది. ధర్మము మొదటిది. ప్రతివ్యక్తి తన ధర్మాన్ని తాను అవలంబిస్తూ ఉండవలె. ధర్మము చాలా విశాలమైన పదము.* మానవజీవిత

* "ధర్మం" అనే శబ్దానికి ఈక్రింది అర్థాలన్నీ కనపడుతున్నవి (1) దానం (2) న్యాయం (3) పోలిక (4) స్వభావం (5) ఆచారం (6) అహింస (7) వేదోక్తవిధి (8) క్రతువు (9) పురుషార్థం. ఈక్రింది ఉదాహరణములు చూడండి.

1 బీదలకు ధర్మం చేయవలెను.
2. ధర్మం చేత ఊర్ధ్వలోకం లభిస్తుంది
3 ఇలా చేయటం నీకు ధర్మం కాదు.
4. ముఖచంద్రులకు ఆహ్లాదకరత్వం సమాన ధర్మం
5 ఆశ్రమ ధర్మాలు అవశ్యానుసరణీయాలు.
6 ఆవులకు పాలివ్వటం ధర్మం
7. ధర్మశాస్త్రం అవశ్యాచరణీయం
8 అహింసా పరమో ధర్మః
9 అథాతో బ్రహ్మ జిజ్ఞాసా

మంతా ఉపరిములో ఇమిడి ఉన్నది. మానవ జీవితమొక గదులవరుస కాదు. అది ఒక గోళము వంటిది. దానిలో కొంత తీసుకుంటే అసలు ఆకారానికి భంగము వస్తుంది కాబట్టి యావజ్జీవితాన్ని చుట్టుకుని ఉన్నది ధర్మము. అతని కోరికలు, యత్నాలు, తత్సాఫల్యాలు, దైనందినచర్య, ఆదర్శము తత్ప్రాపి ప్రయత్నములు, కామతంత్రము, దాన్ని తీర్చుకునేమార్గము, తుదకుమరణము, అన్నీ కూడా ధర్మానికి బద్ధమై ఉండవలె. లేకపోతే నాల్గోపురుషార్థానికి క్షతివస్తుంది. కాబట్టి ధర్మచ్యుతి చాలా అసత్కారము ఈ సూత్రప్రకారము మానవజీవితమెంత స్వచ్ఛము కావటానికి వీలున్నదో తెలుస్తుంది. ఆదర్శము మోక్షము. తత్ప్రాప్తికి ధర్మబద్ధమైన జీవితము అవసరము. జీవితములో శరీరనిర్వహణానికీ, గార్హస్థ్యానికి అర్థకామాలు అవసరాలు * “శరీరమాద్యంఖలు ధర్మసాధనం” కాబట్టి శరీరధారణానికి అర్థమవసరము. కామము మానవునికి సహజ గుణం. “ధర్మప్రజా సంపత్తి” కి వివాహమవసరము. స్వచ్ఛందత వ్యక్తి జీవితాన్ని అపవిత్రము చెయ్యటమే కాకుండా సంఘనీతికి కూడా భంగకరము. అర్థకామాలు ధర్మబద్ధాలుగా ఉండటానికి వ్యక్తులకు వివాహము నిర్ణయింపబడినది. ఏ వ్యక్తికి సహజధర్మమేదో వృత్తి తదనుసారముగా ఉండవలె. వివాహము వర్ణ గృహీతమై పెద్దల ఆశీర్వచనము పొందవలె. వ్యక్తి జీవితానికి శ్రేయస్కరము. కాబట్టి తురీయ పురుషార్థము కోరేవాడు ఈ ప్రకారమున జీవితాన్ని కట్టుదిట్టాలలో ఉంచు కొనటము అవసరము. ఈ ప్రణాళిక పూర్వుల దూరదర్శిత్వాన్ని వేనోళ్ళ చాటుతున్నది. వారికి ప్రవర్తన చాలా ముఖ్యము. శీల స్వచ్ఛత కోసము స్వచ్ఛందతను విడనాడినారు. జీవిత మొక్కొక కాలములో ఒక ఆశయము కలదిగా ఉండకపోతే దానిలో ఒకవిధమైన

---

* "Each individual in him has the sex and parental instincts, love of power and wealth, desire for the common good and the hunger for communion with the unseen These different activities react upon and modify one another. They function in interdependence in man's life. If life is one, there is one master science of life which recognises the four supreme ends, of Dharma or righteousness, Artha or wealth, Kama - artistic and cultural life, and Moksha or spiritual freedom The Hindu code of practice links art the realm of desires with the perspective of the eternal ..It binds together the kingdom of earth and heaven " (The Hindu view of life, P.79)

అపేక్షితత ఇస్తుంది. ఈవిధముగా క్రమశిక్షణ పొందిన మానవుడు సంఘాన్ని తనను కూడా ఉద్ధరిస్తాడు. అలా కానివాడు అడవిలో పూవువలె నష్టజీవనుడు అవుతాడు.

# గోపవిత్రత

భారతీయ సంస్కృతిలో గోవునకు గొప్ప ఉన్నత స్థానమున్నది. గో శబ్దానికి భూమి అని కూడా అర్థము ఉన్నది. భూమి సమస్త సస్యాలనిచ్చి పోషిస్తుంది మానవుడిని. గోవు కూడా త్రాగటానికి పాలు వగైరాలను, యజ్ఞానికి పాయసాదులను, వ్యవసాయానికి ఎడ్లను, ఈ ప్రకారముగా ఇస్తుంది. కాబట్టి పవిత్ర జంతువుగా పరిగణింప బడుతుంది. "గో బ్రాహ్మణేభ్య శ్శుభం భవతు" అని ప్రతి సంధ్యాకాలములో భారతీయుడు కోరుకుంటాడు. అనగా సంస్కృతి సర్వకామదాయి (కామధేను) వర్ధిల్లుగాక అని అర్థము. ఈ గో శబ్దానికి (ధర్మం) అనేక అర్థాలున్నవి అవి అన్నీ మనకిప్పుడు ప్రసక్తాలు కావు అనేక కారణాలచేత భారతీయులందరు గోవును పవిత్రముగా ఎంచుకుంటారు గోహత్య బ్రహ్మ హత్యవంటిది. నాశన మెట్టిదో సంప్రదాయ నాశనమట్టిది. గోరక్షణ కొరకు చాలా సంస్థలు పనిచేస్తున్నవి. కాని గోవు రహస్యముగా చాలా బాధలు పడుతున్నది; మన దేశము వ్యవసాయము ముఖ్యవృత్తిగా కల దేశము. కాబట్టి గోరక్షణము ప్రతి భారతీయుడికి ధర్మము. ఈవిధముగా ఈ సంప్రదాయము యొక్క సంస్కృతి యొక్క బాహ్య లక్షణాలు చెప్పినాను. ఈ విషయాలనన్నిటిని పోషించుకుంటూ అంతస్సును భద్రపరచుకుని అవసరాలైన మార్పులు చేసుకుంటూ, బంధువృద్ధిని, ఆత్మోన్నతిని పొందుతూ ఉండేవా డుత్తము భారతీయుడు.

# సంప్రదాయము - దాని విలువ

సంప్రదాయానికి ఇప్పుడు అన్నివైపుల నుంచీ దెబ్బలు తగులుతున్నవి. కాని హిమాలయ పర్వత శిఖరమువలె అది ఉన్నతమై వచ్చి ఆగిపోయేవే గాని లోనికి ప్రవేశించటము గాని శిరస్సుకు తగలటముగాని ఎన్నిటికీ జరుగనేరదు. ఈ సంప్రదాయము వయస్సు ఇంతవరకు అంతు చిక్కలేదు. ఈ దెబ్బలన్నీ తిరిగి వచ్చి

కాక్షేవాళ్ళకే తగులవచ్చును. తల్లిదండ్రులను పూజించటము ఎట్టిదో సంప్రదాయ రక్షణము అట్టిది. అలా చేయటమువల్ల ప్రయోజనమేమి? అని అడగవచ్చును.

(1) సంప్రదాయము ఒక జాతిని ఇతరజాతులయొక్క విశిష్టతను తెలియ జేయును. భారతీయులు ఆధ్యాత్మిక చింత ఎక్కువగా కలవారు. ఆంగ్లేయులు (బహుశః పాశ్చాత్యులంతా) ఐహికచింత కలవారు. భారతీయులు భోగము కంటె త్యాగానికి విలువ ఎక్కువగా కల్పిస్తారు. మహాత్మా గాంధీకి ఉన్న పలుకుబడికి అదే కారణం. భోగములో పోటీకి వీలున్నది. ఎందుకంటే భోగానికి అనవస్థ. కాని త్యాగములో పోటీకి వీలులేదు. దానికి అంతు ఉన్నది. అంతవరకు అందరు పోలేరు. పోయిన వాడు గౌరవస్థాన మవుతాడు. తృప్తి, మనశ్శాంతి, పెద్దలయెడ గౌరవ ప్రపత్తులు, మత విశ్వాసమూ మొదలైన వన్నీ భారతీయులను వేరు చేస్తవి. ఈ ప్రకారముగానే భాషా సంప్రదాయాలు భాషల యొక్క పృథక్త్వాన్ని తెలియచేస్తవి. తెనుగు అజంత భాష. అరవము తెనుగు సంబంధము కలదైనప్పటికి హలంతములు చాలా కలది. ఉత్తరదేశ భాషలలో అర్ధాక్షరాలు పదాంతములో ఉంటవి. ఇవి భాషా సంప్రదాయానికి దృష్టాంతాలు. ఎందరు మనుష్యులు కలసి ఉన్నా భారతీయుడు భారతీయుని తెలుసుకొనగలుగుతాడు. తెనుగువాడు సాటి తెలుగు వాడిని తెలుసుకుంటాడు. ఎందులో ఉన్నది? భారతీయుడిలో ఉండే భారతీయత్వమూ, తెనుగువాడిలో ఉండే తెనుగుతనమూ దీనికి కారణాలు; సంప్రదాయము, సంస్కృతీ యిరెండులకు విభాజకము.

(2) సంప్రదాయానుసరణము వ్యక్తికిగాని జాతికిగాని స్థైర్యాన్ని ఇస్తుంది. వారెట్లా నడవవలెనో త్రోవ చూపుతుంది. లేకపోతే త్రోవ కొరకు వెదకవలసి వస్తుంది; ఇప్పుడు మనలో కొందరు పూర్వము మీద ప్రత్యయము పోయి నూతన మార్గము నిర్ణయించుకొనలేని స్థితిలో ఉన్నారు. వాళ్ళగతే జాతి కంతకూ పట్టుతుంది. ఏదో నమ్మి ఆచరించే వాళ్ళకు మనశ్శాంతి ఉంటుంది. వీళ్ళకు సంశయముచేత దిగ్భ్రమచెందటము తటస్థిస్తుంది. కాబట్టి తండ్రి తాతలు తరతరాలుగా అనుసరించే జీవిత ప్రణాళికను అనుసరించటము శ్రేయస్సు. అట్లా చేయకపోవటమువల్ల పరంపరనూ, తమలంగరు ప్రదేశాన్ని మరవటమవుతుంది. సంశయము హెచ్చుతుంది.

“సంశయాత్మా వినశ్యతి” అని ఆర్యోక్తి. అట్టినాశాన్ని పొందకుండా సంప్రదాయము వ్యక్తిని, జాతిని కూడా కాపాడుతుంది. అన్ని చిత్తవృత్తులకంటె సంశయము చాలా చెడ్డది. అట్టివారి జీవితము లంగరు తెగి తెరచాప చిరిగిపోయిన పడవ మాదిరిగా సూటిఅయిన త్రోవ లేకుండా పోతుంది. ప్రతి ప్రజ్ఞావంతుడు తాను ద్రష్టనని కొందరు ప్రజలను వెంటవేసుకుని ఏదో కేకలు వేస్తూ వెళ్ళడము ఈ కాలపు అలవాటై పోయినది. సరి సూత్రాలు చూస్తే నాటి బీజాలు ఇక్కడ లేవు. అట్టివారు నాయకులు కావడము వారిని ప్రజలు కొందరు అనుసరించటము, గ్రుడ్డివారి వెంబడి వెళ్లే గ్రుడ్డివారి మాదిరిగా ఉన్నది. జాతికి ఇట్టిగతి పట్టకుండా సంప్రదాయము దిక్సూచిగా ఉండి త్రోవ తప్పితే సరియైన త్రోవను చూపిస్తూ ఉంటుంది.*f*

(3) సంప్రదాయము జాతియొక్క విజ్ఞాన సర్వస్వము. అట్టి దానిని నిరాదరణ చేస్తే మళ్ళీ మనము చరిత్ర మొదటికి రావలసి వస్తుంది. ఒక జాతి చరిత్ర శతాబ్దాల పరిణామము. అట్టి కొన్ని శతాబ్దాల చరిత్రల పరిణామము, సంప్రదాయము, చరిత్ర వద్దనే వారు, జాతియత వద్దనే వారే. సర్వమానవైక్యములో జాతీయత ఒక మెట్టు. మన సన్నిహితుల నుండి ఎక్కడనో ఉన్న వారితో నమ్మకాలలో ఐక్యము పొందినామనటానికి అర్థములేదు. మన కుటుంబానికీ సంఘానికీ దూరులై, అసంబద్ధులైన వ్యక్తులతో ఉద్దేశైక్యత పొందడ మింటికి చిచ్చుంటించడము వంటిది “ఉట్టికెక్కలేనివాడు స్వర్గాని కెక్కెక్కును.” సన్నిహితులను విడనాడువాడు ఎందుకైన పనికి వస్తాడా? తాను నిర్దుష్టుడై ఇతరులను వెలుతురు లోనికి తీసికొని వెళ్ళవలె. తానే చిత్తచాంచల్యముఉన్నవాడు, ఇతరులను ఎట్లా వెంబడి తీసుకుని వెళ్ళగలడు? తనకే నిశ్చితాభిప్రాయము లేక సందేహములో కొట్టుకులాడేవారు, ఇతరులను తరింపచేయగలరా? అందుచేత వ్యక్త్యభిప్రాయానికి దెబ్బ అని అనుకొనరాదు. వ్యక్త్యభిప్రాయ స్వాతంత్ర్యానికి సంప్రదాయము కంచవంటిది. దానికది గీటురాయి. ఆస్వాతంత్ర్యము సరియైన త్రోవన ప్రసరిస్తున్నదో లేదో పరీక్షించుకోటానికి కొలగజ్జ

*f*: "If we are not to lapse into individualistic rationalism and ultimate negation, if we are not to be lead astray by our wandering whims, if our personal intutions are to be guided by the accumulated wisdom of the race, only tradition can help us." (Idealistic view of Life, P. 78)

సంప్రదాయము† సంప్రదాయానుసరణము, సన్మార్గప్రవర్తకము, సంప్రదాయానికి దాస్యము స్వాతంత్ర్య విచ్ఛేదకము. కాబట్టి దానికి దాసులు కారాదు. దేశకాల పాత్రలు దానిని మారుస్తూ ఉంటవి. ఆమార్పుకూడా తదనుసారమే కాని తద్విచ్ఛేదనము వల్ల కారాదు.

(4) సంప్రదాయ జ్ఞానము శాస్త్రజ్ఞానానికి చేదోడు ఇస్తుంది. మానవ తర్కానికి అనవస్థ. కొంత దూరము పోయి అది ఆగిపోతుంది. అలాగే ప్రకృతి శాస్త్రాలు కూడా సమస్త ఆధ్యాత్మికాన్ని సమన్వయము చేయలేవు. ఎక్కడ శాస్త్రజ్ఞానము నిలిచిపోతుందో సంప్రదాయ విజ్ఞాన మక్కడ ప్రారంభిస్తుంది. దాని ద్రష్టల కది ప్రత్యక్ష జ్ఞానమే. వారు దానిలో లీనమై అనుభవించినదే! బుద్ధి మేధలు వెళ్ళజాలని స్థలాలకు ఆర్షజ్ఞానము కనుక్కున్న పెద్దల అంతర్దృష్టి వెళ్లినది.* అట్టివారి అనుభవాలు సంప్రదాయ విజ్ఞానములో ఇమిడి ఉన్నవి. సులభముగా వాటిని తోసిపుచ్చ తగదు. గ్రుడ్డివానికి అనుభవము చాల తక్కువ. అవయవ సౌష్ఠవము కలవాడి జ్ఞానము కంటె విశాలము ప్రజ్ఞావంతుడిది అంతకంటె విశాలము. ప్రతిభావంతుడిది అంతకంటె విశాలము. ఊహా ప్రతిభావంతుడిది అంతకంటె విశాలము. సమస్తవిషయాలకు కార్య కారణభావము చెప్పడానికి వీలు లేదు కాబట్టి

† : "It takes centuries to make a little history and it takes centuries of history to produce a little tradition, and we cannot set it aside. Mankind does not begin completely afresh with each individual. The first principles need not be proved by each of us. There is a body of accepted knowledge, a deposit of faith on which we can all draw... The past helps us to reach more elevated heights from which, as ages move, we may gain a clearer vision of the relations of God and man." S. Radhakrishnan.

* "There are aspects of reality where science is insufficient."

"While the dominent feature of Eastern thought is its insistence on creative intuition, the Western systems are generally characterised by a greater adherence to critical intelligence. .."

"The Hindu thinkers use the term Aarokasha for the non-sensuous immediate knowledge. This intrinsic knowledge arises from intimate fusion of mind with reality. It is knowledge by being and not by senses or by symbols." –S. Radhkraishnan

అనిషయ నుబద్ధమనకూడదు. ఊహా(ప్రతిభకు (Intuition)కార్య కారణ సంబంధానికి ఎట్టిపొత్తు లేకుండా సత్యాన్ని కనుక్కునే శక్తి ఉన్నది.

(5) సంప్రదాయములో లోపాలున్నవని దానిని ధ్వంసము చెయ్యటము న్యాయ్యముకాదు. అది ఒక జీవత్సంస్థ. జీవత్సంస్థను దేశ కాలానుసారముగా మార్చటము బుద్ధిమంతుడి కర్తవ్యము. ఆ మార్పు కూడా సంప్రదాయ మూలసూత్రాలను అనుసరించి ఉండవలె. భారతీయ సంప్రదాయములో గోహింసను ప్రవేశ పెట్టటము తప్పు. అలాగే కర్మ సిద్ధాంతాన్ని త్రోసిరాజని దానిని మార్చటానికి వీలులేదు. దానిని నాస్తిక్యము పునాదిగా కట్టకూడదు. అవినీతి మన ప్రకృతికి సహజమనే మన స్తత్వము పైన ఆమార్పు ఉండకూడదు.†

ఇది సంధియుగము. వెనకటి నమ్మకాలపై ప్రత్యయము తగ్గినది. క్రొత్త నమ్మకాలు పుట్టలేదు సంప్రదాయము ఘనీభవించినది దానిపై నైరస్యాన్ని చూపుతున్నారు యువకులు. ఇట్టి కాలములో జాతికి మార్గదర్శకులైనవారు జాగ్రత్తగా ప్రవర్తింపవలె. ఇప్పుడు నాయకత్వము వహించేవాడు ద్రష్టగా ఉండవలె. అతివాదిగాను సంప్రదాయ నిరసికుడిగాను ఉండకూడదు. ప్రతివెంగళప్ప సంప్రదాయాన్ని దూషించి తాను ద్రష్టననే ఆత్మవంచన పడకూడదు. వీరేశలింగంగారి కంటె ఎక్కువ నిరసన మెవ్వరైనా చేసినారా? ఫలమేమిటి? సంశయాత్ములు తయారుకావటమే! ఆసంశయాత్ము లిప్పుడు నాయకత్వము వహించట మాపత్తు అయినా నిరుత్సాహానికి ఏంతమాత్రము తావు లేదు. ఇన్ని వేల సంవత్సరాల నుంచి వచ్చిన సంప్రదాయ సంస్కృతులను ఒక వ్యక్తికాని కొందరు వ్యక్తుల సమూహముకాని విచ్ఛిన్నము చేస్తా మనుకోవడము ఆత్మవంచనమేగాని మరిఒకటి కాదు.

కొందరు "సంప్రదాయము మనను ఈ దాస్యములోకి దింపినది. అదిమన మెదలకు పడిన గుదిబండ అది ఎప్పుడు నశింపజేస్తే మన మప్పుడు బాగుపడతాము. మనము దానివల్ల పిరికిపందలమై ఉత్సాహ ప్రభు మంత్రశక్తులు నశించి అనదలమై

---

† "However corrupt the Church may be, it is a live organisation, responsive to new influences." – Sr. Radhakrishnan

పోయినాము." అని వాదిస్తూ ఉన్నారు. ఆత్మశక్తితో చాలినశక్తి లేదు. క్రీస్తుప్రభువు తన శక్తి అంతా ఉపయోగించినాడు. అంతా ఆత్మశక్తి దగ్గర నిలిచింది. గాంధిమహాత్ముని సత్యాగ్రహోద్యమమే ఇందుకు నిదర్శనము. ఈ సందర్భములో ఈ క్రింది వాక్యాలు చూడండి.-

" In anger let the thought be ever present that indigination is not a form of courage, but that meakness and gentleness are not only more human, but also more manly and it is he who posseses these, that has strength, nerve and bravery not the angry and discontented."

"శాంతులు ఉత్తములు. స్వర్గలోకము వారిదే" అనినాడు, యేసుక్రీస్తు ప్రభువు. పైన చెప్పిన సంప్రదాయ విజ్ఞానము అంతా సాహిత్యములోనికి వచ్చినది.

# సంప్రదాయము - సాహిత్యము

పురాణాలలో, ప్రబంధాలలో, కథలలో, కావ్యాలలో, పైన చెప్పిన విషయాలే కనపడుతున్నవి. వర్ణాశ్రమ ధర్మాన్ని ఉగ్గడించని గ్రంథము లేదు, పెద్దనగారి ప్రవరాఖ్య పాత్ర కల్తీలేని గృహస్థ ధర్మానికి ఉపలక్షకము. తెనాలి రామకృష్ణుని నిగమశర్మ పాత్ర గృహస్థధర్మమునుంచి పతనమైనవ్యక్తి. పరమేశ్వరకటాక్షము వల్ల రక్షింప బడటానికి ఉపలక్షకము సామాన్యముగా ప్రబంధాలన్నిటిలో కూడా ఇట్టి ఆశయాలే అనుసరింపబడినవి. కృష్ణుడు దక్షిణ నాయకుడుగా సృష్టింప బడినప్పటికీ ఆయన భార్యలంతా అన్యరక్తికి తిరగబడి తాను కూడా అట్టివృత్తికి దిగినట్లు చిత్రంప బడలేదు. ఎక్కడనైనా బహుభర్తృత్వము చెప్పవలసి వచ్చినపుడు దేవ వేశ్యలనో, మనుష్యవేశ్యలనో గంధర్వాంగనలనో సృష్టించినాడు. విక్రమోర్వశీయములో ఊర్వశి, మనుచరిత్రలో వరూధిని, కళా పూర్ణోదయములో కలభాషిణి వంటివారు మొదలైనవారు ఇట్టివారే. స్త్రీ పాత్రలను ఆదర్శప్రాయముగా చిత్రింపవలసినప్పుడు సీతనూ, సావిత్రినీ, ద్రౌపదినీ, చంద్రమతినే చిత్రంచినారుగాని చంచలులనుగా సృష్టించలేదు. తుదకు రాక్షసుడైన రావణుని భార్యను మండోదరిని పతివ్రతగా చిత్రించినారు. ఈవిధముగా శీలస్వచ్ఛత స్త్రీకూడా పతికొరకూ, తాను ప్రేమించిన ఒక పురుషుని కొరకే తపించినట్లు చిత్రించినారు. దుష్టులు స్త్రీలను లోబరచు

[illegible] స్త్రీలు ప్రతిఘటించి తమశీలాన్ని కాపాడుకొనుటే [illegible] ఒడంబడినట్టు చిత్రించలేదు. పతనము చిత్రించిన అహల్యాది [illegible] పశ్చాత్తాపమూ పునఃపూర్వప్రవృత్తి, వర్ణించినారు.* గృహస్థ ధర్మ [illegible] చేత గాక స్వచ్ఛందవృత్తిని అవలంబించిన వారి వాదాలకెక్కువగా [illegible]. వారికి మన స్తత్వశాస్త్రము ప్రమాణమై ఉండవచ్చు. ఈ [illegible] అనుసరించేగృహస్థ ధర్మము కామపురుషార్థ సాధనమని చెప్పినారు. [illegible] స్వయంవరాదులను చేర్చి గాంధర్వాది వివాహాల కు చోటిచ్చినారు. [illegible] గాంధర్వ వివాహము. రుక్మిణిది రాక్షసవివాహము. దమయంతిది [illegible]. "హరిశ్చంద్రుడు రాజ్యము కొరకు మతంగ కన్యకలను అంగీకరిస్తే [illegible] దమయంతి కిరాత రాజును అంగీకరిస్తేనేమి? సీత రావణుని విజ్ఞప్తికి [illegible] చూపితేనేమి? అట్లాచేస్తే వారికి సహజమానవ ప్రమాదము సిద్ధించి [illegible] తెకత్వము వస్తుంది." అని వాదించేవారికి నేనేమి సమాధానము ఇయ్యలేను. [illegible] గొప్పతనముగా తీసుకునే ఈ కాలములో కొందరు యువకులకే అది [illegible].● మామూలు ప్రపంచములోనూ తదనుకరణమై సామాన్య [illegible]లోనూ అట్టి విషయాలు ఉండనే ఉన్నవి. ఉత్తమ సాహిత్యముకూడా [illegible] ఏమో వీరి ప్రశ్న! ఇది మానవపతనమేగాని మనస్తత్వము [illegible].

---

* షేక్స్పియరు మిల్టను మొదలగు మహర్షులుగూడా ఏకపత్నీ వ్రతంలోనూ పాతివ్రత్యంలోనూ [illegible] ప్రణయాన్నే ఉగ్గడించినారు. కాని స్వచ్ఛందతను ప్రేమించి అట్టిపాత్రలను [illegible] చిత్రంచలేదు.

● "We are confusing self-expression and self-development with a life of instincts and passions. We tend to look upon ourselves as healthy animals and not spiritual beings. We have had sin with us from the beginning of our history but we have recently begun to worship it. It is not very modern for a man or a woman who is sick of his or her partner to take to another, but what is really modern is the new phylosophy in justification of it Disguised feeling is masquerading as advanced thought .... .... ..... sex irregularities are becoming less shocking and more popular." (The Hindu view of Life, P 88)

ఈ విధముగా పై అన్ని సంప్రదాయాంతర్భూత విషయాలు పరికిస్తే సాహిత్యములో భాగము కలవైనవి. నిత్యజీవితములోనే అంతర్భూతాలైనప్పుడు జీవిత ప్రతిబింబమైన సాహిత్యములో ప్రవేశించినవి అంటే ఆశ్చర్యమేమున్నది? కాబట్టి ఈ ప్రవాదితో ఆకావ్యాలను విమర్శించవలె. ఒకరి చిత్త మితర సాంప్రదాయ సంకలితమై, దానియొక్క ఉత్కృష్టతను నమ్మేద్రైతే వెనకటి సాహిత్యాన్ని విమర్శించటానికి అతనికి సంపూర్ణాధికారము లేదు. తెనుగుభాష సంప్రదాయాన్ని తెలియకుండా తెనుగును విమర్శించటము వంటిది. అది అంతా దుష్టమైపోతుంది.† అట్లాగాని విమర్శనానికి ఏట్టి విలువాలేదు. సహృదయుడు కాని, శుష్కశాబ్దికుడి కావ్య విమర్శనము కూడా అట్టిదే! శబ్దము వరకే ప్రమాణముగాని రసము విషయమై కానేరదు. కాబట్టి అట్టి సంప్రదాయ సిద్ధమైన సహృదయత్వము కలవాడే సాహిత్య విమర్శనానికి అర్హాధికారి.

"విషయమా ఏది చెప్పవలసి వచ్చినా కమలాన్నే ఉల్లేఖిస్తారు. ఛీ! మన కవులు" అనే సహృదయులను నేనెరుగుదును. వారికి కమల సాదృశములో ఉండే విశిష్టత తెలియనిమాట. కమలములో కవులు చెప్పే గుణాలు లేక పోవచ్చును కాని వేల సంవత్సరాల సంపర్కముచేత కవులూ సాహిత్యవేత్తలూ కూడా ఆగుణాలు కమలములో ఆరోపిస్తున్నారు. అందుచేత సౌందర్యానికీ, మార్దవానికీ, సుందరమైన నేత్రమునకూ మొదలైన గుణాలకు ఉపలక్షకము (Symbol) అయిపోయినది. ఈ సంగతి తెలియనివాడు మన సాహిత్యాన్ని ఏమి విమర్శిస్తాడు.

ఇది సంధికాలము. అన్ని సాంప్రదాయాలకు దెబ్బ తగులు తున్నది. భాషా సంప్రదాయానికి గిడుగువారు దెబ్బకొట్టినారు. గతాను గతిమైన ప్రబంధ ధోరణికి రాయప్రోలు గురజాడలు దెబ్బకొట్టినారు. వీటి కన్నిటికీ మూలము పూర్వమత ధర్మాలపైన వీరేశలింగంగారు కొట్టిన దెబ్బ. వీటి అన్నిటి వల్ల యువజనులలో కల్గిన చిత్తశబలతను వెనక ఉల్లేఖించినాను. ఇక లాక్షణిక సంప్రదాయానికి తగిలిన దెబ్బను తెలుసుకుందాము!

---

† చూ. సాక్షి "కళ్లపిరాం పిళ్లగారి ఉపన్యాసం"

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 3

# తిరుగుబాటు-కవిత్వతత్వ విచారము

ఈ ఘట్టమునుంచి విమర్శన ఘట్టానికి వస్తాను. ఇంతవరకు విమర్శన మెట్లాఉన్నదో తెలుసుకోవలె. అప్పటికి సరియైన విమర్శనము వెలువడలేదు; మూడు రకాలుగా ఉండే దిది. వెనుకటి గ్రంథాల కొకపద్ధతి. తాత్కాలికాలై, సమకాలికుల నాటికొక పద్ధతి. పాశ్చాత్యవాసన కలవాళ్ళువ్రాసేది మూడోది. ఈ మూడు పద్ధతులా నడుస్తూ విమర్శన మెక్కువగా పండితుల చేతులలోనే ఉండేది. భారతాది గ్రంధాలకు పీఠికలలో మొదటి తరిగతి విమర్శన ఉండేది. నాటిలో అంతా పొగడ్తే! ఆ పొగడ్తా కూడా కార్య కారణ భావము లేకుండా జరుగుతూ ఉండేది. ఎప్పుడూ ఉత్తమశబ్దాలేగాని పరీక్షలేదు. భాషాంతరీకరణాలైతే సంస్కృతానికీ తెనుగుకూ తారతమ్యచర్చ వీటిలో కొంత ఉండేది. పండితులలో గర్వశైత్యాలు! అందుచేత రంధ్రాన్వేషణము ప్రధానముగా ఉండేది. ఒక్కమాటు అముద్రిత గ్రంథ చింతామణిగాని, మరే పత్రికగాని, వెనక సంచికలు తిరుగవేస్తే వీటి సంగతి తెలుస్తుంది. విమర్శకుల పాండిత్య ప్రకర్షే పరమావధి. సానుభూతి అనేదే లేదు. అటువంటివి ఇప్పటికీ కనపడుతూనే ఉంటవి! వ్యాకరణదోషాలు చూపటము విమర్శకుడి ముఖ్యవిధి అని వీరి అభిప్రాయము. కృతిలో రసము చూపించి, దాని ప్రాశస్త్యాన్ని చెప్పటము వాళ్ళ కర్తవ్యమునవలె వారికి తోచనేతోచలేదు. ఇక మూడోరకము విమర్శనమెట్లా ఉండేదో వావిలకొలను సుబ్బారావుగారి మాటలతో చెబుతాను:

"ఇంతవరకీ భాషయందుండు విమర్శనములను పేర బిలువబడు గ్రంథములు బందుబాతుల ప్రోవులు. రామాయణ భారత భాగవతాదులపై సంస్కార పికీర్షువులు వ్రాయు గ్రంథములయందు, దబ్బరలు, సపలాపములు మెండు గావున వానిని బుద్ధిమంతుడు చదువకుండుట మేలు. చదువబూనినచో మూలగ్రంథము నంతయు పరించి సత్యాసత్యము లెఱుంగవలయు. కేవల విమర్శనములను నమ్మిన ననర్థము తప్పదు"

ఈ మూడు రకాలలోకూడా సరియైన పద్ధతులు లేవు. ఒక గ్రంథమును విమర్శించే పద్ధతులా గ్రంథము ననుసరించే ఉంటవనీ, దేశకాల పాత్రలూ కవియొక్క సన్నివేశమూ మొదలైనవికూడా విమర్శనములో గ్రహించవలె ననీ, ముఖ్యముగా సానుభూతి సహృదయత్వ మనేవి అవసరములనీ, యీ విమర్శనలు తోపజేయవు. రంధ్రాన్వేషణమే విమర్శనమనీ, భాషే విమర్శనీయాంశమనీ వీటి పరమావధి;* ఇట్టి స్థితిలో ఉన్నది విమర్శనము.

విద్యాధికుడైన కట్టమంచి రామలింగారెడ్డిగారు (జననము 1881) యీ పరిస్థితులను గమనించినాడు. ఆయన ఆంధ్రములో నిష్ణాతమైన విజ్ఞానము కలవాడు. భారతము చదివి తిక్కన హృదయము తెలిసిన వాడు. ఇట్లా తెలుసు కొన్నవారు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారూ, యీ రెడ్డిగారూ - వీరిద్దరేనని నా నమ్మకము. ముఖ్యముగా తిక్కన, పింగళి సూరనలను ఈరెడ్డిగారు తెనుగులో మెచ్చినాడు. అత్యంతమైన దేశభాషాభిమానాలు కలవాడీయన. గొప్ప విద్యాధికుడైనా, పాశ్చాత్య వాసనతగిలినా, స్వభాషను మరచిపోని భాషాభిమాని. విమర్శనముసరియైన త్రోవలో లేకపోవడము చూచి, ఆలోటును భర్తీచేయడానికి పూనుకొని "కవిత్వతత్త్వవిచారం" మనే గ్రంథమును రచించినాడు. ఈయన ఇంగ్లీషు సారస్వతము, మనస్తత్త్వము క్షుణ్ణముగా సవిమర్శముగా చదివినవాడు కావడముచేత తెనుగులో గ్రంథాలను, అటువంటి సూత్రాలతో విమర్శించడము ప్రారంభించినాడు. "వర్డ్సువర్తులో ఉండే ప్రకృతివర్ణనలూ, షేక్స్పియరులో ఉండే మానవ జీవిత చిత్రాలూ, మిల్టనులో ఉండే పవిత్రతా, షెల్లీకీట్సులలో ఉండే చిత్తవికారమూ, బ్రౌనింగులో ఉండే వేదాంతమూ, మన సారస్వతములో లేదని దుఃఖిస్తే ప్రయోజనమేమైనా ఉన్నదా?"◆ వీటికి బదులుగా మరి వేరుగుణాలున్నవి. అవి అన్నీ మరచి వారి సారస్వతమే పరమావధిగా తీసుకొని

---

* క్వాచిత్కముగా కొందరు కొంచెము పాశ్చాత్య వాసనా సహిత విమర్శనలు వ్రాయటము సూచిస్తున్నారు. "ఆధునిక వచన రచనా విమర్శన" మనీ "కవితా విమర్శనము" నీ, "మనుపసు ప్రకాశిక', అనిన్నీ, దానిమీద ప్రతి విమర్శనలూ మొదలైనవి మూలమూలలుగా వెలువడు తున్నవి. వెన్నేటి రామచంద్రరావుగారు, విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారూ మొదలైనవారు వీటిలో జోక్యము కలిగించుకొంటున్నారు.

◆ మనవాళ్ళు కొందరిట్లా అంటూ ఉంటారు

పరీక్షించడము న్యాయముకాదు. ఒకజాతి వాఙ్మయము దాని సంప్రదాయము మీదా, నాగరికతమీదా, దాని దేశకాలపాత్రల మీదా, ఆధారపడి ఉంటుంది. మరిన్నీ దానికి సహజమైన యే విజ్ఞానమున్నదో దానిని ప్రతి బింబిస్తూ ఉంటుంది. హ్లాదరామణీయకాలు సమస్త సారస్వత సూత్రాలైనా, ప్రత్యేక సారస్వతానికి ప్రత్యేక పద్ధతులున్నవి. భావానికీ భాషకూ సన్నిహిత సంబంధమౌటచేత యీ సారస్వత గుణాలు భాషమీదకూడా కొంత ఆధారపడి ఉన్నవి. ఏదీ! రాఘవ పాండవీయము వంటి ఒక్క ద్వ్యర్థికావ్య మింగ్లీషులో వ్రాయమనండి. చూదాము! గీత గోవిందము వంటి భక్తి రసభరితమైనది గాని, మేఘదూతవంటి ఖండకావ్యముగానీ, ఇంగ్లీషులో చాలా అరుదు. భారత మంత విజ్ఞాన సర్వస్వమైన కావ్య మింగ్లీషులో ఒక్కటి చూపండి! మనకు మతము, సారస్వతము, విజ్ఞానము, అన్యోన్యాశ్రయాలు కానడము చేత మన సారస్వతము పాశ్చాత్య వాసనగల వాళ్లకు కొంతమందికి గిట్టదు. మన జీవితాదర్శమువేరు.. వారానికొకమారు దేవుణ్ణి జ్ఞాపకము తెచ్చుకొనడము కాదు మన కర్తవ్యము◆ ఎల్లప్పుడూ జీవితానికీ ధర్మానికీ లంకె ఉంటుంది. "బొత్తుగా రెంటికీ దూరమైపోయి రెండోదెన్నాళ్లున్నా మళ్లీ ధర్మము గెలిచి సత్యాన్ని స్థాపిస్తుందని' మనవాళ్ల నమ్మకము. మనకు జీవితము గదుల వరసవంటిది కాదు. ఇది ఒక దేవాలయము. దానిలో ఎన్ని పాపాలు జరుగుతున్నా దేవాలయమే! కాబట్టి వాళ్ల నాగరకతా విజ్ఞానమూ మనకు సంప్రదాయ సిద్ధముకావు. ఈ సంప్రదాయాలమీద ఆధారపడ్డ సారస్వతాన్ని సంప్రదాయానికి విరుద్ధనియమాలతో పరీక్షించడము తప్పు. ✻ కొన్ని సామాన్య సారస్వత నియమాలుండవచ్చు. మన వాఙ్మయము చాలా

◆ "The English man prays for six days in the Bank of England and for one day in the Church of England." - John Gunther

✻ " There has never been a time when scientific knowledge was more wide spread than it is today. We have overcome great barriers Yet, in spite of many things, we are engaged in devilish pursuits Why? The answer is this. Man's spirit has descended to the more intellectual level Unless man rises to the spiritual level, there is no hope for him. It is this principle that the world needs today "

"Hinduism is great because of certain fundamental principles, universal in value and which are not open to question by any scientific discovery" -Sir S.Radhakrishnan on 26-6-'44

మట్టుకు శృంగారరస ప్రధానము. ఈ శృంగారమంటే తలకంటకముగా ఉన్నట్లు కనపడతారు గాని, లోపల యిష్టమేనని ప్రవర్తనవల్ల కనపడుతుంది. ఉంటే ధర్మబద్ధమైన గార్హస్థ్యము ఉండవలె! లేకపోతే చిత్తచాంచల్యములేని స్థిత ప్రజ్ఞత్వము ఉండవలె. కాబట్టి యీ ధర్మబద్ధమైన గార్హస్థ్యము పరమావధియై దానికి శృంగారము ముఖ్యరసమైనది. శృంగారరసము ఏసారస్వతములో లేదు? నాయికా నాయకులు లేని నాటకముంటుందా సామాన్యముగా? ఇదీగాక మన ప్రాచ్యనాగరకత, ప్రాచ్య రాజ్యాంగము, ప్రాచ్య సంప్రదాయము, పాశ్చాత్యుల నాటికి భిన్నాలు.*

మరీ 18 వ శతాబ్దములో యూరపంతా పారిశ్రామికమై పోయిన తర్వాత దైవాన్ని మరచి, మానవకోటి శరీరకష్టము చెయ్యటము, దానివల్ల పొట్టనిండకపోవటము, ధనమంతా యేకొందరి చేతులలోనో ఘనీభవించి ఉండటము, దానిచేత కలిగిన మనస్తాపము, జీవితము దుర్భరము గావటము, అందుచేత వివాహమంటే భయపడటము, కామతంత్ర మే పద్ధతులతోనో తృప్తి పరచుకోవడము - మొదలైన విషయాలకు లోనై అన్నే సారస్వతములో ప్రతిబింబించడము - మొదలు పెట్టినవి.

ఈ పరిస్థితులు గట్టిబడిన తర్వాత కొన్ని సంవత్సరాలకు మన వాళ్లు ఇంగ్లాండు వెళ్ళటము మొదలుపెట్టినారు. ఈ విధముగ క్రమముగా ఒక తరంగము తర్వాత మరొక తరంగము చొప్పున వెళ్లిరావటము తటస్థించినది. ఈ పోయివచ్చిన వాళ్ళలో కొందరు తమ తల్లి దండ్రులనే మరచి పోయినారు. మరి కొందరు ఉద్యోగాలుచేసి ద్రవ్యార్జనము చేసి సుఖజీవనము చెయ్యటము మొదలు పెట్టినారు. ఇంకా కొందరు అక్కడి పద్ధతు లిక్కడ నాట వలెనని యత్నించినారు.

---

* "No poet, no artist of any art has his complete meaning alone. His significance, his appreciation is the appreciation of his relation to the dead poets and artists. You cannot value him alone He must invariably be judged by the standards of the Past ..... . " -T.S Illiot

"To disregard tradition completely is the most dangerous course any artist can pursue, Whatever has been gained by our predecessors has been hardly won and the mental anarchy which lays it in ruins in order to build the new Jerusalem in its place smacks the sin which Lucifer shared" -Ifor Evans

చూచినారా సంప్రదాయమంటే వాళ్ళుకూడా ద్వేషించలేరు

అక్కడి పద్ధతులన్నీ యిక్కడ సరిపడవని తలచలేదు. ఇటువంటి ఒక తరంగములో వాడు రెడ్డిగారు. ఆవిజ్ఞానముతో 'కవిత్వతత్వవిచారమ'నే గ్రంధాన్ని వ్రాసినాడు.

ఈ కవిత్వతత్వ విచారము వెలువడగానే ఆయన గొప్పవాడౌట చేత పత్రికలు గాని, వ్యక్తులుగాని దానిని విమర్శించడానికి మొగమోట పడినారు. ప్రతివారు ఈయనను లోపల విమర్శించిన వారే ! కాని ఒక్కరికి కూడా పైకి చెప్పే సాహాసము లేక పోయినది. ఈయన పాశ్చాత్త్యులయొక్క "కవిత్వం జీవిత ప్రతి బింబము" నే సిద్ధాంతము నాధారము చేసుకున్నాడు. మన గ్రంధాలు మానవుల సహజప్రవృత్తికి కొంచెము భిన్నాలుగా ఉంటవి! ఈ దృష్టి మన లక్షణశాస్త్రాలు చదివితేగాని తెలియదు ఈయనే గనక సంస్కృత లక్షణ గ్రంధాలు చదివి ఉన్నట్లైతే భాషకు పరిస్వతానికి అమూల్యోపకారక మయ్యేది.

ఈ గ్రంధము యువక హృదయాలలో ఒకవిధమయిన అలజడి కలుగజేసినది! ఈ గ్రంధములో ప్రధమ భాగములో మొదటి, మూడవ అధ్యాయాలలో చర్చించిన లలితకళా సామాన్య సిద్ధాంతాలలో చాలామట్టుకు మన లాక్షణికులు చెప్పినట్టుగా తద్విపరీతముగా ఉన్నవి. ఇక్కడ ఈయన అవలంబించినది సమన్వయ పద్ధతిగాదు. ఎక్కడో ఉన్న సూత్రాలనుబట్టి మన గ్రంధాలను విమర్శించడము. ఒకప్పుడు సాక్షాత్తుగానూ, మరొకప్పుడు నర్మగర్భముగాను దూషించడము - యిది యీయన చేసినపని.‡ "భావనాశక్తి" "ప్రకృతి భావత్రైక్ష్ణ్యము" "భావనాశక్తికి కార్యోత్సాహమునకు నుండు సామ్యము" "అలంకారము లనావశ్యకములు"#

‡ గ్రంధకర్త సాహితీ విమర్శనము (కొలది మాత్రములు లోపములు గలదియయ్యు) అద్భుతమైనది..... వేదాంతమును గురించియు సత్త్వగుణమును గురించియు విమర్శకునకు వెఱ్ఱి వెఱ్ఱి అపోహలు కలవు ... సాహిత్య విమర్శనమేగాక సంఘ విమర్శనముకూడ గ్రంథమందు ప్రవేశమిందినది. గ్రంధకర్త మనువుపై కారములు మిరియములు నూరి పోసినాడు వర్ణాశ్రమధర్మములను చూచి కనులెఱ్ఱచేసినాడు. గ్రంధకర్త సంఘవిమర్శనము పుస్తకమునకు రాచపుండగు చున్నది, .... సందర్భ శుద్ధిలేని మాటల నెట్లో నడుమదొర్లించి కులస్త్రీల పేరున కగ్గిపుల్ల వెలిగించుట యేమి ధర్మము?" - ఆంధ్రపత్రిక యువ ఉగాది సంచిక.

# "వీరి అలంకారశాస్త్రమును దూషించిన దూషణ మసమంజసము, నిర్హేతుకము"
-- భారతి 1938 మార్చి, -- వెంకటేశ్వర్లు

"సాదృశ్యతత్త్వము" "పాత్రరచనాతత్త్వములు" "వికృతిలేని పాత్రములు జడ సమానములు" "మిశ్ర చరిత్రములు గాని పాత్రములు పకృతి విరుద్ధములు" "సర్వలక్షణ సమేతముగా వస్తువులను నిర్దేశించటము తప్పు" మొదలైన వన్నీ కూడా కొన్ని మనవారి దృక్పథానికి విరుద్ధాలు. మనస్తత్వ శాస్త్రముతో సంబంధము అక్కడక్కడా చెప్పినా దానితో సంపూర్ణముగా జోడించి వీటిని నిర్ధారణ చెయ్యలేదు మనవాళ్ళు.* ద్వితీయ భాగములో కూడా యిట్లాగే ఉన్నవి. "కాలసరణి - కథాసరణి" ఇది మన లాక్షణికులకు అచుంబితవిషయము. 'ఐక్యమను లక్షణము' ఇది కేవలము గ్రీకు రోమను సిద్ధాంతము. రెడ్డిగారు వీటితో మనవాటిని సమన్వయింపజేసి ఒక నూతన మార్గాన్ని చూపడానికి సమర్థుడైనప్పటికీ, ఆయనకు సహజముగా లోపల ఉన్న సంఘ సంస్కారచికీర్షా వర్ణాశ్రమాచార నైరస్యమూ ఆయనను కేవలము ముంచి వేసినవి. లక్షణ శాస్త్రము గూర్చి ఒకటి రెండు ఆయన అభిప్రాయాలను అనువదిస్తాను:

"పాత్రములన్నియు నొక్కతీరుదాల్చిన బొమ్మలు. అలంకార శాస్త్ర ప్రకారము చెక్కబడినవి. ప్రాచీనులు వ్రాసినట్లును, అలంకారశాస్త్రము లాదేశించినట్లును విరచింప బ్రయత్నించుట తెలిసి తక్కువపని"

మనోవికారము లనుపదములో ఉన్న 'వికారము' అనే పదము 'పేడివారి తెగకు చేరిన మన వేదాంతులు మొదలైనవారిచే సృష్టింపబడిన పదముట! ఇవి చాలు! పాతివ్రత్యతత్త్వమే వీరికి గిట్టదు. అది అసహజమని వీరి భావము.◆ తర్వాత

---

* మానవుడిలోఉన్న పశుత్వానికి సహజమైన మనస్తత్వాన్నే గ్రహించి, వాడిలో ఉన్న మానవత్వ దైవత్వాలకు సంబంధించిన మనస్తత్వాన్ని వదలడము విమర్శనము కాదు. సామాన్యముగా చిత్తసంస్కారము లేని మానవుడి చిత్తవృత్తికి తగిన మన స్తత్వమే కవికూడా గమనించవలసిన మనస్తత్వ మనుకోవడము పొరబాటేమో?

◆ లాక్షణికులు "సద్యఃపరనిర్వృతి" కావ్యప్రయోజనమని చెప్పినా "కాంతా సమ్మితతయోపదేశయుజే" అని చేర్చినారు. కాని రెడ్డిగారు "కావ్యము శిల్పము. నీతి శాస్త్రము కాదు. ధర్మశాస్త్రముకాదు." అన్నారు ఒకచోట. మరిఒకచోట "జారస్త్రీలెల్ల చెడ్డవారయట! కండకావరముచే నన్యుల గోరువారట! ప్రబంధములోని పతివ్రతలు మాత్రము కండకావరముచే గోరువారుకారా? ఇకేవరము వారికున్నది? . మనుష్యస్వభావమును పరీక్షించి వ్రాయక యలంకార శాస్త్రముల వలనిడి కొన్నందుకు కలిగిన యధోగతియిది!" అన్నారు. రామాయణమన్న వీరికి

శృంగార వర్ణనములో పాశ్చాత్యపద్ధతినీ మన కావ్యపద్ధతినీ, పోల్చి సకారణముగా విమర్శించినాడు. ఇక్కడ కూడా వీరికి సామాన్య మనస్తత్వశాస్త్రమే ప్రమాణము. ఇంతవరకు వీరు చేసిన పాశ్చాత్యసాంప్రదాయాను సరణము చూపటము చాలుననుకుంటాను.

ఈ నైరస్యానికి మన ప్రబంధ కవిత్వధోరణి ముఖ్యకారణము. భారత రామాయణాది పురాణ భాషాంతరీకరణాలను గూర్చి కొన్ని అపోహలున్నా మొత్తము మీద మంచివి అనే వీరి సిద్ధాంతము. ఇక తర్వాత ప్రబంధాలంటే యీయనకున్న అసహ్యత చెప్పడానికి వీలులేదు. తత్రాపి ప్రధమ ప్రబంధకాలము తర్వాత కాలములో వ్రాసిన వాటిమీద (విజయవిలాసము తప్ప) పరిపూర్ణ కటాక్షము! వాటిని

"ఆగ్నేయాస్త్రమును రప్పించి గ్రంధమంతయు నాహుతిగా నిచ్చిన యడల లోకమున కెంతో ఉపకారము చేసినవారగుదురు," అని ఆశించినారు రెడ్డిగారు ప్రబంధపాత్రలనుగూర్చి వ్రాస్తూ 'ఇక సామాన్య ప్రబంధములన్ననో వాని యందలి స్త్రీ పురుషు లెండిన కట్టెలవలె నున్నారు పంగలేరు. పెరుగలేరు కాబట్టి ప్రాప్తులు రెండు. విరువబడుట! పొయ్యిన నిడబడుట!' అన్నాడు◆ చూచినారా యెంత యసహ్యమో!

తర్వాత ఈయన భావా లిక్కడివి కావని తెలియజేయడానికి గ్రంధములో ఈ క్రింద అనువాదాన్నిస్తున్నాను :

---

ఏవగింపు. చూడండి "చవి సారములేని పాత్రములకు దారిచూపినది రామాయణము." అన్నారు. శృంగార తత్వాన్ని గూర్చి ఒక్కమాట ప్రకృతి సుందరము! సౌందర్యమంతా ప్రకృతిలో ఉన్నది స్త్రీ యీ ప్రకృతి స్వరూపిణి! ఆమెలో సౌందర్యమంతా మూర్తీభవించుచున్నది! మనుజుడు సౌందర్యపిపాసి! ఆ సౌందర్యము ఆయనకు ఉపాస్యమూ, వర్ణనీయమూ అయినది! ఆశ్చర్యమేమి? వర్డ్సువర్తు, షెల్లీ మొదలైనవారు ఆపక్షుల నే, ఆమబ్బులనే, ఆసామగ్రినే యెందుకు వర్ణించవలె?

◆ కళాపూర్ణోదయములో సూర్యోదయ వర్ణనములలో నొక దానిని గూర్చి "ప్రబంధములు శ్రాద్ధమునకై తేబడిన యెఱ్ఱగుమ్మడికాయ యనరాదా?" అన్నాడు. "45 సంవత్సరముల క్రింద (అప్పారావుగారు) రచించిన కన్యాశుల్కనాటకమును విమర్శించి నప్పుడు కొన్ని విషయములలో మనము యిప్పటి మనదృష్టితోను, మన ఆశయములతోను, మన సంఘ పరిస్థితుల పరిచయము తోను, మనము విమర్శించగూడదు. ఆ కాలమందలి పరిస్థితులు, అభిరుచులు, యెట్లుండెనో కొంతవరకు తెలుసుకొని మరీ విమర్శించవలెను."

(గి. వెం సీ. నాట్యకళ విక్రమ మార్గశిరము ) మన విమర్శకులు చేసే గొప్ప పొరపాటిది. ఈ నియమమును బొత్తిగా మరిచినాడు రెడ్డిగారు.

"మన వారిలో సంఘ చరిత్రము భానమే యున్నదో లేదో ! భానమే లేనిది ప్రవృత్తి యెక్కడిది? తను తన కుటుంబములయు, తెగలయు క్షేమమంతేగాని, రాష్ట్రముంగూర్చిన చింతలు లేనివారగుటంజేసి, వీరి ప్రారంభములచే దేశమున కేసూత్రమునైన ప్రాణ రక్షణములు సమకూరవు. అట్లగుట ధీర కృత్యములు, గంభీరోద్యమములు, ఏవియు తెలియవు పిరికియు గాంచు కవిత సాధారణజనులపై నేలదృష్టియుంచును? . . .. ఐరోపాలోని కొందరు కవీశ్వరులు కాపువారు సైనికులు మొదలైన తక్కువ స్థితులవారి బ్రతుకులను స్వభావములను యెంచి యెంతో సుందరముగ కావ్యములను వ్రాసి యున్నారు. మన గ్రంథముల మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నెరుగజాలువారికి యీ దేశమున పేదవారిపై నాదరముగల కవి యున్నాడా? తుదకు బీదవారలైన యున్నారా? యను సంశయము పుట్టినను తప్పు వారిదికాదు! శోకరసము వర్ణింపవలయునన్న ననుకూలమగు సందర్భమెయ్యది? క్రొవ్వు కారెడి నాయికా నాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరు గార్చుటకైన నవకాశము లేక మిడుకుచుండు సరి సరి విధములైన గోడులా? శాంతరసమునకు పోషకమెయ్యది? తమకు నష్టము చేసినట్టి రాజుల యుదార చర్యలా? ఆకట మలమలలాడుచు, యింటికి వచ్చి వంట సిద్ధముకాకుండినను భార్యను కోపింపక, కన్నులు మూతపడుచుండ విధిని ధ్యానించుచు, నౌకమూల కూర్చుండు పొలము కాపుయొక్క సహనమియా? ఆహా! జనసామాన్యము యొక్క ప్రతి దిన వృత్తములలో నెంతభావము, రసము, గుణము నిగూఢములైయున్నవో మన కవులకుం దెలియవు గదా? . . కలియుగాది నుండి యింతదాక జనము నెవ్వరు లేని సాధారణ జనులు నేటికి గదా గణ్యులైరి? ఇక ముందు పూజ్యులగుదురుగాక!"

ఈ వాక్యాలు వ్రాసిన వ్యక్తి యూరపులో జరిగిన పారిశ్రామిక విప్లవము తరువాత భావాలకు లోనైనాడని, వేరే చెప్పవలెనా? ఈ విధముగా ఉన్న దీ రెడ్డి గారి చిత్తప్రవృత్తి. ఈయన వ్రాసిన 'అర్థ శాస్త్రమూ', యీ 'కవిత్వ తత్త్వ విచారమూ' కూడా 'సంఘ సంస్కరణోపన్యాసములకూ'' "పూర్వాధునిక సంఘ చరిత్ర విమర్శనలకూ'' పుట్టిళ్ళు. అక్కిరాజు ఉమాకాంత పండితుడు నిజము తెలిపి విమర్శించినాడు: "పాశ్చాత్య వాతావరణములో చేతులు మొగిడ్చి కూర్చున్నవారికి ప్రాచ్యకావ్యవిషయము లెట్లు తెలియును" అన్నాడు. కాశూరి వ్యాసమూర్తిగారీ కవిత్వ తత్త్వ విచారాన్ని విమర్శిస్తూ ఒక గ్రంథమును ప్రకటించినాడు.

## జస్టిసు ఉద్యమం :

రెడ్డిగారి యీ చిత్తవృత్తికి బీజాలేవి అని ప్రశ్నవేసుకొనవలె! 1914

ప్రాంతము చాలా ప్రాముఖ్యమైనది. ఆకాలములో చెన్న పట్నములో ఒక్కసారి వాదము ప్రారంభమైనది.◆ ఈ ఉద్యమానికి పితలిద్దరు. డాక్టరు నాయరు, ఆంధ్రుడైన పిట్టి త్యాగరాయ చెట్టిగారు, బ్రాహ్మణులు ఉద్యోగాలన్నీ కాజేస్తున్నారని ఉక్రోషముచేత బయలుదేరినదీపార్టీ క్రమముగా దాని కారణజాతము వెనక్కు వెళ్ళినది. అర్వాచీన వేదకాలము నుంచీ కూడా బ్రాహ్మణేతరులకు వేదాలు చెప్పకుండా బ్రాహ్మణులు అజ్ఞానాంధకారములో ఉంచినారనీ, మనువనే దురాత్మ బ్రాహ్మణుడు వర్ణాశ్రమ ధర్మాలకు నియమాలు వ్రాసి యీ అంధకారస్థితులను శాశ్వత దాస్యములో పడవేసినాడనీ, మతమనే పేరుతో అప్పటినుంచీ యిప్పటివరకు పీడు పీరిని యేలుతున్నారనీ తుదకు స్వార్థపరులై, పూర్వమొకప్పుడు క్షత్రియులై వైదిక కర్మాధికారాలు గల కమ్మ, రెడ్డి మొదలగు యితర కులాలవారి క్షాత్రము బ్రాహ్మణులు దొంగిలించినారనీ, మొదలైన వాదనము లేవదీసినారు. ఇదే బ్రాహ్మణేతరోద్యమము. ఈ ఉద్యమము దేశాన్నంతా కలచివేసినది. ఏ ఊళ్ళో చూచినా సభలే! ఉపన్యాసాలే! బ్రాహ్మణ దూషణలే!* వీరేశలింగంగారి సంఘ వైరస్యాన్ని చదివిన ప్రజలంతా దీనికి లోబడి పోయినారు. ఇటువంటి ఉద్యమానికి తాను చేసిన పని కారక మౌతుందని ఆయన యెన్నడూ అనుకుని ఉండడు! ఈ పరిస్థితులు రూపాంతరముతో ఇప్పటికీ దేశమునిండా ఉండనే ఉన్నవి!

రెడ్డిగారు ఉపన్యాసాలెప్పుడూ యియ్యలేదు. కాని ఆయన వ్రాసిన గ్రంథాలుమాత్రము మనుదూషణలతోనూ, వేదాంత దూషణలతోనూ, వర్ణాశ్రమధర్మ నిరసనాలతోనూ నిండిఉన్నవి. స్థాలీపులాక న్యాయముగా కొన్ని ఉదాహరణాల్నిస్తాను.

"మగవారిచే గర్హింపబడు పేడివారి తెగకు చేరిన" వారట మనవేదాంతులు! 'మనము బట్టిన వేదాంత పిశాచిని ఒట్టట్లు పారదోలినందులకు నింగ్లీషువారు స్వభాషాభి మానులవుగు మనకెల్ల బూజనీయులు". "కట్టెవారెన కోపిమలకన్న లోకవాసనలనుభవించి యానందించువారు మేలు" హితోపదేశాన్ని పరభాషీయులు స్వీకరించుటగూర్చి చెబుతూ 'మనవలె జాతిమాలి

◆ ఇంతకు పూర్వమే దేశములో ప్రతిమూలా దానికి బీజాలున్నవి! స్థానిక సంస్థలలో తగాదాలు గ్రామజీవనములో ఉన్న స్వార్థపరత్వాలూ వీటికి మూలం

* వక మీటింగు పట్నంలో స్పర్టాంకు అనేచోట జరిగింది. నేను నామిత్రుడు యిప్పుడు న్యాయవాదిగా ఉండే ప్రయాగ రాఘవయ్యయున్నూ (ఇత దన్యాయంగా

వర్ణాదుల వ్యత్యాసముకతన, పూజ్యులైన మనువుయొక్క సంతతివారో కారోయను సంశయమునకు పాత్రులైన విదేశీయుల చేతను, నీగ్రంథమెంత గాఢముగ స్వీకరింపబడిన దనుట విశదమగును' అన్నారు "హిందూదేశములో మనుస్మృతి దెబ్బతగిలిన నాటినుండిప్రజ యీవరకును లేవలేక పడియున్నది దానిది పరాశ్రయమైన బ్రతుకు "జాతిభేదములవలన శ్రేష్ఠకులులకు తదితరుల పక్షమున మర్యాదయు గౌరవమును గలుగగను, శ్రేష్ఠులకుమాత్ర మర్దింప దగినదను నియతిని విద్య దాల్చిన దనుట" "అగ్రజాతులవారి యహంభావము, అశ్రద్ధ, ఆచారము, ఇవి నేనెరుగను, అన్యజాతివారిని తనమార్గమున నధీనులుగా జేయుటను, కవిత్వోచితమైన విషయమును మిక్కిలి సంగ్రహపరచినవి" "వారిని (స్త్రీలను) విద్య, స్వాతంత్ర్యము, మొదలగు దానంబులచేత నుత్తమపదవికిం దెచ్చిననేగాని, యీ దేశమెన్నటికిని పథములకు పాత్రంబు కాదు". "మనలో పెండ్లికి మనసునకును సంబంధము లేదు పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజము కాదు. మరి పితృపితామహజము మనసును నిరోధించి పీడించు వర్గములలో ముఖ్యములు జాతిభేదములు తను తమ యుపశాఖలను మీరి హృదయమును వ్యాపింప గూడదట! దీనివలన గలుగు ఫలమేమనగా, అమనస్కవివాహములు అనగా దేహమొకచోట చిత్తమింకొకచోట! మాటలిక్కడ తలపులక్కడ! చిత్తము శివునిమీద! భక్తిరంకులాడి మీద!" "సనాతన ధర్మగ్రస్తమీ దేశము" ఇవి చాలుననుకుంటాను అవకాశము వస్తే యీయన యీగొడవ చెయ్యని స్థలము లేదు.*

ఈ వ్రాతలకు ఇంకొక బీజము మరొక చోట ఉన్నది. ఈయన ఐరోపాలో చదువుకున్న వాడని వెనక మనవి చేసినాను. ఈయన అక్కడ చదువుకున్న కాలము ఇంగ్లాండులో సారస్వత విషయాలలోనూ అన్నివిషయాలలోనూ, చాలా మార్పులు జరుగుతున్నకాలము. "విక్టోరియన్ యుగము" లో ఉండే మర్యాదలన్నీ నశించినవి. డార్విను యొక్క మానవజన్మ సిద్ధాంతము వెనకటి నమ్మకాలను తారుమారు

* "రంగనాథ రామాయణము"ను ఆంధ్రవిశ్వకళా పరిషత్తు తరపున రెడ్డిగారు ప్రచురించినారు. దానికి తాము "మీమాంస" అని వ్రాస్తూమళ్ళీ యీలాంటి విషయాన్నే చర్చించారు. తుదకు తమకు గురుప్రాయులైన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారికికూడా అసహ్యత కల్గించుకున్నారు. వారికెంత జుగుప్స కలిగిందో భారతి (1943మే నెల) పత్రికలో శర్మగారు రంగనాథ రామాయణము మీద వ్రాసిన విమర్శను చూడవచ్చు. సమయము దొరికితే చాలు రెడ్డిగారు యీప్రస్తావన తేకుండా ఊరుకోలేరు. శ్రీ శర్మగారి గాథాసప్తశతి సారానికి పీఠికవ్రాస్తూ మళ్ళీ యిదే ప్రశంస. సంప్రదాయ నిరసనానికి రెడ్డిగారికీ అవినాభావసంబంధం. తుద కీయన బ్రాహ్మణుడని మర్యాదగా కూడా పిలువలేదు. "ప్రభాకరశాస్త్రి, లక్ష్మీకాంతుడు, సోమశేఖరుడు" అని వ్యక్తులనుగూర్చి ప్రసంగించినాడు. ఈయన చిత్తవృత్తిని భగవంతుడుతప్ప యెవ్వరూమార్చలేరు.

చేసినది. మన స్తత్వ శాస్త్రము పెరగడము మొదలు పెట్టినది. ప్రకృతి శాస్త్ర పఠనము పెరిగినది. ప్రతివిషయములోనూ మార్పులు, చెప్పిన విషయాలను ప్రశ్నించటము కలిగినది. ఈయుగాన్ని చారిత్రకులన్నారు,"Age of question, examination andtest" అని. అనగా పరీక్షాయుగము, లేక అప్రత్యయయుగము అందాము. ఈ యుగానికి కర్తలలో బెర్నార్డ్షా, వెల్సుగార్లుకూడా ఉన్నారు. ఆవాసనే మనకు కొట్టటముకూడా ప్రారంభించినది. క్రమముగా పూర్వమర్యాదలు నశిస్తున్నవి.

సాంఘికముగా, సారస్వతములో వాటి వైఖరి కొంత వెనుక మనవిచేసినాను. సాంఘికముగానూ, మతవిషయములో వీరేశలింగము గారి కాలమే యీపరీక్షకు మొదలు. భాషావిషయములో గిడుగురామమూర్తి పంతులుగారూ, కవిత్వ విషయములో సుబ్బారావు అప్పారావుగారూ, ఉపలక్షకులు. వారి పని క్రమముగా వ్యాపిస్తున్నది. సారస్వత విషయాలలో కూడా వెనకటియుగాన్ని తల్లక్రిందుచేసి వెనకటి విశ్వాసాలనూ, నమ్మకాలనూ, సూత్రాలనూ పరీక్షచేసిన దీ "కవిత్వతత్త్వ విచారము." పాశ్చాత్యవాసన బాగా తగిలినవారు కాబట్టి విషయాన్ని అతిగాఢముగా చెప్పినారు.రెడ్డిగారు.* మనము బ్రిటిషు సామ్రాజ్యములో చేరి ఉండటముచేత యింగ్లాండులో జరిగిన మార్పులు కొంచెము ఆలస్యముగా మనకూ వచ్చినవి. అటువంటి మార్పులలో ఇదొకటి. చూడండీ క్రిందివాక్యము :

"Once again in the early twentieth century, as in the early years of the neneteenth, political prejudice and literary criticism became confounded"
-A.C. Ward.

మనకు రాజ్యాంగముతో సంబంధములేదు కాబట్టి యీమార్పు సాంఘికముగా తలెత్తినది. ఇది సమంజసమే! రెడ్డిగారీ సంవత్సరాలలో ఇంగ్లాండులో ఉన్నవాడు కాబట్టి ఆపరివర్తనాన్ని అక్కడ కండ్లారా చూచినాడు. దానిని ఇక్కడ కలుగచెయ్యటానికి ప్రయత్నించినాడు.

* క్వాచిత్కముగా కొందరు కొంచము పాశ్చాత్యవాసనా **సహిత** మర్శనలు వ్రాయటము సూచిస్తున్నారు. "ఆధునిక వచన రచనా విమర్శన" మనీ "కవితా విమర్శన"మనీ, "మనువసు ప్రకాశిక" అనిన్నీ, దానిమీద ప్రతివిమర్శనలూ మొదలైనవి మూలమూలలుగా వెలువడుతున్నవి వెన్నేటి రామచంద్రరావుగారు, విమర్శ కాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారూ మొదలైనవారు వీటిలో జోక్యము కలిగించుకుంటున్నారు

# వింజమూరి మండలి : అలంకారతత్త్వ విచారము

1914 నాటికి నేను పట్నములో బి.ఏ. ఆనర్సు చదువుకుంటున్నాను. మా "వింజమూరిమండలి" వార మందరమూ యీ "కవిత్వతత్త్వవిచారం" చదివి చాలా ఆనందించినాము, విచారపడ్డాము కూడాను! చెప్పిన విషయానికి సంతోషము; పద్ధతికి విచారము! నేనేదో అప్పటికి అలంకారశాస్త్రము కొంచెము చదువుకొనడము చేత, ఆలంకారికులను తిట్టడమూ, కావ్యాని కలంకారా లనావశ్యకాలనడమూ చూచేటప్పటికి చిత్తము నిలువలేదు.◆ వెంటనే "అలంకారతత్త్వవిచార" మనే గ్రంథము వ్రాసి ముద్రించినాను* (15-10-1915). అచ్చుగాకపూర్వము దీనిని చెన్నాప్రగడ భానుమూర్తిగారికి చదివి వినిపించినాను. చాలా ఆనందించినారు. ఆయన ప్రోత్సాహమే చాలను కొన్నాను. అచ్చువేసినాను. సర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రికా సంపాదకులుగా ఉండేవారు అప్పుడు. ఆయన ఆపత్రికలో దీనిమీద ఒక్కపేజీ విమర్శనము వ్రాసినాడు. దూషణ భూషణలు చెరిసగముగా ఉన్నవి.

కట్టిస్థితిలో "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో" కొమ్ముమటేనుగైన వఝల చినసీతారామ శాస్త్రిగారు నాపుస్తకముమీద దీర్ఘమైన విమర్శన వ్రాసినాడు. ఒక వ్యాకరణ దోషాల లిస్టు ఇచ్చినాడు. అంత వైయాకరణీ విమర్శకుడూ వ్రాస్తే నేనేమి చెయ్యగలను? రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారుకూడా ఒక విమర్శనము వ్రాసినారు. దానికి నేను సమాధానము వ్రాసి కృష్ణా పత్రికలో ప్రచురించినాను. తర్వాత కొన్నాళ్ళకు శర్మగారి దగ్గరనుంచి ఒక ఉత్తరము వచ్చినది. 'దూషించుకొనుటకు

---

◆ అనంత కృష్ణశర్మగారితో నేను పోట్లాడగలనా అని తోచలేదు! ఈ గ్రంథాన్ని పొగడిన పత్రికలూ, వ్యక్తులూ, నాహిద పడతారేమో అని భయమూ వెయ్యలేదు!

* నేనొక గొప్పవాణ్ణనుకోడం, రెడ్డిగారంతవాణ్ణి ఢీకొనడము చేత మహావాళ్ళందరనుకున్నాక [illegible]. నేను సంతోష[illegible] తలుస్తించింది ఇది మాటోపాట! రెడ్డిగారు అసలు నన్నెవ్వ రెరిగి ఉంటారు? "మా [illegible] నేను రాసింది" అని ప్రతివారికీ నాపుస్తకం చూపడమే నాకు [illegible]. [illegible] మెచ్చి పెరిగినట్లు భావించుకున్నాను! గొప్ప లాక్షణికుణ్ణనుకున్నాను మా స్నేహితులు.

మనము ఛాందస పండితులము కామనీ' 'యిక రాసుకోకుండా విరమిస్తే మంచిదనీ' దాని భావము అనుకున్నాను.‡

ఇన్ని వ్యాసాలు గ్రంథాలు వ్రాసుకుని తుదకు రెడ్డిగారూ నేనూ ఒకే సిద్ధాంతానికి వచ్చినాము చూడండిః "సాదృశ్యములలో కొన్ని (సామ్యములు) సహజములును, ననివార్యములును. అవి తమంతటన యే ప్రయాసమును లేక వచ్చినయెడ గథాసందర్భములో కలసిమెలసి యుండును." (కవిత్వ తత్త్వవిచారము). "అలంకారముల నుపయోగింపవలెనని మన లాక్షణికులు చెప్పినపుడు సందర్భోచితముగనని మన మర్థము చేసుకొనవలసి యున్నది. (అలంకార తత్త్వ విచారము). మొత్తముమీద వాదోపవాదాలవల్ల భాషకుపకారమైనది!

కవిత్వానికి భావము, వస్తువు, రచన అనేవి ఉండవలెనని వెనక మనవి చేసినాను. రెడ్డిగారికి ఒక్క భావముతప్ప మిగిలిన రెండూ ఉపసర్జనాలు. ప్రతి పద్యభావము ఉండటము సాధ్యమూ కాదు, సమంజసమూ కాదు. ఈ సందర్భములో రెడ్డిగారి గురుప్రాయులైన అనంతకృష్ణశర్మగారి "సారస్వతోపన్యాసాలూ" "నాటకోపన్యాసాలూ" చదవమని మనవి.సాధారణముగా ఈమూటికీ ప్రత్యేకముగా మననానందపరిచే గుణముందని ఆయన సిద్ధాంతీకరించినాడు. అది సర్వథాసత్యము. హృదయమూ, బుద్ధీ అని రెండున్నవి మనిషికి. హృదయాన్ని భావమూ, బుద్ధిని వస్తుశైలులూ ఆనందింపజేస్తవి. అందరూ రెడ్డిగారి వంటి కళోపాసకులూ, రసలుబ్ధులూ, భావప్రియులూ ఉంటే, ఛాందసుల గతేమిటి? పాఠకులలో అందరూ రెడ్డిగారివంటి వారెప్పుడైపోతారో అప్పుడు కవిత్వము ఉత్తమకక్ష్యలోకి వెళ్లిపోతుంది. కాని అటువంటి సందర్భ మెప్పటికీ ఉండదు. పాఠకప్రపంచము మిశ్రము. పాఠకులెట్లా ఉత్తమ మధ్య మాధములుగా ఉంటూఉంటారో అట్లాగే కవులుకూడా ఉత్తమ మధ్య మాధమ కక్ష్యలలో ఉంటారు. కాబట్టే కావ్యాలను కూడా మన లాక్షణికులు ఉత్తమ మధ్య

‡ అప్పటినుంచీ పరిచయము లేకపోయినా శర్మగారంటే నాకు చాలా గౌరవము. అప్పటినుంచీ రెడ్డిగారు కూడా నన్ను కొంచెము జ్ఞాపకముంచుకున్నారు.

గ్రంథాలయ సర్వస్వ సంచికలో "సహవాసి", అలంకార తత్త్వవిచారము మీద విమర్శ వ్రాసినాడు (సం. 1 సంచిక 3)

మాధమాలుగా విభాగము చేసినారు. "కవిత్వతత్త్వవిచారము" లో రెడ్డిగారు విమర్శించిన విషయాలన్నీ ఆయనప్రకారము ఉత్తమకావ్యాలకు సంబంధించినవి * నిజముగా ఆలోచిస్తే మొదటి యే అయిదారో తప్ప యితరప్రబంధాలన్నీ ఉచ్ఛిష్టాలే అనవలె! ఈ మొదటివాటికి రెడ్డిగారు కూడా సర్టిఫికెట్టు యిచ్చినాడు చూడండి : "రాయకృతమైన యాముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణము, కాళహస్తి మాహాత్మ్యము వీనియందెల్ల నవ్యతయను గుణమున్నది." అన్నాడు. 17,18 శతాబ్దాలలో పందొమ్మిదో శతాబ్దము మధ్యము వరకు వ్రాయబడ్డ వాటిలో యేకొద్దో తప్ప మిగిలినవన్నీ గతానుగతికాలైనవి. కాబట్టి ప్రబంధాలను గూర్చి రెడ్డిగారు వ్రాసినది అసలు సత్యమే. కాని ఆ పతనకాల వాఙ్మయాన్ని గూర్చి వ్రాయటములో చాలా మాకుముగా వ్రాసినారు. మెత్తగా వ్రాయవచ్చు.

ఆయన వ్రాసిన పద్ధతిలో ఉండే లోపాలు కొన్ని చెబుతాను:

(1) సవిమర్శముగానూ సర్వసమ్మతముగానూ వ్రాయవలసిన చోట చాలా కఠినముగానూ, క్రూరముగానూ వ్రాయటము.

(2) శీలాన్ని పాతివ్రత్యాన్ని చాలా ఉదాత్తమని మనవాళ్లు అందరూ అద్భుతముగా అనుకుంటున్నారో, వాటిని నీచముగా నిరసించటము.◆

(3) లక్షణశాస్త్రాల్లో యేముందో తెలుసుకుని, అందులో విషయాలు సహేతుకాలుగా ఉన్నాయోలేవో తెలియకుండా వాటిలో ఉండే అలంకారాల పట్టీలూ, మొదలైనవన్నీ అవశ్యోపయోజ్యాలని భ్రమించి‡ వాటిపైన అసహ్యించుకోవడము. కావ్యప్రకాశిక, సాహిత్యదర్పణము, ధ్వన్యాలోకము చదివినాడా? అవి చదివి వాటిలో విషయాన్నెట్లా చర్చించినారో తెలుసుకుని వాటికీ, పాశ్చాత్యులు వ్రాసిన వాటికీ, ఎంతసమన్వయం కుదర్చటానికి వీలున్నదో పరీక్షించి కుదర్చటము తమవంటి

* ఈయన భావమని చెప్పేది ఉదాత్తమై "ఐడియలిజముకు" సంబంధించిన భావమో, "రియలిజము" కు సంబంధించిన భావమో తర్వాత వచ్చే యిట్టి చర్చలవల్ల తెలుస్తుంది.

◆ "Intentionally making great things small" అనే పద్ధతి ఇక్కడ పాటనురించినది.

‡ ఇది శాస్త్రము. వాత్స్యాయనుడు చెప్పిన సంగతులన్నీ ఆచరణలో ఎట్లాలేవో, అట్లాగే యివ్వేసి. శాస్త్రకారుడు సమస్తాన్ని చర్చించటము విధి

విద్యాధికుల కర్తవ్యము. అట్లా చెయ్యకుండా మన పుస్తకాలను పరీక్షించడము తగని పని.

(4) విమర్శనములో అనేక రకాలున్నప్పటికీ వాటిని స్మరించకుండా. మన కీనాటికున్న లలితకళా జ్ఞానముతో ఎప్పుడో వ్రాసిన గ్రంధాలను పరీక్షించడము, ఎన్నో శతాబ్దాలక్రింద అప్పటి సన్నివేశాలతో వ్రాసిన గ్రంధాలను ఇరవైయ్యో శతాబ్దాదర్శాలతో విమర్శించడము సమంజసము కాదు. పిడుక్కూ బియ్యానికీ ఒకే మంత్రమా?

(5) మనభాషలా వాటి సంప్రదాయాలూ, మన వాఙ్మయ మాతృకలూ, వాటి సాంప్రదాయాలూ గ్రహించకపోవడము.

(6) ఎంత మాత్రము సానుభూతి లేకపోవడము. ఇది అన్నింటి కంటె గొప్ప దోషము. విమర్శనానికి అది మూలాధారము. ఇది లేకపోతే పెడత్రోవ బట్టుతుంది విమర్శనము.

(7) గ్రంధ విమర్శనమూ, రసచర్చా, కాకుండా అనవసర ప్రసంగాలు చెయ్యడము. వాటిచేత గ్రంధ ప్రాశస్త్యము కూడా తగ్గిపోయినది.*

ఇవన్నీ యెట్లాఉన్నా ఈ గ్రంధములో మాత్రము గిడుగువారి భాషావాదము వలె ఇది యువక మండలిలో అత్యంత కలవరము కలగజేసింది. వెనకటి సాంప్రదాయాలు తెలియకుండా, కవితా సంస్కారమున్న యువకులు దీనిలో తమ కనుకూల పద్ధతిని కనిపెట్టారు. పూర్వసారస్వతముమీద నైరస్యముగల యువకు

* ఒక్కొకచోట రెడ్డిగారు వ్రాసిన అశ్లీలాలు ప్రబంధాశ్లీలాలను మించిపోయినవి. ప్రభావతీ పాత్ర విమర్శనములో, యింకా యిట్టివే అనేక స్థలాల్లో, ఈయన వ్రాసిన వ్రాతలు మనస్సులోకూడా తలవతగినవికావు. అన్నిటికి మకుటాయమానంగా ఈక్రిందివాక్యమిస్తాను: కలభాషిణీ మధురలాలసల తారతమ్యాను నుగ్గడించుచు, "మన దేశములో కులస్త్రీలకన్న వారకాంతలే యుత్తములనుట కిది యొక తార్కాణము. మన యిల్లాండ్రు యేకత్తెలుంగాదు. వంటకత్తెలు తప్ప! విద్యయు స్వయంవరణము గలవారు గాన గణికలు సౌమనస్యమున మిన్నలు. తక్కినవారి బ్రతుకెట్టిది? శారీరక క్రియలచే నిండినది" ఈ వాక్యాలు సహృదయానివా? దేశములో సమస్త స్త్రీలపై వ్రాసిన యీ గ్రంధము నేమనవలయునో యేమి చేయవలయునో యోజింపుడు. కులస్త్రీలు గాని వారి సంతానముగాని చదవదగినదిగాదీ గ్రంధము.

అందరికే, యీ నైరస్యానికి కారణాలు చెప్పలేకుండా ఉన్నస్థితిలో యీ గ్రంథము వాళ్ళకు వేదమైనది. అప్పారావు (బ) ఈ గ్రంథము చదివి గంతులువేసినాడు. రాయప్రోలువారు దానిలోనిగ్గు గ్రహించి గంభీరించినాడు. అప్పట్లో ఆయన నెవ్వరినీ యేమీ అనలేదు. ఆయన ఒక మార్గము త్రొక్కినాడు. దాన్ని యిటూ అటూ చూడకుండా అనుసరించటమే ధర్మము. ఇప్పటికీ యీ గ్రంథాన్నిగూర్చి అనేకుల మనస్సులలో అభిప్రాయ భేదాలున్నవి.*

ఇందులో సత్యములేకపోలేదు . నవ్యకవిత్వము బయలుదేరే రోజులలో, అదీ భావప్రధానముగా ఉండవలెననే అభినివేశ ముండే రోజులలో, భావానికి ప్రాధాన్యమిచ్చి, ప్రాచీన సంప్రదాయాల ననుసరించ నక్కర్లేదనే వాళ్ళకు ఈ పుస్తకము చాలా సహకారమైనది. భావకవిత్వము పాశ్చాత్యానుకరణము కాబట్టి వాళ్ల సారస్వత సంఘాలను విషయ వివేచనముచేసి చెప్పటము వాళ్లకు చాలా దోహదముచేసినది. కాబట్టి గ్రంథమెట్టిదైనా, ఏఉద్దేశ్యముతో వ్రాసినా దానివల్ల మాత్రము సారస్వత క్షేత్రములో చాలా ఉపకారమై, నవ్యకవులనుసరించే నవ్యతకు నీళ్లుపోసి పెంచే నవ్యాంధ్ర సారస్వతములో ఒక ముఖ్య విషయమైనది.◆ ఈయన చేసిన యీ సేవే యీయన పేరు సారస్వతములో చిరస్థాయిగా చేయగల విషయము.

---

* కాని రెడ్డిగారు గొప్పపదవిలో ఉండుటచేత యేమీ అనలేకుండా ఉన్నారు. నోరి నరసింహశాస్త్రిగారి యీ మాటలు చూడండి. "కవిత్వతత్వవిచారమునకు వచ్చిన ప్రచారము, రెడ్డిగారికి కావ్యరసగ్రహణములోగాని, విమర్శనలోగాని ఉన్న దక్షతవల్ల రాలేదనీ యెన్నో యితరకారణాలవల్ల వచ్చినదనీ మేము మనవిచేస్తున్నాము "

ఈ గ్రంథాన్నిగూర్చి విశ్వనాథవారేమన్నారో చూడండి "ఈ రోజుల్లో 1914 కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్వ విచారము వ్రాసి విమర్శగ్రంథాల్లో గొప్ప దృక్పథము కల్గించి నవ్యసాహిత్యానికి క్రొత్తదోవలు త్రవ్వినారు."

బుర్రా శేషగిరిరావు గారుకూడా యీ కాలానికి కొంచెము వెనకముందులుగా 'విమర్శాదర్శ' అనే గ్రంథము రచించినారు దీనిని "విమర్శాదర్శ విమర్శాదర్శ" అనే పేరుక్రింద పానుగంటివారు పునర్విమర్శించినారు

◆ "ఆంధ్రాంగ్లభాషా సంప్రదాయనేత్త యయిన మన కట్టమంచి రెడ్డిగారు కొండంతఖ్యాతిని కప్పుకొను మాలక్షణమే పనిచేసిన యుపకారపథము. రాయప్రోలు - అబ్బూరి - దువ్వూరి - పింగళి మున్నగువారి యభ్యున్నతి 'కానరా'' యిచ్చినవాడీయనయే!" (ఆంధ్రి - కార్తికి)

ఈయన అర్థశాస్త్రము పెడర్థాలతో నిండిఉంది. శాస్త్రముగాలేదు. అందులో వ్రాసిన విషయాలన్నీ పాతపడిపోయినై. దానిని మించిన గ్రంథాలొచ్చినై యిప్పుడా విషయముమీద! మిగిలిన ఉపన్యాసాలు మొదలైనవన్నీ తాత్కాలికాలేగాని వాటికి చిరస్థాయిత్వము సున్న. ఇక మిగిలినది "కవిత్వ తత్వ విచారము". ఇది మాత్రము తప్పక చిరస్థాయిగా ఉంటుంది. ఉండదగిందీని! వ్రాసినప్పటినుంచీ పాఠ్య గ్రంథముగానేఉంది, తర్వాతచాలా గ్రంథాలు కావ్యవిమర్శనము మీద పుట్టినా దీని స్థానము దీనిదే!◆ చక్కని, నిర్దుష్టమైన, చురుకైన, హృదయాకర్షకమైన, శైలిలో వ్రాసినాడీయన. ఈయన శైలికి సూదిగుచ్చుకున్నట్లు హృదయానికి సూటిగా వెళ్లే గుణమున్నది, ఇటువంటి తెనుగుశైలి వ్రాయగల వారు చాలా అరుదు. చక్కని హాస్యరసము. ఆయనలో ప్రబంధాలు కలగజేసిన జుగుప్స యొక్క పరిణామమది. ఆయనేమి చేస్తాడు? భావప్రధాన వాది కాబట్టి భావతీక్ష్ణత చాలా యెక్కువ. ఇప్పటికైనా ప్రాచ్యపాశ్చాత్య విమర్శనా సూత్ర సమన్వయము చేసి దేశానికీ భాషకూ ఉపకారము చెయ్యాలని ఆయనకు బుద్ధిపుట్టించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

నవ్యకవుల కొక ప్రోత్సాహమియ్యడమే కాకుండా రెడ్డిగారు చేసిన పని సరియైన విమర్శనము బైలుదేరటానికి మార్గము చూపించనే చూపించినది. అప్పటి నుంచీ కొంత నూతనమార్గములో విమర్శ, వాఙ్మయావలోకనము సాగినది. దర్భా ముక్ష్జేశ్వర సోమయాజులుగారు నవలావాఙ్మయాన్ని యెత్తుకొని విమర్శించినారు. పి. రామమూర్తిగారూ, భావరాజు కృష్ణారావుగారూ, నాటకాన్ని గూర్చి ట్రాజడీల యొక్క లక్షణాలు మొదలైన విషయాలనుగూర్చి గద్యచరిత్ర తీసుకుని పరిశ్రమ చేసినారు. ఆంధ్ర ప్రబంధాలనుగూర్చి గంటి జోగి సోమయాజులుగారు పరామర్శించినారు. "కావ్యప్రయోజనము" మొదలైనవి కూడా విమర్శకు పాత్రాలైనవి. తర్వాత యిప్పుడు పాటిబండ మాధవశర్మ, జమ్మలమడక మాధవరాయశర్మ,బులుసు వెంకటేశ్వర్లు, తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు. పిల్లలమర్రి హనుమంతరావు, వావిలాల

◆ దీనికి పునర్ముద్రణము జరుగుతున్నది అలంకారాలకు కావ్యములో స్థానాన్ని గూర్చి కొంత నూతనముద్రణములో చర్చిస్తారని వినికిడి. నా "అలంకారతత్త్వ విచారము" పునర్ముద్రించ దలచినాను అప్పుడు యీ గ్రంథాన్ని పరామర్శిస్తాను.

గూర్చి వ్రాసినాడు. ప్రచురించడము సాగించినాడు. ఇంతలో 'కవిత్వతత్త్వవిచారము' వెలువడినది. చదివినాము. వెనుకటి అభిప్రాయముమారి, "ఆంధ్రకవితా విమర్శన గ్రంథమాలిక" అని ఒకటి స్థాపించుదామని, రెడ్డిగారు ప్రారంభించిన విమర్శన కార్యాన్ని సరిఅయిన మార్గాల సాగించుదామని నిర్ణయించుకున్నాము. అట్లా గ్రంథమాలిక పేరు మారిపోయినది. రంగాచార్యులుగారు గ్రంథముకూడా విమర్శనమే కాబట్టి యీ గ్రంథమాలిక క్రిందే ప్రచురిద్దామని నిశ్చయించాము. "పింగళి సూరనార్యుడు" అనేది ప్రచురణమైనది. ఈ గ్రంథము ప్రకటింప బడ్డది. రెండూ చదివితే పాఠకులకే తెలుస్తుంది.* ఆంధ్రయువకులు పట్నములో విద్యార్థులుగా ఉండేవారంతా చాలా సంతోషించినారు. అలంకారాలను గూర్చి రెడ్డిగారి అభిప్రాయాన్ని విమర్శింతామని నాకు తీవ్రముగా యిచ్ఛ కలిగే టప్పటికి, అదివరలో నేను వ్రాస్తున్న "అయ్యలరాజు రామభద్రుడు" అనేదాన్ని మానివేసి "అలంకారతత్త్వవిచారాన్ని" వ్రాసి ప్రచురించినాను. ఇది యీ గ్రంథమాలలో రెండవ గ్రంథము. ఇదో పెద్ద ఉదంతము కాదుగాని అప్పట్లో విద్యార్థి కోటిలో గలిగిన భావపరివర్తనానికీ , ఆందోళనకూ, మే ముపలక్షకులమని మనవి చేస్తున్నాను. ఈ క్రింది ఉపోద్ఘాతములో వ్రాసిన వాక్యాలను గమనించండిః

"కేవలాంగ్ల విమర్శనా నియమములు మన యాంధ్రవాఙ్మయమును విమర్శించ టములో పనికిరావు. కేవలము మన పూర్వ విమర్శనా నియమములు ప్రస్తుతకాలమునకు తగవు. కావున నీ రెండు విధముల నియమములను సమ్మేళనము చేసి సంప్రదాయములు చెడకుండ విమర్శనమును సాగింపవలయును ... ... .. . సంప్రదాయ నిరసనము విమర్శనమును పెడత్రోవల కీడ్చుకొని పోవును. దానిచే (సారస్వతమునకు) భాషకును హాని కలుగును. కావున విమర్శనము సరియైన త్రోవల నడుపవలయు. ఆత్రోవలజాపుటకై యీ గ్రంథమాలిక యేర్పాటుప బడినది. ......... ఇందు వెలువడు గ్రంథముల యందు 'సంఘ సంస్కరణోపన్యాసములు' గాని, 'పూర్వాధునిక సంఘచరిత్ర విమర్శనములు' గాని యుండవు. సాకు పెట్టుకుని యాంధ్రకవులగాని, వాఙ్మయమునుగాని తిట్టుటలుండవు ... ....... ...'◆

* రంగాచార్యులుగారు "ఋతుసంహారం" అనే గ్రంథాన్ని తెనిగించినట్టు కొన్ని పద్యాలు భారతిలో ప్రచురితాలైనై ! - భారతి. రక్తాక్షి, కార్తీకం

◆ I was unlike others of my generation in one thing only. I had made a new religion, almost an infallible church of poetic tradition, of a fardel (bundle) of stories, and of personages and of emotions, inseparable from their first expression passed on from generation to generation." - W.B. Yeats

ఇట్టి యుద్దేశ్యములతో వెలువడిన గ్రంధమాలికను సాగించలేక పోయినాము.

"వింజమూరిమండలి" వారం అప్పటినుంచీకూడా మా యథాశక్తి- దేశభాషాసేవలు చేస్తూనే ఉన్నాము. కాని మాపని అంతా ప్రపంచానికి తెలిసే దార్ఢ్యము లేకపోవడముచేత కనపడ్డానికవకాశము లేదు.

ఒక ఉదాహరణము :

నేను కొన్ని సంవత్సరాలక్రింద భారతిలో "తంజావూరు నాయక రాజ్యా సంస్కృతాంధ్ర కవుల"ని ఒకవ్యాసావళి వ్రాస్తూ ఉండేవాడిని. వాటిలో ఒకదాన్లో తెనుగువాఙ్మయ

---

ఉడుత కుడుతాభక్తి అన్నట్టు సంతోషిస్తున్నాము. రంగాచార్యులు గారూ, నేనూ, అప్పారావూ, సీతారామమూర్తీ, అందరము ప్రెసిడెన్సీ కాలేజీ విద్యార్థులమే! మా కందరికీ వావిలకొలను సుబ్బారావుగారే ఆంధ్రగురువు "ఆంధ్రభాషాభివర్ధనీ సమాజ" మని కాలేజీ ఒక తెనుగు సారస్వత సంఘముండేది దాని పక్షాన ప్రతి సంవత్సరము ఒక బహుమతి ప్రచురించి యేటా ఒక ఉత్తమ విమర్శక వ్యాసానికిచ్చి దాన్ని సంఘ పక్షాన ప్రచురించడాని మేము మా గురువుగారి అనుమతి పొందినాము మొదటనే "ఆంధ్రవాఙ్మయమున పాల్కురికి సోమనాధుని స్థానము" అనే దానిని గూర్చి వ్రాసిన ఉత్తమవ్యాసానికి రూ 50 బహుమతి ప్రచురించినాము. సంఘానికి నేను కార్యదర్శిని అయిదో, ఆరో వ్యాసాలు పోటీకివచ్చాయని నాకు జ్ఞాపకము. అందులో నెల్లూరినుంచీ రామదాసయ్యంగారిదొకటి తుద కా బహుమతి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి వచ్చింది. వ్యాసము చాలా ఉత్తమముగా ఉంది హరివంశముచాలా ప్రశంసనీయమనీ, సోముడు తిక్కనంతవాడనీ వీరేశలింగం పంతులుగారి దగ్గరన్నుంచీ వచ్చేవాదాన్ని తీసుకుని, సమస్త విధాలా ఎఱ్ఱాప్రెగ్గడే పైచేయని సోదాహరణము నిరూపించినాడీయన. ప్రచురించుటము మాసంఘముచేత గాకపోయేటప్పటికి పాపము ఆయనే ప్రకటించుకున్నాడు. ఈ వ్యాసము మీద ఆధారపడి తన "సారస్వతోపన్యాసాల్లో" "నాచన సోమన నవీన గుణములు" అనే వ్యాసముకూడా రచించాడనుకుంటాను రెడ్డిగారివలె ఈయన అతిస్తుతికి గాని అతిదూషణకుగాని లోను గాడు. శైలి చాలా ఉదాత్తముగా ఉంటుంది కారణజాతము దృఢముగా ఉంటుంది. మంచి పటుత్వముగలభాష, పాండిత్యమేగాకుండా మంచిలోకజ్ఞానము. ఈయనకు మంచి కవితాధార ఉన్నట్టు "శాలివాహన సప్తశతి" వల్ల విదితమైనది. సంగీత జ్ఞానముకూడా ఉన్నట్టు మద్రాసు రేడియోలో యిచ్చిన ప్రదర్శనాలవల్ల, ఆంధ్రపత్రిక (వార) లో ప్రచురిస్తున్న సస్వరాలైన త్యాగరాయ కృతులవల్లా విదితము ఇప్పుడున్న పండిత విమర్శకులలో ఈయన ఒక అగ్రస్థానము వహించ తగినవాడు ఈయన నెల్లూరిలో జరిగిన నాటక కళా పరిషదధ్యక్షుడుగా ఇచ్చిన ఉపన్యాసము చదివి చాలా సంతోషించినాము. ఈయనను పదికాలాలపాటు ఉంచి ఆంధ్రభాషాసేవ చేయించాలని భగవంతుని వేడుతున్నాను ఆయన వ్రాసిన భావకవిత్వాన్ని గూర్చి వెనకనే స్పృశించిఉన్నాను.

గూర్చి పి. చెంచయ్య, రాజా భుజంగ రావుగార్లు "Heritage of India" పుస్తకమాలలో 'History of Telugu Literature" వ్రాస్తూ, దానిలో దక్షిణదేశ వాఙ్మయాన్ని తిరగకొట్టి ఆ గ్రాన్ని మార్చుమని ఆదేశమిచ్చారు; నేను మార్చనన్నాను  నిజముగా చూస్తే తెనుగు సారస్వతము చెంచయ్యగారికి భుజంగరావుగారికి బిడ్డలయి నాకు బిడ్డ కాలేదూ? వాళ్ళ యిష్టము వచ్చినట్లు అవాకులూ, చవాకులూ వ్రాయవచ్చునా? నేను దాన్ని ఖండించగూడదా? ఎక్కడిది న్యాయము?

పై గ్రంధానికి డాక్టరు రెడ్డిగారు ఉపోద్ఘాతము వ్రాసినారు  ఈ ఉపోద్ఘాతాన్ని గూర్చి భారతి యిట్లు వ్రాసింది. 'అది పిలవకలదేకాని యందు వచింపబడిన విషయములు నిజములని నమ్ముటచే దాని విలువ యించుక తగ్గిపోయినది? దేశభాషల్లో ఉన్న జైన బౌద్ధ వాఙ్మయాలను బ్రాహ్మణ మత పునర్విజృంభణము నాశనము చేసినదట! లింగాయతులచే బౌద్ధులు, జైనులు పడినపాట్లు వీరశైవవాఙ్మయము చదివిన వారి కెల్లరకు తెలిసిన విషయమే? అయినను రెడ్డిగారు నిష్పక్షముగనుండుట ఎంతయో! అట్లైనంగ కున్నను నిందను బ్రాహ్మణమతముపై మోపుట సంగతి" ఇంతవరకు ఉపోద్ఘాతంగూర్చి  తర్వాత పుస్తకాన్ని గూర్చి. "ఇందు ప్రమాదము లనేకములు కలవు ...... ఇందు విమర్శపక్కి కంటె కవిత్వపక్కి యెక్కువగ కనపడుచున్నది.................... ఈ గ్రంథకర్త లాంగ్లమున నిట్టి గ్రంథమును వ్రాయుటచే ఆంధ్రేతరులకు ఆంధ్ర వాఙ్మయమును గూర్చి తప్పుటభిప్రాయములను గలిగించుచున్నారు. అందువల్ల వీరు ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఉపకారముచేసిన వారుగ పరిగణింపబడరు". వీరు రఘునాధరాయలు వ్రాసిన వాల్మీకి చరిత్ర అన్య గ్రంథమని వ్రాసినారు. సరస్వతిలో ప్రచురింప బడ్డది. పద్యప్రబంధము. వీరు సామాన్యాలైన అనేక గ్రంథాలను చూచినట్టుగాకూడా కనపడదు.  -- భారతి. విభవ. ఫాల్గుణము

ఈ దక్షిణదేశ వాఙ్మయాన్నిగూర్చి వారన్నమాటలు రెడ్డిగారు "కవిత్వతత్త్వ విచారములో" వ్రాసినమాటలకు మించిపోయినవి.  సారస్వతచర్చ చేసేటప్పుడు మనస్సులో ఉన్నమాటచెప్పవలసిందే, కాని దాన్ని చెప్పటములో ఒక విధమైన సౌమ్యతా మెత్తదనమూ అవలంబించవలె! వ్యక్తులు ఇష్టమువచ్చినట్టు తిట్టుకోవచ్చు. తప్పులేదు.  ఎప్పుడో పుట్టి పెరిగి గ్రంథాలువ్రాసి భాషాసేవ చేసిన కవులనుగూర్చి వ్రాస్తూ తమస్వాభినివేశాలను పురస్కరించి అవాకులూ చెవాకులూ వ్రాయడము చాలా కూడనిపని.  అది భాషాసేవ యెంతమాత్రముకాదు.  రెండు వాక్యాల నా గ్రంథములోనించి అనువదిస్తాను.  "The fact is undeniable that the Southern School is immoral ......... The poets of the Southern School do not deal so much with marriage as with violation of chastity .............. They

preach immorality as a creed." పాతివ్రత్య మంటె తలకంటకముగాఉండి, మనస్తత్వ శాస్త్రముమీదే ఆధారపడి ఉన్న విమర్శకులు వీరికి యేమి సమాధానము చెబుతారో?

ఈవిధముగా సాహిత్య సంప్రదాయముపైన తిరుగుబాటుద్యమాన్ని రామలింగారెడ్డిగారు లేవదీసి చెంచయ్య భుజంగరావు గారల వంటి అనుయాయుల్ని సంపాదించుకున్నారు. పాశ్చాత్య విమర్శక సూత్రాలలో మనవాళ్ళు సాహిత్యాన్ని విమర్శించడము తరువాత కాలములో బాగా హెచ్చింది; మన దంతా చెత్తఅనీ పాశ్చాత్యుల దంతా ఘనమైనదనీ భావించి విమర్శించేటంత దుస్థితి పట్టింది. ఏమైనా రెడ్డిగారి 'కవిత్వ తత్త్వ విచారము' వచ్చిన తర్వాతనే కేవలశాబ్దిక విమర్శ నశించి, ఒక నూతనమైన విమర్శక దృష్టి మనవారికి అలవడిందని మాత్రము చెప్పవలె!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 4

## సాహితీ సమితి స్థాపనము

నవ్యసాహిత్య వ్యాపనానికీ, వెనుకటి వింశతి సంవత్సరాంతానికీ తుది విషయము సాహితీ సమితి స్థాపనము. నవ్యసాహిత్యానికి మూల స్తంభాలుగా ఎన్నుకున్న వాటిలో ఈ సాహితీ సమితి* ఒకటి అని ముందే తెలిపినాను.

అది 1918-1919 సంవత్సరాల మధ్యకాలము. అప్పటికి మన కీనాడున్నన్ని పత్రికలు లేవు; రేడియోలు లేవు; టాకీలు లేవు; తెలుగు దేశములో వాఙ్మయ పత్రిక అంటే ఏమిటో తెలియని స్థితి ఆనాటిది! ఆంధ్రపత్రికవారి సంవత్సరాది సంచికా, గ్రంథాలయ సర్వస్వమనే మాసపత్రికా, శారదా, అనసూయ మొదలైన కొద్ది పత్రికలే ఉన్న దినాలవి. ఖండకావ్యాలు వాటిల్లోనే తరచు అచ్చౌతూ ఉండి, వెర్రిఆవేశం యువకుల్లో కల్గించేవి. వేంకట పార్వతీశ్వర కవులు, రాయప్రోలు సుబ్బారావు, గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు మొదలైన కొలది ఆధునిక కవుల రచనలే ప్రచురితాలవుతూ కవితాత్మ కల యువకులను ఊరిస్తూ ఉండేవి. ఆనాడు కవిత్వానికి పరమావధి అవధానాలూ, ఆశుకవిత్వమూ అంటే సత్యదూరం కాదు. ఒకప్రక్క అవధానాలు, మరొకప్రక్క ఛందోబద్ధమైన సంఘ సంస్కరణోపన్యాసాలు! గిడుగువారి శిష్టవ్యావహారిక భాష 'గ్రామ్యభాష' అనే పేరు సంపాదించుకొని దూషణ తిరస్కారాలకు గురి అయినది. అలాంటి దినాలలో కార్యదీక్షగల కొందరు యువకులుచేరి, నిర్భయముగా ప్రజలా – పండితులా

---

* చూ॥ చిత్రభాను కార్తీక మార్గశిరముల 'భారతిలో' సమితిపై నోరి నరసింహశాస్త్రిగారు వ్రాసిన వ్యాసములు.

భారతి రజతోత్సవ సంచికలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వ్యాసము.

డిసెంబరు 30, 1946 ఆంధ్రపత్రికలో కురుగంటివారి ఉపన్యాసము.

దూషణ భూషణ తిరస్కారాలను లెక్కచేయకుండా యాదృచ్ఛికముగా ఈ సాహితీ సమితిని స్థాపించినారు.

జమ్మలమడక వారన్న వాక్యాల్ని గమనించండి:

'ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము కనపడవలసిన పరిణామము తత్పరీత ఫలమున్నూ యుద్ధ సమయములోనే భారతదేశములో పొడచూపినది. అంతకు పూర్వము భగ్నమై పోయిన సాహితిని బాగా సమీక్షించిన శ్రీ శివశంకరశాస్త్రి సాహితీ హృదయములలో అపూర్వ మధురస్పందము కలిగింది. 1916 సంవత్సరములోనే ఆయనలో కలిగిన సాహితీ నాట్యస్పందము మిత్రసోదర లోకములో సంచలించింది. వారి అందరిలోనూ సాహిత్య శక్తులను సృజించి గుప్తశక్తులను వికసింప జేసి తెలుగు దేశాన ఒక వెలుగును నిర్మించింది. శివశంకరా లోకమును సహృదయ లోకము మరచిపోలేదు. చుట్టుపట్ల సాహితీ స్పందము రూపుపొంది ధారావాహికమయి వెలసి 1918 వచ్చేటప్పటికి శివశ్రీ సాహిత్య స్పంద ధార ప్రాంతీయ సాహిత్యమును స్వదృష్టితో సమీక్షించి సమీకరించుకొన్నది. అప్పటికి కొంతగా వంగ దేశీయ సాహిత్య ప్రభావితమయిన శివశంకరుని హృదయము సాహితీ సమితి స్థాపనములో వ్యగ్రమై లగ్నమయింది.'

సాహితీ సమితి సభ్యత్వార్హతను గూర్చి శివశంకరశాస్త్రి గారి వాక్యాలనే చూడండి:

"బహుకాల పరిచయము, అన్యోన్య ఆదరానురాగములు, మనస్సుల కలయిక, భారతీయ సంస్కృతీ సంప్రదాయ విద్యలపై లక్ష్యము, శాంత చిత్తముతో వినయముతో పనిచేయు స్వభావము, కళ, భాష విద్యాశాస్త్రాదులలో దేనియందైన ప్రావీణ్యము, అమంగళకరములు, జుగుప్సాకరములైన వానిని పరిహరించి, ఉదాత్తములు ఉల్లాస ప్రదములు, విజ్ఞాన దాయకములైన కృషులు నెరవేర్పగల వారితో ఈ సోదరవర్గము సాహితీ సమితిగా వర్ధిల్లుతున్నది.

-ఆంధ్రపత్రిక మే7, 1947.

అలా స్థాపితమైన ఈ సంస్థ నవ్యసాహిత్య నిర్మాణములో ముఖ్య భాగ

స్వామి కావడము ఆశ్చర్యకరమైన విషయమే. ఈ సంస్థ అనంతరకాలములో ప్రచురించిన కావ్యాలు, అది ప్రచారము చేసిన భాష, అది నిర్వచించిన సాహిత్య సూత్రాలూ ఇప్పటికీ ఆంధ్రదేశానికి వరవడిగా ఉన్నవని చెప్పడము ఎంతమాత్రము సత్యదూరం కాదు. దీనితో సంబంధము కలవారే ఇప్పటికీ నవ్యసాహిత్య రంగములో ముఖ్యపాత్రలుగా ఉన్నారంటే ఇంత కంటే ఒక సంస్థకు అభ్యర్థనీయ మే మున్నది?

ఈ సమితి తెనాలిలో స్థాపితమైనది. కవిత్వమూ, లలిత కళలూ అంటే విశేషము అభిమానమున్న అనేక యువకులు కూడడము తటస్థించినది. వారంతా మిత్రులైనారు. అంతా ఇంగ్లీషు వాఙ్మయాన్ని అభినివేశముతో చదివి అవగాహన చేసుకున్నవారు, బెంగాలీ, హిందీ, మరాఠీ మొదలైన భాషల్ని అభ్యసించి ఆభాషలలోని కావ్యాల్ని చదవసాగినారు. నిరంతరము సాహిత్య గోష్ఠితోనూ, చమత్కార భాషణలతోనూ కాలము గడిపిన జిజ్ఞాసువులు వారంతా. కీర్తి కామమూ, స్వార్థమూ, అహంకారమూ వాళ్ళ మనస్సుల్ని కలుషితము చేయలేదు. ఒక్కచోట తారసిలిన ఆనాటి మధురప్రకృతుల సమావేశమే క్రమముగా సంస్థయై సాహితీ లోకాన్ని ఏలుతున్నదంటే ఎంతచిత్రం!

బాపిరాజుగారి యీక్రింది వాక్యాల్ని అవలోకించండి:

"సాహితీ సమితిలో మహాకావ్యకర్తలున్నారు. ఉత్తమకావ్యానికి కర్తలున్నారు. ఉద్దండులైన కథానికాస్రష్టలున్నారు. గేయ కావ్యస్రష్టలు, నవలాకారులు, ఏకాంకికా నాటక రచయితలూ, మహానాటక రచయితలూ, ఉత్తమ వ్యాసస్రష్టలు, విమర్శకులు, కావ్యస్వరూప చరిత్ర స్రష్టలూ, వచనాలు రచించేవారు, ప్రజ్ఞావంతు లెందరో ఉన్నారు. ఉద్దండ పండితులై మహాకావ్య కర్తలైన పెద్ద లున్నారు. ప్రజ్ఞావంతులైన నూతన కావ్యరచనోత్సాహ పూరితులైన యువకు లున్నారు. వీరిలో చిత్రకారులు, చరిత్ర పరిశోధకులు, శాస్త్రజ్ఞులు, బహుభాషావేత్తలు, సంగీత కళాభిజ్ఞులు, నాట్యరసానంద పరిపూర్ణులూ ఉన్నారు. ఇట్టి ప్రజ్ఞా పూర్ణమై ప్రతిభావంతమై, వ్యుత్పన్నతాశక్తి కలిగిన సంస్థ యీ సాహితీ సమితి."

(ఆంధ్రపత్రిక, జనవరి 18, 1948)

ఈ సాహితీ సమితికి తల్లావజ్ఝల శివశంకర శాస్త్రిగారు సభాపతి. ఈయన సన్నగా ఉండి, మధ్యపాపటతోను, వల్లెవాటుతోను, కనిపిస్తూ నేపధ్య రచనములో స్త్రీలవలె చాలాజాగ్రత్తగా ఉండేవాడు. ఈయన మూర్తి విలక్షణమైనది;* పలుకు దారుణా ఖండల శస్త్రతుల్యము, మనసు నవనీత సమానము.

శివశంకర శాస్త్రి (జననం 1892) అద్భుత వ్యక్తి. వ్యక్తేకాడు, మహా సంస్థ! ఈయనది పదమూడు తరాలుగా పండితవంశము. తండ్రిగారూ, పెత్తండ్రిగారూ, గొప్ప సంస్కృత విద్యాంసులు. ఈయన భార్య ఉద్దండపండితుడై "ధర్మజ రాజసూయ" మనే యినపగుగ్గిళ్ళ గ్రంధము మొదలైనవి వ్రాసిన నేతి సుబ్బారాయ శాస్త్రిగారి కుమార్తె! అటువంటి మామగారిక్రింద తర్బీ తైనా డీయన.

1911, 1912 సంవత్సరములనాటి కీయన గ్రంధరచన ప్రారంభించినాడు. అది నవలలు తయా రౌతున్నకాలము. అప్పట్లో వ్యక్తుల సారస్వతసేవ నవలారచనముతో ప్రారంభ మయ్యేది. అందులో పరివర్తనాలు. అందుకోసము ఈయన బెంగాలీ హిందీ భాషలు 1911లో చదివి నాట్నో నుంచి నవలలను పరివర్తనము చెయ్యడము మొదలు పెట్టినాడు. "రఘునాధజీ; తేజసింగు" అనేవి ఈయన వ్రాసిన ప్రధమ నవలలు. ఈయన గొప్ప పరీక్ష యేమీ ప్యాసుకాలేదు. ప్రతిభాశాలులకు పరీక్ష లెందుకూ? ఇప్పు డీయనతో మాట్లాడితే ఈయనకున్న విజ్ఞానము ఆంధ్రదేశములో ముప్పాతికమందికి లేదు! అప్పటి కింకా ఈయన విజ్ఞానార్జనములోనే ఉన్నాడు. క్రమముగా విజ్ఞానవంతుడైనాడు. నూతన భాషా సారస్వత మార్గాలన్నీ

---

* Twenty two years ago, he was lean, bony and a little stiff in his figure and movements. His behaviour used to be 'ultra masculine' as we used to call it. Although he was always of a deeply affectionate temperament, in those days he never liked any expression of sentiment and called it. 'sentimentality He used to politely move away if anybody touched him affectionately on the shoulder In his manners also there used to be much of the formality of an Englishman. For instance, he would never talk to an 'unintroduced' person in company When a stranger plied him with kindly questions, he replied curtly and referred to it afterwards as a 'question-paper' with great disgust

- Triveni March 1938

గమనించాడు. ఇవి యితర దేశములో యెటువంటి మార్పును ఎట్లా పొందినయ్యో
గమనించాడు. ఇవి యితర దేశములో యెటువంటి మార్పును ఎట్లా పొందినయ్యో
తెలుసుకున్నాడు. కాలగతి పరీక్షించినాడు. భాషా సారస్వతాలు తప్పక నూతన విజ్ఞానానికి లోబడవలెనని నిశ్చయించుకున్నాడు.

కాని ఈయన యిక్కడ నిర్ధారణ చేసుకున్న పద్ధతి చాలా ముఖ్యమైనది. రాయప్రోలువారి భావానికీ, అప్పారావుగారి భాషకూ, మధ్య ఒకవంతెన యేర్పరిస్తేనే కాని, అభివృద్ధి భవన నిర్మాణము కాదని గట్టిగా మనస్సులో నిశ్చయించినాడు. పండితులకు సమాధానము చెబుతూ ఉండవలె! మళ్ళీ వాళ్ళచేత ఒప్పిస్తూ ఉండవలె! అప్పారా యోపజ్ఞకమైనవాటికీ అవకాశము కలగ జేస్తుండవలె! ఆద్వారాకూడా వాఙ్మయాభివృద్ధికి దోహద మియ్యాలె! ఈ అన్ని భావాలకూ సమ్మేళనము కలగజేసేవాడు "రసవాది", కేవల భాషావాది కాదు. కాబట్టి రస మెక్కడ మార్పును అభిలషించినా, ఈయన వ్రాసేదిమాత్రము గ్రాంధిక భాషే* మిక్కిలి సహృదయుడు. అన్నింటికీ సానుభూతేగాని, ఖండన లేదు. ఎప్పుడూ సమాధాన పద్ధతి. ఈయనతో మాట్లాడి అందరు తృప్తిపడి వెళ్ళేవాళ్లు. ఎటువంటివాడి కెట్లా సమాధానమియ్యాలో అట్లాయిచ్చేవాడు. సంస్కృతములో ఉన్న సాహిత్యసిద్ధాంతాలకు సంబంధించిన లక్షణ గ్రంధాలూ, యింకా ఆంగ్లములో ఉన్న పొయటిక్సుమీద ఉన్న పుస్తకాలేకాకుండా, ఫ్రెంచి జర్మను భాషలు చదువుకుని ◆

---

* ఈయనలో ఒక వింత ప్రకృతి ఉంది. ఈయన వ్యావహారిక భాషావాది. వ్రాసేది అంతా గ్రాంధికం. అందులోనూ కవిత్వం నిర్దుష్టం. వీరిని వ్యావహారిక భాషావాదులలోని గ్రాంధికాభిమాని అని అంటారు కడంవాళ్ళు. ఈయన యెంత వ్యావహారిక భాషాభిమానియైనా సభలో "ఇప్పటికైనా ఆకస్మికముగా నిద్రలోనుండి లేపి విద్వాంసుల యెదుట ఉపన్యసింప వలసినదని కోరితే శకటరేఫలు, అర్ధానుస్వారాలు స్పష్టముగా వినబడేలాగ ఉపన్యసింపగలను" అని అన్నారు అట్టివారే శాస్త్రిగారు, వారి వ్యవహారిక భాషాపాదమును.

— కోటమర్తి చినరఘుపతి, ఢంకా, 1945 ఫిబ్రవరి

◆ He is a great linguist. He has a perfect knowledge of Sanskrit, Telugu and English. He is well versed in the Bengalee and Hindi languages and has translated famous books from them into Telugu. He knows, in various degrees, Pali, Prakrit, Marathi, Persian. Urdu, German, and maybe other languages.

— NORI

వాటిలో వ్రాసిన లలిత కళావిజ్ఞానము చదివి హృదయాన్ని ప్రపంచమంత విశాలం చేసుకున్నమనిషి.

ఈయన సహాయనిరాకరణములో రెండవమారు అరెస్టు అయినాడు. అరెస్టు చేసిన ఇనస్పెక్టరుగారు ఈయనగది సోదాజేసినప్పుడు ఆయనకు కనపడ్డవన్నీ పుస్తకాలే! అవికూడా ఆయన యెన్నడూ పేర్లు విననివీ కననివీని! ఆయన ఆశ్చర్యపడిపోయినాడు. "ఇదేమిటీ! ఈయన సహాయ నిరాకరణమంటారు? ఈయన దగ్గిర లలితకళా గ్రంథాలు తప్ప యేమీ లేవే? అయినా నాపనిని నేను నిర్వర్తించవలెగా!" అన్నాడు దగ్గ రున్న వారితో. దీనినిబట్టి ఈయన ఎన్నిగ్రంథాలు చదివినాడో గదా అని మనకున్నూ ఆశ్చర్యము కలుగక తప్పదు.

నవ్యసాహిత్యానుసారుల్లో యేదైనా ప్రశ్నవస్తే దాన్ని గూర్చి చర్చచేసి ప్రత్యుత్తరము సోపపత్తికముగా వ్రాయగలవారు చాలా తక్కువగాఉన్నారు. పద్యాల్లోనో, వచనాల్లోనో, వచన పద్యాల్లోనో "బూతు" నిర్విశేషముగా, నర్మగర్భముగా, ఊహాకందనట్టుగా, తిడుతూ వ్రాయసమర్థులు చాలా మంది ఉన్నారు. ఇటువంటివారు పోట్లాటను తెచ్చిపెట్టగలరు. కాని సమర్థించలేరు. వెనకటి తరములో అనుకునే వారు- "వెంకటశాస్త్రిగారు పోట్లాటలు తెస్తే, తిరుపతిశాస్త్రిగారు నాటిని సర్దడమే ఆయన పనైపొయ్యేద"ని. కాని వెంకటశాస్త్రిగారు దీనిని ఒప్పుకోరు. దాని సత్యా సత్యాలతో మనకు పనిలేదు. డీకొంటే ప్రత్యుత్తరాలను సహేతుకముగా చెప్పడము ప్రతీ వ్రాయసగాడికీ సాధ్యమా! ఎప్పటికీ కాదు! దానికి పాండిత్యమూ, తర్కశక్తీ ఉండవలె. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి మొదలైన కొందరు యీపని కుశ యుక్తులూ, తగిన వారూను. వీరీ ఉద్యమానికి ఉపద్రష్టలు. శివశంకరశాస్త్రి గాట కార్యవాది. ఈయన సామాన్యంగా పోట్లాట తెచ్చుకోడు. సాధ్యమైనంతవరకు తగువు చంపడము యీయన పద్ధతి. మన పని మన కయితే చాలు. ఈ సమాధాన పద్ధతితో యే పని చేస్తా నన్నవాడికి ఆ పనికి ప్రోత్సాహమిచ్చినాడు. ఇంతమందిని సాహితీసమితి సభ్యులను వ్యావహారికం రాయమని ప్రోత్సహించినాడు, వద్దనే వాళ్ళకు సమాధానం చెప్పినాడు; కాని తా నెక్కువగా సాధ్యమైనంతవరకు గ్రాంథికమే

శాస్త్రి వచ్చినాడు. ఏదో చిన్న వాళ్ళని కొందరి విషయంలో, వాళ్ళ బులపాటం తీర్చుకోనియ్యమని కొందరి విషయములోనూ, భాష నీ యిష్టము, భావము మాత్రము స్పష్టముగా ఉంటే చాలునని కొందరి విషయములో, రెండిటియందు నవ్యత చూపగలవాళ్ళను పేపుతడుతూ యీ ప్రకారంగా అందరినీ కూడదీసుకుని కార్యసాధనం చెయ్యడమే యీయన సభాపతిత్వానికి పరిణామం.

యావత్సమితీ ఈ కేంద్రముచుట్టూ పరిభ్రమిస్తున్న దీనాటికీ. ఖగోళానికి సూర్యుడెట్టివాడో సమితికి శివశంకరశాస్త్రిగారట్టివారు.

శివశంకరశాస్త్రిగారు కూడా ప్రాచీనానికీ, నవీనానికీ, లంకె అని చెప్పవచ్చు. ప్రాచీనాన్ని తెంచుకుండా ఉన్నవాళ్ళను కూడకట్టు కుంటూ, నవీనాన్ని ప్రోత్సహించి ఉభయులకూ సమ్మేళనస్థానమైనాడు. నిజమైన సారస్వత సేవకుడు! ఇప్పటికి నవ్యసాహిత్యములో ఆయన స్థానాన్నెవ్వరూ ఆక్రమించలేరు. ప్రవక్తృ స్థానానికి ఆయన్నే ప్రతివాడూ యెన్నుకుంటాడు.

శివశంకర శాస్త్రి, చింతా భీమశంకరం, చింతా దీక్షితులు, నోరి నరసింహ శాస్త్రి, కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, త్రిపురారిభొట్ల వీరరాఘవ స్వామి, పెద్దిభొట్ల వీరన్న శర్మ, వఝ్ఝు బాబూరావు, కొమ్మూరి హనుమంత రావు, కోపల్లె శివకామేశ్వర రావు, మునిమాణిక్యం నరసింహారావు, పెద్దిభొట్ల రామచంద్ర రావు, చామర్తి రాజశేఖర రావు, కొత్తపల్లి సుబ్బన్నా చార్యులు, సాహితీ సమితిలో ప్రథమ సభ్యులు. క్రీ.శ. 1919 లో సాహితీ సమితి స్థాపన జరిగింది.

1920లో 'సాహితీ' పత్రిక వచ్చినది. అనంతరము వేదుల సత్యనారాయణ శాస్త్రి, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, ఆయన అక్కగారు శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మ (అనసూయా పత్రికా సంపాదకురాలు,) కొప్పర్తి నారాయణ మూర్తి, నూతక్కి రామశేషయ్య,కొమాండూరు కృష్ణమాచార్యులు, మొక్కపాటి నరసింహ శాస్త్రి, విశ్వనాధ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు, నండూరి వెంకట సుబ్బారావు, నాయని సుబ్బా రావు, వింజమూరి పార్థసారధి, శ్రీనివాస శిరోమణి, సమతిలో చేరినారు. గిడుగు రామమూర్తి పంతులు గారు తర్వాత గౌరవ సభ్యులుగా చేరడము

విశేషముగా భాసించినవి. ఆతర్వాత ఎంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, అడివి బాపిరాజు, రాయప్రోలు సుబ్బారావు, కురుగంటి సీతారామ భట్టాచార్యులు సభ్యులైనారు.

'సాహితి' శివశంకర శాస్త్రిగారి సంపాదకత్వము క్రింద వెలువడుతూ వచ్చినది. ఈపత్రిక నవ్య సాహిత్య ప్రచారానికి బాగా తోడ్పడినది. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమానికి సాహితీ సమితీ, తత్పక్షాన వెలువడే 'సాహితీ' సంచికా దోహదము చేసినవి. గ్రాంధికవాదులైన యీ సమితి సభ్యులలో క్రమముగా వ్యావహారిక భాషపై ఆదరము కల్గడము ప్రారంభించినది. నిజానికి చూస్తే సాహితీ సంచికలలో చాలా భాగము వ్యావహారిక భాషారచనలు కన్పిస్తై.

ఈవిధమైన సాహిత్య సాధన చేసేవాళ్ళు ఒకవిధమైన నిర్భయత్వము కలగజేసి యీరకమైన సారస్వతానికి స్థాయిత్వ మిచ్చినై. సమితి పత్రికకు వ్రాసేవాళ్ళంతా జడిసి వ్రాసేవాళ్లు. ఇప్పుడా జడుపు వదలిపోయినది. "పైనించివచ్చే దెబ్బలను కాచుకోడానికి శాస్త్రిగారున్నారు" అనే ఒక నిర్భయత్వము కలిగిపోయినది! ఇది యీశాస్త్రి గారూ, యీపత్రికాకూడా వీళ్ళకిచ్చిన ప్రథమదోహదం! ఈపత్రికా, వ్రాసినవాళ్ళూ, వాళ్ళు చేసిన పనీకూడా రాబోయే వింశతి వర్షాలకు సంబధించినవి కాబట్టియిక్కడ ఆసంగతులను స్పృశించ నక్కరలేదు.

మొదట యీ సమితి సభ్యులు యెంతమాత్రము పూచీలేని వ్యక్తులవలె కనపడేవాళ్ళు! ప్రతివాళ్ళకూ హాస్యస్థానమైనారు. పెద్ద లనుకునేవాళ్ళు. వీళ్ళను లక్ష్యము చెయ్యలేదు. కొన్నాళ్ళుండి వెనక్కు తిరిగి చూచేటప్పటికి యీ సారస్వత మప్పుడే స్థిరమైపోయి కొంత జనాదరణాన్ని పొంది, యీ సాధకులు బాగా నిర్భయముగా వ్రాస్తూ, కొందరిచేత గౌరవింపబడుతూ వచ్చినారు. అప్పుడు కొందరు చాలా దుఃఖించినారు. మరికొందరు కాలస్థితిని తెలిసికోక వెనక గిడుగువారి భాషాసంస్కారవాదాన్ని ఢీకొన్నట్టు ఢీకొన్నారు. కాని యీదఫా వాళ్ళ ప్రయత్నాలన్నీ నిష్ఫలాలైనై. నవ్యసాహిత్యము స్థిరమైపోయినది.

ఈ సమితి, పత్రికా కూడా, నవ్యసాహిత్యానికి చేసినసేవ అపారము. ఈ సాహితీపత్రిక దోహద మిచ్చిన సాహిత్య వీధుల్లో ముఖ్యమైనవి ఖండకావ్యం. చిన్నకథ, పెద్ద నవల, ఏకాంకిక అనే నూతన ప్రక్రియలు. ఈ క్రొత్త ప్రక్రియలకూ, కీతులకూ శివశంకరశాస్త్రిగారే వేసినారు అనవచ్చు. అనేక యువ కవులను తయారుచేసి వారిచేత కవితా సాధన చేయించినాడు. ఈయన ప్రభావము లేని నవ్యకవి లేడంటే అత్యుక్తికాదు.* ఈ క్రింది వాక్యాలను గమనించండి:

"సాహిత్యప్రపంచములో క్రొత్తరీతులకు దోవ చూపించింది, క్రొత్త రుచులు ఎరిగించింది. కవితా కన్యను మనోహరముగా, చూడ ముచ్చటగా అలంకరించింది ఆమెకు క్రొత్తపోకడలు, నేర్పించింది, నవకవు లందరిలోకి తొలిదొల్త శ్రీశివశంకరశాస్త్రిగారే ఆయన చూపని సులభోపాయము లేదు కావ్యరచనా విధానానికి అవునన్నా కాదన్నా అనుకరించని ఆధునికులూ లేరు"

- రామకృష్ణశాస్త్రి

ఈ విధముగా శివశంకరశాస్త్రిగారి సభాపతిత్వము క్రింద సాహితీ సమితి నవ్యసాహిత్యములో నూతన ప్రక్రియలను సాధనచేస్తూ వచ్చినది.

ఆ నూతన ప్రక్రియలను గూర్చి ప్రత్యేకముగా గమనించుదాము.

---

* If modern Telugu writers can pride themselves on their very good sense of form in all fields of literature, - Drama, Poetry, or Story - the credit should largely go to Sastry.

It can be said without fear of exaggeration that there is no modern writer in the Telugu land who has not been influenced by Sastry to some extent It was he that was mainly responsible for the establishment of the 'Navya-Sahitya-Parishat'

Triveni March, 1938

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 5

# నవ్యసాహిత్యప్రక్రియలు

## ఖండ కావ్యము*

కావ్య లక్షణము పలువురు లాక్షణికులు పలువిధములుగా వ్రాసి ఉన్నారు. జగన్నాథపండితుని లక్షణాన్ని దాదాపు తరువాత వారంతా ఒప్పుకున్నారు. పాశ్చాత్య కావ్య లక్షణానికి దగ్గరగా ఉన్నది. మన ఆంధ్రదేశములో కూడా ఈ లక్షణానికి ఎక్కువ ఆదరణ ఉన్నది. ఈ లక్షణము చాలా విశాలమై గద్య పద్య ఉభయాత్మకమైన కావ్యాలకూ వర్తిస్తున్నది. ఈ లక్షణాన్ని బట్టి పరీక్షిస్తే ఖండకావ్యమూ, కథానికా తుదకు రసవదర్థ ప్రతిపాదకమైన శబ్దజాలమంతా కావ్యమే అవుతున్నది. మహాకావ్యమనీ, ఖండకావ్యమనీ నిర్వచిస్తున్నారే వానికి భేద మేమిటి అనే ప్రశ్న వస్తున్నది. దానికి కొంచెము పరామర్శ చేస్తాను.

మనవారు కొందరు ఖండకావ్య కథానికలు మనకు సహజ విధులు కావనీ, ఇంగ్లీషు సారస్వతములో వాని ప్రతిబింబాలనీ అంటూ ఉన్నారు. ఇది సరిగాదు. భారత భాగవతాది గ్రంథాలలో ఆయాచోట్లలో ఉన్న వర్ణనలూ ప్రబంధాలలో అక్కడక్కడ కొందరు విమర్శకులచేత అప్రస్తుతాలని అనబడే వర్ణనాంశాలు కూడా ఖండకావ్యాలనే మనము తలచవచ్చును. ఆయాకవులు ఈవర్ణనలను గ్రంథ రచనా కాలమునందే వ్రాయకపోవచ్చుననీ, తమకు ఊహాపరంపర వచ్చినప్పుడు తత్తత్కాలాలలో వ్రాసియుండి, గ్రంథరచనా కాలములో వానిని ఆయా సందర్భము లలో దూర్చియుందురనీ కొందరు సాహిత్య వేత్త లభిప్రాయపడుతున్నారు.‡

---

* కేవలము పాశ్చాత్య అనుకరణము కాదు

‡ ఈ ఊహ అనే భాషాంతరీకరణాలు, మాతృకలో కూడా ఈవర్ణనలున్నవి. అనే వాదానికి విరుద్ధము ఎంతమాత్రమూ కాదు

దీనిలో కూడా కొంత నిజ ముండ వచ్చును. ఒక్కటి మాత్రము గట్టిగా చెప్పవచ్చును. భాషాంతరీకరణాలలో ఉన్న ఇట్టి వర్ణనాస్థలాలలో ఉన్న భాగాలు తీసివేసినా గ్రంథము యొక్క నడకకుగాని, కధకుగాని క్షతిలేదు. ఈ విషయము పై ఊహకు బలమిస్తున్నది.

శాలివాహన సప్తశతి ఆంధ్రుల సొమ్ము. కర్త ఆంధ్రుడైన శాతవాహన చక్రవర్తి హాలశాతవాహనుడు. శాలివాహనా పరనాముడు.◆ 'తద్రచితమైన సప్తశతి సమస్తకావ్య వాఙ్మయానికి మూలభూతమని పరిశోధకులచేత తలచబడు తున్నది. ఆ గ్రంథము కాళిదాస కావ్యాలకు పూర్వము క్రీ.శ. ప్రథమ శతాబ్దములో సంపాదింప బడినది.✻ దానిలో అనేక కవుల కృతు లున్నవి. హాలుడు వాని నన్నిటిని సేకరించి స్వయముగా కొన్ని రచియించి పరిష్కరించినాడు. దానిలో ప్రతిశ్లోకమూ ఒక కావ్యము. ఒకశ్లోకానికీ అనుస్యూతార్థములేదు. ప్రతిశ్లోకమూ రసగీతమే! ఇట్టి కావ్యాన్ని సంస్కృత లాక్షణికులు "ముక్తకం" అనినారు. ఒక్కొక్క ఖండకావ్యము. దీనిలో దాదాపు అన్నిశ్లోకాలలో శృంగారమే ముఖ్య రసముగా ఉన్నది. అది ఒక విప్రతిపత్తికి కారణము కాదు. కాబట్టి ఇట్టి అసంఖ్యాకఖండకావ్యసంపుటి కల మన ప్రాచ్యసాహిత్యములో ఖండకావ్యము లేదనీ అది కేవల పాశ్చాత్య సాహిత్యానుకరణమనీ చెప్పటము సాహసమని తలుస్తాను, కాని అట్టి గ్రంథాలు ఎక్కువగా లేవు అంటే కొంత సత్యము ఉండవచ్చును. పాశ్చాత్య సాహిత్య పఠనము తద్రచనానికి దోహద మియ్యవచ్చును.‡ ఇచ్చినది. శృంగారమే గాక ఇతర రసాలను కూడా గ్రహించినారు రచయితలు, ఇతర సాహిత్య పఠనము మన సాహిత్యములో ఉన్న సారస్వత

---

◆ ఆయన పేర "శాలిగుం[illegible]మను" స్థలం మన ఆంధ్రదేశమునందున్నది. సప్తశతిలో అనేక తెనుగు మాటలు కలవు. తె[illegible]గు దేశపు మర్యాదలు, పంటలు, ఆచారవ్యవహారములును కలవు.

✻ It (Saptasati) stands at the root of all Romantic Literature in India and may be of the rest of the world as well."

*Some contributions of South India S.K. Iyyangar*

‡ "కథలకేం, ఖండకావ్యాలకేం, పాశ్చాత్యుల వరవడి". విశ్వనాథ (జయంతిలో)
చూ:.1939 డిసెంబరు భారతిలో ఇంద్రగంటి వ్యాసము.
మొదటి మోజుకు భ్రమపడి మనయువకులు "ఇది ఎక్కడిదా" అని తెలియక అలా అన్నారని నా ఊహ.

వీధులను విస్తృతము చెయ్యటము సమంజసమే! ఖండకావ్యము మహా కావ్యము యొక్క, కథానిక కథయొక్క, ఏకాంకిక నాటకముయొక్క సూక్ష్మ రూపాలు.◆ ఈ స్థూల సూక్ష్మ రూపాలు అన్యోన్యాశ్రయాలు, సూక్ష్మమైనవి కొంతకాలానికి తర్వాత స్థూలరూపము తాల్చవచ్చును. వెనుక స్థూలములో భాగమైనది ఇప్పుడు సూక్ష్మముగా కనపడవచ్చును.

మనకు కూడా యీ ఖండకావ్యమనే పదము నూతనము కాదు. పూర్వ లాక్షణికులు ఈ పదాన్ని ఉపయోగించినారు.‡ ఇప్పుడు నవీనులు ఖండకావ్యానికి ఏయే లక్షణాలని చెప్పుతున్నారో ఆయా లక్షణాలున్న మేఘసందేశ కావ్యాన్ని ఖండకావ్యమని నిర్వచించినారు. ముందు నేను చెప్పబోయే ఖండకావ్య లక్షణాలన్నీ కూడా మేఘసందేశానికి తప్పక వర్తిస్తాయని కనపడుతూ ఉన్నది. కాబట్టి నవీనులు చెప్పేవాదము సంపూర్ణముగా సత్యము కాదని గట్టిగా చెప్పవచ్చును.

మన చాటుపద్యాలు ప్రాస్తావిక పద్యాలు మొదలైనవి పరీక్షిస్తే ఖండకావ్యా లేలకావు? ఏపద్యాని కాపద్యము గీతము. ప్రతిదీ ఒక కావ్యము, ఇదికూడా నావాదానికి బలాన్ని ఇస్తున్నది. నవ్యసాహిత్యములో వీనికి రెంటికీ ప్రశస్తివచ్చి. సాధకులు పాశ్చాత్య వాసనచేత వ్రాస్తున్నారు అన్నంత మాత్రముచేత ఇవి అంట్లనీ ఎక్కడనుంచో తేబడి వాడబడినవనీ అనుకోటము న్యాయము కాదు. ఈ అవస్థను నవీనుల కథానికకు కూడా పట్టించినారు. దాని సంగతి వచ్చినప్పుడు ఆ విషయము మనవి చేస్తాను. ఖండకావ్యానికి లక్షణాలు కొన్ని క్రింద ఇస్తున్నాను.

మన పెద్దలందరూ కొన్ని వృత్తాలుగల కొన్ని శ్లోకాలు, అటువంటి కొన్ని శ్లోకాలుగల కొన్నిసర్గలూ, ఒకపూర్ణమైన కథ, అనుగుణమైన అష్టాదశవర్ణనలూ, అలంకారయుక్తమైన యితరవర్ణనలూ గలదే కావ్యమనే ఒక అపోహలో ఉండటముచేత నే నుల్లేఖించవలసి వచ్చినది. ఇట్లా అనుకోక యిప్పుడు వ్రాయబడేవాటినికూడా "రమణీయార్థ సహితా" లౌటచేత కావ్యాలక్రింద చేరిస్తే నాకు చాలా సంతోషము! కాని ఒక్క విషయమున్నది. వెనకటి కావ్యాలనుకునే రఘువంశ, కుమార

◆ పి. వేం. హనుమంతరావు రేడియో ఉపన్యాసము, హైదరాబాదు సమాచారము

‡ ఖండకావ్యానికి ముక్తకానికీ భేద మున్నది

సంభవాదులకూ, యిప్పుడు వ్రాయబడేవాటికీ కొన్ని విషయాలలో భేదము చెప్పి వీటి పార్థక్యము చూపదలచినాను:

## 1. పరిమితి

వెనకకావ్యాలు రఘువంశాదులు సంస్కృతములోనూ, మనుచరిత్రాదులు తెనుగులోనూ, కొన్ని వందల పద్యాలతో నిండి ఉండేవి. కొన్ని ఆశ్వాసాలక్రింద విభజింపబడి ఉండేవి. ఖండకావ్యాలనే పేరువల్లనే వీటిపరిమితి వాటికంటె తక్కువనీ అన్ని పద్యాలుండవనీ తెలుస్తున్నది. ఎంత? అనే ప్రశ్నకు ఇంత అని ప్రత్యుత్తరము ఇయ్యడము కష్టము! కాని ఒక్కటి చెప్పవచ్చు. సంస్కృతాంధ్రాలలో కావ్యాలనే శబ్దముతో ఏవి వ్యవహరింపబడుతున్నవో వాటి అన్నిటి కంటెను చిన్నవి అని మాత్రము చెప్పవచ్చు. ఒక్కొకప్పుడొకపద్యమే ఉండవచ్చు. లేక కొన్ని పదులు ఉండవచ్చు. కాబట్టి వెనకటి వాటికంటె పరిమితి తక్కువ.

## 2. వస్తువు

సామాన్యముగా కావ్యములో కథకుమొదలు, మధ్య, చివర, ఉంటవి. కాని వీటిలో ఒక అనుస్యూతమైన ఇతివృత్తముంటుందని చెప్పడానికి వీలులేదు, ఒక్కొక్క ప్పుడు ఒకటే సన్నివేశ ముండవచ్చు. మరొకప్పుడు కతిపయ సన్నివేశా లుండవచ్చు. అంతేకాని మొదటినించి కథా పర్యవసానము దాకా కథ జరుగదు. అంటే నవలలో వలె వచ్చిన ముఖ్యపాత్ర లన్నిటికీ పరిణామము ఉండడమనేదిక్కడ ఉండదు. అసలొకప్పుడు పాత్ర లేకపోవచ్చు! ఒకముండ్లకంప! ఒకపుల్లాకు! ఒకమెరుపుతీగ! ఒకయెండిన చెట్టు! ఇద్దరు స్నేహాస్పదుల కలయిక! ప్రణయానికి అభ్యంతరము! ఒక "లొటిపిట్టచావు"!! ఈ విధముగా కథ ఉండనవసరము లేదు! ఉంటే అది పరిణతి పొందనవసరములేదు! కవికి హృదయాన్ని కరగించి కవితగా పరిణమింపజేసిన యేసన్నివేశమైనా ఉండవచ్చు.* చూసినారా ఎంత భేదమో? తృణ కంకణాదులైన

* "ఒక చిన్న ఖండకావ్యము ఎట్టి పూర్ణానుభవాన్ని క్షణికంలో ఘనీభవింప జేసి మన యెట్టెదుట విస్పష్టమైన రేఖలతో భావ ప్రతిమను సృష్టించగలదో .... .........."
(మల్లవరపు 1939 ఏప్రిల్ భారతి)

"రమ్యాణి వీక్ష్య మధురాణి నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః .....జననాంతర సౌహృదాని" (కాళిదాసు)

రాయప్రోలు కావ్యాలలో కొన్నింటిలో కధ ఉండి ఇది యేకదేశముగా ఉంటుంది. మళ్లీ జడకుచ్చులు, మొదలైన వాటిలో అదీ లేదు. తొలకరి మొదలైన వాట్లో కవియొక్క ఊహామాత్ర గోచరాలైన సన్నివేశాలు! ఈ ప్రకారముగా ఉంటుంది. ఖండకావ్యము. ఇది ఒక గొప్ప భేదము.

# 3. భావ ప్రాధాన్యము

కధావస్తువు కవిహృదయానికి బైట ఉండకుండా కవి హృదయములో నుంచే ఉద్భవిస్తుంది. భావ వస్తు రచనల్లో భావానికి యిందులో ప్రాధాన్యము ఉంటుంది. భావమనగా వెనక నేను మనవి చేసినట్టు "అర్థం" కాదు, ఒక సన్నివేశము చూసినప్పుడు కవికి కలిగే చిత్తవృత్తి వికారము, "భావ" మనవచ్చు కొంతవరకు.* ఈసన్నివేశము కవి చూడనే అవసరమేలేదు. తలపవచ్చు, వినవచ్చు. ఒక వార్తవిన్నా డనండి! వెంటనే కవియైన వాడికి మనస్సులో ఒక విధమైన మార్పు కలుగుతుంది. ఇక్కడ మనస్సు, బుద్ధి, చిత్తము అనే పదాలకు ప్రత్యేకత నేను పాటించటము లేదు. వాటిని మూటిని దాదాపు సమానార్థకాలుగా ఉపయోగిస్తున్నాను. ఒక గానము విన్నప్పుడుగాని, ఒక పదార్థము తిన్నప్పుడుగాని, ఒకవ్యక్తిని కలసినప్పుడుగాని, ఒక దృశ్యము కంటపడ్డప్పుడుకానీ, చిత్తములో ఒకవిధమైన వికారము కలుగుతుంది. అది వాగ్రూపము గొనేటప్పటికి యీ ఖండకావ్యముగా పరిణమిస్తున్నది. ఇందులో ఉన్న రహస్యమిది.

# 4. కవి స్వానుభవము

వెనకటి కావ్యాలలో కవి పరోక్షుడుగాని ప్రత్యక్షుడు కాడు. వాట్లో కధకు ప్రాధాన్యముకాబట్టి ఆయా సన్నివేశాలలో కవిచెప్పే భావాలూ అనుభవాలూ కధలోని నాయికా నాయకులవేగాని కవివి గావు. ఇక్కడనో కధ ఉపసర్గము. కాబట్టి చెప్పే భావాలూ చిత్తజన్యవృత్తులూ పాత్రల కాపాదింప చేసినప్పటికీ అవి కవియొక్క స్వానుభవాలే! ఎక్కడైనా యిక అర్థాంతరన్యాసాలంకారాలుంటే వాటిని కవి

* దీన్నే "mood" అని కొందరంటారు

అనుభవాలక్రింద తీసుకోవాలె పాతకావ్యాలలో. కాని యీ అర్థాంతరన్యాసాలన్నీ దాదాపు లోకోక్తులో, లేక సర్వజనవిదితాలో నిత్యసత్యాలో, అయి ఉంటాయి. అవి కవిస్వానుభవాలని యెట్లా అంటాము! వెనటి వాళ్ళ "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ కదా శ్రోత్రియుల్" అనే మొదలైనవన్నీ యిటువంటివే! కాని యీ కావ్యాలలో అట్లా కాదు. కవి సన్నివేశాలను బట్టి తాననువదించే తత్వోపదేశాలు! ఈ క్రింది ఉదాహరణము చూడండి:-

"పరమ ధర్మార్థమైన దాంపత్యభక్తి
స్తన్యమోహనమైన వాత్సల్యసక్తి
సాక్షిమాత్ర సుందర మైన సఖ్యరక్తి
అందు నాదిమమగు ప్రేమయందె ముక్తి"

ఇక్కడ కవి భార్యాభర్తృ, మాతాపుత్ర, స్నిగ్ధుల మధ్యఉండే మూడురకాల ప్రేమనుగ్గడించి, వాటి కన్నిటికీ మూలసూత్రమైన ప్రేమను గూర్చి చెప్పి వరుసలో తారతమ్య చర్చ చేసినాడు. ఇట్టివే కవి స్వానుభవాలనేవి! ఇట్లాగే "ప్రేమ నలయించు సృష్టిదైవికము కాదు." "వియోగమందమృతమున్, విషమున్, సమవృత్తులే సుమీ' మొదలైనవికూడా యిట్టివే! సంస్కృతములో ఇటువంటివి ఎక్కడైనా కాళిదాసులో కనపడతాయి. అంతేగాని సామాన్యాలు కావు! ఇటువంటివి మనవాట్లో కూడా లేవా? చాటుపద్యాలు అటువంటివి కావా? అనవచ్చు! కాని చాటుపద్యాలలో మిగిలిన "పరిమితి" మొదలైన లక్షణాలున్నా అవి అర్థప్రధానాలూ, హాస్యరస ప్రధానాలూ, అంతేగాని తత్వాన్వేషణాది లక్షణాలు వాట్లో లేవు! భావప్రధానాలు అనడములోనే వీటికి వాటికి భేదము తెలుస్తుంది. తిరుపతి వెంకటేశ్వరుల "నానారాజసందర్శన" ముందముకోండి. అదీకూడా అర్థప్రధానమే! ప్రాసంగికమే! కాని అందులోనూ యెట్టి తత్వాన్వేషణమూ, భావగంభీర్యమూ లేదు!

ఈ క్రింది యెంకిపాట అంద రెరిగినదే:

యెలక జన్మములోన ఎవరమోనంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలక నాయెంకి!

ముందు మనకే జన్మముందోలె యంటి
తెల్ల తెల్లపోయింది పిల్ల నాయెంకి!
యెన్నాళ్ళు మనకోలె యీ సుకము లంటి
కంట తడి బెట్టింది జంట నాయెంకి!

ఇది తత్వకథనానికీ, భావప్రాధాన్యానికీ, పరాకోటి అనడములో తప్పేమి లేదు! "సిగ్గు, తెల్లబోవుట, కంటతడి" వీటిలో కవితత్వము యిమిడి ఉన్నది!

## 5. ప్రకృతి చిత్రాలు

ఈ నవ్యకవిత్వములో ఉండే ప్రకృతి వర్ణనలకూ, వెనకటి వాటిలో ఉన్నవాటికీ వెనక భేదము చెప్పినాను. ఈ ప్రకృతి చిత్రాలు స్వాభావికముగా రమణీయముగా ఉండడమే గాకుండా వాటి అంతరార్థమూ, దాన్ని విప్పి కవి చెప్పడమూ, కలుగుతుంది వీటిలో. అట్లా చెప్పడము అలంకారము క్రింది కొచ్చే టట్టుండదు.

## 6. ప్రణయ కీర్తనము

మన పూర్వకావ్యాలలో ప్రేమకూ, రతికీ, ప్రణయానికీ యెట్టి భేదము లేదు. "రతి" లో, అంటే యిటు "సంయోగము" లోనో "విప్రలంభము" లోనో పర్యవసించే ప్రేమ తప్ప మిగిలిన ప్రేమకంత ప్రాముఖ్యము లేదు. రసాలలో "శృంగారా" నికిచ్చిన ప్రాముఖ్య మితరాలకు లేదు. ఉండవలసినదే. కాని నవ్యుల దృక్పథము వేరు. పైరెంటిలో "విప్రలంభము" రమణీయము. కొందరికి అంతకంటె 'సఖ్యము' రమణీయతమము. జీవితానికి పరమావధి! అది స్వార్థరహితమైన అమలిన శృంగారము. సౌందర్యార్చనమే గాని సౌందర్యానుభవము లేదు, వీళ్ళకు! ఇది చాలా గొప్పభేదము. విప్రలంభము కంటె యెంత సునిశితమై పోయినదో శృంగారము చూచినారా? శృంగారమంటే సౌందర్యమే వీరికి! కాని రతిగా పరిణమించే చిత్తవికారము కాదు! ఇట్లా కొందరు. చాలామంది స్త్రీకి వెనకటి వాళ్ళవలె గాక చాలా గొప్ప స్థాన మిచ్చినారు, శృంగారముగా పరిణమించేదిగాక స్త్రీ పురుషుల మధ్య ఉండే ప్రణయము వీళ్ళకు ముఖ్యము.

## 7. గూఢత

దీని సంగతి తర్వాత విపులముగా చెబుతాను. ప్రస్తుతము దీన్ని "అన్యాపదేశము"గా ఎంచుదాము. అంటే కవి ఒక భావము హృదయములో ఉంచుకుని దాన్ని వేరే విధముగా చెప్పడము.

## 8. మనస్తత్వము

ఇది కూడా దాని లక్షణాలలో ఒకటి అంటారు. ఈ విషయము "సర్రియలిజము"లో చెబుతాను.

ఇంత మాత్రము వీటి పార్థక్యము మనవి చేసినాను. ఇంకా వివేచన కొద్దీ సూక్ష్మభేదా లుండవచ్చు! కాబట్టి ఇట్టి ఖండ కావ్యానికి ప్రాధాన్యమిచ్చినది సాహితీ పత్రిక. ఈ మార్గములో సాధకులు అనేక ప్రత్యేక పద్ధతుల ననుసరించినారు. వాటిలో ముఖ్యమైన వాటిని గూర్చి వచ్చే అధ్యాయములో తెలుసుకుందాము.

## "కథానిక"

ప్రతిభ పత్రికలో నవ్యసాహిత్య విమర్శకులలో ఒకరైన ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు "కథానిక"ను గూర్చి ఒక వ్యాసము వ్రాసినాడు. మొదట వారు నామనిర్వచనములో "కథానిక" అని నిర్ణయించినారు. ఇది యితర సారస్వతాలలోనుంచి మనము గ్రహించినది కాదనీ, మన పూర్వ సాహిత్యములోదనీ, లక్షణాలు సంపూర్తిగా నిర్వచింపబడ్డాయనీ, అగ్నిపురాణములో కథావిభాగ మీ విధముగా ఉందనీ, చెప్పి యీ క్రింది శ్లోకా న్ననువదించినారు.

"ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా తథా
కథానికేతి మన్యంతే, గద్యకావ్యం చ పంచధా"

గద్యకావ్యము అయిదు విధాలు. (1) ఆఖ్యాయిక (2) కథ (3) ఖండకథ (4) పరికథ (5) కథానిక అని. వీటిలో మనకు కావలసినది "కథానిక". ఈ క్రింది భాగము అనువదిస్తాను.

"భయానకం సుఖపరం గర్భే చ కరుణో రసః
అద్భుతోంతే సుక్ల్ప్తార్థా నోదాత్తా సా కథానికా."

కథానిక* బాహ్యలక్షణాలు రెండు : (1) కథ సుదూరముగా సాగిపోక పొందికగా ఉండవలె. (2) పెద్దసమాసాలు, వర్ణనలతోనూ కథా శరీరము బిగిసి పోగూడదు.

అభ్యంతరలక్షణాలు మూడు : (1) పఠితను భయసంభ్రమాశ్చర్యాలలో ముంచే విచిత్రసంఘటన లుండవలె. (2) కథాగర్భములో హృదయము కరిగించే సన్నివేశము కూర్చవలె. (3) పాఠకులు అనుకొనని కొత్త మళుపులతో కథ తమాషాగా ముగిసిపోవలె. ఇది కథానికా లక్షణము.

మహాకావ్యానికి చెప్పబడిన అష్టాదశవర్ణనలలో కొన్ని ఉన్నా ప్రబంధత్వానికి క్షతి లేనట్టు, దీనిలో బాహ్యలక్షణములు తప్పకుండా ఉంటూ, అభ్యంతర లక్షణాలలో యే ఒకటైనా లోపించవచ్చును. అయితే అద్భుత నిర్వహణము మాత్రము విడిచిపెడితే "కథానిక" రక్తికట్టడము చాలా కష్టము.

ఈ లక్షణములే ఇతర "భారతీయుల చిన్న కథలలోనూ, పాశ్చాత్యుల short stories లోనూ, బహుళముగా కనిపిస్తున్నవి." "అగ్నిపురాణమునకు పూర్వము దండ్యాచార్యులు, ఆఖ్యాయిక, ఆఖ్యానము, కథ అనే విభాగాలే చెప్పినట్టు సాహిత్య దర్పణములో విశ్వనాథ కవిరాజు చెప్పి, తానుకూడా వాటినే నిర్వచించి చాలా సూక్ష్మముగా ఆభాగము వదిలేశారు.

పాశ్చాత్య కథకులు "గోర్కి" "చకోవ్" "గాల్స్‌వర్దీ" "వెల్స్" మొదలైనవారి కథల్లో చాలావరకూ ఈ లక్షణములు కనుపించును." ఇంద్రకంటి నాపనిని చాలా తేలిక చేసినాడు. దీన్ని "కథానిక" అనే పేరుతో వ్యవహరించుదాము. ఈకథానికకు సాహితీ పత్రిక చాలాదోహద మిచ్చినది. ఈ కథానికకు వెనక విక్రమార్కచరిత్రలో, హితోపదేశములో పోలికలగుపిస్తాయనీ, పూర్వము ఉండవచ్చుననీ, అవి కాలగర్భములో

* చూ : 1. 'ఏకాదశి' 'కదాలహ'రు లకు శివశంకర శాస్త్రిగారు రచించిన పీఠికలు.
2. 'శోభ'లో భాస్కరభొట్ల కృష్ణరావు ఉపన్యాసము.
3. 1928 ఆగస్టు, 1939 సెప్టెంబరు, 1946 నవంబరు భారతి సంచికలు.

లీనమైపోయినవనీ కూడా చెప్పినాడు. మొత్తము మీద ఈ ఖండకావ్యానికీ, కథానికకూ పట్టుకొమ్మలైనవి సాహితీ సమితీ, తత్పత్రికాను.

## పాటలు : పదాలు※

ప్రసంగవశముచేత రెండు విషయాల నిక్కడ ముచ్చటిస్తాను : (1) పాటలు (2) పదాలు◆ వీటి నిర్వచనము, భేదము, చెప్పటము చాలా కష్టము. పాటలు చిన్నవి. పదాలు పెద్దవి అని అంటారు. అంటే పొడుగాటి పాటలు ఉండకూడదని కాదు. ఉండవచ్చు. ఉన్నవి కూడాను. సామాన్యముగా పదాలుకూడా చిన్నవిగా ఉండవచ్చు. క్షేత్రయ్యపదాలు చూడండి.† మూడు చరణాలు ఉంటైసామాన్యముగా. పాటలకు తుదిపాదములో మకుటము ఉంటుంది. పదాల్లో ఉండదంటారు. క్షేత్రయ్య వాసుదేవ పదాలలో తప్పక తుదిపాదములో పేరు ఉంటుంది. కాబట్టి ఈ అవ్యాప్తి, అతివ్యాప్తి ఎందుకు? రెండూ సమానార్థకాలని చెప్పడము సమంజసముగా కనబడుతున్నది. ఇవి కూడా ఒకప్పుడు భావప్రధానముగానూ, రసవంతముగానూ ఉంటవి. కాని అవన్నీ జానపదాలు కావడము, వాటిలోకొన్నిటికి కవి ఎవరో మొదలైన విషయాలు తెలియక పోవడము, ప్రాంతీయాలు కావడము, అంగాంగి భావ సంపూర్ణమైన కావ్యత్వము లేకపోవడము, "కళాసౌభాగ్యము" కొరవడడము, సహజముగా ఉండడము, వీరమో కరుణో ముఖ్యరసముగా ఉండడము, కథకెక్కువ ప్రాముఖ్య ముండడము, మొదలైన సంగతులు చూస్తే వాటికీ వెనక మనము చెప్పిన ఖండకావ్యాలకూ చాలా భేదమున్నది. వాటిని ఈ కక్ష్యలో చేర్పడానికి వీలులేదు.

---

※ "వీరగీతములు" (ఆంధ్రపత్రిక 29-9-40)

◆ ఇంగ్లీషులో వీటిని "బాలడ్సు" (Ballads) లో చేర్చినారు. మనవాళ్ళు కొందరు "జానపద వాఙ్మయ" మనీ, మరికొందరు "ప్రజారంజకాంధ్రసారస్వత" మనీ పరిపరి విధాలగా వాడినారు

† 'పదాలు - క్షేత్రయ్య' అని చిత్రభాను సం॥ ఉగాది సంచికలో రాళ్లపల్లివారు చక్కని వ్యాసము వ్రాసినారు.

'పద కవిత్వము' (సాహిత్య సమాలోచనము పి. వేం హ.)

కాని ఒక్కటిమాత్రము జరిగినది. ఈ ఖండకావ్యాలు తలెత్తిన తర్వాత ఈ విధమైన జానపదకావ్యాలకు చాలా ప్రచారము హెచ్చినది.*

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఇంగ్లాండు నుంచి వచ్చిన మొదటదినాల్లో రాజమండ్రి ట్రైనింగు కళాశాలలో ప్రొఫెసరుగా ఉండేవాడు. చరిత్ర చెబుతూ ఉండేవాడు. ఆయన గొప్ప దేశభక్తుడూ, భావోన్మాది! గీత గోవిందగీతాలు వినాలంటే ఆయన నోటనే వినవలె! ఆయనను గూర్చి తర్వాత మళ్లీ ముచ్చటిద్దాము.

ఈ వీరగాధలు వింటూఉంటే చాలా మనస్సుకు ఉత్సాహముగా ఉంటుంది. వాటిని సారస్వతదృష్టితో చదవక, సహజధోరణిలో, వాయిద్యముతో, నాట్యముతో, పాడుతూఉండగా వింటూ ఉంటే చాలా హృదయోత్సాహకరముగా ఉంటుంది. వీటికి ఈ కాలములో అనగా నవ్యసాహిత్య సృష్టికాలములో చాలా ప్రాముఖ్యము వచ్చినది◆ ఇప్పుడు వీటి నన్నిటిని సేకరించి అచ్చువెయ్యవలెనని చాలా శ్రమ పడుతున్నారు పెద్దలు.‡ ఇవి ప్రాంతీయాలు కావడముచేత చాలా శ్రమ పడవలె

---

* లక్ష్మీరంజనంగా రిట్లా అన్నారు.

"ఒక విలక్షణమైన కవిత్వచైతన్యం, శ్రోతలకు యేదో ఒక విధమైన అవ్యాజాను రాగం కలిగించే శక్తి, నాగరిక కవిత్వంలో దొరకని వక నిర్మలానందం, అకృత్రిమ భావం, వీటితో నిండిన జానపదగీతాలను తెనుగువాఙ్మయములో వకశాఖగా అంగీకరించి తీరాలి. అజ్ఞాతవీరుల శౌర్యం లోకం మరిచిపోకుండా, తెనుగువారెంత వీరులో లోకం తెలుసుకునేటట్టు చెయ్యాలె. వీర గీతాలు వ్రాసిపోయిన అజ్ఞాతకవులకు ఆంధ్రజాతియెంతయు ఋణపడి వుంది" ఈ వాక్యాలతో నేను యేకీభవిస్తున్నాను.

◆ చలమచర్ల రంగాచార్యులు మంజరీ ద్విపదలో వీరగాథ నుద్బోధించినాడు. రేడియోద్వారా వీరగాథలని అప్పుడప్పుడనేక వీరులను గూర్చికూడా వింటాము తెలుగులో.

‡ దేవేంద్ర సత్యార్థిగారనే ఆయన వీటిని సేకరించటానికి చాలా శ్రమపడుతున్నాడు. టేకుమళ్ళ కామేశ్వరరావుగారు యీయనకు చాలా సహాయముచేసినాడు. పాతపాటలని కామేశ్వరరావుగారు కొన్ని సంపుటాలుకూడా ప్రచురించినాడు. ఈయనకు ఆంధ్రలోకము చాలా కృతజ్ఞము.

నేదునూరి గంగాధరంగారు 4000 పైగా పాటలను పదాలను సేకరించి పాటుపడుతున్నాడు.

ప్రయాగ నరసింహశాస్త్రి, మునకపాటి విశ్వనాధశాస్త్రి మొదలైనవాళ్లు బుర్ర కథలను రచించి పదసాహిత్యని పెంపొందిస్తున్నారు.

వీటిని సేకరించడానికి. ఈ విషయములో కూడ సాహితీ సమితీయులు కృషి చేసినారు. చేస్తున్నారు.

# ఏకాంక నాటిక*

నవ్య సాహిత్యములో వచ్చిన మూడు విశిష్ట ప్రక్రియలలో ఖండకావ్య కథానికలను గురించి ముందు మనవిచేసినాను. మూడవది ఏకాంక నాటిక. ఇది కూడా పై రెంటివలెనే పరిమితావకాశము కలిగినది. నవ్యులకు దీక్షతో ఒక వస్తువుమీద తమ దృష్టిని కేంద్రీకరించి, అంగాంగి భావ నిర్వహణము చేసి మహాకావ్యాన్ని అందించే శక్తి ఉన్నట్టు తోచదు. ఈనాటి ప్రజలకుకూడా ఘట్టిగా రెండు మూడు గంట లొక్కచోట కూచునే ఓపిక లేకుండా పోతున్నది. నూటికో కోటికో ఉంటే ఉండవచ్చునేమో కాని ఇది సామాన్యముగా ఉన్నస్థితి. దీనికి తగినట్టుగా 'కావ్యానికలు', కథానికలు, ఏకాంకికలు బయలుదేరినవి. అల్బార్డే 'కప్' అనే సూత్రాన్ని బట్టి ఇవి సూక్ష్మ రూపాలని తేలిపోయినది. అయినప్పటికీ ఇవి స్వయంపూర్ణత కలిగినవేకాని మరొక దానికి అంగాలుకావు. దేనికదే ఒక రసగోళము. ఉన్న ఒక విషయాన్ని సంపూర్ణముగా దర్శిస్తాడు; సమగ్రముగా చిత్రిస్తాడు కవి. సూక్ష్మములో మోక్షము పొందించడము నవ్యులు సాధించే పరమసూత్రము.

ఖండకావ్య కథానికలలాగా ఏకాంకికా స్వరూపము మనకు ప్రాచీనమైనదే! ఇప్పటివాళ్లు దీన్ని కొత్తఅంటుగా భావిస్తున్నారు.ధనంజయుడు తన 'దశరూపకము' లో దశవిధ రూపకాలకు లక్షణము చెపుతూ ఏకాంకికను గురించీ చెప్పకపోలేదు. అంకమనీ, భాణమనీ, ప్రహసనమనీ, వీధి అనీ వ్యాయోగమనీ కొన్ని రూపక భేదాల్ని సూత్రించి లక్షీకరించినాడు. అంకమంటే ఒకే అంకము కలిగిన రూపకము. ఇది నాటకాదులలో భాగమైన అంకము కాక ప్రత్యేక లక్షణము కలిగినది. అంకమనే పేరుతో ఉన్నది. చూడండి :

---

* 1. చూ : "రూపక వికాసము" పిల్లలమఱ్ఱివారి సాహిత్య సమాలోచనము.
2. 'ప్రతిభ - భారతులలో' డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తిగారి వ్యాసము.
3. "ఏకాంకికలు" శివశంకర శాస్త్రిగారి పీఠిక

"ప్రఖ్యాత కల్పిత వృత్తంబు ప్రాకృత నరనాయకంబు కరుణ రసముఖ్యంబు స్త్రీ పరిదేవిత బహుళంబు వాగ్యుద్ధ, జయాపజయంబు భాణ తుల్యంబు". తత్స్పష్టేకాంకంబు దీనిలో వస్తువు ప్రఖ్యాతమైనదీ కావచ్చు. లేక పోతే కల్పితమూ కావచ్చు. కరుణరసము ప్రధానమైనదిగా ఉండవలెనట. స్త్రీ విచారము, లోభము, వాఙ్మాత్రాన్ని విధించవలెనట. భాణమువలె భారతీవృత్తి, కలిగి ఉండవలెనట. ఇలాంటిది అంకం' అని వ్యవదేశించినాడు. మన కిపుడున్న 'ఏకాంకిక' ఇలాంటి లక్షణాన్నే కలిగింది కాక పోయినా, ఇందులో కొన్ని విషయాల్ని ఇముడ్చుకున్నవి ఉన్నవి.

నాటకము ప్రకరణములనేవి కొన్ని అంకాలు కలిగి, అంగిరసముకలిగి, నాయికా నాయికలుండి నిర్వహింపబడుతవి. అందులో 'అంకము' యొక్క లక్షణాన్నిలా చెప్పినారు :-

'నానాప్రయోజన రసాశ్రయంబు బిందు వ్యాప్తి పురస్కృతంబునను ప్రత్యక్షనాయక చరిత మంకము'

అంగిరస పోషణము సర్వధా ముఖ్యకర్తవ్యము కూడ. దానికి చోటిస్తూ అంగరసాన్ని పోషించుకోవలె. అంటే అంగాంగ సంబంధము చెడకుండా, ఔచిత్యాన్ని పాటించవలసిన బాధ్యత ఉన్నది. ఇలాంటి బాధ 'ఏకాంకికా' కారునికి లేదు. ఇందులో ఒకే అంకము ఉంటుంది, ఒకే సన్నివేశాన్ని పురస్కరించుకొని. అంగరసమంటూ ఉండదు.

ఇక మిగిలినవి చూదాము.

"భాణం" ఏకాంకమే. ఇతివృత్తము కల్పితముగాను, ధూర్త చరితముగాను, ఏకపాత్ర ప్రయోగముగాను ఉంటుంది. 'ఏకాంకిక'లలో కూడా ఇలాంటి వస్తువు ఉంటూన్నవి లేక పోలేదు. కాని ఏకపాత్రాభినయమున్నవి కావు.

ప్రహసనము కూడా భాణతుల్యమే. ఇందులో 'హాసము' ప్రధానము కాబట్టి ఆపేరు వచ్చినది. మన ఏకాంకికలలో ప్రహసనాలు, చాలా ఉన్నవి. వ్యాయోగముకూడా ఏకాంకమే. విఖ్యాత చరిత్రము, హాస్యశృంగారేతరాలైన రసములకు ప్రాధాన్యము, కలిగినది. ఇప్పుడు వస్తున్న ఏకాంకికలలో ఇలాంటివీ ఉంటున్నవి.

అయితే ఏకాంకికా లక్షణము గమనించుదాము. పూర్వము దశవిధ రూపకాల్లో కన్పిస్తున్న 'ఏకాంకము' కలిగిన భాణ, ప్రహసన, వ్యాయోగ వీధులతో సాజాత్యము కలదిగానే కన్పిస్తున్నదీ 'ఏకాంకిక'. కాని సంపూర్ణముగా ఆ లక్షణాల్నే కలిగి మట్టుకు లేదు. పాశ్చాత్య సాహిత్యాల ప్రభావము నూతన ప్రక్రియల మీద ఉండనే ఉన్నది. ప్రాచీన సాహిత్యాన్ని స్వరూపాన్ని మరచిపోతూ, పాశ్చాత్యానికి మురిసి పోతూ ఉన్న దినాలు రావడము వల్ల నవ్యప్రక్రియలు అక్కడినుంచి దిగుమతి చేసుకుంటున్నామని తలుస్తున్నారు; నిజానికి అంతే జరుగుతున్నది. ముందు మురిసిపోయి, వారి ప్రక్రియలనుకుంటూ తెచ్చి నాటుకున్నారు. ఒక్కమాటు పెద్దలు వీపుచరిచి వెనక్కుచూచుకోరా అబ్బాయి అనాల్సి వచ్చినది. ఖండకావ్యము ముక్తకాదుల్లోను, కథానిక ప్రాసంగికాదుల్లోను, ఏకాంకిక భాణాదుల్లోను, బీజభూతముగ ఉన్నవే కాని సరికొత్తవి కావు.

కథానికకు ఏకాంకికకుపోలిక ఉన్నది. ఒక్క సంభాషణము మినహాయిస్తే. కథానిక లక్షణము ఏకాంకిక లక్షణము ఒకటే. దీన్నే 'In dramatic composition, the equivalant of the short story is the one-act play, be it drama or comedy or farce.' అని బ్రాండర్‌మాథ్యూస్ అన్నాడు.

ఏకాంకికా లక్షణాన్ని ఇలాఇలా చెప్పుకోవచ్చు :

1. ముఖ్యముగా 'ఏకాంకిక'లో ఒక్క సన్నివేశమే ఉంటుంది. దానికి తగినట్టుగా పరిమిత పాత్ర సంఖ్య - అంటే నాలుగైదు పాత్రల కన్న ఎక్కువ ఉండకూడదు.

2. దీర్ఘసంభాషణ లేకుండా కథాగమన వేగానికి అనుకూలించే చిన్న చిన్న సంభాషణలు ముచ్చటగా, చిత్రముగా ముక్తసరిగా ఉండేవి రచించవలె.

3. వస్తువు ప్రఖ్యాతమూ కల్పితమూ కావచ్చు.

4. ప్రధానముగా ప్రయోగ గౌరవము కలది ఏకాంకిక. సులభముగా ప్రయోగించేందుకు వీలైయ్యేటట్లే ఉండవలె కాని అన్యథా ఉంటే ముఖ్య ప్రయోజనము చెడుతుంది.

5. దీనికూడా కావ్యత్వము ఆపాదించడము కర్తవ్యము. సంపూర్ణ రసానుభూతి కల్గించవలె.

6. దానితో సందేశాన్ని కూడా అందజేయాలి.

ఇలాంటి లక్షణము కలిగిందీ ఏకాంకిక మన ప్రాచీన రూపకాలతో కేవలము భిన్నంగా కాకుండా ఉన్నటువంటిదీ ఏకాంకిక అని తేలుతుంది కాని తెలుగులో పూర్వము మనకీ విధమైన నాటికలున్నట్లు తెలియటము లేదు.

ఈ ఏకాంకికలు వస్తువును బట్టి కొన్ని విభాగాలుగా కన్పిస్తున్నవి : సాంఘికము; చరిత్రాత్మకము; మనస్తత్వ చిత్రణము, పౌరాణికము, - అని. రచనను బట్టి కూడా విభజింపవచ్చు. పద్యనాటిక; వచననాటిక, గేయనాటిక.

ఈ విధముగా ఏకాంకిక విశిష్టరూపాన్ని పొంది నవ్యసాహిత్య ప్రక్రియలలో స్థానము వహించినది.

సాహితీ సమితి సభ్యులలో శివ శంకర శాస్త్రి, నోరి నరసింహ శాస్త్రి, శ్రీనివాస శిరోమణి, మొక్కపాటి, కొడవటిగంటి, వెంకట సుబ్బయ్య మొదలైన వాళ్లు ఏకాంకికను వ్యావహారిక భాషలోనే రమ్యముగా రచిస్తూ వచ్చినారు. తరువాత చాలామంది బయలుదేరినారు. వాళ్లనుగూర్చి తరువాత తెలుసుకునేందుకు అవకాశము వస్తుంది.

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

## 6

## కొన్ని తిరుగుబా టుద్యమాలు

ఈ సంవత్సరాలలో ఎలాగైతే జస్టిసు పక్షము తలెత్తినదో అలాగే నియోగి వైదీకి కక్ష కూడ కొంత కలకలము కలుగచేసినది. ఈ ఉద్యమానికి రెండు కారణాలున్నై. మొదటిది నియోగులలో వైదిక కర్మాసక్తి; రెండవది సర్కారుద్యోగాలు. ఇదివరలో వైదిక వృత్తి అంతా వైదికుల చేతులలో ఉండేది. ఆబ్దికాదులలో నియంత్రణ వగయిరాలకుకూడ వైదికులనే నియోగులుకూడా ఆహ్వానించేవారు. పంచదశ కర్మలు చేయించడములో బ్రహ్మత్వము కూడ వైదికులకే ఉండేది. అసలు ఎన్నోవందల సంవత్సరాలనుంచీ వస్తున్నదీ రెండు శాఖలకూ వ్యత్యాసము. ఇక్కడ రెండుదాహరణలిస్తాను. సంస్కృత కవులంతా వైదీకులనీ తెనుగు కవులంతా నియోగులనీ ఒక ప్రతీతి ఉన్నది. ఇందులో మొదటి దెట్లా ఉన్నా రెండవది మాత్రము సత్యమనే తోస్తుంది. అధిక సంఖ్యాకులైన ఆంధ్రకవులు నియోగులే; ఇది ఒకటి. నియోగులు రాజులదగ్గర మంత్రులుగాకూడ ఉండడము రెండవది. తర్వాత వీరిద్దరికీ ఆచార వ్యవహారాలలో, వేషభాషలలో కొంత భేదము కూడా కనబడుతున్నది. వీటి నన్నిటినీ అలా ఉంచండి.

వీటిని పురస్కరించుకొనినది వైదీకులమీద తిరుగుబాటుద్యమము. దీనికి ద్వైతాద్వైత కోటీశ్వరశర్మశాస్త్రిగారు నాయకుడు. ఈయన కొక తమ్ముడుండేవాడు. మార్కండేయ శర్మగారని. వీరిద్దరిలో చాల భేదమున్నది. కోటీశ్వరశర్మగారు మంచి స్ఫురద్రూపి. వాగ్ధాటి కలవాడు. గౌడల తావళము వేసుకుని శాలువ కప్పుకుంటే శంకరాచార్యుల అవతారమువలె ఉండేవాడు. ఈయన ఉపన్యాసాలకూ ప్రచారానికీ, చందా వసూలుకూ తగినవాడు. మార్కండేయ శర్మగారు చాల సౌమ్యుడు. పండితుడు. వ్రాయసగాడు. అన్నగారి కంటె నిజమైన కర్మాసక్తి కలవాడు. మార్కండేయ

శర్మగారు భారత ధర్మానికే కాకుండా, ఆంధ్రభాషకు కూడా మహోపకారము చేసిన వ్యక్తి. ఈయనకు నియోగ ఉద్యమముకంటె ధర్మప్రచారాసక్తి ఎక్కువ. వీరిద్దరిలో కోటీశ్వర శాస్త్రిగారు గుంటూరు నివాసముగా ఏర్పరచుకున్నాడు. మార్కండేయ శర్మగారు పట్నములో ఉండేవాడు. 'నియోగి' అనే మాసపత్రికను 1920లో ప్రారంభించి నడిపినాడు. వీరు తదుద్యమ ప్రచారము కోసము 'స్వధర్మప్రకాశిని'* అనే మాసపత్రిక ఒకటి 1923 లో స్థాపించినారు. దానికి సంపాదకుడుగా ఉండేవాడు మార్కండేయ శర్మగారు. అది ధర్మప్రచారమే గాకుండా సారస్వత కృషికూడ చేస్తూ ఉండేది.

గుంటూరీ ఉద్యమానికి కేంద్రము. అక్కడి న్యాయవాదులూ, ఉద్యోగస్థులూ యాకక్షతో తొణికిస లాడుతూ ఉండేవాళ్ళు◆ వీళ్ళలో కొందరెపుడో వదలిన సంధ్యావందనాలు, ఔపాసనలు, అగ్నిహోత్రాలు, మళ్ళీ గ్రహించినారు. ఈఉద్యమానికి మూలము ఇంతకు వెనకనే ఉన్నది. నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులుగారని వెనక తరములో ఒక మహనీయుడు ఈ ఉద్యమాన్ని లేవదీసినాడు. నియోగులలో నిజమైన కర్మాసక్తి కలుగజెయ్యాలని ఆయన లేవదీస్తే అది యీ కాలానికి ఇట్లాగా పరిణమించినది. దీనికి "పద్ధతి నియోగ" మని పేరు. ధర్మము జీర్ణమైపొయ్యే కాలములో ధర్మోద్ధరణానికి తలపడ్డ ప్రతీ ఉద్యమము మంచిదే! వైదికులు కూడ అధఃపతితులయ్యే ఉన్నారు. వాళ్లు వృత్తి వదిలి ఉద్యోగ కాంక్షతో ప్రవర్తించే టప్పటికీ ఉద్యమము బలవంతమైనది. ఇప్పుడు ఈ రెండు తెగలే కాకుండా యావద్భారత జాతీ కూడా ధర్మచ్యుతమయ్యే ఉంది. అది పరమేశ్వర సంకల్పముగా ఉన్నట్టు కనబడుతుంది! ఈ రెండు ప్రశ్నలకు సమాధానము చాల కష్టము. ధర్మ మెపుడూ ఒకటే అని ఒప్పుకున్నా, తత్ప్రవృత్తి మార్గాలలో మాత్రము భేదము కనబడుతుంది. కాబట్టి వెనుకటి మార్గాలెల్లప్పుడూ ఉండమంటే ఉండవు. మార్గ పరివర్తనముతో ధర్మ పరివర్తనమే అవుతున్నదని భ్రమపడుతూ ఉంటామేమో? ఈ నియోగి

---

* ఇందులో వ్యాసాలు నాకు చాల ఉపకారకాలైనై.

◆ ఈ ఉద్యమానికి పరిణామముగా చిల్లర ఉద్యోగులకు చాలా ప్రమాదముగా ఉండేది. ఎద్దూ ఎద్దూ పోట్లాడితే లేగ దూడల కాళ్లు విరగకొట్టినవట!

ఉద్యమము కూడా తిరుగుబాటు మార్గాలలో ఒకటి. ఈ ఉద్యమ మీకాలములో సారస్వతానికి గొప్ప కార్యము చేసినది.

## కవుల పోట్లాటలు

అప్పటి కింకా తిరుపతి వెంకటేశ్వరుల శతావధాన ప్రజ్ఞకు కొంచెము వాళ్లవలెనే వార్ధక్య చిహ్నాలు పట్టినా, ప్రచారములోనే ఉన్నది. ఇంతలో కొప్పరపు సోదరకవులు (సుబ్బరాయకవి, రమణకవి) దేశములో ఆశుకవిత్వావధానాలు చెయ్యడము మొదలు పెట్టినారు. ఇందులో ధారణాశక్తి అంత అక్కరలేదు. వరసగా పద్యాలు ధారగా చెప్పుకొనిపోవడమే అందులో ముఖ్యము. చెప్పడము మాత్రము చాలా తొందరగా చెప్పేవాళ్లు. ఆ చెప్పినవి తప్పులు లేకుండా, రసవంతముగా ఉన్నాయా అనే చర్చ అక్కరలేదు. రసమంటే అంత వేగమైన ధారలో ఎక్కువగా రస ముండడము అసంభవము. రెండవది తప్పులు ఉన్నాయా అని పరీక్ష చెయ్యడాని కవకాశమేదీ! మన మొక్క పాదము ఆలోచిస్తుండగా అప్పుడే కొన్ని పాదాలు ముందుకు వెళ్లిపోతారు కవులు. వెనకటివి వారికీ మనకూ కూడ జ్ఞాపక ముండవు. ధారణ అక్కరలేదు. వీరి కవితాధార అమోఘముగా మద్రాసు మెయిల్‌వలె వెళుతూ ఉండేది. మధ్య మధ్య అడ్డము వచ్చిన వాళ్లమీద కూడా పద్యాలు. ఈవిధముగా ఒక సారస్వత విషయమైన పండగగా ఉండేది వీళ్ల ఆశుకవిత్వావధానము. ఇక తిరుపతి వెంకటేశ్వరులా! అప్పటికి దాదాపు పావుశతాబ్దము నుంచీ అనేక శతావధానాలు చేసి ఆరితేరిన వాళ్లు. 'మావలె శతావధానాలు చెయ్యమని వీళ్లూ' 'మావలె ఆశుకవితాధార చెప్పమని వాళ్లూ' తొడచరుచుచున్నారు. కొప్పరపువారు నియోగులు కావడము, తిరుపతి వెంకటకవులు వైదీకులు కావడము దైవికము. మొత్తముమీద కొంత అవ్యాప్తి అతివ్యాప్తులున్నా నియోగులంతా కొప్పరపువారి పక్షము. వైదీకులంతా తిరుపతి వేంకటేశ్వరుల పక్షము. ఈవిధముగా శతావధాన, ఆశు కవిత్వావధాన పరంపరలు జరిగినవి. వీళ్లు చేసిన చోట వాళ్లు ఎక్కువగా ఉండలేదు. వాళ్లున్నచోట వీళ్లుండలేదు. ప్రత్యేకముగా ప్రగల్భాల కంతులేదు. ఇందులో తిరుపతి వెంకటేశ్వరుల కొక విశేషముంది. దేశములో అన్ని మూలలా శిష్యగణము.*

* కొప్పరపు కవులకిప్పుడుకూడా ఒక శిష్యుడు దొరికినా డనవచ్చు. దొంగలు పడిన ఆరు నెలలకు కుక్కలు మొరిగినవి అన్నట్లు ఇపుడు నెల్లుట్ల రామకృష్ణామాత్యుడనే అతను వైదిక కవులపైన దుమ్మెత్తి పోయడము శోచనీయము

ఈ ప్రకారముగా నియోగి వైదీకి ప్రోత్సాహాల ననుసరించి గుంటూరు జిల్లాలో - బాపట్ల, గుంటూరు, పినపాడు. తెనాలి, నర్సరావుపేట, వేమవరం మొదలైన స్థలాలలో - శతావధానాలు జరిగినవి. ఉభయపక్షాల నుంచీ అనేక మంది పెద్దలకు వీటిలో పేర్లు బైటికి వచ్చినవి.

కాశీ కృష్ణాచార్యులుగారిందులో ముఖ్యులనవలె. ఈయన స్వయముగా శతావధానియై, సంస్కృతాంధ్రాలలో గొప్ప వక్తయై, బహుగ్రంథాలు నిర్మించినాడు. సంస్కృత వాచకాలు బాలురకోసము రచించినాడు. 'కాశీ కృష్ణ పండితీయము' అనే పత్రిక ప్రకటించి సారస్వతసేవ చేసినాడు. "మాతృభాష" అనే మాసపత్రిక 1921 లో స్థాపించి సంస్కృతము మాతృభాష కావాలని ప్రచారము చేసినాడు.◆

జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు మరొకరు. ఈయన 'అభినవ సరస్వతి' అనే సారస్వత మాసపత్రికను నలభై ఏండ్లనుంచీ నడుపుతూ ఆంధ్రములో చక్కని నిర్దుష్టమైన శైలి వ్రాయగలిగి "నాగర ఖండా" ద్యనేక గ్రంథాలను రచించినాడు.

దంటు సుబ్బావధాన్లుగారు పండిత వంశానికి చెంది సంస్కృతాంధ్రాలలో చక్కని పాండితీ కవనశక్తులు కలిగి పండిత రాయలవారి భామినీ విలాసాని కనువాదము మొదలైన గ్రంథాలు రచించినాడు. శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ విద్యాపీఠాన్ని కొంతకాలము నడిపి 'అమృత సందేశ' మనే మాసపత్రికకు సూత్రధారుడుగా ఉండేవాడు. మంచి ఆయుర్వేద పండితుడని ప్రసిద్ధి వడసినవాడు.

బెల్లంకొండ రామారావుగారు గొప్ప వేదాంతి. సంస్కృతములో బహు గ్రంథ నిర్మాత. భగవద్గీతా భాష్యానికి 'భాష్యార్క ప్రకాశిక' అనే వ్యాఖ్య వ్రాసినాడు.

వేలూరి శివరామశాస్త్రిగారు గొప్ప ప్రతిభాశాలి. వ్యాకరణ సాహిత్యాలలో మంచి ప్రజ్ఞ గడించి, ప్రాచీన నవ్యాంధ్ర కవితా మార్గాలలో సమానముగా విహరిస్తూ తమ గురువులైన తిరుపతి వేంకటేశ్వరులతో అనేక చిన్న చిన్న అధిక్షేప కావ్యాలూ, ఇంకా కొన్ని కావ్యాలూ, చిన్న కథలూ వ్రాసి దేశములో పేరు మ్రోగిన కవి పండితుడు. శతావధానాలు చేసి మంచి ఖ్యాతి గడించినాడు.

---

◆ ఈయన కుమారుడు కాశీ వ్యాసాచార్యులు కూడా పండితుడు. శాకుంతలానికి వ్యాఖ్య వ్రాసినాడు; 1944లో మృత్యువాత పడినాడు.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రసిద్ధపండితుడు. ఈయన రాయప్రోలు సుబ్బారావుగారితో కలిసి అవధానాలు చేస్తూ ఉండేవాడు. వీరేగాక చావలి వెంకటకృష్ణయ్య, నడింపల్లి జగన్నాధరావు, పులిపాక పూర్ణయ్యగార్లు, మొదలైన వారున్నారు. వీరిలో జగన్నాధరావుగారు ఆంధ్రుల చరిత్రవ్రాసి, 'ఆంధ్రభారతీతీర్థ' వారిచేత "పురాతత్వ విశారద" అనే బిరుదాన్ని పొందినాడు. ఇలా అనేకులు సాక్షాత్తుగానో పరోక్షముగానో ప్రతిష్ఠపొందినారు.

మొత్తముమీద ఈవాదోపవాదాల యొక్క ఇతర ప్రయోజనా లెట్లాఉన్నా భాష మాత్రము చాల వృద్ధిపొందినది. అన్నిటి కంటె విశేషము తిరుపతి వెంకటేశ్వరులు 'గీరతము'తోపాటు 'గుంటూరు సీమ'. అది భాషకు ఒక అమూల్యాలంకారము. గుంటూరు మాత్రము అదివరలో ఈకక్ష్యకు స్థానమనే మాటను సార్థకపరుచుకున్నది. ఈ ఊరేకాకుండా జిల్లా అంతా వ్యాపించిన దీకక్ష్య. నర్సారావుపేట గ్రామములో అది మిక్కిలి బలిష్ఠముగా వ్యాపించి వ్రేళ్ళుప్రాకిపోయినది. రెండుదాహరణాలిస్తాను. హైస్కూలుకు నియోగిగానీ, వైదికిగానీ, హెడ్మాష్టరుగా ఉండకూడదని సర్కారువారు జీ.ఓ. ప్యాసుచేసినారు. ఆఊళ్ళో మున్సిపల్ ఎన్నికలు మొదలైనవి జరిగేటప్పుడు అభ్యర్థులకిదే ముఖ్యయోగ్యత. ఇతరకులాలవాళ్ళను కూడా చెప్పడములో 'నియోగి తురక' 'వైదీకి తురక' నియోగి మాల, వైదీకి మాల, అనే నామకరణము. పట్టణ ప్రారబ్ధమిప్పటికీ అనువృక్తిగా వస్తూనే ఉంది. కొప్పరపు కవులుకూడా భాషాసేవ చేసినవాళ్ళే! దీక్షతస్తోత్రాదులు చాల గ్రంథాలున్నై వీళ్లు వ్రాసినవి. ఈవిధముగా ఈ కక్ష భాషోపకారమైనది.

పైవిగాక ఇంకాకొన్ని ఉద్యమాలున్నై. వాటిలో విరివైనది కమ్మవారికి సంబంధించినది. వెనుక బ్రాహ్మణులమీద మొదలుపెట్టిన జస్టిసు ఉద్యమము గూర్చి ముచ్చటించినాను. అది అరవ దేశములో పెరిగిపెరిగి, ఇప్పుడు ఇది రామస్వామి నాయకారుగారి ద్రావిడోద్యమముగా పరిణమించినది. తుదకు 'జూ' లను జర్మనీనుంచి వెళ్ళగొట్టినట్టు ఆర్యులనేవాళ్ళను తమిళ దేశము నుంచి వెళ్ళగొట్టటము క్రిందికి దిగుతుందేమో తెలియదు. అంత భయపడ నవసరము లేదనుకుంటాను. బ్రాహ్మణులలో అంతా ఆర్యులనీ బ్రాహ్మణేతరులలో అంతా

ద్రావిడులనీ నిర్ధారణ చేయలేనంత కలసిపోయినారు. ఈ జస్టిసు ఉద్యమము మన ఆంధ్రదేశములో కులకక్షలక్రిందికి దిగినది. కమ్మ ఉద్యమము, రెడ్డి-కమ్మ విభేదము, కమ్మ-కాపువిభేదము విశ్వబ్రాహ్మణోద్యమము, తుదకు ఆదిఆంధ్ర అరుంధత తోద్యమాలూ అన్నీ దీని శాఖలే! ఎవళ్ళ కులము వాళ్ళు అభివృద్ధి చేసుకోటానికి తప్పక ప్రయత్నించవలసినదే. అది ద్వేషపూరితమూ, సకల దేశక్షేమ నిరోధకమూ, కానంతమట్టుకు అవశ్య భావమేనని నా ఊహ. అది అట్లా ఉంచండి. కమ్మవారు పూర్వము ఉపనయనాధికారమున్న క్షత్రియులనీ తర్వాత దాన్ని స్వార్థపరులైన. బ్రాహ్మణుల మూలముగా కోల్పోయినారనే ఒకవాదము. ఈ ఉద్యమానికి కృష్ణా గుంటూరు జిల్లాలు స్థావరాలైనవి. వాళ్ల కుపనయనాధికారము ఉన్నదని వేదములో నుంచీ చూపిస్తూ ప్రచారము చేసినాడు, జి.బి.యస్. సరస్వతి అనే స్వాములవారు. ఈయన పంచముల చరిత్ర ఒకటి వ్రాసినాడు కూడా. దేశమంతా సంచారముచేసి ఈ స్వాములవారు కొల్లూరు మొదలైన అనేక స్థలాలలో వాళ్ల కుపనయనాలు చేసినాడు. వాళ్లలోవాళ్లు యాజ్ఞికాలు చేసుకునేటట్లు కూడా ఏర్పాట్లు చేసినాడు. దీనివలన వైదిక వృత్తిలో ఉన్న బ్రాహ్మణులకు ఇబ్బంది కలిగినది. ఈ విధముగా ప్రతి గ్రామములో విరోధాలు ప్రబలినవి.

ఇంతకు పూర్వమే విశ్వబ్రాహ్మణోద్యమము, వైశ్యోద్యమము ఇంకా యిటువంటివాటివల్లనే విరోధాలు ప్రబలి ఉన్న గ్రామాలు ఈ క్రొత్త విరోధానికి గురి అయినవి.

విశ్వబ్రాహ్మణోద్యమానికి నిరంజనశాస్త్రి, గానాల రామమూర్తిగారలు ప్రముఖులు. వీరిలో రామమూర్తిగారు శాసనసభ్యుడై చాల ప్రశస్తి పొందినాడు. మద్రాసులో 'జస్టిసు'కు తెనుగు తోబుట్టువైన 'సమదర్శిని' అనే పత్రికకు సంపాదకుడుగా ఉంటూ ఉండేవాడు. ఈ పత్రిక కొద్దిలోనే అంతరించినది. ఈయన కూడా శివసాయుజ్యము పొందినాడు. రామమూర్తిగారు మంచి వక్త; వ్రాతగాడున్నూ. ఈయనదీ గుంటూరే. గుంటూరు అన్ని ఉద్యమాలకూ జన్మస్థానమైనదని చెప్పవలె.

ఇవిగాక నిమ్న జాతులలో కూడ ఈ ద్వేషబీజాలు నాటబడినవి. దేశమంతా కులకక్షలతో నిండిపోయినది. ఇది అంతా వెనుక నేను మనవిచేసిన అసంతృప్తి బీజఫలమే. కాని చాల భయంకరమైన ఫలము! తిరుగుబాటు భయంకరాకారాన్ని దాల్చినది. ఈ పరిస్థితులింకా ఇప్పటికీ ఇట్లాగే ఉన్నవి. ఇందులో ఒక చిత్రము. ప్రతికులమూ బ్రాహ్మణులను దూషించడము. మళ్లీ బ్రాహ్మణ ధర్మాలనే అనుసరించడము. ఇదేమిటో!

ఇట్లా తిరుగుబాటుగా పుట్టిన యీ కమ్మోద్యమములో కొందరు సారస్వత సేవకు లున్నారు. తెనాలి తాలూకా కొల్లూరు గ్రామములో సూర్యదేవర రాఘవయ్య చౌదరిగారని ఒక ఆయన ఉండేవాడు. నల్లగా ఉన్నా మంచి మీసాలుకలిగి, చక్కగా మాట్లాడే శక్తి కలిగి, గ్రంధము వ్రాయగల భాషాజ్ఞానము కలిగిన వ్యక్తి. ఈయన "కమ్మవారి చరిత్ర" అని అతి పరిశోధనముతో ఒక గ్రంధము రచించినాడు; కమ్మవారి ఉదంతము తెలియజేసే ప్రధమ గ్రంధ మిది. ఈ గ్రంధము వలన కులానికి చాల ఉపకారమైనది. ఇంకా పరిశోధన చేస్తే* కుల చరిత్ర సమగ్రముగా వ్రాయవచ్చునని ఈ గ్రంధము వలన దృఢమైనది. "ఆర్య కవి కుతంత్రమ"ని మరొక గ్రంధాన్ని కూడా ఈయన వ్రాసినాడు.

అలాంటి పరిశోధనలు చేయడానికి త్రిపురనేని రామస్వామి చౌదరి గారు మొదలైన వారొక సంఘముగా చేరినారు. రామస్వామి చౌదరిగారు (1890 - 1943) గుడివాడ తాలూకా అంగలూరుకు చెందినవాడు. ఈయన చిన్నతనము నుంచీ జస్టిసు భావాలు కలిగిన వాడైనా, కవిత్వ విషయాలలో తిరుపతి వేంకటేశ్వరుల శిష్యుడు. ఆ గురుభావము మాత్రము జస్టిసు మనస్తత్వానికి లోబడలేదు. ఈయన మంచి కవితాధార కలవాడు. అది తిరుపతి వెంకట కవుల కృప చేతను, చెన్నా ప్రగడ భానుమూర్తిగారి దయవల్లనూ అభివృద్ధి చెందినది. ఎఫ్.ఏ. దాకా ఇక్కడే చదివి, ఇంగ్లాండు వెళ్ళి బారిస్టరై తిరిగి వచ్చినాడు. ఇంగ్లాండు వెళ్ళివచ్చినా, మాతృభాషను

---

* గుంటూరు జిల్లా కారంచేడులో కుప్పస్వామి చౌదరిగారంటూ ఒక లక్ష్మీ పుత్రుడున్నాడు. ఈయన నిర్దుష్టముగా పరిశోధనము చేసి కమ్మకుల చరిత్ర వ్రాయడానికి గొప్ప విరాళ మిచ్చినాడు.

మరచి పోకుండా, మీదుమిక్కిలి మాతృభాషాభివృద్ధికి తోడ్పడడములో ఈయన కట్టమంచి వారితో సమాను డనవచ్చు. విద్యార్థి దశలోనే కొన్ని నాటకాలు వ్రాసినాడు. ఇంగ్లాడునుంచి వచ్చిన తరువాత ఈయన జస్టిసు చిత్తవృత్తికి పాలైనాడు. అప్పటినుంచీ ప్రాంతీయ జస్టిసు నాయకులలో ఒకడైనాడు; విజ్ఞాన వంతుడు కావడముల్ల కులస్థు లందరికీ గౌరవస్థాన మైనాడు. తెనాలిలో ప్రాక్టీసు చేసి, మ్యునిసిపల్ చైర్మన్ అయినాడు.

ఈయన మంచి భాషాసేవకుడు. "కుప్పుస్వామి శతక" మని వ్రాసినాడు; "సూతపురాణమ"ని తన సిద్ధాంతాలను ప్రచారము చేస్తూ ఒక గ్రంధము వ్రాసినాడు; ఈయనకు రాముడు దుర్మార్గుడు; కృష్ణుడు ద్రోహి; 'కురుక్షేత్ర సంగ్రామ' మని మామూ లభిప్రాయాలకు భిన్నమైన వాటిని ఆశయముగా పెట్టుకుని ఒక నాటకము కూడా వ్రాసినాడు; ఇది విమర్శకు పాత్రమైనది. ఈయన సహాయముతో కమ్మకుల చరిత్రను గూర్చి చేస్తున్న పరిశ్రమ కొంతవరకు ఫలించినది. హృదయాన్ని దాచుకుని పైకి మెత్తగా మాట్లాడట మెట్లాగో ఈయన ఎరుగడు. పాండవులకు భాగమేలేదనీ, దుర్యోధనుడే సత్ప్రవర్తనుడై నిజమైన క్షత్రియుడనీ ఈయన వాదము, భారతాన్ని గూర్చి.* గుడివాడ పౌరులు ఈయనను సమ్మానించి 'కవిరాజ' బిరుదాన్నిచ్చినారు. ఈయన చనిపోవడము వలన తదుద్యమానుయాయులకు తీరని నష్టము కలిగినదని చెప్పవలె!

తెనాలి తాలూకా సంగం జాగర్లమూడి గ్రామానికి చెందిన కొత్త భావయ్య చౌదరిని గూడ ఎన్నవలె. ఈయన కమ్మవారి చరిత్రను విపులముగా వ్రాసినాడు. రెడ్ల తెగను గూర్చి కూడ వ్రాసినాడు. నేటి కమ్మవారు పూర్వము ఒకప్పుడు క్షత్రియులని యీయన తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు. ఇందులో 'విస్మయ జనకాలైన సిద్ధాంతాలు' చేయబడినవనీ 'విషయాల్ని బట్టి నిర్ణయం చేయబడ లేద'నీ 'విషయాలు తారుమారు చేయబడిన'వనీ ఆంధ్రప్రతికలో డాక్టరు మారేమండవారు తెలియ జేసినారు. వాద ప్రతివాదాలు జరిగినవి. కాని మనకు వాటితో ప్రసక్తి లేదు.

* విమర్శనలు చేయడములో ఈయన పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారిని మాత్రము మించలేదు.

కమ్మవారి ఉద్యమములో భావయ్య చౌదరిగారిని ఉల్లేఖించుకొనడమువరకే మనకు సంబంధించినది.

వీరేగాక ఇంకా కొందరు వ్యక్తులున్నారీ ఉద్యమముతో సంబంధమున్న వారు. వారిలో ఒకడు దుగ్గిరాల రాఘవ చంద్రయ్య సచ్ఛాస్త్రి. ఈయనది కూడా అంగలూరు గ్రామమే. యధాశక్తిగా సచ్ఛాస్త్రిగారు కూడా సారస్వత సేవ చేసినవాడే. విద్యార్థి దశలోనే 'విజయనగర సామ్రాజ్య' మనే నవలను వ్రాసి 500 రూపాయల బహుమానాన్ని పొందినాడు. కాంగ్రెసువాది అయినాడు.; జైలుకు వెళ్ళినాడు; ఖద్దరు కట్టినాడు; సద్బ్రాహ్మణ మహాసభను జరిపించి ఉద్యమ ప్రచారము బాగా చేసిన వ్యక్తి! ఈయన చిత్తరంజనదాసు జీవితము మొదలైన దేశభక్తి ప్రేరకాలైన గ్రంథాలను కొన్నిటిని రచించినాడు. మంచి వక్త. మొత్తముమీద ఈయనను విజ్ఞానము కలిగిన దేశభాషా సేవకుడని చెప్పవలె. కొన్నాళ్ళు (1923 - 26) బెజవాడలో 'స్వరాజ్య' అనే పత్రికను నడిపినాడు. మళ్ళీ సత్యాగ్రహుల లిస్టులో ఉన్నాడు; ఏమి చేసినా సహజ ప్రకృతి జస్టిసు చిత్తవృత్తి. ఈయనకు కులకక్ష ఒక స్వభావము క్రిందికి దిగిపోయి 'అష్టాదశమహాపాతకి' అని బ్రాహ్మణ్ణి తిట్టించిన దీయన చేత. ఇప్పటికీ ఈయన ఇలాంటి రచనలు, ఉపన్యాసాలు చేస్తూనే ఉన్నాడు.

ఈ సందర్భములో ఉల్లేఖించవలసిన ఇంకొక వ్యక్తి వేమూరి రత్నయ్యగారు. ఈయనది కృష్ణా జిల్లా ఘంటసాల అనే గ్రామము. ఈయన చిన్నప్పుడు తానొక పెళ్లికి వెళ్లితే జరిగిన స్వల్పావమానాన్ని పురస్కరించుకొని, విజ్ఞానార్జనోద్దేశ్యము కలిగి, విజ్ఞానము నార్జించినానని చెప్పినాడు. ఈయన ఆర్యసామాజికుడుగా కనబడతాడు. 'హిందూ ధర్మరహస్య'మని ఒక గ్రంథము రచించినాడు. అదికూడ తిరుగుబాటు సూచకమే. ఈ గ్రంథానికి కట్టమంచివారు పీఠిక వ్రాసినారు. రెడ్డిగారంటే వెనుకటి విజ్ఞానము మీద కలిగిన తిరుగుబాటుకు మూర్తి! కాబట్టి అట్టి తిరుగుబాటు ఎందులోనైనా ఉండనీ, సాంఘికముగానీ - సారస్వతముగానీ - అక్కడ ఆయన వాక్కో, కలమో, మనిషో ప్రత్యక్ష మౌతాడు. తిరుగుబాటు రచయిత లందరూ ప్రోత్సాహానికిగాని, సహాయానికిగాని ఆయన చుట్టూ మూగుతూ ఉంటారు.*

* కొంత కాలమునుంచీ ఇదివరలో ఈ తిరుగుబాటుద్యమాలలో పాల్గొన్న జనులంతా ఆర్యసమాజములో చేరుతున్నారు. ఆర్య ధర్మచ్యుతులు కాకుండా బ్రాహ్మణ్యము సిద్ధిస్తుందని వీరి ఆశయము !

ఈ సందర్భములోనే మరియొక విప్లవపక్షగ్రంథాన్ని స్పృశించవలె. నవ్యుడైన ముద్దుకృష్ణ అనే ఆయన రచించిన 'అశోకమ'నే పేరు గల నాటకమది. ఇందులో కథ రామాయణము. రామస్వామి చౌదరి గారి అర్థము కంటె విశేషార్థాన్ని దానికి కల్పించినాడీ ముద్దుకృష్ణగారు. నాటకములో సీతను మానసికముగా అపవిత్రగా చిత్రించినాడు. సామాన్యముగా, జాతి యే విషయాన్ని పవిత్రమూ, గొప్పదీ అని అనుకుంటూ ఉంటుందో దానిని నిరసించడము అతినవ్యులలో కొంతమందికి గుణమై పోయినది. అటువంటి సూత్రముతో పుట్టినదీ నాటకము. కవికుమారుడు కాబట్టి గద్యనాటకాన్ని ఏదో తన ఇష్టము వచ్చినట్లు వ్రాసుకోనీయండి; కాని తాను వ్రాసిన దృక్పథాన్ని సాధిస్తూ పెద్ద 'సింహావలోకనం' వ్రాసినాడు. ఇది అసలు పుస్తకమంత ఉన్నది. ఇందులో - నీతియేమి, ధర్మమేమి, చరిత్రమేమి - భారత సంస్కృతి అంతా చర్చించి తన సిద్ధాంతాలను ప్రతిపాదించినాడు. సారస్వత సేవకుడైన తనకీ గొడవ అంతాదేనికీ? దీని నిండా నిందలే; దూషణమే ! సీతకంటె రాముడు విమర్శనానికి గురిఅయినాడు. రామ స్వామి చౌదరి వలెనే శంబూక వధ సీతా త్యాగము ఈయనకు 'సత్యాగ్రహము' కలుగజేసినవి. ఈయన దృష్టిలో రామ రావణుల కేమీ భేదము లేదు. మంచి చెడ్డలకూ, కర్తవ్యా కర్తవ్యాలకూ అతీతుడైనవాడు, స్థిత ప్రజ్ఞుడైనా అయి ఉండవలె; లేదా సంఘానికి శత్రువైనా అయి ఉండవలె! ఈ గ్రంథాన్ని ఆత్మహత్య చేసుకున్న ప్రాణస్నేహితునికి అంకిత మిచ్చినాడు. హత్య చేసుకున్న ఆ ప్రాణస్నేహితుడి గొప్పదన మిట్లా చెప్పినాడు :

"తుప్పుబట్టిన ధర్మబంధాలకు కట్టుపడిన పాతసంఘమూ, నిండుసత్యం తేజస్సు భరించలేని నూతనసంఘాలు కూడా .... .... నిన్ను ఒక రాక్షసునిగా నిరూపించినవి.''

ఈయన 'సింహావలోకనము'లో తాను భవభూతి అంతవాడినని చాటుకున్నాడు. గ్రంథములో విలువ ఏమన్నా ఉంటే దానిని సింహావలోకము నశింపజేసినది. భారత సంస్కృతికి ఎదురీతగా రచించే గ్రంథాలు ఈ దేశములో ఆదరణ పొందడము చాలా కష్టము!

సికింద్రాబాదు నివాసి అయిన పెదగాడ గంగయ్య (మృతి 1933) అనే విశ్వబ్రాహ్మణుడు తన పరిశోధనలకు ఫలముగా 'అయిదుగురు కవుల సంగ్రహచరిత్ర' అనే గ్రంథము రచించి భాషాసేవ చేసినాడు. ఇందులో ఈయన 'కవికర్ణ రసాయన' కర్త ఇంటిపేరు 'సంకుసాల' కాదనీ 'టంకసాల'అనీ, ఆయన విశ్వబ్రాహ్మణుడనీ ఋజువు చెయ్యడానికి ప్రయత్నించినాడు. ఈ ప్రకారముగా ఈయన గ్రంథములో నూతన మైనవీ, నమ్మడానికి కష్టమైనవీ అనేకమైన సంగతులు చెప్పినాడు. అందులో చేమకూర వెంకటకవి నందిగామ ప్రాంతములో పుట్టి తరువాత తంజావూరు వెళ్ళినాడని ఒకటి. ఇటువంటి పరిశోధనా విషయాలెన్నో ఉన్నవీ పుస్తకములో.

ఇది యావత్తూ ఈ కాలపు తిరుగుబాటు లక్షణ ఫలము. ఈవిధముగా కులకక్షలు కూడా సారస్వతానికి ఉపకారము చేసినవి. ప్రతినూతనోద్యమము పరమేశ్వర సంకల్ప ఫలితమే. తత్కాలానికి కొంత ఆందోళన కలుగజేసినా ఆద్యంతాల కన్నీ కలసి దేశక్షేమాన్నే సమకూరుస్తై. ఈ విధమైన ఆందోళనమే గిడుగువారి భాషా సంస్కార ప్రారంభములో కూడా చూచినాము. అట్టి ఆందోళనమే యీ తిరుగుబాటుద్యమములలోను చూస్తున్నాము. సాంఘిక విజ్ఞానమే సారస్వతములో ప్రతిబింబిస్తూ ఉంటుంది మరి!

## సారస్వత చర్చలు:

ఈ కాలములోనే ఇంకా కొన్ని సారస్వత చర్చలు జరిగినవి. వాటిలో ముఖ్యమైన వాటిని గూర్చి ముచ్చటిస్తాను. ముందు కొన్నిటి పేర్ల నిస్తాను :-

1. నన్నయ్య వైదీకా, నియోగా ?
2. ఆంధ్రంబున ననుస్వారంబు కలదా ?
3. కృష్ణరాయలు క్షత్రియుడా? శూద్రుడా ?
4 నన్నెచోడుడు నన్నయకంటె పూర్వుడా ?
5. భట్టుమూర్తి రామరాజ భూషణు లిద్దరా? ఒక్కడేనా?
6. ఒంటిమిట్ట - వరంగల్లు వాదము.
7 నాచన సోమన, యొఱ్ఱాప్రగడలలో నెవరి స్థాన మెట్టిది ?

8. కురుపాండవుల దాయభాగ చర్చ.

9. ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కృతమేనా ?

వీటిలో ఉన్న అంశాలనుబట్టి కొన్ని సాంఘికాలు, కొన్ని చారిత్రకాలు, మరికొన్ని కేవల సారస్వతాలు అని కనబడుతున్నవి. వీటిలో కొన్ని నిరర్థక చర్చలు.

1. నన్నయ వైదీకైతేనేమి? నియోగైతేనేమి? ఇది సాక్షాత్తుగా శతావధానుల పోట్లాట దినాలలో చర్చకు వచ్చిన విషయము.వంగూరి సుబ్బారావుగారీ విషయాన్ని గూర్చి బహుఅభినివేశముతో మాట్లాడేవాడు. వెనుక ఆయనను గురించి చెప్పినాను. ఆయన చారిత్రకముగా ఆంధ్ర సారసత్వము పొందిన మార్పులను, పరిశోధన చేసి చాలా శ్రమపడి 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర' అనే పేరుతో గొప్ప గ్రంథము వ్రాసినాడు. సారస్వతానికి సంబంధించిన చారిత్రక విషయా లిందులో చాలాబాగా చర్చించినాడు. కాని సారస్వతములో కలిగిన వివిధ తరంగాలను గూర్చిగాని, గొప్ప కవులనూ, తద్రచిత గ్రంథాలనూ గూర్చిగాని అంత ఎక్కువగా స్పృశించలేదు. కట్టమంచివారే దీనికి పీఠిక వ్రాసినారు. వాఙ్మయ సేవ చేసేవాడు తప్పక చదవవలసిన గ్రంథమిది. ఆధునికు లెవరైనా దీన్ని తీసుకుని దానిలో ఉన్న విషయముతో బాటు నేను పైన ఉల్లేఖించిన విషయాలను చర్చించి పరిష్కరిస్తే వాఙ్మయానికి చాలా ఉపకారమౌతుంది. ఈయన కొన్ని చిన్న కథలు కూడా రచించి కథకుడైనాడు.

2. ఆంధ్రములో అనుస్వారము విషయములో అక్కిరాజు ఉమాకాన్త పండితుడు* (1889 - 1932) చాలా కృషిచేసి లేదని నిర్ధారణచేసి తనపేరు కూడా 'ఉమాకాన్తమ్' అని వ్రాసుకునేవాడు. ఈయనలో ఒక మాదిరి పట్టుదల చాలా ఉన్నది. ఈయన కెక్కడా చుట్టుపట్ల మైలుదూరములో మంచి అనేదున్నా కనపడదు; పెడర్థవాదము; కాని భయమనేది యెంతమాత్రము లేదు. మంచి వ్యాకరణ, సాహిత్య జ్ఞానము కలవాడు. స్వయంకృషిచేత విజ్ఞానాన్నార్జించినాడు. ఇంగ్లీషులో కూడా మంచి ప్రజ్ఞకలవాడు. ఈయన సంస్కృతములో నుంచి పతంజలి మహాభాష్యములో ఉన్న విషయాన్ని తెనుగులోనికి తేవాలని చాలా శ్రమపడి కొంత వ్రాసి అచ్చు వేసినాడు. కాని పని చాల పెద్దది; అంతరించినది. ఈయన రచించిన

* చూడు : 'Triveni' 1943 June.

గ్రంధాలలో "టిప్పుసుల్తాన్" అనే నవల చక్కని శైలిలో ఉన్నది. ఈయన మంచి సుశిక్షితమైన తెనుగు వచనశైలి వ్రాయగలవాడు. "నేటి కాలపు కవిత్వము" అనే పేరుతో భావకవిత్వాన్ని విమర్శించినాడు. అందులో దంతా సమంజసము కాకపోయినా ఆ పుస్తకము ఈయన సాహిత్య శాస్త్రజ్ఞానాన్ని మాత్రము తెలియజేస్తుంది; వ్యావహారిక భాషలోనే రచించినాడు. గీరతములో వెంకటశాస్త్రిగారి పద్య విభాగములవలె అధికరణ విభాగము చేసినాడు. ఈయన చర్చించిన కొన్ని విషయాలలో కొంత అర్థమున్నా మొత్తముమీద చూపిన సంకుచిత దృష్టి గ్రంధ ప్రాశస్త్యాన్ని తగ్గించినదనే చెప్పవలె. ఈయన "పల్నాటి వీర చరిత్ర"ను గొప్ప పీఠికతో సంపాదించి ప్రకటించినాడు. అది ఈయన చేసిన ఒక గొప్ప పని. "త్రిలింగ" పత్రికకు సంపాదకుడుగా ఉన్నాడు. అప్పుడా పత్రిక పేరు "త్రిలిఙ్గ"గా ఉండేది. వావిలికొలను సుబ్బారావుగారి తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగుపండితుడుగా ఉన్నాడు. పాండిత్యానికి తగిన శరీరదార్ఢ్యము లేని వాడు. ఈయన సార స్వతానికి చేసినది గద్యశైలీ రచనములో కలగ చేసిన మార్పు! షేక్స్పియరు నాటక కధల నింగ్లీషులో నుంచి పరివర్తనము చేసినాడు. ఈయన కూడా ఒక ఆంధ్ర చంద్రాలోకము రచించినాడు. భాషకు చాలా సేవచేసిన మహనీయులలో ఎన్నదగినవాడు!

3. కృష్ణదేవరాయలను గూర్చిన్నీ, విజయనగర సామ్రాజ్యాన్ని గూర్చిన్నీ, తత్సంబంధమైన చాలా విషయాలను గూర్చిన్నీ ఆంధ్రుల చరిత్రతో పాటు పరిశ్రమ చేసినవాడు చిలుకూరి వీరభద్రరావుగారు. ఆయనకు "చరిత్ర చతురానన" బిరుదిచ్చిన దాంధ్రదేశము. చారిత్రకమైన అనేక గ్రంధాలు రచించినాడు. ఆయన రచించిన గ్రంధాలన్నీ ఒక బండె డవుతవి; అవేగాక "నవరసిక మనోల్లాసిని" "హిందూ గృహము" "హాస్య తరంగిణి" మొదలైన వాటిని కూడా రచించినాడు. వార్ధక దశలో కొందరితో ఈయనకు వైరము తటస్థించినది. ఈయనచాలా పట్టుదలకల మనిషి. చారిత్రకదృష్టి ఒక్కొక్కప్పుడు అహంకారానికి లోబడి పొయ్యేది! హైద్రాబాదులో ఉండే మున్నూరు కాపుల ఉదంతాన్ని కొంత పరిశోధన చేసి, తన ఆంధ్రుల చరిత్ర పునర్ముద్రణోద్యమములో కాకతీయ యుగ సంబంధమైన సంపుటాన్ని ముందు ప్రచురించి, అదివరలో తనను త్రోసిరాజని కాకతీయ సభను వరంగల్లులో జరిపి

కాకతీయ సంచికను ప్రచురించిన వాళ్ళమీద తత్సంచికను విమర్శించి కసితీర్చుకొని ఏక కాలములో వాళ్లకు మనస్తాపమూ మున్నూరు కాపులకు సంతోషమూ కల్పించిన మహానుభావుడు. "జీర్ణ కర్ణాట చరిత్ర"ను సూయల్ ననుసరించి వ్రాసినాడు.* వీరు చివర దినాలలో తమ అల్లుడు మామిడన్న సుబ్బారావు గారింట్లో ఉండి కొవ్వూరులో పరమ పదించినాడు. ఆంధ్రుల పూర్వ చరిత్రను తెల్పి ఆంధ్రజాతి పునర్నిర్మాణానికి తోడ్పడ్డ మహనీయుడు. కీర్తి శేషుడు. ఆయన వ్రాసిన ఆంధ్రుల చరిత్ర విషయమై కర్తవ్యాన్ని వెనకనే మనవి చేసినాను.

4. నన్నెచోడుని పేరెత్తేటప్పటకి రెండు మూడు పేర్లు తలవ వలసి వస్తుంది. మొదటివాడు. మానవల్లి రామకృష్ణకవిగారు.◆ సారస్వతములో పరిశోధన మంటే యేమిటో యెవ్వ రెరుగనికాలములో ఈయన చాలా పరిశోధనము చేసినాడు. ఈయన చేసిన పరిశోధనలలో ముఖ్యమైనది బరోడా గ్రంధాల పక్షాన అభినవగుప్తుని వ్యాఖ్యానముతో భరతమహర్షి భరతశాస్త్ర ప్రచురణము, కాని పూర్తి చేయలేదు. నన్నెచోడుని కుమారసంభవ ప్రచురణము మరొకటి. ఈపుస్తకము ఆంధ్రదేశములో సారస్వత సేవకులకు కలగజేసిన అలజడి యింతంతన టానకీ వీలు లేదు. గ్రంథము గొప్పది. చాలా ఉదాత్తముగా వ్రాసిన గ్రంధము. ఇది ప్రచురించినందుకు రామకృష్ణయ్య గారికి ఆంధ్రదేశమంతా కృతజ్ఞమై ఉండవలసినదే! కాని యీ గ్రంధ పీఠికలో రామకృష్ణ కవిగారు కొన్ని కారణాలిచ్చి, యీగ్రంథము నన్న య్యకు పూర్వము రచింపబడినట్టు స్పష్టముగా అభిప్రాయ మిచ్చినాడు. "పరప్రత్యయనేయ

---

* కాకినాడలో కుందూరి ఈశ్వరదత్తనే ఆయన కూడా ఒక "విజయనగర సామ్రాజ్య" మనే గ్రంధము వ్రాసినాడు. కాని తత్సామ్రాజ్య విషయాల నామూలాగ్రముగా రచించినవాడు వీరభద్రరావుగారే!

◆ 1928 June Modern Review లో Jayaswall రామకృష్ణకవి గారిని గూర్చి ప్రశంసించిరి.

"ఆయనకు ప్రభువుల సహాయ్యము లేదు. హృదయమే సహాయము. దారిద్ర్యమాయన రాజ్యము. ఒక మాధ్యమిక పాఠశాలలో నాయన యొక యుపాధ్యాయుడు... శ్రీరామ కృష్ణకవియే స్వయముగ నూత్నోపలబ్ధ వస్తువు; ఆయన సంస్కృత సాహిత్యజ్ఞాన మతిమానుషము అనగా అపారము; సవిమర్శకము..." - భారతి, జులై, 1928.

బుద్ధు"లంతా నిజమేనని భ్రమ పడినారు.* ఇప్పటికి యీ చర్చ అటూ యిటూ జరుగుతూనే ఉన్నది.

మద్రాసు విశ్వ విద్యాలయములో తెనుగు పరిశోధన శాఖకు చెందిన శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు విశ్వవిద్యాలయ పత్రికలో గొప్పవ్యాసము ఈ విషయాన్ని గూర్చి యావత్సంగతులూ క్రోడీకరించి వ్రాసినాడు. ఇది పుస్తకరూపాన వచ్చినది కూడా. ఈ లక్ష్మీపతిశాస్త్రిగారు కూడా పరిశోధకులలో ఒకడు. ఈయన రఘునాథ రామాయణము మొదలైన మూడుగ్రంథాలలో భాగాలు "రత్న పేటిక"నే పేరుతో ప్రచురించినాడు. ఈయన సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయములో పండితుడుగా కొన్ని సంవత్సరాలు పనిచేసినాడు. తర్వాత అక్కడ యిమడ లేక వెళ్ళి వచ్చి వేసినాడు. ఇంతలో వఝుల చినసీతా రామస్వామి శాస్త్రిగారు మద్రాసు విశ్వ విద్యాలయము నుంచీ ఆంధ్రవిశ్వవిద్యాలయానికి వెళ్ళగానే యీయనను ఆ స్థానానికి నియమించినారు. 1944లో కాలధర్మ మొందినాడు. ఈయన ఒక నిఘంటువు వ్రాసినట్లూ దాని పేరు "వావిళ్లీయ"మని "మాదిరి ఫార"మొకటి అచ్చుది చూచినాను. కాని అది యింతవరకు రాలేదు. ఈ శాస్త్రిగారు◆ కూడా భాషా సేవ చేసినవారే!

ఈయనకు పూర్వమే యీ కుమార సంభవాన్ని పూర్తిగా విమర్శించి కాలనిర్ణయము చేసిన వాడు నడకుదిటి వీర్రాజు పంతులు గారు. ఈయనది పిఠాపురము. ఈయన కూడా మంచి పరిశోధకుడు. కవిత్వముకూడా చెప్పగల సమర్థుడు. ఈయన పరిశోధన, విమర్శన, వ్యాసాలు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో చూడవచ్చు. నన్నెచోడుని మీద అన్ని సంగతులు చర్చిస్తూ ఒక గ్రంథము రచియించినాడు. ఇప్పుడీ నన్నెచోడుడు నన్నయ్యకు పూర్వమువాడని నమ్మే వాళ్లెక్కువగా లేరు! ఈ విషయము నిర్ధారణ అయిన దనుకోవచ్చు.‡ ఈవిధముగా

* నేనూ అట్లా భ్రమపడ్డ వాళ్ళలో ఒకడిని. పూనాలో 1919 లో జరిగిన ఓరియంటల్ మహాసభలో నేను తెనుగు సారస్వతాన్ని గూర్చి ఒక వ్యాసము చదువుతూ, యీ కుమార సంభవము నన్నయ్యకు పూర్వముదని నిర్వచించినాను. తర్వాత అభిప్రాయము మారినది.

◆ ఈయన పాపము చిత్తచాంచల్యము కలిగి 1943లో పరమపదించినాడు. నిడదవోలు వెంకట్రావుగా రీయన స్థానములో వచ్చి మంచి కృషి చేస్తున్నాడు.

‡ మద్రాసు విశ్వవిద్యాలయమువారు నన్నెచోడుని కుమారసంభవము మీద విమర్శక గ్రంథము ప్రకటించినారు. 'కుమారసంభవము' కూడా త్వరలో ప్రచురిస్తారని తెలుస్తున్నది.

ఈ చర్చ లేవదీసినందుకు రామకృష్ణకవిగారికి మనము కృతజ్ఞులము. ఈయన పరిశోధక వ్యాసాలు "ఆంధ్రచారిత్రక పరిశోధక మండలి పత్రిక" మొదలైన పత్రికలలో ప్రచురింపబడుతూ ఉండేవి. "అపురూపమైనవి, చెపితే ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచేవి. అనేకమైన విషయాల కాధారాలు నావద్ద ఉన్నై." అని చెప్పడములో ఈయనా, వెంకటరమణాచార్యులుగారు ముఖ్యులు. చేప్పేవాటిలో దశాంశమైనా, ప్రకటితముగా ఉండవు. మన పరిశోధకులలో ఉన్న విశేషాలు కొన్ని తర్వాత సమయము వచ్చినప్పుడు ముచ్చటిస్తాను. పాపమింత పరిశోధన పండితుడైనా ఈయనను ప్రపంచము తగినట్టు గౌరవించక పోవడము శోచనీయము. ఈయన కాలూది యెక్కడ యెక్కువ కాలము ఉండలేదు. ఇప్పుడు తిరుపతిలోని తిరుమల ప్రాచ్యపరిశోధనా లయములో పరిశోధకుడుగా ఉన్నాడు.

5. భట్టుమూర్తి రామరాజభూషణులను గూర్చి తద్రచితగ్రంథాలను గూర్చీ, ఆంధ్రశబ్ద చింతామణిని గూర్చీ వఝుల చినసీతారామస్వామి శాస్త్రి, మేడేపల్లి వెంకట రమణాచార్యులు (1862 - 1943) మొదలైన పెద్దలు చాలా శ్రమపడి చర్చించినారు.

ఇప్పటికీ యీ చర్చ జరుగుతూనే ఉన్నది. ఇటీవల గొట్టిపాటి వెంకట సుబ్బయ్య అనే విమర్శకుడు 'భట్టుమూర్తి-రామరాజ భూషణుడనే పుస్తక మొక దానిని వ్రాసి, అందులో వారిద్దరూ భిన్నులని తేల్చినాడు.

6. ఇక ఓరుగల్లు ఒంటిమిట్ట చర్చ: దీనిలో వావిలికొలను సుబ్బారావుగారు. జయంతి రామయ్య పంతులుగారు, శేషాద్రి రమణ కవులు మొదలైన వారు చాలా పరిశ్రమ చేసినారు. మొదటి యిద్దరిని గూర్చి వెనకనే కొంతవరకు ముచ్చటించినాను.* ఈ చర్చ కూడా నన్నెచోడని చర్చవలె నిర్ధారణమైనది.

వావిలికొలను సుబ్బారావుగారు పరమ పదించినాడు. శేషాద్రి శర్మగారి

---

* ఇది తెలంగాణాంధ్రలకు చాలా అభినివేశము గల విషయము. "పోతనజయంతిని" జరిపించి "హాలికు"డనే నాటకము వ్రాయించి హైదరాబాదులోని "కృష్ణరాయాంధ్రభాషా నిలయము" వారు భావికాలానికి సాక్ష్యాన్ని బలపరిచినారు. ఒక విషయాన్ని గూర్చి గ్రంథాలు బయలు దేరిన తరువాత దాన్ని తిప్పటము చాలా కష్టము. శిరోమణి రంగాచార్యులుగారీ నాటకాన్ని చక్కని శైలీపాకాల్లో వ్రాసినాడు.

కంత అభినివేశము లేదు. ఇతర దత్తమండ లాంధ్రకవిపండితులుదాసీనులు! ఇక ఒంటిమిట్ట రోదనమును వినేదెవరు?

7. నాచన సోమనను గూర్చి వెనకనే రాళ్ళ పల్లి అనంత కృష్ణశర్మ గారు చేసిన పనిని స్పృశించినాను. నాచన సోమనాధుడి కాలాన్ని, గ్రంధాన్ని గూర్చి, వేలూరు శివరామశాస్త్రిగారొక పుస్తకము రచించినాడు.

8. కురు పాండవ దాయభాగ విమర్శనాన్ని గూర్చి వ్రాసిన వాళ్ళలో విమర్శక్రాగేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారలు పెదపెద్ద గ్రంథాలే రచించినారు.

9. ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వాన్ని గురించి ఒక వివాదము బయలుదేరినది. వఝలపండితుడు నన్నయకృతమని వాదించినాడు. వీరేశలింగం పంతులు, చిలుకూరి నారాయణరావు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారలు మొదలైనవారీ చర్చలలో పాల్గొన్న ముఖ్యులు. ఇప్పటికీ ఈ చర్చ పరిష్కృతము కాలేదు. పండితులలో నన్నయ కృతమే ఆంధ్రశబ్దచింతామణి, అనే విశ్వాసము మాత్రము ప్రబలినదని చెప్పవలె!

ఈ విధముగా ఈ కాలములో పండితులూ కవులూ సారస్వత చర్చలు జరిపి దేశభాషా సేవచేసి కీర్తిపొందినారు. కాలానికి తగినట్టే చర్చలు ఝరుగుతూనే ఉంటవి. వాటివలన సారస్వతానికి ఉపకారమే అవుతుంది.

మొత్తము మీద ఆ కాలములో తిరుగుబాటుద్యమాల ఫలితముగా అనేక పండితులు బయటికి వచ్చినారు. వారి వారి అభిప్రాయాలు, అభినివేశాలు ఎలా ఉన్నా, కొంత సాహిత్యము మాత్రము వెలిసినది. అనేక గ్రంథాలు, పత్రికలు వెలువడినవి. వైదీకి నియోగి కక్షలు–కమ్మోద్యమము–విశ్వబ్రాహ్మణోద్యమము–కవులపోట్లాటలు–విడిగా చూచినప్పుడు అసహ్యముగా కన్పించినా, తద్వారా సాహిత్య కృషి బాగా జరిగినదని ఒప్పుకోవలె.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 7

# పరిశోధనము

పరిశోధనము మూడు విధాలుగా విభజింపవలసి ఉన్నది. చరిత్ర పరముగా, సారస్వత పరముగా, భాషా పరముగా పరిశోధనలు విరివిగా సాగుతున్న కాలమిది. కొంత పరిశోధనాన్ని గూర్చి వెనుక చెప్పడము జరిగినది. సరియైన చరిత్ర పరిశోధనానికి పునాది వేసినది కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు గారని వెనుక తెలుసుకున్నాము. భాషాసారస్వత పరిశోధనలు కూడా అవే మార్గాలలో నడిచినవి. ఈవిధముగా పరిశోధన జరిపినవారిలో కొందరిని పేర్కొనడ మవసరమే! మానవల్లి రామకృష్ణకవి, తేకుమళ్ళ రాజగోపాలరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, జయంతిరామయ్య, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, భావరాజు వెంకట కృష్ణరావు, డా.నెలటూరి వెంకట రమణయ్య, రాళ్లబండి సుబ్బారావు, డాక్టరు మారేమండ రామారావు, రంగస్వామి సరస్వతి, కురుగంటి సీతారామ భట్టాచార్యులు, డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, డాక్టరు చిలుకూరి నారాయణరావు, కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగిసోమయాజులు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వఝల చినసీతారామస్వామిశాస్త్రి, కోన వెంకట రాయశర్మ మొదలైనవారిందులో ప్రముఖులు. వీరినిగూర్చి, వీరుచేసిన పరిశోధనాన్ని గూర్చి కొద్దిగా తెలుసుకుందాము.

మానవల్లి రామకృష్ణ కవిగారి పరిశోధనాదికాన్ని గూర్చి ఇంతకుముందే చెప్పి ఉన్నాను.

## తేకుమళ్ల రాజగోపాలరావు

తేకుమళ్ల రాజగోపాలరావు గారు మన ఆంధ్రులలో సర్వతోముఖ ప్రజ్ఞకల వారిలో ఒకడు. ఈయన మొదట వీరేశలింగముగారి శిష్యుడు. బ్రహ్మమత

ప్రచారము చేస్తూ విగ్రహారాధనమును గూర్చి ఈశ్వర తత్వాన్ని గూర్చి, భోజన ప్రతిభోజనాలను గూర్చి వ్రాసి, తుదకు హిందూ సంఘ సంస్కార చరిత్రను వ్రాసినాడు. ఈయన సన్నని శరీరము గలవాడు. మంచి వాచాలుడు, నిశితమైన బుద్ధీ, మంచి పరిశోధనా శక్తీ కలవాడు. బెజవాడ హైస్కూలులో మాష్టరుగా ఉండి, అటుతరువాత ఈయన క్రైస్తవ కళాశాలలో తెనుగు లెక్చరరైనాడు. ఆకాలములో ఈయన క్రైస్తవమతము స్వీకరించినాడని చెప్పుకునేవారు. ఈయన ఇంగ్లాండు కూడ వెళ్ళి వచ్చినాడు. ఈయనకు చరిత్ర, భాషా పరిశోధన మంటే చాలా ప్రీతి. ఛంద శ్శాస్త్రములో చాలా పరిశ్రమ చేసినాడు. ఈయన 'పరిశోధక పత్రిక' (South Indian Research) అని ఒక మాసపత్రికను కూడ కొన్నాళ్ళు నడపినాడు. ఆంధ్రదేశ చరిత్ర కూడా ఒక సంపుటము ప్రచురించినాడు. అందులో 'తెలుగు' శబ్దముమీద చాల పరిశోధనము చేసినాడు. టిబెటు దేశములో నుంచీ తెలుగువారు వచ్చినట్లు ఋజువు చేసినాడు. ఇప్పటికీ హిమాలయ ప్రాంతములో ఉన్న ఒక జాతివారికి 'తెలంగం' అని దేవుడి పేరట! ఈ విధముగా చిత్ర విచిత్ర విషయా లందులో ఉన్నవి. ఈ క్రింది వాక్యములు చదవండి:

"అరఖాన్ దేశానికి రాజధాని నగరం పేరేమిటో విన్నారా? దానిపేరు "త్రైలింగ"ట...బర్మాదేశంలోని పెగూ రాజ్యాన్ని సాధించి దాన్ని యేలినవారు 'తలైంగుల' ట. ఈ తలైంగుల వృత్తాంతాలు క్రీ.పూ. 4వ శతాబ్దం నుంచి పరంపరగా వస్తున్నవి'
(ప్రమాది, భాద్రపదము, భారతి)

ఈ విషయాలు 'తెలుగు' కాకతీయ వాసనగల 'త్రిలింగ' శబ్ద భవమని చెప్పే వాదాన్ని భగ్నపరుస్తున్నవి. ఇటువంటి వనేక విషయాలకు రాజగోపాలరావుగారికి మనము కృతజ్ఞులము.

## వేటూరి ప్రభాకరశాస్త్రి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గొప్ప పరిశోధనము చేసిన, చేస్తున్న వ్యక్తి. మంచి నిశితమైన వివేచనాశక్తి, మంచిబుద్ధి, రచనా చాతురీ-వీటికి తగినట్లు పదవీ పరమేశ్వరు డీయనకు కలుగ జేసినాడు. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార మంతా

ఆయన చేతిలో ఉండేది. కొంత కాలము తాళపత్ర గ్రంధాలను సేకరించే పదవిలో ఉండేవాడు. ఇప్పుడు తిరుపతిలో ప్రాచ్యపరిశోధనా మండలిలో పని చేస్తున్నాడు. పరిశోధనకు తగిన వాతావరణము ఈయనకు కల్గడము విశేషము. మొదట శ్రీనాధుని కాలాన్ని గురించి యీయన పరిశోధన మొదలు పెట్టినాడు. తత్ఫలితముగా 'శృంగార శ్రీనాథము', 'కనకాభిషేకము' అనే గ్రంధాలు వచ్చినవి. శ్రీనాధుని మీదా ఆయన కాలము మీదా వేటూరివారే అధికారజ్ఞానము గల వ్యక్తి అనవచ్చు. 'చాటు పద్య మణిమంజిరి'ని ప్రచురించి (1913) మహోపకారము చేసినాడు. ఇవిగాక అనేక విషయా లీయన పరిశోధనము చేసినాడు. క్రీడాభిరామము, బసవపురాణములను పరిష్కరించి, వాటి మీద సుదీర్ఘమైన పీఠికలు వ్రాయడమే ఇందుకు తార్కాణము. తంజావూరు వృత్తాంతాన్ని త్రవ్వి 'ట్రైలరు' గ్రంథాన్ని మొదట ప్రచురించిన దీయనే. ఆంధ్ర విశ్వవిద్యాలయమువా రిటీవల ప్రచురించిన రంగనాధ రామాయణమును పరిష్కరించి పెట్టిన దీపండితుడే. దానిలో వీరి పీఠిక లేకపోవడము విచారకరము.

తిరుపతి వేంకటకవుల శిష్యుడై చక్కని కవితాశైలి నలవరచుకున్న వ్యక్తి వేటూరివారు. ఈయనది పండిత కుటుంబము. భాసనాటకా లీయనను ఆకర్షించినవి. "ప్రతిమా నాటకము" మొదలైన వాటిని పరివర్తనము చేసినాడు. అవి చాల రసవంతముగా ఉంటవి. ఈయన అనేక వ్యాసముల రచించినాడు. సులభ బోధకమైన గద్యశైలి యీయనది.

ఈయనను గూర్చి "భారతి రజతోత్సవ సంచిక" లో వ్రాయబడిన ఈ వాక్యాల్ని చిత్తగించండి :-

"వీరు మహా మేధావియగు సంస్కృతాంధ్ర భాషా విశారదులు. పండిత ప్రపంచమున దప్పబుట్టిన మహనీయులు; కేవల భాషా పండితుల యందులేని చరిత్ర జిజ్ఞాస వీరియందు గానవచ్చుచున్నది... వీరి పరిశోధనా పద్ధతులు నిర్దుష్టములు... శృంగార శ్రీనాధ రచనచే ప్రభాకర శాస్త్రులవారు రెడ్డిరాజ్య సంశోధనకు బునాది వేసిరని చెప్పవచ్చును."

ఇటీవలనే 'తెలుగు మెఱుగులు' అనే వీరి వ్యాస సంపుటి ఆంధ్ర గ్రంధమాల

పక్షాన వెలువడినది. ఈనాటి ఆంధ్ర సాహిత్యకులలో ఈ వేటూరివారు పేరెన్నికగన్న మహనీయుడనే చెప్పవలె.

# జయంతి రామయ్య పంతులు

జయంతి రామయ్య పంతులుగారు (1860-1941) గొప్ప భాషా సేవకుడు; పరిశోధకుడు; పండిత పోషకుడు, కవి. ఈయనది అమలాపురం తాలూకాలో ముక్తేశ్వరం అనే గ్రామము. ఈయన పెద్ద సర్కారుద్యోగము చేసినాడు. జిల్లా కలెక్టరైనాడు కూడ. పీఠికాపురాధీశ్వరుడికి ఈయన విద్యాగురువు కావడము, ఆంధ్రనిఘంటు నిర్మాణోద్యమ ప్రారంభము, గ్రాంధికభాషావాద ప్రచారము నిమిత్తము, సాహిత్య కృషికొరకు ఆంధ్రసాహిత్య పరిషత్తును స్థాపించడము మొదలైన విషయాలు వెనుక మనవి చేసినాను. చారిత్రక పరిశోధనములో, శాసన వ్యాఖ్యానములో, భాషా గ్రంధుల్ని విప్పుటలో ప్రజ్ఞావంతుడని పించుకొనినాడు జయంతి. వార్ధక్యములో కూడా పరిశోధన మానని భాషాసేవకుడు; 'ఆంధ్ర వాఙ్మయ వికాసము' మీద ఆంధ్రవిశ్వవిద్యాలయములో ఉపన్యాసాలిచ్చినాడు. అవి గ్రంధరూపము దాల్చినవి కూడ. ఆంధ్ర చారిత్రక మండలివారి త్రైమాసిక పత్రికలో ఆంగ్ల భాషలో తెలుగు వాఙ్మయము మీద వ్యాసాలు వ్రాసి ప్రచురించినాడు.

ఈయన చేసిన కృషి ఎంతటిదో ఈ క్రింది రచనల ద్వారా తెలుసుకోవచ్చు: "శాసన పద్యమంజరి - దక్షిణదేశపు టాంధ్ర శాసనములు - Dravidian Lexicography – శాస్త్ర పరిభాషా ‿దముల పట్టిక-(కొంతవరకు ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటితమైనది.) ఆధుని కాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి -Defence of Literary Telugu–" అనేవి పరిశోధనాజనితాలు.

పరిశోధనము మాత్రమేకాక, ఈయన చక్కని శైలిలో కవిత వ్రాయగలవాడు కూడ అని యీక్రింది గ్రంథాలు తెలుపుతవి: "ఉత్తరరామ చరిత్ర" - "చంపూరామాయణము" - "అమరుకము" అనేవి అనువాదాలు; "ముక్తీశ్వర శతకము" తమ ఇలవేల్పు అయిన ముక్తీశ్వరుడి మీద వ్రాసినది; ఈయనకు చెళ్ళపిళ్ళ వారు 'జయంతి' అనే తమ గ్రంథాన్ని అంకిత మిచ్చినారు.

పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు జయంతివారి పైన వ్రాసిన ఈ క్రింది శ్లోకాన్ని గమనించండి:

శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు రాంధ్ర
సాహిత్య సంస్థా చ భవత్సమజ్ఞామ్
అపార మేధావిభవం చ నూన
మాచంద్రతారం ప్రకటీకరోతు॥

దీనిని బట్టి జయంతి రామయ్య పంతులు గారెంతటి భాషా సేవకుడో స్పష్టమౌతున్నది గదా!

## చిలుకూరి వీరభద్రరావు

వీరభద్రరావుగారిని (1872-1939) గురించి వెనుక చెప్పియున్నాను. ఈయన లక్ష్మణరావు గారి సహాయమును పొంది చరిత్ర పరిశోధనము చేసిన వ్యక్తి. ఈయన రచించిన "ఆంధ్రుల చరిత్ర" ఇప్పటికి మనము లోపాలతో కూడినదని విమర్శించినా, అది తప్ప మరొక గ్రంధము గతి లేదు; మనలో నెరసులు ఏరే వారి సంఖ్య హెచ్చు. చేసిన కృషికి సంతోషించి, తరువాత వారు పరిశ్రమజేసి అందులో కొరపడిన విషయాలను భర్తీచేసే దృష్టి లేనివారే చాలామంది. వీరభద్రరావుగారు అనేక వ్యాసాలను, శ్రీనాథ చరిత్ర మొదలైన గ్రంధాలను, రచించినాడు. ఈయనను గూర్చిన ఈ క్రింది వాక్యాలను పరిశీలించండి:

'తెనుగున చరిత్ర రచనకు గడగిన గ్రంధకర్తలలో రాజవంశ చరిత్రతోపాటు ప్రజల యభ్యుదయమును వర్ణింప మొదట దలపెట్టిన వారు వీరభద్రరావు గారే. వీరిది మనోహరమైన శైలి... వాదముల నడపుట యందు వీరి దండెవేసిన చేయి; వీరి భాష.. అమ్ముపోటువలెను, శూలఘాత విధమునను, కత్తివ్రేటు తెఱగునను నొప్పింపగలదు. పామువలె బుసకొట్టును, పులివలె చీఱివేయును."

చరిత్ర పరిశోధనములో లక్ష్మణరావు గారూ ఈయనా సూర్యచంద్రులవంటి వారని చెప్పవలె. వీరిద్దరి ప్రభావము తరువాత వచ్చిన ఆంధ్ర చరిత్ర పరిశోధకుల పైన బాగా ఉన్నదనడము సత్యము.

# మల్లంపల్లి సోమశేఖర శర్మ

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారొక సుప్రసిద్ధాంధ్ర చరిత్ర పరిశోధకుడు.* (జననము 1891). ఈయన కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు గారలచేత ఉద్బోధితుడైనాడు. మనకు చరిత్ర పరిశోధనాని కున్న ఆధారాలు మూడు విధాలైనవి. మొదటిది శాసనాలు, రెండవది సారస్వత గ్రంథాలలోని అవతారికలు, ఆశ్వాసాంత గద్యలు, మూడవదీ సమకాలికుల వ్రాతలు. ఈ బాపతువాటి నన్నిటిని శర్మగా రవలోడనము చేసినవాడు. చాలా శాసనాలను మూల ఉన్నవి పెళ్ళగించి, వాటిని చదివి, వాటిలో ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన విషయాలను క్రోడీకరించి ప్రచురించినాడు; వాటిమీద విషయ చర్చ చేసినాడు. ఈయన చేసిన పనిలో ప్రచురణమైనది చాల తక్కువ; నాల్గవవంతేమో అనవచ్చు. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ' కార్యములో 1924 సం॥ నుంచి 16 సంవత్సరాలు పనిచేసినాడు. అనంతరము కొన్నాళ్ళు 'భారతి'కి సంపాదకుడుగా ఉన్నాడు. అటు తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయములో చరిత్ర పరిశోధకుడుగా పనిజేసి ఇటీవలనే రిటైరు అయినాడు. మనిషి చాలా సహృదయుడు; సరసుడు; మనస్సు భావ శబలతకు లోనయ్యేది కాదు. ఎల్లప్పుడు చిత్తవృత్తి సరియైన మార్గములోనే ప్రవర్తిస్తుంది; అత్యంత స్నేహ పాత్రుడు. కష్టము కూడా సుఖముగా తీసుకోగల చిత్తస్థైర్యము కలవాడు. హసన్ముఖుడు. కీర్తికాముడు కాడు. పరిశోధనమే యీతని జీవితలక్ష్యము. "ఆంధ్రవీరులు" "అమరావతీ స్తూపము", "చారిత్రక వ్యాసములు", "హిందూదేశ చరిత్ర" అనే గ్రంథాలు ప్రచురితాలు. ఆయన వచన శైలి సజీవమై హృదయాన్ని పులకరింప చేస్తూ ఉంటుంది. చరిత్ర రచనకు మిక్కిలి ఉపయుక్తమై, పాఠకులకు అభిమానాన్ని కలుగజేసే శక్తి కలిగి ఉంటుంది. ఎంత చిక్కువిషయాన్నైనా చిక్కువిడదీసి అరటిపండు వొలిచి చేతులో పెట్టినట్టు చెప్పగల సమర్థుడు. ఆంగ్లభాషలో కూడ 'A

---

* చూ: 1946 అక్టోబరు "అభ్యుదయ" లో ప్రయాగవారి వ్యాసము
1947 మే "నవోదయ" లో పిల్లలమఱ్ఱివారి వ్యాసము.

Forgotten chapter of Andhra History' అనీ, 'The History of the Reddi Kingdoms' అనీ రెండు గ్రంథాల్ని రచించినాడు. నేలటూరివారు శర్మగారిని గూర్చి వ్రాసిన యీక్రింది వాక్యాలను గమనించండి:

"...శర్మగారికి చరిత్రపరిశోధన సహజ క్రీడ; శాసన పరిష్కారమభిమాన విద్య. లిపిశాస్త్రమున వీరితో సమానమైన జ్ఞానము గల వారి సంఖ్య యల్పిష్ఠము. లిపి మర్మ విశారదుడగుటచే నెట్టి ప్రాచీన శాసనముయొక్క గుప్తార్థమును నాయనకు బట్టబయలు. శర్మగారు సంపాదించి ప్రకటించినన్ని శాసనములను మఱి యెవ్వరును బ్రకటించి యుండలేదు. ప్రాచీన దక్షిణ హిందూదేశ చరిత్రయందు శర్మ గారికి దెలియని విషయము లేదు; ఎంతటి గూఢ సమస్యయైనను వీరి దృక్పథమున బడిన చిక్కులను బెడబాసి విశదము కాగలదు." (భారతి - రజతోత్సవ సంచిక)

మల్లంపల్లివారు మొదటి రోజులలో కవిత్వాన్ని వ్రాసినట్లు తెలుస్తుంది 'పాదుకా పట్టాభిషేకము' అనే నాటకాన్ని వ్రాసి, దానిని ఆడించి పేరు గడించినాడు; 'రోహిణీ చంద్రగుప్త,' 'కథానువాదాలు,' అరణ్య రోదనమనే నవల, 'వివేకముగల మంత్రి', 'దేశోద్ధారకులు' మొదలైనవి చిన్ననాడే రచించినాడు; రచించిన వనేకము ముద్రితము కాలేదు. ఇప్పటికీ ఈయన చరిత్ర పరిశోధకుడుగానే కాకుండా సారస్వత స్రష్టగానూ కన్పిస్తూనే ఉన్నాడు; అనేకములైన రేడియో నాటికలు బహు రసవంతాలుగా రచించి ప్రసారింప జేస్తున్నాడు. 'ఆంధ్ర చరిత్ర సంగ్రహమ'నే పేరుతో తాను రేడియోలో యిచ్చిన ప్రసంగాలను గ్రంథరూపేణ ఇటీవల లోకానికి అందించినాడు.

'నిరాడంబరత్వం, సహృదయత్వం, అన్నిటినీ మించిన ఆంధ్రత్వం ఉండటం వీరిలో విశిష్టత' అని పిల్లలమఱ్ఱివారు, 'శర్మగారు కవి, విమర్శకుడు, కృతికర్త, కృతిభర్త, కథకుడు, చారిత్రక పరిశోధకుడు,◆ మహా పండితుడు, ప్రజా సేవకుడు

---

◆ ఆంధ్రసారస్వత ప్రపంచములో ఈనాడు మన సోమశేఖరుడు సర్వజన సమాదరణీయుడై, మాన్యుడై, ఉత్తమ చరిత్ర గ్రంథ రచయితగా పేరుపొందుతున్నా డంటే లక్ష్మణరాయ డాతని కిచ్చిన ఉన్నత విద్యాశిక్షణమే కారణమని మనవి చేస్తూన్నాను.

–నిడదవోలు వెంకట్రావు–ఆంధ్రి: జులై 1994

- ఇదే ఆయనలోని విశిష్టత' అని ప్రయాగవారు వ్రాసిన వాక్యాలు శర్మగారి మూర్తిని సమగ్రముముగా అందిస్తున్నవని చెప్పవలె!

## భావరాజు వెంకటకృష్ణరావు

భావరాజు వెంకట కృష్ణరావుగారు కూడా ఆంధ్ర పరిశోధకులలో ఎన్నదగిన వ్యక్తి. న్యాయవాది వృత్తిలో ఉన్నా, సారస్వత సేవ, చరిత్ర విజ్ఞానము నిరంతరము ఆకర్షిస్తూన్న వ్యక్తి. చారిత్రక పరిశోధనలో స్థిత ప్రజ్ఞుడు. ఆంధ్రేతిహాస పరిశోధక మండలీ నిర్వాహకులలో ముఖ్యుడై మంచి సేవ చేసినాడు. ఆ మండలి తరపున 1922లో ప్రకటితమైన 'రాజరాజనరేంద్ర సంచిక'కు సంపాదకుడుగా ఉండి, ఈయన రాజమహేంద్రవరం చరిత్ర వ్రాసినాడు. 'ప్రాచీనాంధ్ర నౌకా జీవనము' అనే గ్రంథమూ, ఆంధ్రేతిహాస పరిశోధన పత్రికలోని అనేక వ్యాసములు కృష్ణరావుగారి చారిత్రక పరిశోధనా పాండిత్యాన్ని వెల్లడిస్తాయి. ఇటీవల ఆంగ్లములో 'Early Dynasties of Andhra Desa' అనే ఉద్గ్రంథాన్ని వ్రాసి ప్రకటించినాడు. ఈయనకు ఆంధ్రాభిమాన మపరిమితము. 'ఆంధ్ర' అనే శబ్దము తప్పనీ, 'అంధ్ర' అనే అనవలెననీ సిద్ధాంతీకరించినటువంటి స్వతంత్రుడు. దేవాలయాదాయ సంస్థకు కమీషనరుగా కొంతకాలము పనిచేసినాడు. అక్కడున్నప్పుడు కూడా చారిత్రక దృష్టితో అనేక విషయాలను గ్రహించినాడు. వాటి నన్నిటినీ ముందు ముందు తన పరిశోధనలో వినియోగపరుస్తాడని విశ్వసించవచ్చు.

## రాళ్లభండి సుబ్బారావు

రాళ్ళభండి సుబ్బారావు గారు ఆంధ్రేతిహాస పరిశోధక మండలిని రాజమహేంద్రము నుంచి నడుపుతున్న కర్మిష్ఠి. మంచి పండితుడు. ఆంధ్ర సాహిత్యాన్ని బాగా చదివిన సాహిత్యపిపాసి. కాళింగు లంటే ఈయన కపరిమితా భిమానము. 'కళింగ సంచిక'కు సంపాదకుడుగా ఉండి కళింగ దేశ చరిత్ర సవిమర్శకముగా వ్రాసినాడు. ఈయన చేసిన మండలి పరిశోధన పత్రికలో పూర్వగాంగుల చరిత్రపైన అనేక వ్యాసాల్ని రచించి ప్రకటించినాడు. మంచి

కార్యదీక్ష కలిగినవాడు; రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో చరిత్రోపన్యాసకుడుగా చాలా కాలము పనిచేసి ఇటీవల రిటైరైనాడు; ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలి కార్యములో సంపూర్ణముగా తనకాలము సంతతిని వినియోగిస్తున్న మహనీయు డీయన.

## నేలటూరి వెంకటరమణయ్య

డాక్టరు వెంకటరమణయ్యగారు తెలుగులోను, ఆంగ్లములోను, అనేక చారిత్రక విషయ పరిశోధక వ్యాసాల్ని రచించి భారతీత్యాది పత్రికలలో ప్రచురించిన మహనీయుడు. ప్రాచీన పల్లవరాజులపైనా, లేములవాడ చాళుక్యులపైనా అనేక వ్యాసముల రచించినాడు. మదరాసు విశ్వవిద్యాలయపు చారిత్రక పరిశోధకశాఖలో పనిజేసి ఆంగ్లములో అనేక గ్రంథాల్ని ప్రచురించినాడు. "Origin of the city and Empire of Vijayanagar - Studies in the History of Vijayanagar - Early Muslim Expansion in the South India - Further Sources of the History of Vijayanagar" మొదలైన వాటిని రచించి ఈయన విజయనగర సామ్రాజ్య చరిత్రపైన కొంతవరకు అధికారి అయినాడనవచ్చు; ప్రాచీన తామ్ర శిలా శాసనాలను కొన్నింటిని పరిష్కరించి ప్రకటించినాడు. ఇప్పుడుద్యోగమునుండి విరమించినా, చరిత్ర పరిశోధనము మాననటువంటి మాననీయుడు.

## మారేమండ రామారావు

డాక్టరు రామారావుగారు మంచి ప్రతిభాశాలి. ఈయనది కోనసీమ. రాజమహేంద్రవరములోను మద్రాసు క్రిష్టియన్ కాలేజీలో చదివి సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులైన ప్రొఫెసర్ కె.ఎ. నీలకంఠ శాస్త్రి గారి శిష్యుడైనాడు. మద్రాసు విశ్వవిద్యాలయములో పరిశోధనము చేసి డాక్టరు బిరుదాన్ని గడించినాడు. ఆంధ్రాంగ్లాలలో అనర్గళముగా మాట్లాడగల శక్తి కలవాడు. రాజమహేంద్రవరములోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలి పక్షాన వెలువడిన "కాకతీయ సంచిక" కు సంపాదకుడై కాకతీయచరిత్ర వ్రాసినాడు. అంతేగాకుండా కాకతీయ, రెడ్డి రాజ్యాల

చరిత్రల్ని కూలంకషముగా పరిశోధించి అనేక నూతనంశాల్ని కనిపెట్టినాడు. దాదాపు పన్నెండు సంవత్సరాలు గుంటూరు హిందూ కాలేజీలో చరిత్రోపన్యాసకుడుగా పనిజేసి ఇటీవలే హైదరాబాదులోని నిజాం కాలేజీలో ప్రొఫెసరుగా వెళ్ళినాడు. ఈయన చాలా పట్టుదల కల మనిషి. స్నేహపాత్రుడు; చారిత్రక విషయ పరిశోధనములో గాని; శాసనాన్వేషణములోగాని, నిద్రాహారాలు మానేటంతటి దీక్షగలవాడు; గుంటూరు జిల్లాలోని పల్నాడంతా శోధించి శాసనాలను, నాణెములను అనేకము సంపాదించినాడు. లక్ష్మణ రాయ పరిశోధక మండలి పక్షాన 'తెలంగాణా శాసనాల'ను పరిష్కరించినాడు. ఆంధ్ర ఇతిహాస సంశోధక మండలి అని ఒక సంస్థను స్థాపించి, ఆంగ్లములో 'త్రైమాసిక పత్రికను' నడుపుతూ ఆంధ్ర చరిత్రకూ సంస్కృతికీ చాలా సేవ చేస్తున్నాడు. అమరావతిలో సాతవాహన సామ్రాజ్య వర్ధంతిని మహా వైభవముగా జరిపించి తచ్చిహ్నముగా 'సాతవాహన సంచిక' సంపాదించి ప్రకటించినాడు; దీనిలో ఈయన రచించిన వ్యాసాలమూల్యాలని చెప్పవలె. ఆంధ్ర కావ్యాలలోని అవతారికల్నీ ఆశ్వాసాంత గద్యల్నీ ఆంగ్లములోకి అనువదించి యీయన మంచి ఉపకారము చేసినాడు. ఆంధ్రాంగ్లాలలో అనేక చారిత్రక వ్యాసాల్ని రచించి ప్రకటించినాడు. 'భారతీయ విద్యాచరిత్రము' 'భారతీయ నాగరకతా విస్తరణము' 'మధ్వాచార్యుల చరిత్ర' "Libraries in Ancient and Medeival India" 'కవిసార్వభౌమచరిత్ర' మొదలైనవి ఈయన గ్రంధాలు. ఆంధ్రాభిమానము విషయములో ఈయన తరువాతనే ఎవరినైనా చెప్పవలె. కాలేజీలలో ఆంధ్రాభ్యుద యోత్సవాల్ని యేటేటా యేర్పాటు చేయించి తద్వారా ప్రజలకు ఉత్సాహోద్రేకాల్నీ, ప్రచార ప్రబోధాల్నీ కల్పించిన ధీమంతుడు.

చరిత్ర విషయములోనేగాక ఈయన నాటక రచనమందు కూడ ప్రవేశము కలవాడై, అనేక ఏకాంక నాటికల్ని వ్రాసి విద్యార్థుల చేత ఆడించి, ప్రచురించినాడు. ఈనాటకాలలోని కధావస్తువుకూడా ఆంధ్రచరిత్రకు సంబంధించినది కావడము విశేషము.

ఈయనను గుఱించి నేలటూరివా రేమన్నారో చూడండి: "అపారమైన కృషి వలన కీర్తి వహించినాడు. మంచి వక్త. నెఱవాది." చారిత్రకుడికి కావలసిన దింకేముంది?

# రంగస్వామి సరస్వతి

రంగస్వామి సరస్వతి గారిని మన ఆంధ్రులెవ్వరూ ఎరుగరను కుంటాను. ఆయన తెలుగులో చాలా కృషి చేసినాడు. డాక్టరు కృష్ణస్వామయ్యంగారితో కలిసి పనిచేసినాడు. మనిషి గొప్ప ఉత్సాహవంతుడు. గవర్నమెంటువారి శాసన శాఖలో పని చేస్తూండేవాడు. భారతీత్యాది పత్రికలలో ఈయన వ్రాసిన వ్యాసా లమూల్యాలు. విజయనగర సామ్రాజ్యచరిత్రకు మాతృకలైన ఆంధ్రగ్రంధాలలో పీఠికలన్నీ సేకరించి వాటి నింగ్లీషులోకి పరివర్తనము చేసి విజయనగర చరిత్ర నిర్మాణానికి పనికివచ్చే సాధనాలను తయారుచేసి పరిశోధకుడికి సిద్ధాన్నము చేసి పెట్టిన మహనీయుడు; ఈయన కృషి కృష్ణస్వామయ్యంగారు ప్రచురించిన "Sources of Vijianagar History" అనే గ్రంధములో ఇమిడిఉన్నది. పేరు మాత్రము అయ్యంగారికి వచ్చినది. రంగస్వామి సరస్వతిగారు చేసిన కృషి కొనియాడదగినది!

# కురుగంటి సీతారామభట్టాచార్యులు

కురుగంటి సీతారామయ్య గారు (జననము 1890) సంస్కృతాంధ్రాంగ్లాలలో గొప్ప పండితుడు. ఈయనది తెనాలి తాలూకా వేమూరు గ్రామము; పేరుమోగిన పండిత కుటుంబములో జనించినాడు. ఈయన తండ్రిగారు చైనముచేసిన సుబ్రహ్మణ్య మహాగ్ని చిన్నామధేయులు; (తరువాత సన్యసించి అద్వైతానంద తీర్థులైనారు.) ఈయన ప్రపితామహుడు అనుగమ భట్టాచార్యుడని, తర్కసింహమని, అపరగౌతముడని ప్రసిద్ధి పొందిన కురుగంటి వెంకటరామశాస్త్రి గారు.

అటువంటి తండ్రిగారివద్ద వేదాధ్యయనమూ, ఇటు కొల్లూరు స్కూలులో ఆంగ్లవిద్యాభ్యాసమూ చేసినాడు. ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృతము ఆనర్సు చదివి 1917 లో ఘనముగా పట్టాన్ని పొందినాడు. అనంతరము గవర్నమెంటులో స్కూళ్ల ఇనస్పెక్టరుగా పనిచేస్తూ సత్యాగ్రహోద్యమములో పాల్గొని ప్రభుత్వోద్యోగాన్ని త్యజించిన దేశభక్తుడు. కొన్నాళ్లు బెజవాడలో జాతీయ పాఠశాలకు ప్రధానాచార్యుడుగా పనిచేసినాడు. అప్పుడే 'విద్యార్థి' అనే పత్రిక పెట్టి, సంపాదకుడైనాడు. కొవ్వూరులో

సంస్కృత కళాశాలకు ప్రిన్సిపాలుగా కొంతకాలము పనిచేసినాడు; ఫస్టుగ్రేడు ప్లీడరై తెనాలిలో ప్రాక్టీసు పెట్టినాడు. తర్వాత తంజావూరు మాన్యుస్క్రిప్టు లైబ్రరీలో సూపరింటెండెంటుగా పనిజేసినాడు. అక్కడ ఉన్నప్పుడే ఈయనకు పరిశోధన చేయడానికి అవకాశము, చేయవలెననే కుతూహలము కలిగినది. 'తంజాపురాంధ్ర నాయక రాజ చరిత్ర' అనే గ్రంధము అప్పుడు వ్రాసినదే. అప్పటినుంచి ఈయన అవిచ్ఛిన్నముగా పరిశోధనము చేస్తూనే ఉన్నాడు. హైదరాబాదులోని నిజాంకళాశాలలో సంస్కృతాంధ్రాచార్యుడుగా, నిజాంప్రభుత్వ ప్రచారశాఖలో - రేడియోలో ట్రాన్స్లేటరుగా పనిచేసి రిటైరైనాడు.

మనిషి నిగర్వి; మంచి సహృదయుడు; గొప్ప విమర్శకుడు; పండితుడు; పరిశోధకుడు, కర్మిష్ఠి. నవ్యులలో నవ్యుడు; ప్రాచీనులలో ప్రాచీనుడు. స్వరయుక్తముగా వేదాన్ని పఠించగల సమర్థుడు. భారతి, గోలకొండ, దివ్యవాణీత్యాది పత్రికలలో ఆంధ్ర భాషా, సాహిత్య, చరిత్ర సంస్కృతుల పైన అనేక వ్యాసాల్ని రచించిన పండితుడు. ఆంగ్లభాషలో వ్యాసాల్ని, గ్రంథాల్ని రచించి ఆంధ్రుల పౌర్థక్యాన్ని చాటిన మహనీయుడు. "అలంకార తత్వ విచారము" - "తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్ర" - "నిజాము చరిత్ర" - "కొందరు తంజావూరు కవులు పండితులు" - "A Hand Book of Telugu Literature""నవ్యాంధ్ర సాహిత్య వీధులు" (ప్రస్తుత గ్రంధము) - మొదలైన గ్రంధాలు రచించి ప్రచురించినాడు. విమర్శకుడుగా, పరిశోధకుడుగానే కాక కథాకారుడుగా కూడ ఈయన కొంత కృషి చేయడము విశేషము; "కథాత్రయి" మొదలైన కథలు దీనికి నిదర్శనాలు. గిడుగువారి వ్యావహారిక భాషా వాదాన్ని అంగీకరించిన పండితులలో ఈయన కూడా ఒకడు. విసుగు గల్గించకుండా, నవల లాగా ఆకర్షణీయముగా, వైశద్య ప్రధానముగా చరిత్రను రచించడము ఈయన విశిష్టత అని చెప్పవలె.

తంజావూరు లైబ్రరీలో ఉన్నప్పుడు ఈయన చేసిన కృషి మరొకరికి ఖ్యాతి తెచ్చి పెట్టినది. చూడండి ఆయన వ్రాసుకున్న యీ వాక్యాలు:

"నేను తంజావూరు లైబ్రరీలో ఉన్నప్పుడు తెనుగు పుస్తకాల పట్టీకూడా తయారుచేయ్యాలనే ఉద్యమము వచ్చినది. ఇందులో నాకు పూర్వము పింగళి లక్ష్మీకాంతంగారూ,

అక్కడ తయారుచేస్తున్న సంస్కృత క్యాటలాగు సంపాదకులైన పి.పి.యస్. శాస్త్రిగారూ, ఈవిషయములో కొంత ప్రచారము చేసినారు. నేను వెళ్ళిన తర్వాత దానికి బలమిచ్చి పోషించి, అక్కడి విశ్వవిద్యాలయంచేత ఒప్పించాము. ద్రవ్యం శాంక్షన్‌చేసి వాళ్ళు ఉద్యమాన్నంతా శాస్త్రిగారి చేతుల్లో పెట్టారు. బందరు నించీ శాస్త్రిగారి ఆప్తస్నేహితుడైన వరదాచార్యులుగా రిద్దరు పండితులను పుస్తకావలోడనం చేసి వ్రాతకాపీ తయ్యారుచేయ్యటానికి పంపారు. శాస్త్రిగారికి తెనుగు యెంతమాత్రం రాకపోవడం చేత ఆపనంతా నా అధ్వర్యం కిందనే జరిగింది. వ్రాతంతా దాదాపు తయారైంది. ఇంతలో నేను హైదరాబాదు రావడం తటస్థించింది. అచ్చుపని అంతా యితరుల సహాయంతో చేయించారు శాస్త్రిగారు. అంతా తయారైన తర్వాత, అక్కడ వున్న గ్రంధాల్లో వున్న విశిష్టత తెలిపి, వాట్లో ముఖ్యమైనవాటిని గూర్చి తెలియచేస్తూ పీఠిక రాయాలసివచ్చింది. ఆపని శాస్త్రిగారూ చెయ్యలేరు. ఇతరులు చెయ్యటానికీ చాలా శ్రమచెయ్యాలె. అప్పుడు అచ్చైన ఒక కాపీ పంపి శాస్త్రిగారు నన్ను పీఠికరాసి పంపమని హయిద్రాబాదుకు ఉత్తరం రాశారు. అప్పటికి నేను తంజావూరుద్యోగములో లేకపోవడంచేత నాపేరుకూడా వేస్తారనే ఆశతో రాసి పంపాను. తరువాత కొన్నాళ్ళకు నాకొక క్యాటలాగు ప్రతి "ఆంధ్రయూనివర్సిటీ రిజష్టారు అభివందనాలతో" అని వచ్చింది, చూతునుకదా పీఠికకూడా తానే రాసుకున్నట్లు శాస్త్రిగారే సంతకం చేసి అచ్చేసుకున్నారు. చూశారా? దీన్నియేమంటారో! లైబ్రరీ సంగతులు చెబుతూ యిట్లా అన్నారు. "ఈలైబ్రరీలో ఉన్న తెనుగు గ్రంధాలనుగూర్చి కురుగంటి సీతారామయ్యగారు నాదృష్టిని తిప్పాడు. పని ప్రారంభమైంది. పూర్తి అయ్యేలోపునే సీతారామయ్య ఖాయపు ఉద్యోగరీత్యా హయిద్రాబాదు వెళ్ళాడు." కొందరికి పనితక్కువైనా పేరువస్తుంది. కొందరికి పనియెంత చేసినా పేరు రాదు. ఈరెండోరకం వాడిని నేను!వందనాలకైనా పాత్రుడిని కాలేదు!'

ఈ ఒక్క ఉదాహరణము చాలు. ఆంధ్ర పరిశోధకులకు ఎలాంటి అవరోధాలుంటాయో తెలుసుకోడానికి.

కురుగంటి వారిని గూర్చి నేలటూరివారి వాక్యాలు చూడండి: "దేశచరిత్ర యందు వీరికిగల గాఢాభిమానము వీరిని వాఙ్మయరంగము నుండి చరిత్ర పరిశోధనకు దింపినది ... ... వీరి భాషాజ్ఞానమును చరిత్ర రచనయందు చక్కగ వినియోగపెట్టి యన్యచరిత్ర పరిశోధకుల కందని విషయముల ననేకములను బయలు బఱచినారు. వీరి రచన ఇంపైనది ..."

తంజావు రాంధ్ర నాయకరాజచరిత్ర రచనలోను, నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర రచన లోను, ఏది ఎట్లాగున్నా, మొదటివాడీయనే అనే గౌరవము దక్కినది. ఈనాటి ఉత్తమ పండితులలో ఒకడుగా ప్రసిద్ధి వడసిన భట్టాచార్యుడీయన!

# దిగవల్లి వెంకట శివరావు

దిగవల్లి వెంకట శివరావు గారనే న్యాయవాది చరిత్ర పరిశోధనములో సహజాభిలాష కల్గినవాడు. ఈయన బాగా పరిశోధించి 'కధలు-గాధలు' అనే పేరుతో గ్రంధాలను ప్రచురించినాడు. వీటిని అంతకు పూర్వము ఆంధ్ర పత్రిక ద్వారా లోకానికి అందించినాడు. అందులోని విషయాలు పరిశోధనాజనితాలైనా, చక్కని కథలుగా, చదువుకొని ఆనందించడానికి వీలయ్యేటట్లు రచించినాడు. విషయకథనములో ఈయనకున్న ప్రతిభ కొనియాడ దగినది. ఈయన 'పారిభాషిక పదనిఘంటువు' నొకదానిని రచించి మహోపకారము చేసినాడు. ఇంకా అనేకము రచించినాడు. ఈయన గ్రంధాలలో, వ్యాసాలలో కనబడే వచనశైలి ఆకర్షవంతమైనది.

# మరి కొందరు

వీరేగాక ఇంకా చరిత్ర పరిశోధనములో కృషిచేసిన, చేస్తూన్న పెద్దలున్నారు. గ్రంథరూపేణ వారి కృషి బయటికి రాలేదు. వారిలో డాక్టరు శ్రీనివాసాచార్యులు గారొకడు. ఈయన పరిశోధనాన్నంతా ఇంగ్లీభాషలోనే రచించినాడు. లండను విశ్వవిద్యాలయములో చరిత్ర పరిశోధనము చేసి డాక్టరు బిరుదాన్ని పొందినాడు. హైదరాబాదు ప్రభుత్వ పక్షాన కాకతీయ శాసనాల్ని చక్కగా పరిష్కరించి పెట్టినాడు. బెజవాడ కాలేజీ ప్రిన్సిపాలుగా చాలాకాలము పనిచేసి ఇటీవలే అస్సాంలో ప్రొఫెసరుగా వెళ్ళినాడు. ఈయన మంచి వక్త. చేయవలసిన కృషి చాలా ఉన్నది.

వంగోలు వెంకట రంగయ్య గారుకూడా కొంత పరిశోధనము చేసి జన్మను సార్థక పరుచుకున్నాడు. ఈయనది నెల్లూరు. 'మేము పరిశోధనలను చేశామని' విఱ్ఱవీగే యువకుల కంటె నిగురుకప్పిన నిప్పు వలె జీవిత మంతా పరిశోధనకు ధారపోసిన మహనీయుడు. వృద్ధుడైనా ఉత్సాహము తగ్గలేదు.

ప్రయాగ శేషాద్రి శాస్త్రి గారొకడు మంచి ఉత్సాహవంతుడు. ఈయనది గుంటూరు. అక్కడ హైస్కూలులో మాష్టరు. చరిత్రకు కావాల్సిన సాధన సామగ్రిని సేకరించడములో దిట్ట. అనేకాముద్రిత శాసనాల్ని సంపాదించి ప్రకటించినాడు. చరిత్ర అంటే వివశుడై ఉపన్యసించే వాళ్ళలో ఈయన ఒకడు. శిల్పి. చిత్రకారుడు.

ఇప్పుడు యువకు లనేకులు చరిత్ర పరిశోధనము చేస్తున్నారు. వాళ్ళను గురించి చేప్పే అవకాశము తరువాత వస్తుంది.

మన పరిశోధకులలో గర్భశైత్యాలుండడము గర్హింపదగినది. ఈ సందర్భములో రెండు మాటలు చెప్పవలె: పరిశోధనానికి సత్యము పరమావధి. పరిశోధకుడు సత్యాన్వేషి. ఇది ప్రతి పరిశోధకుడికీ ఉండవలసినది. మన పరిశోధకులలో కూడా సత్యాన్వేషణ లేకపోలేదు. పరిశోధకులంతా ఒక కుటుంబము వలె తాము చేస్తున్న పనినిగూర్చి కూడ బలుక్కుంటూ సమిష్టి ఫలాలను భాషకూ దేశానికీ అందచెయ్యడము విధి. ఇట్టి సందర్భములో మన పరిశోధకులలో కొన్నికూడని విషయాలున్నై. మొదటిది అసూయ. అయ్యో! అతనికి పేరువచ్చిపోయెనే! అనే మాట సత్యాన్వేషకుడి కుండకూడదు. రహస్యము మరొక దుర్గుణము వీరిలో తమకు తెలిసిన విషయాలు తమలోనే ఉండవలె. ఇతరులకు తెలిస్తే వాళ్ళెక్కడ తమకంటె ముందు ప్రచురిస్తారో అని బెంగ! వీటన్నిటికేమిగాని మరొకటున్నది. అది క్షమించటానికి వీలులేని విషయము. ఇతరుల మాటలను తమ స్వంత వాటివలె ప్రచురించు కొనడము, కొంతమందికి యితరుల మాటలేగాకుండా యితరుల గ్రంథాలలో ఉండే భాగాలే దొంగిలించడము. పోనీ, యెవరి దగ్గరనుంచి గ్రహిస్తారో వాళ్ళ పేరు చెప్పడానికి సిగ్గనుకోండి! తుదకు తనది గాదని చెప్పటమూ, అటువంటి మాటలనుగాని, భాగాలనుగాని అనువాద చిహ్నము (Inverted Comma) తో ఉంచటమూ విధి. ఒకప్పుడు అభిప్రాయాలు కూడా సుప్రసిద్ధాలైతే పర్వాలేదు గాని,ప్రత్యేకాలైతే తప్పక చెప్పడము విధి. ఇంకా పరిశోధకులలో ఉన్న గర్భశైత్యాలు మరెక్కడా లేవు. పిల్లలు పోట్లాడుకున్నట్టు పత్రికలలో పోట్లాడుకొనడము ఎంత విచారకరమైన విషయము! ఈ దోషారోపణచేసేవాళ్లు తాము స్వయముగా నిర్దుష్టులా అంటే మళ్లీ అట్లాగూ కనపడరు. పరిశోధన విషయములో చర్చించిన అంశమ్ము సరి అని చర్చవల్ల తేలి సర్వాదరణము పొందినదాకా అది సత్యమని స్వీకరించడానికి వీలులేదు. పరిశోధనలో తర్కము నిశితముగా ఉపయోగిస్తేగాని సత్యము తేలదు. దయా దాక్షిణ్యామూ లేకుండా పరీక్షించవలె. కాని వ్యక్తి దూషణము క్రిందికి దిగరాదు. పరిశోధన యెట్టి గర్భశైత్యాలకూ అవకాశ మియ్యవలసిన

విషయము కాదు. ఒక పరిశోధకుడు దుఃఖిస్తూ ఉంటే మరొకడు నవ్వడం కంటె గర్హ్యమింకొకటి లేదు! అంతేగాక అనేక బహిస్సాక్ష్యాల మీద ఆధారపడి ఉన్న ఆంధ్ర చారిత్రక సారస్వత విమర్శనము ప్రథమములోనే నిర్దుష్టముగా ఉండడానికి ఎంత మాత్రము వీలులేదు. నా దగ్గర యేదో అపూర్వమైన విషయముందని పత్రికలోనో ఉపన్యాసములోనో చెప్పడము, బయట పెట్టకపోవడము, ఇదొక పరిశోధక రహస్యము! పరిశోధకులు ఒకరిమీద ఒకరు వ్రాసుకునేటప్పుడు భావాలను కేవలము ఇష్ట మొచ్చినట్టు పోనియ్యకుండా కొంచెము చిత్త వృత్తులను నిరోధించుకుంటూ ఉండవలె. నిజమైన పరిశోధనము లక్ష్మణరావుగారు వ్రాసినట్టుండవలెనని మనవి.

ఇక భాషాశాస్త్ర పరిశోధనములో ముఖ్యముగా మనకు త్రిమూర్తు లగుపిస్తున్నారు. వీరు చిలుకూరి నారాయణరావు, కోరాడ రామకృష్ణయ్య, గంటిజోగి సోమయాజులు గారలు. కాల్డ్వెల్ ప్రతిపాదించిన ద్రావిడ భాషా వాదము ప్రసిద్ధముగా ఉన్నది లోకములో. ఈ వాదానికి మంచి ప్రచారముకూడా వచ్చినది. ఆంగ్లము చదువుకున్న ఆంధ్ర పండితుల ద్వారా చిలుకూరివారు ఆంధ్రానికి సంస్కృత ప్రాకృతాలకు జన్య జనక సంబంధమున్నట్లు పై వాదాన్ని ఖండిస్తూ మరొకవాదాన్ని బయలుదేరదీసినాడు. కోరాడవారు, గంటివారు కాల్డ్వెల్ మతానుయాయులైనారు. వీరు చేసిన కృషి ప్రత్యేకముగా గ్రహించుదాము:

## చిలుకూరి నారాయణరావు

డాక్టరు నారాయణరావుగారు (1890 జననము) విశాఖపట్నము జిల్లా ఆనందపురం అనే గ్రామములో జన్మించినాడు. శ్రీకాకుళం మున్సిపల్ హైస్కూలులో, పర్లాకిమిడీ రాజావారి కాలేజిలో, విజయనగర మహారాజావారి కాలేజిలో చదివి విద్యార్థి దశ పూర్తి గావించినాడు. మద్రాసు విశ్వవిద్యాలయము నుంచి తెలుగు కన్నడ భాషలలో ఎం. ఏ. పట్టాన్ని పొందినాడు. యల్.టి. ప్యాసైనాడు. పదకొండవ శతాబ్దమునాటి ఆంధ్రభాషనుగూర్చి పరిశోధన చేసి మద్రాసు విశ్వ విద్యాలయపు డాక్టరేటును పొందినాడు. తమ కాలాన్ని, విజ్ఞానాన్ని వృధా వ్యయించకుండా భాషా సారస్వతాల కోసము వినియోగించిన వ్యక్తి. ఈయన సర్వతోముఖ ప్రజ్ఞగలవాడు.

'భావ కవిత్వము' చెప్పగల నవ్యుడు; పరిశోధకుడు; వ్రాయసకాడు; ఈయన కూడ వీరేశలింగం గారివలె పరభాషావాఙ్మయాన్ని తెలుగులోకి తీసుకు రావడానికి ప్రయత్నించినవాడు; అందుకోసము అనేక భాషలలో పరిశ్రమ చేసినాడు. 'ఖురాన్ షరీఫ్' ను తెలుగులోనికి పరివర్తనము చేసినాడు. "సంగం వాఙ్మయా"న్ని గూర్చి ఉన్న అపోహలు చాలామట్టుకు ప్రపంచానికి తెలియజేసినాడు. గొప్ప పరిశ్రమజేసి 'ఆంధ్రభాషాచరిత్ర' అనే ఉద్గ్రంధాన్ని రెండు సంపుటాలుగా రచించినాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు దీనిని ప్రకటించినారు. ద్రావిడ భాషా తత్వమని యింగ్లీషులో ఒక గ్రంధాన్ని కూడ ప్రచురించినాడు. వెనుకటి మన విద్యాపద్ధతి నుగ్గడిస్తూ 'ప్రాచీన విద్యాపీఠము' అనే గ్రంధము వ్రాసినాడు. 'పండితారాధ్య చరిత్ర'ను పరిష్కరించి ఉత్తమమైన పీఠికవ్రాసి, దేశభాషోపకారము చేసినాడు. దీనిని ఆంధ్రగ్రంధమాలవారు ప్రచురించినారు. "ఓమర్ ఖయ్యాం" తెనుగులోకి అనువదించినాడు. అరవములోని కంబ రామాయణాన్ని ఆంధ్రీకరించినాడు. "అశ్వత్థామ-అచ్చి-అంబ" మొదలైన నాటికల్ని రచించినాడు. అశోకుని ధర్మశాసనాలపై నొక పుస్తకము వ్రాసినాడు. త్యాగరాయ కృతుల్ని కొన్నిటిని ఇంగ్లీషులోకి తర్జుమా చేసినాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువా రిటీవల ఈయనకు 'కళాప్రపూర్ణ' బిరుదాన్నిచ్చి గౌరవించినారు.*

ఈ విధముగా నిరంతరము గ్రంధ వ్యాసంగమూ, పుస్తకరచనా, నూతన విజ్ఞాన సాధనా తత్ప్రచారమూ చేస్తున్న భాషాసేవకుడీయన.

# కోరాడ రామకృష్ణయ్య

కోరాడ రామకృష్ణయ్యగారు ప్రసిద్ధాంధ్ర భాషావేత్తలలో ఒకడు. మనిషిచాల సాత్వికుడు; నిరాడంబరుడు; నిండుకుండ! ఈయన బందరులో 1891లో జన్మించినాడు;◆ పండిత కుటుంబము. సంప్రదాయ సిద్ధముగా పినతండ్రిగారివద్ద

---

* చూ:12-12-47 తేదీ 'ఆంధ్ర రిపబ్లిక్'లో "కళాప్రపూర్ణ చిలుకూరి"పై పిల్లలమఱ్ఱివారి వ్యాసము.

పట్టప్రదానోత్సవములో విశ్వనాధవారి ఉపన్యాసము (ఆంధ్రపత్రిక 13-12-47)

◆ చూ : ఏప్రిలు 1947 'అభ్యుదయ'లో ప్రయాగవారి వ్యాసము.

సంస్కృతాన్ని చదువుకున్న వ్యక్తి. 1915 లో బి.ఏ. పూర్తిచేసినాడు. అనంతరము విజయనగరము కాలేజిలో ట్యూటరుగా చేరినాడు. చిన్నప్పుడు పద్యాలూ, పాటలూ, వ్రాసినాడంటే ఆశ్చర్యముగా ఉండవచ్చు. వాటిల్లో జాతీయోద్యమము, సత్యాగ్రహోద్యమము- వస్తువు! 1921 లో ఎం.ఏ. పట్టాన్ని పొందినాడు; మద్రాసు విశ్వవిద్యాలయములో అప్పుడు క్రొత్తగా ఏర్పడిన ప్రాచ్య పరిశోధక శాఖలో చేరడము తటస్థించినది. అప్పుడే 'ఆంధ్రభారత కవితావిమర్శన' మనే విమర్శక గ్రంధాన్ని రచించి ప్రచురించినాడు. అప్పటినుంచి భాషా సారస్వత పరిశోధనలలో నిమగ్నుడైనాడు. తత్ఫలితముగా "కాళిదాసుని కళా ప్రతిభలు - సారస్వత వ్యాసములు - భాషోత్పత్తి క్రమము - Sandhi - Dravidian Philology" మొదలైన గ్రంధాలు వెలువడినవి. భారతీత్యాది పత్రికలలో ఈయన వ్రాసిన భాషావిషయక వ్యాసాల కంతులేదు. అఖిల భారత ప్రాచ్య విజ్ఞాన పరిషత్తులో (All India Oriental Conference) ద్రవిడభాషలపైన అనేకోపన్యాసాలిచ్చినాడు. దానిలో ద్రవిడభాషా శాఖాధ్యక్షుడుగా ఒకసారి ఈయన ఎన్నుకోబడడము గర్వకారణమే!

# గంటిజోగి సోమయాజులు

గంటిజోగి సోమయాజులు గారు (జననము 1900) కూడ సుప్రసిద్ధాంధ్ర భాషావేత్తలలో ఒకడు. ఈయనది విజయనగరము; విజయనగరము కాలేజీలో చదివి 1921లో బి.ఏ. పట్టాన్ని పొందినాడు. మరు సంవత్సరము ఎల్.టీ. అయినాడు. 1926లో తెలుగు విద్వాన్ ప్యాసైనాడు. కొంత కాలము ఆదోని హైస్కూలులో మాష్టరుగా పని చేసినాడు. 1928లో సంస్కృతములో ఎం. ఏ. పట్టము పొందినాడు. మద్రాసు పచ్చయప్ప కాలేజీలో ఆంధ్రోపన్యాసకుడుగా కొద్ది కాలము పని చేసి, అనంతరము ఆంధ్ర విశ్వవిద్యాలయములోనికి వచ్చినాడు. పింగళి లక్ష్మీకాంతంగారి తర్వాత ఇప్పుడీయన ఆంధ్ర విశ్వవిద్యాల యాంధ్రశాఖలో ప్రధానాచార్య పీఠాన్ని అలంకరించినాడు. మొదటినుంచీ యీయన జిజ్ఞాసువు. మంచి పట్టుదలగల మనిషి. కవిగా ప్రారంభమై భాషాపరిశోధకుడుగా పరిణమించినాడు.

'బసవచరిత్ర'మనే పద్యకావ్యాన్ని (1925) - 'ధర్మసామ్రాజ్యమ'నే చారిత్రక నవలనూ (1927) - 'రామచంద్రుని హంపీయాత్ర' అనే కావ్యాన్నీ (1930) రచించి కవి అనిపించుకున్నాడు. మేఘ సందేశానికి ఆంగ్లములో వ్యాఖ్య రచించి (1930) విద్యార్థులకు మేలొనర్చినాడు. అనంతరము భాషావిషయముపై దృష్టి సోకినది. అప్పటినుంచి కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని బాగా పరిశీలిస్తూ వచ్చినాడు. మొదట్లో (1930) 'ద్రావిడ భాషలు' అనే చిన్న గ్రంథము ప్రచురించినాడు; భాషాతత్త్వాన్ని క్షుణ్ణముగా పరిశోధించే నిమిత్తము తమిళ, కన్నడ, మళయాళ భాషల్ని కూడ నేర్చినాడు. ఇటీవలనే 'ఆంధ్రభాషావికాసము' అనే ఉద్గ్రంథాన్ని (1947) ప్రకటించి లోకానికి తాను జేసిన కృషిని వెల్లడించినాడు.

భాషా విషయములో పరిశోధనముచేసిన వారనేకులుండవచ్చు. కాని పై ముగ్గురినీ ముఖ్యులుగా చెప్పినాను. ఉద్దండపండితుల్ని మరి ఇద్దరిని ఇక్కడ పేర్కొనవలె. వారే మల్లాది వారు; వజ్ఝల వారు. వీరిద్దరిని గురించి కొంచెము విపులముగా చెబుతాను:

## మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సూర్యనారాయణశాస్త్రిగారు రాటుదేలిన పండితుడు; కవి; వ్యాఖ్యాత. ఈయన వాక్కు అశనిపాతము వంటిది. అతి స్వతంత్రుడు. ఈయనది ధవళేశ్వరము. సంస్కృతాంధ్ర పండితుడుగా రాజమహేంద్రవరములోనూ ఆంధ్ర విశ్వవిద్యాలయములోనూ పనిజేసి 1941లో రిటైరైనాడు. సంస్కృత వాఙ్మయ చరిత్రను రెండు సంపుటాలుగా వ్రాసినాడు; దీనిని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారే ప్రచురించినారు. అమూల్యాలైన అనేక వ్యాసాల్ని (భాషాపరముగా, సాహిత్యపరముగా) వ్రాసి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక మొదలైన వాటిల్లో ప్రకటించినాడు. అన్నిటికన్న ఈయన రచించిన 'ఆంధ్రభాషానుశాసన'మనే వ్యాకరణ గ్రంథము వలన ఈయనకు ఖ్యాతి హెచ్చినదనవచ్చు. గిడుగు రామమూర్తి పంతులుగారి వాదములో ఉన్న ఆంతర్యాన్ని గ్రహించి దానికి బలము చేకూర్చిన పండితుడు మల్లాది. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అన్నారు పెద్దలు! గిడుగువారి పద్ధతి ననుసరించి

నూతన వ్యాకరణము చారిత్రక పద్ధతి ప్రకారము వ్రాయడ మవసరమైనది. ఈ అవసరాన్ని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు గ్రహించి చక్కని పద్ధతులతో వ్యాకరణాన్ని నిర్మించినాడు. చిన్నయ సూరికంటె అనేక విషయాలలో విలక్షణముగా రచించినాడు. ఈ వ్యాకరణము సంపాదించిన విశిష్టత ఏమంటే చిన్నయసూరి కట్టిన ప్రాకారాన్ని ఇది ఛేదించినది. గచ్ఛద్భాషకు ప్రాకారాన్ని నిర్మించకూడదని సిద్ధాంతీకరించినది! అందుచేత శాస్త్రిగారన్నట్లు ఈ వ్యాకరణమూ సమగ్రము కాదు. ఏమైనా ఈ వ్యాకరణము వ్రాసి ఈయన మంచిభాషాసేవ చేసినాడు. ఇంతే కాకుండా ధనంజయుని 'దశరూపకము'ను ఆంధ్రీకరించినాడు. "ఉత్తరరామ చరితము, ప్రతిజ్ఞా శాంతనవము, భీష్మప్రతిజ్ఞ, వీరచరితము," మొదలైన నాటకాల్నీ 'ప్రేమ తత్త్వమ'నే పద్యకావ్యాన్నీ, 'భాసనాటకకధల'నే వచన కావ్యాన్నీ, ఇంకా ఎన్నో గ్రంధాల్నీ వ్రాసి ఖ్యాతి గాంచినాడు. సంస్కృతములో ఉన్న వాఙ్మయాన్ని ఈయన యధాశక్తిగా అనువదించి ఆంధ్రుల కుపకారము చేసినాడు. ఉపాధ్యాయ పండిత పరిషత్తును స్థాపించి దాని కధ్యక్షుడై సంస్కృతాంధ్ర పండితులకు దేశములో గౌరవము పెంపొందింప జేయడములో కృషిచేసినాడు, ఈయన పింగళి సూరన రచియించిన 'కళాపూర్ణోదయా'నికి గొప్పవ్యాఖ్య రచించి ఆవిధముగా మంచి సేవ చేసినాడు. దివాకర్ల వెంకటావధాని మొదలైన శిష్యులీయనకు సన్మానముచేసి ఆయన పేర ప్రత్యేకసంచిక నొకదాన్ని ప్రచురించి గౌరవించినారు.

## వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి :

ఈయన గొప్ప వైయాకరణి. చిన్నయ సూరిపైన మంచి అధికారి; మహా పండితుడు. ఒడ్డూ పొడుగూ ఉన్న మనిషి. విజయనగర మహారాజా వారి సంస్కృత కళాశాలలో పండితుడుగా పనిచేసినాడు. తర్వాత మద్రాసు విశ్వ విద్యాలయ పరిశోధక శాఖలో కొంతకాలము పనిజేసినాడు. అనంతరము ఆంధ్ర విశ్వ విద్యాలయములో పండితుడుగా ఆనర్సు విద్యార్థులకు పాఠాలు చెప్పి 1941లో రిటైరైనాడు. ఈయన 'మార్గోపదేశిక' అని విద్యార్థుల కోసము వ్యాకరణ మొకదాన్ని రచించినాడు. "వైయాకరణ పారిజాత" మనే ఉద్గ్రంథాన్ని పెద్దల కోసము రచించినాడు.

ఇది వ్యాకరణ భాష్యము. దినిలో వీరవలంబించిన శాస్త్ర పద్ధతి ప్రశంసనీయ మైనది. "ఆంధ్ర శబ్ద చింతామణి విషయ పరిశోధన"మని వ్రాసినాడు; నన్నయ కృతమే 'ఆంధ్రశబ్ద చింతామణి' అని ఋజువు చేసినాడు. ఈయన గొప్ప వ్యాఖ్యాత కూడా. "హరిశ్చంద్ర నలోపాఖ్యాన" వ్యాఖ్యను పరిష్కరించి చక్కని పీఠిక రచించినాడు. ఇందులో రామరాజభూషణ భట్టుమూర్తుల ఐక్యతను సమంజసముగా చర్చిస్తూ శ్లేష భేదాలను సోదాహరణముగా నిరూపించినాడు. ఈయన 1915లో వ్రాసిన 'వసుచరిత్ర విమర్శనము' సమగ్రమైనదై తరువాత వచ్చిన విమర్శకులకు చాల ఉపకారక మైనది. 'భాషాపరిశోధనమును ఈయనవలె దీర్ఘముగను, అగాధముగను, సూక్ష్మముగను చేసినవారనేకులు లేరు" అని కట్టమంచివా రీయనను ప్రశంసించినాడు. నిజమున కంతే! ఈయన "వీరసింహుడ"నే కావ్యమును రచించి వైయాకరణి కావ్య మెట్లా వ్రాసినాడనే ఆశ్చర్యము కలుగ జేసినాడు. మళ్ళీ ఆంధ్ర విశ్వ విద్యాలయము తరపున వేతనము పొందుతూ ప్రస్తుతము ఉద్గ్రంథ రచనము చేస్తున్నాడు. వృద్ధుడైనా వ్యాకరణ మంటే పరిశోధన మంటే అపరిమితోత్సాహము కలవాడు. ఈయనకున్న శిష్యకోటి కంతులేదు. ఆంధ్ర విశ్వ విద్యాలయము వారిటీవల ఈయనకు 'కళాప్రపూర్ణ' బిరుదాన్నిచ్చి గౌరవించినారు. ఆ సందర్భాన విశ్వనాధ సత్యనారాయణగారు పలికిన వాక్యాల్ని కొద్దిగా ఉల్లేఖిస్తాను. చూడండి:

> "......ఆంధ్రదేశమున సంస్కృత వ్యాకరణ ప్రసక్తి కలిగినంతన కీర్తిశేషులు శ్రీతాతా సుబ్బరాయశాస్త్రిగారి దివ్యమూర్తికెట్టి ప్రధమ స్ఫురణముకలదో, యాంధ్ర వ్యాకరణ ప్రసక్తి వేళ శ్రీ చిన సీతారామస్వామిశాస్త్రిగారి మూర్తి కట్టి స్ఫురణము కలదు. . ... అహోబలపండితుని తరువాత నీదేశమున నాంధ్రవ్యాకరణమునకు శాస్త్ర మర్యాద తెచ్చిన వారిర్వురే: సూత్రకర్తయైన సూరి, వ్యాఖ్యాన కారులైన శాస్త్రిగారు.....ఈ మహనీయుడొక్క వైయాకరణుడే కాడు; విమర్శకాగ్రేసరుడు కూడను."
>
> ఆంధ్ర రిపబ్లిక్ 19-12-47

ఇటీవల ఈయన శిష్యులంతా జేరి విజయనగరములో ఈయనకు సన్మానము చేసినారు. ఇంతకన్నా ధన్యత్వమున్నదా?

వీరేగాక ఇంకా పరిశోధనము చేస్తూ ఉన్న పెద్దలూ, పిన్నలూ, చాలమంది ఉన్నారు. కాని వాళ్ళలో చాలాభాగము గ్రంధరూపేణ అందించని వారు. పత్రికలలో వ్యాసాలు రచిస్తూ వారు చేసిన సేవ అపారమైనదే. వారిని కొద్దిగా చెబుతాను.

# కోన వెంకటరాయశర్మ

కోన వెంకటరాయ శర్మగారు నిరాడంబర జీవి; నల్లగా పొడుగుగా ఉండి, శాంతమైన సంభాషణ వైఖరి గలిగి, పనే ప్రధానముగా పెట్టుకున్న వ్యక్తి. ఎప్పుడూ సారస్వత సాధన చేస్తూ ఉంటాడు. ఆంధ్రసాహిత్య పరిషత్తు నుంచి చీలిపోయి 'ఆంధ్ర సారస్వత పరిషత్త' ని స్థాపించి యేటేటా సభల్ని జరిపిస్తున్నాడీయన. ఆంధ్ర మహా పండితులలో కొందరి జీవిత చరిత్రల్ని సంగ్రహిస్తున్నాడు. 'ఆంధ్రవాణి', 'ఆంధ్రపత్రిక' మొదలైనవాటిలో అనేక వ్యాసాల్ని రచించినాడు. "ఆంధ్ర సచివోత్తములు;ఆంధ్రదండనాథులు" మొదలైన గ్రంథాల్ని రచించినాడు. మంచి విమర్శకుడు.

'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము'ను వ్రాసి 'కవిత్వవేది' గారు, 'విజయనగర సామ్రాజ్య మందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'నూ, ఆంగ్లములో 'పింగళి సూరన' అనే గ్రంధమునూ రచించి తేకుమళ్ళ అచ్యుతరావుగారు మంచి భాషాసేవ చేసినారు.

వేదము వెంకటాచలయ్య, మామిడిపూడి వెంకటరంగయ్య, డాక్టరు గిడుగు సీతాపతి, పింగళి లక్ష్మీకాంతం, నిడదవోలు వెంకటరావు, బండారు తమ్మయ్య, చిదిరెమఠం వీరభద్రశర్మ, సురవరం ప్రతాపరెడ్డి, నండూరి బంగారయ్య గారలు మొదలైనవారు కూడా ఇంతో అంతో పరిశోధనముచేసి కీర్తి గడించిన భాషా సేవకులే.

వేదము వెంకటాచలయ్యగారు వ్రాసిన 'కతిపయ శబ్దార్థ విమర్శనము' చాలా విజ్ఞానదాయకమైన వ్యాసావళి. భారతిలో ఈయన అనేక వ్యాసాల్ని ప్రచురించినాడు.

మామిడిపూడి వెంకటరంగయ్యగారు గొప్ప పండితుడు. విజ్ఞాన వేత్త, రాజనీతిజ్ఞుడు. ఈయన విజయనగరము రాజావారికి దివానుగా, వెంకటగిరి రాజావారి కాలేజీకి ప్రిన్సిపాలుగా, ఆంధ్రవిశ్వవిద్యాలయములో చరిత్రాచార్యుడుగా, భీమవరము కళాశాల ప్రిన్సిపాలుగా పనిజేసి రిటైరైనాడు. ఎంతటి క్లిష్టమైన

సమస్యనుకూడా అరటిపండు వొలచి చేతిలో పెట్టినట్లుగా బోధించగల సమర్థుడు. ఆంగ్లములో అనేక గ్రంథాల్ని ప్రచురించినాడు.

గిడుగు సీతాపతిగారు రామమూర్తి పంతులుగారి కుమారుడు. భాషా శాస్త్రములో పరిశోధనము చేసినవాడు, డాక్టరేటు బిరుదాన్ని పొందినాడు. 'భారతీ శతకము' రచించినాడు. సినిమారంగములో నుంచి ప్రవేశమున్నవాడు.

పైన ఉల్లేఖించిన మిగతావారు పీఠికలూ, వ్యాసాలూ వ్రాసి సాహిత్య విమర్శచేసినా, చేస్తూన్నవారు. వీరి సాధనను మళ్లీ చెప్పుకునే అవకాశము వస్తుంది.

ఈ విధముగా ఈ కాలములో పరిశోధనలు చరిత్ర పరముగా, భాషా పరముగా, సాహిత్య పరముగా బహుళముగా జరిగినవి. జరుగుతున్నవి. ఆంగ్ల విమర్శనా పద్ధతులు, ఆంగ్ల విమర్శ గ్రంథాలు వీళ్ళకాదర్శాలుగా నిలిచి ప్రోత్సహించిన వనడానికి ఎట్టి సందేహము లేదు. అయినా మన పూర్వ విమర్శనా పద్ధతులు కూడా ఆదరింపబడుతూ వచ్చినవనే చెప్పుకోవలె. ఏమైతేనేమి చక్కని విమర్శ వీధి మన కిప్పటికి ఏర్పడిన దనవలె. ఈ కాలానికి పరిశోధనము అన్ని ముఖాలా తృప్తికరముగా జరుగుతూ వచ్చినదని మనము హర్షించవచ్చు!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 8

## నూతన ప్రక్రియా సాధనము

నవ్య సాహిత్యములో వచ్చిన నూతన ప్రక్రియలను గూర్చి ముందే తెలుసుకున్నాము. ఖండకావ్య, కథానికా, ఏకాంకిక అనే ఆ నూతన ప్రక్రియల్ని ముఖ్యముగా సాహితీ సమితి సభ్యులు సాధన చేస్తూ వచ్చినారు. 'సాహితి', 'సఖి' ,'శారద' 'గ్రంథాలయ సర్వస్వము', మొదలైన పత్రికలు ఈరకమైన సాధనకు రంగస్థలాలైనవి. సాహితీ సమితీయులకు సభాపతి శివశంకర శాస్త్రి గారు కేంద్రమని పూర్వము మనవి చేసినాను. శాస్త్రిగారు సమితి సభ్యులు చేసిన రచనల్ని సరిదిద్దుతూ, వారిని ప్రోత్సహిస్తూ ఉండేవాడు. ఈసమితి ప్రథమ సభ్యులు చేసిన సాధనను, రచించిన గ్రంథాలను గూర్చి కొంత చెబుతాను.

ముందు సభాపతిగారిని గూర్చి తెలుసుకుందాము. ఈయన వ్యక్తిని గురించి వెనుక తెలిపి ఉన్నాను. యువకులలో ఉన్న కవితా ప్రతిభను గుర్తించి, వారికి చేయూత నిచ్చి, ఈయన తనతోపాటు అనేకుల్ని సాహిత్య సాధకులనుగా తయారు చేసినాడు. ఖండ కావ్యాలను, కథలను, వ్యాసాలను బహుళముగా రచించినాడు. బహు భాషాపండితు డగుటవలన అన్యభాషా గ్రంథాల్ని అనేకము ఆంధ్రీకరించినాడు. జీవన ప్రభాతము (1913) మాధవీ కంకణము (1918) కాంచన మాల (1923) కుంకుమ భరణి (1926) మొదలైనవి శాస్త్రిగారు భాషాంతరీకరించిన వంగభాషా నవలలు. ఈయన వ్రాసిన ఖండ కావ్యాలలో 'హృదయేశ్వరి'* (1925)కి లభించిన ప్రశస్తి ఇంతా అంతా కాదు. ఇది కవి హృదయాన్నుంచి ప్రత్యక్షముగా

---

* 'శాస్త్రిగారి ఆంతస్సు హృదయాగ్నిలో వెన్నవలె కరగి భావములను పాదరసము వలె యెగఁబ్రాకిస్తుంది.' – వంగల, సహృదయకలశి.

వెలువడిన భావ కావ్యము. 'ఆవేదన' అనే కావ్యము◆ తరువాత (1929) వచ్చినది. ప్రచ్ఛన్న నామముతో 'నీలకంఠ కథలు' రచించి ప్రకటించినాడు. అన్నిటికన్నా ఈయన గేయనాటికల్నీ, పద్యనాటికల్నీ సృజించి అందులో మార్గదర్శకుడైనాడు. నలుమూలలా ఉన్న యువకుల్ని ఆకర్షించి వారిని సాహిత్య రంగములో ప్రవేశపెట్టి, గిడుగువారి వ్యావహారిక భాషావాదానికి ప్రాచుర్యము కలుగజేసి నవ్యాంధ్ర సాహిత్యానికి మూల కందముగా నిలిచినాడు.

చింతా భీమశంకరరంగారు (1891-1941) అప్పుడప్పుడు ఖండకావ్యాలు భారతిలో వ్రాస్తూఉండేవాడు. "రఘుపతి శతకమ"నే అధిక్షేప కావ్యాన్ని (Satire) వ్రాసినాడు. "సాంఘిక దౌర్జన్యము-అగ్గిరాముడు" అనే నవలలు వ్రాసి పేరు సంపాదించినాడు. అపరాధ పరిశోధక నవలలంటూ తెలుగులో వ్రాసినది మొదట ఈయనే అనవచ్చు. కథానికల్ని రచించినాడు. "స్వేచ్ఛ" మొదలైన కథలు మంచి పాకాన వ్రాసినటువంటివి. ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగముచేసి 1941లో కీర్తిశేషుడైనాడు.

చింతా దీక్షితులుగారు (1891జననము) ఈనాడు ప్రసిద్ధి పొందిన కథా రచయితలలో ఒకడు. ఈయన చిన్ననాటినుంచీ పాటలూ, ఖండ కావ్యాలూ సాధనచేస్తూ వచ్చినాడు. 'రాజగిరిరాజు' అనే పేరుతో 1913 నాటికే "కౌంటు ఆఫ్ మాంటెక్రిస్టో" అనే డ్యూమన్ నవలను అనుసరించి వ్రాసినాడు. 'పరిణామవాద' మనే పేరుతో 1920లో సాహితీ సమితి గ్రంథపరంపరలో మొదటి గ్రంథాన్ని ప్రచురించినాడు. ఈయన పైన గురజాడ కవి ప్రభావము ఉన్నదని వింటాము. ఈయన స్వతంత్రముగా పిల్లలకు పాటలు వ్రాయడమే కాకుండా కాలగర్భములో కలిసిపోతూ ఉన్న పాతపాటలన్ని పోగు చేస్తూవచ్చి మంచి ఉపకారము చేసినాడు. 'ఏకాదశి' (1925) అనే పేరుతో పదకొండు కథల్ని ప్రచురించినాడు. తరువాత కాలములో కథాసంపుటాలు "దీక్షితులకథలు, వటీరావుకథలు, హాస్యకథలు" అనేవి

---

◆ 'ఇది కవి 32 సంవత్సరమున రచించిన పద్య ఖండికల సంపుటి. ఇందులో కవి తన స్నేహితుల విషయాలు, తన యభ్యాసాలు ప్రతిఫలింప జేశారు. శివశంకరశాస్త్రి గారి రచనలన్నిటిలో మానసిక వ్యథ, సుఖ దుఃఖముల ప్రకటన, భగవద్భక్తి స్ఫురిస్తవి. – వంగల శ్రీరామావధాని.

వచ్చినవి. మొదట్లో ఈయన గ్రాంధిక భాషలో కథలు వ్రాస్తూ క్రమముగా వ్యావహారిక భాషను గ్రహించినాడు. సజీవమైన వ్యావహారిక భాష వ్రాసే కొద్దిమందిలో ఈయన ఒకడు. ఈయన 'శబరి' అనే నాటకము మంచి ప్రశస్తి పొందినది. 'నీలా సుందరి' అనే ఫేరీటేల్ రచించినాడు. ఈయన వ్రాసిన "లక్కపిడతలు" పిల్లల్ని బాగా ఆకర్షించినది. ఏకాంకికలను కూడా సాధనచేసినాడు. బాల సాహిత్యములోను, కథా సాహిత్యములోను ఉత్తమ స్థానాన్ని ఆక్రమించి యీయన రచనలు ఆబాల గోపాలమూ, అలరింపజేస్తున్న వంటే అత్యుక్తి కాదు.

మనిషి నిరాడంబరుడు, సన్నగా పొడుగ్గా ఉంటాడు. అంతర్ముఖుడైనా హాస్య ప్రియుడు. రమణమహర్షి భక్తుడు. ప్రభుత్వ ట్రైనింగు స్కూలు హెడ్మాష్టరుగా పనిజేసి ఇటీవలనే రిటైరైనాడు. ఇప్పటికీ సాహిత్య సేవచేస్తూనే ఉన్నాడు.

నోరి నరసింహశాస్త్రిగారు జననము (1900) ఈయనది పండిత కుటుంబము. ఈయన, సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడై గుంటూరు మిషన్ కాలేజీలో పనిచేసిన నోరి హనుమచ్ఛాస్త్రి గారి కుమారుడు. ఈయనది గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరు గ్రామము. బి.ఏ., బి.యల్. ప్యాసై వకీలుగా రేపల్లె చేరినాడు. చిన్ననాటి నుంచీ సంస్కృతాంధ్రాలలో మంచి ప్రవేశము కల్గినవా డీయన.* విద్యార్థిగానే కవిత్వము చెప్పడము ప్రారంభించినాడు. సాహితి, సఖి భారతీత్యాది పత్రికలలో అనేక ఖండకావ్యాలను, కధానికలను, ఏకాంకికలను, వ్యాసాలను ప్రచురించినాడు. 'గీతమాలిక' (1921) అనే ఖండకావ్య సంపుటినీ, 'భాగవతావతరణమ'నే పద్యనాటికనూ, "సోమనాథ విజయమ"నే వచన నాటకాన్నీ (1923) గ్రంథ రూపాన అందించినాడు. సోమనాథ విజయానికి మంచి ప్రశస్తి వచ్చినది. ఈయన వ్రాసిన ఏకాంకికలు భావపరిపూర్ణాలై, ధర్మప్రబోధకాలుగా ఉంటవి. ఈయన కెంతటి విమర్శజ్ఞాన మున్నదో ఈయన వ్యాసాలు తెలుపుతై. మనిషి సనాతనాచార సంపన్నుడు. కర్మిష్ఠి. ఈవ్యక్తిత్వము తరువాత కాలములో

---

* చూ: ప్రతిభలో నోరి ఖండ కావ్యాలపైన వావిలాల వారు వ్రాసిన వ్యాసము "నేటి ఆంధ్ర సాహితీ లోకంలో సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యాలను విశేషంగా జీర్ణించుకొన్న వాళ్ళలో వకడు. – వావిలాల. " (ప్రతిభ – సం 6. సం.1)

బాగా స్థిరపడినట్లు తరువాత వచ్చిన రచనల వలన గమనిస్తాము. కవి సమ్రాట్ బిరుదాంచితుడు.

కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారు (జననము 1898) తెనాలి నివాసి. చక్కని ముఖవర్చస్సు- పొడుగాటి కాయము-మెత్తని జిహ్వ, కలిగి ఆహ్లాద కరుడుగా ఉండేవాడు. 1922 లో "సంధ్యా రాగము" నే ఖండకావ్య సంపుటిని ప్రచురించినాడు. ఈయన వ్రాసిన 'మాయపెండ్లి' అనే ఏకాంకిక ఆకర్షణీయమైనది. చిన్నతనములో (1915) ప్రబంధము నొక దానిని వ్రాసినాడు. కాని ప్రచురించలేదు. ఈ నూతన మార్గములో గేయమును సాధనచేసి సఫల మనోరథుడైనాడు. ఈయన వ్రాసిన 'మేలుకొలుపు' హృదయంగమమైనది. 'పోయిననగ' అనే కథ మంచిగమనము కలిగి ఈయన కథారచనా ప్రాశస్త్యాన్ని చాటుతున్నది. చిన్నవయసులో మంచి ఆశచూపి కీర్తికాముడు కావలసిన యీ వెంకటసుబ్బయ్యగారు అదృశ్యుడు కావడము శోచనీయము.*

త్రిపురారిభొట్ల వీరరాఘవస్వామిగారు (జననము 1892) సంస్కృతాంధ్రాలలో మంచి పండితుడు. వేదాంత, ధర్మ, అలంకార, జ్యోతిష శాస్త్రాలలో కృషి చేసినవాడు. పద్య కవిత్వమును చెప్పినాడు గాని ఎక్కువగా ప్రచురించలేదు. బెంగాలీ భాషను బాగానేర్చి అనువాదాలు చేసినాడు. 'కపాలకుండల' (1922) అనే నవల, 'కుంతల', 'నవమాలిక' లనే కథా సంపుటాలు, ఈయన గ్రంథాలు. చాలా కాలానికి గాని వ్యావహారిక వాదాన్ని గ్రహించలే దీయన. కొంత కాలము సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా పని చేసినాడు. ఈయన సాహితీ సమితికి మంత్రిగా వ్యవహరించినాడు.

కోపల్లె శివకామేశ్వరరావుగారు (జననము 1898) వ్యాకరణాలంకార వేదాంత శాస్త్రాలలో విద్వత్తు కలవాడు. కాకినాడ కళాశాలలో పండితుడు. ఖండకావ్యాలు, వ్యాసాలు అనేకము రచించాడు. శతావధానిఅనిపించుకున్నాడు. 'స్వప్నవాసవదత్త', 'కర్ణభారము' మొదలైన గ్రంథాల్ని ప్రచురించినాడు. 'సాహిత్యమీమాంస' మొదలైన

* ఈయనను గూర్చి శివశంకర శాస్త్రిగారు 'అజ్ఞాత మిత్రమ'నే పేర గీతా రూపముగా అశ్రువుల నిచ్చినాడు.

గ్రంథాల్ని ప్రచురించినాడు. 'సాహిత్య మీమాంస' అనే మంచి లక్షణ గ్రంథాన్ని రచించినాడు. ఈయన సాహిత్య క్షేత్రములో సృష్టివిమర్శనాలలో రెంటిలోను కృషిచేసిన వ్యక్తి.

మునిమాణిక్యం నరసింహారావుగారు మొదట్లో ఖండ కావ్యసాధన చేసి మానినాడు. విద్యార్థిగా ఉన్నప్పటినుంచే కథలు వ్రాస్తూ ఉండేవా డీయన. 'సంసారము దుఃఖభాజనము కాదనీ అది సౌఖ్య నిలయమనీ నిరూపించిన ఉత్తమ హాస్యరచయిత మునిమాణిక్యం' అని అనిపించు కొనినాడు. ఈయన సృష్టి ంచిన 'కాంతం' అనే పాత్ర అద్భుతమైనది. 1921-22 ప్రాంతానికే ఈయన 'కాంతం' పుట్టి, పెరిగి, పెనిమిటితో కాపరము చేస్తూ ఆయనచేత 'టీ'ని మాన్పించి నగలు చేయించుకున్నది. ఈయన కాంతం కథలు 'క్లాసికల్' అయిపోయినై. కాంతం కథలు-వక్రరేఖ-ఉపాధ్యాయుడు మొదలైన గ్రంథాల్నిమొదట ప్రచురించినాడు. తరువాత కాలములో అనేక గ్రంథాల్ని ప్రచురించి మంచి పేరు సంపాదించుకున్నట్లు తర్వాత గమనిస్తాము. బి.ఏ., బి.ఇడి. అయి బందరు హైస్కూలులో మాష్టరీ చేస్తున్నాడు.◆

వేదుల సత్యనారాయణశాస్త్రిగారు (జననము 1900) శతావధాని; శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శిష్యుడు. చక్కని పాకములో ఖండ కావ్యాలు అనేకము రచించినాడు. 'దీపావళి'※ అనే పేరుతో కొన్నిటిని ప్రచురించినాడు. 'గౌతమీ కోకిల' అనే బిరుదాన్ని పొందినాడంటే ఈయన కవితా శక్తి వేరుగా చెప్పవలెనా! 'అపరాధిని' 'ధర్మపాలుడు' మొదలైన బెంగాలీ నవలల కనువాదాలు చేసి ప్రచురించినాడు. స్వతంత్రముగా కథల నల్లుతూ ఉండేవాడు. హైస్కూలు పండితుడుగా జీవయాత్ర గడుపుతున్న నిరాడంబరుడు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు (జననము 1897) పండిత కుటుంబానికి చెందినవాడు. ఈయనది పిఠాపురము. ఇంటివద్ద జరుగుతూ ఉండే పండిత

---

◆ చూ: 'ఆంధ్ర శిల్పి' (1948)లో మునిమాణిక్యం వారిపైన వ్యాసము.

※ ఈ పుస్తకములో ...సంఘ బహిస్కరణ ఒక వైపు, ప్రేమ తరంగము లొకవైపు హృదయమును కలచివేయ కవి దుఃఖపుటూర్పుల సందడి ప్రేమ గాయకుడై వలపు వెదజల్లి అన్యతాభావపథమున రెక్కలు గట్టుకొని ఎగురుచున్నాడు. --వంగల శ్రీరామావధాని

గోష్ఠులు, సర్. ఆర్. వెంకటరత్నం నాయుడుగారి శుశ్రూష, రవీంద్రుని గ్రంథావలోకనము ఇతణ్ణి మంచి సంస్కారిగా తీర్చిదిద్దినవి. బి.ఏ. ప్యాసై కాకినాడ కాలేజీలో కొంత కాలము పనిజేసి విద్యార్థులలో కవితాభిరుచి కల్గించినాడు. గేయాలు, పద్యాలు, నాటికలు సాధించినాడు. ఈయన 'కృష్ణపక్షము' (1925) 'ఊర్వశి', 'ప్రవాసము' (1929) అనే ఖండ కావ్యాలను ప్రచురించినాడు. ఈయన కవిత్వములో సుఖాంశ కన్నా దుఃఖాంశ ఎక్కువగా ఉంటుంది; శబ్దాలంకార భూయిష్ఠమైన, చక్కని శయ్యాసౌలభ్యము కల కవిత్వాన్ని వ్రాస్తాడు. సభారంజకముగా గంటలకొలది మెత్తగా మాట్లాడగల సమర్థుడు. మంచి ప్రతిభావంతుడు. తరువాత కాలములో పేరుప్రతిష్ఠలు పొందిన నవ్యకవులలో ఒకడు.

కొమాండూరి కృష్ణమాచార్యులు గారు ప్రాచీన కావ్య పద్ధతిలో కావ్య రచన చేసిన నవ్యుడు. గుంటూరు క్రిష్టియన్ కాలేజీలో పండితుడుగా పనిజేసి రిటైరైనాడు. 'కుసుమాంజలి' (1923) అనే ఖండ కావ్య సంపుటి, 'హర్ష చరిత్ర' అనే చంపూ (ఆంధ్రీకరణము) రచించినాడు. ఇవేగాక (పాదుకా సహస్రము' అనే వేదాంత దేశికాచార్యులవారి సంస్కృత కావ్యాన్ని ఆంధ్రీకరించినాడు. ప్రాకృతము నుంచి 'సేతుబంధ' మనే కావ్యాన్ని తెనిగించినాడు. ఈయనను విద్వత్కవి అనవచ్చు.

మొక్కపాటి నరసింహశాస్త్రి గారొక విశిష్టమైన వ్యక్తి. ఈయన ఇంగ్లాండు పోయి వచ్చినాడు. హాస్యరచనల్ని చేయడములో సిద్ధహస్తు డనిపించుకున్నాడు. ఈయన వ్రాసిన బారిష్టరు పార్వతీశం (1924) అనే నవల ఈయనకు శాశ్వత కీర్తి తెచ్చిపెట్టినది. 'పార్వతీశం' పాత్ర నవ్య సాహిత్యములో స్థిరముగా నిలిచిపోతుంది. ఈయన అనేక కథల్నీ, నాటికల్నీ రచించినాడు. లోకవృత్తములో జరిగే సామాన్య విషయాలను యథాసంభవముగా చిత్రించడములో మొనగాడీయన. ఏకోదరులు (1927), 'ప్రతిబింబములు' అనే గ్రంథాల్ని కూడా ప్రచురించినాడు.

ఈయన ప్రకృతే హాస్య ప్రకృతి. గుండ్రని మనిషీ - పొట్టి ఆకారమూ - చక్కని భాషోచ్చారణా కలిగి ఎప్పుడూ చిరునవ్వు మొగములో తొలకాడుతూ ఉంటుంది. తరువాత కాలములో పేరుపొందిన నవ్యులలో ఈయన కూడా ఒకడు.

విశ్వనాథ సత్యనారాయణగారు (జననము 1895) విద్వత్కవి. ఈయన అతి స్వతంత్రుడు. ప్రథమ దినాలలో తిరుపతి వెంకట కవుల శుశ్రూష చేసినాడు. ఎం.ఎ. పట్టము పొంది కొంతకాలము గుంటూరు క్రిష్టియన్ కాలేజీలో పనిజేసి ఇపుడు బెజవాడ కాలేజీలో ఆంధ్రాచార్యుడుగా ఉన్నాడు. ఖండ కావ్య, కధానికా, ఏకాంకికలనే కాక నవల, మహాకావ్య, నాటకాలను రచించినాడు. 'కిన్నెరసాని పాటలు' - 'కోకిలమ్మ పెండ్లి' - 'నర్తనశాల' - అనార్కలి' - 'వేనరాజు' - గిరి కుమారుని ప్రేమగీతాలు' - మొదలైనవి ఈయన తొలి కృతులు. ఈయన సాధన చేయని ప్రక్రియ అంటూ లేదు. ఈయనకు మన సంప్రదాయ సంస్కృతులంటే అపరిమితాభిమానము. తరువాత కాలములో కవిరాజుగా, కవిసామ్రాట్టుగా పేరు పొంది నవ్య సాహిత్యాన్ని ఏలినాడు. ఈయన గూర్చి మళ్లీ వ్రాసుకునే అవకాశము వస్తుంది.

శ్రీనివాస శిరోమణిగారు (అసలు పేరు కరణం శ్రీనివాసరావు) కథా రచనలో మంచి సాధకుడు. తరుచు వ్యాసాలు వ్రాసినాడు కూడా. ఒడ్డూ పొడుగుగల మనిషి. పెద్ద మీసం! ఈయన ఆంధ్ర పత్రికా కార్యాలయములో చాల కాలము పని చేసినాడు. "పునర్జన్మ, చైతన్య చరిత్ర" మొదలైన గ్రంధాలు రచించినాడు. నాటికాసాధన కూడా చేసినవాడని చెప్పవలె.

సాహితీ సమితి ప్రథమ సభ్యులలో మిగతా వారుకూడ నవ్యసాహిత్యములోని నూతన ప్రక్రియల్ని సాధన చేసినవారే. గతానుగతికమైన రచనగాక, వీరంతా ప్రత్యేకము, విశిష్టమైన వ్యక్తిత్వము, ప్రతిభ కలిగిన వారై చిత్రగతులలో ఖండకావ్యరచన చేసినారు.

నాయని సుబ్బారావుగారు (జననము 1899)'సౌభద్రుని ప్రణయ యాత్ర' మాతృగీతాలు' అనే ఖండకావ్యసంపుటులను ప్రచురించినాడు. ఈయన సౌమ్యుడు; కవితాహృదయము కలవాడు. నరసరావుపేట హైస్కూలుకు హెడ్మాష్టరుగా ఉన్నాడు.

చామర్తి రాజశేఖరరావుగారు (1898-?) మంచి సాధకుడై ప్రతిభ చూపిన నవ్యులలో ఒకడు. చిన్నతనమునుంచీ ఖండకావ్య రచనచేస్తూ ఉండేవాడు. 'విజయ

ధ్వజము' 'బృందావనము' మొదలైనవి రచించినాడు. చిన్నవయసులోనే మృత్యువాత పడినాడు.

పెద్దిభొట్ల పూర్ణశర్మగారు భావోన్మాది. నల్లని దేహముకలిగి, ఎత్తైన క్రాఫింగుతో, గుండ్రని ముఖము మందహాసముతో ఉండేది. ఖండకావ్య సాధనము 1916 - 20 లలో చేసి వంగభాషా ప్రభావము కలవాడుగా కన్పించినాడు. అభివృద్ధికి రావలసిన కాలములో మృత్యువీతణ్ణి తీసుకు వెళ్ళినది.

కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు గారు చక్కని ప్రకృత్యుపాసకుడు. కవి. ఖండకావ్య సాధనము చేసినవాడు. ఈయన రచనలలో అంతటా నవ్యత గోచరిస్తుంది.

కొడాలి ఆంజనేయులుగారు, విశ్వనాధవారితో కలిసి కవిత్వము చెప్పినవాడు; ఇద్దరు జంట కవులుగా వ్యవహరించినారు కూడా. ఆంజనేయులుగారు చక్కని కవిత్వము వ్రాయగలవాళ్లలో ఒకడు. కాంగ్రెసు ఉద్యమములో చేరి తర్వాతకాలములో కవిత్వసాధన మరచినాడు.

కొప్పర్తి నారాయణమూర్తి, వింజమూరి పార్థసారథి, వజ్ఝబాబూరావు గారలు కధారచనలో కొద్ది సాధన చేసినవారు; వజ్ఝ బాబూరావుగారు గొప్ప చిత్రకారుడని పేరుపొందినాడు. సప్తపది అనే పేరుతో తనకధానికల్ని గుదిగూర్చినాడు. వచనశైలి బాగుంటుందని గిడుగువారిచేత మెప్పుపొందిన వాడు. ఇటీవలే గతించినాడు.

అడివి బాపిరాజు, రాయప్రోలు సుబ్బారావు, నండూరి వెంకటసుబ్బారావు గారల కృషిని గూర్చి పూర్వమే మనవి చేసినాను. ఇంక పోతే పంచాగ్నులవారు, గిడుగువారు, కురుగంటివారు మహా పండితులై ఈనవ్య సాహిత్యానికి బాసటై నిల్చినారని చెప్పవలె.

ఈ విధముగా పైన పేర్కొన్న సాహితీ సమితి సభ్యులు పత్రికలద్వారా తమ గ్రంధాల ద్వారా నూతన ప్రక్రియా సాధనము చేసి నవ్య సాహిత్యానికి ఒక స్థితిని చేకూర్చినారు./

వీరి ననుసరించి తరువాత అనేకులు నవ్య సాహిత్య సృజనము చేస్తూ వచ్చినారు. వారిని గూర్చి తర్వాత భాగములో ముచ్చటించుకొందాము.

నవ్య సాహిత్య సౌధానికి మూలస్తంభాలుగా అమరిన గిడుగు వారి భాషావాదము - రాయప్రోలు గురజాడల ఖండకావ్య గీతికా రచన - కట్టమంచివారి కవిత్వ తత్త్వ విచార రచన - సాహితీ సమితి స్థాపనము లనేవి ఎలా సంభావితాలై సాహిత్యానికి దోహదభూతాలై నవో గమనించినాము.

ఈ విధముగా ఒక స్థితికి వచ్చిన నవ్య సాహిత్యము ముందు ముందెలా విస్తరణము పొందినదీ, ఎవరెలా కృషి చేసినదీ. ఏయే ఉద్యమాలు దోహదభూతాలైనవీ వారి కృషిలో ఉన్న గుణదోషాలెలాంటివో తర్వాత భాగములో తెలుసు కొందాము.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# (నవ్యసాహిత్య విస్తరణము)

# 1

## జాతీయోద్యమము: వాఙ్మయము

"కవులు కొందరు దేశభక్తినే విషయముగా చేసుకొని కావ్యాలను రచించిరి. కొందరు గాయకులు దేశభక్తినే గానము చేసినారు. చిత్రకారులు దేశభక్తి పూరకాలైన చిత్రాలే చిత్రించినారు" అని యీ శతాబ్దపు ప్రథమ సంవత్సరాలను గూర్చి వ్రాస్తూ మనవిచేసినాను. యూరోపు దేశములో కవికుమారులు సాక్షాత్తుగా కొంతమంది యుద్ధములో స్వయముగా పాల్గొన్నారు. అవసరము వచ్చినప్పుడు యుద్ధముచేస్తూ గుంటలలో అవకాశము దొరికినప్పుడు కావ్యాలు రచించినారు. తుదకు అక్కడే ప్రాణాలుకూడా వదలినారు. విల్ ఫ్రెడ్ ఓవెన్ అనే కవి 1918 సంవత్సరములో ఫ్రాన్సులో యుద్ధములో పాల్గొంటూ పరమపదించినాడు. అట్లాగే ఫ్రాన్‌జుమార్క్ అనే జర్మన్ లలితకళోపాసకుడు 1916 సంవత్సరములో యుద్ధము చేస్తూ వీరస్వర్గాన్ని చూరగొన్నాడు. ఈయన ఒక లలిత కళాసూత్ర భాష్యము రచించినాడు. గుంటలలో తీరిక దొరికినప్పుడు గొప్ప లలిత కళాభావాలను అత్యుదాత్తముగా వివరించినాడు. ఈవిధముగా అనేక కవులున్నారు. వీరి కావ్యాలు చూస్తూఉంటే కొన్ని విషయాలు కనపడతవి. మొదటిదినాలలో ఉత్సాహము ధైర్యము పురికొల్పడము; తర్వాత యుద్ధము ముగియక ఆలస్యమైనప్పుడు నిరుత్సాహము, ఎప్పుడు చావు వస్తుందో అనే అనిశ్చయము, చూస్తున్న నాశనానికి జుగుప్స; తుదిదినాలలో యుద్ధము చాలు అనేభావము, అప్పటి యింగ్లాండు రాజకీయవేత్తల కార్యాలు చూస్తూ అసంతృప్తి, మళ్ళీ యుద్ధము వస్తుందనే సూచన; ఈవిధముగా మూడంతస్తులున్నై ఆకాలపు

సారస్వతములో!* మన అప్పటి నవ్యసారస్వతములో అనగా యుద్ధవాఙ్మయములో వీనిలో యేదీ కనపడదు! ఎందుకు కనపడుతుంది? ఆ అనుభవాలు మనవారికేవీ ఆలక్షణాలు కనపడ్డానికి? కాని ఆకాలములో మరిఒక విధముగా కవుల హృదయాలు ప్రవర్తించినవి! ఆ హృదయ పరివర్తనమే మన కవుల భావనవ్యతగా పరిణమించినది! తర్వాత వత్సరాలలో అనగా 1920 సంవత్సరానంతరము మన రాజకీయాందోళనా దినాలలో వెనుకటి ఆంగ్లకవిత్వ యుద్ధలక్షణాలు కొన్ని ఉన్నవి! మొదటి సత్యాగ్రహ దినాలలో ధైర్యమూ, ఉత్సాహమూ కనపడుతుంది! తర్వాత త్వరలో రాజకీయసమస్య పరిష్కారము కాకపోయేటప్పటికి అసంతృప్తి ఆందోళనా కనపడుతుంది! కాబట్టి యుద్ధకాలములో ఆంగ్లకవిత్వగుణాలు సహాయనిరాకరణ దినాలలో వెలువడ్డ కొంత మన సారస్వతములో కనపడతవి! దీనిలో నవ్యులనుకొనువాళ్ళుమాత్రము బహుళముగా పాల్గొనలేదు!

## కొందరు సేవకులు ◆

ఈ కాలములో గేయాలనూ, కావ్యాలనూ వ్రాసినవారిలో బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, గరిమెళ్ళ సత్యనారాయణ, బుచ్చి సుందర రామశాస్త్రి వగైరా వార్లను సేర్కొనవలె. లక్ష్మీకాంత కవిగారు "స్వరాజ్యరథము", "స్వరాజ్యసమస్య" అనే అత్యంత దేశభక్తి పూరితాలైన ఖండకావ్యాలను రచించి ప్రకటించినారు. ఇవి చాలా హృదయాకర్షకముగా ఉంటవి. వీనిలో స్వరాజ్యోద్యమమూ, తదాకారమూ, తత్ప్రచారమూ, తద్వివరణమూ, తిలక్ మహాశయుడు చేసిన సేవా, ఆయన తర్వాత నాయకత్వము గాంధీమహాత్ముడి హస్తగతమవడము, ప్రజల కర్తవ్యము, మిక్కిలి

---

* "The men who came home from the war with decorations rubbed shoulders with the mutilated and the dead." "It (Dzdaism) expressed protest and resignation, disgust and fury." (Modern German Art)

◆ ఈభాగాన్ని గూర్చి వ్రాసేటప్పుడు నామనస్సు సంకోచిస్తున్నది. సారస్వతసేవే ఆశయముగాని మరొకటి కాకపోవడము చేతనూ, ఈ సారస్వతాన్ని వదలడానికి వీలులేదు కాబట్టిన్నీ, విషయకథనము అత్యవసరము కాబట్టిన్నీ, తదాకారమూ, తత్స్థానమూ తెలపడము నా విధి.

ఉత్సాహకరముగానూ హృదయంగమముగానూ చిత్రించినాడు. సరసమై నిర్దుష్టమై వాక్య చిత్రాలతో కూడిన యీ ఖండకావ్యాలు తత్కాలములో ప్రచారానికివచ్చిన కావ్యాలన్నిటిలోను సారస్వతదృష్టితో చూస్తే గొప్పవి. ఒక్క పద్య మనువదిస్తాను:

"తరి గాంధీయుగ మేగుదెంచె నిక నేతద్భారతీయ స్వరా
జ్యరథం బాతని సారథిత్వమున వే సాగింపు డంచున్ జగ
ద్గురు డేగెన్ దివి లోకమాన్యుడవె యుద్ఘోషించె తూర్యధ్వనుల్
ఉరు తద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయప్రజల్!"

- స్వరాజ్యరథము

ఇట్టి ఉద్బోధలతో నిండిఉన్న దేశభక్తి పూరితమైన కావ్యాలివి.

తర్వాత గరిమెళ్ళ సత్యనారాయణగారి* పేరాంధ్రదేశములో అన్ని మూలలా వ్యాపించి ఉన్నది. ఈయన చాలా ఉత్సాహవంతుడు. 1920 డిసెంబరులో తనచదువు మానివేసి స్వదేశోద్యమములో చేరిపోయినాడు. మనిషియెంతమాత్రము స్ఫురద్రూపిగాడు. బట్ట, కట్టు, జుట్లలో చాలా అశ్రద్ధ! ఎంత చూడటానికి ఆకర్షణ లేదో వాక్కులో అంత రస మున్నది. ఈయన గేయకవి. ఈయన వ్రాసిన గీతాలలో కల్లా ఒక్కటిమాత్రము సర్వాంధ్రదేశ మెన్నటికి మరవని దై ఉన్నది. దాని మొదటి పాదాన్ని మాత్రము సూచిస్తాను.

"మాకొద్దీ తెల్లదొరతనమూ..." అనేపాటను 1921, 22, 23 వత్సరాలలో పాడని యువకుడు లేడు! యావదాంధ్రదేశమూ పాకిపోయిన పాటయొక్క కర్త జాతి కెంత ప్రియుడో వేరే చెప్పే పనిలేదు! ఆంధ్రుల హృదయ క్షేత్రాలలో శాశ్వతస్థానమూ, ఆంధ్రసారస్వతములో మృతిరహితమైన పేరూ సంపాదించుకున్నాడు. కాని యీయన పేదతన మనుభవిస్తున్నాడు. దేశభక్తులంతా దారిద్ర్యాన్ననుభవించడానికి వెనకాడకూడదు. వాళ్ళను భరించవలెననే బాధ్యత దేశము వహించడము లేదు. పైపెచ్చు వీరిని నిందించడమే. "ఎవరుద్యోగం వదలమన్నా రీయన్ని?" అని ఒక

* ఈయన నాకు యల్.టి. క్లాసులో సహాధ్యాయి. ఈయన చేయితగిలిన ప్రతి విషయమూ సరసమేననీ చెప్పడములో ఎట్టి అతిశయోక్తి లేదు.

ప్రశ్న! వారి స్వార్థత్యాగమువల్లనే తాను సుఖజీవనము చెయ్యడము సంభవిస్తున్నదని యీ సుఖజీవికి అనిపించదు! ప్రపంచధర్మము! వెనుకటి సహాయ నిరాకరణోద్యమములో సత్యనారాయణగారివలె కష్టపడ్డవారు వేలకువేలున్నారు. తుదకు కాంగ్రెసు వారధికారానికి వచ్చినప్పుడుకూడా వీళ్ళకు మోక్షము కలుగలేదు. ఒకమారు 1921 సంవత్సరములో ఒక సన్నివేశము కలిగినది. ఆంధ్రదేశములో నాయకులంతా జైళ్ళకు వెళ్ళారు. జాతీయవిద్యోద్యమములో పనిచేస్తున్న వాళ్ళము మిగిలిఉన్నాము. మాకు రెండు పూటలా కడుపునిండా తిండిలేదు. ఆసరస్వతిని నమ్ముకుని ఉన్నాము. తిలకు స్వరాజ్యనిధి ఉండే దప్పుడు. దానికి గాంధీగారు సర్వాధికారి. ఆంధ్రదేశములో ఉండే జాతీయ పాఠశాలోపాధ్యాయులము చాలా మందిమి కలిసి గాంధీగారికి మహజరొకటి పంపుకున్నాము. అందులో మాకు శరీరపోషణ చేసుకోడానికి అవసరమని తమకెంత తోస్తుందో అంత వేతనాన్నియ్యమని విన్నవించినాము! "ఆంధ్రజాతీయవిద్యాపరిషత్తు"ని ఒక కాంగ్రెసు పోషణలో ఉన్న సంస్థ ఉండేది. తత్క్షణ వెళ్ళింది మహజరు. గాంధిగారి దగ్గర్నించి ఉత్తరం వస్తుందని అనుకుంటున్నాము. అప్పుడాయన "యంగు ఇండియా" అనే ఒక పత్రిక ఆంగ్లభాషలో ప్రకటిస్తూ ఉండేవాడు. అందులో ఒక వారములో వ్రాసినాడు ఈ సంగతి. దాని అర్థమిది: "ఇటువంటి మహజరొకటి నాకు వచ్చింది. నా సానుభూతంతా వాళ్ళదే! కాని ప్రతిఫలము కోరి వీళ్ళు త్యాగము చెయ్యలేదు. త్యాగానికి సేవే ప్రతిఫలము కాబట్టి వాళ్ళంతా చావవలసిన అవసరం వస్తే చావవలసినదే!" ఇది అమానుషమైన ప్రత్యుత్తరం, తమవలె సర్వావస్థలలో సర్వకాలము త్యాగము చెయ్యగల వాళ్ళుఅందరూ అయితే భారతదేశానికి స్వరాజ్యమే అక్కరలేదు. అందరి రక్తమాంసాలూ తనంత స్వార్థత్యాగము కలవి కావు. ఇప్పటికీ అసలుసూత్రము యిట్లాగే ఉంది. ఒక్క జవహర్లాలుమాత్రం సంయుక్త రాష్ట్రాల్లో కాంగ్రెసుసేవ చేసేవాళ్ళకు వేతనాల నేర్పాటు చేయటానికి ప్రణాళిక వేసి కొంత అమల్లో పెట్టినాడు. గొప్ప గొప్ప నాయకులకు కావలసిన సౌకర్యాలన్నీ లభిస్తూనే ఉంటవి! ఇతరులు తమకు సమస్త సౌకర్యాలు చేస్తారని తెలిసీ చాటుగా లక్షలు దాచుకుని పైకి పేదవాడని కనపడుతూ సేవ చెయ్యడము సుళువే! వీరిలో కొందరికి సామాన్యవాలంటీరు అనుభవించే

కష్టాలు ఎంతమాత్రము తెలియవు. మళ్లీ వీరు సాధించిన అన్ని కార్యాలూ వాలంటీర్లు సాధించి పెట్టినవే! అటువంటి **వాలంటీరు** సత్యనారాయణగారు. చిత్రకారుడీయనపటాన్ని చిత్రించ లేదు! ఈయన గొప్ప ఉపన్యాసకుడు కాడు. ఎక్కువగా శబ్దం చేసే మనిషి కాడు! ప్రాతినిధ్యానికి ఏస్థానిక సంస్థకూ నిలవ లేదు! తుదకు సహకారోద్యమములో కూడా పాల్గొనలేదు. స్థానిక కాంగ్రెసులలోకూడా అధికారము లేదు. ఇక ఎవ్వరుచూస్తారీయన్ని? కాని యివ్వేవీ లక్ష్యము చెయ్యకుండా, మాబోటివాళ్ళనలె మెత్తబడి వెనక్కు వెళ్ళకుండా, ఇప్పటికీ యధాశక్తిగా దేశసేవ చేస్తూనేఉన్న దేశభక్తాగ్రేసరుడు! అర్ధాన్నం తింటూ దేశసేవ చేస్తున్న వాళ్ళు నిజమైన దేశభక్తాగ్రేసరులు! పైనున్న వాళ్ళకు సమయము వచ్చినప్పు డేదో అవకాశం లభిస్తుంది! అటువంటి స్వార్ధనిరహితుడు సత్యనారాయణగారు. ధన్యజీవి! సనుస్తాంధ్రుల జిహ్వాగ్రాలలో ఉన్న గీతానికి నిర్మాత! భావిఆంధ్రులు గీతగోవింద కర్తనువలె నిరంతరగానం చేస్తూ ఉంటారు. రఃమధ్య హిందూపుర ఆజాద్ పఠనమందిరము వారన్న మాటలు పరికించండి :

"సుప్రసిద్ధ జాతీయ గీతరచయిత శ్రీగరిమెళ్ళ సత్యనారాయణగారి పేరు నెరుగనివారాంధ్రదేశమున లేరు - వారు రచించిన "మాకొద్దీ తెల్లదొరతనము" మొదలగు పాటలవలన వారు దీర్ఘ కారాగారవాసశిక్ష ననుభవించుటయేగాక, వేలకొలది ఆంధ్రులు ప్రతిజాతీయోద్యమమునందును వారి పాటలను పాడి సంవత్సరమునకు తక్కువకాని కఠినశిక్షల ననుభవించినారు. ఆంధ్రదేశములో గత మూడు దశాబ్దములాయన ప్రజాసామాన్యముతో జరుగుచున్న రాజకీయ ప్రబోధమునకు వేలకొలది నాయకులిచ్చిన ఉపన్యాసములకంటె వారిపాటలే ఎక్కువ కారణములనుట నిర్వివాదమైన అంశము."

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారుకూడా ఆ దినాలలో గొప్ప పాటలు వ్రాసి దేశాభిమానము కలుగజేసినవారిలో ఒకడు. ఈయన చూడటానికి ఆహ్లాదకరుడుగా కనబడడు గాని నోరువిప్పేటప్పటికి సమక్షాన్ని వదలలేరు ఎదుటున్నవాళ్ళు. పద్యపఠనములో ఈయనతో సమాను లిప్పుడున్నవాళ్ళలో ఎక్కువగా లేరు. ఈయన వ్రాసిన దేశీయ గీతాలకు ఈయన "సమ్మానం" కూడా

పొందినాడు. ఈయన పాటలు అతి మనోహరముగా రచించి స్వయముగా పాడే వాడు. ఒక్కపాద మనువదిస్తాను:

"అంటరానివా రెనరో కారు మా
వెంటరానివారె."

ఈయనను గూర్చి మళ్ళీ తర్వాత చెప్పుకునే అవకాశము వస్తుంది. ఇట్లాగే యీ కాలములో అనేక గేయాలు రచింపబడ్డని. అప్పటి పరిస్థితులు వీనిలో ప్రతిబింబిస్తవి! భారతదేశాని కెప్పుడైతే కోపమువచ్చినట్లు ఆంగ్లేయు లనుకున్నారో, భారత ప్రజలకు "నావిష్ణుః పృధివీపతిః" అనే నమ్మక మున్నది కాబట్టి యువరాజును పంపితే దేశమంతా రాజభక్తి పూరితమైపోతుందని, యిప్పుడు రాజ్య త్యాగము చేసిన విండ్సరు ప్రభువుగారిని (అప్పుడు యువరాజుగారు) యిక్కడికి పంపినారు. కాని భారతీయులు ఈ సంచారాన్ని ఉదాసీనముగా చూచినారు. ఈ క్రిందిగేయ మందుకు తార్కాణము

"ఏమయ్యో! యువరాజ!
ఎందుకొచ్చావయ్యా! ఏమయ్యో!

ఆకాలములో విఠల్‌భాయి పటేలుగారు ఎసెంబ్లీ ప్రెసిడెంటుగా ఉండేవాడు. ఆయన ఏవిధముగానైనా యీ భారత సమస్యను ఉభయపక్షాల ఆనుకూల్యముతో పరిష్కరింప జేదామని రీడింగు ప్రభువును, గాంధీగారితో మాట్లాడటానికి సమ్మతింప జేసి ఒక సంభాషణ ఏర్పాటు చేసినాడు. అప్పుడీ సమస్య అంతా యిద్దరూ చర్చించినారు! తర్వాత నే | ప్రయోజనమేమీలేక సహాయనిరాకరణము ప్రారంభించినాడు గాంధీగారు.

"రీడింగు గాంధీప్రభువు
మేడ మీద కూరుచుండి
ఆడినట్టి మాటలకు,
అర్ధమేమి తెలుపగోరన్నా ! చిన్నన్న !

ఇది ఒక సంభాషణరూపముగా ఉన్నది. గాంధీగారిమీద దేశ ప్రజలకు నమ్మకము కలగజెయ్యవలె! ఎట్లా కలుగుతుంది ఆనమ్మకము? ఆయన్ను ఆంధ్రదేశ మెరగదు! ఆయన సేవ నుగ్గడించవలె!

"మమ్ముబ్రోవ, మహిని వెలసితివీ
మహాత్మగాంధీ"
క్రూరులైన బోయరుల
ఘోర కష్టముల బడిన
భారతీయుల బాము లుడిపితివీ
వారంచర మొరవిని
భారతీయుల బాము లుడిపితివీ
ఇది దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమోదంతము,
పంటలన్నీ మంటగలియగ,
పన్నులియ్యగ లేని రైతుల,
విన్నపమాలించి బ్రోచితివీ
ఆకైరా ప్రజల
విన్నపమాలించి బ్రోచితివీ!

ఇది కై రా రైతు సత్యాగ్రహోదంతము.

సహాయ నిరాకరణ దీక్ష
సాధనమూనూని నీవు
బానిసత్వము బాప నెంచితివీ
మా భారతీయుల
బానిసత్వము బాప నెంచితివీ!

ఇది తత్కాలములో జరుగుతున్నపవి. చూచినారా మూడు చరణాలలో గాంధీగారు చేసిన ముఖ్యసేవ నుగ్గడించి, రెంటిలోనూఆయన జయము పొందినాడనీ, కాబట్టి తప్పక జయము పొందుతాడనీ, ఉద్యమములో పాల్గొనటానికి సంకోచించవలదనీ ఉద్బోధము!

మరిఒక కవికుమారుడు భారతీయులకు బ్రిటిషు సామ్రాజ్యములోనే గౌరవము తక్కువనీ, కాబట్టి యీఉద్యమములో చేరి త్యాగము చేసి పోయిన కీర్తిని నిలవబెట్టుకోమనీ, తప్పక అప్పట్లో ఉద్యమములో ముఖ్యాంశమైన నిర్మాణ కార్యక్రమములో పాల్గొనమనీ ఉద్బోధము చేసినాడు, చూడండి -

"దేశమాత సేవ చేయండీ
జనులార మీరలు
దేశదాస్యము తొలగ ద్రోయండీ"
దేశవస్త్రంబులనె దాల్చండీ
జనులార మీరు వి
దేశవస్త్రము లంటబోకండీ,
దేశనాశనకరములగు నీ
వేషభాషల రోసి మోహా
వేశమును బరిమార్చి గాంధ్యుప
దేశమును మీ మది దలంచుచు॥

ఇందులో స్వదేశవస్త్రాలనే వాడమనీ, విదేశవస్త్రాలను బహిష్కరించమనీ, నిరాడంబరజీవనము చేయమనీ ఉద్బోధమున్నది. ఇది ఖద్దరుద్యమము.

మనకు గౌరత లేనెలేదండీ
పాశ్చాత్య మోహ
మ్మునను మునిగియు తెలియరేమండీ॥
కానడా మరి ఆఫ్రికాది
ఖండములలో నుండు వారలు
మనల బానిసలని దలంచుచు
మదిని చాలగ నేవగింతురు॥

బ్రిటిషు సామ్రాజ్యములో మనకు గౌరవము తక్కువనీ దానిని మనము గుర్తించడము లేదనీ దీని భావము.

అంటరాని తనమె లేదండీ
మన దేశవాసుల
నందరిని నొక రీతి చూడండీ
కంటి కగపడు నిమ్నజాతుల
నంటుకున్నను దోష మనుచును
కంటగింపక వారి మీ
వంటివారలవలె దలంచుచు॥

ఇది అస్పృశ్యతా నిరసనము; హరిజనసమస్య దీనిలో ఉద్బోధింపబడినది. ఈ విధముగా ఉద్యమాన్ని ప్రచారము చేసినాడీ కవి కుమారుడు.

ఒక కవికుమారుడు భరతపుత్రుని మేలుకోమని యీవిధముగా ప్రబోధించినాడు:

'మేలుకొనుమీ! భరతపుత్రుడ!
మేలుకొనుమీ! సుజనమిత్రుడ!
**మేలుకొనుమీ!** సచ్చరిత్రుడ!
మేలుకొనవయ్యా! వత్సా! మేలుకో!

ఇటువంటి పాటలతో తెల్లవారుజామున స్వచ్ఛంద సేవకులు వీధులలో తిరిగి నిద్రమేల్కొలిపేవారు. వీనినే "ప్రభాతభేరీ" లనే వారు. భూపాళరాగములో పాడుతూఉంటే చాలాఉత్సాహము కల్పించేవి ఈ పాటలు. ఆ సంవత్సరాలలో కాంగ్రెసు సమావేశాలకు వెళ్ళడ మొకయాత్ర.

ఈ కాలములో కొన్ని పదాలుకూడా పుట్టినవి. ఒక దానిలో పుట్టు పూర్వోత్తరాల దగ్గరనుంచి చరిత్రవిషయాలన్నీ చాలామట్టుకు మంచి చమత్కారముగా రసవంతముగా చెప్పినాడు. భరతమాతకు నమస్కరించి తమ గొడవ చెప్పుకుంటున్నాడు భారతీయ కుమారుడు.

"దండాలు దండాలు భరతమాతా
అవి,
అందుకొని దీవించు ,,
రెండు వంద లేండ్ల కింద ,,
అల్ల,
కుంపినోడు దిగినాడె ,,
దిగి యూరకున్నాడ ,,
మాకు,
చిప్ప చేతికిచ్చాడె ,,

కట్టెలైన కొట్టకుండ ,,
చిన్న,
కత్తి కూడ లాగినాడె ,,

* * * *

తాటిచెట్లు వాడివంట భరతమాతా
వాడి
తాతవచ్చి పాతినాడో ,,

ఈవిధముగా తెనుగు నుడికారాలుగల చక్కని రసవచ్ఛైలిలో వ్రాసినాడీ కవికుమారుడు. ఇందులో ఆయుధశాసనం, మద్యపాన సమస్య, దేశాన్ని ఆర్థికముగా బలహీనము చెయ్యడము మొదలైన చారిత్రికార్థిక విషయాలు చక్కగా వర్ణింపబడ్డవి!

మరో కవికుమారుడు భారతమాత్ర సమాశ్వాసమని కొన్ని చక్కని గేయాలను రచించినాడు. ఈవిధముగా అనేకు లీ వీధిలో సాధన చేసినారు. ఒక సాధకు డిట్లా తల్లిని ఓదార్చినాడు:-

"భరతమాతరో బాయుము, నీ దుఃఖము,
కొరతేమీ, కొరతేమీ,
మనకింక గలుగు సౌఖ్యము"

కొన్నిటిలో నాయకు లొక్కొకరిని ఉల్లేఖించి వారుచేసిన సేవకూడా చెప్పినారు కొందరు. మరిఒక సాధకుడు భారతవర్షములో ఉన్న పన్నులు చమత్కారముగా పేర్కొన్నాడు చూడండి:-

"దండాలండోయ్, మే ముండలేమండోయ్ బాబు ॥దండా॥
ఉప్పుకును, పన్ను బాబు
పప్పుకును, పన్ను బాబు
కొప్పు కాస్త, దేవుడికి
వొప్పుకుంటె, పన్ను బాబు ॥దండా॥

ఈ గేయాలలో కొన్ని భాగాలు వెనకటి యిప్పటి పరిస్థితులలో ఉండే భేదాన్ని తెల్పుతవి! రాజకీయములలో చూస్తే ఒక కాలములో రాజద్రోహము మరొకతరములో కాదు. 1907 సంవత్సరములో స్వరాజ్య పదమంటే రాజద్రోహము!

తర్వాత అది పరిపాటి పదమై పోయినది. అట్లాగే ఉప్పు సంగతీని. గాంధీగారు ఉప్పు సత్యాగ్రహము చేసిన తర్వాత ఉప్పు పండే స్థలాలదగ్గర ఉన్న వారు ఉప్పును తమ స్వంత ఉపయోగానికీ, స్వయముగా నెత్తిమీద మోసుకొని పోయి వర్తకము చేసుకోటానికీ సర్కారువారు ఒప్పుకున్నారు

"పన్నెండు దేశాలు పండుతున్నాగాని
పట్టె దన్న మె లోపముండీ
ఉప్పు ముట్టుకుంటె దోష ముండీ"

మన భారతదేశములో 12 రాష్ట్రాలున్నవి! బాగా పండుతున్నవి. కాని కరువు పరిస్థితులే! ఉప్పు ముట్టుకోకూడదు! ఆ కాలములో ఉప్పుముట్టుకుంటే తప్పే! అందుచేతనే గాంధీగారు ఉప్పుమీద సత్యాగ్రహము చేసినాడు! మరొకటి, ఆరోజులలో గాంధిటోపి పెట్టుకోకూడదని ఒక కలెక్టరుగా రుత్తరువిచ్చినారు. ఈ సంగతి పార్లమెంటు దాకా పోయినది! యెవరైనా రాట్నం పరిశ్రమ * బళ్ళో పెడితే అది తప్పు!

"గాంధిటోపీ పెట్టి, పాఠశాలల్లోకి
రావద్దు రావద్దంటాడు,
రాట్నం బళ్ళో పెట్టవద్దంటాడు,
రాజద్రోహమంతా, రాట్నములో వున్నదట"

ఇది చరిత్ర విషయమైపోయినది. తుదకా కాలములో గాంధినొక దేవుడిగా భావించి ఆయనకు దేవుడికి పాడినట్టు హారతులు కూడా పాడేనారు.

"జయ గాంధిదేవా మంగళం
జయ మంగళంబు నీకు
సత్యాగ్రహాశ్రమతాపసా
అరవిందసంస్తుతిపాత్రమా
నర శోకతాలిమిత్రమా
పాంచాలపరిభవఖేదనా
నవ్యభారతీయపాలనా
కస్తూరిసాధ్వీవల్లభా"

ఇందులోకూడా అప్పట్లో ఉండి యిప్పుడు అంతరించిన సత్యాగ్రహాశ్రమము

---

* ఇప్పుడు గృహపరిశ్రమ క్రింద సర్కారువారే దాన్ని ఒప్పుకున్నారు! ఈవిధముగా మారెనై పరిస్థితులు.

సంగతి, అప్పుడు గాంధీగారికీ షౌకతాలీగారికీ మిక్కిలి స్నేహ ముండేదని ద్యోతకమవుతున్నది.◆ మరిన్నీ అరవిందఘోషుగారుకూడా గాంధీగారిని వారొనర్చే సేవకై కొనియాడినట్టుకూడా తెలుస్తున్నది. ఈవిధముగా ఆ కాలములో తాత్కాలిక పరిస్థితులను గూర్చీ, చారిత్రక రాజకీయార్థిక విషయాలనుగూర్చీ, కాలోచితముగానూ, ఉత్సాహజనకముగానూ, రసవంతముగానూ పాడి యితరులచేత పాడించినారు కొందరు కవులు. నాయకులు చెప్పే ఉపన్యాసాల కంటె యీ పాటలూ పద్యాలూ చాలా ప్రచారము చేసినవి. బసవరాజు అప్పారావుకూడా ఆకాలములో యీ ఉద్యమ ప్రచారము చేసిన మనిషి.

"కొల్లాయి గట్టితే నేమి
మాగాంధి
కోమటై పుట్టితే నేమి?"

మొదలైన గేయా లప్పటివే! అత డీఉద్యమములో మునిగిపోయి వృత్తినికూడా వదిలివేసి తిరిగినాడు! భావోన్మాది కాబట్టి యీ ఉద్యమ మాతనిని ఆకర్షించినది! ఈవిధముగానే కొందరు మద్యపాన నిషేధాన్ని గూర్చి గేయాలనే రచించినారు. మరికొందరు పారశాలాబహిష్కారాన్ని గూర్చిన్నీ యింకా కొందరు ఇతర విషయాలనుగూర్చి చాలా హృదయంగమముగా పాడినారు. వీరీ పాటలను పాడుతూ ఒక ఊరునించీ మరిఒక ఊరికి పోతూఉండేవారు. ఎక్కడనైనా పెద్ద సభ జరిగేటప్పు డీ పాటలను పాడుతూ ద్వారముదగ్గర కొందరు త్యాగజీవులు వాలంటీర్లు నిల్చునిఉంటే ఉపన్యాస వేదికదగ్గరకంటె యీ గేయాలను వింటూ అధికసంఖ్యాకు లుండేవారు అట్లా ఆకర్షించిన వీ గేయాలు!

## కొందరు త్యాగజీవులు

జాతీయోద్యమములో ఎన్నదగిన కృషీ, త్యాగము, ప్రబోధము కల్గించిన వారిలో దామరాజు పుండరీకాక్షుడు గారు ఒకరు. (జననము 6-7-1898). ఈయనది గుంటూరు శ్రీ గురులింగలీల మొదలైన కథల వ్రాసి పేరుగన్న

◆ "మహాత్మాగాంధికిని, మౌలానా షౌకతల్లి మహమ్మదాలికి జైజైజై!"

కీ. శే. పాటిబండ్ల వెంకటప్పయ్యగారు వీరి మాతామహులు. చెన్న పట్టణములో బి.ఏ. చదువుతూ లోకమాన్యుని నిర్యాణానంతరము గాంధీపిలుపు విని జాతీయోద్యమములోకి ఉరికిన దేశభక్తుడు పుండరీకాక్షుడుగారు. 1920-24లలో అనేకములైన జాతీయ రచనల సలిపి దేశీయులలో దేశభక్తినీ, త్యాగగరిమనూ, పురికొల్పినాడు. అసహాయోద్యమములో పాల్గొని కృషి చేసినాడు; 1925లో న్యాయవాద వృత్తిని స్వీకరించినా లోపలఉన్న కాంక్ష కొద్దీ జాతీయ ప్రబోధకాలైన నాటకాలను రచించి, నటసమాజాలచేత వాటిని ఆడించి, దేశాన్ని ఉఱ్ఱూతలూగించిన వ్యక్తి. స్వరాజ్యసోపాన నిలయమని పేరుపెట్టి దానితరపున ఆ నాటకాలను ప్రచురిస్తూ ప్రచారము గావించినాడు. అప్పుడు ప్రభుత్వము వీటిని ఆడరాదని ఆంక్షకూడ వేసినది. "స్వరాజ్యసోపానము" (1920), గాంధి మహోదయము' "గాంధివిజయము" (ఇది అసహాయోద్యమము, కలకత్తా కాంగ్రెస్‌కు సంబంధించినది), 'పాంచాల పరాభవము' (1921) లేక పంజాబు దురంతములు అనే నాటకములు 'కలియుగ ప్రహ్లాద' అనే హరికథ, "స్వరాజ్య మహాసభ", 'గుంటూరిగొప్ప', (పన్నుల నిరాకరణము', "కెమాల్ పాషాచరిత్ర", "సంస్కారిణి", 'కలియుగ భారతము', మొదలైన గ్రంథాలను రచించి ఎంతో ఉద్బోధము ప్రజలలో కల్పించినాడు. .ఈయన నాటకాలు నాటి రాజకీయ పరిస్థితులను ప్రతిబింబింప జేయడమేగాక, తీవ్రమైన ఉద్రేకమును కల్పించునవియై కవిగారి నిశితమైన రచనాపద్ధతినికూడ వెలిబుచ్చుతూ ఉన్నవంటె అతిశయోక్తికాదు. ఈయన వ్రాసిన నాటకాలలో నుంచి కొన్ని పద్యాలను అనువదిస్తాను :

కత్తులులేవు శూలమును గాండివమున్ మొదలే హుళక్కి, నో
రెత్తి ప్రచండ వాక్పటిమనేనియుఁజాటడు, వైరిమీద దం
డెత్తగ సేనలేదు, బలహీనము కాయము, కోపతాపముల్
బొత్తుగ సున్న, అట్టి వరమూర్తి మనోబలశాలి గాంధిఁ జే
యెత్తి నమస్కరించి స్మరించెదమెప్డు స్వరాజ్యసిద్ధికిన్

మీ తాత ముత్తాతలౌ తాతలకుగూడ నాగరికత నేర్పినాము మేము
...... దేహీయటంచు మా దేశంబు జేర రానిచ్చి వర్తకహక్కు లిచ్చినాము,
బలపరాక్రమ పౌరుషంబులను మీకు దీసిపోలే ది కెన్నడు తీసిపోము.

శ్రీ గాంధీనామం మరువాం మరువాం
సిద్ధము జైలుకి వెరువాం వెరువాం
కూడి భరతమాత గొలుతాం గొలుతాం
భూదేవి గుణముల దలతాం దలతాం
దేశచరిత చెవుల విందాం విందాం
వేరే కథలు చెవుల మందాం మందాం
దేశభక్తులు మాకు సారాం సారాం
దేశద్రోహులు మాకు దూరాం దూరాం
మాగాంధినే మేము నమ్మేం నమ్మేం
మరి యితరులను మేము నమ్మాం నమ్మాం।
భరతమాతనెపుడు మరువాం మరువాం
ప్రభువుల శిక్షకు వెరువాం వెరువాం
అవనీ జనని సేవను మానాం మానాం
మరియొక జోలంటే మౌనాం మౌనాం।
స్వరాజ్య ప్రాప్తిని కందాం కందాం
స్వాతంత్ర్యమున మన ముందా ముందాం॥

ఈ కీర్తనను పాడని ఆంధ్రుడాకాలంలో లేడంటే ఇది ఎంతగా ప్రాచుర్యము పొందినదో గ్రహింపవచ్చు.

ప్రజలలో జాతీయ భావమును పురికొల్పినకవులు ఇంకా లేకపోలేదు. వారిలో సోమరాజు రామానుజరావు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, మారేపల్లి రామచంద్ర శాస్త్రి, మాగంటి అన్నపూర్ణ, అడవి బాపిరాజు, శివశంకరశాస్త్రి, అబ్బూరి రామకృష్ణ రావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, మొదలైనవారున్నారు.

కేవలము రచనవలననేకాక ఉపన్యాసముద్వారా, ఉద్యమకర్తలుగా ప్రఖ్యాతి వడసిన మహానుభావు లనేకులున్నారు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, పట్టాభి సీతారామయ్య, కొండ వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశం, బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మీనారాయణ, బులుసు సాంబమూర్తి, వేదాంతం లక్ష్మీ కాంతం, చెరుకువాడ వెంకటనరసింహం, గొల్లపూడి సీతారామశాస్త్రి, దువ్వూరి సుబ్బమ్మ, వేదాంతం కమలమ్మ, నడింపల్లి నరసింహారావుగారలూ ఇంకా పలువురు

త్యాగమూర్తులు జాతీయోద్యమమును బహుముఖములుగా వ్యాప్తి నొందించిన మహామహులు. వీరి వక్తృత్వ మసాధారణమైనది. ఒక విధముగా ఆంధ్రులలో మహావక్తలున్నారనీ, ఆంధ్రభాష వక్తృత్వానికి చాలా ఉపకరిస్తుందని చాటిన వారైనారు వీరంతా. వీరిలో కొందరినిగూర్చి పూర్వమే ఉల్లేఖించినాను.

## ఆంధ్రరత్నం :

ఇక్కడ ఆంధ్రరత్నాన్నిగూర్చి ముచ్చటించుకొని తీరవలె. ఆంధ్రులలో ఈయన విశిష్టమైన వ్యక్తి; వక్తృత్వానికి పెట్టింది పేరు; ఈకాలములో వక్తృత్వమునకు వచ్చిన ప్రశస్తి ఇంతంత గాదని మరువరాదు.

వక్తృత్వవీధిమాత్ర మీ కాలాంతానికి మిక్కిలి ఉత్తేజకరముగా నుండి ఆకర్షిస్తున్నది. సాధకుల సంఖ్య హెచ్చై పోయినది. సంచరించే ప్రజాసంఖ్యకు మితి లేదు. సాధకులు వీరికి సంపూర్ణ సౌకర్యాలు చెయ్యటానికి చాలా శ్రమ పడుతున్నారు. వెనుకటి 1907-8 నాటికంటె సాధకుల సంఖ్య 3,4 రెట్లై పోయినది. 1920 సంవత్సరములో రాజకీయ ప్రచారము ప్రాముఖ్యానికి వచ్చినది. ఈ ప్రచారానికి యువజనమంతా నడుములు బిగించి బైటికి వచ్చినారు. పెద్దవారంతా వీరికి కావలసిన విజ్ఞానసామగ్రి సేకరించి పెట్టి ధైర్యాన్నిచ్చి పంపినారు. ఈ సాధకులలో కొందరెన్నటికి మరవడానికి వీలులేని వారున్నారు. ముఖ్యుడు ఆంధ్రరత్నము. ఈయన ప్రజలలో "వజ్రం"; "మణి" వంటివాడు. నాయకులంతా యీయనను చూస్తే వణికేవారు. ఈయనతో సమానమైనవాడు భారతదేశములో లేడు. ఇతనిని ఆంధ్రరత్న మనటంకంటె "భారతరత్న" మనవలె.

ఇతను ఇంగ్లాండుపోయి విద్య నభ్యసించినాడు. ఎందరు అభ్యసించలేదు? వారి పేర్లన్నీ మనకు జ్ఞాపకమున్నాయా? పోయివచ్చి గొప్ప ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళ పేర్లే యెన్నో మన మెరగము! కాని వాళ్ళవలె ఉద్యోగమూ, ద్రవ్యార్జనమూ పరమావధిగా కలిగి, "బ్రతికాడు, చచ్చాడు" అనిపించుకోకుండా, తన పేరు శాశ్వతముగా చేసుకున్నాడు. ఇంగ్లాండు పోయివచ్చిన మనవారిలో ప్రతీవాణ్ణీ పరీక్షిస్తే వీరిలో దేశాభిమానాలు మృగ్యాలుగా ఉన్నవి! ఎక్కడో సి.ఆర్. రెడ్డిగారి

వంటివారు నూరు కాకులలో ఒక్క కోయిలలాగ కనపడతారు. ఈ విషయాన్ని గూర్చి వెనక కొంచెము మనవి చేసినాను. ఇప్పుడు విపులము చెయ్యనక్కర లేదు. ఈయన పేదవాడు. అయినా నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు మొదలైన స్నేహితుల సహవాసంతోనూ, సహాయంతోనూ అక్కడ విద్యార్జనకై కాలం గడిపినాడు. ఈయన కళోపాసకుడు. స్వత: నాట్య సంగీతశాస్త్రజ్ఞానము కలవాడు. ఈ కళోపాసకత్వ మీయన జీవితములో ప్రతికార్యములోనూ వ్యక్తమౌతూ ఉండేది. ఇంగ్లాండులో విద్యార్థి దశలోనే అక్కడి లలిత కళాభిజ్ఞులతో ఈయనకు స్నేహ ముండేది ఈయన అష్టపదులు పాడుతూ ఉంటే నిద్రాహారాలక్కరలేదు.

ఇంగ్లాండులో డాక్టరు ఆనంద కుమారస్వామిగారనే గొప్ప దేశభక్తు డుండేవాడు. ఆయన గొప్ప లలితకళావిమర్శకుడు. ఆంధ్రరత్నం కళోపాసన ఆయన్నాకర్షించింది. ఆయన గీతగోవింద గానము విని ముగ్ధుడైపోయినాడు. వీరిద్దరికీ మంచి సఖ్యము కలిగినది. ఇద్దరూ కలిసి అభినయ శాస్త్రము పరిష్కరించి అచ్చు వేయించినారు. మంచి చిత్రాలతోకూడా నిండి ఉన్నది. చాలా ముఖ్యమైన గ్రంధమది. ఈ ప్రకారముగా విద్యార్థి దశలోనే తన ప్రతిభ చూపినవ్యక్తి. ఈయన ఎడింబరో విశ్వవిద్యాలయములో ఎం.ఏ. ప్యాసై రాగానే సర్కారు వారీయనను విద్యాశాఖలో గజెటెడు ఉద్యోగానికి నియమించినారు. ఈయన యిమిడి ఒకరికింద ఉందగల వ్యక్తి కాడు. అక్కడ చోటు ఆయనకు వేడైనది. అక్కడ రాజీనామా యిచ్చి వచ్చినాడు. విద్యాశాఖ కైన నష్టము దేశానికి లాభకరమైనది. సహాయ నిరాకరణోద్యమములో అమాంతము దూకినాడు. విద్యాలయ బహిష్కార కార్య మాంధ్రదేశములో ఈయనపైన బడ్డది. అప్పుడీయన చూపిన వక్తృత్వ సామర్థ్యము చెప్పటానికి వీలులేనిది. ఈయన గొప్ప ప్రతిభాశాలియేగాక సమస్త పురాణేతిహాసవేత్త. అఖండరామ భక్తుడు. ఒక్కొక్కప్పుడు సమాదిలోనికి వెళ్ళి రాముడితో సంభాషించి వచ్చేవాడు. ఈయన "రామదండు" అనే పేరుతో ఒక వాలంటీరుదళాన్ని ఏర్పాటు చేసినాడు. రామదండంటే దేశములో మ్రోగిపోయినది. దానికి కావలసిన ప్రణాళికలంతా

అట్లా రాత్రులు వినే అదృష్టం అనేకమార్లు నాకు కలిగింది, కు.సీ.

యేర్పాటు చేసినాడు. ఇంగ్లీషులోనూ తెనుగులోనూ యీయన మాట్లాడుతూ ఉంటే, వెనక గోపాలకృష్ణమురళికి గోవులూ, గోవత్సాలూ, చేతనాచేతన ప్రపంచమంతా యెట్లా ముగ్ధమై పొయ్యేది వేలకు వేలకు శ్రోతృజనము. అది ఉపన్యాసము కాదు! హరికథ కాదు! ఏదో ఒక విధమైన దేవగానము! అది ఒక్కమారు వింటే గోపాలకృష్ణగీతలు "గంగాజల లవణికల"వలె పావనాలూ, తాపశాంతికరాలూ, తుదకు ముక్తిమార్గదర్శకాలూను! ఆధోరణి అనిర్వాచ్యము. ఆంధ్రదేశములో ఇట్టి వ్యక్తి నభూతో నభవిష్యతి! యువకజనానికి నాయకత్వము వహించి పారశాలా బహిష్కారకార్యము సంపూర్తిగా నిర్వర్తించినాడు. ఈయన యెంత గొప్పవక్తో అంత గొప్పకవి. జైలు నించి బయటకు వచ్చినప్పుడు శ్రీరంగంలో రంగనాధుడు మీద చెప్పిన శ్లోకాలు చిరస్థాయిగా ఉండవలసినవి! ఇతని తెనుగు పద్యరచన హాస్యరసపూరితముగా ఉండేది! మనిషిలో చాలావంతు హాస్యరస మని చెప్పవలె! అంతమాత్రము చేత కార్యదీక్ష లేదని చెప్పటానికి వీలులేదు. చీరాల పేరాల మ్యునిసిపాలిటీ సత్యాగ్రహ సందర్భములో ఈయన పేరు భారతదేశమంతా మ్రోగిపోయినది. ఇంగ్లీషులో ఒక పుస్తకముకూడా వెలువడ్డది. మ్యునిసిపాలిటీ వదిలి

---

ఈయన వ్రాసిన గ్రంధాలన్నీ బెజవాడలో గుమ్మడిదల వెంకటసుబ్బారావుగా రచ్చువేసినారు ఈయన గోపాలకృష్ణయ్య భక్తుడు. దేశసేవ జీవితపరమావధిగా పెట్టుకున్నవాడు చాలా ప్రజ్ఞగలవాడు. 'గోష్ఠి' అనే పత్రిక పెట్టి గోపాలకృష్ణమతం ప్రచారం చేస్తున్నాడు. చాలా కొనియాడదగిన పని చేస్తున్నాడు.

చూ : 'మా గోపాలకృష్ణుడు'

"కాల చక్రము గతిగడచి తెనుంగు
భావి భాగ్యమ్మెల్ల పండినవెనుక
ఆనాటికెవరైన నడుగకపోరు
గోపాలకృష్ణుడే గోష్ఠివాడంచు"
భాగ్యవశమ్మున భావికాలాన
అమృతతుల్యమ్ములు నతిభావభరిత
ములునైన నా గీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్ప దీపించు.
బసవరాజు అప్పారావు [భారతి]

ఆంధ్రరత్న -

గొంతూకెత్తి పాడేగీతం
గోపాలకృష్ణయ్యా మధురం
మధురాలన్నీ మాయంచేసే
మాయదారీ బ్రతుకూరక్కసీ
గంగాధారే కంఠశ్రుతులూ
నింగీనేలా కురిసే అమృతం
నీవిచ్చిన మాచైతన్యానికి
నీకేహంగూ మాకే పొంగూ!
అడవి బాపిరాజు [ఆంధ్ర రిపబ్లిక్]

పట్టణ ప్రజ నందరిని పాకలలో ఉండేటట్టు చేసిన స్థలములో రామనగర మనేపేర పట్టణము నిర్మించి, అక్కడ రామాలయము కట్టి పుణ్యక్షేత్రాన్ని చెయ్యవలెనని సంకల్పించి కొంత నిర్మాణము చేసినాడు. అక్కడ తుదిస్థావర మేర్పరుచుకొని, తాను స్థావరము స్థిర పరచుకున్న చోటే భౌతిక దేహము వదిలినాడు.

ఆంధ్రరత్న చాటుధారలు మిక్కిలి హృదయంగమాలు! ఈయన ఆంధ్రదేశములో నాయకులనే వారిని గూర్చి వ్రాసిన చాటుధారలు అన్నీ అన్నీ వాక్చిత్రాలు! సారస్వత ప్రియులకు జిహ్వాగ్రాలమీద ఉంటవి. ఈయన గొప్ప రాజకీయవేత్తకూడాను. ఈయన యిచ్చిన స్వరాజ్య నిర్వచన మెవ్వరూ యియ్యలేదు. దాన్ని అనువదిస్తాను :-

"Swaraj therefore means the preservation of Hindu Dharma, Muslim Dharma, Christian Dharma, Parsi Dharma, Sikh Dharma, in short the Swadharma of all, a Co-ordinated federation of all, which are now threatened with distruction, by godless philosophy, industrial anarchy, and spiritual famine that beset the world at the present moment."

ఇతడు గౌడరుద్రాక్షలు వేసుకొని పెద్ద అర్ధణా అంత కుంకుమ బొట్టుపెట్టి, బ్రహ్మ వర్చస్సు తాండవమాడుతూ ఉండగా సుందరాకాండం పారాయణచేస్తూ ఉంటే, మహర్షివలె తేజోరాశిగా కనపడేవాడు. బయట యే వేషంవేస్తే దానికి అచ్చు గుద్దినట్టుండేది ఠీవి. ఒకనాడు అకాలీ సిక్కువలె నేపథ్యము ధరించేటప్పటికి నేను కనుక్కోలేక పోయినాను. ఇతని "బ్రాహ్మణోద్యమం" వ్యాపించినట్లైతే హరిజనసమస్య ఉండేది కాదు ! ఒక్కమారు కాంగ్రెసు కార్యదర్శి అయినాడు. అదే అర్ధశతాబ్దానికిగాను కాంగ్రెసు ఆంధ్రుల చేతులలోకి వచ్చిన అదను! నాయకమ్మన్యులు అంతశ్శైత్యాలతో, గోపాలకృష్ణయ్య అవుతాడేమో అని కడుపుబ్బరముతో, దాన్ని కాస్తా పోగొట్టుకొన్నారు. కాకినాడ కాంగ్రెసు మన ఆంధ్రదేశములో జరిగిన తుదికాంగ్రెసు. ఇప్పుడాంధ్రులంటె కాంగ్రెసులో న్యూనత! ఆంధ్రరత్నం కాలంలో పోగొట్టుకొన్న అవకాశము యిప్పటికి 23 యేండ్లైనది., కాంగ్రెసు దృష్టిలో దక్షిణభారత దేశము లేనేలేదు. 1921 సంవత్సరములో ఆంధ్రరత్నం ఆధిపత్యము క్రింద బెజవాడలో ఏనాడు అఖిలభారత

కాంగ్రెసు సంఘ సభ జరిగినదో! మరిచిగూడా పోయినారు! వల్లభాయి పటేలుగారు ఆంధ్రులను చేసిన హేళనము ఆంధ్రుల చరిత్రనిలోకెక్కినది! ఆంధ్రరాష్ట్రమంటే పటేలుగారు చేసిన హేళనను చూస్తే కాంగ్రెసంటే ఆంధ్రులు వైముఖ్యము చూపవలసినది! కాని వీరంత సంకుచిత దృష్టి కలవాళ్ళు కారుకాబట్టి యింకా పెనుగులాడుతున్నారు! మన వాళ్ళ ఉదంతమిది. అటువంటి ఆంధ్రరత్నమంటే కర్మదీక్ష లేదనీ, అంతా నవ్వులాటేననీ, ఆఖరుకు పిచ్చివాడనీ, మన ప్రముఖుల అభిప్రాయము! ఆయనకున్న ప్రతిభలో వీళ్లకొక్కరికికూడా - యెవరో ఒక రిద్దరుతప్ప, శతాంశము లేదు! ఆయనతో అంతస్సంబంధము కలవారికాయన హృదయమార్దవము, మానవత్వము, ఉదాత్తతా తెలుస్తుంది! కాంగ్రెసు ద్రవ్యము లెక్కచెప్పలేదనే ఒక అపోహ ఆయనమీద ఉన్నది!* "తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు." అటువంటి "రత్నాన్ని" కోల్పోయిన ఆంధ్రదేశానికి యిప్పట్లో ముక్తిఉండదని నమ్మకమే!

అక్కడక్కడా కొందరు త్యాగజీవులు శనివారపు సుబ్బారావు, ముదిగంటి జగ్గన్న శాస్త్రిగారివంటివాళ్ళు దేశభక్తిని పురికొల్పే గ్రంథాలను ప్రచురించడానికి పూనినారు. వీరిలో శనివారపు సుబ్బారావుగారు వయోజనవిద్యను తరిచి దాన్ని ప్రచారములోనికి తెచ్చినాడు. దేశానికి సంబంధించిన అనేక ఆర్థికవిద్యావిషయక లెక్కలను యెత్తి చూపినాడు. చాలా ఉత్సాహమూ పట్టుదలా కల మనిషి. జీవించి ఉంటే యెంతో దేశసేవ చేసిఉండేవాడు.

జగ్గన్నశాస్త్రిగారు తణుకులో పల్లెటూరు గ్రంథమాల స్థాపించినాడు. కాని ఆదరణ తక్కువైపోయినది. "192ప లగాయతు 1931 వరకు పల్లెటూరు గ్రంథమండలి

---

* ఆయన సేవచేసినాడు. జీవితకాలంలో ఆయనను గౌరవించలేని ఆంధ్ర దేశము శిలావిగ్రహము స్థాపించిగౌరవించినది. కోడితాడిపర్రు గ్రామము ధన్యము. ఆ ప్రతిష్ఠ ఆయన ప్రియమిత్రుడు నడింపల్లి చేతులమీదుగా జరగడము గొప్పవిషయమే. "ఏకో నివాపసలిలం పిబసీత్యయుక్తం" అనే భవభూతివాక్యాలు తలుపునకు వస్తున్నవి.

ఈయనకు తుదిదినాలలో సేవచేసిన లక్ష్మీనరసింహారావుగారూ, డాక్టరు చలపతి రావుగారూ ధన్యులు.

పేరిట సుమారు 15 పుస్తకములను వ్రాసి ఆంధ్రభాషామతల్లిని సేవించితిని." వేలూరి శివరామశాస్త్రి గారు విశ్వమాత ప్రేరణవల్ల గాంధీగారి "ఆత్మకథ"ను భాషాంతరీకరించినాడు. జగన్నశాస్త్రిగారు స్వయముగానే జవహర్లాలు నెహ్రూగారి "ఆత్మకథ" ను అనువదించినాడు. ఇది మొదటిదానికంటే సాఫీగా ఉంది, ఈ రెండో గ్రంథము. శైలినిగూర్చి డాక్టరు పట్టాభి.గారిట్లాఅన్నారు. "ఆంగ్లగ్రంథములను తెనిగించునప్పుడు, తెనుగుతర్జుమావలెనుండకమూలమే తెనుగా అనిపించవలెను.' ' జగన్నశాస్త్రిగారు అనేకమార్లు శ్రీకృష్ణజన్మస్థానానికి పోయినవాడు!

ఈ విధముగా ఆంధ్రదేశములో అనేకులు జాతీయోద్యమాన్ని పురస్కరించుకొని వాఙ్మయాన్ని సృజించినారు. యోగ్యముచేసినారు. అందరిలోను ఆంధ్రరత్నము* అగ్రగణ్యుడైనాడు, ఆయన కనేకులు శిష్యులై గాంధీ స్వరాజ్యోద్యమాన్ని సాగించి ధన్యులైనారు. నవ్యాంధ్ర సాహిత్యములో రాజకీయ పరముగా వెలువడిన వాఙ్మయము ప్రత్యేకస్థానాన్ని పొందుతున్నదని గమనించినాము. దీనికి తోడ్పడిన త్యాగజీవులకూ కవులకూ దేశము ఎంతో ఋణపడి యున్నదనే చెప్పవలె!

---

* 'మన గోపాలకృష్ణుడు' అనే పేర వివిధాంధ్రకవులు ఆంధ్రరత్నాన్ని గూర్చి వ్రాసిన పద్యాలు ఒక గ్రంథముగా వచ్చినది 'గోపాలకృష్ణుని చాటువుల'ను శ్రీ వేపా సుబ్రహ్మణ్యముగారు భద్రపరచగా వాటిని ప్రచురించినారు.

'కోతిమేడ కపిగాళ్ళ గతు లయోమయముల్తై నన్ను వీధిని బెట్ట వెన్నుచుండె' 'శంకరుడై మహానందిని సుంకరకొండాయ యాయె జోద్యంబేలా' 'చామెర్లరాముణ్ణి సీమలో మెచ్చారు మెంకిపాటలు సింగికెక్కుచుండె' 'కొండెంకటప్పయ్య కొండంత కోపాన చిట్టి బుజ్జాడుచు ఒందుతోసి' 'వెంకిపిల్లనైచ్చి సంకకెక్కించావు' మొదలైన గాటు పద్య పదాలు మరువరానివే గదా!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# రెండు సంస్థలు

# 2

## ఆంధ్ర విశ్వ విద్యాలయము : స్థాపనము

ఈ కాలములో ఆంధ్రులకు చాలా ఉత్సాహజనకమైన అంశము జరిగినది. ఏనాడు ఆంధ్రమహాసభ స్థాపించి ఆంధ్ర విశ్వ విద్యాలయమూ ఆంధ్రరాష్ట్రమూ కోరామో, అప్పటినుంచీ చాలా దినాలు ఆందోళన చేసినాము. తుదకు 1921 సంవత్సర జాతీయోద్యమములో లీనమై పోయినదీ రాష్ట్రోద్యమము. ఈ కాలానికి దగ్గరగా "జస్టిసుపక్షం" ఎన్నికలలో గెలుపొంది శాసనసభలో అధికసంఖ్యాకమైనది. అప్పట్లో ఇంగ్లాండు ఇండియాకు ప్రసాదించిన రాజ్యాంగ సంస్కరణల ప్రకారము కొన్ని మంత్రిపదవులు లభించినవి. మొదట 1921 సంవత్సరములో శాసన సభలను బహిష్కరించిన కాంగ్రెసువారు తమ అభిప్రాయాన్ని మార్చుకుని స్వరాజ్యపక్షమనే పేరుతో ఎన్నికలలో నిలిచిమళ్ళీ శాసనసభలలో ప్రవేశించినారు. ప్రభుత్వానికి ఈ స్వరాజ్యపక్షము ప్రతికక్షిగా ఉండేది మద్రాసుశాసనభలో. అందులోనున్న వాళ్లలో ఒక నాయకుడుగా ఉండేవాడు రామలింగారెడ్డిగారు. 1925 ప్రాంతములో సర్.ఎ. పి. పాత్రోగారు విద్యాశాఖమంత్రిగా ఉండేవాడు. ఆయనకూ ఇంకా ప్రభుత్వ వర్గములో అందరికీకూడా రెడ్డిగారు పక్కలో బల్లెమైపోయినాడు. ఈయన చర్చలో చూపే కౌశలము, ప్రతికక్షులను వేసే ప్రశ్నలూ, వాళ్ళను చాలా కష్టపెడుతూ ఉండేవి. ఎట్లాకనిపెట్టారో కనిపెట్టినారు. ఈయన కుద్యోగ మొకటి ఇస్తే యీ శ్రమ తప్పించుకోవచ్చునని! ఇది కనిపెట్టడములో వాళ్ళ పరేంగిత జ్ఞానాన్ని మెచ్చుకోవచ్చు. ఆలోచించి "ఆంధ్రవిశ్వవిద్యాలయము" స్థాపించడానికి నిశ్చయించినారు. అప్పట్లో

---

28-4-26 నాటినుంచి విశ్వవిద్యాలయ కార్యక్రమము ప్రారంభమైనది.

పానుగల్లు రాజాగారు ముఖ్యమంత్రిగా ఉండటముచేత దృష్టి కొంచెము ఆంధ్రులమీదికి తిరిగినది. ఈ పానుగల్లు రాజాగారే తిరుపతి దేవస్థానాదాయము విద్యకు వినియోగించడానికి మొదట అంచనా వేసిన దూరదర్శి. ఆయన చనిపోకపోతే తిరుపతి దేవస్థానము ఆంధ్రదేశములో ఆంధ్రుల చేతిలో ఉండేది. సి. రాజగోపాలా చారిగారి హయాములో అక్కడ ప్రాచ్య విద్యాలయ నిర్మాణము జరిగినది. పరిశోధన చేయిస్తున్నారు. ప్రాచ్యవిద్యా పాఠశాల స్థాపించినారు. దానిలో తెనుగు విద్వాన్ పెట్టడానికి మనవారు ఆందోళనచేసి పెట్టించేటప్పటికి కృత్యాద్యవస్థ అయినది! ఇప్పుడు ఆంధ్రదేశములో కొంతభాగము ఇతరరాష్ట్రాలు కలుపుకోనీ, ఆంధ్రభాషకు విశ్వవిద్యాలయములో ప్రాముఖ్యమియ్యక పోనీ, తుదకు ఆంధ్రులకు గొప్పనష్టము రానీ, 'యావద్భారతోద్యమములోపడి వీటిని' లెక్కచేసేస్థితిలో లేము! ఈ విశ్వవిద్యాలయముకూడా మనవాళ్ళు కోరితే వచ్చినది కాదు. సర్కారువారు స్వయముగా ప్రసాదించినది. పానుగల్లు రాజాగారి దానము! కాని యిందుకు పురికొల్పినది, రెడ్డిగారి బారినించీ శాసనసభలో తప్పించుకోవలెననే ఉద్దేశము. అప్పట్లో మన మహానాయకులకు విశ్వవిద్యాలయముమీద దృష్టే లేదు. చిల్లరవారు పోట్లాడుకోవటము మొదలు పెట్టినారు. మా ఊరంటే మా ఊరని తగవులు ప్రారంభించినవి. గుంటూరువారూ బెజవాడవారూ ఒకటై బెజవాడకు ఓటిచ్చినారు. రాజమండ్రివారికి బెజవాడ ఎంతమాత్రము గిట్టదు. మొత్తము మీద ఈ పోట్లాటకు ఫలముగా విశ్వవిద్యాలయము విశాఖపట్నము వెళ్ళిపోయినది. దత్తమండలాలు బయటికి వెళ్ళిపోయినవి! రాష్ట్రసమస్య వెనుకటికంటె క్లిష్టతరమైనది. రెడ్డిగారు వైస్ చాన్సెలరై ఆ పదవి పొయ్యేకాలములో కాంగ్రెసులో చేరినాడు. మళ్ళీ విశ్వవిద్యాలయోపాధ్యక్షపదవి ఖాళీ అయ్యేటప్పటికి మళ్ళీ కాంగ్రెసును వదిలివేసినాడు. విశ్వవిద్యాలయము రావడము, దానికి విద్యాధికుడైన రెడ్డిగారుపాధ్యక్షుడు కావడము చూసి జాత్యభ్యున్నతికి చాలా యీ సంస్థ తోడుపడుతుందని మాబోటివాళ్లము ఆశించినాము కాని యీ పదిహేడు సంవత్సరాలనుంచీ చాలా నిరుత్సాహము కలిగినది. అదివరలో విశ్వవిద్యాలయముయొక్క ఆశయాలనుకున్నవి ఒక్కటయినా

సఫలము కాలేదు*. ఎన్ని సంవత్సరాల నుంచీ మన నాయకులంతా ఉన్నత విద్యను దేశభాషలలో గరపవలెనని ఆందోళన చేస్తున్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయ మీ విషయములో కృషిచేసినది. ఇంకొక విశేషము. ఈ విశ్వవిద్యాలయాన్ని స్థాపించేటప్పుడు విద్యాధికుడైన రెడ్డిగారి సలహా తీసుకున్నారట! అటువంటివాడు ఉపాధ్యక్షు డయ్యేటప్పటికి మాకందరికి తెనుగుకు అభ్యున్నతి కలుగుతుందనే ఆశ కలిగింది. ఈమార్పు త్వరలో వచ్చే సూచనేలేదు. వెనుక ఒకమారు విశ్వవిద్యాలయపు కనీసకర్తవ్యము మనవిచేసినాను. మొదట ఉపాధ్యక్షులు ఇద్దరూ గొప్ప అంతర్జాతీయ విద్యాధికులు! రెండవవారు రాధాకృష్ణ పండితులు. వీరెక్కువకాలము ఆంధ్ర విశ్వ విద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉండలేకపోయినారు. మన దురదృష్టమే అది. ఇటువంటివాళ్ల హయాలలోనే అవసరమైన మార్పులురాకపోతే నిరుత్సాహము కాక యింకేమున్నది? తెనుగుకు ఆనర్సుక్లాసు పెట్టడముతప్ప చేసిన ఉపకారములేదు. సంస్కృతముమీద సవతితల్లి ప్రేమే! మద్రాసువిశ్వవిద్యాలయము చేసినమాత్రము కూడా తెలుగుకు ఆంధ్రవిశ్వ విద్యాలయము చెయ్యలేదు. తంజావూరు లైబ్రరీలో ఉన్న తెలుగుగ్రంథాల పట్టిక తయారుచెయ్యడము వీరు చేసిన ఒక గొప్పపని. ఒక

---

* రెడ్డిగారు 7-12-40 (ఆంధ్రపత్రిక) తేదీన యిచ్చిన ఉపన్యాసములో ఈ క్రిందివిధముగా చెప్పినాడు.

"ఈ విశ్వవిద్యాలయము "సైన్సు, అప్లైడుసైన్సు"కు ప్రాముఖ్యము నొసంగునదై యున్నది వాఙ్మయము, సారస్వతము, మున్నగునవి అంత ప్రాముఖ్యముగా నెంచబడుటలేదు."

ఆంధ్రదేశమంతా యీయనకూ, విశ్వవిద్యాలయానికీ కృతజ్ఞము, ఇక ఆంధ్రులు బాధపడనలసిన అవసరములేదు. "మీ సంస్కృతికోసము కాదీసంస్థ" అన్నప్పుడు ఇక దుఃఖమెందుకు? "ఈ విశ్వవిద్యాలయము ఒక్కపార్టీది కాదనియు, ఒక్క కులమువారిది కాదనియు, ఒక్కజిల్లాది కాదనియు ప్రజలు తలచుచున్నట్లు ఈ విరాళములు స్పష్టము చేయుచున్నవి." ఆంధ్రప్రజలది కాదన్నప్పుడు ఈ మాటల కర్థము లేదు ఈ పైమాటలు చేతలతో నిదర్శనముగా చూపవలె! ఈ క్రింది వాక్యాలుచూడండి. , , We must introduce our students to the great basic intellectual and social achievement of our race, and to forces shaping contemporary Society" (Dr. Nelson. O Meab, President to City college, New York)

ఖండాంతరాలలో ఇట్లా ఉంటే మన సంస్కృతికి స్థానము లేదంటున్నారు మన విశ్వవిద్యాలయాధికారులు.

ఉత్తమ నవలకు బహుమతి ఇస్తామని ప్రకటిస్తే "నారాయణరావు", "వేయి పడగలు" బయటికి వచ్చినవి. ఇటీవల "ఆంధ్ర సాహిత్య చరిత్రను" కూడా యిట్లాగే పారితోషిక మిచ్చి వ్రాయించవలెననుకున్నారు, *విశ్వవిద్యాలయము వారు. ఇట్లాగున్నది ఈ చరిత్ర! చేసేపనికంతకూ ఓట్లూ ఉద్యోగాలూ ప్రతిఫలమూ చూడడమైతే యిక యితరానికి చోటేలేదు. నిజమైన ఆంధ్రాభ్యుదయము కోరే వాళ్ళకు చాలాఉత్సాహ భంగమైనదనీ, ఆంధ్రుల భావ్యభివృద్ధికి వలయు ఒక్కపనైనా జరగలేదని చెప్పి యీ ప్రశంసనాపివేస్తాను.

## ఆంధ్రనాటక కళాపరిషత్తు

వెనక కొన్ని సంవత్సరాలుగా నాటకకళకు కొంచెం దోహదము కలిగినదని చెప్పినాను. మన ప్రముఖులంతా నాటకకళోద్ధరణము విషయమై అభిప్రాయాలు మార్చుకోటానికీ, అవసరమైన కొన్ని విషయాలు నిర్ధారణ చేసుకోటానికీ, సంఘమొకటి అవసరమని తలచినారు. అటువంటి పరిషత్తు నొకదానిని స్థాపించినారు. ఇందులో బళ్ళారి రాఘవాచార్యులుగారూ, వనారసగోవిందరావుగారూ చేసిన కృషి చాలా గొప్పది. ఒక ఆదర్శక నాట్యశాల నిర్మించవలెననీ, ఆదర్శక నటకులను తయ్యారు చెయ్యవలెననీ, చక్కని నాటకాలను వ్రాయించవలెననీ, యువకులకు నాట్యములో తర్ఫీతునియ్యవలెననీ మొదలైన ఉన్నతాదర్శాలు వీళ్ళకు మొదట ఉండేవి! వీటి అన్నిటికంటే పూర్వము స్త్రీలు నాట్యరంగ మెక్కవలెననే ప్రశ్న పరిషత్తు నాకర్షించినది.

---

ఈయన ఆంధ్రరాష్ట్రాన్నిగూర్చి యిప్పుడు చెప్పేమాటలు ఆబాలగోపాలము కోపకారణాలుగా ఉన్నాయి. ఈయన కాకినాడలో నాట్యకళాపరిషత్తులోనూ అంతకుపూర్వము తన షష్టిపూర్తి మహోత్సవసందర్భములోనూ చెప్పిన మాటలు చాలా నిరుత్సాహముగా ఉన్నవి! మచ్చునకు రెండువాక్యాలనిస్తాను. "The question of forming a separate province has gone to rocks. There will be no use of salvaging it." (21-1-41 Speech at Madras) ఈ అర్థాన్నే విచారముతో చెబితే కొంచెము నయమే! "ప్రజామిత్ర" యీయనకు ఒక బహిరంగలేఖ వ్రాసినది!

* 1941 సంవత్సరము నవంబరు నెలలో సర్ విజయగారి యాజమాన్యము క్రింద జరిగిన ఆంధ్రమహాసభలో సరియైన ఆంధ్రచరిత్ర వ్రాయటానికి గట్టి ఉపసంఘము ఒకటి స్థాపించబడినదని తెలుస్తుంది.

విశ్వదాతవంటి వాడుకూడా ప్రవేశించవలెననే అభిప్రాయము పొందినాడు. పత్రికలలో వాదోపవాదాలు జరిగినవి. ఈ విషయములో చాలాగొప్పవ్యక్తులు పాల్గొన్నారు. సంసారులైన పురుషులలో ఇది మొదట చాలా కలవరము కలుగచేసినది! ఆ పని చెయ్యడములో కొద్దిమంది సంసారస్త్రీలు కొంచెముత్సాహము చూపినారు. కాని మొత్తముమీద చాలా మంది మాత్రము దీనిని అనుసరించలేదు. తెనాలిలో (1929) లో జరిగిన ప్రథమ పరిషత్సభకు ఆచంట వెంకట్రాయ సాంఖ్యాయన శర్మగారు అధ్యక్షత వహించినారు. విశ్వదాతగారు కూడా వచ్చి యీపాత్రధారణాన్ని గూర్చి గంభీరోపన్యాసమిచ్చినారు. పింగళి లక్ష్మీకాంతంగారు 1937లో జరిగిన వార్షికానికి అధ్యక్షోపన్యాసము ఇచ్చినారు. ఇది నాటకకళమీద మంచి వ్యాసము. ఈపరిషత్తు చాలా ఉత్సాహముతో పనిచేసినది. ప్రతిసంవత్సరము కాకపోయినా అప్పుడప్పుడు కలవడము కొంతచర్చ చేయడము కొన్ని నాటకాలను ప్రదర్శించడము యెవళ్ళ పనిమీద వాళ్ళు పోవడము కలుగుతున్నది! సినిమా◆వచ్చి యీ ఉద్యమానికి దెబ్బకొట్టినది. వేషము వేయతగిన స్త్రీలంతా సినిమాలలో నటీత్వములో ఉండటముచేత, సమర్థులైన పురుషులుకూడా సినిమారంగాన్నే ఆశ్రయించ వలసివచ్చినది.

ఇటీవల "నాట్యకళ, సినిమాకళ" అని పెద్దలొక ఉపన్యాసమిచ్చినారు (ఆంధ్రపత్రిక 23-1-41). అందులో కొన్ని అభిప్రాయాల నిక్కడ యిస్తాను. గిడుగు సీతాపతిగారన్నారు: "నాటకంలో సంగతులూ, నవలలో ఉన్న వర్ణనలూ, రెంటినీ చూపవచ్చునట చలన చిత్రంలో ! ప్రేక్షకుడి ఊహకు విడిచిపెట్టే కొన్ని విషయాలనుకూడా చూపవచ్చునట?" ఇది కళాస్వభావము కాదు; అన్ని లలిత కళలలోనూ ఊహలనండి, వ్యంగ్యమనండి, ధ్వననండి, రసమనండి ప్రధానం! అది

---

◆ సినిమా విమర్శ లెక్కువైనాయి. నవ్యులలో సినిమా విమర్శ 'ఫాషన్' అయిపోయినది. కొన్నాళ్ళు కృష్ణాపత్రికలో **'సినీఫాన్'** అనే ప్రచ్ఛన్న నామముతో సినిమా విమర్శ వస్తూ ఉండేది. ఇంటూరు వెంకటేశ్వరరావు అనే అతను 'తెలుగు సినిమా వెలుగులు' అనే పుస్తకము వ్రాసినాడు. 'సినిమాకళ' మీద పద్మరాజు భారతిలో (1938Feb. ) వ్యాసము వ్రాసినాడు.,

'నాటకకళ' అనే పత్రిక ఒకటుండేది.

ప్రేక్షకాభావమే సినిమాలో గొప్పలోపము! సీతాపతిగారుకూడా "కొన్ని శబ్దములో, కొన్ని విషయాలింకా చూపకూడనివని ఒప్పుకుంటున్నారు* అంతేకాక సినిమాలో ప్రేక్షకుడేడీ? అదికూడా ఒక గొప్పలోపము! ప్రేక్షకుడున్నప్పుడు నటులులేరు! ఫొటోగ్రాఫిలో తీయడానికి వీలులేని విషయాలుంటాయా? అట్లా అన్ని విషయాలూ చూపటముచేత సినిమాకళ కళకాక సంసారమైపోతున్నది:" నటకుడి భావప్రకటనము బాగుండే వరకు డైరెక్టరు చెప్పి చేయించగలడట? "ఈ మాటల్లో డైరెక్టరే ప్రధానసామాజిక స్థానములో ఉన్నాడని ఒప్పుకుంటున్నారు. " స్వగతంలో నాటకంలో పక్కనటుడు గొంతుచించుకొని అరవక్కర్లే"దట! ఇటువంటి స్వగతాలు సినిమాకళలో ఉండవా? ఉంటే ప్రేక్షకులకు వినపడనక్కర్లేదా? 'ఇంతవరు తమ శీలాన్ని కాపాడుకోగల' పవిత్రులు ఈ పరిశ్రమలో చేరితే యిందులోకూడ కాపాడుకోగలరు ఈవాక్యము చాలా భావసంభితముగా ఉన్నది. నేనుకూడా దాన్ని అట్లాగే వదులుతున్నాము. డైరెక్టరు గోపాలరావుగారి ఈక్రింది ప్రసంగము విచిత్రముగా ఉన్నది. "మానవుడిదృష్టి దేవుడిమీదనించీ తగ్గి, తనమీదకే మరలుతున్నదట! దేవుడిమీదనించీ దృష్టిమరలించి ఎలా బాగుపడాలనే సమస్య ఉదయించిందట! అది పరిష్కరించుటకు కళ తోడ్పడాలట!" దేవుడిని మానవజీవితములోనించీ వెళ్లగొడుతున్నాడీయన! అంత సులభముగా గోపాలరావుగారి ఆజ్ఞానువర్తియై వెళ్లిపోడు దేవుడు! గోపాలరావుగారికంటె చాలా కాలము క్రిందటినించీ మానవజీవితములో తిష్టవేసుకుని కూచున్నాడు దేవుడు! యుద్ధాలు, విప్లవాలు, మొదలైనవి దేవుణ్ణి తాత్కాలికముగా మరపించినా, మానవజాతి మళ్లీ దైవసన్నిధిలో ఓనమాలు చదువుకుంటూంటే, సినిమాకళా గోపాలరావుగారూనా ఆయన్ను మానవజీవితములోనించీ వెళ్ళగొట్టడము!

---

*డైరెక్టరు గోపాలరావుగారు ఈక్రింది మాటలతో సీతాపతిగారి వాదాన్ని ఖండించినారు "సినిమాలో డైరెక్టరు కొన్ని సంగతులు చెప్పకుండా ప్రేక్షకులూహకు వదిలి పెడతారు. నవలగా స్పష్టముగా వ్రాసిచూపిస్తాము. కావున నవలకన్న సినిమా ఉత్తమశ్రేణికి చెందినది." అంతకంటె చాలా ముఖ్యమైన విషయాలను ప్రేక్షకుడి ఊహకు వదిలే నాటకము ఇంతకంటె ఉత్తమశ్రేణికి చెందినదని యీవాదమే ధ్రువపరుస్తుంది! దీన్నే నాటకములో సూచ్యార్థ సూచనమన్నారు. "It is generally forgotten that on the screen as on the stage, what is left out is as important, and often even more important than what is let in"

(Indian Express 6-8-41)

సినిమాకు కావలసిన టెక్నిక్కు వేరు? అది ఒకప్పుడు నాటకము కంటె చాలా భిన్నము. ఒక్క ఉదాహరణ మిస్తాను. నాటకములో సభ్యులనుచూస్తూ మాట్లాడవలె, ప్రతిభ ఉపయోగించి నాట్యము చెయ్యవలె! ఒక్కొక్కప్పుడు నటుడు సభను చూచి ఉత్సాహము పొందడమో భయకంపితుడు కానడమో తటస్థిస్తుంది. కాని సినిమాలో నటుడి ప్రతిభ అక్కర్లేదు, డైరక్టరుంటాడు. వారు చెప్పి నట్టు చెయ్యవలె! ఎదురుగా ఎవ్వరూ ఉండరు కూడాను. ఎదట మనిషిలేకుండా, వాతావరణము లేకుండా నటించడము. వినీ, చూసీ, బాగాఉండలేదని కాని, బాగా ఉందనికానీ, చెప్పేవాళ్ళు ఫిలింతయారుచేస్తున్నవాళ్ళేగాని సభాసదులు కారు, సభాసదులంటూ ఉండి, వాళ్ళ ఆమోదమో, వైముఖ్యమో చూపిస్తుంటే పాత్రధారికి నేర్చుకునే విషయాలుంటవి!* ఇక్కడ డైరెక్టరు సర్వజ్ఞుడు! ఎప్పుడూ వై.వి.రావు గూడవల్లివంటి డైరక్టర్లు దొరుకుతారా? కాబట్టే మన తెనుగు ఫిల్ము లిట్లాఉన్నై! సినిమా కళలో ఉన్న అసలు లోపమే యిది! రసము కొంతవరకు చంపివేసినది ◆ ప్రజలను ఎందుకూపనికిరాని చద్దిస్మృతుల,

* డాక్టరు సీతాపతిగారు సినిమాకళలో నాటకం కంటె కొన్ని విశేషాలున్నై అన్నా, యీ విషయంలో మాత్రం యేకీభవించినారు, (ఆంధ్రపత్రిక 23-1-41)

◆ ప్రథమదర్శనమేగాని పునర్దర్శనము రసోత్పత్తి చెయ్యదు, లంటే "క్షణేక్షణేయున్నవతా ముపైతి" అనేగుణములేదు రమణీయతలేనిది రసమెక్కడిది? గ్రామఫోను వంటిదే యిన్నీమాట. జీవమూ, ప్రాణమూ లేని కళకు స్థాయిత్వం యిచ్చిం దీపరిశ్రమ "మ్యూజియంలో పెట్టిన జంతువుల శవాలవంటిదని" ఒక విమర్శకుడన్నాడు. అంత క్రూరముగా చెప్పడము నాసల్లకాదు. ప్రతిభా తత్పరిణామమైన క్షణక్షణ నవ్యతాలేదని మాత్రం గట్టిమాట. గ్రామఫోనుమూలపడ్డట్టు సినిమాకళకూడా యెప్పుడన్నా మూలపడవచ్చు. రాఘవాచార్లుగా రేమన్నారో చూడండి -

'గాంధిగారు చెప్పినట్లు దేవుడు, సత్యం, సౌందర్యం, కలిసివుంటాయి. కాని 'ఆట్కిల్' దినాలలో దేవునిబదులు దురాశయు, సౌందర్యము బదులు రూపాయి అణా పైసలు, సత్యంబదులు అడ్వర్‌టైజుమెంటు స్థావరమేర్పర్చుకున్నవి. ఎంత ఎక్కువ ప్రకటనచేస్తే అంత పెద్ద స్టారులు, లేదా ప్లా నెట్లు అవుతారు. సినీమాలలో ప్రదర్శించబడునది బూటకపు సౌందర్యం. భారత సంఘముయొక్క మర్యాదయు గొప్పతనము యీ సినిమాలవలన, నాశనం చేయబడుచున్నది. మన స్త్రీ జనం యొక్క సభ్యత నశింపబడి వికృతాకారముతో ప్రదర్శింపబడుచున్నది. కనుక మీరెవ్వరూ సినిమాలకు పోరాదనియే నా సలహా? (ఆంధ్ర పత్రిక 24-1-41) ఎంతగట్టిగా చెప్పారు!

పద్మావతీ దేవిగారివి యీ మాటలు: 'ఆంధ్రులలో అనుకరణం యెక్కువ' 'సోజాహో రాజకుమారి' అని సొగల్ పాడినమట్టు తెచ్చి 'చాలు యీసరసాలు చాలు' అని మన సినిమాల్లో యెక్కిస్తే, అదేమిసరసంరా అని దిగులేస్తుంది." (ఆంధ్ర పత్రిక 24-1-41)

(2-5-41 ఆంధ్ర పత్రికలో జమ్ములమడక మాధవ రామశర్మగారి వ్యాసాన్ని కూడా చదవమని కోరిక.)

మనం యెట్లాచేసినా పర్వాలేదు, ప్రజ మెచ్చుతారు, హాళ్లు నిండుతారనీ, కొన్ని సన్నివేశాలూ, కొంత సంగీతమూ, కొన్ని స్త్రీ పురుష సమావేశాలూ, కొంత భావ ప్రకటనము కొంత శరీర స్పర్శా, కొంత చుంబనాదికమూ, కొంత విలక్షణ నేపథ్యయుక్తనాట్యమూ, చూపితే చాలనుకోడం! *అవ్వే ప్రతిఫిలింలోనూ, అవసరమున్నా లేకపోయినా పడవేయడం! ఇట్లా సినీమాకళ వచ్చి నాటకానికీ, రంగానికీ, దెబ్బకొట్టింది! ఈపీడ ఎప్పుడు వదలుతుందో తెలియదు. ఇందులో కళ యేముంది? సూచ్యార్థ సూచనము దృశ్యార్థ దర్శనమంటూలేదు! ప్రతిదీ దర్శనీయమే! కర్మంజాలక చావువస్తే, వాకిట్లో కూచోబెట్టి నీళ్లుపొయ్యడం దగ్గరనుంచీ, కాటిలో దహనంచేసి, యింటికొచ్చిందాకా- యేడ్పులు పెడబొబ్బలూ సహా-చూపవలసినదే! ఎంత జుగుప్స! నేను కొంచెము అతిశయోక్తిగా చెప్పానేమో! మళ్లీ నాటక కళకు ఎప్పటికి గౌరవ మొస్తుందో తెలియదు. § స్త్రీలు నాటకరంగాని కెక్కడమనే సమస్య యిప్పుడు ఎక్కువగా చర్చించటము లేదు ఈవిషయములో తెలుసుకోగోరినవాళ్ళుపల్లి అనంతకృష్ణశర్మగారి 'నాటకోపన్యాసాలు' చదవమని మనవి. ఇక యీ సినిమాసారస్వతాన్ని గూర్చి యెంత తక్కువ చెబితే అంతమంచిది. అది సారస్వతం

---

దీని పేరే 'Mob' (మాబ్) టేస్టు అన్నాడు కొడవటిగంటి.

'...మాబ్ టేస్టు! అని కావాలె?'
"ప్రతీ నటుడూ ఆమాటే అన్నాడు.
కవి ఆమాటే అన్నాడు.
మ్యూజిక్ డైరెక్టరు
పెట్టుబడిదార్లు.....
ఆర్టిస్టు..... (ఆంధ్ర పత్రిక 20-9-40)

"In England and America the stage today has assumed greater importance than before the coming of the films. In India it has been said that the films had killed the stage. But such a view did not appear to be correct. He thought that the films over-took the stage here, before the stage to maturity."

(Noel Coward)

నాటకాలమీద ప్రజలకు అభి··· కలుగుతున్నట్లు అగుపిస్తుంది సినిమాలు వినుగెత్తిస్తున్నై అందుకు తార్కాణముగా పాదుకాపట్టాభిషేకము అనేఫిల్ములో నాటకము సినిమా కలగాపులగంగా కనిపిస్తుంది

కాదు. గాలి! దీన్నే పోగుచేసి కుప్పలు వేసినారు మా లక్ష్మీకాంతం అన్నగ్గారూ, మొదలైన వాళ్ళు! నవ్యుల్లో త్రిపురారి భొట్ల వంటివాళ్ల క్కూడా యీగాలి తగిలింది! అనుసరిస్తూన్న సంగీతం తీసి వేస్తే, భావము కల సంగీతముగాని, పద్యముగాని, పాటగాని, నాకు కనపడలేదనటములో నామనస్సులో ఉన్న దాన్ని మనవి చేస్తున్నాను.! గవ్వైపాటవచ్చి తెనుగు సినిమారంగాన్ని ముట్టడేసింది!※ ఆపాడేది తెనుగో, ఉర్దూవో, హిందీవో, తెలియటానికి వీల్లేకుండా ఉన్నది! సంగీత స్వరాలలో మాటలు మునిగి పోతున్నై!◆ మిగిలింది నిర్భావహాసం! పక్కలు కదులుతై! కంఠములోనించీ లయతో కూడా శబ్దము వస్తుంది! కాని అది నవ్వుగా ముఖములో కనపడదు! ఇది

---

'ప్రొడ్యూసర్సు దీనిని (ప్రజల సినిమా సక్తతను) అవకాశముగా తీసుకొని చత్త ఫిలుములు వారి తలమీద రుద్దరాదు. (జాన్ అలెగ్జాండర్, ఆంధ్రపత్రిక 31 1.41)

※ "టాకీయంత్రముల మూలమున మానవ కంఠస్వరమును విపరీతముగా అతిశయింపజేసి పెద్దగా విన్పింపజేయుటవల్ల సహజకంఠస్వరములోని మార్దవమున్నూ హెచ్చుతగ్గుల వొదుగు లున్నూ అంతర్ధానమైనా, నాట్యాభినయములలో అర్థ సంభరితమై అవయవ విన్యాసములు సందర్భ శుద్ధిగా చూపబడును. కాని టాకీలలో కొన్ని విన్యాసములను మాత్రము చూపగల్గుచున్నారు. ఏదో ఒక్క విన్యాసమునే ఒక్కొక్క సందర్భములో ప్రధానముగా పెద్ద బొమ్మగా జేసి చూపుచున్నారు...... ఇటువంటి యంత్ర చమత్కార ప్రభావములవల్ల మానవులకుండెడి సహజ రస గ్రహణశక్తి కూడా నశించి, సహజభావప్రకటనా సామర్థ్యముకూడా జనులకు నశింప గలదు". డాక్టరు కజిన్సు గారు - ఆంధ్రపత్రిక. 25.10.40

"ఫిల్ములు మూలంగా సంస్కారం జరగగలదని నేననుకోను"

వై.వి. నిత్యానంద, ఆంధ్రపత్రిక, 27-12-40

కొమ్మూరి పద్మావతీ దేవి గారు పట్నంలో ఉపన్యాసమిస్తూ నాటకాన్ని నీతి బోధచేస్తుందని ఉగ్గడిస్తూ చెప్పిన రీతి చూడండి·

◆ "ఇలాగే (పైన చెప్పినట్టు) నాటకాల ద్వారా కూడా ప్రబోధం చేయవచ్చును. ఇలా ప్రచారం చేసే నాటకాలు ప్రస్తుతం తేవనే అనాలి. తగిన సహాయం లేక యింత వరకూ ప్రచారం చేసేవి ఏవీ మన దేశంలో రాలేదనే చెప్పాలిసివస్తుంది." పద్యాల ద్వారా పాటలద్వారా, నీతిని బోధించటముకంటె నాటకాలద్వారా సినిమాలద్వారా యెక్కువగా బోధించవచ్చునని యీమె ఆశయము. అట్లా బోధించే నాటకాలు లేవన్నప్పుడు, సావిత్రి, హరిశ్చంద్ర, వేణీసంహారం, పాదుక, మొదలైన నాటకాలు జ్ఞప్తికి రాలేదు కాబోలు దేవిగారికి! హరిశ్చంద్ర నాటకమువల్ల ప్రపంచములో సత్యం యెంతబోధ అయిందో, సావిత్రివల్ల యెంత పాతివ్రత్యముబోధఅయిందో దేవిగారికి తెలియని విషయం కాదు! చెప్పేమాటలకు, వినే కావ్యానికీ, చూచే నాటకానికీ, నడిచే

భావ ప్రకటనకు మచ్చు! ఈదినాలలో నాట్యకళా పరిషత్తు జరపడానికి ప్రయత్నించుట మంత వెర్రిలేదు! సినిమా కళాపరిషత్తు వచ్చింది! వాళ్లే నాట్యకళాపోషకులు! నాట్య రంగము మూలబడ్డది. సినిమా ద్రవ్యములభింపజేస్తున్నది! ఇక వీళ్లకు నాట్య రంగము మీద శ్రద్ధ ఉండమంటే యెలా ఉంటుంది? ఆంధ్రపత్రికలో 'రాజు' కూడా వాపోయినాడు, "ఆదర్శ నాట్యమందిర నిర్మాణము, ఆధునిక నాటకరచనా ప్రయత్నం, ఉత్తమ నాట్యశిక్షణాలయము, ఈ మొదలైన పరిషత్తాశయాలు ఈడేరలేదు.

---

నడవడికీ, సంబంధం ఉండటం చాలా అరుదు! అట్లా సంబంధం ఉంటే అది "Art for art's sake" కాదు.

"ఆంధ్రగాయకులు హిందూస్తానీ సంగీతాన్ని అనుసరించి కర్నాటక సంగీతాన్ని యీసడిస్తున్నారు". (త.శి.శా. ఆంధ్రపత్రిక 22-1-41)

"మద్రాసులో తెలుగు, తమిళ, చిత్రాలు చాలా ప్రాథమిక స్థితిలో నున్నందున ప్రజల కింకా సన్నిహితంగా ఉన్నవని చెప్పచ్చు. వాటిలో బ్రాహ్మణద్వేషంకూడా మిక్కుటంగా కనిపిస్తుంది...... ద్రవ్యాపేక్ష ఉండనేఉంది...' (జాన్ అలెగ్జాండరు. ఆంధ్రపత్రిక 31-1-41.)

సినిమా అడ్వర్‌టైజుమెంటు ఎటువంటి నిరర్థక, అసభ్య ద్వేషపూరిత, సంప్రదాయ నిరసన పూరిత, చివరకు- మాటలతో నిండుతై! మచ్చుకి-

"ముడుపులు, నిలువుదోపిళ్ళు. పదహారు బాహువులెత్తి నిలబెట్టినారే, వారి విలాసాలకు ఏర్పాటు చేసుకున్నవి! డబ్బులేకపోతే వారికి మకరకుండలాలు, సింహతలాటాలు, ఛత్రచామరాలు, బహుపరాకులు, పవళింపుసేవలు ఎలా వస్తాయి?" (ఆంధ్రపత్రిక 31-1-41)

ఇట్లా వ్రాయకపోతేనూ, ప్రజలను మోసం చేసే చిత్రాలను, సంభాషణలనూ కల్పించకపోతేనూ, సినిమా డైరెక్టర్లకూ భవనాలు, మోటార్లూ, యితర ప్రాపంచికానందాలూ, యెట్లా వస్తాయి? సినిమాలు రాజకీయ, సాంఘిక, నైతిక సమస్యలను తీరుస్తాయని ప్రకటనలు! ఒక్కటిమాత్రం నిశ్చయం. కొందరి ఆర్థికసమస్యలను మాత్రం తీర్చినై! తీరుస్తున్నై! ప్రచారం, అడ్వర్‌టైజుమెంటు, నాగరకతా ప్రారబ్ధాల్లో కొన్ని.

1941 October "Torch" పత్రికలో సినిమా కళయొక్క ప్రస్తుత అపాయ స్థితిని గూర్చి సంపాదకుడు ఇట్లా వ్రాసినాడు.

"A new terrorist type of vile opportunists have come into existence in our land, and their power to delude and exploit the masses is growing day by day. They are the educated malcontents. They take particular pride in parading their morbid modernism, and pose themselves as the leaders and liberators, philosophers, and guides of a new India. They are a greater danger to our culture and country than the oldfashioned and but- disappearing priests and plutocrats."

కొంతకాలము నడచి పరిషత్పత్రికకూడా మధ్యనే నిల్చిపోయింది.'' క్షీణిస్తూ ఉన్న నాటకరంగాన్ని (కంట్రాక్టునాటకాలవల్ల) టాకీలు వచ్చి ఒక్కతన్ను తన్నాయి. అంతటితో ఆంధ్రనాటకరంగానికి వెన్నెముక విరిగినట్టు అయింది.' 'టాకీలు మనదేశానికి కొత్తగా వచ్చిన విజ్ఞానసాధనాలవటం చేత మొదటి రోజులలో ప్రజల మీద మచ్చుమందు చల్లగలిగాయి. ఇప్పుడిప్పుడే ప్రజలామైకం నించీ తేరుకుంటున్నారు.' ఈయన యిలా అన్నాడుగాని నాకింకానమ్మకంలేదు. కాని మద్రాసులో కొత్తపల్లి లక్ష్మయ్య (1899-) గారి సంపాదకత్వం క్రింద మళ్లీ 'నాట్యకళ' పత్రిక ప్రచురణ కొన్నాళ్ళు సాగడము సంతోషం. బెజవాడ రామచంద్రారెడ్డిగారి వంటివారు తలుచుకుంటే తప్ప ఈ ఉద్యమము* అవిచ్ఛిన్నముగా జరగదు. సంపాదకులు, వ్రాయసగాండ్లు దొరుకుతారు, కాని "తండులాలు" సమకూర్చే లక్ష్మీపుత్రులవసరము! సి.ఆర్. రెడ్డి ప్రభృతులు సందేశాల నంపారనడము యేమీ ప్రయోజన కారి కాదు. ఇటువంటివారి, ఆశీర్వాదాలు పొందిన చాలా సంస్థలు అంతరించినై. తుదకు పత్రిక ఊరికే పంపవలసినదే గాని కొననుకూడా కొనరు. వీళ్ళు పునరుద్ధరించడము చాలా సంతోషము. ఇక అంతరించకుండా ఉండటము సాహిత్యసేవకుల ఆశయము! టాకీయుగములో యీ నాటక కళోద్యమము యేటి కెదురీత! సినీమాకళనూ నాటక కళనూ, సమ్మేళనముచేసి ఒక నూతన కళను సృష్టించటమవసరమని నీలం రాజు శేషయ్యగారు చెప్పినాడు. అన్ని మార్గాలలో నూతనత్వం కావాలనే యువకులు చేయవలసిన పని అది! నాటక కళ యొక్క సంపూర్ణనాశనము కావచ్చు దీనివల్ల! ఈ పరిషత్తూ, పత్రికా, మళ్ళీ వాద ప్రతివాదాలలోకి వచ్చింది.

---

* 23-11-40 తేది కృష్ణాపత్రిక, 20-11-40 తేది ఆంధ్రపత్రిక, 27-12-40 తేది ఆంధ్రపత్రిక, చూడండి. ఈ సందర్భంలో పరిషత్తు కర్తవ్యాన్ని గూర్చి 24-1-41 తేది ఆంధ్రపత్రికలో ఓగిరాల వెంకటసుబ్బారావు, మల్లాది వెంకటేశ్వర్లు గార్ల వ్యాసాలు చూడండి.

హైదరాబాదులో ఇటీవల భాస్కరభొట్ల కృష్ణారావు మొదలైన యువకులు కొందరు ఆంధ్రనాట్య కళాపరిషత్తని స్థాపించినారు.

కూర్మా వేణుగోపాల స్వామిగారిటీవల ఆంధ్రనాటకరంగముపై ఉపన్యాసాలిస్తూ నాటకాలు వేయిస్తూ, గుంటూరులో నాట్యసమితిని నడుపుతూ, ఈ కళకు అంజలిఘటిస్తున్నారు.

కాకినాడలో కట్టమంచి వారి, పిఠాపురం ఉయ్యూరు యువరాజుగారి యాజమాన్యము క్రింద ఆంధ్రనాట్య కళాపరిషత్తు జరిగింది.

ఉయ్యూరు కుమార రాజాగారూ, యఱ్ఱోజు మాధవాచార్యులుగారూ అనేక నాట్యకళోపాసకుల అండతోను, ఆదరముతోను, ఈ నాట్యకళాపరిషత్తును మళ్ళీ పునరుజ్జీవింప జేయడానికని సర్వవిధాల ప్రయత్నిస్తున్నారు. ముదావహము. అక్కడక్కడ దేశములో ఉన్న నాటక సమాజాల నన్నిటినీ నాట్యకళాపరిషత్తులో చేర్పడానికీ, నాట్యకళోద్ధరణము సమగ్రముగ కొనసాగించడానికీ ప్రయత్నాలు జరగటము, నటులకు, రచయితలకు ప్రోత్సాహమీయడము అభినందింపతగిన అంశము!

కనుక ఆంధ్రులకున్న విశ్వవిద్యాలయమూ, నాటక కళాపరిషత్తూ ఎలా ఏర్పడి జాతి ఏకైతాన్ని మలచుచున్నాయో పరిశీలించినాము. వాటిని పురస్కరించుకొని వచ్చిన వాఙ్మయాన్నీ, వాదోపవాదాల్నీ కూడా గ్రహించడం కొంతవరకు జరిగినది!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 3

# నవ్య సాహిత్యము: పత్రికలు

## కథానిక* (ప్రథమ స్థితి)

ఈ వీధిలో సాధకులు చాలా సిద్ధిపొందినారు. ఈ కథానికా రచనములో సాధకులు అధికసంఖ్యాకులు వ్యావహారికాన్నే ఉపయోగించినారని అనటము భావ్యమే† చ్యుతసంస్కారముకాని గ్రాంథికము వాడిన వాళ్లుకూడా ఉన్నారు. ఇటువంటివారిలో ఈవిషయములో గిడుగువారి శిష్యులుకూడా ఉండడము ఆశ్చర్యకరము. వెనక చింతాశంకరదీక్షితులుగారిని గూర్చి, ఆయన రచించిన ఖండకావ్యాలనుగూర్చి, వాటిలో సాధ్యమైనంతవరకు ఆయన లక్షణమైన భాషనే వాడటాన్ని గూర్చి, మనవిచేసినాను. మచ్చుకు ఆయన కొన్నికథలలో ఉపయోగించిన భాషనుగూర్చి చెబుతాను. 'సాహితి' మొదటి సంచికలో ఈయన "స్వేచ్ఛ" అని ఒక కథవ్రాసినాడు. దానిలో సంభాషణలో వాడిన భాషను వదలి, కథావస్తువును కవి చెప్పేటప్పుడుపయోగించిన భాషను ఉల్లేఖిస్తాను.

---

*కథకు కావ్యభాషవల్ల జీవకళ ?దరి పోతుంది. వాడుకభాష వాడితేనే వర్ధస్సు. ...... .గు. అప్పారావు పంతులు గారు వాడుకభాష తో చెప్పిన "దిద్దుబాటు" అనే కథవల్ల తెలుగులో వెలుగు బయలుదేరింది"

- శివశంకరశాస్త్రి.

సభాపతిగారు 1915లోనే "ఆఖ్యాయిక" అనే పేరుతో సచిత్ర మాసపత్రిక ప్రకటించడానికి యత్నించినట్టూ అది సాగకపోయినట్టూచెప్పినాడు. కథాస్వరూపాన్ని అందులో నిర్వచించినాడు.

(భారతి-ప్రమాది- భాద్రపదం)

†శేషాద్రి రమణకవులు కూడా సాహితిలో తాము వ్రాసిన 'ఇల్లాలుమాటతప్పుతుందా' అనే కథలో వ్యావహారికాన్ని వ్రాసినారు.

"జాగరూకతతో క్రిందకు దిగిన దొంగరాముడు, జవానుల ప్రతిబంధకమైన గాలిదుమారము నావంతయు లక్ష్యము జేయక, దుబ్బుచాటున లేడివలె పరుగెత్తుకొని పోజొచ్చెను. జవాను క్రింద కురుకునప్పటి కాతడప్పుడే సుమారొక ఫర్లాంగుదూరము పోయెను . ఆతని జాడగనుగొనునప్పటికి జవానుల కైదునిముసములు పట్టెను. అప్పకైటిన నయ్యది జవానుల చాకచక్యమువలన గాదు, జైలుగోడ కరమైలు దూరములోనున్న గుట్టపై నాతడు నిల్చి వెనుకకు దిరిగి తన్నెవరైన (అ)నుసరించి వచ్చుచున్నారేమోన (అ)ని చూచుటచే జవాను లతడేగిన మార్గమును గనుగొన గలిగిరి."

చూచినారా యీ వచనము! ఇందులో చక్కని సలక్షణ భాష ఉపయోగించినాడు కర్త. "క్రిందకు" "అయ్యది" అనే పదముల నుపయోగించట మాశ్చర్యమే! "కిందికి" అనవలసినది "అది" అనవలసినది. ఇది నవ్యుల మార్గము. పైనచూస్తే నిత్య సంధులు పాటించినట్లూ, ద్రుతసంధులు చేసినట్లూ, సరళాదేశాలు చేసినట్టూ కనబడుతుంది. అరసున్నలు మాత్రము ఉపయోగించలేదు, రెండు స్థలాల్లో బ్రాకెట్లు ఉంచినచోట విసంధిఉంది.* చూచినారా అప్పటికింకా కథలలోకూడా వెనుకటి పద్ధతినే నవ్యులు కొందరు అప్పుడప్పుడూ ఉపయోగిస్తున్నారు!◆ పూర్తిగా గ్రాంథికాన్ని ఉపయోగించిన వాళ్ళుకూడా ఉన్నారు. త్రిపురారిభొట్ల వీరరాఘవ స్వామిగారూ, వాసుదేవరావుగారూ, మంచి భాషను వ్రాసినారు. విశ్వనాథకూడా సలక్షణభాషనే చాలావరకు వ్రాసినాడు. ఒక్కటి మాత్రము స్పష్టము! సౌలభ్యము కొరకు ప్రయత్నించినారు. అవసరమైన స్థలాలలో వైశద్యము కోసము సంధి చెయ్యటానికి వెనుదీయలేదు. ఈ పద్ధతిని కొందరే అవలంబించినారుగాని బహుళముగా వ్యావహారికాన్నే పూర్తిగా వ్రాసినారు. అటువంటివాళ్ళ సంఖ్య ఎక్కువగా ఉంది కాబట్టి పేర్లు చెప్పట మనవసరము.

---

* వెనుకటి"స్వీయచరిత్ర" "గాలిపాట" అనే కథలలో భాష యింతకంటే ఎక్కువ వ్యావహారికము.

◆ వ్యావహారికము సంపూర్ణముగా యిట్టిదనీ యిప్పటికి స్థిరపడలేదు. మునిమాణిక్యం వారికి ఒకవిధమైన గృహవ్యావహారికము పట్టుబడ్డది. కథలలో మొదటినుంచీ ఆయన వ్యావహారికాన్నే వాడినట్టు కనపడుతుంది.

ఈకధకులు కొందరు ఇంగ్లీషులో ఉన్న వాటిని అనుకరణాలు చెయ్యటము మొదలుపెట్టినారు. ఈ కధానికామార్గము మనకుక్రొత్తది కాబట్టి ఇంగ్లీషులో నాటి ననుకరించటము సమంజసమే! కొందరు ఆ వాతావరణము తీసుకుని కథలను కల్పించినారు! కొందరు కథలనే గ్రహించినారు! మరి కొందరు "ఎవ్వరు చూడవస్తారు" అని వాటినే ఉన్నవాటినున్నట్టు స్వభావసిద్ధమైన మన భాషలో రచించి, స్వతంత్రాలా అన్నట్టు చేసినారు!

"చలం"గారి శైలీ భాషాకూడా మిక్కిలి స్వాభావిక సిద్ధము, సహజము; వ్యావహారికము వ్రాసే వాళ్ళలో ఈయన ప్రవీణులలో ఒకడు!* ఈయనకథలను చదువుతూ ఉంటే స్వతంత్రాలుగా కనిపిస్తవి. కాని చాలా ఇతర భాషలోనించీ గ్రహించినవే! మొపాఁసాఁ (Mopassant) మిాటర్‌లింక్, అనటోల్ ఫ్రాన్సు, హెచ్.జి. వెల్సు మొదలైన కొందరి కథలు యింగ్లీషులోవి తర్జుమా చేసి ఉన్నవి! ఫ్రాంసు యూరపుఖండాని కెట్లాజ్ఞానాన్నిచ్చినదో, అట్లాగే స్త్రీ పురుషుల స్వచ్ఛంద ప్రవర్తనాన్ని ప్రసాదించినది.◆ ఈ రెండూకూడా క్రమక్రమముగా వ్యాపిస్తూ మన దగ్గరక్కూడా వచ్చినవి. ధాన్ని ఒక గొప్ప మతమువలె మనవాండ్లు కొంతమంది గ్రహించినారు! దీనికి కొందరు దాసులైపోయి, ఆవిధమైన వాఙ్మయాన్ని మన సారస్వతములోనికి తెచ్చి దాన్ని ఫలవంతము చెయ్యడానికి పూనినారు. అట్లా వాళ్ళ కధలను చాలా

---

* ప్రకృతి తత్త్వవివేచనమూ, స్వాభావోన్మీలనమూ చిత్తవృత్తి పరిశోధనమూ ఈయనవలె తెనుగు కధానికా రచయితలలో చేయగలవాడు లేడు.

* "వీరి కథలు కొన్ని పూర్తిగా మొపాఁసాఁ యొక్క కవుల అనువాదాలే, పూర్తిగా అనువాదాలు కాకపోయినా అక్కడక్కడ వీరు కవులకు వచ్చేచమత్కారమైన భావాలూ సొంపులూ వీరికి మొపాసాయొక్క కథలు చదటంవల్లనే పట్టుబడ్డాయని మొపాసాయొక్క కథల గురించి ఏమాత్రం తెలిసినవాళ్ళకైనా బోధపడుతున్నది. అప్పుడప్పుడు వీరు తమ కథలు కొన్ని అనువాదాలు మాత్రమే అన్నవిషయం తెలియపరచకుండా ఊరకుండరు ...... ... ........ ...

ఏదేశభాషలోనో ఉన్న కథలు తెచ్చి మనదేశంలోనూ మనభాషలోనూ ఇరికించడానికి ప్రయత్నించినట్టుగా కనిపిస్తుంది." (భారతి శార్వరి శ్రావణం)

◆ మొపాఁసాఁ కథలలో చాలా చమత్కారం, మొదలైనవి ఉన్నా కొంచెమో గొప్పో "అశ్లీలం" లేని కధ ఉండదు

వాటిని మార్చో. కొంతకలిపో, కొంత తీసివేసో చాలా కథల నీ "చలం" గారు రచించినాడు. తర్వాత తర్వాత స్వతంత్రాలుకూడా వ్రాసినాడు ఒక్కభారతి - అదీ తర్వాతదినాలలో--తప్ప ఈయన కథలు ప్రచురించని తెలుగుపత్రిక లేదు. కొన్ని కథలు "పాపం" అనే పేరిట ప్రకటించినాడుకూడాను, ఈయన "శశిరేఖ" 'చిత్రాంగి' మొదలైన నాటకాలుకూడా వ్రాసినాడు. వాటిలోకూడా ఆయనమామూలుమార్గాన్నే వెళ్లినాడు. ఉదాత్త తంటూలేదు. అశ్లీలమూ, పూర్వసంప్రదాయనిరసనమూ, యీరెండు యెక్కడచూచినా కనబడుతూఉంటై యీయనకృతులలో! చిన్ననాటికలు కొన్ని కలిపినమ్మాళ్వార్సు 'నాటికాగుచ్ఛ' మని ప్రకటించినారు. సారస్వతములో అన్ని రకాలు ఉండవలసినదే! సారస్వతము జాతి యావజ్జీవితానికీ ప్రతిబింబము! కాబట్టి యిటువంటి జీవితానికి కూడా ప్రతిబింబముగా ఉండవలసినదే. అందుకనే తారాశశాంకవిజయ రాధికాసాంత్వనాది గ్రంధాలు పారకుల నాకర్షిస్తున్నై! ఇటువంటి వాటిని, అధమకావ్యాలన్నా, మొత్తంమీద కావ్యాలే! ఆవిధముగా ఇటువంటి కథానికావాఙ్మయాన్ని మన దానిలోకి కష్టపడి తెచ్చినవారిలో "చలం"గారొకడు! ఆయన్ను మనము ఒకవిధమైన సారస్వతానికి బ్రహ్మగా అంగీకరించవలసినదే. అనేకులు యువకులూ, యువతులూ, బాలవితంతువులు...చాలా శిష్ట కుటుంబాల్లో వాళ్లూ - యీయన కథలను, 'వినోదినిలో'నో మరో పత్రికలోనో రహస్యముగానైనా తెప్పించుకుని చదువుతూ ఉంటారు! చూచినారా యిటువంటి సాధకుడిని - సంఘములో ఒక భాగముపైన యింత పలుకుబడిఉన్న సాధకుడిని మనము ఎంత మాత్రము నిరాదరణ చెయ్యకూడదు.

మానవుడిలో పశుత్వము, మనుష్యత్వము, దేవత్వము అనే మూడంశములు ఉన్నై! వీటిలో మొదటివి రెండూ సహజాలు! మూడవది మాత్రము గూఢముగా ఉన్నది. దాన్ని అభివృద్ధి చేసుకోడానికి చాలా ప్రయత్నము కావలె? మానవత్వము బాహిరము! పశుత్వముకూడా గాఢమే గాని దాన్ని ఊరికే తాకితేచాలు అది ప్రజ్వరిల్లుతుంది. జ్ఞానములేని పశువులకూ, మానవుడికీ, సమానమీ అంశ! ఈ అంశాన్ని ఉపయోగించటములో జాగ్రత్తకు దారిచూపేది మానవత్వము, అటువంటి మానవత్వము జ్ఞానముతో పశుత్వాన్ని దాని సరిహద్దులలో ఉంచకపోతే, అది

వ్యక్తికిచేసే అపకారము యింతని చెప్పటానికి వీలులేదు. ఆ అంశను యెక్కువగా నిడిస్తే అధఃపతితుడై పోతాడుమానవుడు. పైస్థితికి వెళ్ళడము మంచిదో నీచత్వములోకి పోవడము మంచిదో ఆలోచించండి: ఈ అంశము బొత్తుగా విడవడానికి వీలులేదు. ధర్మ సంతానానికి మూలసూత్రమిదే! కాని ఇది ధర్మబద్ధముగా ఉండడము సాంప్రదాయసిద్ధము! పొరపడడముకూడా మానవుడికి సహజమే! అక్కడనేఉన్నది సంఘాన్ని అభివృద్ధికి తేవలసిన కవికృత్యమూ వ్యక్తి ప్రయత్నమూను. పొరపడవచ్చు! దాన్ని కూడా దిద్దటానికీ ప్రయత్నించడము "కవిబ్రహ్మ" పని! ఎన్ని చెప్పినా మంచిచెడ్డలు ఏక కాలావచ్ఛేదకముగా యెప్పుడూ ఉంటై! అట్లాగే ఈ పశుత్వముకూడానని మనస్సు సరిపెట్టుకుంటే వెళ్లిపోతుంది! కాని, అట్లాకాకుండా, సంఘములో ఉన్న యీకుళ్ళు సహజమని, ఉన్న భిన్నరూపాల నన్నిటిని ప్రచారం చేసి, ఉత్సాహకల్పనముమూలంగా యువతీ యువకుల చిత్తవృత్తులను మాత్రము కలచడము కవిఅయి జ్ఞానవంతు డైనవాడు చెయ్యవలసిన పనికాదు. ◆ఈ ధర్మోప న్యాసము అంతా అప్రస్తుతము. కవి మనము చెప్పినట్టు వింటాడా! అందులో తాను ఇటువంటి సారస్వతానికి కర్తై, సంఘాన్ని ఉద్ధరిస్తున్నాననే 'అహం' ప్రత్యయముతో వ్రాస్తూంటే అతణ్ణి ఆపడం యెవరికి సాధ్యం? శిష్యగణంకూడా దేశంలో పోగైన తర్వాత మ[illegible] కష్టము! కాని యిట్టి అవస్థలో మునిగిపోయి కొట్టుకుంటున్న వాళ్లకు వైరాగ్యముచాలా త్వరగా పట్టుబడుతుంది. "లీలాశుకుడిని" చూడండి. అట్లాగే ఈవిధమైన వ్రాతలు అనేకము వ్రాసిన "చలం"గారు రమణ మహర్షిగారి శిష్యులై చిత్తశాంతి పొందటానికి యత్నిస్తున్నారు. బహుశః లీలాశుకుడివలె ఈయన ముక్తిపొందుతాడని నా నమ్మకము!

'తెలుగుదేశములో గు. వెంకటచలంగారు ప్రసిద్ధులు. వీరి కథలు నాటకములు ఆంధ్రదేశములో పాఠకులు, కొత్తసిద్ధాంతాలవారు పాత సిద్ధాంతాలవారు, ఆతురతతో చదువుతారు-. వెంకటచలంగారికి పాత్రల సంభాషణ వ్రాయుటయందు మంచి నేర్పు

◆ "ఆయన సిద్ధాంతాలు నా మనస్సుకు వేరుగా ఉంటై" అన్నాడు విశ్వనాథ. అంతేగాక స్త్రీకి యెక్కడలేని గౌరవమిచ్చామని చెప్పుకుంటూ ఉంటారు నవ్యులు. అటువంటి దానికి ఈయన వ్రాతలు విపరీతాలుగా ఉంటై! ఈయన వ్రాతలుచూస్తే ప్రపంచంలో శీలమంటూ ఉందా అనేగాక, శీలం అవసరమా అనికూడా అనుమానం కలుగుతుంది. :

కాదు...... ఈ కధలు వయసువస్తూఉన్న స్త్రీపురుషులు చదువతగినవికావు వీటిని చదువుటవల్ల, స్వచ్ఛమై సరళమై పవిత్రమైన ప్రేమాంకురములు పుట్టి విజృంభించి పెరుగనలసిన మనసులలో, తుచ్ఛమై హేయమై నీచాతినీచమైన విషవృక్షాంకురము లుదయించి ప్రబలును...... అసభ్యవర్ణనకు యింతకంటె పరమావధి ఉండదు."

వాళ్లవాళ్లే అనగా ఆయనతో సమానమైన నవ్యులే ఆయన కథలను గురించి ఇట్లా వ్రాయుడముకంటె ఆశ్చర్యమేమైనా ఉందా? †

మొదటి మొదటి కధకులలో పరీక్షించినట్లైతే తర్వాత ఉత్తమ కక్ష్యకు చెందబోతారనే సూచనలను చూపినవాళ్లున్నారు. వాళ్లలో మునిమాణిక్యము, చింతా, మొక్కపాటి, విశ్వనాథగార్లు ముఖ్యులు.* మునిమాణిక్యంవారి కాంతం 1921-22 సంవత్సరమునాటికే పుట్టి పెరిగి పెనిమిటితో సంసారము చేస్తూ, ఆయనచేత 'టీ'ని మాన్పించి నగలు చేయించుకున్నది. ఇంకా తర్వాత యెన్నెన్ని పనులు చేసినదో, యెంత పతిప్రేమగలదో, పాఠకు లెరుగుదురు. కాంతం ప్రతిబింబాలు యింటింటా ఉన్నవి! యిటువంటి కుటుంబకథలు చాలా అరుదుగాఉన్నవి. తాగుడు, వ్యభిచారం, బీదల కష్టనిష్ఠురాలు, యింకా యితర విషయాలు కథావస్తువులుగా వ్రాసినవాళ్ళు చాలామంది ఉన్నారుగాని, ప్రతి సంసారంలో ఉన్న చిల్లర కలలూ, వాటివల్ల కలిగే తాత్కాలిక మనస్తాపాలూ మళ్ళీ అతుక్కోడాలూ, మొత్తంమీద సంసార శకటం సాగుతూఉండి సుఖమిస్తూనేఉండటమూ, ఒకరి చిత్తవృత్తి నొకరు కనిపెట్టి నడుస్తూఉండటమూ, మొదలైన వాటినిగూర్చి రచించినవారు చాలా తక్కువ. ఈవిషయములో మునిమాణిక్యాన్ని చెప్పి మరొకరిని చెప్పవలె.

---

† "చలంగారి కలం" అని కొన్ని కథలు ప్రచురించినారు బందరునించీ.

* 30-7-40 ఆంధ్రపత్రికలో ఇట్లా ఉంది.

"కథానికా రచనలలో చింతావారి మునిమాణిక్యంవారివి స్వతంత్రరచనలు కావనియు" రామానుజరావు నాయుడుగారు.

"చింతా మునిమాణిక్యంవారి రచనలు స్వతంత్రమైనవని తాము రుజువుచేయగల మనిన్నీ' సభాపతిగారు.

కాంతంకథలు 'క్లాసికల్' అయిపోయినై!◆ ఎటువంటి హాస్యరసం! మెత్తనిహృదయంగమమైనది. పానుగంటివారి దానివలె నవ్వించే పద్ధతికీ దీనికీ చాలా భేదమున్నది. ఇంద్రగంటివారిలక్షణము, యీయన కథలకు వర్తింపచేస్తే అచ్చముగా అందులో చెప్పినట్టే ఉంటవి. అందుకనే అంత హృదయంగమా లైనవి! కొందరు "కర్తగారి స్వానుభవాలా యివి" అని భ్రమపడేటంత నిజముగా కనిపిస్తై! పాఠకుడి అనుభవానికి సరిపోయినప్పుడూ, కవిహృదయము ప్రవేశంచేసి రసమాస్వాదించినప్పుడూ, వచ్చే ఆనందమే నిజమైన కావ్యానందము!§

ఈ మార్గములో, లోకవృత్తంలో జరిగే సామాన్య విషయాలను యథాసంభవముగా చిత్రించడములో మొనగాడు మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. (1892)* ఈయన కూడా హాస్యానికి పెట్టిందిపేరు. ఆ హాస్యలోంనూ అతిసూక్ష్మమైనది సుమా! ఈ కాలములోనే బారిష్టరు పార్వతీశానికి పునాదులు వేసియున్నై! ప్రథమసాహితీ దినాలలో యీయన వ్రాసిన "పిలక" అనే కథ చదివితే నవ్వు వస్తునేవున్నావస్తుంది. ఈయన ప్రకృతే హాస్యప్రకృతి.† సామాన్యంగా మాట్లాడుతూ ఉంటేనే చాలా సంతోషముగా ఉంటుందాయనతో!

◆ "కాంతం కథలు", 'నేనూ, మా కాంతం'', "కాంతం కైఫీయతు", "మునిమాణిక్యం కథలు" మొదలైనవి ఈయిన కథాసంపుటాలు. ఇతర నాటకాలు వ్రాసినాడు గాని ఈయన ప్రత్యేకస్థానం కథానికలోనే! యువదంపతుల దగ్గిరనించీ ప్రారంభించి, వృద్ధ దంపతులదాకా, దంపతుల ప్రేమయొక్క క్రమపరిణామం చిత్రించాలనే ఆశించినాడు గాని భార్యమృతి నిరుత్సాహం కలించినట్టు తెలుస్తుంది కాని తిరుమళిగవచ్చి అతని ఉత్సాహాన్ని రేకెత్తించినట్లు తెలుస్తుంది 'హాంబాబ'నే కథా సంపుటి ఒకటి వచ్చింది 'మేరీ కహానీ' అని ఒకటి వచ్చింది

§ ఈ రెండోది మళ్ళీ రెండు మెట్లకింద ఉందని ముందు తెలుసుకుంటాము

* మేమిద్దరం ఒకమారు యేలూరులో జరిగిన ఒక కాంగ్రెసు కమిటీమీటింగుకు వెళ్ళాము మధ్య ఇంటర్వెల్‌లో కాఫీ హోటలుకెళ్ళి కాఫీతాగి బయటకొచ్చేటప్పటికి ఇద్దరు జట్కా వాళ్ళకు పోటీతగిలి, అందులో ఒకతడు "శనివారప్పేట ఎవళ్ళైనా రండి! ఊరికే తీసుకుపోతా" నంటున్నాడు. రెండోవాడు "నేను అరటిపండ్లు ఇస్తానుకూడాను" అంటున్నాడు అప్పుడు మిత్రుడు నరసింహశాస్త్రి "సీతారామయ్యగారూ! శనివారప్పేట వెళదాంరండి ఊరికే తీసు కుపోతాడట!" అన్నాడు. "మనకక్కడేం పనుంది? అనవసరంగా ఎందుకు" అన్నాను. అప్పుడు "మనకిటువంటి బేరం మళ్ళీ వస్తుందా? రండి పోదాం నామాటవిని అని బలవంతం చేయడం సాగించినాడు. పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వొచ్చింది!

† ఈయన 'విముక్తి' అనే వారపత్రికను 1932 లో మొదలుపెట్టి కొన్నాళ్ళు సాహితీ సేవ చేసినాడు.

'రియలిజం ఐడియలిజం' లను బట్టి పరీక్షిస్తే మన నవ్యకవులలో ముప్పాతిక మూడు వంతులు మొదటి మెట్టులో వాళ్ళు; కొద్దిమంది రెండోమెట్టుదాకా వచ్చారేకాని దాన్ని దాటినవాళ్ళు చాలా అరుదు. వాస్తవ జగత్తులోనించీ కాల్పనిక జగత్తుద్వారా అపరోక్షానుభూతిని పొంది పాఠకుని రసానుభవములో ముంచడము ఉత్తమ కవి కృత్యము! వాస్తవానుభవ చిత్రమువల్ల కూడా ఒకవిధమైన ఆనందము కలుగుతుంది. కాని అది క్రిందిమెట్టు. కథకులలో మునిమాణిక్యం మొక్కపాట్యాదులు కలిగించిన ఆనందము ఇట్టిది! సంపూర్ణ రసానుభవము మన ప్రత్యక్షాన్ని దాటిపోయి, కాల్పనిక జగత్తునుకూడా దాటిపోవలె! మనము వెనుక గమనించిన నవ్యత అంతా పాశ్చాత్య వాసనాఫలముగాబట్టి దానిలో సాధకులంతా పాశ్చాత్యులు పోగలిగిన రెండోమెట్టు దగ్గిరకి మాత్రమే పోగలిగినారు. వెనుక మనవిచేసిన బసవరాజు, నండూరు, దేవులపల్లి, వేదుల, దువ్వూరిత్యాదులంతా యిటువంటి చిత్తపరిణతి పొంది, "రసభావస్ఫూర్తిచే బుద్ధియందంకురించి వ్యక్తిగత సంస్కార విశేషము"ను పొందిన సాధకులు. వీరు రెండోమెట్టును చేరినారు. ఇది వాళ్ళ చిత్తపరివర్తనము చేత వాళ్లు కల్పించిన జగత్తు. మనను తీసికొనివెళ్ళి వాళ్ళ కాల్పనికజగత్తులో సంచరింపచేసినారీ మహామహులు. ఇంతమాత్రము చిత్తసంస్కారము మనలో కలగచేసినందుకు వారికి మన వందనాలు! ఖండకావ్య కర్తలో, ఇప్పటికి నేను ఉల్లేఖించిన వాళ్ళలో తృతీయ సోపానానికి మార్గము చూపడములో ఎక్కువగా దారిచూపినవాడు రాయప్రోలు! గట్టిపోలికలు కనిపిస్తవి నాయనిలో! సఖ్యము మననవ్యుల కందరికీ ఉపాదేయమే అయినా, చాలా మంది యీ సఖ్యాన్ని ప్రేయసిద్వారా చూసేవాళ్ళేగాని, ప్రేయసికంటె భిన్నముగా దీన్ని గమనించేవాళ్ళు గారు. * కాబట్టి వాళ్ళకు కేవలం సఖ్యము పరమావధి కాదు. ప్రేయసీప్రణయమే ప్రాప్యము! కాని రాయప్రోలు అట్లాగాక సంయోగ వియోగాత్మక ప్రణయము కంటె సఖ్యాన్ని ప్రణయానికి పరమావధిగా చేసినాడు. చూడండీ విమర్శకవాక్యం!

---

* "మగడు వేల్పన పాతమాటది
ప్రాణమిత్రుడ నీకు.............." (గురజాడ)

"సంసారమున నీ సఖ్య వాత్సల్యాది సంబంధములున్నను రసానుభవము మాత్రము దుర్లభము. ఈ సంబంధములకు రెండు విశేషములు కలవు (1) తరళత (2) ఆనందము. తరళతయనగా సర్వత్ర సంచారము చేయునది, ఆందరిలోను ప్రవేశించునది. ఆనందము సంచరించుచోట సుఖము ఉత్ఫుల్లమగును. సర్వసంచార శీలము, సర్వానందదానము, రసముయొక్క ముఖ్యధర్మములు' ఈ ధర్మములించుక సంసారమునందు గలవు .... ... కాని వానికి వికాసము లేదు ఆ సంబంధములు దేహ ప్రాణ మనఃపర్యంతమైనను పూర్తిగ వ్యాపింపలేకున్నవి. ఇక నతిక్రమింపజాలవని వేరుగ చెప్పనేల? దేహప్రాణమనముల నాక్రమించి, వాని నతిక్రమింపనంతవరకు, వానిని రసములని యనుటకు వీలులేదు.◆ సఖ్యరసమును చూడుడు!..... పంచేంద్రియములును సఖుని బొందుటకు వ్యాకుల పడుచుండును! మనస్సు అవిరాగముగ సఖునిరూపమును ధ్యానించు చుండును! రెండు దేహములలోను ఒక్క ప్రాణమే స్పందించును! సుఖ దుఃఖములందు ఐక్యత యేర్పడును! ...... ... ...ఇంద్రియములకును, అతీంద్రియములకును గల భేదము సమసిపోవును! ఆత్మ దేహధర్మమును బొందును! .. ..... .. ఎవడు సఖ్యరసము నొక్క కణమునైనను ఆస్వాదించునో వానికిది కల్పన కాదు!"◆

ఈ విధముగా ఈయన సఖ్యాన్ని పరమావధిగా దానినే మూడో మెట్టుగా పేర్కొన్నాడు. ఈ ఆనందము వ్యక్తిగత సంస్కారము కాదు! ప్రపంచమంత విశాలము! ఇదే నిజమైన ఉత్తమకవి గ్రహించి మన కందచేసే రసము! రాయప్రోలు పద్యము చూడండి:-

"కులశుభాంగీ వయోధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి,
సాత్వికప్రేమ కోశపేశలములైన
వత్సలామృత రుచులను వలచె నేడు!"

రెండురకాల ఆనందాన్ని ఉల్లేఖించి వాటిలో తనది రెండవదని చెప్పినాడీ కవికుమారుడు. ఇది పరిణత మార్గము!

---

సభాపతిగారి "అజ్ఞాతమిత్రం" ఒకటి ఉన్నది.

◆ ఇదియే కవిసృష్టిలో విలక్షణత. సంసారములకు అనగా బ్రహ్మసృష్టికి సుఖదుఃఖాత్మకమైన అనుభవమే కాని ఆనందరూపమైన రసానుభవము లేదు. కవిసృష్టి యట్టిది కాదు. అందు సుఖదుఃఖములు లేవు.

◆ సమీక్ష.

దీన్ని బట్టి కధానికను పరీక్షిస్తే యీ యుద్ధానంతరదశ వర్షకాలములో వెనక మనవిచేసిన మునిమాణిక్యం, మొక్కపాటి గాక చింతా విశ్వనాధలలో, ఈ తృతీయ సోపానానికి బీజాలు కనపడతవి. ఇద్దరూకూడా మధ్యమెట్టుదగ్గిరకు ఈ కాలములోనే వెళ్ళినవాళ్ళనటానికి కావలసిన తార్కాణాలున్నవి! చింతా దీక్షితులుగారు "శ్యామల" అనే కధలో ఈక్రింది వాక్యాలను వ్రాసినాడు.

"బ్రహ్మసృజించిన వస్తువులందు ప్రణయమే లేకున్న సృష్టి కెంతలోపము ఎచ్చి యుండునో? ........ ఆమె విగ్రహము చూడడమే నాకు తృప్తిగా వుండేది ఆమెతో మాటాడటం సహితం లేదు . ఆమె విగ్రహమును వీక్షించుటకై ఎప్పుడును నేను ఉవ్విళ్ళూరుచూ వుండు వాడను"

అంతేకాక శ్రీధరరావు శ్యామలకు వ్రాసిన ఉత్తరములో "ఈయాదరము స్నేహముగా పరిణమించుటకు నేనాశించుచున్నాను" అని ఉంది. ఇదంతా వెనక చెప్పిన సఖ్యముయొక్క ఛాయే! అంతేకాకుండా ఆకధయొక్క పరిణామము అనగా ఆమె చనిపోయిన తర్వాత శ్రీధరరావు అవివాహితుడుగా ఉండి తన సఖ్యాన్ని జీవితమంతా జ్ఞాపకముంచుకోడముకూడా సఖ్యాన్ని పోషించడమే! కాబట్టి యీయన వ్రాతలో సఖ్యముయొక్క బీజాలున్నవి! ఇక విశ్వనాధను గనుక తలిస్తే ఆయన 1923 నాటికి వ్రాసిన "పరిపూర్తి" అనే కధలో నాయకుడు ఈ సఖ్యవాత్సల్యాలను తన ప్రవర్తనలో చూపించిన ఆదర్శక స్నేహితుడు! నాకొకప్పుడు ఆకధ అసంభవముగా కూడా తోచినది. కాని ఆలోచించగా చంద్రశేఖరుడి పాత్ర అలౌకికముగా ఈ ప్రపంచములో కాకుండా యెక్కడనో ఉన్నట్టు గోచరిస్తుంది! అతని బుద్ధిపరిణతి, స్వార్థరాహిత్యమూ, తోడివారికి ఆనందము కలగజేయవలెననే ఆదర్శమూ, అందులో దైవముచేతవంచించబడిన మందభాగ్యుల యెడల ఆచరణ పూర్వకముగా చూపే అనుకంపా చూస్తేనూ; ఆయన భార్యయొక్క అమాయకత్వమూ, స్వచ్ఛప్రకృతీ, భర్త తానందకత్తె అని చెప్పినప్పుడు వచ్చే సంతోషమూ, మొదలైనవీ చూస్తేనూ; ఒకటి దైవికపాత్రగానూ, రెండవది పసిపిల్ల పాత్రగానూ విజ్ఞాన వైధర్మ్యము కనపడుతుందిగాని, సమన్వయించుకునేటప్పటికి, కల్గే రసానుభూతి మూడోమెట్టుకు దగ్గిరగా ఉన్నట్టు స్పష్టమౌతుంది. నల్లని దేహమూ, యేమాత్రము సౌష్ఠవములేని

అవయవ విన్యాసమూ, తుదకు గుడ్డితనమూ, కలిగిన స్త్రీని పరిణయము కావడములోనే చంద్రశేఖరుడి వైశిష్ట్యమూ, చిత్త పరిణామమూ కనపడుతుంది. పెద్దఆస్తి వస్తుందని గానీ మరే ప్రతిఫలాశ లేదు! కేవలము దైవోపహతురాలికి సంతోషము కలిగించటమే ఆశయము! సంతోషము కలిగించటమేగాక హృదయపూర్వకముగా ప్రేమించడము అతని పాత్రకు ఎక్కడలేని ఔన్నత్యము కలిగించినది.* ఈ విధముగా మొదలు పెట్టినది ఈయన భావౌన్నత్యము:

ఈ సఖ్యము ఎక్కడిదా అని భ్రమపడవద్దు! ఈ నవ్యులు నూతనముగా దీన్ని కనిపెట్టలేదని వెనకటి విమర్శకుడి వ్రాతలేసాక్ష్యము, కాని ఈ నవ్యులు దానికి ప్రాముఖ్యమిచ్చినారు. మన లాక్షణికులు రససంఖ్యా నిర్వచనములో మూడు తెగలుగా ఉన్నారు. అష్టరస వాదులు, నవరసవాదులు, దశరసవాదులు. భరతుడు అష్టరసవాది. తర్వాత కొందరు తొమ్మిదికి మరిఒక భక్తిని కలిపి పదిరసాలు చేసినారు. ఈ భక్తికి వాత్సల్యాన్ని స్థాయిభావము చేసినారు. ఇదే రూపాంతరములో సఖ్యమైనది. దీన్నే పోతనమహాకవి "తనుహృద్భాషల సఖ్యము" అన్నాడు ప్రహ్లాదుడి విషయములో! అందుచేత "సఖ్యం" పదోరసమైనది. దీనిని నవ్యులు గ్రహించినారు. దీనికిటీవల చాలా గొప్పదనము వచ్చినది! చైతన్యమతములో భక్తీ, విశిష్టాద్వైతములో శేషశేషిభావమూ, క్రైస్తవ బ్రహ్మ సమాజమతాలలో "Doctrine of Divine Spouse" అనేదీ, యీ సిద్ధాంతము యొక్క రూపాంతరాలే! వెనకటితరములో ఈవిధమైన భక్తివాత్సల్యాలకు పానుగంటివారి "రాధాకృష్ణ" ప్రసిద్ధి చెందినది. అక్కడ భక్తి రూపముగా ఉన్నది యిప్పుడు "సఖ్య" మైనది, స్థాయీభావమొక్కటే "వాత్సల్యము' వీటి రెండిటికీ! ఇది రసానుభావానికి తుదిమెట్టు, సంయోగముకంటె విప్రలంభము

---

* ఇక్కడ చంద్రశేఖరుడియొక్క భోగము కేవల మానుషంగికమే గనక అప్రధానము ఇతరులకు ఆనంద ప్రదానము చేయవలెననే యిచ్ఛ స్వసుఖాన్ని అతిక్రమించినది! తర్వాత యీయన "ఏకవీర" అనే పేరుతో వ్రాసిన భావపూర్ణమైన నవలలో ప్రణయము సఖ్యముగా మారడము ఒకవైపూ, దానినించీ చ్యుతమైనందుకు పాపాన్ని కడిగివేయడానికి జలార్పణము చేసుకోవడము మరోవైపూ చిత్రించినాడు.

గొప్పది! దాన్ని మన నవ్యులు చాలామంది గ్రహించినారు. అంతకంటె గొప్పది సఖ్యము! వెనక నే నుల్లేఖించిన అమలిన శృంగారము ఇటువంటిదే! ఈ అమలిన శృంగారాన్నే (స్త్రీ పురుషుల మధ్యైనప్పటికీ కామవివర్జితమైతే) సఖ్య మనవచ్చు. ఇటువంటి సఖ్యమే వెనకటి విమర్శక వాక్యములో ఉల్లేఖించినది. ※ కాబట్టి సారాంశ మేమిటంటే, అమలిన శృంగారమన్నా, సఖ్యమన్నా, భక్తి అన్నా, పాత్రభేదమేగాని, అనుభవించే రస మొక్కటేనని సమన్వయము! ఈ రసానుభూతిలో, గ్రంధము పఠించే సహృదయుడికేగాక, పాత్రకుకూడా సుఖమేగాని దుఃఖస్పర్శే లేదు! ఆ సుఖము కూడా శాశ్వత సుఖమువంటిదే!సృష్టి, పాత్రలు, సహృదయులు అందరికీ ఆనందానుభూతే! ఇంతకంటె కవిసృష్టికి వైలక్షణ్యము ఉన్నదా? "హ్లాదైకమయీం" అనే లాక్షణికుడి వాక్యానికిదే అర్థము! ఇది కావ్యానికి పరమపరీక్ష! చలముగారి రచన అంతా విమర్శక వాక్యము ప్రకారము 'ఆర్యధర్మచ్యుతము" కాని అక్కడక్కడా రసానుభవముయొక్క మెట్లలో యేదైనాతగులుతున్నందునదానికికూడా కావ్యత్వసిద్ధి ఉన్నది. మొదటి మెట్టు తరుచు తగులుతూ ఉంటుంది.

'సాహితీ' ప్రథమసంచికలలో 'శతావధాని శివరామకవి' అనే పేరుతో కొన్ని గీతాలున్నవి. ఈరచయిత వేలూరి శివరామశాస్త్రి గారని నా ఊహ. అయితే ఈ నవ్యమార్గములోకి యీ కాలానికి యీయన కూడా వస్తున్నారని తేలుతుంది, తర్వాత యీయన కథానికలను గ్రహించి సాధన చేసినట్లు, మనకు తెలుసు. ఈ ప్రథమ గీతాలలో ఈయన ద్విపదను గ్రహించినాడు.

'సాహితి' లో వ్రాయని ఒక కధకుడిని ప్రశంసించవలె, ఇక్కడ ఈయన

---

※ భక్తుడి యెడల పరమేశ్వరుడు సఖ్యాన్ని చూపుతాడు.కుచేలుడే దీనికి తార్కాణము. పరమేశ్వరసాన్నిధ్యమెట్లా విడువలేడో, భక్తసాన్నిధ్యము పరమేశ్వరుడూ వదలలేడు.

"నా హం వసామి వైకుంఠే న యోగిహృదయే రవౌ,
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద!"

చూసినారా పరమేశ్వరుడు భక్త ప్రియుడు!

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు: కథాకథనములో సిద్ధహస్తుడు.* ప్రబుద్ధాంధ్ర పత్రికకూ ఈయనకూ అవినాభావ సంబంధము. ఈయన "ఆంధ్రోద్యమము" లో మునిగిపోయిన వ్యక్తి. భారతస్వరాజ్యము రాకపోయినా ఆంధ్రరాష్ట్రము వస్తే చాలనేవారు. ఈయన కథలు ఆంధ్రదేశములో అభిరుచికలిగించినది. 1921 నాటికే "శ్మశానవాటికా" నవలలూ, అనేక పూర్వరాజుల కథలూవ్రాసి ప్రశస్తిని పొందినాడు. తర్వాతతరములో శాస్త్రసమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణముగా, ఉత్సాహముకలుగచేసేటట్లూ, పూర్తిగా చదివిన తర్వాత వెంటనే మరవకుండా కొంతకాలం మననంచేసేటట్లూ వ్రాయగలసమర్థుడు. ఈయన ఆంధ్రరాజుల అనేక సన్నివేశాలను కథలుగా అల్లి ఆంధ్రాభిమానము కలగజేసినాడు. "(వీరి) సంఘసంస్కారమూ, ఆంధ్రరాష్ట్రమూ, ఈ రెంటినీ కలిపి వ్రాసినకథలూ వ్యాసాలూ భాషాదృష్టితో చూస్తే వాడుకభాషకు క్రొత్త అలంకారాలు,' అన్నాడు విశ్వనాథ. ఈయన "వారకాంత" వంటి సాంఘిక నాటకాలూ, "వీరపూజ" అనే క్షాత్రముతో నిండిన సంపుటి వంటి గద్యగ్రంథాలూ, రచించినాడు. ఈయన "ప్రబుద్ధాంధ్ర" అనేకజన్మల నెత్తినది, దేశములో ఆంధ్రాభిమానము కలగ జేసిన పత్రిక!

## "శారద" సాహిత్యానువృత్తి:

పూర్తిగా సాహితీ పత్రిక అంతరించక పూర్వమూ కొంతవరకు తర్వాతాకూడా "శారద" వీళ్ళకు స్థానమిచ్చినది. వెనుకటివారు కొందరూ, కొందరు కొత్త వాళ్ళుకూడా యీ మార్గానుయాయులు కనపడతారు ఇందులో. వెనకటి వాళ్ళలో ప్రథమవింశతి వర్షాలలో' వ్రాసి తర్వాత ఆగిన అబ్బూరి మళ్ళీ కొంచెము గొణిగినాడు. 'ఎర్రగన్నేరు" అనే పేరుతో పద్యావళి వ్రాసినాడు, విశ్వనాథ, అడివి, బాగా తేలుతున్నారు.

---

ఈయన కలాభివర్ధనీ పరిషత్తు తరపున తన కలంపోటు, వారకాంత, వీరపూజ, తల్లి ప్రాణం, చిన్ని కవులు ఇత్యాది పుస్తకాల్ని అచ్చువేసినాడు.

'చిన్నికథలు' అనే పేరుతో కొన్ని ప్రచురించినాడు ఇందులోనివి పెద్దకథలే. 'ఆత్మబలి' అనే నవలొకటి 'వడ్లగింజలు' అనే నవల ఆంధ్రవారపత్రికలో కథల సంపుటి ఒకటి వచ్చింది.

* చూ మార్చి 47 భారతిలో ముద్దా విశ్వనాథంగారి వ్యాసం

"శారద"లో అడివిగారి 'హిమబిందు' అనే నవల ప్రచురణం కావడము మొదలెట్టినది. విశ్వనాథ పత్రిక లలో క్వాచిత్కముగా కనపడ్డా "ఆంధ్రప్రశస్తి" "కిన్నెరసానీ" యింకా యితర కావ్యాలు వ్రాసిన కాలమిదే!◆ విశ్వనాథ మొదటి కావ్యము నేను చదివినది, ముత్తరాజు సుబ్బారావుగారి నిర్యాణమైన తర్వాత అయనపైన వ్రాసిన "బాష్పాంజలి".* **ముత్తరాజుసుబ్బారావుగారీయన** గురువులలో ఒకరు. ఈయనకే గాక అనేకులకు ఆయన సహృదయత్వమూ, నాట్యకళాభినివేశమూ మొదలైనవి కలగజేసినాడు. పింగళివారు, మొదలైనవారు చాలామంది వాస్తో కూస్తో ఆయన ప్రోద్బలముకలవాళ్ళే! ఈ సుబ్బారావుగారు స్వయముగా కవి. శ్రీకృష్ణతులాభారేత్యాది నాటకాలు వ్రాసినాడు. ఈయన "తులాభారం" యిప్పుడు చాలా ప్రశస్తిలో ఉన్నది.

◆ ఒకమారు తెనాలిలో తమ కావ్యగానము జరిపినారు. అప్పుడు నేను తెనాలిలో వృత్తిలో ఉన్నాను. నేనాసభకు అగ్రాసనాధిపత్యము వహించినాను ఎసు కావ్యాలలోనుంచీ అనేక భాగాలు చదివినారు అప్పటికింకా యీ నవీనమార్గములో నాకు పూర్తి లభినివేశము కలగకపోవడము చేతా, ఆయన వ్రాసిన కొన్ని కృతులు సంకేతాలలో నిండి ఉండడముచేతా నాటిలో ఉండే రసాన్ని నేను అస్వాదించలేక పోయినాను. అది నా లోపమేకాని కవిది మాత్రముకాదు సంపూర్ణ సహృదయత్వము సంపాదించుకుని మరొకమారు తత్కావ్య పఠనముచేత నిజమైన సహృదయత్వము కొంచెముగా అలవడ్డప్పుడు ఆయన కావ్యాలు చదివి చాలా ఆనందాన్ని పొందినాను. (కు.పి)

"ఆధునిక కాంధ్ర సారస్వతములో కృష్ణశాస్త్రి, నాయని, రాయప్రోలు, విశ్వనాథ ఆదిగా అరుదుగా వున్నారు కవులు. కాకిబంగారం మెరుపుతో కూర్చిన పద్యసంపుటమును కావ్యం అనమంటే అనలేం!" **(హనుమదింద్రగంటి)**

* ఇంతకు చాలా పూర్వమే 1912-13 సంవత్సరము నాటినించే కవిత చెబుతూ చక్కని ఖండకావ్యాలను వ్రాసినట్టు విన్నాను సాహితి సం 5సం.1లో 'నాపాట' అని ఒక గీతమున్నది అది విశ్వనాథ సత్యనారాయణశాస్త్రి అని పేరుతో ఉన్నది. నానమ్మక మీయనదేనని అపాట చదివితే అప్పటికింకా విరివిగా కావ్యగానము చేయనట్టు కనపడుతున్నది. గీతి ఉత్పన్నమై తన్నే వరించినదట! ప్రకృతిలో నిలవలేక పోయినదట! బహుశః బయటికి రావాలెనని శ్రమపడే రోజులని తోస్తుంది. "ఉపసంహృతమైన యస్త్రమట్లు', అనే బింబ ప్రతిబింబ భావముతో కూడిన పూర్ణోపమ సత్యనారాయణగారిదే యీ గీతమని కొంతవరకు ధృవపరుస్తున్నది. వైదికోపమలూ, మొదలైనవి యీయనలో విశిష్టాలు! ముత్తరాజు సుబ్బారావుగారిమీద వ్రాసినదీ యిదీ ఒక్కకాలానివే' అప్పటికే యీయన కవిత్వానికి సహజగుణమైన క్లిష్టత పొడగట్టుతున్నది "ముషిత బుద్ధి" అనే గీతము చూడండి!

"రాజ్యశ్రీ" అనే నాటకముకూడా బందరులో ప్రదర్శిస్తే చూచినాను. ఈయన నవ్యులలో కొంతమందికి చిత్తవికాసము కలగ జేసినవాడు. విశ్వనాథ తన కృతజ్ఞతను, గురుబుణాన్ని "బాష్పాంజలి"ని సమర్పించి తీర్చుకున్నాడు. ఈ కాలములో దువ్వూరి పెనుమర్తులు యింకా వ్రాస్తూనే ఉన్నారు. ఈ పేర్లిచ్చినవాళ్ళుగాక కొందరు నూతనులున్నారు. తర్వాత వాళ్ళను కూడా ఆంధ్రదేశము కొందరినిబాగా ఎరుగును. సన్నిధానం, కవికొండల, పంచాగ్నుల, నాళం మొదలైనవారు ఆంధ్ర దేశములో ప్రశస్తిపొందినవారే! వీరిలో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారిని గూర్చి వెనక మనవి చేసినాను. వీరు తమ వ్యాసరచనచేతా, తమసాన్నిధ్యసహాకారాల చేతా, నవ్యకవితకు గౌరవమిచ్చిన రసావేశము గల వ్యక్తి. పండితులు నవ్యసాహిత్యానికి నైచ్యాపాదనచేసే రోజులలో తానీ నవ్యులకు బాసటై నిలిచి, తమ శాస్త్రజ్ఞానాన్ని తద్రక్షణకొరకై వినియోగించిన సహృదయులు. వీరాకాలములో చేసిన సనిక"ర్మ ఉదాహరణము చాలు! వీరు వాత్స్యాయన కామసూత్రాలను సవ్యాఖ్యానముగా సోదాహరణముగా, అనేక నూతన విషయాలతో వ్రాసి అచ్చు ప్రారంభించినారు.◆ ఈసంగతి తెలిసి అనేకులు వీరి కార్యభంగము చెయ్యడానికి ప్రయత్నించినారు. వారిలో ఎవ్వరెవ్వరున్నారో మన కప్రస్తుతము. ఆదినాలలో శృంగారము సచ్చిగా ఉన్న గ్రంధాలు ప్రకటించకూడదనీ, అమ్మకూడదనీ ఒకవేళ అట్లా చెయ్యనలసివస్తే, అటువంటి భాగాలు లేకుండా చెయ్యవలెననీ కొందరు మహానుభావులు ప్రభుత్వానికి పురికొల్పి సర్కారుచేత ఉత్తరువులను ప్యాసు చేయించినారు.✻ దీనిక్రింద తారాశశాంక

◆ "ఆర్యభారతీ గ్రంధమాలిక"ని ఒకటి స్థాపించినారు దీనిలో రాజశేఖర కవిరాజు విరచితమైన గ్రంధాన్ని "కావ్య మీమాంస"నే పేరుతో అనువదించినారు

✻ "About 30 years ago there was a Government Telugu translator who in consequence of an unhappy domestic occurance, resorted to an instensive drive against obscenity. Classical works in Telugu became forbidden literature. Their Publishers were faced with prosecutions. In one instance the magestrate below acquitted the publisher. Government appealed to the High Court and secured a conviction. Another publisher who made profits out of obscenite had his wings clipped by an undertaking to publish expurgated dyitions only There was trouble over the undertaking Telugu authors and petrons went on a deputation to Governor Zeal to demolish literature in the interst of morals proved a passing phase. (Indian Express, 8-5-1941)

విజయమూ, రాధికాసాంత్వనమూ, శుకసప్తతికథలూ, వైజయంతీ విలాసమూ, తుదకు తిరుపతి వెంకటేశ్వరుల శ్రవణానందమూకూడా - నిషిద్ధములైనవి! చూచినారా మనవాళ్ళ తెలివీ, భాషాసేవా! ఇంతక్రిందికిదిగినది. ఉద్గ్రంథాలన్నీ ఉలుంకులతో ప్రచురణము కావలసివచ్చినది. పూర్వకవులమీద కూడా చెలాయించారీమహామహులు అధికారాన్ని! వాత్స్యాయన కామసూత్రాలచ్చొతున్నవని, ఆగ్రంథము ప్రచురణము కాగానే నిషేధించటానికి ఉత్తర్వువ్రాసి సిద్ధముచేయించినారు అధికార్లచేత! శాస్త్రిగారు చాలా రహస్యముగా తన పనిని నిర్వర్తించినారు. తమరు స్వయముగా అచ్చుకూర్పు చేసి దాన్ని ఒక మిషన్ మీద అచ్చేయించుకుని ఈవిధముగా పుస్తకము పూర్తిచేసినారు. చాలా ఖర్చైనది. దానికి 10 రూపాయలు విలువుఉంచి, ప్రకటించడానికి పూర్వమే కొన్ని ప్రతులు స్నేహితులకు విక్రయించి, కొంత ధనము సేకరించుకున్నారు. ఇప్పటికీ చాలా ప్రతులు మిగిలిపోయినై! వీరు శ్రమపడకపోతే ఈగ్రంథము బయటకు వచ్చేదికాదని నేను గట్టిగా చెప్పగలను! ఇప్పుడు ఆ నిషేధమంతా తొలిగిపోయినది. ఒక్క మారా గ్రంథము చదివితే, అనేక నూతనాంశాలతో కూడినదని ప్రతివాళ్ళకూ తెలుస్తుంది. ఆ గ్రంథము ప్రచురించినందులకు ఆంధ్ర దేశము వారికి కృతజ్ఞమై ఉండవలె! ఇదే గాక గౌతమధర్మ సూత్రాలను సర్వమంగళ వ్యాఖ్యతో ప్రచురించినారు. ఆ గ్రంధానికి శాస్త్రిగారు వ్రాసినపీఠికను చదివితే నూతనవిషయా లనేకాలను నేర్చుకోవచ్చు. శాస్త్రిగారి పాండిత్యము అపారము. ఇది ఆయన్ను నవ్యమార్గమునుంచి విముఖుడిని చెయ్యకపోవడము చాలా ప్రశంసకు తగిన విషయము. ఇది వారి హృదయ పరిణతిని తెలియచేస్తుంది. వీరినిగూర్చి విశ్వనాథ అన్న మాటల నిక్కడ అనువదిస్తున్నాను:

"ఆదినారాయణశాస్త్రిగారు పండితులు. వాడుకభాషావాదులు తెలుగుకవులనుగురించి ఒక మెచ్చుకునే గీతం వ్రాశారు. ధృతరాష్ట్రుని పశ్చాత్తాపమని ఒక గేయం వ్రాశారు. కాని జైనుల మతకధలు అని వ్రాశారు. ఆ కధలలో ఉన్న వాడుకభాష దానికదేసాటి! అవి ఇంకా వ్రాసి పుస్తకరూపముగా ప్రకటిస్తే సంస్కృతములో ఆచార్యదండి కేస్థానముందో, వాడుకభాషలో ఆదినారాయణశాస్త్రిగారి కాస్థానం ఉంటుంది."

కవికొండలవారు◆ (1892) జననం. ప్రథమ సాహితీసంచికలలో ఎక్కువగా వ్రాసినట్టు కనపడదు. కాని ఈయన మొదటినుంచీ ఈ నవ్యసారస్వతముతో ఉఱ్ఱూతలూగినవాడే! ఈయన గీతం, కథ, ఖండకావ్యం, అన్నీ సాధించినవాడే! విశ్వనాథ ఇట్లా అన్నాడీయన్నుగూర్చి.

"ఈయన వ్రాయని పద్ధతి లేదు ఆయన కవిత్వములో గొప్ప ప్రకృతి పరిశీలన ఉంటుంది గోదావరిజిల్లా పాటకజనం 'యాస' ఉంటుంది. సూక్ష్మతమమై గ్రహించరాని భావుకత్వం ఉంటుంది."

ఈయనలో కూడా వెనక నేను మనవిచేసిన గూఢత కనపడుతుంది. ఈయన కూడా దాఁపు ముప్పైసంవత్సరాలనించీ తన వృత్తిలో ఉంటూ, తమ సాహిత్యముతో ఆంధ్రదేశాన్ని రసాస్వాదము చేయిస్తూ ఉన్న వ్యక్తి!

సన్నిధానం పండితుడు. ఈయనకూడా దాదాపు ఇరవై సంవత్సరాలనించీ వ్రాస్తున్న వాడే! § కొన్ని ఖండకావ్యాలు వ్రాసినాడు. తాను నవ్యుడనుకోకుండా, నవ్యులలో ఉండే నవ్యతకు నవ్వుతూ, తన్మార్గములో ప్రవర్తించిన వ్యక్తి! ఈయన పాండిత్యము నవ్యతను గ్రహించడానికొక ప్రతిబంధకమైనది. మిగిలినవాళ్ళలో దేన్ని నవ్యత అన్నామో అది ఈయన ఖండకావ్యాలలో ఉన్నది కాని దాన్ని

---

◆ 'ఈయన బొబ్బిలిపాట' బాగా పాడతాడు జనపదములు, మాతృదేశసంకీర్తనము, కలరుతము, **కుమారకంఠము**, చదువులదుత్త, కోనేరు, చిట్టికైత, ఆగడపలు, త్రయిప్రకృతి చందనము, ఆత్మవ్యక్తి - నెలబాలుడు, జంటలు-పొట్టికత, వివిధకుసుమావళి, విప్రసందేశము. మొదలైనవెన్నో రచించినాడు

కవికొండల ఇప్పటికీ వినోది.. నుంచి భారతిదాకా అన్నిపత్రికలకూ రచనలు పంపుతూనే ఉంటాడు. చాలనిస్సారముగా కూడా పరిణమిస్తున్నవి. ఇది శోచనీయము.

10-9-40 తేది ఆంధ్రపత్రికలో కవికొండలవారు తమనుగూర్చి ఇట్లా చెప్పుకున్నట్టుంది. "ఆంధ్రోద్యమము, బీసెంటు గారిచే నడపబడిన హోంరూలుద్యమము, తమలో స్వాతంత్ర్యబీజములను నాటినవనియు, తను భావములను గీతములద్వారా లోకమునకు తెలియబరచుకొంటిననియు నుడివిరి '

§ సాహితిలో "బాల్యస్మృతి" అనేపేరుతో ఒక ఖండకావ్యము వ్రాసినాడు. పరమేశ్వరసాన్నిధ్యాన్ని కోరుతున్నా డీయన ఈ గీతములో!

తెలుసుకోలేకుండా ఉన్నాడు * "ముండ్లకొమ్మ" మీద ఒక ఖండకావ్యము రచించడములో దాని స్వగతము కొంచెమున్నది. అవి ముండ్లకంప భావాలా, తనవా? ఈవిధముగా తాను పరోక్షుడి ననుకుంటూ వ్రాసిన భావాలన్నీ తనవి కావని భ్రమపడుతున్న వ్యక్తి! ఈయనకు కూడా కొన్ని సన్నివేశాలలో చిత్తవికారము కలిగి ఖండకావ్యముగా వెలువడ్డట్టు స్పష్టము. "పువ్వులతోట" "కావ్యమంజరి" చదివితే ఈ సంగతి స్పష్టమౌతుంది. ఈయన గోవర్ధనాచార్య సప్తశతిని తెనుగులోకి పరివర్తనము చేసినాడు. చక్కని గ్రాంధిక భాష వ్రాస్తాడు. ఈయన నవ్యతను గ్రహించకపోవడానికీయన తృణకంకణం మీద వ్రాసిన విమర్శనమే సాక్ష్యము. అది చదివితే యీయన శుష్కవైయాకరణిలాగా కనిపిస్తాడు. కాని చిత్తసంస్కారమున్నట్టు తనకు తెలియనివ్యక్తి. ఈయన భాషకుచేసిన వేరేసేవ చెప్పుకోడానికి మళ్లా తావువస్తుంది! "నడుమంత్రపుసిరి" అనే ఖండకావ్యాన్ని యెవరినో ఉద్దేశించి అన్యాపదేశముగా వ్రాసినాడని ఒక ప్రతీతిఉన్నది. ఈయన నవ్యకవిత్వానికి ప్రత్యర్థిగా వ్రాసేవాళ్ళల్లో ఒకడు. ప్రాచీనములోఉన్న రసాన్ని గ్రహించగలడని యీయన వ్యాసాలే సాక్షి. ఈయన నవ్య సాహిత్యంలో ఉన్న రసాన్ని గ్రహించలేకపోయినట్టు కనపడతాడు. ¶

---

* జూలై 1927 భారతిలో 'సినిమాప్రదర్శనమ'ని వ్రాసినాడు. ఒక పున్నమి రేయి మేడమీదకూర్చుండ కండ్లాకసమువంక, చంద్రుడును, వచ్చుచు పోవుమేఘములను చక్కని ఉపమానములతో నెవరో తెరమీద మంత్రగానివలె చూచినానని యానందించితినని చెప్పినాడు ఇదే భావకవిత్వము.

¶ "రసము, రసజ్ఞత, తెలిస్తే శబ్దం చేత వాచ్యమైనా అవాచ్యమైనా, అలంకారములు హెచ్చుగా ఉన్నా తగ్గుగాఉన్నా కవిత్వములోఉండే అందాన్నీ ఆనందాన్ని గ్రోలగల్గుతాము రసమనేది హృదయంలోకాక కవిత్వం కుంటుగా ఉందనటం సరికాదు" అన్నాడు విశ్వనాథ ఒకమారు (ఆంధ్రపత్రిక 22-9-40) ఈమాటలు సన్నిధానం వారికి వర్తించవు. ఈయన తప్పక సహృదయుడే! కాని తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళని బుద్ధిపూర్వకముగా హృదయము విముఖము చేసుకున్నట్టు ఒకప్పుడు తోస్తుంది!

"A book that a person of education and good taste does not care to read more than once is very probably not worth much. But we cannot consider the judgment of a single individual infallible ... For ever the gratest critics are apt to have a certain dulnesses certain inappreciations" (Lafcadis Hearn)

నాళం కృష్ణారావుగారు నిష్ణాతుడైన కవి. ఈయన కావ్యాలు దాదాపు 30 సంవత్సరాలనించీ ఆంధ్రదేశములో ప్రచారములో ఉన్నవి. చక్కని రసవంతమైన భాష. నా చిన్నతనములో "ఆంధ్రమే" అనే మకుటముతో ఆంధ్రదేశముయొక్క గొప్పదనము తెల్పుతూ వ్రాసిన పద్యాలు పునః పునః పఠించేవాడిని. ఈయన వైశ్యజాతికి మకుటాయమానుడు. లక్ష్మీపుత్రుడు, సారస్వతవేది, తర్వాత నవ్యపథసంచారము చేసి సిద్ధిపొందినవాడు. రాజమహేంద్రవరములో ప్రతి సారస్వతోద్యమములో ఈయన తప్పక పాల్గొంటూ ఉంటాడు.

ఈయన చేసిన సారస్వతసేవలో "గౌతమీ గ్రంథాలయ" సేవ చాలాగొప్పది. దానికొరకాయన తన ధనాన్నీ, కాలాన్ని, పలుకుబడినీ వినియోగించి దాన్ని చిరస్థాయి చేసినాడు! అదే ఈయన భావిశరీరం! ఈయన గొప్ప సంఘసంస్కారి. "దేశమాత పరిదేవనము" "భక్త సంజీవని" మొదలైన గ్రంథాల ననేకాలను రచించినాడు. ఈయన న్యాయముగా ప్రాచీనమార్గములో ఉండదగినవాడు. కాని కొందరివలె నవ్యతను చూపినాడు. ఖండకావ్యాన్ని సాధించినాడు.*

ఈయనకు దేశము "మధురకవి" అనే బిరుదిచ్చినది. ఇది చాలా నిజము. మధుర గీతికలక్రింద యీయన కావ్యాలన్నీ గోరుముద్దలు, వెన్నబుడగలు, తేనెచినుకులు, దీపావళి, ముద్దు, విరిదండ కొన్ని సంపుటాలుగా ప్రచురింపబడ్డై! ఈయనకు షష్టిపూర్తి మహోత్సవము జరిపి చరితార్థమైనది ఆంధ్రదేశము! చక్కని గద్యపద్య వ్యాససంపుటి "కృష్ణరాయాభ్యుదయ సంచిక" అనే పేరుతో ప్రచురించి

---

* ఈయన నిరాడంబరజీవి చూడండి "చిన్ని పువ్వు" అనే ఖండకావ్యములో

"వన్నె చిన్నెలుగల పువ్వు వ్వియున్న
నిన్నె ప్రేమింతు మనసార చిన్నిపువ్వ!
నీ నిరాడంబరవివిక్త నిష్కలంక
జీవనంబును నలవడజేసి కొనగ" అన్నాడు.

ఇంతేగాక 'తెలుగు సామెతలు' అని సామెతలకు తెలుగు కావ్యాలలో నుంచి ప్రయోగాలతో సంపాదించి భాషాసేవ చేసినాడు

'కృష్ణకుమారి' అనే పేరుతో ఈయన కుమార్తె కూడా ఉభయభాషాప్రవీణ స్యాసై సారస్వతసేవ చేస్తున్నది

యీయన్ను బహూకరించినారు! కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి సోదరులు "కృష్ణ మహస్సు" అనే పేరుతో ఒక కావ్యాన్ని నాళంవారికి అంకితం ఇచ్చినారు. ◆

నే నెన్న డెరుగని విషయము ఒకటి కనపడ్డది "శారద" పాత సంచికలను తిరగేస్తూంటే! నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు గారు ఖండకావ్యాన్ని సాధించడము ఆశ్చర్యకరము! సముద్రాన్నుద్బోధిస్తూ, "సంద్రమా! తెల్పు నీఘోషసారమంత"! అనే మకుటముతో ఒక,ఖండకావ్యము వ్రాసినాడు. ఇంకా "మంగళగిరి లక్ష్మీ నృసింహ స్తోత్రమని ఒక స్తోత్రాన్ని కూడా రచించినాడు. "పూని గోవిందుభజించు మూఢ మనస" అనే మకుటముతో శంకరాచార్యుల వారి "భజగోవిందా"న్ని భాషాంతరీక రించినాడు§ పద్యాలు చక్కగానే ఉన్నాయి. ఆంధ్రరత్నంగాలి ఊరికేపోలేదు. కవిత్వము చెప్పించిన దీయనచేత. ఈవిధముగా "శారద" ఈసాహిత్యానికి చోటిచ్చినది.

# భారతి - సాహిత్యసాధన

1924 సంవత్సరము జనవరి నెలనించీ విశ్వదాతగారు "భారతి"ని స్థాపించినారు. ఈభారతీ స్థాపనం ఈ నవ్యసాహిత్యానికి ఒక గొప్ప ఉత్సవము. కృష్ణాపత్రికకూడా ఇంతకాలమూ ఈ నవ్యకవితకు ప్రోత్సాహమిస్తూనే ఉన్నది. ఈ 25 సంవత్సరాలనించీ ఈ పత్రిక ముట్నూరికృష్ణారావుగారి పోషకత్వముక్రింద ఈ నూతనకవిత కిచ్చిన దోహదానికి విలువ లేదు. ఆయన స్వయముగా గొప్ప విమర్శకుడు. ఆయన అప్పుడప్పుడు వ్రాసిన విమర్శక వ్యాసాలు కొన్ని 1937 సంవత్సరములో "సమీక్ష" అనే పేరుతో ఒక సంపుటిగా ప్రకటించినాడు. భారతసారస్వత విశిష్టత "సమీక్ష"లో

---

◆ నాళంవారి కవిత్వంమీద పిల్లలమర్రి వేంకట హనుమంతరావు, శ్రీపాదగోపాలకృష్ణ మూర్తి కొమరవోలు వెంకటసుబ్బారావుగారలు ఈ సంచికలో వ్యాసాలు వ్రాసినారు

§ రాయప్రోలువారు 1925లో తన పినతల్లికోర్కెపై భజగోవింద శ్లోకాలు కొన్ని అనువదించినాడు దివ్యవాణి విజయసంచికలో అచ్చైనవి వావిలాలవాసుదేవ శాస్త్రి 'ముముక్షుతారక' మను పేర భజగోవింద శ్లోకాన్ని 1874లో తెన్గించినాడు. ఈకాలానికే వడ్డాదికవియు ఆంధ్రీకరించినాడు. సూరాబత్తుల సూర్యనారాయణ అనే అతను గీతగోవిందాన్ని తెన్గించినాడు.

చిత్రించినట్లు ఎవ్వరూ చెప్పలేదు. ప్రాచ్య పాశ్చాత్య ప్రణయ సిద్ధాంతాలూ, రససిద్ధాంతాలూ, తారతమ్య చర్చచేసి, ఉదాహరణ పూర్వకముగా వ్రాసి భాషకు మహోపకారముచేసినాడు. ఇప్పుడు భాషలో ఉండే గొప్ప విమర్శన గ్రంధాలలో యిదిఒకటి. యీయన ప్రాపున చాలామంది నవ్యకవులు తమ రచనలను సాగించినారు. ఈ కృష్ణాపత్రికకు బాసటగా సాహితీ, శారదలు పనిచేసి అస్తమించినవి. భారతి బయలుదేరినది. మొదటినించీగూడా యీపత్రిక నడకే గాక అచ్చు, మొదలైనవి కూడా చక్కని పోలికలతో ఉన్నవి! కాకినాడలో దేశీయమహాసభ జరుగుతుండగా భారతి ప్రధమసంచిక వచ్చింది.◆ ఇప్పటినించీ యీ భారతీపత్రిక ద్వారా బయటికి వచ్చిన సాధకులను గూర్చి ముచ్చటించుకుందాము.

"భారతి" పత్రిక తీసి అప్పటిసంచికలు అనగా 1924-30 లకు సంబంధించినవి గనుక చూస్తే యీ ఖండకావ్యమనే "అంటు జాడ్యం" పెద్దలకు కూడా తగిలినట్లు కనపడుతుంది. ప్రభవ అశ్వయుజమాస సంచికలో కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారొక ఖండకావ్యం "కోకిల" మీద రచించినట్టుంది. ఈపద్ధతిని వారామోదించినట్టే యిది తార్కాణము. ఇది యేమీ ఆశ్చర్యములేదు. సలక్షణ భాషలో కావ్యము "మహా" గానీ "ఖండం" గానీ రచిస్తే యెవ్వరి కేమీ అభ్యంతరమున్నది? వెనకటి భాషాప్రధానుల కసలే ఉండదు. పెద్దలలో కొందరు ఈ పత్రికాసంచికలలో కొన్ని గ్రంధాలు పూర్తి చేసుకున్న వాళ్ళున్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ "భగవదజ్జుక" "ప్రతిమానాటకాది" కావ్యాలూ ఇంకా ఇతర "చిన్ననాటిముచ్చట్లు" అనే కొన్ని పూర్తిచేసుకున్నారు. వీరిని గూర్చి వెనక మనవి చేసినాను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్ర దేశములో ఇప్పుడున్న వైయాకరణులలో సహృదయత్వ మెక్కువగా ఉన్న మనీషి. శుష్కవైయాకరణులకు మనకు లోటేలేదు. కాని సూర్యనారాణశాస్త్రిగారికి సామాన్యభాషాతత్వముల నెరిగిన వాడవటముచేత మన భాషలో తత్తత్కాలాలలో కలిగిన మార్పులను చారిత్రక దృష్టితో చూడగల చిత్తస్వాస్థ్యమున్నది. ఆయన శుష్కవైయాకరణి కాదనటానికి

---

◆ అందులో "వాఙ్మయచక్రం" అని ఈ గ్రంధకర్తదొక వ్యాసమున్నది.

ఆయన వ్రాసిన కావ్యాలే సాక్షి. ఈ రెండు శక్తులు కలిసి ఉండటము చాల అరుదు. ఈసంచికలు తిరగవేస్తే ఆయన వ్రాసిన 'ప్రేమతత్త్వము' అనే కావ్యము క్రమముగా పూర్తయినట్టు కనబడుతుంది.

పురాణము సూర్యనారాయణ తీర్థులు ఆంధ్రదేశానికి చిరపరిచితుడేకూడాను. ఈయన యీ భారతి సంచికలలో "కుమారుడు" అనే నీతికావ్యము పూర్తిచేసుకున్నాడు.

కూచి నరసింహముగారిని (1866-1940) గూర్చి వెనక ఒకమారు మనవి చేసినాను. ఆయన "రామచంద్రప్రభో" శతకాన్నొకదాన్ని పూర్తిచేసుకున్నాడు. ఈ సంపూర్ణకావ్యాలు గాక అనేక ఖండకావ్యాలున్నై, ఈ పురాతన మార్గావలంబులవి. ఉమర్ ఆలీషాగారు "లేఖిని" అనే గీతమాలికనూ, త్రిపురాన వెంకట సూర్యప్రసాదరావు దొరవారు "రతివిలాపము" అనే ద్విపదఖండ కావ్యాన్నీ, నల్లాన్ చక్రవర్తులవారు "వేమనతారావళి" అనే ప్రశంసా ఖండకావ్యాన్నీ, యీవిధముగా అనేకులు రచించినారు. ఈ రచించినవారిలో నడకుదుటి వీర్రాజు, చింతలపూడి సీతారామయ్య పెమ్మరాజు లక్ష్మీపతి,* శ్రీపతి త్ర్యంబకరావు, మక్కపాటి వెంకట రత్నం, జనమంచి సీతారామస్వామి, తురగా వెంకట్రామయ్య, దీపాల పిచ్చయ్య శాస్త్రి,◆ దంటు సుబ్బావధాని, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగార్లు మొదలైనవారున్నారు. మొసలికంటి హనుమంతరావుగారు "స్వర్భంగము" అనే పేరుతో ఇంగ్లీషులో మిల్టన్ మహాకవివ్రాసిన "పారడైస్ లాస్ట్" (Paradise Lost) అనే కావ్యాన్నీ భాషాంతరీక రించినాడు. తూములూరి శివరామయ్యగారు "తిక్కనకవి ప్రశంస" అని ఒక ఖండకావ్యములో ఆమహాకవిని ప్రశంసించినాడు. మంగిపూడి వెంకటశర్మగారు

---

* ఈయన "నేను, నీవు" అనే ఖండకావ్యములో వ్రాసిన ఒక్కవాక్యమనువదిస్తాను.

"నేను నీవను భేదమే లేని స్నేహ
మున బ్రవర్తిల్లి .......... ........."

ఇదికూడా సఖ్యచిహ్నమే!

◆ ఈయన మేఘదూతము తెనుగు పరివర్తనము చేసినాడు. ఈయనేగాక, గుఱ్ఱం వెంకట, సుబ్రహ్మణ్యం, భీమరాజు సత్యనారాయణ, మాడభూషి మరంవెంకటాచార్యులు గారలుకూడా చేసినారు.

తమ లేఖినిని సాగిస్తూనే ఉన్నారు , శేషాద్రిరమణకవులుకూడా తమ కవితావినోదాలు సల్పుతూనే ఉన్నారు. వాటిలో కొన్ని భాషాదేశాభిమానాలు పురికొల్పే "ప్రతాపరుద్ర చక్రవర్తి', మొదలైనవి ఉన్నవి!

కంఠోక్తిగా నవ్యులమని అనుకునేవాళ్లు కొందరు కొన్ని సంఘాలుగా చేరినట్టు కనపడుతున్నది.

మొత్తముమీద భాషాసేవ యీవిధముగా చాలా జరిగినది. ఒక యీసాధకులు దాదాపు అన్ని విషయాలలో ప్రథమ నవ్యసాహిత్య సాధకుల మార్గాలే అనుసరించినారు. వాళ్ళ ప్రకృతిప్రణయాలే ముఖ్య కావ్యవస్తువులు. కవితాసామగ్రి మొదలైనవి కూడా అవ్వే కొందరు కొన్ని వైశిష్ట్యాలు చూపినారు. నండూరు వెంకటసుబ్బారావుగారి యెంకివలె, అధికార్ల సూర్యనారాయణగారికి "జానకి" నాయిక. "యెంకిపాట" ల ఉపోద్ఘాతములో సుబ్బారావుగారు ఈయనను "జానకీపతి" అని నిర్వచించినాడుకూడాను. ఈసాధకులలో వెనకటి పేర్లవారుగాక నూతనులు చాలామంది ఉన్నారు. వెనకటివాళ్ళు అనగా వేదుల మొదలైనవారు క్వాచిత్కముగా వ్రాసినట్టు కనబడుతుంది. **శివశంకరశాస్త్రి**గారి లేఖిని చలాయిస్తూనే ఉన్నది. కృష్ణశాస్త్రి గారుకూడా క్వాచిత్కముగానే వ్రాస్తూవచ్చినాడు. కవికొండలవారు కూడా అప్పుడప్పుడూ గానముచేస్తూనే ఉన్నాడు. విశ్వనాథ గానము వెనుకటికంటే తరుచైనది! దానికి వెనకటికంటె పటిమ **అభివృద్ధిఅయిన** కొద్దీ భావ భాషాక్లిష్టతలు అలవడుతున్నట్టు కనపడుతున్నది కాని చాలలోతుకు దిగి వ్రాస్తున్నట్టూ, నిత్యాదర్శాల్ని వదలలేదనీ కనపడుతున్నది.

ఈ కాలములోనే కోలవెన్ను రామకోటేశ్వరరావుగారూ ఈయనా కలిసి ఒక ఆంగ్లమాసపత్రిక, ఒక తెనుగుమాసపత్రిక, స్థాపించి నడిపినారు. రామకోటేశ్వరరావుగారు "త్రివేణి" కిన్ని సత్యనారాయణ గారు "జయంతి" కిన్ని సంపాదకత్వము వహించినారు. "త్రివేణి" మాత్రమిప్పటికీ దేశభాషాసేవలు చేస్తూనే

---

"గోవిలాసము'నే చక్కని ఖండకావ్యము రచించినాడు. ఈయన గోప్రీతీ, సంఘసేవా, సారస్వతసాధనా అనితరతుల్యాలు.

ఉంది. "జయంతి" శారదతో కలిసి స్వర్గరాజ్యములో ఆంధ్రభాషాప్రచారము చేస్తున్నది. విశ్వనాథవారి "కిన్నరసాని" నడక ఆంధ్రులకందరికీ ముద్దులు మూటకట్టుతున్నది. సందర్భోచితాలైన ఆ నడకలకు ఆంధ్రదేశమంతా జోహారు చేస్తున్నది. ఇతరులు చాలామంది కిన్నరసానిని నడకలో అనుకరించవలె ననుకొని బోర్లపడుతున్నారు. దీనికి "బాపిబావ' చిత్రాలు చాల దోహదమిచ్చినై! ఇంతలోనే కోకిలమ్మ పెళ్ళికూడా చేయించినాడు. ఆంధ్రప్రశస్తికూడా ఈకాలందే ననుకుంటాను. రామకోటేశ్వరరావు గారు ఆంధ్రభాషకు పరభాషాకుమారుల మెప్పును తీసుకురావాలని ప్రయత్నించినవారిలో ముఖ్యుడు. ఈయన సంపాదిస్తున్న 'త్రివేణి' పత్రికలో ఆంధ్రాభ్యుదయాన్ని గూర్చీ, ఆంధ్రుల సాహిత్యచిత్రకళా కౌశలాన్ని గూర్చీ, ప్రచురించిన వ్యాసాలవల్ల తెనుగంటేనూ, తెనుగు జాతి అంటేనూ, తెనుగుసాహిత్య శిల్పాలంటేనూ, తెలియనివాళ్ళనేకులు కళ్లుతెరచినారు. ఈయనకూడా "కేవరు ప్రధాని" మొదలైన ఉత్సాహకల్పకాలైన పుస్తకాలను రచించినాడు. జాత్యున్నతికి చాలా పాటుపడ్డధన్యుడు. పట్టిన కార్యముకోసము అనగా "త్రివేణీ" పత్రికా నిర్వహణముకోసము సర్వస్వము అర్పించిన స్వార్థత్యాగి. ఎన్నికష్టాలు వచ్చినా వెనుకంజవెయ్యని ధీరుడు!

అప్పుడప్పుడు విశ్వనాథ ఆంధ్రులచరిత్రలోనించి కొన్ని సన్నివేశాలు తీసుకుని చిత్రమైన సంభాషణలను కల్పించినట్టుకూడా కనపడుతుంది. "ప్రోలరాజని" ఒక కల్పన ఉన్నది కాకతీయ శౌర్యాన్ని తెలియచేస్తున్నది. ఇటువంటివే కొన్ని కల్పనలను ఇతరులు కొందరు కూడా యెత్తుకున్నారు. మద్దిపట్ల వెంకటరమణయ్యగారు "స్థానేశ్వర యుద్ధమనీ" "ఝురీతరుణమనీ" కొన్ని వీరకృత్యాల నుగ్గడించినాడు. రెండోది చాల రసవంతముగా ఉన్నది. హోల్దిఘాటు యుద్ధానంతరము రాణాప్రతాప సింగు ఒక నదిని దాటడమనే అతిసాహసకృత్యాన్ని తన గుఱ్ఱము సహాయముచేత చేయడము ఆ జంతువు ఆ పనిచేసి ఆయాసముచేత మృతిపొందటము అందుకు

రాణా దుఃఖించడము చాలా హృదయరంజకముగా చిత్రించినాడు కవి.* కొత్తపల్లి జగ్గయ్య చౌదరి అనే ఆయన సంగ్రామసింహుని దాసి "పన్నా" అనే ఆమె రాజుయొక్క చిన్నకుమారుని కష్టాలకోర్చి రక్షించిన కధను చాలా రసవంతముగా రచించినాడు. జాషువా కోకిలకంఠము విడివడుతున్నది. ఈయన ఖండకావ్యాలనుగూర్చి వచ్చే దశవర్షవృత్తాంతము చెప్పేటప్పుడు ముచ్చటిస్తాను. నాళం కృష్ణారావుగారు "పాపాయి" మొదలైన కొన్ని లలిత కావ్యాలను రచించినాడు. తుమ్మల సీతారామమూర్తిచౌదరి సహజకవికుమారుడు "ఆత్మార్పణం" అనే కావ్యాన్ని రచించినాడు. దీనిలో భారతదేశముయొక్క వైలక్షణ్యానికి మూలభూతాలైన కొన్ని ధర్మాలను చెప్పినాడు. చక్కని శైలిలో, భారత దేశానికి సహజముగా అతిధిపూజా, అపకారము చేసినవాళ్ళకు కూడ ఉపకారము చేయడమూ, మొదలైనవి అలంకారాలైన గుణాల రసవంతముగా ఒక కధ సృజించి చెప్పినాడు. ఒక వ్యాధుడికి ఒక కపోతము, తనయొక్క ప్రియురాలి నా వ్యాధుడు వలలో పట్టుకొని ఉండగా, గాలివానవల్ల చలితోనూ ఆకలితోనూ వాడు బాధపడుతూ ఉంటే, తన గూటిపుల్లలను చలిమంటగానూ, తన దేహాన్ని వాడి ఆకలితీర్చటానికి ఆహారముగానూ అర్పించిందట! శిబిచక్రవర్తి కధవలెఉన్నది. చక్కని రసవచ్ఛైలిలో రచించి ఆహ్లాదము కలగచేసినాడు. ఈయన యితర ఖండకావ్యాలుకూడా చాలా రసవంతాలుగా ఉంటై! § ఈయన నవ్యరచయితలలో పేర్కొనతగినవాడు! పింగళి కాటూర్లు యేనాడు "తొలకరి" రచించినారో మళ్ళీ వాళ్ళకు సరస్వతీకటాక్షము కలగక, ఆలస్యముగా కలిగినపుడు

---

* చైతకా! చైతకా! యంచు క్ష్మాతలేశు
డనుగుమోమును తన యొడియందు జేర్చి,
కనుల నీరొల్క పుల్కుపుల్కుమని దొరను
కాంచి యా తేజి కడసారి కన్నుమూసె"

ఆ చూపులలో"సఖ్యము" తాండవిస్తున్నది.

◆ ఈయన ఆత్మకధను కొంతభాగాన్ని పద్యకావ్యముగా రచించినాడు.

§ వెంకటేశ్వరరావుగారు ఈమధ్యకాలములో విక్టరు హ్యూగో కవియొక్క "బగ్ జార్గల్" ను ఆంధ్రీకరించినాడు. "నల్లకలవ" అనే పేరుతో డ్యూమాసు (Dumas) "Black Tulip" అనే నవలను పరివర్తనము జేసినాడు. 'పాల స్తృహృదయం' అనే ఖండకావ్యము వచ్చినది.

"నాటికి నేడు" అనే ఖండకావ్యాన్ని రచించినారు. అందులో ఇది వరకు కలగనందుకు వేదన, యిప్పుడు వచ్చినందుకు సంతోషము చక్కని వాక్చిత్రాలతో చిత్రించినారు. ఈ కాలమే "సౌందరనందానికి" పునాదిపడ్డ కాలము. - అనంతపంతుల రామలింగస్వామిగారి 'శుక్లపక్షం' తయారౌతున్నది. ఈయన శైలి చాలా అంతరార్థము కలిగి ఉంటుంది. ఒక్కొక్కచోట తాను భావకవి ననిపించుకుంటూ భావకవిత్వాన్ని నింద చెయ్యడము కనిపిస్తూ ఉంటుంది. శ్లేష ప్రధానమైనదీ కావ్యము◆! జనమంచి వెంకట్రామయ్యగారు ఒక అంతర్ముఖుడైన కవికుమారుడు. ఈయన వ్రాసిన 'నవకుసుమాంజలి'* అనే ఖండకావ్యసంపుటిని విమర్శిస్తూ విమర్శకుడు 'ఈయన మానసము సౌందర్యమునుండి సత్యముదెస తిరుగుచున్నది' అన్నాడు.‡ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు తమకు వచ్చిన ఐహిక సన్నివేశాలచేత దేవుడిని తల్చుకునే చిత్తశాంతి లేదని అన్యాపదేశముగా 'నిష్కాసము' అనే ఒక ఖండకావ్యము వ్రాసినాడు!

---

◆ ప్రతిభలో ఈయన కవిత్వాన్ని గూర్చి విమర్శకుడు ఇట్లా అన్నాడు. "వ్యాజనింద వీరికి అభిమానపాత్రమని తోస్తుంది. వెనక "శుక్లపక్షము"లోనూ యీ రీతి రచనే సాగించారను కుంటాము."

"ఈ గ్రంధమున ధ్వనులనేకములు గలవు. శ్లేషాద్యలంకారములకిది బరణి. హాస్యములకిక్క, విచిత్రకల్పనలకు రావు. ఇట్టి హేళన కావ్యములు తెనుగున నింతవరకు లేవని చెప్పుట సత్యదూరము కాదు." (భారతిలో విద్వాన్ విశ్వనాధనరసింహం)

* ఈ కావ్యాన్ని తన కుమారుడైన బ్రహ్మానందునికే అంకితం చేసినాడు.

ఈయన కుమారులు జనమంచి కామేశ్వరరావు, రామకృష్ణలు కూడా సారస్వత సాధకులు

నవ్యకుసుమాంజలిపై -

"వెంకటరామయ్యగారి ఆశయము వాఙ్మయసేవయై శివమూర్ధ్నో పరిఖేలదంబరధునీ దివ్యప్రవాహతుల్యజనాకాంక్షియై వనప్రియకంఠ హుంకృత్యనుకరణమై ప్రకృత్యలంకారమై, అంత్యమున జీవేశ్వరైక్యతానిరూపణమై ధన్యతగాంచినది"

- శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, భారతి 1929 మార్చి

‡ ఈయన 'కవులు గాధల'నీ 'బిందుగారబ్బాయి' అని పుస్తకాలను ప్రకటించినాడు. "ఇబ్సెన్ హమేషానిషా" అని కృష్ణాపత్రిక యీయనకొకమారు బిరుదునిచ్చింది.

దేవుడిని వెళ్ళగొట్టాడు ప్రపంచములో ఎక్కడా చోటియ్యకుండా! † కొందరు వెనకటితరములోవలెనే మంచి అభివృద్ధికి వచ్చేదినాలలో దేవుడు సన్నిధికి లాక్కున్నాడు. వాళ్ళలో ముఖ్యులు మద్దిపట్ల వెంకట రమణయ్య. జంధ్యాల శివన్నశాస్త్రి, కొంపల్లె జనార్దనరావుగారలు, ముఖ్యులు. వీరిలో శివన్న శాస్త్రిగారు "సంస్కృతాంధ్రాంగ్ల హిందీ బెంగాలీ భాషాకోవిదులు" కొంపల్లె జనార్దనరావు మంచి పండితవంశములో పుట్టిన స్ఫురద్రూపైన యువకుడు. కొంతకాలము 'ఉదయిని' అనే పత్రికనుకూడా నడిపి భాషాసేవ చేసినాడు. కాని యితడు ఒకవిధమైన సులభముగా అర్థముకాని భాషను అలవడచేసుకున్నాడు! 'స్వర్ణయోగి' 'వెలుగు' మొదలైన ఏకాంకికా నాటకకర్త కూడాను. జనార్దనరావు చాలా అభివృద్ధికి రాదగినవాడు! వీళ్ళుగాక ‡ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు చక్కని రసవత్కవిత్వము వ్రాయగలిగి తన వంశానికి పేరుతెచ్చిన ప్రతిభాశాలి! శివసాయుజ్యము పొందినాడు! చాలా దుఃఖించినాము! మిగిలినవారిలో మల్లాది వెంకట విశ్వనాథశర్మ, శిరిపి ఆంజనేయులు, భమిడిపాటి రామసోమయాజులు, నిడుమోలు కనకసుందరం, కొప్పర్తి నారాయణమూర్తి, మల్లాది చంద్రశేఖరరావు, వెంకటకాళిదాసకవులు, విన్నకోట వెంకటరత్నశర్మ, వెలువోలు సీతారామయ్య చౌదరి, పురిపండా అప్పలస్వామి, తన్నీరు కృష్ణమూర్తి, అన్నంరాజు శర్మ, చిర్రావూరి కామేశ్వర రావు, తాపీ ధర్మారావు, పాటిబండ మాధవశర్మ, దివాకర్ల వెంకటావధాన్లు మొదలైన అనేకమంది చక్కనిశైలిలో ఖండకావ్యాలు వ్రాసిన వాళ్ళున్నారు.

కొందరు రాజకవులున్నారు. ఇంకా శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవ వర్మ మహారాజులుంగారు, వెంకటాద్రి రామచంద్రఅప్పారావుగార్లు, వత్సవాయి వెంకట

---

† ఈయన వ్రాతలను మొదటినించీ చదివితే ఒక్కటి కనపడుతుంది. ఆస్తిక్యములో నించీ క్రమముగా మెట్లుదిగి నాస్తిక్యములోకి దిగినట్టు నిదర్శనాలు కనపడతై! విశ్వనాధ తాము పుటకతో తెచ్చుకున్న ఆస్తిక్యమూ, ధర్మమూ, క్రమముగా బలమౌతూ వచ్చినై! ఈ వైధర్మ్యము వీళ్ళవ్రాతలలో వ్యక్తమౌతూ ఉంటుంది.

‡ భావకవి. సుజనామోదిని, సావిత్రీ సత్యవంతము, ప్రేమము, దీనచింతామణి, వెంకట రావు, కౌముది, మోసము, ఉదంకుడు, పాలవెల్లి, తేనెపట్టు, విరిసెజ్జ, మున్నగునవి యితని రచనలు; వీరి తాతగారి జీవనచరిత్రకూడా వ్రాసినాడు. టేకుమళ్ళ కామేశ్వరరావుగారి కెక్కువ పరిచయమున్నట్లు తెలుస్తున్నది.

నీలాద్రిరాజుగార్లు మొదలైనవాళ్ళున్నారు. నీలాద్రిరాజుగారు కాళిదాసుని శాకుంతలాని కొక పరివర్తనము వ్రాసినాడు. చాలా రసవంతముగా ఉన్నది. రామచంద్రఅప్పారావు గారు నిరంతరసాధన చేస్తున్న రాజకవి. "సాహిత్య సమ్రాట్టు" గారి సంగతి వెనక మనవిచేయనే చేసినాను. వీరందరూ వెనకటి సాధకుల మార్గాలనే అనుసరించినారు.

ఇక గేయాలను సాధించినవాళ్ళలో వెనకటితరములోవారు గాక పైన చెప్పిన వారిలో కొప్పర్తి నారాయణమూర్తి◆ విన్నకోట వెంకటరత్నశర్మ, పూడిపెద్ది వెంకటరమణయ్య, జనమంచి వెంకట్రామయ్య, త్రిపురాన దొరవారు మొదలైన వారున్నారు. వీళ్లలో దొరవారు "అజవిలాప" మనే పేరుతో మంచి గీతాన్ని ఒకదాన్నీ, వెంకట్రామయ్యగారొక చక్కని జానపద గీతాన్ని "బండిచక్రమ" నే పేరుతోనూ వ్రాసినారు. కొందరు మారుపేర్లతో రచించినారు. "తిరుగుబోతు" అనేపేరుతో ఒకాయన "నీతరువాత" అనేది ఒకటి వ్యావహారికములో రచించినాడు. *f* ఇది బావకుమరదలికి సంవాదరూపముగా ఉన్నది. ఇక నరహరి శెట్టి వెంకటరత్నం, సోమంచి సూర్యనారాయణ, ఏనుగు తిమ్మరాజు, జయదేవారెడ్డిగార్లు మొదలైన వారనేకులున్నారు. జయదేవారెడ్డిగారి "ల వ ం గ త ల" జాన్ లిలీ (John Lily) అనే ఒక ఆంగ్లకవి కావ్యానుకరణము. తిమ్మరాజు గారు"**శివ-పూజ**'ను గూర్చి వ్రాసినారు. ముద్దుకృష్ణగా రొకనూతన వ్యక్తి యీకాలములో వ్రాసినవాళ్లలో. † ఈయనకూ నాకు

---

◆ "మృత్యువు లో:
"మరలివచ్చితి నిదురలెమ్మిక
మరణ మెరుగదు జీవ మెన్నడు,
మదిని నమ్మెదు రాత్రి వెడలగ
నుదయ మరుదెంచున్."

చాలా బాగున్నది. "ఎరుగడు జీవియెన్నడు" అంటే ఇంకా బాగుండేదేమో! రాయప్రోలు పోకడ కనపడుతున్నది.

*f* ఇంకో ఆయన "హాలికుడనే" పేరుతో "ఏమో" అని ఒకటి రచించినాడు.

† ఈయన గీతాలు సాహితిలోకూడా కొన్ని కనపడతై! "వానాలప్ప" ఒక బాలగీతము; ఇటువంటిదే "జోలపాట" కూడా. లయ కనపడుతున్నదిందులో! కొన్ని కధలుకూడ ఉన్నై; "దయ్యాలున్నాయా" అనేది మొదలైనవి.

ముద్దుకృష్ణ 'అశోకం, అన .్క.ఎ, టీకప్పులో తుఫాను' అనే నాటికలను వ్రాసి ప్రచురించినాడు.

నవంబరు 1932లో స్థాపించ 'జ్వాల" అనే పత్రిక నడిపినాడు కొన్నిదినాలు 'ఎక్కడికి?' అనే కధలసంపుటి వ్రాసినాడుకూడా. ఆ కాలములోనే 'వైతాళికులు, అనేపేరుతో నవ్యకవుల పద్యగేయసంపుటిని వెలువరించినాడు.

1920 సంవత్సరములో కీ॥ శే॥ సముద్రాల అప్పలాచార్యులుగారి ద్వారా పరిచయమైనది. అప్పటికి యింకా విద్యార్థిదశలోఉన్నట్టు జ్ఞాపకము! నిగూఢముగా ఉండి యీ కవితాశక్తి విజృంభించటానికి ప్రారంభిస్తున్నది. ఈ విధముగా గేయసాధకులు సాధన చేస్తువచ్చినారు. వీళ్ళకు వెనకటివాళ్ళనుగూర్చి చెప్పిన మాటలేవర్తిస్తవి! కొందరు వీళ్ళలో సామాన్యప్రపంచములో నించీ ఔపమ్యాలనూ రూపకాలనూ గ్రహించినారు. వెనకటి వాళ్ళల్లేనే! కవిసామర్థ్యము సామగ్రి యేరుకోవడములోనే ఉన్నది అసలు! చంద్రుడితో మొగముపోల్చడము అనాదినించీ ఉన్నదని యిత్తడిశిబ్బితోనూ, జడను సర్పముతో పోల్చడము అనాదిసిద్ధమని యినప గరిటెతోనూ, పోల్చాడనుకోండి! ఇది నవ్యతా? విపరీతనవ్యత! హాస్యము కోసము వ్రాస్తే యిట్టి కల్పనలు కావ్యోపస్కారాలు కావచ్చు! గాడేపల్లి అనంతముగారు 'హృదయపటమ'ని ఒక గీతము రచించినాడు. అందులో,

> "కాంత! నీకై దుఃఖోదకములలోన
> తడిపియుంచితి హృదయవస్త్రమ్ము రమ్ము,
> నీట హృదయమ్ము బరువెక్కె నీదు మృదుక
> రమ్ముల హృదయమ్ము పిడిచికొమ్ము, చివికి
> చినిగిపోవకమున్నె, అశేషసౌఖ్య
> వీచికల నారగట్టుమో ప్రియసఖుండ!"

(కాంత! ప్రియుడా!) అని వ్రాసినాడు. గుడ్డనానపెట్టడము, పిండటము ఇది చాలా జుగుప్సాకరము. రూపము చాలా నవ్యముగా ఉందనుకున్నాడు. కాని కవికుమారుడు, "హృదయమ్ముపిడిచికొమ్ము" అన్నప్పుడు జుగుప్సాకరమైన అర్థమువస్తున్నదని యెంతమాత్రము దృష్టిలేకపోయినది. ◆ అందుకనే కవితాసామగ్రి యేరుకోడములో ఉన్నది. కవిప్రతిభ! లాక్షణికుడీ సందర్భములో చెబుతూ యీ క్రింది స్వభావోక్తి కాదన్నాడు.

---

◆ ఎటువంటి జారిణీకూడా యిట్లా బహిరంగముగా మాట్లాడదు. క్రిందటి తరములో ఇంగ్లాండు ఆస్థానకవి ఆల్‌ఫ్రెడ్ ఆస్టిన్ (Alfred Austin):

"Poetry is the transfiguration of life, on imaginative representation of whatever men perceive, feel, think, or do."

"మాహిష్మతీపురీమధ్యే ముహురాఘ్రాయ మేదినీం,
ఏకపాదం సముద్ధృత్య శ్వా మూత్రం విసృజత్యహో!"

పైగీతము సరిగా ఇట్లాగే ఉన్నది. కవిత్వము సులభము కావచ్చును గాని భావోదాత్తత కొరవడకూడదు! ఇటీవల వ్రాతలన్నిటిలో ఛందస్సాంకర్యాది వెనక చెప్పిన కొన్నిలక్షణాలున్నై. యస్. జి. ఆచార్యగారు తమ అసమచ్ఛందస్సులో వ్రాస్తూనేఉన్నాడు. మరిచినాను, ఈకాలములోకూడా పాపినేని వెంకటేశ్వర రావు గారనే ఆయన భావగద్యము వ్రాయటానికి యత్నించినాడు.

"కోయిలా! నన్ను పరిహసించెదవేల? తియ్యమామిడిచివురుజొంపములయందు గూరుచుంటివనియా! లాలిపాటలపై తేలిపోవుచుంటివనియా! విశ్వకుమారిని మేలుకొల్పుచుంటి వనియా? పరిహసించిన పరిహసింతువు గాక! నాకేమి యుడుకు".

దీన్ని పరీక్షించుట చదువరులకే వదులుతున్నాను. "కోయిల" అనేకులకు-అనగా దాదాపు సగముమంది కవికుమారులకు-గానవస్తువై నది. ఏవోకొన్ని తప్ప అన్నీ చాలా పేలవముగా ఉన్నై! కోయిల పేరెత్తగానే కవులమౌతామని కొందరు భ్రమపడ్డారు! చిత్త సంస్కారము లన్నిటికంటె ముఖ్యము ఎరువుసొమ్ము వలె దాన్ని తెచ్చి పెట్టుకుంటే వెంటనే స్వభావవిరుద్ధముగా కనపడుతుంది!

కథను ఎత్తుకుంటే చాలామంది సాధకులు కనిపిస్తారు. ఇక్కడ వెనకటి తరములోవలెనే భాష బహుళముగా వ్యావహారికమే వ్రాసినారు. కొందరు, కొత్తపల్లి సూర్యారావుగారివంటి మడికట్టుకున్న వాళ్ళుకూడా లేకపోలేదు. వేలూరి వంటివాళ్ళు అటూయిటూ కూడా ఉన్నారు. ఈయన కథలలో కొంచెము బిరుసుదనము కనపడుతుంది. కాని పండిత కథకులలో ఒకడు. ఈయన చిత్తపరిణామాన్ని ఆనుపూర్విగా పరీక్షించడం ఒక గొప్ప కార్యము! ఈకథకులలో కొందరు వెనకటివాళ్లు కనపడుతున్నారు. మునిమాణిక్యం మొక్కపాట్లతో సమానమైన ఒకవ్యక్తి యీ కాలములో బయటపడ్డాడు. భమిడిపాటి కామేశ్వరరావుగారి కథాకథనం ఒక విశిష్టమార్గము. అందులో మంచి ప్రకృతి పరిశీలన, చక్కని వ్యావహారికం, హృదయ రంజకమైన హాస్యము ఉంటై. ఈయన కథలు భాషకు అలంకారాలు! వెనకటి వాళ్ళలో వేదుల "అనితమ్మ" అని ఒక చక్కని కథను వ్రాసినాడు. వీరేగాక విశ్వనాథ

పద్యాలలో ఎట్లా విజృంభించినాడో కథలలోకూడా అట్లాగే విజృంభించినాడు. కొన్ని ప్రత్యేకతలు చూపినాడు. "తస్మాత్" నగలమీద ఆమె నిరాదరణ" అన్నాడొక్కచోట! ఈయన యెప్పుడూ భావ, శీల వైవిధ్యముగల పాత్రలను చిత్రించటములో చాలా సమర్థుడు. ఈకాలములోనే 'ఏకవీర' రచించినాడు. ఎల్లప్పుడూ నైతికాదర్శము ముందు చుక్కానివలె నడుస్తూఉంటుంది. "తిరోధాన" మనే ఒక కథలో ఎంత ఐహికములో దిగిపోతే అంత ఆముష్మికానికి దూరమౌతామనే నీతి చక్కగా పోషించినాడు. భమిడిపాటి రామసోమయాజులు, వెంపటి నాగభూషణం (1909), బులుసు వెంకటరమణయ్య, సోమయాజుల వెంకటరామమూర్తి, గోపరాజురాజన్న, మల్లాది రామకృష్ణశాస్త్రి (1906) గార్లు చక్కని శైలిలో ప్రకృతిసిద్ధముగా కథలను రచించినారు. మాడపాటి హనుమంతరావుగా † రీ కాలములో 'ప్రేంచెందు' హిందీ కథలను కొన్నిటిని పరివర్తనము చేసినాడు. వాటిలో 'ఇక కావలసినదేమి' అనేది ఒకటి. చింతా శంకరదీక్షితులనే పేరుతో కొన్ని కథలున్నై! చింతా భీమశంకరం, దీక్షితులుగార్లూ కలిసి యీ సమిష్టి నామం గ్రహించినారట! ఈ భీమశంకరంగారు * కూడా సారస్వతసేవ చేసినవాడే!

ఈ పై మార్గాలలో స్త్రీలుకూడా కొందరు సాధన చెయ్యడానికి పూనుకున్నారు. వారిలో 'అమల'అనే పేరుతో "విషాదగీతి" అని ఒక ఆమె గీతము వ్రాసింది! (అమల అంటే నేను స్త్రీ అనుకున్నాను.) టి. సరస్వతిగారు 'సందేశమ'నీ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు అప్పట్లో చనిపోయిన మాగంటి అన్నపూర్ణాదేవి పైన 'స్మృతి' అనీ, కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు "శ్రీరామస్తవము" న్నూ, వాడ్రేవు రంగనాయకమ్మగారు 'వైరాగోద్యమ'నీ రాజేశ్వరిగారు 'ధర్మపత్ని' అనీ, యీ విధముగా కొందరు చక్కని హృదయంగమమైన ఖండకావ్యాలను రచించినారు. ◆కథలు వ్రాసినవాళ్ళలో గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు కూడా యెన్నదగింది!

---

† వీరు హైద్రాబాదు నివాసి! సాంఘికముగా, రాజకీయముగా, వైజ్ఞానికముగా, జాతి నభివృద్ధిలోకి తీసుకురావలెననే ఆదర్శానికి జన్మ ధారపోసిన వ్యక్తి!

* స్కూళ్ళ యినస్పెక్టరుగా ఉండి 1940 లో కైలాసవాసి అయినాడట. మొదటిసాహితీ సంచికలలో "మారుతి" అనేపేరుతో వ్రాసింది దీక్షితులుగారని సభాపతి అన్నారు.

◆ వెనకటి తరములో మొసలికంటి రామబాయమ్మగారు సాహితిలో 'హృదయవీణ' నీ 'యేడ్వవలదమ్మ పసికూన యెల్లవేళ' అనీ కొన్ని ఖండకావ్యాలు వ్రాసినారు.

ఈమె 'పశ్చాత్తాపం' అనే ఒక నీతిదాయకమైన కథ వ్రాసింది. తుదకు కథలో నాయికకు పశ్చాత్తాపము కలిగి భర్త కాళ్లమీదపడి క్షమించమని వేడుకుంటుంది! ఆధునిక యువతులకు కొందరికి చాలా నీతిదాయకము. ఈకాలములోనే మద్రాసులో ఉన్న కేసరి కుటీరం స్థాపకుడైన కె. యన్. కేసరిగారు 'గృహలక్ష్మి' అనే ఒక మాసపత్రిక స్త్రీలకోసము పెట్టి నడుపుతున్నాడు. యుద్ధకాలంలో ఇది ఆగిపోయింది. గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు 'ఆంధ్రమహిళ' అనే పత్రిక పెట్టి స్త్రీలకై సేవ చేయడానికి పూనుకున్నది. నవ్యమార్గాలలో సాధనచేస్తున్న స్త్రీలు చాలామంది దానిలో వ్రాయడము మొదలుపెట్టినందుచేత భారతిలో వ్రాసే స్త్రీలసంఖ్య తక్కువైంది!

జూలూరి తులశమ్మగారు 'ఋతుమాల' ఆంధ్రసర్వస్వములో వ్రాసింది. కొందరు యువకులు గురజాడ అప్పారావుగారి కన్యాశుల్క మార్గాన్ని అవలంబించిన వాళ్ళున్నారు. వాళ్ళల్లో కొల్లూరు ధర్మారాయకవి "ప్రాక్టికల్ కవిత్వమ"ని అప్పారావుగారి గిరీశాన్నే ఉల్లేఖిస్తూ వ్రాసినాడు! వెంపటి పురుషోత్తం "భాగ్యరేఖ" అనేదొకటి వ్రాసినారు. కాని అప్పారావుగారి పటిమ రాలేదనే చెప్పవలె! ఏవో మాటలను కలిపి నవ్వుపుట్టించడమా అప్పారావుగారి ఆదర్శం? పెమ్మరాజు లక్ష్మీపతి అనే ఆయన 'బార్డోలీ విజయ'మనే పేరుతో అప్పు డక్కడ జరిగే విజయవంతమైన ఒక సన్నివేశాన్నిగూర్చి పాడినాడు. 'వీరమ్మ పేరంటాలు' అనే ఒక వీరగాథను ఉన్నవ లక్ష్మీనారాయణగారు చక్కని జానపదవ్యావహారికములో రచించినాడు. ఈయన పేరెత్తితే 'మాలపల్లి' జ్ఞాపకమొస్తుంది. ఈ "మాలపల్లి" అనేది ఒక అద్భుతమైన నవల. ఈ కాలానికి ఇదే ఉత్తమమైన నవల అని చెప్పవలె. దీన్ని ఈయన జైల్లో ఉండగా వ్రాసినాడు. బైటికొచ్చి ప్రచురించినాడు. ఇందులో సామ్యవాదం ఉన్నదని వెంటనే సర్కారువారు దానిమీద ఆంక్ష పెట్టినారు. తర్వాత కొన్ని సంవత్సరాలకు పునర్ముద్రితమైనది. ఈయన వ్రాసిన యేగ్రంథములోనైనా ఆంధ్రాభిమానము పొంగి పొర్లుతూ ఉంటుంది! ఈయన సారస్వతసేవే కాకుండా సాంఘిక, రాజకీయ, విద్యాసేవ చేస్తున్న ధన్యజీవి. గుంటూరులోఉన్న "శారదానికేతనమ"నే సంస్థ యీయనసేవకు సజీవోదాహరణము! ఈయనతో ఈయన ధర్మపత్ని

లక్ష్మీబాయమ్మగారు కూడా సేవచేసి చిరస్మరణీయఅయింది! ఇద్దరూ అనేకమార్లు శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్ళివచ్చి పవిత్రులైనారు. ఒక కవికుమారుడు జస్టిసు పక్షాన్ని కవిత్వములోకి తెచ్చినాడు. బ్రాహ్మణులు మొదటినుంచి చేసిన, దుర్మార్గాల నన్నిటినీ గుదిగుచ్చి బుద్ధిచెప్పినాడు "అధిక్షేపం" అనే ఖండ కావ్యములో. ఈయన పేరు వెలగపూడి దానయ్యచౌదరి. ఈయన కమ్మవారికి చెందినవాడు. బ్రాహ్మణనిరాస నీవిధముగా కావ్యరూపముగా వ్రాసిన కవి కుమారుడు మరొకడు కానరాడు. ఈయన హృదయతాప మిందులో గోచరిస్తున్నది.

సెట్టి లక్ష్మీనరసింహంగారు గిడుగువారి శిష్యుడు. అప్పారావు గారి మార్గానుయాయి. అనేక ఖండకావ్యాలు వ్రాసినాడు. తర్వాత మానివేసినాడు. శ్రీశ్రీశ్రీ విక్రమ దేవవర్మ మహారాజులుంగారికి ఆప్తమిత్రుడు. ఆయనను కృతిపతిని చేసినాడుకూడాను. ఈయన చేసిన ఒక గొప్పకార్యముంది. రవివర్మ చిత్రించిన సుప్రసిద్ధ చిత్రాలకు ఆంధ్రానువాదమును పద్యరూపముగా వ్రాసినాడు. "దమయంతి-హంస" 'విశ్వామిత్ర తపోభంగము' గంగావతరణం', మొదలైన చిత్రాలను సారస్వతములోకి తెచ్చినాడు. ఎవరైనా ఈయనపద్యాలనూ, రవివర్మ చిత్రాలనూ, కలిపి అచ్చువేస్తే దేశభాషాసేవ చేసినవాళ్లౌతారు.

## నాటకం:

నాటకము సంగతి రెండుముక్కలు చెప్పుకుందాము. చిన్న చిన్న నాటకాలు అనగా రెండుమూడు రంగాలు ఉండేవి వదిలేస్తాను. నాటక కర్తలు సామాన్యముగా గ్రాంధికాన్నే వాడి పాత్రోచితభాషకు ప్రాముఖ్యమిచ్చినారు. కొందరు ఇందులో బొత్తుగా పద్యాన్ని వాడని వాళ్ళున్నారు. వాడిన వాళ్ళుకూడా ఉన్నారు. సి.కామేశ్వర రావుగారనే ఆయన "కుచేలుడ"ని ఒక నాటకములో గ్రాంథికాంధ్రాన్నే వాడినాడు. పింగళి నాగేంద్రరావుగారు † "నా రాజు" అనే నాటకము రసవంతముగానే

† ఈయన యిప్పటికీ రచనలు సాగిస్తూనే ఉన్నాడు. ఇటీవలనే 'వింధ్యరాణి' అనేఒకటి వెలుపడ్డది.

రచించినాడు. అందులో అయన చ్యుతసంస్కారము కాని భాషనే ఉపయోగించినాడు * కాళ్లకూరి గోపాలరావుగారు కూడా చక్కని శైలిలో నాటకాలు వ్రాసినారు. "వాల్మీకి" అని ఒకటీ, "తిమ్మరుసు" అని ఒకటీ, యీరెండు చాలా బాగా ఉన్నవి! "వాల్మీకి" మనస్తత్వము ప్రధానముగా ఉన్న నాటకము. వాల్మీకి యొక్క మొదటి వృత్తి, ఆయనకు నారదాదులు వచ్చి జ్ఞానము ప్రసాదించడం దానివల్ల వచ్చినమార్పు, అది వచ్చేటప్పుడు కలిగే చిత్తవికార వైవిధ్యము కుమార్తె యొక్క ప్రవర్తనా, మొదలైనవి చాలా హృదయంగముగా రచించినాడు. ఒక స్థలములో అనగా తండ్రియొక్క ఆకారదర్శనమైనప్పుడు చదువుతూ ఉంటే షేక్స్పియరు "హామ్లెట్" అనే నాటకములో దయ్యపురంగము చదువుతున్నట్టు అనుభవిస్తాము. వాల్మీకి ఆ రంగంతర్వాత పునర్జన్మను పొందినట్టుభావిస్తాడు. గోపాలరావు గారుకూడా అనేక ఖండకావ్యాలను రచించినాడు. 'సౌందర్యమంజరి కథ' విశ్వదాత ఆదరానికి చాలా సంవత్సరాలు పాత్రుడైనాడు. దివంగతుడైనాడు. 'తిమ్మరుసు'కూడా చక్కని శైలిలోనే ఉంటుంది. పాత్రలయొక్క శీలపోషణములో ఈయన మిక్కిలిదిట్ట! అనేకులవలె ఎట్లాగో మొదలెట్టి నడపడముకాకుండా, ముందే నాటకావయవాలన్నిటినీ కూర్చుకుని రచించే దీర్ఘదర్శి. చలమచర్ల రంగాచార్యుల 'హలికడు' నాటకం. 'అది ఒక విశిష్టతగల యుత్కృష్టనాటకము. కవిజీవితాన్ని చిత్రించడములో ప్రథమ గ్రంథమని చెప్పిన చాలును.

'హరిశ్చంద్ర' 'సావిత్రి' అనే పేర్లతో ఆకథలలో భావపూర్ణ వస్తుయుతాలైన తుదిభాగాలను వ్యావహారికములో రచించినాడు. కాశీ సోమయాజుల సుందరరామ మూర్తిగారు అనే ఆయన. ఈయన తన ఉపోద్ఘాతములో, గ్రాంధికాంధ్రముపట్ల తమకాదరము లేకపోలేదనీ; కాని, వ్యావహారికములో వ్రాస్తే రససిద్ధికాదా అనే పరీక్షకోసము తానీ నాటకాలను రచించాననీ, శ్రీశ్రీశ్రీ జయపురము మహారాజులంగారికి చదివి వినిపించాననీ; ఆయన చాలా మెచ్చుకున్నాడనీ, అందుచేత ప్రకటిస్తున్నాననీవ్రాసుకున్నాడు. సహృదయులను బలవంతపెడితే వాళ్ళేమంటారు?

---

* వావిలాల సోమయాజులు 'నాయకురాలు' అనే నాటకాన్నీ , రామనాథం 'బిచ్చకత్తె'ను, కొండముది గోపాలరాయశర్మ 'ఎదురీత'ను రచించి ప్రదర్శింపజేస్తున్నారు.

బాగుందంటారు! తొలిపలుకుకూడా వ్రాస్తారు! శిఫారసుకూడా యిస్తారు! ఈ నాటకాలు, ప్రచారములో ఉన్న లక్ష్మీకాంతకవిగారి 'హరిశ్చంద్రం'త రసస్ఫూర్తిగాని, సచ్చిదానందశాస్త్రిగారి 'సావిత్రి' అంత ఆహ్లాదము గాని, కల్గి ఉన్నయ్యో లేవో తేల్చుకోవడము చదువరులకే వదులుతున్నాను. చాలా సాహసించా డీయన! ఒక్క సంగతి చెప్పదలచినాను, గద్యములో సరససిద్ధికాదని నా ఆశయముకాదు. అట్లాగైతే పానుగంటివారిని తోసి రాజనవలసి వస్తుంది! కాని భావపూర్ణముగా హృదయ మున్నపుడు పద్యము వెలువడ్డంత సులభముగా గద్యము వెలువడదు. * పద్యము భావప్రధానము, గద్యము వైశద్యప్రధానము. వాల్మీకికి "శోకం శ్లోకరూపముగా వచ్చింది." ఏసారస్వతములో నైనా చూడండి. ప్రథమగ్రంథాలు పద్యరూపముగా ఉన్నై! ఋగ్వేదము పద్యరూపము! హృద్గతమైనభావాలు పైకొచ్చేటప్పుడు ఒకవిధమైన "లయ"లో వస్తై. ఎవరైనా చనిపోయినప్పుడు వాళ్ళ ఆప్తులు ఏడవడమెప్పుడైనా యీ గ్రంథకర్త విన్నాడో లేదో! వినేఉంటే అందులో ఉండే "లయ"ను ఆయన తెలుసుకోలేక పోవడము చాలా విచారము. ఆధునికులు చాలామంది గేయములో యతిప్రాసలు "లయ" నిస్తైయని వాటిని పాటిస్తున్నారు! ప్రకృతిలోనే ఒకవిధమైన లయ అంతర్బహిర్వ్యాప్తమై ఉన్నది! కాబట్టి అసామాన్యమైన వ్యక్తితప్ప అట్టి సందర్భాలలో పాడిమాటలతో రసస్ఫూర్తి చేయలేడు! ఈయన యీసాధన యీరెండు నాటకభాగాలతో పూర్తైనది! ఇంకా యీవిధముగా వ్రాయలేదు! బహుశః ఈయనకే తెలిసినదేమో యీ సంగతి!

## జయంతి, సుజాత(లు) - సాహిత్యసాధన

"జయంతి" పత్రిక చాలా గొప్పగా ఉండేది. దీనిలో వ్రాసే వాళ్ళను చూస్తే వెనకటి ఉన్నవ లక్ష్మీనారాయణగారివంటివేత్తలూ, నాయని సుబ్బారావు, కృష్ణశాస్త్రి, బూర్గుల రామకృష్ణరావు గార్ల వంటి నవ్యులూ, పంచాగ్నులవారివంటి పండితులూ, భావరాజు, మల్లంపల్లి వంటి పరిశోధకులూ, కనబడతారు. వాళ్ళనుగూర్చి వెనక మనము తెలుసుకునే ఉన్నాము. పోతే ఒక్కవిషయము మాత్రము ఎక్కువగా

* 'భావోద్రేకాన్ని ప్రకటించడానికి గద్యముకంటె పద్యమే ఉత్తమము'. సభాపతి

కనపడుతుంది! విశ్వనాథ భావస్వాతంత్ర్యానికి దారి యేర్పడిందని. ఈయనలో సహజముగాఉన్న "శక్తి" క్రమంగా వికసిస్తూ పూర్ణముగా స్వతంత్రంకావడానికి దగ్గరకొస్తూఉన్నదని. ఈ ఆత్మవిశ్వాసబీజాలు వెనకనే కొంచెము మనవి చేసేఉన్నాను. ఇంతేగాక యాయన "పెంకెతనం" కూడా వికసిస్తూ ఉందని కూడా తెలుస్తుంది. ఈ గుణము గొప్పకవికి సహజముగా ఉంటుంది. శ్రీనాథుడి 'పెంకెతనం' పెద్దన "పెంకెతనం", యింతకుపూర్వం నన్నయ తిక్కన్నల "పెంకెతనం" గనక పరీక్షిస్తే అది తెనుగుసాహిత్యాని కెంత ఉపకారము చేసినదీ తెలుస్తుంది. గురజాడ గిడుగువార్ల "పెంకెతనమే" రాయప్రోలు, దేవులపల్లి, వేదుల, బసవరాజు, నండూర్ల "పెంకెతనమే" తుదకు సభాపతిగారి "కనపడని పెంకెతన"మే, నవ్యసాహిత్య దోహదమైనదని వెనకటి చరిత్రవల్ల తెలుసుకున్నాము. ఇటువంటి 'పెంకెతనమే' విశ్వనాథకు వస్తున్నట్టూ వెనకటి నవ్యులందరికంటె ఈ అంశ యాయన దగ్గర యెక్కువపాలుగా ఉన్నట్టూ కూడా తెలుస్తుంది. తుదకు "మారుమూల పదాల" నుపయోగించే పద్ధతిని సాధించుకోవడమంత పెంకెతనము కూడా అలవడుతున్నదని స్పష్టపడుతున్నది. ఈ "పెంకెతనం" యాయనకు అనితర సులభస్థాన మిచ్చినది. ముఖ్యకారణ మేమీ అని ఆలోచిస్తే యాయనలో ధర్మబీజ మున్నది! ఈ ధర్మబీజమే "పెంకెతనము"నే దుకూలము ధరించి, చుట్టూ బహుళముగా కనపడుతున్న తిరుగుబాటనే నగ్నతనుంచీ, అర్ధవస్త్రధారణాన్నుంచీ, యాయన కవిత్వాన్ని విలక్షణము చేసినది. ఈ ధర్మబీజము ఉన్న రాయప్రోలు కృతులూ, విశ్వనాథవీ వెనకటి దశవర్ష కాలానికి ఈదశవర్షకాలానికీ, మండనాయమానాలు. మిగిలినవి యెన్నైనా వన్నెచిన్నెలు గలిగిన దివ్యాప్సరసల వంటివి, ఇవి స్వచ్ఛప్రకృతి రూపులైన "శ్రీవాణీగిరిజలవంటివి. మూడో రకము సానలవంటివి అసంఖ్యాకాలు *

"సుజాత" సంగతికూడా కొంచెము తెలుసుకుందాము. ఇది నిజాం రాష్ట్రములో హైద్రాబాదులో పుట్టినది. ఈ రాష్ట్ర భాగానికి తెలంగాణమని పేరు.

---

* సాహితిలో ప్రణయగీతాలు వ్రాసే గిరికుమారుడు జయంతిలోకి వచ్చినాడు.

ఇది ఇప్పటికీ అవిచ్ఛిన్నముగా జరుగుతూ దేశభాషాసేవలు చేస్తూనే ఉన్నది. చాలాసంతోషం! దీర్ఘాయువై యితోధిక సేవచేయుగాక!

ఆంధ్రదేశములో పుట్టిన సాహిత్యపిపాస యిక్కడికికూడా యీ దశ వర్షకాలములో ఆంధ్రదేశ భాషాభిమానాలు తలెత్తినై! "గోలకొండ" వారపత్రిక స్థాపించబడింది. కె.రామాచారి అనే చిత్రకారు డగుపిస్తున్నాడు.

"సుజాత" అని ఒక చక్కని మాసపత్రికేగాక "నీలగిరి"! మొదలైనవి మరికొన్ని పుట్టి అంతరించినై! 'సుజాత' 4 సంవత్సరాలు భాషాసేవ చేసింది. ఇందులోకూడా మనము వెనక తెలుసుకున్న పేర్లవారు కొందరూ కనపడుతూనే ఉన్నారు. వెనకటి మార్గాలకంటె చెప్పుకోదగ్గయింకా నూతనమార్గాలేమీ యిందులో కనబడటములేదు. 'సుజాత' ను తలిచేటప్పటికి ఒక్క ఆంధ్రయువకుడి పేరు జ్ఞప్తికి వస్తుంది. సిరిగూరి జయరావు చక్కని ఖండకావ్యాలు వ్రాస్తూ ఉండేవాడు.*

ఈకాలములో విమర్శనము చాలా పెరుగుతున్నది. నాటక రచనా, ప్రదర్శనమూ కూడా విమర్శకుల పరీక్షకు లోనైనై! కవిత్వతత్వము కూడా చర్చకు పాలైనది. 1914 సంవత్సరములో రామలింగారెడ్డి గారి గ్రంధము తర్వాత అక్కడక్కడా వ్యాసరూపముగా విమర్శకులు వ్రాయడము మొదలెట్టినారు, కాని విరివిగా సమస్త విషయాలూ చర్చించిన సమగ్ర గ్రంధము వెలువడలేదు. పురాణం సూరిశాస్త్రిగారు చాలా చిత్తసంస్కారముగల వ్యక్తి. లలితకళా సూత్రాలను బాగా జీర్ణించుకున్న విమర్శకుడు. ఈయన తానొక గృహాన్ని నిర్మించదలచి దానికి పునాదినుంచీప్లానూ, కట్టడమూకూడా స్వయముగా నిర్వహించుకున్న వేత్త! ఈయన మూడు విమర్శన గ్రంధాలు రచించినాడు. నాట్యంమీదా, నాటకంమీదా, "నాట్యాంబుజ నాట్యోత్పలాలూ", విమర్శనము మీద "విమర్శక పారిజాత" మనీ. ఇవి ఉద్గ్రంథాలు! "సంఘ సంస్కరణోపన్యాసాల" తో నిండి ఉండక, విషయమే ప్రధానముగా వ్రాసినవి! పాశ్చాత్యకవిత్వతత్వాన్ని ఉగ్గడిస్తూ, మనదానితో సాధ్యమైనంతవరకు సమన్వయిస్తూ పోయినాడు. కాని యీయనక్కూడా సంస్కృతములో ఉన్న రసశాస్త్రము కొంతవరకు అచుంబిత మవడంచేత పూర్తిగా

* ఇంగ్లాండుపోయి సివిల్‌సర్వీసు పరీక్షలో ఉత్తీర్ణుడై మధ్యరాష్ట్రాలలో కలెక్టరుద్యోగము చేస్తూ మృత్యువాత పడినాడు. నిజాం కళాశాలలో చరిత్రాచార్యుడుగా పనిచేసి విశ్రాంతి తీసికొంటున్న సిరుగూరు హనుమంతరావుగారీ జయరావుగారి అన్నగారే

చెయ్యలేక పోయినాడు. కాని "శేషంకోపేనపూరయేత్" అనేపనిమాత్రము చెయ్యలేదు. అప్పటి కాలములో ఉండే నాటకకంపెనీలు, సుప్రసిద్ధ నటులు, వాళ్ళ విశిష్టతా, మొదలైనవన్నీ చాలాబాగా చర్చించి నటకులక్కూడా ఒకస్థానాన్నిచ్చినాడు. నాట్యకళకు ఈపుస్తకాలవల్ల ఒకవిధమైన గౌరవము వచ్చినది. ఇవిగాక యీయన పత్రికల్లో యీ విషయాలనుగూర్చి అనేక వ్యాసాలుకూడా వ్రాస్తూండేవాడు. ఇటీవల ఈయన కీర్తి శేషుడైనాడు.* కోరాడ రామకృష్ణయ్య, రంగస్వామి సరస్వతి, పరవస్తు రామానుజస్వామి మొదలగువారు భాషాతత్త్వవిమర్శనచేసినారు. బాలకవి భోగరాజు నారాయణ మూర్తిగారు "ఆంధ్రకవిత్వచరిత్ర" ను వ్రాసినారు. తేకుమళ్ళ అచ్యుతరావుగారొక వాఙ్మయ చరిత్రకు పునాది వేస్తున్నాడు.◆ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు తమ నాటకరంగ గ్రంధానికి దోహదముచేస్తూ అప్పుడప్పుడూ వ్యాసాలు రచిస్తున్నాడు. నాగలింగం వెంకటేశ్వరశాస్త్రి మొదలైనవాళ్ళు విమర్శన వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాళ్ళు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగా రీకాలములోనే తమ భావిభాషాసేవకు సాధన చేసుకుంటున్నాడు. ఆంగ్లములో ద్రావిడ భాషాతత్త్వాన్ని గూర్చి ఒక గ్రంధముకూడా వ్రాసినాడు. చాలా విమర్శనముతో కూడి ఉన్నది అది. కోరాడ రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయ పరిశోధకులుగా నియమింపబడి, పరిశోధనకు మంచి అవకాశముకలిగి, మహాభారత కవితా విమర్శనము మొదలైన అనేక పరిశోధన గ్రంధాలను రచించినాడు. పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రాచీనవాఙ్మయ పరిశోధనముచేసి, తమ పరిశోధనా ఫలాలను దేశానికందచేస్తున్నాడు. మానవల్లి, వేటూర్లు తాము పరిశోధనలో చూచిన నూతన విషయాలను దేశానికి సమర్పిస్తూనే ఉన్నారు. మల్లంపల్లి భావరాజులు తమ శాసనపరిశోధనలను చరిత్రకు సహాయము

---

* ఆకాలములో పింగళి కాటూర్లూ, పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి, కోట ఆంజనేయులు, పారుపల్లి సుబ్బారావు మొదలైనవాళ్ళు చాలామంది ఈయనకు కవి నటమిత్రులుండేవాళ్ళు. నాటక విషయాలలో సంప్రదింపులు జరుగుతూ ఉండేవి!

◆ "విజయనగర సామ్రాజ్యాంధ్ర సారస్వతము" మీద ఇంగ్లీషులో ఒక చరిత్ర తర్వాత ప్రచురించినాడు.

'విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రమ'ని తెలుగులోను, పింగళి సూరనార్యునిమీద ఇంగ్లీషులో ఒక గ్రంధాన్ని రచించినాడు.

ఇస్తూనే ఉన్నారు. మామిడిపూడి వెంకటరంగయ్యగారు సంస్కృతములో ఉన్న "కామందకీయ రాజనీతి" ని తెలుగులోనికి పరివర్తనము చేసినాడు. చిలుకూరు వీరభద్రరావుగారు భారతిపుటలను తమ పరిశోధనలతో అలంకరిస్తూనే ఉన్నాడు. డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు తమ చరిత్ర పరిశోధనలనుచేసి చరిత్రను సత్యకథనముగా చేయటము సాగించినాడు. మిగిలిన వానికేమిగాని పెండ్యాలవారి పరిశోధన చాలా చమత్కారముగా ఉంటుంది. మామూలుత్రోవకు కొంచెము భిన్నముగా ఉంటుంది. ఈయన గొప్ప మేధాశాలి, చాలా గ్రంధాలను రచించినాడు. నేత్రదృష్టి కొరవడినా పరిశోధనము మానలేదు. ఆపస్తంబుడిని గూర్చి చాలా శ్రమచేసి పరిశోధించినాడు. చెప్పదలచిన విషయము కుండబద్దలు కొట్టినట్లు చెప్పెయ్యటమే కాని ఒకరికి కోపముగాని తాపము గాని వస్తుందని ఆలోచించడము లేదు. ఆయనంత పరిశోధకుడికి తప్ప అంత స్వాతంత్ర్యము ఉండటము కష్టము.

"వ్యాసము" కొంచెము తలయెత్తుతున్నది. ముట్నూరి కృష్ణారావు,✻ కోలవెన్ను రామకోటేశ్వరరావు, అడివి శంకరరావు, మానవల్లి రామకృష్ణయ్య, వేటూరు ప్రభాకరశాస్త్రి, దిగవల్లి వెంకటశివరావు, బెజవాడ గోపాలరెడ్డి, వల్లూరు సూర్యనారాయణ రావు◆ తణికెళ్ళ వీరభద్రుడు మొదలైనవారు చక్కని వివిధలక్షణ లక్షితాలైన

---

కొమఱ్ఱాజు లక్ష్మణ రావు, గిడుగు పితృపుత్రులు, కోరాడ రామకృష్ణయ్య రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, దువ్వూరి రామి రెడ్డి, నండూరు బంగారయ్య, వావిలాల సోమయాజులు, నోరి నరసింహశాస్త్రి, కురుగంటి సీతారామయ్య, దువ్వూరి వెంకట రమణ శాస్త్రి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, నిడదవోలు వెంకట్రావు, పిలకా గణపతిశాస్త్రి, కొడవటిగంటి, జమ్మలమడక మాధవరామశర్మ, జి వి. కృష్ణరావు, పిల్లలమర్రి వెంకటహనుమంతరావు, జొన్నలగడ్డ సత్య నారాయణమూర్తి, దేవరపల్లి వెంకటకృష్ణ రెడ్డి మున్నగువారు వ్యాసరచనమునకై సాధనము చేసినారు. వీని పరిణామములే అనేక వ్యాసావళులు! గిడుగువారి షష్టిపూర్తి సందర్భాన 'వ్యాససంగ్రహము' వచ్చింది-

వీనిలో -

"సారస్వతము, విమర్శనము, చరిత్ర, శాస్త్రము, భాష, విద్య, సంస్కృతి" ఈ విభాగాలపై వివిధ వ్యాసాలు వచ్చినవి, వస్తున్నవి. ఇన్ని విధాలుగా కృషి అగుపిస్తున్నా ఒకటి మాత్రంచెప్పాలి. వ్యాసాన్ని ఒక సమగ్రమైన కళాసిద్ధి మాత్రం ఆపాదించడానికి ప్రయత్నం జరగలేదు.

✻ 'నవ్యాంధ్ర సారస్వతంలో 'వ్యాసం' అనేదానికి వరవడి పెట్టింది కృష్ణరావు గారి ఎడిటోరియలు'
- భారతి 1936 ఏప్రిల్

◆ వల్లూరి వారి గ్రంథాలు, వారి తేదీ 1866 - 1933.

'వర్ణాశ్రమధర్మ పరిణామము' 'అంతర్జాతీయధర్మ శాస్త్రము' 'నానాదేశరాజ్యాంగ విధానము' "మనస్వాతంత్ర్యము" "స్వీయచరిత్ర"

వ్యాసాలను రచించి యీ విధమైన సాధనకు మార్గ దర్శకులైనారు. ఇవిగాక యితర శాస్త్ర వాఙ్మయము కూడా విరివిగా పెరగడము సాగినది.

కొందరు యితర భాషల్లో వృద్ధిపొందుతున్న బాలవాఙ్మయము చూసి అటువంటిది మనభాషలో లేకపోవడమువల్ల చింతించి ఆ లోటుతీర్చడానికి కృషి సల్పుటము మొదలుపెట్టినారు. గురజాడ అప్పారావు గారే యీ విషయములోకూడా మార్గదర్శి. *ఈ పథమును గ్రహించి అనేకులు చిన్నపిల్లలకొరకు గేయాదులను రచించినారు. చింతా దీక్షితులుగారీ విధమైన గేయాలు చాలా వ్రాసినాడు. గరిమెళ్ళసోమన్నగారీ విధమైన దసరాపద్యములు పిల్లలకు విజ్ఞానదాయకములుగా రచించినాడు ◆ కూచి నరసింహంగారీవిధమైనకృషి చేసినందుకు ప్రశంసనీయులు. ఈ విషయంగూర్చి మళ్లీ చెప్పుకునే అవకాశము వస్తుంది.

---

* పిల్లలకొరకు "మిణుగురుల"నే చక్కని చిన్ని చిన్ని గేయాలను రచించినాడు.

◆ శేషాచార్యులుగారనే ఆయన 1904, 5 ప్రాంతంలో బెజవాడస్కూలులో మేష్టరుగా ఉండి యిటువంటి బాలవాఙ్మయము కొంత రచించినట్టు జ్ఞాపకము.

చింతాదీక్షితులు, కవికొండల వెంకట్రావు, టేకుమళ్ళ కామేశ్వరావు మొదలైన వారు ఈవర్గానికి దోహదం చేసినారు.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# 1931 తర్వాత నవ్యసాహిత్య సాధన

# 4

## కాలపరివర్తనము : స్వభావము

వెనకటి దశవర్షకాలారంభములో ఎట్లాగైతే రాజకీయాందోళనతో ప్రారంభించామో అట్లాగే యిప్పుడుగూడా ప్రారంభించినాము. 1931 సంవత్సరములో రెండో సత్యాగ్రహ సమరము ప్రారంభమైనది. మళ్ళీ నాయకులంతా జైళ్ళలోకి వెళ్ళారు. దేశము గందరగోళముతో నిండి ఉంది. ఈ కాలములో వెనుకటివలె ఉత్సాహము కల్గచెయ్యడము అవసరమంతగా లేకపోవటముచేత వెనకటి దేశీయగీతాలే వినియోగించినవి! కవుల కంఠము వినపడకపోవడానికిదొక కారణము. ఈరెండో సమరము గట్టి గింజలనూ తాలునూ వేరు చేసింది. గట్టిగింజలు నిలిచినై! తాలు గాలికెగిరిపోయినది. నవ్యకవులలో చాలామంది తమ ప్రణయములోనూ, ప్రకృతివర్ణనలలోనూ యింకా యితరాంశాలలోనూ, మునిగిపోయి దేశాన్ని మరచిపోయినారు. కొద్దిమంది మాత్రము ఆంధ్రరాష్ట్రమంటే ఉద్రేకము కలగ చెయ్యడానికి ప్రయత్నించటము మొదలు పెట్టినారు. శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి వాళ్ళు కాంగ్రెసునూ, దేశము గౌరవిస్తున్న నాయకులనూకూడా విమర్శిస్తూ, ఆంధ్రరాష్ట్రముమీద దృష్టిలేని ఆంధ్రనాయకులను దూషించడానికి వెనుదియ్యకుండా యిష్టము వచ్చినట్టు వ్రాయడము ప్రారంభించినారు. యువకులలో కొందరుకూడా యీ చిత్తవృత్తిని గ్రహించినవాళ్ళున్నారు. ద్వితీయ సత్యాగ్రహసమరానికి పరిణామముగా గాంధీ-ఇర్విను ఒడంబడిక జరిగి జైళ్ళలో ఉన్న వారంతా బయటికి వచ్చినారు. బయటి కొచ్చినవారిలో సారస్వతప్రియులు, పత్రికలకు రచయితలుగానో, చరిత్రగ్రంధకర్తలు గానో, ఇన్సూరెన్సు ఏజెంట్లగానో, వర్తకులుగానో పొట్టపోసుకోటము 1

మొదలుపెట్టినారు. ఏమి చేస్తారు మరి? 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' అని ఆర్యోక్తి! కొంతమంది వ్యక్తులకోసము కొన్ని యిన్సూరెన్సు కంపెనీలే స్థాపింపబడ్డవి. ధనమూ, పలుకుబడీ అదృష్టమూ, ఉన్నవాళ్ళు నెగ్గుతునే ఉన్నారు. కొందఱు న్యాయవాదులుగా మళ్ళీ చదివి పరీక్షలై ప్రాక్టీసుచెయ్యటము మొదలుపెట్టినారు. రెండు సత్యాగ్రహసమరాల ఫలముగా దేశములో ఉత్సాహము క్షీణించినది. జైళ్ళలోకి వెళ్ళివచ్చినవాళ్ళంతా విశ్రాంతిని కోరినారు. ఇంతలో మళ్ళీ శాసనసభలకు వెళ్ళాలనే పక్షము ప్రబలినది. అందరికీ మళ్ళీ చేతినిండా పని దొరికినది. బుద్ధి ప్రతిభగల వాళ్ళకు వానిని చూపించే అవకాశము వచ్చినది. దేశములో కాంగ్రెసుకే పలుకుబడి ఉండటంచేత ఓట్లు అధికముగా కాంగ్రెసు అభ్యర్థులకే వచ్చినవి. జిల్లాబోర్డు, మ్యునిసిపాలిటీలు, శాసనసభలు ఖద్దరువాలాలతో నిండిపోయినవి! వెనకటి కులకక్షల కుళ్ళంతా ఖద్దరుచాటున ప్రబలటము మొదలుపెట్టినది. నిజమైన త్యాగము చేసినవాళ్ళు ఎక్కడైనా ఆశ్రమాలలోనో, జాతీయ స్కూళ్ళలోనో తలదాచుకోవలసి వచ్చినది. మళ్ళీ అవే జస్టిసు సూత్రాలు, అవే బ్రాహ్మణ బ్రాహ్మణేతరకక్షలు! పాతసారాయే! సీసాలు మాత్రము క్రొత్తవి! ఈకాలములో కాంగ్రెసువారి పరిపాలనను గూర్చి యెంత తక్కువచెబితే అంత మంచిది. ఈప్రకారముగా యిప్పటికీ రాజకీయ వాతావరణ మిట్లాగే ఉంది. కాంగ్రెసు అధికారమువల్ల వచ్చిన పరిణామము ఏమిటంటే దేశములో వెనకటికంటె కులకక్షలూ, పరస్పరవైరమూ ఎక్కువైనది. తుదకు కాంగ్రెసులోనే అంతఃకలహాలు ప్రబలినవి! వాటితోనే ఇప్పటికీ వాతావరణము నిండి ఉన్నది. ఇంతలో యుద్ధము వచ్చినది! కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా నిచ్చినవె! కాంగ్రెసు ప్రభుత్వంవల్ల దేశములో గొప్పగా చెప్పుకోదగ్గ విశేషాలేమీకలుగలేదు. విశ్వవిద్యాలయము మరొక కొందరు వ్యక్తులకు రంగస్థలమైనది. ఈమధ్య ఆర్థిక దుస్థితి వచ్చి మళ్ళీ కొంచెం దేశం రెక్కొన్నది. ఇప్పుడు మళ్ళీ అంతరాత్మను నమ్ముకున్న వాళ్ళకు తావు చాలాతక్కువగా ఉన్నది. సినిమారంగము వచ్చి కొందరుకవులకూ, నిర్మాతలకూ, పెద్దమనుష్యులకూ, పని కల్పించినది. ఖద్దరు కట్టుకునేవారూ, క్రాఫింగు దువ్వుకునేవారూ, ధోవతిజుబ్బాలూ మాత్రమే తొడుక్కునేవారు, 35 వత్సరాలకు లోపల వయస్సు ఉన్న వారిలో ప్రతి సినిమా

చిత్రానికీ వెళ్ళనివాళ్ళు చాలా అరుదు. కాఫీహోటళ్ళూ, చుట్ట బీడి సిగరెట్టు ఖిల్లీదుకాణాలూ, రైల్వేలూ, సినిమాలూ వీటికి మాత్రము నిత్యకల్యాణము పచ్చతోరణము. వినోదినీ, ఢంకా, మొదలైన అణా బేడ పత్రికలకున్న ప్రచారము ఇతరవాటికి లేదు. ప్రజామిత్ర ఎలక్షన్లకోసముపుట్టి, సినీమాలతో బ్రతుకుతున్నది. జనవాణికూడా యెలక్షన్‌లలోపుట్టి నశించింది. రాజకీయం హెచ్చుతగ్గులతో రాజకీయపత్రికలకు పలుకుబడి హెచ్చుతగ్గులుగా ఉంటుంది. ఇక నవ్యసాహిత్యం కోసం పుట్టిన "వైశాఖి, సఖి, ఉదయని, చంద్రిక" మొదలైన పత్రికలు కొన్నాళ్ళు నడిచి అంతరించినై! ఉత్సాహవంతులకు ద్రవ్యములేదు! ఉత్సాహము లేనివాళ్ళ దగ్గిర ఉండి లాభములేదు! కాని దేశానికి యధాశక్తిగా, ఏదోఒక శాఖలో సేవచేయాలనే ఆశ చాలమంది యువకులలో ఉంది. నాట్యములో అభిరుచి ఉన్నవాళ్ళు దానిలో ఏదోఒకపని చేయడం మొదలుపెట్టారు. కవికుమారులు ఏవో తమకు తోచిన వెర్రోమొర్రో వేసుకునే పత్రికలకు పంపుతున్నారు. కధకులు ఏదో కధలు వ్రాస్తున్నారు. సభలు జరిపి వాటిలో మాట్లాడి కొందరు బులపాటం తీర్చుకుంటున్నారు. పత్రికలలో తమ పేర్లచ్చైతున్నవని కొందరు సంతోషిస్తున్నారు. కొందరు వ్రాతగాండ్లు అన్యోన్యాభినంద నాలతో వారి వ్రాతలను వీరూ, వీరివ్రాతలను వారూ మెచ్చుకుంటూ కాలము గడుపుకుంటున్నారు. కొందరు పెద్దలు తామెప్పుడో ఆర్జించినకీర్తితో వర్తకము జరుపుకుంటున్నారు. కొందరు ఆంధ్రరాష్ట్రము కోసము ఎంతైనా త్యాగం చేస్తామని ప్రగల్భాలు కొడుతున్నారు. కొందరు కాంగ్రెసును విమర్శించడంతో తృప్తిపొందుతున్నారు. కొందరు అసలు తమరెవ్వరో మరిచిపోయి ఒదులు లాగులు వేసుకుని చాలా గొప్ప విజ్ఞానవంతులమని గప్పాలుకొట్టుకుంటూ, కాఫీ హెూటళ్ళకూ సినిమాలకూ పోతూ, ఎట్లా ద్రవ్యం తెస్తున్నారో తెలియకుండా సంచరిస్తూన్నారు. బ్రిటిషిండియాలో ఎక్కడ ఉద్యోగాలు లభించకపోవడంచేత, లభించే చోట్లకు దూరమనుకోకుండా పోతూనే ఉన్నారు. రైళ్లు పట్టకుండా ప్రయాణీకులు! సీజను జోన్‌టిక్కెట్లుపెట్టి రైల్వే కంపెనీలు ద్రవ్యము నార్జిస్తున్నై! కాఫీహెూటళ్ళలో ఖాళీ కుర్చీలుండటం లేదు. ప్రయాణాలు చెయ్యటం ఒక ఫాషనైపోయింది! బస్సుల్లో చోటే దొరకటంలేదు. ఎక్కడచూసినా పిపీలికాదిబ్రహ్మ పర్యంతం చర్చలే! రైళ్ళల్లోవింటే

అంతర్గ్రామము దగ్గరనుంచి అంతర్జాతీయముదాకా చర్చలే! ఎవ్వళ్ళకూ ఎవ్వళ్ళ యెడలా యెట్టి భక్తి శ్రద్ధలూ కనపడటము లేదు. స్కూళ్ళూ కాలేజీలూ యెన్ని కొత్తవిపెట్టినా చాలడంలేదు. గ్రాడ్యుయేట్ల సంఖ్య నానాటికీ హెచ్చుతున్నది. ఉద్యోగాలు దొరకక నిరుద్యోగపిశాచము దేశమంతా ఆవరించినది. యువతీ యువకులు పెండ్లంటే భయపడుతున్నారు. స్త్రీ పురుషుల కట్టు, బొట్టు, జుట్టు మొదలైనవాట్లో చెప్పటానికి వీల్లేని మార్పు లొస్తున్నవి! వానికి సినిమాకంపెనీలు ఫ్యాషన్లు దిద్దుతున్నవి. కూర కొనుక్కోడమైనా మానివేసి ఫేసుపౌడరు వేసుకొని వెళ్ళడము ప్రబలిపోయినది! * గ్రంధకర్తలకు అచ్చుకర్చులు గిట్టడములేదు. పుస్తకాల్లో సగము స్థలం ఖాళీయే! ప్రతివాడు ఏదోపనిఉన్నట్టు పిలిస్తే పలకకుండా నడుస్తూ ఉన్నాడు! మోటార్లు మేఘాలమీద పోతున్నై! ప్రజలు ఊరికే యిటూ అటూ కదులుతూ ఉంటారు. కారణమేమిటంటే చెప్పరు! కొద్దివాళ్ళకూ గొప్పవాండ్లకూ వాళ్లకు తగినట్టు అప్పులు! ప్రతివాడు ఆదాయానికిమించి జీవిస్తున్నాడు. సమయ మొచ్చినప్పుడు అవసరమైన దానికంటే యెక్కువ ఖర్చు చేస్తున్నాడు. బంగారము ప్రియమవడం చేతా, కొత్తసొమ్ములమీద బుద్ధిపోవడముచేతా, చెంబమ్మి కంచము, కంచమమ్మి చెంబు చేయించిపనివాళ్ళకు పని కల్పిస్తున్నారు! దేశములో ఆర్థిక దుస్థితి యెంత యెక్కువగా ఉందో అంత బ్యాంకుల సంఖ్య యెక్కువైంది. ప్రతివాడూ యితరుల ద్రవ్యము వాడుకుందామనే! కొన్ని బ్యాంకులు, డైరెక్టర్లు ద్రవ్యము ఇష్టమువచ్చినట్లు వాడుకోవడం చేత దివాలాలుకూడా తీసినై! కంపెనీల

---

"A number of factors such as the dis-organisation brought about by the last war, economic conditions favouring late marriages. The passion for self-expression, weakened parental control, inadequate sex-education, Fruedian psychology, and the knowledge of the methods for birth-control which saves us from the fear of natural Consequences, have brought about a laxity in standards."

"Economic independence with freedom from the ties of marriage and the responsibilities of motherhood is the ambition of many a young woman of the growing Smart Set" "Kalki" Sir Radhakrishnan.

* ప్రజలలో కళాప్రీతి యెక్కువై పోయినది! కాని ఆత్మవికాసానికి సంబంధించినదే కళ అని మాత్రము ఎవ్వరకీ తోచటము లేదు!

సంఖ్య యెక్కువైంది! టీ, కాఫీ, కంపెనీలు ఆవస్తువులకు ప్రచారము ఎక్కువ చెయ్యడానికి డిపార్టుమెంట్లు స్థాపించినారు! వాటిని త్రాగని స్త్రీ పురుషుల సంఖ్య చాలా తక్కువ. ఇన్స్యూరెన్సు యేజెంట్లు ప్రజలమీద దయచూపి తమ ప్రచారము చేస్తున్నారు! సనాతనులను చూస్తే సంస్కారచికీర్షువులకు గిట్టదు! వారినిచూస్తే వీరికి అసహ్యము! శారదా చట్టమువచ్చినా కట్నాలు తగ్గలేదు! ఎంతచదువెక్కువైతే అంత యెక్కువ మొత్తం! యిటువంటి సంగతులు చెప్పటానికి సిగ్గువేస్తుంది! విజ్ఞానానికి ఫలము నేపథ్యాదికము కాదనీ, హృదయ వికాసమనీ యెవ్వరూ గ్రహించడములేదు. అన్నిటికేమిగాని ఒక్కటిమాత్రము గర్హించవలసిన విషయము. తుచ్ఛకామానికి (sex) ప్రచారము చాలా హెచ్చినది.* దానికికొన్ని పత్రికలూ కొందరు వ్యక్తులూ ప్రచారము చేస్తున్నారు. ప్రతిపత్రిక ముఖపత్రమూ స్త్రీ చిత్ర సంకలితమే! అందులో కొన్ని అశ్లీలపూరితాలు. ప్రతిసినీమా ప్రకటన స్త్రీ పురుష ప్రేమనటన సమన్వితమే! బట్టలమీద బొమ్మలు కూడా యిటువంటివే! పత్రికల్లో వేసేకథల్లో ముప్పాతిక వాటికి యిదే వస్తువు! అదీ న్యాయమైన భార్యాభర్తృ ప్రణయము కాదు. సినీమా చిత్రాలు కూడా దీనికి దోహదము చేస్తున్నవి! ఈ విషయములో సంగతులన్నీ తెలుచుకొంటే చాలా జుగుప్సాకరముగా ఉంటుంది. యువతీ యువకుల హృదయక్షేత్రాలు మలినాలైపోయిన తర్వాత జాతిశీలము భద్రముగా ఉంటుందా?◆

---

* నేటి మన (సినిమా) చిత్రములలో అవినీతి ప్రచారము తలయెత్తుచున్నది. ఇది సంఘమునకు విషకీటకము వంటిది. దానిని పెరుగకుండ అణచివేయు బాధ్యత చిత్రదర్శకులమీదనేయున్నది. ధనార్జనము మాత్రమే ప్రధానముగ భావించి పామరజనపూరితమైన మన ప్రస్తుత సంఘమునకు ప్రదర్శించుటకై అవినీతి ప్రచార చిత్రముల నిర్మించుట మిక్కిలి హేయము, గర్హ్యము, నీతిబాహ్యము ' - ఆంధ్రపత్రిక: 25-10-49 చిట్టా రామకృష్ణారావు

"Looseness (of sexual life) is commended in good fiction and accepted in high society. ..... . .... ... Many 'sin' not so much cut of fashion, as owing to a feeling that a married woman ought to have lovers. Sexual promiscruity is getting to be regarded as a social duty."

◆ 'ప్రతిభ' యేమంటున్నదో చూడండి :-

మనదేశంలో యిప్పుడు పత్రికల సంఖ్యావిషయంలో ఏమీ కొదువలేదుగాని, అవి నిర్వహిస్తున్న పనిమాత్రం యేమీ తృప్తికరంగా లేదు. కథలకు వస్తువు శృంగార విషయమొక్కటే అనీ, హాస్యానికల్లా మూలము స్త్రీలజీవితము అవినీతికరముగా ఉన్నట్లు నిరూపించి అతివిస్తారముగా

ఈవిషయము పిన్నలూ, పెద్దలూ, ఆలోచించవలసిఉన్నది. మహర్షులూ, ప్రవక్తలూ, చాలా ఎక్కువై పోయినారు. తన్మతాలు సులభమోక్షసాధకాలుగా కనపడడముచేత అనుయాయులు చాలా హెచ్చుగా చేరుతున్నారు. సన్యాసులు ఆశ్రమాలను స్థాపించడమెక్కువైనది! భక్తి సిద్ధాంతాలకు ప్రచారము చాలా హెచ్చినది. సుఖసాధనాలు మనుష్యుల చిత్తాలను ఆకర్షిస్తున్నవి. సుఖమేపరమావధిగా పరిగణింప బడుతున్నది. రాజకీయములో సామ్యవాదము హెచ్చుమందికి నచ్చుతున్నది. ఒక వైపున కొందరు పేదవారిపైనా, కర్షకకార్మికులపైనా సానుభూతి చూపుతూ ఉంటే, మరికొందరు కేవల దైహిక మానసిక సౌఖ్యముకోసము యత్నిస్తున్నారు. క్రికేట్ టెన్నిసుపందెమంటే రైలుఛార్జియెంతైనా వెళ్ళవలసినదే! ప్రతిఫిల్ము తప్పక చూడవలసినదే! భరతనాట్యమూ, కత్తాకాలీ, అయితే తెలియకపోయినా తలలూచవలసినదే! ద్రవ్యము లేకపోయినా ఇతరుల ద్రవ్యముతోనైనా టీ కప్పు చప్పరించవలసినదే! సిగరెట్టు, పఫ్ పీల్చవలసినదే! కొందరి పాండిత్యమిందులో క్యాటలాగు పాండిత్యము! సంభాషణ చేస్తూ చేస్తూ, తాజా క్యాటలాగులోనించీ సేకరించిన ఒక పుస్తకము పేరు విసరి, 'యిదిచదివావూ' అనడమూ-యెదటివాణ్ణి దంగుచేయడమూ! మాటలలో ఒక దానికీ యింకొక దానికీ సందర్భము లేకుండా మాట్లాడి చాలా గొప్పవాళ్ళమను కొనడము! ఈ ప్రకారముగా ఉన్న సంఘము సారస్వతములో ప్రతిబింబిస్తూనే ఉన్నది. ఎంత ప్రతిబింబిస్తున్నా కొందరు వ్యక్తులు ధృవనక్షత్రాలవలె త్రోవ చూపిస్తూనే ఉన్నారు. వారికి దేశమంతా కృతజ్ఞముగా ఉండవలె.

---

అసభ్యవర్ణన చేయిదమనీ, యీ మొదలైన అభిప్రాయాలు యిప్పటి చిల్లర (కాదుగొప్ప) రచయితలల్లో వ్యాపించియున్నవి. జుగుప్సాకరమైన వ్రాతలూ, వాటి కనుగుణముగా ఉండే చిత్రపటములూ ప్రకటిస్తూ ఉన్న పత్రికలు చెలామణీ అవుతూ ఉండటము విషాదకరముగా ఉన్నదనీ, ఇట్టి వాఙ్మయమూ చిత్రలేఖనమూ అరిష్టదాయకములనీ, స్త్రీల విషయమై వ్రాసేటప్పుడు, భ్రాతృభావమూ, ఉత్కృష్ట ప్రేమభావమూ, మనసులో పెట్టుకుని వ్రాయనలెననీ గాంధీజీ సెలవిచ్చినారు".

ఈ కాలములో ఆటలమీదా, పాటలమీదా, నాట్యముమీదా యిష్టమే కాకుండా సులభముగా ధనార్జనచేసే మార్గాలు వెతకడంకూడా ఒకటికల్గింది యువకచిత్త వృత్తుల్లో, అందుకని అనేకులు "cross word puzzles" "solve" చెయ్యడను మొదలెట్టినారు ఇది సాహిత్యములోనికి కూడా యెక్కినది!

# సాహిత్యస్థితి:

ఈ దశవర్షకాలములో జరుగుతున్న సాధన యింత అని చెప్పటానికి వీలులేదు! అచ్చవుతున్న పుస్తకాలూ, ప్రచురింపబడుతున్న పత్రికలూ చూస్తే విషయవైవిధ్యము చెప్పనలవికాదు. కాని ఖండాంతరాలలో శాస్త్రాలన్నీ అపారముగా పెరిగిపోతున్నవి. వాటిమీదఅసంఖ్యాకాలైన గ్రంధాలు పుడుతున్నవి! మనము ఈ విషయములో యింకా చెయ్యవలసినపని చాలా ఉన్నది. ఇందులో మన భాషాకుమారులు స్వతంత్రులుగా ఉండటానికి వీలులేదు. తప్పక ఇతరభాషలలో గ్రంథాలనువదించవలసినదే! అందులోపరిభాషది ఒక గొప్పచిక్కు, ఇప్పుడు ప్రచురిస్తున్నవి స్కూళ్ళలో ఉపయోగాని కనుకూలించేవే గాని ఉద్గ్రంధానువాదం ఒకటైనా బయలుదేరలేదు. శాస్త్రపాండిత్యము కలిగి, భాషాజ్ఞానము కలిగి, రచనాసామర్థ్యము కలిగినవాళ్ళు చాలా తక్కువగా ఉన్నారు. ఫిజిక్సులో బోసు మొదలైనవాళ్ళ పరిశోధనలూ, రామన్ మొదలైనవాళ్ళ పరిశోధనలూ మనస్సుకు పట్టించుకున్నవాళ్ళే చాలా తక్కువ. అటువంటివాళ్ళలో ఉపజ్ఞతో వ్రాయగలవాళ్ళు బొత్తుగా లేరనే చెప్పవలె. ఇక యెట్లా వస్తవి? ఈవిషయములో ఉస్మానియా విద్యాలయము దారిజూపినది. దేశ భాషలలో ఉన్నతవిద్య గరపడం ప్రవేశపెడితే కదా యీ గ్రంధాల కవసరం అని అంటున్నారు. నిజమే! ఉస్మానియాలో వాళ్ళ కవసరమైనది. ఒక భాషాంతరీకరణ సంఘాన్ని నియమించి అన్ని శాస్త్రాలలో ఉన్న ఉద్గ్రంధాలు పరివర్తనము చేయించడానికి మొదలుపెట్టినారు. అది సరియైన పద్ధతి. మన విశ్వవిద్యాలయము ఎప్పుడు మొదలుపెడుతుందో ఆపద్ధతి! అసలు మొదలు పెడుతుందో లేదో తెలియదు! ఇంగ్లాండులో విశ్వవిద్యాలయాల పనిచూస్తే ఆశ్చర్యమేస్తుంది సమస్త శాస్త్రాలలోనూ అవి చేసినపనికి మేరలేదు. మన విశ్వవిద్యాలయాధికారులు ఎన్నికలకూ, ఉద్యోగాలకూ తంటాలుపడుటమేగాని విజ్ఞానవృద్ధి వాళ్లకి పక్కవాద్యము ! నిజమైన వైజ్ఞానికుల చేతిలోకి రావలెనీ సంస్థలు. అప్పుడేమైనా మార్పు కలగవలె. శాస్త్రాలిట్లా ఉన్నవి. మిగిలిన రాజకీయార్థికాలు ఎట్లాఉన్నవి? వాటిలో కొంచెమింతకంటె నయమే. కాని అనేకమంది వ్రాసేవ్యాసాలను

సంపుటీకరణముచేసి గ్రంథరూపముగా ప్రచురించడములేదు. వ్యాసాలు పత్రికలతో అంతరించిపోతున్నవి. ముందు రాబోయే వ్రాతగాళ్లకు వెనకటి పత్రికలను శ్రమపడి తిరగవేసుకోడానికి అవసరంలేకుండా చెయ్యటానికి వాటినన్నిటినీ సంపుటీకరణము చేయవలె. పుస్తకప్రచురణకర్తలీ విషయమై శ్రద్ధ వహించవలె! ఈ విషయములోకూడా విశ్వవిద్యాలయాలు చెయ్యతగినపని అపారముగా ఉన్నది. గొబ్బూరి వెంకటానంద రాఘవరావు గారు మొదలైనవారు ఖగోళశాస్త్రాన్ని గూర్చి చేసేపని చాలా అపారముగా ఉన్నది. దానంతనూసేకరించి గ్రంథరూపముగా చేస్తేతప్ప అదంతా నశించిపోతుంది. జాతికి నష్టమొస్తుంది. చావలి వెంకటహనుమంతరావుగారు మొదలైనవాళ్ళు రాజకీయార్థికాలమీద వ్రాసేవన్నీకూడా గ్రంథరూపముపొందవలె! చరిత్ర విషయములో ఆంగ్లములో 'The Early Dynasties of Andhra Desa' అనే ఉద్గ్రంథము ప్రచురించినాడు భావరాజు ఇటీవలనే. రాళ్ళబండి, మారేమండ మొదలైనవారు చేసేపని అంతా కూడా గ్రంథస్థముగావలసిన అవసరము నేను యెంతనొక్కిచెప్పినా తీరదు. గ్రంధకర్తలకంటె లక్ష్మీపుత్రులైన ప్రచురణకర్తలీ విషయములో శ్రద్దవహించవలె! ఈ పనులు కొన్ని విశ్వవిద్యాలయానివి! 1932 సంవత్సరములో భారతిలో శాస్త్రి మనకు విజ్ఞానము లేకపోవడాన్ని క్రిందివిధముగా చెప్పినాడు:

"ప్రపంచ పరిమాణమును తెలుసుకొందమన్న ఖండాంతరదేశముల చరిత్రలు మనభాషలోలేవు. భరతవర్షపూర్వోన్నతి నెరుగుటకు తదంతర్గతదేశముల యితిహాసములు లేవు. "ఆంధ్రులన నెవరు, మనమెప్పుడెట్టి యున్నత్యవస్థలు పొందినాము, నేటికి మనస్థితి కారణములైన సన్నివేశములెట్టివి?" ఈ విషయముల నవగాహనము చేసికొనుటకు నేటివరకును సమగ్రమైన మన చరిత్రములే లేకపోయినవి. ఆంధ్రదేశముయొక్క భౌతిక స్వరూపమునైన తెలిసికొనుటకు మనకు భూగోళశాస్త్రము లేదయ్యె! జాతకగ్రంథములు పంచాంగములు నసంఖ్యాకములు! కాని ఖగోళశాస్త్రము ప్రకటింపబడదయ్యె! మనకు గణితశాస్త్రము లేదు. ఇంజనీరింగు గ్రంథములు, సముద్రమునకు, భూగర్భమునకు, గనులకు లోహములకు సంబంధించిన గ్రంథములును లేవు. కొన్ని ప్రకృతి శాస్త్రములకు ప్రవేశికలే గాని, విపుల పరిశోధనములు తెలుపు నుద్గ్రంధములు లేవు! . . . . . యువకులకు శీల నిర్మాణమునకు దారిచూపు మహాపురుషుల జీవితములు ఒకటి రెండు తప్ప తగినన్ని లేవు. మహాపురుషుల యుపదేశములును, రచనలును లేవు . . . . సంగీతశాస్త్రము యొక్క వికాసమును దెల్పు

యితిహాసము లేదు .... విపులమైన కవుల చరిత్ర లేదు. సమగ్రమైన వాఙ్మయచరిత్ర లేదు. మనకింతవరకు సమగ్రమైన విజ్ఞానసర్వస్వము, నిఘంటువులెవ్వి? ..... ఇట్లైయుండుటచే మనవాఙ్మయము వికాసము లేక, ఎదుగుబొదుగును లేక మారాకువేయక, సభ్యవాఙ్మయముల గణనమున స్థానము లేక గుంటపూవులు పూయుచున్నది. మహాపురుషులను సృష్టించిన జాతియొక్క నాగరికతకు నికషమైన వాఙ్మయము విషయమున, మన ప్రముఖులు ఏమియు తలపక, ఏమియు చింతింపక, ఏమియు పట్టించుకొనక, దేశమును, జాతిని, నాగరికతను, సభ్యతను వెనుకకు నెట్టుచున్నారు కాని ఆంధ్రులు ముందంజవేసినారని యొకకేక వినబడుచున్నది. ఎందుకు? అనుకరణమునందా? అడుగులో అడుగు వేయుట యందా?"

పైచిత్రము చాలా విషాదకరమైనదైనా, చాలామట్టుకు నిజమేనని ఒప్పుకోక తప్పదు. ఇది అంతా విశ్వ విద్యాలయము మూలమంతులు చేయవలసినవి. ఈ విషయము ఎక్కువగా తల్చుకుంటే కష్టముగా ఉంటుంది కాబట్టి విశ్వవిద్యాలయాన్ని యెక్కువగా స్పృశించను. పరీక్షలుచేసి డిగ్రీలిస్తున్నది! మెత్తని పదవులను కొందరికి కలగజేసింది! పై మాటలు 1932 లో వ్రాసినా యిప్పటికీ చాలా వరకు వర్తిస్తూనే ఉన్నవి! పైన శాస్త్రి ఉల్లేఖించినవికాక యింకా అనేక విషయాలున్నా ఆంధ్రులకిప్పటికీ తాకనివి. వాటినన్నిటిని చెప్పి యెక్కువగా విసిగించను. విద్య జనసామాన్యములో వ్యాప్తిస్తేనేగాని పఠనాసక్తి పెంపొందదు. అది పెంపొందితేగాని పుస్తకములు ఖర్చుకావు. అవి ఖర్చౌతూఉంటేగాని ప్రచురణకర్తలు ప్రకటించరు. వేయిప్రతులు ఖర్చు అయిన గ్రంథాలను వెతికితే తెనుగులో చాలా తక్కువగా ఉంటవి. వాటిలో పాఠ్యపుస్తకాల సంఖ్య యెక్కువ! అవి కొనక తప్పదు విద్యార్థిగణము! అట్టిది ప్రచురణముకూడా దేశీయులహస్తాలలో పూర్ణముగా లేదు. ఏ మాక్మిలన్ కంపెనీయో, లాంగుమన్సు కంపెనీయో ఎత్తుకుతీసుకున్నవి. ఇటీవలనే మనవాళ్లు కొందరు విద్యాశాఖవారి సానుభూతిని పొందడానికి ప్రయత్నిస్తున్నారు. రామా, వెంకట్రామా మొదలైన కంపెనీలు ఆ విషయంలో కృషి చేస్తున్నవి. ఇక్కడ మళ్లీ పేచీ! దీనికంతకూ బీజము దేశభాషలలో ఉన్నతవిద్య గరపడము. అది జరిగితే అన్నీ తప్పక జరుగుతవి. కాబట్టి మళ్లీ విశ్వవిద్యాలయ మిక్కడ స్ఫురణకువస్తుంది! ఈ విధముగా సమస్య అంతా అన్యోన్యాశ్రయముగా ఉన్నది! గ్రంథకర్తలు తమ స్వాభిప్రాయాల నియ్యటానికిగాని, తాము నిజమనుకునే విషయాలను తెల్పటానికిగాని

వీలులేదు. ఈ సమస్య రాజకీయములోకి దిగవచ్చుకాబట్టి దీన్ని వదిలివేస్తున్నాను! మన ఆర్థికము, రాజకీయము, మన విద్యా, మన చేతిలోకి వచ్చినదాకానూ, వచ్చినవి కరుడుగట్టిన సనాతనుల చేతులలో ఉన్నన్నాళ్లూ మనకర్మ మిట్లాగే ఉంటుంది! సనాతనులు మతవిషయములోమాత్రమే లేరు! అన్ని విషయాలలోనూ ఉన్నారు. రాజకీయములో సనాతనులు ప్రథమ అడ్డంకి! అది తొలిగితే గానీ అన్నివిధాల సనాతనులూ సెలవు తీసుకోరు!

## సాహిత్యవ్యాప్తి - అనువృత్తి, అనుకరణము:

ఆధునికులు, 16, 17, 18 శతాబ్దాలలో ప్రబంధ కవిత్వము గతానుగతికమై పోయినదని చాలా పలవరిస్తున్నారు. అది నిజము కూడాను. ఈ కాలము (అనగా 1920 నించీ 1940 వరకు) నవ్యసాహిత్యాన్ని చూస్తే పాడిందేపాట! క్రొత్తవాళ్ళు పాతవాళ్ళను అనుకరించటము! ఇదే మార్గము. నవ్యత పురాణము క్రిందికి దిగినది! వీరిలో గవేషణ ఉన్నవాళ్ళకు కొంచెము ఆత్మ పలుకుతూ ఉన్నది. ఇదివరలోనే చిత్తానికి చాలా ఒత్తిడి కలిగించినవాళ్ళకు అవే ఊహలు, అదే పలవరింపు, అదే ఆశ, అదే నిరాశ, అదే మాటలప్రోగు. ఒక కాలానికి నవ్యతఅన్నది మరొక కాలానికి పాతదై పోతుంది. దేశభక్తి ఎవరిలోనో కొందరిలో తప్ప మిగిలినవాళ్ళలో ఆవెనకటి ప్రణయమే, ఆ వెనకటి ప్రకృతే ప్రేరకమౌతున్నది. ప్రకృతియొక్క వైఖరి అనంతమైనా వీళ్ళకు ఒకే విధముగా కనపడడము, ఆ కనపడ్డదాన్ని అనేక భంగులుగా వర్ణించడము! ఈ కాలములో పత్రికలలో, వెనకటి దశవర్షకాలములో పుట్టిన 'గృహలక్ష్మి' చక్కగా భారతి ననుకరించి నడుస్తున్నది. ఒక్కొక్కప్పుడు దానికంటెకూడా ఆకర్షకముగా ఉన్నదా అనిపిస్తున్నది. ఉదయిని, చంద్రిక, మొదలైనవి పుట్టి అనేక కారణాలచేత అంతరించినవి.* వినోదినీత్యాదుల కెప్పటికీ మోసములేదు. గృహలక్ష్మి కేవలము

* "వీణ" అనేపేరుతో పాటిబండ మాధవశర్మగారొక పత్రిక స్థాపించి శ్రమతో నడిపినాడు. "సఖి" (1927-28) అనే పేరుతో కొన్ని సంచికలువచ్చినవి. 'వైశాఖి' అని కొన్ని కూడావచ్చినై! 'మహతి' అనే పేరుతో వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య ఒక పత్రిక తెనాలిలో స్థాపించి కొన్నాళ్ళు నడిపించినాడు. తర్వాత అంతరించినది. ఇతడు 'ప్రేమాంజలి' అనే పుస్తకమురచించినాడు. ప్రేమగ్రంథమాలలో ప్రథమ కుసుమమిది. ఇట్లాగే 'హారతి' అనే పత్రిక ఉండేది. (1927) వేదుల

స్త్రీలకువదిలితే బాగుండేది. కాని దానినిండా కూడా భారతిలో వ్రాసే వాళ్ళవ్రాతలే! పరిశోధకులయొక్కయు, శాస్త్రకర్తలయొక్కయు, చారిత్రకులయొక్కయు, వ్రాతలు చదవటానికి నూతనముగా ఉంటవి. కథకులక్కూడా కొంచెము నూతనత్వము మిగులుతూనే ఉన్నది. కాని యీ ఖండకావ్యకవిత్వము మాత్రము గతానుగతికమూ, అనుకరణూను! భారతిపేజీలు తిరగవెయ్యండి; గృహలక్ష్మి చూడండి; యివ్వేపేర్లు. అటుకొన్ని సరస్వతి గ్రంథమండలిలో నవలలూ ఇటు కొన్ని ఖండకావ్యాలూ! ఆజనమంచివారే; ఆ ఓలేటివారే; ఆ బొడ్డువారే; ఆ పూడిపెద్దివారే; ఆ కొంపల్లివారే; ఆ కవి కొండలవారే; ఆ కందుకూరివారే; ఆ అధికార్లవారే; ఆ పురాణం వారే! ఒక్కొక్కప్పుడు పై శీర్షికక్రింద పేరు చూస్తే చదవబుద్ధికూడా పుట్టకపోవచ్చు. గృహలక్ష్మి కొన్నాళ్ళు పరితలకు కష్టము కలగచెయ్యకుండా చేసినది! నావంటి వాడికి చాలా వీలుగాఉండేది! ఇక కథకులలో ఆ మల్లాది మొదలైనవాళ్ళే! ఒకామె పురాణము వినడానికి వెళ్ళివచ్చిన తర్వాత అక్కడ యేం చెప్పాడని భర్త అడిగాడట! "అక్కడా నీ మొగానే మొద్దులు పెట్టమన్నారన్నదట." ఎక్కడికిపోయినా యీ పేర్లే కనపడుతున్నవి. ఇట్లా అన్నానని వీటిలో మంచిరచనలూ, కొంత నవ్యతా కనపర్చిన వాళ్ళూ లేకపోలేదు.

## గ్రంథరచనము

ఈ కాలములో కొంచెము కవిత్వమంటే మన ప్రాచీనుల అభిప్రాయమేమిటో

---

కామశాస్త్రి ప్రతిభలో వ్రాస్తున్న అతి నవీనవిమర్శకుడు అన్నాడు చూడండి: 'అతినవీనుల రచనలకు తావిచ్చి, బాగా నవీనత్వ. కలిగించి, విశిష్ట సారస్వత సృష్టికి వీణ తోడ్పడితే పత్రిక సార్థక మౌతుంది.' మాధవశర్మగారి ఐశ్వర్యపరిమితి నాకు తెలియదు! ఇట్టి కారణము చేతనే వెనకటి సాహితీత్యాదులు చచ్చినైయని వీరికి మనవి. గృహలక్ష్మి ఒకమారు 1933 సంవత్సరములో 'గృహలక్ష్మి కంఠాభరణ' మనే పేరుతో ఒక చక్కని సచిత్ర సంచిక ప్రచురించినది. దానిలో స్త్రీలుకూడా మగవాళ్ళవలె సర్వసార్వతవీధుల్లో సంచరిస్తున్నట్లు దృష్టాంతాలు చూపుతూ రసవద్గ్యాసపద్య కథావళులు రచించగలరని నిరూపించినారు. కేసరిగారిని అందుకు హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను. మార్గం కనపడితే ఉద్రేకం బైటికొస్తుంది. గిడుగువారూ పంచాగ్నులవారూ యీ సంచిక నాశీర్వదించినారు. ఈ యిద్దరూ వ్రాయడం "యీ సంపుటి గౌరవానికి ఉత్కర్షహేతువులే" అన్నది "ప్రతిభ".

తెలుసుకోటానికి కొందరు నవ్యులు ప్రయత్నిస్తూ, లక్షణగ్రంధాలను వ్రాయించటానికి చేసిన కొందరి ప్రయత్నాలు గ్రంధరూపముకూడా పొందినవి! వెనకటి తరములో అప్పారివారి గ్రంథాలవలె మల్లాదివారి 'దశ రూపకం' వలె, సాహిత్యవిమర్శన గ్రంథాలు, రాఘవయ్యంగారి "అలంకారమంజరి, కావ్యాత్మలు" బులుసు వెంకట రమణయ్యగారి "కువలయానందసారము" గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారి "ఆంధ్రనాటకరంగం," భోగరాజు నారాయణమూర్తిగారి "ఆంధ్రకవిత్వ చరిత్రము' పసుమర్తి యజ్ఞ నారాయణశాస్త్రిగారి "నట ప్రకాశిక," కవిత్వవేది "వాఙ్మయచరిత్ర సంగ్రహం," నడుకుదుటి వీర్రాజుగారి "నన్నెచోడుడు" మొదలైనవి ప్రశంసనీయాలు, ఇక వ్యాసకర్తలలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, దువ్వూరి సూర్యనారాయణమూర్తి, మారేపల్లి రామచంద్రశాస్త్రి,* టేకుమళ్ళ కామేశ్వరరావు, పాటిబండ మాధవశర్మ, కీ.శే. అమరవాది హనుమచ్ఛాస్త్రి, కొణిదెన బాలకృష్ణయ్య, శ్రీపాద కామేశ్వరరావు, రాధాకాంతయ్య, తాపీధర్మారావు, రాజా పార్థసారధిరాయనింగారు, ఆచంట బాపిరాజు, ఆకెళ్ళ శేషాద్రి, కర్రి సాంబమూర్తిశాస్త్రి, చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాదు, చర్ల గణపతిశాస్త్రి, జ. మాధవరామశర్మ మొదలగువారి వ్రాతలు చాలా ప్రశస్తముగా ఉన్నవనక తప్పదు. వీరున్నూ యింకా యితరులూ మన లక్షణశాస్త్రాన్నీ పాశ్చాత్యుల

* టేకుమళ్ళ రాజగోపాలరావుగారు ఛందస్సులోను, టేకుమళ్ళ కామేశ్వరరావుగారు లిపివిషయములోను కొన్ని నూతన సలహాలిచ్చినారు. వారు నూతన ఛందస్సు లుపయోగించ మన్నారు. వీరు లిపిగుర్తులను సూచించినారు.

రామమ్మ=రావఁమ్మ

ఫ్రా = Pharmacy

ఉ,ఆ, మొదలైనవి.

కామేశ్వరరావుగారు సర్కారుద్యోగి. ఈయన పిల్లలకోస మనేక పాటలు వ్రాసినాడు. పాలపిట్ట మొదలైనవి పిల్లలకు చాలా ఉపయోగార్హాలు. ఈయనకు ప్రభాకర శాస్త్రి లక్ష్మీనరసింహశాస్త్రిగారు తమ "ఆంధ్రప్రతిభ"ను అంకితమిచ్చినారు. వీళ్ళు కూడా కొన్ని గ్రంథాలను రచించినారు. వాటిలో పుష్పబాణవిలాసమనువాదం; 'పుష్పమాల' ఖండకావ్యము.

ఈ కాలములో పూలతోట-మాసపత్రిక-హనుమకొండనుంచీ

'సుధ' అనే పత్రిక కుటుంబరావు సంపాదకత్వానా వచ్చి సేవచేసినవి.

'వాణి' అనే పక్షపత్రిక 'ప్రజామిత్ర' వారపత్రిక గూడవల్లి రామబ్రహ్మంగారి సంపాదకత్వాన వెలువడినవి.

వాన్నీ సమన్వయము చెయ్యటానికి ప్రయత్నాలు, ప్రత్యక్షంగా కాకుండా, పరోక్షంగానైనా చేస్తున్నారు. తూములూరి శివరామకృష్ణశాస్త్రిగారు తమ ఉభయభాషాపాండిత్యాన్ని తమ "నవ్యాభరణం" మొదలైన విమర్శనవ్యాసాలలో వ్యక్తీకరించినాడు. పూర్వుల పాండిత్యం కలిగి నవీనాన్ని సహృదయదృష్టితో చూడటంలో వీరి రసపిపాస, నిష్పక్షపాతబుద్ధి తెల్లమౌతున్నది. రాయప్రోలువారి 'తృణకంకణా'నికి పైన పేర్కొన్నవ్యాసం చక్కని విమర్శనం. 'తెనుగు తల్లి'లో పోతన్నను గూర్చిన వ్యాసం పాండితీ సమన్వితమూ, విశేషాంశ సంకలితమూ, మనోహరమూ, అనకతప్పదు.◆ వేదాల తిరువేంగళాచార్యులుగారి 'ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తి' చాల గొప్ప గ్రంధము. అనే కాంధ్రగ్రంధాలలో నుంచీ ఉదాహరణా లిచ్చినాడు. ప్రతి ఆంధ్రుడు చదనవలసిన గ్రంధమిది! ఆంధ్ర ధ్వన్యాలోకము రూపొందుతున్న దీకాలానికి.

# శాస్త్రములు-పరిశోధన-చరిత్ర

ఇక శాస్త్రవిషయాలలోనూ, పరిశోధనవిషయాలలోనూ, కోరాడ రామకృష్ణయ్య, పరవస్తు వెంకటరామానుజస్వామి, డాక్టరు నారాయణరావు, రాజగోపాలరావు, సోమయాజులుగార్ల భాషావిషయాల్లోనూ కామరాజు, మల్లంపల్లి, భావరాజు, మానవల్లి, వంగోలు, హరేమండ, నేలటూరి, మొదలైనవారు చారిత్రక విషయాలలోనూ;✻ గొబ్బూరీత్యాదులు జ్యోతిశ్శాస్త్రంలోనూ; దువ్వూరి బాలకృష్ణమూర్తి ఆర్థిక, వ్యవసాయాదిక విషయ వ్యాసకర్త కొండేపూడి సుబ్బారావు, గొటేటి జోగిరాజు మొదలైనవారు వ్యవసాయశాస్త్రములోనూ; ఆరోగ్యశాస్త్రములలోనూ; చిత్రకళలో తలిశెట్టి రామారావుగారూ; చేసిన కృషి చాలా ప్రశంసనీయము. రాజకీయములో

---

◆ ఈయిన "నరసభూపాలీయ వివరణ" మనేపేరుతో భట్టుమూర్తిగ్రంధానికి వాఖ్యానము రచించినాడు. సన్నిధానమువారున్నూ వ్యాఖ్య రచించి ప్రచురించినారు.

✻ కపిల కాశీపతిగారు నాగార్జునకొండనుగూర్చి ఆంధ్రజాతికి తెల్పినందుకు ఆయన కాంధ్రదేశమంతా కృతజ్ఞం! బుర్రా వెంకటసుబ్బారాయుడుగారు వేదకాలాన్నిగూర్చి చాలా పరిశోధనము చేసినాడు. కంభంపాటి అప్పన్న శాస్త్రిగారు వరంగల్లులోని కాకతీయులకు సంబంధించిన 'వేయిస్తంభాలగుడిశాసనాన్ని' గూర్చి చాలా శ్రమచేసి ఒక గ్రంధము రచించినాడు. ఇతడు అస్తమించినాడు ఇటీవలనే.

చావలి వెంకటహనుమంతరావు, మోచర్ల కృష్ణమూర్తి, వల్లూరి సూర్యనారాయణరావు, నార్ల వెంకటేశ్వరరావు (స్వదేశ సంస్థానాలు వ్రాసినాడు) తిమ్మరాజు సత్యనారాయణ (గాంధీగారి లండన్ ఉపన్యాసాల్ని అనువదించినాడు) మొదలైనవారు చాలా శ్రమపడినారు.◆ కవులు, గాధలు అనే పుస్తకాన్ని ప్రచురించినాడు. ఏనుగుల వీరా స్వామయ్యగారి కాశీయాత్ర అనే ఒక ప్రాత తెనుగువచనకావ్యం పునర్ముద్రించి భాషాసేవ చేసినాడు. ఈ గ్రంధము మొదట 1838 లో ముద్రితమైనది.

కొందరు మహాపురుషుల జీవితచరిత్రలు వ్రాసినారు. వారిలో ముప్పంగి లక్ష్మీనృసింహశర్మ, అడివి శంకరరావు, కోన వెంకటరాయశర్మ, కపిల కాశీపతి, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఆంధ్రరచయితల కర్త మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, మహామేధావులు- అని ప్రచురించిన (ఆంధ్రావళి గ్రంధమాల తరపున) గొబ్బూరివారు మొదలైనవాళ్ళున్నారు. ఈసందర్భములో పైవారు అవలంబించిన "భాషాచిత్ర" పద్ధతి చాలా ప్రశంసించదగిఉన్నది. వెనకటి జీవిత చరిత్రలేగాక యివి భాషాచిత్రాలు. శీలపరీక్షలు. సత్యనారాయణగారి "ఆంధ్ర మహాపురుషుల జీవితము"లూ, అవటపల్లి నారాయణరావుగారి 'విశాలాంధ్రమూ' చెప్పదగిన గ్రంధాలు. "విశాలాంధ్రం" పుస్తకము యింకా విశాలమూ, కర్త చిత్తము విశాలమూ అయినట్టైతే యింకా బాగుండేది! సత్యనారాయణమూర్తిగారు "మహాపురుషులజీవితాలే" గాకుండా యింకా 'సాహిత్యతత్వవిమర్శ' 'విద్యార్థిప్రకాశిక' మొదలైన గ్రంధాలేగాక యింకా తాను యెక్కడికెళ్ళినా తద్యాత్ర ఒక గ్రంధము చొప్పున తయారుచేసినాడు. ఈయనను దినైక గ్రంధనిర్మాత అనవచ్చు. గ్రంధ నిర్మాణమంటే యీయనకు 'నల్లేరుపై బండినడక'. అంతేగాక యెక్కువభావమూ అర్థమూ లేకుండా వందలపేజీలు నింపగల సామర్థ్యమీయనకున్నదని కొందరంటారు.* ఇతడనేక నవలలను రచించినాడు. ఇదిగాక ఆంధ్రపత్రిక

◆ మొసలిగంటి సంజీవరావుగారు "మహారాష్ట్ర స్వాతంత్ర్యవిజృంభణం" వ్రాసి జాతికుత్సాహము కల్పించినాడు.

* అది కొంతవరకునిజమే (చూ ఆంధ్రపత్రికలో భద్రాచలంగూర్చి వ్రాసినాడు.)

ఈయన చాలా విపులముగా చదివినవాడవడం చేత ఈయన గ్రంధాలలో లనేక గ్రంధాలలోనించి అనువాదాలు అసంఖ్యాకులుగా ఉంటై. ఈయన ఒక విశిష్టశైలిని సంపాదించినాడు

గ్రంథవిమర్శన శాఖలో ఒక అగ్రపీఠమధిష్ఠించినాడు. నవ్యసాహిత్యవేత్తలకు తమ "ఆత్మప్రియ"మందు అత్యంతాదరము. సమకాలికులైన మహాపురుషులను గూర్చి వ్రాయడము చాలా కష్టము! అటువంటి సత్యనారాయణగారి కృషి చాక చక్యమూ చాలా ప్రశంసించదగినవి.◆

హాస్యరచనలో భమిడిపాటి కామేశ్వరరావుగారు "అపుడు, ఇపుడు, మాటవరుస, కాలక్షేపం, అవును, నిజం" మొదలైనవి ఈయన గ్రంథాలు: తమ వ్రాతలను భారతి పుటలద్వారా ఆంధ్రావళి కందిస్తునే ఉన్నాడు. ఈయనతోపాటు నందివాడ చిదంబరంగారు ఆశ్రేణిలో చాలా ప్రశస్తిని పొందినాడు. 'వర్తకమందం' 'దేవునిపై విశ్వాస రాహిత్య తీర్మానం'లోని హాస్యము రసపరిణతిని పొందినదనడములో ఎట్టి అభ్యంతరము లేదు భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యాల తర్వాత యీయన ఉన్నత స్థానమియ్యదగినవాడు (1912-) కొన్ని దినములు ఈయన ఒక పత్రికను సంపాదించినాడుకూడ. మేడిచర్ల అంజనేయులు అనే ఆయన. ఖాసింఖాను పారశీక వాఙ్మయచరిత్ర వ్రాయడమేగాక, డాక్టరు మహమ్మదు యెక్బాలుగారి భాషాసేవ నుగ్గడించడమేగాక, హాఫీజ్ మొదలైన పారసీక కవుల వ్రాతలనూ, యెక్బాలు వ్రాతలనూ, కొన్నింటిని తెనుగు భాషలోకి తెచ్చి భాషకు అలంకారాలను కల్పించినాడు. కీట్సు వ్రాసిన కొన్ని ఖండకావ్యాలను తెనిగించినాడు. మిక్కిలి

---

ఆంగ్లంలో కార్డినల్ న్యూమెన్ యొక్క భాషాభావ వైదగ్ధ్యం కొంత చూపెట్టినాడు ఈయన శైలిలో నుటన్నారి శైలి లక్షణాలు కొన్నున్నై! ఈయన అవకాశమువస్తే భారతీయ విజ్ఞానోత్కృష్టాన్నుగ్గడిస్తుఉంటాడు చళ్ళపిళ్ళ, బలిజేపల్లి మొదలైన అనేకుల మెప్పును పొందినాడు వ్రాసేభాషాభావాలకు బుర్రా శేషగిరిరావుగారిట్లా అన్నారు:

"This talented young Andhra author - as a prolific writer, attempting new sallies of style, treatment and outlook, in Telugu prose, critical descriptive and imaginative after the manner of the foremost of European essayists." ఈయన బహుగ్రంథ నిర్మాతల్లో చేర్చవచ్చు ఆధునికుల్లో ధర్మస్థాపనకై పాటుపడుతున్న కొద్దిమందిలో ఒకడు.

◆ గోవిందరాజుల సుబ్బారావు మొదలైనవారు కొందరు, పరమపదించిన మాస్టరు అంజి, పిల్లలమర్రి సుందర రామయ్య మొదలైన నటులజీవితాలనూ వాళ్ళ సామర్థ్యాలనూ స్పృశించినారు.

శ్రోత్రపేయముగా ఉన్నది. ఖురాన్‌కు సవివరణాంధ్రానువాదము వ్రాస్తూ మూడు సంచికలు ప్రకటించినాడు.

## బాలవిజ్ఞానము

బాలవిజ్ఞానశాఖకు చింతాదీక్షితులు మొదలైనవారు తంటాలు పడుతూనేఉన్నారు.* కొందరు ప్రాతపాటలను పరిష్కరించి భారతి పేజీలలో ప్రకటించినారు. కొందరు పెద్దలు మండపాక, ముద్దుకృష్ణేత్యాదులు చిన్న పిల్లలకు పాటలు రచించినారు. బాలవిజ్ఞానశాఖ యితర వాఙ్మయాల్లో ఎంత పెరిగిపోయినదో చెప్పలేను. మనము చేసినది ఆవగింజలో అరవైయోవంతు లేదు. ఇక్కడకూడా శాస్త్రాలలో ఎంతపని చెయ్యవలెనో అంతపని చెయ్యవలసి ఉన్నది. శాస్త్రాలంటే జ్ఞాపక మొచ్చినది:

పూర్వమీమాంసాశాస్త్రాన్ని కాలేజీలో మా గురువులలో ఒక రగు శ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు ఉపన్యాసాలక్రింద రచించినారు. వీరు ఇతర దర్శనాలను గూర్చికూడా వ్రాయటానికి సమర్థులు కాబట్టి యితరాలనుగూర్చి కూడా వ్రాస్తే బాగుండును. వీరు గోదావరిజిల్లా అమలాపురము వాస్తవ్యులు. చాలా నిరాడంబరజీవి! నిగర్వి! ఉపకారవేతనము దీసుకుని విశ్రాంతి ననుభవిస్తున్నారు. భగవంతుడు దీర్ఘాయు విచ్చుగాక! ఈ కాలములో ప్రకృతిశాస్త్రాలమీద ఒక్కటంటే ఒక్కటే ఉద్గ్రంథము వెలువడినది. కాళీపట్నపు కొండయ్యగారి "విశ్వరూపం" యీ యుగాభరణం అని చెప్పవచ్చు! వ్యావహారికభాషలో ఉదాత్తభౌతికాదిశాస్త్ర విషయాలను అందరికీ అర్థమయ్యేటట్టు రచించి, శాస్త్రాలకూ వేదాంతానికీ సంబంధము కల్పించి, మానవుని విజ్ఞానానికి తోడ్పడే యీ గ్రంథం యీ యుగానికి మకుటాయమానమైన వాటిలో ఒకటనటంలో యెంత మాత్రం అభ్యంతర ముండకూడదు. నవ్యకవితఅంతా ఒక యెత్తు యిది ఒక్కపుస్తకం ఒకెత్తు! ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు దీనిని ప్రచురించటంకూడా ఒక విచిత్ర విషయం. పారిభాషిక పదాలకు భాష వెతుక్కో నక్కర్లేదని యీ గ్రంథకర్తగారు చూపినారు!

* తెనాలిలో 'బాలకేసరి' అనే పేరుతో ఒక మాసపత్రిక ప్రకటిస్తున్నారు.

ఇదిగాక హిందూదేశార్థిక శాస్త్రంమీద ఒక గొప్ప గ్రంథము వెలువడినది. ఉత్మకూరి గోవిందాచార్యులొక గొప్ప త్యాగజీవి. (1901) ఈయన పై కెంత అనాకర్షకుడుగా కనపడతాడో అంత లోపల ప్రతిభా వంతుడు. గాంధిగారివలె కొల్లాయి మాత్రమే వస్త్రముగాకల త్యాగశీలుడు. ఎన్ని సత్యాగ్రహసమరా లైనాయో అన్నిమాట్లూ శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళిన కార్యశూరుడు. మృత్యువు కంటబడ్డప్పుడు కూడా భయము లేకుండా మనస్సు చలించని పట్టుదలకలవాడు.* ఈయన పండితుడు, కవి, రాజకీయవేత్త! ఈయన రచించిన "హిందూ దేశార్థిక చరిత్ర" చాలా గొప్పగ్రంథము. రెడ్డిగారి దానికంటె పరిమితిలో విషయచర్చలో, ఆధునికతలో, శబలత లేకుండా నిష్కృష్టముగా చెప్పటంలో, చాలా ఉత్కృష్టమైనది. అన్నిటికంటె దానిలో ఇతరులను నిందించే సందర్భాలు లేవు! రెండు సంపుటాలలో చక్కని శైలిలో రచింపబడినది. పరిభాషా పదజాలస్పష్టిలో ఆచార్యులు గారు చూపిన విశిష్టత కొనియాడదగినది. కొన్ని చోట్ల కొందరు వ్రాసినట్లు ద్రావిడ ప్రాణాయామాల వలె ఉండకుండా పారిభాషిక పదజాలము ఆపాతతః తెలిసేటట్టుగానూ, సులభముగానూ, పొట్టిగానూ ఉన్నవి. ఈయన 'గోవింద రామాయణము' నే పేరుతో ఒక ఉత్తర రామాయణ కథా గ్రంథాన్ని పద్య ప్రబంధముగా రచించినాడు. ఈయన "రాజ్యాంగ చరిత్రను" కూడా వ్రాసినాడు. ఏది వ్రాసినా సలక్షణముగానూ, నిష్కృష్టము గానూ, రసవంతముగానూ వ్రాయగల సమర్థుడు. రెండు శాస్త్రగ్రంథములూ రెండు రత్నములని చెప్పవచ్చు. రామాయణము అనర్గళధార కలిగి యెక్కడా కుంటు పడకుండా ఒక్కమారు చేతపుచ్చుకుంటే విడవశక్యము కాకుండా, అపాత మధురమై, ద్రాక్షాపాక సంకలితముగా ఉన్నది పండితపామరజన హృద్యముగా ఉన్నది.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి 'ఆంధ్రభాషాచరిత్ర'-ఈ భాషకు మండనాయమనమని చెప్పడములో ఏమీ అతిశయోక్తి లేదు. దానికి అగ్రస్థానాన్ని చ్చినది కర్త స్వతంత్రపరిశ్రమే! స్వతంత్రపరిశ్రమ యెప్పుడూ వృథాపోదు.◆ ఇక

---

* ఈయన సత్యాగ్రహి అనే వారపత్రిక 1924 లో స్థాపించి చాలదినాలు నిర్వహించినాడు కవివారపు సుబ్బారావు నడిపిన 'పల్లెటూరు' అనే పత్రిక దీనిలో లీనమైనది.

◆ ఈయన వాఙ్మయ చరిత్ర కారుడూ వైయాకరణీ మాత్రమే గాడు! ఈ రెండిటితో పాటు చక్కని కవితాశక్తికలవాడు. "భవిష్య పర్వము" కూడా వచ్చేసింది. 'ప్రేమతత్త్వము' నే కావ్యాన్ని భారతిద్వారా పూర్తిచేసుకొన్నాడు.

నారాయణరావుగారి గ్రంథము వారి జీవిత కష్టఫలం! ఆయనకేనాడు కాల్డ్వెల్ సిద్ధాంతముమీద నమ్మకము కలగలేదో అప్పటినించీ పరిశోధనము చేయడము మొదలుపెట్టి విషయాన్ని సేకరించడము ప్రారంభించినారు. ఆంగ్లములో "Dravidian Phylology." అనే గ్రంథము వ్రాసినాడు ఇతర పత్రికలలో వ్రాసినాడు. తుదకు తన యావత్పరిశోధనాన్ని యీ గ్రంథరూపముగా పెట్టినాడు.

కోరాడవారు కూడా కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని గట్టి చెయ్యడానికి తెనుగులో సంధి స్వరూపములో, ద్రావిడచిహ్నాలున్నయ్యని స్పష్టీకరిస్తూ "సంధి" అనే గ్రంథాన్ని వ్రాసినాడు. కాల్డ్వెల్ భాష్యానికిది వార్తికమని చెప్పవచ్చు. ఇపుడు గంటివారు 'ఆంధ్రభాషావికాస' మని ఒక ఉద్గ్రంథము వ్రాసినారు. ఈ యిద్దరిపరిశ్రమ ఫలంగా తెనుగు నిజస్వరూపము కొంత తెలుసుకోవచ్చు.

## కావ్యము - రాజకవులు

కావ్యము దగ్గరకు వస్తాను. మొదట కొందరు రాజకవులను పేర్కొంటాను. శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజులుంగారు రాజ్యప్రాప్తికిపూర్వ మెంత కవిపండితులో, కవిపండితపోషకులో, తర్వాత గూడా ఆ గుణాలు అనువృత్తాలైనై◆ వీరి కాలములో అనేక గ్రంథాలు కృతిని పొందినారు. వాటిలో సెట్టి లక్ష్మీనరసింహం గారిదిన్నీ కాళ్ళకూరి గోపాలరావుగారిదీ ముఖ్యాలు. గోపాలరావుగారి "సౌందర్యమంజరి" గాఢముగా చదివే అవకాశము కలిగినది నాకు. గోపాలరావుగారు అనేక గ్రంథాలను రచించినాడు. వాటిలో కొన్ని చాలా యెన్నదగినవి. శ్రీవారికి కృతిచ్చిన గ్రంథముగా "వాల్మీకి చరిత్ర" అనే మనస్తత్త్వ ప్రధానమైన నాటక మొక టున్నది. అది ఒక్కొక్కచోట అనగా ప్రాచేతసుని చిత్తవృత్తి మార్పు, జ్ఞానోదయము కలిగినప్పుడు చదువుతూఉంటే, షేక్స్పియరుకవి నాటకము చదువుతున్నట్టుంటుంది. ఈయన కవిత్వము గంగాజలమువలె స్వచ్ఛమై సర్వలక్షణలక్షితమై ఉంటుంది. కాని కొంచెము ప్రయత్నించినట్టు మాత్రము సూచనగా కనపడుతూ ఉంటుంది.

◆ వీరి విద్యాప్రీతి, తత్ఫలమైన టెక్నాలజీ కాలేజీలనుగూర్చి ఆంధ్రలోక మిదివరకే యెరుగును.

"సౌందర్య మంజరి" ఉపోద్ఘాతములో వారి మత్వాన్ని చాలా ఉగ్గడించి చెప్పినాడు. రసానికీ, ఉపాసనకూ సామరస్యము కలిపినాడు. శ్రీ విశ్వదాతగారి పోషణలో ఉండి యిటీవలనే పరమపదించి కీర్తికాయుడైనాడు. సెట్టి లక్ష్మీనృసింహంగారు శ్రీవారికి చిరకాలమిత్రులై, శ్రీవారిచేత భ్రాతృనిర్విశేషముగా చూడబడినాడు. ఈయన చాలా గ్రంథాలు రచించినాడు. వెనక వారి రవివర్మ చిత్రపద్యాలను గూర్చి మనవి చేసినాను. ఈయన మొదట వ్యావహారిక భాషవాదియై తుదకు గ్రాంధికములోనికి వెళ్ళిపోయినాడు.. (నేడు కూడా వారి విమర్శనానికి గురైనా నొకమారు.) శ్రీవారి పాండిత్య సహాయముతో నన్ను విమర్శించినా డాయన! వీరిద్దరి గ్రంధాల కృతిభర్తైన శ్రీ వర్మగారిని గూర్చి యెక్కువగా చెప్పేదేమీ లేదు. ఏనాడు మానవతీ చరిత్రను (వెనుక ప్రశంసించినాను) చదివినానో అప్పటినించీ అనగా 30 సంవత్సరాలనించీ వీరు రచనలు సాగిస్తూనే ఉన్నారు. వీరికి సంప్రదాయమూ, నీతీ, చాలా ముఖ్యాలైన విషయాలు. ఆర్యమతంమీద వీరికున్న గౌరవం చాలా గొప్పది. వీరి గీతాలలోనూ, వ్యాసాలలోనూకూడా యెప్పుడూ సంప్రదాయాన్ని నీతినీ బోధిస్తూ ఉంటారు. వీరి "మాయామహత్వమ" నే ఖండగీతి ప్రకృతిరహస్యాన్ని ఉగ్గడిస్తూ ఉన్నది.* తరువాత శ్రీ ఉయ్యూరు రాజుగారూ, రామచంద్రప్పారావుగారూ, **పీఠికాపురం** యువరాజు గారూ ప్రశంసించదగినవారు. ఉయ్యూరురాజుగారు బహు కావ్యనాటక నిర్మాతై కీర్తి గడించినాడు.◆

---

* "కేవలము గ్రాంథిక **భాషాభిమానులు**, అయినను కాలానుగుణమగు సంస్కరణము అంగీకరించెదరు. కావుననే 'నేటి తెలుగు' అను వ్యాసములో "వాటిని అయితే, కూతురును" యిత్యాదులు గ్రాహ్యము లన్నారు. అంతే కాదు. మల్లాదివారి చారిత్రక వ్యాకరణమునకు కృతిభర్తలైనారు."

వీరు ఆంధ్రదేశములో సారస్వత సంచారము చేస్తూ వ్యక్తులకు, సంస్థలకు, మిక్కుటముగా వదాన్యత చూపిస్తున్నారు. (కృష్ణాపత్రిక 14-6-41)

◆ శ్రీ వెంకటాద్రి అప్పారావుగారిని గూర్చి "ఆంధ్రి" "భాద్రపది"లో ఇట్లా వ్రాసినది. "---ప్రభువులై, కవులై, పండితులై, భాషాభిమానులై, ఆంధ్రరచయితలలో నొకరుగా నభినుతింప బడుతున్నారు.-- అష్టపదుల నిటీవల నందమైన యాకృతిలో తీర్చి దిద్ది యాంధ్రీకరించిరి. వచస్పందర్భశుద్ధి నెరింగిన జయదేవుని మధురగేయములను తెనుగుపాటలుగాను, శ్లోకములను పద్యములుగాను, మార్చి 'ఆంధ్రజయదేవుడ'ని పించుకొనినా రప్పారావుగారు-- అప్పారావుగారి

* రామచంద్రఅప్పారావుగారు కూడా ఒక రాజకవి. *నాల్గోవారు పిఠికాపుర యువరాజుగారు ఇప్పటి నవ్యమార్గములో నడుస్తున్నారు ప్రతిభ 1940 సంపుటము వారిరచనతో ప్రారంభమైనది. మూడవ సంపుటములో "శ్మశానస్వప్తి" అనే ఖండకావ్య మొకటి ఉన్నది. ఉత్తమమైన భాషాభావములు! మృతుని హృదయ గహ్వరములో భావాలను చక్కని భాషలలో గుదిగూర్చి చెప్పినారు.! 'భారతి' లో "అభాగ్యుడు" అనే ఖండకావ్యములో దుఃఖంయొక్క ప్రకృతిని చక్కగా వివరిస్తూ యీ క్రింది భావము వెలిబుచ్చినారు.

...... యేడ్పువచ్చినయడ కంటినీళ్ళు
తోడు రాకున్న బ్రతుకుట దుర్లభంబు"

వివాదం తిట్లతో అంతమైనట్టు, దుఃఖము బాష్పాలతో అంత మొందుతుంది! అట్లాగాక కరుడుగట్టి యేడ్పురాని దుఃఖం దుర్భరము! పాంథుడు, వాన, కేక- తుదకు ఆత్మహత్య! చక్కని శోకరస గోళముగా వర్ణించినారు! ఇటువంటి కావ్యాలలో కారణము కోసమువెదక కూడదనేది మాత్రము జ్ఞాపకముంచుకోవలె పాఠకుడు. వీరు రెండు సాంఘిక నాటకాలనుకూడా వ్రాసినారు. రెండుకూడా ప్రతిభలో విమర్శింపబడ్డవి! 'స్వార్థత్యాగము' - 'ఆలోకము నుంచీ ఆహ్వానము.' స్వార్థత్యాగములో కొంచెము పాశ్చాత్యానుకరణమున్నది. ఈ కాలములో అది ఉండడము లోపము

---

కవితాభిరుచితోపాటు, చిత్ర కళారసాభిరతియు సీకృతిలో నేరులై పారుచుండును.-- ఈయన రాధాకృష్ణప్రేమో పాసకుడు. వారి చిత్రకళానికేతనము దీని కుదాహరణముగా చూపవచ్చును.- - వీరు జ్యోతిషములోకూడా నధిగతప్రవేశులు. 'జ్యోతిర్లీల' నాటక మరసిన దచ్ఛాయలు కొంతవరకు గొచరించును. -- ఈ రాజవ్యక్తి నిరాడంబరజీవి. ఇతర భూవరుల కొరవడి.

* "చినుకుల చిందులు" అనే పేరుతో సచిత్ర ఖండకావ్య సంపుటి ఒకటి ప్రకటించినారు దానిలో అదివరకు ప్రకటితాలు కొన్ని, అప్రకటితాలు కొన్ని ఉన్నై. చిత్రాలలో ఒకదానిలో 'కేశవ' ' అనే పేరున్నది. దీనిలో కూడా ఒ రాయనకు కొంచెము శ్రీశ్రీ గారి గాలి తగిలినట్లుకనపడుతుంది వచనపద్యవిభాగములేదు. అక్కడక్కడా "మంటల నాలుకలు" "శ్మశానం"' వగైరాలు కనపడుతున్నై! శబ్దధ్వనికోసము చాల శ్రమపడినారు రమణీయత కొరవడుతున్నది. కర్తయొక్క ఐశ్వర్యము మాత్రమే ప్రతిబింబిస్తున్నది.

కాదు! రోండో నాటకము విడాకులసిద్ధాంతము యొక్క రెండు వైపులూ చూపడానికి పుట్టినట్టు కనిపిస్తుంది.*

# నవ్యకవులు

వెనకటి దేవులపల్లి, వేదుల, దువ్వూరీత్యాదులు కొంచెము రుద్ధ కంఠు లయినట్లు కనపడతారు. దువ్వూరి క్వాచిత్కముగా "ఖయాముప్రశంస" వంటివి వ్రాసినాడు. వేదులవారు కొన్ని కథానికలు గద్యలో రచించినారు. కృష్ణశాస్త్రిగారు "ఊర్వశీ" ప్రకటనము చేసిన తరువాత అట్టే గానము చేసినట్టు కనపడదు. ఇది మొదటి విశేషము.

సభాపతిగారు తమ పద్యనాటకాలను "పలితకేశము" "ప్రేమ పరీక్ష" "మేడూరివారి కోడలు" "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" మొదలైనవాటిని చక్కగా హృదయంగమముగా ఒక దానిని మించినట్టు మరొక దానిని రచిస్తూ వచ్చినారు. కవితలో క్లిష్టతపోయి సౌలభ్యమెక్కువకావడం, భావాలు ధారావాహికగా ప్రవహించడం, అప్రయత్న గ్రథనము కనపడడము మొదలైనవి, ప్రజ్ఞా పరిణామ సూచికాలు. ఈ గుణాలన్నీ సభాపతిగారి రచనలలో బాగాకనపడుతున్నై! ప్రతిభలో ప్రకటితమైన "దీక్షితదుహిత" పైన విమర్శన మొకటి భారతిలో వావిలాలవారు వ్రాసినారు. దానిలో సభాపతి రచనలయొక్క క్రమపరిణామము చాలా చక్కగా తెలియజేసినారు. "వాకోవాక్యాన్ని" కూడ వ్రాసినారు. (చూ.కృష్ణరాయాభ్యుదయసంచిక) ఈ క్రింది విమర్శకుడి మాటలే నా మాటలుగా గ్రహించమని మనవి. "ఆధునికాంధ్ర సాహితీ

* వీరు 'వసంతగీత' 'నీలిరత్నాల'నే ఖండకావ్యసంపుటులేగాక 'అమరకావ్య' మనే పేరుతో ఉమర్ ఖయ్యుమును అనువదించినారు. దీని అనువాదాలు చాల ఉన్నై! దువ్వూరివారు 'పానశాల' అనీ, రాయప్రోలువారు 'మధుకలశమనీ', యింకా చిలుకూరి నారాయణరావు మొదలైనవారూ భాషాంతరీకరించినారు. వీరందరూకూడా మాతృకకు ముగ్ధులై రచించినవారే! ఇవన్నీ బాగున్నవనే చెప్పచ్చును. ఆదిభట్లనారాయణదాసుగారు కూడా దీన్ని సంస్కృతాంధ్రాలలోనికి అసలు పారసీకభాషలోనుంచి పరివర్తనంచేసి తారతమ్యం చూపడానికి నాలుగు గ్రంధాలను కలిపి ప్రచురించి చాల శ్రమపడినారు. ఈ శ్రమకు శ్రమే ఫలమైనది! సహజకవులు కూడా ఒక్కొక్కప్పుడు తమ గ్రంధాలతో రసావిష్కరణము చెయ్యలేకపోవడము మనము చూస్తూ ఉంటాము! ఈయన 'వాలుజడ, ఉపాసన' అనే రెండు గ్రంథాలిటీవల ప్రచురించినాడు.

ప్రపంచములో వ్యుత్పన్నత, ఉపజ్ఞ, రెంటినీ పొదిగించుకున్న కవులు కడుంగడు దుర్లభులు. నూతన రచనా సంప్రదాయాలకు మార్గదర్శకులై, నవ్యసాహిత్యాచార్య పదవిని అధిష్ఠించిన శ్రీ శివశంకరశాస్త్రిగారు వీరిలో ఒకరు." ఈయనకు రూపకవిధానముమీద యెక్కువప్రీతి. అందుచేత "సంవాద ఖండికలనూ" "పద్యనాటికలనూ" యెక్కువ గౌరవించినాడు. ఈ విషయములో పాశ్చాత్యాధునిక నాటక కర్తల ననుసరించినాడు. కాని ఈయన రచనలు మొదటినుంచీ, అనగా నవలారచనదగ్గరనుంచీ, చివర వరకూ, గ్రాంథికవ్యవహారిక భాషాప్రయోగములోనూ, ప్రాచీనాధునాతన భావప్రకటనములోనూ, శబ్దగ్రథనములోనూ, కాలానుసారముగా, రుచ్యనుసారముగా మారుతూ పూర్వాధునికుల యిద్దరిమధ్య ఒకవిధమైన వంతెనై, సారస్వతానువృత్తికి దోహదము చేసినైయని ఘంటాపథముగా చెప్పవచ్చు. రెండు రకాల కావ్యపద్ధతికీ, తద్రచయితలకూ కూడ సామరస్యం కలగ జెయ్యడమే ఈయన గొప్ప సారస్వత సేవ. సభాపతిగారి రచనలో ఆయన మనఃపరిణామము కూడా కనపడుతూ ఉంటుంది. తుదకు సంప్రదాయంమీద, సహజ మానవ క్షమమీద దృష్టి తొలగలేదనీ, వీరి సహజ మనోవృత్తి కాలానుగుణమైన మార్పనీ, యీయన చిత్తవృత్తి నిరంతర దుఃఖభాజనము కాకపోవడమే కాకుండా దాని సహజగుణము సంతోషమే అనీ తెలుస్తుంది. దువ్వూరివారివలె వీరికి భార్యావియోగము 'బొగ్గులమసిభగ్నశల్యములు'గా గోచరించి కవితాస్రవంతి కొంత కాలము ఆగలేదు. ఇక్కడ కవికీ సామాన్యులకూ భేదముండేది! ఈతత్వమే ఆయన్ని యితరులనించీ వేరుచేసేది. వీటిల్లో చాలా సభాపతిగారు* తన స్నేహితులకీ స్నేహితు రాండ్రకీ

* భారతి, విక్రమాషాఢము. ఆంధ్ర పత్రికలో వంగల శ్రీరామావధానిగారు విమర్శించినారు. (ఆంధ్రపత్రిక సారస్వతానుబంధాలు. డిసెంబరు 1941.)

సభాపతిగారి కృతులలిస్టు, చూడండి కొంత:- కాంచనమాల, కుంకుమ భరణి, దివ్యలోచనములు, శిష్యురాలు, దీపారాధన, ప్రభుతీర్థము, క్రుద్ధముని, ప్రతాప కుమారి, భానుమతి, గురుశిష్యులు, నైయాయికుడు, పలిత కేశం, ఛిద్రఘటి, చామెకాంబ, ప్రభువాక్యము

పైవిగాక :-

హృదయేశ్వరి - ఉపకావ్యము

ఆవేదన - ఖండికాసంపుటి

పద్మావతీచరణచారణ చక్రవర్తి - పద్యనాటిక

అంకితం ఇచ్చినాడు. వారొక ఖండకావ్యములో వీరి భాషాసేవనుగ్గడిస్తూ వీరికి కవివాక్యములో రావలసిన అమరత్వాన్ని ప్రసాదించినారు. వారికి వీరు 'ప్రేమపరీక్ష' ను కృతియిచ్చి వీరికి అమరత్వము కల్పించినాడు. ఇది చాలా సమంజసముగా ఉన్నది. కవిమిత్రులంటే ఇట్లా ఉండవలె!

కొందరు ఈ అవకాశములో అవకాశము కలగజేసుకుని తమగ్రంధాలను పూర్తిచేసుకున్నారు. అటువంటివాటిలో, రాళ్ళపల్లి వారి "గాధాసప్తశతి" సన్నిధానమువారి "గోవర్ధనాచార్య సప్తశతీసారం" ప్రశంసనీయాలు. రెండూ చదివేవారికి వారి దృక్పథభేదమూ, వారి భాషాభేదాలూ, వారి ఉపజ్ఞాతారతమ్యము తెలుస్తవి! రాళ్ళపల్లి వారి గ్రంధము భాషకు అలంకారము! కాని రచనచూస్తే వీరికి పద్యముకంటె గద్యము సహజమని కనపడుతుంది. సన్నిధానము వారు కూడా మాతృక రసము

---

వరపరీక్ష - గీతినాటిక
సాధకుడు - సంవాదము (మీజాన్)
రత్నాకరము - గీతికసంవాదము
దీక్షితదుహిత - పద్యరూపకము - వాకోవాక్యం
రాజజామాత - గీతికారూపకము
నోణకభార్య - గీతినాటిక
కవిప్రియ - పద్యరూపకము
యక్షరాత్రి - యవనికాంతరము
గృహేందిర - సంకీర్ణకృతి
వకుళమాలిక - గీతికాస్వగతము
ఇటీవల శ్రవ్యనాటికలు కూడా వీరు వ్రాస్తున్నారు.

పై వాటికి పెట్టిన నామధేయాలు, వాటికూర్పు వైవిధ్యమూ చూడండి. ఇప్పటికీ 'మహాకావ్యం ప్రారంభించవలెననే కుతూహలము' ఉన్నదని 24-9-40 తేదీన నాకు వ్రాసినాడు. వార్ధక్యములో ఈయనకు సుభేచ్ఛ యెక్కు వౌతున్నట్లు గోచరిస్తున్నది ఈయనకు కవిత్వం ఊపిరివంటిది. 'అందమైన ఆప్సరాలు మధుర కంఠంతో గానము చేస్తూ ఉంటే మైమరచి వింటూ ఉండాలని' యీయన ఆశయమట! (ఆంధ్రపత్రిక 14-12-41) తదన్వేషణములో ఉన్నాడని తోస్తుంది!

ఈ సమావేశానికి ఈగ్రంధకర్త అధ్యక్షత వహించినాడు సికిందరాబాదులో, "ప్రేమ పరీక్ష" అనే పేరుమార్చి "ఛిద్రఘటి" అన్నాడట.

తెప్పించడానికి శ్రమపడ్డట్టే విశదమౌతుంది ఇవిగాక కాంచనపల్లి కనకాంబగారి "హంసవిజయం" ఒకటి. దీని ప్రశస్తి మహారాజులు, కవిరాజులు, విద్యాధికులు, చాలా ఉగ్గడించినారు. విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథాలలో కొచ్చినది. నేను పాఠము కూడా చెప్పినాను. నా స్వాభిప్రాయము పెద్దల వ్రాతలకు కొంచెము విరుద్ధముగా ఉంది. ఇందుగ్గడించిన విషయాలనుబట్టి, వాటి వైవిధ్యాన్ని బట్టి, నాటకరచనకంటె, గద్యగ్రంథ రచనచేస్తే బాగుండేదేమో అనిపించినది. ఇప్పుడున్న సంఘస్థితి అంతా చెప్పి చివరకు "శ్రీ తిరుమల శ్రీ త్రిలింగ విద్యాపీఠా" దర్శాన్ని ప్రచారం చేసినారు. ఇది ఒక సంఘవిమర్శన నాటకము. కావ్యదృష్టి చాలా కొరవడ్డది! అయినా కర్త్రి చాలా శ్రమపడ్డది. ఆమె వ్రాసిన జీవయాత్రకూడా యిటివంటిగుణాలే కలిగిఉన్నది. కావ్యము ద్వారా ధర్మబోధ చెయ్యడములోనే కవి ఉపజ్ఞ కనపడవలసినది!

చిలకమర్తివారు కవిభల్లటశతకాన్ని సంస్కృతంలోనించీ అనువదించినాడు. చాలా హృదయంగమముగా ఉన్నది. మాతృకలో ఉన్న అన్యాపదేశాన్ని చాలా సమంజసముగా దించినారు. మంగిపూడి వెంకటశర్మగారు తమ "మద్దుకత" మొదలైన రసవత్ఖండ కావ్యాలను పూర్తి చేసుకున్నారు.

కొందరు తమ ఖండకావ్య సంపుటాలలోనించీ భాగాలను పరితలను ఆస్వాదింపజేసివారు.◆ అటువంటివాటితో మండపాక "తేనెపట్టు" జాషువా

---

◆ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి 'షాహజీ' చక్కని పాకంలోపడ్డ ఖండ కావ్యము. ఈయన బౌద్ధవాఙ్మయంలో చాలా కృషిచేసినాడని వినికిడి. 'ప్రబంధ నాయికలనే' వచనగ్రంథము వచ్చినది.

✻ ఇందులో దేశభక్తి స్ఫోరకాలైన గేయాలున్నై! దేశము మరచిపోని ఆధునికుల్లో ఈయనకొక అగ్రస్థాన మియ్యవచ్చు. ఈ గేయగుచ్ఛము చక్కని గీతాలతో నిండిఉన్నది. భరతమాతయొక్క గొప్పతనం, రైతులస్థితి, దేశముయొక్క పూర్వోన్నత్యం, అస్పృశ్యత మొదలైన అనేకవిషయాలపైన చక్కని గేయాలను వ్రాసినాడు. ఈయన కుమారుడు రామారావు ఆధునిక గ్రామ జాతీయ జీవనము ప్రతిబింబింపజేసే రైతుబిడ్డనే నాటకము వ్రాసినాడు మాండలిక వ్యవహారికములో వ్రాసి కొన్ని పదాలకు అర్థాలు కూడా తుదిన యిచ్చినాడు. మాండలిక పదాలను ప్రచారం చెయ్యవలసిన పద్ధతియిదే! ఈనాటకానికి అభిప్రాయమిస్తూ రెడ్డిగారు అవకాశం చూచుకుని కాంగ్రెసును విమర్శించినాడు ఈ నాటకములో కర్త కాంగ్రెసు నిర్మాణకార్యక్రమ ప్రచారం చేసిన మాట వాస్తవమే! ఈ కాలములో వ్రాసిన చాలా నాటకాలు ఏవో అభినివేశాలను ప్రచారము

"ఖండకావ్యం" గోరుగంతుల "పూలతోట" సోమయాజులు "రామచంద్రుని హంపీయాత్ర" బెళ్లారి 'ప్రేమతపస్విని' సబ్నివీసు "గేయగుచ్ఛము" జయంతి గంగన్నగారి సుమబాల, కంఠమాలలు మొదలైనవి యెన్నదగినవి. కొడాలి సుబ్బారావు (1904-32) రచించిన 'హంపీక్షేత్రం'లో 'కవితాశిల్పం' ఉట్టిపడుతూ ఉంటుంది. ఇతను చిన్నవయసులోనే గతించినాడు. 'ప్రతిభ'ను గూర్చి చెప్పేటప్పుడు మరికొన్నింటిని పేర్కొంటాను. ఇప్పుడు పేర్కొన్నవాటిలో అనుసరింపబడ్డ మార్గాలన్నీ చాలామట్టుకు చర్వితచర్వణాలే! సోమయాజులుగారి "హంపీయాత్ర" యింగ్లీషులో ఉన్న బైరను వ్రాసిన "Child Harold's pilgrimage" అనే కావ్యానికి అనుకరణము. దీనిలో వెనకటి సామ్రాజ్యోన్నతి చాలా చక్కగా చెప్పినాడు కవి.

పైన పేర్కొన్నవారు గాక ఖండకావ్యాలను వ్రాసిన వారిలో వెనక దశవర్షకాలములోవారు గాక కొత్తవాళ్ళు చాలామంది ఉన్నారు. జనమంచి వెంకట్రామయ్య, కొల్లూరు ధర్మరాయకవి, నాదెళ్ళ వెంకట్రావు, మిన్నికంటి గురునాధశర్మ, పెమ్మరాజు లక్ష్మీపతి, ఓలేటి సీతారామమూర్తి, కోరుమిల్లి వీరసోమసత్యనారాయణ, కుందుర్తి నరసింహారావు, వెంకటపార్వతీశ్వరకవులు, వేంకటకాళిదాసకవులు, శేషాద్రి రమణకవులు, పండితారాధ్యుల నాగభూషణం, (ఈయన 'గంగాలహరి' అనువదించినాడు.) మున్నంగి లక్ష్మీనృసింహశర్మ, సోమంచి వాసుదేవరావు, తురగా వెంకట్రామయ్య, జనమంచి కామేశ్వరరావు,* నిడమర్తి యీశ్వరప్ప, దివాకర్ల వెంకటావధాని, ఆచంట సూర్యనారాయణశర్మ, అధికార్ల సూర్యనారాయణ, అన్నమరాజు శర్మ, కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు, అయ్యగారి సత్యనారాయణమ ..స్త్రి, కొమాండూరి, పంద్యారం, హరి రాధాకృష్ణమూర్తి, సహదేవ సూర్యప్రకాశరావు కొడాలి, అడివి, శిరిపి, మేడిపల్లి లక్ష్మీకాంతకవి,◆

చెయ్యడము కొరకే అన్నట్లుతోస్తుంది. విశ్వనాధవారి వేనరాజు వగైరాలల్లో కూడా ఉన్న, మంచనండి చెడ్డనండి యిదే!

పారనంది జగన్నాధస్వామి జూన్ 1929 భారతిలో సుమబాలను గూర్చి 'ం౨౦౨ ద్విపదపంక్తులే అయినా, భావనలో స్ఫురించేదీ విస్తారముగా ఉంటుంది' అన్నాడు

* ఇతని తమ్ముడు జనమంచి రామకృష్ణ ఒక సాధకుడే.

◆ ఈయన 'నా కవనం' అనే ఒక ఖండ కావ్య సంపుటి, 'జనాబాయి' అనే నాటకమూ రచించినాడు. శృంగార ప్రియుడు 'సౌందర్య విలాసము' నే నవలకూడా రచించినాడు.

పురాణము కుమార రాఘవశాస్త్రి, పిశిపాటి నారాయణశాస్త్రి, మొదలైనవారి పేర్లు కనబడుతున్నై! ఇంకా వీరుగాక చాలామంది ఉన్నారు.

## కొందరి విశిష్టత

కొందరిని గూర్చి కొంచెము ప్రత్యేకముగా ఒక్కొక్క మాట చెబుతాను. కాటూరు వెంకటేశ్వర రావుగారు ఒకవైపు "సౌందరనంద" సాధన జరుగుతూ ఉండగానే అప్పుడప్పుడు ఉద్రేకము వస్తూండటము 'వరలక్ష్మీవ్రతం' లాంటి చక్కని కావ్యాలు వ్రాయడము ప్రకృతి సిద్ధమైన సన్నివేశాలు కల్పించడము కలిగినది. తర్వాత సినిమాకవి కావలసిన సముద్రాల వెంకట రాఘవాచార్యులుగారు అప్పుడప్పుడు దశవర్షకాలములో చక్కని కొన్ని ఖండకావ్యాలు వ్రాసినారు. 'భిక్ష' 'శ్రావణి' మొదలైనవి ఒక్కొక్కప్పుడు గూఢభావసంకలితాలై సహృదయపరితకు 'సద్యః పరనిర్వృతి' ని కలుగజేస్తున్నై! కుమార రాఘవశాస్త్రిగారు గంగాదేవీకృత "మధురా విజయ" కావ్యము ప్రకటితభాగాన్ని తెనుగులోకి పరివర్తనముచేసి భాషాసేవ చేసినాడు మంచికావ్యశైలిలో, నిర్దుష్ట భాషలో మాతృకను వెలయించి మించినాడు. అయ్యగారి సత్యనారాయణమూర్తి గారు ఆంగ్లములో షెల్లీకవికృతమైన "Love's philosophy", అనే ఖండకావ్యము 'ప్రేమతత్వం' అనే పేరుతో స్వేచ్ఛానువాదము చేసినాడు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు 'బసవగీత' అని ఒక గేయాన్ని వారి సహజరసవద్ధోరణిలో వ్రాసినారు, నవలారచనాశక్తే గాక గీతరచనాశక్తికూడా ఉన్నదని యీయన అప్పుడప్పుడు చూపుతూ ఉంటాడు. ఆయన సర్వతోముఖ ప్రజ్ఞ దేశానికంతకు విదితమే! మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు తమ సహజ విజయాన్ని వదలి రచ్చకెక్కటం ప్రారంభించినాడు. ఈయన గేయాలను గూర్చి వెనక స్పృశించినాను. ఈయన కవిత్వము "అతులిత మాధురీ మహిమ" గలదని నా అభిప్రాయము. ఈయన 'సతీస్మృతి' అని భార్యా వియోగము కలిగినప్పుడు వ్రాసినాడు. చాలా హృదయ ద్రావకముగా రచించినాడీ ఖండగీతి. ఈయన సామాన్యముగా అందరూ అనుకునేట్టు "పారడీ" కవి అనుకునే రచనలు కాకుండా చక్కని భావపూర్ణమై ప్రతిభావంతమైన కవిత చెప్పగల సామర్థ్యము కలవాడని యిటీవల నవ్యసాహిత్య పరిషత్తువారు

ప్రచురించిన "పంచవటి"* అనే ఖండకావ్య సంపుటివలన తెలుస్తుంది. లక్ష్మణుని శీలాన్ని చాల ఉదాత్తముగా చిత్రించినాడు. "బృందావన"మని ఖండకావ్య సంపుటిలో ఖండికలు చాలా రసవంతముగా ఉన్నాయి. ఈయన చాటుధారల వంటివి ఆధునికులెవ్వరూ రచించలేరని నా ఆశయము. ఈయన పద్యము చదివేపక్కీ అనితరసాధారణమని వెనక చెప్పినాను. చూడడానికి ఎంత అజ్ఞానిగా కనబడతాడో అంత ప్రజ్ఞావంతుడు. సభను రంజింప జెయ్యటంలో ఈయనతో సమానులు చాలా తక్కువమంది. ధనవంతుడు కాడు. తన కావ్యాలు చదువుకుని తానే ఆనందించే రసపిపాసి. కావ్యానందంలో కష్టాలను మరచిపోయ్యే కళాభిజ్ఞుడు. ఈతని "శారద"కూడా మిక్కిలి రమణీయము, "ఒమార్ ఖయాం"లో కొన్ని ఘట్టాలు చాలా రమణీయముగా పరివర్తించినాడు. ఈయనకు 'స్వయంవ్యక్తుడ'ని బిరుదిచ్చి శాలువ కప్పినారు. కడపలో శేషాద్రిశర్మగారు కూడా వీరిని సన్మానించినారు. ఈయన ప్రకృతిచేత హాస్యప్రియుడు. ఈయన చాటుధారలు హాస్యప్రధానాలుగా ఉంటవి. ఈయన సినిమాతారల మీద వ్రాసిన పద్యాలువింటే పొట్టపగిలేట్టు నవ్వు వస్తూఉంటుంది. కాటూరి వెంకటేశ్వరరావుగారికీ యీయనకూ జీవికాజీవి, ఈయన ఆధునికులలో ఎన్నదగినవాడు.

ఇక్కడే భార్యావియోగస్థితిలోనే వ్రాసిన విశ్వనాధవారి "వరలక్ష్మీత్రిశతి" ని గూర్చి రెండుమాటలు చెబుతాను. కృష్ణవేణిలో భార్య అస్థులను కలిపే సందర్భములో దీనిలో పద్యాలూ, "గౌరీపూజ" అనే శీర్షిక క్రిందివీ, హృదయవిదారకాలైనట్టీ సంపూర్ణమైనట్టీ అనిర్వాచ్యమైనట్టీ ఆనందాన్ని కలగజేస్తై! "కృష్ణార్పణం"లో అస్థికలు కలుపునప్పుడు ఉత్పన్నమైన భ..ాలు చదివేటప్పుడు నేనానందముతో అశ్రులు రాల్చానని చెప్పటం కేవలసత్యకథనం!* సూక్ష్మవిషయాలయొక్క అంగాంగీ

---

* పిల్లలమర్రివారు ఫిబ్రవరి 1950 భారతిలో రచించిన "మధుర భారతి మాధవ పెద్ది కవి' అన్న వ్యాసాన్ని చూడండి.

మద్వియోగవ్యథా దూయమానహృదయ
నీరజను భవత్తనయాకుమార రక్షః
నాతురమనోంబుజాతను నాదరించి
యాది యోదార్చుఁగాక నిన్నాదిగౌరు.

భావముతో కూడిన ఆ వర్ణనము నిరుపమానము! ఎటువంటి స్వల్ప విషయాన్నీ భాషాచిత్రాలు కల్పించి పాఠకుడి మనశ్చక్షుస్సులకు గోచరమయ్యేటట్టు చెయ్యడములో పరమావధిని పొందినైయని చెప్పడములో యేమీ అతిశయోక్తి లేదు.◆ గౌరీపూజలో స్త్రీవ్యక్తి ప్రకృతిమాతలో లీనమైన ఘట్టము చదివితే సాక్షాత్కైలాసవాసైన పార్వతీ రూపము అలౌకికమై సర్వప్రపంచ వ్యాప్తమై హృదయానికి ఒకవిధమైన పవిత్రానందాన్ని చేకూరుస్తుంది.

"గౌరు" అనే ప్రయోగ మక్కడ బంగారములో రత్నము పొదిగినట్టు తోస్తుంది. అందులో హృదయ నిగూఢప్రేమ, పవిత్రత, మాతృత్వము స్పష్టమౌతున్నవి. ఒక కవి భార్యావియోగము భాషాకుమారుల కందరికీ ఆనంద హేతువు కావడము

---

ఒక యెన్న్ పుట్టుకలకు ముందరైన
మత్ప్రారబ్ధమిరీతి బరిణమించె
నానా విచిత్ర జన్మకృతాస్మదఘ రాశి
అయి అయి నేటికిట్లయ్యె దుదకు
పితృదత్తమగునాస్తి హతమయ్యె నాయందు
ఆయనిచ్చిన భార్య అట్లెపోయె
నాతండ్రి చేసిన నానామహాపుణ్య
కర్మలీగతి గంగ గలసిపోయె
మిగిలినదియొక్కడే నాకు మేరువంత
బరువు నాగుండెలో మధ్యభాగమందు
అంతె పేరునకంతె భార్యాస్థిగాని
నాశరీరాస్థినిజము కృష్ణార్పణమ్ము

"గ్రామ్యగ్రాంధిక విషయమున నీకవికొక నిశ్చితాభిప్రాయము లేదేమో! విశ్వనాథశైలిలో సంగీతము లేదనుటకన్నను అది తారశ్రుతిలో పలికినదగుట తగినది ఈమహాకవికి ధ్వనిదృష్టి చాలతక్కువ .. ఇతడు ముఖ్యముగా వాచ్యకవి. భావతీక్ష్ణతపై నున్నంత దాహము శిల్పముపై లేదు. .... నూత్నతయను పదార్థములేని దీతడుకలమే పైకెత్తడా అనిపించును. ఈయన రచనలయందు హాస్యము తక్కువ." పుటపర్తి - భారతి ఫిబ్రవరి 1943

◆ ఈ పద్యాలే క్లిష్టాన్వయానికి కూడా పరమావధిగా ఉన్నై: ఉన్నప్పటికి పాఠకుడికి యెంత తెలిస్తే అంత ఆనందం కల్గే స్వభావంకూడా వాట్లో ఉంది "కొండవీటి పొగమబ్బులు" కూడా దృష్టాంతంగా చూడండీవిషయానికి రాచసిరి ఉడిగిపోయిన శిధిల దుర్గలక్ష్మికి ఆపొగ మబ్బులు కూర్చిన వెర్రియలంకృతులే యీ వాక్యాన్ని వెలార్చినవి' అన్నాడు సంపత్

సహజమే! ఈయనకీ భార్యావియోగమయ్యే కాలములో కొంత నిరుత్సాహమూ, నిరాశా, ఆవరించినట్టు తత్కాలములో వ్రాసిన "ఆకాంక్ష" మొదలైన ఖండకావ్యాలవల్ల కనపడుతుంది. కాని మళ్ళీ దానినించీ, మృతినించీ జన్మ లేచినట్లు సహజమైన చిత్తశాంతి చేకూర్చుకుని ఉత్సాహాన్ని పొందడము ఆంధ్రసాహిత్యముయొక్కా, భాషయొక్కా భాగ్యమనే చెప్పవలె! దువ్వూరివలె తాత్కాలికముగా పతనాన్ని పొందకుండా ఉండడంలోనే ఉన్న దీయన యొక్క విశిష్టత. అదే కవికి పరీక్షాకాలము. అటువంటి దుఃఖములోనించీ సుఖము కలిగితే ఆయన ప్రకృతిని జయించాడన్నమాట! అదివరకు "ఆకాశదీపం" "విశ్వామిత్రుడు - మేనక" మొదలైనవి ఉదాత్తముగా నే ఉన్నై! ఆయన కవిత్వానికి సహజాలైన అన్ని గుణాలు వాటిలో ఉన్నై!* కాని భార్యా వియోగను తరువాతనే ఆయన కవితాజ్యోతి - బహుశః ప్రథమపత్నీ జ్యోతి ద్వితీయమందు ద్విగుణముగా మూర్తీ భవించుటచేతనో యేమో - కాళిదాసు చెప్పినట్టు 'సః అధికం బభౌ'.◆ మొత్తముమీద రెండవస్థలూ కలిసి యీయన్ని నవ్యసాహిత్యాకాశ వీధిలో దుర్నిరీక్ష్యుణ్ణిగా చేసినవి. సూర్యుడు ఆపాతతఃతీక్ష్ణుడైనప్పటికీ ఎట్లా సర్వసస్యదాతో, సర్వారోగ్యదాయో, అట్లాగే యీయన కవిత్వము కూడానూ! ఆపాతతః క్లిష్టమైనా లోతుకు దిగితే అనిర్వచనీయ రసావిష్కరణం చెయ్యగల శక్తి ధర్మప్రకృతికి మార్గదర్శిగా ఉండేగుణమూ దానిలో ఉన్నై! "తొడ, తొడ" అనే పద్యము చదువుతూ ఉంటే భవభూతి "కమపి కమపి" శ్లోకం తలపుకొస్తూ ఉంటుంది.

---

* 1. దుష్కరప్రాస = హ్మ, ష్ఫుర్వ, క్ష్ణ, ఖ్య 2. క్లిష్టాన్వయము = "ఆకాశదీపము" (పిచ్చితలలు) 3. తెనుగు నుడికారాలు = "శిరేరిభైరీ" 'యధాలాపముగ" (మనుష్యుడు) 4. మారుమూల పదాలు = వఱ్ఱు, తోరహత్తు, 5. ఉదాత్తత 6. నేయార్థం = (కొన్ని పద్యాలకు ఆయనే అర్థం చెప్పవలె)

◆ మరల రేకెత్తిన ఉత్సాహానికి 'పరిశోధకుల' నే కథే తార్కాణం.

‡ తొడతొడనందుకో నరటితోటలు పెంచెదనంచు, సెజ్జలో
మెడమెడలాని శంఖములు మెల్చెదనంచును, నూహలూహలో
వడివడిపోయి యందములు వాల్చెదనంచును, వెఱ్ఱియాసలం
బడిచనినంతలేద, యెడబాటు విచిత్రముగా ఘటిల్లెబో!
వైధర్మ్యం యెంతచక్కగా చెప్పినాడో చూడండి!

విశ్వనాథ రాయప్రోలు లిద్దరూ నవ్యసాహిత్యానికి సూర్య చంద్రులవంటివారు. ఒకరు దుర్నిరీక్ష్యుడు! రెండవవారాహ్లాదకరుడు ఒకరు మిరుమిట్లుగొలుపుతాడు! రెండవవారు చల్లజేస్తాడు! ఒకడు శాసిస్తాడు! రెండవవారు మిత్రుడల్లే ఒప్పిస్తాడు! ఒకరి వ్రాతలు మహోదధితరంగ పరంపరలు! రెండవ వారివి అచ్ఛోదసరో వరనీరోపమానములు! వీరిద్దరూ ఆద్యంత రక్షకులై నవ్యసాహిత్యాన్ని రక్షిస్తున్నారు. ఒకరిది ఉపక్రమ ప్రాబల్యము! రెండవ వారిది ఉపసంహార విజయము! ఒకరివద్ద మొదలు పెట్టిన ధర్మము మధ్య యెన్నో విధాల సంచరించి తుదకు రెండవ వారిలో సాఫల్యము పొందినది! కాబట్టి నవ్య సాహిత్యమంతా యీయిద్దరి మధ్య ఉయ్యాలలూగి, ఏధర్మములోతా బైలుదేరినదో, అదేధర్మములో వచ్చిఆగినది!*

# మరికొందరు

ఉమ్మర్ ఆలీషాగారివలె (1945) మరణం మరొక సయ్యదుబదురుద్దీ సాహెబుగారు ఒక భక్తిగీతము రచించినాడు. చక్కగా ఉంది. దాని శీర్షిక "నీ దర్శనము నీ సేవ" ఇటువంటి ముసల్మాను కవులూ, జాషువావంటిక్రైస్తవ కవులూ, విజ్ఞానైక్యతను నిరూపిస్తారు కాబట్టి మన కందరికీ వంద్యులు. ఈయన కవిత్వములో కూడా ముసల్మానుచిహ్నాలు భాషలో ఎంతమాత్రము లేవు. చక్కగా భాషాకుమారుడు

---

* ఋక్కేమంటున్నదో చూడండి.

'యస్తిత్యాజ సచివిదగ్ ంసఖాయం
న తస్య వాచ్యపి భాగో అస్తి
యదీగ్ంశృణోత్యలకగ్ం శృణోతి
నహి ప్రవేద సుకృతస్య పంథాం'

ధర్మమును వదలినవారి వాక్కున భాగములేదు.

'విద్యా హ వై బ్రాహ్మణమాజగాను
గోపాయ మాం శేవధిష్టే హమస్మి
అసూయకాయాన్నృజవే యతాయ
న మా బ్రూయా వీర్యవతీ తథా స్యామ్'

విద్య తనను అసూయగలవానికిని, ఋజుప్రవర్తన లేనివానికిని, చపలునికిని, ఇయ్య వద్దన్నదట!"

వ్రాసినట్టే ఉన్నది కావ్యము. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి ఖండకావ్య మొకటి వెనకటి దశాబ్దకాలములో నిరూపించినాను. ఈ కాలములో కూడా ఆయన "గడ్డిపరక" అనే శీర్షికతో దాని యొక్క ఉపయోగాలు దానిని ప్రపంచము నిరాదరించడము. న్యాయము గాకపోవడము మొదలైన సంగతులతో రసవంతముగా రచించినారు. వీరేగాక వేదం వెంకట్రాయశాస్త్రిగారు "దైవమహిమ" అని ఒక ఖండ కావ్యము వ్రాయడము ఆశ్చర్యము. ఇటువంటివారు వ్రాయడంవల్ల ఖండకావ్యానికి ప్రాచీనులిచ్చిన ఆంక్ష చాలామట్టుకు తొలిగిపోయినట్టు భావించవలెను. వీళ్ళ ఆదరణకు చాల విలువ ఉన్నది. ఇట్లాగే శివరామశాస్త్రి, ఆదినారాయణ శాస్త్రిగారు మొదలైన పండితుల వ్యావహారిక భాషోపయోగముకూడాను. కొందరు వీరిలోవీరే అసంతృప్తిపడి తమలో తమకు కొన్ని సలహాల నిచ్చుకున్నారు. మంగిపూడి వెంకట శర్మగారు తమ అనుభవాన్నిబట్టి. కవితకు ప్రయోజనముండవలెనని చదువరులు జీవితాన్ని దిద్దుకోడానికి పురికొల్పవలెననీ, సాధువుల నడతలూ, కార్మికుల చరితలూ, పాటకపు జనుల ఆటపాటలూ, రైతులయొక్క, పతివ్రతలయొక్క శుభశీలురయొక్క, ఆడుకునే పిల్లల యొక్క, చేష్టాదులూ, మాతృప్రేమా, మొదలైనవి కావ్యవస్తువులుగా ఉంటే సమంజసముగా ఉంటుందనీ, మొదలైన విషయాలను చెబుతూ 'కవులకు హితవు' అనే శీర్షికతో చక్కని ఒక ఖండకావ్యము వ్రాసినాడు జనమంచి కామేశ్వరరావుగారు, కృష్ణశాస్త్రి మొదలైనవాళ్ళ దు:ఖముతో విసుకుచెంది 'కవికుమార' అనే శీర్షికతో ఒక కావ్యము రచిస్తూ ఇట్లాగన్నాడు! -

> "శోకగీతుల సుప్తవీధుల
> ముంచెత్తబోకుముగా!
>
> . .............. ...........................
>
> ప్రియవియోగమె ప్రియకరంబగు"

ఇదే 'శరీరనాశోపి సమానురాగయోః ' అన్నప్పుడు కాళిదాస సిద్ధాంతము! ప్రత్యాశ లేనప్పటి ప్రణయమే నిజమైనది! స్వార్థ రహిత మవడముచేత దానికి పవిత్రత వస్తుంది. కాని అది కవిని క్రుంగదియ్యకుండా అతని విజ్ఞాన నేత్రాన్ని తెరవవలె. అప్పుడే అతను నిజమైన కవైపోతాడు. ఈసందర్భములో వెనక కొన్ని దృష్టాంతా

లిచ్చినాను. జాషువాకవి 'అయోమయము' అనే శీర్షిక క్రింద నవ్యకవులను సంబోధించినాడు, చూడండీక్రింది పద్యం :-

"కవి సమయమ్ముదప్పి సుడికారపు సొంపును పాడుచేసి నీ
వెవతుక కోసమో కుమిలియేడ్చెదు, చక్కని తెల్గుకైతకా
యువులు కుదించి యేమిటికయోమయముం బొనరింతువోయి? నీ
కవనము పాడుగాను! చెడుగా యిఁకనేనియు రమ్ముదారికిన్".

కానియీవర్ణనమునవ్యుల కందరికీ వర్తించదు! కొందరికీ కూడా పూర్తిగా వర్తించదు! చిలుకూరి నారాయణరావుగారు పోతన కవిమీద చక్కని కులుకు బెళుకులొలికే ఖండకావ్యము రచించినాడు. కావ్యము నడక చాలసరసముగాఉన్నది. దీనియొక్క ప్రతిధ్వనే హైద్రాబాదులో పోతన జయంతి అధ్యక్షోపన్యాసములో కూడా విన్నట్టు జ్ఞాపకము. ఈవిధముగా ప్రణయమో, ప్రకృతో, భక్తో, స్వానుభవమో, సన్నివేశములో, వస్తువులుగా ఈ సాహిత్యమంతా నడిచినది.*

## స్త్రీలు

గృహలక్ష్మి స్థాపించిన తర్వాత, దాన్ని ముట్టడించిన పురుష కవికుమారులు సంఖ్యకంటె భారతిని ముట్టడించిన కవయిత్రీ సోదరీమణుల సంఖ్య చాల తక్కువ. అయినప్పటికీ కొందరు చక్కని రచనలను సాగించిన వాళ్ళున్నారు. వెనకవాళ్లు పురుషుల కెంతమాత్రము తీసిపోరని విన్నవించినాను. మొత్తముమీద రెండుపత్రికలు చూస్తే వాళ్ళలో విజ్ఞానవ్యాప్తి చాలా త్వరగా కలిగినట్టు గోచరమవుతుంది. వారిలో చక్కని ఖండకావ్యాలూ, గీతాలూ, కథలూ, వ్యాసాలూ రచించేవాళ్ళ సంఖ్య చాలా పెరిగినది. కొందరు కవయిత్రులనూ వారి కావ్యాలనూ పేర్కొంటాను. పరుచూరు భువనేశ్వరీదేవిగారు, చావలి బంగారమ్మగారు, 'కర్షకా' 'దైవమహిమ' మొదలైన ఖండకావ్యాలను వ్రాసినారు. చిలుకూరు లక్ష్మీనరసమ్మగారు పిచ్చుక దంపతుల

* టేకుమళ్ళరాజగోపాలరావుగారివంటివారు కొందరు ఈ నవ్యులను కొత్త జాతులనూ, వృత్తాలనూ' అనుసరించవలసిందనీ, తెనుగులో నిర్యతి ప్రాసంగా శ్రవణసుఖాన్ని మాత్రము పాటించుకుంటూ "పరుగు కవిత్వం"(run - on verse) వ్రాయమనీ ప్రోత్సహించినారు కొందరు దాన్ని అనుసరించినారుకూడాను. (జయంతి)

ఇచ్ఛావిహారాలు మొదలైన వాటిని తమ గీతాలలో చిత్రించినారు. జ్ఞానాంబ జహంగీరు చక్రవర్తి యొక్క న్యాయబుద్ధి నుగ్గడిస్తూ ఒక ఏకాంకనాటకము రచించినారు. దుర్గాబాయమ్మ వెనకటి దశవర్షకాలమునుంచీ కూడా అప్పుడప్పుడూ వ్రాస్తూవచ్చినారు. కనుపర్తి వరలక్ష్మమ్మగారి పేరూ, ఆమె భాషాసేవా జగద్విదితమే! ఆమె కథలు ఉత్తమకక్ష్యలోవని గట్టిగా చెప్పవచ్చు. 'చోరగుడి సీతమ్మగారి జీవితచరిత్ర' ను కూడా చక్కగా ఆదర్శప్రాయముగా రచించినదామె. ఆమె 'శారదలేఖలు' చదవని స్త్రీపురుషులుండరు. ఈమెగారి కొకమారు గృహలక్ష్మి సువర్ణకంకణము లభించినది. దేశమంతా సంతోషించినది. ఈకోటిలోవారే కాంచనపల్లి కనకాంబగారూ, చేబ్రోలు సరస్వతీదేవిగారూ, సరస్వతీదేవిగారు మరల 'అభినవమొల్ల' అనిపించుకున్నారు. రామాయణాన్ని ఉత్తరకాండ సహితముగావ్రాసి జన్మ ధన్యత నొందించుకున్నారు. ఇంకా జనమంచి అనంతమ్మ, చిలకపాటి సీతాంబ, బసవరాజు వెంకటరాజ్యలక్ష్మమ్మ మొదలైన అనేకులు విద్యావతులున్నారు. తుదకు సి.యస్. లక్ష్మి అనేయువతి 'నానాజాతిసమితి' ని గూర్చి చక్కని రాజకీయవ్యాసము వ్రాసినారు. స్థానాపతి రుక్మిణమ్మ ఒక ఖండకావ్య సంపుటి 'పూలమాల' అని ప్రకటించినది. బుర్రాకమలాదేవి అనేయువతి 'వందేమాతరం' అని ఉత్పలమాలిక చక్కగా వ్రాసినది: ఆచంట సత్యవతమ్మ కృష్ణశాస్త్రిగారిని చక్కగా అనుకరించి వ్రాసినది.

"చెట్టులో పుట్టనై
పుట్టలో పామునై
మట్టిలో తేమనై
మరచి ఆడితిగాని
ఈజీవితంబులో నింత దుఃఖంబుండెనా?
దేవ! నే నిసుమంత దెలియనైతి!

ఇది వాస్తవగీతియో, ఉపాలంభగీతియో, తెలుసుకొనడానికి వీలులేకుండా ఉన్నది. మునిమాణిక్యాదులవలె సరళాదేవిగారు 'గడ్డిపూలు' అని శీర్షికనుంచి గద్యశకలాలను రచించినారు. ఆమె అభిప్రాయము భావగద్యము వ్రాయవలెనని.

"ప్రయత్నిస్తాను! ప్రయత్నిస్తాను! యుగయుగాలు గడిచినా వెదుకుతాను!

ఈ అగాధ విశ్వములో కాలుపెట్టినది మొదలూ, నీ అన్వేషణమేనా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు! నీ సందర్శనాపేక్షే **నాజీవితము.** ఎట్లా చిక్కక తప్పించుకుంటావో చూస్తాను!

సంధ్యారుణకాంతులు జారిపోయినట్లు జాడలు పొడకట్టెను! ఇక నామేను మరపించిన ఆపాటకొరకు వెదకనారంభించితిని! కాని అంతయు నిశ్శబ్దమే! ..........'' ఈ ప్రకారముగా సోదరీమణులు 'ముగుదల్ నేరువరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్' అనే కవివచనాన్ని సార్థకపరిచినారు. గృహలక్ష్మిలో భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారనే ఒక పండిత ప్రకాండుడు తమ విజ్ఞానాన్ని వెదజల్లి దేశపువందనాలకు పాత్రుడైనాడు. యాజ్ఞవల్క్య శాఖకాయన అపరయాజ్ఞవల్క్య మహర్షి అనవచ్చు* ఈ పత్రిక.

గృహలక్ష్మి విడాకుల చట్టాన్ని గూర్చి ఆంధ్రదేశములో ఉండే నారీమణులు చాలమందియొక్క అభిప్రాయాలను సేకరించి ఆ విషయములో రెండుపక్షాల వాఙ్మయము కొంత తయారుచేసినది. ఈ పత్రిక స్త్రీలోకానికి చేసినసేవకు మేరలేదు. పురుషలోకానికి కూడానూ అంటే తప్పేమిలేదని నా ఊహ! హైదరాబాదులో కూడా కొందరు యువతీమణులు సాహిత్యసాధన చేస్తున్నవాళ్లున్నారు. వీరందరిలో ఎల్లాప్రగడ సీతాకుమారి కథ, గేయం, మొదలైనవానిలో సిద్ధహస్తఅయినది. స్త్రీలలో ఖండకావ్యాలువ్రాసి గ్రంథాలు ప్రచురించినవాళ్ళల్లో సోమరాజు యిందుమతీదేవి యెన్నదగినవారు. ఈమె "కావ్యావళి" ఉత్తమకక్ష్యలో చేర్చవచ్చు. నవ్యసాహిత్యములో కావ్యాలువ్రాసిన పురుషులు చిత్రించిన ప్రణయముకంటె యీమె చిత్రించిన ప్రణయం చాలా పవిత్రమైనదని చెప్పవలె. ప్రణయాన్ని స్త్రీ యెట్లా భావించి చిత్రిస్తుందో యీమె కావ్యాలు నిదర్శకాలుగా ఉంటై!

**నందగిరి** ఇందిరాదేవి ఒక రచయిత్రి, రాచమళ్ళ సత్యవతీదేవి, తెలుగుతల్లి అనే మాసపత్రిక పెట్టి కొన్నాళ్ళు నడిపించింది. తెలుగుతల్లి, తరపున వచ్చిన రవీంద్ర, పోతన, సంచికలు ఎన్నదగినవే.

---

* ఈయన పరిచయభాగ్యము నాకు కల్గింది. ఈయనా నేనూ కలిసి పూనా ప్రాచ్యపండిత సభకు వెళ్ళినాము.

నవలలు వ్రాసిన స్త్రీలు కూడా ఉన్నారు. "వీరిలో జయంతిసూరమ్మగారి సుదక్షిణాచరిత్రముతో స్త్రీల నవలా రచన 1906లో మొదటపుట్టినట్లు కనబడుతుంది! 1914లో మల్లవరపు సుబ్బమ్మ కళావతి చరిత్ర, కృపాబాయి సత్యానాధమ్ కమలాంబ, ఎస్. స్వర్ణమ్మ ఇందిర, 1916లో, వి. శ్రీనివాసమ్మ ప్రియాన్వేషణము. సేతుపిండారి, గోపిసెట్టి లక్ష్మీనరసాంబ సుకేశి సుగుణవళి, 1919-21లో మాగంటి అన్నపూర్ణాదేవి సీతారామము, నవవర్షస్వప్నము, అనే నవలలు రచించినారు వీరేగాక ఇంకా కయిత్రులున్నారు చూడండి:

| రచయిత్రి | | నవల |
|---|---|---|
| ఓలేటి సూర్యప్రభాదేవి | - | ఇందుమతి |
| దేశిరాజు లక్ష్మీనరసమాంబ | - | కమలావతి |
| పులివర్తి కమలాదేవి | - | కుముద్వతి, రాధికా చంద్రావళులు |
| మల్లాది బుచ్చమ్మ | - | లంకావతి |
| కనుపర్తి వరలక్ష్మమ్మ | - | వసుమతి |
| ఏ.పి. పిరాట్టమ్మ | - | శోభావతి |
| ఆచంట సత్యవతీదేవి | - | సునందని |
| కూచి రామలక్ష్మమ్మ | - | అమల |
| పి. రాజలక్ష్మమ్మ | - | మదవతి |
| డి. సత్యానార్థ సతి | - | లలిత |
| సీరము సుభద్ర | - | జాగిలము |
| పులుగుర్తి లక్ష్మీనరసమ్మ | - | యోగీశ్వరి |
| చిల్లరిగె రమణమ్మ | - | రామాశ్రమము |
| అట్లూరి వెంకటసీతమ్మ | - | రూపవతి |

- ఆంధ్ర సర్వస్వము

## కథావీధి

కథకు వచ్చేటప్పటికి అంత కష్టముకాదు. ఎందుకంటే వెనుకటి వ్యక్తులే కధలను తిప్పించి మళ్ళించి, కుదించి, పెంచి, వేరుగా కనపడేట్టుచేసి, భాషాంతరీకరించి, యెక్కడనించో చెప్పకుండాదాచి, యీవిధముగా కథకులమని కొంద రనిపించు కున్నారు. ఈ కధావీధి మాత్రము చాలా సాగినదని తప్పక చెప్పవలె. వీరిలో కొన్ని

కొత్త పేర్లు కనబడుతున్నవి, ప్రాత వానితో కలసి! వెనుకటి కవికొండల, పూడిపెద్ది, మల్లాది, శ్రీపాద మొదలైనవారు వ్రాస్తూనే ఉన్నారు. కొంత వారిలో గతానుగతికత్వము కలిగిపోయినది. శ్రీనివాస శిరోమణి వచ్చి నూతనముగా కొంత కలవరము కలిగించి సన్నివేశాలలో వైశిష్ట్యమూ, మొదలైన గుణాలను తెచ్చిపెట్టినాడు. ఈయన మన కథకులలో ఉత్తమకక్ష్యకు చెందినవాడు. ఇంకా తెలంగాణం కూడా శూన్యము కాదని కొందరు ఇక్కడనుంచీ యెన్నదగిన కథకులు బయలుదేరినారు. వెనుక సుజాతపత్రిక వచ్చి తెలంగాణాంధ్రులకు కొంత యీ ఖండకావ్య కథావీధులలో అభినివేశము కలిగించినది. ఆశాఖ యిప్పటికీ అలాగే సాగుతున్నది. "గిరి"గారు, పిశుపాటి వెంకటరమణయ్యగారు వీరిలో ముఖ్యులు. వెనుకటి దశాబ్దములో మాడపాటివారిని గూర్చి తెలుసుకున్నాము. ఈ దశాబ్దములో పైవారేగాక సురవరం ప్రతాపరెడ్డిగారి పేరు ఒకటి విశిష్టముగా చెప్పవలె. "గిరి, రమణయ్య" లవలె ఈయన కలము కేవల కథావీధిలో గాక పత్రికా నిర్వహణములో, గ్రంధ రచనములో, రాజకీయ పరిజ్ఞానములో సాహిత్య వీధితోపాటు పని చేసినది. చేస్తున్నది. "గిరి రమణయ్యగారలు" కథావీధిలో చాలా వరకు సిద్ధహస్తులైనారని చెప్పవచ్చు. "గిరి' 'గారి 'సితార' ప్రతిఫలం! 'కావేరీ' చక్కని కథా సంవిధానముతో హృదయంగమమైన పరిణామము కల్గి ఆహ్లాదము కలగజేస్తున్నది. "రమణయ్య" గారు హాస్యంలోకూడా చక్కగా రచన సాగించగలరని చెప్పడానికేమీ అభ్యంతరములేదు. ఈయన వ్రాసిన 'ఘటాశ్రాద్ధం - కేశఖండనం' శిష్టర్ వేదావతి చాలా నవ్వుపుట్టించి నీతిదాయకమై ఉన్నది.* ఈ వీధిలో 'కాశీపతి' కూడ ఎన్నదగిన పరిశ్రమ చేసినాడు. "సుప్రసిద్ధాంధ్ర కథకులు" అని యీక్రింది పట్టికనిచ్చు . ను: చూడండి

"శివరామశాస్త్రిగారి - "అంతర్నాటిక" "మాలదాసరి" మొదలైనవి.

మొక్కపాటి - 'భిక్షువు' 'శిల్పిద్వయము' వగైరా.

---

* ఈయన అప్పుడప్పుడ . కృష్ణాపత్రికాదులలో విమర్శన వ్యాసాలుకూడా, వ్రాయడంకద్దు. ఈయన యిల్లు ఒక సారస్వత దర్బారు. సహృదయుడు; సరసుడు. నవ్యాంధ్రసాహిత్య సాధకులలో చాలామందికి ప్రియమిత్రుడు, డాక్టరుగారు.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి - 'తులసి మొక్కలు' 'ఇద్దరము ఒక చోటికేపోదాము' ఇత్యాదులు.

అడివివారి - తిరుపతి కొండమెట్టు

కావూరివారి - గృహకల్లోలాలు

వెంకటచలముగారి - వేదాంతము

శిరోమణిగారి - ధర్మ సంస్థాపనము

దీక్షితులుగారి - శ్యామల, గాలిపాటవంటి కథలు శుభ్రమైన కథానికలు

పై సాధికార పట్టికలో విశ్వనాథ, కొడవటిగంటి మునిమాణిక్యాలను కలప వలసి ఉన్నది. హనుమచ్ఛాస్త్రిగారు వ్రాసినప్పటికంటె దేశపరిస్థితులు సాంఘికాదులలో చాలా మారినవి. అందుచేత నూతన కథావస్తువులతో అనేక కథానికలు తర్వాత కాలములో తలలెత్తినవి.

## భాష

ఈ కాలపు వ్రాతలలో చాలా సామాన్య పదాలు, వాక్యాలు, సాహిత్యము లోనికి దూరినవి. నవ్యులు, దాదాపు అందరూ, ఆంగ్లభాషా పాండిత్యము కలవారు కావడమే కాకుండా, ఆ భాషలో ఉండే నిగ్గును మన భాషలోకి తేవలెననే ఉత్సాహము కలవారు కూడా కాబట్టి ఆ భాషావాదులు అనేకముగా మన భాషలోనికి వచ్చినవి. చింతా దీక్షితులుగారి లక్క పిడతలలో పిల్లలు మాట్లాడే అనేక పదాలూ, నుడికారాలూ, గీతాలలో కెక్కించినారు. 'తృవ్వాయి' మొదలైనవితత్ స్థానాలలో చాలా అహ్లాదము కలుగజేస్తవి. కవి 'మశకగానము' అనే కావ్యములో వైద్యపదాలు 'టెటినసు' సాఫానరించి' 'వాక్యూయము' 'పంపుకొట్టడము' 'ఇంజక్షన్' మొదలైన అనేక మాటలనుపయోగించినాడు. ఈ విధముగా పరభాషాపదాలు, భావాలు వచ్చిసాహిత్యమును విశాలము చేసినవి. విశ్వనాథ కూడా 'లడాయి ఫరవా, తగాదా' మొదలైన పరభాషాపదాలూ, 'రెణ్ణెలల్'లాంటి వ్యావహారిక పదాలూ పద్యాలలో ఉపయోగించినాడు. (చూ. గొంగళీపురుగు.)

ఇంకా శాస్త్రాలలో ఉద్గ్రంధా లెక్కడా లేవడములేదు. పుస్తకా లసంఖ్యాలుగా ప్రకటింపబడుతున్నవి. అచ్చుసౌకర్యాలు దీనికి చాలా సహకారులైనవి. సామాన్య సాహిత్యము ఎంతైన అభివృద్ధి అవుతున్నది కాని సాంకేతిక వాఙ్మయాని కింకను మంచి పరిస్థితి రాలేదు. కావ్యకర్తల సంఖ్య చాలా ఎక్కువైపోయినది. ఖండకావ్యాలు రైసు మిల్లులవలె గతానుగతికములై పోతున్నవి, ప్రతిభ అందరిసొమ్ము కాకపోవడముచేత నిజమైన కవులు వేళ్ళమీద లెక్కింప దగ్గవాళ్ళే ఉన్నారు. వ్యావహారిక భాషా ప్రయోగము స్థిరమైనది. నండూరువారిమార్గములో సిద్ధిపొందినవాళ్ళసంఖ్య చాలా తక్కువ. అడివి కొంత యత్నించినాడు. ఈవిషయము మరల తెలుసుకునే అవకాశము వస్తుంది!

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# నవ్యసాహిత్యపరిషత్తు*

# 5

## స్థాపన

1748 సంవత్సరము భారతదేశచరిత్రలో చాలా ప్రాముఖ్యము గలది. అట్లాగే నవ్యాంధ్రసాహిత్య చరిత్రలో 1933 సంవత్సరము చాలా గొప్పది. నవ్యసాహిత్యమనేది ఒకటి స్థిరమైపోయేటప్పటికి దానికొక సంస్థ ఉంటే బాగుండునని మనవాళ్ళకు తోచినది. అందుకోస మొక ప్రయత్నముచేసి తత్సాధకుల నందరినీ ఒకచోట చేర్చుటము అవసరమైనది. మొదట మంచిపేరు వాళ్ళకు తట్టక దానికి 'అభినవాంధ్ర కవిపండితసభ' అనే పేరుతో బరంపురములో 1933 సంవత్సరము మార్చి 10, 11, 12 తేదీలలో కలిసినారు. ఇందుకు గూడా పంచాగ్నులవారే ప్రథమ సూత్రధారులు. వీరు నవ్యసాహిత్యానికి చేసిన సేవ నిరుపమానము. ప్రతిభలో ఈక్రిందివాక్యమును చూడండి. 'ఈ పరిషత్ప్రతిష్ఠాపనమునకు ప్రధానకారకులు గురుభాగవతుల ధర్మారావుగారు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు మొదలగు బరంపురం వాస్తవ్యులు.' వీరిని ఈ పరిషత్తువారధ్యక్షపదవిచ్చి గౌరవించినారు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ప్రథమ సభాధ్యక్షులు! ఆ సభలో చేసిన తీర్మానాల నీ క్రింద యిస్తున్నాను. వానివల్ల ఈ పరిషదుద్దేశాలు వెల్లడౌతవి.

1. సభా నిబంధనలనూ, తత్ప్రచార క్రమమునూ నిర్ణయించడాని కొక ఉపసంఘమును నిర్మించుట (సభ్యులు గు. ధర్మారావు సభాపతి చి.నారాయణరావు, పం. ఆదినారాయణశాస్త్రిగారలు)

---

* 1945 లో నవ్యసాహిత్య పరిషత్తుకు హైదరాబాదులో ఉపసంఘము స్థాపింపబడింది చూ నవ్యసాహిత్య పరిషత్తుపైన నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసము - భారతి జనవరి 1945.

2. సభోద్దేశములను ప్రచారము చెయ్యడానికి వ్యక్తులను నియమించుట.

3. గ్రాంథికాంధ్రము ఒకానొకప్పుడు పరిమిత ప్రయోజనము కలదైనా, నేడది సర్వజనోప యోగకారికాదు ..... వ్యావహారికాంధ్రము అపరిమితప్రయోజనము కలది. ప్రజలలో జ్ఞానాభివృద్ధి కలగడానికి యిదే పరమసాధనము.

4. ప్రారంభవిద్య, ఉన్నతవిద్యలను తెలుగు పిల్లలకు చెప్పేటందులకు, సాధనముగా గవర్నమెంటు వారేర్పాటు చేసిన గ్రాంధిక భాష అందుకు తగినదికాదు. భాషకున్నూ, బాలురకున్నూ, అందువల్ల తీరని నష్టము కలుగుతున్నది. కావున జీవద్భాషలోనే విద్యాకార్యమంతా జరపవలెనని గవర్నమెంటును ఈ సభవారు కోరుతున్నారు.

5. ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు, మద్రాసు విశ్వవిద్యాలయములవారి నిబంధనలలో, ఇంటర్మీడియేటు, బి.ఏ. పరీక్షలకు రెండో భాగములోని దేశభాషలను బోధించే ఉద్దేశము నవీనభావ ప్రకటనకు అనుకూలమైన భాషను ఉపయోగించేటట్టు చేయడమే అని స్పష్టముగా ఉన్నప్పటికీ, తెనుగుబోర్డు ఆఫ్ స్టడీస్‌వారు ఆ నిబంధనను యిన్ని సంవత్సరముల నించిన్నీ ఉల్లంఘిస్తూ ఉండడము చాలా విచారకరము. కాబట్టి ఇకముందు నవీనభాషతో ఉన్న గ్రంథాలకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చేటట్లు తెనుగుబోర్డు ఆఫ్ స్టడీసు వారిని కోరవలెనని ఆయా సిండికేట్లవారిని ఈసభవారు కోరుచున్నారు." సభాధ్యక్షులు కొందరు నవ్యులపైన కొన్ని అభిప్రాయాలిచ్చినారు; పేర్లతో పిలవకుండా తిట్టారనవచ్చు.*

ఈ సభ నేర్పాటు చెయ్యడానికి మూలసూత్ర మీక్రింద ఇట్లా యిచ్చారు :-

"ఆంధ్రవాఙ్మయాభివృద్ధికోసము ఆంధ్రదేశమున మంచి సంస్థ వక్కటి అయిననూలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తు ఉండియు పరిమిత ప్రయోజనకారి అయిపోయినది."

---

* "పెండ్లిఅయినా కాక, స్త్రీ హృదయం యెట్టిదో అయినా తెలియక, ప్రేమగీతాలూ ప్రణయగీతాలూ పాడేవారున్నూ, ఏమీ కారణం లేకుండా కళ్ళకు నీళ్లైనా లేకుండా అరవవారి కూలి యేడుపు యేడ్చేవారున్నూ "

ఇవి యీ సభయొక్క ఉద్దేశాలు. కేవల సారస్వతసేవ కొరకేగాక యావద్విద్యా విషయాలలోకూడా పని చెయ్యడ మీ సభయొక్క ఉద్దేశాలలో ఒకటి. ఇదివరలో ఉన్న ఆంధ్రసాహిత్య పరిషత్తు పరిమిత ప్రయోజనము కలది కాబట్టి దానికి సాహిత్యాది విషయాలలో ఎదురెత్తుగా పుట్టినదీసంస్థ. కాని తర్వాత యీ ఉద్దేశాలలో కేవలసాహిత్యవ్యాపనమే ముఖ్యోద్దేశమై పోయినది. చూడండి క్రింది "ప్రతిభ"లో వాక్యాలు :

"నవ్యసాహిత్యరచన చేయడము, నవ్యసాహిత్యము దేశములో యేవిధముగా ఉత్పత్తిఅవుతున్నదో పరిశీలించి అందులోని బాగోగులు విమర్శించడము, నవ్యవాఙ్మయమును గురించిన అపోహలు తొలగించుటకూ స్వసాహిత్యవ్యాపనము కోసమూ ప్రచారము చేయడము, వచన వాఙ్మయమూ సాధ్యమైనంతవరకు పద్య వాఙ్మయమున్ను ప్రజలకు సుపరిచితమైన వ్యావహారికభాషలో నిర్మించి అందుమూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయడమూ - ఇవి పరిషదుద్దేశములు." ఈవిధముగా ఈ సంస్థయొక్క ఉద్దేశాలుగూడా కేవల వాఙ్మయవ్యాపనానికే అనువర్తించేట్టు చేయబడ్డవి. ఇప్పుడుదీని కృషి చూస్తే కేవలసాహిత్యవ్యాపనమే కనబడుతున్నది. ఈఉద్దేశపూర్తికొరకు ఈక్రింది కార్యక్రమము నేర్పాటుచేసినారు.

(1) పలుతావులలోఉన్న కవులు తరుచు కలిసి సంప్రతించుకోడానికి ఒక ప్రణాళిక ననుసరించి గ్రంథరచనకు అవకాశముకొరకూ సభలూ చర్చలూ సల్పడము.

(2) పరిషదుద్దేశ [illegible]రానికి సమావేశాలు ఉత్సవములూ ఏర్పాటు చెయ్యడము.

(3) పరిషత్తుతరుపున ఒక పత్రిక ప్రకటించడము.

(4) నవ్యసాహిత్యపుస్తక భాండాగారము నెలకొల్పి, అచ్చట నవ్యగ్రంథ విక్రయశాల, ఏర్పాటుచెయ్యడము.

ఈ ఉద్దేశ పరిసమాప్తికోస మీ కార్యక్రమము ముందుంచుకొని క్రమముగా కృషి సల్పగా సల్పగా తుదకు 1936 సంవత్సరము నాటికి పత్రికాస్థాపనమైనది. ఈ

ఉద్దేశసాఫల్యము కోసము 1936 సంవత్సరానికి వెనకటి సమావేశాలలో నవ్యసాహిత్యపుస్తక ప్రదర్శనాలు, గ్రంథపఠనాలూ మొదలైనవాటితో ప్రచారము చేసినదీ సంస్థ. మొదటిపేరు మార్చుకుని "నవ్యసాహిత్యపరిషత్తు" అయినది. ఆపేరుతోనే యిప్పుడిది వ్యవహారములో ఉన్నది. 1936 నుంచీ సంవత్సర సంపుటాలు ప్రచురించినది "ప్రతిభ". పత్రికమాత్రము మంచి ఉత్తమశ్రేణిలోఉన్నది. నిర్భయముగా గ్రంథాలను విమర్శిస్తున్నది. నవ్యుల రచనలనన్నిటిని ప్రచురిస్తున్నది. నవ్యసాహిత్య ప్రచారానికి భారతి కంటె కేంద్రమైపోయినది. ఇది స్థాపించినతర్వాత యీ సాహిత్యానికి స్థాయిత్వము ఏర్పడ్డది. 1939 ఫిబ్రవరినెలలో తన్మహోత్సవము జయప్రదముగా జరిగినది. మొదటినించీ నవ్యసాహిత్య రజతోత్సవము చేయవలెననే సంకల్పముండేది. క్రమముగా అది 1940 సంవత్సరము బెజవాడ పరిషత్సభలో జరిగి, "నవ్యాంధ్ర సాహిత్యనిర్మాత"లలో ప్రథముడైన రాయప్రోలువారికి అఖండసమ్మానము జరిగినది. ఇంతలో గిడుగురామమూర్తి పంతులుగారు దివంగతులై ఆంధ్రదేశాన్ని అశ్రు సముద్రంలో ముంచిపోయినారు. ఈయన లోటు యిప్పుడు చూడనివారులేరు, తత్రాపి నవ్యసాహిత్యాని కిది తీరనిలోటు. తత్స్మారక సంచికకూడా ప్రచురించినదీ పత్రిక. తన కర్తవ్యము చక్కగా నిర్వర్తిస్తున్నది. గ్రంథసమీక్షమాత్రము చాలా ఉదాత్తముగానూ, నిర్మోగమాటముగానూ చేస్తూఉండడము చాలా సంతోషకరము. ఈ పరిషత్తూ, పత్రికా సందర్భములలో ముగ్గురు వ్యక్తుల పనిని ప్రత్యేకముగా ప్రశంసించవలసి ఉన్నది. సభాపతిగారూ, తెలికచర్ల వెంకటరత్నంగారూ, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారూ, చేసిన సేవను ఎంతచెప్పినా తీరదు. ఇప్పటి కీపరిషత్తు తరఫున 11 సమావేశములైనవి.

1. బరంపురం - 1938 - చిలుకూరి
2. రాజమండ్రి - 1933 - రాయప్రోలు
3. అనంతపురం - 1934 - సభాపతి
4. కాకినాడ - 1936 - పంచాగ్నుల
5. గుంటూరు - 1937 - గిడుగు
6. బందరు - 1938 - బుర్రా

| | | | | |
|---|---|---|---|---|
| 7. బెజవాడ | - | 1940 | - | విశ్వనాథ |
| 8. మద్రాసు | - | 1941 | - | అడివి |
| *9. ఏలూరు | - | 1942 | - | దేవులపల్లి |
| 10. తెనాలి | - | 1944 | - | కాటూరి |
| 11. ముక్త్యాల | - | 1946 | - | మల్లంపల్లి |

ఈ ప్రకారముగా సభలు జరిపీ, పత్రికను నడిపీ, యీ పరిషత్తు చేస్తూన్న పని చాలా గొప్పగా ఉన్నది. కాని పత్రిక సకాలములో రావటమూ, సభలు నిర్ణీతకాలములో జరపడమూ పడడములేదు. ఇప్పుడు పుస్తక ప్రకటనమొకటి చాలా మంచిస్థితిలో ఉన్నది. పరిషత్తు తీసుకున్నదీ ప్రకటనకార్యము. రాయప్రోలువారి కావ్యాలన్నీ ప్రచురించినది. ఇంకా యితర కావ్యాలుకూడా ప్రచురణ అవుతున్నై. చక్కని కూర్పులుగా బయటకు వస్తున్నై! పత్రికాపుస్తక ప్రచురణములో సభాపతి, కార్యదర్శులు చేస్తూఉన్న కృషికి దేశమంతా వారికి వందనాలియ్యవచ్చు. సభాపతిగారి భార్యావియోగము వారి నీ కార్యానికి ప్రత్యేకించినది ! నిష్కామకర్మాచరణముచేత వారు మోక్షము చూరగొంటున్నారు ! భగవంతుడు వీరికి దీర్ఘాయుష్యమిచ్చుగాక !

## ప్రతిభ - సారస్వతము

ఒక్క మారీ పత్రికలో ప్రచురించిన సారస్వతాన్ని స్పృశిస్తాను. వెనకటి కవికుమారుల రచనలు క్వాచిత్కముగానే గాని యెక్కువగా కనపడటములేదు.

---

వేదులవారికి గొప్ప సన్మానం ౾రిగిం దీసందర్భంలో.

* సర్కారుద్యోగముచేసి, ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రిన్సిపాల్ పదవి నధిష్ఠించి ఇప్పుడు గుంటూరులో విశ్రాంతి తీసుకుంటున్న విస్సా అప్పారావుపంతులుగా (1884)రీ సమావేశానికి ఆహ్వాన సంఘాధ్యక్షుడు. ఈయన సంగీతములో గొప్ప పరిశోధన చేస్తున్నాడు. ఆంధ్ర సంగీతాన్ని అవలోకనముచేసి దానికి ఉద్బోధం కాన్పించటానికి యత్నిస్తున్నాడు. వీరికి నవ్యసాహిత్యమంటే మిక్కిలి ఉత్సాహము కలదు. వెంకట పార్వతీశ్వర కవులకు 1944 లో జరిగిన సమ్మానము జయప్రదముగా జరగటానికి వీరు ముఖ్యకారకులు.

నవమవార్షికోత్సవసంచిక, అనేపేరుతో ప్రతిభ ఏడవ సంపుటము అచ్చయినది.

విశ్వనాధ కావ్యాలు ప్రతిభలో అంతయెక్కువగా పడటములేదు. *నే నుల్లేఖించిన సాహిత్యవీధీ సంచారము కనపడుతున్నదీ పత్రికలో. పత్రికవారి స్వంతమాటలను ప్రధమ సంవత్సరాంతానికి మనవిచేస్తాను. "మొదటి సంపుటములో పరిషత్తు నాల్గవ అయిదవ వార్షికసభలలో అధ్యక్షతవహించిన ఆదినారాయణ శాస్త్రిగారూ, రామమూర్తిపంతులుగారూ, నవ్యసాహిత్యోద్యమము గురించి చేసిన ఉపన్యాసాలూ, భాషాచరిత్రకు సంబంధించిన వ్యాసాలూ ప్రకటించినాము. సారస్వతశాఖకు సంబధించిన పది వ్యాసాలు ప్రకటించినాము. రెండు పద్యనాటికలూ, రెండు గద్యరూపికలూ, ఖండకావ్యములూ, గేయములూ, కధలూ, గ్రంధ విమర్శనములూ ఈ సంపుటములో ప్రకటితములైనవి." చూడండి ఎన్ని వీధులలో ఈ రచయితలు సంచారముచేసి పత్రికకు వస్తువును కూర్చినారు. ఈ పద్ధతిలోనే యిప్పటికీ యీ పత్రిక నడుస్తున్నది. వారికున్న కష్టాలుకూడా వారి నోటినుంచే విందాము :

"అచ్చు బాగాలేదని కొందరూ, గెటప్, తృప్తిగాలేదని కొందరూ, 'సాహితి, సఖి, ఉదయిని, పాటైనా వుండద్దా' అని కొందరూ, వ్యాసాలకు చాలాపేజీలను విడిచిపెడుతున్నారని కొందరూ మంచి వ్యాసాలు రావడంలేదని కొందరూ, పద్యాలు తగ్గించాలని కొందరూ, కొందరి పద్యాలకువెలివేస్తే బాగుండునని కొందరూ, కధలు చాలవని కొందరూ, విమర్శనలు మరీ ఘాటుగా వున్నవని కొందరూ, యీ విధముగా యెవరికి తోచిన మాటలు వారు అంటున్నారు."

శ్రేయాంసి బహు విఘ్నాని! ఒక్కమాట మాత్రము మనవి చేస్తాను. సాహితి, సఖి, ఉదయిని, పత్రికలను మాత్రము ఆదర్శముగా పెట్టుకోవద్దనీ, (త్వరలో అంతరించినై కాబట్టి) ఎటువంటి పనికీ వంకపెట్టేవాళ్లుంటూనే ఉంటారనీ, అంతమాత్రముచేత నిరుత్సాహము చెందక కర్తవ్యము నిర్వర్తించవలెననీ ప్రార్థిస్తున్నాను. అదిగనక జరగకపోయెనా నవ్వులకు కబుర్లేగాని కార్యోత్సాహములేదనీ, బాలనాయక బహునాయకమైనదనీ, 'మరోమారు రుజువవుతుంది. 'కాబట్టి అట్లా చెయ్యక వినయముకోసము తలవగ్గమని ప్రార్థన. అందులో ఎట్టి అవమానమూ, అప్రతిష్ఠా లేదు. కృష్ణశాస్త్రిగారి కృతులు "నాడు నేడు" 'ఊర్వశి' మొదలైనవి అప్పుడప్పుడూ కనబడుతున్నవి! 'హఫిజ్' అనే పారసీక కవియొక్క కావ్యానికి ఒక

* "రామలింగారెడ్డి ప్రశంస" మొదలైనవి చాలా కొద్దిగా ఉన్నవి.

స్వేచ్ఛానువాదమున్నది. * కొంచెము "అయోమయము"గా ఉంది. ఖాసింఖానుగారు చేసిన పరివర్తనము హృదయంగమముగా ఉంటుంది. "పురిపండా, కొడాలి, జాషువా, అడివి, బొడ్డు, కొమాండూరు, కవి కొండల మొదలైన ప్రాతపేర్లు కొన్ని కనపడుతూనే ఉన్నవి. సభాపతి, నరసింహశాస్త్రి గార్లు తమ చక్కని పద్యరూపికలూ నాటికలూ రచిస్తూనేవచ్చినారు. ఇవిమాత్రము చాలా ఉత్తేజకరాలుగానే ఉంటూ వచ్చినై! మొదలెట్టినప్పటినించీ, సమప్రదేశములో ప్రవహించి దేశాన్నంతా నూతనసస్యాఢ్యముచేసే జీవనదులవలె వీరిద్దరి రచనలూ భాషాలంకారాలుగా ఉంటూనే ఉన్నవి! కర్షక కార్మికుల జీవనచిత్రాలు, చిరుమామిళ్ళ విజయపార్థసారధి, రాజమన్నారుగారు మొదలైన వారు ◆ "పాషాణి" అనేపేరుతో డి.యల్. రాయి నాటకానుకరణాలు మొదలైనవీ, "ఎలిజీ" పద్ధతిలో పన్యాల వెంకటరంగనాధరావు గారూ, ఈవిధముగా కొన్ని నూతన కావ్యాలు వచ్చినవి! తమ తండ్రిగారి భాషాసిద్ధాంతాల నన్నిటినీ గుదిగుచ్చి పద్యరూపముగా "భారతీశతక" మనేపేరుతో గిడుగు సీతాపతిగారు రచించినారు. ఇది చదువుతూఉంటే నాకు ధూర్జటి కాళహస్తీశ్వరశతకము చదువుతున్నట్టుంది. అంత సరసముగా ఉందీగ్రంధము. సభాపతిగారు పేరు చెప్పకుండా తమ స్వీయచరిత్రలో భాషాధ్యాయాన్ని "నాలో మార్పు" అనే శీర్షిక క్రింద రచించినాడు. చాలా విషయాలతో నిండి హృదయ కర్షణముగా ఉన్నదీరచన.

ఆంధ్రాభిమానాన్ని పురికొల్పు తున్నారు మారేమండ రామారావుగారి వంటివారు తమ "తెలుగు వెలుగు" మొదలైన గ్రంథాలతో! చింతా దీక్షితులుగారితో బాటు కూచి నరసింహంగారు కూడా బాలవాఙ్మయముకోసము కృషిచేస్తున్నాడు. ఇటీవల "శాలావాఙ్మయ గ్రంధమాల" అనే పేరుతో సికింద్రాబాదులో పుస్తక

---

* "మొగసాల" 'జైలులో' అని ఒక చక్కని కావ్యము కూడా రచించినాడు.

◆ నాటికాగుచ్ఛము.

ఈయన "శ్మశానవాటిక" అనే శీర్షిక క్రింద ప్రతిభ సం.5 సం.1లో వ్రాసిన ఖండ కావ్యము జాషువా కావ్యానికి ప్రతిబింబముగా ఉన్నది. 'అశ్రుగీతి' అనే ఎలిజీ, అనూరాధ నీకోసం, అనే పెద్దకథలూ, ప్రేమలత అనే ఖండకావ్యము ప్రకటించినాడు'

ప్రచురణము జరుగుతున్నది. ఇతర వాఙ్మయాలను తప్పక యీ విషయములో అనుకరించవలసి ఉన్నది మనము. సాహిత్య పరిశ్రమ చక్కగా చేస్తున్నారు. జమ్మల మడక, పాటిబండ, గొడవర్తి, కృత్తివాసతీర్థులు, కొడవటిగంటి, నోరి, వావిలాల మొదలైనవారిసారస్వత వ్యాసాలు చాలా ఉత్తేజకరాలుగా ఉన్నవి. చింతా దీక్షితులు గారి "యక్షగానతత్వనిరూపణమూ" పుచ్చా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి "సంగీత తత్వనిరూపణమూ", యీ కాలానికి చాలా అవశ్యకర్తవ్యాలుగా ఉన్నవి. మండపాకవారి "సారంగపాణిపదవిమర్శ" వెంపటి నాగభూషణంగారి "మువ్వగోపాలపదములు" కూడా చాలా హృదయంగమముగా ఉన్నవి. ఈ పత్రిక కలంకారభూతాలైన వ్యాసాలివి. పురాతనకథలను "లలిత కథావళి" "సిందుబాదు కథలు" అనే పేరుతో రాయసంవారూ, మొసలికంటివారూ, వ్రాసినారు. కథానికావీధిలో వెనుకటి, శ్రీనివాస శిరోమణి, కొడవటిగంటి, బొడ్డు, మల్లాది, రామకృష్ణశాస్త్రి విశ్వనాథకవి రాజు, మొదలైనవారేగాక 'బుచ్చిబాబుకథలు' అనే పేరుతో కామకథలూ (Sex) "కృష్ణమూర్తికథలు" అనేపేరుతో శాస్త్రపరిశోధన కథలూ, 'యువకధావళి' అనీ 'ఆధారములు' అనీ కార్మికజీవనము తెలియజేసే కథలూ, యింకా నీలకంఠం కథలూ, (సభాపతిగారిదని ప్రతీతి) కరుణ కుమారకథలూ, జీవనప్రభాత్ కథలూ 'సూర్యనారాయణమూర్తికథలూ, 'ముత్యాలశాల' 'ప్రేంచెందు అనువాదాలు' "కమ్మతెమ్మరలు" 'వెలుగునీడలు' 'వాహ్యాళి' అనే పేర్లతో కొన్ని ఉన్నవి. అనేక రకాలుగా యీ వీధి చాలా అభివృద్ధిలో ఉన్నది. 'వ్యత్యాసాలని సాంఘిక కథాసంపుటి అందే నారాయణస్వామిచేత వ్రాయబడినది.

'ప్రజాసామాన్యానికి సంబంధించిన యితివృత్తాలనే తీసికొని వారి నిత్యజీవితాల్లో, సారస్వతములో, కళలో, ప్రతిఫలించేటట్లు చేయాలని యిప్పటికి అభిప్రాయము. దీనికే ప్రోలిటేరియన్‌కళ అని పేరు. దీనిని ప్రజాసామాన్యములోనించి బయలుదేరిన చిత్రకారులు సృష్టించవచ్చు. లేదా వారి జీవితాన్ని సానుభూతితో గమనించి ప్రశాంతముగా ఇతరులైనా సృష్టించవచ్చు. మాలపల్లి, యెంకిపాటలు దీనికి నిదర్శనములు. మార్గ (Classical) దేశి (Folk) రీతులు, మన సంస్కృతిలో ఎల్లప్పుడు ప్రవహిస్తూనే ఉన్నవి. ఒకదానివలన రెండవదానికి బలము, ఉత్తేజము, కలుగుతూ ఉంటుంది.'

(కోలవెన్ను రామకోటేశ్వరరావు, ఆంధ్రపత్రిక, 12-11-40)

ఈమార్గదేశీవిభాగము కవిత్వములోనూ నాట్యములోనూ, సంగీతములో కూడా ఉంది. నన్నెచోడుడు వీటిని సంస్కృతాంధ్రాలకు పర్యాయాలుగా వాడినాడు ఈకథావీధిలో యువకులు, పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, మొదలైనవాళ్ళు చాలామంది సంచారముచేసినారు. ఎన్ని కథలు ఎందరు వ్రాసినా వెనక నేనిచ్చిన లిస్టును మించినవి పుట్టలేదు.

## బౌద్ధప్రభావము:

నవ్యులలో కొందరు కారణమేమో తెలియదు బౌద్ధవాఙ్మయమువంక తమ దృష్టిని సారించినారు. బహుశః అందులోఉండే అహింసాసత్యసిద్ధాంతాలు వీరికి నచ్చినై అనుకుంటాను. ✻ మరొకటి కూడా కావచ్చు. వీళ్ళకు వెనకటి సంప్రదాయాన్ని తెంచుకోడాని కిష్టములేదు. కాని నవ్యులలో కలవాలనే ఆదుర్దా ఉన్నది. అందుచేత వస్తువును వెతుక్కోగా బౌద్ధవాఙ్మయము దొరికినది వీళ్ళకు. ఇందులో తప్పేమీలేదు. అదీ తప్పక మన భాషలోకి రావలసినదే. ఈ వీధి సంచారము చేసిన వారిలో దుగ్గిరాల బలరామకృష్ణయ్య (బౌద్ధవాఙ్మయ బ్రహ్మత్వము వీరి కబ్బినది), కిళాంబి రంగాచార్యులు, చిలుకూరి నారాయణరావు, సన్నిధానము, పింగళి, కాటూర్లు, వేలూరి చంద్ర శేఖరంగార్లు ఎన్నదగినవారు. ఈ బౌద్ధ వాఙ్మయములో పింగళి కాటూర్ల◆ 'సౌందరనందమూ' వేలూరి చంద్రశేఖరముగారి 'కాంచనమాల' సన్నిధానమువారి 'జాతకకధాగుచ్ఛము' ఉత్తమాలు. మళ్ళీ వీరిలో సర్వజనులనూ

---

✻ వంగూరు సుబ్బారావుగారు తమ 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర'లో 1920 సంవత్సరములోనే యిలావ్రాసినారు 'ఇంతవరకేల? ఇప్పుడాంధ్రదేశమున బౌద్ధ జైన వాఙ్మయముల భాషాంతరీకరించి ప్రచారమొనర్పుడు, వాఙ్మయము తెనుగులో పుట్టిన మరుసటిదినమునుండి యాంధ్రదేశమున బౌద్ధ జైన మతప్రీతి, జైనమతస్థులును బయలుదేరుదురు.'

◆ కాటూరువారు ఎ.యస్.పి. అయ్యరుగారి కొన్ని నాటకాలు పరివర్తన చేసినాడు ఈ కాలములో పూర్వపద్ధతిని ప్రబంధాలు, నాటకాలూ రచించేవారు అడుగంటలేదు. ఒకవేపు అవీ వస్తూనే ఉన్నవి! హనుమత్సందేశాదులు చక్కని ప్రబంధాలుకూడా పుట్టినవి!

రసములో ముంచివేసిన 'సౌందరనందము' † తత్కర్తలకు శాశ్వతకీర్తిని తెచ్చిందనడములో ఎంతమాత్రము అనుమానము లేదు. చక్కనిశైలిలో, ఔచితిని పాటిస్తూ, కథను పోషించుకుంటూ, వర్ణనలను అవసరమైతే వదలకుండా, భావ గుంభితముగా రచించినారు. ఈగ్రంథము రచించిన శిష్యులకూ, కృతి పొందిన గురువర్యులకూ కూడా కీర్తిని తెచ్చినది. సూర్యనారాయణశాస్త్రిగారి 'జాతకకథా గుచ్ఛము' ఉదాత్తశైలిలో నడుస్తున్నది. వీరి కవిత్వము కూడా రాటుతేలి క్రమక్రమముగా వలసిన సౌలభ్యము అలవడచేసుకున్నది. కాంచనమాలను గూర్చి చెప్పవలసివస్తే దీనికి మాతృక ఉన్నప్పటికీ చంద్రశేఖరము (1897)గారు దీన్ని మంచి రసవత్కథా సందర్భాలతోనూ, మనోవృత్త ప్రదర్శనాలతోనూ, సరసశైలితోనూ కూర్చినారనడము సత్యదూరము కాదు. ✻

## కొన్ని నవ్యసాహిత్య గ్రంథాలు

ఈ కాలములో ప్రచురింపబడిన కొన్ని నవ్యసాహిత్యగ్రంధాలను గూర్చి ముచ్చటిస్తాను. ప్రేమగ్రంథమాలనేపేరుతో ఒకటి స్థాపింపబడి ప్రేమను చిత్రిస్తూఉన్న 'ప్రేమాంజలి' మొదలైన ఖండకావ్యాలు ప్రచురణైనవి! వేపకొమ్మ ఆదిశేషయ్యగారు 'కురంగీకిరాతమనే' ఖండకావ్యము ఒకటి వ్రాసినాడు. వఝుల వెంకటేశ్వరకవిగారు 'నౌకాభంగము' అనేపేరుతో ఆంగ్ల కవివరుడగు టెన్నిసను వ్రాసిన ఈనక్ ఆర్డెను **(Enoch Arden)** అనే ఆంగ్లకావ్యాని కనువాదము రచించినాడు. చాలా చక్కగా ఉన్నది. 'ఏకాంతద్వీపము' లోని వర్ణనలు మొదలైనవి చాలా హృదయంగమాలుగా ఉన్నవి! కాని ప్రియుడికోసం వేచియున్నన్నాళ్లుండి తుదకు పెళ్లిచేసికొనడము కొంచెం ప్రాచ్యపద్ధతికాదు. బొడ్డు బాపిరాజుగారి 'విపంచి', కందుకూరి రామభద్రరావుగారి 'లేమొగ్గ', 'తరంగిణి' 'వేదన'; వఝుల కాళిదాసుగారి

† ఇందులోని ఘట్టాలన్నీ తీసికొనే పన్యాల రంగనాధరావు 'జ్ఞానభిక్ష' అనే గేయనాటిక రచించినాడు. సాధనసమితి సభ్యులైన సూర్యచంద్రులు వ్రాసిన 'సాంధ్యగీతి' రాజలింగం వ్రాసిన 'సాధన' కేశవస్వామివ్రాసిన 'త్యాగి' అనే నాటికలు బౌద్ధవాతావరణము కలిగినవే. దుర్భా రామమూర్తిగారి 'త్యాగము' చక్కని ఖండకావ్యము.

✻ ఈయన తత్సమచంద్రికను పెంచి వ్రాసిన వ్యాకరణ మొక యుద్గ్రంధము

'భిక్షాపతి', కుందుర్తి నరసింహారావుగారి 'యౌవనజ్వాల', వట్టికొండ రంగయ్యగారి 'ప్రణయి', మధునాపంతులవారి 'తోరణము' 'గోభూమి', బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారి 'ప్రేమతపస్వి'ని; అత్తిలి సూర్యనారాయణమూర్తిగారి 'పాలపుంత', సబ్బినీసువారి 'గేయ గుచ్ఛము', నాళం కృష్ణారావుగారి 'విరిదండ', మొదలైనవి రసవత్కావ్యాలే. * తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఆంధ్రోద్యమాన్ని పురికొల్పుతూ 'రాష్ట్రగానం' అనే కావ్యము ప్రశంసనీయముగా వ్రాసినాడు. ◆ దీనిమీద చర్ల గణపతిశాస్త్రి విమర్శవ్రాసినాడు. భారతి 35 ఇంద్రగంటి 'తెలుగువీణ' కె. అన్నమరాజశర్మ 'మల్లె పువ్వులు' సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారు ఒక 'సాధకుడు' తమ అభిమాన దేవతయైన లలితపైన 'లలితాశతకం' గాక ఆంగ్లములోనించీ మిల్టను వ్రాసిన 'కోమస్' అనే కావ్యాన్ని 'కామవిలాసము' అనే పేరుతో స్వేచ్ఛానువాదము చేసినాడు. విశ్వ విద్యాలయమువారు యం.ఏ.కు పాఠ్య గ్రంథముగా పెట్టి గౌరవమిచ్చినారు. 'తరంగములు' అనే పేరుతో పిఠాపురం యువరాజుగారు తమ కావ్యగానాన్ని చేసినారు చక్కని భావాలతో నిండిఉన్నవి. పద్యాలన్నీ. అడవి బాపిరాజు 'గోధూళి' అనే పేరుతో చక్కని జానపదకావ్యాన్ని రచించినాడు. చాలా రసవంతముగా ఉన్నది. కాని నండూరివారి కావ్యానికి ప్రతిధ్వనియ అని తోచవచ్చు. § వీరుగాక ఇంకా యితర ఖండకావ్యాలు పురిపండా, ఉమర్ ఆలీషా ఇంద్రగంటి మొదలైనవారు

---

* కృత్తివాసతీర్థులు మళ్ళీ తండ్రి అయిన సభాపతిగారి ననుకరిస్తూ పద్యనాటకాలు రచిస్తున్నట్లు 'రాసలీలానాటికే' సాక్ష్యము

◆ బోడేపూడి వెంకట్రావుగారి "ఆంధ్ర తేజము" ఇది ఒక చక్కని కథాకావ్యము వ్రాసినాడు. కీర్తిశేషులయిన వంగూరి సుబ్బారావుగారి 'మణిమేఖల'లోని నీరపత్నికిది రూపాంతరము అన్నాడు కవి. విశ్వనాథ మెచ్చుకున్నాడు.

§ "బాపిరాజు" చాలామందికి భావనా గురువు. అత్తిలి సూర్యనారాయణమూర్తి గారు ఆయనకు కావ్యాన్ని అంకితము చేసినాడు. రుక్మిణీనాథశాస్త్రిగారు ఈయనను "అలరవీంద్రుడవు నీవె అవనీంద్రుడవు నీవె" అని పేర్కొన్నాడు. బాపిరాజు ఇతను చాలా సర్వతోముఖ ప్రజ్ఞకలవాడు. కవై చిత్రకారుడై సినిమా డైరెక్టరై చాలా ఉన్నతమైన శక్తిగలిగి నిగర్వై సంప్రదాయాని కోసము పాటుబడే కొద్దిమందిలో ఈయన ఒకడు ఇతని మాటలు పాటలు పిన్నవాళ్ళు ఇతన్ని ఎన్నటికి మరువరు గోధూళే గాక యితను రచించిన 'నాగరాజు' మొదలైన పాటలు చాలా ఉన్నవి

వ్రాసినారు. జాషువా 'ఖండకావ్యాలు' రెండు సంపుటాలుగా ముద్రింపబడటమేగాక ఆయన వ్రాసిన "ఫిరదౌసీ" మొదలైన యితర కావ్యాలుకూడా యీకాలాన్నే ముద్రింపబడి 'ఆంధ్రదేశాని' కల్హారుముద్దుగా ఇయ్యబడ్డవి! ఇతనీ కాలములో నవ్యాకాశములో తేజోవంతముగా వెలుగుతున్న నక్షత్రము. ఇతని నుడికారము మిక్కిలి శ్రోత్రపేయము. ఇతనికి చక్కని పదజాలమే తటుతుందిగాని శ్రుతి కటు పదజాలము తట్టనేతట్టదు. భాషా పరిశ్రమ చెయ్యడములో మత మడ్డురాదని సిద్ధాంతీకరించిన వాళ్ళలో ఈయన ముఖ్యుడు. క్రీస్తుమీద వ్రాసిన ఖండకావ్యము చాలాహృదయంగమము. క్రైస్తవుడైనను చిత్తవృత్తి మారకపోయినందులకు యీయనకు ఆంధ్రదేశమంతా అభినందిస్తుంది. ఈకాలములోనే విశ్వనాథ "శృంగారవీధీ"త్యాదులైన వెనకటి కావ్యాలుకూడా ప్రచురణ ప్రారంభమై దేశాన్ని ఆనందింప చెయ్యడము మొదలుపెట్టినవి. కొందరు యువకులు మళ్లీ యీమార్గములోనే సాధన చేసేవాళ్లు వావిలాల సోమయాజులు, రావూరు సత్యనారాయణ మొదలైనవారు తయారౌతున్నారు.

వీరందరిలో ఒక్క విశేషము కనపడుతున్నది. వెనక, సృష్టికీ - విమర్శనానికీ విరోధ మనుకుంటూ ఉండేవాళ్ళు. ఇప్పటివా రట్లాకాకుండా వీటికి విరోధం లేదని చూపుతున్నారు. "ప్రతిభ" చూస్తే ఖండకావ్యకర్తలే గ్రంధవిమర్శనచేసే వాళ్ళుగా కూడా కనపడతారు. నవ్యసాహిత్య పరిషత్తువారి తరిబీతుక్రింద జరిగిన గొప్ప విశేషమిది. ఇది మొదటినుంచీ సభాపతి, నోరి, చింతా మొదలైన వారి ప్రతిభ యొక్క అనువృత్తి: వేదులవారు బెజవాడ పరిషత్సభలో ఇచ్చిన ఉపన్యాసము సభ్యులెన్నడూ మరవరానిది. విశ్వనాథ అధ్యక్షోపన్యాసము, వారి విమర్శన శక్తిని ప్రతిఅక్షరములోనూ వెల్లడిచేస్తున్నది. పింగళివారు అప్పుడప్పుడూ చెబుతున్న విమర్శనోపన్యాసాలూ, తుదకు "వ్యాసమంజరికి" వ్రాసిన ఉపోద్ఘాతములోనూ తమ విమర్శన శక్తిని చూసినారు. వెనకటికైనా రామలింగారెడ్డి ఆంధ్రదేశానికీ, భాషకూ తమ అమూల్య విమర్శక ౧ౖప్రాయాలను దయచేసినారు. ఈవిధముగా ఈ రెండుశక్తులూ కవులకు కలడగను భాషకు మహోపకారమనడములో ఎట్టి ఆక్షేపణా లేదు. ఈ సందర్భములో ఈ భాషాకుమారులంతా యీవిధముగా పెంచిన

వాఙ్మయము యావత్తు ఒకే ధారావాహికగా వస్తున్నదని వీరిలో ఉపజ్ఞకలవారను కొనడము చాలా సరసముగానూ యువకులకు తెలియజెప్పటముగానూ ఉన్నది. ప్రథములైన రాయప్రోలు మన పూర్వసాహిత్యాన్ని "తెనుగు మాన్యము" అన్నాడు. దానిమీదే మనకు అభివృద్ధి చెయ్యాలని వీరి ఊహ: "పరిణతవాక్కు, లసదనవద్య కళాకవితా పితామహుల్ స్థిరముగ నిచ్చిరీతెలుగు తీయనిమాన్యము" అన్నాడు. ఇటువంటి భావముతోనే నోరి "ఆంధ్రకవిత్వములోని ఫాషన్లు" అనే వ్యాసము రచించినాడనుకుంటాను.*f* వేదాలనుంచీ మొదలెట్టి, వాల్మీకి, వ్యాసుడు, గుణాఢ్యుడు, కాళిదాసు, భవభూతి, తిక్కన్నలలోనుంచీ అనువృత్తై తనలోకి దాచుకున్నాడీ కవితాస్రవంతిని. ఇంకా కొందరు కూడా ఈ విధముగానే తలచినట్టు కనపడుతుంది. అది చాలా సమంజసము! కొందరుమాత్రము తామెక్కడినుంచో అంట్లునాటబడ్డట్టు వచ్చి యిందులో పడ్డామని అనుకుంటున్నట్టు తోస్తుంది. ఈ అనువృత్తి భావమే సాహిత్యానికి పునాది. ఇదే సాంప్రదాయ విచ్ఛిత్తి కాకుండా సాహిత్యాన్ని సరియైన త్రోవలో పెడుతోంది. సభాపతి, నరసింహశాస్త్రిగారలు కూడా యీభావాన్నే చాలా మార్లు నొక్కి చెప్పినారు. ఇందుకు మరొక తార్కాణమిస్తాను. వీరు గ్రంథవిమర్శలు చెప్పినప్పుడు చెప్పే కొన్ని మాటలూ, నిర్వచించే పద్ధతులూ, మన పూర్వుల సంప్రదాయాలతో ఎంతమాత్రము భిన్నించడము లేదు. కొన్ని చూపుతాను. గ్రంథ నామాలను గూర్చి చెబుతూ మేఘసందేశ విమర్శలో హనుమచ్ఛాస్త్రి గారు 'గ్రంథనామం యింకా కొంచెము స్పష్టమై ఉండడము అవసరం అన్నాడు. ఇంకా 'మరిన్నీ' వంటి చ్యుతసంస్కృతులున్నూ అక్కడక్కడ కనబడుతావున్నాయి" అనడము చాలా

*f* కందుకూరి రామభద్రరావుగారు "తెలుగుతోట" అనే ఖండకావ్యములో కూడా ఇదే అనువృత్తభావం అణిగిఉందనుకుంటాను. "ఎంతచక్కనిదోయి యీ తెనుగుతోట" అని ప్రారంభించి "నాదుతలపులు రేపు నాతెలుగు తోటలో పాడుకొననిండోయి, పలవింపనిండోయి'' అన్నాడు. అప్పటినుంచి, యీతోట ఒకటేననే భావము వస్తున్నది ఇంద్రగంటివారు 1939 మార్చి భారతిలో వ్రాసిన వ్యాసములో ఇట్లా అన్నారు. 'నేటి కాలపు కవిత్వము --- కొందరన్నట్టు కేవలము పూర్వకవిత్వముతో సంబంధం లేకుండా, పూర్తిగా ఇప్పటివారి ప్రజ్ఞావిశేషమువల్ల సృష్టింపబడిన అపూర్వ సంస్థ --- కాదని తోస్తుంది. ఇంతేకాక యిది వేదకాలమునించీ ప్రవహించే 'కవితా స్రవంతి" అనికూడా చెబుతూ పైన ఉల్లేఖించిన బాపిరాజుగారి గీతభావాలతో ఏకీభవించినాడు.

ఆశ్చర్యము. ఆ విమర్శించిన కావ్యము చ్యుత సంస్కృతి ఉండకూడని కావ్యము కాబట్టి సమంజసమే! పట్టాభిగారి కావ్యము విమర్శిస్తూ నరసింహశాస్త్రిగారు "... ఈ కవిని అనుకరించి యితరు లెవరైనా కావ్యాలు వ్రాస్తే వాళ్ళను విశాఖపట్నం పంపనలసి వస్తుంది" అన్నారు. ఎంత కఠినము? 'రైతుబిడ్డ' అనే నాటకము విమర్శించటములో వెంకటరత్నంగారు, 'కవి పాత్రల మరుగున ఉండడము సమంజసముగాని ప్రచారకుడుగా రంగంమీదికి మాటిమాటికీ ప్రత్యక్షం కారాదు.' అని చక్కగా వ్యంగ్య ప్రాధాన్యాన్ని నిర్వచించినాడు. ఇవి మచ్చుకు చాలనుకుంటాను. వీటితోపాటు మాండలిక పదములను గూర్చి, కవివ్రాసే కథా వస్తువును గూర్చి, సృష్టించే పాత్రలనుగూర్చి, వ్రాసేటప్పుడు కొన్ని కొత్తవిషయాలను చెప్పడము న్యాయమే! కాబట్టి విమర్శించినదోవ చక్కగా పూర్వాధునిక ఫక్కీల సమ్మేళనము చాలా సమంజసమూ కర్తవ్యమూను! ఇది వీరు నిర్వర్తిస్తే ఆంధ్రసాహిత్యానికి చాలా సేవచేసిన వాళ్ళౌతారు.

## మనవి :

ఇప్పటి సాహిత్య పరిస్థితులనూ, సాహిత్య వాతావరణాన్నీ, సాహిత్య సంపర్కాలనూ, అనుసరించి పూర్వుల సాహిత్యదృష్టికి విపరీతాలు కాకుండా ఉండే విమర్శనాపద్ధతులను నెలకొల్పి, వ్రాసేవాళ్ళకు మార్గాన్ని నిరూపించడమూ నవ్యులు ముఖ్యముగా చెయ్యవలసిన పనులలో ఒకటి. ఈ విషయములో నవ్యులలో పండితులూ, సాహిత్యవేత్తలూ అయినవాళ్ళు తప్పక ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. ప్రతిభలో మనవాళ్ళు కొందరు వ్రాస్తున్న సాహిత్య వ్యాసాలు చూస్తే నాకీ ఆశ కలుగుతున్నది. ఉత్సాహముతో ఉప్పొంగుతున్న యువకులు చేయవలసినపని యిది. నినికాంచీమా బొత్తిగా విడిపోవద్దని ప్రార్థన.

ఈదశాబ్దాంతానికి దగ్గిరే భావినవ్యాంధ్రసాహిత్యమార్గదర్శి శ్రీ రంగం శ్రీనివాసరావుగారు(జనన: సు 1910)భారతిలో ఖండకావ్యరచన ప్రారంభించినాడు. ఈయన అప్పటి రచనలసు చూచినవాళ్లు ఇప్పుడాయన వ్రాసే కావ్యాలవంటివి వ్రాస్తాడని అనుకొనిఉండరు. ఇతర ఖండకావ్యకర్తలగు నవ్యులవలెనే యీయనకూడ

భావగీతాలు కొన్ని రచించినాడు. భారతీసంపుటాలలో కొన్ని ఖండకావ్యాలు ఒక కథ కనబడుతున్నవి. వాటిలో మొదటిది శివతాండవము మీద "ప్రళయనర్తనము"నే పేరుతో ఉంది. చక్కని సలక్షణ భాషా శైలీని. గౌడీరీతిలో ఉన్నది. ఈయన తన ప్రధమ గీతములోనే శివునితాండవము చెయ్యమనే కోరిక చాలా విచిత్రముగా ఉంది. ఇప్పుడున్న సృష్టిమీద నిరాశతో, ప్రళయానంతరము మంచి సృష్టి వస్తుందనే ఆశో దీనికి ప్రేరకము తెలియదు. నాశనము పునఃసృష్టికి పూర్వరంగము కాబట్టి లోపములేని స్వచ్ఛమైనసృష్టి కావలెనని కవికుమారుడు కోరుతున్నాడా అనిపిస్తుంది. భాషమాత్రము మిక్కిలి హృదయంగమమై, సన్నివేశానికి తగిన పారుష్యము కల్గియున్నది. తర్వాతది "అహర్ముఖం" అనేగేయం. తెల్లవారుజాము ఒక కలకన్నాడు. పూర్వ భారతదేశావస్థ కళ్ళకు కట్టినది. వెనుకటి ఋష్యాశ్రమాలు, మునులు, ఋగ్వేదగానము, కనపడ్డె వినపడ్డది కాని తనకేమీ అర్థముకాలేదట ! ఈగేయము కూడా చక్కని సలక్షణ భాషలోనే ఉన్నది. వస్తువుకూడా పూర్వ భారతౌన్నత్యము కాబట్టి మనస్సు నాకర్షించేదే ! మూడోది "అంధకారము" అనే శీర్షిక కలది. సంధ్యాకాల వర్ణనము. కవికుమారుడు సంధ్యకూ, అంధకారానికీ, నక్షత్రాలకూ సంభాషణ కల్పించినాడు. ఇదికూడా గేయమే! అంధకారానికీ నక్షత్రాలకూ అవినాభావసంబంధము కలిగిన సఖ్యము. ఈ సఖ్యాన్ని చక్కని ఈక్రింది గీతములో వర్ణించినాడు.

"నిలువలేనే నీవు నిలచియుండనివేళ
వెలుగలేనే నీవు విస్తరించనివేళ,
నీ కాటుకలచేత నా కను ల్వికసించు,
నీకు నేనే నాకు నీవె యీ లోకాన"

ఎంత అందముగా ఉంది! చీకటిని "కాటుకలు" అనేపదముతో వివక్ష చెయ్యడముచాలా హృదయంగమముగా ఉన్నది. ఇది ప్రకృతిసిద్ధము. నేత్రరోగము వచ్చినప్పుడు కాటుకచేత కళ్లు విస్తృతాలవుతవి. ఇది వైద్యశాస్త్రముమీద ఆధారపడ్డ అభేదాధ్యవసాయము ! ఇది యీ కాలములో క్రమముగా అభివృద్ధి అవుతున్న ఒక పద్ధతి. శాస్త్రాలలోనించి సాదృశ్యకల్పన. తుదిపాదములో సఖ్యము చక్కగా

ఉగ్గడించినాడు కవి కుమారుడు. సఖ్యములో ఉండే అన్యోన్యాశ్రయము ఒకరు లేకుండా రెండోవారు ఉండలేకపోవడము చక్కగా నిర్వచించినాడు. చాలా రసవంతముగా ఉందీగీతము. ఈగీతములో ఈయన సఖ్యమనే పరమావధికి దగ్గరగా వెళ్ళినాడు. నాల్గోది 'అంతస్సమాధి' అనే శీర్షికగలది. ఇది కూడా "అహర్ముఖం"లాగు ఒక కల. కలలో కృష్ణరాయలసభను చూచినాడు కవికుమారుడు. అప్పటి భారత దేశౌన్నత్యము ఒక్కమాటు కళ్ళకు కట్టినది. అప్పటివైభవము మళ్ళీ ఎప్పటికైనా వస్తుందా అని కవి చాలా శోకిస్తాడు. ఇదికూడా దేశభక్తిస్ఫోరకమైన గీతము. తర్వాతది 'నిశీధసాంత్వనం' అనే శీర్షికతో ఉన్నది. ఇదీకూడా సామాన్యముగానే ఉన్నది గాని విప్లవద్యోతకముగా ఎంతమాత్రములేదు. తుదిగీతము "సుమార్చన" అనేది. దీనిలో పూలన్నీ కొయ్యడము పరమేశ్వరార్చనము జరపవలెనని. ఇదికూడా చాలా భక్తిరసస్ఫోరకముగా ఉంది. పరమేశ్వరార్చనకు సుమచయము సేకరించటముకంటె సత్కార్యముంటుందా? ఇంతవరకు ఈయన కావ్యాలలో మామూలుకంటె భిన్నమైన మార్గాలు యెట్టివీ కనడలేదు. * ఇక కథసంగతి చూస్తే అది "సోములు చెప్పినకథ" అనే శీర్షికలో ఉన్నది. లోకవృత్తములో కనపడుతున్న శృంగారమే దీనిలో వస్తువు. ఇక్కడకూడా విప్లవము ఏమీ కనపడటము లేదు. చక్కనిభాష, శైలి, చక్కనిభావన, మనోహరమైన వస్తువు. ఈవిధముగానే ఉంది సందర్భము. మల్లవరపు విశ్వేశ్వరరావుగారు కూడా ఈ దశాబ్ది ఆఖరులో వ్రాత మొదలుపెట్టినట్టు కనపడుతుంది. ఈయన "స్వప్నభంగమ"నే పేరుతో ఒక ఖండకావ్యము వ్రాసినాడు. * ఇది గేయము. ఇందులో ఛందస్సులో ఒక విశేష మున్నది. పదాలూ సమాసాలూ వెనకటి పాదములోనించీ తర్వాత పాదానికి ప్రవహించే గుణము పెట్టినాడు. ఇది వెనకటి వాళ్ళలో అక్కడక్కడా కనపడుతుంది. ◆కాని దీనిలో

---

* భారతి, శుక్ల ఆషాఢము.

◆ గురజాడ అప్పారావుగారి 'కాసులు'

విసుము ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినది; వే
రొకటి హృత్కమలంపుసౌరభ
మ, దియు నిది యెక్కెడను గలుగుట
యరుదు; ...................................

దాదాపు ప్రతిపాదమూ అట్లాగే ఉన్నది. ఆంగ్లములో "Run on verse" అంటే 'అనువృత్తగీతి' అందామిటువంటిదాన్ని. *ఈయన వెనకటి కవిసమయాలనే అలంకారాలనే ఉపయోగించినట్లు కూడా కనపడుతుంది.

'సుఖశంప మరగించి
శోకాంబుదమె పెంచి'

చూస్తే ఈయనకు కొంత కృష్ణపక్షకర్తయొక్క అంశ ఉన్నట్టు తోస్తుంది. శోకము మేఘమూ, సుఖము మెరుపూ, మెరుపు క్షణ భంగురము ! ఇంతకంటె శోకము చిరకాలవర్తి ! ఈ విధముగా వచ్చే తరములోకవితావిప్లవానికి మార్గము తీసిన వాళ్ళీదశాబ్దిలోనే తలెత్తటము మొదలెట్టినారు. కాని అటువంటి చిహ్నమేమి యిప్పటికి కనపడడము లేదు. ఇప్పటికి వీరిద్దరుకూడా సంప్రదాయాన్ని యెంతమాత్రం ఉల్లంఘించలేదు. క్రొత్త inspiration రాలేదు. ఇది యెప్పుడు రావడానికి మొదలు పెట్టినదో -

---

* ఒకాయన 'సింహావలోకనగీత మన్నాడు.' మొత్తంమీద 'గచ్ఛచ్ఛైలి' తో ఉన్నదన్నమాట.

'సమ్మోహనస్వప్న
సంతతానంద ప్ర
పంచమ్ములో సుప్తి
నింతకాలముదాక,
. ... . . . . . . . . . .
వింతవింత సుఖప్ర
వంతీజాలాలలో
దేలియాడుచు నింద్రి
యాలు సల్పెను కేళి'

శ్రీ శ్రీ ది-ఇటీవల 'మాలతీమాధవము'నే నాటిక ప్రసారిత మయింది రేడియో కేంద్రమునుంచి।

'సువర్ణాక్షత'లనే సంపుటిలో శ్రీ శ్రీ 'రనాన్ వద్సు' అర్థవంతంగా గీతించినాడు. అంతకుపూర్వం అనగా, 1930 లో వచ్చిన 'శృంగారకంఠాభరణం' అనే శృంగారసంచికలో ఇతను 'హారతి' అనే ఖండికను రచించాడు. అందులో

'జ్యోతిర్మనోజ్ఞముల్ పవిత్రము
హూర్తముల్ మన భాగ్యముల్
వీత ప్రపంచవ్యథాత్ములమై
వెళ్గిపోదము వెన్నెలన్' అన్నాడు.

శ్రీరంగం శ్రీనివాసరావునుగురించి మండపాక పార్వతీశ్వరశాస్త్రి అభిప్రాయం చూడండి:-

"సజీవులైన ఆధునికులలో ప్రథమస్థానం వహించవలసినవారు శ్రీరంగం శ్రీనివాసరావుగారు. ఈయువకుణ్ణి మొదటితరగతిలో చేర్చలేదు సరిగదా ఇంతకన్న సగానికి సగం తక్కువైన వార్లందరినీ వీరాధివీరులను చేసినారు. ఇది వింతలలోవింత. ఈ మధ్య కవిగారు నాకు వ్రాసిన కార్డులో ఉన్నసంగతులు చూస్తే ఈకవి చాలా విశాలహృదయుడనిన్నీ, ఆధునిక కవులలో ఉత్కృష్ట స్థానం వహించవలసినవాడనిన్ని గోచరించును. ఆ ఉత్తరములో కొంతభాగము ఈ దిగువ వ్రాస్తాను.

"నవీన కవిత్వము ఆధునికాంధ్ర వాఙ్మయానికినిస్సంశయంగానిరుపమానమైన అలంకారమని నానమ్మకము. భాగవతంకాని పద్యానికి కావ్యక్షేత్రంలో స్థానం కాదనికూడా విన్నవించ సాహసిస్తున్నాను. హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాలలో కవికి నిరాఘాటంగా విహరించగల అధికారము కలదు. అట్టి అతని సంచారాలలో ఏ సన్ముహూర్తాననో కావ్యగతం ఒకటి మెరుగులుతీరిన విలక్షణ రచనాధోరణిలో వెలుగుచూస్తుంది. ఆ గీతం కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం ఇది. ఆమహోన్నత సంసిద్ధి నందుకోవాలని చేస్తున్న ప్రయోగాలు నా ప్రస్తుతరచనలు. ఎప్పుడూ ఉన్నతి మార్గానికే దారితీస్తాడు మానవుడు. ఆదర్శముల పరమోత్కృష్టత అతని సాధనకు లక్ష్యము.

"A man's reach must exceed his grasp.
Or what is there a heaven for?"

ప్రస్తుతమునా ప్రవృత్తి పైని చెప్పిన (Browning) భావానికనుగుణ్యంగా ఉంది. మానవుడు భూతలస్వర్గ సామ్రాజ్యాన్ని సాధిస్తాడనే (Optimism) కూడా నాది! చూదాం! చూదాం!"

దీనినిబట్టి ఈ కవి ఎంత శక్తికలవాడో పోల్చుకోవచ్చును.

-భారతి 1934 జూన్

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

## కొన్ని నవీనుల సిద్ధాంతములు : విమర్శ

### కళకు కళయే ప్రయోజనము

ఈ సూత్రమీకాలములో అమలులోకి వచ్చినది. వెనకటి వింశతి వర్షకాలములోనే మొదలుపెట్టి కొంచెము కొంచెమువ్యాపించి యీకాలములో నవ్యులలో చాలమందిలో గట్టిపడ్డది. సభాపతివంటి వారు తాము మౌనమువహిస్తూ శిష్యులచేత చెప్పిస్తూఉంటారు. అసలు ఇట్టి విషయము మన పూర్వలాక్షణికులకు తట్టినదో లేదో చూదాము! వారు చెప్పిన కావ్యప్రయోజనాలలో రెండూ ఉన్నవి! "కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే." ఇక్కడ రెండు భాగాలుగా అవుతుందీ సమస్య:-

(1) కవికి తన స్వానందమేగాక పరానందంకూడా ప్రాప్యమూ ఆదర్శమూనా? లేక కోకిలపాటల్లే తనకూ, యితరులకూ కూడా నిరర్థకమై సహజమా?

(2) కళకు అందులో కావ్యకళకు నీతి ఆదర్శముగ్గా ఉండవలెనా? అక్కరలేదా?

పై సంస్కృతలాక్షణికవాక్యములో రెండూ ఉన్నవి? 'సద్యఃపరనిర్వృతయే' అన్నప్పుడు ఎవ్వరి నిర్వృతి? రచయితదా పరితదా? పై వాక్యములో అది వివరముగా లేదు. ఇద్దరి ఆనందమనే చెప్పవలె. ఇది సమంజసము. ఎందుకంటే, కవి తానునుభవించే ఆనంద మితరులకు కలగజేస్తాడు. తాను ముందానందంపొంది తదనుభవానందము నితరులలో కలుగ చేస్తాడు. ఇక్కడే నటకుడికీ కవికీ భేదమున్నది. ఇద్దరికి చాలా పోలికలున్నవి. కాని పై విషయములో మాత్రము కొంచెము భేదమున్నది, ఎప్పుడూ నటుడు తాను నటిస్తున్నాననే భావము మరవ

కూడదు. కాని కవి తాను వర్ణిస్తున్న వస్తువులో రసము ఆస్వాదించవచ్చు. ఐక్యము పొందవచ్చు. తాను సృష్టించిన వ్రాతలలో లీనుడు కావచ్చు. ఈక్రింది విమర్శక వాక్యము చూడండి. 'ఇంద్రియములు రసస్నిగ్ధము లైనప్పుడు విషయరాజ్యము ఆనంద రసముయొక్క విలాస భూమిగ గన్పట్టును' (సమీక్ష). కళాకర్తల కందరికీ యింతే. ఇంత శ్రమపడి వాళ్ళు రచించే గ్రంథముగానీ, చిత్రముగానీ, అనుకరణమే! ఎందుచేత? అందులో పాత్రలు అసలువారు గారు. వారికి మేదోమాంసాలు లేవు. వాక్చిత్రముచేత కావ్యములోనూ, ఆకృతిచిత్రము చేత చిత్రకళలోనూ, ఉన్నట్టు కనపడతారు.* మొదటిది మనోగోచరము! రెండవది యింద్రియగోచరము! మనస్సు బహిరంగముగాక ఆంతరమైనా, దానికికూడా యింద్రియత్వ మిచ్చినారు మనవాళ్ళు! "మనష్షష్ఠాణీంద్రియాణి" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ! అనగా సాక్షాదింద్రియము కాకపోయినా యింద్రియ గుణాలుకలది. ఇంద్రియాత్మలమధ్య తార్పుకత్తె మనస్సు! "ఆత్మా మనసా సంయుజ్యతే, మన ఇంద్రియేణ, ఇంద్రియ మర్థేన" అన్నాడు శాస్త్రకారుడు.

"విశ్వముయొక్క బహిర్ద్వారములు బంధింపబడి యుండుటచే, విశ్వాంతరమున నిర్మల కాంతితో వెలుంగు నాత్మానందము సామాన్యులకు ప్రాప్యముగాకున్నది. ఈ బహిర్ద్వారములను తెరచి-యందలి యాత్మస్వరూపమును చూపగల తాలపు జెవియే-విశ్వాత్మ యొక్క మూర్తిస్ఫురణమును చర్మచక్షువులకు గోచరింపజేయు జ్ఞానాంజనమే ఈ కళ". గ్రహణం చర్మచక్షుస్సుచేతనే అయినా ఈ ఆనందము అనుభవించేది మనస్సుద్వారా ఆత్మే కాబట్టి స్వరూపాన్ని తానుచూసి యితరులకు చూపేవాడు నిజమైన కవి!

---

* అడివి బాపిరాజొకచోట యిట్లా అన్నాడు. 'కవిత్వమునందున్నూ, సంగీతము నందున్నూ అనుకరణము అనలేదు. ప్రకృతి వున్నది వున్నట్లు చెప్పడం అనుకరణము కాదు.' పాపము ఈ వాక్యములోనే కాదంటూ అవునని చెప్పినాడు. 'ఉన్నది ఉన్నట్లు చెప్పడము' అనేదాన్లోనే అనుకరణమని తేలుతున్నది మాతృక ఉన్నది. ఉన్నట్టు చెప్పడము అనుకరణము ఉన్నట్టు చెప్పడము చేత ఉన్నది కాదిది ఉన్న దాన్ని చెప్పడముచేత అనుకరణమైనది. ఇక్కడ సంగీతము సంగతి మనకక్కరలేదు. తర్వాత వాక్యములో ఇంకా స్పష్టముగా చెప్పినాడు. "అది వర్ణించడము' '. అంటే అసలుదికాదు వర్ణన అన్నమాట! అంటే మళ్ళీ అనుకరణమే! చిత్రము కూడా యింతే.

Vide - (లలితకళలు - లక్ష్మణరాయ వ్యాసావళి)

ఈ కళనల్ల ఆనందమిద్దరికీ ప్రాప్యమే! నవ్యులు తమను కోయిలలుగా చిత్రించుకోనడమొక పరిపాటైపోయినది. ఆంధ్రజాతికి వసంతకాల మొచ్చినది. ఆ వసంతములో తాము కోయిలలు. ప్రకృతి సిద్ధముగా పాడుతున్నారు. పాడడానికి కారణము వసంతాగమనము కోయిలకు. వీరికికూడా జాతిలో ఉత్పన్నమైన నూతన శక్తే కారణము. ఇంతవరకే సరిపోతుందిగాని సామ్యము తరవాత పట్టదు. ప్రకృతి జడము. కోయిల అజ్ఞాని. కాబట్టి ఈ సాదృశ్యము పూర్తిగా వర్తించటానికి వీలులేదు. జాతిజడ మెంతమాత్రము కాదు! తమను కోకిలలవలె అజ్ఞానులనుకునే టట్లైతే అది ఆత్మ వంచనే! కోకిలపాటకు సంపూర్ణసాదృశ్యము తీసుకుంటే మరో విప్రతిపత్తి ఉంది. కోకిలకు మనము వింటున్నామనే జ్ఞానము లేదు గాని మనముమాత్రము వింటున్నాము. అట్లాగే కవి మనకోసము పాడకపోయినా అతనిపాట మనకు వినపడి ఆనందమో జుగుప్సో పొందుతూనే ఉన్నాము. దానివల్ల మన చిత్తవృత్తిలో కల్గిన మార్పును మనము వెల్లడిచేస్తే, కోకిలకు ఏమీ తెలియనట్టు కవి కూడా యేమీ తెలియకుండా ఉంటాడా? అట్లా ఉండేటట్టే అయితే ఈపద్యాలద్వారా తమ ప్రచార మెందుకు? తను ఈ ప్రవర్తనే యితరులనేమాటలకు తమరు సమ్మతియో అసమ్మతియో తెలుపుతున్నారని నిరూపిస్తున్నది! కాబట్టి ఈవాదము చెయ్యడమే తమ వాదానికి బలహీనము తెచ్చిపెడుతున్నది. ఉదాహరణము కారణమెప్పటికి కాదు. అది సాదృశ్యకల్పనతో విషయగ్రహణ సహకారేగాని, అంతకంటె యెక్కువని చెయ్యలేదు. కోకిలాసాదృశ్యాన్ని వీరాలంకారికముగా చెబుతున్నారని గట్టిపడుతున్నది! ఇంతమాత్రము చేత ఒక మూలసూత్రనిర్ధారణము చెయ్యట మెంతమాత్రము పనికిరాదు. అజ్ఞానైన కోయిలలతో తమను పోల్చుకోటమే ఒకలోపము! పైగా దానిని ఒక కారణముగా గ్రహించడమంతకంటె గొప్ప పొరబాటు! వసంతాగమనమూ, తత్కార్యమైన కోకిలగానమూ, రెండూకూడా అవినాభావసంబంధముకలవి. ఇలాగే యిటువంటి సంబంధమున్న అనేక విషయాలున్నవి! కాని కోకిలాగానము చెవుల కింపుగా ఉంటుందనీ, వసంతమెప్పటికప్పుడు నూతనత్వము కలది కాబట్టినీ, దీన్ని గ్రహించినారని నా అభిప్రాయము. అంతకంటే యీ సాదృశ్యాన్ని దూరము తీసుకుపోగూడదు. కావ్యము గానము చేసే కవికీ, చదివే పాఠకులకీ ఆనందము

కలగచేస్తుంది. కోకిలా గానంవలే వినేవాళ్ళకుమాత్రము కాదు. నిరర్ధకమూగాదు. తెలియకుండా గానము చేసే కోకిలాగానము వంటిదీకాదు. కార్లైలను మహా కవి కవిని ప్రవక్త (Prophet) అన్నాడు. ప్రవక్తఅంటే ఒక సందేశాన్ని ఇచ్చే వ్యక్తి అన్నమాట. ఒక సందేశమూ, యిచ్చేవారూ, పుచ్చుకునేవాళ్ళు అనే మూడువస్తువు లున్నవి! * లోకములో ప్రతి వ్యక్తిచేసే అన్ని కార్యాలూ యితరులకు సంబంధించినవి కాక పోయినా వాటిలో కొన్నిమాత్రము స్వసంతోషానికే కాకుండా పరసంతోషానిక్కూడా చేస్తూఉంటాడు. భార్య భర్తృసంతోషము కోసము పాటుపడుతూ ఉంటుంది. భర్త భార్యా సంతోషము కోసమూ, తల్లి తన పిల్లవాడికి సంతోషము కూర్చడానికీ, యీవిధముగా ఇతరుల సంతోషముకూడా యీతరులకొరకూ కూడాను. బుద్ధి పూర్వకముగా నగ్నతను ఆచరణములో పెట్టేవాడు, వేదాంతిఐనా, పిచ్చివాడైనా కావలె!◆ ఇటువంటివారు అత్యల్ప సంఖ్యాకులు. కాబట్టి "ప్రయోజన మనుద్దిశ్యనమందోపి ప్రవర్తతే" అన్నట్లు ప్రయోజనము కోరకుండా యెవ్వడూ యేపనిని శ్రమపడి చెయ్యడు. ఆ ప్రయోజనాన్నే స్వపరుల నుద్దేశించి చేసేది కావ్యము! ప్రేయసి కోసము పరితపిస్తూ, దుఃఖపడుతూ, ఆహ్వానమిస్తూ, ప్రేయసినే వస్తువుగా గ్రహించికవి, నాతృప్తికొరకే నేను పాడుతున్నాననడము నేను పాడుతున్నదాని అర్థమునాకే తెలియదనడముకంటె హాస్యాస్పదమైన విషయము లేదు. కవి పాఠకులు పరస్పరము అవినాభావ సంబంధము కలవారు.*

---

* ఈ అనుబంధత్రయము మోక్షముదాకా అనువృత్తము.

◆ ఇప్పుడు ఈ రెండూకాని నగ్నవాదులు జీవితవిషయములోనూ కళావిషయంలోనూ ఉన్నారు! ఇక్కడ వాళ్ళను నేను గ్రహించడము లేదు. (Dadaism, Nudism)

* భామహదండివామనులు పూర్వభారతీయ లాక్షణికులలో కావ్యప్రయోజనాలలో కర్తకు కీర్తిన్నీ పాఠకుడికి ప్రీతిన్నీ నిర్ణయించినారు. ఇందులో కవితోపాటు పాఠకుడినికూడా ఈ లాక్షణికులు కావ్యప్రయోజనాలలో సమభాగిగా చేసినారు. సహృదయుని పదలితే కవికి గతిలేదు. అల్లసానివాడు "ఊహతెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకినగాక, ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే!" అన్నాడు! అలౌకికానందము కావ్యప్రయోజన మన్నప్పుడే సహృదయుణ్ణి కూడా కలుపుతున్నట్లు స్పష్టము! ఆర్నాల్డు బెన్నెటు అనే ఆంగ్లవిమర్శకుడు "సహృదయత్వం" (Literary taste) లో The aim అనే అధ్యాయము చదివితే సత్యము తెలుస్తుంది. కవికి కావ్యము వ్రాయటానికి ఎంత విజ్ఞానము కావాలో సహృదయుడికి కవిహృదయ ప్రవేశము చేసి

ఇక రెండవసంగతికి వద్దాము. శాస్త్రకారుడు ఇదికూడా "కాంతాసమ్మిత తయోపదేశయుజే" అని చెప్పినాడు. ధర్మబోధ కావ్యప్రయోజనాలలో ఒకటని మొదటి లాక్షణికులు కంఠోక్తిగా చెప్పినారు. ◆ తర్వాతవాళ్ళు చాలామంది ఒప్పుకున్నారు. కాని యిటీవల అనగా 200 సంవత్సరాలమధ్య ఉన్న కొందరు నవ్యలాక్షణికులు ఈ ధర్మబోధకత్వాన్ని కొంచెము రెండవరకము క్రిందికిదింపినారు. మొదటి **లాక్షణికులు** ధర్మముమీద చాలా ఒత్తినారు. వారిలో భామహుడు మిగిలిన శాస్త్రాలవలెనే దీన్ని చేసి మోక్షము ప్రాప్యమనికూడా వ్రాసినాడు. తర్వాత లాక్షణికులు కొంచెమో అభిప్రాయాన్ని వెనక పెట్టి అలౌకికానందాని కెక్కువ ప్రాముఖ్య మిచ్చినారు. వీరు రసవాదులు, వీరికి ధర్మముకంటె రసము ప్రధానము కాబట్టి దానికి ప్రాధాన్య మిచ్చినారు. కాని వెనకటి "కాంతాసమ్మిత తయోపదేశయుజే" అనే అంశాన్ని

తానానందముపొంది ఇతరులకు కవి సందేశము చెప్పటానికి అంత విజ్ఞానమా హృదయవికాసమా, కావలె! కార్లైలేమన్నాడో చూడండి:-

"Criticism must be like an Inter-preter between the inspired and the uninspired, between the prophet and those who hear the melody of his w ords." (ఉద్రిక్తులకును, నముద్రిక్తులకును మధ్య అనగా ప్రవక్తకును నాయన వాక్యరసమును విను సామాన్య ప్రజలకును, మధ్య వ్యాఖ్యాతవలె విమర్శకుడుండ వలెను.) ఈ వాక్యములో విమర్శకకృత్యాన్ని ఉగ్గడించినాడు కార్లైలు! విమర్శకుడనేటప్పటికే సహృదయుడు రంగముమీదికి వచ్చినాడు

కోలెరిడ్జి యేమన్నాడో చూడండి "Not the poem that we have read but that to which we return possesses the genuine quality of poetry."

"మనము చదివిన గ్రంథముగాక యేగ్రంథము పునఃపఠింతుమో యది యుత్తమ కావ్యమన దగినది ""

ఇందులో "We" అనే పదముతో వాచ్యులెవ్వరు? పాఠకులన్న మాట! ఏజాతి వాఙ్మయములో విమర్శనమెక్కువగా పెరుగుతుందో అది ఉత్తమ మైనదనిగుర్తు! విమర్శన మంటే సహృదయకృత్యము!

The test of a great book is whether we want to read it only once or more than once. Any really great book we want to read the second time even more than we wanted to read it the first time; and every additional time that we read it, we find new meanings and new beauties in it. L.Hearn

◆ "చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి-కావ్యాదేవ" -విశ్వనాధకవిరాజు

బొత్తుగా వదలలేదు. ఈ ఆనందము ఆంగ్లలక్షణ కర్తలయొక్క అభిప్రాయానికి దగ్గరకివస్తుంది. ఈ వాదాన్ని మన నవ్యులు అను కూలముగా ఉన్నదని గ్రహించినారు. ఈ వాదానికి ఆధునిక విమర్శకులలో ముఖ్యుడు కట్టమంచి.*

'కావ్యము, శిల్పము, నీతిశాస్త్రముకాదు. ధర్మశాస్త్రముకాదు శిల్పము యొక్క యుత్కర్షనికర్షముల నేర్పరుపవలయునన్న దాని రచనాసంవిధానములబట్టి నిరూపించనగునేగాని, భగవద్గీతలయంత పారిశుభ్ర్య మిందులోలేదు. రామానుజభాష్యమువలె ముక్తిదాయకముకాదు. అని వాపోవుట నిర్నిమిత్తప్రలాపము .......... .... శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట. ఈ వశీకరణశక్తి యుండినయెడ నీతిలేకున్న నేకొదువయులేదు. అది లేనిచో నుపనిషత్తుల నుడుకబెట్టి ధృతియంతయు తీసి ముందునించినను నేఫలములేదు. కావున మన భాషకు నీతి ముదురునట్టు చికిత్స దోహదము, ప్రాయశ్చిత్తము చేయవలయునను పరమ పారిశుద్ధ్యదురంధరుల కొకదండము పెట్టి దూరముగ బొమ్మనుటయే కర్తవ్యము.''

తర్కంతో పాటు దూషణతో తన వాదాన్ని సాధించటానికి ప్రయత్నిస్తున్నాడీయన! నీతి అంటే ఈయన కంతకంటకమై పోయినది. తానొక సంఘములో ఉండి సంఘ నీతిని తృణీకరించడము భావ్యము కాదనీ, యేదో ఒక సూత్రానికి బద్ధుడు కాని వ్యక్తి సంఘానికి ఉపద్రవ కారనీ మనవి! ఇప్పుడు (1) నీతిప్రాధాన్యము (2) నీత్యప్రాధాన్యము (3) అవినీతిబోధ అనే మూడు అంతస్తులున్నవి! అవినీతిని బోధించమని మాత్రమీయన చెప్పలేదు. లేకపోతే ఈయన మార్గా నుయాయులగు నవ్యుల కావ్యాలన్నీ అవినీతిబోధకాలయ్యేవి! నీతిని కంఠోక్తిగా బోధించనక్కరలేదన్నారు. ఒప్పుకున్నాము! అది ప్రధానాంశముగా ఉండనక్కరలేదు! ఇది మనలాక్షణికులు "అలౌకికానందువాదులు'' ఒప్పుకున్నదే! కాబట్టి అక్కడకూడా విప్రతిపత్తి లేదు. ఇక మిగిలిన దేమిటి? నీతి అనేది ప్రధానముగా ఉండనక్కర లేదు. ఈ విషయాన్ని చెప్పటానికింత కారిన్యమెందుకు? నీతి, ధర్మమనేది చాలా గొప్ప విశాలమైనపదము. ఇందులో మానవుడి ప్రవృత్తి అంతా యిమిడిఉంది. శిల్పము కాబట్టి కావ్యానికి ప్రాప్యము "మనసును హరించుట' అన్నాడు. ఈ హరించటము నీతిబోధ ద్వారాగాని ధర్మబోధద్వారాగాని కాదు? మాకూ యిష్టమే! అవినీతి అధర్మము

* గిడుగు సీతాపతిగారుకూడా యిట్టి అభిప్రాయమునే వెలిబుచ్చినారు.
చూ. ఆంధ్రసర్వస్వము పుట 304

బోధిస్తేకూడాకాదు! అదికూడా ఈయనకు అసమ్మతేననుకుంటాను! ఇక మిగిలినది "నీతి లేకున్న నేకొదవాలేదు" అనే వాక్యములో ఉన్నది ఈయన సిద్ధాంతము. ఇది 'అనలంకృతీ పునఃక్వాపి' అనే మమ్మటవాక్యమువలె ఉన్నది. అక్కడెట్లాగైతే 'అవసరమైతే నీతిని బోధిస్తూ' అని ఈ మన వాక్యాలకు నేను భాష్యము రచిస్తున్నాను. "మనసును హరించుట" "రససంపోషణము" అనే మాటలు ఒక్క అర్థములో ఉపయోగించినాడనుకుంటాను. "రసానుభవము" అన్నదానికంటె 'మనసును హరించుట' అనడము చాలా పేలవముగా ఉంది. 'మనసు' అన్నచోట రసానికి కావలసిన అలౌకికత్వము బొత్తుగా శూన్యమై చాలా క్రిందిమెట్టులో ఉన్నది. 'రసమువల్ల కలిగేది ఆనందము దాన్ని పొందేది ఆత్మ.' అంటేగాని ఆ అలౌకికత్వము రాదు. 'పరనిర్వృతి' కాజాలదు. భార్య ఉందనుకోండి! మాటలచేతా విలాసాలచేతా 'మనసును హరిస్తుందను' కోండి! కాని ప్రవర్తనలో కొంచెము స్వచ్ఛంద అనుకోండి! తత్కాలానికి 'మనసును హరిస్తు'న్నదికదా అని ఆమె శీలాన్ని గూర్చి కళ్ళు మూసుకుని ప్రవర్తించగలడా భర్త? కాబట్టి 'మనసును హరించటమే' ముఖ్యమైనప్పటికీ, ఆమె ప్రవర్తనలో నీతికూడా యెట్లా ఆశిస్తామో, అట్లాగే కావ్యానికి ముఖ్యమైనప్పటికీ నీతినీ ధర్మాన్నీకూడా అట్లాగే ఆశించటము కర్తవ్యము. ఒకవేళ తత్కాలానికి 'మనసును హరిస్తే' చాలని 'సద్యః' శబ్దముచేత గ్రహిస్తారేమో నాకు తెలియదు! ఆశబ్దము ఈ కావ్యపరనమువల్ల వచ్చే ఆనందము మోక్షముకంటె భిన్నమని చెప్పడముకోసముపయోగింపబడ్డది! అంతేకాని ధర్మబోధకత్వాన్ని కొట్టివెయ్యడానికికాదు. ఇక్కడ **లాక్షణికునివి** కొన్ని వాక్యాల ననువదిస్తాను.

'యధాకామినీ, కటాక్షవీక్షణాదివిలాసై రేవ కామినమావర్జయంతీ, 'మమేదమభిలషితం కురు అనభిలషితం మాకురు' యిత్యనుక్త్వైవ సర్వం సంపాదయతి, తథాకావ్యశ్రీరపి వ్యంజనావ్యాపారమాత్ర పరత్వేన ఉపసర్జనీ భూతశబ్దార్థతయా...సహృదయ హృదయాహ్లాది కారిణా వ్యంజనావ్యాపారేణైవ రామాది వద్వర్తితవ్యం నతు రావణాదివత్' ఇతిపుంసఃకర్తవ్యేప్రవర్తయతి నివర్తయతి చాకర్తవ్యాత్ ఇత్యస్యాః కాంతాసమ్మితత్వమవగంతవ్యం' వ్యంజనద్వారా రస ప్రధానమై

నీతిబోధకత్వం అప్రధానముగా ఉండవచ్చు కావ్యములో అంటే వీరికి సమ్మతమే ననుకుంటాను!

కవులనుకూడా అలౌకికులు (బ్రహ్మలు) లౌకికులు అనిరెండు భాగాలుగా భవభూతి విభాగించనే విభాగించినాడు "వశ్య వాక్కులు వాగ్వశ్యులు"నని. ఈ సందర్భములో మరొక విమర్శకుడి వాక్యాలు కూడా మనవిచేస్తాను:-

'మనస్సునకు చమత్కారమును నానందమును గూర్చుటయే కళల ముఖ్యోద్దేశమైనచో వాని స్వతంత్రధర్మమే నశించును. కళల ప్రయోజన మింతకంటెను నెక్కువ యున్నతమైనది. సత్యము సుందరమైనప్పుడు, భావము పంజరమునుండి యెగయు విహంగమువలె విముక్తినొంది యనంతపథమును త్రొక్కును. మానవప్రకృతి యుజ్వలితమైన వెంటనే ప్రాణము నృత్యముసేయును. ఆత్మయొక్క నిజసౌందర్యము - కళలయందు మూర్తీభవించియున్నది. కళయన రసస్పృష్టి! కళయన విశ్వాంతరాళమునుంచి కాలికివచ్చు నమృతకలశము' (సమీక్ష).

ఇక్కడ చూసినారా, ఈ కళలకు వెనకటి ఆయన వలెగాక యెంత ఉదాత్తత యిచ్చినాడో ! ఇటువంటి దృష్టిలో నీత్యవినీతులకుగాని, ధర్మాధర్మములకుగాని, తుదకు ఎట్టి ద్వంద్వాలకుగాని చోటు లేదు. కళ వీటి కన్నటికి అతీతమైనదని ఈ విమర్శకుడి అభిప్రాయము. 'మనసును హరించుట' అనేది చాలా నీచమైన కళాప్రయోజనము. అది లౌకికమేగాని అలౌకికము కాదు. అనువాదము మొదటి వాక్యముల్లోనే ఉన్నది. కళాప్రయోజనము "మనసును హరించుట" మంత నీచము కాదని. ఈ ఆనందమును మనస్సునుదాటి యెప్పుడు ఆత్మ సంబంధి అవుతుందో అప్పుడది అలౌకిక మవుతుంది. ఈ క్రింది మాటలను చూడండి : "ఈ విశ్వము జడముకాదు. జడత్వము మనస్సునందున్నది. మన మనస్సుయొక్క వ్యభిచార దోషమువలన రూపమాధుర్యముల యందుండు దివ్యసుందరుని జడునిగజేసి విశ్వము జడమని చెప్పుచున్నాము." చూసినారా మనస్సు యొక్క పరిమితి. ఆత్మ అట్లా గాదు. అది అవిచ్ఛిన్నమైన ఊట వంటిది స్వచ్ఛము, విజ్ఞానయమము. మనస్సు అనేది సామాన్యజ్ఞానాన్ని యింద్రియములద్వారా గ్రహిస్తూ ఉంటుంది. మరొక అనువాదము చూడండి :

"మానవుని సామాన్యజ్ఞానమునకు విశ్వములోని యనంత రహస్యము గోచరము కాదు. ప్రకృతిగతమైన యాత్మకును మానవాత్మకును ననవరతము జరుగుచుండు రమ్యక్రీడ శుద్ధ మానవచింతకు గోచరమగు విషయముకాదు." కాబట్టి యేది మనుష్యుడు జ్ఞానమను

కుంటున్నాడో అది సామాన్యజ్ఞానము అది మనస్సుకు సంబంధించినది. ఆత్మ దీనికి పైది హృదయమే ఆత్మకు స్థానము. "పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖం-తస్యాంతే సుషిరం సూక్ష్మం--తస్యమధ్యే మహానగ్నిః - తస్యమధ్యే వహ్నిశిఖా - నీవారశూకవత్తన్వీపీతా - అణూపమా -తస్యాశిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థిత " అంటున్నది శ్రుతి. ఇది ఆత్మ. ఇక్కడ సత్యాసత్యాలూ, ధర్మాధర్మాలూ మొదలైన ద్వంద్వాలు లేవు. అది కేవల ఆనందమయము. కవి యెటువంటివాడో యిట్లా చెప్పాడు: "ఎవరు స్వకీయ జీవనమునందలి సత్యమును సాక్షాత్కారమొనర్చు కొనగలరో, యెవరి చిత్తము భగవదాయత్తమై, పరాను రక్తిప్రవాహమున నిమగ్నమై యుండునో, యెవని భావము దేహమనఃప్రాణముల నతిక్రమించి ప్రేమరసమున పారవశ్యమునొందునో, వారే కళావిదులు, వారే రసస్రష్టలు, వారే కవులు శిల్పులు, గాయకులు, చిత్రలేఖకులు, విగ్రహనిర్మాతలు కాగలరు."

అట్టివాడు నిజమైన కవి అంటేను. అటువంటి కవిహృదయాన్ని ప్రవేశించే సహృదయునిసంగతి ఆలోచించండి. రూపలాలసతోనూ, భోగవాంఛతోనూ నిండి, బాహ్య ప్రకృతిని యింద్రియాలతో గ్రోలి ఆనందించేవాళ్ళు ఆపై మెట్టుకు చెందిన వాళ్ళు కారని స్పష్టము. కాని వీళ్ళకుక్కూడా తాత్కాలిక లౌకికానందాన్ని యిచ్చే శక్తి ఉండటంచేత ఆ నామకరణ మిస్తున్నాము. ఇట్టి లౌకిక కవులు "రియలిజం"లో తేలి ఆడుతూఉంటారు. ఇంకా కొంచెము ప్రజ్ఞకలవాళ్ళు పాశ్చాత్యుల 'ఐడియలిజం' దగ్గరకి పోగలరు. కాని నిజమైన కవులు రసానుభవముచేత తృప్తియావస్థను చెంది సహృదయులనుకూడా ఆ ఆనందములో పాల్గొనేటట్టు చేస్తారు. రసమూడో అంతస్తులో సత్యము, అసలు సత్యము.

"మనబుద్ధికి గోచరమగు సత్యము సతతము మారునదేగాని నిర్వికల్పితమైన యఖండసత్యము కాదు." (సమీక్ష)

ఇటువంటి నిర్వికల్పమైన సత్యానికి తాళముచెవినిచ్చి సహృదయునికి చూపేవాడు నిజమైన కవి:

"విశ్వముయొక్క బహిర్ద్వారములు బంధింపబడి యుండుటచే విశ్వాంతరమున నిర్మలకాంతితో వెలుంగు నాత్మానందము సామాన్యులకు ప్రాప్యముకాకున్నది. ఆ బహిర్ద్వారములను తెరచి యందలి యాత్మస్వరూపమును చూపగల తాళపుచెవియే- విశ్వాత్మయొక్క మూర్తిస్ఫురణమును చర్మచక్షువులకు గోచరింపజేయు జ్ఞానాంజనమే- యీ కళ." (సమీక్ష)

ఈ పై మెట్టునించీ కొంచెం దిగితే మన మామూలుకవుల స్థానమువస్తుంది. అక్కడ నీతి సంఘమూ మొదలైన వన్నీ వస్తై! వాటినిబట్టి ఆ కవులవ్రాతలను పరీక్షించడము మొదలుపెడతాం. గత్యంతరము లేదు. "విషయభోగములందు చిక్కుకొనిన జనసామాన్యమునకు నీతి మిక్కిలి ప్రయోజనకారి యనుటకు సందియుము లేదు" అన్నాడు విమర్శకుడు. కాబట్టి జనసామాన్యాని కుద్దేశింపబడే కావ్యాలు నీతినియమములు పాటించట మవసర మని తేలుతున్నది. ఈసామాన్యకక్ష దాటిపోయిన కవులకూ రసపిపాసకులకూ నీతి అవసరము లేదనేమాటా, ధర్మ మక్కరలే దనేమాటా, నిజమే! శ్రీకృష్ణపరమాత్మ "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అన్నాడు. అది అధికారిభేదాన్ని బట్టి ఉంటుంది. సామాన్యజనము యొక్క చిత్తవృత్తి చాలా చంచలముగా ఉంటుంది కొందరు "పెద్దల" యొక్క చిత్త వృత్తి కూడా అట్లాగే ఉండవచ్చు! అట్టివాళ్ళకు నీతి తప్పక అనుసరించదగినదే! శ్రీకృష్ణవాక్య మట్టివాళ్ళకు వర్తించదు. ఒకవేళ పూర్వజన్మపరిపాకముచేత ఒక్కొక్కవ్యక్తికి తదనుసరణమే ఈ జన్మములో కర్తవ్యము కావచ్చు! అటువంటివారు సామాన్యుల కనుకరణీయులు కారు. * ఈ సందర్భములో నవ్యుడైన కొడవటిగంటి కుటుంబరావు వ్రాతలలోనించీకూడా కొంచెమనువదిస్తాను.

---

* నవ్యుడైన నోరి నరసింహశాస్త్రిగారు 'కావ్యప్రయోజనము' అనే వ్యాసములో "కావ్యములో ఉపదేశము లేకపోతే అది నిరర్థకము -- ఇది వింటే చాలా మందికి విభ్రాంతి కలగవచ్చు. కాని కొంచెం ఆలోచిస్తే యిది సమంజసముగానే కనపడుతుందని నా మనవి-- ఇప్పటికి నవనాగరికులైన విమర్శకులుకూడా, యెవరన్నా గొప్పకవి ఒకడున్నాడు అంటే 'అతనికి సందేశమేమిటి' అని ప్రశ్నిస్తారు. కాబట్టి అట్టివారి దృష్టిలోకూడా నిజమైన గొప్పకవికి యేదో వక సందేశ ముండవలెనని, అంటే ప్రతికవీ యేదో ఉపదేశించవలెనని. అనగా నిజమైనకవి ఒక మహర్షి [Sage, Seer, Prophet] వంటివాడని స్పష్టమవుతున్నది. 'ఏదో ఒకటి ఉపదేశించడానికి నాకు అధికార మున్నది. అది ఉపదేశిస్తున్నాను. ఈ ఉపదేశానికి సంస్కృతమైన నా అంతరాత్మ ప్రేరేపిస్తున్నది. అందువల్ల ఈవిధముగా లోకసంగ్రహము జరుగుతుంది'అని అయినా పోని చెప్పగల కవులెంతమంది దేశములో ఉన్నారు?"

"It is well to remind ourselves that literature is first and last means of life, and that the enterprise of forming one's literary taste is an enterprise of learning how best to use means of life." Literary Taste, Arnold Bennet

"దేశభక్తిగాని, దేవుడుగాని, కళగాని నీతికి అతీతమంటే యేమీ లాభములేదు. వాటన్నిటికీ యేదో ప్రయోజనము ఉండటము మూలముగానే వాటికి మన జీవితములో స్థానము ఏర్పడుతున్నది. ప్రయోజనము అంటూ ఉన్నతరువాత, ఆ ప్రయోజనము తాలూకు మంచిచెడ్డలు వాటిని అంటకుండా ఉండవు.

కాని కొద్దిమంది ప్రపంచములో అపూర్వవ్యక్తులు ఎప్పుడూ ఉంటారు. ఇతరులు సాధనలుగా ఉపయోగించుకునేవి వారికి ప్రయోజనాలుగా ఉపయోగపడతై. వారిని specialists అనవలె. గణితము ఒక సాధనము. కాని కొందరికదే పరమార్థం... భగవంతుణ్ణి కనుక్కోటానికి ఉద్యమించి, ఆఖరుకు భగవంతుణ్ణిగురించి తమ అన్వేషణా ప్రయత్నములోనే తమ ముక్తిని చూసుకోగలిగినవారున్నారు. (వీళ్లే వెనకటి ఆదర్శసాధకులు.) ఈ అపూర్వవ్యక్తులు తమ బుద్ధికుశలతను వినియోగపరచి కళను దాని ప్రయోజనము నించి వేరు చేసి ఆనందించ గలుగుతారు. వారికి బూతుబొమ్మలలో ఉన్న అందాన్ని చూచేటప్పుడు, యితరులకు కలిగే జుగుప్సగాని ఉద్రేకముగాని కలగదు. (వీరే సత్యాన్ని తెలుసుకున్నవారు) వారు పాము సౌందర్యాన్ని కనుక్కునేటప్పుడు దాని విషదంష్ట్రలను స్మరించలేరు." వారి ఆత్మజ్ఞానము మూలముగా సర్వము ప్రేమమయమైపోతుంది. అందుకనే నాకు 'Art for the sake of art" అనే సూత్రాన్ని అవలంబించేవాళ్ళతో సానుభూతిలేదు. ప్రయోజనాన్ని పూర్తిగా నిరసించిన కళాప్రయోజనము నాకు హాస్యాస్పదముగా ఉంటుంది. ఎంత దుఃఖములో ఉండీకూడా యితరులకు నవ్వువచ్చేటట్లు యేడ్వడము ఎంతనగుబాటు విషయమో, ఏమీ కారణము లేకుండా అత్యద్భుతముగా ఏడ్వడము కూడా అంత నగుబాటు పనే! నేనీపని నెందుకు చేస్తున్నానో నీకవసరములేదు, నా శిల్పము మాత్రము చూడు, అందులో కళఉన్నదో లేదో చూడు, అని యేకళాకారుడూ అనరాదు. అతని కీ కళను గురించి యేమైనా తెలిసిఉంటే అట్లా అనలేడు." (ప్రతిభ)

నవ్యులుకూడా నీతి ప్రయోజనాలను వదలలేదు. ఇక్కడే మన సాంప్ర దాయానికీ పాశ్చాత్య సాంప్రదాయానికీ భేదమున్నది. వెనక విమర్శనాన్ని గూర్చి చెప్పినప్పుడు అది సంప్రదాయ సిద్ధముగా ఉండవలెనని చెప్పినాను. ప్రాచ్య సంప్రదాయము వేరు. పాశ్చాత్య సంప్రదాయాలు వేరు. మూలసూత్రాలు కొన్నిట్లో

సామ్యము ఉండవచ్చు. ప్రాచ్యులలో అందులో భారతదేశములో ధర్మము జగత్తుకు మూలము. ఈ ధర్మాని కన్నీ లోబడడము భారతీయపద్ధతి. మన నవ్యులు కొందరు సుఖము పరమావధైన పాశ్చాత్య దేశాలు వెళ్ళివచ్చి అక్కడ సంపాదించిన జ్ఞానముతో విమర్శనము ప్రారంభించేటప్పటికి ఈ విభేదము కనపడుతుంది. భారతదేశము రాజుకంటె సన్యాసిని ఎక్కువగా గౌరవించేది! ప్రవృత్తిలో నివృత్తిని చూచేది! నిరభిసంధి కర్మానుష్ఠానము పరమావధిగా కలది! ఈ ధర్మబద్ధత భారతీయ జీవనములో జీర్ణించిపోయినది. ఇందుకు మన్వాదులనూ, వర్ణాశ్రమాలనూ తిట్టి యెంతమాత్రము ప్రయోజనము లేదు! కవి కూడా ధర్మబద్ధతే చూపినాడు. ఈ ధర్మము మన రక్తములో జీర్ణమై ఉన్నది.

"భారతీయుల ప్రకృతి బయట నెట్టి విషయలంపటమున చిక్కుకొన్నను, వారి లోపలదాగియుండు ధర్మనిరతియు, వైరాగ్యబోధమును పూర్తిగ లోపింపజాలవు. భారతవాణి అంతరముననుండి మేఘగర్జనమువలె "నఖలు నఖలు" అని ధర్మఘోష చేయుచునేయుండును రోమనుల విషయలంపటత్వమునకును భారతీయుల భోగపరాయణతకును, భేదమిచ్చటనే కలదు. రోమనుల కామప్రవృత్తి వారి రాజ్యమును, సభ్యతను, తుదకు జాతినికూడ విచ్ఛిన్నము చేయువరకు వదలలేదు. భారతీయుల భోగపరాయణత వీరి యంతః ప్రకృతిని సంఘపటిష్ఠతను, పూర్తిగ ననుభవింపలేక పోయెను. కావుననే భరత వర్షమున ఆర్యధర్మము ఏనాడును నిశ్శేషముగ లోపించలేదు. దాని అప్రతి హత శక్తి నిరంతరము సాగివచ్చుచునేయుండెను. కావుననే యీదేశము కర్మభూమియని పేరొందినది. భారతసభ్యతయందు ఇహపరములను సమన్వయిము చేసుకొనగల చైతన్యశక్తి కలదు. అర్థకామములు సంఘముపైబడి కొల్లగొట్టకుండ ధర్మమోక్షములు యామికులవలె హెచ్చరిక కలిగియే యుండెను." (సమీక్ష)

ప్రాచ్యపాశ్చాత్యముల కెంతభేదమున్నదో చూడండి! ఈ సంప్రదాయము ప్రకారము మన విమర్శనము సాగించవలె! ఇది నావంటి మందాధికారి చేయదగిన పనికాదు. నవ్యులలో ఇప్పుడు చక్కగా లక్షణశాస్త్రాలు సాధనచేస్తున్న వాళ్ళున్నారు. వీరందరూ కలసి యీ సంఘర్షణాన్ని పరీక్షచేసి నిర్ధారణ చేయవలసిఉన్నదనీ, అందాకా మన లక్షణశాస్త్రము సమగ్రము కాజాలదనీ మనవి చేస్తున్నాను.

## జీవము, శిల్పము :

ఈ సందర్భములోనే మరొకసంగతికూడా చర్చించవలె. నోరి నరసింహశాస్త్రిగారు జనవరి 1938 "ప్రతిభలో" "నవ్యకవిత్వమ"ని ఒక వ్యాసము

వ్రాసినారు. అందులో నవ్యకవిత్వములో నవ్యతను పరీక్షించి శిల్పమూ, జీవమూ* అనే రెండుగుణాలు కవిత్వానికి ముఖ్యాలనీ, వెనుకటి వెయ్యిసంవత్సరాలనించీ శిల్పముకోసము కవులు పాతర్లాడినారనీ, జీవము జానపదగీతాలలో పదాలలో అణిగి ఉందనీ శివకవులు రెంటిని సమ్మేళనము చెయ్యటానికి ప్రయత్నించి సిద్ధిని పొందలేక పోయినారనీ, ఆపనిని ఈ నవ్యకవులు ప్రయత్నించి సిద్ధిని పొందుతున్నారనీ కాలమే దీన్ని తేల్చగలదనీ చెప్పినాడు. ◆ ఒకచోట జీవాన్ని, ప్రాణాన్నీ సమానార్థకాలుగా వాడినాడు. కాబట్టి జీవమంటే ప్రాణమన్న మాట! ఈ అర్థములోనే "ఉద్రేక" పదంకూడ వాడినాడు. ఈ వ్యాసములో చాలా అసందర్భ వాక్యాలున్నవి.! అసలు సిద్ధాంతమే ప్రమాదమని తోస్తుంది. అన్నికళలూ శిల్పాలే! అన్ని కళలూ అనుకరణాలే! శిల్పమంటే కళాకౌశలము. కళలో అవయవాలను వాటి వాటి స్థానాలలో ఉండేటట్లు రచించే సామర్థ్యము. కళలన్నీ అనుకరణాలైనప్పుడు నిర్జీవాలన్నమాట! "జీవమున్నచోట శిల్పముండదట! శిల్పమున్నచోట జీవముండదట!" ఇది ఒక విపరీతసిద్ధాంతము! తాజ్‌మహల్లో ఉన్నది శిల్పమా? జీవమా? రెండూనా? అజంతా శిల్పాల్లో ఉన్నది శిల్పమా? జీవమా? రెండూనా? ఇది చాలా సాహసము! కళకు జీవాన్నిచ్చేది శిల్పము, కవిత్వాన్ని తీసుకుందాము! కవి యేరుకున్న వస్తువు, దాని నిర్వహణమూ, సృజించిన పాత్రలు, వాటి శీలపోషణమూ, కావ్యములో ఉపయోగించే పదగ్రథనమూ, అనగా మొత్తముమీద భావ వస్తు రచనలు, చేరి ఒక కావ్యానికి జీవాన్నిస్తవి! అంటే అవి యేది ఎట్లా ఉపయోగించవలెనో సరిగా చూచి ఉపయోగించటమన్న మాట! అదేశిల్పము కవియొక్క ఈ పనితనము (శిల్పము) కళకు జీవమిస్తుంది. ఈ ప్రకారముగానే చిత్రమూను, ఇన్ని వేల సంవత్సరాలెప్పుడైతే ఈ గ్రంథాలూ, చిత్రాలూ, జీవించినయ్యో అదే జీవానికీ, శిల్పానికీ పరీక్ష!

* ఈ శీర్షిక మహారాష్ట్రానుకరణమని నేననుకుంటాను. ఎందుకంటే మహా రాష్ట్ర సారస్వతములో 'జీననము, కళ' అనే సారస్వతచర్చ జరుగుతున్నది. శాస్త్రిగారు జీవనాన్ని జీవాన్నిగా మార్చినట్టు కనపడుతుంది

◆ ఇటువంటి అభిప్రాయాలు నవ్యులు ఇటీవల చాలా ఎక్కువగా వెలిబుచ్చుతున్నారు. అందుచేత ఈవ్యాసమిక్కడ చర్చించవలసివచ్చినది. నాకు సహజముగా నరసింహశాస్త్రిగారంటే గౌరవము నవ్యులలో తలతిరగనివాళ్ళల్లో ఈయన ఒకడు.

వాటిలో ఎప్పటికప్పుడు కనపడే నవ్యతే రమణీయత! ఈరమణీయతే రసాన్నిస్తుంది కావ్యానికి! ఈ రసము సహృదయుని ఆనందింప జేస్తుంది! ఏవో కొత్తమాటల నుపయోగించి ఆత్మవంచనా లోకాన్ని మోసము చెయ్యడమూ వద్దు! కాలము చేసిన పరీక్ష కావ్యానికి ఉత్తమమైన పరీక్ష! దానికి నిలిచిన కావ్యాలలో కళ కొరవడలేదని తార్కాణము! అనుకరణమైన కళలో సహృదయుడికి, పరిణతబుద్ధికీ, కలిగే రసాస్వాదనానికి మార్గము జీవము. అదే రమణీయత! భౌతికముగా చూస్తే కళలలో జీవముండటానికి వీలులేదు. ప్రతిమలో, చిత్రములో, కావ్యములో, జీవముంటుందా? ఉండదు. కాని లక్షణచేత, వాటిలో ద్రష్టకుగాని, శ్రోతకుగాని రసానుభవము కలగ జేసే అంశను జీవము అందాము! కాబట్టి జీవమంటే ప్రతి శిల్పములో ఉండేగుణము. అది లేకపోతే దానిలో చిరకాల స్థాయిత్వముండదు. ఇప్పుడు అజంతా చిత్రాలు మొదలైన వాటిలోనూ, మహాభారతాది గ్రంధాలలోనూ ఉండేది అదే! దాని సత్వమే వాటికి చిరస్థాయి నిస్తుంది. ఇక్కడ ఒక్క విషయముంది. సామాన్యజనము తమ చుట్టు ఉన్న సన్నివేశాన్ని దాటలేక పోవటముచేత, ఎవరైనా సామాన్యకవి అటువంటి సన్నివేశాలనుగూర్చి పాడితే, ఆ సామాన్యులకు ఆ సన్నివేశ ముత్సాహజనకమౌతున్నది. అట్లా ఆప్రాంతములో వాళ్ళకు తరతరాలుగా ఉండవచ్చు. విషయముయొక్క విశేషాన్ని బట్టి స్వల్పకాల స్థాయిగానైనా ఉండవచ్చు ఆ ఉత్సాహము. వ్యాసములో నరసింహశాస్త్రిగారు చెప్పిన బుర్రపాటలు మొదలైనవి అటువంటివి. అవ్వి సర్వజాతికీ సంబంధించినవైతే చావవు. కాని నిజమైన జాతీయకవి-అనగా మొదటిరకము కవిగాని, రెండోరకము కవిగాని-అటువంటిదాన్ని గ్రహించి ఉత్తమకావ్యము గనక రచిస్తే అది చిరస్థాయిగా ఉంటుంది.* 'బసవపురాణము' 'పండితారాధ్య చరిత్ర' మొదలైన ఉద్గ్రంధాలు బ్రతికుండి జాతికంతకు చెందిన గ్రంథాలై ఉండడానికి కారణమిదే! మిగిలిన శివతత్వాలూ, పాటలూ, తన్మతాను యాయులలోనే ఉండ తగినవి గాని పై గ్రంథాలవలె సకలజాతికి ఆనందము కలిగించేశక్తి వాటిలో లేదన్నమాట! అంతేగాక ఈ పాటల చేతా పద్యాలచేతా కల్గింపబడే ఉద్రేకమూ

* "— — Dialectical poems cannot have a wide range of effective publicity, nor will they have a long life." (కట్టమంచివారి రైతుబిడ్డ పీఠికలో)

ఉత్సాహమూ మిక్కిలి స్వల్పకాలస్థాయి. ఉత్తమ కావ్యకళవలె చిరస్థాయైన భావాలను కల్పింపజాలవు. త్యాగరాయకృతుల వలెనూ, అష్టపదులవలెనూ, యితర పాటలూ పద్యాలూ ఆనందము కల్పించడము, సమస్త జాతి ప్రీతిపాత్రాలు కావడము, చిరస్థాయిలుగా ఉండటము కల్గుతుందా? ఎందుకు కల్గుతుంది? అవి కళాకౌశలము కలవి. అందుకనే కీట్సుమహాకవి "A Thing of beauty is a joy for ever" అన్నాడు. అట్టి సుందరకావ్యాలుగాని, సుందరచిత్రాలుగాని జీవముకలవి! కాల పురుషుడు గొప్ప పరీక్షకు డందరికంటె! ఈ పరీక్షకుని పరీక్షకు నిలవగలదే నిజమైన జీవము కలది. గ్రీకులాటిను సారస్వతాలూ సంస్కృత సాహిత్యమూ, మన వెనకటి "తెనుగు మాన్యమూ" అటువంటి పరీక్షలో ఆరితేరినవి! దీనికి క్షతికలిగి, నవ్యుల "జీవశిల్ప' సమ్మేళనము ఫలముగా కలిగిన సాహిత్యము కాలక్రమముగా దీన్ని మించుతుందను కోడము కంటె భ్రమా, ఆత్మవంచనా వేరేలేదు! అదెట్లా ఉందంటే "తెనుగు ఓ,నా, మాలు రాకుండా యితర జాతీయ వాతావరణములో పెరిగి, తర్వాత యే కొద్దో గొప్పో తెనుగు నేర్చుకుని, వెనకటిదంతా చెత్తని అనుకోడములాగుంది." ఇప్పటి మానవుడు వెనకటి ఋషుల కంటె గొప్పవాణ్ణని అనుకోడముకంటె హాస్యాస్పదమేమైనా ఉన్నదా? చిరస్థాయిత్వము కలగచేసే జీవములేదు కాబట్టే వెనకటి శివకవుల వ్రాతలు నశించినవి! వేదము తూ,చా, తప్పకుండా ఎన్ని వేలసంవత్సరాలనుంచో ఉన్నది! దానికి క్షతి ఉన్నదా? పరమేశ్వరుడు బొల్లివిస్టు! నిమ్నోన్నతాలను ఎప్పటి కప్పుడు సరిచేస్తూ ఏది చిరస్థాయిగా ఉండతగినదో నిర్ణయిస్తాడు! ఈ విషయములో గర్వపడిగాని అభిమానపడిగాని ప్రయోజనములేదు. "శిల్పముమీద వారి దృష్టే ఆ కవులచేత నిర్జీవప్రతిమలను తరచుగా సృష్టి చేయించింది" అనే మొదలైన వాక్యాలన్నీ లెక్కచెయ్యనక్కరలేదు. "నవ్యకవులలో విలాసము కోసమూ, కవిత్వము చెప్పేవారు ఉండరు" "కవితోద్రేకము లేనిది వారు సామాన్యముగా వ్రాయరు" మొదలైన వాక్యాలు గర్వోక్తులు కాబట్టి నిరర్థకాలు.* ఏడుస్తూ ఉండటమో, ఆనందముపొందుతూ ఉండటమో గాక, విలాస వినోదాలుకూడా కవితోద్రేకానికి

* "ఉబుసుపోకకై చేయు వీరి కావ్యములు కావ్యములుకావు"
(వేదాల వరదాచార్యులు ఆంధ్రపత్రిక 17-11-40)

కారణజాతములోనివి సవినయముగా మనవిచేస్తాను. శృంగారకరుణాలే రసాలని శాస్త్రిగారు భ్రమపడుతున్నాడు గాబోలు? కవులు జీవించవలెనంటే ప్రధానముగా సామాన్యజనముమీద ఆధారపడవలెనని అనటము సమంజసము. ఈ క్రింది మహామహావాక్యము చూడండి.

"A Nation whose language becomes barbarous, must be on the brink of barbarism in regard to every-thing else. A nation which allows her language to go to ruin is parting the best half of her intellectual independence and testifies her willingness to cease to exist."

జీవించడముకోసము సామాన్య జనులవెంబడిబడేవానిని కనిగా భావించడము శాస్త్రిగారి సంకుచిత దృష్టిని తెలియజేస్తున్నది. "ఆంధ్రాభిమానమువల్ల మన కవీశ్వరులను జగత్తులోని ఉత్తమకవులతో పోలిస్తే రసికబృందములో మనము హాస్యాస్పదులమౌతాము." అనేవాక్యము భాషా జాత్యభిమానము లేనివారి మాటేకాకుండా సత్యదూరము. ✳ తిక్కన పోతనలుగల సాహిత్యము ఎంతమాత్రము సిగ్గుపడనక్కరలేదు.◆ నవ్యకవులది సాధించలేకపోతే తెనుగుజాతి నిర్వీర్యమైనదనీ తెనుగువాణి నీరసమైనదనీ మరొక్కసారి రుజువౌతుంది." అనటముకంటె భ్రమ వేరేలేదు అవి అట్లా ఎప్పుడూకాలేదు. తెనుగుజాతికి వీర్యమూ, తెలుగు వాణికి రసమూ' అదివరకే ఉన్నవి! ముందు ఉంటవి! వీళ్ళు తెనుగుజాతికి వీర్యము తెస్తున్నారనేది అబద్ధము!

---

✳ సభాపతి గారు కూడా యిలాగ అనడము నేను విన్నాను [Intentionally Making great things small] కాని విశ్వనాధ 'మన పూర్వాధునిక కవులు, ఇతర దేశ పూర్వాధునిక కవులతో తూగలేరని కొందరి ఉద్దేశము. షేక్స్పియరు తెనుగు దేశములోనూ, తిక్కన యింగ్లండులోనూ పుట్టడము ప్రకృతిధర్మము కాదేమో! ఎక్కడాకవులు కొద్దిమందే! వారిలో శక్తి వుంటుంది'. అన్నాడు

◆ వీళ్ళు సాహిత్యసేవ చేయుటములేదనీ, తెలుగుతల్లికి నూతనాలంకారాలు కల్పించటములేదనీ, వీరు నూతనమార్గాలలో భాషాసేవ చేయడములేదనీ నా ఆశయము కాదని నేను వెనకచెప్పిన దానివల్ల తెలిసేఉంది. కాని పూర్వులకంటె మనము గొప్పవాళ్ళమనీ, వారెందుకు పనికిరానివాళ్ళనీ అనుకోటము బాగుండలేదని నా మనవి. ఈ గర్వము పోగొట్టుకుంటే వీరి వ్రాతల కిప్పటి కంటె ఎక్కువ ప్రాశస్త్య మొస్తుంది!

# కవితావస్తువు : దేశభక్తి

ఈ విషయాన్ని గూర్చి కొంచెము ముచ్చటిస్తాను! ఇది యిటీవల నవ్యులు చాలామంది చెబుతున్నారు. "వీరు (నవ్యకవులు) ప్రకృతిని ఉపాసించుటలో అపూర్వ వివేచనాశక్తి ప్రదర్శించుచున్నారు. దేశభక్తి నుద్బోధించుటలోను, సామాన్య జీవితముల చిత్రించుట లోను, వీరి శిల్పనైపుణ్యాము ప్రశంసార్హము." (23-7-40 ఆంధ్రపత్రికలో) పై వాక్యములో ఉన్న సంగతులు పరీక్షిస్తే ప్రకృతిని నవ్యకవులు ఉపాసించిరనీ, కొందరు సామాన్య జీవితాన్ని చిత్రించినారని అనేవి ఒప్పుకొనవచ్చు. కాని దేశభక్తిని వీళ్ళందరూ ఉద్బోధించినారని ఒప్పుకోవటానికి వీలులేదు. ఈదశవర్షకాలములో భారతదేశము చాలా రాజకీయాందోళనముతో నిండిఉన్నది. అది ఏమన్నా యీ కవుల వ్రాతలలో ప్రతిబింబించిఉందా అని గనకచూస్తే, ఎక్కడో చాలా క్వాచిత్కముగాతప్ప లేదనే చెప్పవలె. ఏ అప్పారావో, రామిరెడ్డో కొన్ని స్థలాలలో దేశభక్తి నుల్లేఖించినారు. మిగిలినవాళ్ళలో రాయప్రోలువారూ, విశ్వనాథ వారూ, తుమ్మలవారూ మొదలైనవారు ఆంధ్రాభిమానాన్ని పురికొల్పినారు◆ అంతేగాని మిగిలినవాళ్ళంతా వాళ్ళ ప్రేయసులేమో, పరితాపమేమో, దుఃఖమేమో, ఆనందమేమో తప్ప దేశాన్ని స్మరించినవాళ్ళు ఎక్కువగా లేరని చెప్పడానికి సాహసించ నవసరములేదు. ✻ 1921 సంవత్సరములో ప్రారంభించిన సత్యాగ్రహసమరము చాలా సంవత్సరాలు అనువర్తించడమేకాకుండా మరిఒక నూతన సత్యాగ్రహతరంగముకూడా దేశాన్ని అన్నిమూలలా కలవరము పొందిస్తున్నది. దాన్నేమైనా కీర్తించి ప్రజకు దోహదమిచ్చినారా? ప్రథమదివసాలలో గరిమెళ్ళ సత్యనారాయణ వారు మొదలైనవారు కొన్ని గీతాలు రచించి ఉద్బోధించి జైళ్ళనలంకరించినారు. వారి స్వంతపనులూ, స్నేహితుల పనులూ సవరించడమే కాని, దేశీయ సమరానికి దోహదమిచ్చినవాళ్ళు చాలా తక్కువ. సభాపతి, అడివి

---

◆ "గురజాడ దేశభక్తి రాయప్రోలులో రాజుకుని, రగిలి, స్ఫులింగాలను విసరింది. విశ్వనాథ సత్యనారాయణగారు జాజ్జ్వల్యమానము చేశాడు" (ఆంధ్రపత్రిక 22-9-40)

✻ కాని తెనుగువారి శౌర్యము లేమికీ, తెనుగుతల్లి తీపిలేమికీ దుఃఖించడము ఒక మామూలైపోయినది నవ్యులకు.

బాపిరాజు ◆కొడాలి ఆంజనేయులు (జననము 1898)గారు, చిరంజీవులై వర్ధిల్లుగాక! శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్ళి రాలేదనడము సత్యదూరముకాదు. ఇంగ్లాండులో యుద్ధానికి పూర్వము వ్రాసిన కవులవ్రాతలు చూస్తే వాళ్ళ దేశభక్తీ, ఉత్సాహమూ, యుద్ధానికి పురికొల్పడమూ కనడుతున్నది. అనేక కవులు స్వయముగా ఫ్రాంసు దేశములో గుంటలలో కూచుని పోరాడినవారున్నారు. మనవాళ్లు జైళ్ళలోకి వెళ్ళినవాళ్ళను మరిచిపోయి,వాళ్ళవంతుకూడా బయటే తాము సుఖమనుభవించటము కనిపిస్తుంది. వీళ్ళలో ఉద్యోగాలలో ఉన్నవాళ్ళను వదిలినా కొందరు విడిగా ఉన్న వాళ్ళైనా ఈ విధముగా పనిచేసినవారు కారు. న్యాయముగా వీళ్ళు నిజమైన దేశభక్తితో తమ హృదయాలు నిండి అత్యంతముగా పాడి ఉద్యమానికి సహకారులై నడవవలసినవారు! మొదటి సమరములో పోనీండి! రెండో దాన్లోనైనా తప్పు సవరించుకున్నారా? అప్పుడుగాదు ఇప్పుడు! ఇప్పుడు కూడా ఎక్కడోతప్ప దేశభక్తిని పురికొల్పుతున్నవాళ్ళు చాలా మంది ఉన్నారా? ఇంకా దేశానికి స్వాతంత్ర్యము రాలేదుగా! వీళ్ళలో ఆ విధమైన ఆందోళనకూడా ఉన్నట్టు కనపడదు. నిందించకుండా చెప్పాలంటే వీళ్ళు భాషాసేవలోనూ, కావ్య నిర్మాణములోనూ మునిగిపోయి ఉన్నారనవలె! అప్పారావు రామిరెడ్డిగార్ల కాలములో రచించిన దేశభక్తి గీతాలను గూర్చి ఆయా స్థలాలలో చెప్పినాను. రాయప్రోలు, విశ్వనాథలు మాత్రము చక్కని పద్యాలలోనూ గీతాలలోనూ ఆంధ్రుల పూర్వోన్నత్యాన్ని కొనియాడి, ఉత్సాహాన్ని కల్పించి తమ కర్తవ్యములో కొంతభాగము నిర్వర్తించినారు. శ్రీపాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారుకూడా ఈ ఆంధ్రాభిమానాన్ని పురికొల్పటములో చాలా పాటు పడినాడు. *ఇంతమాత్రముచేత నవ్యులంతా ఈపని చేసినారన్నిన్నిర్ధారిచేయ్యడము సమంజసము కాదు. మరీ నరసింహ శాస్త్రిగారు చెప్పినట్టు "తెనుగుజాతికి వీర్యముతేవడానికి

◆ పట్టాభి సీతారామయ్యగారు ఆంగ్లములో వ్రాసిన కాంగ్రెస్ చరిత్రను తెలుగులోకి అనువదించాడు.

* వేదుల మొదలైనవారికి తమ 'ప్రాణధనమానముల పూజాప్రసవములుగా 'ఆమె' మహోజ్జ్వలపాదపీఠి నుంతుమని' బుద్ధి పుట్టినది. ప్రణయముతో కాలము గడపకుండా, రాజులసేవ చెయ్యకుండా, నీచపుదాస్యవృత్తి చెయ్యకుండా 'మాతృదేశ సేవా చరణమ్మునం దసువు లర్పణ' చెయ్యాలనుకున్నాడు. కాని అల్లా జరగలేదు. కారణము తెలియదు.

ప్రయత్నించార" నడము మిక్కిలి సత్యదూరము! ఈవిషయములో వాళ్లు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించలేదనే చెప్పవలె! కాబట్టి బంగారయ్యగారి వాక్యము ఒప్పుకోడానికి వీలులేదు! కాలానుగుణమైన పని చెయ్యకపోవటమూ, తత్కాలపరిస్థితులు వీరి వ్రాతలలో ప్రతిబింబించకపోవడమూ చూస్తే వీళ్ళ హృదయాలలోఉన్నట్టు చెప్పిన సుఖదుఃఖాలు, కృత్రిమాలుగా కనపడతవి! చుట్టు ఉన్న సన్నివేశాలతో సానుభూతి పొందని కవి నిజమైనకవికాడు. పెద్దలయెడ భక్తి, రాజభక్తి, దేశ భక్తి, దైవభక్తి, మొదలైన యేభక్తి వీళ్ళదగ్గిర ఉన్నట్టు కనపడదు. "జనసామాన్యము" "జనసామాన్యము' ' అనే వీళ్ళ పలుకులు చిలక పలుకుల్లాగు వినబడుతూఉంటవి! జనసామాన్యానికి అవసరమైన రాజకీయ స్వాతంత్ర్యము, ఏదిగనక లభిస్తే వాళ్ళ దారిద్ర్యమూ కష్టాలూ తొలుగుతాయో అట్టి స్వాతంత్ర్యము వీళ్ళకు కవితావస్తువు కాకపోవడము చాలా విషాదకరము!*

---

* దీనికంతకూ ఒక్క ప్రబల కారణము నాకు తట్టుతున్నది. వీళ్ళలో చాలా మంది, బ్రహ్మ సమాజ సంపర్కము కలవాళ్ళవటము. ఆవాసన తగిలితే వాళ్ళకు సర్వాంగ్లత్వపక్ష పాతకము కలుగుతుంది! బ్రహ్మ సమాజములో వాళ్ళు భారతదేశము మొత్తము మీద అసహాయోద్యమములో ఎక్కువగా పాల్గొనలేదు

"తనదొడ్డిలోనె పండిన ప్రత్తి సమకూర్చి
తనుసొంతముగ నేకులను రచించి
తన చేతితో వడికిన నూలు తనయూరి
సాలె నేసినయట్టి చేలగట్టి
తనచేనిలో ఫలించిన పంటదినుసులు
తనయింటి పాడినే యనుభవించి
తనజన్మ భూదేవతలను చాల ప్రేమించి
తనబాసలో పాండితిని గడించి
తనదు మత సాంప్రదాయ[illegible]తిని నడచి
తనదు తనవుపరార్థదత్తము [illegible]నర్చి
మించి సత్కీర్తిచే ప్రకాశించునట్టి
జనుడె చరితార్థుడాతని జన్మె జన్మ" మంగిపూడి

7,8 సంవత్సరాలనుంచీ కథకులు కొంచెము కృషిజీవిక గలవారిజీవనమూ, దారి ద్ర్యమూ, మొదలైనవాటిని చిత్రించటము మొదలు పెట్టినారు. కొందరు సబ్బవీస్ గురునాధరావు గారివంటివారు దేశాస్త్రీ నాయకులనూ మరవకుండా కీర్తించటము మొదలు పెట్టినారు. అయినా యిప్పటికీ వెనకటి కవితాసామగ్రే అనువృత్తముగా వస్తున్నది. ఇక ముందైనా ఈ తప్పు సవరణచేసుకునే సూచనలు కనపడటము లేదు! ఇంతతో యిమిటేషన్ బోల్షివిజంవచ్చి రక్తాన్ని, కండలను, అస్థులను, మాంసపిండా లను చిత్రిస్తున్నది. ఈ అంతర్జాతీయ బీభత్సము ముందర 'అస్మత్' పదమే అంతరించేట్టుంది! కాని మళ్ళీ ప్రపంచ యుద్ధమొచ్చి ఆశయాలను మార్చేటట్టు కనపడుతుంది

# భాషాసిద్ధాంతాలు

1929 సంవత్సరములో సాహితీ పత్రిక వెలువడ్డప్పటినించీ 1937 సంవత్సరము వరకు తమకు వచ్చిన అనుభవాన్ని బట్టి సభాపతిగారు నవ్యులననుసరించిన భాషాసిద్ధాంతాలను, తాను రచించిన "నాలో మార్పు" అనే వ్యాసాంతానికి గుదిగూర్చినారు. కావ్యానికి శబ్దార్థాలు రెండూ అవసరాలే కాబట్టి అర్థమూ దాని యొక్క నవ్యతా, శబ్దమూ వీళ్లు గ్రహించిన భేదాలు, అక్కడక్కడా చెప్పినాను. కాని అధికారికముగా సభాపతిగా రభిప్రాయాలిస్తే నిష్కర్షఅయిపోతుందనీ, అవన్నీ ఒక్కచోట ఉండటము మంచిదనీ యిక్కడ ఇస్తున్నాను.

"అదివరకు మనకు ఉన్న వ్యాకరణ గ్రంధాలన్నీ పద్యభాష నిరూపించడానికే కాని, వచన భాషకోసము కాదని యేమాత్రము ఃసమీక్షాదృష్టి వున్న వానికైనా గోచరిస్తుంది. అయితే పద్యాలమధ్య ఉన్న వచనము సంగతి ఏమని సంశయము కలగవచ్చు. కథా సంధికోసము, సామాన్య విషయ ప్రతి పాదన కోసము ఉపయోగించే భాష ఛందోబద్ధము చెయ్యడము యిష్టము లేక వెనకటికవులు గద్య రూపముగా వుంచారు. అయితే ఈ భాషకూ, పద్య భాషకూ విశేష తారతమ్యముంటే, యెగుడుదిగుడుగా వుంటుందనీ సమత్వము సమకూరదనీ ఆప్రకారము చేశారు. కాబట్టి ఆభాష వచనానికి ప్రమాణముగా ఎంచుకోకూడదు. వ్యాకరణమో సమగ్రముగ లేదు. చిన్నయసూరి వ్యారణము నిష్కారణముగా ప్రమాణగ్రంథము అయిపోయింది. దాన్ని బట్టి భాషయావత్తు దిద్దుతామంటారు ప్రాచీనపద్ధతిలో తయారైన విద్వాంసులు.

"ఎంతగొప్ప వైయాకరణి అయినా ఒకడు భాషకు సమగ్రమైన వ్యాకరణము చెయ్యలేడు. వృద్ధికావడము మానివేసిన సంస్కృతభాషకు వ్యాకరణము అనుశాసించిన భగవాన్ పాణినిమహర్షి అతఃపూర్వము అనేక మంది వ్యాకృతులను స్వీకరించి అష్టాధ్యాయి చేస్తే అదికూడా సమగ్రము కాలేదు. అటువంటి స్థితిలో సామాన్య విద్వాంసుడెవరో జీవద్భాషకు ప్రమాణభూతమైన అనుశాసనము చేసాడంటే అస్మదాదులము అంగీకరించలేము. వాఙ్మయములో ఉన్న గ్రంధజాలమంతా ప్రచురము కాలేదు. అయినదాన్ని కూడా ఒకడు పరిశీలించలేడు. గ్రహణశక్తి చాలకగాని, భ్రమప్రమాదాదుల వల్లగాని అనేక శబ్దరూపాలు ప్రత్యక్షముకావు.

"భాషాభివృద్ధి" అంటూ చాలామంది చిలకపలుకులు పలుకుతున్నారు. నిజముగా వృద్ధి కోరినట్లైతే వ్యవహారములో ఉన్న భాషను స్వీకరించి తీరాలె. ఎంతమహాకవైనా భాష యావత్తు తన గ్రంథాలలో యిముడ్చుకోలేడు. వెనకటి కవులు ఉపయోగించిన భాష ఆకాలములో వారికి తెలిసిందే! గ్రాంథిక శబ్దాలుకూడా వెనక మనుష్యులనోట వచ్చినవే కాని ఆకాశమునుంచి ఊడిపడ్డవికావు! అంతకంటె ఎక్కువ భాష మనము వాడకూడదంటే భాషాభివృద్ధికోరడము

లేదని అర్థము! "కితాబీ" వాఙ్మయము 'జమీందారీ కవిత్వము' చెయ్యడము కోసమైనా వెనకటి వాఙ్మయము చాలదు. మనము ఈ కాలము జగత్కుటుంబులని యెంచుకుంటున్నాము. అనేక భావతరంగాలువచ్చి తాకుతున్నాయి. మన ప్రకృతి మునపటివలె లేదు. నవీనసన్నివేశాలకు సంఘర్షణలకు, సమస్యలకు, ఉచిత వ్యక్తీకరణానికి నూతనపదజాలమూ, అన్వయాలూ కావాలె. దానికి లోకమే శరణము. శబ్దసిద్ధి లోకమువల్ల కలుగుతుందని నన్నయభట్టారకుడుకూడా చెప్పాడు.

"వైయాకరణి అయినా, కవైనా, కొత్తమాట స్వయముగా సృష్టించలేడు. అది లోకము చెయ్యవలసిన పని అవసరము వచ్చినప్పుడు కొత్తశబ్దము బయలుదేరుతుంది. మొన్నటి (1919) ఐరోపా సంగ్రామములో "Camaflouge" అనేమాట పుట్టింది.✻ అంతా వాడుతున్నారు. సాహిత్యవృద్ధి చెయ్యాలంటే అర్థవంతమైన అనేక శబ్దాలు వాడాలి. గ్రంథస్థము కాకుండా వ్యవహారములో ఆంధ్రదేశము మొత్తము మీద లక్షల కొద్దీ శబ్దాలున్నవి. అవి గ్రహించవలసిన బాధ్యత మనమీద ఉన్నది.

"ఎటువంటి పదాలు, ఉపాదేయములు? ఇక్కడ మతభేదాలు యేర్పడతవి. కేవలము అనాగరకులు-- అనగా పట్నాలకు బహుదూరములో ఉండేవారు, అడవులలో సంచరించేవారు, సత్తానల్లగాని మరి యేవాఙ్నిరోధమువల్లగాని ఉచ్చారణ చెడినవారు, అసభ్య వ్యవహారము చేస్తున్న వాళ్లు--ఇటువంటి వాళ్ళ మాటలు అంగీకరించ నక్కరలేదు. స్వీకరించిన శబ్దాలకు అన్వయము యెలాగు? భాషాతత్వము వాక్యరూపాన్ని నిర్ణయించే ఉన్నది దాన్ని గమనిస్తే చాలు. కొండవీటి చాంతాళ్ళవలె దీర్ఘ కావ్యాలు మట్టుకు పనికిగావు. కర్మణి ప్రయోగాలు కూడవు

"మాండలీకశబ్దాలు మనకర్థము కావని విచార పడగూడదు. క్రమముగా అర్థము తెలుసుకుందాము..... వెనకటి పుస్తకాలలోభాష ఎంత కష్టపడి నేర్చుకున్నాము? ఇది నేర్చుకొనడము అట్టే కష్టము కాదు ... ....◆

"గ్రంధకర్తలకు సంశయము కలుగుతూ ఉంటుంది, వాక్యాలు వ్రాయడము ఎలాగనీ, ప్రమాణము ఏదీ అనీ. ఆత్మ ప్రమాణమే ప్రమాణమని నా ఆశయము. లోక వృత్తము బాగా గ్రహించి, జాతీయాలు, లోకోక్తులు, సందర్భశుద్ధులు, మొదలైనవన్నీ గ్రహించి తనకు నచ్చినట్టు

---

✻ ఇప్పుడుఅనేక మాటలు పుట్టినై. 'బ్లిట్జ్‌క్రిగ్' (Blitzkreig) "లుఫ్ట్ వాఫ్" [Lutfwaffe] 'క్విస్లింగు' [quislıng] మొదలైన విట్టివే!

◆ 'ప్రాంతీయ శబ్దాలు భాషా దేవి విస్తారమైన తనువు' అవి తీసివేస్తే ఆవిడ గుజ్జు అయిపోతుంది.' అన్నాడు జయంతిలో విశ్వనాథ. డాక్టరు రెడ్డిగారు 'రైతుబిడ్డ'ను గూర్చి వ్రాసిన అభిప్రాయములో కూడా మాండలీకాన్ని గూర్చి చెప్పిన మాటల కిది సమాధానము.

వ్రాస్తే చాలును పెద్దలతో గాని, గురువులతో గాని, సభారంగముమీదగాని, జాగరూకతతో ప్రసంగించే పద్ధతి అవలంబించతగ్గది తన యిష్టానిష్టాలనుబట్టి గ్రంథకర్త కొన్ని రూపాలు స్వీకరిస్తాడు కొన్ని విసర్జిస్తాడు. భాషలో అనేక రూపాంతరాలు ఉన్నవి. ఇలా కొంత కాలము రచనలు సాగితే అప్పటికి ఒక Standard ఏర్పడవచ్చు

'నియమాలను వ్యతిక్రమించకుండా గ్రంథము చేసిన కవిలేడు. Standard అనే ఊహమాత్రమే! కాని తెన్నుదాటి విచ్చలవిడిగా సంచరించవలసిన అవసరము ఉండదు ఉచితజ్ఞుడైనవాడు ఏవో నియమాలకు లోబడే ఉంటాడు.

'ఇటువంటి భావాలు కలిగి ఆ రోజులలో నేను వచనరచనకు పూనికొని చాలా మంది మిత్రులను ప్రోత్సాహించాను. నవ్యసాహిత్యము ముందంజ వేసింది. పూజ్యులైన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు 'మాలపల్లి' వ్రాసిన తర్వాత వాడుకభాషకు ఎక్కువ గౌరవము వచ్చినది.'

పండితుడై రసికుడై విశాలహృదయుడౌటచేత సభాపతిగారు ఈపనిని నెగ్గించ గలిగినాడు. ఆయనవలె పండితుణ్ణికాకపోయినా, నా అభిప్రాయాలుకూడా సరీగా యిటువంటి పరివర్తనాన్నే పొందినై! ఇది చదివితే పద్యరచనకు సాధ్యమైనంతవరకు చ్యుతసంస్కారము కాని భాషనూ, గద్యానికి వ్యావహారి కాన్నీ వాడమని సభాపతిగారి ఆశయమైనట్టు కనపడుతుంది.◆ ఇది ఒక సలహా మాత్రమేగాని, కవి నిరంకుశుడు! రసము కోసము స్వతంత్రిస్తాడు. మనకు రసము కావలసినది!

---

◆ అయితే భారతభాగవతాలు ఈ భాష (వ్యావహారికం)లో వ్రాయవచ్చునా? అని అడిగినారు నేను కాదన్నాను. వాడుక భాషకు అంతసామర్థ్యము లేదు. నేడు రామాయణము ఈ భాషలో వ్రాయాలని కాదు. ఈ భాషలో వ్రాసినా, ఆభాషలో వ్రాస్తే ఏ ఆనందము వచ్చినదో ఆ అందము రాదు. ఆ రెంటి తారతమ్యానికీ బొబ్బిలికథను రంగరాయ విజయముతో పోల్చిచూస్తే తెలుస్తుంది పిడుక్కూ బియ్యానికీ ఒకే మంత్రము వద్దని సహృదయులైన నవ్యుల అభిప్రాయముకూడా నన్నమాట! ఒకచోట కంఠోక్తిగా ఇట్లా చెప్పినాడు 'పాట యేభాషలోనైనా ఉండవచ్చు! పద్యము గ్రాంధిక భాషలో ఉండాలె! గద్యము వాడుక భాషలో ఉండాలె! ఇప్పుడట్లాగే ఉన్నవి!

* విశ్వనాథ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి ఆంధ్రభాషానుశాసనాన్ని నవ్యసాహిత్యములో చేర్చవలసిందని అన్నారు. అది సమంజసమే!

వెనక ధారావాహికగా ప్రవహించే భాషకు ఒక శాశ్వతమైన వ్యాకరణాన్ని రచించడానికి వీల్లేదని పెద్దల అభిప్రాయాలను చూపినారు. ఎప్పటికప్పుడు శిష్ట వ్యవహారములో ఉన్న భాషకూ, గ్రంథస్థమైన భాషకూ, సన్నిహితసంబంధ ముండవలె! గిడుగువారి వాదంలో ఉన్న సారాంశమిదే. శబ్దసిద్ధి లోకంవల్ల కలుగుతుంది. ఆ శబ్దాలను వైయాకరణి పరిశీలించి వాటిని సూత్రిస్తాడు. ఈ విషయమే మన తెనుగు వ్యాకరణాలను ఎప్పటికప్పుడు పరిశీలిస్తే కనపడుతుంది . ఎందుకో గాని చిన్నయ సూరిగారి తర్వాత ఘనీభవించిందీవిషయము. త్రిలింగలక్షణ శేషము కొంతపని చేసినది. తర్వాతభాషలో జరుగుతున్న మార్పులన్నీ పరీక్షించి గద్య గ్రంధస్థభాషనూ, వాడుకలో ఉన్నభాషనూ పరిశీలించి ఒక నూతన వ్యాకరణము వ్రాయవలెనని వీరేశలింగపంతులుగారికే తట్టిందని సూర్యనారాయణీయ పీఠికలో శాస్త్రుర్లుగారు వ్రాసినారు. శ్రీ వీరేశలింగంపంతులుగారు స్వీయచరిత్రలో ఇట్లా వ్రాసినారట! "పూర్వవ్యారణములన్నియు పద్యకావ్యముల కొరకే! వచనకావ్యములులేని కాలమున బుట్టినవగుటచే నందలి లక్షణము లనేకములు వచనకావ్యాభివృద్ధికి తగవనియు, నిప్పటికాలమునకు తగినట్టుగా వ్యాకరణమును మార్చుకోవలయుననియు నేననుకొని, యీ కాలమునకును వచన రచనాభివృద్ధికిని దగిట్లుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్షణముగా నొక వచనకావ్యము చేయవలెనని పలుమారు తలపోసితిని.' / చూసినారా వీరేశలింగంగారి అభిప్రాయము. ఈ కాలానికి తర్వాత ఆంధ్రదేశములో పండితుల అభిప్రాయము చాలా మారి పోయిందని యీక్రింది సూర్యనారాయణీయ పీఠికాభాగంవల్ల విశదమౌతున్నది:-

'కీ॥శే॥ పేరి కాశీనాధశాస్త్రిగారు 1912 లో చెన్నపురమున జరిగిన పండిత సభలో 'శిష్టవ్యవహారమునందున్న తెనుగుభాష సంస్కారార్హమని' యుపన్యసించిరి. ఈ అభిప్రాయమునే మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు 'ఆంధ్రభాషా సంస్కరణ, మనెడి వ్యాసమున సయుక్తికముగా, సప్రమాణముగా, వివరించిరి. 1914 లో ఎలమంచిలిలో జరిగిన విద్వత్సభలో 'శిష్టవ్యవహారమందున్న భాష గ్రామ్యమనుట శాస్త్రవిరుద్ధమ'నెడి యుపపాదనమును శ్రీవఝుల చిన సీతారామశాస్త్రి గారు మొదలగు విద్వాంసు లనేకు లామోదించిరి. 1915 లో బందరు కళాశాలలో జరిగిన పండితసభలో **తక్కినపండితులవలెనే** యర్వాచీన కవిప్రయుక్తములైన యనేక శబ్దములు గ్రాహ్యములగునని' చెప్పుచు నా సతీర్థులగు శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు

ఈ ప్రయోగములలో గొన్ని నిర్దుష్టములయ్యు నిటీవలివారి యపరిశీల కత్వము వలన అపప్రయోగములుగా నెన్నబడుచున్నవి. ఏవి ఎట్లయినను ఆయా విచారము కవులకుగాని, సామాన్య రచయితల వ్రాతలయందు విశేషించి చూడగూడదను వాదము సత్యదూరముకాదు' అని అభిప్రాయ మిచ్చిరి. 1915లో కాకినాడలో జరిగిన పండితసభలో సభ్యులైన అత్తిలి సూర్యనారాయణగారె 'కేవల గ్రాంధిక భాషాభిమాని నై యుండియు సత్యము గ్రహించిన పిదప నా పూర్వాభిప్రాయమును మార్చుకొని సద్గ్రామ్యము సజ్జన గ్రాహ్యమే యగునని నా యభిప్రాయమును వెల్లడించుచున్నాను' అని వ్రాసిరి. 1916లో కొవ్వూరిలో జరిగిన సారస్వత మహాసభలో సభ్యులును నా సతీర్థులును కీర్తిశేషులు నగు శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రి కీ॥శే॥ రాజా కొచ్చర్లకోట వెంకట కృష్ణారావు కీ॥శే॥ వీరేశలింగము పంతులు కీ॥శే॥ తల్లాప్రగడ సూర్యనారాయణరావు, చిలుకూరు వీరభద్రరావు గారు, మొదలగు ననేక విద్వాంసులు 'తెనుగు మాటల సాధుత్వాసాధుత్వములు స్పష్టముగా బోధించే తెలుగు వ్యాకరణము లేకుండుటచేతను, ఉన్నవి పరస్పర విరుద్ధములుగాను అసంపూర్ణములు గాను ఉన్నందుచేతను, వ్యాకరణమునకు మూలము ప్రయోగము లగుటచేతను, తెనుగు గ్రంధములలోని ప్రయోగములను ప్రమాణములుగా అంగీకరింపక తప్పదు. నేటి వాడుకలో నున్న పదములు నూరు సంవత్సరములనుండి పెద్దల వాడుక చొప్పున ఉన్నట్లు నిదర్శనము లున్నప్పుడు అవి నిర్దుష్టములుగా ఎన్నవలెను. నేడు తెలుగుదేశ మందంతటను పెద్దల వాడుకలో ఏకరూపములుగ నున్నపదములు పూర్వకాలపు గ్రంధములలో కనపడకపోయినను నేటి గ్రంథములలోనున్న యెడ సాధువులే' అను తీర్పు నంగీకరించియున్నారు. 1919 లో చెన్నపురమునందలి కళాశాలలోని పండితులు దండిగుంట సూర్యనారాయణశాస్త్రి, నరసింహం పంతులు మొదలగువారు, అర్వాచీన కవిప్రయోగము లనేకములు సాధువులనియు గ్రాహ్యములనియు నంగీకరించిరి. ఇట్లే బ్ర.శ్రీ ప్రయాగ వెంకట్రామశాస్త్రి గారు ననేక పండితులభిప్రాయముల నిచ్చియున్నారు.'

చూచినారా గిడుగువారి వాదానికి పండితులెట్లా అభిప్రాయాల నిస్తున్నారో! ఈపద్ధతి ననుసరించి నూతన వ్యాకరణము చారిత్రిక పద్ధతి ప్రకారము వ్రాయడము అవసరమైనది. ఈ అవసరాన్ని మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు గ్రహించి చక్కని పద్ధతులలో వ్యాకరణాన్ని నిర్మించినారు. చిన్నయసూరిగారికంటె అనేక విషయాలలో విలక్షణముగా రచించినారు. ఇది రచించటములో వారి ఆశయాన్నిట్లా చెప్పినారు.:-

'...... భాషాసంప్రదాయ జిజ్ఞాసతో లౌకిక భాషగానున్న సంస్కృతమునకు సంస్కారా నుగుణముగా ననుశాసనములు చేసిన మునిత్రయమువారి సంస్కార పక్షవాక్యములను మనము

చేసియు, ప్రయోగదృష్టితో నాంధ్రభారతము మొదలుగా ప్రాచీనార్వాచీనకావ్యములనేకములు పఠించియు, లక్షణదృష్టితో నాంధ్రశబ్ద చింతామణి మొదలుగా ప్రాచీనార్వాచీన వ్యాకరణములు పరిశీలించియు, దేశకాలభేదమున లౌకికభాషలకు మార్పు నైజమనియు మారిన శబ్దములను పూర్వపూర్వకవులు ప్రమాణముగా నుత్తరోత్తరకవులు వాడుట సహజమనియు, నట్టివానికి నయ్యాకాలమున లక్షణ కర్తలను శాసనముచేయుట యాచారమనియు గ్రహించి, నన్నయాది ప్రాచీనులు వాడినదియు నాంధ్రమే' యని, నిశ్చయించుకొని యర్వాచీనకవి ప్రయుక్తములైన బహుశబ్దములసాధువులనెడి వాదము సముచితము కాదని తలంచితిని.'

ఇది చారిత్రిక పద్ధతి. ఈపద్ధతి ననుసరించి మనవాళ్ళు గ్రామ్యాలనే శబ్దాలకు అనేకాలకు సాధుత్వము కల్పించినారు శాస్త్రిగారు. ఇందులకు శాస్త్రిగారి యెడల సకలాంధ్రలోకము కృతజ్ఞము, రామలింగారెడ్డిగారి వంటివాడీ వ్యాకరణాన్ని మెచ్చుకున్నాడంటే యిక వేరే సర్టిఫికేటు అక్కరలేదు. ఆయన దీనికి పీఠిక వ్రాసినాడు. అందులో కూడా కొంత సంఘసంస్కరణోపవ్యాసము చేసినాడు. తుదకు శాస్త్రి గారి పద్ధతిని మెచ్చుకున్నాడు. "శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పద్ధతిని నవీనము, స్వతంత్రము .......... ప్రతి ప్రకరణమునందును చారిత్రక దృష్టియు 'అసాధారణ యోజనాశక్తియు విస్పష్టములు.''

ఈ వ్యాకరణము ఇంకా "సమగ్రము కాదు'' "వివిధ మండలములలో వేరువేరు తెరగుల వాడుకలోనున్న యపారశబ్దజాలమున కాయా మండలములలోని పెక్కండ్రు కలసి చేయతగిన యనుశాసన మొక్కమారుగా సమగ్రముగా చేయుట నాకొక్కనికి సాధ్యమునుగాదు'' అన్నారు శాస్త్రిగారు. ఈ వ్యాకరణము గిడుగువారి ఆశీర్వాదాన్ని పొందినది. ఇద్దరు సహృదయులే కాబట్టి ఒకరుచేసిన పని కొకరు సమ్మతించినారు. శాస్త్రిగారు గిడుగువారిని గూర్చి ప్రతిభలో వ్రాసిన వ్యాసములో తమ అభిప్రాయాన్నీ గిడుగువారితో తమ సంబంధాన్ని చెప్పినారు.'' ఈ వ్యాకరణము నవ్యాంధ్ర సాహిత్యాని కలంకారభూత మైనదని అందరూ గ్రహించినారు. వ్యాకరణము తత్కాలభాషకు దగ్గరకు రావలెననే సిద్ధాంతాన్ని ఋజువుచేసినది.

ఈ కాలానికి సంబంధించినదే పర్వులవారి "వైయాకరణ పారిజాతం'' కూడాను. దీనిలో వీరవలంబించిన శాస్త్రపద్ధతి చాలా ప్రశంసనీయము. "నన్న యాథర్వణీయము'' అన్నారు దీన్ని. నన్నయ సూత్రాలకు అధర్వణుఁడు వార్తికం

వ్రాసినాడని గ్రహించినారు వీరు. అది నిజమే! కాబట్టి ఆ రెండింటిని జోడించి కలిపి భాష్యం రచించడం ప్రారంభించినారు. ఇంకా పూర్తికాలేదు. త్వరలో పూర్తిచేసి భాషకుపకారము చేస్తారని ఆశిస్తున్నాను. ఈయన మనకున్న గొప్పవైయాకరణుల్లో ఒకడు. పారనంది రామశాస్త్రిగారు (1851-1930 పర్లాకిమిడి.) వ్యవహార భాషావ్యాకరణము రచించినాడు. ఇది గమనింప తగినది.

ఇటీవల వాచస్పత్యగ్రంథ నిర్ణేతలైన కొత్రశ్యామల కామ శాస్త్రిగారు "వ్యాకరణ సర్వస్వ" మని సమగ్రవ్యాకరణము వ్రాసి ప్రచురిస్తున్నారు, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు తత్సమచంద్రికా దులే గాక సంస్కృత వ్యాకరణ సామగ్రిని కౌముద్యాది గ్రంథాలలోనించీ తెనుగుకు సంబంధించినంతమట్టుకు విడదీసి ఒక గొప్ప వ్యాకరణము రచించినారు.

ఇటీవల 'శరదాగమ మ'ని రెండు భాగాలలో కౌముది తెలుగులోకి అవతరింప జేసినాడు, అప్పలజోగన్న శాస్త్రిగారు విజయ నగరమునుంచి. తత్సమతద్భవ చంద్రిక అనే పుస్తకము 1940లోనే అయితం కాళీవరప్రసాదరాయకవి రచించినాడు. ఇది పద్యములలో నున్నది. ఇదిగాక, 'బాలకళానిధి' అనే సారస్వత సర్వలక్షణ సంగ్రహమును రచిస్తున్నాడు. 'సులభీకృతఛందఃకళ' అనే భాగాన్ని ప్రకటించి కవికుమారులకు సహాయము చేసినాడు.

# సింహావలోకనము

ఒక్కమారీ కాలాన్ని సింహావలోకనము చేస్తే సారస్వతక్షేత్రములో ప్రసరించిన వీధీ విన్యాసము చాలా హృదయంగమముగానూ సర్వతోముఖం గానూ కనపడుతున్నది. ఖండకావ్యవీధి చాలా రసవంతముగా ప్రసరించటము సాగింది. గద్యపద్యనాటక రచన సాగుతునే ఉంది, కొందరు విశ్వనాథవంటి సార్వకాలికకవులు క్రమముగా వికసిస్తున్నారు వృక్షం కొమ్మలలో బదనికలు పుట్టినట్టు ఒకమూలనుంచి అతినూతన మార్గాలు పుట్టే సూచనలు కనిపిస్తున్నవి. గద్యము సర్వమార్గాలా ప్రసరించి ప్రజలకానందసంధాయకమూ, జ్ఞానదాయకమూ అవుతున్నది. వ్యావహారికభాషగేయానికీ, కథకూ స్థిరమైపోయినది. భాషావిషయములో పండితుల

అభిప్రాయాలు కూడా మార్పు పొందుతున్నవి. వ్యాసం చక్కని పరిణామము బొందుతున్నది. నవ్యులలో కొందరు యువకులు చక్కగా వెనకటి లక్షణ శాస్త్ర సిద్ధాంతాలను ఆధునిక భావాలతో పరీక్షించి పరిష్కరించడము సాగించినారు. పరిశోధనము అనంతముఖాల ప్రసరిస్తూనే ఉన్నది. చరిత్రలో చక్కని నిర్దుష్టత కోసము ప్రయత్నాలు జరుగుతున్నవి. అనేకుల దేశభక్తుల, గొప్ప వారి జీవిత చరిత్రములు వ్రాయబడుతున్నవి. నవలలు వ్రాస్తూనే ఉన్నారు! వెనకటి నమూనా నాటకాలు కూడా వ్రాస్తూనే ఉన్నారు. నాటక ప్రదర్శనాలు సినిమా సంఘర్షణచేత వెనకపడుతున్నవి! ఈ విధముగా అన్ని సారస్వత వీధులలోనూ భాషాకుమారులు సంచారముచేస్తున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయాన్ని గూర్చి ఉత్సాహము పొందిన వాళ్ళు నిరుత్సాహాన్ని పొందినారు. పెద్దదైన స్వరాజ్యాందోళనలో ఆంధ్రులు నిమగ్నులైపోయినారు. కవులు దేశాన్నంతగా కీర్తించడము లేదు. ప్రణయానికి ఇచ్చినంత ప్రాముఖ్యము దేశభక్తికియ్యటంలేదు. కొందరు యువకులచిత్తాలలో మొలవకూడని అంకురాలను మొలిపిస్తున్నారు. వాళ్ళవ్రాతలకు కొందరు తమవాళ్ళే వైముఖ్యం చూపటము చాలా సంతోషకరము. రాయప్రోలు, విశ్వనాధలు యామికులవలే మళ్ళీ చిత్తవృత్తిసంస్కారాన్ని యధాస్థితిలో పెట్టడానికి చాలా శ్రమపడుతున్నారు. వెనకటి కొందరికి సృష్టి వెనక్కుతగ్గింది 'తగ్గుతున్నది. కథానికమాత్రము సంపూర్ణపరిణామము పొందేసూచనలు పొడకట్టుతున్నై! నవ్యసాహిత్యానికి స్థైర్యమొచ్చినది. దేశములో అన్ని మూలల నించీ దీనికి ఉత్సాహము కనపడుతున్నది. పెద్దలుకూడా దీనికి సుముఖులవుతున్నారు. వాళ్ళల్లో కొందరు వ్రాతలుకూడా వ్రాయడము మొదలెట్టినారు. వాటిలో శ్రీ చెళ్ళపిళ్ళవారి వ్రాతలు దేశము దృష్టిని మార్చటములో చాలా ఉపకారకాలైనై! కొందరు చిన్నతనపు చేష్టలను చూపడాని కుద్యుక్తులవుతున్నారు. కాని ఇంకా సంపూర్ణముగా ధైర్యముగా ధైర్యము వహించటములేదు. కొందరు పెద్దలు వీళ్ళకు ప్రోత్సాహమిస్తున్నారు. ఈ కుర్రవాళ్లు ఇంగ్లాండులో యుద్ధానంతరము వచ్చిన సాహిత్యములో మార్పులన్నీ మనకు తెచ్చిపెట్టటానికి అంచనాలు వేస్తున్నారు. తమ చిత్తవృత్తులను ఆ కృత్రిమ వాతావరణములోనికి తెచ్చుకుని లేని ఉద్రేకానికి పాలై ప్రపంచమంతా మునిగి

పోతున్నట్టు భావిస్తున్నారు. మరికొందరు జాతిలోఉన్న నిమ్నోన్నతాలకు తావిచ్చి వాటిని సమంచేయటానికి ప్రయత్నిస్తున్నారు. పూర్వమార్గముకూడా బొత్తుగాలేదని అనుకోవద్దు. అక్కడక్కడా వాళ్ళుకూడా చక్కనివ్రాతలు వ్రాస్తూనే ఉన్నారు. రాజశేఖర శతావధానిగారి ఉదాహరణ మిచ్చే ఉన్నాను. అన్ని లలిత కళలలోనూ యంత్రమొచ్చి వాటియొక్క లాలిత్యాన్ని దెబ్బకొట్టింది! ఇది చాలా విషాదకరం. ఆంధ్రదేశములో అందరు కవులు జోక్యము కలగ జేసికోక పోయినా జాతీయాందోళనానికి వలసిన ఉత్సాహము కొరవడలేదు. ఇతర రాష్ట్రాలతోపాటు ఎందులో కూడా తీసిపోలేదు. కులకక్షల వాతావరణము ఇంకా అట్లాగే ఉంది. కాని యీ కులకక్షలు దేశభక్తితో ఏకకాలావచ్ఛేదకముగానూ, ఒక్కొక్కప్పుడు కవి వ్యక్తిగతంగానూ, ఉన్నవి! నవ్యుల్లోనే కొందరిలో పూర్వసంప్రదాయాభిమానం కల్గి తత్ప్రచారము కొంచెము సాగించినారు. నోరి విశ్వనాథలవంటి ముఖ్యులు సంప్రదాయానుసారముగా నవ్యతను తెచ్చి భాషా సారస్వతాలను వెలయింపవలెనని ప్రయత్నిస్తున్నారు. చాలా ప్రశంసనీయము. మాలపల్లెలో భాషా, నవలావీధి సిద్ధి పొందినై! ఇది భాషామతల్లికి నవ్యాభరణము. దేశదృష్టి పూర్ణముగా సారస్వతము మీదికి ప్రసరించటానికి వీలే లేకపోయినది. రాజకీయము బలవత్తరముగా ప్రబలిపోయినది. పత్రికలు కొన్ని కొత్తవి పుడుతున్నై! పాతవికొన్ని అంతరిస్తున్నవి! ఆంధ్ర, కృష్ణాపత్రికలు మాత్రము యథాశక్తి దేశభాషాసేవలు చూస్తూనేఉన్నై!* భారతి నవ్యసాహిత్యానికి చాలా ఉత్సాహము కల్పించినది. ముట్నూరి కృష్ణారావుగారు తమ వ్రాతలతో యువకుల చిత్తాల త్రోవ తప్పకుండా కాపాడుతూనే ఉన్నాడు. జాషువాకవి సారస్వత సేవకు మతము అడ్డుకాదని గొంతెత్తి చాటడము ప్రారంభించినారు. ఇది ఒక గొప్ప భాషాసేవ అని నా అభిప్రాయము. సాహితి అంతరించిన తర్వాత నవ్యసాహిత్యానికి పత్రిక లేకపోవటము చూచి సభాపతీత్యాదులు కృషి సలుపుతున్నారు. గిడుగువారు తమ ఉద్యమం దేశములో బలము చేకూర్చుకోవడము చూచి చాలా ఆనందము పొందుతున్నాడు. పిం.గు. కాటూర్లు గురుదక్షిణను సేకరించుకొంటున్నారు. విశ్వనాథలో 'వక్రసాఫీ' పంచలు రెండూకలసి ఆయన వ్రాతలకొక సార్థక్యం

* ఈ రెండు పత్రికలకూ బెజవాడలో బ్రహ్మాండమైన రజతోత్సవ సన్మానాలు జరిగినై.

కలుగచేస్తున్నవి. శ్రీ శ్రీ ఆయన శిష్యులూ రాబోయే వర్షాకాలానికి మేఘాలు కావడానికి తయారౌతున్నారు. వెనుకటి వసంతకోకిలాలు కొంచెం కొంచెం వెనకబడుతున్నవి. రాయప్రోలువారి కంఠముతరుచు వినపడకపోయినా వినపడ్డప్పుడు దేశానికి ఉత్తేజకరముగానే ఉన్నది. సభాపతిగారు తమ సహజ మధురకావ్యరచనను సాగిస్తూనే ఉన్నారు. నండూరువారు చాలా తక్కువగా బయటపడుతున్నారు, నవ్యపక్ష బాహుళ్యముచేతనో యేమో అల్పసంఖ్యాకులలో ఉండే రోజులలో కనపడని స్నిగ్ధత కొంచెము తగ్గినట్టు కనపడుతున్నది. పంచాగ్నులవారు తమ చేయూతను నవ్యసాహిత్యానికిస్తూనే ఉన్నారు. ఈ కాలాంతానికి సారస్వత మీస్థితిలో ఉన్నది. ఖండకావ్య కథానికలు ఒక విధమైన స్థైర్యాన్ని పొంది యింకా అభివృద్ధికిపోయే సూచనలు కనపడుతున్నవి.

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

## 7

## నవ్యసాహిత్యము : గుణదోషవిచారము

నవ్యసాహిత్యం ఎలా పత్రికాముఖముగా, పరిషత్తులద్వారా అభివృద్ధి పొందుతూ వచ్చినదో కాలానుసారిగా పరిశీలించినాము. నవ్య కవులందించిన కవిత్వములో ఉన్నగుణాలను ఎన్నుకోవలసి ఉన్నది. విమర్శ అంటే గుణదోష విచారము గదా! ఈవిధమైన పరిశీలనము వలన సాహిత్యములో నవ్యత, కవిలోని వ్యక్తి, సువేద్యాలవుతవి.

'సాహితి' వెనకటిసంచికలు తిరగవేస్తే ఇదివరలో నేను మనవిచేసిన సాహితీసమితి సభ్యులేగాక అనేక వ్రాయసగాండ్లు కనపడతారు. సాహితీసమితి సభ్యులు కొందరు చెప్పుకొనే వాండ్లు కారు, మరికొందరు చాలా గర్వముతో ఆ సంగతి చెప్పుకొనేవారు. వెనక పేర్కొన్నవారుగాక నూతనులలో కొన్ని పేర్లు మనకు చాలా ఆదర పాత్రులవి. వేదుల, విశ్వనాథ, కొమాండూరు, దువ్వూరి, పెనమర్తి, నాయని, అడివి, మొదలైన సుప్రసిద్ధ నవ్యాంధ్రసాధకులు కనపడతారు. వీళ్ళలోకొందరు గద్యపద్యవీధులలో రెండింటిలోను సాధన చేసినవారున్నారు. వేదుల, విశ్వనాథ, కొమాండూరు, నాయని గార్లలో అప్పటికే తర్వాత సిద్ధహస్తులయ్యే పోకడలు కనబడుతున్నవి. భాషా, భావమూకూడా వ్యక్తిత్వాన్ని పొంది, నవ్యతను చూపుతూనే ఉన్నవి. ఉభయసాధకులుగాఉన్నా కొందఱు తర్వాత తమ ప్రత్యేకతను ఏదోఒక్క దాన్లోనేచూపినారు. కొందరు రెంటిలోకూడా తమశక్తిని వ్యక్తీకరించినారు. ఈమార్గసాధకులలో కొందరప్పటికే కావ్యాలను ప్రచురించినారు. దువ్వూరి రామిరెడ్డిగారు కొన్ని రచించినారని వెనక మనవిచేసినాను. 1921 నాటికే ఈయన చక్కని "కృషీవలుడ"నే జానపదకావ్యము వ్రాయగలవాడని రామలింగారెడ్డి ప్రభృతులు చెప్పినారు. ఆయన ఆవిధమైన సాధనలో కృషిచేస్తూనే ఉన్నాడు. రెడ్డిగారిట్లాఅన్నాడు

ఈయన్ని గూర్చి:

ఈ గ్రంథమునందు పొలముకాపులయు, కాపుటిల్లాండ్రయు, దైనందిన చర్యలతో ఋతువర్ణనములను కవి బహు చమత్కారముగా సమన్వయించియున్నాడు. గ్రామాంతర నివాసము, వ్యవసాయవృత్తి, ఇత్యాది ప్రకృతి సామీప్య జీవితమునకును మనుష్యస్వభావ ప్రవృత్తికిని ఉండు సంబంధము చూపబడి యున్నది."

1920 నాటికే నాల్గు పెద్దకావ్యాలను వ్రాసినాడు. రామిరెడ్డిగారి కవిత్వాన్ని పరిశీలించి చూద్దాము:

దూవూరి రామిరెడ్డి చిన్నప్పటినుంచీ వ్యవసాయము చెయ్యకపోయినా తత్సాంప్రదాయములో పుట్టినాడు కాబట్టిన్నీ, చిన్నప్పటినించీ కవితాశక్తి కలవాడౌటచేతా నూతన భావాలు గాటముగా హృదయములో నాటి తదనుగుణముగా గ్రామీణుల జీవనాన్ని చిత్రించవలెననికోరిక పొడమినది. కాబట్టి వాళ్ళ వేషభాషలూ, వాళ్ళ నాగరికతా గమనించినాడు. ఆయన వ్రాసిన కావ్యాలలో యిటువంటి పదసామగ్రి అనంతంగా కనపడుతుంది. "గిడ్డి" "పలుపు" "మేపుట" "అదల్చుట" మొదలైన జానపదుల, అందులో కాపుల, నుడికారాలతో, వారి జీవితాంశాలు చక్కగా హృదయంగమంగా వర్ణించినాడు. ఒక్కొక్కచోట జానపద నాగరిక జీవితాల తారతమ్యము చెప్పినప్పుడూ, విశేషాన్నించీ సామాన్యాన్ని సమర్థించినప్పుడూ వచనములో వ్రాస్తేనే బాగుండేదేమో అనిపిస్తుంది.

---

* ఈయనకు 1915 సంవత్సరంలోనే కవిత్వము అంకురించినట్టు చెప్పుకున్నాడు. ఈ ప్రథమకాలంలో కొన్ని ప్రబంధాలు వ్రాసినాడు. ఒకదానిలో విమర్శకకృత్యాన్ని హృదయంగమంగా చెప్పినాడు. ఈయనక్కూడా లాక్షణికుడంటే అసహ్యంయిందులో కనపడుతుంది. విమర్శకుడు "వ్యాకృతీ, లక్షణలక్ష్యాలూ, జిడ్డుకట్టెట్టుతిని అజీర్ణపుగాలి త్రేస్తాడట!" ఆయనకు బ్రహ్మ "సరసాత్మా, కోమలతా, లోపముచేశా"డట! ఈ విధంగా విమర్శకుడిని చిత్రించినాడు. ఉన్మాదంతో యిష్టమొచ్చినట్టు వ్రాసే కవికుమారుడి మాటలను విమర్శకుడు లెక్కచెయ్య నవసరములేదు! ఈయన కాళిదాసు ఋతుసంహారమూ, పుష్ప బాణవిలాసభాణమూ భాషాంతరీకరించి నాడు. ఈయన కథల పొంత బోలేదు. వచనం నాటకాలలోతప్ప వ్రాయలేదు. చక్కని సలక్షణభాషను 99 వంతులు వ్రాసినాడు. చాలా హృదయంగమమైన శబ్దసౌష్ఠవం! ఈయనకు డాక్టరుజిన్సు అనే పేరుగల గొప్ప ఐర్లాండు కవి ప్రోత్సాహమిచ్చినట్టు విశ్వనాథ వారు చెప్పినారు. ఈయన తన కొన్ని కావ్యాలు "Voice of the reed" అనే పేరుతో ఆంగ్లములోనికి పరివర్తనం చేసి ప్రచురించినాడు.

"నేటి నాగరికత నీ మేలుగోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు,
నా యవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చు జిత్తశాంతి యున్నె?"

ఈ ఆర్థిక శాస్త్రసిద్ధాంతములో ఎంతమాత్రము కావ్యత్వము లేదు. ఇటువంటివే వేదాంతఘట్టాలుకూడా అనేకముగా ఉన్నవి. ఈయన దృక్పథము సమస్త రంగురంగుల ప్రకృతి వర్ణనముగాక దరిద్ర కృషికజీవిత సంబద్ధాలైన ప్రకృతివిశేషాలను చిత్రించటము మీదికి అక్కడక్కడా తత్వశాస్త్ర సామ్యవాదాలమీదికీ పోయినది! * ఈయనకూడా తాను వర్ణించే వస్తువుకూ, భావాలకూ అనుకూలమైన పదజాలాన్ని సంగ్రహించినాడు. ఈయనలో భావనాశక్తి "జలదాంగన"లో చక్కగా చూడవచ్చు నక్షత్రమాలలో మొదటి "కవిమనోరథమూ" కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షం ప్రథమగేయమూ కొన్ని సమానభావాలతో నిండిఉన్నవి. రామిరెడ్డి గారు పరమేశ్వరుడు తనను "జలదార్భకుడుగా' "తుహినాంబుకళికగా" "మలయూట కాల్వగా" "కలువగా" "మురిపెంపుచుక్కగా" యేల సృజించలేదని చాలా విచారపడ్డాడు! దేవులపల్లి తానేమికావాలని చెప్పినాడో చూడండి "ఆకులో ఆకు" "పూవులోపూవు '"నునులేతరెమ్మ" "చిరుగాలి కెరటం" "సెలపాటలో తేట" "తెరచాటుతేటి" "చిన్నారి సిగ్గు" "జలదంపునీలంపునిగ్గు". ఈవిధముగా ఉందీయన సామగ్రి. ఇప్పుడున్నట్టుకాక మరోవిధంగా అయిపోదామనేయిచ్ఛ యిద్దరికీసమానం! ఒకాయన "జలదార్భకుడు" కావాలనుకుంటే, రెండోఆయన "జలదంపునీలంపునిగ్గు" అయిపోవాలని అనుకుంటున్నాడు. ఒకరు "మలయూటకాల్వ" కావాలనుకుంటే రెండోవారు "సెలపాటలో తేట" కావాలనుకుంటున్నాడు! చూసినారాసామ్యం! కవికుమారుల ఊహాసామ్యమంటే యిదే! ఆ కాలపు భావైక్యాన్ని, ప్రకృతిప్రణయాన్ని

---

* ఒక ఖండకావ్యములో పిల్లలనుకోల్పోయి కూడులేక మలమలమాడుతున్న "ముసలి మాలెత" యొక్క ముష్టెత్తడాని కిష్టములేకపోవడమూ, కష్టము చేసి పొట్టపోసుకోవాలనే యిచ్ఛా, కూలి దొరికినప్పుడామె సంతోషమూ చాలా రసవంతముగా వర్ణించాడు. 1921 సంవత్సరపు జాతీయోద్యమము యీయనను కొంచెము కదిపింది. "రాట్నపుపాట" 'జాతీయగీతమూ" మొదలైన ఖండకావ్యాలను వ్రాయించిన దీయనచేత.

తెల్పుతున్నది! ఏ కాలములో భిన్నవ్యక్తులలో, భిన్న సంస్థలాలలో, భావైక్యత తత్కాలమహిమ! ✻ ఈ ప్రథమఖండ కావ్యాలలోనూ, తర్వాతవాటిలోనూకూడా, కవియొక్క మృదుహృదయమూ, ప్రకృతిప్రీతీ, మొదలైనవన్నీ సమానధర్మాలుగా కనపడుతూనేఉన్నై. ఈయన "కుసుమాశ్రువు"అని రాయప్రోలువారి శబ్దసామగ్రికి మరోరకము అశ్రువులను చేర్చినాడు! పూలనుంచీ కారే హిమాంబువులకి చక్కని పేరునిచ్చినాడు కవికుమారుడు! ఈయనలోకూడా అక్కడక్కడా వితర్కమూ, భావనా, గవేషణమూ, కనపడుతూనే ఉంటాయి. ఈయనదికూడా చక్కని "రీతి' శ్రవణసుఖమే యీయనక్కూడా ప్రాప్యము. సరళ భావాలను సొడుగాటి సమాసాలతో చెప్పడము వేదులవారివలె ఈయనక్కూడా అక్కడక్కడా కలుగుతుంది! ఈయన కూడా హృదయమతి కోమలమవడంచేత "ప్రేయసిని" శ్రమపెట్టడు! "ప్రేయసిం దన కవుంగిట నొత్తు" టతోనే, తృప్తిని పొందుతాడు ◆

తర్వాత కాలములో అనగా 1921-25 సంవత్సరాలమధ్య ఈయన వ్రాసిన ఖండకావ్యాలలో కొన్ని పద్యసంభాషణారూపాలుగా ఉన్నై. ◆ ఈయనకూడా వాక్చిత్రకల్పనలో చాలా ప్రజ్ఞ చూపినాడు చూడండి క్రిందిరూపకము.

"విజ్ఞానమయమైన విస్ఫులింగమున
నంటింపు నా హృదయంపు గప్పురము"

ఇది ఒక నవ్యకల్పన! ప్రేయసి ఈయన రమ్మన్న కాలానికి రాలేదు! ఆ

---

✻ 16 శతాబ్దములో ఒక్క కాలములో పింగళి సూరన మాయాసలకూర రంభలను సృష్టిస్తే షేక్స్పియరు 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' (Comedy of errors) అని ఒకే పోలిక వ్యక్తులను గూర్చిన నాటకము వ్రాసినాడు.

◆ ఒక్కొక్కప్పు డదిగూడా ఉంటాను. చూడండి.

"అభిశప్తజీవనుండైన నేనేడ
సకియకంఠాశ్లేషసౌఖ్య మదియేడ?"

ఈ విషయములో వెనక నేను చెప్పినవారితో సమానుడే ఈయనకూడాను!

'కాలగుర్తు లనంత కాలసికతముల
బూర్వవీరుపోల్కి ముద్రించి పొమ్ము'

"foot prints on sands of time" కు ప్రతిబింబమిది.

సందర్భములో,

"ఇంక మాకు బరస్పరేక్షణప్రాప్తి
కలుగుట నిజమేని, కన్నీరుబొట్ల
మాలను రచియించి, మాయలమారి
చేడియ కర్పించి, శిక్షగావింతు"

అన్నాడు. ఇందలి తుదిపాదము మిక్కిలి రసవంతము. ప్రేమకు పరమావధి! కన్నీటిచే శిక్షయొనర్చుట! గాంధీగారి అహింసాతత్వం వలె ఉన్నది ఇది? ప్రియురాలికి ప్రియుడి కన్నీరుగాక వేరే శిక్ష కావలెనా? ఈకాలపు ఈయనవ్రాతలలో కొంత ద్విపద చక్కని శైలిలో ఉన్నది. తుదిదశలో అనగా 1925-30 సంవత్సరాలకు మధ్య ఈయనకు **ఆపత్పరంపర** వచ్చినట్టున్నూ, తద్వారా కొంత దుఃఖము కవితా రూపముగా వెలువడ్డట్టున్నూ కనపడుతుంది. జీవితం భారమై పోయినది. ప్రియావియోగము, శిశువియోగము, హృదయాన్ని కలచినట్టున్నూ, కవితకు కావలసిన మనశ్శాంతి లేనట్టున్నూ చెప్పుకుంటున్నాడు. ఈ అధ్యాయానికి "భగ్న హృదయుడ"ని పేరుపెట్టినాడు. ఇందులో అక్కడక్కడా దేవులపల్లి పోకడలున్నా ఆ దుఃఖఝురి యిందులో జలజలాపారు సెలయేరైనది! ఇది కూడా బాష్పాలను తెప్పిస్తున్నా, ఆ "వెక్కి వెక్కి" యేడుపుక్రింద యిది ఆగదు. అది **దుఃఖహృదయహిమవన్నగము** మీదినించీ దుమికే బాష్పగంగ! ఇది కరుణహృదయ సహ్యాద్రినించీ ప్రవహించే కన్నీటి కావేరి! అదీభేదము! ఈ భాగములో కొన్నిపోకడలు చాలా రమణీయాలున్నవి.

'హృదయమును దొంగలించిన రీతిగానె
స్మృతిని సైతము నీవు హరింపుమతివ'

ఇది చదివినప్పుడు కాళిదాసు 'ప్రసక్తే నిర్వాణే హృదయ పరితాపం ప్రజన యసి 'కిమ్' అనే శ్లోకపాదము జ్ఞప్తికి వస్తున్నది. కొంచెమీ భాగములో బీభత్సము కూడా కనపడుతున్నది.

"... ... ... ... కాటిదరివెచ్చగ మార్చుచు గూరుచుండి నీ
లలిత మనోహరాకృతి నిలాతలమందున బారజూడ బొ
గ్గులమసి భగ్నశల్యములు గోచరమయ్యె నికేమి చెప్పుదున్"

ఆహా! రతిజుగుప్సల కెంత సమీప వైధర్మ్యాన్ని తెచ్చినాడు! *వాఙ్మయములో చిరంజీవిత్వము పొందినాడు! తర్వాత, క్వాచిత్కముగా తప్ప ఈయన యెక్కువగా వ్రాయలేదు. 14 సంవత్సరాల తర్వాత ద్వితీయ భార్యాప్రోత్సాహముతో, వార్ధక్య చిహ్నముగా వెడలిన 'నెరసిన వెంట్రుక'లతో, ఈయనకు మళ్ళీ కవితా జ్యోతి పునరుజ్జ్వలమై 1942 సంవత్సరము ప్రారంభించి మళ్ళీ వ్రాయటము మొదలుపెట్టాడు, "పలితకేశం" (భారతి, 1942 జనవరి, ఫిబ్రవరి) చాలా హృదయంగమముగా ఉండి, ఆయన కవిత్వానికున్న సహజ గుణాలతో ఒప్పుతూ, మళ్ళీ ఈయన నవ్యసాహిత్యములో తన యథాస్థానము తీసుకుని భాషామతల్లి నర్చిస్తాడనే ఆశ భావుకులకు కలగజేస్తున్నది. దీనిలో అనర్గళధార, భావనచేత స్వల్పవస్తువును విస్తరించడము. మృదువైన హాస్యము, తత్వోపదేశము, మొదలైన ఆయన కవిత్వానికిఉండే సహజగుణాలు నశించలేదనీ, ఉద్బుద్ధాలైతే వెనకటి నిశితత్వముతో రాగలంత నాటుకుని ఉన్నయ్యనీ గట్టి పడుతున్నది. ఇంకా అనువృత్తిగా చాలా వ్రాసే ధోరణికూడా గోచరిస్తున్నది. 'గులిస్తా'ను భాషాంతరీకరించినట్టుకూడా వింటున్నాము. ఈయన 'ఫారసీ' చదువుకున్నాడు. 'ఖయ్యాము'ను 'పానశాల' అనే పేరుతో మాతృకను చదివి తెనిగించినాడు. అలాగే యిప్పుడీ 'గులిస్తా'ను కూడాను. 'పలిత కేశం'లో మదరాసు బీచి వర్ణనవంటి స్వాభావిక రమణీయ వర్ణనలు చాలా అరుదుగా ఉన్నవి ఈ కాలము వాటిలో! ఈ విధములో దువ్వూరు కవిలోని కవితా ప్రాశస్త్యాన్ని గ్రహించినాము.

నోరి నరసింహశాస్త్రిగా రప్పటికే "సోమనాధ విజయ" మనే నాటకము రచించి ప్రచురించినాడు. ఇది మహమ్మద్ గజినీ సోమనాథ దేవాలయ ముట్టడిని కీర్తించిన కావ్యము. ఈ గ్రంథము మీద విమర్శనలో ఉన్నదీ వాక్యము.

భగవంతుడు దీనరక్షకుడే యయినప్పటికీ, నిరంకుశులగు మహంతులు, అర్చకులు, భాగ్యవంతులు, మొదలగువారి మూలమున దేవాలయములో బంధింపబడి పేదవాండ్లకు అందుబాటులో లేకుండుటను పలుమారు చూస్తూ వచ్చిన గ్రంధకర్త హృదయావేదనయే యీ నాటకమును రచించుటకు పురికొల్పినట్లున్నది".

---

* రతి జుగుప్సగామారినది! ఈయన తన వియోగాన్ని ఉదాత్తదృష్టితో చూడగల ఔన్నత్యము అప్పట్లో కోల్పోయినాడు. 'ఉల్లమున తత్వబోధ కాలూనగలదె?' అని చెప్పడముతో ఈయన భావనాశక్తికి పరమావధియైపోయినది. ఉన్నతస్థానము పూర్తిగా చేరలేకపోయినాడు. దుఃఖాన్ని కూడా సుఖముగా భావించలేక పోయినాడు!

చూచినారా కర్తగారి ఈ తిరుగుబాటభిప్రాయము. నాటకము చాలా హృదయంగమముగా ఉంటున్నది. రచనలో నరసింహశాస్త్రిగారు, నైతికధర్మాల నుంచుకొని వ్రాసేవాళ్ళలో ఒకడు. చెప్పేదికూడా చక్కని సరసశైలిలో లలితభావాలల్తో, చెప్పగల సమర్థుడు. ✻ కొమాండూరు కృష్ణమాచార్యులుగారు అప్పటికే సిద్ధ హస్తత్వం చూపుతున్న కవికుమారుడు. ఆయన "కుసుమాంజలి" అనే పేరుతో ఒక ఖండకావ్య సంపుటి ప్రచురించినాడు. ◆ఈయన్ను గూర్చి అప్పటి విమర్శకులు వ్రాసినారు ఈక్రింది వాక్యాలను :

"విషయాను గుణ్యమగుశైలి నవలంబింపగల సమర్థు డీ కవి -- ఇంత కఠినముగా వ్రాసిన కలమే యెంత కోమలముగా మార్దవముగా మేఘమునకు స్వాగతమిచ్చుచున్నది!"

ఈయన చక్కని శైలిలో ఔచితిని సంపూర్ణముగా నిర్వహిస్తూ, నవ్యభావభూయిష్ఠమై రసవంతములైన కావ్యాలను రచియించగల సమర్థుడు,వీరేగాక వీరరాఘవస్వామిగారి కపాలకుండల యిప్పటికే వ్రాసి ప్రచురించినాడు. ఈ కాలానికి వారి దృష్టిలోనే నవ్యమార్గములో సాధనచేసి ప్రోత్సాహము లేని కవుల పట్టికలు

---

✻ ఈయనకు కర్ణాటభాషా పరిచయము కూడా ఉన్నది ఈయన 'మహిషాసుర మర్దనము' అనే పేరుతో ఒకగొప్ప గ్రంథము రచిస్తున్నట్లు వినికిడి. ఈయన 'గీతమాలిక' తర్వాత ప్రకటింపబడ్డది 'నేటి ఆంధ్రసాహితీలోకములో సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యాలను విశేషముగా జీర్ణించుకొన్నవాళ్ళలో ఒకడు' (వా సో.ప్రతిభ. సం.6 సం 1) పాపము ! ఈయనవి అనేక కావ్యాలను తగులబెట్టించి పుణ్యము కట్టుకున్నాడు సభాపతిగారు. చూడండీ క్రింది గీతము ·

'రూపుమాత్రపుఁ బూలెన్నొ రూపునాసి
పోయిననెకాని పిందెపూల్ పుట్టబోవు
పిందెలెన్నియొ నాశంబు నొందిగాని
పూర్ణఫలమొండు నిలువగాబోదు లతను'

ఈయన ఒకమారు తనసహజ సరళప్రకృతికి తాత్కాలికముగా స్వస్తిచెప్పి 'నీరోపాట'ని ఒక బీభత్స ఖండకావ్యము రచించినాడు. అది చదివితే కవి కృత్రిమచిత్తవృత్తి తెచ్చిపెట్టుకుని వ్రాసినట్టే కనిపిస్తుంది.

◆ ఇంకా సంస్కృతములోనుంచి 'పాదుకాసహస్రము' 'హర్షచరిత్రము' అనే గ్రంథాల నాంధ్రీకరించినాడు. ప్రాకృతములోనించి 'సేతుబంధ' కావ్యాన్ని తెనిగించినాడు. ఈయన్ను నిద్వత్కవి అనవచ్చు. పూర్వపు పండితులలో నవ్యత అలవడ్డవారిలో ఒకడు ఇది చాలా అరుదు!

ఇచ్చినారు సాహితి పత్రికలో :-

'ఆధునిక కవులలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, అబ్బూరి రామకృష్ణారావుగారు, చిలుకూరు కామేశ్వరరావుగారు, పాతూరి అంజయ్యగారు, బసవరాజు అప్పారావుగారు, పాటిబండ అప్పారావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, నండూరు సుబ్బారావుగారు; (పైవారు సాహితీసమితి సభ్యులు కారన్నమాట) ఇంకా సాహితీసమితి సభ్యులలో, చింతా దీక్షితులుగారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు (1897) దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, నోరి నరసింహశాస్త్రిగారు మొదలగువా రెంతమందియో చిత్తాకర్షములగు కవితలు రచించగల వారుండియు, ప్రోత్సాహపరుచువారు లేక, వారి కావ్యము లనేకములు ప్రకటింపబడకుండుట, నవీనాంధ్రభాషావిదులకు తెలియని విషయము కాదు '

ఈ అనువాదముతో ఒక్క విషయము తేటపడుతున్నది. ఇందులో రెండు 'లిస్టులు'న్నవి ! వాటిలో మొదటి లిస్టులోవారు సాహితీ సమితి సభ్యులుకారని వ్యక్తపడుతున్నది. అటువంటి మార్గదర్శకులగు రచయితలే సాహితీసమితిలో సభ్యులు కాకపోవటము చాలా ఆశ్చర్యము ! దాదాపు వీరినందరినీ - ఒకరిద్దరు తప్ప - నేను కూడా పేర్కొనే ఉన్నాను. ఆకాలములో సారస్వతవీధీ సంచారముచేసే భాషాకుమారులలో వీరు ముఖ్యులు.

## భాష :

వీరి అప్పటి పైవ్రాతలవల్ల రెండు విషయాలు తేలుతున్నవి. మొదటిది, అప్పటి కీ దేశములో వీరికి ఆదరణ సంపూర్తిగా కలగలేదని! ఆంధ్రసాహిత్యపరిషత్తు చాలా బలమైన సంస్థగా ఉన్నది. గిడుగువారి సహాయముతో వీరెంత శ్రమపడినా యింకా దేశీయుల దృష్టి పూర్తిగా వీరివైపు తిరగలేదు. కాని బలము మాత్రము కూరుతున్నది. సుబ్బారావుగారీ' అప్పారావుగారీ నవ్యమార్గాలను రెండింటిని సంచరించేవాళ్ళందరికీ ఒకవిధమైన సోదరత్వము కలిగి వారందరూ సమానమైన భాషాసేవ చేస్తున్నారనే భావము కలగడము రెండవది! ఈ రెండవ విషయము చాలా గొప్పది! ఈవిధముగా ఈ సమ్మేళనములో కృషిచేసినదీ సాహితీపత్రిక. ఈ పత్రికా, సమితీ కూడా ఈ సోదర సాధకత్వము వీరిద్దరి మనస్సులలో కలగచెయ్యడము గొప్ప భాషాసారస్వతసేవ ! కాబట్టి రెండురకాల భాషా (గ్రాంథిక, వ్యావహారిక)

నవ్యులకు పాదేయమేననీ, బావనవ్యతే ముఖ్యమనీ, దీనివల్ల తేలుతున్నది. వీరు మళ్ళీ ఒక్కొక్కరు భాషామతల్లికి నూతనాలంకారాలు కల్పించినారు. ఈకాలప్పు వ్రాతలవల్ల మూడు విషయాలు వ్యక్తమౌతున్నవి. (1) కావ్యము పద్యరూపముగా ఉన్నప్పుడు దాదాపు అందరూ చక్కని సాధ్యమైనంతవరకు చ్యుతసంస్కారము కానిభాషనే వాడుతూ వచ్చినారు. (2) గేయము రచించినప్పుడు వ్యావహారికము కొంద రుపయోగించినట్టు కనపడుతుంది. (3) వచనములోనూ కథలోనూ కొద్దిమందితప్ప బహుళముగా వ్యావహారిక రచననే అనుసరించినట్టు స్పష్టము. ※సాహితీసమితి సభ్యులలో వ్యావహారిక భాషోపయోగములో పట్టుదలకలవాళ్ళ వ్రాతలుకూడా పద్య విషయములో మాత్రమిట్టి పద్ధతినే అనుసరించినవి. మునిమాణిక్యము ఒక గీతములో,

'పాతదన్నది యెల్లను మారుతుంది
కొత్తదానికి చోటిచ్చి తీరుతుంది.'

అని వ్రాసినా ఆగీతమే మిగిలిన భాగాలు చాలావరకు సలక్షణమైన భాషలో ఉన్నవి.

ఎక్కడైనా యడాగమాలు, విసంధి, మొదలైన వాటిలో స్వాతంత్ర్యము వహించినా సామాన్యముగా వీరు భాషాసంప్రదాయాలు వదలలేదనే చెప్పవలె. వేదులవారిని గూర్చి కందుకూరి రామభద్రరావుగారు వ్రాసిన ఈక్రింది వాక్యము గమనించండి :

"వారి భావనాశక్తిబలమైనది. వారు కవిసమయములను విడువలేదు తెలుగు గడ్డను బుట్టి యుత్తమ సాంప్రదాయముల నుల్లంఘించలేదు. వారి భాషకు ప్రాచీనుల పటిమయున్నది"

చూచారా! ఈయన యెంతప్రాచీన సాంప్రదాయాలను గౌరవించినాడో? మునిమాణిక్యం వ్రాసిన, 'పాడినదె పాడుచుంటివి పాతపాట'

---

※ 30-7-40 ఆంధ్రపత్రికలో ఇట్లా ఉంది -

'ఇప్పటివారు ప్రబంధరచనకు పూనుకున్న చందస్సు, వ్యాకరణము, కథావస్తువు రసపుష్టి గమనించి కవిత్వరచన చేయదగు ననియు, లేదా గేయకవిత్వమైన వ్యావహారిక భాష వాడవచ్చు ననియు'

శివశంకరశాస్త్రిగారు

అన్నప్పుడు పాటయొక్క ఆకారముగాక, భావమని అర్థము చేసుకుంటే ఈయనక్కూడా భావనవ్యతేగాని భాషావిషయమై నవ్యతాభినివేశము లేదనే చెప్పనచ్చు. అట్లాగే -

"నాకు మాత్రము నీ గీతి నచ్చులేదు" అన్నప్పుడు కూడాను. చింతా దీక్షితులుగారు వ్రాసిన మొదటిగీతాలలో 'చంద్రార్పణమ'ని ఒకటున్నది. అదిచాలా చక్కగా ఉన్నది. భాషకూడా చ్యుతసంస్కారమని చెప్పటానికి వీలులేదు. మొదటిభాగము గీతము, రెండవది ద్విపద. రెండూకూడా ఒకే విధమైన భాషలో ఉన్నవి! కాకపోతే ఈక్రింది విధముగా -

"ఆడుదము పాడుదము రండు అందరమును" అని విసంధి చేసినాడు. ఇది అంత విశేషముకాదు. యతిప్రాసలను పూర్ణముగా పాటించినాడు. ఈయిన గాకుండా దాదాపు అందరూకూడా చాలా నియమాలు పాటించనే పాటించినారు. గీతాలు సాధన చేసినవాళ్ళుకూడా కొందరు బొత్తుగా ఈవిషయములో యింకా వ్యావహారికభాష నంగీకరించినట్లు కనపడదు :-

"కాశీరత్నం పూసేచోట
పందిరిద్రాక్షలు పాకేచోట
కొండకోనలో
గంగాజలములు
మిలమిలలాడుచు మెఱసేవేళ
కలకలపాడవె, కవితాకన్య !"

పైదానిలో కొడాలి ఆంజనేయశర్మగారు గ్రహించిన నుడికారాలు చాలా హృదయంగమాలుగాఉన్నై! "పూయుచోట" "ప్రాకుచోట" అంటే తప్పక భాషాపారుష్యము కలిగినట్టున్నూ ఇట్లా ఉంటే శ్రవణసుఖముగా ఉన్నట్టున్నూ పాఠకులకు గోచరమౌతుంది. * రాయప్రోలు సుబ్బారావుగారి విషయములో ఈ క్రింది నియమాన్ని చెప్పినారు.

---

* భాషావిషయము వదలితే యితర అన్నివిషయాలలోనూ కావ్యములో గీతము అంతర్భూతముగానే విషయవివేచనము చేసినాను.

"మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి
నార్ద్రనవనీత మార్దవమగును నుడువు
శ్రవణసుఖమిచ్చు సలలితోచ్చారణమున,
భంగిమ యటందురీ పదబంధసరణి."

శ్రవణసుఖ మన్నింటికంటె ముఖ్యము నవ్యులకు. దానినే 'భంగిమ' అన్నారు. ఈ విధముగా నవ్యులందరూ తమ కావ్యాలలో ముఖ్యముగా అనుసరించిన దీ శ్రవణసుఖము. దీనిలో **నవ్యులందరు** దాదాపు సిద్ధహస్తులనే చెప్పవలె! ఈ ఆంజనేయశర్మగారు తమ యితర "పెండ్లికూతురు" మొదలైన అనేక కావ్యాలలో సలక్షణమైన భాషనే వాడినాడు. అంతేకాకుండా యెక్కడా వ్యావహారిక ముపయోగించని గేయాలు కూడా ఉన్నై యీయన కృతులలో! శివశంకరశాస్త్రిగారు తమ కావ్యాలలో సామాన్యముగా సలక్షణ భాషనే వాడినాడు. గేయాలలోకూడా చాలామట్టుకు ఎక్కడయినా తప్ప - చాలా అరుదుగా - సలక్షణమైన భాషనే వాడినాడు. వేదులవారు కూడా తమ గేయాలలో చక్కని భాషను ఉపయోగించినాడని వెనకనే చెప్పినాను. నాయని సుబ్బారావుగారు కూడా చక్కని భాషేవాడినాడు. వీళ్ళూవాళ్ళేమిటి దాదాపు అందరూ పద్యకావ్యాలలో సలక్షణ భాషనే వాడినారు! * గేయాలలో కూడా శ్రవణసుఖము కలగచేసేభాషనే వాడినారు.

కవిత్వానికి మూడు ముఖ్యవిషయాలు. ఈక్రింది ఆంగ్లలక్షణాన్ని చూడండి:

"Poetry is the artistic expression of human mind in emotional and rhythmical language".

దీనిలో మూడంశ లున్నవి:

(1) Artistic expression
(2) Emotion
(3) Rhythmical language

---

* ఇప్పటికింకా పద్య కావ్యాలలో ఉచ్ఛృంఖల భాషోపయోగము చెయ్యడానికి కవికుమారులు వెనుకముందాడుతున్నారు. అట్లా వ్రాసేవాళ్ళున్నా వాళ్ళు వీళ్ళు కలిసి ఒక కుటుంబమనుకునే ఐక్యతే ఏర్పడినది నీళ్ళలో ఇది సాహితీసమితీ పత్రికా చేసిన గొప్పసేవ. ఈ ఐక్యమే నవ్యసాహిత్యపరిషత్తును లేవదీసినది. ఈ సోదరత్వము ఉండబట్టే యీ సాహిత్యాని కింతబలము చేకూరినది.

దీన్నిబట్టి చూస్తే మొదటిదిచిత్తాన్ని, రెండవది హృదయాన్ని మూడవది శ్రవణేంద్రియాన్ని, ఆనందింప జేస్తవి యని తేలుతుంది. లోపలచదువుకున్నా చెవుకు వినపడుతూనే ఉంటుంది. విననే అక్కర్లేదు శ్రవణసుఖము కనుక్కోటానికి. కాబట్టి శ్రవణేంద్రియము, హృదయము, చిత్తము, అనేవి మూడు సుఖపడవలె. ఓటినే వెనక భావ, వస్తువు, రచనలన్నది. భావము హృదయాన్ని, వస్తువు చిత్తాన్ని, రచన శ్రవణేంద్రియాన్ని, ఆనందింప చేస్తై! కాబట్టి శ్రవణసుఖము చాలా అవసరము! శ్రవణ సుఖముకోసము ఒక్కొక్కప్పుడు గొప్ప కవులు కూడా కొంచెము సంస్కారాన్ని వదిలివేసినారు. 'పెక్కుచందాలంబండు' అన్నారు పెద్దన్నగారు మనుచరిత్రలో!* అవి పూర్వ కవి ప్రయోగాలంటారు మన పెద్దలు! అట్టిదే మరొకరు చేస్తే 'యేడిశావు' లే అంటారు! ఈ విధమైన శృంఖలాబద్ధులు కాకుండా శ్రవణసుఖాన్ని సహాయముగా చేసుకుని నవ్యకవికుమాళ్ళు పాడడము చాలా ప్రశంసించదగిన విషయము! ఈ దశాబ్ద ప్రథమవర్షాలలో § పంద్యారము వెంకటసుబ్బయ్య. కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు, పెనుమర్తి వెంకటరత్నం ◆(కొడవటిగంటి వెంకటసుబ్బయ్య పూర్ణశర్మలవలె) చాలా అభివృద్ధికి రాదగి, చక్కని ఫక్కీలో వ్రాయడము మొదలు పెట్టి అభివృద్ధిని సూచిస్తూఉన్న దినాలలో పరమేశ్వరుడు చెట్టును కొట్టివేసినాడు! ఉద్రేకము చాలా ఎక్కువగా ఉండేది! భావముతో పొంగి పొర్లుతూ ఉండేని గీతాలు. ‡ చాలా వృద్ధికాముడు!

---

* 'అల్లికజిగిబిగీ, ముద్దుపలుకూ, పదగుంఫనమూ' కూడా అన్నిటికంటె ముందు శ్రవణసుఖమిచ్చే మిగిలిన రసాదుల నుత్పత్తిచేసి ఆనందింపచేస్తై. 'రోసీ రోయదు' 'లేదుండగా' 'ప్రక్షింపకాబోయచే' 'అంతా మిథ్య' మొదలైన ధూర్జటికవి ప్రయోగాలయొక్క హృదయంగమత్వానికి ఈ శ్రవణసుఖమే మూలాధారము.

§ ఈయన ఇప్పుడు ధూళిపూడిలో తెలుగు పండితసభలో ఉన్నాడు. ఈయన రచన ఎప్పుడప్పుడు పుస్తకరూపముగా వచ్చినాయి.

◆ జననము 1907 - మరణము 1930.

'రత్నాపణ'మనే పేరుతో ఈయన వ్రాసిన కావ్యాలు ప్రకటితాలైనై. ఈయన సోదరుడు కామేశ్వరరావుకూడా ఒక సాధకుడే.

‡ నేను 1922-23 సంవత్సరాలలో 'విద్యార్థి' అనే పత్రికను బెజవాడలో సంపాదిస్తూ ఉండేవాడిని! అప్పుడు వెంకటరత్నముగారిని అడిగింది తడవుగా పద్యాలు పంపించినారు. చాలా ఆనందించి వందనాలతో ప్రచురించినాను. అటువంటి వెంకటరత్నము లేనిలోటు చాలా సంవత్సరాలదాకా అనుకుంటూ వచ్చాము!

'శ్రీ వెంకటరత్నముగారు భావుకులగు యువకులు. వీరిది తెనాలి. వీరి సరస రచనము ఆంధ్రవాఙ్మయ వధూటికి నూత్నాలంకారములు.' (భారతి: ప్రమోదూత భాద్రపదము)

వీళ్ళుగాక యికమిగిలిన సాహితీసమితి సభ్యులు కాని వాళ్ళల్లో నండూరు బసవరాజులు తప్ప దాదా పందరూ సలక్షణ భాషనే వ్రాసినారు. ఈ యిద్దరిలో బసవరాజు అటూ యిటూ కూడా వ్రాసినాడు. లక్షణభాషకాక, వ్యావహారికమూగాక, కేవల జానపదభాషను గ్రహించి ఆ తరములో సిద్ధిపొందినవాడు నండూరు ఒక్కడే!

## భావ నవ్యత:◆

'నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవేర్జయతి'

అని అన్నాడు గదా మమ్మటుడు! కవిసృష్టి విలక్షణము. ఇట్లా లాక్షణికుడు చెబుతూఉంటే ఈ వైలక్షణ్యానికికూడా కంచె వేసినారు మనవాళ్ళు కొందరు. లక్షణానికి అవస్థగాని వైలక్షణ్యానికి వైవిధ్యమే! అంటే మనవాళ్లొప్పుకోరు. ఈ వైలక్షణ్యాన్ని సాధించటానికి మనకవులు - మన కవులేకాదు యితరజాతి కవులుకూడా- తమకనుకూలమైన కొంత సామగ్రిని ఏర్పాటుచేసుకున్నారు. కొన్ని ఉపమానాలూ, కొన్ని కవిసమయాలూ, కొన్ని విలక్షణమైన హంసల్లాంటి పక్షులూ, కోకిలా వసంతాల లాంటి సహజమైత్రిగల అంశాలూ మయూర సర్పాలవంటి సహజ శత్రుత్వముగలవీ, కమలములాంటి కొన్ని పుష్పాలూ, సూర్య చంద్రోదయాస్తమయాదులూ, శృంగారాదులైన రసాలూ, యిటువంటి కొంత సామగ్రిని సేకరించుకున్నారు.*

◆ ఇప్పటి మన నవ్యులు కొందరు అప్పటి పాశ్చాత్యకవుల గ్రంధములు చదివి నట్టు వీరి వ్రాతలవలన తెలుస్తుంది. ఎందుచేతనంటే యుద్ధానంతరము అక్కడ వచ్చిన కవిత్వగుణాలు చాలామట్టుకు మనవాండ్ల వ్రాతలలో కూడా అనువృత్తాలైనై "Despair and concomitants - satire and irony; realism, matter of factness. ....; and as a substitute for idealism, escape into a world of fantasy and fairy." (నిరాశ, దానితోకూడా ఉండే అధిక్షేపము, వక్రోక్తి, యధాదర్శనము; నిజమైన భావనకుమారుగ భావోన్మాదము.) ఇవి మన నవ్యులలో బాగా కనపడతవి!

* ప్రకృతిలో అనంతవస్తువులున్నై. కాని వాటిలోనించీ యేరుకోవడంలోనే ఉన్నది కవిప్రతిభ అతనికి సహజముగాఉన్న సంస్కారాన్నిబట్టి యీ సామగ్రిలో తనకు సహకారులైనవీ, ఉత్తమమైనవీ, అగపడతవి. వాటితోనే భావన కలిపి వాటికి హ్లాదైకమయతను కల్పిస్తాడు. అన్ని వస్తువులు కవితాసామగ్రి కాగలవా అనేది ఒక ప్రశ్న. కోలెరిడ్జి అనే ఆంగ్లవిమర్శకుడు రెండువిధాలుగా భాగించినాడు. "Poetic thoughts and thoughts translated into the language of poetry "

ఇవేగాక పరుషభావాలకూ, సరళభావాలకూ, ఉపయోగించే పరుషసరళశబ్దసామగ్రి కూడా ప్రతి కవీ తన కనుకూలమైన దాన్ని సేకరించుకుంటూ ఉంటాడు. ఇవన్నీ అసలు కవియొక్క ప్రత్యేక చిత్తవృత్తిననుసరించి ఉండవలసినవి. కాని ప్రబంధ కాలములో వీటిలో కొన్నింటిని మొదటి ప్రబంధకవులు చాలా ఎక్కువగా ఉపయోగించినారు. వాటిని వ్యక్తిత్వము లేకుండా తర్వాత వాళ్ళందరూ అనుసరించినారు. అదే అలవాటైనది. దాన్ని భరించలేనివాళ్ళను మనవాళ్ళు తిట్టడము మొదలుపెట్టినారు. అటువంటి భావదాస్యమునించీ కవిత్వాన్ని తప్పించడము యీ నవ్యులు చేసిన ఒక గొప్పపని. వీళ్ళలో ఎవరైనా వెనకటి సామగ్రినే వాడదలిస్తే వీళ్ళ నిషేధమేమిలేదు. కొందరు ఆ సామగ్రినే వాడినారుకూడాను కాని ఒక్కటే సూత్రము. ఎట్లాఅయినా తీసుకురానీ నవ్యతా, సౌలభ్యమూ తెస్తేచాలు! ఒక్కొక్కప్పుడు సౌలభ్యము కొరవడ్డా నవ్యతమాత్రము అవశ్య సంపాద్యము. ఈ నవ్యతకొరకు యీ ప్రాత సామగ్రిలో కొన్ని యేరుకొనడమేగాకుండా కొంత నూతన సామగ్రి కూడా సేకరించినారు యీ నవ్యులు. వస్తువులనుచూచే దృక్పథములోనే ముందు కొంత భేదమున్నది వెనకటి వాళ్లకూ నవ్యులకూ† వస్తువుల క్రిందఉండే పునాదిభావాలూ, వస్తువుల అన్యోన్య సంబంధమూ వానిలోఉండే అంతరార్థమూ, మనస్తత్వమూ, హృద్గతమైన భావాలూ, వాటియొక్క భిన్నతా, వీటిమీద నవ్యులకు ఆధారము. అన్నిటికి తమ హృదయమే ప్రమాణము.

## ప్రకృతి:

అన్నిటికంటె మొదట వీళ్ళను బాహ్యాంతర ప్రకృతి ఆకర్షించినది. ఎందుచేత? ఈక్రిందిది సుబ్బారావుగారి అభిప్రాయము:-

"కానబడ కనుమానప్రమాణమునకె
అంది యందని పరతత్త్వమవలనుంచి,
పంచభూత దృశ్యంబైన ప్రకృతియొకటె
సన్నిహితలక్ష్యమనియె వచస్వి నేడు."

† "In the poetry of all of them (Romantic Poets) there is a sense of wonder, of lite seen with new sensıbilıties, and fresh vision" - for Evans

ఇది కొందరికి. మరికొందరిలో ఈ ఉపాసనా, అంతర్ముఖత్వమూ లేకపోవడముచేత యీప్రకృతిని ఉన్నదున్నట్టుగ్రహించి అందులోనికి తమభావాలను దూర్చటము మొదలుపెట్టినారు. మానవులకు సుఖదుఃఖాలు సహజాలు. ఒక రకము సాధకులకీ సుఖ దుఃఖాలు సహజాలై అభేద ప్రతిపత్తికలవి:-

"జంతువుల జన్మవర్ధనా స్తమయమ్ములను
ఆద్యసూత్ర మానందమే యగును కవికి"

అందరూ యిటువంటి చిత్తవృత్తి కలవాళ్ళనటానికి వీలులేదు. నాయనిలోకూడా యీచిత్తవృత్తి కనపడుతున్నది నాయని సుబ్బారావు వ్రాసిన "సౌభద్రుని ప్రణయయాత్రలో"

"ఇది పగులునను భయ మ్మింతవరకు
ఈ తలంపున నానందమిపుడు పొంగు" అన్నాడు.

పగిలిపోయిన పడవచక్కలను "పాథోనిధానమ్ము నీదునప్పుడూ" "పయోధిగర్భమున రత్నరథము కట్టునప్పుడూ" "చితికి కాష్ఠములుగ మన్నించు నప్పుడూ" ఉపయోగింతువని, ఆ ఆనందానికి కారణము చెప్పినాడు. శరీరము పోయినా ఆత్మ శాశ్వతము కాబట్టి చెక్కలుపయుక్తాలే అవుతవి! చెక్కల సమ్మేళనమైన పడవ పగలవచ్చు ! కాని చెక్కలకెట్టి భంగమూలేదు. కాబట్టే నిర్భయానికి కారణము! మృతిఅంటే భయములేకపోగా ఈయన కానందమని చెప్పుతున్నాడు! ఈయన "నిత్యక్రీడ"కూడా యిటువంటి భావములోనే ఉన్నది.

కృష్ణశాస్త్రిగారున్నాడనుకోండి. ఆయనకు సుఖదుఃఖాలలో సుఖాంశ కంటె దుఃఖాంశ ఎక్కువ. ఇందుచేత ప్రకృతిలో అంతటా దుఃఖమే ఎక్కువగా కనబడుతుంది:

"అమలమోహన సంగీతమందు హృదయ
దళనదారుణ రోదనధ్వనుల విందు"
"ఏడ్వలేక ఏడ్వలేక ఏడ్చుచుంటి"
'ఎడతెగని యాత్రనిట్లు సాగింపలేక
ఏడ్వగాలేక కృశియింతు నేనొకండ'

---

* "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తియః" అన్నాడు కాళిదాసు
"స్వస్యచ ప్రియమాత్మనః" అన్నాడు ధర్మాన్ని మనువు.

పై మొదటితరగతి వారికి దుఃఖములో సుఖమే గోచరిస్తుంది. రెండవ రకమువాళ్ళకు సుఖములోకూడా దుఃఖమే గోచరిస్తుంది. ఆ దుఃఖాంశ ఒక్కొక్కప్పుడు కరుడుకట్టి స్వభావమై పోతుంది. ఒకవేళ సుఖాంశ వచ్చినా అది అత్యల్పకాలస్థాయి. చూడండి:

"కన్నీటికెరటాలలో" 'వెన్నెల'
"నిట్టూర్పులో నెత్తావి"
"ఫెళ ఫెళార్భటులలో" 'మెరుపు'

ఇది ఒక ప్రకృతిదృశ్యము. మరొక* ఆయనకు ప్రకృతిశేషము. తాను శేషి. కాబట్టి తా ననుభవించే విషయము! మరికొందరికి తమ కోరికలకు దోహదమిచ్చే సహకారి! కొందరికి తమ తాపాన్ని అభివృద్ధిచేసే ఒక కృతకశత్రువు. కొందరు ఈ ప్రకృతిలో లీనమైపోతూ ఉంటారు.

"ఏ నొక సమీరబాలుడ నీ ప్రసవము
నాకు సమభాగినిగ కూర్చినా డతండు,
మా పరస్పరమును స్పర్శమాత్రమునన
పులకితబ్రహ్మపథమున బోవగలము." (గిరికుమార)

ఈయన రాయప్రోలువలె కేవల దర్శనమాత్ర, భాషణమాత్ర సుఖమే కాకుండా కొంచెము ముందుకు పోయి స్పర్శసుఖము కూడా వాంఛిస్తున్నాడు.

' లలిత కోమల సౌరభోజ్వలసుమాళి
జెలగు వనముల సుఖ మపేక్షించు నెవడు,
అల్లిబిల్లిగ లత లల్లి చల్లనైన
చలువపందిళ్ళ గోరునే సజ్జనుండు,
అత డెరుంగు మహానంద మనగ నేమొ'
అరయు నాతండె సంతృప్తి యనగ నేమొ'
'అతడె నిజముగ ధన్యాత్ముడనగ నొప్పు
నపరిమిత సౌఖ్యములదేలు నృపులకంటె' - సుబ్బన్నాచార్యులు

---

* 'వెక్కివెక్కి రోదింతును విసువు లేక
విరతి లేక దుర్భరశోకవిషమగీతు
లేడ్చినైతు ఎలుంగెత్తి యేడ్చినైతు' (Gloom, hopelessness)

'కృష్ణశాస్త్రి పాపము నిజముగా బాధపడి వ్రాస్తాడో లేక భావించివ్రాస్తాడో! ఆ విషాదకవిత్వము ఆయనకు చెల్లినది. కృష్ణపక్షములో కంటే 'ప్రవాసము ఊర్వశి'లోని శాస్త్రినిచూస్తే 'అపిగ్రావారోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్' అనుకుంటాను'' అన్నాడు హనుమదింద్రగంటి.

ఈయనకు ప్రకృతి సంపూర్ణ సౌఖ్యమిచ్చే శేషి. విశిష్టాద్వైత సిద్ధాంతానికి ఒక మెట్టు తక్కువ! ప్రకృతిమానవుల కున్న యీ సంబంధాన్ని పరమేశ్వరుడికీ మనకూ వర్తింపచేస్తే అదే విశిష్టాద్వైత సిద్ధాంతము. కాబట్టి ఈయన అనుభవముద్వారా ఆనందము పొందవలెనని కోరేవాళ్ళలో ఒకడు!

'సహజసౌందర్యసద్వస్తుచయము జూచి
పరగ మది నుబ్బి సమ్మోదబాష్ప వారి
కణము లొలికింపని యతండు గణనసేయ
కడిది కలుబండయే యగుగాని నరుడె' పంద్యారము

ఈయనకు ప్రకృతి హృదయాన్ని కరిగించే వస్తువు. ప్రకృతిని చూచి ఆనందించనివాడి నెట్లా తిడుతున్నాడో చూడండి! కాని ఈయనకు ప్రకృతిలో ఉన్న అన్ని వస్తువులూ ఇట్లాగే సహజసౌందర్యముతో కనిపిస్తాయా? అన్నిట్లోనూ ఈ హాయి ననుభవిస్తాడో లేదో?

'అలరు చక్కదనంబు దయావిహీన
మయిన, నది నిష్కలంకమై, హానికరము,
కానిచో దాని గాంచుటకంటె జగతి
కాముకున కిష్టతర మేమి గలదు చెపుమ?'

ఈయన కాముకుడు కాబట్టి ఈయనకు ప్రకృతిలో చక్కదనమున్నా ఒక్కొక్కప్పుడా చక్కదనములో దయలేదు. దీనిలో ఉండే పవిత్రత కాముకుడికి ఆటంకము.

'ప్రత్యుషఃపుల్లనీరేజ ప్రసనమందు
హర్ష సంగీతమును షట్పదాళి పాడె,
రాగ మెడలిన తనదు వియోగగీతి
చలితపత్రాళి వెలిదాల్చె **కలువపూవు**' పెనుమర్తి

ఈయనకు ప్రకృతి సుఖ దుఃఖోభయమయము. ఈ విధముగా ఒక్కొక్క

---

'దేవులపల్లివారి దివ్యమౌ దుబ్బా
కదిలిస్తే చాలూ కన్నీటిజాలూ' అన్నాడు పిల్లలమఱ్ఱి కవికుమారుడు.

కవికి తచ్చిత్తవృత్తి ననుసరించి ప్రకృతి కనపడుతూ ఉంటుంది. * మొత్తముమీద ఈవిధముగా ప్రకృతిమీదికి దృష్టి సంపూర్తిగా మళ్ళినది కవికుమారులకు. ఈ ప్రకృతి కొందరికి సరళగానూ, కొందరికి పరుషగానూ కనబడుతూఉంటుంది. అది కూడా వీళ్ళ చిత్తవృత్తి ననుసరించేఉంటుంది. వీళ్ళు మొత్తముమీద ప్రకృతి రసానుభవము చేసినవాళ్ళనటములో ఎట్టి అభ్యంతరము లేదు! ◆ వేదులవారు, చూడండి ఏమన్నారో!

'తృణము తృణమున శాంతి విరిసెను
దిక్కుదిక్కుల కాంతి మెరసెను'

ఈయన ఒక్కొక్కప్పుడు,

"ఈ వ్యధాక్లిష్ట జీవితకావ్యమునకు
నంతిమాశ్వాస శాంతిసమాప్తి యెపుడో?".

అని భావములో కలిగియేడ్చినా, మొత్తముమీద ఆమెను మృదుల బంధములో చేర్చాలని తోస్తూ, శాంతీ కాంతీ కనపడుతూన్నే వుంటాయి. † పైన నేను మనవిచేసినవి

* కొందరు ప్రకృతిని దర్శించి పసిపిల్లలు ఆనందించినట్లుగా ఆనందించి, ఉన్నదిఉన్నట్లుగా వర్ణిస్తారు ప్రకృతిలోని పదార్థజాలాన్ని కొందరు కవులు యింద్రియ సంబంధమైన వ్యామోహాన్ని పొంది ఆమె బాహ్యసౌందర్యాన్ని అభినందిస్తారు వస్తువు కనుగుణమైన ప్రకృతిస్థితిని తీసుకుని నేపథ్యచిత్రణంచేస్తారు కొంతమంది. ఉపమా రూపకాలంకారాల కుపయోగించుకొనీ అంతతో ఆమెకు స్వస్తిచెబుతారు కొంతమంది. ప్రకృతిలోని అతీంద్రియమైన శక్తిని గ్రహించి జగదేకమాతగా పూజిస్తారు కొంతమంది." (వా.సో. ప్రతిభ. సం. 6 సం. 1.)

◆ 'భావకవులందరూ అంతో యింతో ప్రకృత్యుపాసకులే! ఏ విషయాన్ని విస్మరించినా యీ కవుల ప్రకృతి కావ్యాలుమాత్రం ఉదాత్త భావబంధురములై, ఉత్తమములై, ఆంధ్రవాఙ్మయానికి శిఖరప్రాయములుగా వున్నవనడములోసాహసం గానీ అత్యుక్తిగానీ యేమీ లేదు'

(పాటిబండ మాధవశర్మ)

† ఆషాఢ మేఘానంతరము శరదుత్సవము శాంతినిస్తుంది దేవులపల్లి వారికివలె మోహన సంగీతములో రోదనధ్వనులు వినపడవు. ఇదివరకు చిత్తవృత్తి యింతే ! కాని యిటీవల కొంతమార్పు కనపడుతున్నది. 2-11-40 కృష్ణాపత్రికలో "దీపావళి నాడు" లో విషాదము కనపడుతున్నది. లోకమంతా సంతోషిస్తూంటే యీయన హృదయములో "అణచుకొనియున్న ఘోరదుఃఖానలమ్ము" రగులుకొన్నదట! "గొంతువిప్పి లోలోన కుమిలికుమిలి యేడ్చినా" యెడద పగిలిపోలేదట! తాత్కాలికముగా కాకుండా తాను "శైశవమాదిప్రేమ స్మశానమన"ని చెప్పినాడు!

ఆ కవుల సామాన్య చిత్తవృత్తులు ! ఒక్కొక్కప్పుడు వీరికి కూడా కొంత అశాంతి, నిరాశ,✻ భయము, కష్టము అనేవి మనస్సులోనికి రావచ్చు. వచ్చినా అసలు చిత్తవృత్తికి సహజమైన ప్రకృతి వచ్చేటప్పటికి యథాప్రకార ప్రకృతి కలిగి పోతుంది. ఈ విధముగా ప్రకృతిలో నటించి తత్సాన్నిధ్యమువలన తమ హృదయాలలో కలిగే "స్వానుభవభాష్యాలను" విప్పిచెప్పి † తద్వారా ఊసరక్షేత్రాలకుకూడా ఒక విధమైన దోహదము చేసినారు. ఈ విధముగా ప్రకృతిని అర్చించేవాళ్ళూ, అనుభవించే వాళ్ళూ, చూచి ఆనందించేవాళ్ళూ, తన్మయులై పోయేవాళ్ళూ అయి, ప్రకృత్యంతస్సును తమరు గ్రహించినదాన్నీ, గ్రహించగలిగినదాన్నీ, గ్రహించినా మనుకున్నదాన్నీ, మా కందచేసినారు! ప్రకృతి అంతలీల కలది. ఒకళ్ళకు పూర్ణముగా అందేదా? అంతే గాక శివుడంత చిత్తసంస్కారము కలవానినీ, అంతర్ముఖునీ, జితేంద్రియునీ, లోబరుచుకొని వశుడుగా చేసుకున్నది! కాని తత్కాలానికి వశుడైనట్టు కనపడ్డా, తుదకు ప్రకృతిని తానేయేలిన మహానుభావు డాయన! శివ శక్త్యైక్యమైతేనేగాని సృష్టిలేదు! అలాగే యీ కవి కుమారులుకూడా తమతమ జీవశివులతో బాహ్యప్రకృతిని మేళవించి కావ్యసృష్టి సాధించినారు! ప్రకృతి తత్కాలానికి వాళ్ళకు వశమయిపోయినట్టు కనపడుతుంది! ◆

---

✻ వేదులవారి 'ప్రవాసి" మొదలైనవి

† 'కొందరు ఆధునికుల ఖండికులలో ఆత్మపరమైన రహస్యప్రపంచము సంజ్ఞారూపకమైన నిగూఢానుభూతి, ఉత్కృష్టరసోద్దీపకములైన భావచిత్రాలూ పాదులేర్పరుచు కోగలవని చెప్పవచ్చు."
మల్లవరపు, భారతి 1939 ఏప్రిల్

"The Poet is he who sees life newly, assimilates it emotionally, and contrives to utter it musically," Buchanan,

◆ "They [Romantic Poets] all had a deep interest in nature, not as a centre of beautiful scenes but as an informing and spiritual influence on life .. ....... They all valued their own experiences to a degree which it is difficult to parallel in earlier poets ........., The Romantic Poets look into themselves, seeking in their own lives for strange sensations ... .. This strangeness of the individual experience leads each of the romantics to a spiritual loneliness. - I for Evans

# *ప్రణయము : సామగ్రి

ఇక వీళ్ళ కవితాసామగ్రినిగూర్చి కొంచెము మనవిచేస్తాను. వీళ్ళలో చాలా మందికి ప్రణయమే వర్ణనీయవస్తువు. ఈ ప్రణయాన్నే ప్రకృతిలో చూస్తూఉంటారు. ◆రాయప్రోలుగారికి యీ ప్రణయము ప్రపంచమూలసూత్రము.మిగిలినవాళ్ళకుకూడా ప్రణయభావమే ముఖ్యము. దీనిలో సుబ్బారావుగారికి అమలిన శృంగారమంటే అభినివేశము. కాని మిగిలినవాళ్ళకు విప్రలంభ మెక్కువ ప్రీతిగా కనపడుతుంది. సంయోగమే లేని విప్రలంభము కొందరికీ, సంయోగానంతర విప్రలంభము కొందరికీ, ఊహావిప్రలంభము కొందరికీ, ప్రియముగా కనపడుతుంది.*, ఈ ప్రణయానికి వీళ్ళుకూడా ఎంత పూర్వులను తిట్టినా, పవనకుమారునీ, చంద్రాతపాన్నీ, కోకిలగానాన్నీ, శారదరాత్రులనూ, నదీసైకతాలనూ, లలితకుసుమాలనూ, వాటిలో పరిమళాన్నీ, చిన్ని ముద్దులనూ, మురళీరవాన్నీ, సహకార వృక్షాన్నీ, వసంతశోభనూ, మావి చిగుళ్ళనూ, శాద్వలాలనూ, - యీ విధముగా లెక్కించడానికి మొదలుపెడితే

---

* నవ్యకవులకు ప్రత్యేకమైన **కవితాసామగ్రి** ఉన్నదని అందరికీ తెలుసును. నోరి నరసింహశాస్త్రిగారి ప్రతిభలోని వ్యాసము ఈ భాగమున కుపకారమైన వాట్లో ఒకటి. చూ' ఆధునిక కవిత్వము ' ప్రేమ - అన్నపేరుతో వేమూరి వెంకటరామనాధం వ్రాసిన వ్యాసము (ఆంధ్రశ్రీ)

చూ. 'సాహిత్యము - శృంగారము' - పిల్లలమఱ్ఱివారి 'సాహిత్యసమీక్ష'

◆ 'గిరికుమారు'నికి వేరేవస్తువే లేదు! ఈ పేరు పెట్టుకొని వ్రాసినది విశ్వనాధ

* రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు పూర్వులకూ ఆధునికులకూ భేదము చెప్తుతూ పూర్వులు తమ కెంత వైరాగ్యము-న్నట్టు కనపడతారో, సమయమప్పుడు అంత భోగవాంఛ వాళ్ళవద్ద కనపడుతూ ఉంటుందనీ, వా ళ్ళు ఆ వాంఛను తీర్చుకోటానికి కావలసిన **శరీరమనోదార్ఢ్యాలు** కలిగిఉంటేవాళ్ళనీ ఉగ్గడించి, ఇప్పటివాళ్ళకు దుర్బలత్వంచేతనో,చిత్తైకాగ్ర్యరాహిత్యము చేతనో ఆ పట్టుదల లేక సంపూర్ణముగా అనుభవించే శక్తిలేకుండా దుర్బలులై ఉన్నారనీ చెప్పినారు! ఇది సత్యమువలెనే కనపడుతుంది. ఈ కవి కుమారులు కొంతమంది ప్రేయసిని చూస్తేనే చాలనేవాళ్ళూ, కొందరు చూచి చేతగానితనంచేత ఆనదించుకోలేక వాపోయేవాళ్ళూ, మరికొందరు పైచేష్టలచేతనే తృప్తిపొందేవాళ్ళూ, ఇంకా కొందరు వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకుని దుఃఖించే వాళ్ళూ, యిట్లా పరిపరివిధాలుగా కనపడతారేగాని, వచ్చినఅవకాశాన్ని వశముచేసుకుని అనుభవించి **'తృప్తాఃస్మః'** అనుకునేవాళ్ళొక్కళ్ళూకూడా కనపడటంలేదు. [no climax] ఆధునికుడిది భ్రమరవృత్తి ! నిలకడా లేదు! సంపూర్ణానుభవమూ లేదు!

అంతులేదు - వాళ్ళ ప్రణయసామగ్రిగా చేసుకున్నారు. ప్రణయసామగ్రిని ఏదో విధముగా, అనేక భంగులుగా కీర్తించడములో మాత్రము చాలా హృదయంగముగా గానముచేసినారు.

"పవనపులకిత చంద్రాతపప్రఫుల్ల
చారుశారదయామినీ సమయమందు"
"మంజుకుసుమామృతములోని మధురిమంబు."
"ప్రకృతి పులకింప యమునాస్రవంతి పొంగ"
"అనుకూల్యంబుతో శారదానిలమ్ము"
"చారుచంద్రకరస్మేర కైరవమ్ము" - వేదుల

ఈ విధముగా ఈయన సామగ్రి యిట్టిది. దుఃఖము పల్లవిగా చేసుకున్న కృష్ణశాస్త్రిగారు :

"పొడుపుచెలికడకొ? సంజపడతికడకొ?"
"సౌరభము లేలచిమ్ము పుష్పవ్రజంబు?"
"చంద్రికల నేల వెదజల్లు చందమామ!"
"మావిగున్న కొమ్మను, మధుమాసవేళ
పల్లవము మెక్కి కోయిల పాడనేల?"*

---

ప్రేయసిని 'అన్యత్రానురాగం' లేకుండాచేయగల శక్తీ, సామర్ధ్యమూ అనేకులకు లేదు అందుకనే వెనకటివాళ్ళకు ప్రేయసి స్వాధీన! వీళ్ళకు స్వచ్ఛంద! అందుకోసం ఒకప్పుడు వీళ్ళుకూడా స్వచ్ఛందులు కావలసివచ్చినది! ఇది సరిగా ఇప్పటి యువతీయువకుల చిత్తవృత్తి! ఉభయులకూ వివాహమంటే గిట్టదు! తుదకు యే కొద్దిమందోతప్ప 'భుజాశ్లేషబంధన' మనుభవించినవాళ్ళుకూడా ఎక్కువగా కనపడరు! ప్రేయసిని ఏమీ చేసినా క్షమించి స్త్రీకి అత్యంత స్వేచ్ఛనిచ్చినారీ నవ్యులు ఆమెకు స్వాధీనులైపోయినారా అనిపిస్తుంది 'కామ్యవాదిని' యగు మోహపుబొమ్మగా మెలగిన స్త్రీ నవ్యకవిత్వములో 'ప్రేమజీవన విభాతకైశికీగీతిగా' 'ఆశాపథాంతరాళపారిజాతముగా 'తపఃకల్పవల్లిగా' "పరిఢవించినది" (వంగల శ్రీరామావధాని, ఆంధ్రపత్రిక, 7-12-41) ఇది కొందరి అభిప్రాయము. వీళ్ళలో కొందరిలో ప్రణయాన్ని త్రోసిపుచ్చి ప్రేయసి యితర స్థలాలకు వెళ్ళినా, కొన్నాళ్ళుండి మళ్ళీవచ్చినా క్షమించగల మనశ్శాంతి ఉన్నది "ప్రేయసి అట్లాచేస్తే నేనుమాత్రంచేస్తేయేమి" అనే వికల్పమూ మొదలైనవి కూడా కొందరిలో కనపడతై. భావోన్మాదులై "నాకుకూడా యెప్పుడైనా సౌఖ్యానిస్తూంటే చాలనే' మనస్తత్వముకూడా కొందరిలో కనపడుతూ ఉంటుంది

* "చంద్రికాశీతల మనోజ్ఞ జాలకముల"

ఎంతదుఃఖించేవాళ్ళకు్కూడా కొన్ని ఆనందఘటిక లుండకుండా ఉండవు! ఒకవేళ అట్లా పైకి కనపడుతున్నా హృదయము చూస్తే తప్పక ఉంటవి ! వాళ్ళకట్టు, బొట్టు, జుట్టూ, యితరచేష్టలూ బాహ్య చిహ్నాలు ఆంతరానికి. కాబట్టి ఒక్కొక్కప్పుడు చిహ్నాలు ఆంతరానికి. కాబట్టి ఒక్కొక్కప్పుడు వీళ్ళ గీతాలలో వీళ్ళు చెప్పిన దుఃఖమంతా తెచ్చిపెట్టుకున్నట్టు కనపడుతుంది !

దాని గానము నచ్చకపోయినా కోయిలనే తన గానవస్తువుగా గ్రహించినాడు మునిమాణిక్యం :

"మెక్కి మావిచిగుళ్ళను మిక్కుటము
పాతపాటలనే యేల పాడెదీవు?
కొత్తపోకట నీకడ నుత్త దకట"

పాప మీయనకు వసంత నవనవోన్మేషత్వము మనస్సుకు రాలేదో! పొడకట్టలేదో! ఈయనకు పొడకట్టకపోయినా యీయన వ్రాతలలోమాత్రము పాఠకులు "క్షణక్షణనవ్యతాగోచరత్వం" మాత్రము అనుభవిస్తున్నారు? ఇక నోరి నరసింహశాస్త్రిగారు:

"బింబఫలముల బోలు నీ పెదవు లెపుడు
లీనమై పోతివీ దివ్యగానసుధను"
"రూపమాత్రపు పూలెన్నో రూపుమాసి"
"పచ్చనిబయళ్ళనడుమగా బయలువెడలి"

ఈ విధముగా కొందరు ఈ వెనకటి సామగ్రినే గ్రహించినారు. "అనుతాపం" "ఆశ" "కాంక్ష" "ఉత్కంఠ" యిట్టువంటి శృంగారరససామగ్రిని, సాత్విక-సంచారభావాలనే తీసుకుని *గీతాలను రచించినారు వేదుల మొదలైన అనేకులు. ములుగు చంద్రమౌళి గారు "చైత్రలక్ష్మి" అనీ, "చంద్రార్పణ" మని చింతాదీక్షితులు గారూ, "తరంగమాలిక"ని పూర్ణశర్మగారూ, "శరద్రాత్రి" అని చామర్తి రాజశేఖర రావుగారూ, "విప్రలబ్ధ" అని కొడాలి ఆంజనేయ శర్మగారూ' "స్వాధీనపతిక" అని సుబ్బన్నాచార్యులుగారూ, యీ ప్రకారముగా పూర్వసామగ్రినే గ్రహించి వ్రాసినారు. ఋతువులూ, వాటిలో కలిగే ప్రకృతిభిన్నతా, మొదలైనవి కొందరికి కవితాసామగ్రి అయినవి.

---

* ఇప్పటికీ కొందరా సామగ్రిని అవలంబించినారు. వింజమూరి శివరాం ఒకడు. ఈయన వ్రాసినవన్నీ రేడియోద్వారా కూడా ప్రచారము పొందినవి!

"సభాపతి" గారు "పుష్యపూర్ణిమ"ను గ్రహించి వ్రాసినారు. కొందరికీ ప్రణయము రతిగానో, భక్తిగానో, సఖ్యముగానో కనపడి ఆ విధముగా కీర్తించినారు. "ప్రేయసీ" అని దేవులపల్లివారన్నారు! "తల్లిని" కీర్తించినారు నోరి నరసింహశాస్త్రి నాయనీ. "హరీంద్రకుమారుడ'నే శీర్షికక్రింద మైత్రిని గానముచేసినాడు శివ శంకరశాస్త్రిగారు. ఈ సందర్భములో వారి యామైత్రీ కీర్తనములోనుంచి కొన్ని ఉదాహరణాలిస్తాను :

"ఏలనో గాని నిన్ను వీక్షించినంత
బ్రాణములు లేచివచ్చినపగిది నుండు"
"ఏమి యీ ప్రేమ తెలియదోయీ కుమార
ప్రాక్తనభవమ్మునందలి బాంధవమ్మొ?"
"కానగ వచ్చి స్వప్నముల గ్రమభవద్వదనారవిందమ
న్యానముగా ముదంబొసగుచున్నది కొన్ని దినాలనుండియున్"

తుది రెండు పాదాలూ కొడవటిగంటి వెంకటసుబ్బయ్యను గూర్చి చెప్పిన గీతములోవి! ※ ఈ విధముగా వీళ్ళసామగ్రి పూర్వత్వాన్ని బొత్తుగా విడవలేదు. ఈ వస్తుసామగ్రి వెనకటివాళ్ళకు రసానికి సహకారైన సామగ్రిఅయితే, వీళ్ళకది 'విషయ' రూపముగా మారినది. ఇది సమంజసమే! వెనకటితరములో మొత్తముమీద రస

---

※ సుబ్బారావు గారీసఖ్యాన్ని ప్రణయశిరస్సుగా గ్రహించినాడు. తృణ కంకణములో చివరభాగమంతా దీని కీర్తనమే!

"కనుల నొండొరులను చూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజన గొనుటకన్న
కొసరి '**యేమోయి**' యని పిలుచుకొనుటకన్న
చెలుల-కిలమీద నేమి కావలయు సఖుడ?

ఈ సఖ్యము ఈయనకు అకారణము, అవ్యాజము, స్వార్థరహితము. కొందరు నవ్యుల ప్రణయానికీ ఈయన ప్రణయానికీ మాలిన్యమే భేదము. గురజాడ అప్పారావుగారు కూడా దీనిని తిలకించినాడు కొంతవరకు.

'మగడు వేల్పన పాతమాటది; ప్రాణమిత్రుడ నీకు" (కాసులు – గురజాడ)

దృష్టిగాని, అంగాలమీద (అవయవాలు కావు) అంతగాదృష్టి పడలేదు. ప్రకృతిని, సౌందర్యాన్ని, భావాలను విడదీసి పరీక్షించే కాలములో ఇట్లా ఉండడము సహజమే!✻

# పదజాలము :

ఇక పదజాలాన్ని ఎత్తుకుంటే కొంత వెనకనే ఈ విషయము వచ్చినది. పదాలు లేకుంటే కవితాసామగ్రి ఉంటుందా? పదాలచేత ప్రతి సామగ్రిని నిర్వచించ వలసినదేకదా? సందర్భోచితపదజాలము వీళ్ళనాకర్షించినది. ఈ విధమైన వాక్చిత్రాలే వీళ్ళు నిర్మించినది. చక్కని నుడికారము. ఒక్కొక్కప్పుడు అర్థగాంభీర్యాదులు లేకపోయినా పదాలు చక్కగానూ, లలితముగానూ, ఉండి శ్రవణ సుఖాన్నిస్తవి. మళ్ళీ వెనకటి శ్రవణసుఖమే సేవ్యమైన దిక్కడ కూడా ! ఈ కవుల వ్రాతలు చూస్తే - కొందరు - తెనుగు నుడికారాన్నీ, జాను తెనుగుపదాలనూ, దేశ్యాలనూ ఎక్కువగా గ్రహించి వాడినట్లు కనపడుతుంది. ఇది భాషకు వీరిలో కొందరివలన కలిగిన గొప్ప ఉపకారము. కొందరీ శబ్దసమ్మేలనసందర్భములో కొంత నవ్యత కనపరచినారు. వెనక మనమానందబాష్పాలనో దుఃఖబాష్పాలనో యెరుగుదుముగాని 'విశ్వాసవిరక్తిబాష్పా'ల నంతగా ఎరగము.◆ ఎందుకంటే సుఖ దుఃఖాలనే వెనకటి వాళ్ళు తలచినారు. కాని "సఖ్యా"న్ని అంత ఎక్కువగా వాళ్ళు కీర్తించలేదు. ఒకవేళ కీర్తించినా అన్నిరకాల బాష్పాలనూ "ఆనందాశ్రువుల" క్రిందికే తెచ్చి కీర్తించినారు. మరిన్నీ సువర్ణరజతకంకణాల నెరుగుదుమేగాని" తృణకంకణ"మెన్నడైనా విన్నామా?

---

✻ నేటికవులు ఎపుడూ రసానికి ఆశ్రయములుగా ఉండే ప్రేమ - విరహము హాసము - రోషము - మొదలైన విషయాలనే తీసుకుని కావ్యాలు వ్రాస్తు ఉన్నారు'

(ఇంద్రగంటి, భారతి 1939 మార్చి)

"సకియ ! విశ్వాస బాష్పముల్ చాలు నాకు,
లేదు వే రాసప్రణయవల్లీమతల్లి! "

◆ "మామకీన ప్రణయ మధుకణముల
విడిచెడు, విరక్తిబాష్పముల్ విడుచుపోల్కి"

ఈయన తర్వాతవాళ్ళకు ఇటువంటివి యింకా సులభముగా కనపడ్డవి! ※ ఆదోవలో కొన్ని నూతనాలుకూడా కనిపెట్టినారు! వాటినికూడా గ్రహించినారు. ఆదిలో 'ప్రేమతపస్విని' ఒకరు వ్రాస్తే తర్వాత మరో ఆయన 'ప్రేమసన్యాసులు' అన్నాడు. ఒకాయన "తృణకంకణ" మంటే మరొక ఆయన 'తృణశయ్య'ను పేర్కొన్నాడు. *f* కొన్ని స్థలాలలో వీళ్ళ శబ్దజాలము చాలా హృదయంగమముగా ఉంటుంది. కాని విడదీసి అర్థము చెప్పబోతే చెయిజారిపోతుంది అర్థము ◆ వీళ్ళ నుడికారాలలో ఒక విశేష మిది. 'పదముల అన్యోన్యమైత్రీ కల్పనము'లో అనగా 'శయ్య'లో వీళ్ళు చాలా ప్రవీణులు. వీళ్ళను వెనకటి రీతివాదులలో చేర్చవచ్చు! కాని రీతి ఏకదేశమే గాని రసగోళముకాదు. మరీ ఈరీతి రాయప్రోలువారి చేతులలో పరిణతి పొందినది. 'పేశలరాగలాలిత స్వాంతదళీపుటంబులు' అశ్రుకణికా వ్యాసంగము' 'ప్రాణప్రబంధాశ్వాసాంతము' † 'ఆశాభంగ కరోరశస్త్రికలు' 'బాష్పజ్ఞాన విద్యార్థి' "పూలసంకెళ్ళు" మొదలైన అసంఖ్యాకాలైన పదబంధాలిట్టివే! కొందరిలో యీ పదబంధాలు కొంచెమింకా పొడుగై, జటిలాలైపోయినై. కృష్ణపక్షకర్తవి కొన్ని చాలా పొడుగైన, గౌడీపదబంధాలు. ఈయన వ్రాతలు ఆంధ్రమహామహుల హృదయాలలో 20 యేడ్లనించీ ఉన్నవి. అనేకయువకుల జిహ్వాగ్రాలమీద నటిస్తున్నవి! మచ్చుకు రెండు అనువదిస్తాను:

"ప్రబల నీరంధ్రాభ్రజనిత గాఢధ్వాంత
నిబిడ హేమంతరాత్రికుంతలములలో - చుక్కేలా?"
"క్షుభితమృత్యుకఠోరవికట పాండురశుష్క
వదన దంష్ట్రాగ్నిలో - నవ్వేలా?"

---

※ కృష్ణశాస్త్రిగారికి "వీక్షణపరిమళములు" వచ్చినై
"నేత్రపానము" మొదలైనవి పాతలే!
"ప్రత్యూషహర్మ్యాంగణాంతము" (మల్లవరపు)

*f* "తృణ నిశయ్యా"అన్నాడు చాలా పూర్వమే భర్తృహరి.

◆ చివరకు మాటలన్నీ అర్థమైన భావము గోచరించకుండా చెప్పే కవిత్వానికి కూడా వారే (రాయప్రోలువారు) అక్కడక్కడా దారి చూపించారు." (నోరి నరసింహశాస్త్రి)

† "అంతిమాశ్వాసకాంతి సమాప్తి" (వేదుల)

ఇంతమాత్రముచేత ఈయన సులభముగా వ్రాయడనటానికి వీల్లేదు. వ్రాస్తాడు! వ్రాసినాడు! అయితే యిక్కడ ఇట్లా వ్రాసినాడేమని ఒక ప్రశ్న! పై రెండుదాహరణాలు చూస్తే అందులో పరస్పర విరుద్ధ విషయాలు ఏకకాలావచ్ఛేదకాలుగా ఉండటం పేర్కొనబడినది. ఈ విరుద్ధ విషయైకదేశవర్తిత్వము ప్రకృతిసిద్ధము. ఒకవంక దుఃఖము, అందులో క్వాచిత్కసుఖము! దుఃఖము జటిలము! సుఖము సరళము. అట్టి సందర్భాలలో కర్కశభావమూ. వస్తువూ కర్కశమైన పరుషాక్షరదీర్ఘసమ్మేళనముతో వర్ణిస్తేతప్ప రసవత్తకలదు. సుఖాంశ ఆనందకరమూ, స్వల్పకాలవర్తిని, కాబట్టి హ్రస్వపదాలతో వివక్షితమైనది. "చుక్క" "నవ్వు" రెండూకూడా సరళ వస్తువులే! ఈ పరుససరళవస్తువులు వైధర్మ్యమూ, అయినప్పటికీ యేక దేశవర్తిత్వమూ, చక్కగా శబ్దజాలరూపముగా హృదయంగమముగా స్ఫురింపజేసినాడు కవి. కృష్ణశాస్త్రిగారు తమ అంతులేని దుఃఖాన్ని ఒక్కొక్కప్పుడు దీర్ఘసమాసన భూయిష్ఠమైనశైలిలో ప్రతిబింబింప జేసినాడను కుందాము. వేదుల కూడా కొన్నిచోట్ల ఎందుకు దీర్ఘముగా వ్రాసినాడు? దానికి

---

ఇటువంటి పదబంధాలు, చాలా మందిలో ఉన్నవి. దేవులపల్లి, వేదుల, మొదలైనవాళ్ళల్లో చాలా చూపించవచ్చు విశ్వనాథవారిలో ఇవి చాలా గంభీరాలు, క్లిష్టాలు, అయిపోయినవి.

ఈపదబంధాల, మీద 'పారడీ'గా పిల్లలమఱ్ఱి కవికుమారుడు దేవులపల్లి మీద వ్రాసినది చూడండి:

అతడు- చటుల ఘోర గంభీర భీకర కుటిల
నిబిడధ్వాంతపటల ప్రకట
నిటలమ్ముతో
ఆపె- లులిత కల్లోలినీ సలిల చలిత లలిత
దళిత కోమల నలినీ సమాన
నయనమ్ములన్
అపుడు- అనంతభావాంబరవీధీ
విహరణోద్రిక్త హృదయ
విన్యాసియై
అద్దుకొన్నాడు
సుద్దువిన్నాడు. -ఆంధ్రవిశ్వవిద్యాలయ సంచిక

కారణమడగటానికి వీలులేదు. ఒక్కొకప్పుడు సరళభావాలుకూడా దీర్ఘసమాస బంధాలలో వస్తవి.

"అరుణ రాగోదయోన్మీలితాంబుజమ్ము
చారుచంద్ర కరస్మేరకైరవమ్ము
పవన పరిరంభ పులకిత ప్రసవచయము"

ఈపాదాలలో ఉల్లేఖించిన వస్తువులు చాలా సరళమైనవి. అందమైనవి. హృదయంగమమైనవి. "సూర్యుడు" "చంద్రుడు," "గాలి", వీటితో సహజమైత్రిగల "కమలం" "కలవ" "పుష్పం." చక్కని వస్తుసమూహము! అకారణ సహజమైత్రీ సమ్మిళితము! దీర్ఘ సమాసాలతో చెప్పడమెందుకూ-అనకూడదు! అట్లా అనటానికి మనకధికారము లేదు! వచ్చినై. కవికుమారు డేమిచేస్తాడు.* వెనకటి కవికుమారులు పెద్ద సమాసాలు వ్రాసినప్పుడు మన నవ్యులు వాళ్ళనాక్షేపిస్తూ ఉంటారు. ఇతరుల ననడమేకానికవి భావపూర్ణ హృదయము మనము చెప్పినట్టు వింటుందా? అందుచేత దుఃఖకాలములో "ఇటువంటి ద్రావిడ ప్రాణాయామములో యేడ్చాడా" అనడముచాలా తెలివితక్కువ!◆ సహృదయు డనవలసిన మాట కాదు. పైన వైధర్మ్యసహితముగా దుఃఖమెంత జటిలసమాసరూపముగా కవికుమారుడి హృదయగర్వములోనుంచి వచ్చినదో కృష్ణశాస్త్రిగారి వ్రాత చూసినాము. ఈ సమాసము చూడండి. 'హతవిధిక్షుభిత ప్రధమానురాగ రేఖాపరిభూత యౌవనసుఖ స్పృహలన్' (వేదుల) ఇటువంటివి సహృదయులకే కొంచెము కష్టము కలిగిస్తవి. కాని వాళ్ళకుక్కూడా అసహజాలుగా కనపడవు 'మెల్లిఁగసుపుడ్తత్వాలకు' కనపడవచ్చు! వాళ్ళకు నా సానుభూతిని అందజేస్తున్నాను!

---

* జటిలంగాఉన్నా కర్కశత్వము లేదు! సరళపదాలలోనే వచ్చినవి!

◆ "కవిత్వమందరికీ అర్థమయ్యేటట్లుగా వ్రాయాలంటే ఎవ్వరు వ్రాయిలేరు 'ఓచతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక అని వ్రాయడమెందుకు? 'ఓ! బ్రాహ్మణుడా' అనినగాని, 'ఓ ప్రవరయ్యా' అనిగాని వ్రాస్తే చాలదా అంటే, శ్రీశ్రీ చెప్పినట్టు ఆ 'mood' అనేది యిప్పటికవులకే గాక అప్పటి వాళ్ళకు కూడా ఉన్నది ఆ పటీరాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్' అని సిద్ధుడిచేత చెప్పించినాడంటే ఆపట్టున అట్లా వ్రాస్తేగాని ఆ అందము రానేరాదు. ఆసమాసము ఎందుకు వేసినాడో ఆ శిల్పాన్ని గ్రహించలేనంతమాత్రాన అది పనికిరాదనటము వివేకము కాదు'

విశ్వనాధ-ఆంధ్రపత్రిక 22-9-40)

## కవిసమయాలు, అలంకారాలు :

వీళ్ళుపయోగించే కవిసమయాలనూ, అలంకారాలనూ కొంచెము పరామర్శిద్దాము. వీళ్ళకు కవిసమయాలంటేనూ, అలంకారాలంటేనూ, నైరాశ్యమని మొదటమొదట చెప్పుకునేవాళ్ళు. ఇటువంటివి ఉపయోగించకపోవటమంటూ ఉండదు. ఎందుకంటే వాటి ఉపయోగము మానవప్రకృతిలోనే ఉన్నది.✻ ఒక కవికుమారుడంటాడు ·

"స్తనభారమున నృత్యమొనరించు కౌనున
బంగరొడ్డాణంబు బహుచిత్రగతి గ్రాలన్"
"ఆశ్రోణిపర్యంతవిశ్రుతశిరోజరా
జితశోభనాంగియై ... .. ..."                - సుబ్బన్నాచార్యులు

పై రెండలంకారాలు ఎంత ప్రాతవో చెప్పడానికి వీలులేదు! అధమం వెయ్యేండ్ల వయస్సున్నది వీటికి? ఈక్రింది వేదులవారి గీతములో

'ఒంటిగా వేడిని
ట్టూర్పు లెగబోయుచును,
జంట దొరగిన పడుచు
చక్రవాకి విధాన'

కవి సమయము కూడా వాల్మీకి అంతప్రాతది!

'పెదవు లెడనేసి దంతకౌముదులు పర్వ'
'బింబఫలములబోలు నీ పెదవులెపుడు'
'అబ్ధిగర్భోలద్భుడబాగ్ని శిఖల'

చూచినారా కవిసమయాలంటే వీళ్ళకు యేవగింపు పైకేకాని, అసలు హృదయములో లేదని తేలుతున్నది.† ఇటువంటి దృష్టాంతాలు అనంతముగా

---

✻ "ఇప్పటి కావ్యాలలోనూ ఉపమాది అలంకారాలు లేకపోలేదు. కాని వాటిని చెప్పేవిధానము కొత్తగా ఉండవచ్చు"                (ఇంద్రగంటి, భారతి 1939 మార్చి)

† 'వౌనలచ్చి మనిపించు నా యెంకి' అన్న నండూరివాక్యముకూడా యిట్టిదే ఇట్లాగే బ. అప్పారావులోనించీకూడా చూడవచ్చు!

'కలువరేకుల నీ కన్నుగవ కరంగ'                - మల్లవరపు

చూపించవచ్చు. వెనకటివాటిని గ్రహించడమేకాకుండా నూతన కవిసమయాలనూ, అలంకారాలనూ కొన్నిటిని సృష్టించినారు.

"పుడమిపడంతి కోడెతనపుంజిగినా మొలకెత్తు పచ్చికన్" ఇది రాయప్రోలువారి ఉత్ప్రేక్ష. కాని స్త్రీకి "కోడె" జిగి తెప్పించి నాడు. ఆమాటకు 'యౌవనమునకు సంబంధించిన' అని అర్ధము

."పగబట్టు పామల్లె"*

చెప్పుకోవలె నండూరు; అన్నాడు వెంకివెంబడివెళ్లే ప్రియుణ్ణి! ఎంత రసవంతమైన ఉపమానము! భావములోనూ, ఆకారములోను కూడా సామ్యము! లోతుకు దిగితే కొంచెము వైధర్మ్యము కనపడుతుంది! కాని అలంకారాలు ఆపాతతః విషయగ్రహణసాధకాలై ఆనందింపచేస్తై!

వేదులవారివి ఈ క్రింది పాదాలు:

'కట్టుచీల్చిన ధారుణీగర్భమందె
కోమలాంకురముల నాటుకొనెనుగాదె'

ఈయన అర్థాంతరన్యాస ముపయోగిస్తున్నాననే భావమున్నదో లేదో! పడిపోయినది!

'తొలకరిపాటపాటజడితుంపరలన్ పైపై గ్రసింపగా
దలచి బలాకలున్ ... ... ..'

కవిసమయసహితాలంకారము కూడాను, పైది! ఈవిధముగా ఉదాహరణ లియ్యవచ్చు. మొత్తముమీద వీటి నన్నిటిని చూస్తే పిండితార్థముగా తేలే దేమిటి? 'వెనకటివాళ్ళు వీళ్ళను నిందించడమూ, వీళ్ళు వాళ్ళకంటె పొడిచి గెలిచామనీ' అనుకోడమే కాని దాదాపు వెనకటి వాళ్ళ సామగ్రిని, పదాలను, సమయాలను,

---

* 'పదలు తెల్లనిత్రాచు పడగలా విరిసింది'
'ఏటికడుపున దాగి ఏటనిదురోయింది'
'పతిగుట్ట మొగిలితోడుః'
'పోనుపో స్వచ్ఛమై తేరుకొన్న మనోహరుని ప్రేమపోలిక'
'తదుత్త సమాధి మృత్తికన్' -ఇవి మచ్చుకుమాత్రమే!

అలంకారాలను ఉపయోగించినారు. కాని వాటి సమ్మేళనములోనూ, యేరుకోడము లోనూ, దృక్పథములోనూ, భిన్నత్వముచూపి కొన్ని నూతన కల్పనలు చేసినారు. ✻ ఈ కాలములో నూతనపదజాలము వచ్చి భాషను విశాలము చేసినది. నాగరికతతో కూడా నూతన భావాలు ఆవహిస్తున్నాయి. కాబట్టి ఆభాషను ఆభావాలను తెల్పడములో గ్రంథము నూతనమైనది! ఇదొకవిచారానికీ, నిరసనానికీ పాత్రమెప్పటికీ కాదు! తిక్కనాదులకంటె శ్రీనాథాదులు నూతనత్వము చూపలేదా? అంతకంటె నూతనులు వీరేశలింగము పంతులుగారు! రాయప్రోలువారు ఈ నూతన సంఘర్షణయొక్క పరిణామము. ఆయనదోవకూడా పాతగిలుతున్నట్టు కనపడుతున్నది. ఈ నవ్యత సహజముగా మెట్లెక్కివచ్చినట్టె కనపడుతున్నదిగాని హఠాత్తుగా ఆకాశమునుంచి పడ్డదని అనుకోడానికి ఎంతమాత్రము వీలులేదు.◆

## గ్రథనము :

ఈనవ్యతారహస్యాన్నీ వెనకటి లాక్షణికుడు నిర్వచించనే నిర్వచించినాడు. చూడండి :

> 'త ఏవ పదవిన్యాసాః తాఏవార్థ విభూతయః
> తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్'

వీళ్ళు నూతన పదాలను సృష్టించినారా? లేదు. కాకపోతే వ్యావహారికముగా ఉన్న కొన్ని పదాలనూ మరికొన్ని పరభాషాపదాలను సారస్వతములోనికి చేర్చినారు.

---

✻ నోరి నరసింహశాస్త్రిగారిట్లాగన్నాడు ఒక చోట: 'ఈ లోకములో చిత్రమేమంటే పాతదే మళ్ళీమళ్ళీ కొత్తగా కనపడుతూ ఉంటుంది. అటువంటి నూతనత్వమే ఈ కాలపు తెలుగుకవిత్వములో ఉన్నది.' ఇది సమంజసమే! 'క్షణే క్షణే యన్నవతాముపైతి' అన్నప్పుడు లాక్షణికుని దృష్టి యిదే!

'పూర్వాలంకారికులు చెప్పిన మార్గాలకు ఇప్పుడవలంబించే మార్గాలకు వివరాలలోనే భేదంగాని అసలు ప్రధానంలో లేదు. ఎప్పుడూ అట్లాంటి భేదములేదు. ఉండదుకూడాను.'
-- విశ్వనాథ : ఆంధ్రపత్రిక, 27-9-40

◆ 'కాబట్టి నేటికాలపుకవిత్వము కొందరన్నట్లు భాషరాని అపండితుల అర్థము లేని గోష్ఠికాదని కొందరన్నట్లుకేవలము పూర్వకవిత్వముతో సంబంధము లేకుండా పూర్తిగా యిప్పటివారి ప్రజ్ఞావిశేషమువల్ల సృష్టింపబడిన అపూర్వసంపద్రయున్నూ కాదని తోస్తుంది.' - భారతి, 1939 మార్చి

ఈపదాలకు వీళ్ళు సృష్టికర్తలు కారు. ఉన్నపదాలకు ఉన్న అర్థముకంటే భిన్నార్థాలు కల్పించినారా? లేదు. ప్రతీపదానికీ సహజమైన అభిధార్థమూ, అదిపట్టకపోతే ఉండే లక్షణార్థమూ, అట్లాగేఉన్నవి ✳ పోనీ వ్యంజననేమైనా యెక్కువగా వాడి పదాలకూ పదబంధాలకూ నూతనరసవంతమైన అర్థాలను సహృదయులలో కలగ జేసినారా అంటేవీళ్ళలో వ్యంగ్యంకంటే వాచ్యమెక్కువ. అవే పదాలై అవే అర్థాలైతే యిక నవ్యత యెక్కడ ఉన్నది. వాటిగ్రంథనములో ఉన్నది? విశేషమూ నవ్యతాను ఈగ్రంథము కావ్యానికి ముఖ్యము. ఈగ్రంథనమువల్ల పదసమ్మేళనానికి ఒక అపూర్వతా, నవ్యతావస్తున్నది. ఆ నవ్యతే ఇప్పుడీ నవ్యుల నవ్యత! రెండుదాహరణలిస్తాను. సూర్యాస్తమయవర్ణనము చూడండి.

'పశ్చిమాశానికషసువర్ణ రేఖ
లొకటొకటి చెరపుచు బోవుచుండె
గగనదుర్గపు తూర్పు బంగారు తలుపు
తెరవబడియె రేరాజరుదెంచునంచు'◆ - వేదుల

రెండు దిక్కుల రాగము. ఒకటి తగ్గుతున్నది. రెండవది క్రమాభివృద్ధి పొందుతున్నది. మొదటి క్రమక్షైణ్యాన్ని ఒక్కొక్క రేఖనే పొద్దు చెరుపుతూ పోతున్నదనీ, రెండవక్రమాభివృద్ధిని తలుపు తెరచేటప్పుడుండే క్రమముగ చిత్రించడమున్నూ దీనిలో ఉన్న నవ్యత! ఈమాటలు విడివిడిగా మన మెరిగినవే! కాని వీటి సమ్మేళనమువల్ల ఎటువంటి నవ్యత వచ్చినదో చూడండి! ఇంకొకటి :

---

✳ ఇంద్రగంటివారన్న మాటలు చూడండి.

మాటలూ అర్థములూ పూర్వపు వే అయినా. కూర్పు నేర్పువల్ల కావ్యాలను నవ్యములుగా చేయవచ్చునని సాహిత్యవేత్తలన్నారు.' - భారతి 1939 మార్చి

◆ 'తెరచుకొనె తూర్పుతల్పు బంగరు వెలుంగు
దెసల మసిమంప నొ౯వింత తేరుకదలె'

— — — — — — — — — — — —

'గములుగా జిమ్ముకొనుచు చీకటుల పొగులు' - శివరామం

'పక్షివలె నాకాశనిర్మల
పథవిహార స్వేచ్ఛ కోరితి
పక్షములు లేవంచెరుంగక
ప్రాకులాడుచు పొగిలితిన్' ✻ - కృష్ణపక్షము

ఎగరవలెననే కోరికా, రెక్కలులేవని జ్ఞాపకము లేకపోవడము జ్ఞాపకము వచ్చేటప్పటికి అయ్యో అని దుఃఖము! "ప్రాకులాడితి" అనే మాటచేత యత్నము; విఫలత్వము, దుఃఖము, స్ఫురిస్తున్నవి! ఈగ్రథనమే కావ్యానికి రమణీయత నిచ్చేది. ఈ నవ్యతే మన నవ్యకవులు సాధించినది! కాబట్టి వాటికి రమణీయత్వ మొచ్చినది! కావ్యత్వము సంపూర్ణముగా సిద్ధించినది!

# పర్యవసానము :

వెనక వివరించినపేర్ల వాళ్ళలో దాదాపు అందరిని స్పృశించినాను. ఒకవేళ ఎవరైనా ఒకరిద్దగు మిగిలితే వెనక చెప్పినమాటలే వాళ్ళకుకూడా వర్తిస్తవి.

రాయప్రోలు, బసవరాజు, నండూర్ల కవితాస్రవంతి ప్రవహిస్తూనే ఉన్నది. రాయప్రోలు కావ్యాలు ఒకదానివెనుక ఒకటి వస్తూనే ఉన్నై. బసవరాజు "సెలయేటి గానం" అచ్చైనది. మిగిలినవి తయారౌతున్నవి. నండూరు ఎంకిపాటలు దేశమంతా యువకుల నోళ్ళల్లో మారుమ్రోగుతూ ఉన్నవి. అప్పారావుగారి "ముత్యాల సరాలూ" 'నీలగిరి పాటలు' దేశమంతటా పునఃపునః పఠనముచేసి కవికుమారులు వాటి ననుకరిస్తున్నారు. కృష్ణపక్షమచ్చైనది. దేశాన్ని దుఃఖములో ముంచేసినది. వేదులవారి కవితాధారను పత్రికలో చదివి దేశము ఆహ్లాదిస్తున్నది. దీపావళి తయారౌతున్నది. రామిరెడ్డిగారు తమ సహజ కవితా ధురీణాలైన కావ్యాలను

✻ దీనికి మాతృక 1906 ప్రాంతములో ఉన్నది చూడండి పాల్ క్లీ (Paul Klea) అనే ఒక చిత్రకారుడు. "The hero with the wing', అనేది చిత్రించినాడు! దాన్ని గూర్చి విమర్శకుడంటాడు. 'The one-winged human being who yearns to fly and is for ever rising into the air and crashing, martyr, invalid, ... and fool.' (Modern German Art) ఇందు ఒక్క రెక్క. మన దేవులపల్లికి రెక్కలే లేవు! అక్కడ ఎగరడానికి ప్రయత్నము, పడడము సకారణము, ఇక్కడ పక్షాలే లేకుండా ఎగరాలనుకోడము అజ్ఞానమో యేమిటో!

రచించి అచ్చువేయించి ఆనందింపచేస్తున్నారు. కొందరు కీర్తిశేషులై దేశము తమ్ము స్మరించుకునేట్టు చేసి పోయినారు. సభాపతిగారు నూతన మార్గాలనన్వేషిస్తూ తాను స్వయముగా దారి చూపిస్తూ, హృదయేశ్వరీత్యాది రసవద్గ్రంధాలను రచిస్తూ, యీ నూతనోద్యమానికి క్రమక్రమముగా బలము చేకూరుస్తూ ఉన్నాడు. ఈ కాలాంతానికి కొందరికిప్పుడే కవితా జ్యోతి కొంచెము తగ్గుతున్నట్టు కనపడుతున్నది. పైన పేర్కొన్న వాళ్ళలో 1930 తర్వాత కవితా సాధన చేసినవాళ్ళు తక్కువ! శివశంకర శాస్త్రిగారి జ్యోతి యితోధికముగా వెలిగి, తర్వాత తరానిక్కూడా తేజస్సు నిచ్చినది. పింగళి కాటూర్ల కవితాస్రవంతి "సౌందరనంద" కావ్యకర్తృత్వములో వినియోగ మౌతున్నది. వీళ్ళకు ముట్నూరివారి ప్రోద్బలము ఉన్నది. ఈమార్గాన్ని సంపూర్ణముగా అవలంబించలేక బౌద్ధవాఙ్మయముమీదికి దృష్టి మరల్చినారు కొందరు. అరవిందుడి యోగసాధన దీనికి కొంచెము దోహదమిచ్చినది. జాషువా నక్షత్రం క్రమక్రమంగా తేజోవంతం మౌతున్నది. కొడాలి సుబ్బారావుగారు చిన్నతనం లోనే చాలా అభివృద్ధిని సూచించినాడు. కాని పరమేశ్వరు డాయుర్భాగ్య మియ్యలేదు పింగళి నాగేంద్రరావు "నారాజు"ను సాహితి ద్వారానే పూర్తి చేసుకున్నాడు. యువకులు కొందరు లక్షణ శాస్త్రము చదివి యీ నూతన కావ్యాలను సానుభూతితో విమర్శించడము మొదలు పెట్టినారు. వీళ్ళ యీ పని యీ కవితా ప్రచారానికి చాలా సహాయము చేసినది.

**సాహితీపత్రిక** నెంత ఉత్సాహముతో నడిపినా, కవికుమారులు పోషించినా అంతరించటము విచారకరము. ఇంతలో బందరులో "శారద" లేవదీసి కవుతా శ్రీరామశాస్త్రిగారు ఈ నవ్యసాహిత్య స్రవంతికి జాలు కల్పించినారు. అందులో వెనకటివారిలో చాలా మంది సాధన చెయ్యటము మొదలెట్టినారు. పంచాగ్నులవారు సారస్వత రంగములో ప్రవేశించి క్రమముగా ఈ నవ్యసాహిత్యోద్యమానికి బలము చేకూరుస్తున్నారు. ఈ నవ్యసాహిత్యానికి పండితాదరణ లేదనే లోటు చాలా తీర్చారు శాస్త్రిగారు. వీరి సహాయము నవ్య సాహిత్యానికి పెట్టనికోటై ప్రతిపక్షులను నిరాయుధులను చేసినది.

## భావగద్య :

వీళ్ళలో కొందరు 'భావగద్యం' (Prose Poetry) వ్రాయడానికి ప్రయత్నించినారు. ఇట్లు ప్రయత్నించినవాళ్ళలో మునిమాణిక్యం అడవి, విశ్వనాధ ముఖ్యులు. కాని మునిమాణిక్యం మాత్రము పద్యములో గాని యీ భావగద్యములోగాని యెట్టి అభ్యున్నతి పొందలేదు. కధను గ్రహించి దానిలో సిద్ధహస్తుడైనాడు. మిగిలిన యిద్దరూ తర్వాత పద్య గద్య వీధీ సంచారము చక్కగా చేయడములో సిద్ధిపొందినారు! ఒకటి రెండుదాహరణ లిస్తాను. "కవి, ఆనంద"* మనే పేరుతో మునిమాణిక్య మిట్లా వ్రాస్తున్నాడు. "పట్టణములు భగభగమండిపోనీ! ఆకరాళజ్వాలామాలికాచయము, ఆదవాగ్నికీలలు, ఆదావానలోద్భూత ధూమశకలములు, ఆ కాలవహ్ని నన్నానందింప జేయును! నే నాడుదును! వీణాగాన మొనరింపను!" ఎంత బీభత్సము పట్టణాలు మండితే నష్టపడేవాళ్ళు వేరు. అటువంటి దృశ్యము నిజముగా చూస్తే దుఃఖించక ఆనందముపొందేకవి రాక్షసిగాని మానవుడు కాడు! ఆ దుఃఖించే నిజమైన కవివ్రాతలు చదివి ఆనందించేవాళ్ళము సహృదయులము మేము! ఇదేచాలు ఈయన ఈ మార్గములో సిద్ధుడు కాడని చెప్పడానికి తార్కాణము. దుఃఖదర్శనముచేత వాల్మీకికి "శోకః శ్లోకత్వమాగతః". కాని యీ యనకు యితరులబాధతో కలిగిన "ఆనందః శోకత్వ మాగతః"! ఎందుకీ కృత్రిమ చిత్తవృత్తులు. ఈయన పద్యము వ్రాయడము మానివేసినాడు ! బ్రతికిపోయినాము! అంతేగాక స్వభావహాస్య ప్రకృతి అయిన యీయన యిటువంటి ప్రకృతికి తగనివాడు! అడివి :-

'నాకు రెక్కలేయుండినయడల గౌతమీనీచికా నఖశిరంబుల నంటి యంటనట్లు సూర్యకిరణపుంజెలిమి పుట్టు, ఇంద్రధనుస్సులలో నెగిరిపోవువాడ. నే మీనంబనైనచో గౌతమీ స్రవంతికానీల గభీరప్రదేశంబుల నీదుచు, క్రిందికి నింకివచ్చు నీరెండవెలుగుల చెలగాటలాడుచు జలహిమస్పర్శలో పరవశుడనై యుండువాడ :-'

వెనకటి బీభత్సము లేకపోయినా, అంతకంటె లలితముగా ఉన్నా, మొత్తము మీద తెచ్చిపెట్టుకున్న భావనగా ఉన్నదిగాని సహజముగా ఏదోదృశ్యము చూచి

---

* జమ్మలమడక పూర్ణచంద్రరావనే ఒక సాధకుడు భావగద్యను వ్రాయడానికి ప్రయత్నిస్తున్నాడు.

హృదయావేదన పొందినట్లు ఎంతమాత్రం కనపడటము లేదు ! భాషకూడా, మిట్ట పల్లాలుగా ఉన్నది "చెలిమిపుట్టు" అనేచోట "చెలిమిచేతపుట్టు" అని అర్థముచేసుకో వలె! వీచికలకూ సూర్యకిరణాలకూ సంయోగమువల్లకదా ఇంద్రధనుస్సు పుడుతుంది! ఇక్కడో విప్రతిపత్తు! ఆకాశములో ఈ సంయోగము కలిగితేగాని ఇంద్రధనుస్సు పుట్టదు ! ఇలా శాస్త్రదృష్టానికి భిన్నముగా ఉండకూడదు వస్తువు! విశ్వనాథవారిని కొంచెము గమనించండి:

రంగము, కృష్ణానదీతీరము, ఒక యువకుడు, ఒక బిచ్చకత్తె వచ్చినది. 'ఒక బిచ్చపుది! ప్రౌఢవయః పరిపాక ! మేని చినుగుపుట్టముదికి యెన్నేండ్లైనదో? డబ్బులడుగుకొనుచున్నది. ఇచ్చిన వారిచ్చిరి ! లేనివారు లేరు ! ఆమె దీనములైన కనులతో నతనికడకు వచ్చినది. అతడు కనులెత్తి చూచినాడు. ఇద్దరిచూపులు కలిసినవి. ఆమె వదనాంత మనోజ్ఞ రేఖాంతరమ్ముల మన్మధుడు నివాసమున్నాడు. ఆ కనులయందము రతికి తలవంపు.'

కొంత ముచ్చటగా ఉందిది! ఒకవిధమైన అవ్యక్తమధురమైన శ్రావ్యతే కాకుండా, హ్రస్వవాక్య పరంపరలో, వాటిలో సమానాంతాలలో ఒకమధురమైన లయ ఉన్నట్టు గోచరమౌతున్నది. "వదనాంత" "రేఖాంత" పదాలూ, "ఇచ్చినవారిచ్చిరి లేనివారు లేరు." మొదలైనవాటిలో ఒక అవ్యక్త మాధుర్యమున్నది. "మన్మధుడు నివాసమున్నాడు" "రతికి తలవంపు" - యీ నుడికారాలు పద్యాలలో ఉండవలసినవి. అందుచేత పద్యవాతావరణము కలగచేసినవి గద్యానికి. గణాలుగాని, మాత్రలుగాని, లేకపోయినా, ఒకవిధమైన శబ్దసామ్య ముండడమువలన ఆ పదసమ్మేళనానికి కొంత సౌందర్యము వచ్చినది. ఈయన యీ శక్తితర్వాత యీయనవ్రాతలలో కంఠోక్తిగానూ, సహజముగానూ, హృదయంగమముగానూ, రసవంతముగానూ పాఠకులు చూస్తారు, అడివికూడా తర్వాత ఈ మార్గములో సిద్ధిపొందటము సులభసాధ్యము కాదు.

## రచనలో చేసిన కొన్ని మార్పులు :

పద్యాలలోనూ గీతాలలోనూ కూడా కొన్ని మార్పులు కనిపిస్తై ! కొన్ని చూపిస్తాను. ముఖ్యముగా మార్పు కలగచేసిన వాళ్ళలో సభాపతీ, కృష్ణపక్షకర్తా, కూడా ఉన్నారు.

1. సమవృత్తాలలో నాలుగుపాదాలు కాకుండా రెండేసేవ్రాయడము "ఈహామహోపగం దొడరి యీదుచునుండ జలాంగనాస్వయం గ్రాహనిబద్ధ దివ్యతరగాత్రుడవై వసియింతె లోతునన్. ఇది "అజ్ఞాతమిత్రమ'నే ఖండకావ్యవైఖరి, రెండేసి పాదాల నొక వృత్తముగా విభజించినాడు శివశంకరశాస్త్రిగారు. ప్రాస రెండేసికే ఉంచినాడు. ఈరెంటిలో మాత్రము యతిప్రాసలను పాటించినాడు. ఈ ఖండకావ్యశీర్షిక నాకు కొంచెముబాటుండలేదు! కాని కవిగారు బుద్ధిపూర్వకము వైధర్మ్యము గల రెండు భావాలను కలపదలచుకున్నారేమో తెలియదు ఈ పద్ధతి గీతము మొదలైన దేశీయ ఛందస్సులకు్కూడా వర్తింపజేసినాడు.* ధానితో వారి ఉద్దేశ్యము (ఛందోభంగం) కనపడుతుంది. ఈ ఛందోభంగమొక నూతనమార్గము.

2. ఇష్టమొచ్చినట్లు పాదాలను గణనియమముగాని, మాత్ర నియమముగాని లేకుండా విభాగము చెయ్యడము. చూడండీ క్రింది గీతము ◆

| | |
|---|---|
| '1 భయగర్జితములు | 3. ఆకాశమందహాసములు |
| 2. వినవచ్చుచున్నవి | 4. కనవచ్చుచున్నవి. |
| 5 నా హృదయవీణకు | |
| 6 ఒక్కటియె తీగ | 7. ఓ సఖీ |
| 8. నా కవితాదేవికి | |
| 9. ఒక్కటియెపాట | 10 ఓ సఖీ |
| 11. నాకు, | |
| 12 ఒక్కటియె వస్త్రము | 13. ఓ సఖీ |
| 14 నాకు, | |
| 15. ఒక్కడే శ్రోత | 16. ఓ సఖీ |

* * *

* ఈ మార్పులు 1930 వరకు వర్తించేవి. తరవాత యింతకంటె చాలా ముఖ్యమైన మార్పులు కలిగినవి.

'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' చూడండి.

◆ ఇటువంటి విషయములో ఆల్డసుహక్స్లీ అనే ఒక ఆంగ్లవిమర్శకు డిట్లా అన్నాడు:

"Metres whose rhythms ........... are strong, resistant and practically invariable offer the poet a kind of short-cut to musicality. They provide him both a ready-made, reach-me-down music. He does not have to create a music appropriately modulated to his meaning; all he has to do is to shovel the meaning into the moving stream of the mete and allow the current to carry it along -"

17. చీకటిగుహాలో
18. నల్లనినది
19. ఒక్కటి
20. పారుచున్నది
21 దాని
22. రాతిగట్టుపై
23. ఒక్కడు
24. కూర్చున్నాడు
25. సూర్యుడంతవృద్ధుడు
26 అంతకన్నవృద్ధుడు
27. అతడు
28 ఇంద్రధనురంబరముల
20. నేయుచున్నాడు

దీన్నేమనవలెనోనాకు తెలియకుండా ఉన్నది ! దీన్ని స్వామి శ్రీఆనంద ఆచార్య అనే ఆయన వ్రాసినాడు. ఈ విధమైన రచన యిప్పుడు కాలములో చాలా కనపడుతున్నది. ఇటువంటిదానికి పునాది 1923 సంవత్సరములో పడ్డదని దీనివలన తెలుస్తున్నది. ఇది ఇంగ్లాండులో యుద్ధానంతరము వచ్చినమార్పు. ఇదేగాక ఛందస్సును పాటింపక పోవడము శబ్దసామ్యము మాత్రమే పాటించడము (Rhythm) గణవిభజన మీద బొత్తుగా దృష్టిఉంచకపోవడము మొదలైనవన్నీ ఆచారమైపోయినై ఇంగ్లాండులో యుద్ధమైన తర్వాత ! ఈక్రింది వాక్యాన్ని గమనించండి :

"Poets juggled with new words and new forms. They tried new Rhythms in all kinds of combination possible and impossible."

దీన్నిబట్టి పరీక్షచేస్తే సరిగా అట్లానేఉన్నె పైపంక్తులు. పాద సమతను గనక ఆలోచిస్తే 2, 4 పంక్తులు సమాలు 5, 6, 7 ళ్ళు 8, 9, 10 క్రమముగా సమాలుగాఉన్నై! 11, 12, 13 ళ్లు 14, 15, 16 లకు సమాలుగా ఉన్నై ? అక్కడనుంచీ అల్లరి మొదలు పెట్టినది. సమతకూడా, ఉంటేఉన్నది లేకపోతేలేదు. గీతమంతా యిట్లాగేఉంది అంత్యనియమాన్ని చూదాము. 1,3 కలిగిఉన్నవి; 2, 4లు కలిగిఉన్నై? "వీణకు" "దేవికి" విభక్తి సామాన్యము "తీగ" కూ "పాట"కూ అక్షర సంఖ్యాసామ్యము; తర్వాత శబ్దసామ్యము కొంత ఉన్నది. "ఓసఖీ" 4మార్లు "నాకు" రెండుమార్లు వచ్చినవి. తర్వాత మళ్ళీ అడివి. ఈరచన నవ్యములో నవ్యము. ఇదొక నూతన గీతమార్గము.◆

---

"What is that mother?
That, bear, is a wood.
Can we go in?
Yes, if you like.

◆ Metrical confusion

3. దేశీయ ఛందస్సులను వాడటము : గేయాలలో బహుళముగా మాత్రా ఛందస్సునే వాడినారు. ఇతరాలలోకూడా దేశీయాలైన గీతము మొదలైన వాటికే ప్రాముఖ్యాన్ని ఇచ్చినారు. ఒక్కొక్కప్పుడీ ఛందస్సులు సంకరముగా కూడా ఉండటము కద్దు. భిన్న ఛందస్సులను సమవిషముగా ఉపయోగించడము ఉంటుంది. ఈవిధమైన వ్రాతలు చాలామంది వ్రాసినారు. ఆంగ్లములో కొన్ని ఛందస్సు లున్నై ఇటువంటివి. వాటిననుకరించడము మొదలుపెట్టినారు వీళ్ళు.

"చిన్నపూలే వాడెనా ?
        తన
కన్నెవలపుల వీడెనా?
        తన
చిన్నెలన్నియు వన్నెలన్నియు
మున్నులో గోల్పోయెనా?"

ఇది అసమమాత్రాఛందస్సు గల గేయము ! బాగానే ఉంది. తర్వాతది చూడండి.

"కాంతు నెరుగని కన్నెగాదా ?
సిగ్గు వీడని మొగ్గగాదా?
మొన్న మొన్న నె ముద్దువల్లిని
మొసలు దీరెనుగా !"

---

What's this mother
That's a tree, dear.
And this? And this? And this?
All trees dear.
And this?
That's a tree, too, I think only it has run a little wild.
Oh mother, where's the wood gone to?
It is still here, dearest. We are in it;
    but you can't see for the trees."

ఈ ఉదాహరణము ఛందస్సుకు మాత్రమే, పై అనువాదములో "wood" కూ "trees" కీ భేదము చక్కగా తెల్పినాడు కవి.

ఇది మరోరకము ! ఇలా ఛందస్సమ్మేళనము ! "కన్నీటి కెరటాలలో వెన్నెలేలా" అనే గీతములో ఎన్నిరకాల ఛందస్సున్నదో చదువరు లెరుగుదురు! ఈ క్రింది వేదులవారి గీతము తిలకించండి :

తూర్పువాకిటిగూట తొలిదివ్వె వెలిగించి
తొగరు పావడసంజ తొలగిపోయెడువేళ,
"ఒంటిగా వేడి ని
ట్టూర్పు లెగబోయుచును,
జంట దొరగిన పడుచు
చక్రవాకి విధాన
ఈ సముద్రతటాన ఏ సఖునికోసమై
గాసిజెందుచునుంటివో సఖీ ! ప్రియసఖీ !"

ఈ క్రిందిదికూడాను :

"నాలోనె నేడు బృందావనము విరిసినది,
నాలోనె నేడె యమునాతటిని మొరసినది,
ఏ వసంతానిలమొ
ఏ గాన కలకలమొ
ఈ నా యెడదనిండా నిండిపోయినది
ఓ దివ్యగాయకా?
ఓ ప్రాణనాయకా?
ఏది యింకొక్కమా రూదరా నీ మురళి ?"

మనోహర మాత్రాఛందోగానం! ఈవిధముగా అసమపాదాలు గలా, ఒక్కొక్కప్పుడు సమతలేని, ఒక్కొకప్పుడు సమవిషమాలు సామ్యము గలిగీ, సామాన్యముగా అంత్యానియమము ఉండే రచనకు ప్రారంభించినారీ కవికుమారులు. గురజాడవారి ముత్యాలసరాలు చాలా మంది అనుకరించినారు. ఈ గీతరచనము సుబ్బారావుగారు కూడా అనుసరిస్తున్నారు ఇప్పుడు. ఈవిధమైన గీతీ వైవిధ్యము చాలా ఎక్కువైనది. లయప్రధాన మవడము చేత ఈమార్పు ప్రశంసనీయము.

4. చంపువులను బొత్తుగా వదలడము. ఈ కవికుమారులు వెనకటి వాళ్ళవలెగాక పద్యవాక్యాలలో గద్యను బొత్తిగా తీసివేసినారు. ఇది ఒక గొప్పమార్పు.

మనకు మొదటనుంచీ చంపువులుగా ప్రబంధా లుండడ మలవాటు! దాన్ని వీళ్ళు మార్చడము సమంజసము ! ఇది కూడా ఇంగ్లీషు అనుకరణమే !

5. పద్యసంభాషణాలు, పద్యకధలు : వెనక రామిరెడ్డిగారిని గూర్చి చెప్పినప్పుడు పద్యసంభాషణలనుగూర్చి చెప్పినాను. ఈకాలానికి దగ్గిరగానే "కోకిలాకాకం" అనే శీర్షికతో ఒక కవికుమారుడు పద్యకధను వ్రాసినాడు. సభాపతిగారీ దోవన చాలా సాధన చేసినాడు. ఆయన పద్యనాటిక లిప్పటికి దాదాపు 10కి మించినై! పద్మావతీ చరణ చారణ చక్రవర్తి త్యాదులు ఆంధ్రదేశములో యువకుల కందరికీ పరిచితాలే! వాకోవాక్యాలని పద్యసంభాషలనే వేరే పేరుతో వాడినాడు అంబడిపూడి వెంకటరత్నం పద్యకకథలు వ్రాసినాడు రజనీ కాంతరావు, పన్యాల రంగనాధరావుగారలు గేయనాటికలనూ వ్రాసినారు. వావిలాల సోమయాజులుగారు "సౌగంధి కాపహరణము' అనే సంగీత రూపకాన్ని రచించినాడు. రేడియోద్వారా అనేక రూపకాలు ప్రదర్శితాలౌతున్నవి కూడా.

6. పద్యపాదసంఖ్య కంతులేక పోవడము. ఇదేమితప్పుకాదు గాని, పాఠకుడిలో ఒక విధమైన విసుగును కలుగచేస్తుంది కొంత చదివిన తర్వాత. ఇదికూడా ఆంగ్లసారస్వతము మనకిచ్చిన ఊహే!

7. గద్యనాటకాలు, ఒకవంక పద్యనాటకాలు సభాపతీత్యాదులు వ్రాస్తూఉంటే, యింకాకొందరు కేవలగద్యనాటకాలు వ్రాయటానికి పూనినారు. ఆంగ్లసారస్వతములో గద్యనాటకాలు రచిస్తున్నారు కవులీ కాలములో. వెనుక పానుగంటివారిని గూర్చి చెప్పినప్పుడు యీ విషయము కొంచెము చెప్పినాను. గద్యపద్యనాటకాల పరస్పర గుణగణాలు చెప్పటమనవసరము. రసపోషణ పద్యముంటేనే గాని జరగదనటానికి వీలులేదు. కాని భావము లయసహితముగా వెలువడడము సహజము. గద్యనాటకాలు సర్వజనము తెలుసుకోడానికి వీలుంటుంది. పద్యముకూడా భావ ప్రధానముగా ఉన్నస్థలములో ఎక్కడైనా ఉంటే నాటకములో రసపుష్టి గలుగజేస్తుంది. దీనికి దారిచూపినవాళ్ళు పూర్వయుగములోనే ఉన్నారు. కాని నవ్యులు ఈ విషయములో బహుళముగా కృషి మొదలుపెట్టినారు. చింతాదీక్షితులు మొదలైన వారీకృషి

చేసినారు. కాబట్టి యీ కాలములో మూడు రకాల నాటకాలు సాధించినారు సాధకులు. ఈ నాటకాలలో వెనకటివలెగాకుండా చిన్నవి, ఏకాంకికలు వీళ్ళు సాధించటము మొదలు పెట్టినారు. ఇది సమంజసమే! ఎందుకంటె హ్రస్వకావ్య కాలమిది! పొడుగాటి పద్యకావ్యముగాని, గద్యకావ్యముగాని చదవటానికి పాఠకులకూ, వ్రాయటానికి కవులకూ కావలసిన ఓపికలేదు. ఖండకావ్యము, చిన్నకథ అభివృద్ధిపొందిన కాలములో ఏకాంకికలూ నాటికలూ కూడా లేచినవనడము చాలా సమంజసము! సాహితీసమితి సంచికలలో "వరూధిని" "కైలాసశిఖరము" అనే ఏకాంకికలున్నవి. వానిని ఆకాశముమీదనించీ భూమికీ దింపినారీ కవులు?

వీళ్ళు - ఉపయోగించే కొన్ని ఉపమానాలూ, పదబంధాలూ అప్రయుక్తాలు. కొందరుతాము చెప్పదలచుకున్న భావాన్ని స్పష్టముగా చెప్పలేనివాళ్ళున్నారు. అందుచేత దాన్ని అపుష్టార్థమనవచ్చు. చ్యుతసంస్కారము చాలామందికి మతమే! అర్ధానుస్వారాలను కొందరు పాటించినారు. కొందరులేదు. చాలామంది విసంధిని ఆమోదించి ఉపయోగించినారు, శకట రేఫను అవసరమైన స్థలాలలో - అనగా ద్విత్వాలలో వేస్తూనే వచ్చినారు. కాని, సామాన్యముగా భేదము చూపించలేదు. ఇక ఛందోభంగాలకు మితిలేదు. వెనక చూచినాము. ఈ ప్రకారముగా లాక్షణికులు చెప్పే కావ్యదోషాలున్నాయని ఒప్పుకోవలసినదే ! కాని యివ్వన్నీ బుద్ధిపూర్వకముగా చేసేవాళ్ళ నేమంటాము? అంతేగాక కొన్ని యిందులో గతానుగతికముగా దోషా లనడమేకాని వీటిని అనేకులు పూర్వులే పాటించలేదు ! మరిన్నీ భాషా భావమూ, సులభమై నూతనమయ్యే దినాలలో అప్రయుక్తాలని కూచుంటే భావ్యమా? నన్నయాదులు వాడని యెన్ని మాటలూ, పదబంధాలూ భాషలోకిరాలేదు? కాబట్టి ఒక కాలాని కప్రయుక్తమైనది, యింకొక కాలానికి ప్రయుక్తమౌతుంది. చ్యుత సంస్కారము గిడుగువారి భాషాసంస్కారవాదాంతర్భూతము. నియమ శృంఖలలను త్రెంచివేసే రోజులలో ఛందోభంగ మొక లోపమా? సభాపతి మొదలైన వాళ్ళ పట్టుదల చేత యింకా సాధకులు యతిప్రాసలను వదలలేదు ! అందుకు వాళ్ళను అభినందించవలె ! ఆధునికులు కొందరు ఈ యతిప్రాసలు పద్యానికి గాని, గీతానికిగాని, ఒకవిధమైన గమనాన్నిస్తాయని వదలకపోవడమే నియమముగా కూడా

పెట్టుకున్నారు. కొందరు వీరిలో ఎంతకాలము క్రిందో ఉపయోగింపబడి యిటీవల వదలిన పదాలనూ ప్రయోగాలను చేయడముకూడా కనపడుతుంది. *మచ్చుకు వేదులవారిలో ఒక ఉదాహరణనిస్తాను :

"నాకడనె నేర్చె ప్రణయ హేవాకకేళి!"

'హేవాక' శబ్దమీమధ్య యెవ్వరూ ఉపయోగించినదికాదు.

"పూజారివాఁడుగో పువ్వులెత్తులను" అన్నాడు.

'వాఁడుగో' పదము మానివేసి చాలా దినాలైనది మనవాండ్లు. 'అడుగో' అనేది పూర్ణముగా వాడుకలో కెక్కిపోయినది. ఇది రామిరెడ్డిగారి నిర్దుష్టభాషకు సమంజసమే! ఈవిధముగా లోపాలను స్పృశించినతర్వాత కొన్ని గుణాభాసాలను స్పృశిస్తాడు.

## గూఢత (మర్మకవిత) : †

ఇది ఈయుగములో ముఖ్యమైనది. ఈ శతాబ్దములో దీనికి చాలా బలము వచ్చినది. ప్రకృతిశాస్త్రాలపారముగా పెరిగిపోవడము చేత ప్రతివాళ్ళు వస్తువుల అంతస్సును పరీక్షించటము మొదలుపెట్టినారు. అంతస్సు ఎంత వెదకినా అసలు కనపడటము లేదు. ఈకనపడకపోవడము కవిత్వానికికూడా పట్టినది. పద్యములో భావమేమిటో తెలియకపోవడము ! తెలియకపోయినా చదివితే ఒక అవ్యక్తార్థము స్ఫురించి ఆనందము కలగవచ్చు లేక పోవచ్చు ! పైకి మాటలు మాత్రము సులభముగా ఉండడము? ఇట్లా వ్రాసే కవులకందరికీ తాము చెప్పే విషయాన్ని లోతుదాకా దిగి పరిశీలనము చెయ్యడము తమలో ఉత్పత్తి అయ్యే అవ్యక్తభావాలనుకూడా వర్ణించడం ఒకపని! బంగాళీ కవీంద్రుడగు రవీంద్రు డీ

* విశ్వనాధ ఈ పద్ధతికి పట్టుకొమ్మ అయినాడు.

† Mysticismఅనేమాటకు 'భావయోగం' అనే మాట వాడినాడు భారతిలో, "జీవకళ" వ్యాసం వ్రాసిన "శాస్త్రి" అనే గూఢనామధేయుడు. కాని ఆ పదము వాడితే, వాడిన ప్రతిచోటా ప్రక్కనే ఇంగ్లీషుపదము వాడవలసివస్తుందని నేను వాడలేదు. ఈ పదము బాగానే ఉంది. (భారతి - విక్రమాషాఢం) కాని నేను వాడినది "అన్యాపదేశం, విషయనిగరణం" అనే అర్థములో అర్థము కాకపోవడమే నవ్యులవ్రాతలలో ఉన్న Mysticism. ఇది "భావయోగం" ఎప్పటికీ కాదు.

పద్ధతిలో దిట్ట ! ఈయన భక్తుడు. ఆ భక్తిభావాన్నీ, శేషశేషిభావాన్నీ, మిక్కిలి హృదయంగమముగానూ, గూఢంగానూ, వర్ణించినాడు! ఆయన కవిత్వాన్ని 'ఈట్సు' అనే ఐర్లాండు కవిమహాశయుడు చదివి ఆనందించినాడు ! ఇద్దరూ ఒకేరకము వాళ్ళవడముచేత ఆయన రవీంద్రుడి భావాలకు ముగ్ధుడై, ఆయన "గీతాంజలి"కి ఉపోద్ఘాతము వ్రాసినాడు. ఈట్సు మహాకవి ప్రపంచము కళ్లు తెరిచేటప్పటికీ రవీంద్రకవనం ప్రపంచమంతా మెప్పుపొందినది. 1912-14 సంవత్సర ప్రాంతములో "గీతాంజలి" చేతిలో పట్టుకోనివాళ్ళు లేరు! అదివరలో ఆయన్ను కనిపెట్టలేని భారతీయులకు కూడా ఆయన ప్రవక్త అయిపోయినాడు.

"గూట చిల కేదిరా?
చిన్నన్న?
గూడు చినబోయెరా!"

ఆయనకు నోబిల్ బహుమానము లభించినది! ఈగూఢత వెనకటి తరములో చాలా ఉన్నతికి వచ్చినది! కాని యూరపుఖండములో యుద్ధమువచ్చి యీ గూఢతకు దెబ్బతగిలినది! బాహిరత్వము (ఉన్నదున్నట్టు చెప్పడం) కవిత్వానికి లక్షణమైనది యుద్ధానంతరము కాని యుద్ధము మనదేశానికంతగా దెబ్బకొట్టలేదు కాబట్టి యీగూఢత మనకు వ్యాపించినది! ఇది బొత్తుగా మనకు కొత్తదికాదు. దీన్ని మనవాళ్ళొక కాలములో "అన్యాపదేశమన్నారు" చెప్పదలచిన విషయాన్ని గూఢముగానూ, దేనిమీదో అప్రస్తుతముమీదపెట్టీ చెప్పడము! వెనుకటి శతాబ్దములో మన దేశములో కొన్ని భక్తి సిద్ధాంతాలు బయలుదేరినై! వాటిలో "అచల" సిద్ధాంత మొకటి! ఈ "అచల" సిద్ధాంతము ఆంధ్ర దేశములో చాలా ప్రచారములో ఉండేది! ఈ సిద్ధాంత ప్రచారము కోసము కొన్ని పాటలుకూడా రచితాలైనవి.

గూడు దేహమూ, చిలక ఆత్మ, ఆత్మలేని దేహము చిన్నబోయినది! గూఢత అనగా ఇట్టిది! "తొమ్మిది ద్వారాల కొంప" అన్నారనుకోండి! నవరంధ్రాలూ, అవికల శరీరమూ అన్నమాట!* ఈ గూఢతనీ నవ్యకవులు పట్టుకున్నారు; రాయప్రోలు

---

* 'ఈ మూలములేని బట్టబయలు యేమీలేదు" వంటివెన్నో ఉన్నై దృష్టాంతాలు. పోతులూరు వీరబ్రహ్మమనే ప్రవక్త బహుశిష్యగణము కలిగి అనేక పాటలను రచించినాడు ఇటువంటి గుణముకలవాటిని.

వారి దగ్గిర్నించి దీనికి లోబడిపోయినారు! రవీంద్రాదులు భక్తికి దీన్ని◆ అన్వయింప జేస్తే యీ నవ్యులు దీన్ని ప్రణయానికి అన్వయింపజేసినారు!

దీనికోసం కొంత పదసామగ్రినికూడా సేకరించినారు! కొందరిలో ఈ గూఢత మిన్ను ముట్టిపోయినది! అస్పష్టతని మరొకటున్నది. అంటే కవి చెప్పదలచిన భావాన్ని స్పష్టముగా చెప్పలేకపోవడము. ఈ అస్పష్టతా గూఢతా అప్ప చెల్లెండ్లు! ఇటువంటి వ్రాతలలో పదాలకు నిగూఢముగా ఉన్న అర్థాలు తెలుసుకోడానికి, అటువంటి చిత్తవృత్తిలో ప్రవేశిస్తేగాని సాధ్యముకాదు. ఈకవిహృదయ ప్రవేశానికి వెనుకటి లక్షణ శాస్త్రపఠన మొక అభ్యంతరముగా ఉంటుందొకప్పుడు. పైపెచ్చు యీ పద్ధతి అసహ్యముగా కనపడుతుంది కూడాను కొందఱికి. కాని కవిని సానుభూతితో చదివి, కవియొక్క భావసన్నివేశము గ్రహించి, కవిహృదయాన్ని గనక ప్రవేశిస్తే యిది అంత బొత్తుగా తెలియకపోదు. కాని ప్రతిపాఠకుడూ యింత శ్రమపడతాడా? శ్రమపడితేమాత్రము కొంత ఫలమున్నది. దువ్వూరుగారు "మర్మకవి" అనే శీర్షికతో ఒక ఖండకావ్యము వ్రాసినాడు. దానిలో మర్మకవిత్వలక్షణాలు కొన్ని చెప్పినాడు. ఈయనకు మర్మకవిత్వమందు చాలప్రీతి. ఈయన కవిత్వ మంతా కాకపోయినా చాలా మట్టుకు యీ రకానికి చేరినది ఉన్నది! ఒక్కొక్కప్పుడిట్టి కవిత్వము మాటలపోగుగా కనపడి, అర్థము పట్టుకుందామంటే దొరకదు.

" ...........గగనంబునందు
యెగిరిపోయెదవోయి, యెటులబట్టినను"

నిజముగా మొదట యీ మర్మకవిత్వముయొక్క పునాది భూమిమీద ఉన్నట్టు కనపడదు. కాని అర్థము తెలిసిన తర్వాత -

"........ నీకావ్య
పుష్పకంపు రసార్ద్ర పులకితాత్ములను
జీవనయాథార్థ్యసీమలందుండి !

◆ పవిత్రమైన శరీరాత్మసంబంధానికీ, జీవేశ్వర సంబంధానికీ, ఉపయోగించే నిజమైన గూఢత (mysticism) లో దీన్ని చేర్చటానికి వీలులేదు: ఇది "విషయ నిగరణం" "అన్యాపదేశం" వంటిది. కాబట్టి ఈ "గూఢత" శబ్దము ఈ సంకుచితార్థంలో వాడినాను.

కొనిపోవు నందనవన గంధవహము
వీతెంచుకల్పనా శీతనగంపు
కడపటశృంగంబు కడకొక్క తృటిని." అనిపిస్తుంది

కావ్య పుష్పకా న్నెక్కివాళ్ళను ఈ ప్రపంచమునుంచీ కల్పనా హిమవంతము యొక్క మిక్కిలి యెత్తైన శిఖరా న్నధిష్ఠింపజేసి, అక్కడ నందనవన పరిమళా న్నాఘ్రాణించేటట్లు చేస్తుందట! మర్మకవిత్వ ఫలాన్నిట్లా చెప్పాడు:-

'........ యెన్నికష్టముల
మరచి సుఖింతు నీ మహిమంబువలన'

కావ్యానందము ప్రత్యనీకరహితమని పెద్దలు చెపుతారు. చూడండి కవికుమారు డేమంటాడో,

'కవికులాభరణ, నీకావ్యమాధురికి
వినిమయంబుగ నీయ విశ్వంబునందు
నేమియు గన్పట్టదీ డైనయటుల'

అసలు నిజమైనది పరనిర్వృతి! అది అసాధారణలభ్యము! కాబట్టి "యీ సద్యఃపరనిర్వృతే" అసలు "పరనిర్వృతికి" ప్రత్యామ్నాయము! ఇదే కావ్యానందము! దీనికి ప్రత్యామ్నాయ మింకేమున్నది? ఈ పద్ధతిలో కొందరి వ్రాతలు సహృదయులకు కూడా అందనివై పోయినై. ✻కొన్ని గూఢత కుదాహరణాల నిస్తాను. "దీపనిర్యాణమ' నే శీర్షికతో రామిరెడ్డిగారి ఖండకావ్యం ఒకటి ఉన్నది. అందులో తానొక యెడారిలో ఒక ఒంటెనెక్కి వెళ్ళుతున్నట్లూ, అంతా అంధకారమైనట్లూ, చుక్కలుకూడా కనపడనట్లూ, అంతా నిశ్శబ్దమైనట్లూ చెప్పి దారి తెలియడము కోసము.

'పలుమారు నాచేతి బంగారుదివ్వె
వెలిగింతుగాలి, కంపిలియానిమేష
మందె, పయ్యెర వీచి, యారిపోయెడిని '

---

✻ఆంగ్లములో Imagination (కార్యకారణసహితమైన హృదయంగమ భావము) Fancy (చిత్తవిభ్రమము) అని రెండు పదాలున్నవి. వీటిలో రెండవది చాల క్రిందిమెట్టుది. మన నవ్యులలో ఎక్కువగా కనపడేదిది. మొదటిది కొందరిలో అల్పసంఖ్యాకులలోనే కనపడుతున్నది Imagination లో స్పష్టత, నిర్దిష్టత, ఉన్నవి. Fancy లో సంకీర్ణత, అస్పష్టత ఎక్కువగా ఉన్నవి. Imagination లో పునాది ఉంటుంది. Fancy లో భ్రాంతి యెక్కువ అంశ Imagination లో భావము పనిచేస్తూఉంటుంది. Fancy కేవలము భ్రమ ఆధారముగా కలది.

అన్నాడు. ఇచ్చట "తనలోనున్న జ్ఞానమువల్ల ఈ సంసారమనే ఎడారిని దాటాలని యత్నిస్తూ ఉంటే మాటిమాటికీ అజ్ఞానము ఆ జ్ఞానాన్ని ముంచేస్తున్నదని" అర్థముకావచ్చును. ఆ అజ్ఞానాన్నే 'విధి' అన్నాడని ఈక్రింది వాక్యాలవల్ల తెలుస్తున్నది.

'---విధి యీడ్చు తెరగులనెల్ల
ధూళిబ్రుంగుచు నేడు త్రొక్కుచున్నాడ!'

జీవికి స్వతంత్రత లేదని సిద్ధాంతీకరించి, దీనికి అంతుఎప్పుడా అని ఆశిస్తున్నాడు కవికుమారుడు. ఒకనాడు తాను ఒక చెరువుగట్టున కూర్చుండగా ఒక స్వప్న మొచ్చినదని చెప్పినాడు. ఆ స్వప్న మిట్లా ఉన్నదట!

'మావితోటను పర్ణమంటపమంచు
జనరంజకంబైన సభయొండు జరిగె'
*   *   *
రారాజు క్రొంబచ్చ జాగద్దె డిగ్గి
యందరితోబాటె యవనిగూర్చుండె.'

పూర్వ మొకప్పుడు యుద్ధముచేసి యిప్పుడు తుప్పుపట్టిన తుపాకితో ఒక సిపాయీ, బురదబట్టలు కట్టుకొన్న రైతూ, నిరుపేదా, రాజపరివారమూ, అంతా ఒకే పరిబంతిలో కూర్చున్నారట! * ఈ విధముగా ప్రపంచము ఇకముందు ఎట్టి మానవ భేదము లేకుండా సర్వసమమైపోతుందని దీనిఅర్థమనుకుంటాను. తదనుగుణముగా 'భవిష్యద్దర్శన'మని దీనికి పేరుపెట్టినాడు. ఈవిధముగా అనేక గూఢతా విశిష్ట కావ్యాలనీ రామిరెడ్డిగారు రచించినారు. నోరి నరసింహశాస్త్రిగారి కావ్యములో మృతకళేబరాన్ని గూర్చి యిట్లా ఉన్నది.

*   *   *

---

* ఆర్థర్ సిమ్మన్సు [Arthur Symons] అనే ఆంగ్ల విమర్శకుడిట్లా అన్నాడు 1893లో.

"The most representative literature of the day, the writing which appeals to, which has done so much to form, the younger generation, is certainly not classic, nor has it any relation to that old antithesis of classic, the romantic. After a fashion it is no doubt a decadence; an intense self-conciousness, a restless curiosity in research; an over-subtilising refinement upon refinement, a spiritual and moral perversity-"

ఈ పరిస్థితులు క్రమముగా మన సాహిత్యములో వస్తున్నవి.

"తలపు ప్రాణము లీ రెండు తలగిపోయె,
కారుచీటు లింటిలో గ్రమ్ముకొనియె,
కాంతి సుంతయు కిటికీల గానరాదు,
అన్నివేళల 'కిరుకిరు' మనెడి తలుపు
తెరచి యున్నట్టి చప్పుడే తెలియరాదు"

శరీర మిల్లు, కిటికీలు రంధ్రములు, కిరుకిరుశబ్ద ముచ్ఛ్వాస నిశ్వాసము. చూచినారా గూఢత! వేదుల తాను ప్రపంచములో మంచినే చూడలేదనీ, ప్రజలు వెనకటి ఔన్నత్యాన్ని స్మరించుకుంటూ నెమరువేసే పశువులవలె ఉన్నారనీ, రాజులు మత్తులైయున్నారనీ, దేవుడు విగ్రహాలలో చిక్కుకొనిపోయినాడనీ, ప్రజలకు దారి దొరకడంలేదనీ, కాబట్టి ఈ పూర్వనాగరికతనంతా నశింపజేయుటానికి, ప్రయత్నించమని ఉద్బోధించి ఈనాశనములోనించీ సుందరమైన భవిష్యత్ప్రపంచము పుడుతుందనీ, మొదలైన భావాలతో వేదుల,

"వెలిగించు కాగడా వెలిగించవోయి
ప్రళయరుద్రుని ఫాలభాగమ్మునందు"*

అంటూ ఒక చక్కని గూడార్థగీతాన్ని వ్రాసినాడు. కృష్ణశాస్త్రిగారి ఈక్రింది గీతి చూడండి :-

"నవవసంత శుభోదయానంద వశత
ప్రకృతి నూతన జీవలావణ్యమొంద,
రాయిరప్పయు కంఠస్వరంబుదాల్చి
నైజగుణము త్యజించి గానంబుచేయ
పికమ ! పాడకుమనుచు శపించినారు !

పక్షినని పాడగలనని, ప్రణయవీధి
నిత్యలీలావిహారముల్ నెరపుదునని
పక్షములదూల్చి, బంధించి పంజరాన,
గానమును, బ్రాణమును హరింప బూనినారు"

---

* అక్కడ నిప్పు ఉంటుంది. ఆయన సంహారకర్త కూడాను.

ఇట్టిది ఇంగ్లీషు సారస్వతములో కూడ ఉన్నది :-

The neleulosity of Shelly at its cloudiest is preferrable to the ruggedness of Wordsworth. - Swinburne

ఇందులో కాలము మారినదనీ, కవికుమారుడనైన నేను గానము చేస్తానంటే, యీ పూర్వాచారపరాయణులు కవిత్వాన్ని లక్షణాలలో బంధించిపెట్టి, మాబోటి వ్రాయసగాళ్ళను తిట్టుతున్నారనీ, నామీద అధికారము కలవాళ్ళు బొత్తుగా నిషేధిస్తున్నారనీ, గూఢార్థమేమైనా ఉందేమో పాఠకులకు వదలుతున్నాను! క్రిందిటి దశవర్షకాలములో యీ గూఢత సహృదయుల జాట్లలోనుంచి వెళ్ళిపోయినది. ఇప్పుడు కొందరు వ్రాస్తున్న కవిత్వము వాళ్ళకూ వాళ్ళ స్నేహితులకూ తప్ప యితరులకు తెలియకుండా ఉంది. ✻ ఇక్కడ యీ గూఢతా సందర్భములో తుది సిద్ధాంతము మనవిచేస్తున్నాను. వెనక నేను "గూఢాలని" మనవిచేసిన అన్యాపదేశ సందర్భాలన్నీ కేవలం భౌతిక ప్రపంచభావనా సంబద్ధాలుకాబట్టి, యివి నిజమైన "గూఢత" (mysticism) లో చేర్చడానికి వీలులేదు ఆధ్యాత్మిక భావనకు సంబంధించినంతవరకే తన్నామానికర్హత ! వీటికన్నిటికి "అన్యాపదేశమ"నేనామ కరణము సమంజసం! గూఢత అంటే నాయీ నిర్వచనము రవీంద్రకవీంద్రుని గ్రంధ మొక్కటి చదివితే తెల్లమౌతుంది. రాయప్రోలు ధ్యానగీతము చదవండి. ఆయనయొక్క భావనాప్రపంచము తిరిగి తిరిగి పరమాత్మ స్వరూపాన్ని చూడగోరితే తుదకు,

"వినబడియె నొక్కసూక్తి హృద్వివరమందు
స్మృతులుమూసి, ముక్కోటిదేవతల వదలి,
బ్రహ్మవిష్ణుపరంపర త్యజించి,
అగ్ని ముఖమందె అమృతమ్మునందుమంచు"

"నియతం కురు కర్మత్వం" అనే శ్రీకృష్ణ వాక్యానికిది ప్రతిబింబమా ? లేక "మోక్ష మీ జన్మలోనే లభ్య"మనియా ? లేక "కష్టంలోనే సుఖమున్నద"నియా ? లేక "ఈ కర్మలోనుంచీ అగ్ని పరీక్ష అయిపోయినతర్వాత అమరత్వము వస్తుంద"నా?◆

---

✻ Appeal to a limited circle

◆ "గూఢతయు జాటుతనంబునులేకయుండ చెప్పిన నదెపో కవిత్వమనిపించు అన్నాడు పెద్దన్నగారు. ఇది అన్యాపదేశము అస్పష్టతలాంటిదే ! ఈ గూఢత కేవల ప్రాపంచిక భావనా సమన్వితమవటముచేత అపకర్షాహేతువుగాకూడా ఉంది ! మన నవ్యులనుకునే గూఢత అంటే 'చాటుతనానికి" వ్యతిరేకమైనదని తోస్తుంది.

## క్లిష్టత :

పింగళి సూరన కవిత్వలక్షణము చెబుతూ "తలపెల్ల నక్లిష్టతను ప్రదీపితముగా" అన్నాడు! ఈ నూతనకవిత క్లిష్టమని చెప్పటములో ఎట్టి తప్పులేదు. ప్రతి పాఠకుడికీ తెలియకపోవడమేగాక సహృదయుడిని కూడా తిప్పలు పెడుతుంది. ఒక్కొక్కప్పుడు. ఇక్కడ రెండు కష్టాలున్నవి. అన్వయము దొరక్క ఒక కష్టమూ, భావ మంతుపట్టక రెండో కష్టమూ! ఇటువంటిదాన్నే నేను 'క్లిష్టత' అన్నది. ఈక్లిష్టతా, వెనక చెప్పిన గూఢతా, అస్పష్టతా, యివన్నీ పరస్పర సంబద్ధాలే! కవి చెప్పదలచిన విషయాన్ని సహృదయుడికి తెలిసేటట్టు చెప్పటమే "అక్లిష్టత" అంటే ! ఈ భావాన్వయక్లిష్టతలకు పరశ్శతదృష్టాంతాలియ్యవచ్చు! ఎవరో కొందరి వ్రాతలు తప్ప బహుళముగా యీదోషముకలవే! శివశంకరశాస్త్రిగారు స్వచ్ఛముగా ప్రకాశించే కవితాసామర్థ్యముకల సాధకుడు. ఈయనవ్రాతలలో ఎక్కడా క్లిష్టత కనపడదు. ✻ మిగిలిన చాలామందిలో మాధురీ, రసమూ, లేదందామా ఎంతమాత్రము వీలులేదు! కాని క్లిష్టత సామాన్యపాఠకుడిని విముఖుని చేస్తుంది. గూఢతా, అస్పష్టతాకూడా అంతే ! ఇవన్నీ కలిసి పాఠక ప్రపంచాన్ని సంకుచితముచేస్తై! ఇప్పుడు నవ్యకవిత్వానికీ, కవులకూ, దేశములో అంతటా సంపూర్ణ సానుభూతి లేకపోవడానికిది ఒకగొప్ప కారణము! అయితే వీటిని గుణాలు అనుకోండి, దోషాలనుకోండి. ఇవే ఈవ్రాతలకు విశిష్టతనిచ్చిన కొన్నివిషయాలు? § అందుచేత వాళ్ళు దాన్ని వదలటాని కెంత మాత్రము వీలులేకుండా ఉన్నది వదలకూడదు కూడాను. ఈక్లిష్టత రాయప్రోలువారిలో కూడా కనపడుతుంది.

---

✻ మళ్ళీ పేలవత్వమూ లేదు చక్కగా పెద్దన్నగారి పరీక్షకు తార్కాణభూతమైనదీన కవిత. భావనాశక్తికీ, ఔచితికి యెట్టిలోటూ లేదు. "శరది సరిదాస్యాన పులినా" వలె స్వచ్ఛతాభాసురమై, పాఠకపిపాసను తీర్చి ఆనందింప జేస్తుంది.

§ విశ్వనాథదిమాత్రం క్రమాభివృద్ధిపొంది క్లైష్ట్యం అభివృద్ధి పొందుతూవచ్చింది. ఇప్పుడు మధ్యాహ్నకాలం కావచ్చింది.

హృదయమోహనమయి ప్రేమమృదులమైన
తావకీన లీలాదాన దళపుటంబు,
మామకీన ప్రణయభంగ మధుకణముల
విడిచెడు విరక్తిబాష్పముల్ విడుచుపోల్కి"

కొంతవ్రాసిన తర్వాత ఈ గూఢతాక్లిష్టతలు కవినే కష్టపెడతై! కవితాజ్యోతి త్వరలో ఆరిపోవడానికిగాని, తర్వాత కావ్యాలకు అపకర్ష కలగచెయ్యటానికిగాని, మార్గా లౌతై! శివశంకర శాస్త్రిగారి కవితాస్రవంతి స్వచ్ఛమై, సహజమై యిప్పటికీ, రసవత్పయోదసదృశమై ప్రవహిస్తూ ఉండటానికీ, ఆయనకంటె చిన్ని వాళ్ళైనా అనేక మంది కవితాస్రవంతులు (వేదులవారు, దేవులపల్లి వారు, నండూరువారు మొదలైన వారివి) అంత ధారావాహికలుగా ప్రవహించకపోవడానికీ కారణము వీరి కవితా స్రవంతులు గూఢతా క్లిష్టతాసికతాతపాలలో ప్రవహించడమే! 'శివశంకరశాస్త్రిగారి జీవితానికీ సాహిత్యానికీ, లంకె' అన్నాడు విశ్వనాధ. దేవులపల్లి మొదలైనవాళ్ళేవో చిల్లరకావ్యాలు వ్రాసినా, వెనకటి భావౌన్నత్యము అంతగా కనపడటములేదు. చూచినారా వయఃపరిపాకము రాకమునుపే వీళ్ళ కవితాజ్యోతికి తైక్ష్ణ్యము తగ్గి పోయినది. ఏ శక్తి అయినా అతిగా దాన్ని కష్టపెడితే కొంత కాలమైన తర్వాత ఎదురు తిరుగుతుంది! ఈజీవుడికీ, శరీరానికీ కూడా యింతని ఒక నిర్ణీతశక్తి ఉంది భౌతికముగా ఉపయోగించడానికి. శరీరానికి లేదుగాని జీవుడికి మాత్రము ఆధ్యాత్మికముగా కల శక్తి అనంతము! కాని ఆది భౌతికముగా నిర్ణీతము. ఆ నిర్ణీతాన్ని కష్టపెట్టి ఖర్చుఅయ్యేటట్టు చేస్తే అది యిక పనిచెయ్యదు! ఈసంగతి ఒక ముఖ్యముగా గమనించదగిన విషయము! ఈవ్రాతగాళ్ళలో కొందరు తమ చిత్త వృత్తులను కృత్రిమ పరిస్థితులలో పెట్టుకోటము మొదలుపెట్టినారు. సహజమైతే తప్ప, చిత్తవృత్తి కృత్రిమమైనప్పుడు అందులోఉండే సూక్ష్మాంశాలు అసహజాలవడముచేత నిష్కృష్టముగా చెప్పడానికి వీలులేకుండా ఉంటై! అందుచేత ఈ అపుష్టార్థదోషము వస్తుంది. వెనకటి అస్పష్టతా, క్లిష్టతా కూడా ఒక్కొక్కప్పుడిట్టి కారణమువల్లనే కలగవచ్చు కూడాను. కాబట్టి యివన్నీ చాలా సన్నిహితాలైన విషయాలు! మరొకటున్నది! ఈకవులు తమకు మనస్సులో పైకివచ్చే భావాలేగాక,

నాటిక్రింద అవ్యక్తముగా ఉండి, కలగాని, మూర్ఛగాని, వచ్చినప్పుడు వచ్చే పరోక్షానుభూతిని కూడా చెప్పడానికీ, వర్ణించడానికీ, ప్రయత్నించడములో కూడా వస్తుంది అస్పష్టతా, అపుష్టార్థమూను ! తమకే సంపూర్ణముగా అనుభవములేని భావాలను పాఠకుడికి విప్పిచెప్పడమెట్లా ? కాని అవి అబద్ధాలందామా? కావు ! స్వప్నాలూకావు ! ఇటువంటి సందర్భములో వాళ్ళకున్నట్టీ, వచ్చినట్టీ, అనుభవముకాని దాన్ని చెప్పడములో ఈ విప్రతిపత్తి కలుగుతున్నది ! ఇటువంటి పద్ధతిని ఉమాకాంతపండితుడు "అయోమయ"మని నామకరణము చేసినాడు! కాని ఆయన చేసిన హేళనానికి తగ రీ కవికుమారులు. అప్పుడు వాళ్ళకుండే చిత్తవృత్తి, తద్భావాలూ, స్తనశల్యపరీక్ష కాగలవు ! వాటినే తదనురూప చిత్తవృత్తితో మనము పరీక్షిస్తే వాళ్ళతో మనము సానుభూతిని పొందుతాము ! అట్లాగే గాకపోతే అపరిణతబుద్ధుల కందనట్టీ, మంత్రద్రష్టల కగపడనట్టీ, భావాలను మనముకూడా ఉమాకాంత పండితుడన్నట్టు అనవలసివస్తుంది ! అది అకార్యకరణము ! కాబట్టి అటువంటిదానికి పరీక్ష యాథార్థ్యముతో పోల్చటము కాదు ! అటువంటి చిత్తవృత్తిని సాధించి పరీక్షించడము కర్తవ్యము !

## స్వేచ్ఛ :

ఇది నవ్యులు కొనియాడే ఒక గొప్పవిషయము. కాని స్వేచ్ఛకు అంతున్నది. ఇదికూడా జీవుడికీ, శరీరానికీ, పరిమితము! వేటిచేత పరిమితము? అని అడుగుతారేమో! అనేక విషయాలచేతే గాక, తుదకు తమ ఉపాస్యదేవతైన ప్రకృతిచేతనే పరిమితము. వెకన దేవులపల్లివారు రెక్కలు లేవని మరచి యెగరడానికి ప్రయత్నించి దుఃఖించడము చూచినాము ! ప్రకృతినిదాటే స్వేచ్ఛ భౌతికముగా లేదు జీవికి! ఆధ్యాత్మికముగా శక్తి సంపాదించుకోవచ్చు! కాని ఈ సాధకులలో బహుసంఖ్యాకులు ప్రకృతిని దాటడానికి ప్రయత్నించినవాళ్ళు లేరు. అటువంటి అప్పుడు తమశక్తికి మించిన స్వేచ్ఛను కలిగి ఉన్నామనుకొనడము వట్టి భ్రమ. రెండో విషయము సంఘము ! సంఘోపద్రవమైన స్వేచ్ఛను గ్రహిస్తే సంఘమూరుకోదుసుమా! ఒక్క కవితావిషయాలలోనే కాదీపరిమితి ! రాజకీయము గ్రహించండి ! స్వాతంత్ర్యము

కోరుతున్నాము మనము ! ఎట్టిదిస్వాతంత్ర్యము ! మనయిష్టమొచ్చిన పనిచెయ్యటాని కధికారముండడము కాదు స్వాతంత్ర్యమంటే! స్వేచ్ఛఅని, తినగల దానికంటె యెక్కువ తింటే కడుపు చెడుతుంది ! కాబట్టి స్వేచ్ఛ పరిమితము ! ఈ సంగతి నీనవ్యులు గమనించినట్లు తోచదు. సంఘనీతి అనేది ఒకటుంది ! ఆ నీతి మన స్వేచ్ఛ నరికట్టుతుంది. మన కిష్టము లేకపోయినా దానికి లోబడక తప్పదు. సంఘమే తప్పనుకుంటే దిద్దటానికి ప్రయత్నించవలె కవికుమారుడు ! అంతేగాని సంఘములో అవినీతి ఉన్నదని దానిని ఎక్కువ చెయ్యటానికిగాని, కోమలయువక హృదయాలను ఆ దుర్నీతిలో మునగమని ప్రోత్సహించటముగానీ, సంఘోన్నతికొరకు పుట్టిన 'కవిబ్రహ్మ'కు న్యాయముకాదు. అట్టిది స్వేచ్ఛ కాదు. విశృంఖలత ఇది దాదాపు చాలామంది నవ్య కవికుమారులు గమనించవలసిన విషయము.

## వాచ్యము :

మన లాక్షణికులు వ్యంగ్యప్రధానమైనది ఉత్తమకావ్యమని నిర్వచించినారు. ఈ ఉత్తమత్వాన్ని అనేకమంది అనేకవిధాలుగా పేరు పెట్టినారు. వైయాకరణులు దీన్ని స్ఫోటమన్నారు. రసవాదులు రసమన్నారు; ధ్వనివాదులు ధ్వని అన్నారు; కొందరు వ్యంగ్యమన్నారు. ఏపేరుతో చెప్పినా తుదకు ఒక్కటే. 'జీవితము వ్యంగ్య వైభవము' అన్నాడు లాక్షణికుడు. ఇప్పుడు కొందరు నవ్యులు లక్షణశాస్త్రము బాగా అవలోడనముచేసి 'కావ్యాత్మ' ఏది అనే ప్రశ్నను చాలా చర్చిస్తున్నారు. "రసము" కావ్యాత్మ అని నిర్ధారణ చేసినారు కొందరు. వ్యంగ్యమూ, ధ్వనీ అని మరికొందరు. ఈ వ్యంగ్యము మొత్తముమీఁద పురాతనాధునాతన లాక్షణికు లందరూ చాలా కొనియాడినారు. ఇదికూడా ఒక శబ్దశక్తిగా అంగీకరించినారు తర్కమూలముగా లాక్షణికులు, ధ్వనిఅన్నా వ్యంగ్య మన్నా ఒకటే! శబ్దానికి మూడుశక్తులున్నై ! ఆ

---

"Freedom can be obtained only through bonds of discipline and **surrender** of personal inclination. To secure the freedom to acquire and to enjoy we have to trust ourselves and bind our will in certain ways ...... In the interests of spiritual freedom Hindu Society regulated the most intimate details of daily life and they are the rules of Dharma." [Hindu Review of Life]

మూడు శక్తువల్ల వచ్చే అర్థం కూడా మూడురకాలు ! వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థాలని వాటి పేర్లు. దార్శనికులంతా వాచ్యలక్ష్యాలనే ఒప్పుకున్నారు కాని లాక్షణికులు వ్యంగ్యాన్నికూడా ఒప్పుకోవడమే కాకుండా దానికి యెక్కడ లేని గౌరవ మిచ్చారు. ధ్వన్యర్థమే వ్యంగ్యార్థం ! దీన్నే తాత్పర్యార్థమనీకూడా అన్నారు ! ఈ ధ్వన్యర్థా న్నీవిధముగా నిర్వచించినారు.

"యత్రార్థశ్శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ?
వ్యంక్తః కావ్యవిశేషః సః ధ్వనిరితిసూరిభిః కథితః"

శబ్దాలూ, తత్సంబంధాలైన అర్థాలూ, తమ స్వార్థాలను అణచిపెట్టుకుని, మరో హృదయంగమార్థాన్ని స్ఫురింపజేసినప్పుడు, ధ్వని అంటారు. కాబట్టి శబ్దాలకుండే సామాన్యార్థముకాదు ధ్వనిఅంటే, దానిమీద ఆధారపడే దూరాన ఉన్న ఒక హృదయంగమమైన అర్థము వ్యంగ్యము. దీన్నే యింగ్లీషులక్షణశాస్త్రములో "Suggestion" అంటారు! ఈ శక్తిచాలా గొప్పది! ఇది ప్రతికవికీ ఉండదు. అందుకోసమే దాని ప్రాధాన్యా ప్రాధాన్యాలనుబట్టి లాక్షణికులు కవులనూ కావ్యాలనూ విభజించినారు. వ్యంగ్యప్రధానకావ్యాన్ని ఉత్తమ కావ్యమన్నారు. వ్యంగ్య మక్కడక్కడా ఉండి యెక్కువగా వాచ్యమైతే దాన్ని మధ్యమకావ్యమన్నారు. కేవల వాచ్యాన్ని అధమకావ్యమన్నారు. లాక్షణికులు కాళిదాస భవభూతులను తారతమ్య చర్చచేసి భవభూతి ఉత్తర రామచరిత్రను వాచ్యముక్రింద నెట్టేసినారు. భవభూతే వాచ్యప్రధానుడైన కవైతేమిగిలిన అనేకమంది గతి ఏమిటి? ఈ విషయములో ఇటువంటి పట్టుదల చూపినారు మనపూర్వులు! అది సమంజసమే ! సాక్షాత్తుగా చెప్పినదానికంటే ఎక్కువ అర్థము స్ఫురింపచేసే కవి గొప్పవాడా? ఉన్నదెంతో అంతే అర్థముతో తృప్తిపడే కవి గొప్పవాడా? మొదటిరకమువాడే గొప్పవాడనడములో ఏమైనా సందేహమున్నదా? కాబట్టి అది ఉత్తమలక్ష్యమనడములో ఎట్టి అభ్యంతరములేదు. అంతా అట్లా ఉండేట్టువ్రాయడము సామాన్యముకాదు. అట్లా ప్రతిపద్యము వ్యంగ్యముగా వ్రాసిన కవే లేడని చెప్పవచ్చు! * అందుచేతనే యిదిసగం

* తుదకు విసికి లక్షణకూడా ధ్వనిభేదముగానే అంగీకరించినారు.

◆ సాంకేతికముగా ఒకమాట కింకొక అర్థమౌతుంది. వెనక ఉదాహరణములో "గూడు' ' అంటే ఒక వస్తువుండే మూయబడ్డచోటు. చిలుక అంటే ఎగిరేవస్తువు! ఒకదానిలో ఒక టుంటుండడము సామ్యము. ఈ సామ్యముచేత గూడంటే శరీరమూ, చిలుకఅంటే ప్రాణముండేచోటూ అని సాంకేతికముగా అర్థము చేసుకోవలె.

అదిసగం వ్రాసినవాళ్ళను గొప్పకవులన్నారు ! వ్యంగ్యముప్రధానముచేసి యెక్కువగా వాచ్యాన్ని గ్రహించినకవులు అంతకంటె యెక్కువ సంఖ్యాకులు ! ఇక మూడోరకం-అనగా వాచ్యాన్నే గ్రహించినవారు - ముప్పాతికమంది వాళ్ళే! ఈ పరీక్షతోగనక ఒక్కమారు చూస్తే నవ్యులలో లెక్కకువచ్చేవా ళ్ళెందరు? ఒక్కపొరబాటు పడకూడదు. వెనుక గూఢత అన్నానే దాన్ని వ్యంగ్య మనకూడదు. అన్యాపదేశానికీ గూఢతకూ సమానార్థాలుగా వాడిన కొంచెము భేదమున్నది! గూఢతలో శబ్దాలకుండే అర్థాలకూ గూఢార్థాలకూ భేదముంటుంది. సామాన్యము గమ్యముగా ఉంటుంది. ఈ సామ్యము గూఢార్థస్ఫోరకము. ఇది రెండోరకము. అన్యాపదేశములో ప్రస్తుతాలుంట్లె! ఒక ఉదాహరణము ! “మాళవికాగ్నిమిత్రం” లో రాజు పండితకౌశికిని ఉభయ నాట్యాచార్యుల తారతమ్యపరీక్ష చెయ్యమన్నప్పుడు ఆమె “పట్టణముండగా పల్లెలోనా రత్నపరీక్ష?” అన్నది. అంటే ‘రాజులగు తమరుండగా సన్యాసినిని నేనా నాట్య పరీక్ష చేయటము;’ అని అర్థము ఇక్కడ పట్టణ గ్రామాలూ, రత్నపరీక్షా అప్రస్తుతాలు! ఆ అప్రస్తుతాలమీద పెట్టి ప్రస్తుతాన్ని చెప్పటముచేత అది ఒకదాన్ని అపదేశించి మరొక దాన్ని చెప్పటమైనది!

## వ్యంగ్యము :

ఇట్టిదానికీ వ్యంగ్యానికీ చాలా భేదమున్నది. ఇక్కడ ప్రస్తుతా ప్రస్తుతాలు లేవు, ఔపమ్యమూ లేదు. వ్యంగ్యార్థము దూరముగా ఉంటుంది. ఆ అర్థమత్యంత రమణీయముగా ఉంటుంది. ముఖ్యార్థము అప్రధానమైపోతుంది. ఒక పెద్దరాయి యెత్తి చెరువులో పడవేసినారను కోండి. పెద్దచప్పుడుతో నీళ్ళు పైకి లేచినై ! ఈ లేచిన నీళ్ళు పక్కఉన్న నీళ్ళలో ఒక్కతరంగాన్ని కలగజేసినవి ! ప్రథమ తరంగము తర్వాత క్రమముగా గోళరూపముగా ఒక్కొక్క తరంగము పుట్టి గోళవిస్తీర్ణమెక్కువౌతూ తుదకు ఒడ్డుకువచ్చి తాకినపుడు ఆ తరంగము “జిలజిల”ని చక్కని హృదయంగమమైన చప్పుడుచేస్తూ, చూడటాని కానందము కల్గచేస్తూ, నీళ్ళలో కాలుపెడితే ఒక విధమైన స్పర్శసుఖాన్ని కలగచేస్తుంది ! ఈ తుదితరంగము ధ్వన్యర్థము అనగా వ్యంగ్యార్థము వంటిది! మొదటి ప్రథమసంక్షుభిత తరంగము

వాచ్యార్థము ! దానిమీదే అనుక్రమణికగా ఈ తుదితరంగము ఆధారపడి ఉంది! కాని దానిఘోషకంటె, భిన్నత్వముకంటె భిన్నమైన సౌందర్యమూ, శబ్దమూ, మృదుస్పర్శా, కలిగిఉంటుందీ తుదికూలస్పర్శి తరంగము ! జన్మస్థానము రెండర్థాలకూ ఒకే శబ్దము ! ముఖ్యార్థము ఈ నూతనార్థాన్ని పుట్టించి తాను వెనక ఉంటుంది. ఈ క్రింది ఉదాహరణము లాక్షణికులిస్తారు !

"గచ్ఛ గచ్ఛసి చేత్కాంత పంథానస్సంతు తే శివాః
మమాపి జన్మ తత్రైవ యత్ర భూయో గతి స్తవ"

ఇది దూరదేశ ప్రయాణోన్ముఖుడైన నాయకునితో నాయిక అంటున్నది. ప్రయాణమా తప్పేటట్టులేదు; తనకా యిష్టములేదు! వద్దనీ చెప్పగూడదు ! అది అపశకునము. కాబట్టి ఈవిధముగా చెప్పినది! "ఓ కాంతుడా! నీవు పొమ్ము! నీమార్గము మంగళప్రదమగు గాక! నీ వెక్కడికి వెళ్ళుచున్నావో నేనక్కడే పునర్జన్మము నొందుదును" అని దీని అర్థము. మొదటి రెండుపాదాలు వెళ్ళమని ఉన్నది. చూడండి తర్వాత రెండుపాదాలు ! పునర్జన్మమొందే దెప్పుడు? చచ్చినతర్వాత ! కాబట్టి "నేను పునర్జన్మాన్ని పొందుతాను" అంటే "నీవు వెళ్ళితే నేను చచ్చిపోతాన' ని తాత్పర్యము. కాబట్టి "నీవు వెళ్ళవద్దు"అని మొత్తముమీద అర్థము ! చూచినారా వెళ్ళమనేదానికి వెళ్ళవద్దనే అర్థము క్రిందికి దిగినది. ఇది వ్యంగ్యమంటే ! ఇట్టి వ్యంగ్యార్థాన్ని లాక్షణికులు గౌరవించారంటే ఆశ్చర్యమేమున్నది. ఒక్కొక్కప్పుడు విపరీతార్థమే రావచ్చు ! అల్లరిపిల్లవాడొక డున్నాడనుకోండి ! వాడొకప్పుడు అల్లరి అమితముగా చేసినప్పుడు, "ఎంతబుద్ధిమంతుడివిరా ! నాయనా !" అన్నామనుకోండి! మన అభిప్రాయము "బుద్ధిమంతుడని కాదు, బుద్ధిమంతుడు కాడని." కాబట్టి "బుద్ధిమంతుడు" అనే పదానికి "అల్లరివాడు" అనే విపరీతార్థము వస్తున్నది! ఇదికూడా ఒకవిధమైన వ్యంగ్యమే అన్నారు ! ఈ విధమైన పరీక్షచేస్తే ఎటువంటి కావ్యముగూడా సంపూర్ణముగా ఆగదు ! ఈ క్రింది తిక్కనపద్యము చూడండి :

"నీవు సుభద్రకంటె కడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు దిట్టినను పంకజనాభ యొకండు రాజనూ

✻ "హనుమంతుడిముందు కుప్పిగంతులు" మొదలైనవి కూడా యిటువంటివే !

యావ భ్వధంబునందు శుచియై పెనుపొందిన వేణిబట్టి యీ
యేవురుచూడగా సభకునీడ్చె కులాంగన నిట్లొనర్తురే !"*

ఇందులో "పంకజనాభ" అనే సంబోధనా, "ఒకండు" అనే సంఖ్యావాచక సర్వనామమూ చూడండి. సుభద్రకృష్ణునికి చెల్లెలు సాక్షాత్తుగా ! కృష్ణుడెవరు ? మహావిష్ణువే ! మహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుడు తన స్వంత చెల్లెలైన సుభద్రకంటె ద్రౌపది కెక్కువ చనువూ గౌరవమూ యిస్తాడట ! ఇది ద్రౌపది యొక్క గొప్పతనాన్ని చెప్పుతున్నది. ఆ గొప్పతనానికి అవధిలేదు. పరమేశ్వరుడే తన స్వంత సోదరికంటె యెక్కువ గౌరవిస్తాడన్నప్పుడామెయొక్క గొప్పతనము తలచినకొద్దీ యెక్కువౌతున్నది! "అట్టి నను" అంత గొప్పదాన్నైన నన్ను! "ఒకడు" ఇక్కడ పేరు చెప్పకపోవడముచేత అశబ్దవాచ్యుడగు వ్యక్తి పేరుచెప్పదగని నీచుడనీ, లెక్క సేయదగినవాడు కాడనీ, తుదకు ఫలానా అని నిర్దిష్టము చెయ్యగలవాడు కాడనీ, ద్రౌపది కవమానము కలగచేసిన వ్యక్తియొక్క నైచ్యాన్ని వెనక ద్రౌపదినిగూర్చి చెప్పిన గొప్పతనముతో వైధర్మ్యము చూపుతూ, ఒక్కమాటతో తిక్కననిర్వచించి నాడు చూడండి "అట్టినను' 'అనేమాటకు సామాన్యముగా "పూర్వోక్తగుణవిశిష్టయైన నన్ను" అని అర్థం చెప్పకోవలె. "నను" లో ఉన్నగర్వం ఊరికే సర్వనామములోలేదు ! వెనుకటి మాటలతో కూడేటప్పటికీ "నను"కు ద్రౌపదీ గర్వకోపద్యోతకత్వము కలిగినది. ఆగర్వ మెట్లా తుదకు పరిణమించినదో చూద్దాము ! "అటువంటి గొప్పతనంగల నన్ను" యెవరు పరిభవించినది? "ఒకడు" నామ నిర్వాచ్యతకు తగని ఒక నీచుడు ! ఎవడో ఒకడు, వెధవ ! వాడిపేరెందుకులెండి" అన్నట్టున్నది. "ఈయేవురు చూడగా" అనేమాటలలో పాండవులయొక్క చేతగాని తనమూ, సంఖ్య ఉండీకూడా వాడినేమిచేయ లేకపోయినారనీ, సిగ్గులేక తలయెత్తుకు తిరుగుతున్నారనీ, ఆనాడు చూస్తూ వూరుకున్నవాళ్ళు వీళ్ళేనని, ప్రగల్భాలే కాని వీళ్ళేమిచేయలేరని, వాళ్ళయెదుట చూచినదానికి ప్రతీకారము చేయలేకపోయినారనీ, వీళ్ళుఏమైనా చెయ్యగలరని తనకు నమ్మకం పోయిందనీ, యీవిధముగా ఎన్నెన్నో హృదయంగమాలైన అర్థాలు స్ఫురిస్తున్నై !

* కులాంగన లిటులోర్తురే ! (పాఠాంతరము)

"కులాంగన నిట్లొనర్తురే!" ఇక్కడ పాఠభేదాలలో నేను గ్రహించినదిది. ఇది నాకు ఒక శాపంగా ద్యోతక మౌతున్నది "పతివ్రతనైన నన్ను ఇట్లాచేసినాడుగావాడు! చూడండి ! నశిస్తాడు" అని నాకు అర్థమౌతున్నది. ఇక్కడ వెనుక "నేను" ను అన్వయించుకోండి. ఆమె తాను పతివ్రతననే గర్వమూ, కోపమూ పురస్కరించుకొని, "కులాంగన నగు నాకిట్టి పరాభవము చేసినవాడు నశించు గాక" అని శపించినట్టు కనపడుతున్నది ! వ్యంగ్య మంటే యిట్లా ఉంటుంది.

గూఢతనూ, అన్యాపదేశాన్నీ, వ్యంగ్యమని భ్రమపడవద్దనీ, వ్యంగ్యమంటే యిట్టిదనీ, ఉదాహరణముతో చెప్పడముచేత, ఒకవేళ ఈ నవ్యులలో అట్టిది ఉన్నట్టు చెపితే, పాఠకులు దాన్ని సంపూర్ణముగా పరీక్షించి నిర్ణయించటానికి శక్తి కలుగుతుందని, యింత వివరముగా చెప్పినాను. నాకు చదివినంతవరకు ఈ నవ్యులలో వ్యంగ్యము కంటె వాచ్యము బహుళముగా కనపడుతున్నది. ఉత్తర రామచరిత్రలో భవభూతి వ్రాసిన "శ్రితాసి చందనభ్రాంత్యా దుర్విపాకం విషద్రుమం" అనే మొదలైన చక్కని కల్పనలనుకూడా వాచ్యాల క్రింద లాక్షణికులు కొట్టివేసినప్పుడు వీళ్ళ వ్రాతలలో వ్యంగ్యము మృగ్యమని చెప్పడమే భావ్యమని నాకు తోస్తున్నది. ఇతరత్రా యెక్కడైనా వ్యంగ్యముగా ఉన్నదని యెవరైనా వ్రాస్తే అప్పుడు దాని గూఢతాన్యాపదేశాలతో పరీక్షించి విమర్శిద్దాము.

## సాదృశ్యబాహుళ్యము (ఉదాహరణపరంపర) :

లలితకళ లన్నిటిలోకూడా నిజమైన కళావేత్తఅయితే తనచిత్రాలను, కొద్ది గీతలతోనో, కొద్ది మాటలతోనో చిత్రిస్తాడు. కాని చెప్పినదే చెప్పిగాని, వ్రాసినదే వ్రాసిగాని భాషాచిత్రాన్నిగాని, ఆకృతి చిత్రాన్నిగాని, చిత్రించడానికి యత్నింపడు. మొదటి గీతలలో పోలిక తేలేపోతేగాని, మొదటవచ్చిన శబ్దజాలముతోనే భావచిత్రాన్ని కల్గించలేకపోతేగాని, తర్వాత యెన్నిమార్లు గీతలుగీచినా, యెన్ని శబ్దాల నుపయోగించినా యెంతమాత్రము ప్రయోజనములేదు. ఒక వేళ మొదటిదానిని స్వల్పముగా సర్దవలసివస్తే సర్దవచ్చు తర్వాత ! రంగులు ఊరికే పామడముచేత ఆకృతి చిత్రము కల్పిస్తాడనటముగాని శబ్దజాలాన్ని ఎక్కువగా ఉపయోగించి

భావచిత్రాన్ని కల్పిస్తాడనడముగాని పొరపాటు ఇదొక విషయము. జ్ఞాతము ద్వారా అజ్ఞాతానికి వెళ్ళవలె ! నిజమేకాని ఈ అజ్ఞాతవిషయాన్ని తెల్పడానికి ఉపయోగించే ఉదాహరణలూ, సాదృశ్యాలూ అసంఖ్యాలుగా యిస్తే ఒకప్పుడుకాదు - ఎల్లప్పుడు - (గారెలెక్కువగాతింటే వెగటైనట్టు) వెగటౌతుంది. చెప్పిన భావాన్నే చెప్పడము. ఉదాహరణాలను అంతులేకుండా యియ్యడము, ఈ నవ్యులకొక అలవాటు. ఇదేమి జామెట్రీప్రాబ్లెమా ? లెక్కా? గట్టిగాచెప్పి బుర్రకెక్కించడానికి! కుంచెతో కొన్ని గీతలతో ఆకారము తేలేనివాడు తొట్టిలో ఉన్న రంగునంతా ఉపయోగించినా తీసుకునిరాలేడు. అట్లాగే కవికూడాను. ఈ విషయాన్నే ఉమాకాన్తపండితుడు "పులుముడు" అన్నది.

ఇలా నిరర్థక పదప్రయోగము, ఉదాహరణ పరంపరా, భావపౌనః పున్యమూ, సామాన్యముగా చాలామంది నవ్యులరచనలలో కన్పించుతై. శివశంకరశాస్త్రిగారి రచనలలో ఇవి కొంచెము తక్కువే అనవలె. మరీ భావపూర్ణ హృదయులైన వారిలో ఇది మితిమీరి పోయినది. నవ్యసాహిత్యానికిది అపకర్షహేతువని చెప్పవచ్చు. *

# ముగింపు

నవ్యాంధ్ర సాహిత్యముగూర్చి ముచ్చటించుకునే సందర్భాన ఈ భాగములో రాజకీయోద్యమాల ప్రభావాన్నీ, పత్రికల దోహదాన్నీ, సంస్థల ప్రాబల్యాన్నీ ప్రసక్తాను ప్రసక్తముగా ఆయా విశేషాల్ని (విపులముగానే) పరిశీలించినాము; అసహాయోద్యమము (Non-co-operation movement) యువకవుల హృదయాల్ని ఆవేశించి వాళ్ళచేత గేయాల్నీ పద్యాల్నీ, కావ్యాల్నీ ఎలావ్రాయించినదో చూచినాముగదా! దీనివలన రాజకీయోద్యమములో కవులెంతగా ఉపయోగపడగలరో ఆసందర్భము ఋజువుచేసినదనవలె.

---

* మన పూర్వలాక్షణికులు కూడా ఈవిధమైన కవిత్వాలనూ కవులనూ సూచించినారు చూడండి కవులనెలా ఏడు విధాలవారినిగా విభజించినారో.

1 వాచకుడు = పదాడంబరము 2. ఆర్థుడు = మితశబ్దము, అర్థవిస్తారము 3 శిల్పకుడు = యమకాదులు సుశబ్దము 4. రౌచికుడు = కథారుచి 5. భూషణార్థి = అలంకారప్రియుడు 6. మార్దవానుగతుడు = సరళశబ్దములు, విరళార్థములు 7. వివేకి స్మృతి శాస్త్రాలంకారప్రియుడు.

శారద - భారతి - జయంతి - సుజాత - వీణ - మహతి - ప్రతిభ మొదలైన పత్రికలు వర్ధిల్లి నవ్యాంధ్రసాహిత్య విస్తరణానికి ఎంతో తోడ్పడినా అనేకకవులను విమర్శకులను వెలుగులోకి తెచ్చిన విషయాలను గమనించినాము. వాటివెనక ఉన్న సంపాదకులు కవులకు భాషకుచేసిన ఉపకారము ఎంత చెప్పినాతీరనిదే! అలాగే "గృహలక్ష్మి" అనేక స్త్రీలను కవయిత్రులనుగా ఎలా తయారుచేసి యిచ్చినదో చూచినాము. పత్రికలలో పాతపేర్లు అనువృత్తాలవుతూ వచ్చినా, క్రొత్తవాళ్ళ సాధనలను ప్రోత్సహిస్తూ ఉండడముచేత రాబోయే కాలములో నవ్యసాహిత్యాని కొక చక్కని భవిష్యత్తు ఉన్నదనే ఆశ పొడముతున్నది. ప్రాతవాళ్లు సాహిత్యరంగములో కాలూనినిలువ ద్రొక్కుకొంటూ, రాబోయే రచయితల కుత్సాహము చేకూరుస్తూ ఉండడము గమనింపదగినది. అలాంటివారిలో సాహితీ సమితీయులెన్నదగినవారు కూడాను. వీరు రసవాదులు. ఉక్తిలో - భావములో నవ్యత నుద్దేశించినవారు. విశ్వనాథ, నోరిగడుసుబారుతున్నారు.

కవితాసమితీయులు (విశాఖపట్నం) సాధనచేస్తూ ఆశకల్పిస్తున్నారు. మారేపల్లివారి (కవిగారు) ప్రభావ మా సమితిలో యువకులను ప్రాచీన కవితామార్గమును దూషించే రచనలను చేయనీకుండా చేసినది. శ్రీరంగం శ్రీనివాసరావు, పురిపండా అప్పలస్వామి, వఝుల కాళిదాసు, పూడిపెద్ది వెంకట రమణయ్య మొదలైనవారు వీరిలో కొందరు. నవ్యసాహిత్య పరిషత్తు వచ్చి స్వేచ్ఛకు చక్కని అవకాశమిచ్చినది అనవలె. మొదట్లో చాలకాలము శివశంకరశాస్త్రిగారి వంటి పండితుని చేతిలో ఉండి నవ్యసాహిత్యపరిషత్తు అమంగళ కరములు, జుగుప్సా కరములు కాని రసవద్రచనలను ప్రోత్సహిస్తూ వచ్చినట్లు కన్పిస్తుంది. తెలికిచెర్లవారి కార్యనిర్వహణదీక్షా, తల్లావఝ్ఝలవారి సహృదయత్వమూ, అనేక యువకవుల్ని ఆకర్షించి నవ్యసాహిత్య పరిషత్సభ్యులను, అభిమానులను చేసినవి. వావిలాల సోమయాజులు, పిలకా గణపతిశాస్త్రి, శివరామం, పన్యాల రంగనాధరావు, పాప, రజని, మల్లవరపు, వట్టికొండ రంగయ్య, దేశిరాజు కృష్ణశర్మ, పిఠాపురం యువరాజా, మొదలైన వాళ్ళనేకులు సాధకులు బయలుదేరినారు. వీళ్ళవలన కొంత నవ్యసాహిత్యసృష్టి జరిగినది. తుమ్మల సీతారామమూర్తి చౌదరి, జాషువా, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,

దుర్భాక రాజశేఖరశతావధాని, సురవరం ప్రతాపరెడ్డి, గరికిపాటి మల్లావధానులు, పంగనామముల రామచంద్రరావు, దుర్భా సుబ్రహ్మణ్య శర్మ మొదలైన వారనేకులు ఏసంస్థలద్వారా కాక విడిగా కవితాసాధనచేస్తూ ఇతరులలో ఆయాప్రాంతాలలో ఉత్సాహాన్ని కల్పిస్తూ ఎంతోకృషిచేసి నవ్యసాహిత్య వృక్షాన్ని ఫలవంతము చేసినారు.

సాధన సమితీయులు (సికింద్రాబాదులో) సాధనచేస్తూ నవ్యచైతన్యాన్ని కల్పిస్తూ వచ్చినారు. వారిలో పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు, జమ్మలమడక సూర్యప్రకాశరావు, రాజలింగం, భాగీ నారాయణమూర్తి, భండారు చంద్రమౌళీశ్వరరావు, బూర్గుల రంగనాధరావు, నెల్లూరి కేశవస్వామి, దేవులపల్లి రామానుజరావు మొదలైన సాధకు లాశకల్పిస్తున్నారు.

అప్పుడే ఒకప్రక్కనుంచి రెండవ ప్రపంచయుద్ధ మేఘము దట్టముగా క్రమ్ముకొని వస్తున్నది; కాలవైపరీత్యమే సాహిత్యాల లోనూ, ప్రతిబింబిస్తుందన్నట్లు నవ్యాంధ్రసాహిత్యములో నూతన సూత్రాలపైన రచనల్ని సాగించడము ప్రారంభమైనది; కొంతవిప్లవ దృష్టిప్రబలడము మొదలు పెట్టినది; స్వేచ్ఛ-స్వాతంత్ర్యమనేపదాలపై దృష్టి కేంద్రీకృతమైనది; శిష్టా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు గారల రచనలు వెనుకటి నవ్యమార్గానికి భిన్నాలై అతినవ్య చైతన్యాన్ని లోకములో కలుగజేస్తున్నవి. జలసూత్రము రుక్మిణీనాధశాస్త్రిగారు స్థిర పడిన నవ్యుల కవిత్వంపైనా, క్రొత్తగా వచ్చిన అతినవ్యుల ధోరణిపైనా పారడీలువ్రాస్తూ కొంతచైతన్యాన్ని కలుగజేస్తున్నాడు. వెనుకటిదానిపైన అసంతృప్తి, ముందును గూర్చినఅనిర్దిష్టతా, ఏర్పడినవి సందిగ్ధ వాతావరణము పెరిగిపోతున్నది.

రాజకీయాలలోని విభిన్నమతాలు సాహిత్యములోకూడా ప్రతిబింబించడము ప్రారంభమైనవి. ఆ ప్రకారముగా నవ్యసాహిత్యము నవ్యాతినవ్య పథముల నడుస్తూ వచ్చినది.

ఏఏ నూతన మార్గాలు సాహిత్యములో ఏర్పడినవో వానికర్త లెవరో వానివాని ప్రభావము లెలాంటివో, అనుయాయులుగా ఎవరెవరెలా కృషిచేసినారో, సంప్రదాయ సంస్కృతుల నిలువ ద్రొక్కే ప్రయత్నమెలా ఒకప్రక్కజరుగుతూ వచ్చినదో, మొదలైన విషయాలను విపులముగా రాబోయే భాగములో పరిశీలిద్దాము.

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

## వివిధ కవితోద్యమాలు : సాహిత్య వికాసము

## 1

### రాజకీయములు : విప్లవదృష్టి

ఇంతవరకు పూర్వభాగాలలో - నవ్యసాహిత్య మేవిధముగా రూపొందినదీ, ఎలా విస్తరించినదీ, ఎవరెవరే విధముగా కృషిచేసినదీ, ఏయే వ్యక్తులూ సంస్థలూ మూలభూతములుగా నవ్యసాహిత్య మెలా వృద్ధి చెందినదీ, ఆ వచ్చిన నవ్యసాహిత్యం ప్రజామోదం ఎలా పొందినదీ, గుణదోష పరిశీలనానికి ఎంతవరకు ఆగినదీ మొదలైన విషయాలను యథావకాశముగా పరిశీలించినాము. ఈ భాగములో ఇంచుమించుగా రెండవ ప్రపంచయుద్ధకాలము మొదలుగా ఈ పదేండ్లలో వెలువడిన సాహిత్యాన్నీ, ఆయా కవితోద్యమాలను పర్యాలోచిద్దాము.

ఈ దశవర్షకాలం భారతదేశ రాజకీయాలలో అనేకమార్పులు కలిగినకాలం. దేశచరిత్రలో ఎంత విలువ అయినదో సాహిత్య చరిత్రలోనూ ఈ కాలము అంత విలువ కలిగినది. రాజకీయాలలోను, సాహిత్యములోను విప్లవదృష్టి ఎక్కువగా ప్రబలిపోయింది. సాహిత్యం రాజకీయోద్యమాల్ని ప్రచారము చేసుకోడానికి ఉపయుక్తమైన కాలమిది. ఇదివరకులాగా కాక ఈ కాలంలో రచయితలు వ్రాయడమే తడవుగా పత్రికలలో అచ్చుకావడం సులభమై పోయింది; ప్రచారం కోసం ప్రాకులాడడం హెచ్చిపోయిన కాలమిది. అసంఖ్యాకాలైన పత్రికలు! ఎక్కడ చూచినా రాచకీయ చైతన్యమే. సభలు, ఉపన్యాసాలు ఎక్కువై పోయినవి. ఒక్కమారు రాజకీయా లీ పదేళ్లలో ఎలా ఉన్నవో పరిశీలిద్దాము.

దేశనాయకుల కృషి ఫలితముగా, వారి త్యాగము కారణముగా, భారత దేశములో బ్రిటిషు ప్రభుత్వానికి పూర్వమున్నంత బింకము లేకపోతున్నది. కాంగ్రెసు

అనే ఓడకు గాంధీగారు చుక్కాని వంటివాడు - అనేక ఉద్యమాల ద్వారా ఒత్తిడి తీసుకొని వస్తూ బ్రిటిషు వారి చేతులలోనుంచి మనదేశాన్ని తీసికొని, ప్రజాయత్త ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి ఆయన ప్రయత్నం చేసినాడు. క్రమముగా రాష్ట్రాలలో ఎడ్వైజరీ గవర్నమెంటు కొద్దిగా వీగి దేశ సేవాపరాయణులు, త్యాగధనులు, అయిన కాంగ్రెసు నాయకులతో గూడిన మంత్రివర్గాలకు అవకాశము నిచ్చినవి. పైన అధికారము చెలాయించే వాళ్లు బ్రిటిషువాళ్లే. అయినప్పుడు దేశీయ మంత్రి వర్గాలకున్న ప్రతిపత్తి ఎట్టిది? రెండవ ప్రపంచ యుద్ధములో ఇండియాను కూడా భాగస్వామినిగా వీరిని సంప్రదించకుండా బ్రిటిషువారు చేర్చినారు. ఆ సంఘర్షణములో కాంగ్రెసు మంత్రివర్గాలు గాంధ్యుపదేశాను గుణముగా రాజీనామా లిచ్చినవి. తీవ్రమైన అశాంతి దేశమంతటా ప్రబలినది. ఒకప్రక్క రెండవ ప్రపంచయుద్ధము వచ్చిపడినదాయె, బ్రిటిషువారికి ఇండియా మద్దతు కావలెను. గాంధీని విరోధము చేసుకోగల ధైర్యము లేదు, బ్రిటిషు సామ్రాజ్యానికి. ప్రపంచయుద్ధమా యేండ్లతరబడిగా సాగుతూ విపరీత పరిస్థితుల్ని ప్రపంచమంతటా కల్గిస్తున్నది. భారతీయులలో అసంతృప్తి బాగా ప్రబలింది. బ్రిటిషువానికి సహాయపడవలెనంటే ప్రజ కొట్టవచ్చేటట్లున్నది. ఇక్కడి నుంచి సరుకు ఎగుమతి చేస్తేగాని బ్రిటిషువారికి గతులులేవు. కాంగ్రెసు పక్షము వ్యతిరేకముగా ఉన్నట్లు తోచగానే కాంగ్రెసు నాయకుల్ని ప్రభుత్వమువారు జైళ్ళలో పెట్టినారు. అంతకు పూర్వముకన్నా భారతీయులకూ, భారతదేశానికీ కఠినపరీక్ష ఆసన్నమైనది! జైళ్ళలో బ్రిటిషు సామ్రాజ్యవాదము పెట్టిన బాధలు దుర్భరమైనవి. ఘోరమైన చావులు సంభవించినవి. నాయకులను జైళ్ళలో పెట్టిన బాధలు ప్రజలు విని విభ్రాంతులైనారు; తెప్పరిల్లి, విప్లవశంఖాన్ని పూరించడానికి పూనుకొన్నారు. మహదేవ్ దేశాయి, కస్తూరిబా గాంధీ మరణాలు (జైలులో) తీవ్రసంచలనానికి కారణములైనవి. భారతదేశమంతటా విప్లవాగ్ని జ్వలిస్తుందనే భయం క్రమముగా హెచ్చడం ప్రారంభమైనది. బ్రిటిషువారు పంపిన రాయబారాలు ఫలప్రదంతాలు కాలేదు. కాంగ్రెసు నాయకులను కారాగారాలలో నుంచి విడుదల చేసినారు. ఏమిటీ ఫలితం? దేశప్రజా, నాయకులూ ఏకాభి ప్రాయులైనారు! వీరు బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రక్కలో బల్లమై నిల్చినారు. లార్డు

వేవేల్ గవర్నరుజనరల్‌గా చాల నాటకము ఆడినాడు. ఏ పప్పులూ ఉడకలేదు. బ్రిటిషువానికి ఎటువైపు చూచినా శత్రుత్వమే ఎదురువచ్చింది. ముస్లింలీగు నాయకుడైన జిన్నాను దువ్వినారు. హిందువులకూ, ముస్లింలకు, మధ్య వైషమ్యాలను రెచ్చగొట్టినారు. గాంధీ-జిన్నా సంభాషణలు విఫలములు కాజొచ్చినవి. కాంగ్రెసు వారికీ ముస్లింలీగు వారికీ మధ్య ద్వేషభావాలు తీవ్రరూపం దాల్చేటందుకు బ్రిటిషు సామ్రాజ్యము సర్వవిధాలా ప్రయత్నించినది. బ్రిటిషువారి మద్దతు చూచుకొని జిన్నా బిర్రబిగవడం ప్రారంభించినాడు. పాకీస్థాను అని ముస్లింలకు ప్రత్యేక రాజ్యాన్ని పంచియియ్యవలెనని పట్టుక్కూచున్నాడు జిన్నా. దేశము విభజన కాకుండా అఖండము గానే ఉండవలెనని కాంగ్రెసు పట్టుబట్టింది. అది కొనసాగేటట్టు లేదు. ఇలా ఉండగా గాంధీగారు ఆగస్టు 9, 1942 నాడు 'క్విట్ ఇండియా' సూత్రాన్ని ప్రతిపాదించడముతో విప్లవం దేశం నలుమూలలా వ్యాపించినది, దావాగ్నిలాగా. క్రిప్సు రాయబారం (1942) జరపడానికి వచ్చి వెళ్ళినాడు. కల్లోల పరిస్థితులు దేశంలో బహుముఖాల పొడసూపినవి. లార్డుమౌంటుబాటన్ గవర్నరు జనరల్‌గా వచ్చినాడు. పునః రాయబారప్రయత్నాలు (కాబినెట్‌మిషన్ 1944) ప్రారంభం కాజొచ్చినవి. గాంధీ జిన్నాల మధ్య సామరస్యం అసాధ్యమని తేలిపోయింది. ఇంతలో ఇంగ్లాండులో టోరీలు ఓడిపోయి లేబరుపార్టీ విజయం పొందడం జరిగింది. ఇదొక విధముగా భారత దేశానికి లాభకరమైనదనవలె! భారతదేశం కొరకరానిది అయినది బ్రిటిషువారికి. క్రమముగా దేశాన్ని విభజించి, హిందూ ముస్లిం వైమనస్యాలను పెంచి, కరువు కాటకాల్ని కల్పించి, బీభత్స పరిస్థితులలో మనదేశాన్ని వదలి ఎలాగైతేనేమి బ్రిటిషువారు వెళ్ళిపోయినారు; భారతదేశానికి పారతంత్ర్యం వదలిపోయింది. - ఇదీ దిఙ్మాత్రముగా ఈ కాలంలోని రాజకీయ పరిణామం!

దేశపరిస్థితుల కనుగుణంగా సాహిత్యంలోనూ నవ్యరీతులూ, వివిధ ధోరణులూ పొడసూపుతూ వచ్చినవి. వాని స్వరూప స్వభావాల్నీ, ఆయా ఉద్యమకర్తల్నీ, తదనుయాయుల్నీ, వారు చేసిన కృషినీ ముందు ముందు పరిశీలించుకొందాము.

ఇక్కడ ఒక విషయము చెప్పవలె. రెండవ ప్రపంచయుద్ధచ్ఛాయలు కన్పిస్తున్నప్పటి నుంచీ కవితారీతీ, కావ్యవస్తువూ, మారిపోవడము ప్రారంభమైనది.

కవులదృష్టి యలౌకికము నుంచి లౌకికమైనది. విప్లవమే సాహిత్యం అంతటా పర్వీన ధర్మమైపోయినది. ఇదే ఈ పదేండ్ల (40-50) సాహిత్యములోనూ ప్రతిబింబించినది. అయితే రచయితలలో భావకవిత్వపు బాటల నడిచేవారు లేకపోలేదు; పురాణముల ననువదించేవారు లేకపోలేదు; ప్రబంధ ప్రక్రియను సాధిస్తూ ఉన్నవారు లేకపోలేదు, ఇవ్విధముగా నవ్య కవులనీ, అతినవ్యకవులనీ, అధివాస్తవికులనీ, నాస్తికవాదులనీ, అభ్యుదయ కవులనీ, ఒకటేమిటి అనేక నామములతో కవితారీతులు - సాహిత్య మార్గములు - కవులు - వ్యవహరింపబడుతూ వచ్చినారు. ఏకకాలావచ్ఛేదకాలుగా విభిన్న కవితారీతులు ఆంధ్రభాషలో ప్రజల ఆదరాన్ని చూరగొన్నాయంటే విశేషమే వాటి నన్నిటిని గురించి విసరంగా తెలుసుకునే పూర్వము ఈ కాలానికి స్థిరపడిన కొందరు పండితకవులను గూర్చి తెలుసుకుందాము.

## కొందరు పండితకవులు :

వీరినిగూర్చి కొంత కాకపోయినా కొంతైనా పూర్వభాగాలలో స్పృశించడము జరిగినది. కాని వీరు వివిధ పట్టణాలలో తమ చుట్టుపట్లనున్న యువకులలో సాహితీ చైతన్యమును కల్గిస్తూ, తాము చిన్నచిన్న కేంద్రాలుగా సాహిత్యవలయాలను సృజించిన వారని మాత్రము గమనించవలె. వీరిలో మరికొందరు తమకు తాము కృషి చేసుకుంటూ ఎవరితోనూ సంబంధం లేకుండా విడిగా నిల్చినవారూ ఉన్నారు. అయినా వీరి కవిత్వములో పలుకు ఉన్నట్లు గమనించగల్గుతాము. క్రమంగా వీరంతా ఆంధ్ర ప్రజామోదాన్నీ సమ్మానాన్నీ పొందినవారే. వీరి ప్రభావం నవ్యాంధ్ర సాహిత్యములో ఎంతగా ముద్రితమైనదో, వీరెలా కృషి సల్పినారో పరిశీలిద్దాము.

## దుర్భా సుబ్రహ్మణ్యశర్మ :

నెల్లూరు మండలాన్ని సాహిత్యోత్సాహముతో ఉర్రూతలూగించిన వారిలో దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ముఖ్యుడు. ఈయన అనేక యువకులలో సారస్వతాభిలాష కలిగించి నెల్లూరి మండల సారస్వత జీవితములో నవ్యచైతన్యాన్ని తెచ్చి పెట్టినాడు. అనూచాన వైదిక కుటుంబములో నెల్లూరులో 1-10-1875 తేదీన

జన్మించినాడు. చిన్ననాటి నుండి పద్యరచనాభ్యాసము కలిగి ఆశుకవిత్వము చెప్పుతూ వచ్చినాడు. అష్టావధానాలు చిన్నతనంలో ఎన్నోచేసినాడు. మంచి పండితుడు. ఇంగ్లీషులో ఎఫ్.ఏ. దాకా చదివి రెవిన్యూ శాఖలో కొంతకాలం మొదట్లో పనిచేసినాడు. ఆ పిమ్మట నెల్లూరులో కాలేజీ పెట్టినప్పటి నుంచీ అందులో ఆంధ్ర భాషాధ్యాపకులుగా పనిచేసి విశ్రాంతి తీసుకున్నాడు. ఈయన విద్యార్థులకనేకులకు కవితాభిక్ష పెట్టినాడు. నెల్లూరులో ఈయనలేని సారస్వతసభ అంటూ లేదు. చక్కని తెనుగు కవిత్వము చెప్పి "అభినవ తిక్కన" అనీ "సాహిత్యస్థాపక" అనీ, బిరుదనామాల్ని పొందినాడు. పరమహంసానందనాథుని లక్ష్మీశృంగార కుసుమమంజరినీ, శంకరుని 'సౌందర్యలహరి, వివేకచూడామణులను' సరళశైలిలో చక్కగా ఆంధ్రీకరించిన కవిసత్తముడు. సారస్వత జిజ్ఞాసతో కూడిన అనేక వ్యాసాలను రచించిన ప్రజ్ఞావంతుడీయన. కవిత్వంలోనేకాక వేదాంత జ్యోతిషాలలో నిశిత జ్ఞానము సంపాదించుకొన్న విద్వాంసుడని కీర్తిబడసినాడు. దువ్వూరిరామిరెడ్డి, ముత్తరాజు సుబ్బారావు, మోచర్ల రామకృష్ణయ్య గారలవంటి కవులకు ఈయన గురుప్రాయుడంటే ఈయన శక్తిసామర్థ్యములను గూర్చి వేరే చెప్పనక్కరలేదు. నెల్లూరులో సాహిత్య కేంద్రముగా ఉండి యెందరెందరినో ఆకర్షించి, యెన్నో గ్రంథాలకు సారస్వతపు విలువ కలిగిన పీఠికల్ని రచించి కీర్తికాంచుచున్న ఈయన కృషి యెంతైనా ప్రశంసింపదగినది.

## మారేపల్లి రామచంద్రశాస్త్రి :

ఈయన విశాఖపట్నం జిల్లాకంతటికీ సాహిత్య చైతన్యము చేకూర్చిన వ్యక్తి. వ్యక్తే కాదు. సంస్థ! ఈయన యిచ్చిన తరిఫీదును అనుసరించి యెందరెందరో కవులు ఆ ప్రాంతాల ఉద్భవించినారు. కవితాసమితికి ఈయన ప్రాణమువంటివాడు. దానికి ఈయన మొదటి నుండి అధ్యక్షుడు. ఈయనను ఆ ప్రాంతాన పేరు పెట్టి పిలువడముకన్న "కవిగార"ని సంభావించడముతోనే తత్ప్రాంతీయులు ఈయన్ని సమ్మానిస్తూ ఉంటారు. ఈయన గొప్ప వ్యక్తి. గంటలతరబడి గంభీరోపన్యాసము చేస్తూ ఉంటే జనులు అలా నోరు తెరుచుకుని వింటూ ఉంటారు. ఈయనకున్న కార్యదీక్షా, కవితాశక్తీ అద్భుతమైనవి. నాటక సమాజములను నిర్వహించడములో

ఈయన తీసుకున్న శ్రద్ధ మరొకరు తీసుకోలేదు అని చెప్పవచ్చు. సమగ్రమైన తెనుగు వ్యాకరణమునూ, వ్యుత్పత్తులతో కూడిన సమగ్ర ఆంధ్ర నిఘంటవునూ, వ్రాయవలెననే ధృఢసంకల్పముతో ఈయన వయసు మళ్ళినా, (జననము 1873) అచంచల దీక్షతో కృషి సాగిస్తూ ఉండడము మెచ్చదగింది. "నుడికడలి", అన్న పేరుతో ఈయన నిఘంటువు◆ కొద్దిగా దేశంలోని వెలుగును చూచింది. గ్రంధాలయ ఉద్యమంలో ఈయన అమితముగా కృషి చేసిన, చేస్తూఉన్న వ్యక్తి.

## దుర్భాక రాజశేఖరశతావధాని :

ఈయన రాయలసీమ పండించిన రత్నాలలో ఒకడు; కడప జిల్లా జమ్మలమడుగు గ్రామంలో 18-10-1888 తేదీని జన్మించినాడు. మద్రాసు క్రిష్టియన్ కాలేజీలో ఎఫ్.ఏ. వరకు చదివినాడు. కాని చిన్ననాడు విద్యగరపిన కందాళ్ల దాసాచార్యులు గారి ప్రభావము ఈయన మీద ఎంతైనా ఉన్నది. కవితాగురువులు దాసాచార్యులుగారే! ఈయన గొప్ప దేశభక్తుడు. ప్రొద్దుటూరులో డిస్ట్రిక్టుమునసబు కోర్టులో లేఖకుడుగా 14 సంవత్సరములు పనిచేసి, 1921లో గాంధీగారి పిలుపు నందుకొని ఉద్యోగానికి రాజీనామా నిచ్చిన త్యాగి యీ శతావధాని. ఈయన అనేక పద్యకావ్యాలనూ, నాటకాలనూ రచించినప్పటికీ, 1915 నుంచి కృషి చేస్తున్నప్పటికీ, ఆంధ్రలోకానికంతకూ గర్వమును ఆపాదించే 'రాణా ప్రతాపసింహచరిత్ర'మనే వీరరసప్రబంధాన్ని రచించిన తర్వాతనే (1932) యీయన కీర్తి నలుదిశలా వ్యాపించిన దనవలె. 1920 నుంచి 1926 వరకు ఈయన గడియారం వెంకటశేషశాస్త్రిగారితో కలసి అష్టావధానాలు, శతావధానాలు చేసినాడు. అప్పటి నుంచే శతావధాని బిరుదము ఈయన పేరులో కలసిపోయినది. ఈయన బహుగ్రంథ నిర్మాత.*

---

◆ వాడుకలతో, సామెతలతో, ప్రయోగాలతో వ్యుత్పత్తులతోసహా ప్రమాణాంధ్రనిఘంటువును వెలయించుటకు రామచంద్రశాస్త్రిగారు చేస్తున్న ఈ ప్రయత్నము ప్రశంసనీయము.

భారతి డిసెంబరు 45

* ఈయనకున్న బిరుదులు చూడండి; కవిసింహ, అవధాని పంచానపన, కావ్యకళానిధి, కవిసార్వభౌమ, వీరకవితావీర, మహాకవిచూడామణి, అభినవతిక్కన, వీరప్రబంధ పరమేశ్వర, చారిత్రక కవిబ్రహ్మ, సుకవిరాజరాజ, కవితాసరస్వతి, మహాకవి మార్తాండ, చారిత్రక కవితాచార్య, కవిబ్రహ్మర్షి మూర్ధన్య, వీరరసరత్నాకర, రసకవితా నిష్ణాత, సాక్షాద్వీరప్రతాప, మహాకవి పారిజాత, ఆంధ్రకవితా మహాశిల్పి, సుకవిపరమేశ్వర, సుకవి సామ్రాట్, అభినవటాడ్డు.

'శరన్నవరాత్ర పద్యావళి' 1915లో బహుమానము పొందినవి. 'వీరమతీచరిత్రము' (1916)◆ 'చండనృపాలచరిత్రము' (1921), పుష్పావతి (1947), 'అమరసింహ చరిత్ర' (1950) అను పద్య ప్రబంధాలు ఈ కవిరచనా పాటవాన్ని ప్రదర్శించేవి; సలక్షణమైన భాష, గంభీరమైన శైలీ, ఈయనను మహాకవికోటిలో చేర్చుతున్నవి అనవలె. సీతాపహరణము (1923), సీతాకల్యాణము (1923) అనే రామాయణ నాటకాలను, పద్మావతీ విజయమనే (1924) మరొక నాటకాన్నీ రచించి యీయన నాటకకవి అనిపించుకున్నాడు. ఈయన కాంగ్లములో ఉన్న ప్రవేశము ఆ భాషలో గ్రంధకర్తను చేసినదంటే వేరే దానిని గూర్చి వ్రాయనవసరము లేదు. The Heroines of Hindustan అని ఆర్యావర్త వీరనారీమణులను గూర్చి ఆంగ్లములో గ్రంధమును (1938) రచించి ప్రకటించినాడు. కవిగానేకాక ఆ ప్రాంతములో ప్రజాహిత జీవితాన్ని గడుపుతూన్న వ్యక్తిగాకూడ ఈయన గణనకెక్కినాడు. మునిసిపాలిటీలో వైసుచైర్మనుగాను, తాలూకా బోర్డులో వైసు ప్రెసిడెంటుగాను, మద్రాసు సెనేటు సభ్యుడుగాను వేదపాఠశాలా కార్యదర్శిగాను, ఇంకా ఎన్నో పదవులలో ఉండి దేశ భాషాసేవ చేసిన కవిపండితుడు, ధీమంతుడీయన. ఇదివరకు చెప్పినట్లుగా రాణా ప్రతాపసింహచరిత్ర వీరి గ్రంధాలలో మకుటము. ఈయనకు దేశమనేక విధాలుగా తన సంతోషాన్ని తెలుపుకున్నది. ఈయనకు అనేక స్థలాలలో సమ్మానాలు, బిరుదులు, బహుమానాలు లభించినవి!

రాజశేఖర శతావధానిగారు రాయలసీమలో చాలమంది కవులకు✻ ప్రోత్సాహమిచ్చినాడు. అనేక గ్రంధాలకు ఈయన పీఠికలు వ్రాయడమే యిందుకు తార్కాణము.

---

◆ సాహితీ సమితి వారు కురుగంటివారి ఆధిపత్యాన 'వీరగాధావిధాత' అనే బిరుదాన్నిచ్చి గౌరవించినారు.

✻ అనుభవ చికిత్సాదర్పణము వ్రాసిన వసంతపురం ము`సెయ్యగారు, రంజనోపాఖ్యానాది గ్రంధాలు వ్రాసిన కె రామస్వామి, చింతా నృసింహరెడ్డి అనే కవీ, 'కావ్యాలంకార చూడామణి' పరివర్తనము చేసిన కాండూరు నరసింహాచార్యులు వీరి మన్ననకు పాత్రులైనవారు! కలచవీడు వేంకటరమణాచార్యులతో అవధానాలు కూడ కలసి చేసినట్లు తెలుస్తున్నది.

రాణాప్రతాపసింహచరిత్ర మీ కాలములో రచింపబడిన ప్రథమాంధ్రేతిహాస ప్రబంధము. ఉత్తమ చారిత్రకకావ్యము◆. రాజవంశ చరిత్రలూ వాటిలో చిత్తూరు రాజవంశ చరిత్రా, ప్రతాపసింగు యొక్క శౌర్యపరాక్రమాలూ, అక్బరు ప్రతాపసింగును లోబరచుకోవలెనని నయమునా భయమునా చేసిన ప్రయత్నాలూ, కొందరు రాజపుత్ర ప్రభువులు మహమ్మదీయులకు లోబడడమే గాక వారితో సంబంధ బాంధవ్యాలు కూడా జరపడమూ, నౌరోజుత్సవమూ, హిందూరాజుల ధర్మచ్యుతీ, అక్బరు వంటి వాళ్ళ ద్వారా ప్రతాపసింగును లోబరుచుకోటానికి ప్రయత్నించడమూ, చిత్తూరు ముట్టడీ, ప్రతాపుని రాజ్యచ్యుతీ, తత్కాలములో ఆయనపడిన కష్టాలూ, ఆయన కుటుంబానికి వచ్చిన ముప్పులూ భిల్లనాయకులప్రాపూ, దినైక గండంగా కాలము గడపడమూ, తుదకు దేశము వదలడానికి ప్రయత్నించడమూ, 'భామాసాహి' దర్శనమూ, అతని ద్రవ్య సహాయముచేత జయించడమూ, మొదలైన విషయాలతో కూడి ఉన్న ఉత్తమ కావ్యమిది.

ఈ గ్రంథము చదువుతూ ఉంటే భారతం చదువుతూ ఉన్నట్టుంటుంది; దీనిలోని యుద్ధవర్ణనలు చదువుతూ ఉంటే ఎలాగైతే తిక్కన యుద్ధవర్ణనలు ఒకదానికంటె ఒకటి నూతనముగా ఉంటవో అల్లాగే ఉంటవి. అడవిలో ప్రతాపసింహు సంసారము పడిన శ్రమా, ఆయన భార్యపాతివ్రత్యమూ, పిల్లల శౌర్యమూ, తల దాచుకుంటూ యుండగా తురకల దండు రావడము వలన సపుత్రకళత్రముగా ఆయన పడిన శ్రమా, గడ్డిరొట్టెలు తినడమూ మొదలైన ఘట్టాలు చదువుతూ ఉంటే ఒడలు జలదరిస్తూ ఉంటుంది. వీరమాత అయిన పాటీశ్వరీదేవి శీలమూ, వీర యువకులగు సంతానము యొక్క యుద్ధోత్సాహమూ, వీరుడై యేకపత్నీ వ్రతస్థుడైన ప్రతాపుని శీలమూ మొదలైనవి చాలా రసవంతముగా వర్ణింపబడినవి✻. ఈ పాత్రలు

◆ చూ భారతి నవంబరు 1943 సంచికలో విశ్వనాథవారి వ్యాసము.

✻ "ఈ రాణా ప్రతాపచరిత్ర రామాయణములాగా చాలా వ్యాపించదగ్గది." 'నీహారలేశాల కేమి? అవిలేని కవియెవడు? ఈనాటి ధన్యకవులలో యీయన చిటికిని వేలిమీదికి వచ్చేవాడేగాని అల్లాటప్పావాడు కాడు ' (చెళ్ళపిళ్ళ)

ఇంతకన్నా కవికి కావలసిన ప్రశస్తి ఏమున్నది? 'రాణా ప్రతాపచరిత్రలో నుంచి కొన్ని పద్యాల నుదాహరిస్తాను :

సీతారామకుశలవులకు తులతూగుతున్నవి. ప్రతాపసింహుడు దేశం వదిలి వెళ్లడానికి ఉద్యుక్తుడైన సందర్భములో దేశమాతకిచ్చిన వీడ్కోలు ఎంతటి పాషాణ హృదయాన్నైనా కరిగిస్తుంది. ఈ గ్రంథము ఒక్కమాటు మొదలుపెడితే ఇక వదలబుద్ధి పుట్టదు. ఉపోద్ఘాతములో భావ కవిత్వమనేదాన్ని కొంచెము హాస్యముతో వర్ణించినాడు. ఈ గ్రంథమీ దశాబ్దిలో వ్రాయబడ్డ ఉత్తమకావ్యాలలో ఒకటి.

---

ఇరువదేండ్లుగ నుత్తమ పరికరముల
భక్తిఁగూర్చి నాపావన స్వాంతనుందు
తల్లి! నేగట్టుకొనిన స్వాతంత్ర్యవజ్ర
భవనరాజంబు కన్నీటివరద మునిగె.'

విశ్వపావనమైన వృత్తి వర్తించు గోబ్రాహ్మణులకుఁ దగ్గుపాటుకలిగె
ధాత్రనిభుల్ మునుల్ స్థాపించు వర్ణాశ్రమాచారవిధు లడుగంటిపోయె
మంగళలక్ష్మి సమానకాలౌ సాధ్వుల సౌశీల్యగరిమ కార్యంబునందె
పెట్టనికోటలై వెలసి నిన్గొల్చువీరుల పౌరుషము గంగ గలిసిపోయె

వేయియేండ్లుగ వ్రేటుపై వ్రేటు దగిలి
చిక్కి, ససిదక్కి, స్రుక్కి, కృశించి, నాదు
పాలనమున మంచముపట్టి, డీలుపడగ
పాలుపడితివె? తల్లి మేవాడలక్ష్మి!
భానుకుల గౌరవము నిల్పంగ నోడి
త్యాగమునఁ గుంటువడి, నీ పదములగొలుచు
పున్నెములులేక, దూరభూములకునేగు
మమ్ము మా పేళ్లు లోకంబు మరచుగాత

నేనేగాక, మరొక్కధీరు డెవ్వడేనిన్, నిన్ను సేవింప నెం
తేనిఁ బూనిన, వాని పుణ్యఫలమున నేనిఁ దల్లి! మేవాడ ల
క్ష్మీ నిత్యోత్సవనిత్య మంగళ జయశ్రీ నిత్యసౌభాగ్య రే
ఖా నిత్యప్రభలెల్ల నీకు గలుగుం గాకంచు కాంక్షించెదన్

చెళ్ళపిళ్ళవారి యీ వాక్యాలు గమనించండి :

"కవులలో ఇట్లు తన్మయత్వం కలవారు కొందరేయుంటారు. ఆధునికులలో ఈ రాజశేఖర కవి తన్మయత్వంగల కవి అని రచన వ్యాఖ్యానిస్తూ ఉంది. ఉదాహరించవలసివస్తే 100కి 50 పద్యాలేనా ఉదాహరించవలసి వస్తుంది." - ఆంధ్రపత్రిక 23-3-41

# వెంపరాల సూర్యనారాయణశాస్త్రి :

ఈయన అమలాపురము తాలూకాకు చెందిన విద్వత్కుటుంబములో జన్మించి తత్సంప్రదాయాన్నీ నిలబెట్టిన పండితుడు. ఇందుపల్లి అనే గ్రామంలో 28-7-1896 తేదీన జన్మించినాడు. ఈయన పినతాత సీతారామశాస్త్రిగారు పూర్వ మీమాంసలో అఖండ ప్రజ్ఞను గడించిన పండితుడు. తండ్రి ఆగమముల వల్లించిన శిష్టుడు. యజ్ఞము, చయనము మొదలైన క్రతువుల్ని ఈయన తాత తండ్రులు చేశారంటే ఈ కుటుంబపు వైదిక సంపత్తి వేరే చెప్పనక్కరలేదు. సూర్యనారాయణ శాస్త్రిగారు చక్కని పండితుడు. చావలి లక్ష్మీనరసింహశాస్త్రిగారి వద్ద సాహిత్య గ్రంథాలను, వేదుల సూర్యనారాయణ శాస్త్రిగారివద్ద వ్యాకరణశాస్త్రాలన్నీ అభ్యసించిన వ్యక్తి. చిన్నప్పటినుంచీ కవిత్వము చెప్పడము ఈయనకు అలవాటుగా ఉండేది. దేశభక్తి ఈయన కపరిమితము. బోర్డుస్కూళ్ళలో పండితుడుగా పనిచేస్తూ 1921 అసహాయోద్యమంలో ఆ ఉద్యోగాన్ని విరమించి కాకినాడ నేషనల్ స్కూలులో ప్రవేశించి పనిచేసినాడు. 1923లో తనకు కలిగిన అనారోగ్యమును పురస్కరించుకొని "వేంకటేశ్వర శతకాన్ని" రచించడం జరిగింది. పంజాబు హత్యలనుగూర్చి ఈయన వ్రాసిన పద్యాలు ఆనాటి కాకినాడ సభలలో మారుమ్రోగి పోయినవి. పిఠాపురములో సూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయములో 1925 నుంచి 1937 వరకు ఉండి ఈయన తన్నిఘంటు నిర్మాణమునకుగాను చేసిన కృషి అపారమైనది. ఒక్క పదమునకు ప్రయోగముల వివిధ కావ్యాలలో నుంచి తడువుకోకుండా ఈయన చెబుతూ ఉంటే ఆ ధారణాశక్తికి ఆశ్చర్యపోవలసినదే. పాణిని, పతంజలి, వరురుచి అన్న వైయాకరణుల జీవితచరిత్రల గ్రహించి "మునిత్రయచరిత్ర" అనే పేరుతో ఒక ప్రబంధమును రచించి (యువసంవత్సరము) రాయుడుశాస్త్రిగారికి కృతిగా ఇచ్చినాడు. శ్రీనాథునిపైన ఈయన కభిమానము మెండు. శ్రీనాథుని కంటగట్టిన వ్యభిచారదోషాన్ని ఖండిస్తూ అనేక విద్వద్గోష్ఠులలో ప్రసంగించినాడు. ఈయన ఉపన్యసిస్తూ ఉంటే యెక్కడెక్కడి విషయాలూ ఈయనకు కరతలామలకాలే. ఈయన యిటీవల (1948) రచించిన "శంకర విజయము" అన్న ప్రబంధము ఈయన పాండిత్యమునకూ కవితాశక్తికీ నికషోపలము వంటిది. గోదావరిజిల్లా

పండితులలో ఈయనకొక విశిష్టస్థానము ఉన్నదని చెప్పవలె! ఈయన ప్రభావ మనేకులపైన ఉన్నది.

## వేలూరి శివరామశాస్త్రి :

ఈయననుగూర్చి పూర్వభాగాలలో కొంత అక్కడక్కడ ఉల్లేఖించుకొన్నాము. ఈయన స్ఫురద్రూపి. విద్వత్కవి. తిరుపతి వెంకటకవుల శిష్యులలో శతావధానములు చేసిన మేటి. వాదములలో శత్రుకోటి నెదుర్కొన్న మేధావి. ఈయన దగ్గర చదువు కొన్నవారిలో అనేకులు ప్రసిద్ధ కవులైనారు.◆ ఒక్క కవిత్వములోనే కాక శాస్త్రములలోను ప్రజ్ఞ గడించిన వ్యక్తి. ఈయన వంశమే కవులను, పండితులను తయారు చేసేటటు వంటిది అనవచ్చు.✻ 'శివరామశాస్త్రిగారితో పరిచయం చాలు - అది ఎవరినైనా Inspire చేస్తుంది.' అన్న వాక్యంలో యధార్థము లేకపోలేదు. ఈ దృష్టితోనే ఈయనను గూర్చి మళ్ళీ ప్రస్తావించుకోవలసి వచ్చింది. ఈయన ఒక సాహిత్య సంస్థ! కథలు-గాథలు✻ (పద్యాలు), ఏకావళి-బిందుగారబ్బాయ్. (శరచ్చంద్రుని అనుకృతి) అనే గ్రంథాలనూ; ప్రాచీన ఖగోళముపైన, సాహిత్యముపైనా, విద్యుల్లోకము పైనా వ్యాసాలనూ, ప్రచురించినాడు. మంచి సంస్కారి అని యీయన రచనవల్ల

◆ సన్నిధానమువారూ, అంబడిపూడి వెంకటరత్న కవీ, మొదలైన వారీయన ప్రభావము కలవారు.

✻ వేలూరి చంద్రశేఖరం (కాంచనమాలా నాటకకర్త) వేలూరి సహజానందం, సదానందం, మొదలైనవారు రచయితలుగా కన్పిస్తున్నారు.

ఈయన రచనలలోని సౌందర్యమును, విశిష్టతనుగూర్చి చిరుమామిళ్ళ శివరామ కృష్ణప్రసాదుగారు భారతి 1950 ఫిబ్రవరి సంచికలో వ్రాసిన వ్యాసమును చూడండి. అందులోనే యీ క్రింది వాక్యాలు :

"జ్ఞానిగా, గొప్ప స్వభాషాభిమానిగా, శాంతిదూతగా, నిరాడంబర - నిష్కల్మష హృదయులుగా శ్రీ శాస్త్రిగారు నాకు వారి గ్రంథములయందు దర్శన మొసంగిరి ... శ్రీ శాస్త్రిగారి రచనములందు గణనీయమగు లక్షణములలో సుకుమారమును, సుమనోజ్ఞమును, సులభమును ఐనశైలియు, హృదయము నాకట్టు విషయనిర్ణయము ప్రధానములై యున్నవి. అందులకే వీరొక ప్రత్యేకతను నవీనాంధ్ర వాఙ్మయమున గడించియున్నారు."

భారతి రజతోత్సవ సందర్భాన ఈయన అధ్యక్ష స్థానమును అలంకరించి గౌరవమును పొందినాడు.

చూడడానికి చాల అమాయకుడుగా కన్పిస్తాడు. లోపల సరస్వతి ఇల్లు కట్టుకున్నాడున్నది! ఈయనకున్న పాండితీ, రసవ ద్వాక్కూ ఈయన గ్రంథములో అంతటా కన్పిస్తూ ఉంటై. శుష్కమైన చరిత్రను కావ్యబద్ధము చేసి రసపోషణ మొనర్చుట విశేషమే గదా. శేషశాస్త్రిగారు (జననము 1897) ప్రొద్దుటూరులో మునిసిపల్ హైస్కూలు పండితుడుగా 1932 నుంచి జీవయాత్ర గడుపుతున్న వ్యక్తి. ఈయన కవితాప్రతిభకు పండితులు, రసికులు, పరిషత్తులు నీరాజనాలుపట్టి బిరుదుల నిచ్చినారు. (కవివతంస, కవిసింహ, శతావధాని, అవధానిపంచానన మొదలైనవి) హిందూ పురములో కృష్ణదేవరాయపరిషత్తు వారిచ్చిన (1944 మే 28 తేదీన) కవిగండపెండేరము గొన్న గండరగండడు శేషశాస్త్రిగారు. మద్రాసు ప్రభుత్వము, తెలుగు భాషా సమితి ద్వారా యీకవి వ్రాసిన శివ భారతమునకు బహుమానమిచ్చి గౌరవించింది. అటుతర్వాత రేడియో ద్వారా యీయన అనేక ప్రసంగాలు చేసి చక్కని వ్యాప్తిలోకి వచ్చినాడు. కవిత్వం చెప్పడములోనే కాకుండా విషయ విమర్శలోను ఈయన గొప్ప ప్రతిభ కలవాడు. నెల్లూరు సభలో ఈయన తిక్కనను గురించి చేసిన ఉపన్యాసమే యిందుకు తార్కాణము. గడియారంవారి గ్రంథము సాహితీ లోకంలో కల్గించిన చైతన్యం ఇంతింతని చెప్పలేము. హైందవ ధర్మాభినివేశం దేశంలో ప్రబలిపోతూవున్న దినాలలో* వీరుల చరితలను గ్రహించి ప్రబంధీకరించడం ప్రశంసనీయము. ఈ గౌరవము ఏకగ్రామ (ప్రొద్దుటూరు) వాసులకే జరగడము గమనించదగింది. దుర్భాకవారూ గడియారంవారూ ఇద్దరూ సూర్యచంద్రుల వంటివారు◆; ఏకోదరుల వంటివారు. ఇద్దరూ కలసి శతావధానములు చేసినవారు గాన వీరిద్దరూ చెరియొక వీరరస ప్రబంధాన్ని రచించి తమ చిత్తములు, హృదయములు ఎలా బింబ ప్రతిబింబ భావములు కలిగి ఉన్నవో ఋజువుచేసిన వారైనారు. చరిత్ర చాల

---

* ఈ కాలానికి రాష్ట్రీయ స్వయంసేవక సంఘం వేళ్లు పాతుకుపోతున్నవి నలుముఖాలా.

◆ "వీరిద్వురూ ఒకయూరనేవర్తిల్లి, యొకపేరనే కవితలు రచిస్తూ శతావధానములు చేస్తూ కొంతకాలమైక్యముతో వర్తిల్లినారట! కావున ఈ రెండు గ్రంథములూ 'ఒక కొమ్మనే పూచిన రెండు పూవులు' అనదగినవి. కవితారచనలో ఈ యిర్వురును కలసిన ఒక్కడైన సవ్యసాచి - వీరిద్వురూ వేర్వేరుగా ఉన్నా సవ్యసాచులే అవడమును, వేర్వేరుగా రచించిన ఈ రెండు గ్రంథములూ సమర్థిస్తున్నవి." వేటూరి ప్రభాకరశాస్త్రి.

శుష్కమైనది. దానికి కావ్యత్వమును పొందించడము ఈ మహాకవులు ఇద్దరూ సాధించిన విశేషమూ!

గడియారమువారి శివభారతము చదువుతూ ఉంటె పారకులనేక స్థలాలలో పులకితగాత్రులై తీరుతారు. ఈయన కవితాశైలి ఒక తేనెవాక!✻ ధర్మప్రబోధము చేస్తున్న సందర్భాలలో కవిగారి చిత్తశుద్ధి, ధార్మిక చింతనములు ముఖ్యముగా భాసిస్తూ ఉంటై. నన్నయలోని నైష్ఠిక తాత్పర్యాన్నీ శాంతస్థితిని తిక్కనలోని గాంభీర్యాన్నీ, తెనుగుదనాన్నీ ఈ కవి పుణికి పుచ్చుకున్నాడా అనిపిస్తుంది.‡ శివాజీకి రామదాసు చేసిన ధర్మోపదేశము◆ తానాజీ నిర్యాణమునకు శివాజీ పొందిన దుఃఖము మొదలైన ఘట్టాలు మరువరానివి ఈ శివభారతములో ఎన్నో ఉన్నవి§. విమర్శకులనేకులు శివభారతము పైన తమ మెప్పులను కురిపించినారు. భాషలో - ఛందస్సులో -

---

✻ ఈ క్రింది ప్రశంసా పద్యమును చూడండి.

పలుకులు కండ చక్కెరలు, భవ్యములీరచనావిధాన రీ
తులు, రసపోషణం బమృతతుల్యము, పోకడలెల్లఁ గ్రొత్తలై
తలఁపులదన్ను, భావము ముదంబిడు, నింతటిగోస్తనీ ఫలం
బులఁ దలపించుకైత వలపుల్ మెఱవుల్ దలపంగవచ్చునే. - వాయుపేయాజుల

‡ ....... Siva Bharatam a work which is next to the Mahabharata of Tikkana of seven centuries ago stands in Volume, poetic excellence and scope as the greatest living monument of the present age and of the ages that have preceded it .... ... — 'Indian Literatures of Today'

◆ రెండు పద్యాల నుల్లేఖిస్తాను :

వేఁడిమిసూపరా, దొరులవేడినచో బలహీనవృత్తి, బొం
కాడుటకాని కార్యము, యధార్థత లోకవిరోధి; మేలునర
గీడునఁబోలెఁగీడు బరికించు జగంబున - నెల్లవారు 'మా
వాఁడ'న - రాజనీతి నడుపన్ దరమే యొకపాటి వానికిన్!

సృష్టి - పరస్పరాశ్రయపరీతమయయ్యు, స్వతస్స్వతంత్రతా
పుష్టము : భిన్న మార్గములఁబోకడ - నైజము న్యాయ్యమయ్యు
త్కృష్టము తన్నికృష్ట మడఁగించెడి : ధర్మపదార్థ మిట్లు సం
సృష్టము సంకరం బగుటఁజేసి సమన్వయశక్తి కావలెన్.

§ నాకై - లోకము మేలుకై కడఁగి తానా! త్యాగివై యోగివై
నా కర్తవ్యము లీవ తీర్చి జయమున్ నాకిచ్చి, యున్నట్టులే
నాకశ్రీ గయికొంటి, లీతప మఖండత్యాగ మేమందు! నౌఁ
గాకన్నా! ననుఁబాసి యొంటి విడిపోఁగా నీకుఁ గాలాడెనే!

అలంకారములో - ఈ కవి పూర్వకవుల పోకడనే పఠించినాడు. అప్పుడప్పుడు స్వతంత్ర ప్రయోగములను చేసి భాషలో - ఉక్తిలో చమత్కారములను ప్రదర్శించక పోలేదు. అన్నిటికన్నా ఈయన కవితలో ఉన్న శైలీసారళ్యమే అత్యంతాకర్షణీయమైనది: పలుకుబళ్లలోని తెలుగుతనమే ఆంధ్రుల హృదయాన్ని మురిపించుచున్నది◆: సిపమెక్కించినా, శివంకరముగా పర్యవసించడము* కారణముగా కావ్యగౌరవము స్థిరముగా నిలిచిపోయింది. మొత్తముమీద నవ్యాంధ్ర సాహిత్యానికి మందరాయమానమైన కావ్యనిర్మాణము చేసిన‡ శేషశాస్త్రిగారు ఆంధ్రులకు వంద్యులు.

---

ప్రతిభటుండయి మీదబడుచు బాజీప్రోక దళుడు నాపై కత్తి ఎత్తువాడు
కపట పండితుడైన యఫజులుఖానుతో ద్వంద్వయుద్ధక్రీడ సలుపువాడు,
దండయాత్రల సయిస్తాఖానుమీదపై నడచేయబడి పోరునప్పుడు,
నవురంగజేబు నన్నరికట్టి చెఱనుండి యనువుమై దప్పించుకొనెడువాడు,

అడ్డుపడి, పోరుసలిపి, తోడై తెగించి
నన్నుగాపాడుకొను ధీరు నిన్ను నేడు
కుఱుచగడమునకై బలిగొంటి, నకట!
గడము! తానాజీ! బొగ్గుకై కల్పతరువు!
శివపతి యెవండు? తానజీస్నిగ్ధహృదయ
బలముద్రావి, పెన్పొందిన భద్రమూర్తి
నిజము; తానజీ! యీనాడు నీవులేని
శివపతి యెవండొ! యెంతలోబవలు-రేయి!
హృదయమునుజీల్చి యందులోబొదిగియున్న
నన్ను బహిరంగపఱచి ధన్యతను గొంటి
వన్న! తానజీ! నేటికా నిన్ను దాచి
లేతవడితి! నీభాగ్యంబు లేదు నాకు!

◆ చూ. భారతి 1943 అక్టోబరు సంచికలో విశ్వనాథవారి వ్యాసము. భారతి 1947 మార్చి సంచికలో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి వ్యాసము. త్రిలింగ 3-12-1945

* ఇట్టి కావ్యములే ప్రపంచమునకు 'శివ'మును ప్రసాదించేవి. 'శివమెత్తించే' గ్రంథములు ప్రపంచ సారస్వతములో బయలుదేరినవి. బయలుదేరుతున్నవి అవి మాత్రము తెగిన గాలిపటములు. - చిలుకూరి నారాయణరావు.

‡ ఈ సందర్భములో చెరుకుపల్లి సుందరరామయ్యగారి కవిగారికి చేసిన సాహాయ్యమును స్మరించి తీరవలె. కవిగారి వాక్యాలే చూడండి .

పనిగొని పొత్తములో చదివిపోయని యొర్మిజరిత్రమెల్లజ
క్కన వడబోసి యిచ్చుటయె గా దపుడప్పుడు యోగ్యమైన సూ
చనలిడి జాగునోగు నలసత్వమువో నను(బ్రోత్సహించి యీ
పని తనదైనయట్లు శివభారతసృష్టిని నాకు దోడ్పడెన్.

# గాడేపల్లి వీరరాఘవశాస్త్రి :

ఈయన గద్వాల సంస్థానా స్థానములోని విద్వత్కవి. కర్నూలు జిల్లాలోని ఎఱ్ఱగొండపాలెములో 1891లో జన్మించి 1945లో కీర్తిశేషుడైనాడు. ఈయన జన్మతః ప్రతిభావంతుడు. ఏకసంథాగ్రాహి. హాస్య చతురుడు. ధైర్య సాహసము గల స్వతంత్రుడు. శ్రౌతమును తండ్రికడ వల్లించినాడు. రాళ్ళభండి నృసింహశాస్త్రి గారికడ వేదమును, మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి, భారతుల నృసింహశాస్త్రిగారల సమక్షాన సాహిత్యమునూ గ్రహించిన విద్వాంసుడీయన. సంస్కృతాంధ్రాలలో అద్భుతకవిత్వం చెప్పగలవాడు. పితృవియోగానంతరం దారిద్ర్యాన్ని* ఎదుర్కొనే నిమిత్తము అష్టావధానాలు, శతావధానాలు◆ చేస్తూ, యావదాంధ్ర దేశమూ సంచారముచేసి ధనముతోబాటు కీర్తినీ ఆర్జించినాడు. ఆశుప్రబంధాలు కాక, "త్రిపురాంతక స్థలమాహాత్మ్యము - శ్రీ సత్యవరలక్ష్మి ధ్రువచరిత్రము" - అనే కావ్యాలను రచించినాడు. మద్దులపల్లివారు 'చమత్కార కవిత్వమ'నే పేర ఈయన సారస్వత జీవిత విశేషాలను, అవధానాది సందర్భాలలో ఈయన చెప్పిన పద్యాలను చేర్చి ప్రచురించడము మెచ్చదగినది. కర్నూలు జిల్లా బోర్డులోను, గద్వాలలోను హైస్కూలు పండితుడుగా పనిచేసి ఈయన అనేక యువకులలో సాహిత్యబీజాలను నాటినాడు. ఈయన చాటువులలో కన్పించే ప్రతిభా, పాండితీ‡ అవధానాల ద్వారా

* దారిద్ర్య దేవతా స్తవాన్ని చేసినాడు చూడండి, ఎంత చమత్కారముగా ఉన్నదో!
హే దారిద్ర్య నమస్తుభ్యం సిద్ధోహం త్వత్ప్రసాదతః
పశ్యామ్యహం జగత్సర్వం, న మాం పశ్యతి కశ్చన.

◆ ఈయన ఆశువుగా అనేక మాలికలను చెప్పి, గ్రుక్కతిప్పలేని దీర్ఘసమాసాలతోను, మనోహరమైన లలితమైన వాగ్గుంభనముతోను సభాస్తారులను ముగ్ధులను చేసిన సందర్భాలెన్నో ఉన్నవి.

ఈయన సమాసఘటనాశక్తి చూడండి :

‡ సులభంబైన సమాసమాయెనట! రక్షోయక్ష గీర్వాణదో:
కలితానంత నిరుద్ధ మందరనగోత్కర్షాతి హర్షాయితో
జ్జ్వల దుచ్చండపయః పయోధిభవదదివ్య ద్వీచికాజాతమం
జుల పీయూషమునైనఁదేఁగల కవీశున్ నన్ను గుర్తింపరో.

ఈయన చెప్పిన చాటువులలో అనేకము చక్కని ఖండకావ్యాలుగా నిలువదగినవి ఉన్నవి.

వ్యర్థమైపోకుండా మహాకావ్య నిర్మాణములో వినియోగింపబడి ఉన్నట్లైతే బాగుండేది. ఈయన ప్రభావముమాత్ర మనేకశిష్యులపైన పడి సారస్వతక్షేత్రాన్ని ఫలవంతం చేయడం గమనింపదగింది.

## సురవరము ప్రతాపరెడ్డి :

హైదరాబాదు ప్రాంతములో సురవరము ప్రతాపరెడ్డిగారి ప్రభావము గమనింపదగినది. (జననము 1896) సాహిత్య గోష్ఠులను జరుపుతూ, పండితులను చేరదీస్తూ, తాను స్వయముగా గ్రంథ రచనము చేస్తూ, (గోలకొండ పత్రికా సంపాదకుడు కాబట్టి) అనేక కవి పండితుల పద్యాలనూ వ్యాసాలను ప్రకటిస్తూ, కొంత సాహిత్య చైతన్యాన్ని కల్గించిన వాడైనాడు. బి.ఏ., బి.యల్. అయినా ఎనిమిదేండ్లు మాత్రం న్యాయవాద వృత్తిచేసి తతిమ్మా జీవితాన్ని మాతృభాషా సేవకు అంకితము చేసిన, చేస్తున్న వ్యక్తి. ఈయన బహుభాషా పరిచయము కలవాడు. చరిత్ర అంటే ఈయన కభిమానము ఎక్కువ; పరిశోధనాబుద్ధి కలవాడు; "రామాయణ విశేషములు - ఆంధ్రుల సాంఘిక చరిత్ర" అన్న గ్రంధాలు. ఈయన చారిత్రక దృష్టిని వ్యక్తము చేసేటటువంటివి. అనేక కథలను, పద్యాలను, పాటలను వ్రాసి కవి అనిపించుకొన్నాడు. వ్యాసాలద్వారా అజ్ఞాతకవుల ననేకుల్ని వెలికి తీసుకొనివచ్చి ఎంతో సేవచేసినాడు. 'ఉచ్ఛల విషాదమ'నే నాటకాన్ని ప్రచురించి నాటక కవి అనిపించుకొన్నాడు. హిందువుల పండుగలు - హైందవ ధర్మ వీరులనే - గ్రంధాల ద్వారా తనకున్న హిందూద్ధరణ దృష్టిని వ్యక్తము చేసినాడు. 'ప్రతాపరెడ్డి కథల'లో తెలంగాణా తెలుగులోని మాండలికాల్ని చొప్పించి భాషాసేవ చేసి విశిష్టతను గడించినాడు. 'ప్రాథమిక స్వత్వములు' - 'గ్రంధాలయములు' అనే యీయన గ్రంథాలు రాజకీయోద్యమము లోను గ్రంధాలయోద్యమములోను ఈయనకు గల అనుభవాన్ని తెలియపరిచేవిగా ఉన్నవి. గోలకొండ పత్రికా సంపాదకుడుగా ఇరవైమూడు సంవత్సరాలు ఏకదీక్షతో ఉండి అత్యంతాభినివేశముతో హైదరాబాదు రాజకీయ, సాంస్కృతిక జీవితాభ్యున్నతికి

విశేషముగా పాటుబడిన వ్యక్తి యీయన.✻ స్వభావము చేత మితభాషి కావడమువలనా, విమర్శలలో వ్యక్తి దూషణలుండడమువలనా, పుల్లవిరుపుగా ప్రసంగించే ధోరణివలనా యీయన సంఘములో సఖ్యాన్ని సాధించలేక పోయినాడు. వ్యక్తిని గూర్చిన అంతర విషయాలను వదలివేసిన కృషినిమాత్రము గ్రహిస్తే యీయన ప్రశంసనీయుడే. హైదరాబాదులో తెలుగువాళ్ళ◆కొక ప్రతిపత్తిని (Status) చేకూర్చి పెట్టినవారిలో ఈయన గణనీయమైన కృషిచేసిన ధీమంతుడు. ప్రజాహితజీవి.

హైదరాబాదులో సాహిత్య చైతన్యము కలిగించినవారిలో అ. దత్తాత్రేయశర్మ, సన్నిధానం వారు, మొదలైనవారున్నారు.

చివుకుల అప్పయ్యశాస్త్రిగారు (కవిగా, పండితుడుగా ఈయన ప్రశస్తిని గూర్చి ప్రథమభాగములోనే వ్రాసుకొనే ఉన్నాము.) దివ్యవాణి విజయ సంచికలను ప్రచురించి తద్వారా తెలంగాణానికీ సర్కారు జిల్లాలకూ మధ్య వంతెన కట్టినవాడు.

కొల్లాపురములో ఉండి స్నేహలతాకవితా సంఘాన్ని స్థాపించి కృషిచేస్తూ ఉన్న సాహిత్యపోషకుడు వాయుపేయాజుల రామసుబ్బారాయుడుగారు. ఆ సంఘం తరపున అనేక గ్రంథాలను ప్రచురించి అనేక కవులకు, కవయిత్రులకూ‡ మంచి చేయూత నిచ్చిన పండితుడీయన. స్వయముగా తాను కవి; అన్నిటికన్నా మించి సహృదయుడు.

---

✻ "బహుభాషాకోవిదుడు ... ఆంధ్రమహాసభకు మొట్టమొదటి అధ్యక్షుడు ఇతడే. కొన్నియేండ్లు ఆంధ్రమహాసభకును, ... రెడ్డి విద్యార్థి వసతి గృహమునకు కార్యదర్శిగానుండి పనిచేసినాడు ... కవిత్వము, కథారచన, వ్యాసరచన, సాహిత్య విమర్శ, చరిత్ర పరిశోధన, విజ్ఞానము మొదలైన వివిధ వాఙ్మయ వీథులలో ఈయన కలము స్వైరవిహారము జేసినది .. పాడిమాటలు కట్టెవిరుపుగా ధ్వనించినను ... అదొక చిత్రంగా శ్రోతలను వశంవదుల గావించు కొనును."
- 'ప్రత్యూష'లో సాధన సమితివారు.

◆ ముల్కీ - ఆంధ్రులంటే ఈయన కపరిమితాభిమానం. కొత్వాల్ వెంకటరామారెడ్డి జీవితచరిత్ర వ్రాసినాడు. ప్రసిద్ధ ప్రాచీనాంధ్ర కవులలో కొందరిని హైదరాబాదు ప్రాంతమువారని సిద్ధాంతీకరించడములో చాల పరిశ్రమ చేసినాడు.

ఇటీవలనే 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ప్రచురించినాడు.

‡ చేబ్రోలు సరస్వతీదేవి, సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారలు మొదలైనవారీ సంఘ సభ్యులు.

# పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు :

ఈయన గుంటూరు జిల్లాలో పేరుపొందిన విద్వత్కవి. నెల్లూరు జిల్లాలోని సంగము గ్రామములో 1897లో ప్రసిద్ధ మాధ్వ బ్రాహ్మణ కుటుంబములో జన్మించినాడు. గుంటూరు, చల్లపల్లి, కొంకుదురు, పిఠాపురము, తెనాలి మొదలైన తావులలో విద్యాభ్యాసముచేసి, సంస్కృతాంధ్రాలలో కూలంకష పాండిత్యాన్ని గడించినాడు.* గుంటూరు టవును హైస్కూల్‌లోను (1918-1939) ఆ తరువాత హిందూ కాలేజీలోను సంస్కృత పండితుడుగా పనిచేస్తూ అనేక యువకులకు కవితాభిక్ష పెట్టుతున్నాడు. ఈయన సంస్కృతాంధ్రాలలో రెంటిలోను నిర్దుష్టమైన **కవిత్వం చెప్పగల సమర్థుడు. ఆశుప్రబంధాలను, అవధానాలను చేసిన ప్రజ్ఞావంతుడు◆.** బహుకావ్య నిర్మాత. శ్రీరామ కల్యాణము (ప్రబంధము) కైకేయీ సౌశీల్యము (లఘుకావ్యము) ఉషాహరణము-అన్న స్వతంత్ర కావ్యాలను, ఆంధ్ర కాదంబరి - ద్విపదమేఘ దూతము - ప్రతిజ్ఞా యౌగంధరాయణము - అనే అనువాద గ్రంథాలను, శ్రీ పురుషోత్తమవైభవము మొదలుగాగల గురుచరిత్రములను (పద్యప్రబంధములు) అనేకము‡ రచించి ఈయన అపార సాహిత్యసేవ చేస్తున్న మనీషి. భారతానికి

---

* ఈయన గురువుల నుతించిన యీపద్యమునుబట్టి ఎంతటి ఉద్దండులో యీయన యాచార్యులు తెలుస్తుంది :

నాటకాలంకార పాటవం బొసగిన ఘనుడు కాశీకృష్ణ కవివరుండు
ప్రకరణపాండితీ ప్రాభవంబొసగిన గురుడు రామబ్రహ్మకోవిదుండు
కౌముది సాంగంబుగా నాకు జెప్పిన నయభాషి పేరి పేరయమనీషి
అటుపైన దానివ్యాఖ్యలు పఠింపించిన నోరి సుబ్రహ్మణ్య సూరివరుఁడు
వేదులాన్వయవారాశి విధుడుబుధుడు సూర్యనారాయణ ప్రభాశోభితుండు
లోనుగాగల విద్వదీశానులైన యస్మదాచార్యవర్యుల నభినుతింతు.

కృష్ణాచార్యులగారికి ఈయన శిష్యుడేకాక అల్లుడుకూడ. 'కాదంబరి' ఆంధ్ర పద్య ప్రబంధముగా అనువదించి మామగారికి అంకితం చేసినాడు.

◆ తెనాలి, పిఠాపురము, చిత్రాడ, గుంటూరు, సంగములలో అవధానాలు చేసి సత్కారాల్ని అనేకము పొందినాడు.

‡ శ్రీ పూర్ణబోధ విజయము, శ్రీ జయతీర్థ విజయము, శ్రీ వ్యాసరాజ విజయము, శ్రీ వాదిరాజ విజయము, శ్రీ రాఘవేంద్ర విజయము, శ్రీ రుక్మిణీశ విజయము - అనే ఆంధ్ర ప్రబంధాలు, కొన్ని సంస్కృత స్తోత్రాలు రచించినాడు.

ఉద్యోగపర్వము దాకా టిప్పణి వ్రాసిన వ్యాఖ్యాత. గాంధీగారి నిర్యాణానికి తనలో కలిగిన హృదయ వేదనను 'ఆత్మ సమర్పణమ'నే లఘుకావ్యము ద్వారా వెలిబుచ్చిన దేశభక్తుడీయన. ఈయన దగ్గర తర్కము - వ్యాకరణము - న్యాయము - సాహిత్యములను చదివిన శిష్యులెందరో ఉన్నారు. వారిలో ప్రసిద్ధ కవులు, వర్ధమాన కవులు, పండితులు చాలమంది ఉండడము విశేషము◆. గుంటూరు వైశ్య గురుకులాశ్రమానికి కొంతకాలము గౌరవ కులపతిగా ఉండి తదభ్యుదయానికి పాటుపడినాడు; అసలీయన ఇల్లే ఒక సంస్థ. అక్కడ విద్యాబోధ - కావ్యరచనములనేవి నిరంతరమూ జరుగుతూ ఉండవలసినదే. ఇటీవల 'పూర్ణప్రజ్ఞ గ్రంథమాల'ను స్థాపించి అందులో తన గ్రంథాల నన్నిటినీ క్రమముగా ప్రచురిస్తూ ఉన్నాడు; అయితే శతలక్షణి - కావ్యాలోకము - అనే వ్యాకరణాలంకార గ్రంథాలు వ్రాసిన పండితుడీయన. ఈయన ఉపన్యసిస్తూ ఉంటే అనేక విశేషాలు, పద్యాలు, శ్లోకాలు, దొర్లుతూ వెనక వేంకటశాస్త్రిగారి ధోరణిని జ్ఞాపకము చేస్తూ ఉంటవి. మనిషి ఎంతటి పండితుడో అంత వినయమూ, శిష్యవాత్సల్యమూ కలవాడు. స్నేహపాత్రుడు. ఈయన అనేక సమ్మానాలను ప్రశంసలను అందినాడు.* ఆంధ్ర సారస్వత పరిషత్తు వారీయనకు

◆ కొమాండూరి కృష్ణమాచార్యులు, తల్లావజ్ఝ లవారు, క్రొత్తజగ్గయ్యచౌదరి, తడికమళ్ల కోటీశ్వరగుప్త, క్రొత్త సచ్చిదానందమూర్తి, కాలువ రాఘవయ్య, పశర్లపాటి వాసుదేవశాస్త్రి, వెల్లంకి వెంకయ్య శాస్త్రి, మానూరి వెంకటరమణయ్య, ధనకుధరంగారలు మొదలైనవారు కొందరు. వీరిలో జగ్గయ్యచౌదరి 'పన్నా' అనే తన చిన్న కావ్యాన్నీ, - కోటీశ్వర గుప్త 'పద్యమంజరి' నీ గురువుకు అంకితము చేసినారు. కాలువ రాఘవయ్య అనే శిష్యుడు వసుచరిత్రను నాటకముగా వ్రాసి ఈయనకు అంకితము చేసినాడు. కొమాండూరివారు తన హర్షచరిత్రావతారికలో -

'స్వాదు కాదంబరీ రసాస్వాదనమున
బూర్ణమగు ప్రజ్ఞవాయని బుధవరులను
శాబ్దికులఁ గావ్యవేత్తల సరసకవుల
లాక్షణికులను దలఁతు సలక్షణముగ'

అని యీయన నుద్దేశించి వ్రాసినాడు.

* కొప్పరపుకవులు, చెళ్ళపిళ్ళవారు, కాశీకృష్ణాచార్యులు మొదలైనవారు, పత్రికలు, అనేకవిధాల ఈయన కవితాశక్తిని గురించీ, పాండితీగరిమను గురించీ ప్రశంసించి ఉన్నారు. వీరి "కైకేయి సౌశీల్యము"లో నవ్యత ఉన్నట్లు, పిల్లలమఱ్ఱివారి పీఠిక, నిరూపిస్తున్నది, చూడండి. వీరి 'ఆత్మ సమర్పణము' కూడ చక్కని ఖండకావ్యము.

'కవిశేఖర' బిరుదాన్నిచ్చి గౌరవించినారు. ఈయన గుంటూరు జిల్లాకే ప్రతిష్ఠ తెచ్చిన కొద్దిమంది విద్వత్కవులలో ఒకడై ప్రశంసనీయమైన భాషాసేవచేస్తున్న వ్యక్తి. ప్రాచీనుడులా కన్పించినా నవ్యతను హృదయములో మన్నించగల రసజ్ఞుడు.

# గరికపాటి మల్లావధాని

ఈయన పశ్చిమగోదావరీ జిల్లాకు చెందిన పండిత కవులలో పేరు వడసినవాడు. 18-9-1899 తేదీని కోవ్వూరులో తెలుగునాటి వైదిక కుటుంబములో జన్మించినాడు. *సంస్కృతాంధ్రాలలో నిర్దుష్టమైన, సాధికారమైన పాండిత్యము కలవాడు. ◆కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠములో చదువుకొనే దినాలలో వేలూరి శివరామశాస్త్రిగారు చేసిన అష్టావధానమీయనను ఆకర్షించి తత్ప్రజ్ఞా సాధనపై ఈయన దృష్టిని మరలించింది. తర్వాత కాలములో ఈయన చేత అవధానాలు చేయించింది.‡ 1921 అసహాయోద్యమములో చేరి, చదువు మానివేసి గ్రామగ్రామాల జాతీయ గీతాలను పాడుతూ ఉపన్యాసాలనిస్తూ, కాంగ్రెసు ప్రచారము చేసిన దేశభక్తుడీయన; 1930 ఉప్పు సత్యాగ్రహోద్యమములో § పాల్గొని శ్రీకృష్ణ జన్మస్థానాన్ని

---

* ఈయన తండ్రి కాక్యప్రజ్ఞకలిగి సంస్కృతాంధ్రములలో సాహిత్య జ్ఞానము కల్గి, వదాన్యులని పేరుపొందిన సీతారామయ్యగారు చోడవరము గుండేపల్లి యెష్టేటులో సముద్దారుగా పనిచేసినారు.

◆ ప్రఖ్య సీతారామశాస్త్రి, పురిఘళ్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, తాతా సుబ్బారాయశాస్త్రి, జి.వరదాచార్యులుగారలు గురువులుగా ఈయన సంస్కృతభాషా పాండిత్యము సంపాదించినాడు; కల్లూరి వెంకట్రామశాస్త్రిగారు, వఝుల పండితులు గురువులుగా ఆంధ్రభాషా పాండితి నార్జించినాడు.

‡ తెల్కిచర్ల జమీందారుగారి వినోదార్థము కవితాగోష్ఠులను - అష్టావధానములనూ జరిపి ఎనిమిది ఎకరముల భూవసతిని సమ్మానముగా పొందినాడు.

§ విచారణ సందర్భాన కోర్టువారి కీయనిచ్చిన సమాధానాన్ని చూడండి.
లేదుగదయ్య! మా నుడుల లేశ మసత్యము సత్యబద్ధమౌ
వాదమె దోసమయ్యెడు; నభాగ్యమిదే మనకబ్బె; నింకనొఁ
గాదననేల మీ విహిత కార్యకలాపము దీర్పఁబూనుఁడా
మీఁదట దేవుఁడేగలఁడు మిమ్మును మమ్ముఁ బరీక్షసేయఁగన్

దర్శించినాడు. అక్కడున్నప్పుడే "భారతాంబికా శతకా"న్ని రచించినాడు. తరువాత "అమరు" కావ్యాన్ని ఆంధ్రీకరించినాడు. ఈయన రచించిన జాతీయగీతాలకు‡ దేశములో ఆ రోజులలో మంచి ప్రచారం ఉండేది. ఏలూరు జాతీయ విద్యాలయములో (1923-30) చేరి యీయన దేశభక్తినీ, జాతీయ దృక్పథాన్నీ అనేక విద్యార్థులలో కల్గించినాడు. అటు పిమ్మట ఏలూరు మునిసిపల్ హైస్కూల్ పండితుడుగా దాదాపు పదేండ్లు (1938-47) పనిచేసినాడు. అక్కడ కళాశాల పెట్టిన తర్వాత అందులో చేరి ఇపుడా కలార్థులకు కవితాభిక్ష పెట్టుతూ కాలక్షేపం చేస్తున్నాడు✻. ఏలూరులో సాహిత్య చైతన్యాన్ని కల్గిస్తూన్న కొద్దిమందిలో◆ ఈయన గణనీయుడు. సన్నగా, పొడుగ్గా ఉండి కంఠమెత్తి పాటలనూ, పద్యాలనూ పాడుతూ ఉంటే సభ్యులు ముగ్ధులు కావలసినదే. ఈయనకున్న ప్రతిభకూ, పాండిత్యానికీ సరితూగే గ్రంథజాలము ఇంతవరకూ వెలువడకపోవడం దురదృష్టమే. కాని యీయన శిష్యులలో నవ్య కవులుండడము§ సాహిత్యాభిలాష యువకులలో కల్గిస్తూ ఉండడము ఇక్కడ గమనించదగిన అంశము.

## సాధు వరదరాజం పంతులు :

దక్షిణదేశములో తెలుగు భాషకు మంచి ప్రచారము కల్గించిన మహాశయుడీయన. దక్షిణాంధ్ర అనే పత్రికను స్థాపించి (1927లో) అహర్నిశలూ ఆంధ్రభాషా ప్రచారము కోసం పాటుపడిన, పాటుపడుతున్న వ్యక్తి ఈయన. ఆంధ్రుల 'ఊసరక్షేత్రములందుండినను ఆంధ్రుడు ఆంధ్రుడే' అనీ, 'నా మాతృభాష నా ప్రాణము. అది మరచిపోయిన పాపము' అనీ పత్రికలో మొదట వ్రాసుకున్నవాడు.

‡ 1930లో కాంగ్రెసు సంఘమే వీటిని ప్రకటించినదట.

✻ చెన్నాప్రగడ భానుమూర్తిగారి ఆధ్వర్యాన సభలో (నరసాపురములో) "కవిశేఖర" బిరుదాన్ని పొందినాడు

◆ నందిరాజు చలపతిరావు, నండూరి వెంకటసుబ్బారావు, సోమంచి లింగయ్యగారలు ఇతరులు

§ బొడ్డు బాపిరాజు, ముదుంబ నరసింహాచార్య, రెండుచింతల సత్యనారాయణశాస్త్రిగారలు మొదలైన నవ్యులట్టివారు.

ఎంతటి దీక్షకలవాడో వేరే తెలుపనక్కరలేదు. ప్రవాహానికి ఎదురీదడములో ఈయన పొందిన, పొందుతున్న కష్టాలు తన కృషిని మరింత తీక్ష్ణము చేస్తున్నవి. రాష్ట్రేతరాంధ్రులు తెలుగుభాషను మరచిపోకుండా ఈయన చేస్తున్న కృషి ప్రశంసనీయమైనది.*

పైవారేకాక ఇంకా పలువురు పండితులు, కవులు, అవధానులు, సాహిత్యాభిరుచిని ప్రజలలో పలుతావులలో కల్గిస్తూ వచ్చినారు. ప్రత్యక్షముగా ఉండి ప్రముఖంగా ఆయా తావులలో కృషిసల్పినటువంటి వారనే పైన ఉల్లేఖించుకొనడము జరిగినది. ప్రచ్ఛన్నముగా ఉండి నవ్యులచేత కవితాసాధన చేయించిన మహామహు లెందరో ఉండి ఉంటారు. వారందరినీ నవ్యసాహిత్యానికి దోహదము చేసిన వారినిగానే ఎంచుకోవలె.

---

* ఇలాగే వంగదేశములో ఖరగపురములో భండారు దండపాణిగారనే ఆయన (1927లో) రాష్ట్రేతరాంధ్రులనే పత్రికను స్థాపించి తానే సంపాదకుడుగా ఉండి కృషి చేసినాడు. బర్మాలో 'వసంతకుసుమము' అనే సంచిక, జంషడ్పూరులో ఆంధ్రనాటక సాహిత్య పరిషత్తువారి ప్రచురణలూ ఆంధ్రభాషా సాహిత్య ప్రచారము కోసము కృషిచేస్తున్నవిగా ఉండడం మెచ్చదగిన అంశము. ఈ క్రింది వాక్యాలు చూడండి :

"వంగదేశములో ఖర్గపురమున ఉన్న ఆంధ్రులు రాష్ట్రేతరాంధ్ర సంఘమొకటి ఏర్పాటు చేసి, రాష్ట్రేతరాంధ్ర సంజీవని అనే పత్రికను ప్రారంభించినారు. వీరు భారతవర్షమునకు సాగర ప్రాంతములను ఉన్న ఆంధ్రుల స్థితిగతులు తెలిసికొని, భాషావిషయమున ఎట్టి ఏర్పాటులు చేసినచో, ఎట్టి వాఙ్మయము నిర్మించి వారి కిచ్చినచో, వారి ఆంధ్రమున ఏకత్వముకలిగి, వారు మాతృభూమితో సాహచర్యము కలవారగుదురో నిశ్చయించుకోదలచినారు."

[ప్రతిభ సం 1. సం 1.]

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

# 2

# నవ్యకవిత్వము - అనువృత్తి

ఈ దశాబ్దాదికి (1940 ప్రాంతానికి) నవ్యసాహిత్యము బాగా స్థిర పడిపోయినది; ఖండకావ్యములో నవ్యులు పొందినసిద్ధి కధానికలోను గడించినా రీకాలానికి. గ్రంథ ప్రచురణము బాగా జరుగుతున్నది. గ్రాంధికభాషపార్యగ్రంథాల కోసము తప్ప రచయితలెవ్వరూ ఇతరత్రా హెచ్చుగా ఉపయోగించడములేదు. తల్లావజ్ఝల, దేవులపల్లి, అడివి, విశ్వనాధలు మాత్రం పలుతావుల ఉపన్యాసాలనిస్తూ, యువకులను సమ్మోహితులను జేస్తూ, అనేక సభలలో సమ్మానాలు పొందుతూ నవ్యసాహిత్య వ్యాపనానికి చాల కృషిచేస్తున్నారు. ప్రథమ నవ్యులలో వీరే అవిచ్ఛిన్నముగా ఈనాటికీ రచన సాగిస్తూ ఉండడము గమనించతగింది. రాయప్రోలీత్యాదులు కొందరు తమ ప్రాత రచనలను చూచుకొని మురిసిపోవడము, వాటినే పునః ప్రచురించుకొంటూ ఉండడమేకాని ముందుకు సాగడములేదు. నోరి, మల్లవరపు, వంగల, ఇంద్రకంటి, శ్రీ శ్రీ మొదలైనవారు నవ్య సాహిత్యముపైన విమర్శక వ్యాసాలను రచిస్తూ కొంత సంచలనాన్ని కలుగజేస్తున్నారు. దేశములో యువకవులు గత దశాబ్దికాలానికి పైగా సాధనచేస్తూ, ప్రధమ నవ్యుల అడుగుజాడలలో నడుస్తూ, ఈ కాలానికి గ్రంధాలను ప్రచురించుకొని మంచి వ్యాప్తిలోకి వస్తున్నారు. అనేకులు పత్రికలలో నిలచిపోయినవారే. ఉపన్యాస వేదికలదాకా రానివాళ్ళే బహుళసంఖ్యాకులు. వారి రచనలు భారతి - ప్రతిభ - కిన్నెర - మహతి - వీణ - మొదలైన పత్రికలలో విరివిగా ప్రచురితమవుతూ నవ్యసాహిత్య వికాసానికి తోడ్పడినవనే చెప్పవలె, మరీ నవ్యులు తప్పటడుగులు వేయడము ప్రారంభిస్తున్నారీ కాలానికి. చిన్నచిన్న కవితా

సంస్థలూ,* ప్రచురణ కేంద్రాలూ◆ నలుమూలలా అనేకము ఏర్పడి కృషిసాగిస్తూ నవ్యసాహిత్య విస్తృతికి దోహదంచేస్తూ వస్తున్నవి. వీటి అన్నిటికీ సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తులే మార్గదర్శకములనవలె. ఈ సంస్థలద్వారా పత్రికల ద్వారా సాధనచేస్తూ ఉన్న నవ్యులనేకులలో నేటికి (1950) కొద్దిమంది రాటుదేలుతున్నారు. ఈ దశాబ్ది కాలములో వచ్చిన సాహిత్యమును గూర్చి ఉత్తరోత్తరా గ్రహిద్దాము. అంతకన్నా ముందు 1940 నాటికి స్థిరపడిన కొందరు నవ్యకవులను గూర్చి విపులముగా ముచ్చటించుకుందాము. వీరిని నవ్యులలో రెండవశ్రేణిలో నిల్పుకోవలసి ఉన్నది. అప్పారాయ సుబ్బారాయో పజ్జికాలైన రెండుమార్గాలా సాధన చేసిన ప్రధములను గూర్చి పూర్వం ఉల్లేఖించుకున్నాముగదా! అవే మార్గాలలో కృషిచేస్తూ ఈ కాలానికి గడితేరినవారు అనేకులున్నారు. ప్రజాభిమానాన్ని చూరగొనడము, యువకులకు తర్వాత పదేళ్ళలోనూ మార్గదర్శకులయే గౌరవము పొందడము ఏ కొందరికో దక్కింది. వారిని గూర్చి ముందు చెప్పుకున్న తర్వాత ఇతరుల సాధనను తెలుసుకుందాము.

## కాంచనపల్లి కనకాంబ :

ఈమె విదుషీమణి, కవయిత్రి. భక్తురాలు. ఈమెనుగూర్చి పూర్వము

* కౌముదీసమితి (విజయనగరము) - ఆంధ్రవాఙ్మయ సేవాసమితి (బూర్గుంపాడు) - కవికుమారసమితి (అనంతపురము) - సాధనసమితి (సికింద్రాబాదు) - వ్యాససారస్వత సమితి (బెజవాడ) - నవ్యకళాపరిషత్తు (నరసారావుపేట) - సాహిత్యమండలి (ఏలూరు) - కాకతీయ కళాసమితి (వరంగల్లు) - రాయలసీమ సాహిత్య పరిషత్తు - విజ్ఞానవర్ధినీ పరిషత్తు (హైదరాబాదు) - మజిలిస్ - ఇ-ఉ మర్ఖయాం - మధుపాయి (వాల్తేరు) - దేశకవితామండలి (ఘంటశాల) మొదలైన సంస్థ లీకాలానికి ఇుంచుమించు ముందు వెనుకలుగా ఏర్పడి చేసిన కృషి ప్రశంసనీయమైనది. సాహితీసమితి తర్వాత అంతటివి కవితాసమితీ (విశాఖపట్నం) యువకవి మండలీ (తెనాలి). ఈ కవితా సంస్థల ద్వారా సాధన చేసినవారిలోనే నేటి ప్రఖ్యాత రచయితలున్నారనే విషయం గమనిస్తే వీటి ప్రాముఖ్య మెంతటిదో అవగతమౌతుంది.

◆ ఉషాగ్రంధావళి - దేశోద్ధారక గ్రంధమాల - అణాగ్రంధమాల - యువ ప్రచురణలు - సాహిత్యకుటీరము - సాహిత్యలతాగ్రంధమాల - నవ్యసాహిత్యమాల - లక్ష్మీ గ్రంధప్రచారిణి - నవోదయరేఖావళి - నమ్మాళ్వార్లు - కళానిధి గ్రంధమాల - భారతీ గ్రంథమండలి - ఆంధ్రావళి గ్రంధమాల - మణిమాలికా గ్రంధమాల - సాహిత్య మేఖల ప్రచురణలు - స్వర్ణలతా గ్రంధమాల - శశికళా కిరణమాల - మొదలైనవెన్నో ఉన్నవి.

కొద్దిగా ఉల్లేఖించుకొన్నాము. అయినా, యీకాలానికి ఈమె (జననము 3-9-1893) విజయవాడలో శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహా విద్యాపీఠము ద్వారా విశేష కృషిచేస్తూ కీర్తిగడిస్తూ ఉండడమువలన విపులముగా వ్రాసుకోవలసి వచ్చినది. ఈమె చిన్నతనము నుంచి విద్యావ్యాసంగము చేస్తూ అద్భుతమైన తెలివితేటల్ని ప్రదర్శిస్తూ వచ్చినది. నెల్లూరులో ఉపాధ్యాయురాలుగా పనిచేస్తూ దానిని వదలి చెన్నపురిలో బ్రాహ్మణ వితంతు శరణాలయములో ఆంగ్ల విద్యాభాసము చేయబోయి ఆ పిమ్మట ఇంటరుమీడియేటు వరకు చదివినది.* తర్వాత సంస్కృతాంధ్రాలలో పాండితి సంపాదించి (విద్వాన్ ప్యాసై) లేడీ విల్లింగ్‌డన్ హైస్కూలులో ఆంధ్ర విదుషీమణిగాను, తర్వాత క్వీనుమేరీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకురాలుగాను ఈమె పనిచేసి అనేక స్త్రీలకు తన ప్రవచనాల ద్వారా యోగ్యత కల్పించినది.◆ చిన్ననాటి నుంచి కవిత్వము చెప్పుతూ అనేక కృతులను వ్రాసి, కవితిలక గ్రంథమాల, పేర వెలువరించినది. పండితోత్తముల మెప్పును బడసిన కవయిత్రి యీమె. ప్రాచీన కవితా మార్గావలంబిని అయినా 'తోమాలియ'లో నవ్యత లేకపోలేదు. సరసమైన నిర్దుష్టమైన కవితాధోరణి కలిగి బహుకావ్య కర్త్రియై నవ్యాంధ్ర కవయిత్రులలో ఉత్తమస్థానాన్ని అలంకరిస్తున్న కనకాంబగారు ప్రశంసనీయ. ఈమె వచన గ్రంథాలను - నాటకాలను - ప్రబంధాలనూ రచించి తద్వారా తనకున్న కవితా ప్రాగల్భ్యాన్ని కప్పిపుచ్చే వైరాగ్యదృష్టిని హెచ్చుగా వ్యాపింపజేయడానికి పాటుపడినది. రాధ (అమృతవల్లి 1917) - గౌతమబుద్ధచరితము 1918 - శ్రీ జీవయాత్ర (1925) - హంస విజయము (1935) - శ్రీ మద్రామాయణ కథా సంగ్రహము (1936) - అమృతసారము (1936) - ఆనందసారము (1936) - అభిజ్ఞాన శాకుంతలము (1941) - తోమాలియ (1942) - చక్కని కథలు (1946) మొదలైనవి ఈమె

---

* "బాల్యంబుననె యాంధ్రభాషాకవిత్వంబు గఱపె మున్ మంగురామానుజుండు
ఆంగ్లవిద్యారహస్యంబు నాకెఱిగించె లీలమై బిదప డ్రైన్‌డేలుసాధ్వి
సంస్కృతసాహిత్య సంప్రదాయము నృసింహాచార్యపండితుం డవల దెల్పె" ...
అమృతానందనాథస్వామి భక్తకోటిలో చేరిన సాధకురాలు కనకాంబగారు.

◆ "పదియు రెండవయేటఁ బలికించితివిగదా నెల్లూరు శ్రీరంగనేతృమహిమ"
(ఆనందసారము)

కృతులు. హిందూ సుందరి, సావిత్రి, జనానా, అనసూయ, దేశాభిమాని, ఆంధ్రపత్రిక గృహలక్ష్మిత్యాది పత్రికలద్వారా సాహిత్య కృషి చేసిన ప్రజ్ఞావంతురాలు. వీటిలో 'శ్రీ జీవయాత్ర' కవయిత్రికి ఎక్కడలేని ప్రశస్తి తెచ్చినది. ఈమె అనేక సమ్మానాలను పొంది, చెళ్ళపిళ్ళేత్యాది మహాకవుల ఆశీస్సులను పొంది,* ప్రఖ్యాతికి వచ్చినది; విద్యాపీఠము పక్షాన ఎందరెందరు పండితులనో గౌరవించి, సమ్మానించిన ధన్యురాలీమె; 'కవితిలక' - 'కవితావిశారద' అన్న బిరుదనామాల్ని పొందిన కవయిత్రి. నిరంతరమూ కవితాగోష్ఠిలోను, వేదాంతగోష్ఠిలోనూ కాలమును బుచ్చుతూఉన్న యోగ్యురాలు. ఇప్పటికీ, ఉపన్యాసాల ద్వారా - రేడియో ప్రసంగాల ద్వారా స్త్రీజాతి నుద్ధరిస్తూ ఉన్న సాధ్వీమణి కనకాంబగారు.

## పంగనామముల రామచంద్రరావు :

ఈయన ముందు వేదాంతి - తర్వాత పండితుడు - ఆ పిమ్మట కవి. చాల కాలముగా 'భారతి'లో ఖండకావ్యాలను వ్రాస్తూ వచ్చిన సాధకుడు. తన ధోరణిలో తాను కవితా వ్యాసంగము చేసుకుంటూ వచ్చినాడేకాని రచ్చకు రావలెననే కుతూహలము లేనివాడు. కాని ఈయన సాధనమబట్టి గణనీయమైన కృషిచేసిన వాడనవలె. ఈయన గుంటూరు జిల్లాలోని కట్టెంపూడిలో 31-3-1895 తేదీని జన్మించినాడు. ఆంగ్ల విద్యాభ్యాసము నిమిత్తము గుంటూరుచేరి అక్కడనే 1944 నుంచీ ఇప్పటిదాకా టవున్ హైస్కూలులో ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ జీవయాత్ర గడుపుతున్న వ్యక్తి యీయన. దారిద్ర్యము పీడిస్తున్నకొలదీ కవిత్వం ఈయన ముఖాన హెచ్చుగావెలువడడం గమనించతగింది. ఈయనకు కవిత్వోపాసనమే భోజనము. లోకము దృష్టిలో చాదస్తుడు. ఈయన సాక్షాత్తుగా ఎవరిపైనా ప్రభావము కల్గి ఉండకపోయినా, ఈయన కావ్యాలు నవ్యాంధ్ర సాహిత్యాన్ని పోషించేవిగానే ఉండడం విశేషము. శ్రీ తిరుపతి వేంకటేశ్వర శతకము - పల్నాటియుద్ధము -

---

* ఈయమ పాండితీగరిమ, మీయమ జ్ఞానవిశేష మీ మహా
ధీయుతురాలి వర్తన, విధేయత, యోగ్యత, నీతియుక్తి, యాం
గ్లేయకళా ప్రవిష్టత, మలీమసకార్య పరాఙ్ముఖత్వమున్
ధీయుతులీ కృతిన్గనిన౯ దెల్లముగా౯ బొడకట్టు సర్వమున్.

పల్నాటిపౌరుషము (నాటకము) - అశోకవనము (ఖండకావ్యము) - భద్రాద్రిరామదాసు (ప్రబంధము) - కురంగి (పద్యకావ్యము) అభిజ్ఞాన శాకుంతలము - మొదలైన వీయన గ్రంధాలు. ఈయన కవితలో పలుకు ఉన్నదనే చెప్పవలె.

## జాషువా కవి :

నవ్యాంధ్ర కవులలో జాషువ విలక్షణస్థానాన్ని సంపాదించుకొన్న సహజకవి. ఈయనలో ఆంధ్రత్వము మూర్తీభవించి ఉంటుంది. ఆ మీసాలూ, ఆరీవీ, నడకలో హుందాతనమూ, మాటలలో దర్పమూ, తెలియని వాళ్ళను కూడా ఛప్పున ఆకర్షిస్తవి. ఈయన గుంటూరు జిల్లా వినుకొండ గ్రామములో 1895 అక్టోబరు 28 తేదీన జన్మించినాడు. ఆంగ్ల విద్యాభ్యాసము కొద్దిగాచేసి, హైయర్‌గ్రేడు ట్రైనింగు ప్యాసయినాడు. తర్వాత ఉభయభాషాప్రవీణ బిరుదాన్ని గడించినాడు. భారతిలో అనేక ఖండకావ్యాలు (1924-1936) ఈయనవి అచ్చవుతూ వచ్చినవి. ఈయన ప్రబంధాలను, నాటకాలను కూడా రచిస్తూ వచ్చినాడు; నవలలను నిర్మింప యత్నించినాడు; సినిమాకు మాటలు పాటలు వ్రాయబూనినాడు. ఎన్ని యత్నించినా ఖండకావ్య రచయితగా మాత్రము జాషువా కవిపేరు స్థిరపడిపోయినది. ఫిరదౌసి (1932), స్వప్నకథ (1933), ఖండకావ్యములు (మొదటి రెండు భాగములు (1937-38),◆గబ్బిలము-మొదటిభాగము (1940), ముంతాజమహలు (1941), గబ్బిలము-రెండవభాగము (1942), కాందిశీకుడు (1942), నేతాజీ (1946), ఖండకావ్యము (మూడవభాగము (1947), బాపూజీ (1948), స్వయంవరము (1949), అన్నవి ఇప్పటికి ఆయన రచించిన ఖండకావ్యములు. 'ఫిరదౌసి' విశ్వవిద్యాలయ తరగతులకు పాఠ్యగ్రంథముగా నిర్ణీతమై మంచిపేరు కవికి గడించి పెట్టినది. "గబ్బిలము"పై ఈకవి **కమితాభిమానము.** దేశములోకూడా ఫిరదౌసి, గబ్బిలము, ముంతాజ

---

* హిమధామార్కధర పరిణయము, మదాలస, రుక్మిణీ కల్యాణము, చిదానంద ప్రభాతము, ధ్రువవిజయము, కన్యకాపరమేశ్వరి, తెరచాటు, మొదలైనవి తన తొలినాటి కృతులని కవిగారే నాతో చెప్పినారు - పి. వేం. హ

◆ ఈ 'గబ్బిలము'ను ఆంగ్లములోనికి నరసింహాచార్యులనే ఆయన అనువదించడం విశేషం. దీనిని వల్లభజోస్యుల సుబ్బారావుగారు ప్రశంసించినారు.

మహాలులకున్నంత ప్రచారము ఈయన వ్రాసిన ఇతరవాటికి లేదని చెప్పవచ్చు. దేశాభిమానము, ఆంధ్రాభిమానము ఈకవికి హెచ్చు. 1942 దాకా వినుకొండ హైస్కూలులో పండితుడుగా ఉంటూవచ్చి, 1943లో మద్రాసు ప్రభుత్వాన్ని ఆశ్రయించి 'సాంగ్ పబ్లిసిటీ ఆర్గనైజర్' అయి దారితప్పి యుద్ధవాఙ్మయాన్ని సృజించినాడు! అటుతరువాత కవిత్వము చెప్పడమే ఒక ఉద్యోగమైపోయిన దీయనకు; దేశమాదరించి పలుచోట్ల ఈయనకు సమ్మానాలు చేసినది;* వేంకటగిరి, జయపురం, ముక్త్యాలరాజు లీయనను సత్కరించినారు. 'కవికోకిల', 'కవితావిశారద', 'నవయుగ కవి చక్రవర్తి' మొదలైన బిరుదాలను, ధనాన్ని, గండపెండేరాన్ని ఇచ్చి ప్రజలు, రసికులు తమకీతని కవితపైనున్న అభిమానాన్ని చాటినారు. ఈయన కవిత్వము సరళమై, ముద్దు లొలికే పలుకుబళ్ళతో నిండి ఉంటుంది. ఈయన కలములో విశిష్టమైన ఒడుపు ఉన్నది; మనోహరమైన పదసంపుటులను, హృదయంగమములైన అలంకారములను కూర్చడములో జాషువాకవి నేర్పరి. తెలుగు కవిత్వంలోని తీపి ఈకవి చూపినట్లు నవ్యులలో మరొకరు చూపలేదా అనిపిస్తుంది. అయితే మహాగ్రంధమేదీ వ్రాయకపోవడము వల్ల కాలపరీక్ష కీయన కవిత యెంతవరకాగుతుందో మరి? కాని తాను చేసిన కృషికి తన జీవితకాలములోనే మెప్పు పొందడము ఎంతో విశేషముగదా◆

---

* తన ఊరిలోనే తనకు సమ్మానము జరగడము గమనించదగినది. అందులో వినుకొండ వాసులేమన్నారో చూడండి :

వినుకొండం జనియించినావు కవిభూభృన్మౌళివై, నీపయిన్
ఘనసంఘం బమృతంపుసోన కురియంగాఁజాగె; నీ కొండలో
న, నెటుల్ పుట్టెనొ గాంగనిర్ఝరమనన్గా వెల్లువై పాఱు నీ
ప్రణుత శ్రీకవితా మహాలహరి; మా భాగ్యంబు జోష్వా కవీ!

◆ 'జాషువా కవి రసమయహృదయుడు ... జాతీయప్రబోధమున కీతని కలము గూడ పూనినది ... రసమయ భావము లీతని హృదయములోనుండి వడపోతలు పొంది వచ్చుచుండును. .... తెలుగు నుడికారమును భద్రపఱుచుచు, నూతనమైన చక్కని పదసంపుటులను గల్పించుచు, మనస్తత్వ పరిశీలనముచే బాత్రల జిత్రించుచు, నెడనెడ విశ్వసూత్రముల బోధించుచు, నెన్నదగిన నవ్యకవి యనిపించుకొన్నాడు. - పిల్లలమఱ్ఱివారి 'సాహిత్యసంపద'

6-7-47 'ప్రజాబంధు'లో బంకుపల్లి రామజోగారావుగారి వ్యాసములోని ఈక్రింది భాగాలు చూడండి.

# తుమ్మల సీతారామమూర్తి చౌదరి :

ఈయననుగూర్చి పూర్వభాగములో కొంత గ్రహించి ఉన్నాము. 1920 నుంచి భారతి సంచికలద్వారా తన ఖండకావ్యాలను వెలువరిస్తూ ఈ కాలానికి గ్రంధములను ప్రచురించి, సమ్మానాలను పొందీ, తన కవితాసౌరభాన్ని నలువైపులా ప్రసరింపజేస్తున్నా డీకాలానికి. ఈయన గుంటూరు జిల్లాలోని కావూరు గ్రామములో 25-12-1901 తేదీన జన్మించినాడు. జాస్తి సుబ్బయ్య, తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారలీ కవికి గురువులై సంస్కృతాంధ్ర సాహితీ పాటవాన్ని చేకూర్చినారు. చిన్నతనమునుంఛీ దేశాభిమానమూ, ఆంధ్రాభిమానమూ, పిత్రు గౌరవమూ కలిగి వాటినే తన రచనలలో ప్రతిబింబింప చేస్తూవచ్చిన నవ్యుడీయన. కాంగ్రెసుసేవా తాత్పర్యమీ కవికిమెండు. 1920-29 మధ్యకాలములో అనేకపద్యాలను వ్రాసి జాతీయ కవితాఖ్యాతి గడించినాడు. నవ్యులలో భావావేశము హెచ్చుగా ఉంటుంది. కాని భాషాపాటవం చాలమందిలో అంతగా కన్పించదు. ఈ కవి వ్యుత్పన్నుడు కావడమువల్ల పండితులుమెచ్చే శబ్దాధికారమూ, పామరుల నాకర్షించే భావావేశమూ ఈయన కవితలో కన్పిస్తవి. ఈయన స్వభావము వెన్నలాంటిది; పరమసౌజన్యమూర్తి సీతారామమూర్తి. స్వాతంత్ర్యప్రియుడు. ఈయనలో ఉన్న గుణాలన్నీ ఈయన కావ్యాలలో కన్పిస్తూనే ఉంటవి. ముఖ్యముగా 'రాష్ట్రగానము, (1938)తో ఈయనకెక్కడలేని ప్రాచుర్యము కల్గినది. దేశీయులలో ధర్మాభిరతి కొరవడకుండా కాపాడే నిమిత్తము, ఆంధ్రులలో కార్యోత్సాహాన్ని కల్గించే నిమిత్తమూ ఈయన కవిత్వాన్ని సాధనగా ఉపయోగించుకొన్నాడు. ఈ దృష్ట్యా చూస్తే ప్రథమ నవ్యులలో రాయప్రోలు అందుకున్న స్థాయికీ కవి వెళ్ళుతున్నాడనవలె. ఆత్మార్పణము

---

"గొప్ప కవులమల్లే ఆయనకూడా స్వేచ్ఛాజీవి. స్వాతంత్ర్య ప్రియుడు ... దేశహితార్థం తన కవిత్వం వినియోగించడమే తన లక్ష్యమని ఆయన స్పష్టంగా చెప్పాడు. దేశాన్ని తన కవితతో శీఘ్రంగా సంస్కరించాలని ఆయనకి తీవ్రమైన అభిలాష. ఆయనకు స్వభావసిద్ధంగా గొప్ప ఆత్మ విశ్వాసం ఉంది."

"Rich in imaginary, chaste in style, and superbly sweet in melody of thought and word alike, his poetry move on with the ease and elegance of a majestic river fertilising even the most barren soil on which it may happen to flow."
— V. Krishna Rao, 11-6-34.

తాపీ ధర్మారావు నాయకుడు కావడానికి అఱ్రులచాస్తున్నా డంతకుపూర్వమునుంచే. ఇదో విధంగా సమయం వచ్చింది. ఆంధ్రదేశంలో జెండా ఎత్తాడు. ఆజెండా కిందికి యువకులువచ్చి చేరారు. దీనికి రూపాన్నిచ్చే టప్పటికి "అభ్యుదయ రచయితల సంఘ" మైంది. 1943 లోనే వట్టికొండ రంగయ్య విశాలాక్షులు 'అభ్యుదయగీతాలు' "విప్లవజ్వాల" ప్రచురించారు. "ప్రజాశక్తి అనే పత్రిక ప్రారంభించారు. మహీధర సోదరులు "రష్యాపై" ఉన్న వాఙ్మయాన్ని కొంత అనువదిస్తూ వచ్చారు. నార్ల, కంభపాటి సత్యనారాయణ, తుమ్మల వెంకట్రామయ్య, చదలవాడ పిచ్చయ్య, ఆళ్వారు స్వామి, మహంకాళి, కొమర్రాజు వినాయకరావు మొదలైనవాళ్లు కృషి చేస్తున్నారు. ఖండవల్లివారు "ఆకలి" మీద కావ్యం వ్రాశారు. ప్రయాగ కోదండ రామశాస్త్రి మున్నగు వారు బెంగాలు విశాఖ ప్రాంతాల్లోనికి కరువుమీద పదాల్ని వ్రాశారు. బుర్ర కధలవిధానం ప్రచారం చేస్తున్నారు. కృషి ఘనత్వం గుర్తించారు వ్యక్తుల్ని గౌరవించడం కర్తవ్యమన్నారు. సంఘసేవ, భాషాసేవ చేసినవాళ్ళ వర్ధంతులు జరపడం ప్రారంభించారు "తెలుగు తల్లి" సంచికల్ని ప్రచురించారు. చిలకమర్తివారి స్వీయ చరిత్రను ప్రచురించి పుణ్యం కట్టుకున్నారు. అభ్యుదయ సంఘాలు చాలా వెలసినాయి, తత్పరిణామంగా సాహిత్య వ్యవసాయం మరోవిధంగా జరుగుతూన్నది. లిఖిత పత్రికలు మిక్కుటమైనాయి. విద్యార్థులలో బాగా ప్రాపకం పొందినై. చిత్ర లేఖనంలోకూడా కృషి .జరుగుతూ ఉన్నది. పత్రికలు కారణముగా మొత్తానికి నూతన చైతన్యం కలిగింది. "అభ్యుదయ సాహిత్యమంటే" ఏది అనే ప్రశ్నలో కృషీవలులు చిక్కుకున్నారు. దీనికి సమాధానంగా నాగభైరవ శివరామకృష్ణ, గోపీచంద్ మొదలైనవాళ్లు విమర్శన చేస్తూ వచ్చారు. ఈ ఉద్యమానికి మూలసూత్రాలు పాశ్చాత్యంలో తయారైనాయి. అందులో పాతకొత్తలకు వైషమ్యం కూర్చటంకాదు సూత్రం. సంప్రదాయానికీ, పూర్వసాహితి కృషీవలులకూ భిన్నంగా కాక వాళ్ళను ఆకట్టుకొని ఏకముఖంగా చుట్టూఉన్న ప్రజను ఉద్బోధిస్తూ ఉండడమే ప్రధానోద్దేశంగా కలిగిందీ ఉద్యమం. సామరస్యం కూర్చడమే ముందుకర్తవ్యము. ఈ ఉద్దేశ్యాన్ని వ్యక్తిగత దౌర్బల్యంతో కలుషితం చేస్తూన్నా రాంధ్రలోకంలో, ఈ మార్గాను యాయులు. ఇంకా బాగా స్థిరపడలేదిది.

ఎన్ని మార్పులు వచ్చినా, ఎవరిదోవ వాళ్ళదే. బలవంతంగా ఒకరిని మరొక ఉద్యమాను యాయులుగా చేయటం దుర్లభం. వాతావరణానుగుణంగా తనకున్న విచక్షణాశక్తినిబట్టి ఒక రచయిత ఒక మార్గానువర్తి అవుతాడు ఇప్పటికి పురాణాల్ని అనువదించే వాళ్లున్నారు. పిలకా గణపతిశాస్త్రి ఆపని చేస్తున్నాడు. ప్రబంధరచనసలిపే వాళ్ళు లేకపోలేదు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, గడియారం వెంకటశాస్త్రిగారు, దుర్భాకవారు మొదలైనవారీ పధానికి చెందినవారు. శాస్త్రచర్చ జేస్తునేఉన్నారు కొందరు. చివుకుల అప్పయ్యశాస్త్రిగారు "పురాణాలు" 'దర్శనాలు' గూర్చిన గ్రంధాలు వ్రాశారు. గీతాభాష్యాలు వ్రాస్తున్నారు. ఇందుకు బ్రహ్మానంద స్వామి, బులుసు అప్పన్న శాస్త్రి, మొదలైనవాళ్ళు కన్పిస్తారు. రామాయణాన్ని అనువదిస్తు ఉన్నారు. విశ్వనాధవారు, సోమరాజు వారు, ఆత్మకూరువారు మొదలైన కవులు, చారిత్రకపరిశోధనం చేస్తూ వ్యాసాలు (పత్రికల్లో, గ్రంధాలుగా) ప్రచురిస్తున్నారు. పోతుకుచ్చి, దిగవల్లి, మల్లంపల్లి, కురుగంటి, నేలటూర్లు. పూర్వసాహిత్యాల్లో మెరుగుల్ని దిద్దుతూఉన్నారు పిల్లలమర్రి. పుట్టపర్తులు. నన్నెసాహిత్యంలోని ఎణుకులు చూపెస్తున్నారు. రాయప్రోలు సుబ్రహ్మణ్యం, పిల్లలమర్రి, వింగల, రామనాధం, జమ్ములమడక మొదలైనవారు. ఈవిధంగా పలువురు పలుకకాలైన వ్యవసాయం చేస్తున్నారు. ముద్రణాసౌకర్యం నిమిత్తమై ముదిగొండ శర్మగారు లిపిసంస్కరణాన్ని సూచిస్తున్నారు. తెలుగులో - ఇది ఒక కొత్త ఉద్యమం. జి.వి.కృష్ణరావు, వేటూరి వారున్నూ - లిపి సంస్కారమును సూచిస్తున్నారు.

అన్నిటికీ తావిస్తున్నది రేడియో అని ఒప్పుకోవాలి. కాశీపతి రామనాధం, రజని, పన్యాల, దేవులపల్లి, అడవి, ఖాసింఖానులు కృషి చేస్తున్నారు. పత్రికలు కూడా ల రేడియోసాహిత్యాన్ని ప్రచురించడం మొదలె ... సాహిత్య సమ్మేళనాలు పెట్టి ఒక విధంగా కృషి చేస్తున్నది రేడియో, ఏకాంకికా పరిచయాన్ని గోపాలకృష్ణమూర్తి వ్యాసాలద్వారా చేసినాడు. కొన్ని ఏకాంకికా, కధాసంపుటాలు వస్తూ ఉన్నాయి. కధకులసంఖ్య చాలా హెచ్చి ... మారేమండ, మల్లంపల్లులు, చారిత్రక సన్నివేశాలతో నాటికలుగా వ్రాసి ప్రయోగిస్తూ ఉన్నారు. గోపాలస్వామిగారి ప్రోత్సాహమున వావిలాల సోమయాజులు "నాయకురాల"నే నాటకం నిర్మించినాడు దామరాజు

"పోతన" "రణభేరి" నాటకాల్ని రచించి ప్రయోగింపజేసినాడు. సినిమా వచ్చి కవుల రచనలకూ, తావిస్తూనేఉన్నది.

సారస్వతసభ లనేకముగా జరుగుతున్న రోజులివి. వేంకటపార్వతీశ్వరకవుల షష్టిపూర్త్యుత్సవాలు జరపడం ఫలితముగా కొంత సాహిత్యం వెలువడింది. వారి కావ్యకుసుమావళి (రెండుభాగాలు) ప్రచురితమైనవి. శివశంకరశాస్త్రి గారీ సందర్భాన సంపాదించిన వివిధ నవ్యకవుల గీతికా ఖండికా సముచ్చయము "మహోదయ" మనే పేరుతో వెలువడడం ఒక భాగ్యం. 'వైతాళికు'ల తర్వాత 'మహోదయం' ఎన్నదగిన 'ఏంథాలజీ' అనవలె, అలాగే తల్లావఝులవారి సంపాదకత్వాన 'కథాలహరి', 'ఏకాంకికలు' అనే సంపుటాలు ఆంధ్రప్రచారిణీ వారి ప్రచురణలుగా ఈ కాలానికి వెనుక ముందుగా వచ్చినవి. వేదాంతకవి "కవితాసంస్థానం, కెరటాలు" మొదలైనవి, అబ్బూరి వరదరాజేశ్వరరావు రచించిన "ప్రతిమాసుందరి" అనే రూపకం, బెళ్ళూరి శ్రీనివాసమూర్తి 'జాముకోడి', కె.యస్. రామా 'కన్నతల్లి', అల్లూరి జానకిరామరాజు 'మాతృస్మృతి', ఏలూరు జాతీయరచనా మండలివారి 'కుసుమాంజలి', గొరాబత్తుని వెంకటేశ్వరరావు 'వేల్పుటావు భాగ్యలక్ష్మలు', వారణాసి వెంకటేశ్వర్లు 'సుధాంజలి' రత్న సానువులు, సొట్లపల్లి 'జైలు', మూర్తిబాబు నాటికలు, రాచకొండ నరసింహమూర్తి 'జాగృతి', శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదించిన 'తొమ్మిది ఏకాంక నాటికలు', గోపీచంద్ 'పరివర్తనం', నూరేమండ 'నాలుగునాటికలు', ప్రతివాది భయంకరాచార్య 'పురుషోత్తముడు' చిరంజీవిపాటలు, చినలూరి లక్ష్మీనరసింహాచార్య 'రవికిరణము' గాదిరాజువారి 'స్వప్న కుమార స్వరూప సందర్శనము' భోజరాజు సంధ్యాసౌమిత్ర" మల్లంపల్లి 'చారిత్రక వ్యాసములు', మొదలైన గ్రంథాలెన్నో ఈ మధ్య కాలాన ప్రచురితమైనవి. నవ్యసాహిత్య మెంత సిరివిగా వెలువడుతున్నదీ వీటినలన స్పష్టమౌతూనే ఉన్నది. కాని దీన్ని వెనక్కు నెట్టివేసిన రెండు నూతన కవితోద్యమాలు ఈ మధ్యకాలములో బయలు దేరి సాహిత్యరంగంలో అలజడి కల్గిస్తూవచ్చినట్లు గమనించవాలు అవి స్థిరంగా నిలిచినవి కాకపోయినా వాటి స్వరూపం తెలుసుకోవలె. అవే అధివాస్తవిక - అభ్యుదయ ధోరణులు! ఈ ఉద్యమాలను గురించీ, వీటిని ప్రవర్తిలజేసిన ముఖ్య రచయితలను గూర్చీ ముందు ప్రకరణాలలో విపులంగా తెలుసుకోవచ్చు [illegible]

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# అతివాస్తవిక ధోరణి

# 3

## సూత్ర గ్రథనము :

మొదట భావకవిత్వమనే పేరుతోను, ఆ తర్వాత నవ్యకవిత్వమనే పేరుతోను వ్యవహరింపబడుతూ వచ్చిన సాహిత్యము దేశములో బాగా స్థిరపడి పోయినట్లు గ్రహించినాము. అయితే 1938 నాటికే నవ్యకవిత్వముపైన తిరుగుబాటు భావాలు పొడసూపుతూ తర్వాత తర్వాత విప్లవభావము హెచ్చయి పోతూవచ్చినట్లు గమనించ గల్గుతాము. 1932 నుంచే ఇంచుమించుగా అతి నవ్యధోరణి తెలుగు సాహిత్యంలో ప్రారంభమైనట్లున్ను, క్రమంగా పాశ్చాత్యసాహిత్యానుకరణం ప్రబలమైపోతూ వచ్చినట్లున్ను తెలుస్తుంది. ఆదర్శతత్వము పైన అభినివేశం రచయితలలో క్రమంగా నశించిపోతున్నది; సంప్రదాయం వీరికి కంటకం అయిపోతున్నది; వాస్తవికత అంటూ కొంత, అతివాస్తవికత అంటూ కొంత, సాహిత్యరంగంలో ప్రవేశపెట్టుతూ అతినవ్యులు విజాతీయధోరణులపైన మమకారము చూపెట్టుతున్నారు. పాశ్చాత్యుల "సర్రియలిజం" తెలుగులో "అతివాస్తవిక ధోరణి" అయింది. కవిత్వంతో "ఎక్సుపరిమెంట్సు" జరపడం ఒక ఫాషనయిపోయింది అతినవ్యులకు; ఛందస్సుతో, భాషతో - ఇష్టము వచ్చినట్లు ఆటలాడడం వీళ్ళకు సరదా! 'జ్వాల' పత్రికపెట్టి ముద్దుకృష్ణగారు క్రొత్తబాట వేయడం ప్రారంభించినాడు; శ్రీరంగం శ్రీనివాసరావుగా రీయనకు తోడైనాడు; శిష్టా ఉమామహేశ్వరరావుగారు అతినవ్యధోరణిని రచన సాగిస్తూ వచ్చిన ఆద్యుడనిపించుకున్నాడు. పూడిపెద్ది వెంకటరమణయ్య, కవికొండల వెంకటరావు గారలుకూడా నూత్న ఛందస్సులను ప్రయత్నించినవాళ్ళే. ఏమైనా

వీరిలో ప్రవక్తృస్థానాన్ని మాత్రం శ్రీ. శ్రీ చూరగొన్నాడని చెప్పుకోవలె*. వీరి అతినవ్య మార్గాన్ని చూచి మొదట నవ్యులు విభ్రాంతులు కాజొచ్చినారు. అయితే ఉదార భావంతో నోరి, తల్లావజ్ఝల వారలిద్దరూ వీరి వీపు తట్టి ఉషారిచ్చినారు మొదట్లో. ప్రాచీన కవితామార్గానుయాయులైన పండితులు దీనిని నిరసించడము ప్రారంభించినారు. నవ్యసాహిత్యముతోపాటు "ప్రతిభ"లో స్థానము దీనికికూడా కల్పించినారు తత్సంపాదకులు. దానితో మంచి ప్రచారం లభ్యమైందీ ధోరణి కవిత్వానికి; శ్రీ. శ్రీ నలుగురికంటా పడ్డాడు. కొందరు యువకులు అతనిని అనుసరించడం ప్రారంభించినారు; కొందరర్థముగాక తికమకపడడం కూడా గమనిస్తాము. పేరడీలు బయలుదేరదీసి ఈ ధోరణిపైన, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు దీని ప్రచారానికి కొంత కారణభూతుడైనాడు. పిఠాపురం యువరాజా పరాభీ అనువారీ అతినవ్యధోరణిలో గ్రంథాలు వ్రాసి ప్రచురించినారు. ఈ ధోరణిని మొదట్లో కొందరు 'బీభత్సకవిత్వ' మన్నారు అందులో కన్పించేభావాన్ని బట్టి; భాషనుబట్టి "మణిప్రవాళం" అనవచ్చునన్నారు; వస్తువునుబట్టి "శ్మశాన కవిత్వ" మన్నారు; ఈ కవికున్న 'అహం' జూచి 'అహంభావ కవిత్వ'మని అన్నారు, ఛందస్సులలో వైవిధ్యాన్ని, నవ్యతను బట్టి "వైచిత్రి" అన్నారు; నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్ష పీఠాన్నుంచి విశ్వనాథ ఈ నూతన మార్గాన్ని దర్శించి మన్నించినాడు. మొత్తంమీద ఈ ధోరణి కొందరి దూషణకు, కొందరి ఆమోదానికి, మరికొందరి అనుసరణకూ గురి అయింది. ఈ ధోరణినిగూర్చి తెలుసుకోవాలంటే పాశ్చాత్యుల చిత్రకళలోను

---

* తొలి సంచికలో 'జ్వాల' ఎందుకో వివరించిన విధము చూడండి:

"మనం పాపస్థంగా వుండడంవల్లనో, పురాతన మగతచేతనో, రక్తంలో నీరసం చేతనో, నూతన తేజస్సునకు గుడ్లగూబల మౌతున్నాము. ఇదిపనికిరాదు . యువకుల దృష్టికి . ఒక కొత్తదారి కనబడుతూ ఉన్నది మార్పు తప్పదు. దీనికి అడ్డు వీల్లేదు. వచ్చినా ఆగదు పిరికివారికి ముక్తిలేదు అందుచేత సచ్చని పాతబంధాలను తెంపివేయడానికి ఎంతైనా సాహసిస్తాము . మాకు మతంలేదు, జాతిలేదు, వర్ణంలేదు, ఆడవాళ్ళిందుకు మగవాళ్ళందుకు అనే భేదం లేదు . యువకులు ఉద్రేకంతో, సాహసంతో ఏది తెచ్చినా దాన్ని ప్రచారంలో పెడతాము. ఉన్నదిఉన్నట్టు అంగీకరించి నిర్జీవంగా తుప్పుపట్టడంకన్నా, నష్టం కలిగినా సాహసించి ఏదో యత్నించి జీవించడం ఉత్తమం .. "

వారి సాహిత్యములోను ఆమధ్య వచ్చిన ఈ విధమైన మార్గానికున్న సూత్రాలను ఉల్లేఖించుకోవలె. లేకపోతే దీన్ని అవగాహన చేసుకోలేము. అందుచేత ముందా సూత్రాలను గ్రహించుదాము. వాటి నీక్రిందివిధముగా చెప్పవచ్చు:

1. అల్లరిచిల్లరితనము (gloom & hopelessness).
2. నిరాశ (Scrappiness and disorder).
3. పురోభాగిత్వము (cynicism)
4. కోపము. అది తీర్చుకునే మార్గము లేకపోవడము.
5. సంపూర్ణ పరిణామాభావము (ఉద్దేశరాహిత్యము)
6. అందరు గొప్ప అనుకునే వాటిలో యేమీ లేదనటము.
7. ఎక్కడైనా సౌందర్య ముంటే (కర్మముచాలక) దాన్ని పాడుచేయడము.
8. నేయార్థము, కొద్దిమందికే ఉద్దేశించడము.
9. ఛందస్సు తారుమారు చెయ్యడము.
10. విరుద్ధభావ సమ్మేళనము.
11. మనస్తత్త్వానికి ప్రాముఖ్యమిచ్చామను కొనడము.
12. శబ్దార్థక్లిష్టత.
13. సంకేతము (Symbolism) ఇక్కడ మన లాక్షణికాభి ప్రాయానికీ దీనికీ భేదమున్నది. ఏదో మాట ఉపయోగించడము. దీనిలో ఇంత అర్థమున్నదనడము. ఆ అర్థము ఉండవచ్చు లేకపోవచ్చు!
14. అచ్చులోనూ వ్రాతలోనూ విప్లవము!
15. అవసరాన్ని బట్టి పదాలనూ వాటి ఉచ్చారణనూ తారుమారు చేయడము!

పై సూత్రాలతోబాటుగా తులతూగేవే చిత్రకారులలో భవిష్యద్వాదుల (Futurists) శాసనాలు ✻. వాటిని పరికించడం అవసరం; చూడండి:

1. జీవితములో ఎక్కువ వేగము.
2. పాతదానిమీదనూ తెలిసినదానిమీదనూ అసహ్యమూ, కొత్తదంటే, తెలియనిదంటే అపేక్ష.
3. శాంతజీవనమంటే వెగటు, ప్రమాదకరమైన అనుభవాలమీద అభిమానం.
4. అతిలోక చింతా నాశనము.

---

✻ 'అహంహభావ కవిత్వ ధోరణి' అన్న "ప్రతిభ"లోని వ్యాసంలో నోరి వారుదహరించిన వివి.

5. మానవుల కోరికలు అనంతముగా వృద్ధికావడము.
6. ఎవరికివారు తమకు అందరానిది తెలుసుకోవడము.
7. స్త్రీ పురుషులకు సంఘములో భేదము తగ్గిపోవడము.
8. స్త్రీ పురుష ప్రణయమూ, దానికి గౌరవమూ, తగ్గవలె.
9. వ్యాపారమంటే గాఢాభిమానము, సంపూర్ణమైన ఆర్థికబుద్ధి
10. యంత్రబుద్ధి.
11. క్రీడలంటే వెర్రి. అందులో మించవలెననే తృష్ణ.
12 దూరయాత్రలమీద అపేక్ష. ఏకాంతచింత లేకపోవడము
13. విశ్వజనీనమైన ఊహలు.
14. ఎంకరలమీద, నెమ్మదిమీదా, అసహ్యాభావము, సూటిదనము, తొందర ఇత్యాదులందు ఆదరము.

15. పాతపండితులు చెప్పిన లక్షణాలన్నీ దూరముగా గిరాటువేసి, కవులు భావపరంపరలతో ఒళ్ళు మరిచిపోయి మరిపించవలె. భావవేగము చిత్రించేందుకు కారకము, విశేషణాలు, కామాఫుల్‌స్టాపులు-అన్నీ ఎగరవేసి తంతివార్తల భాషలో, నోటికివచ్చిన విధంగా, క్లుప్తసరిగా, అత్యవసరమైన మాటలు మాత్రమే కురిపిస్తూ, భావగీతాలు (Lyrics) చెప్పవలె.

16. తంతులులేని ఊహ (Wireless imagination).

17. విశేషణాలు ప్రయోగించడము తగ్గించి వేయవలె.

18. క్రియాపదాలు భావార్థకంలో మాత్రమే వాడవలె. అందువల్ల రచనకు ప్రచండత, ఓజస్సు కలుగుతవి, వాక్యనిర్మాణము వల్ల రచనకు నిలకడకలిగి అది ఆగుతూ ఆగుతూ ఉంటుంది. అది పనికిరాదు. భావార్థక ప్రయోగమువల్ల వాక్యనిర్మాణము నశిస్తుంది.

19. భావాన్ని అనుకరించే ధ్వనిగల శబ్దాలు తరుచుగా నిర్భయంగా ప్రయోగించవలె. శైలివేగము తెలియజేయడానికి గణితములోనివీ, సంగీతములోనివీ సంజ్ఞలు ఉపయోగించుకుంటాము.

20. అచ్చులోకూడా మార్పు. పేజీ ఒక్కంటికి మూడునాలుగు రంగుల సిరా. అవసరమైతే ఇరవై రకాల టైపులూ వాడతాము.

21. భావోన్మాదము సువ్యక్తము చేయడానికి పదస్వరూపము మార్చి కొత్తరూపాలు సృష్టించవలె. అవసరం కొద్దీ మాటలు కోయడము, పొడిగించడము,

వెనుకపడ్డట్లు తెలుసుకుంటాము*. ఈ కొత్తపద్ధతి మన సాహిత్యచరిత్రలో పరివర్తనకాలములో వచ్చిన మార్పునీ, కాలక్రమేణా ఈ మార్గము మళ్ళీ మరొకదానికి దారితీసి సాహిత్య విస్తారానికి సహాయకారి అయినదని గుర్తించవలె.

ఈ'సర్రియలిజము' రెండవ ప్రపంచయుద్ధకాలములో ప్రవర్తిల్లిన కవితోద్యమమని తెలుసుకోవలె. ఇది ఎంతో కాలం మన ప్రాంతాన వర్ధిలలేదని చెప్పవలసి ఉన్నది. మన తెలుగుదేశములో నైసర్గికము, సహజము కాని ఏ పాశ్చాత్య కవితోద్యమమైనా తిష్ఠవేసుకొని కూచోజాలదు. అల్లాగే ఈ 'సర్రియలిజ' ◆మున్ను అట్టేకాలము నిలువలేదు. ఏమైనా దీనినిగూర్చి కొంతచర్చ జరిగినమాట వాస్తవం. దీని నిర్వచనమును, సూత్రవిచారమునుగూర్చి కొంతచూదాము:

'సర్ - రియలిజం' అనినపుడు 'సర్' పదానికి గల అర్థమేమిటీ అని చర్చ: 'సర్' అంటే 'ఇన్' (లోపల) అనికొందరు◆...

దీన్ని బట్టిచూస్తే 'సర్ రియలిజం' లో ఒక పద్ధతి మనకు కనపడే బాహ్య ప్రపంచానికి పునాదైన నిమ్నోన్నతభావ ప్రపంచకథన మన్నమాట! మరికొందరు "సర్" అనే పదము "సూపర్" యొక్క సకుంచితరూపమనిన్నీ, 'సర్రియలిజము' అనగా యథార్థదృష్టాన్ని చాలా అతిశయోక్తితో చిత్రించటమూ యథాభావనను కూడా చాలా ఎక్కువచేసి చిత్రించటమూ అంటున్నారు. ఇంతకూ మనవాళ్ల 'సర్రియలిజం' ఒక నిర్దిష్ట పద్ధతికాదు. దానిలో యథాదర్శనం (realism) దగ్గర్నుంచీ అసహ్యత (uglyism) దాకా ఉన్నవి, యథాదర్శనము దాని కేంద్రము. దాని చుట్టూ యీ "యిజములన్నీ" వ్రేలాడుతున్నవి. ఈ మార్గానుయాయులు చేసే పనిని క్రిందివిధముగా చెప్పినాడు ఒక విమర్శకుడు: "The sur-realist artists took a world disorganised by lack of planning and mirrored it in exaggerated detail, as if they had studied it with microscope, and by a process of psycological

---

* రష్యన్ 'ఫ్యుచరిజం' అంటే మబ్బులో ఉంది. ధ్వనులే సంగీతం, మాటలే కవిత్వం, రంగులే శిల్పచిత్రాలు - మూడుముక్కలలో ఇదీ దాని తత్వం. ఇటువంటిదానిని కొందరు 'ఒగ్లిజమ్' (అసహ్యత) అన్నారు; 'డాడాయిజం' (పరమాసహ్యత) ఇంకా అసహ్యమైనది ఒంటూకూడా ఒకటి ఉన్నది.

◆ జమ్ములమడకవారు దీనిని 'అంతశ్చేతస' మన్నారు.

analysis." అంటే యీవిధమైన కవులు ఇప్పుడు పైకి కనపడే బాహ్యప్రకృతిలో ఒక నిర్ణీత పద్ధతి లేదనీ, తామా ప్రకృతి లీలలను భూతద్దముతో చూచి అందులో ఉండే అవయవ విన్యాసాన్ని అంతా తప్పీళ్ళతోనూ, మనస్తత్వశాస్త్రరీత్యానూ పరీక్షించినట్టున్ను చిత్రిస్తారు.

మన మనస్తత్వ శాస్త్రవేత్తలు సామాన్యముగా జ్ఞానానికి (మనస్సునకు) ద్విక్షణావస్థాయిత్వము చెప్పినారు. ఇంద్రియార్థ సంపర్కమువల్ల కొన్ని సంస్కారాలు కలుగుతవనీ, ఆ సంబంధమైన వస్తువు మళ్ళీ కనపడ్డప్పుడుగాని, భావము వచ్చినప్పుడుగాని, ఆ సంస్కారాలు ఉద్బుద్ధాలౌతవనీ చెప్పినారు. కాబట్టి ప్రకృతిని చూచినప్పుడు ఒక భావన కలిగి ఒక విధమైన సంస్కారము కలుగుతుంది. మళ్ళీ అది ఉద్బుద్ధమైనప్పుడు సరిగా ఎట్లా కనపడ్డదో అట్లా మాటలలో కూర్చడము పెద్ద పని అనుకుంటారు. ఇది గొప్పపని. కష్టసాధ్యమున్ను ✻. కాబట్టి అతి నవ్య మార్గాలలోను విశేషమున్నదని గమనించవలెనే కాని త్రోసివేయరాదు.

ఈమార్గం ఆంతరానుభవముమీదా, మనస్తత్వంమీదా, ఆధారపడి ఉన్నది. కాబట్టి ఈ అనుభవ సంస్కారమే తర్వాత ఉద్బుద్ధమైనప్పుడు ఇతరానుభవాలతో కలిసి ఉంటుంది కాబట్టిన్నీ, తదనురూపమైన సంస్కారము కలవాళ్ళకే అది తెలుస్తుంది. అందుచేతనే ఈరకం కవుల వ్రాతలు కవికిచుట్టూ ఉన్న సంకుచిత వాతావరణంలో ఉన్నవాళ్ళకే ఉద్దేశితాలవుతవి.◆ ఇందులో కార్యకారణ భావం

---

✻ 1. జ్ఞానానికి పరిమితిలేకపోవడము 2. దాని ఉన్నదున్నట్లు నిర్వచించడము కష్టము కావడము 3. అందరిలో సమానానుభవము లేకపోవడము 4 చెప్పే పద్ధతిలో భిన్నత్వము 5. జ్ఞాన మితరజ్ఞానముతో కలిసి ఉద్బుద్ధము కావడము-కారణాలు

◆ ఈ క్రింది వాక్యాలుకూడా ఈవిషయాన్నే ఉల్లేఖిస్తున్నవి:

"The Poet is now seeking to find and establish that central calm, a point from which he may begin to work outward again, and in the process he is bound to be obscure, for he is talking to himself and his friends. to that tiny temporarily isolated unit with which communication is possible, with whom he can take a number of things granted..... In modern poets, there is a perpetual interplay of private and public meaning, the inner circle of communication-the Poet's communication with his own arbitarily isolated social group is perpetually widening into and become identified with the outer circle of environment,".

- Cecil Day Lewis.

కన్పించదు  ఇది ఉద్రేకానుభవ విధానము.  పదాలలో ఒకదాని కొకదానికి సంబంధం ఉండదు; వ్యాకరణం అన్వయించదు; కవి సమయాలలో - కవితా సామగ్రిలో - భాషలో - అన్నిటా నవ్యతే లక్ష్యం. నూత్న పదబంధాలు, నూతనాకృతులు, నూత్నఛందస్సులు - వీటికోసమే ఎక్కువ ప్రయత్నం! ఇవి దోషాలా గుణాలా అన్నది ప్రశ్న! దీన్ని సహించనివారు లేకపోలేదు.  పాశ్చాత్యులలోకూడ ఈరకమైన కవిత్వ ధోరణిపైన ఇరుపక్షాలు అంటూ బయలుదేరి కొంత ఘర్షణ పడినారు.  అక్కడ కూడా ఈ ధోరణి కొద్దికాలమే ఉండి సమసిపోయింది.

ఈ పద్ధతిలో ఉద్దేశం తిరుగుబాటేగాని, ఆ చెప్పింది నిజమా, అబద్ధమా, పిచ్చా, ఊహా, కలా, అనే సంగతి అనవసరంగాగ కన్పిస్తుంది. చూస్తే ఇది అంతా గారడీవాని పనివలె ఉంటుంది.*  దీనివలన కలిగే చిత్తవికార మందుకనే క్రింది మెట్టులో దవుతున్నదనవలె. అల్లరి బుద్ధిపూర్వకంగా చేయడం - మేమే గనుక చేస్తున్నాము గదా అని గర్వపడడము ఈ మార్గవర్తులలో కన్పిస్తుంది.

పైన వివరించినవాటిలో కొన్ని నవ్యకవిత్వములో కన్పించినప్పటికీ నవ్యకవులు పూర్వ సంప్రదాయాలను బొత్తుగా నిరసించలేదు. వాళ్ళకు శబ్దము - దానికి శ్రవణ సుఖం ఉండడము - శబ్దార్థ సంబంధము ఉండడము - ఆ అర్థానికి రమణీయత, హ్లాద రామణీయకాలూ, రసమూ, ఉపాదేయాలుగానే కనపడుతవి. భాషనుగూర్చి కొందరికి వ్యావహారికం యిష్టమైనది.  ఛందస్సు, శబ్దసమ్మేళనం - స్వేచ్ఛ - వాచ్య వ్యంగ్యాలు - గూఢత - నేయార్థం మొదలైన వాటిలో వారికి అభిప్రాయభేదా లున్నప్పటికీ, సంప్రదాయాన్ని పూర్తిగా మూలచ్ఛేదము చేయతలపెట్టలేదు.  కాని యీ అతినవ్యమార్గము దగ్గరకు వచ్చేటప్పటికి సహృదయులందరూ నిర్విణ్ణులుకాక మానరు. సంప్రదాయలాక్షణిక సూత్రాలూ, ఈ అతినవ్యులనుసరించే సూత్రాలూ పూర్తిగా విరుద్ధాలు. వీరికి కవితా సౌందర్యం అక్కరలేదు. ఎక్కడైనావస్తే దానిని బుద్ధిపూర్వకముగా చెడగొడతారు. శబ్దము అర్థావబోధ చెయ్యనక్కరలేదు. కావ్యానికి

---

* Sur-realism has led us into realms of magic, into the borderlands of sub-conscious, between madness, mental twilight and the dream, its goal being to achieve the realisation of achieving something new. - Modern German Art

అర్థము ఉండనక్కరలేదు. అసలు కళ సత్యకథనమేకాని యెంతమాత్రము అనుకరణము కాదు*. భావవైరుధ్యము అవశ్యముగా ఉండదగినది. ఛందస్సక్కర లేదు. తుదకు భావాలయొక్క కావ్యాలయొక్క పరిసమాప్తి కూడా అక్కరలేదు. భావ ప్రకటనను మనస్తత్వ శాస్త్రము ప్రకారము కాబట్టి "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అనే నిర్వచనములో ఉన్న అంశా లేమీ అవసరం లేదు. వీరికి రసముతో ప్రసక్తే లేదని చెప్పనెరె.

ఈ అతివాస్తవిక ధోరణిని తెలుగులో ప్రవేశపెట్టిన సాధకులను గూర్చీ, వారి రచనలను గురించీ, విపులంగా తెలుసుకొందాము. వీరు చెప్పిన సూత్రాలు, వ్రాసిన వ్రాతలూ పైన మనముల్లేఖించుకొనిన సూత్రములకు సరితూగేటటువంటి వేనని గమనించగల్గుతాము.

## శ్రీరంగం శ్రీనివాసరావు :

అతి వాస్తవిక ధోరణి గూర్చిన ప్రసంగము వచ్చిన వెంటనే శ్రీ. శ్రీ. పేరు స్ఫురించి తీరుతుంది. ఈ ధోరణి కవిత్వాన్ని ఎందరు చెప్పినా శ్రీ. శ్రీ. వారందరిలో ప్రముఖుడై కీర్తి గడించినవాడు కనుక ముందితనిని గూర్చి వ్రాసుకోవలసి ఉన్నది. అంతేకాకుండా సూత్రగ్రథనము సందర్భానకూడా ఈతని రచన లెంతగానో ఉపయోగిస్తాయి. శ్రీ. శ్రీ. (జననం 1910) కవితాసమితిలో (విశాఖపట్నం) సాధకుడుగా బయలుదేరినట్లు, సలక్షణభాషతో, ఆలంకారిక సమ్మతమైన కవితను చెప్పినట్లు,

* మనోహరత్వమనునది లలితకళల . . యొక్క ముఖ్యధర్మము . లలిత కళ అనుకరణములుగా నుండునేగాని మూలములుగ నుండవు. యుద్ధము యొక్క రసవంతమైన వర్ణనము కావ్యమగునేగాని ఆయుద్ధము కావ్యము కాజాలదు కళ కళగా ననుభవించుటకు, నెయ్యది యనుకరణ మన్న జ్ఞానము చూచువారికిగాని వినువారికిగాని యత్యంతావశ్యకమనిమాట మరచిపోగూడదు . . కళలకు కళాత్వము లోపించునంత తన్మయత్వము జెందినయెడల నొక్కొక్కప్పుడాభాసమునకు కారణమగునని మాత్రము మరువరాదు

-లక్ష్మణరాయవ్యాసావళి.

ఇది 1928 లో ఈయన ప్రచురించిన "ప్రభవ"* అనే ఖండకావ్య సంపుటివలన వ్యక్తమైనట్లు పూర్వమే(పుటలు 446-450)హించినాము. ఈతడు సంస్కృతాంధ్రాంగ్ల కవితామార్గాల నన్నిటినీ కలయజూచిన ప్రతిభావంతుడు. మొదట్లో (1928 ప్రాంతానికి) భావకవిగా ప్రకృత్యారాధనము - ప్రేమ తపస్సు చేసినవాడే. ఉత్తమ భావుకుడైన అంతర్ముఖుడితడు తన ప్రథమ రచనలలో! ఈతడు పలాయనవాదిగా ప్రారంభమై, వాస్తవిక ధోరణులలో "ఎక్స్పరిమెంట్సు" చేసి చివరకు అభ్యుదయవాదిగా పరివర్తనం పొందినాడు.

ఈతని గుండెలో ఆవేదనా, ఆవేశం హెచ్చు. వాస్తవికలోకంపైన దృష్టి మరల్చిన కవిధీరుడితడు. "మరో ప్రపంచ" ద్రష్టగా ఇతనిని పేర్కొని తీరవలె. ప్రస్తుతం ఈతని అతివాస్తవికధోరణే మనకు ప్రసక్తము కనుక దానిని గూర్చే విచారించు కొందాము. భారతీ ఆనందవాణీత్యాది అనేక పత్రికలలో ఈయన రచనలు బహుళంగా కన్పిస్తవి. కాని యీతడు 'ప్రతిభ' సంచికలలో ప్రచురించిన గీతాలే అతివాస్తవిక ధోరణిని గూర్చిన సూత్రాలను అందించేవిగా ఉన్నవి. చూడండి:

---

* 'ప్రభవ' ప్రకృతిగీతములు - ప్రణయగీతములు - ప్రకీర్ణగీతములనే మూడు భాగాలుగా ప్రచురింపబడింది వీనిలో ఆంగ్ల సారస్వత ప్రభావము బాగా ఉన్నది; అందుకనే భావకవిగా ఈతనిని నిరూపిస్తున్నదీ 'ప్రభవ' అనవలె. పురిపండా 'ఉపక్రమణిక'లో వ్రాసిన ఈ వాక్యాలు చూడండి :

"... నవీన కవికుమారులకుంబలెనే శ్రీనివాసరావు గారికి ప్రకృతిలక్ష్మి యుపాస్యదేవత . .

ఇది మనోజ్ఞ ప్రకృతిధామ మిచటఁజేరి
అమృత పేశల నవమాధురిమముఁగూర్చు
విహగకల కూజితధ్వనీ విధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు.

అని 'మరల మరల మంజులగాన ఝురులఁదేలు'ను . . . ప్రణయగీతములు . కేవలము పరమేశ్వరుని పరముగ రచింపబడినవి . . .

శ్రీనివాసరావుగారి కవితయం 'దొక యనిర్వచనీయ మహోన్నతమగు హొయి' యున్నది 'దరులొరసి పారు గాంగనిర్ఝరిణియట్లు' వీరిగతిఁ (చెంగుచెంగున) తురంగలించును. కవిత్వమునందు మంచి యుత్సాహమున్నది."

దీన్ని బట్టి చూడండి శ్రీశ్రీ ఈనాటి కెలా మారిపోయినాడో! పోల్చడానికి కూడా వీలులేదు

"ఛందో బందోబస్తులన్నీ
ఛట్ ! ఫట్ ఫట్ మని త్రెంచి
Damnit ! ఏమిట్రా ఇ? దంటే
Pray ! It's poetry అందాం."

ఇందులో ఛందస్సక్కరలేదనీ, అయినా "పొయిట్రీ" అవేననీ మొదటిసూత్రం.

"అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేదాం,
కాదన్న మాదన్న ◆ యెవడన్నా వుంటే
వేమన్న యేమన్నాడో చూదమందాం."

అర్థం అక్కరలేదు. శబ్దము అర్థముతో సంబంధించి ఉండదు. అది స్వతంత్రము. శబ్దసామ్యమూ తదలంకారము మాత్రము గ్రాహ్యం*. ఇది రెండో సూత్రము. గద్య పద్యభేదము లేదు. గణఛందస్సు లేక పోయినా, మాత్రా ఛందస్సైనా ఉన్నదా అంటే అదీ లేదన్నారు వెనక. ఇప్పుడు గద్య పద్య భేదమే లేదన్నారు. ఒకే కావ్యములో గద్య పద్యాలు రెండు రకాలూ కలిసి ఉండవచ్చు! ఇది మూడో సూత్రము.

"హోష్! హూష్! హూష్! హోష్! అని కేకలువేసి కావ్ కావ్! మ్యావ్ మ్యావ్! అందాం గమ్మత్తుగా."

సౌందర్యమక్కరలేదు. సౌందర్యరహితాలైన శబ్దాలుకూడా కావ్యముకావచ్చు. అంతేకాకుండా బుద్ధిపూర్వకముగా, సౌందర్య రహితాలైనా, అల్లరిచిల్లరగా ఉండేవి, నిరర్థకాలైనా, శబ్దాలనుపయోగించవచ్చు.

---

◆ (వేమన) " . . . సెలకాలపు వ్యక్తి యిదంతా తనకర్థం కావటంలేదు. ఇందులో ఒక్కర్థమేమీలేదు. ఆయనకు కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆయనకు జీవితమే అర్థం కాలేదన్నమాట. ఇతడు కళ్లు మూసుకున్నాడు. వెనుకపడి పోయాడు -భారతి 1939 ఫిబ్రవరి

* ఈ అతివ్యాప్తి వ్యాఘాతదోషమునుండి అలంకారమార్గంలో చేరుద్దామంటే శబ్దాలంకారాలకు కానానేకుంది గాని అర్థాలంకారాల పని ఎళ్ళి అభావమే ! "అర్థాన్ని అడవిలోనే వదిలాం! నే మాత్సృష్టికి ఏళ్ళను వెర్రికూతలే.

"న . . . న . . . న . . . న . . . నత్తి మాటలు కూడా
మ . . . మ . . . మ . . . మ . . .మన వ్రాతల్లో వుండవచ్చు!"

పై నాలుగుపాదాలు కలిపి నాల్గో సూత్రము *

ఈ నాల్గుసూత్రాలతో "రమణీయత" "అర్థం" "శబ్దం" ఈ మూటిసమ్మేళనం "కావ్యం" అనే సిద్ధాంతం పూర్వపక్షమైపోయినట్లు

* ప్రతిభ సంపుటం 5 సంచిక 1 లోకూడా "కనుమలో ఎది-కొ-కొ-కొలిమి" etc

ఇందులో 'నీసాల్వర్సాన్' కంటె 'నియోసాల్వర్సా' నని స్పష్టంగా అంటే యింకా బాగుండేదేమో! అశ్లీలస్ఫురణం జుగుప్సాకరంగా ఉంది. బీభత్సమున్నా! ఇదొక విశేషము. కవిగతి సాల్వర్సాన్ యింజక్షన్ కిందికి దిగింది! అది మళ్ళీ కవిముఖాన వినడం! ఇందులో దాదాయిజంయొక్క ఛాయ ఉంది! ఈ క్రిందిది యింగ్లీషు దాదాయిజం కవిత్వం!

" In your inside three are smoking lamps the swamp of blue honey
cat crouched in the gold of a flemish inn, boom, boom,
lots of sand-yellow bisyclist chateanneuf des pepes
man hatten there are tubs of excrement before you
mbaze, mbaze, baze-baze, mleganga, garoo.
.. .. . . .. . .. . "

నిర్థకపు "హుష్‌హుష్" లాటి కేకలు, అపద్ధపుబొక్కనలు, మొదలైనవి; పత్రికలపై పద్యపాదాలు పెద్దక్షరాలతో మొదలెట్టాలనే నియమాలు మొదలైనవి లేక పోవడమూ, కనిపిస్తున్నై! ఒక గొప్ప దాదాయిస్టు ఈ క్రింది ప్రశ్నలలో తన అభిప్రాయాన్ని చెప్పినాడు.

"What is beautiful? What is ugly? What is great, strong, weak? What am I? Don't know! Don't know! Don't know!"

"Dada was a violent protest against art, literature, morals, and society."

"In Dada and sur-realism magazines the subject of suicide evoked keen interest.

"To Dada the past was dead and the future was powerless to be born "

ఒకమారొక దాదాప్రదర్శనం జరిగిందట అక్కడ జరిగిన విషయాల్లో యీ క్రిందివి కొన్ని :-

(1) దాదాసిద్ధాంతం స్త్రీ పురుషభేదం లేదని

(2) బాక్సింగు (ముష్టియుద్ధం)లో నెత్తురు కారుతూంటే అయ్యో అనకుండా చూడటం

(3) చిరుసు హంసపుముద్దలలా టొమాటోలు పెట్టి ప్రేక్షకులూ ప్రదర్శకులూ కొట్టుకోటం (వాళ్ళ తమ వెంట్రుకలు పీక్కుంటామని ప్రచురించారట గాని చూపలేదట!) ఒక ప్రదర్శనాన్ని గూర్చి యిట్లా ఉన్నది

"One of them (exhibits) was the printed reproduction of Mona Lisa with a pair of moustaches painted on her face and leaving an inscription underneath 'Lhooq' (look)"

మరి ఒక ప్రదర్శనం-

"The visitors had to pass through a public lavatory in order to enter the gallery. Inside, the spectators were provided with hatchets with which they could attack the exhibits. At the end of the gallery, a young girl stood reciting obscene poems.. .. . and the exhibition had to be closed down by the police.'

ఇంకా మరికొన్ని గీతాలు చూడండి·

"అచ్చా! స్వేచ్ఛాజీవీ!
ఐతే, కైతే, నీ వ్రాతని
Argument కోసం ఒప్పుకున్నా,
పానుగంటివారు ఒప్పుకోరు."

గ్రాంధికవాదైన పానుగంటివారిమీద దెబ్బ యిది!

"పానుగంటివారు ఒప్పుకోకపోతే
పామునంటిదానికి విరుగు డుంది.
ఇంద్రగంటివారి నడిగితే,
ఏమిటంటారో తెలుసునా?"

ఇంద్రగంటివారీ మార్గాన్ని మన్నిస్తున్నారని చెప్పడం

"పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం!
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
"మానిషాదగీతం"లో వున్నది!"

"శ్రీనివాసరావుగారీరకం కవిత్వానికి వాల్మీకివలె ఆదికవి" అని చెప్పడం. ఈపైన చెప్పిన పద్ధతి "సర్రియలిజ" మని యీ క్రింది గీతంలోని తుది చరణముతో తెలుస్తున్నది!

"జీబ్రాకి, Algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్లూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం యిస్తే
వెర్రికాదు, sur-realism రా సోదరా!*

---

* 1939 సంవత్సరం మార్చి భారతిలో "పాతసీసాలలో కొత్తపానీయము" అనే శీర్షికగల వ్యాసంలో ఈయన అభిప్రాయాలను చూస్తే ఆయన యీ "రసం" తో పనిలేని కవిత్వానికే, "శబ్దానికి అర్థానికీ సంబంధం లేద'నే వాదానికీ ప్రవక్త అని నమ్మటానికి వీలులేదు

* "కొంటెకోణాలు" ప్రతిభ IV 170

(ప్రతిభ) మొదలైనవి ఇతని బుద్ధి నైశిత్యాన్ని ప్రదర్శిస్తున్నవి. అనేక సాహిత్య ప్రక్రియలలో సాధన చేస్తున్నవాడైనా, ముఖ్యముగా నాటికా కర్తగా నవ్యులలో విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. ఇతడు వ్రాసిన 'భార్యలసమ్మె' అనే నాటిక, వెఱ్ఱితలలు వేస్తూ ఉన్న అభ్యుదయ మార్గాలను వ్యంగ్యంగా విమర్శిస్తున్నటువంటిదై దేశంలో మంచి ప్రాచుర్యం సంపాదించి కవికి ప్రజలలో ఖ్యాతి నార్జించిపెట్టింది. ఈతని నాటిక లనేకాలలోని కథా వస్తువు ఔత్తరాహుల గాధలలోనివై కవిదృష్టిని - అభిలాషను వ్యక్తము చేస్తున్నవి. ఆకాశవాణిద్వారా ఇతని నాటికలు శ్రోతృ హృదయాలకు ఆనందం కల్గిస్తూ ఉండడం గమనించదగింది. భారతీయ సంస్కృతిని గూర్చి పరిశ్రమచేసినట్టి 'నాగరికతా విస్తరణము' ద్వారా తెలుగులోకానికి జ్యోడు మహాశయుని చక్కగా అందించినట్టి ప్రతిష్ఠ ఈతడు గడించుకొన్నాడు. అయితే ప్రాచీనదృష్టి మెండుగా ఉండడము వలన ఇతర యువకవులతో బాటుగా ప్రగతి మార్గాలలో నడవక ప్రాతబడుతున్నాడనవలె. ఏమైనా ఈతడు ఉపాధ్యాయుడుగా రాజమంద్రి - సికింద్రాబాదు - ఒంగోలు - వేటపాలెం మున్నగు స్థలాలలో విద్యార్థులలో సాహిత్యచైతన్యాన్ని కల్గిస్తూ ఉన్న సారస్వతసేవకుడని కీర్తి గడిస్తున్నాడు.

## పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు :*

ఈ దశ కానికి ఐదారు సంవత్సరాలకు ముందే సాహిత్య వ్యవసాయాన్ని ఆరంభించి ప్రక్రియా వైవిధ్యంతో నేటికీ కృషిచేస్తూ, యువ సాహిత్యోపాసకులలో ప్రముఖ స్థానాన్ని స్వీకరించి కీర్తి ప్రతిష్ఠలు గడించుకుంటున్న వారిలో పిల్లలమఱ్ఱి ముఖ్యుడు. గుంటూరు మండలము బ్రాహ్మణకోడూరు గ్రామంలో ప్రసిద్ధమైన వైదిక కుటుంబంలో ఇతడు (31-12-1918) జన్మించినాడు. ప్రతిభావంతుడైన ఈతడు సికిందరాబాదు మహబూబు కళాశాలలోనూ, హైదరాబాదు నిజాం కళాశాలలోనూ, విద్యాభ్యాసం చేసినాడు. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రులవారికీ, కురుగంటి సీతారామ భట్టాచార్యులవారికీ ప్రియశిష్యుడై వివిధ సాహిత్య మార్గాలలో పయనించి రసిక హృదయ రామణీయకతతోనూ, పాండిత్య ప్రాభవంతోనూ

* వావిలాల వారి కలం నుంచి.

పరిచయం చేకూర్చుకొని సాహిత్యరంగంలో ప్రవేశించినాడు*. తొలికృతులలోని మాధుర్యంతో హైదరాబాదు మండలాలలోని యువకవిలోకాన్ని ఆకర్షించి "సాధనసమితీ" ప్రముఖ స్థాపకుడై (1939) కొంతకాలం అధ్యక్షపదవిని నిర్వహించి అవిచ్ఛిన్న ప్రభావంతో సాహిత్యకృషి సాగించినాడు. ఉత్తమ విద్యావ్యాసంగంకోసం ఈతడు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రవేశించి ◆ ప్రథమ శ్రేణిలో ఎం.ఏ. పట్టభద్రుడైనాడు (1943). విశ్వవిద్యాలయ విద్యార్థిగా ఉంటూ ఉన్నప్పుడు కూడా ఈ కవికుమారుడు వాల్తేరులో యువకులను అనేకులను ఆకర్షించి సాధనసమితికి శాఖ నొకదానిని కల్పించి 'ప్రత్యూష' (లిఖిత మాస పత్రిక) ద్వారా సభ్యుల రచనలను సంపాదించి ప్రకటించినాడు (1940-43). విద్యాభ్యాసం పూర్తి ఐన తర్వాత కొద్దికాలము హైదరాబాదు ప్రభుత్వశాఖకు ద్విభాషిగానూ, పిమ్మట ఏడెనిమిది సంవత్సరాలుగా గుంటూరు హిందూకళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగానూ ఉంటూ సాహిత్యంలో వివిధ విశిష్ట మార్గాలను అన్వేషిస్తూ ఈతడు విశేష కృషి చేస్తున్నాడు. గేయం, పద్యం, నాటిక, కథ, వ్యాసం, కావ్యవిమర్శ, గ్రంథవిమర్శ, రేడియో ప్రసంగం, లేఖలు - మొదలైన సమస్త సాహిత్యశాఖల్లో నడిచిన ఈతని లేఖిని ఉదాత్త వస్తువునూ కమనీయ కళావిన్యాసాన్నీ స్వాయత్తం చేసుకున్నది. ఈతని రచనలలో ప్రామాణికత సర్వే సర్వత్ర గోచరిస్తుంది. ప్రాచీనమూ, అధునాతనమూ అయిన సాహిత్య రసనల స్వరూప స్వభావాలను ఉత్తమ కవితావీథులలో విహరించే ఈతని సరససాహితీ హృదయం అందుకున్నది; కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించి ఇస్తున్నది. కవి భ్రమరమై ప్రథమతః 'మధుకణములు'* (1940) సేకరించి సాహిత్య సరస్వతిని ఇతడు ఉపాసించినాడు. 'రవీంద్రుని కవితాత్మ పుష్పసౌరభమువలె ప్రతిపదంలోనూ

---

* సికిందరాబాదులో జమ్మలమడక సోదరుల (సూర్యచంద్రుల) మైత్రీ, సాహచర్యమూ ఆనాడు అంతర్వాహినిగా ఉన్న ఈతని కవితానిర్ఝరిణికి త్రోవలు కల్పించినవి.

◆ ఆంధ్ర విశ్వవిద్యాలయములోని ఈయన గురువులైన పింగళి - అబ్బూరి కవుల ప్రభావమీతని హృదయముపై కంటె, గంటి - మల్లాది - వజ్ఝల - దువ్వూరి పండితుల ప్రభావమీతని బుద్ధిపైనా హెచ్చుగాపడి ఈతనిని నవ్యకవిగాను, యువపండితునిగాను తీర్చిదిద్దినవనవలె.

* "అన్ని ఖండకావ్యాలు, నవ్యకవిత్వానికి చెందిన క్రొత్త పోకడలకు సంబంధించినవే! వీరిది నడకలేని నాటుకవిత్వంకాదు. హృదయంగల కవి . . .". - కృష్ణాపత్రిక.

వాసించే' "చిత్ర"ను 'అమూల్య ప్రతిబింబం'గా అనువదించి (1941) అందించినా డీతడు. కథకుడుగా ఈతడు అనంత కథానికావైవిధ్యంతో ఒప్పుతున్న 'వెలుగునీడలు' (1942) ప్రచురించి ఉత్తమ కథకుల్లో ఒకడని పేరు పొందినాడు. రూపక రచయితగా 'వత్సల' (1949) 'దీపకళిక', వంటి ప్రౌఢమైన ఏకాంకికల నిర్మించినాడు. ఇవి ప్రదర్శితములై ప్రేక్షకులనూ, ఆకాశ వాణిముఖాన వినబడుతూ శ్రోతలనూ ఆనందపరుస్తున్నవి.

ఈతనికి విశిష్ట స్థానాన్ని కల్పించి ఖ్యాతిగడించి పెట్టినది సాహిత్యవిమర్శ. ఆంధ్రసాహిత్యాని కున్న ఈ లోటును గమనించి ప్రాక్పశ్చిమ విమర్శనా మార్గాలను అవలోడనం చేసి సంపాదించుకున్న యోగ్యతతో 'కవి - కావ్య' విమర్శకూ' ప్రాచీన - అధునాతన కావ్యవిమర్శకూ పూనుకొని ◆ ఈతడు విశేష సామర్థ్యంతో అధికారిక విమర్శను నిర్వహించినాడు. నేడు ఆంధ్రసాహిత్య లోకంలో విమర్శకశేఖరుడై అర్హమైన తన ప్రథమ తాంబూలాన్ని అందుకుంటున్నాడు‡. "సాహిత్య సమాలోచనము✻" (1946) - "సాహిత్యసంపద"◆ (1949) - "సాహిత్య సమీక్ష" (1950) ఈ శ్రేణికి చెందిన ఇతని ముద్రిత గ్రంథపరంపర. "పంచవటిపర్యాలోకనము" (1944) లో ఒక ఖండకావ్యం ఎలా విమర్శితము కావలెనో ఈతడు సహృదయ దృష్టితో నిరూపించి చూపినాడు. 'నిశితబుద్ధి అయిన ఇతని విమర్శనలు విషయ వివరణలో విశదములై భావోత్తేజకములై ఉన్నవి' (శివశంకరశాస్త్రి) : రసికత, భావుకత,

◆ ఈయన కలానికి రెండువైపులా పాళీలున్నవి - ఆంధ్రశిల్పి.

‡ నవ్యాంధ్ర సాహిత్య చరిత్రకారుడుగాకూడ గణన కెక్కుతున్నాడు.

✻ 'వాస్తవమున కిది లక్ష్యలక్షణ సమన్వితమైన ఆంధ్రసాహిత్య చరిత్రమన్న అత్యుక్తి కాదు.' - మల్లంపల్లివారి ప్రవేశిక.

◆ "Sahitya Sampada is charactarised dy a wise selection of themes and an attractive presentation." - Dr. C.R. Reddy.

'పదునాఱవ శతాబ్దము మొదలు నేటి వఱకుగల మహాకవులలో పదునొకండుగురు కావ్యరచన యందలి మఱుగు మెఱుగులను ఇందు వివరించినారు. ప్రాత క్రొత్త త్రోవలు రెంటియెడను సమానమైన సహానుభూతిని అభిమానమును వెలవరించిన . . . ఇది యొక అఖండ గ్రంథమేయై తెలుగులకు కావ్యరసానుభవమునకు చక్కని మార్గదర్శకమై యున్నది.'
- రాళ్ళపల్లివారు.

విన్యాసపరిజ్ఞానము, సమన్వయశక్తి, సరసహృదయము - మొదలైన ఉత్తమ విమర్శక లక్షణాలన్నీ ఇతనిలో రూపొందినవనడం అతిశయోక్తి కానేరదు.

'పిల్లలమర్రి' ఒక సాహిత్యకేంద్రం. నేటి యువక సాహిత్య లోకంలో ఈతడొక ప్రత్యేకవ్యక్తి; సహృదయుడు - భావుకుడు, కవి ‡, కథకుడు, నాటికా కారుడు, విమర్శకుడు, సంపాదకుడు ✳, అధ్యాపకుడు, వక్త. వక్తగా ఈతడు ఉదాత్త వస్తువుతోనూ, అధికారిక ప్రవచనంతోనూ, శ్రావ్య కంఠంతోనూ, ఉన్నతమూర్తితోనూ, సభ్యులను ఆకర్షించి ఆనందింప జేస్తున్నాడు. భారతి, ప్రతిభ, ఆంధ్రశిల్పి, తెలుగుతల్లి, వాణి - మొదలైన పత్రికలన్నిటిలో తరుచుగా రచనలను ప్రకటిస్తూ యువకలోకానికి కళాశాల లోనూ, బాహ్యప్రపంచములోనూ వెనుక నొక వెలుగై చైతన్యాన్ని ఇచ్చి ప్రోత్సహించి, అనేక సమాజాలకు ◆ కారణభూతుడై ప్రవర్తిస్తూ, ఆకాశవాణిముఖంగా సాహిత్య సద్గోష్ఠులలో పాల్గొంటూ సాహిత్య సంచలనం కల్గిస్తున్న సాహిత్యాచార్యుడు. ఈతడిచ్చిన వెలుగును అందుకొని ఉత్తేజితులై సాహిత్య దీపాల వెలిగిస్తున్న యువక కవిలోకం క్రమశః వింతకాంతులతో విశాలాంధ్ర సాహిత్యవీథుల అలంకరిస్తున్నది. ఇతని 'శారదాపీఠం' ఒక శారదాపీఠం! ఇతడే ఒక శారదాపీఠం!!

## వావిలాల సోమయాజులు :

ఈ కాలానికి పూర్వంనుంచే **(1935)** భారతి, ప్రతిభ, ప్రజామిత్ర - ఇత్యాది పత్రికలముఖాన సర్వతోముఖంగా సాహిత్యకృషి చేస్తూఉన్న ఈ యువకవి ఉత్తమ ప్రతిభావంతుడు. గుంటూరు మండలంలోని విప్రులపల్లె అగ్రహారంలో **(18-1-1918)** జన్మించినాడు. మాతాపితృవంశాలు రెండూ యజన యాజనా శీలంతో బహుతరాలుగా ప్రవర్తిల్లిన ఉత్తమ వైదిక కుటుంబాలు. తత్ఫలితంగా

‡ ఆధునిక గేయరచయితలలో ఈతడు ఉత్తమశ్రేణికి చెందిన వాడనవలె. ఈ కవి కుమారుడు వ్రాసిన శారదాస్తుతి కాపుపాటలు-ఆంధ్రాభ్యుదయం మొదలైన గేయాలు ప్రసిద్ధాలు.

✳ ఆంధ్ర రిపబ్లిక్ అనే వారపత్రికను కొందరిసాయంతో గుంటూరునుండి నిర్వహించినాడు కొంతకాలం.

◆ సరస సారస్వతసమితి, ఆంధ్రసాహిత్యమండలి, కవితావనం, జ్యోత్స్నా సమితి మొదలైనవి.

ఈతనికి సనాతన సంప్రదాయజ్ఞత కొంత అలవడింది. ఈతడు యౌవనారంభం నుంచీ ఉత్తమ భావుకుడు, కళాశీలి, శైలూషుడు. ఈతని వ్యక్తిత్వాన్ని గమనించి దోహదక్రియలుచేసి ప్రథమదశలో కొంత ప్రభావాన్ని నెరపిన పెద్దలు శివశంకరశాస్త్రి, మారేమండ రామారావుగారలు. తెలుగుభాషను అభిమానశాఖగా స్వీకరించి 1937లో బి.ఏ., పరీక్షలో పట్టభద్రుడైనాడని అనడం ఇతని వ్యుత్పన్నతకు ఒక కొలబద్ద కానేరదు. ఇతని వివిధ సాహిత్యశాఖా వ్యవసాయాన్ని పరిశీలిస్తే వయసుకుమించి పరిశ్రమచేసిన ప్రౌఢ యువకుడని తట్టి తీరుతుంది. ప్రాచీన ధోరణినీ, నవఫణితినీ 'సమఫాయా'లో సమ్మేళనం చేసుకున్న పాండిత్య స్ఫోరకమైన రసజ్ఞత* ఇతని కావ్యరచనలో సర్వత్ర గోచరిస్తుంది. 'భారత జయఘంటా', 'ఆపకండీరథము', మొదలైన గేయాలూ, 'సౌగంధిక', 'సాక్షాత్కారము' లవంటి గద్య పద్య నాటికలూ రేడియో ముఖంగా ప్రాచుర్యాన్ని పొందుతూ ఈతనికి కీర్తినిగడించి పెడుతున్నవి. పల్నాటివీరగాథను "నాయకురాలు" అనే నామంతో రూపకంగా రచించి గుంటూరు నాట్యసమితి వారిచే, ఆంధ్రదేశంలోని వివిధప్రాంతాలలో ఆడిస్తూ, ఉత్తమ నాటక రచయితగా విఖ్యాతి గడించుకుంటున్నా డీతడు◆. ఇతడు అభిమాన సాహిత్యశాఖగా

---

* ఈశ్వరుని ఉద్దేశించి ధూర్జటి పలికినట్లుగా 'మహత్కాంక్ష' అనే ఖండకావ్యంలో ఈకవి కుమారుడు చెప్పిన ఈ వాక్యాలు హృదయంగమభావాలకూ, ఆర్ద్రతోద్వేగాలకూ నిదర్శనాలు; ఉదాహరణాలుగా రెండు -

తనువు న్నిత్యముగా నొనర్పు మిలపై దాసుండనై కొల్తుని
న్ననవచ్చిన్నతకాళహస్తి, నటుకాదా జన్మమే లేని నీ
గణమందొక్కనిగా గ్రహింపగదె - ఆ కైలాససంధ్యానట
ద్గణ మందొక్కడనై రచించెదను భర్గా నృత్యగీతమ్ములన్
నాకొక జన్మమిచ్చి భువి నవ్వనియింపగనిమ్ము స్వామి! నీ
వాకిట బిల్వ వృక్షమటు వత్సలతన్ - దినమున్ దినమ్ము ప
త్రాకృతితో త్వదీయ పదహల్లకవీధి నలంకరింతు ఛా
యాకమనీయ దేహమున హ్లాదము కూర్చెద నేత్రపంక్తికిన్.

◆ "ఇది చదువుకోటానికెంత ఆకర్షకంగా ఉందో, ప్రదర్శించడానికి కూడా అంత రక్తి కట్టుతుంది. మనకీ మధ్య వెలువడిన నాటకాలలో ఇది ఒక గొప్ప నాటకంగా మనం లెక్కించుకోవచ్చు. . . . . . . పాత్రపోషణలో కొన్ని ప్రత్యేకతలు చూపించారు . . . శ్రీ శివశంకరశాస్త్రిగారికి అంకితమిస్తూ వ్రాసిన పద్యాలు, ఇంకా కొన్ని పాటలూ చక్కని ఖండకావ్యాలుగా సారస్వతంలోకి చేరగలవు. ... "
- సూరంపూడి భాస్కరరావు : 'ఆంధ్రశిల్పి'

"వ్యాసాన్ని" స్వీకరించినట్లు కనిపిస్తున్నది‡. కథానిక, నవలాది ప్రక్రియలలోనూ ఇతడు తన ప్రత్యేకతను కాపాడుకుంటూ రచన సాగిస్తున్నాడు. రచనలలో 'ప్రాత - క్రొత్తల మేలు కలయిక' విషయవైవిధ్యము, బహు గ్రంధసారము హెచ్చుగా ఉంటూ, యువ రచయితలలో ఇతనిని విశిష్టునిగా గణించేటట్లు చేస్తున్నవి. స్ఫురద్రూపమూ, శ్రావ్యకంఠమూ, ఆకర్షణీయమైన ఉపన్యాసధోరణీ కలిగి ఈయన నేటి వక్తలలో గణన కెక్కుతూ ఉండటం గమనింపదగ్గ విషయం. సాహితీసమితి యువసభ్యులలో ఈతడు మంచి భవితవ్యం కలవాడు. గుంటూరు శారదానికేతనం ప్రాచ్యభాషా కళాశాలకు షుమారు ఎనిమిది సంవత్సరాలు ప్రధానాధ్యాపకుడుగా వ్యవహరించి యువతీ హృదయాలలో సాహిత్య స్పందాన్ని కల్గించి, ప్రస్తుతం ఆ పట్టణంలోనే హిందూకళాశాలలో పండితుడై అనేక యువసాహిత్యసాధకులకు ప్రోత్సాహమిస్తూ ఉన్న ఈవ్యక్తి ఒక చిన్న విజ్ఞానకేంద్రమే అనవలె!

## పైడిపాటి విద్వాన్ :

నవ్యసాహిత్య సాధన చేస్తున్న యువకులలో ఈయన గొప్ప ఉత్సాహ వంతుడు. కృష్ణాజిల్లా శాయపురానికి చెందినవాడై (జననం 22-2-1918) స్కూలు ఫైనలు, విద్వాన్ పరీక్షలను ఇచ్చినాడు. చిన్నతనంలోనే అవధానాలు చేసి కొంత ఉబలాటమూ ఉపజ్ఞా చూపెట్టినాడు; నవ్యకవిత్వం పైన ప్రీతికలిగి గేయసాహితిని తూణీరం (1941) - దేశం (1942) - దశావతారాలు (1947) - జ్యోతి స్తరంగిణి -

‡ 'పుష్పలోకం', 'భ్రమరాన్వేషణము, 'సాహిత్యంలో చంద్రుడు', 'మలయానిలుడు' మొదలైన వ్యాసాలు (భారతి) ఆంధ్రసాహిత్యంలో వ్యాససాహిత్యానికి నూతనాలంకారాలు. ఇతని 'స్తోత్రపాఠం' 'శత్రువులు - శత్రుత్వం' వంటి (ఆంధ్రవారపత్రిక) వ్యాసాలూ కులాసా ధోరణిలో నడిచినా వ్యక్తి వైశిష్ట్యాన్ని గుర్తింపజేస్తున్నవి చారిత్ర దృష్టితో వ్రాసిన 'ఆంధ్రులూ - సంగీతనాట్యాలు', వంటి వ్యాసాలు - తాత్త్వికదృష్టితో నడిచిన 'శబ్దము - శబ్దసంపద, 'గణపతి' 'నవ్వు' 'నిద్ర' వంటి వ్యాసాలు విచిత్రమార్గాలలో నడిచినవి. వివాహమూ, మతమూ, ఇతనిని ఆకర్షించటంవల్ల మతసాంఘిక వ్యాసాలు కొన్ని ఈ రచయిత ప్రచురించినాడు. సాహిత్య విమర్శకు 'దీక్షిత దుహిత విమర్శ" ఒక చక్కని ఉదాహరణ. ఇతడు దక్షిణదేశ సాహిత్యమును గురించి విశేష పరిశ్రమచేసి ప్రచురించిన వ్యాసాలు (భారతి) ప్రామాణికతను వెల్లడిస్తున్నవి. పరిశోధకుడుగా కూడ కొంత కృషి చేస్తున్న యువపండితుడు.

అన్న సంపుటాల ద్వారా పెంపొందించిన నవ్యుడు. వీటిలో కపుతున్న భావోద్వేగమూ, ఆంధ్రాభిమానమూ స్పష్టముగా కన్పిస్తవి. అష్టపదులధోరణి అలవరుచుకుని దశావతారాలను ✻ తెలుగులో పట్టించిన ఈయన ప్రతిభ అభినందింపదగినది. ఆధునిక గేయరచయితలలో ఈయనకొక స్థానమున్నది.

నృత్యయోగ్యాలైన గేయాల్ని వ్రాస్తూ ఈయన మంచి ప్రచారములోకి వస్తున్నాడు◆. నీలం (1942)-అనే కథలసంపుటీ, ఆంధ్ర శ్రీ ● (1944) - అనే ఖండకావ్యసంపుటీ, ఉషాసుందరి † (1946) అనే నాటకం, 'కవిరాజు' అనే (జన్మభూమి పత్రికలో వరుసగా ప్రచురితమైన) నవల, రామలింగేశ్వరశతకము, (1947) 'శతపత్ర' మనే ధ్వని ప్రధానమైన ఖండికా సముచ్చయమూ - ఈ కవి స్వతంత్రుడు. కీర్తికాముడు. అతి నవ్యధోరణిని తీవ్రంగా అపహసిస్తూ, అధిక్షేపిస్తూ గేయాలు వ్రాసినా డీయన. హృదయంలోని ఉద్వేగాన్నీ దూకుడునూ కలంలో కన్పింప జేయడంలో ఈయన శక్తిమంతుడు - నవ్యసాహిత్యరంగములో ఈ యువకవి ఈకాలానికి అలజడి కల్గించిన సాధకులలో ఒకడనిమాత్రం గుర్తింపవలె.

---

✻ ఉదాహరణకొక్కటి చూడండి :

జృంభిత మునిజన శాపరూపులె
కుంభినిపై కనకాక్ష కశిపులై
గందు మిగిలి, కనకాక్షుడు వరుణుని
చెండి, రసాతలమేగి, బంతిగా
నేలమోయు తొలికిటిని చివ్వకై
తూలి పిలువ ; నతి ఘుర్ఘురతన్ పెను
కోఱకత్తులను చీరి రాక్షసుని
ధారుణి ధర్మోద్ధరణ మొనర్చిన
వరాహావతారా!

◆ త్రిలింగదేశం మనదేమోయ్' అనే ఆంధ్ర జాతీయగీతమని ఒకటి వ్రాసి మంచి ప్రచారము గావించినాడు.

● "ఇందు దేశ కాలపాత్రోచితమైన భాష ప్రయోగింపఁబడినది. రామదాసు తానీషా సంభాషణాదికము వినినప్పుడు నాకు దిట్టకవి నారాయణకవి వ్రాసిన చరిత్ర జ్ఞప్తికివచ్చి మిక్కిలి యానందము కలిగినది. మరియు డొక్కావారి చరిత్రమును వినుచున్నప్పుడు నేను తన్మయుడనైతినను టతిశయోక్తి కాదు." - శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

† "మీ కవితాకలం చిందుల్లోని భావగర్భిత ప్రౌఢాంగనా వ్యంగ్యవిలాస విన్యాసాన్ని అరమోడ్పు కన్నులతో అర్థం చేసుకొంటూ ఆనందిస్తున్నాను." - స్థానం.

## సంపత్ :

నవ్య సాహిత్యరంగములోకి పైవారి తర్వాత వచ్చిన వాడై నప్పటికీ, చిత్రకవితా రచనలను చేయడాన్ని బట్టి శ్రీ . శ్రీ తో చేర్చ దగినవాడై నప్పటికీ ఈతడిక్కడే ప్రస్తావింపబడడంలో కారణమేమిటీ అంటే - ప్రాచీనుల పాండితిని, నవ్యుల భావుకతను, అభ్యుదయవాదుల ఆవేదనమును కల్గిన విశిష్టవ్యక్తి కావడమే. 'సంపత్' అచ్చమైన కవితా హృదయం, గుచ్చుకునే వాక్పటిమ కలవాడు. మైసూరు రాష్ట్రములోని వెంకటాపురంలో (20-10-1917) జన్మించినాడు. పుట్టినది పండితవంశం కావడంవల్ల సంస్కృతాంధ్రాలలో ప్రవేశము సహజముగా చిన్ననాటనే కల్గిన దీయనకు. సరిహద్దులలో నివాసం చేయడం కారణంగా తమిళ కన్నడాలు గ్రహించినాడు. అనంతపురం లోనే చిన్ననాటినుంచి బి. ఏ., దాకా విద్యాభ్యాసము చేసినాడు; అభిమానాన్ని పురస్కరించుకొని తెలుగు ఎం.ఏ., అయినాడు; ఉద్యోగార్థము బి.ఇడి కూడ చేరింది దానిప్రక్కన. ఈతని రచనలు భారతీత్యాది పత్రికలలో ప్రచురితమౌతూ మంచి ప్రతిభావంతుడని నిరూపిస్తున్నవి. విశ్వనాథ - దేవులపల్లి - శ్రీ శ్రీ ల వెనుక చకా చకా సాహిత్య వీథులలో నడుస్తూ, వారినిమీరి నడవవలెననే ప్రయత్నం కలవాడులా కన్పిస్తాడు. భాషలో విశ్వనాథ - భావములో దేవులపల్లి - రచనలో శ్రీ శ్రీ ఇతనిని - ఆకర్షించి నారనవలె. ఈ ముచ్చురు కలసిన మూర్తే 'సంపత్'. కవితాకన్యను గిరగిర వివిధ ఛందోమార్గాలలో త్రిప్పుతూ చూపరులను, పాఠకులను దిగ్భ్రాంతులను చెయ్యజాలిన ప్రజ్ఞకలవా డీతడు. 'విశ్వకవి వాల్మీకి' 'కైలాసగంగ' నడిచిన పద్ధతిని - వానిలోని కవి హృదయాన్ని - భాష లోని పాటవాన్ని తిలకిస్తే ఈతనికితడే సాటి అనిపిస్తాడు; గేయం - పద్యం - కథ - నవల - ఈ ప్రక్రియల నన్నిటినీ సాధించినాడు. కాకినాడ - రాజమండ్రి - అనంతపురము (ప్రస్తుతం) కళాశాలలలోని విద్యార్థుల కాంధ్రోపన్యాసకుడై, నిరంతరమూ గోష్ఠివలన సానలు తీరుతున్న ఈతని కవితాప్రతిభ దినదినానికీ నవనవోన్మేషం పొందుతున్నట్లు కన్పిస్తుంది. నవ్యసాహిత్య వీథులలోని మూడుమార్గాల లోను 'ధర్జాగా దర్పంతో నడవడానికి తగిన స్తోమతున్నట్లు ఈయన రచనలే చెప్పగలవు. సాహిత్యములోని

ప్రాచీన, నవ్య, అతి నవ్య ధోరణులను తనలో ఇముడ్చుకున్న 'సంపత్' ఎన్నదగిన నవ్యుడు.

పై నుల్లేఖించిన యువకులేకాక ఈకాలాని కెందరెందరో కృషి చేస్తూ నవ్యసాహిత్య వ్యాప్తికి కారణభూతులయిన వారున్నారని పూర్వమే గమనించినాము. అయితే వారందరిలోను పై నుల్లేఖించిన వారిలోగల సర్వతోముఖ ప్రజ్ఞ కన్పడదు, ప్రథమ ద్వితీయ శ్రేణులకు జెందిన నవ్యులలో ఏ నలుగురైదుగురో తప్ప చాలవరకందరూ సృజన శక్తి కలవారేగాని విమర్శకులు కారు. కాని యీపైన ఉల్లేఖించిన యువబృందములో ఇంచుమించు అందరూ అటు కావ్యస్రష్టలు, ఇటు విమర్శకోత్తములును; వివిధసాహిత్య ప్రక్రియాసాధనవల్ల, వక్తృత్వ ప్రజ్ఞ కలిగి ఉండడంవల్ల, తదితర యువ సాహిత్యకులకన్నా పైవారు నవ్యసాహితీ చరిత్రలో ప్రత్యేకస్థానమును గడించుకొంటున్నారు.

ఇక ఈకాలానికి వెనకముందుగా (1940-45) జరుగుతున్న నవ్యాంధ్ర సాహిత్య వ్యవసాయాన్ని కొంత అవలోకించుదాము :

## సాహిత్య వ్యవసాయ సమీక్ష * :

**1938** ప్రాంతానికే కొత్తనీరు బాగా వచ్చినది, శ్రీ శ్రీ-ఉమా మహేశ్ లు ఈనీటికింద కొత్తవ్యవసాయం ప్రారంభించారు. అతి వాస్తవికరచనలన్నారు. కవి పిచ్చివానితో సమానమన్నారు. కవిత్వం పిచ్చిమాటల్లాగా సమన్వయం ఉండనక్కర లేదన్నారు. ఇంకేమి? ఈ పద్ధతి తేలికచేసింది కవిత్వాన్ని. ఉపపత్తి లేని యువకులంతా వెట్టికూతలు వ్రాయడం ప్రారంభించినారు. అదేమిట్రా అంటే 'పొయట్రీ' అన్నారు. పండితులు లెక్కచేయలేదు. నవ్యకవులు మనల్ని తలదన్నారేమా అని విస్తుబోతున్నారు. నోటికొచ్చినట్లు వాగడం కవిత్వమై పోతున్నది!

కొత్తనీళ్లు ప్రాతనీళ్ళను పారదోలాలనే భావం రేకెత్తింది. కొందరిలో అందుకని దోషాల్ని ఎన్నబూనారు. ప్రబంధాలు వీరి దూషణకు గురిఅయినై. సంస్కృత

* 1945 లో "మీజాన్ పత్రిక"లో నేను వ్రాసిన వ్యాసమునే యిక్కడ ప్రచురించుచున్నాను.
- పి. వేం. హ.

పదబంధాలు శృంగార రసాధిక్యము వీరి ఏవగింపుకు కారణాలు. పైగా ప్రజాజీవితం పూర్వకవిత్వంలో ప్రతిఫలించటం లేదనే దోషాన్ని ఆరోపించినారు. ఈ యేవగింపంతా వచ్చి సంస్కృతం మీద విరుచుకొని పడింది. తాపీ ధర్మారావుగారు దీనికి నాయకుడు. పూర్వ సాహిత్యంమీద తిరుగుబాటు తెస్తున్నాడు. సుకుమారులైనట్టీ కష్టపడడానికి ఓపికా, శక్తీలేనట్టీ విద్యార్థులలోని అలసత్వాన్ని ఎక్కువ చేసిందీ వాదం! ఇంకేముంది: ఎటు చూచినా విమర్శలు, తేలికరచన లెక్కువైనవి.

ఈ విధంగా సాహిత్యదృష్టిలో మార్పు వచ్చినది. ఈ ఉద్యమాలద్వారా చేసినకృషి పరిణామంలో విషమంగా ఆకారం దాల్చింది. ఈ విపరీత ఫలసాయానికి పండితులు కలవరపాటు చెందుతూనే ఉన్నారు. వాళ్లలో జరుగుతున్న సంఘర్షణ ఫలితంగా కొంత కార్యం జరిగింది. భాషాసంప్రదాయాల్ని భద్రపరచవలసిన బాధ్యత వీరు గుర్తించారు. సభల్లో డీకొన్నంత మాత్రాన (సమాన ఉపపత్తి ఉన్నది గనకనా) ఏమీ ప్రయోజనం లేదనుకున్నారు. మర్యాదా మాటా తెలియనివారితో జగడ మెందుకనుకున్నారు కాబోలు గ్రంథ రచన సాగించారు. "సులభీకృత ఛందఃకళ" అని నెల్లూరునుంచి ఒకరు, 'నవరసగంగాధర'మని జమ్మలమడకవారు, 'తత్సమ చంద్రిక,' "నరసభూపాలీయ వ్యాఖ్య" లంటూ సన్నిధానంవారు, 'శరదాగమం' అంటూ అప్పల జోగన్న శాస్త్రిగారు, 'ధ్వన్యాలోకానువాదం' భాగవతుల కుటుంబశాస్త్రి, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, వేదాల తిరువేంగళాచార్యులు గారలు - 'ప్రతాపరుద్ర యశోభూషణం,'' 'అలంకార వసంతం' అని చలమచర్ల రంగాచార్యులుగారు కృషి చేసి గ్రంథాల్ని తెలుగులోకి అనువదించినారు. ఇదొకవిధంగా సాహిత్య సంప్రదాయానికి పాటుపడ్డారు. లాక్షణిక భాషా ప్రచారానికి పండితులింకా పాటుపడుతూనే ఉన్నారు. వ్యావహారిక భాషవల్ల మాండలికాలవరోధం కల్గించుచున్నందు వలన దానిపై కొంత వైముఖ్యం ఏర్పడుతున్నది.

ఇలా ఉంటూ మనం ఎంతసేపూ తెలుగులో తర్జన భర్జనలు చేసుకుంటున్నాం; దీనితో కాలయాపనమౌతున్నది; ఆంధ్రేతరులకు మనల్ని గురించి చెప్పవలసిన బాధ్యత ఉన్నదని గుర్తించారు కొందరు. నిర్మాణ కార్యక్రమం కావాలి కాని ఊరికే గాలి పోగు చేయడంలో ప్రయోజనం లేదనుకున్నారు. మతసామరస్యం లేకనే మన

భారతదేశమిలా ఉన్నదనీ, పరస్పరావగాహనకు అవకాశాలు ఏర్పరుస్తేగాని ప్రయోజనం లేదనీ గుర్తించినారు. ఈ అభిప్రాయాలు, 'హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు'గా రూపుతాల్చినవి. విమర్శనకు పరిశోధనకు మంచితావిచ్చిందిది నిజాముచరిత్ర వచ్చింది. ఆంధ్రవాఙ్మయ చరిత్ర ఆంగ్లంలో కురుగంటివారు ప్రచురించినారు. పి.ఇ.యన్. వారుకూడా ఈకాలానికే డా.పి.టి. రాజుగారిచేత తెలుగువాఙ్మయంమీద ఆంగ్లంలో చిన్న గ్రంథం వ్రాయించి ప్రచురించినారు. ఆధునికాంధ్ర వాఙ్మయాన్నంతా పోగుచేసి దానికి నిర్దిష్టాకారాన్నిచ్చి చరిత్రగా గ్రథించడం ఒక్కరివలన అయ్యే పని కాదు కురుగంటివారు నిర్మొహమాటంగా విమర్శలు రాకపోవడంవలన సాహిత్యలోకం తప్పుదోవల్లోకి పోతుందని "నవ్యాంధ్ర సాహిత్యవీధుల్లో" ఋజువు పరిచినారు. జంకులేని విమర్శ తెలుగులోకంలో ఇంకా నిర్మింపబడాల్సే ఉన్నది. 'నేటికవిత్వ'మని సుందరాచారిగారి చిన్న ప్రచురణ వచ్చింది. మత సామరస్యం కూరుస్తూ చాలకృషి చేసి 'ఖుర్ అన్ షరీఫ్'కు వ్యాఖ్యవ్రాసి నారు ఖాసింఖాన్‌గారు; వేమన తత్వాన్ని ఉర్దూలో ప్రొఫెసరు టోపాచే వ్రాయించారు. తలలన్నీ ఒక చోటకూడని ఈదుస్థితిలో భారతదేశాని కిలాంటి గ్రంధాలు ఐక్యత కూర్చవచ్చు. మత వైషమ్యాల్ని తొలగించు కోవాల్సిన కాలం కదా యిది! కథానికలు తెలుగులో కుప్పతిప్పలుగా వస్తున్నాయి. ఇందుకు లక్షణాదికం మధించిన గ్రంధం కావాల్సిన కొరత కొంతవరకు తీర్చారు, ఖాన్‌గారు తామొక గ్రంధం ప్రకటించి; ఆంధ్రలోకాన్నంతా ఆకట్టుకొని, విజ్ఞాన సర్వస్వం (Encyclopedia) తెలుగులో వ్రాయించ ప్రయత్నించినారీ పరిషత్తువారు. మాగంటి బాపినీడు గారు అక్షరజ్ఞానమున్న ఆంధ్రుడికి ఉపయోగపడేందుకు "ఆంధ్ర సర్వస్వమ"ని వివిధాంశాల మీద ప్రముఖులచేత వ్యాసాలను వ్రాయించి సంపాదించినాడు. ఈ కృషి యెన్నదగినదే.

గాలి కబుర్లతో ఏమీ ప్రయోజనం లేదనీ, ఆ గాలే విజ్ఞానం అయితే సార్థకం అవుతుందనే ఉద్దేశంతో ప్రతాపరెడ్డి, బిదురు శేషయ్య, రంగాచార్యులు, భాస్కరభొట్ల, బి.వి. రమణ రావు, ఇల్లిందల సీతారామరావు మొదలైన సాహితీప్రియులు "విజ్ఞానవర్ధినీ పరిషత్తు"ను స్థాపించి సేవ జేస్తున్నారు. 'నవ్యాంధ్ర సాహిత్యవీధులు' కారణంగా సాహితీ సమితి తిరిగి సంచలించడం ప్రారంభించింది. "నిజాం

రాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు" తత్కారణానే ప్రారంభమైనట్లు పత్రికలు గోలకొండ చెప్పుతున్నాయి. ఏతత్ సంస్థ మూలంగా కొంత వాఙ్మయ వ్యవసాయం జరుగుతూ వచ్చింది. ఆంధ్రాణంలో ఆంధ్రభాషాభిముఖ్యము అలవరచాల్సిన అవసరం చాలా ఉన్నది. దానికోసం జిల్లా ప్రతినిధుల ద్వారా యీ పరిషత్తు మంచి ప్రచారం చేస్తూ ఉన్నది. ఖండవల్లి బాలేందు శేఖరం, బిదురు శేషయ్య, కాళోజీ నారాయణరావు ప్రభృతులు మంచికృషి జేస్తున్నారు. వరంగల్లు, ఖమ్మంలలో చక్కని సాహిత్యాభిరుచి అలవడుతున్న సూచన లగుపిస్తున్నాయి. సాహిత్య సమావేశాలు జోరుగా సాగుతున్నాయి-గ్రంధాలయాలద్వారా సర్కారు, నిజాం ప్రాంతాల్లోని ఆంధ్రులు చేతులు కలిపారు. పాతూరి నాగభూషణం చాలా పాటు పడుతున్నా డీవిషయంలో. ఖమ్మంలో "హస్కర్స్ క్లబ్" అని కొందరు చేరి గ్రంథ ప్రచురణం చేస్తున్నారు". పులిజాల హనుమంత రావు కవితా వేశం కలవాడై సాధన చేస్తున్నాడు. అంబడిపూడి వెంకటరత్నం వ్రాసిన దక్షిణ ప్రచురించారు. అయోధ్య రామయ్య అనే యువకవి 'ఘంటారావం' ఇత్యాదులద్వారా బయటికి వస్తున్నాడు - "భాషార్ణవ"మని వ్రాసి నెల్లుట్లవారు వైదీకి - నియోగి వైషమ్యాలను రేకెత్తించడానికి వెనక్కు నడుస్తున్నాడు, ఈ ఇరవయో శతాబ్దములో! "తరణి" అనే మాసపత్రిక పెట్టి 'సిద్ధాంతి' గారు కొంత సాహిత్య వ్యవసాయానికి క్షేత్రం కల్పిస్తున్నారు. వైషమ్యాల మూలకంగా దివ్యవాణి గోలకొండ, మీజాన్ లలో కొంత వాఙ్మయం పెరిగింది - దీనివలన కొందరు రచయితలు బయటికి వచ్చారు. ఆంధ్రసారస్వతమహాసభ, అని పెట్టి దాని తరపున సమావేశాలు జరిపి సాహితీలోకానికి అ.వె. దత్తాత్రేయ శర్మగారు మంచి సేవజేసినారు. తత్ఫలితంగా "ఆంధ్ర శ్రీ" అనే సంచిక వచ్చింది.

ఈకాలానికే యువకవులనేక సంస్థలద్వారా సాహిత్యవ్యవసాయం సాగిస్తున్నారు. నరసరావుపేటలో "నవ్యకళాపరిషత్తు" స్థాపించి దేశిరాజు కృష్ణశర్మ, అని శెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసు, మాచిరాజు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, పోల్చూరి ఆంజనేయప్రసాద్ మొదలైన వాళ్ళు నారుమళ్ళు కట్టుకున్నారు. బెజవాడలో "వ్యాస సారస్వత సమితి" అని కొంత కృషి సాగిస్తున్నారు. కొందరు ఏలూరులో "సాహిత్య మండలి" అనిపెట్టి సామవేదం జానకిరామశర్మ, సింగరాచార్య, పైడిపాటి

విద్వాన్, సోమంచి లింగయ్య, కొనకళ్ళ వెంకటరత్నం మొదలైనవాళ్ళు కృషి చేస్తున్నారు, 'ప్రవరుడు - మాయావిలసనమ'ని సామవేదంవారి పుస్తకం - 'శ్రావణి' అని వాళ్ళ సంచికా తత్ఫలితాలు. కందుకూరి రామభద్రరావు బీదలతో కలిసిమెలసి ఆయ ననుభవిస్తూన్న 'వేదన'ను ప్రచురించాడు. దేశి "కవితామండలి" పెట్టి ఘంటశాల నుంచి శివరామకృష్ణ, గొఱ్ఱెపాటివారు కృషి చేస్తున్నారు - ప్రచురణాలు శరపరంపరవలె వస్తున్నవి. చిన్నపిల్లలకు గొఱ్ఱెపాటివారి పాటలు, రచనలు చాలా ఉపకరిస్తున్నాయి - కర్లపాలెం కృష్ణారావు, వారణాసి వెంకటేశ్వర్లు అనే కర్షకులు గ్రంధమాలలద్వారా చక్కగా సాగుబడి చేస్తున్నారు. యువకార్యాలయం మద్రాసుచేరి చక్రపాణి, చలం, కొడవటిగంటి, సముద్రాల, గోఖలే (మూగజీవాలు,) మొదలైనవాళ్లు చేస్తున్న కృషిని ప్రచురిస్తున్నది - అనంతపురంలో నవ్యకవిత్వానికి ప్రాపకం యిచ్చే సమితులు కృషి చేస్తూనే ఉన్నాయి - వరంగల్లులో రామానుజరావు మొదలైన వాళ్ళు "కాకతీయ కళాసమితి" అని నడుపుతున్నారు. తిరుపతిలో 'సారస్వత సమితి' స్థాపింపబడింది. ఆచార్యులు మొదలైనవాళ్ళు కృషి ప్రారంభించారు - ఆంధ్రవాఙ్మయ సేవాసమితి తరఫున బెల్లంకొండ చంద్రమౌళీశ్వరశాస్త్రి, నల్లాన్ చక్రవర్తులవారు కృషిచేస్తూనే ఉన్నారు - "విధురవీణ" తత్ఫలితంగా వచ్చింది ఆచార్యులవారిది. ఊటుకూరి సత్యనారాయణరావు అనార్కలీ' మొదలైన నాటకాల్ని వ్రాస్తూఉన్నాడు. అదివరకు నుంచీ చేస్తున్న సాధనను పురస్కరించుకొని 'సాధనసమితి' ద్వారా గాదిరాజు, బూర్గుల, సూర్యచంద్రులు, భండారు, వెల్దండలు చేసిన ప్రత్యేక కృషి వెలువడింది. "సాహితీ విపణి" పెట్టి అమ్మబోతున్నారు - గుంటూరులో నవ్యసాహిత్యాన్ని ఆమోదిస్తూ 'సరససారస్వత సమితి' అనీ, 'ఆంధ్ర సాహిత్యమండలి' అనీ, 'కవితావనం' అనీ విద్యార్థి కవులను చేరదీసి పిల్లలమర్రివారు కృషి చేయిస్తున్నారు. మద్రాసునుంచి 'సంస్కృత గ్రంథమండలి' వారనేక గ్రంథాలు ప్రచురిస్తున్నారు. స్వామి శివానంద రచనలను అనువదిస్తూ దిగవల్లి శేషగిరి రావనే కృషీవలుడు కొంతసాగు నిర్వహిస్తున్నాడు. ఇలాగ బహుముఖంగా యువకవులు వ్యవసాయం సాగిస్తూ వస్తున్నారు.

అంతకు పూర్వంనుంచీ కృషిచేస్తున్న వాళ్ళు కొత్తపంటల్ని పండించారు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఆంధ్రవారప్రతికలలో వ్యాసపరంపరను ప్రవహింప

చేస్తున్నారు. విశ్వనాదవారు "జేబుదొంగలు, అంతరాత్మ, ధర్మచక్రం" అనే నవలల్ని ప్రచురించినా. తమ రామాయణ రచనాన్ని సాగిస్తూన్నారు. జలసూత్రం 'దేవయ్యస్వీయచరిత్ర' వ్రాశాడు ఆంధ్రవార పత్రికలో. "వడ్లగింజల"నే నవలను పూర్తి చేసుకున్నాడు శ్రీపాద, దువ్వూరి 'పలితకేశం' ప్రచురించి యీమధ్య వదిలి పెట్టిన అరకను పట్టుకున్నట్లు ఋజవు చేస్తున్నాడు. మాధవపెద్దికవి 'ఉమరుఖయాం'మీద మోజుకొద్దీ పద్యాలు వ్రాసి ప్రచురించాడు. ఈయనచాటువులుకూడా పుస్తకరూపం దాల్చినై. జాషువా 'ముంతాజ్ మహలు'ను దిద్దుకున్నాడు. ఇంతలోకే బర్మానుంచి "కాందిశీకులు" వస్తు ఉంటే వాళ్ళ కష్టనిష్టురాలు గమనించి ఒక కావ్యం వ్రాశాడు. తుమ్మల 'పరిగెపంట' పండించాడు; ఏటుకూరి తెరవెనక నుంచి పూర్తిగా బయటికివచ్చి 'త్రివేణి' 'నాయకురాలు' అని రెండు పుస్తకాల్ని ప్రకటించాడు. కాటూరువారు "పౌలస్త్య హృదయాన్ని" పరిశీలించారు; "నల్లకలువ"ను శాశ్వతంగా నాటారాంధ్ర క్షేత్రంలో. మునిమాణిక్యం కాంతాన్ని కోల్పోయి "తిరుమాళిగ"లో తిరిగి రచించు కొన్నాడు. "రాధబాబు, రుక్కుతల్లి, కాంతం, మేరీకహానీ" మొదలైన వాటిల్లో వెనుకటి అనుభవాల్ని తవ్వి పోసుకుంటున్నాడు. సన్నిధానంవారు 'ఖడ్గతిక్కన', 'వాసవదత్త' మొదలైనవాళ్ళను చిత్రించారు. ఉన్నవవారు 'తిక్కన', నవలను సాగిస్తూ ఉన్నారు - 'నాళంవారు' తెలుగు సామెతల్ని ప్రబంధస్థ పయోగాలతో సంపాదించారు- చిలుకూరివారు కూడా సామెతల్ని ఓలక్ష పోగుచేశారట. గంటి సోమయాజులుగారు భాషా చరిత్ర నిర్మిస్తున్నారు. 'భమిడిపాటి వారు, మొక్క పాటివారు' యధారీతిగా పత్రికల్లో వ్రాస్తూనే ఉన్నారు. ముద్దుకృష్ణ 'ఎక్కడికి' అని కధల్నీ "టీకప్పులలో తుఫాను" అని నాటికనూ ప్రచురించారు. ఇలాగు కొత్తపంటల్ని పండిస్తూ పాత ధాన్యాన్ని తిరుగదంపిస్తూ నవ్యులు కృషి చేస్తున్నారు.

నవ్యసాహిత్యవర్షం పడి చక్కని ఫలాల్ని పండించింది. పువ్వాడ "గోవత్సము"నీ, జంధ్యాల "ఉదయశ్రీ" అనీ, పన్యాల "అశ్రుగీతి" 'ప్రేమలత'లనీ, మంత్రిరావు సత్యనారాయణ "సమాధి" అనీ; గుంటూరు సత్యనారాయణ 'రజనీప్రియ' అనీ, వట్టికొండ "మధూదయ అరుణోదయా" లనీ, పెనుమర్తి "ప్రేమరాగము"నీ, యడ్లపల్లి "తెలుగువీణ" మొదలైనవీ, ప్రచురించారు. ఏకాంకికల్ని అనేకులు సాధన చేస్తున్నారు. "సంయుక్త" అని రామనాథం పద్యనాటికను ప్రచురించాడు.

పశ్చిమాన్నుంచి కురిసిన అతివాస్తవిక కవితావర్షానికి మోజుపడి ఆవర్షపు నీటితో కొన్ని పంటలు పండించారు - ఉమామహేశ్ పఠాభి, నారాయణ బాబు, ఏల్చూరి, దేశిరాజులు; బూర్గుల, సూర్యం, పన్యాల, 'పూషా' లున్నూ. పిఠాపురం యువరాజుకూడా యీ మార్గానువర్తే. "నామరహితం" "తీరనికోర్కెలు" "సువిశాల మిదం విశ్వం" అనే గ్రంథాలు ఆయనవి.

గుడిపాటి వెంకటచలాన్ని అనుసరించే వాళ్ళు వచ్చారు కొవ్వలి, జంపన, ధనికొండ, చందూరి, గోవిందు, సౌరిస్, మల్లాది - పాపయ్యలింగం - మొదలైనవాళ్ళ రచనల్లో చలంవిత్తనాలే పూర్తిగా కన్పిస్తున్నాయి. సంఘాన్ని బురదగుంటగా చిత్రించటమే చాలమంది ఆదర్శంలా కన్పిస్తుంది-వీళ్ళ రచనలు చదివిన యువతీ యువకుల శీలాల్ని ప్రశ్నార్థకాలు చేస్తాయి - అనుకొంటున్నారు కొందరు.

విశ్వనాధవారికి యువకుల్లో ఈకాలానికి అనుయాయులు చాలమంది బయలు దేరుతున్నారు. జమదగ్ని, రామలింగేశ్వరరావు, కుందుర్తి ఆంజనేయులు, సింగరాజు వెంకటసుబ్బారావు, ధూళిపాళ శ్రీరామమూర్తి మొదలైన వాళ్ళు ఆయన మాదిరే పదబంధాలు చేస్తూ, ఉపన్యాస మాయనవలె చేస్తూ, అనుయాయులని పించుకుంటున్నారు.

నండూరి సుబ్బారావుగారి ఎంకిపాటల ప్రభావము యువకులలో కన్పిస్తున్నది. 'భాగీ' లంబాడీలమీద, 'పిల్లల మఱ్ఱి' కాపు జీవితం మీద, 'ప్రయాగ' గొల్లలమీద వ్రాసిన పాటలన్నీ తత్ప్ర భావభూతాలే అని చెప్పవలె. గోఖలే యేనాదిభాషలో కథలు వ్రాయడంలో కూడా ఎంకిపాటల ప్రభావం అతని మీద ఉన్నదనే చెప్పవచ్చు-

హిందీసాహిత్యం తెలుగులోకి క్రమక్రమముగా హెచ్చుగా వస్తూ ఉన్నది. ఆంధ్రులలో హిందీ నేర్చుకున్నవాళ్ళు చాలామంది ఉన్నారు. అంచేత విరళంగా రచన సాగుతూఉన్నది. చక్రపాణి శివరామకృష్ణ, కృత్తివాస తీర్థులు, కేశవస్వామి, ఇలింద్ర రంగనాయకులు, పి. శ్రీనివాసరావు మొదలైన వాళ్లెందరో శరత్ బాబువి, ప్రేమచంద్రునివి, వనపూల్‌వి అనువదిస్తున్నారు. రవీంద్ర సాహిత్యం అనువాదాల్లోకి

అధికముగా వస్తున్నది; మల్లవరపు, పిల్లలమఱ్ఱి, గోపాలరెడ్డి, మొదలైనవారు కృషిచేస్తున్నారు. ఇటీవల తెలుగులో నుంచి హిందీలోకి కొన్ని అనువదిస్తూ ఉన్నారు. దక్షిణభారత హిందీసభవారు. వేమూరి అంజనేయశర్మ, వారణాసి రామమూర్తి ప్రభృతులు పేర్కొన దగినవారు. ఈ మార్గాన కొంత సాహిత్యవ్యవసాయం జరుగుతూన్నది.

సంస్కృత కావ్యాను వాదంకూడా జరుగుతూనే ఉందొక ప్రక్క. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, విశ్వనాధరావులు "విక్రమాంకదేవ చరిత్ర"ను అనువదించారు, వనపర్తి నుంచి. "హంససందేశాన్ని" "అమరుకాన్ని" అనువదించాడు, పెనుమర్తి వెంకటేశ్వర శాస్త్రి. వింజమూరి శివరాంకూడా అమరుకాన్ని చక్కగా భాషాంతరీకరించాడు. కాళిదాస, భవభూతుల కావ్యాలు అక్కడక్కడా అనూదితాలవుతూనే ఉన్నాయి. ఈ కాలానికికూడా, ఆంగ్లానువాదం యధారీతిగా జరుగుతూ వస్తున్నది.

1941 నాటికి నవ్యసాహిత్య ఫలసాయాన్ని తిరస్కరించారు కొందరు. తిరుగుబాటు అంకురించింది. కొత్తప్రాజెక్టు నిర్మించారు. ప్రణయ కవిత్వానికి స్వస్తి అన్నారు. భావనా ప్రపంచాన్ని దూరంగా ఉంచాలన్నారు. అందులో విహరించడం మాని భారతభూమిమీద నిలిచి మాట్లాడమన్నారు. 'కళకళ కోసం' అనే వాదాన్ని తుంగలో తొక్కమన్నారు. రష్యాచూడం డెల్లాఉన్నదో అని దృష్టినటు నిగిడ్చారు. సుత్తి కొడవలుల ప్రాముఖ్యము చాటాలన్నారు. యమ్. యన్. రాయ్ పార్టీకి సానుభూతిచూపారు. లెనిన్ సూత్రాల్ని అకళించుకోవాలన్నారు కొందరు. గోపీచంద్, పి.వి. సుబ్బారావు, జి.వి. కృష్ణరావులు కృషిచేశారు. రచనల్ని ప్రచురించారు. 'విహారి' పత్రికను 'రాడికల్' పత్రికను సాగించారు. 'కావ్యజగత్తు'లో కృష్ణరావు సూత్రాల్ని గ్రంధించాడు. తర్వాత 'యుగసంధ్యను' ప్రచురించాడు. వీరరస ప్రధానమైన రచనలే రావాలని చాటుతున్నాడు. 'నవ్య కవులకు, వీళ్ళకు భేదం వచ్చినది. కలతలు పొడమినై, ఇలాగెంతో కాలం గడవలేదు.

ఇంతలోకే "ప్రజాసాహిత్యం" అని పెద్దకేక అఖిల భారతదేశం వినిపించేటట్లు వచ్చింది అందరూ విన్నారు. దేశస్థితిని చూచి కార్య శూరులు ముందడుగు వేశారు.

తాపీ ధర్మారావు నాయకుడు కావడానికి అర్రులచాస్తున్నా డంతకుపూర్వమునుంచే. ఇదో విధంగా సమయం వచ్చింది. ఆంధ్రదేశంలో జెండా ఎత్తాడు. ఆజెండా కిందికి యువకులువచ్చి చేరారు. దీనికి రూపాన్నిచ్చే టప్పటికి "అభ్యుదయ రచయితల సంఘ" మైంది. 1943 లోనే వట్టికొండ రంగయ్య విశాలాక్షులు 'అభ్యుదయగీతాలు' "విప్లవజ్వాల" ప్రచురించారు. "ప్రజాశక్తి అనే పత్రిక ప్రారంభించారు. మహీధర సోదరులు "రష్యాపై" ఉన్న వాఙ్మయాన్ని కొంత అనువదిస్తూ వచ్చారు. నార్ల, కంభపాటి సత్యనారాయణ, తుమ్మల వెంకట్రామయ్య, చదలవాడ పిచ్చయ్య, ఆళ్వారు స్వామి, మహంకాళి, కొమర్రాజు వినాయకరావు మొదలైనవాళ్లు కృషి చేస్తున్నారు. ఖండవల్లినారు "ఆకలి" మీద కావ్యం వ్రాశారు. ప్రయాగ కోదండ రామశాస్త్రి మున్నగు వారు బెంగాలు విశాఖ ప్రాంతాల్లోనికి కరువుమీద పదాల్ని వ్రాశారు. బుర్ర కధలవిధానం ప్రచారం చేస్తున్నారు. కృషి ఘనత్వం గుర్తించారు వ్యక్తుల్ని గౌరవించడం కర్తవ్యమన్నారు. సంఘసేవ, భాషాసేవ చేసినవాళ్ళ వర్ధంతులు జరపడం ప్రారంభించారు "తెలుగు తల్లి" సంచికల్ని ప్రచురించారు. చిలకమర్తివారి స్వీయ చరిత్రను ప్రచురించి పుణ్యం కట్టుకున్నారు. అభ్యుదయ సంఘాలు చాలా వెలసినాయి, తత్పరిణామంగా సాహిత్య వ్యవసాయం మరోవిధంగా జరుగుతూన్నది. లిఖిత పత్రికలు మిక్కుటమైనాయి. విద్యార్థులలో బాగా ప్రాపకం పొందినై. చిత్ర లేఖనంలోకూడా కృషి .జరుగుతూ ఉన్నది. పత్రికలు కారణముగా మొత్తానికి నూతన చైతన్యం కలిగింది. "అభ్యుదయ సాహిత్యమంటే" ఏది అనే ప్రశ్నలో కృషీవలులు చిక్కుకున్నారు. దీనికి సమాధానంగా నాగభైరవ శివరామకృష్ణ, గోపీచంద్ మొదలైనవాళ్లు విమర్శన చేస్తూ వచ్చారు. ఈ ఉద్యమానికి మూలసూత్రాలు పాశ్చాత్యంలో తయారైనాయి. అందులో పాతకొత్తలకు వైషమ్యం కూర్చటంకాదు సూత్రం. సంప్రదాయానికీ, పూర్వసాహితి కృషీవలులకూ భిన్నంగా కాక వాళ్ళను ఆకట్టుకొని ఏకముఖంగా చుట్టూఉన్న ప్రజను ఉద్బోధిస్తూ ఉండడమే ప్రధానోద్దేశంగా కలిగిందీ ఉద్యమం. సామరస్యం కూర్చడమే ముందుకర్తవ్యము. ఈ ఉద్దేశ్యాన్ని వ్యక్తిగత దౌర్బల్యంతో కలుషితం చేస్తూన్నా రాంధ్రలోకంలో, ఈ మార్గాను యాయులు. ఇంకా బాగా స్థిరపడలేదిది.

ఎన్ని మార్పులు వచ్చినా, ఎవరిదోవ వాళ్ళదే. బలవంతంగా ఒకరిని మరొక ఉద్యమాను యాయులుగా చేయటం దుర్లభం. వాతావరణానుగుణంగా తనకున్న విచక్షణాశక్తినిబట్టి ఒక రచయిత ఒక మార్గానువర్తి అవుతాడు. ఇప్పటికి పురాణాల్ని అనువదించే వాళ్లున్నారు. పిలకా గణపతిశాస్త్రి ఆపని చేస్తున్నాడు ప్రబంధరచనసలిపే వాళ్ళు లేకపోలేదు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, గడియారం వెంకటశాస్త్రిగారు, దుర్భాకవారు మొదలైనవారి పథానికి చెందినవారు శాస్త్రచర్చ జేస్తునేఉన్నారు కొందరు. చివుకుల అప్పయ్యశాస్త్రిగారు "పురాణాలు" 'దర్శనాలు' గూర్చిన గ్రంథాలు వ్రాశారు. గీతాభాష్యాలు వ్రాస్తున్నారు. ఇందుకు బ్రహ్మానంద స్వామి, బులుసు అప్పన్న శాస్త్రి, మొదలైనవాళ్ళు కన్పిస్తారు. రామాయణాన్ని అనువదిస్తు ఉన్నారు. విశ్వనాథవారు, సోమరాజు వారు, ఆత్మకూరువారు మొదలైన కవులు, చారిత్రకపరిశోధనం చేస్తూ వ్యాసాలు (పత్రికల్లో, గ్రంథాలుగా) ప్రచురిస్తున్నారు. పోతుకుచ్చి, దిగవల్లి, మల్లంపల్లి, కురుగంటి, నేలటూర్లు. పూర్వసాహిత్యాల్లో మెరుగుల్ని దిద్దుతూఉన్నారు పిల్లలమర్రి, పుట్టపర్తులు. నవ్యసాహిత్యంలోని చణుకులు చూపిస్తున్నారు. రాయప్రోలు సుబ్రహ్మణ్యం, పిల్లలమర్రి, పింగళి, రామనాథం, జమ్మలమడక మొదలైనవారు. ఈవిధంగా పలువురు పలురకాలైన వ్యవసాయం చేస్తున్నారు. ముద్రణాసౌకర్యం నిమిత్తమై ముదిగొండ శర్మగారు లిపిసంస్కరణాన్ని సూచిస్తున్నారు. తెలుగులో - ఇది ఒక కొత్త ఉద్యమం. జి.వి.కృష్ణరావు, వేటూరి వారున్నూ - లిపి సంస్కారమును సూచిస్తున్నారు.

అన్నిటికీ తావిస్తున్నది రేడియో అని ఒప్పుకోవాలి. కాశీపతి రామనాథం, రజని, వన్నాల, దేవులపల్లి, అడవి, భాసింభానులు కృషి చేస్తున్నారు. పత్రికలు కూడా ఆ రేడియోసాహిత్యాన్ని ప్రచురించడం ముదావహం. సాహిత్య సమ్మేళనాలు పెట్టి ఒక విధంగా కృషి చేస్తున్నది రేడియో, ఏకాంకికా పరిచయాన్ని గోపాలకృష్ణమూర్తి వ్యాసాలద్వారా చేసినాడు. కొన్ని ఏకాంకికా, కదాసంపుటాలు వస్తూ ఉన్నాయి. కదకులసంఖ్య చాలా హెచ్చింది. మారేమండ, మల్లంపల్లులు, చారిత్రక సన్నివేశాలతో నాటికలుగా వ్రాసి ప్రయోగిస్తు ఉన్నారు. గోపాలస్వామిగారి ప్రోత్సాహమున వావిలాల సోమయాజులు "నాయకురాలు"నే నాటకం నిర్మించినాడు దామరాజు

"పోతన" "రణభేరి" నాటకాల్ని రచించి ప్రయోగింపజేసినాడు. సినిమా వచ్చి కవుల రచనలకూ, తావిస్తూనేఉన్నది.

సారస్వతసభ లనేకముగా జరుగుతున్న రోజులివి. వేంకటపార్వతీశ్వరకవుల షష్టిపూర్త్యుత్సవాలు జరపడం ఫలితముగా కొంత సాహిత్యం వెలువడింది. వారి కావ్యకుసుమావళి (రెండుభాగాలు) ప్రచురితమైనవి. శివశంకరశాస్త్రి గారి సందర్భాన సంపాదించిన వివిధ నవ్యకవుల గీతికా ఖండికా సముచ్చయము "మహోదయ" మనే పేరుతో వెలువడడం ఒక భాగ్యం. 'వైతాళికు'ల తర్వాత 'మహోదయం' ఎన్నదగిన 'ఏంధాలజీ' అనవలె, అలాగే తల్లావఝులవారి సంపాదకత్వాన 'కథాలహరి', 'ఏకాంకికలు' అనే సంపుటాలు ఆంధ్రప్రచారిణీ వారి ప్రచురణలుగా ఈ కాలానికి వెనుక ముందుగా వచ్చినవి. వేదాంతకవి "కవితాసంస్థానం, కెరటాలు" మొదలైనవి, అబ్బూరి వరదరాజేశ్వరరావు రచించిన "ప్రతిమాసుందరి" అనే రూపకం, బెళ్ళూరి శ్రీనివాసమూర్తి 'జాముకోడి', కె.యస్. రామా 'కన్నతల్లి', అల్లూరి జానకిరామరాజు 'మాతృస్మృతి', ఏలూరు జాతీయరచనా మండలివారి 'కుసుమాంజలి', గొరాబత్తుని వెంకటేశ్వరరావు 'నేల్పుటావు బాగ్యలక్ష్మమ్మలు', వారణాసి వెంకటేశ్వర్లు 'సుధాంజలి' రత్న సానువులు, పొట్లపల్లి 'జైలు', మూర్తిబాబు నాటికలు, రాచకొండ నరసింహామూర్తి 'జాగృతి', శ్రీపాద గోపాలకృష్ణమూర్తి సంపాదించిన 'తొమ్మిది ఏకాంక నాటికలు', గోపీచంద్ 'పరివర్తనం', నూరేమండ 'నాలుగునాటికలు', ప్రతివాది భయంకరాచార్య 'పురుషోత్తముడు' చిరంజీవిపాటలు, చిలుకూరి లక్ష్మీనరసింహాచార్య 'రవికిరణాలు' గాడిరాజువారి 'స్వప్న కుమార స్వరూప సందర్శనము' భోజరాజు సంధ్యాసౌమిత్రి" మల్లంపల్లి 'చారిత్రక వ్యాసములు', మొదలైన గ్రంథాలెన్నో ఈ మధ్య కాలాన ప్రచురితమైనవి. నవ్యసాహిత్య మెంత విరివిగా వెలువడుతున్నదీ వీటివలన స్పష్టమౌతూనే ఉన్నది. కాని దీన్ని వెనక్కు నెట్టివేసిన రెండు నూతన కవితోద్యమాలు ఈ మధ్యకాలములో బయలు దేరి సాహిత్యరంగంలో అలజడి కల్గిస్తూవచ్చినట్లు గమనించినాము. అవి స్థిరంగా నిలిచినవి కాకపోయినా నాటి స్వరూపం తెలుసుకోవలె నంటే అధివాస్తవిక - అభ్యుదయ ధోరణులు! ఈ ఉద్యమాలను గురించీ, వీటిని ప్రవర్తిలజేసిన ముఖ్య రచయితలను గూర్చీ ముందు ప్రకరణాలలో విపులంగా తెలుసుకొన [illegible]

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# అతివాస్తవిక ధోరణి

# 3

## సూత్ర గ్రథనము :

మొదట భావకవిత్వమనే పేరుతోను, ఆ తర్వాత నవ్యకవిత్వమనే పేరుతోను వ్యవహరింపబడుతూ వచ్చిన సాహిత్యము దేశములో బాగా స్థిరపడి పోయినట్లు గ్రహించినాము. అయితే 1938 నాటికే నవ్యకవిత్వముపైన తిరుగుబాటు భావాలు పొడసూపుతూ తర్వాత తర్వాత విప్లవభావము హెచ్చయి పోతూవచ్చినట్లు గమనించ గల్గుతాము. 1932 నుంచే ఇంచుమించుగా అతి నవ్యధోరణి తెలుగు సాహిత్యంలో ప్రారంభమైనట్లున్ను, క్రమంగా పాశ్చాత్యసాహిత్యానుకరణం ప్రబలమైపోతూ వచ్చినట్లున్ను తెలుస్తుంది. ఆదర్శతత్వము పైన అభినివేశం రచయితలలో క్రమంగా నశించిపోతున్నది; సంప్రదాయం వీరికి కంటకం అయిపోతున్నది; వాస్తవికత అంటూ కొంత, అతివాస్తవికత అంటూ కొంత, సాహిత్యరంగంలో ప్రవేశపెట్టుతూ అతినవ్యులు విజాతీయధోరణులపైన మమకారము చూపెట్టుతున్నారు. పాశ్చాత్యుల "సర్రియలిజం" తెలుగులో "అతివాస్తవిక ధోరణి" అయింది. కవిత్వంతో "ఎక్సుపరిమెంట్సు" జరపడం ఒక ఫాషనయిపోయింది అతినవ్యులకు; ఛందస్సుతో, భాషతో - ఇష్టము వచ్చినట్లు ఆటలాడడం వీళ్ళకు సరదా! 'జ్వాల' పత్రికపెట్టి ముద్దుకృష్ణగారు క్రొత్తబాట వేయడం ప్రారంభించినాడు; శ్రీరంగం శ్రీనివాసరావుగారీయనకు తోడైనాడు; శిష్ట్లా ఉమామహేశ్వరరావుగారు అతినవ్యధోరణిని రచన సాగిస్తూ వచ్చిన ఆద్యుడనిపించుకున్నాడు. పూడిపెద్ది వెంకటరమణయ్య, కవికొండల వెంకటరావు గారలుకూడా నూత్న ఛందస్సులను ప్రయత్నించినవాళ్ళే. ఏమైనా

వీరిలో ప్రవక్తృస్థానాన్ని మాత్రం శ్రీ. శ్రీ చూరగొన్నాడని చెప్పుకోవలె*. వీరి అతినవ్య మార్గాన్ని చూచి మొదట నవ్యులు విభ్రాంతులు కాజొచ్చినారు. అయితే ఉదార భావంతో నోరి, తల్లావజ్ఝల వారలిద్దరూ వీరి వీపు తట్టి ఉషారిచ్చినారు మొదట్లో. ప్రాచీన కవితామార్గానుయాయులైన పండితులు దీనిని నిరసించడము ప్రారంభించినారు. నవ్యసాహిత్యముతోపాటు "ప్రతిభ"లో స్థానము దీనికికూడా కల్పించినారు తత్సంపాదకులు. దానితో మంచి ప్రచారం లభ్యమైందీ ధోరణి కవిత్వానికి; శ్రీ. శ్రీ నలుగురికంటా పడ్డాడు. కొందరు యువకులు అతనిని అనుసరించడం ప్రారంభించినారు; కొందరర్థముగాక తికమకపడడం కూడా గమనిస్తాము. పేరడీలు బయలుదేరదీసి ఈ ధోరణిపైన, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు దీని ప్రచారానికి కొంత కారణభూతుడైనాడు. పిఠాపురం యువరాజా సరాభీ అనువారీ అతినవ్యధోరణిలో గ్రంధాలు వ్రాసి ప్రచురించినారు. ఈ ధోరణిని మొదట్లో కొందరు 'బీభత్సకవిత్వ' మన్నారు అందులో కన్పించేభావాన్ని బట్టి; భాషనుబట్టి "మణిప్రవాళం" అనవచ్చునన్నారు; వస్తువునుబట్టి "శ్మశాన కవిత్వ" మన్నారు; ఈ కవికున్న 'అహం' జూచి 'అహంభావ కవిత్వ'మని అన్నారు; ఛందస్సులలో వైవిధ్యాన్ని, నవ్యతను బట్టి "వైచిత్రి" అన్నారు; నవ్యసాహిత్య పరిషత్తు అధ్యక్ష పీఠాన్నుంచి విశ్వనాథ ఈ నూతన మార్గాన్ని దర్శించి మన్నించినాడు. మొత్తంమీద ఈ ధోరణి కొందరి దూషణకు, కొందరి ఆమోదానికి, మరికొందరి అనుసరణకూ గురి అయింది. ఈ ధోరణినిగూర్చి తెలుసుకోవాలంటే పాశ్చాత్యుల చిత్రకళలోను

---

* తొలి సంచికలో 'జ్వాల' ఎందుకో వివరించిన విధము చూడండి

"మనం పరాధీనంగా వుండడంవల్లనో, పురాతన మగతచేతనో, రక్తంలో నీరసం చేతనో, పూతన తేజస్సునను గుడ్లగూబల మౌతున్నాము. ఇదిపనికిరాదు. . యువకుల దృష్టికి ... ఒక కొత్తదారి కనబడుతూ ఉన్నది . మార్పు తప్పదు దీనికి అడ్డు వీల్లేదు. వచ్చినా ఆగదు. పిరికివారికి ముక్తిలేదు అందుచేత నచ్చని పాతబంధాలను తెంపివేయడానికి ఎంతైనా సాహసిస్తాము . . . . మాకు మతంలేదు, జాతిలేదు, వర్ణంలేదు, ఆడవాళ్ళిందుకు మగవాళ్ళందుకు అనే భేదం లేదు. యువకులు ఉద్రేకంతో, సాహసంతో ఏది తెచ్చినా దాన్ని ప్రచారంలో పెడతాము. ఉన్నదిఉన్నట్టు అంగీకరించి నిర్జీవంగా తుప్పుపట్టడంకన్నా, నష్టం కలిగినా సాహసించి ఏదో యత్నించి జీవించడం ఉత్తమం .."

నాటి సాహిత్యములోను ఆమధ్య వచ్చిన ఈ విధమైన మార్గానికున్న సూత్రాలను ఉల్లేఖించుకోవలె. లేకపోతే దీన్ని అవగాహన చేసుకోలేము. అందుచేత ముందా సూత్రాలను గ్రహించుదాము. నాటి నీక్రిందివిధముగా చెప్పవచ్చు:

1. అల్లరిచిల్లరితనము (gloom & hopelessness).
2. నిరాశ (Scrappiness and disorder).
3. పురోభాగిత్వము (cynicism).
4. కోపము. అది తీర్చుకునే మార్గము లేకపోవడము.
5. సంపూర్ణ పరిణామాభావము (ఉద్దేశరాహిత్యము)
6. అందరు గొప్ప అనుకునే వాటిలో యేమీ లేదనటము.
7. ఎక్కడైనా సౌందర్య ముంటే (కర్మముచాలక) దాన్ని పాడుచేయడము.
8. నేయార్థము, కొద్దిమందికే ఉద్దేశించడము.
9. ఛందస్సు తారుమారు చెయ్యడము.
10. విరుద్ధభావ సమ్మేళనము.
11. మనస్తత్వానికి ప్రాముఖ్యమిచ్చామను కొనడము.
12. శబ్దార్థక్లిష్టత.
13. సంకేతము (Symbolism) ఇక్కడ మన లాక్షణికాభి ప్రాయానికీ దీనికీ భేదమున్నది. ఏదో మాట ఉపయోగించడము. దీనిలో ఇంత అర్థమున్నదనడము. ఆ అర్థము ఉండవచ్చు లేకపోవచ్చు!
14. అచ్చులోనూ వ్రాతలోనూ నిప్పనము!
15. అవసరాన్ని బట్టి పదాలనూ వాటి ఉచ్చారణనూ తారుమారు చేయడము!

పై సూత్రాలతోబాటుగా తులతూగేవే చిత్రకారులలో భవిష్యద్వాదుల (Futurists) శాసనాలు ※. వాటిని పరికించడం అవసరం; చూడండి:

1. జీవితములో ఎక్కువ వేగము.
2. పాతదానిమీదనూ తెలిసినదానిమీదనూ అసహ్యమూ, కొత్తదంటే, తెలియనిదంటే అపేక్ష.
3. శాంతజీవనమంటే వెగటు, ప్రమాదకరమైన అనుభవాలమీద అభిమానం.
4. అతిలోక చింతా నాశనము.

---

※ 'అహంభావ కవిత్వ ధోరణి' అన్న "ప్రతిభ"లోని వ్యాసంలో నోరి వారుదహరించిన వివి.

5. మానవుల కోరికలు అనంతముగా వృద్ధికావడము.
6. ఎవరికివారు తమకు అందరానిది తెలుసుకోవడము.
7. స్త్రీ పురుషులకు సంఘములో భేదము తగ్గిపోవడము.
8. స్త్రీ పురుష ప్రణయమూ, దానికి గౌరవమూ, తగ్గవలె.
9. వ్యాపారమంటే గాఢాభిమానము, సంపూర్ణమైన ఆర్థికబుద్ధి
10. యంత్రబుద్ధి.
11. క్రీడలంటే వెర్రి. అందులో మించవలెననే తృష్ణ.
12. దూరయాత్రలమీద అపేక్ష. ఏకాంతచింత లేకపోవడము
13. విశ్వజనీనమైన ఊహలు.
14. పంకరలమీద, నెమ్మదిమీదా, అసహ్యాభావము, సూటిదనము, తొందర ఇత్యాదులందు ఆదరము.
15. పాతపండితులు చెప్పిన లక్షణాలన్నీ దూరముగా గిరాటువేసి, కవులు భావపరంపరలతో ఒళ్ళు మరిచిపోయి మరిపించవలె. భావవేగము చిత్రించేందుకు కారకము, విశేషణాలు, కామాఫుల్‌స్టాపులు-అన్నీ ఎగరవేసి తంతివార్తల బాషలో, నోటికివచ్చిన విధంగా, క్లుప్తసరిగా, అత్యవసరమైన మాటలు మాత్రమే కురిపిస్తూ, భావగీతాలు (Lyrics) చెప్పవలె.
16. తంతులులేని ఊహ (Wireless imagination).
17. విశేషణాలు ప్రయోగించడము తగ్గించి వేయవలె.
18. క్రియాపదాలు భావార్థకంలో మాత్రమే వాడవలె. అందువల్ల రచనకు ప్రచండత, ఓజస్సు కలుగుతవి, వాక్యనిర్మాణము వల్ల రచనకు నిలకడకలిగి అది ఆగుతూ ఆగుతూ ఉంటుంది. అది పనికిరాదు. భావార్థక ప్రయోగమువల్ల వాక్యనిర్మాణము నశిస్తుంది.
19. భావాన్ని అనుకరించే ధ్వనిగల శబ్దాలు తరుచుగా నిర్భయంగా ప్రయోగించవలె. శైలివేగము తెలియజేయడానికి గణితములోనివీ, సంగీతములోనివీ సంజ్ఞలు ఉపయోగించుకుంటాము.
20. అచ్చులోకూడా మార్పు. పేజీ ఒక్కంటికి మూడునాలుగు రంగుల సిరా, అవసరమైతే ఇరవై రకాల టైపులూ వాడతాము.
21. భావోన్మాదము సువ్యక్తము చేయడానికి పదస్వరూపము మార్చి కొత్తరూపాలు సృష్టించవలె. అవసరం కొద్దీ మాటలు కోయడము, పొడిగించడము,

ఆదికాని, మధ్యకాని అవసానముగాని బలపరచడము, అచ్చులు, హల్లులు వృద్ధిచేయడము తగ్గించడము, ఇటువంటివి చేసి నూతన వర్ణవిన్యాసము (Orthography)సృష్టిస్తాము"

పై సిద్ధాంతాలలో చాలవరకు కవిత్వంలో అతివాస్తవిక వాదులు అనుసరించినవే, ఇంచుమించుగా తెలుగులో కూడా ఇవి అనూదితాలైన వనవచ్చు. శ్రీ శ్రీ, పరాభి మొదలైనవారి రచనలలో నుంచి కొన్ని సూత్రాలను తర్వాత గ్రహించే సందర్భం వస్తుంది. అప్పుడీవిషయం ఋజువవుతుంది.

18, 19 శతాబ్దాలలో పూర్వము యూరపుఖండాని కంతకు విజ్ఞాన చక్షుస్సునూ, విమర్శనా సూత్రాలనూ ఇచ్చినది ఫ్రాన్సు. ఆవిధముగా ఆమార్గము మారుతుండగా యుద్ధము వచ్చినది. అపుడు ఇటలీ మొదలైన దేశాలలో ఈవిధమైన మార్గము పాటమరించినది. క్రమముగా ఈదృష్టి అనేకమార్పులు* చెంది 'సర్ - రియలిజం' క్రిందికి వచ్చినది. ఇది ప్రథమంలో (ఫ్యూచరిజంగా) చిత్రకళకోసం పుట్టి సాహిత్యానికి అనువృత్తమైనదని గమనించవలె ◆ కాని కొన్ని సంవత్సరాల నుంచి అదికూడ మారిపోయినట్లు కనపడుతుంది. రాజకీయములోను సాహిత్యములోను ఇంకా కొన్ని ఇతరవిషయాలలోను మనకు మార్పు చాలా ఆలస్యము కావడమే కాకుండ, మనకామార్పు కలిగేటప్పటికి అసలామార్పు పుట్టినచోట నశించడము కూడా కనపడుతుంది.‡ ఈ 'సర్ - రియలిజం' కూడా అల్లాగే 20 సంవత్సరాలు

---

*సర్‌రియలిజంగా పరిణమించేలోపల ఈకళాదృష్టిఅనేకమార్పులు పొందినది డాడాయిజం యుద్ధమైన వెంటనే వచ్చిన విపరీతపరిణామం సంప్రదాయంపైన విపరీత నిరసనం అదివరకుండే యధాభావన యధాదర్శన మొదలైన మార్గాలద్వారా నడిచిందీ కళాదృష్టి. తుదకు సర్ రియలిజంగా పరిణమించింది. ఇందులో సమస్తమార్గాల కళలూ ఉన్నవి. అసహ్యత (Uglyism) భావచిత్రం (Imagism) మనస్తత్వం (Psychology) కళలుకూడా దీనితో ఉన్నవి.

◆ ఒక జర్మన్ కళాభిజ్ఞుడు 1914లో ఇట్లా అన్నాడు:

Today we are breaking up the chaste, ever-desceptive phenomena of nature, and re-assembling them according to our will. -Franc Marc

ఈ అంతర్దృష్టి మొదట 'యక్సురే' కనిపెట్టడంతో నిశ్చయమై, తర్వాత, 'రేడియో - టెలివిజన్'ల వల్ల గట్టిపడింది. కాని అంతిస్సింకా సంపూర్ణంగా బుద్ధికి అందనట్టే కనపడుతున్నది

‡ 'German art is held in contempt and suppressed in the country where it has grown up' -Modern German art.

వెనుకపడ్డట్లు తెలుసుకుంటాము*. ఈ కొత్తపద్ధతి మన సాహిత్యచరిత్రలో పరివర్తనకాలములో వచ్చిన మార్పునీ, కాలక్రమేణా ఈ మార్గము మళ్ళీ మరొకదానికి దారితీసి సాహిత్య విస్తారానికి సహాయకారి అయినదని గుర్తించవలె.

ఈ 'సర్రియలిజము' రెండవ ప్రపంచయుద్ధకాలములో ప్రవర్తిల్లిన కవితోద్యమని తెలుసుకోవలె. ఇది ఎంతో కాలం మన ప్రాంతాన వర్ధిలలేదని చెప్పవలసి ఉన్నది. మన తెలుగుదేశములో నైసర్గికము, సహజము కాని ఏ పాశ్చాత్య కవితోద్యమమైనా తిష్ఠవేసుకొని కూచోజాలదు. అల్లాగే ఈ 'సర్రియలిజ' ◆మున్ను అట్టేకాలము నిలువలేదు. ఏమైనా దీనినిగూర్చి కొంతచర్చ జరిగినమాట వాస్తవం. దీని నిర్వచనమును, సూత్రవిచారమునుగూర్చి కొంతచూదాము:

'సర్ - రియలిజం' అనినపుడు 'సర్' పదానికి గల అర్థమేమిటీ అని చర్చ: 'సర్' అంటే 'ఇన్' (లోపల) అనికొందరు◆...

దీన్ని బట్టీచూస్తే 'సర్ రియలిజం' లో ఒక పద్ధతి మనకు కనపడే బాహ్య ప్రపంచానికి పునాదైన నిమ్నోన్నతభావ ప్రపంచకధన మన్నమాట! మరికొందరు "సర్" అనే పదము "సూపర్" యొక్క సకుంచితరూపమనిన్నీ, 'సర్రియలిజము' అనగా యధార్థదృష్టాన్ని చాలా అతిశయోక్తితో చిత్రించటమూ యధార్థభావనను కూడా చాలా ఎక్కువచేసి చిత్రించటమూ అంటున్నారు. ఇంతకూ మనవాళ్ల 'సర్రియలిజం' ఒక నిర్దిష్ట పద్ధతికాదు. దానిలో యధాదర్శనం (realism) దగ్గర్నుంచీ అసహ్యత (uglyism) దాకా ఉన్నవి, యధాదర్శనము దాని కేంద్రము. దానిచుట్టూ యీ "యిజములన్నీ" వ్రేలాడుతున్నవి. ఈ మార్గానుయాయులు చేసే పనిని క్రిందివిధముగా చెప్పినాడు ఒక విమర్శకుడు: "The sur-realist artists took a world disorganised by lack of planning and mirrored it in exaggerated detail, as if they had studied it with microscope, and by a process of psycological

---

* రష్యన్ 'ఫ్యుచరిజం' అంటే మబ్బులో ఉంది. ధ్వనులే సంగీతం, మాటలే కవిత్వం, రంగులే శిల్పచిత్రాలు - మూడుముక్కలలో ఇదీ దాని తత్వం. ఇటువంటిదానిని కొందరు 'ఉగ్లిజమ్' (అసహ్యత) అన్నారు; 'డాడాయిజం' (పరమాసహ్యత) ఇంకా అసహ్యమైనది ఉంటూకూడా ఒకటి ఉన్నది.

◆ జమ్ములమడకవారు దీనిని 'అంతశ్చేతన' మన్నారు.

analysis." అంటే యీవిధమైన కవులు ఇప్పుడు పైకి కనపడే బాహ్యప్రకృతిలో ఒక నిర్ణీత పద్ధతి లేదనీ, లామా ప్రకృతి లీలలను భూతద్దముతో చూచి అందులో ఉండే అవయవ విన్యాసాన్ని అంతా తప్పొళ్ళతోనూ, మనస్తత్వశాస్త్రరీత్యానూ పరీక్షించినట్టున్ను చిత్రిస్తారు.

మన మనస్తత్వ శాస్త్రవేత్తలు సామాన్యముగా జ్ఞానానికి (మనస్సునకు) ద్విక్షణావస్థాయిత్వము చెప్పినారు. ఇంద్రియార్థ సంపర్కమువల్ల కొన్ని సంస్కారాలు కలుగుతవనీ, ఆ సంబంధమైన వస్తువు మళ్ళీ కనపడ్డప్పుడుగాని, భావము వచ్చినప్పుడుగాని, ఆ సంస్కారాలు ఉద్బుద్ధాలౌతవనీ చెప్పినారు. కాబట్టి ప్రకృతిని చూచినప్పుడు ఒక భావన కలిగి ఒక విధమైన సంస్కారము కలుగుతుంది. మళ్ళీ అది ఉద్బుద్ధమైనప్పుడు సరిగా ఎట్లా కనపడ్డదో అట్లా మాటలలో పెట్టడము వీళ్ళ పని అనుకుంటారు. ఇది గొప్పపని. కష్టసాధ్యమున్ను ※. కాబట్టి అతి నవ్య మార్గాలలోను విశేషమున్నదని గమనించవలెనే కాని త్రోసివేయరాదు

ఈమార్గం ఆంతరానుభవనుమీదా, మనస్తత్వంమీదా, ఆధారపడి ఉన్నది. కాబట్టి ఈ అనుభవ సంస్కారమే తర్వాత ఉద్బుద్ధమైనప్పుడు ఇతరానుభవాలతో కలిసి ఉంటుంది కాబట్టిన్నీ, తదనురూపమైన సంస్కారము కలవాళ్ళకే అది తెలుస్తుంది. అందుచేతనే ఈరకం కవుల వ్రాతలు కవికిచుట్టూ ఉన్న సంకుచిత వాతావరణంలో ఉన్నవాళ్ళకే ఉద్దేశితాలవుతవి.◆ ఇందులో కార్యకారణ భావం

---

※ 1. జ్ఞానానికి పరిమితిలేకపోవడము 2 దాని ఉన్నదున్నట్లు నిర్వచించడము కష్టము కావడము 3. అందరిలో సమానానుభవము లేకపోవడము 4. చెప్పే పద్ధతిలో భిన్నత్వము 5. జ్ఞాన మితరజ్ఞానముతో కలిసి ఉద్బుద్ధము కావడము-కారణాలు.

◆ ఈ క్రింది వాక్యాలుకూడా ఈవిషయాన్నే ఉల్లేఖిస్తున్నవి:

"The Poet is now seeking to find and establish that central calm, a point from which he may begin to work outward again, and in the process he is bound to be obscure, for he is talking to himself and his friends, to that tiny temporarily isolated unit with which communication is possible, with whom he can take a number of things granted... . In modern poets, there is a perpetual interplay of private and public meaning, the inner circle of communication-the Poet's communication with his own arbitarily isolated social group is perpetually widening into and become identified with the outer circle of environment,". - Cecil Day Lewis.

కన్పించదు ఇది ఉద్రేకానుభవ విధానము. పదాలలో ఒకదానికి కొకదానికి సంబంధం ఉండదు; వ్యాకరణం అన్వయించదు, కవి సమయాలలో - కవితా సామగ్రిలో - భాషలో - అన్నిటా నవ్యతే లక్ష్యం. నూత్న పదబంధాలు, నూతవాక్యతులు, నూత్నఛందస్సులు - వీటికోసమే ఎక్కువ ప్రయత్నం! ఇవి దోషాలా గుణాలా అన్నది ప్రశ్న! దీన్ని సహించనివారు లేకపోలేదు. పాశ్చాత్యులలోకూడ ఈరకమైన కవిత్వ ధోరణిపైన ఇరుపక్షాలు అంటూ బయలుదేరి కొంత ఘర్షణ పడినారు. అక్కడ కూడా ఈ ధోరణి కొద్దికాలమే ఉండి సమసిపోయింది.

ఈ పద్ధతిలో ఉద్దేశం తిరుగుబాటేగాని, ఆ చెప్పింది నిజమా, అబద్ధమా, పిచ్చా, ఊహా, కలా, అనే సంగతి అనవసరంగాగ కన్పిస్తుంది. చూస్తే ఇది అంతా గారడీవాని పనివలె ఉంటుంది.* దీనివలన కలిగే చిత్తవికార మందుకనే క్రింది మెట్టులో దవుతున్నదనవలె. అల్లరి బుద్ధిపూర్వకంగా చేయుడం - మేమే గనుక చేస్తున్నాము గదా అని గర్వపడడము ఈ మార్గవర్తులలో కన్పిస్తుంది.

పైన వివరించినవాటిలో కొన్ని నవ్యకవిత్వములో కన్పించినప్పటికీ నవ్యకవులు పూర్వ సంప్రదాయాలను బొత్తుగా నిరసించలేదు. వాళ్ళకు శబ్దము - దానికి శ్రవణ సుఖం ఉండడము - శబ్దార్థ సంబంధము ఉండడము - ఆ అర్థానికి రమణీయత, హ్లాద రామణీయకాలూ, రసమూ, ఉపాదేయాలుగానే కనపడుతవి. భాషనుగూర్చి కొందరికి వ్యావహారికం యిష్టమైనది. ఛందస్సు, శబ్దసమ్మేళనం - స్వేచ్ఛ - వాచ్య వ్యంగ్యాలు - గూఢత - నేయార్థం మొదలైన వాటిలో వారికి అభిప్రాయభేదా లున్నప్పటికీ, సంప్రదాయాన్ని పూర్తిగా మూలచ్ఛేదము చేయతలపెట్టలేదు. కాని యీ అతినవ్యమార్గము దగ్గరకు వచ్చేటప్పటికి సహృదయులందరూ నిర్విణ్ణులుకాక మానరు. సంప్రదాయలాక్షణిక సూత్రాలూ, ఈ అతినవ్యులనుసరించే సూత్రాలూ పూర్తిగా విరుద్ధాలు. వీరికి కవితా సౌందర్యం అక్కరలేదు. ఎక్కడైనావస్తే దానిని బుద్ధిపూర్వకముగా చెడగొడతారు. శబ్దము అర్థావబోధ చెయ్యనక్కరలేదు. కావ్యానికి

---

* Sur-realism has led us into realms of magic, into the borderlands of sub-conscious, between madness, mental twilight and the dream, its goal being to achieve the realisation of achieving something new. - Modern German Art

అర్థము ఉండనక్కరలేదు; అసలు కళ సత్యకథనమేకాని యెంతమాత్రను అనుకరణము కాదు*. భాషానైరుధ్ధ్యము అవశ్యముగా ఉండదగినది. ఛందస్సక్కర లేదు. తుదకు భావాలయొక్క కావ్యాలయొక్క పరిసమాప్తి కూడా అక్కరలేదు. భావ ప్రకటనము మనస్తత్త్వ శాస్త్రము ప్రకారము కాబట్టి "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అనే నిర్వచనములో ఉన్న అంశా లేమీ అవసరం లేదు. వీరికి రసముతో ప్రసక్తే లేదని చెప్పవలె

ఈ అతివాస్తవిక ధోరణిని తెలుగులో ప్రవేశపెట్టిన సాధకులను గూర్చి, వారి రచనలను గురించీ, విపులంగా తెలుసుకొందాము. వీరు చెప్పిన సూత్రాలు, వ్రాసిన వ్రాతలూ పైన మనముల్లేఖించుకొనిన సూత్రములకు సరితూగేటటువంటి వేనని గమనించగల్గుతాము.

## శ్రీరంగం శ్రీనివాసరావు :

అతి వాస్తవిక ధోరణి గూర్చిన ప్రసంగము వచ్చిన వెంటనే శ్రీ. శ్రీ. పేరు స్ఫురించి తీరుతుంది. ఈ ధోరణి కవిత్వాన్ని ఎందరు చెప్పినా శ్రీ. శ్రీ. వారందరిలో ప్రముఖుడై కీర్తి గడించినవాడు కనుక ముందితనిని గూర్చి వ్రాసుకోవలసి ఉన్నది. అంతేకాకుండా సూత్రగ్రథనము సందర్భానకూడా ఈతని రచన లెంతగానో ఉపయోగిస్తాయి. శ్రీ. శ్రీ. (జననం 1910) కవితాసమితిలో (విశాఖపట్నం) సాధకుడుగా బయలుదేరినట్లు, సలక్షణభాషతో, ఆలంకారిక సమ్మతమైన కవితను చెప్పినట్లు,

---

* మనోహరత్వమనునది లలితకళల . . యొక్క ముఖ్యధర్మము . లలిత కళ లనుకరణములుగా నుండునేగాని మూలములుగ నుండవు. యుద్ధము యొక్క రసవంతమైన వర్ణనము కావ్యమగునేగాని ఆయుద్ధము కావ్యము కాజాలదు. కళ కళగా ననుభవించుటకు, నయ్యది యనుకరణ మన్న జ్ఞానము చూచువారికిగాని వినువారికిగాని యత్యంతావశ్యకమనివిస్మరించుట మరచిపోగూడదు . . కళలకు కళాత్వము లోపించునంత తన్మయత్వము జెందినయెడల వాక్యైక్యప్పుదాభాసమునకు కారణమగునని మాత్రము మరువరాదు .

-లక్ష్మణరాయవ్యాసావళి.

ఇది 1928 లో ఈయన ప్రచురించిన "ప్రభవ"* అనే ఖండకావ్య సంపుటివలన వ్యక్తమైనట్లు పూర్వమే(**పుటలు 446-450**)హించినాము. ఈతడు సంస్కృతాంగ్ధ్రాంగ్ల కవితామార్గాల నన్నిటినీ కలయజూచిన ప్రతిభావంతుడు. మొదట్లో (1928 ప్రాంతానికి) భావకవిగా ప్రకృత్యారాధనము - ప్రేమ తపస్సు చేసినవాడే. ఉత్తమ భావుకుడైన అంతర్ముఖుడితడు తన ప్రధమ రచనలలో! ఈతడు పలాయనవాదిగా ప్రారంభమై, వాస్తవిక ధోరణులలో "ఎక్స్పరిమెంట్సు" చేసి చివరకు అభ్యుదయవాదిగా పరివర్తనం పొందినాడు.

ఈతని గుండెలో ఆవేదనా, ఆవేశం హెచ్చు. వాస్తవికలోకంపైన దృష్టి మరల్చిన కవిధీరుడితడు. "మరో ప్రపంచ" ద్రష్టగా ఇతనిని పేర్కొని తీరవలె. ప్రస్తుతం ఈతని అతివాస్తవికధోరణే మనకు ప్రసక్తము కనుక దానిని గూర్చే విచారించు కొందాము భారతీ ఆనందవాణీత్యాది అనేక పత్రికలలో ఈయన రచనలు బహుళంగా కన్పిస్తవి. కాని యీతడు 'ప్రతిభ' సంచికలలో ప్రచురించిన గీతాలే అతివాస్తవిక ధోరణిని గూర్చిన సూత్రాలను అందించేవిగా ఉన్నవి. చూడండి:

---

* 'ప్రభవ' ప్రకృతిగీతములు - ప్రణయగీతములు - ప్రకీర్ణగీతములనే మూడు భాగాలుగా ప్రచురింపబడింది వీనిలో ఆంగ్ల సారస్వత ప్రభావము బాగా ఉన్నది; అందుకనే భావకవిగా ఈతనిని నిరూపిస్తున్నదీ 'ప్రభవ' అనవలె. పురిపండా 'ఉపక్రమణిక'లో వ్రాసిన ఈ వాక్యాలు చూడండి .

"... నవీన కవికుమారులకుంబలెనే శ్రీనివాసరావు గారికి ప్రకృతిలక్షి యుపాస్యదేవత . .

ఇది మనోజ్ఞ ప్రకృతిధామ మిచటఁజేరి
అమృత పేశల నవమాధురిమముఁగూర్చు
విహగకల కూజితధ్వనీ విధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు

అని 'మరల మరల మంజులగాన ఝురులఁదేలు'ను . . ప్రణయగీతములు . . . కేవలము పరమేశ్వరుని పరముగ రచింపబడినవి . . .

శ్రీనివాసరావుగారి కవితయం 'దొక యనిర్వచనీయ మహోన్నతమగు హొయి' యున్నది 'దరులొరసి పారు గాంగనిర్ఝరిణియట్లు' వీరిగతిఁ (చెంగుచెంగున) తురంగలించును. కవిత్వమునందు మంచి యుత్సాహమున్నది."

దీన్ని బట్టి చూడండి శ్రీశ్రీ ఈనాటి కెలా మారిపోయినాడో ! పోల్చడానికి కూడా వీలులేదు.

"ఛందో బందోబస్తులన్నీ
ఛట్! ఫట్ ఫట్ మని త్రెంచి
Damnit! ఏమిట్రా ఇ? దంటే
Pray! It's poetry అందాం."

ఇందులో ఛందస్సక్కరలేదనీ, అయినా "పొయిట్రీ" అవేననీ మొదటిసూత్రం.

"అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేదాం,
కాదన్న మాదన్న ◆ యెవడన్నా వుంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం."

అర్థం అక్కరలేదు. శబ్దము అర్థముతో సంబంధించి ఉండదు. అది స్వతంత్రము. శబ్దసామ్యమూ తదలంకారము మాత్రము గ్రాహ్యం※. ఇది రెండో సూత్రము. గద్య పద్యభేదము లేదు. గణఛందస్సు లేక పోయినా, మాత్రా ఛందస్సైనా ఉన్నదా అంటే అదీ లేదన్నారు వెనక. ఇప్పుడు గద్య పద్య భేదమే లేదన్నారు. ఒకే కావ్యములో గద్య పద్యాలు రెండు రకాలూ కలిసి ఉండవచ్చు! ఇది మూడో సూత్రము.

"హాష్! హూష్! హూష్! హాష్! అని కేకలువేసి కావ్ కావ్! మ్యావ్ మ్యావ్! అందాం గమ్మత్తుగా."

సౌందర్యమక్కరలేదు. సౌందర్యరహితాలైన శబ్దాలుకూడా కావ్యముకావచ్చు. అంతేకాకుండా బుద్ధిపూర్వకముగా, సౌందర్య రహితాలైనా, అల్లరిచిల్లరగా ఉండేవీ, నిరర్థకాలైనా, శబ్దాలనుపయోగించవచ్చు.

---

◆ (వేమన) " . పాతకాలపు వ్యక్తి యింకా అనర్థం కాదంటాడు. ఇతడుల అస్పష్టమేమీలేదు ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థం కాలేదన్నమాట. ఇతడు కళ్లు మూసుకున్నాడు వెనుకపడి పోయాడు. -భారతి 1939 ఫిబ్రవరి

※ ఈ అతినవ్యమార్గాన్ని శ్రమపడి అలంకార మార్గంలో చేరుద్దామంటే శబ్దాలంకారాల [illegible] వరకే [illegible] కాని అర్థాలంకారాల దగ్గర కెళ్ళి అభావమే! "అర్థాన్ని అడవిలో వేసి వదలడం! [illegible] సాహిత్యదృష్టికి కీళ్ళవి వెర్రికూతలే.

"న . . . న . . . న . . . న . . . నత్తి మాటలు కూడా
మ . . . మ . . . మ . . . మ . . .మన వ్రాతల్లో వుండవచ్చు!"

పై నాలుగుపాదాలు కలిసి నాల్గో సూత్రము *

ఈ నాల్గుసూత్రాలతో "రమణీయత" "అర్థం" "శబ్దం" ఈ మూటిసమ్మేళనం "కావ్యం" అనే సిద్ధాంతం పూర్వపక్షమైపోయినట్లు

---

* ప్రతిభ సంపుటం 5 సంచిక 1 లోకూడా "కనుమలోఎది-కా-కా-కొలిమి" etc

ఇందులో "నీసాల్వర్సాన్" కంటె "నియోసాల్వర్సా" నని స్పష్టంగా అంటే యింకా బాగుండేదేమో! అశ్లీలస్ఫురణం జుగుప్సాకరంగా ఉంది బీభత్సమున్నా! ఇదొక విశేషము. కవిగతి సాల్వర్సాన్ యింజక్షన్ కిందికి దిగింది! అది మళ్ళీ కవిముఖాన వినడం! ఇందులో డాడాయిజంయొక్క ఛాయ ఉంది! ఈ క్రిందిది యింగ్లీషు డాడాయిజం కవిత్వం!

" In your inside three are smoking lamps the swamp of blue honey
cat crouched in the gold of a flemish inn, boom, boom,
lots of sand-yellow bisyclist chateanneuf des pepes
man hatten there are tubs of excrement before you
mbaze, mbaze, baze-baze, mleganga, garoo
. . . . . . . . . . . . . . . . . . . "

నిరర్థకపు "హుష్‌హుష్" లాటి కేకలు, అశుద్ధపుబొక్కెనలు, మొదలైననీ, వగైరాలనీ పద్యపాదాలు పెద్దక్షరాలతో మొదలెట్టాలనే నియమాలు మొదలైనవి లేక పోవడమూ; కనిపిస్తున్నై! ఒక గొప్ప డాడాయిస్టు ఈ క్రింది ప్రశ్నలలో తన అభిప్రాయాన్ని చెప్పినాడు.

"What is beautiful? What is ugly? What is great, strong, weak? What am I? Don't know! Don't know! Don't know!"

"Dada was a violent protest against art, literature, morals, and society."

"In Dada and sur-realism magazines the subject of suicide evoked keen interest.

"To Dada the past was dead and the future was powerless to be born."

ఒకసారొక డాడాప్రదర్శనం జరిగిందట. అక్కడ జరిగిన విషయాల్లో యీ క్రిందివి కొన్ని :-

(1) డాడాసిద్ధాంతం స్త్రీ పురుషభేదం లేదని

(2) బాక్సింగు (ముష్టియుద్ధం)లో నెత్తురు కారుతూంటే అయ్యో అనకుండా చూడటం

(3) ఓవరకు మాంసపుముద్దలూ టొమాటోలు పెట్టి ప్రేక్షకులూ ప్రదర్శకులూ కొట్టుకోటం (వాళ్ళ పైని వెంట్రుకలు పీక్కుంటామని ప్రచురించారట గాని చూపలేదట!) ఒక ప్రదర్శనాన్ని గూర్చి యిట్లా ఉన్నది.

"One of them (exhibits) was the printed reproduction of Mona Lisa with a pair of moustaches painted on her face and leaving an inscription underneath 'Lhooq' (look)"

మరి ఒక ప్రదర్శనం-

"The visitors had to pass through a public lavatory in order to enter the gallery Inside, the spectators were provided with hatchets with which they could attack the exhibits At the end of the gallery, a young girl stood reciting obscene poems... . .and the exhibition had to be closed down by the police.'

ఇంకా మరికొన్ని గీతాలు చూడండి:

"అచ్చా! స్వేచ్ఛాజీవీ!
ఐతే, కైతే, నీ వ్రాతని
Argument కోసం ఒప్పుకున్నా,
పానుగంటివారు ఒప్పుకోరు."

గ్రాంధికవాదైన పానుగంటివారిమీద దెబ్బ యిది!

"పానుగంటివారు ఒప్పుకోకపోతే
పాముపంటిదానికి విరుగు డుంది.
ఇంద్రగంటివారి నడిగితే,
ఏమిటంటారో తెలుసునా?"

ఇంద్రగంటివారి మార్గాన్ని మన్నిస్తున్నారని చెప్పడం.

"పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం!
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
"మానిషాదగీతం"లో వున్నది!"

"శ్రీనివాసరావుగారిరకం కవిత్వానికి వాల్మీకివలె ఆదికవి" అని చెప్పడం.
ఈపైన చెప్పిన పద్ధతి "సర్రియలిజ" మని యీ క్రింది గీతంలోని తుది చరణముతో తెలుస్తున్నది!

"జీబ్రాకి, Algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్లూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం యిస్తే
వెర్రికాదు, sur-realism రా సోదరా!*

---

* 1939 సంవత్సరం మార్చి భారతిలో "పాతసీసాలలో కొత్తపానీయము" అనే శీర్షికగల వ్యాసంలో ఈయన అభిప్రాయాలను చూస్తే ఆయన యీ "రసం" తో పనిలేని కవిత్వానికే, "శబ్దానికీ అర్థానికీ సంబంధం లేద'నే వాదానికీ ప్రవక్త అని నమ్మటానికి వీలులేదు.

* "కొంటెకోణాలు" ప్రతిభ IV [170]

ఇది వీరి మార్గము. ఈ మార్గానికి వీరికి ప్రేరణయిచ్చిన విషయాలు చూడండి:

"Charlie Chaplain[1], Joseph Stalin[2]
Walt Disney[3], George Hugnet[4]
Greta Garbo[5]. Pirandello
ఇటీవల మా Inspiration
Sigmund Freud[7], Harold Lloyd[8]
Albert Einstein[9], Jacob Epstein[10]
హరీన్ చట్టో[11], గి. రాం. మూర్తి[12]
ఇటీవల మా Inspiration."◆

వీరి రచనలో హాస్యమూ, యితరులను వెక్కిరించడమూ, పియానో వాయింపువంటి నడకా, మనస్తత్వ శాస్త్రరహస్యాలూ, భౌతికశాస్త్ర విషయాలూ, చిత్తంవచ్చినట్టు భాష నుపయోగించడం, పూచీలేకుండా ఉండటం, మొదలైన విషయాలన్నీ కలిసి ఉంటయ్యని చెబుతున్నాడు. వీరికి యిష్టమైన విషయాల నీక్రింద రెండు గీతాలలో యిచ్చినాడు చూడండి:

కథాకాళీ [1] కూచిపూడీ [2]
జావానాట్యం, Russian Ballet, [3]
Jazz, Rumba, Carioca, [4]
హుషారిస్తాయ్, నిషాచేస్తాయ్.
Don Bradman [5] Mohan Bagan, [6]
Walter Lindrum, [7] Vines, [8] Codhet [9]

---

◆ 1. హాస్య సినీమా నటుడు 2.రషియా నియంత 3. హాస్యచిత్రకారుడు ( micky-mouse గాడు) 4. నవీనమార్గకవి, చిత్రకారుడు. 5 సినీమా నటి 6. గొప్ప యిటాలియన్ కధకుడు, నోబిల్ బహుమాన ప్రతిగ్రహీత. కొన్ని యీయన కథలు "Better think twice about it" అనే పేరుతో ప్రచురింపబడ్డై! 7. మనస్తత్వ శాస్త్రవేత్త. 8. ఈయన కూడ హాస్య సినీమా నటుడు 9. గొప్పభౌతిక శాస్త్రవేత్త 10. గొప్ప సర్ రియలిస్టు 11. హరీంద్రనాధ్ ఛట్టోపాధ్యాయ్, ( కమలాదేవి భర్త, సరోజనీ దేవిగారి తమ్ముడు.) 12. వాగనుశాసన గిడుగు రామమూర్తిపంతులుగారు.

కొంచెం Carroms, కాస్త Ping pong
ఒక కప్ కాఫీ, ఒక పఫ్ Cigrette."
వీరికి సంకేతాలు చాలా యిష్టం
"ఆట వెలది ద్విపద కత్తగారు.
5;3;2; ఆముక్తమాల్యద!"

వీళ్లు శబ్దప్రధానవాదులు. అలంకార ప్రియులు;

"తురాయికంటె! ఆ
క్షురాయికంటె, హిమాం
శురాయి గొప్పవాడు."
"..................................
హాంగ్ కాంగులో
కింగ్ కాంగుతో, ఒ
రాంగుటాంగ్ ఆడిన
పింగ్‌పాంగ్ లాగు!!! "

ఇందులో ఉపయోగించిన శబ్దాలనే మనము తీసుకొని వాటి పునరాగమనము చేత శ్రోత్రేంద్రియానికి కలిగే ఆనందముతో తృప్తి పొంది వీలైతే రస మనుభవించవలె! అనేక భావసమ్మేళనానికి వేరే యెక్కడికి పోనక్కరలేదు, ప్రతి శబ్దములోనూ ప్రతిబింబించే ఉంది.

చూచినారుగదా శ్రీ శ్రీ అతివాస్తవిక ధోరణి; ఆయన ప్రతిపాదించిన సూత్రాలున్ను, ఈ ధోరణి శ్రీశ్రీ అంటె ఉన్మాది అనే అభిప్రాయం కలుగ జేసింది. అయితే ఈతడు వ్రాసిన "మరో ప్రపంచం" అనే గీతం మంచి వ్యాప్తిలోనికి ఇతణ్ణి తెచ్చిందనవలె. ఇది ఒక విప్లవగీతం.◆ దీన్ని 1934 లో కవి రచించినా, 1940

---

◆ "మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకు
నదీనదాలూ, అడవులు, కొండలు
ఎడారులా మనకడ్డంకి?
పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం, పోదాం పైపైకి

ప్రాంతానికి దేశమంతటా వ్యాపించి, అపుడే మన దేశాన పొడసూపుతూఉన్న రష్యావ్యామోహంతో చేతులు కలిపింది.

రెండవ ప్రపంచ యుద్ధచ్ఛాయలు పొడసూపుతూ ఉన్న రోజులలో శ్రీశ్రీ ప్రవక్తవలె నూతనోత్తేజంతో 'బీభత్స కవిత్వం' చేసినాడు. అందుకు కవితాసామగ్రి ఎట్లాంటిది కావలెనో ఈక్రింది గీతాలలో వ్యక్తీకరించినాడు చూడండి :

"సిందూరం, రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులిచంపిన వేడినెత్తురూ
ఎగ రేసిన యెర్రనిజండా
రుద్రాలిక నయన జ్వాలిక
కావాలోయ్ నవకవనానికి."

పైవన్నీ ఎర్రని వస్తు సమూహమే! మిగిలినవి చూడండి :

'ఘాటెక్కిన గంధక ధూమం,
పోటెత్తిన సప్తసముద్రాల్
రగులుకొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం

---

పదండి త్రోసుకు
పోదాం,పోదాం పై పైకి!
కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం, వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?
దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు
బాటలు నడచీ
పేటలు గడచీ
కోటలన్నిటిని దాటండి!
ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా, చావండి!
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా, రారండి!
'హరోం హరోం హర, హర హర,
హరహర
హరోంహరా: అని కదలండి!
మరో ప్రపంచం
మహా ప్రపంచం
ధరిత్రినిండా నిండింది. . ."

చలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి.''

ఈక్రిందిది సంపూర్ణ బీభత్సం :

**"రాబందుల రెక్కల చప్పుడు,**
పొగగొట్టపు భూంకారధ్వని,
అరణ్యమున హరీంద్ర గర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్ర విరావం
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.''

ఇదంతా రెండవ యుద్ధపు భయంకర వాతావరణాన్ని సృజించి నట్టి కవిత్వం * ఏమైనా ఈ రెండు ధోరణులూ నవ్యాంధ్ర సాహిత్య రంగంలో ఎక్కువ

---

* నారాయణబాబు, కృష్ణశర్మ లీ నూతన కవిత్వధోరణులలో ఈతనికి కొంచెం తోడున్నారనవలె  దేశిరాజువారి ఈ క్రింది గీతంలో **యుద్ధఘోష** వినండి·

కదిలి కదిలి జ
గ మొక ఉద్ధృతతరగై
ఎగసి ఎగసి తక్షక
కాకోదరకాలకూట
విషాగ్నిజ్వాలై
మూలముట్టగా ముసరుచు
బుసబుస బుసబుస
పుక్కిలింతలై క్రమ్ముకరాగా
కుకుధరి కుకుధరి
కుఢికు కుఢికు ఢిం
ఢికు తకిటతకిట
ఢికుఢికు ధిధిలం
ధికుధికు సర్వం

కదిలి కదిలి జ
గమొక యుద్ధరంగమై
ధణాంధణధణధణాంధణ
ధిమింధిమి నినాదమయమై

కూలిన మానవఅస్థులమధ్యలో
మూల్గిన మూలుగు
నికృష్టజీవిత
నిరాశహేళీ
కరాళకృత్యం

3

కాళికగుడిలో
ఘంటలమ్రోతలు
చాముండీశ్వరి
శబ్దనృత్యమును
చండికదేవీ
శక్తిలాస్యమును
దుర్గామాయారౌద్రవర్తనము
ధ్రిగుడుధ్రిగుడుతక
ధిరుగుడుధిమితా!
దుగుదుగుతధిమిత
తొాధిరితొాధిరి బం

కాలం నిలువలేదని కనుగొంటాము. అందుచేతనే శ్రీశ్రీ 'సర్రియలిష్టు' గాను, బీభత్సవాదిగాను నెగ్గలేకపోయినాడని తెలుసుకుంటాము. అయితే తర్వాత తర్వాత రష్యా ప్రభావంచేత రాణకెక్కి అభ్యుదయవాదిగా పేరు ప్రతిష్ఠలూ, వ్యాప్తి గడించుతూ వచ్చినట్లు ముందు గమనిస్తాము.

# శిష్ట్లా ఉమామహేశ్వరరావు :

అతినవ్యులలో శిష్ట్లా అసాధ్యుడు. ఇతనికి 'మహేశ్వర్' 'వినాయక పండితుడు; 'ఉమా' 'విజయమహేశ్వరం' - మొదలైన పేర్లెన్నో ఉన్నవి. గుంటూరుజిల్లా మంచాళ అగ్రహారానికి చెందిన ఉత్తమ వైదిక కుటుంబంలో (1912 ?) జన్మించినాడు*. ఈతని జీవితము, చిత్రమైనది; 'విశృంఖల విహారము' ఎక్కడా నిలకడ అంటూ లేకపోవడం - కారణాలుగా యువకవులలో ఎవరికీ లేనన్ని స్వేచ్ఛా జీవితానుభవాలితనికి లభించినవి. ఈతని ప్రతిభ అద్వితీయమైననది : హాస్యప్రియుడు, మంచి మాటకారి. కళాశాలల్లో పనిచేసి విద్యార్థులతోను, 'ఫరమ్సు'లో (బొంబాయి) పనిచేసి ప్రజలతోను,మిలటరీలో పనిచేసి సిపాయీలతో ఇంకా ఇతరులతోను ఈతడు సంపాదించిన అనుభవం విచిత్రమైనది. అది యితని రచనలలో సర్వత్ర కన్పిస్తూనే ఉంటుంది. నూతన ఛందస్సులలో, ఇతడు కొత్తభాషతో, సులభంగా అందరికీ

---

ఖదను త్రొక్కినది రా  
క్షసకృత్యం  
ఎగసిమండినది  
మారణదేవీకరాళజిహ్వక  
కుప్పలు కుప్పలు  
దుగుతక తధిగిణతకతోం!  
మారుమ్రోగినది  
లోకంబంతట  
మహాలయంబున లయోత్సవం!  
అంతా వేదన! అంతా నాశనం!

* ఈ కవి అనూచాన సంపదకల ఉత్తమ వైదిక కుటుంబములో పుట్టాడు. పురాణగాథలు చాలా చదివాడు. Folk-lore, folk songs మీద పెరిగాడు. దివ్య జ్ఞాన సమాజ తీర్థయాత్రలు చేశాడు. ఒకానొక యతివద్ద కొంత శుశ్రూష చేశాడు జ్యోతిషంలో ప్రవేశం వుంది. అధ్యాత్మ రామాయణ కీర్తనలంటే అత్యంతప్రీతి. వాగ్గేయకారకుల కృతులు వల్లెవేశాడు. Rythm అనేది ఇతనికి అభిమానపదం. కాశీ ప్రయాగ సకలకళా పరిషత్ పుస్తక భాండాగారాలలో బాగా దానా వేసుకున్నాడు వయస్సు ఎక్కువ లేకపోయినా విచిత్రమయిన అనుభవాలు పొందాడు కొన్ని సందర్భాలలో గుండె బిగుతుకలవాడు - తరుచుగా గుండెజావ! ఒకప్పుడు ఇతనికి తర్కదృష్టి వుంటుంది. మరొకప్పుడు తన కేదితోస్తే అదే . . . " - శివశంకరశాస్త్రి

అంతుపట్టని కవిత్వం చెప్పినాడు. ఆంగ్లములో ఎం.ఏ అయి ఆ కవితారీతులన్నిటినీ పరిశీలించి జీర్ణించుకున్నవాడు. 1931 నుంచే ఇతడాధోరణులలో రచనసాగిస్తూ వచ్చినట్లు తెలుస్తుంది. 1938 దాకా అజ్ఞాతంగానే ఉన్నాడనవలె. అయితే నోరి వారన్నట్లు 'రచనముందా, వెనుకా అనే విచారము ఎట్లా ఉన్నా సంపూర్ణమైన నవ్యత్వమున్న కవి ఇతడే'. ఇతనికి రాదగిన ప్రసిద్ధి రాకపోవడానికి తాను అందుకు యత్నింప పోవడమే కారణమనవలె. 1938 లో "విష్ణుధనువు"◆ 'నవమిచిలుక' లనే పుస్తకాలను ప్రచురించినాడు. 'శాంతిని' అనే పత్రికను కొద్దికాలంపాటు గుంటూరు నుంచి సంపాదించినాడు; తర్వాత తర్వాత పత్రికలలో కథలు, పాటలు ప్రచురిస్తూ వచ్చినాడు. -ఈతని "విష్ణుధనువు" విచిత్ర ఖండకావ్యసంపుటి. "ఇందులో ప్రేమ ఉద్భ్రాంత ప్రేమ" 'ప్రేమ అంటే ఆత్మ నిర్వాణముచే ఆరాధించుటయే' అంటా డితడు. దీనిలో ఉన్న నవ్యతను గూర్చి, వైచిత్రిని గూర్చి, కవి ప్రతిభను గూర్చి ప్రస్తావిస్తూ తల్లావజ్ఝల, విశ్వనాధకవులు -ఈయువకుని వీపుతట్టి గుణదోషాలను ఎన్నినారు† అతినవ్యతకు ఇతని రచనలలో కొన్ని పాదాలను ('విష్ణుధనువు' లోనివే.)

---

◆అందరిదీ ఒకత్రోవ, ఉమామహేశ్వరరావునిది ఒకత్రోవ! నాకు తెలిసినంతలో అతినవీనమార్గంలో మొదట నడిచినవాడు ఇతనే. ఇతని భావన బహుముఖాల పరుగెత్తి ఎక్కడెక్కడి విషయాలో ఏర్చి కూర్చుతుంది. ఇతని పంక్తులలో ఎన్ని ఉపమానాలు, ఎన్ని ఉత్ప్రేక్షలు, ఎన్ని రూపకాలు కిటకిటలాడుతున్నవి! ఒక విధంగా ఇది ఎంత సృష్టి. ఉపజ్ఞ, ఉద్రేకము, అతినవత్వమూ, అభిలషించేవారికి ఈ కావ్యసముచ్చయమువల్ల కడుపునిండి తీరాలి -తల్లావజ్ఝల

† విశ్వనాథవారి వాక్యాలివి:-

"కవి గొప్ప ప్రతిభావంతుడు మనస్సులో జరుగుకొన్ని వికారములు ఉన్మేషములు ఇంత చక్కగా ఆరోపించిచెప్పుట మిక్కిలి కష్టమైనపని చూడండి:

'దాగుడు మూత పడవీ మనస్సంచారములు
కల్తెర పెట్టిన తెగవు. ఎక్కడ కేగుచుంటిరని
పోవునప్పుడడిగిన నవి పకపక నవ్వు అక్కడ
ఏమి చేసితిరన సిగ్గుచే లోనికి
జొర్తురు. వెంటనే యుప్పెన వచ్చినట్లు మహా
ర్ణవమి పిల్లలవలె అల్లరి చేతురు'

.. ఈయన కవిత్వములో మాత్రాప్రస్తావన లేదు. పాదనియమములేదు క్రొత్త పాదము మొదలు పెట్టినపుడు సర్వత్ర విశేషార్థద్యోతకముగా మొదలు పెట్టబడిందని చెప్పుటకు వీలు లేదు కాని ప్రతిగీతంలోను ఒకపూవు వుంటుంది. ఆ పూవు మధ్యమధ్య విరిగిపోతూ వుంటుంది'. . ఈయన భావములు, ఈయన సంస్కారం, ఈయన భావనా శక్తి, ఈయన కవితాశక్తి పరమోత్కృష్టస్థితిలో వున్నవి. కాని వీని నన్నింటికి భాషాలోపము ఒకటి వున్నది."

"ఉమా మన సంగీతమూ తెల్లవారి సంగీతమూ తెలిసినవాడు కావడంచేత కొంత విపరీత మార్గంలో విహరించినాడు, రచనలో Formal beauty ఇతనికి ఇష్టంకాదు ఎంతసేపటికీ ఇతను వక్రగతులలో, ఊపులో, లయలో లాస్యం చేస్తాడు . -తల్లావజ్ఝలవారు

ఉదాహరణలుగా చూడండి:

ఇటు వెన్నెల అటు వెన్నెల
నడి శిరసుకు శ్రీ వెన్నెల
ఇటు వెన్నెల అటు వెన్నెల
చిరునవ్వుల కల వెన్నెల
ఇటు వెన్నెల అటు వెన్నెల
నిరులల్లిన జడ వెన్నెల

ఇట్లా ప్రారంభించి పదహారు పాదా లయ్యేసరికి-

ఇటు వెన్నెల అటు వెన్నెల
పిచ్చెత్తే వళ్లంతా నెర్రెత్తే దిక్కులకై పరుగెత్తే నామనసున
వెన్నెల్లో ప్రేయసి లేక
అమావాస్య! అమావాస్య! అమావాస్య

# మహాలయ అమావాస్య!

"భావకవిత్వపు బాటలలో నడిచిన ఉత్తమభావుకుడు శిష్ట్లా. అయితే పదకవితపైన హెచ్చుగా మోజుకలవాడనవలె. భాషా భావాలలో అతి నవ్యధోరణి తెచ్చి పెట్టడానికి, నవ్యఛందస్సులను నడిపించడానికి ఉద్యమించిన వారిలో శిష్ట్లా ప్రథముడని మరువరాదు.

అతి నవ్యులలో ఒకడయిన 'నారాయణబాబు' ఏమని అంటున్నాడో చూడం డితనినిగూర్చి :

"ఈనాడు అతి నవీనులమని బోరవిరుచుకు తిరుగుతున్న అతి నవీనులకు కూడా నవీనుడు శిష్ట్లా . ఏనాడో అతినవీనమైన మార్గంలో కవిత్వంరాసి లోకం చేత

---

‡ ఇదివరకు చూచిన శ్రీ శ్రీ గీతాలలోవలెగాక ఇందులో సంపూర్ణ పరిణామం, అను స్యూతార్థమూ ఉన్నది. కాని యింత తొందరలో ఆశంతా నిరాశ కావడానికి తగిన కారణం? ఇతని కవితలో భావచిత్ర, యథాదర్శన, సాంకేతిక, భావిభావన, నగ్న మొదలైన అన్ని మార్గాల చిహ్నాలూ కనపడుతూ ఉంటవి." - కురుగంటివారు.

పై గీతమును చూచి 'ఇటువంటి కావ్యం నిజమైన కవిగాని వ్రాయలేడ'న్నారు నోరివారు ప్రతిభలో.

విస్మరింపబడ్డాడు, అతి నవ్యకవిత్వం ఎన్ని కొత్తపోకడలు పోగలదో అన్నిటినీపోయి చూచాడు-భావకవిత్వం నుంచి అధివాస్తవికతవరకు.

కవిత్వంలో యీయన ప్రత్యేకత ఏమిటంటే పదాల పునఃసృష్టి (Re-creation) కోసం ప్రయత్నం చేశాడు. ఆదిని పదాలు స్ఫటికాల (Craystals) లాగ, బహుముఖాలతో, జీవన చైతన్యంతో, నిండుగా కవులను పులకితం చేసేవి. రానురాను పాతపడి, అరిగిపోయి, అందరి నోళ్లాపడి, అర్థం తూచుకొనే గుండురాళ్లలా తయారయాయి.. యీమర్మం తెలుసుకున్నది శిష్ట్లాకవిత్వం.''

ఉమామహేశ్వర్ ప్రచ్ఛన్న ప్రవక్తృత్వా ప్తి ఎవరింకా కాదనగలరు? శిష్ట్లా వ్రాసిన "సిపాయి కథలు'' వస్తువులోను, కథనములోను నవ్యమార్గానికి చెందినవై ఆంధ్రకథానికా సాహిత్య విచార సందర్భాన మంచి స్థానము గడించి పెట్టేవిగా ఉన్నవి. ఈతడు వ్రాసిన "కాళింగి పాటలు''న్ను తెలుగుపద కవిత్వానికి నూత్నాలంకారాలనదగినవి. పిల్లలకోసమని ఈయన వ్రాసిన పాటలు, కథలు పత్రికలలో ఎన్నో ప్రచురితమైనవి గణింపదగినవి. అయితే ఏమి? నవ్యత ఉన్నంతగా నాజూకు లేక పోవడము మూలాన, ప్రతిభ ఉన్నంతగా భాషాపాటవం, ప్రాపకమూ లేక పోవడము మూలాన ఇతనికి ప్రాచుర్యము తన జీవితకాలానే లభించక పోయినదని చెప్పవలె. (భారతి జూన్ 1946)

"ఉమా "విష్ణుధనువు''లో దేశంలోని సమ్యక్ దృక్పథానికి దూరమై, నిద్రాణమై, నిర్వేదయూసనైన, అశాంతి, అసంతృప్తిని, నిశీథ సౌందర్యమూర్తిగా దర్శించాడు''

-దేశిరాజు కృష్ణశర్మ [ప్రతిభ]

"ఇతనిది శ్రీ శ్రీ, నారాయణబాబు, ఇత్యాదులదివలె ఎక్కడనుంచో వచ్చిన కవిత్వంకాదు. తెలుగుగడ్డలో పుట్టి తెలుగుజీవితంతో పెరిగిన నవ్యకవిత్వ మితనిది''

-నోరి నరసింహశాస్త్రి [ప్రతిభ]

# శ్రీరంగం నారాయణబాబు

అత్యంతాభిని వేశంతో అధివాస్తవిక ధోరణిని (ఇతడే 'అధి' అన్నవాడు) రచనలద్వారా, సభాముఖానా ప్రచారం చేసిన అతి నవ్యుడు నారాయణబాబుగారు. ఉత్సాహము, ఉద్రేకము కొరవడని స్వేచ్ఛాజీవి యితడు. ఉక్తిలో వలెనే వేషంలోను ఇతడొక విలక్షణవ్యక్తి. ఆ గిరజాలజుట్టూ, ఆ చుడేదారీపైజామా, ఆ ఆటగోటుతనం - ఆవీ చూస్తే ఇతడొక విచిత్రవ్యక్తి అనిపించి తీరుతాడు. ఈతడు కూడా 'కవితా సమితి' సభ్యుడుగా ఉన్నపుడు మొదట్లో భావ కవి త్వవు బాటలలో నడిచినవాడేనని తెలుసుకుంటాము. అయితే 'అందులో నల్లమందు తన మున్నదని, గ్రహించి విసర్జించాడట, ఆ మార్గాన్ని. 1928-29 నాటి కీతడు నవ్యమార్గగామిగానే ఎలా అగుపిస్తున్నాడో చూడండీ, 'వలపు చెలమలు' అనే ఖండకావ్యంలో:

"మనకు సహకారి యగుచు మన్మధుడు వెదకి
వాడియలుగుల గాడి త్రవ్వంగ క్రొత్త
వెలమ లేర్పడి తేటలౌ జలములూరె
సలలితములైన యీతీపి వలపు చెలమ
లందు తేరినయవ్వి శ్రీ చందనోప
మానురాగ సుధాగంధిలామల ప్ర
సన్న పావనతోయ`ుల్ సకియ! యవియు
నింకిపోవును నీవు గ్రహింపకున్న"

తర్వాత తర్వాత ఈతడు క్రమంగా వాస్తవిక-అధివాస్తవిక-బీభత్స-అభ్యుదయ ధోరణులలో రచనలను సాగిస్తూ వచ్చినట్లు గమనిస్తాము. అతివాస్తవిక మార్గాన ప్రవక్తృస్థానము గడించే.విషయములో శ్రీ.శ్రీ, నారాయణబాబు లిద్దరూ అహమికలతో నడచినవారని మాత్రం మరువరాదు. అయితే శ్రీ.శ్రీ. కి మంచి

ప్రాచుర్యం లభించడంమూలాన,ఇతనిరచనలు *బహుళంగా పత్రికలలో ఆ దినాలలో రాకపోవడం మూలాన తగినంత ప్రచారమూ, ప్రోత్సాహమూ ఇతనికి లభించలేదు. అయితేనేమి? ఛందస్సులలో స్వేచ్ఛా, భావాలలో పాశ్చాత్య (రష్యా) వ్యామోహం, తెలుగు కవిత్వంలో అతి నవ్యతను తీసుకురావలెననే ఉబలాటము పట్టుదలా, ఇతని రచనలలో బాగా కన్పిస్తవి. శ్రీశ్రీ మరోప్రపంచాన్ని దర్శించి ఇట్లే ఇతడు రష్యా

---

* భావకవిని హేళన చేస్తూ ప్రకృతిలో బీభత్సాన్ని దర్శిస్తున్న ఈతని గీతం చూడండి:

"మృత్యు వొసంగే
మాతృ కరమ్ముల
విధవ కానుపు
పెదిమల
వెలుగై వెలిగి
నలుపెక్కిందీ సంధ్య!

ఖేదం రేపీ
రోదసి నిండి
విశ్వగళమ్మున
హాలాహలమై
విస్తరిల్లినవి
చీకటులు!

నల్లని త్రాచుకోరలు,
తెల్లని మసూచికుండలు
గగనమ్మున
తారలు!
జట్కాగుఱ్ఱం
కాలంమెళ్ళో
గంటలు రెండు
మ్రోగినవి!

మియాలంటూ
చచ్చిన తల్లిశవం
మెళ్ళో గజ్జెల

పట్టిడలో
ఉల్లాసంగా
ఆడుకొనే
పసిపిల్లడులా
గాలి!

ఒళ్లు తెలియని
పుళ్ళ బాధతో
వెక్కి వెక్కి
ఏడ్చినది
చుక్కల ఆకాశం!

సద్యో ఫలితం
విద్యుద్దీపం
వెలుగున
గదిలో
ఖ్యాతిగడించే

గీతం వ్రాసి
ప్రేయసి కంకిత

చేతులు నులుముతు
కూచున్నావ!

(ఆంధ్రపత్రిక సం.సం. 1928-2

పిలుపువిన్నాడు చూడండీ గీతంలో :

"రక్త పతాకం
 శక్తి నాలుక
అగ్నికిరీటం
 ఆకాశమున
మునిమాపు
 కేకలువేస్తూ
పిలిచింది !" - 'సామిధేని'లోనిది

ఈతని 'రుధిర జ్యోతి' అనే ఖండికలను (పత్రికాముఖాన వెలువడిన వాటిని) గనుక చూస్తే, శ్రీ. శ్రీ కి తీసిపోని సహచరి అతివాస్తవిక ధోరణిలోగాని, బీభత్స ధోరణిలోగాని ఇతడున్నాడని గుర్తింపజేస్తవి. శ్రీ శ్రీ. కి లేని ఉపన్యాసధోరణి ఇతనికుండడము విశేషము: గేయాలను శ్రావ్యంగా పాడి సభ్యులను ముగ్ధులను చేయడంలోను ప్రజ్ఞ గడించినవాడీ నారాయణబాబుగారు. పాఠకులలో అద్భుతాశ్చర్యాలనూ భయోత్పాతాన్నీ కల్గించే శక్తి ఈతని కలానికి ఎంతైనా ఉన్నది. కవితా ధోరణులను గూర్చి వాదించగల తార్కికుడు కూడా. వీరి అతివాస్తవిక ధోరణిపైన వచ్చిన విమర్శల నెదుర్కొంటూ ఈతడు తెలియజేసిన అభిప్రాయాలను గమనించండి :

"అతివాస్తవికత నాస్తికమైన తిరుగుబాటు. అన్నీ శూన్యంలో ఆఖరు అవుతాయి. చివరకి అతివాస్తవికతకూడా శూన్యంలోనే ఆఖరు అవుతుంది." అని అంటున్నారు. (పాలగుమ్మి పద్మరాజుగారు)

ట్రిస్టాన్ జారా అమలులోకి తెచ్చిన డాడాయిజమ్ వీరు చెప్పిన నాస్తికత్వం సాధించేందుకే పుట్టింది. డాడాయిజమ్ అంటే విధ్వంసం (Negation). అలా ప్రారంభమై అల్లకల్లోలం గావించడం తోనే, అందులో కొందరు బుద్ధిమంతులు, వారిలో ఆంద్రేబ్రిటన్ ఒకడు, కేవలం విధ్వంసంవల్ల ప్రయోజనం హుళక్కియని విరమించుకొని, డాడాయిజమ్‌కు ఎదురుతిరిగి విధ్వంసధ్వంసం (Negation of Negation) కింద యీ అధివాస్తవికతను అవలంబించారు.

అధివాస్తవికత సాహిత్యంలో తెరువబడిన మంత్రకవాటం. ఫ్రాయిడ్ సిద్ధాంతాలు, మార్క్సుసూత్రాల కలయికలో పుట్టిన క్రమగానం. సాహిత్యంలో ఒక నూతనదృక్పథం. మతాలలో అద్వైతమతం ఎల్లాంటిదో, సాహిత్యమతాలలో అధివాస్తవికత అల్లాంటిది. వాస్తవికత నిర్గుణంలాంటిది. బ్రహ్మపదార్థాన్ని శూన్యమనగలమా? ఇది శబ్దబ్రహ్మను అందుకునే ప్రయత్నం. అందుకో లేకపోతే వ్యక్తుల శక్తికాని ఆశయం లోటు ఎంతమాత్రం కాదు....

"అతివాస్తవికత మనకు కావాలంటే, వెఱ్ఱివాళ్ళదగ్గరకు, త్రాగినవాళ్ళ దగ్గరకు పోవాలి" అంటున్నారు నిజమే. స్వచ్ఛందమైన అజ్ఞాతమనస్సు విహారం చేస్తుంది. కాని వెఱ్ఱివానికి కవికి వ్యత్యాసం ఉందంటే కవి కావలసినప్పుడు, వెఱ్ఱిని తెచ్చుకొని ఉపయోగంతీరాక, అరికట్టుకోగలడు. వెఱ్ఱివాడు అట్లా చేయలేడు. . . . . . .

పాల్ఇలార్డు, అధివాస్తవికులకు గురుతుల్యుడు. తెలుగు దేశంలో అధివాస్తవికులుకూడా యీయనమతం ప్రయోజనం కలిగినదని నిర్ణయించుకొని స్వీకరించారు. ఈయన పద్యాలు ... ... కట్టుబొమ్మలు కావు. పరంజ్యోతికి కీనీడలు. చర్మచక్షువుతో, పరంజ్యోతిని చూడలేము. గాబట్టి, నీడనుంచి వెలుగును దర్శించే అవకాశాలు కలిగించిన మహాకవి.

తెలుగుదేశంలో అధివాస్తవికత పుట్టి ఎంతోకాలం కాలేదు. పుట్టడమే బాలారిష్టాలతో; తెలుగుదేశపు అధివాస్తవికతయొక్క మూలం అన్యదేశాలమీద ఆధారపడ్డా, అన్యదేశాలలోని అధివాస్తవికతకు, తెనుగుదేశం అధివాస్తవికతకు ఎన్నో తేడాలున్నాయి. ఏ నవీనమైన సిద్ధాంతమైనా ప్రవేశపెట్టేటప్పుడు, దేశకాల పాత్రల ననుసరించి ప్రవేశపెట్టాలి కాబట్టి. లేకపోతే మొక్క మొలవదు.

* * *

కొంతమంది స్నేహితులు అధివాస్తవికతను అపస్మారం అని అంటున్నారు కాదు క్లోరోఫారం అంటున్నాం మేము. ఒకప్పుడు భావకవిత్వం చెప్పి, దాంట్లో నల్లమందుతనం ఉందని గ్రహించి విసర్జించాం. తదుపరి, వాస్తవికపద్ధతులలో సామ్యవాదపు బాటలలో అభ్యుదయ రీతులలో, నా 'రుధిరజ్యోతి'లోని గీతాల

రచింపబడ్డాయి. అధివాస్తవికత సాహిత్యంలో ఒక దృక్పథమని మొదటే మనవిచేశా. దీనివల్ల మానవునకు సంఘానికి శ్రేయస్సు కలదని నమ్మి రచన సాగిస్తున్నాం. ప్రయోజనం లేదు అని తెలియకుండా దీన్ని విసర్జించేందుకు ఎంతమాత్రం మాకు ఇష్టంలేదు

వాస్తవికత ఛాయాచిత్రంలాంటిదైతే, అధివాస్తవికత x'ray ఛాయాచిత్రం లాంటిది."

-ఆంధ్రపత్రిక (24-12-1944)

పైవాక్యాలలో అధివాస్తవికతను అద్వైతంతో ముడిపెట్టుతున్నాడీయన. అద్వైతం - శబ్దబ్రహ్మ - మంత్రకవాటం మొదలైన పదాలను వాడినాడు. నిజానికివి ఈ మార్గవర్తులకు అచుంబితాలే అని చెప్పవలె. "అధివాస్తవికత" విజాతీయమైన ఉద్యమమేననీ, తాము తెలుగులో తెచ్చి నాటడానికి ప్రయత్నిస్తున్నామనీ, అయితే బాలారిష్టాలకు గురి అయి ఈ ధోరణి తెలుగుదేశంలో ఆదరణ పొందలేక పోతున్నదనీ పై వాక్యాలలో ఈయన స్పష్టము చేసినాడు; శ్రీ. శ్రీ.గారివలెనే నారాయణబాబుగారు కూడా అధివాస్తవికధోరణిని విసర్జించి తర్వాత కాలంలో "అభ్యుదయమార్గ" గామియైనాడని గుర్తిస్తాము.

## పఠాభి ·

నవ్యులను, అతినవ్యులను తలదన్నిన మేటి అహంభావకవి ఈతడు. తాను వ్రాసిన 'ఫిడేలు రాగాల డజన్' అనే వచన పద్య సంపుటిని ప్రకటించి ఒక తీవ్రసంచలనాన్ని, నవ్యసాహిత్యలోకంలో కల్గించిన నవ్యాతి నవ్యుడితడు. ఈ పుస్తకాన్ని చూసిన వారంతా దిగ్భ్రాంతులైనారు. ఈతని రచనలలో 'అహం' బాగా అగుపిస్తుంది; తనను గురించి 'ఆత్మకథ'లో చెప్పుకున్న రీతి చూడండి; ఈ విషయం అవగతమౌతుంది :

పయిజమ్మాలు వేస్తాను కాబట్టి
నన్ను మీరు షోదాయని సోషలిష్టని
తిట్టబోకండి. ప్రఖ్యాతంగా నున్న
కవిన్నేను ; . . .

తన కన్నులలో టెలిస్కోపులు, మయిక్రోస్కోపులూ ఉన్నవంటాడు. పద్యం అంటేను, వ్యాకరణమంటేను, సుతరాం గిట్టదితనికి. చూడండేమంటాడో -

"నా యీ వచన పద్యాలనే దుడ్డు కర్రల్తో
పద్యాల నడుముల్ విరుగ దంతాను !"

చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను ! తానే స్వయంగా చెప్పుతున్నాడు చూడండి - తన స్వేచ్ఛను గురించీ, దొంగతనాన్ని గురించీను :

"ఇంగ్లీషు భాషా భాండారంలోనుంచి
బంది పోటుంజేసి కావల్సిన
మాటల్ను దోస్తాను,
నాయిష్టం వచ్చినట్లు చేస్తాను,
అనుసరిస్తాను నవీనపంథా, కాని
భావకవిన్మాత్రం కాన్నే
నహంభావ కవిని"

రచనలో, భావంలో, వర్ణక్రమాన్ని మార్చడంలో అతివాస్తవికులు (పాశ్చాత్యులు) సూచించిన సూత్రాల ననుసరించిన వాడితడు ; ఉక్తిలో అలంకారాలలో కవి సమయాలలో, 'కొత్త పాషన్లు' తెచ్చిపెట్టుతున్న పద్ధతి చూడండి :

"క్రాస్వర్డు పజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వు చేసే మహాభాగ్యం
ఏ మానవునిదో కదా !"

"ఓ బోగంచానా! నీవు
సంఘానికి వేస్టుపేపరు బాస్కట్టువా ? "

"శశీ ! . . . . . . కన్పిస్తావు నీవు, స్పన్సరు కంపెనీ
లేక వయిటువేసులోకీ
దారితప్పి ప్రవేశించి
తందరాడుచున్న దరిబేసి గ్రామస్తున్లాగ !"

ఇంగ్లీషు పదాలను తెలుగులిపిలో వ్రాయడము, తెలుగు వర్ణక్రమాన్ని అచ్చులో వింతగా మార్చడము, అతినవ్యధోరణికి చెందినవే ఈతని రచనలలో కన్పిస్తవి ; (Tricks with in-offensive print) చూడండి :

"అన్ యోన్యమగు దమ్పతులు కూడ"

"మ్యారేజ్జేసుకొన్నావు గదా !

స్వీట్ హార్ట్ !"

అన్నిటా క్రొత్త దనాన్ని ఆకాంక్షించే ఈ అతినవ్యుల్ని దర్శించినాము. ఛందస్సులు వీరిపాలిటి చండశాసనాలు. 'వైచిత్రే' *వీరి దృష్టిలో సౌందర్యం ; 'పఠాభి' గారి పుస్తకానికున్న 'ఇంట్రో'లో ఈ క్రింది శ్రీ.శ్రీ. వాక్యాలను గమనించండి. వీరి విశృంఖలత్వం తిరుగుబాటు లెంతటివో గోచరిస్తవి :

"కవి సర్వతోముఖ స్వాతంత్ర్యదూత. స్వేచ్ఛాదాత. అవ్యయం అనాచ్ఛాదితంగా, ఆకాశమధ్యలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా షికారుపోవచ్చును. ప్రతిఫలం విచిత్ర సౌందర్యం. విచిత్రమే సౌందర్యం ! సౌందర్యమే విచిత్రం ! ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది. కవిహృదయంలోని రాగాలాపన యెట్టి తీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలె . . . నవకవికి అనుకరణ అసహ్యం. క్రొత్తశక్తులు క్రొత్తరూపంలో సాక్షాత్కరించాలి. ఇవన్నీ ఋణపక్షాన నవకవుల తిరుగుబాటు . . ."

"ఫిడేలు రాగాల డజన్" తోనే 'పఠాభి'కి కీర్తివచ్చింది. అంతే! మళ్ళీ ఇతడు సారస్వతరంగంలో అయిపేలేడు.

## పిఠాపురం యువరాజు :

అతి నవ్యులలో ఈయన (రావు వేంకట మహీపతి గంగాధర రామారావు) గారు పేర్కొన తగినవాడు. ప్రాచీన నవీన కవితా ధోరణులను బాగా జీర్ణించుకొన్న రసజ్ఞుడీ యువరాజు. అందుకనే అతివాస్తవిక ధోరణిని ప్రవర్తిలజేస్తూ ఉన్నప్పటికీ

* ఈ సందర్భాన పా. పద్మరాజుగారి "కవిత్వము - వైచిత్రి" (ప్రతిభ 7 సం॥) అనే వ్యాసాన్ని చూడండి.

ఈయన గ్రంధాలలో ఆయాఛాయలు పొడసూపుతూ ఉంటవి : 'చినుకుల చిందుల' నే ఖండకావ్య సంపుటిలో 'ప్రేమలేఖ' ఒకటి ఉంది. అందులో దీ పద్యము !

మధుర రసమును మఱపించి మగతనిచ్చు
నధరవీధిని నేఁగ్రోలు నమృత రసము
భవ్య భవదీయ పరిరంభ బంధనమున
మేను మఱతును నిత్యము తేనెవాన"

భావకవిత్వ ధోరణి ఇలా ఎన్నిటనో కన్పిస్తుంది. ఈయన రచనలలో. ఇలాగే ప్రాచీనధోరణిలో పద్యాన్ని చెప్పిన సందర్భాలూ ఎన్నో అగుపిస్తవి. చూడం డీ క్రింది పద్యం ఉదాహరణకు :

అది నానావిధ పుష్పశోభితము నవ్యానన్య సందేశమున్
అది స్వేచ్ఛా జలయంత్ర పోషితము సేవ్యానంద సామ్రాజ్యమున్
అది జ్యోత్స్నాపరిరంభ జృంభితము దివ్యారామ రాజేంద్రమున్
అది సామ్రాడ్హృదయోద్భవామృతము దేవారాధ్య సుక్షేత్రమున్.

పూర్వ భాగములో ఉల్లేఖించుకొని నట్లుగా ఈయన కృష్ణశాస్త్రి - శ్రీ. శ్రీ.ల ధోరణులలో కవిత్వం చెప్పిన ఉత్సాహి. 'ప్రతిభ' 'భారతి' మొదలైన పత్రికల ద్వారా ఈయన రచనలు వెలువడడమే కాక, గ్రంథరూపంకూడా దాల్చినవి. 'చినుకుల చిందులు' - 'నామరహితం' - "తీరనికోరిక - తర్వాత" - స్వార్థత్యాగము' - "ఆలోకము నుంచీ ఆహ్వానము" "సువిశాలమిచం విశ్వం - అన్న వీయన గ్రంధాలు. ఈయన కావ్యాలలో ఊహ - మనస్తత్వం - ప్రధానముగా చిత్రింపబడి ఉంటవి; విరోధాభాసాంలకారాన్ని ఈయన ఎక్కువగా ఆదరించినాడు; పాశ్చాత్య ధోరణులను

చక్కగా పుణికి పుచ్చుకొన్న అతినవ్యుడు*. ఉక్తిలో నైశిత్యము, భావములో గాంభీర్యమూ - అగుపిస్త పీయన రచనలలో. "మంటలు-శ్మశానం - స్వేచ్ఛ - " మొదలైన భావాలమితంగా కన్పిస్తూ ఉండడము మూలానా, వచనపద్యాలను ప్రవర్తిలచేసిన ఆద్యులలో ఒకడు కావడం మూలానా, అతి వాస్తవిక కవులలో చేర్చుకోవలసివచ్చినది. అయితే తర్వాత దశకానికి (1950) ఈయన కవితారంగానికి దూరమై పోయినాడని గమనించగల్గుతాము.

## మరికొందరు :

ఈ అతి నవ్యమార్గములో పై అయిదారుగురే కాక అనేక యువకులు తన్మార్గానువర్తులున్నారు. వీరిలో ఏలూరు సాహిత్యమండలికి చెందిన బి.వి. సింగరాచార్యగారొకడు. ఛందస్సులలో స్వేచ్ఛా, భాషలో 'మణిప్రవాళమూ' పదప్రయోగాలలో వైచిత్రీ రచనలో సంకేతాలు అభిలషించిన వారిలో ఈయన కూడ చేరుతున్నాడు; అయితే భావకవిత్వధోరణే హెచ్చుగా కలవాడని చెప్పుకొనవలె.

---

* 'నామరహితం'లో గంగాధర రామారావు గారు (కర్త) మొదట్లో వ్రాసిన ఈ వాక్యం చూడండి :

"పద్యం గద్యం కాకుండా వింతయైన సంగీతంలో క్రొత్తభావాలు పెంచి మూడునూటల్లో ముప్పదితళుకులూ, మూడువందల హ్రాద్భావాలూ చూపించాలని యత్నించాను. తృప్తి కలుగ లేదు "

దీన్నిబట్టి ఈయనవి కూడ వచన పద్యాలని తెలుస్తున్నది.

పై గ్రందము అతివాస్తవికకవితకు చెందినది .. .. .. ఈ గ్రంథము మొదట నుంచీ చివరవరకు చదివితే ఈ కవి జీవితములో ఏదో ఒక ఆవేదన ఉన్నట్లు పొడగట్టుతుంది. ఆ ఆవేదనే కవి సృష్టిపై మనకు సానుభూతి కలిగిస్తున్నవి . ఈ కవి భాషలో కూడా (అంటే ఛందస్సులోనే కాకుండా అని) కొన్ని విచిత్రాలు చేయక విడిచిపెట్టలేదు . . . ఇటువంటి స్వాతంత్ర్యాలు . లేకుంటే ఈ కావ్యము మామూలుపద్ధతిగానే ఉండేదేమో? అలా ఉండాలనే కవి ఒకదారీ తెన్నూ లేకుండా భాషను అధ్వాన్నముగా వాడినట్లు తోస్తుంది కొన్నిచోట్ల పులుసుడు ఎక్కువగా ఉన్నది . . మొత్తముమీద ఈగ్రంథము విచిత్ర మయింది .. "

-ప్రతిభ 6వ సంపుటి

ఈక్రింది గీతాలు చూడండి :

"నా Sweet-heart నల్లని రూపుకి
తెల్లపట్టు Saree సొగసు
ఆ గుండ్రని నల్లకలువ Face
ఆ Face లో తెల్ల కలువ Eyes !
అలా అలా వస్తూ వస్తూ
కల కల కల నవ్విందంటే
నా ముద్దుకి ముత్యాల్ హారాల్
నా Mystic Beauty muse కి
నా కవితకు చక్కిలిగింత !
నా అందం తెలిసిన కళ్ళకి
Color - effect తెలిసిన కళ్ళకి
అసలు తనే నల్లనిది గదా -
'ఆ Nasty నల్లని Saree ని
అస లెవ్వరికైనా ఇచ్చెయ్
అంటే - మా ఆవిడ వినదే !
ఆ మాసిన నల్ల మసిష్టం
లో తానే కనబడకుండా
తయ్యారై వచ్చి మెల్లిగా
గదిలో Light ను తగ్గిస్తే
ఎల్లాగుంటుందో బోలో
ఈ Beauty worshipper కి*

ఈ గీతములో ఒను స్వ్యాతార్థమున్నది; 'ప్రేయసి గొడవ' ఉంది; కొద్ది హాస్యమూ ఉంది. అంతవరకు 'రొమాంటిసిజమే'. రచనలో సంపూర్ణంగా నవ్యత

* Vibgyor -ప్రతిభ సంపుటి 6

ఉంది. ఉక్తిలో వైచిత్రి! భాషలో మణిప్రవాళం* ! అందుచేత అతినవ్యధోరణిలో చేరుతున్నది.

బీభత్స మార్గాన దేశిరాజు కృష్ణశర్మగారు కొద్దికాలం నడిచినట్లు పూర్వమే ఉల్లేఖించు కొన్నాము. ఈయన వ్రాసిన 'దయ్యాల పెళ్ళి' 'భవిష్యత్తు' మొదలైనవి ఇట్టి ధోరణికి చెందినవి; పిలకా గణపతిశాస్త్రిగారి 'యుద్ధఘోషణ' (భారతి జులై 1940) నోరి నరసింహశాస్త్రిగారి 'నీరోపాట' ఈ ధోరణి ననుసరించినవే ననవలె. కొద్దికాల మీ బీభత్సం ఫ్యాషన్ అయిపోయి శవాలు, ఎముకలు, మొదలైన సామగ్రితో యువకులు రచనలు చేసినారు. ఏల్చూరి సుబ్రహ్మణ్యం, జమ్మలమడక సూర్య ప్రకాశరావు, * పూషా, మల్లవరపు విశ్వేశ్వరరావు మొదలైనవారి నీ సందర్భంలో చెప్పవలె.

---

*మణిప్రవాళ పద్ధతి హాస్యంకోసం ప్రచారంలో మనకున్నదే. అరవంలో ఈ పద్ధతి ఉన్నది. మళయాళంలో కూడా 'తుళ్ళాలనే నాట్యంచేసేటప్పుడు పాడటానికని కుంజన్ నంబియారు మణిప్రవాళమార్గంలో పాటలు రచించినాడు.

"తండులాలు గృహమందు న సంతి, తిండికైతె పలుమంది వసంతి" - Goto కడె, Buy Some వడె, Eat it Today, without తడె" - I saw a పాము on a కాల్వకట్ట' మొదలైనవన్నీ మణిప్రవాళ పద్ధతికి చెందినవే. శ్రీ.శ్రీ. గారి భుజంగ ప్రయాతాన్ని చూడండి :

"భుజంగ ప్రయాతం, బభుక్షాభిఘాతం
చలంగారి పాపం, ప్రజామిత్ర కోపం
జరుక్ నాధ Zambuk, మినీశాస్త్రి Humbuk
లతాంతార్ద్ర రాగంబు లంబాడి లంగా . . ."

ఇందులో మణిప్రవాళమేకాక, సంకేతాలు - ఇతరుల కర్థంకానివి - ఉపయోగింపబడినవి. ఇట్టిదాన్ని చిత్రకవిత్వంలో మన ప్రాచీనులు చేర్చే ఉన్నారు

* ఈ బీభత్సధోరణి చూడండి:

ప్రతి కబళము కొక రక్తపు బొట్టూ
అడుగడుగున కొక హాహాకారం
మెట్టు మెట్టుకొక మానవ దేహం
గళగళమున నొక కపాలమాలా
చేత చేతనొక విషాక్త శస్త్రం
చెవుల్ గింగురన వికటపుహాసం
ఎచ్చట చూచిన రక్త ప్రవాహాల్
ఇంట బైట మానవ కంకాళాల్
ధిం ధిమి ధిం ధిమి ఒకటే నాట్యం! - సూర్యప్రకాశరావు

పూషా (రజనీకాంతరావు) గారు కళ, కవిత్వము అనవసరమని, ప్రాచీనాన్ని మరిచిపోవాలని, విప్లవాన్ని రేకెత్తించి అరాజకాన్ని వర్ధిల చేయాలని తెలుపుతున్నాడు చూడండి:-

మనిషికి లవ్ ఆఫ్ మదర్ కంట్రీ!
జీవితానికి ఆర్ట్ అండ్ పోయెట్రీ!
అక్కర్లేదు! అన్ నెసిసరి!
యూనివర్స్ కింక పెడాంట్రీ!
అక్కర్లేదు! అన్ నెసిసరి!
ఫర్గెట్ యెస్త్రి యెస్టరుడే!
డోంట్ థింక్ ఆఫ్ ది ల్యాస్ట్ మినిట్!

* *

ఇది వృద్యత్ హోమానలం
సహేంద్ర తక్షకాయ స్వాహా !
ప్రాచీనత లన్నీ
వయస్సుతో వరడై బెరడై
వదలకున్న వాసనలన్నీ
సహేంద్ర తక్షకాయ స్వాహా !
వాగనీ ! మ్రోగనీ ! చెలరేగనీ !
విప్లవశంఖం ! విలయశంఖం !
కాలచక్రం మధ్యేమార్గాన
తప్పుతున్నాం అఖండ సమాధిని !

* *

జీతాలు భాషలు దేశాలూ
ఖండాలు సముద్రాలు గోళాలూ
అరాజకంలో అనార్కీలో
విప్లవ విలయ ప్రళయ జ్వాలలో
భగ్నం భుగ్నం మగ్నం నగ్నం కావాలి ! - [Culture And Anarchy

అయితే వీరి దందరి ఈ ధోరణి గీతాలూ కృత్రిమత్వాన్నే వ్యక్తీకరిస్తున్నవి. వీరందరూ త్వరలో ఈ మార్గాన్ని వదలివేసి భావకవు లనిపించుకున్నవారే అని గమనిస్తాము.

బీభత్సము రసాలలో ఒకటి కాబట్టి ఈరకం కవిత్వానికి కూడా కావ్యత్వం సిద్ధించడానికి ఏమీ అభ్యంతరం లేదు, వస్తు వెలాంటిదైతే నేమి? కవి చాతుర్యంపైనా ప్రజ్ఞపైనా ఆధారపడి ఉంటుంది, రసచిత్రణం. అతినవ్యులంతదూరమేపోలేదు ; పోవాలనీప్రయత్నించనూ లేదు. మన పూర్వులూ కవితా సామగ్రిగా 'సింధూరా' దికాన్ని స్వీకరించే ఉన్నారు. "జయకుంజర కుంభ సింధూర సంధ్యాయమాన సలిలయా" అన్నాడు బాణుడు వేత్రవతిని వర్ణించినపుడు. కాళిదాసు కూడా మేఘ దూతంలో చర్మణ్వతినీ రక్తప్రవాహాన్ని ఉల్లేఖించినాడు. బంధూకాన్ని ఆరుణ్యం చెప్పవలసి వచ్చినపుడు కవులు సాదృశ్యం క్రింద తీసుకున్నారు. ముద్రారాక్షసంలో 'కబళితగజరక్త సుందర'మని మృగరాజు ఆననాన్ని వర్ణించినాడు. అయితే అతినవ్యులన్నట్లుగా వారు ఇవే కవితాసామగ్రి అని మాత్రమనలేదు ! ఏమైతే నేమి అతివాస్తవిక ధోరణిపైన విమర్శ మాత్రం తట్టుకోలేనంతగా వచ్చినది ; గాలి దుమారమే అది. దానికీ పాశ్చాత్య సంసర్గం హెచ్చుగా ఉన్న అతినవ్యులెంతగా సమాధానము చెప్పినా మన తెలుగు గడ్డమీద అది నెగ్గలేక పోయినమాట వాస్తవము. అతి వాస్తవిక వాదుల దోరణిపైన ఈక్రింది అభిప్రాయాలు గ్రహించండి :

"... ఉన్నదున్నట్లు నగ్నముగా భావాన్ని వెల్లడించడమే ఈ మాదిరి రచనకు లక్షణమంటారు తద్రచయితలు ... అతి వాస్తవికత ఎంత నగ్నముగా ఉంటే అంత సొగసట. అసలు మానవునికి కలిగే భావాలన్నిటికీ స్వప్నావస్థ ఆలవాలమని, అక్కడ స్ఫురించిన భావము వెల్లడికి రానురాను స్వచ్ఛతనూ, స్వారస్యమునూ ప్రత్యేకతనూ కోల్పోతుందని, అందువల్ల స్వాప్నిక స్థితిలోని భావ ప్రపంచాన్ని బాహ్యాలంకారాలకు పాలుగాకుండా యథాతథముగా చిత్రించడమే అతివాస్తవికత అని ఆ సంప్రదాయవాదులు అంటారు... ఇప్పటికిది అనుకరణము. అందులోను ప్రథమావస్థ ... కాబట్టి సహృదయులకు కొంత తాలిమి అవసరము.' - వేదుల (ప్రతిభ సం॥) ఈయన సానుభూతితో చూడండంటూ ఈ ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నాడు.

"క్రొత్తవాదాల విలువ ఏమిటి? పైకి ఎగరడం ఎన్నడూ ఎరగని మనుష్యులను ఆకాశ వీధులలో తిప్పే ఆకాశవిమానాలవలె వీరీ క్రొత్త కవితా యంత్రాలు సృష్టించినారా! లేక ఈ కవిత్వానికీ మనము ఎరిగివున్న కవిత్వానికీ స్వభావములో సామ్యమేదైనా ఉన్నదా? ఆలంకారికులు చిత్రకవిత్వమని చెప్పిన దానితో దీనిలో ఎంత చేరుతుంది?" అంటూ నోరి నరసింహశాస్త్రిగారు ప్రశ్నించిన పైవాక్యాల లోనే సమాధానమూ లేకపోలేదు. పూర్వం 'చిత్రకవిత్వ' ధోరణితో పోలినవే ఈ అతివాస్తవికాది ధోరణులనీ, దానికున్న విలువే (శూన్యం!) వీటికీ ఉంటుందనీ తాత్పర్యం.

అతినవ్యుల రచనలపైన ప్రముఖులు, చూపిన నిరసనాన్ని ఈ క్రింద చూడండి:

"ఇది చిరస్థాయిగా ఉండదగిన సారస్వతానికి చెందినదిగాదు గాని, తాత్కాలికమైన ఆనందము, ఉద్రేకము కలిగించి, శ్రోతల హృదయతంత్రులను కంపింపజేసేదే గనుక దీనికిని సారస్వతములో స్థలము లేకపోలేదు."

-గిడుగు వేంకట సీతాపతి

"దీనిలో భావమునకు తగిన శిల్పరచన లేదు"

- రామానుజరావునాయుడు

"వీరి రచనలో భావకారిన్యం వున్నా, భాషాసౌష్ఠవం తక్కువ ... వీరి ఉపమానాలు కొంతవరకు హేయంగా ఉన్నవి . . . అంత మెచ్చుకోజాలము.

-సభాపతి

"రాతల్ చాతల్ కాక
పప్పుల్ గొప్పల మనుకొని
పండ్లను ఫట్, ఫట్ ఫట్ కొరికితె
కవిత్వమౌనా?
పిచ్చి రాతలతో
ఇచ్చి వదుల్చుకుంటే -
చచ్చి చావని శవమల్లే
అసహ్యమేస్తుంది !

పెడర్థమే అర్థమైతే
ఆభాసే భాషైతే
నీరసమే రసమైతే
పొయిట్రీ కాదది
తొయిట్రీ !" - 'హరీతుడు'

ఇంకా ఆధునిక యువకుల వైముఖ్యాన్ని చూడండి:

"ప్రతిదాంలోనూ నేడు (Realism) వాస్తవికత కావాలని పాకులాడుతున్నాం. నిజానికి పక్కా వాస్తవికతనే చిత్రిస్తే మనం భరించగలమా? దైనందిన జీవితము కళ్లకు కట్టినట్టు చూపిస్తే ఎంత అసహ్యం వేస్తుంది! ..... భావకల్పన కావాలి. ఈసృష్టిలో ముక్కా చెక్కా అయిపోయి చెల్లాచెదరుగా వున్న సౌందర్యాల్ని ఒక చోట కూర్చుని ఈ వాస్తవికతలోంచి తప్పించుకోవాలి. .... వాస్తవికత కోసం, 'అతివాస్తవికత' (Sur-realism) కోసం, ఏడిచేవాళ్లు పిరికి పందలు, అసలు సాహిత్యంలో సౌందర్యం ఎందుకు కోరతాం? - ఆ అలభ్య సౌందర్యాల్ని భావించి ఆనందించటానికే కాదు - అందులో మసిలే వ్యక్తుల్లా జీవించడానికి! - సత్యం (వాణి10-6-1941).

* * * *

రక్తపతాకం
చేతులొ పట్టుక
పుర్రెలహారం
మెళ్లో వేసుక
జుట్విరబోసుక
శ్మశాన వాటిక
కాళీనృత్యం
చేసినగానీ
నవకవితకు నవ్యత
కలగదో ...... !

బాబో! భయం వేస్తుంది
బీభత్సంలో సౌందర్యం
అస్థుల పెంటలో ఆనందం! - భాగి నారాయణమూర్తి

అతివాస్తవికుల భాషా భావాల అల్లరిని గూర్చి ఒక పాశ్చాత్య విమర్శకు డీ క్రింది విధముగా అంటున్నాడు:-

"Viewed in retrospect it reminds one of those regrettable incidents which do occur at times even in best regulated prisons. A group of mutineers established on the roof gleefully hurling slates at law and order down below, and very well aware that every gesture is in full view of a scandalised world outside the walls. The poets were out of hand " O! Dear! O! Dear!" the outside world exclaimed, "How crude! How undisciplined! How positively wanton! New movements never used to do so violent completely law - less ."

నిజానికి అతివాస్తవిక ధోరణులను (అంతశ్చేతన - బీభత్స - మణి ప్రవాళములు) సమగ్రంగా అనుసరించిన రచనలు మన తెలుగు భాషలో అవతరించనే లేదనే విషయం యధార్థమైనది. సూత్రచర్చ జరిగినంతగా ఆ సూత్రాలను ఇమిడ్చిన రచనలు ఎక్కువగా పుట్టకపోవడం - ఆ పుట్టిన వాటికి పురిటిలోనే సంధి కొట్టడం - ఈ సందర్భాన గమనించవలసిన అంశాలు! *

---

* 'సర్రియలిజం' మాసిపోయినదని అంగీకరిస్తూ శ్రీ.శ్రీయే వ్రాసిన ఈ క్రింది వాక్యాలు చూడండి:

"....Sur-realism is in retreat today on many world fronts Progressive thought looks on sur-realism with suspicion. Orthodox rightist criticism is shocked and scandalised by the sur-realist excesses All the same I think surrealism has not been given a fair chance here in our country. Telugu poetry at any rate is richer for the daring experiments of the neo-surrealists.

-Introduction to 'Soudamini'

# నవ్యాంధ్ర సాహిత్య వీథులు

# అభ్యుదయ మార్గము

# 4

## అభ్యుదయ రచయితల సంఘ స్థాపన:

మన దేశములో స్వాతంత్ర్యప్రాప్తికి పూర్వరంగమొక మహా విప్లవముచేత ప్రకాశించినట్టిది. ఈకాలానికి సంఘములో శాంతి - వర్గవైషమ్యాలు - ఆవేశాలు - అధికంగా పెరిగిపోతూవచ్చినవి. పరప్రభుత్వ - దౌర్జన్యానికి శిరసొగ్గే పాత్రత్వము - ఉపేక్షవహించే సహనము ప్రజలలో నశించి పోయినవి. భారత ప్రజాశక్తి ఎంతటిదో బ్రిటిషువారికి తెలిసిన దినాలవి, రాజకీయాలు ప్రజాజీవితాన్ని ఘట్టించిన రోజులవి. "ప్రభుత" పైన "జనత" కు నైరాస్యం, స్వాతంత్ర్య సంపాదనంలో దీక్షా ప్రబలిన సందర్భం! మానవ సామ్యం, కృషిమనత్వ మనే సిద్ధాంతాలపైన దేశీయుల దృష్టిపడిందపుడు. ఇంపీరియలిజాన్ని, ఫాసిజాన్ని ఎదుర్కొనటానికి విప్లవ శంఖం పూరించిందపుడు. రష్యా దృక్పథాన్ని యువకులలో కొందరు విద్యార్థులు మోజుపడి అభిలషింప బూనినారు. జమీందారులపైన - పెట్టుబడిదారులపైన - సనాతనుల పైన* - తిరుగుబాటు ప్రారంభమైనది. ఆర్థిక స్వాతంత్ర్యాపేక్షలు, అధికార దౌర్జన్యాన్ని సహించలేని ఆత్మాభిమానము, వారి దుస్థితికి సానుభూతి ప్రబలంగా హెచ్చినవి; మతము పేరిట, వర్ణము లపేరిట, జాతిపేరిట సంఘములో జరుగుతున్న అన్యాయాలను అరికట్టవలెననే సంస్కారవాంఛ తీవ్రమైనది. ఇవన్నీ ప్రజాభాషలో తెలిపి కళలను ప్రజలకు సన్నిహితం చేయవలెనని ఒక ఉద్యమం బయలుదేరినది; బ్రతుకే ఒక సమస్య అయిన సందర్భాన జనులను పీడిస్తున్న ఆకలి - దారిద్ర్యము

---

* "It is the object of our Association to rescue literature from the conservative classes .. to bring arts into closest touch with the people.."

- పరాధీనత - మొదలైన విషయాలు కావ్య వస్తువులు కావలెనని అభిలషించినారు.* ఆదేశించినారుకూడ.

ఈ సూత్రాలతో అభ్యుదయ రచయితల సంఘమంటూ ఒకటి స్థాపితమైంది; లక్నోలో (1936 ఏప్రిల్ 10) ఏనాడో అఖిల భారత అభ్యుదయ రచయితల ప్రథమ సమావేశం జరిగింది. అయితే దానికి బలం చేకూరి ఉపసంఘమంటూ ఆంధ్ర ప్రాంతాన ఏర్పడేసరికి (1943?) ఇంతకాలము పట్టింది. వీరి ప్రణాళిక కొంత చూడండి:

"రచయిత నిజంగా తన ఆశయాలకు తను కట్టుబడివుంటే ప్రజలలో మిళితంగావాలి. పాత ప్రపంచం, సాంప్రదాయాలు విచ్ఛిన్నమై పోతున్నపుడు, నూతనతత్వంతో వాటిని పునరుద్ధరించాలి. దీని అర్థం: రచన ప్రత్యేక సాంప్రదాయాలతో పోషింపబడ్డ కళయని గుర్తించక పోవడం కాదు. సమగ్రమైన నూత్న విజ్ఞానం మాటల్తో ఒక్కసారిగ పుట్టివస్తుందనే భ్రమలోపడడమూ గాదు. కాని సంఘం ప్రమాదంలో ఉన్నప్పుడు రచయిత తనకోసమే తాను తన ఊహాసౌధాలనుండి దిగిరావాలి. ఏకొద్దిమందినో మన వైజ్ఞానికసాంప్రదాయ రక్షకులనుగా భావించి ఊరుకుంటే క్రూరమైన, ఫాసిస్టు దాస్యానికి లోబడ్డదేశాలలోవలె వారు బలవంతంగా దుష్టశక్తులకు లోబడి పోతారు. ఉదాహరణకు సోవియట్ మనకు ఎలావిప్లవంద్వారా విజ్ఞానాన్ని, నాగరికతను అందరివశం అవుతుందో స్పష్టపరుస్తుంది. ......

"అభ్యుదయ రచయితల సంఘం ఈక్రింది ముఖ్యకర్తవ్యాలను నిర్వర్తించాలి:

1. మనదేశం సామ్రాజ్యవాద బానిసత్వంనుంచి విముక్తిపొందాలన్నా, జపాను దండయాత్రనుంచి ఆత్మరక్షణ చేసుకోవాలన్నా జాతీయైక్యత ఎంత అవసరమో ఉద్ఘాటిస్తూ నాటికలు, కథలు, పద్యాలు, గేయాలు, పదాలు వ్రాయడం.

---

* "...... We believe that the new literature of India must deal with the basic problems of our existence today - the problems of hunger and poverty, social backwardness and political subjection."

-Extracts from Progressive Writers Associations' Manifesto.

2. ఇతర దేశాల అభ్యుదయ రచనలను ముఖ్యంగా ఈమధ్య వెలువడ్డ సోవియట్, చైనా సారస్వతాన్ని అనువదించి ప్రచురించడం.

3. వివిధ భారతీయుల్లోని ప్రముఖ రచనలను సకాలానికి ఇంగ్లీషులో సంపుటాలుగా ప్రకటించడం.

4. పత్రికలను, అభ్యుదయ సారస్వత సంపుటాలను వివిధ భారతీయ భాషల్లో ప్రకటించడం.

5. కార్మిక, కర్షకులలో సాహిత్య, వైజ్ఞానిక గ్రూపులనేర్పరచి అభ్యుదయ రచయితల సంఘాన్ని ప్రజా సాహిత్యంతోటి కళలతోటి సన్నిహిత సంబంధ మేర్పర్చుట.

6. ప్రజా నాట్యమండలితో సహకరించేయడం. నాటకాలను వ్రాసి వారిచేతనే ప్రదర్శింపజేసి సహాయపడడం."*

చదలవాడ పిచ్చయ్యగారనే యువకుడు, సాహిత్యోత్సాహి, ఈ ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘస్థాపనకు ముఖ్య కారకుడై ప్రముఖ రచయితలను, కవులను పండితులను, అధికారులను లోగొని వారి సానుభూతినీ మద్దతును సంపాదించి యీ సంఘానికి మంచి వ్యాప్తి, స్థితి మన ప్రాంతాన కల్పించినాడు. మల్లంపల్లి ఈ అభ్యుదయోద్యమానికి వెనుక ఒక వెలుగుగా నిల్చినాడు. ప్రయాగ కోదండరామ శాస్త్రిగారనే యువకవి, సాహిత్యోపజీవి దొరికినాడు, కూడ ఉండి కృషి చేయడానికి. ఇంతకు ముందే నాల్గైదు సంవత్సరాలుగా సాహిత్యరంగములో కృషి చేస్తూన్న నవ్యకళా పరిషత్ప్రముఖులతో రామదాసు-ఆంజనేయులు-సుబ్రహ్మణ్యంగారలు 'నయాగరా' అనే వచన గీతాల (Vers libre) సంపుటి అచ్చేసి (1944) అభ్యుదయ మార్గవర్తులై ఉన్నారు. వీరూ, వీరితోపాటుగా కృషిచేస్తున్న అనిసెట్టి సుబ్బారావు, ధనకుధరంగారలనే యువకవులూ చదలవాడ పిచ్చయ్యగారితో సహకరించినారు. అన్ని ప్రాంతాలలోను ఈ సంఘానికి ఉపసంఘాలు ఏర్పడినవి. సికింద్రాబాదులో ఆళ్వారుస్వామిగారనే ఉత్సాహికార్యకర్తయై కొంత సంచలనాన్ని అక్కడ కల్గించినాడు.

* చూచినారుగదా వీరి ప్రణాళిక. ఇందులో రాజకీయాలు, రష్యా, వినదిస్తున్నవి!

వీరక్కడ ఒక ముద్రణాలయమును స్థాపించి కొందరు ప్రముఖరచయితలను ఆకర్షించినారు మొదట్లో. తెలంగాణా ఆంధ్రులను కలుపుకొని ఉద్యమాన్ని విశాలం చేయసాగినారు. అక్కడి 'తెలుగుతల్లి' అనే మాసపత్రిక నుద్ధరించీ, అనేక సారస్వత వైజ్ఞానిక సమావేశాలను ఏర్పరచీ, "మాభూమి-ముందడుగు" నాటకాలను ప్రదర్శిస్తూ, సాహిత్యపాఠశాలను నడిపీ, "ప్రజా శక్తి" "అభ్యుదయ" లనే పత్రికలను సూత్రప్రచారమే ప్రధానముగా నడిపీ, వీరేశలింగం - గిడుగు - గురజాడ - ధర్మవరం - కాశీనాధుని-కొమఱ్ఱాజుల - వర్ధంతులను ✻ దేశమంతటా జరిపించీ, ఈసంఘమువారు సామాన్యప్రజనూ, రాజకీయములతో సంబంధములేని పండితులనూ, అధికారులనూ, యువరచయితలనూ, విద్యార్థులనూ, ఒకరనియేమిటి? అందరినీ లోగొన్నారు◆. వివిధపట్టణాలలో ఈసంఘమువారు జరిపిన బ్రహ్మాండమైన సభలు, తదధ్యక్షుల పేర్లను చూడండి :-

| | | |
|---|---|---|
| తెనాలి | 1943 | తాపీ |
| బెజవాడ ✻ | 1945 | తెలికిచెర్ల |

---

✻ ఇలా వర్ధంతులు జరుపుతూ ఉండడంవలన దీనిని కొందరాకాలాన 'తద్దినాల సంఘమని' హేళన చేసినారు

◆ చెళ్ళపిళ్ళ-విశ్వనాధ-కురుగంటి-మల్లాది-గోపాలరెడ్డి-శరగోపం-దుర్భాక-అడివి-నార్ల-నిస్సా-గోవిందరాజాచారి-రామానుజరావునాయుడు-ఖాసింఖాన్-జమ్మలమడక-సన్నిధానము-అయల సోమయాజుల-వానిలాల-దేశిరాజు-పాటిబండ- విశ్వనాధకవిరాజు-సీతాపతి-పెండ్యాల-పువ్వాడ-మునిమాణిక్యం-దివాకర్ల-ఇంద్రకంటి-పిలకా-మొదలైనవారెందరో పండితులు, కవులు, ప్రముఖులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో తెలిసో తెలియకో ఈ సంఘానికి బలంకూర్చినవారే. మళ్ళీ కమ్యూనిస్టుపార్టీకి ఇది అనుబంధమైనదంటే నాలిక కొరుక్కున్నవారె!

ఈ అభ్యుదయ సంఘము వారేర్పాటుచేసిన సభలకు అధ్యక్షత వహించిన వారు సామాన్య వ్యక్తులుకాదు. రచయితలలో, విద్యార్థులలో సంఘములో పలుకుబడి గల మహా మహులే అంతా! ఒకవర్గపు అభిమానం బాగా చూరగొన్నవాడు తాపీ-నవ్యసాహిత్య పరిషత్కార్యదర్శి తెలికిచెర్ల, యువకవులలో ఒకడై సాధనసమితి అధ్యక్షుడుగా కొంత బలగం వెనక ఉన్న వాడు పిల్లలమర్రి సభ్యులను సమ్మోహితుల్ని చేయగల సామర్థ్యంగలవాడు దేవులపల్లి. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి రాజమన్నార్. ఇంకేం కావాలని అందరూ ఘరానా మనుష్యులే!

✻ ఈ సభలోనే చిలకమర్తివారిని సన్మానించి, వారి 'స్వీయచరిత్ర'ను ప్రచురించి దేశం మెప్పును పొందినారు. అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి సజ్జాద్ జహీర్ ఉపన్యసించడము, అడవి బాపిరాజుగారు అనువదించడము జరిగిందీ సందర్భంలోనే.

| | | |
|---|---|---|
| సికింద్రాబాదు | 1945 | పిల్లలమర్రి |
| రాజమండ్రి | 1946 | దేవులపల్లి |
| మద్రాసు | 1947 | రాజమన్నారు |

సమావేశాలద్వారా పేరుపడిన పండితులను ఎందరినో దగ్గరకు తీసినారు. పెదపూడిలో సాహిత్యపాఠశాలను నడిపించి మల్లంపల్లి - పంచాగ్నుల-కోరాడ-చిలుకూరి - నిడుదవోలు - మొదలైన లబ్ధప్రతిష్ఠులనులోగొన్నారు. 'చిలకమర్తి' వారి సమ్మాన సందర్భాన పెద్దల నెందరినో తమ వేదిక నెక్కించినారు; వర్ధంతుల సందర్భాన మరికొందరు పండితులను; పత్రికకు,సమావేశాలకు సందేశాలనిమ్మని వాటిని సంపాదించి దేశంలో మరికొందరు పెద్దమనుష్యులను తమలోకి లాక్కున్నారు. జీవికకోసమని ఎందరో యువరచయితలు వీరి పత్రికాకార్యాలయాలలోను, ముద్రణాలయములోను చేరిపోయినారు.◆

ఈ అభ్యుదయోద్యమం కూడ ఒక తిరుగుబాటుద్యమ మేనని గ్రహించవలె. అతివాస్తవికులకువలెనే వీరికికూడా ప్రతీచే జ్ఞానోదయం కల్గించింది. అతివాస్తవికులకు కళారంగమే రంగం. వీరికి రాజకీయ రంగంకూడా ఉంది! అతివాస్తవికులు సంప్రదాయవాదుల నెలా నిరసించి దెబ్బతిన్నారో మన దేశాన, అల్లాగే వీరున్నూ ప్రథమంలో ప్రాచీనతను తెగనాడి జట్టీ తెచ్చుకున్నారు; ప్రాచీన సంస్కృతిపైన సంస్కృత భాషపైన - వీటిని పట్టుకు వ్రేలాడుతూ విజ్ఞానం తమ సొత్తుగా చేసుకున్న

---

◆ " . . . . కార్మిక, కర్షకలోకం గొప్పను వర్ణించేది అభ్యుదయరచన . . . . ఎపుడైతే బ్రాహ్మణుడు విజ్ఞానాన్ని తన సొత్తుగా యుంచుకొని సంఘాన్ని కంట్రోలు చేయడానికి యత్నిస్తే క్షత్రియుడు ప్రతికక్షిగా భుజశక్తితో వచ్చాడు. 'నావిష్ణుః పృథివీపతిః'. వాడి క్రింది తరగతి కాపిటలిస్టు, నీది భుజబలమైతే నాది ధనబలమని తను కొంత శక్తి లాగాడు. తర్వాత కార్మికుడు తన సంగ తేమన్నాడు. ఇతడి ప్రాధాన్యాన్ని గూర్చి ఆలోచించాలి. పూర్వం విజ్ఞాన ధనాన్ని గొప్పతనం గూర్చి మన వాఙ్మయం చాలా పొగిడింది. ఇప్పుడు కార్మికుడివంతు . . . వీడి తరణోపాయం వాంఛలు, అభిరుచులు తీర్చాలి . . . సమకాల జీవిత వస్తువులు తీసికొని (సమస్యలు పరిష్కరించి) వారి రుచులను గూర్చి వ్రాస్తేనే అభ్యుదయరచన అని రచయితలు అంటున్నారు. . ప్రాచీన సంపదను ఆధారముగ తీసికొని ఇప్పుడు మనం కొంత సంపద కలిసి, భావి మానవులకు అందివ్వాలి . . ." - పాటిబండ మాధవశర్మ (ఆంధ్రప్రభ 3-3-1946)

బ్రాహ్మణులపైనా* - జమీందారులపైన - ధనికవర్గంపైన - వీరికి విలాస వినోదాలు కల్పిస్తున్న ప్రబంధ, భావకవిత్వాలపైన-పండితులు అధికారం చెలాయిస్తున్న గ్రాంధిక భాష, వ్యాకరణం, ఛందస్సులపైన- స్వేచ్ఛా సౌఖ్యాలను అరికట్టే అర్థకామాల కట్టుబాట్లపైన, ఒక పెద్ద తిరుగుబాటే తెచ్చినారని గ్రహింపవలె.

ఈ ఉద్యమ ఫలితముగా పత్రికలలో అనేకవాదోపవాదాలు బయలుదేరినవి. 'ఏది అభ్యుదయం? ప్రాచీన సాహిత్యం అభ్యుదయాన్ని ఉద్దేశించనేలేదా? ప్రజకూ సాహిత్యానికీ ఉండిన-ఉండవలసిన సంబంధ మెలాంటిది? రాజకీయాలకు సాహిత్యములో స్థానమెంతటిది, ఎలాంటిదై కావ్యవస్తువు ఫలానిదేలయి ఉండాలని కవిని శాసించవచ్చునా?◆కూడదా? కవి స్వతంత్రుడా? పరతంత్రుడా? వ్యంగ్యము-

---

* ఈ అభ్యుదయ రచయితల సంఘము కమ్యూనిజాన్ని ప్రచారం చేసేందు కలా బురఖా వేసుకొని వచ్చినటువంటిదనే రహస్య మొకటి ఎలాగైతేనేమి క్రమంగా లోకమంతటా వ్యాపించడము ప్రారంభమైనది. దీన్ని కాపాడుకుంటూ బయటపడకుండా ఉండే నిమిత్తం పెద్దల-పండితుల-అధికారుల-అండచేరిందని ఇదంతా "డిప్లొమాటిక్ స్టంట"ని ఒక అభిప్రాయం సారస్వతవేత్తలలో పొడచూపింది; తర్వాత ధృవపడింది

31-3-1948 తేదీ ఆంధ్ర వారపత్రికలోని ఈక్రింది వాక్యాలు చూడండి -

"శ్రీ చదలవాడ పిచ్చయ్యగారు ఆంధ్రకమ్యూనిస్టులలో అగ్రగణ్యులలో నొకరు. కమ్యూనిస్టులచే స్థాపింపబడిన అభ్యుదయ రచయితల సంఘమునకు ఆంధ్రదేశంలో కొంచెము స్థావరము దొరకుటకు వీరి కృషియే కారణమని చెప్పకతప్పదు అభ్యుదయ రచయితలసంఘము కేవలము కమ్యూనిస్టు సంస్థ కాదని చెప్పి, రచయితలను భ్రమపెట్టి, ఆ సంఘములో ఆంధ్రదేశంలో కొంచెము స్థావరము దొరకుటకు వీరి కృషియే కారణమని చెప్పకతప్పదు అభ్యుదయ రచయితలసంఘము కేవలము కమ్యూనిస్టు సంస్థ కాదని చెప్పి, రచయితలను భ్రమపెట్టి, ఆ సంఘములో చేర్పించి, దానికి కృత్రిమ ప్రాబల్యమును ఈయన సాధించినాడు. కాని అభ్యుదయరచయితల సంఘము ఈ విధముగా అభివృద్ధి జెందుట, కమ్యూనిస్టుకమిటీకి ఇష్టము లేదని ఇప్పుడు చదలవాడ పిచ్చయ్యగారు ప్రచురించిన ఈ పుస్తకము (ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకుల నగ్న సత్యాలు) వలన రుజువగుచున్నది. అనేక ప్రముఖరచయితలను అభ్యుదయ సంఘము పేరుతో ఉపయోగించుకొనుచు, అదే సమయమున వానిని ఎంత న్యూనత పరచినది ఈ లేఖల వలన తెలియుచున్నది"

◆ మానవ జీవనము పవిత్రత, కష్టించి పనిచేయుటలో గల గౌరవము, సర్వమానవ సౌభ్రాతృత్వము, సర్వమానవ ఐక్యత, పీడితజాతులకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యము ఇవే నేటి రచయితలకు పునశ్చరణ మంత్రాలుగా ఉండాలి . . ధనికునికంటెనూ శ్రామికునిగౌరవం పాలకునికంటెనూ పీడితుని గౌరవం నిలబెట్టవలసిన బాధ్యత, సంకీర్తన చేయవలసిన బాధ్యత రచయితలదీ, కవులదీని . . కవి తన కలాన్ని ప్రధానంగా స్థాపించుటకు, నిరంకుశత్వాన్ని,స్వార్థపర తను రూపుమాపి ధర్మరాజ్యం నెలకొల్పుటకు, దాస్యశృంఖలములను తెగత్రెంపి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రతిష్ఠించుటకు వినియోగపరచినపుడే కీర్తివస్తుంది. నవయుగధర్మాన్ని గుర్తించండి. ప్రజాభ్యుదయంకోసం పాటుపడండి . ." - మల్లంపల్లి (నవ్యసాహిత్య పరిషదధ్యక్షపీఠంనుంచి)

శిల్పము-సౌందర్యము※ -ఆదర్శము-రసము అన్నవాటికి రచనలలో స్థానముండ వలెనా? అక్కరలేదా? సాహిత్యం ప్రచారాత్మకమా? ప్రబోధాత్మకమా? †వర్గ పరిమితమా? వర్గాతీతమా? తాత్కాలిక ప్రయోజనమే లక్ష్యమా? శాశ్వతత్వం అభిలషణీయమా? 'ప్రేమ'కు సాహిత్యంలో స్థానమే ఉండనక్కరలేదా? కామం సంఘంలో విపరీతంగా ప్రబలవచ్చునా? ప్రాతది పరిత్యజించడంవలనా సంప్రదాయదూషణవలనా అభ్యుదయం చేకూరుతుందా◆? మన సంస్కృతి ఎలా ఉన్నా రష్యాను దిగుమతిచేస్తే సరిపోతుందా?

సాహిత్యంలో సనాతనిజమా, గాంధిజమా, హ్యూమనిజమా, కమ్యూనిజమా, ఏది పోషింపదగింది? కవిత్వం అంటే రమణీయార్థము ఉండవలెనా §? కేవలం 'ప్రెస్సు రిపోర్టర్' వ్రాసిన రచన కవిత్వమౌతుందా? కవికి ఆవేశమే (Emotion)

---

※ " . . కొంతమంది అభ్యుదయ రచయితలు యీనాడు సౌందర్యోపాసనకు తావులేదనీ, దేశం దారిద్ర్యంతోను దైన్యంతోను నిండి ఉంది గనక, వాటిని పారదోలే ఉపాయాన్ని ప్రబోధించే రచనలు మాత్రమే చెయ్యాలనీ కవులకు నిర్దేశిస్తున్నారు. కవి సంఘానికి దూరంగా ఎప్పుడూ వుండడు విశ్వశ్రేయానికే తన రచన వినియోగం కావాలని ప్రతిరచయితా కోరుతాడు. కాని కవికి భావస్వాతంత్ర్యం వుండాలి. అతన్ని యీ రచన మాత్రమేచెయ్యి, యిదిచెయ్యకు అని ఆజ్ఞపెట్టలేరు " - క్రొవ్విడి రామం ('ప్రజాబంధు')

† పిల్లలమర్రి వ్రాసిన వ్యాసం. - ('సాహిత్య సమీక్ష')

◆ "ఒక్క సారిగా పాతకీ ఏమీ సంబంధం లేకుండా, ఒక కొత్త సంస్కారం గానీ ఒక కొత్త సారస్వతంగానీ ఎక్కడినుంచి ఊడిపడుతుందినో వీళ్ళ ఊహ! పాతలోని మంచిని తీసుకొని కొత్త ఏర్పడుతుందని చెప్పే మూర్ఖిజం వీళ్లకు అందని పండు .. "

-గోపీచంద్ (విహారి, డిసెంబరు 1943)

మన ప్రాచీన వాఙ్మయం దేశకాలానుగుణ్యంగా వెలసినదేకాని గాలికి పెరిగినదికాదు... మన దేశచరిత్ర మనకు సరిగా అవబోధం కాకపోవడంవల్ల, మనకు సరియైన చారిత్రకదృష్టి లేక పోవడంవల్ల, మనం ఈ యఖండ సత్యాన్ని గుర్తించ లేకుండా ఉన్నాము. ... నియంతృత్వం ఖండించే మీరు సాహిత్య రంగంలో మరల నియంతలుగా మారరాదని నా మనవి.

-మల్లంపల్లి (తెనుగుతల్లి ఏప్రిల్ 45)

§ "కావ్యానికి ప్రధానమైనవి, ప్రాణంలాంటివీ. 1. వస్తువు, 2. కవిత్వం అభ్యుదయకరమైన కథావస్తువును స్వీకరించి, హృదయంగమంగా రసౌచిత్యాదిభంగాలు లేకుండా చిత్రించాలి" అని ధనకుధరంవారే అంటున్నారు.

ప్రధానమా? నిగ్రహం (Restraint) ముఖ్యమా? కవి ఉపదేష్టా? సైనికుడా? ఒక పార్టీ సభ్యుడా? - మొదలైనవన్నీ ప్రశ్నలే. ఎవరి ఇష్టము వచ్చినట్లువారు చర్చలుజరిపినారు; తత్ఫలితంగా రాజకీయరంగములోలాగానేసారస్వతరంగంలో కూడా పార్టీలు. మతాలు, ఏర్పడినవి. అయితే తమ అభ్యుదయం నిమిత్తమే సాహిత్యసీమలో తామే సమన్వయవాదులు కావలసివచ్చి ఆవిధంగా వర్తించినారీ అభ్యుదయ సంఘం వారు. దీనివలననే పెద్దల అండజేరి* వారి ఆశీస్సులను సానుభూతినీ పొంది◆ తమ సంఘానికీ, ఉద్యమానికీ, ఒక ప్రతిపత్తి సంపాదించ గలిగినారు.

రాజకీయాందోళన సాహిత్యంలో ప్రతిబింబించి కొంత రచనసాగించిందీ అభ్యుదయ రచయితల సంఘము* ఒక పార్టీకి చెందిన "ప్రజాశక్తి"కీ కేవలం రచయితలకు చెందినదంటున్న "అభ్యుదయ" కూగల అవినాభావ సంబంధం చాలమందికి అర్థముకాక బాధ కల్గిన విషయం చెప్పితీరవలె. అయితే 'దేశస్వాతంత్ర్యం' వచ్చి ఈ బాధతీర్చింది. తెలంగాణా ప్రజా పోరాటమువచ్చి 'అభ్యుదయా'ని కొక స్వరూపం ఘటించి పెట్టింది; అనేక "రచయితలు" బయలుదేరినారు.

పాతవాళ్ళలో తాపీ ధర్మారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారలు అండగా నిల్చి ఈ నూతన మార్గాన్ని అవలంబించినారు. యువ రచయితలలో కొడవటిగంటి కుటుంబరావు, పద్మరాజు, శ్రీశ్రీ, నారాయణబాబు, గోఖలే, రుక్మిణీనాథశాస్త్రి, కొడాలి రాజారావు గారలపేర్లు ఈ ప్రకరణాన కూడ కన్పిస్తున్నవి. అనిసెట్టి సుబ్బారావు, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ధనకుధరం వెంకటాచార్య, పోలూరి ఆంజనేయ ప్రసాద్, మొదలైన నవ్యకళా

---

* తమ సంఘాన్ని కాపాడుకునే నిమిత్తం పెద్దలను వీరు వాడుకుంటే, ఈ పెద్దలు (భ్రాంతికలోనై) తమకు పెద్దపీటలు వేసి గౌరవించేవారు, తమపేరును, బొమ్మను, ఉపన్యాసాలను, రచనలను కన్నులు చెదిరేటట్టు ప్రచురించి ప్రచారం చేసేవారు. దొరికినారుగదా అని యశోభిలాషతో వీరిని మన్నించినారు. మొత్తముమీద ఒకరికొకరు తెలియక వారిని వీరు, వీరిని వారు వాడుకున్నారు. ఏమైతే నేమి వ్యక్తులకు వ్యాప్తి, సంఘానికీ బలిమీ చేకూరినవనవలె.

◆ పంచాగ్నుల, దేవులపల్లి, మల్లంపల్లి, రాజమన్నార్, జమ్మలమడకలుముఖ్యంగా వుంచి ప్రోత్సాహమిచ్చినారు; నోరి, తల్లావజ్ఝల, విశ్వనాథలు ఈ ఉద్యమాన్ని ఆదరించనేలేదు. మీదుమిక్కిలి ఖండిస్తూ వచ్చినారు.

పరిషత్ప్రభృతులీ మార్గవర్తులైనారు. ఇంకా కొమ్మజ్జాజు వినాయకరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, నాగభైరవ శివరామకృష్ణ పి.వి. శివయ్య, తుమ్మల వెంకటరామయ్య, నాజరు, కోగంటి, చిరంజీవి, కృష్ణదేవరాయలు, సి.వి. కృష్ణరావు, సంపత్, తెన్నేటి సూరి, గిడుతూరి సూర్యం, రమణారెడ్డి, చాగంటి సోమయాజులు, నార్ల చిరంజీవి, కొత్తపల్లి రంగారావు, నారపరెడ్డి, సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు, సోమసుందర్, అయ్యపు వెంకటకృష్ణయ్య, రాంషా, జగ్గయ్య, బి. గోపాలం, పల్లా రామకోటయ్య, చంద్రారెడ్డి, గంగినేని, నల్లం బాలకృష్ణారావు, 'మాన్స', శ్రీరామ కవచం, వి.లక్ష్మి, చావలి రామచంద్రరావు, మాచినేని వెంకటేశ్వరరావు, ఆత్రేయ, జాస్తి సీతారామదాస్, 'అజంతా', మొదలైన కొత్తపేర్లు ఎన్నో ఈవాఙ్మయ రంగాన విన్పిస్తున్నవి. స్వాతంత్ర్య - తెలంగాణా ప్రజాపోరాటములు కారణములుగ విజృంభించిన కవిధీరులు తెలంగాణాలో కొందరున్నారు; భాగినారాయణమూర్తి, జమ్మలమడక సూర్యప్రకాశరావు, వెల్దుర్తి మాణిక్యారావు, అద్లూరి అయోధ్యరామయ్య, కాళోజీ నారాయణరావు, దాశరథి కృష్ణమాచార్య, ధవళా శ్రీనివాసరావు, గడియారం రామకృష్ణశర్మ, పాట్లపల్లి రామారావు, ఆంగీరస్, గంగులశాయిరెడ్డి, మొదలైన ఆవేశపూరితులైన యువకవు లెందరో పైకి వచ్చినారు. వీరి రచనలనుగూర్చి ముందు ముందు గమనిస్తాము. అంతకు పూర్వము వీరు తెచ్చిన రాజకీయ చైతన్యమెలాంటిదో స్థూలంగా గమనించవలె.

ఇన్ని దినములూ రాజకీయములు ఏ కొందరు స్వార్థపరుల చేతులలోనో ఉండి అజ్ఞానములో బానిసచిత్తవృత్తికి లోనైన ప్రజానీకాన్ని అణగద్రొక్కడానికి ఉపకరిస్తూ వచ్చినవి. దినాలు మారి పోయినవి. కేవలం విద్యాధికులను, స్వార్థపరులను, నమ్ముకుంటే దేశానికి క్షేమం కలిగేటట్లులేదు. "ప్రజలలో ఒక విప్లవము చెలరేగవలె. దానివలన సంఘక్షేమం స్థాపితముకావలె". నిజమే! దీనికి ఎంతో ప్రయత్నమవసరము. ప్రజలలో రాజకీయ ప్రబోధము కల్గించవలె; విజ్ఞాన బీజాలను నాటవలె; వారికి

విప్లవ మాహాత్మ్యమును బోధించవలె. వీటి అన్నిటిద్వారా, బానిసత్వమంటే అసహ్యము - ప్రభుత్వమంటే రోత - స్వాతంత్ర్యమంటే అభిలాష - విప్లవమంటే విశ్వాసము - సమత్వమంటే ఆనందమూ ప్రజలలో కలిగేటట్లు చేయవలె. ఈ రచయితలందరూ ఏతత్ప్రయత్నమును చేసినవారే!* నిజమునకు ప్రజలలో రాజకీయ చైతన్యమును వీరు చాలవరకు సాధించినారని చెప్పవలె. ఉపన్యాసములవలననేమి, రచనలవలననేమి, అభ్యుదయోద్యమము◆ ప్రజలలో ఒక గొప్పసంచలనాన్ని కలుగజేసినది. దీనికి రచయితలు సృజించిన 'ప్రచార వాఙ్మయము' ప్రమాణము వివిధ సంఘములలో అనేక ప్రదేశాలలో పొడసూపిన సమ్మేలు తార్కాణాలు. విప్లవశంఖాన్ని పూరించడము, తిరుగుబాటు సూచించడము ప్రధాన ఉద్దేశము కాని నిర్మాణ పథమునుగూర్చి ఆలోచించడము వీరి అభిమతమపుడుకాదు. అందుచేతనే వీరి రచనలలో అట్టి విప్లవభావమే పోషింపబడింది. వివిధ రాజకీయ కల్లోలాలు దేశములో చెలరేగినవి. యథాతథములుగా, ప్రజల కండ్లకు గట్టేటట్లు చిత్రించి, అందులో తమ హృదయ వేదనను రంగరించి, రోషవిస్ఫులింగాలను చెరిగించినారు; వీరు ప్రజలలో గొప్ప సంచలనాన్ని కల్గించిన మాట ఎవరూ కాదనలేరు. ఇంకా వీరి రచనలను, అందులో వీరు గ్రహించిన వస్తువునూ గమనించుదాము.

ఈ రచయితలంతా మన దేశములోని వివిధ రాజకీయసంఘటనలను వస్తువుగా స్వీకరించి ఆవేశంతో, ఆవేదనతో, అహంభావముతో 'ప్రజాభాష'లో

---

* 'అభ్యుదయ' ప్రథమసంపాదకీయం చూడండి.

◆ ఇదొక ఉద్యమమే నంటున్న ఈక్రింది వాక్యాలు చూడండిః

"... అభ్యుదయ రచన అనేది ఒక పద్ధతికాదు ఒక ఉద్యమం. కొన్ని కొన్ని విశేష పరిస్థితులలో ఇటువంటి ఉద్యమాలు బయలుదేరుతాయి. ముఖ్యంగా, నిన్న మొన్నటివరకు, గాఢనిద్రలోనూ మేల్కొనివున్నా మధురమైన స్వప్నాలమైకం వల్లనో ఒళ్ళు తెలియకవున్న మన సాహిత్య జీవనంలో ఒక గొప్ప మెలకువ కలిగిఉన్నాయి ఈ ఉద్యమాలు..

-సుకుమార్ (అభ్యుదయ)

'ప్రజానీకం' కోసం, విప్లవాన్ని వర్ధిల చేయవలెననే అభినివేశముతో రచనలను బహుళంగా చేస్తూ వచ్చినారు.* నేతాజీ సుభాసచంద్రబోసు - ఆజాద్ హింద్ ఫౌజు (I.N.A) లను గురించీ, బర్మా కాందిశీకులను గురించీ,బెంగాల్ - విశాఖ - రాయల

* కవిని అడుగుతున్న ప్రజల ధోరణి చూడండి: ఇందులోనే వీరి వస్తుజాలం ఎట్టిదో బోధపడుతుంది:

మా భాషలో మా కేకలో
మా బాధలు మా చావులు
మా తగవులు మా గెలుపులు
మా కళ్ళకు గట్టినట్లు
నడిగూడెపు నరకాసురు
డెంకటగిరి సంకటాలు
చల్లపల్లి దోపిళ్ళూ
భూస్వాముల పరవళ్ళూ
మా కళ్ళకు గట్టినట్లు
నైజాముల నాజీజం
బూర్జువాల పోకిళ్ళను
మా కళ్ళకు గట్టినట్లు
లోకాలను దిగమింగే
వాషింగ్టన్ పాసిస్టు
రాకాసుల పోకళ్ళను
మాకళ్ళకు గట్టినట్లు
మా పొలం మా పంట
మా మిల్లు మా యిల్లు
మా చదువు మా సంధ్య
మా దేనని మాకిమ్మని
వాదించే బోధించే
మాపట్టం మాచట్టం
మా ఆలన మా పాలన
మా దేనని మాకిమ్మని
మేమంతా ఒకటేనని
రూపించే చూపించే
ఘోషించే శాసించే
రాళ్ళను కరగించే
పొగరెక్కిన
ముళ్ళను తగలేసే
అజేయానికి అభివృద్ధికి
ఆరాటపు పోరాటపు
ఆలోచనా ఆందోళనా
తరంగాలు పరంపరలు
తరిమి తరిమి
పొర్లించే - పొంగించే
మా హృదయతంత్రిశ్రేణిని
మా జీవితశక్తిసేనను
స్పందించే
కదం తొక్కించే
మా దేశం మా జాతిని
మా రక్తం మా శక్తిని
ఉడికించే ఉబికించే
మా సమరంలో దూకించే
మందిని ముంచి మదించి తిరిగే
మా పగవాణ్ని చాపచుట్టి
గిరిపైనుండి గిరాటువేసే
వేడిరాతలు వాడిగీతలు
సూటిమాటలు
వాటంగా రాయమనీ
కాకుంటే కవికాదనీ
అంటున్నా మంటున్నామోయ్
కవీ! ప్రజలం
మేమంటున్నా మంటున్నామోయ్

- అరుణకుమార్ (ప్రజాశక్తి 18-4-48)

సీమల కరువులనుగురించీ, నౌఖాలీ - బీహార్ - బొంబాయిలలో చెలరేగిన హిందూ ముస్లింల హత్యాకాండ◆ ఇండ్లదోపిళ్లు, గృహదహనాలు - స్త్రీలమాన భంగాలు మొదలైన అత్యాచారాలనుగురించీ, జునాఘడ్ - కాశ్మీర్ - హైదరాబాదు రాష్ట్రాలలో సంఘర్షణలను గురించీ, "రజాకారు'ల దౌర్జన్యాలనుగూర్చీ, జమీందారుల పెట్టుబడి దారుల - అన్యాయాలనుగూర్చీ కొంత వాస్తవిక శిల్పం పేర (నగ్నంగా! పచ్చిగా?) ఈ యువరచయితలందరూ రచనలు సాగించి ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని కల్గించడానికి ప్రయత్నించినారు. ఈ అభ్యుదయోద్యమం కారణముగా వాఙ్మయ రంగాన రాజకీయాలకు గౌరవం లభించడమేకాక, గేయం - నాటకం - బుర్రకథలనే ప్రచారానికి పనికివచ్చే ప్రక్రియలకున్ను (Forms) ఆదరం లభించినది. ఛందస్సు కోసంగాని, భాషాపాటవంకోసంగాని, ప్రయత్నమే అక్కరలేదనిపించడము వలనా, నోటికి వచ్చినట్లు ప్రేలడమే ఫ్యాషనులాగ కన్పించడమువలనా ఈ కాలాన "కవుల" సంఖ్య తగ్గిపోయి, "రచయితల" సంఖ్య పెరిగి పోయినది; అందుకనే వీరి రచనలలో 'రాజకీయ నినాదాలు హెచ్చుగా విన్పిస్తవి. భాషాసాంకర్యం బహుళంగా కన్పిస్తుంది:✻ ఆత్మశుద్ధి (Sincerity) కొరవడిపోయి

---

◆ ఈ క్రింది గీతాన్ని చూడండి:

కరశృంఖల తగిలిస్తూ
విభేదాల రాజనీతి
రెండున్నర శతాబ్దాలు
పండేరోజులు వచ్చాయి!
మీ రాక్షసపరిపాలనలో
హత్యాకాండల నాపండి!
లోకం మేలుకుంది నేడు
ఉరిశిక్షలు వేయిస్తూ
విద్యలు అమలుపరుస్తూ
మండించిన మీ పాపం
ఊరూరా కరువులు వెలసిన
నేటివరకు సాగిన
మీ కాలం గతించింది!

- కుందుర్తి (ప్రజాశక్తి)

✻ "... పాతతో సంబంధం లేకపోవటంవల్ల వచ్చే నష్టం వీళ్ళు రాస్తున్న భాషలో స్పష్టంగా కనిపిస్తుంది. పైకి ప్రజాసామాన్యానికి అర్థమయ్యేటట్టే రాయాలని వీళ్ళు చెపుతారు. కాని తెలుగు నుడికారం వీళ్ళువాడే భాషలో ఎక్కడా కనిపించదు. మక్కికిమక్కీ పరభాషలో నుంచే రావటంవల్ల మామూలుభాషకు అలవాటుపడ్డ ప్రాణాలు కడబడుతున్నై. ఈ తికమక ఒక్క వాక్యనిర్మాణంలోనే కాదు, మాటల్లోనూ సమాసాల్లోనూ కూడా కనిపిస్తుంది. 'వ్యథిత హృదయాలు' అంటారు. 'ఇతివృత్తం' 'కథావస్తువు' అని మామూలుగా వాడేచోట 'ముడివస్తువు' అంటారు చూడండి, ఈ వాక్యం ఎంత విచిత్రంగా వుందో! "కావ్యరచనకి కవి ఉత్సాహానికి, శిధిలాలు - అడవులు ముడివస్తువు లైనాయి."

" వ్యక్తితో బయలుదేరే ప్రతిస్పైవేటు ఉద్రేకం కళాకిరణం అయిపోయింది" - ఇక చాలు అనుకుంటాను. అభివృద్ధిని సరిగ్గా అర్థంచేసుకోలేక వీళ్లు తమ రచనల్లో ఇటువంటి చక్రబంధాలు చాలా చేస్తున్నారు "

- గోపీచంద్ (విహారి)

యశోభిలాషే § హెచ్చుగా కన్పిస్తుందీరచయితలలో! అయితే అలాగని చెప్పి వీరినందరినీ తీసివేయడానికివీలులేదు. అత్యల్పసంఖ్యాకులు వీరిలో కవితాత్మ కలవారు లేకపోలేదు; పలుమంది ప్రజ్ఞకు పెనగులాడినవారైనా ప్రతిభకలవారనలంటూ లేకపోలేదు. ఎలాగైతేనేమి మొత్తంమీద వీరు సమాజములోను సారస్వతములోను - మంచో చెడ్డో - కొంత సంచలనం కల్గించిన మాట వాస్తవం.

# కొన్ని అభ్యుదయగ్రంథాలు:

ఈ అభ్యుదయ ధోరణి ✻ ఈ కాలాన యువకుల నందరినీ ఆకర్షించి

§ "There are those, who once they have embraced an idea, will stake everything to push it through. And then there the disgruntled intellectuals who wear an idea, like a flower in the button-hole to cut a figure in the fashionable world Quite a large number of the Progressive Writers, it appears was recruited from the latter class The real motive of their revolt was not love but self-love." - Prof. Mohammad Sadiq.

✻ ముందుకు వెళ్లేటందుకు వెనుకను కలుపుకొని వెళితేనే క్షేమమని బోధిస్తున్న గేయం చూడండి: ఈక్రింద దేవులపల్లి, పోతుకూచి వారలన్న వాక్యాలను కూడ చూడండి:

కాలంకొట్టెడు గంటల గమనిక
లోకం నేర్పెడు సమానసూచిక
ఆకళించుకొని అనువర్తించుట
ప్రగతి కవి భారం! నేటి ప్రగతి కవి భారం!
వెన్ను మువిరెనా వెనుక యుగములు
మొగ్గ తొడగని ముందు యుగములు
ముందు వెనుకల భావ బంధము కలిగినట్లు
ఉపదేశించుట ఉద్బోధించుట
ప్రగతి కవి భారం! నేటి ప్రగతి కవి భారం! - పిల్లలమర్రి (మీజాన్)

" ఈ కాలంలో ప్రచారక వాఙ్మయం చాలా అవసరం దీనికోసం అందరూ ప్రయత్నించాలి ... ఈసంఘంలో అందరూ ఉండవచ్చు సమస్త మానవకోటీ ఒక్క **నూతనలక్ష్యం** దిశగా నడుస్తున్నది పాతప్రపంచం శిథిలమై, ఆస్థానంలో కొత్త ప్రపంచం ఉద్భవిస్తున్నది. ఈవిశ్వ జనీనభావం వైపు ఉన్నవాడే ఉండాలని ఎవరూ కోరరు రానున్న నూతన వ్యవస్థలో మానవుడే మకుటధారి " - దేవులపల్లి

" .అభ్యుదయశబ్దము సాహిత్య విశేషణమైనపుడు కేవలభౌతికాభ్యుదయము కాక, కేవల ఆర్థికాభ్యుదయముకాని అర్థముగా చెప్పుకొనరాదు భౌతిక మానసిక శక్తులకు సమన్వయమును కూర్చి, మనో వికాసమును, ఉత్తేజమును చేకూర్చగలిగిన సాహిత్యమే అభ్యుదయ సాహిత్యము .. " - పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి (ఆంధ్రవారపత్రిక 8-9-48)

వారికి అనుసరణయోగ్యమైనది◆. అన్ని పత్రికలూ దాదాపుగా ఈ ధోరణి వాఙ్మయాన్ని ప్రచురించి ఆదరించినవనవలె; ముఖ్యముగా "ప్రజాశక్తి - అభ్యుదయ" పత్రికలను చెప్పవలె; అయితే పత్రికలలోనే వీరి రచనలన్నీ నిలచిపోయినవి. చాలామంది అభ్యుదయమార్గగాములు గ్రంథరూపేణ వారి వారి రచనలను అందించనేలేదు. అయితే ఇటీవల ప్రచురింపబడిన వాటిని గమనించవలె; ఈ ధోరణిలో 1944 లో మొదట "నయాగరా" వెలువడింది; ప్రజాశక్తి ప్రచురణమయిన 'విప్లవగీతాలు' అనే పుస్తకము తర్వాత వచ్చింది. దాశరథి వ్రాసిన ఖండికలన్నీ "అగ్నిధార" అన్న పేరుతో (1949) వచ్చినవి; ఇంతకు పూర్వమే 'మీజాన్' పత్రికలో పనిచేస్తూవచ్చిన ఆంగీరస్, విద్వాన్ విశ్వం, శ్రీనివాస చక్రవర్తి, సుబ్బారావు, రామచంద్ర, మొదలైన యువ బృందంచేరి 'ప్రగతి' (1947) అనే గ్రంథాన్ని ప్రచురించినారు; సోమసుందర్ వ్రాసిన గీతాలన్నీ "వజ్రాయుధం" అనే పేరుతో (1949) వెలువడినవి; ఆరుద్ర "త్వమేవాహమ్", అనిసెట్టి 'అగ్నివీణ', (1949)✻ నారసరెడ్డి పుస్తకము, రెంటాల 'సంఘర్షణ' - అన్న వీ ధోరణికి చెందినవే మరికొన్ని గ్రంథాలు వచ్చినవి. ఎన్నాళ్ళనుంచో వస్తున్నదనుకొంటున్న శ్రీ. శ్రీ వ్రాసిన 'మహా ప్రస్థానము' కూడా ఈమధ్యనే (1950) వెలువడింది. ఇది గ్రంథముగా రావడం ఆలస్యమైనప్పటికీ, ఈ ధోరణి కవులందరికీ ఇది భారతం లాంటిది! ఈ విధముగా ఈ కాలానికీ ధోరణి రచనలు కొన్ని గ్రంథరూపం దాల్చినవి.

ఈ గ్రంధాలన్నీ ఒక నవ్యసాంఘిక వ్యవస్థకోసం పతిత జాత్యుద్ధరణము నిమిత్తము వ్రాయబడినవే. వీటిలో దైన్యులయెడ కరుణా, అధికారులపైన ఉక్రోషము, స్వాతంత్ర్యప్రీతీ, ఆత్మవిశ్వాసము నిండుగా కన్పిస్తవి; పదప్రయోగాలన్నీ చిత్రంగా

---

◆ వాసిరెడ్డి నాగేశ్వరరావు అను రైల్వే కార్మికునిచే వ్రాయబడిన "కూలోడ" పాట కష్టజీవులందరిని ఉత్తేజపరచింది. అలాగే శెట్టిపల్లి వెంకటరత్నంగారి "ఆగునా జీనాలు సాగునా లోకాలు", గరిమెళ్ళ సత్యనారాయణగారి "అన్యాయకాలంబు దాపురించిందిపుడు అందరము మేలుకోవాలండి" లోకనాధంగారి "రైతుకూలీ" మొదలైన గేయాలీ ధోరణివే!

✻ పుట్టపర్తివారుకూడ 'అగ్నివీణ' అని ఒక గేయ సంపుటి ప్రకటించినాడు ఇంతకు పూర్వమే.

ఉంటవి; వీటిలో ఒక ఉద్వేగము, ఊపూ, తూగూ స్ఫుటంగా కన్పిస్తవి. "నిప్పులకంఠం అగ్నివీణ - రక్తపతాకం - సామ్రాజ్య తృష్ణ - పీడితజాతి - విప్లవ శంఖం - జగన్నాధుని రధచక్రాలు" మొదలైన పదము లెక్కడబడితే అక్కడ గోచరిస్తవి. వీటి అన్నిటికీ శ్రీ. శ్రీ.. దే గురుపీఠమనవలె. అతని గీతాలే తర్వాత వారినెందరినో ఆవేశపరిచినవనినా (పరోక్షముగనైన) తప్పులేదు. వీరందరికీ రష్యావిప్లవవాఙ్మయము మకుటము. ఈ విషయము వీరి రచనలలో స్పష్టముగా కన్పిస్తుంది. కొన్ని పదాలు, వాక్యాలు అక్కడి భావాలను రచనలను అనువదించే ప్రయత్నములో విజాతీయమైనవై (సంకరములై) వెక్కిరిస్తున్నట్లు వీళ్ళ గ్రంధాలలో నిలచినవి కూడ ఉన్నవి. ప్రజలకర్థము కావలెనని వ్రాస్తున్న వీరు నిజానికి తత్ప్రయత్నములో విఫలురే అయినారనిపిస్తుంది, ఈ గ్రంధాలలో అనేక ప్రకృష్టపదబంధాలను చూస్తే, ఈ అభ్యుదయకవులలో చాలమంది రచనలు కేవలం వెర్రికేకలవలె ఉంటవి; అయితే భావములో తీవ్రత - హృదయములో ఆవేదన, భాషలో పదను, దృష్టిలో నైశిత్యము, ఎస్తువులో తాదాత్మ్యము, గుండెలో ధైర్యము, ఉక్తిలో వైచిత్రికలవారు ఏ కొద్దిమందో ఉన్నారు. శ్రీ. శ్రీ., దాశరధి, రామదాసు, అనిసెట్టి, సోమసుందర్ మొదలైన వారు తరతమ భావాలతో కన్పిస్తున్నారు.

## కొందరు రచయితలు:

భావకవిత్వం చెప్పి అపుడు పదిమందిలో ఒకడై, అతివాస్తవిక ధోరణి ప్రవర్తిలజేసి అక్కడా విఫలుడై, దేశకాల పరిస్థితుల నర్థంచేసుకొని 'రష్యా'వలన ఆవేశం (Inspiration) పొంది ఈమార్గానికి ప్రవక్తఅయి యువరచయితలలో పలువురిని అనుయాయులను చేసుకొన్నాడు, శ్రీరంగం శ్రీనివాసరావుగారు. ఈ మార్గ వర్తులందరికీ "రష్యాన్యామోహం" సమానధర్మం! అందరివీ "ధూకుడు రచనలే"! తామే సంఘనాయకులైన కవులమనే "అహంకారము" అందరికీ సమానమే! శ్రామికులపైన అవ్యాజానురాగం, అధికారం నెరపుతున్న అందరిపైనా ఉక్రోషమూ వీరి రచనలలో గోచరిస్తవి.

ఈ ధోరణి కవిత్వానికి శ్రీరంగం శ్రీనివాసరావుగారిదే పెట్టింది పేరు. ఈయన అందరికన్నా ముందే రష్యా విప్లవాన్ని అర్థంచేసుకొన్నాడు. అంతకు

ముందన్ని మార్గాలలోనూ 'ఎక్సుపరిమెంట్సు' జరిపి, ఈ ధోరణికికూడా శ్రీకారం చుట్టినాడు. యువరచయితలంతా కళ్ళు చెదరే 'అగ్నికిరీటపు ధగధగల'ను - 'ఎఱ్ఱ బావుటా నిగనిగల'ను చూచి, 'మరో ప్రపంచం'లోకి ఈయనతో ప్రవేశించినారు; "పతితులపైన - భ్రష్టులపైన - బాధాసర్పదష్టులపైన - దగాపడిన తమ్ములపైన -" జాలితో దృష్టులనునిగిడ్చి, ఆయనతోపాటు 'జగన్నాథుని రథచక్రాలు' వచ్చేసి ప్రజారాజ్యం స్థాపిస్తవని ఊరడించడం నేర్చుకున్నారు. అయితే ఏమిలాభం? శ్రీ. శ్రీ. రచనలకున్న విశిష్టత మరి వేటికీ లేదనవలె. ఈతడు సహజకవి. ఏ ధోరణిలో వ్రాసినా అతని ప్రతిభ ఎక్కడకు పోతుంది? అందుకనే "హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని యివ్వడం అతనికే తెలుసు. మాటల్ని కత్తులూ, యీటెలూ, మంటలుగా మార్చడం, అతనికే చాతనవును. ఇతడు ధ్వంసంచేసిన◆ పాత ఛందస్సులల్లోనుంచి పాతమూలుగులూ, Serenadings మూర్ఛలూ, వేదాంతాలూ, మత్తులూ పోయి దేశాలకి ఉత్సాహాలకి కదిలిపోయే యువకసేనలకి నూతనముగ నిర్మాతలకి Back ground music కింద Marching band కింద, కొత్తరక్తాన్ని కదను తొక్కించే సంగీతం" ✻ ఇతని గీతాలలోనే వినిపిస్తుంది; కవిత్వమితనికొక "తీరనిదాహం". "అలజడి మా జీవితం, ఆందోళన మా ఊపిరి, తిరుగుబాటు మా వేదాంతం" అంటాడితడు. ఇతని పదబంధాలూ, ఉక్తివైచిత్రీ

◆ "కవితా! ఓకవితా !" అనే శ్రీ. శ్రీ. వ్రాసిన అద్భుతగీతంలో ఛందోవ్యాకరణాలను పాటించక పోయినందుకు సమాధానముగా అంటాడుగదా -

నానిన్నని కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే -
అవి,
పుంఖాను పుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువులదాటి
వ్యాకరణాల సంకెళ్లు విడిచి
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి -
నడిగా, వడినడిగా
వెలువడినై, పరుగిడినై, నాయెద నడుగిడినై !

✻ చలం యిచ్చిన 'యోగ్యతా పత్రం'లోని వీ వాక్యాలు

అనుకరిద్దామనినా మరెవ్వరికీ చేతగానంత వైలక్షణ్యం కలిగినవి. చూడండి:

"కార్మికధీరుల కన్నులునిండా
కణకణమండే
గలగల తొణకే
విలాపాగ్నులకు, విషాదాశ్రులకు
ఖరీదుకట్టే షరాబు లేడోయ్!"

ఈ చివరి పాదములోని ఉక్తి విశేషము గమనింపతగింది.

"ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం"

ఈ గీతంలోని ఉత్తరార్ధం శాశ్వతసత్యాన్ని సూత్రప్రాయంగా చెప్పుతున్నది గనుక, ఈ రెండు పాదాలు వ్యవహారములో నిలిచి పోవచ్చు! అభ్యుదయ ధోరణిలో అనేక రేడియో నాటికల్నికూడ శ్రీ. శ్రీ. రచించినాడు. విజాతీయ రచనలనేకం అనువదించినాడు. మొత్తముమీద ఈ ధోరణికికూడ ప్రథముడై ఈయన రష్యా* మానసపుత్రుల సంఖ్య హెచ్చింపచేసీ, తన రచనలచేత వారిని తృప్తి పరుస్తూ

* రష్యా నాహ్వానిస్తున్న ఇతని గీతం చూడండి:-
సుప్త కంకాళాలు మేలుకొంటున్నాయి!
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది!
కార్మికులు, కర్షకులు, తాడితులు, పీడితులు -
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు
ప్రపంచం నీకోసం పరిపక్వంగా ఉంది!
కోటి గొంతులు నిన్ను కోరి రమ్మన్నాయి!
కోటి చేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి!
సైరా అంటూ రష్యా!
జై అంటూ రష్యా!
లేలేలే, రష్యా!
రారారా, రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా!"

అభ్యుదయకవిగా ఖ్యాతి గడించుకొంటున్నాడు.◆

అభ్యుదయకవులలో శ్రీ. శ్రీ. తరువాత పేర్కొన దగిన యువకుడు, మంచి ప్రతిభావంతుడు, దాశరథి కృష్ణమాచార్యులు. ఈతనిని రెండవ శ్రీ. శ్రీ. అనవచ్చు. ఈయన హైదరాబాదులో మానుకోట తాలుకాకు చెందిన గూడూరనే గ్రామములో 1927 (సెప్టెంబరు)లో జన్మించినాడు. సంప్రదాయ సిద్ధముగా సంస్కృతాంధ్రాలలో మంచి ప్రవేశము సంపాదించుకొన్న చిన్నవాడు. ప్రాచీనుల పద్య రచనా పాటవాన్నీ, నవ్యుల భావుకత్వాన్నీ అతినవ్యులవాఙ్మైశిత్యాన్నీ చక్కగా తన రచనలలో పదిలపరుచుకొన్న ప్రజ్ఞావంతుడు. కొంత కాలముగా కవితాసాధనము చేస్తున్న వాడైనప్పటికీ ఈతనిపేరు తెలంగాణా ప్రజాసమర సందర్భములోను, ఆ తర్వాతను బాగా పైకి వచ్చినదనవలె. 'అగ్నిధార' - 'రుద్రవీణ' లనే పేర్లతో ఈతడు తన ఖండ కావ్యాలను రెండుసంపుటాలుగా అందించినాడు. అంతకు పూర్వమే మాతృభూమి-ప్రజామిత్ర - గోలకొండ - సారథి - అభ్యుదయ - మొదలైన పత్రికలద్వారా 'దాశరథి' పఠితృలోకానికి పరిచితుడే. శ్రీ. శ్రీ. వలెనే ఈతడును భావకవిత్వాన్ని మొదట చెప్పినవాడే! ప్రకృష్టమైన పద బంధములు - రమ్యమైన భావకల్పనములు - ఇతని ఖండ కావ్యాలలో కనిపిస్తూ ప్రథమనవ్యుల (ముఖ్యముగా విశ్వనాథ - వేదుల) ధోరణులను జ్ఞాపకం చేస్తున్నవి; "ఉష - ఆమని - ఋతుషట్కము - వసంతకుమారి-త్రపామయీ" మొదలైన ఖండికలలో ప్రకృతి సౌందర్యానికి పరవశుడైన సుకుమార యువహృదయాన్ని చూడగలము.* రవీంద్రుని గీతాలను కొన్నిటిని అనువదించినందు

◆ ఈయన వ్రాసిన "అద్వైతం" "ఓ కవితా" అన్నవి శాంత చిత్తులనూ, "మహాప్రస్థానం" - "జగన్నాథుని రథచక్రాలు" అన్నవి ఉద్రిక్త హృదయులనూ బాగా తృప్తిపరిచే గీతాలని చెప్పవలె!

ఈ ధోరణిని వివరిస్తూఉన్న శ్రీ. శ్రీ. వాక్యాలు చూడండి.

"విప్లవకారులు సాహితీ జగత్తులోనూ వున్నారు. వీరి సందేశం కొద్దిమంది తమ చేతుల్లో పెట్టుకొనివున్న విజ్ఞానం, సిరిసంపదలు అశేష జనసముదాయానికి అందుబాటులో వుండేటట్టుచేసి సాంఘిక జీవితాన్ని సుఖమయము, శుభకరమూ చెయ్యాలని భూతలాన్ని 'స్వర్ణంగా' మార్చాలని యీ దృక్పథం .....వడివడిగా ప్రజలందరినీ ముందుకు నడిపించే కవిత్వం వ్రాయాలి. సంఘాన్ని ముందుకు నడిపించడమే విప్లవపంథా, అభ్యుదయరీతి!..."

- అభ్యుదయ సం 1 సం. 1

* 'వీణా వాదనానంద సంధ్యావీచీపరిజల్పిత స్తనకటీ నాభిప్రదేశాలతో వచ్చిన వాసంత కుమారిని' దర్శించిన ఈతడు ప్రేమ తపస్వికాక తప్పలేదు మొదట. అందుకనే సఖిని సంభావిస్తూ ' నవారుణ పల్లవికారసాల నిష్కుటముల గూడుకట్టికొని కోయిల కూయిలు చోట కోటి సంకటములు మాటువెట్టి వడగాడ్పుల యేడ్పులుదాటి శీతలోత్కట జలపాత తీరముల కాలము నేలము వేసికొంద' మంటున్నాడు! ఉమరు ఖయ్యాము తత్వం కొంత పట్టుబడినట్లే కన్పిస్తుది.

వలనకూడ ఈతని దృష్టి మన దేశాన్నీ, మన సంప్రదాయాన్ని వీడలేదని తెలుస్తుంది. అందుకనే దాశరథి ప్రారంభదశలో ప్రకృత్యారాధకుడైన భావకవిగా కన్పిస్తున్నాడు.

అయితే దాశరథి భావకవిగాకన్న అభ్యుదయకవిగానే నేడు పేరు గడించుకొంటున్నాడు; దేశంలోని (ముఖ్యంగా నైజాము ప్రాంతాలలో) అరాజకాన్నీ-(రజాకారుల) దౌర్జన్యాన్నీ - అన్యాయాలనూ చూసిన కవిహృదయం మహావేదననే పొందినది. అందుకనే దాశరథి అగ్ని పర్వతం◆ బ్రద్దలైనట్లుగా ఒక్క మాటుగా ఆవేశముతో దుష్టలోకంమీద విరుచుకొనిపడి, దేశీయులను ప్రబోధిస్తూ, విప్లవ శంఖాన్ని పూరించినాడు. ఆ ధోరణిని అంతా చూస్తే శ్రీ. శ్రీ. ని మించిన అభ్యుదయ కవి దాశరథి సుమా అనిపిస్తుంది; చూడండి:

"వెచ్చని కంటినీటినిక పిండెద నా కలమునుండి" అంటూ, "పరుల హింసించువారలు బాగుపడెడుమాట వట్టిది, నాశనమ్మౌట నిజము" అని శాపమే పెట్టుతున్నాడితడు. 'వేదన యేదియో కలత వెట్టును గుండియనెందుచేతనో' - 'నా చెవులలోన రుధిరవీణా కఠోర ఘోర ఝుంకారమేల డాగుకొనజూచెనో'! అని తనలోని కలవరాన్ని తెలియ జేస్తున్నాడు. 'ఓ నిరుపేదజీవి! . . . ఎన్నినాళ్ళీ నరకాన క్రుంగెదవు, లెమ్ము, సమాజము మార్చివేయగా' - అని పేదవానిని ప్రబోధిస్తున్నాడు; "నా గీతావళి ఎంతదూరము ప్రయాణంబౌనొ; అందాక ఈ భూగోళమ్మున అగ్గివెట్టెదను, ద్యోమణ్యుష్ణగోళమ్ముపై ప్రాగాకాశ నవారుణాస్త్ర జలధారల్ చల్లి చల్లార్చెదన్" అని ఉద్రేకముతో శపథం పట్టుతున్నాడు; 'నా తెలంగాణ కోటిరత్నాల వీణ, అంటున్నాడు. 'అనాదిగా సాగుతోంది అనంత సంగ్రామం, అనాధుడికి ఆగర్భ శ్రీనాథుడికీ మధ్య' అని గుర్తించి - 'స్వకుక్షింభర రక్షస్తతి పక్షాలను విరగ్గొట్ట

◆ ".. ఈతని కళ్ళల్లో దైన్యము గోచరిస్తుంది కాని హృదయంలో అగ్ని పర్వతము ఉంది . . దాశరథి మానవజీవితం ఇంత నికృష్టం, ఇంత దుఃఖపరిప్లుతం కావటానికి కారణం ఏమిటీ, జాతిని ఈస్థితికి తెచ్చిన దెవరు - ఎవ్వరా దురాత్ముడు? అని, కళ్ళెఱ్ఱజేసి భయంకరంగా సింహగర్జనలు చేసినాడు. అవే అతని గేయములు . . . దాశరథి కవిత్వానికి శాశ్వతత్వము వున్నది సామ్రాజ్యవాదము చచ్చేంతవరకూ, ధనికవాద పిశాచ సహస్రశిరాలు తెగి వ్రేలాడిందాకా ఈతని గేయాలకు అవసరమున్నది . . ." - మునిమాణిక్యం (కృష్ణాపత్రిక 2-4-49)

సమిధలుగా తేతెండోయ్' అనీ, భూవావళి బుగ్గిపోసి కోపావళి నగ్గిద్రోసి దీపావళి జరపండో అనీ జనుల్ని ఉద్బోధిస్తూ 'నిరుపేదా! నిరీక్షించు దివ్య దివ్య భవితవ్యానికి నిరీక్షించు' అని ఆశ గొలిపి ధూర్జటినై 'పరపీడాకరనిరుదార నిరంకుశ నీరసనిస్తేజ లోకానికి మార్జిన్ వేయాల'ని నిశ్చయించు కొంటున్నాడు; "చిరఖేదాగాధ మహాంబుధి విరిసిన బడబానల పద్మంలో వెలిసి"న "విప్లవబ్రహ్మ" అయి ఈతడు 'నవజగత్తునే పుట్టిస్తున్నాడు'. ఈవిధముగా తెలంగాణములో ధీరహృదయముతో, నిశితవాక్కుతో గొప్ప తిరుగుబాటును సాధించిన యువనాయకుడు దాశరథి ✻! ఇతడనేకులవలె ఒడ్డున కూచొని శ్రీరంగనీతులు బోధించినవాడుకాడు ; సాక్షాత్తుగా తెలంగాణా ప్రజాసమరములో దుమికి శ్రీకృష్ణజన్మస్థానాన్ని దర్శించి వచ్చిన సైనికుడు! కౌగిలించుకొనడము వలనకాక ఇతని దేశభక్తి కడుపులో నుంచే వచ్చింది. అందుకనే హృదయంలో జ్వలించిన భావానలాన్ని భాషానిలంతో స్వయంగా చెరిగిన విప్లవబ్రహ్మ కాగలిగినాడు ! ఈతని ఆవేశము, ఆవేదనా (శ్రీ.శ్రీ. పైనలె రష్యాప్రభాసం లేక) సహజమూ, సజాతీయమూ అయినవి; దీనినిబట్టే దాశరథి అభ్యుదయ కవులలో ప్రముఖ స్థానాన్ని చూరగొంటున్నాడనవలె ◆

పై యిద్దరితో పాండిత్యములో తులతూగలేక పోయినప్పటికీ అభ్యుదయమార్గాన గణనీయులైన రచయితలు కొందరున్నారు. వారిలో ఆవేశమే

---

✻ "...బ్రతుకు విలువలు నశించి పాడుపడిన యీ స్వార్థ ప్రపంచములో విప్లవాగ్నుల తుఫానును లేపుచున్నది నిజముగా యీయన కవిత్వము ... .పీడితప్రజల సమస్యలకు ప్రాధాన్యత యిచ్చి, గొంతెత్తి చెప్పగలిగిన కవివాణి దాశరథియే. దౌర్జన్యము, అన్యాయము, అక్రమములమీద తిరుగుబాటే ఒకమాటలో దాశరథి కవిత్వము ."

- 'అగ్నిధార' తొలిపలుకు. దేవులపల్లి రామానుజరావు.

◆ అసాధారణమైన ఉపజ్ఞను, బహుముఖమైన ప్రతిభనూ చూపెడుతున్న దాశరథి అభ్యుదయ కవుల్లోను, యితర విప్లవ రచయితల్లోను తలబంతి అనుపించుకున్నాడు. జన సామాన్యంయొక్క హృదయాలలోని ఆకాంక్షలను ఇంత శక్తివంతంగా ఇంత ధైర్యంగా వ్యక్తీకరించిన యువకవి ఆంధ్రావనిలో అరుదనిచెప్పిన అతిశయోక్తి కాజాలదు.

- సాధనసమితివారి 'ప్రత్యూష' నుండి.

హెచ్చు; రాజకీయ నినాదాలే వారి రచనలు.※ అయితే 'అనిసెట్టి' అభ్యుదయ రచయితలలో శిల్పదృష్టికల యువకవిగా అర్థవ్మైన ప్రజాదర్శాన్ని చూరగొంటున్న విషయము ఉల్లేఖించుకొనవలె ◆తత్త్వప్రీతి-కవితాపిపాసా ఇతనికి వెన్నతో పెట్టినవి; ప్రసిద్ధులైన సాహితీపరుల - (నాయని, కోలవెన్ను, ఆడివి, రాఘవరావు గారల) ప్రభావమితని హృదయముపైన, బుద్ధిపైన బాగాపడినది. నరసరావుపేటలో నవ్యకళా పరిషత్తునకు కార్యదర్శియై ఇతడు యువరచయితలతోడి సాహచర్యాన్ని సంపాదించినాడు; ఆంగ్లములో బి.ఏ., అయి ప్రత్యేకాభిమానముతో ఆంగ్ల సారస్వతాన్ని జీర్ణించుకొన్నాడు; తర్వాత మార్క్సిజాన్ని అర్థము చేసుకొని, దేశపరిస్థితులను అవగతం చేసుకొని అభ్యుదయ మార్గాన నడవడం ఆరంభించినాడీ అనిసెట్టి. ప్రజాశక్తి - అభ్యుదయ పత్రికల సంపాదకత్వము కొంత వహిస్తూ, తనవి అనేక రచనలను వివిధ పత్రికలలో ప్రకటిస్తూ సారస్వత రంగానికి తన జీవితాన్ని అంకితం చేసిన చేస్తున్న యువకవి ఇతడు. 1942 ఆగస్టు ఉద్యమంలో విద్యార్థి సమ్మెకు నాయకత్వము వహించి తనలోని కార్యనిర్వహణ శక్తిని, ఉద్రేకోత్సాహాలను వెలిబుచ్చిన యువకుడు §. హృదయములోగల ఆవేశానికీ ఆవేదనకూ ఇతర రచయితలవలె

※ "ప్రజాకవిత్వం పేరుతో - కేవలం రాజకీయ నినాదాల బోర్డుల్లాంటి గేయకవిత్వమో - లేక టెక్నిక్కే ప్రధానమని ఎంచే సాము గరడీల కవిత్వమో వెలువడ్డం ఆరంభించింది ఇందులోని మొదటిరకం కవులు - 'సూడో ఫోక్ లోర్', కవిత్వం - అనాది సిద్ధంగా వచ్చిన సాంస్కృతిక జీవితంలో మానవుడు ప్రకృతితో సంఘర్షించి సాధించిన కళాత్మక కాంతుల్ని విడిచిపుచ్చి - పచ్చి రాజకీయవాక్యాలతో నింపడంవల్ల కవిత్వం సాధించే శక్తివంతమైన ఉత్తమ ప్రయోజనానికి దూరమయ్యారు అలాగే రెండో వరుసకు సంబంధించిన రీతివాదులు (ఫార్మలిస్టులు) టెక్నిక్ లేని కవిత్వాన్ని ఊహించలేమంటూ - టెక్నిక్‌నీ కవిత్వాన్నీ రెండుగా విడదీస్తూ - టెక్నిక్ పేర పారకుణ్ణి దిగ్భ్రమలో ముంచే సాము గరడీలు చేస్తూ - అభ్యుదయ కవిత్వంలో రామరాజభూషణుణ్నీ - జేమ్సు జోయిస్‌నీ పునహా స్థాపిస్తూ - అర్థ ప్రేరణచేయని మాటల కూర్పుతో కవిత్వాన్ని నింపడంవల్ల వీరుకూడా కవిత్వం సాధించే ఉత్తమ ప్రయోజనానికి దూరమయ్యారు."

- సోమసుందర్,

◆ ఇతడు గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకాలోని పురుషోత్తమ పట్నంలో 23-10-1922 తేదీన జన్మించినాడు; గుంటూరులోని హిందూకాలేజి, ఏ.సి.కాలేజీలలో ఉన్నత విద్యాభ్యాసం చేసినాడు. కొంతకాలం (1944) మద్రాసులో లా చదివీ, ఆంధ్ర విశ్వవిద్యాలయములో (1946) ఎం.ఏ , ప్రారంభించీ విరమించినాడు.

§ ఆగస్టు ఉద్యమానికి చెందిన కరపత్రం వ్రాసినందున 1944లో మద్రాసులో అరెస్టుచేయబడి రెండు సంవత్సరాలు జైలులో ఉన్నాడు.

కాక శిల్పపరంగా ఒకరూపం కట్టించడానికి ఇతడ† మితముగా ప్రయత్నము చేస్తాడని తెలుస్తుంది. ఈ విషయ మితని 'అగ్నివీణ'లోని రచనలవలన ఋజువవుతున్నది.

◆ "ఇతని 'అగ్నివీణ'ను పట్టుకుంటే చాలు రోషవిస్ఫులింగాలు, కోపానలం, వీరాగ్నిజ్వాలలు, బహుముఖాల వెళ్ళగ్రక్కుతూ ఉండడాన్ని గమనిస్తాము : ఇందులోని రచనలన్నీ కవి హృదయాన్ని దూసుకొని వచ్చిన శరపరం పరల్లాంటివి. ఉద్రేకమూ, ఉక్రోషమూ, ఉద్వేగమూ వ్యక్తపరిచే ఈ 'అగ్నివీణ' లో భాషాభావాలు అహమహమికలతో ఒకదానినొకటి మీరుతూ వర్తిస్తున్నవి." "కరువున బడ్డ బెంగాల్ ప్రజకోసం - రంపమెత్తి రాళ్ళుకొట్టి ఊరుకట్టి దారివేసి కొమ్మలేని చెట్టుక్రింద కుమిలిపోయే కూలీలకోసం' - జగతిదాస్యముక్తికోసం - నైజాం ప్రజాబాధా నివృత్తి నిమిత్తం - రైతులకోసం - పురుషునితో సహగమిస్తూ రోషంతో పగతో కొడిగట్టిన వత్తిలాగు శ్మశానధూళిగా దహించుకుపోతున్న స్త్రీల, హక్కుల కోసం - బ్రిడ్జి క్రింద స్టేషన్లో ధూళిమీద . . . తిరుగుతూ, ఉండే దిక్కులేని తల్లులు దిగవిడిచిన

---

† గేయాలు, కథలు, రేడియో ప్రసంగాల్ను, నాటికలద్వారానే కాక అనిసెట్టి నాటకాలు కూడ రచించి వేయించి పేరుపొందుతున్నాడు. ఇతని 'గాలిమేడల'నే నాటకంపైన వేమూరి ఆంజనేయ శర్మగారు వెలిబుచ్చిన అభిప్రాయం కొంత చూడండి :

".. ఆంధ్ర నాటకరంగంలో కలుగుతూవున్న అభివృద్ధికి ఈనాటకము ఒక మచ్చుతునక . . . స్వార్థం, ద్రోహబుద్ధీ, మోసమూనూ, ఆర్థిక శక్తికి మాత్రమే ప్రాధాన్యాన్నిచ్చే ఈనాటి సాంఘికవ్యవస్థ మారితీరవలెనని ఈ నాటకం సందేశాన్నిస్తున్నది . . . శాస్త్రీయ దృక్పథంతో జీవితాన్ని చిత్రించడం ప్రేక్షకులను గూడా నాటకంలో పాత్రధారులనుగా చేయడానికి ప్రయత్నించడం - ఇవి రెండూ నాటకంలోని కొత్తవిషయాలు . . . ఆంధ్ర నాటకరంగం . . . కొత్త రాచబాటలమీద పయనిస్తున్నది. ఆ పయనంలో ఈ నాటకం ఒక మైలురాయి."

(కృష్ణాపత్రిక 19-8-1950.)

◆ పిల్లలమర్రివారి రేడియో విమర్శనుంచి -

" . . . ఈ రచనలు చదువుతూఉంటే గుండె జలదరిస్తుంది. శరీరం గగుర్పొడుస్తుంది. కళ్ళు చెమ్మగిల్లుతాయి . . . "

"ఇతని కవిత్వంలో అభ్యుదయ దృక్పథం విద్యుద్వాహినిలా ప్రసరిస్తుంటే, శిల్పనైపుణ్యం ఆ వాహినిలో నిగూఢంగావున్న వెలుగునూ వేడినీ జగత్తుమీదకు విరజిమ్ముతుంది."

- 'అగ్నివీణ' ముఖ పత్రంనుంచి

పిల్లలకోసం" ఈతని హృదయం అలమటించిపోయి ఆక్రోశిస్తున్నది. ఈ విషయం ఒక్క 'అగ్నివీణ' వలనేకాక, ఇతని కథల (అనిసెట్టి కథలు*) లోను, 'బిచ్చగాళ్ళ పదాల'§ లోను అన్నిటా వ్యక్తమౌతూనే ఉన్నది. అభ్యుదయ రచయిత లందరిలో సర్వసాధారణముగా కన్పించే 'అహం' భావ మితనిలో హెచ్చుగా ఉన్నట్లు ఇతని రచనలే చెపుతున్నవి. ఇతని వాక్యరచనలోను, పదబంధాలలోను, భావావేశము నపనయించే విజాతీయత £ విశేషముగా తొంగిచూస్తూ ఉంటుంది;*f* అయితే ఊహలు జీవితనైజముతో ఒరుసుకొని వెలువడుతూ ఉండడం ఇతని రచనలలో స్పష్టంగా కన్పిస్తుంది; మొత్తము మీద అభ్యుదయమార్గ వర్తులలో కవితాత్మఉండి, ప్రౌఢోక్తికోసం◆ ప్రయత్నించే విప్లవకవిగా అనిసెట్టి పేరుపొంది యువకుల వనేకుల

---

* "సుబ్బారావుగారి కారుణ్యాత్మకమైన హృదయం కథలన్నింట స్పందిస్తోంది."

"జీవితాన్ని, జీవితముయొక్క వేర్వేరు అంశలనీ, నిండుదనాన్ని, శుష్కత్వాన్ని, ఎత్తు పల్లాలను, కర్కశమార్దవాలను ఈరచయిత యధాగోచరంగా చర్మచక్షువులతో చూచి ఉద్విగ్నతతో చిత్రించారు' --రేడియో సమీక్షనుంచి

§ బెల్లంకొండ రాఘవరావుగారు దీనికి దర్పణాన్ని అమర్చి పెట్టినారు

£ "రక్తాక్షరాలు" - ఆత్మబలి" అనే అనువాద గ్రంథాలున్ను ఇతనివి వెలువడినవి. రష్యా వాఙ్మయాన్ని దిగుమతి చేస్తున్నవారిలో ఇత డొకడు

*f* 'వచ్చాను వచ్చాను వ్యాససంతతివాణ్ణి' - ఈ జగతినుంచి నూత్నజగతిని పెల్లగిస్తా' - 'భువనభవనమున చీకటి పునాది పెకలిస్తాను' - 'జీవిత సత్యజ్వాలా కీలాంగుళి స్పృశించి, నాతనువు వీణమీటిన నిలువెల్ల ప్రకంపిస్తున్నా ! ఇది నాధర్మం ! తపస్సు' - 'నలభైకోట్ల ప్రజా విప్లవకంఠం నా గీతం' - 'నారక్తం ధారపోసి నవలోకం స్థాపిస్తా' - 'నే రివ్వున తుపాకిగుండై చీల్చివస్తా' - 'సమరహృదయం నేను' - మొదలైన వాక్యాలే అహానికి దృష్టాంతాలు; ఈ ధోరణి చూచి "కవిత్వం ఏమిటి? కోతలు గాని?" - అనేవాళ్ళు ఒకప్రక్కన లేకపోలేదు.

◆ "మానవవృక్షంపండిన మధుర సలంకదా ఇప్పుడవిసి బెంగాల్ హృదయం - మీటిన నక్కలయే ఎల్లనికూటికుండ పడిపోయేరాత్రి; పిండినరక్తం కక్కే పిలికిన పొదుగు దిగివచ్చే పగలు - ప్రకృతి బాలింత పచ్చిపాలగుండె లాగుందేమి - తల విరబోసుకు రాత్రి జలక్రీడలాడుతోంది, సంఘ చక్రగమనంలో, ఇరుసునీకుటుంబమా - నానీడే నాకులేని నిప్పుల నడిఎండ - మొదలైన వాటిలోఉన్న ఉక్తివైచిత్రీ ఆలంకారిక రచనము గమనింపతగినవి. వీటిలో అస్పష్టత ఆవరించుకొని కొంత ఉన్నట్లు గోచరిస్తుంది.

"పూలచేల యౌవనాన పొంగిపోవు యువకసఖా భావికాల పదహతి నీఊహాసౌధము కూలున్ - చరిత్ర పవిత్ర సంగీతంలో అధిరోహణ దశలో నీ అడుగుతొ తప్పుడుతాళం వెయ్యకు - నొసటిరాతకు నోరు లేదోయ్ - నీ కుటుంబ మిసుకగూడు -' మొదలైన నాటిలో ప్రబోధం శాశ్వతమైంది.

నాకర్షిస్తున్నాడని మాత్రము గుర్తింపవలె.

అభ్యుదయ ధోరణిలో మొదటవెలువడిన "నయాగరా" గ్రంథకర్తలలో బెల్లంకొండ రామదాసనే యువకవి * (జననం కావలిలో : 13–8–1923 తేదీన) ప్రత్యేకముగా ఎన్నదగినవాడు. ఇత డొక విచిత్రవ్యక్తి. మొదట శివభక్తి. తర్వాత కృష్ణప్రేమ, అటు తరువాత సామ్యవాదములపైన తాత్పర్యాన్నీ అభినివేశాన్నీ కనబరచిన అభ్యుదయమార్గగామి యితడు. పత్రికలలో (ఆంధ్రప్రభ - దేశాభిమాని - సర్వోదయ) కొంతకాలము సంపాదకభారాన్ని మోసి విరమించిన స్వేచ్ఛాభిలాషి. అప్పుడప్పుడు పత్రికాముఖాన వెలువడిన యితని రచనలనూ "శ్మశానం"◆ అనే చిన్నపుస్తకాన్నీ (1940) చూస్తే ఇతడు మంచి ప్రజ్ఞ కలవాడేనని తెలుస్తుంది. "ధర్మయుద్ధంలో ఆహుతి అయ్యే అనేకజీవాల అరుపుల చప్పుడు కవిత్వ" మంటాడితడు; "ఆలోచించిన అలంకారాలు, రసౌచిత్యాలు, పదౌచిత్యాలు, ప్రయోజనాలు, శైలులు, బిగువులు, ఇత్యాదులన్నీ అర్థంలేని పిచ్చి నమ్మకాలు; కవిత్వానికి శత్రువులు" ఇతని దృష్టిలో!

---

* ప్రసిద్ధ సాహితీపరుడైన రాఘవరావుగారి కుమారు డితడు.

◆ శివుని సంబోధిస్తూ వ్రాసిన ఈక్రింది గీతంలో ఇతని భావనవ్యతను, ఉక్తి వైశిష్ట్యాన్ని గమనించండి ·

ఓ శివా! నీ జడల్లో అన్ని కాలాల్లో
సన్నగా స్రవించేగంగలో ఒకచిన్నలనై
నేనే ఒక రాగమై
పాడుకో కొత్తనడకలు పాడుమో
నా హృదయమే ఒక శ్మశానము
కాలిందోయ్ నిశ్శేవనిస్సాత్వికస్వార్థశవం
ఆ శ్మశానమే నీ నాట్యస్థలం
ఆడవోయ్ పాడవోయ్ నా గుండెకాటిలో
నేనే కాలిపోదామని పిస్తుందోయ్
ఆకాలిన బూదే నీ విభూతవుతే
నా భాగ్యం కాల్చవోయ్ నీ త్రినేత్రంతో
నా భావాలు కైలాసాలై
వాటిమీద నీవు కూర్చుంటే
నా గుండెలో రేగిన తాళాలే
మోగిన సంగీతాలే నీ పాదాలవుతే
నీ డమరకమవుతే
నా గీతాలే నీ భంగిమలవుతే
చాలు చాలోయ్
ఓ చంద్రశివా !
ఓ సూర్యశివా !

"... శ్మశాన గర్భిత రహస్య పరిశోధకుడైన యీకవి నిజంగా కవి. ఈతని హృదయం బౌద్ధ ధర్మపేటిక! ఈతని లేఖిని బుద్ధదేవుని సన్యాసదండము ! ఈతని ఓదార్పు గీతాలు శాక్యముని కమండలోదకము . . " - ( డి. కేశవరావు. ) అతిశయోక్తి కొంత తీసివేయవలె !

ఇతడు తన రచనలలోనేకాక జీవితములోను అభ్యుదయ కవే! ఏళ్ళ తరబడిగా వస్తున్న సాంఘిక నియమాలపైన విప్లవం తెచ్చి* నవసంఘాన్ని స్థాపించడానికి ఉద్యమించిన అభ్యుదయ కవులలో రామదాసు, శ్రీ. శ్రీ. తరువాత పేర్కొన వలసినవాడు. ఇతడు బుద్ధిపూర్వకంగా పుణ్యాన్ని విసర్జించినట్లు, సౌందర్యాన్ని విడిచిపెట్టినట్లు తానే చెప్పుకొనినాడు◆. ఇతని దృష్టిలో "సంఘం - మనకళ్ళకు గంతలు కట్టి మన కాళ్ళక్రిందనే, ఒక కత్తులబావి త్రవ్వుతున్నది;" దీనినుంచి తప్పించడానికీ 'సత్యము, శాంతము, శివము, సౌందర్యము అయిన ఒక సమస్త జగత్కల్యాణ సృష్టికోసం విధ్వంసకు దీక్షాకంకణం' ధరించినా నంటాడు; తన కృతులకు గ్రంధాకృతి ఇయ్యక పోయినప్పటికీ, అనిసెట్టి మొదలైన నవ్యకళా పరిషత్సభ్యులకూ - ఇంకా ఇతర అభ్యుదయ రచయితలకూ ఆవేశాన్ని (Inspiration) అందించిన గౌరవం దక్కించుకొనిన అభ్యుదయకవి ఈతడేనని తెలుస్తుంది. ఏమైనా ప్రతిభ ఉన్నంతగా ప్రచారం ఇతనికి లభించలేదనే చెప్పవలె. స్థిరంగా ఉండి ఏ మార్గానా నడవక పోవడము కూడ కొంత కారణమేమో మరి !

ఈ ధోరణి రచయితలలో పిఠాపురమునకు చెందిన ఆవంత్స సోమసుందర్ (జననము 1924) అన్నయువకు డెన్నదగినవాడు; యధార్థజీవితంలో 'బూర్జువాల' నిరంకుశత్వాన్ని నిరసిస్తూ, 'కుబేరలోకం సమాధిపై పేద జనుల కుచేలలోకం'

---

* మానవ మేధస్సుకు సంకెళ్ళను తగిలించిన గత సాంఘిక శిలాశాసనం పడగొట్టను పగిలిన నానిప్పుల కంఠం పలికిన విప్లవగీతం ప్రపంచాన్ని పసిఫిక్ రంగంగా పగిలించిన నా గీతం . . . కదలని సమాజ హిమాలయంలో కదిలే నవక్రాంతి బాడబాగ్ని మండించిన నాగీతం . . . యుగాలనుంచీ నడిచే నియమపుర్రైళ్ళకు పట్టాలను పీకేసిన నా గీతం . . శ్రామికజనఫాలంలో ఎండని ఘర్మజలం చల్లని చేతులతో తుడిచిందట. వర్గరహిత సంఘస్వర్గానికి పూలనిచ్చెనలు వేశిందట . . . నవలోకం చూపిందట . . . జీవితాన్ని విహంగం చేసిందట !" అంటాడు.

- 'నయాగరా'

◆ "నా సాహిత్యం ఒక విప్లవం. నాసాహిత్యం ఒకవర్తమాన సంఘ వ్యతిరిక్తతా ఉద్యమం. నా సాహిత్యం పాపంకోసం పుణ్యాన్ని విడిచిపెట్టింది. వికృతత్వంకోసం సౌందర్యాన్ని విడిచిపెట్టింది పాతాళంకోసం ఆకాశాన్ని పరిత్యజించింది. నా సాహిత్యం సమాజబాహ్యులైన అభాగ్యుల జీవన వటవృక్షపు పాపచ్ఛాయలో కూర్చొని 'ఈపాపచ్ఛాయ ఎందుకుంది' అనే ప్రశ్నను గురించి తపస్సు చేసింది..."

-రామదాసు (ఆంధ్రరాష్ట్రం 4-1-1948)

నిర్మించవలెనని ఉద్బోధిస్తూ, కవితావేశముతో విప్లవాన్ని వర్ధిలజేసిన తీవ్రవాణి ఇతనిది; తెలంగాణా ప్రజాసమర సందర్భాన 'నైజాం నాజినాన్ని' ఢీకొన్న "వజ్రాయుధ" పాణి ఇతడు; యుగధర్మం చైతన్యమనీ, జన హృదయములో పోరాటమున్నదనీ గుర్తించి తిరుగుబాటు తెచ్చిన 'విప్లవకవి' ఇతడు. "లేనివాళ్ళ నరాలరక్తం సారా త్రాగి త్రాగి మత్తెక్కిన కలవారల పొగరుమోతు లోకం రేపో యెల్లుండో కూలిపోక మానదని, అపుడు ఈ జీవితం బరువులు - అపచారాలు - గాయాలనుంచి విమోచనం పొందుతుందని" విశ్వసించినవాడు. 'ధనస్వాములు దేవుని కొనివేశా'రని, 'దేవునిశ్రవణ పుటమ్ముల కరగించిన సీసం పోశార'ని అంచాతనె పేదల అన్నార్తుల దీనారవముల శ్రవణాలకు చేరువకానీయని "చెవుల్లేని కారురాతి దేవుడు గుండెలేని బండవెధవ దేవుడ"ని గుర్తించినా డితడు. 'దినమంతా రక్తం ధారవోసి పరిశ్రమించే దీనుల ఒక్కటిగా . . . సమీకరించుటకోసం - నిర్దయగా పరాన్నభుక్కుల హతమార్చుటకోసం - వర్గరహిత స్వర్గమ్మును స్థాపించుటకోసం" - కాంక్షించినట్లు అదే తనతీరని తపస్సన్నట్లు తెల్పుతున్నాడు. ఈరకమైన భావాలను అభ్యుదయ రచయితలందరూ ఇంచుమించుగా వెలిబుచ్చుతూ వచ్చిన సోమసుందర్ రచనలలో కవివాణి, కవి హృదయం అధికంగా కన్పిస్తవి; అలంకారాలు, కవి సమయాలు, సాంకేతికాలు, రాయప్రోలు బసవరాజుల ధోరణులు, కన్పిస్తూ ఇతని రచనలు భావకవిత్వానికీ, అభ్యుదయ ధోరణికీ (రచనా సందర్భాలలో కొంత) వంతెన వేస్తున్నవా అనిపిస్తున్నవి*. తన "వజ్రాయుధా"న్ని తన "భావంలో భావమైన భావనకి" అంకితము చేసుకొనడము వలనకూడ సోమసుందర్ అభ్యుదయ మార్గాన

---

*ఆశాసుమ మూలాసౌరభ మిది వీడలేను - నీహృదయం నెత్తురు చిందిన గెడ్డయి, తుఫానులో రాలిన జీర్ణపత్రమై - ఆతారను పీక నులిమి చంపిందేదో చీకటి. చీకటి పిశాచి చచ్చెను; తాటకివలె, పూతనవలె, మేరువుగా శవంపడెను - పాపం లోకం కోపం విసరినశాపం" - మొదలైనవాటిలో అలంకారాల[illegible]న. ఉక్తి వైచిత్రిపైనా ఈకవికి దృష్టి ఉన్నట్లు స్పష్టం.

"తల్లీ ఏడవకమ్మా ! మళ్ళీ జన్మన్నది మాకుంటే చల్లని నీ కడుపున జన్మిస్తాం', అన్నపుడు రాయప్రోలూ, "పోరండి బ్రతుకుకై, పోరండి పుడమికై, పోరండి స్వేచ్ఛకై" అన్నపుడు బసవరాజూ కన్పిస్తున్నారు.

నడుస్తున్న భావకవే కాని చాలమందివలె, కేవల 'విప్లవ రచయిత' మాత్రంకాడని ఋజువవుతున్నది.

ఈ అభ్యుదయ ధోరణి అతివాస్తవిక ధోరణినుంచి వచ్చినదని తెలుపుతూ శ్రీ.శ్రీ. శిష్ట్లా, నారాయణబాబు, రుక్మిణీనాధశాస్త్రిగారలు "తద్వంశపురుషులనీ, (మొదటి తరంవాళ్ళనీ) - రెండవతరానికి చెందినవారు అనిసెట్టి, రామదాసు, ఏల్చూరి, ఆరుద్ర మొదలైనవారనీ - ఇందులో మూడవతరంవారు (రెంటాల మొదలైనవారు) కూడ వస్తున్నారనీ వీరు తమ "ప్రవర'లో ◆ చెప్పుకొంటున్నారు. శ్రీ. శ్రీ. మేనల్లుడైన "ఆరుద్ర"ని (భాగవతుల శంకరశాస్త్రి : జననం 1925) రమణారెడ్డినీ, మరికొందరినీ వీళ్ళలోవీరు ఆకాశానికి ఎత్తివేస్తున్నారు; § 'త్వమేవాహమ్' (కళాకేళి ప్రచురణం) పుస్తకానికి టిప్పణి వ్రాస్తూ "ఆరుద్ర" ఉన్నాడు గనుక ఇక తాను పద్యాలు వ్రాయకపోయినా పర్వాలేదని శ్రీ. శ్రీ. అంటున్నాడు. అంటే 'ఆరుద్ర' ఈ ధోరణి రచతలలో శ్రీ. శ్రీ. నే మించిన మొనగాడన్నమాట; వాస్తవికులు, అతి వాస్తవికులూ ఐనా వీరతిశయోక్తిని మాత్రం వదలలేదనిపిస్తుంది!' 'ఆరుద్ర' తెలంగాణ విప్లవాన్ని, సామ్యవాద వ్యవస్థను 'త్వమేవాహమ్' రచనకు భిత్తికలు (Background) గా గ్రహించినాడట. కావచ్చు; కాని వీరనుకునే ప్రజాసామాన్యానికిది అర్థంకాదని చెప్పవలె! తన రచనలలో (రేడియో నాటికలలోకూడ) "కాలం గురించి తన గాఢజిజ్ఞాస" ను తెలియజేస్తూ అన్నిటా సంప్రదాయాన్ని 'ఛిద్రం' చేస్తూ భాషలో అన్యదేశ్యాలను అపరిమితంగావాడుతూ "టెక్నికే" ప్రధానంచేసుకొని వ్రాస్తున్న

---

◆ రెంటాల "సంఘర్షణ"కు నారాయణబాబువ్రాసిన 'ప్రవర'ను చూడండి.

§ పరస్పర మభినందించుకొంటూ, ప్రశంసించుకొంటూ ఉండే సంఘమని (Mutual admiration Society) వెనుక భావకవులనన్నట్లే వీరినిగూర్చికూడ అనేవారు ఈ కాలానికి బయలుదేరినారని గమనిస్తాము. అంతేకాకుండా ఎంత అయోమయంగాను అర్థంకాకుండాను (అదంతా టెక్నిక్ అంటూ) వ్రాస్తే అంత గొప్ప అతివాస్తవిక కవి అనీ, ఎంతగా ఆవేశంతో కేకలూ బొబ్బలూ వేస్తే అంత గొప్ప అభ్యుదయకవిఅనీ అనే క్రిందికి దిగిపోయిన వీరెండు ధోరణులున్ను! అందుకనే అసంఖ్యాకులు అభ్యుదయ రచయితలు బయలుదేరినారు; రచయితకాని వాడిదేపాపం! వ్రాసినదల్లా అచ్చులో అగుపించేందుకు అనువైన కాలమైను ! ఏది గుల్లమో ఏది గాడిదో చూడరాని సామ్యదృష్టి ఫ్యాషనైపోయె ! ఎవరినేమని అంటాము? అన్నీ ఆణిముత్యాలే.

'ఆరుద్ర' వీరందరి తలల్లోనుంచి దూరి వచ్చిన అభ్యుదయ రచయిత అని మాత్రం అనిపించుకొంటున్నాడు !*

తెలంగాణము అభ్యుదయకవిత్వధోరణికి అపుడు అనుకూలమైన వాతావరణము కల్గిఉన్నది ; ప్రజాప్రబోధం అవసరమైనది అక్కడ. తెలంగాణా ప్రజాసమరాన్ని వస్తువుగా చేపట్టిన అభ్యుదయకవు లెందరున్నా, వారిలో చాలమంది దూరాన ఉండి రాళ్లురువ్వినవారే! అలాకాక, ప్రత్యేకంగా తాను తెలంగాణ ప్రజానాయకుడై, ప్రజాకవి అయి ప్రబోధించి తాను తెలంగాణ ప్రజానాయకుడై, ప్రజాకవి అయి ప్రబోధించి త్యాగముచేసి, జైలుకు వెళ్ళిన దేశభక్తుడు కాళోజీ నారాయణరావనే (జననం 1904) న్యాయవాది. అందుకనే ఇతడు అసలైన అభ్యుదయకవి; చేతలోను వ్రాతలోను విప్లవకారుడు. రజాకార్లదురంతాలను నిరసిస్తూ తత్ప్రభుత్వాన్ని ముఖాముఖి ఎదుర్కొన్న యువకవిధీరుడితడు¶. అక్కడ

---

* "Confusion ముట్టడించి Anxiety గుప్పిటనుంచి, స్వర్గారోహణం సమయంలో Two-way Switch మీదనుంచి, ఆర్పేస్తారన్న భయంనుంచి, నిరుత్సాహము నిషానుంచి, విషాదం బారినుండి, వినాశం దారినుండి మముబ్రోచే వారెవరూలేరా" అనే ప్రశ్నకూ నిరాశకు "వీల్లేదిదుగో సామ్యంఖిల్లా మనదే జగం ఆఖేదం అయితే అల్లా కూడా స్వామ్యం వీల్లేదియ్యా దొరాకవీ ఇకరయితే" అంటున్నాడు. మేనమామ పోలిక ఎక్కడకు పోతుంది? ఆరుద్ర కొరకరానికొయ్య' అయినా ఈయుగాన బలవత్తర కంఠాలలో అతనిదొకటి కనుక గమనించవలె' నని అంటారు సోమసుందర్.

¶ "నల్లగొండలో నాజీశక్తుల నగ్నన్మృత్య మింకెన్నాళ్ళ"ని ధట్టించినాడు. "కత్తులు దూసుకువచ్చేవారితో మెత్తని మాటలు ఎందులకు? చీటికి మాటికి చిర్రను వారితో స్నేహభాషణమెందుల"కంటాడు. "హద్దుమీరి అధికారవర్గము ఆడిన ఆటలు చాలింక: రాజుపేరట అరాచకమునకు జరిగిన పూజలు చాలింక; పాలనపేరట పల్లెపల్లెలో జరిగిన పాపము చాలింక; బీదల సర్వస్వముతో ధనికులుచేసిన బేరము చాలింక; విచ్చలవిడిగా ప్రాణమానముల పాడిన వేలము చాలింక; . . . నిక్కుచు నీల్గుచు నిరంకుశత్వము చేసిన నృత్యము చాలింక కాలము వ్యర్థము చేయగ కళ యని వ్రాసిన కైతలు చాలింక, కైతచేత మేల్కొల్పకున్న కాళోజీ కాయమే చాలింక" అన్న ధోరణిలో ఇతని దేశభక్తి ఎంత అకుంఠితమైనదో, లోని వేదన ఎంత తీవ్రమైనదో అవగతము కాగలదు

ప్రజోద్యమాన్ని ◆సంస్కార వాంఛనూ దీప్తిమంతముచేసిన విప్లవకవి; పాటలువ్రాసి, వాటిని ప్రజాముఖాన† విన్పించి నాటి ప్రభుత్వండొక్కలో బల్లెమును గ్రుచ్చడములో 'కాళోజీ' రెండవ 'గరిమెళ్ళ' అనే చెప్పవలె. ఇతనిది తీవ్రమైనవాణి; వాక్చాతుర్యము - వ్యంగ్యము - అధిక్షేపము - మృదుల హాస్యము ఇతని రచనలలో కన్పిస్తూ ఉంటవి. చూడడానికి సన్నగా‡- వేషములో మహరాష్ట్ర డిలాగా కన్పించినా, తీవ్రమైన కవితావేశము దేశభక్తీ గల ఆంధ్రుడని ఇతని రచనలవలన తెలుస్తున్నది. భాగ్య నగరములో 'వైతాళిక సమితి' స్థాపించి, "కాళోజీకథల"ను ప్రచురించి, గోలకొండ మొదలైన పత్రికలలో విప్లవ గీతాలను, సంస్కారగేయాలను వెలువరించి, ఉర్దూభాషా కవితచెప్పి, సారస్వతరంగంలో స్థానం గడించిన 'కాళోజీ' ముఖ్యముగా గేయకవిగా (సాధించిన ప్రక్రియనుబట్టీ), విప్లవకవిగా (అనుసరించిన విధానాన్ని బట్టీ) తెలంగాణములో గణన కెక్కుతున్నట్లు గమనిస్తాము.

## మరికొందరు :

పైన పేర్కొన్న వారేకాక నేడు అభ్యుదయపధాన నడుస్తున్న యువరచయిత లెందరెందరో బయలుదేరినారు. చాలమంది రచనలలో ప్రత్యేకత లేక పోవడము,

---

◆ "ఆపనిలో జరిగేటి అవకతవకల"కు ఇతని రచనలు కొరడా పెట్టువంటివి! సమకాలిక రాజకీయాల్లోని ఒడుదుడుకులను, నాయకుల తప్పులను, ప్రభుత్వాల దౌర్జన్యాలను సంఘములోని అవినీతినీ, కపటాన్నీ ఈయన కనికరం లేకుండా విమర్శిస్తాడు... అభ్యుదయ కవిత్వానికి ఉండవలసిన ప్రయోజనమూ, ఆనందమూ (?) ఈయన కవిత్వంలో తప్పకుండా ఉంటాయి...
-- 'ప్రత్యూషనుంచి.'

† "ఈయన గేయములు ప్రజల నాకర్షించినట్లుగా మరియెవరి గేయములు ఆకర్షించలేదు. సంస్కరణల గురించిన గేయములకు తెలంగాణమున కలిగిన బహుళ ప్రచారము నిరుపమానమైనది..." -- దేవులపల్లి రామానుజరావు.

‡ "..బక్కపల్చగా, ఎత్తుగా, పొడుగ్గా ఉంటాడు. హైదరాబాదులోగాని, ఒరంగల్‌లోగాని ఏ భిక్షువువంకనో, దీనవదనయైన ఏ వృద్ధురాలివంకనో జాలిగా చూస్తున్న మనిషి మీకు ఎవరైనా కనపడితే అతడే కాళోజీ ఏమోనని అనుకోటంలో తప్పులేదు; పదింట తొమ్మిదిపాళ్లు అతడు కాళోజీ అయిఉంటాడు... దుఃఖితుల బాష్పప్రవాహశీకరాళి ఈతని కనుగుంటలలోపడి నిలచిపోయినది ... ఈతడు అచ్చమైన ప్రజాకవి" -- మునిమాణిక్యం (కృష్ణాపత్రిక)

కేవలం అనుకరణమే కన్పిస్తూ ఉండడము గమనింపదగిన అంశం! సమకాలిక సాంఘిక రాజకీయ అన్యాయాలను ఖండించి నవసమాజమును స్థాపించడము, ప్రజల నుద్బోధించడము అందరి రచనలలోను సమానంగా ఉన్న ధోరణే; లోపి ఆవేదనకు, ఆవేశానికీ తగిన వాక్పటిమ లేకపోవడము, వాక్పటిమకు తగిన అంతశ్శుద్ధి లేకపోవడము, ఇవి ఉంటే కవిత్వాంశము కొరవడడము కారణాలుగా చాలమంది రచనలు గణనీయములు కాకపోతున్నవి; ఆమధ్య భావకవిత్వం ఫ్యాషనైపోయినట్లే ఈకాలానికి (1950) అభ్యుదయ ధోరణి ఫ్యాషను క్రిందికి దిగి పోతున్నట్లు కన్పిస్తుంది. చాలమంది రచనలు పత్రికలలోనే నిలిచి పోయినవి; కొద్దిమంది ఇపుడిపుడే తమ రచనలకు గ్రంధాకృతి నిస్తున్నారు; అక్కడక్కడ వీరి రచనలలో తళుక్కుమని ప్రతిభ కన్పిస్తూనే ఉన్నది. అయితే ఈ ధోరణి రచనలు గతాను గతికములయి పోతున్నట్లు మాత్రం గమనిస్తాము; ప్రజాకవిత్వమంటూ ప్రజల కర్థముకాని ఇంగ్లీషుపదాలు, సంస్కృతసమాసాలు, విజాతీయ వాక్యనిర్మాణరీతులూ, శబ్దార్థాలంకారాలు, అధికంగా పొందిస్తూ అహంభావాన్ని ప్రకటించే రచయిత లెక్కువై పోయినారు; అంటే వస్తువులో భిన్నతేకాని, ప్రయోజనాన్ని గమనించనివే అనేకుల రచనలన్నమాట; అందుకనే వీరిలో వీరికి తగవువచ్చి "అభ్యుదయకవిత్వం' ' "ప్రజాకవిత్వానికి" భిన్నమనే అభిప్రాయం ఒకటి బయలుదేరినట్లు గమనిస్తాము. 'నయాగరా' కర్తలలో ఒకడైన కుందుర్తి ఆంజనేయులు ✻ (జననం 1922) అట్లాకాక ఈ మార్గమును కొంత అర్థంచేసుకున్న అభ్యుదయ రచయితగా కన్పిస్తున్నాడు; సమకాలిక రాజకీయసంఘటనలను ◆ శక్తివంతమైన ప్రజలభాషలో ఎరుగజేసి వారిని ప్రబోధింపజూచిన అల్పసంఖ్యాకులలో 'కుందుర్తి' ఒకడు. ఈవిషయాన్ని ప్రజాశక్తి

✻ ఇతడు విశ్వనాథకు (1940-42) శిష్యుడై మొదట 1937 మొదలుకొని కొంతకాలము భావకవిత్వ మార్గాన నడిచిన ప్రేమతపస్వి అనీ 1942 నుంచి శ్రీ శ్రీ. ప్రభావానికి లోనై అభ్యుదయ రచయితగా పరివర్తనం పొందినాడనీ తెలుస్తుంది.

◆ 'మన్యంలో' - 'యుద్ధకాలం' - 'ఆకలియాత్ర' - మొదలైనవన్నీ ఆవేదనా పూరితాలు;

అభ్యుదయ - జ్యోతి - పత్రికలలో కనబడే యితని రచనలే ఋజువు చేయగలవు‡; భావన కన్నా, వాస్తవిక కథనం ఇతని వచనాలలో చూస్తాము. రెంటాల గోపాలకృష్ణ* ప్రచురించిన (1950) "సంఘర్షణ" అనే పుస్తకము కూడ ఈశ్రేణికి చెందినదే. అనిసెట్టి, రామదాసుల రచనల ఛాయలే ఇందులోను కన్పిస్తున్నవి. 'నా గేయం జడతమీద పగబట్టిన పెనుసర్పం' -- 'లోకంలో శోకించే పతితుల ప్రాణాలన్నీ నాపాటల వృక్షంపై పక్షులుగా విశ్రమించు' - నా కావ్యజ్యోతి కాంతిలో నరహృదయం వెతుకుతాను' - అనడములో అభ్యుదయ ధోరణివాడైనా "పంటచేలో మంచెపైనా పరిగపిట్టల పారద్రోలే కాపుకన్నెల వలపు కులుకుల తళుకుచూపుల కొరిగిపోతు" వెన్నపూస అయిపోతున్నాడు! అందుకనే అక్కడక్కడ భావకవిత్వధోరణి వదలనట్లు కన్పిస్తాడిత డనడము.

ఈ అభ్యుదయ మార్గాన భావకవులుకూడ అనేకులు నడుస్తూ వచ్చినట్లు గమనించవలె; అందులో ముఖ్యుడు అడివి బాపిరాజుగారు: మతవిప్లవము, ఆంధ్రుల దైన్యము - కూలీలు - వస్తువుగా ఈయన అనేక గీతాలను (1947 లో) వ్రాసినాడు;

---

‡ 'శ్రామికులను దోచుకునే సంఘస్థితి పోవాలని సమాజంలో రివల్యూషన్ రావాలని పోరండి! - జగమొక సమిష్టికుటుంబంగా చేసేందుకు వీలున్నది - మానవత్వం హింసకు తల ఒగ్గదనీ, మనిషిబలం ఏనాటికి తగ్గదనీ నాకు తెలుసు - "వీరందరి రచనలలో కవిత్వంకన్న ఉపన్యాసధోరణే కన్పిస్తుందని గమనిస్తాము. "కూటికోసం దుర్నీతులు, కోటీశ్వరుడి రాతిగుండె ప్రాణానికి మానానికి కరువుల్లో తల కొరువులు నశించాలి! నశించాలి!" అనే వచనాలలో అభ్యుదయదృష్టి కన్పిస్తూనే ఉన్నది.

* "... వీరి కవిత్వంలో వింతవింత పోకడలు, వివిధ గమకాలు, రాగంబాణీ, తానంమీటూ కనబడతాయి. ఈకావ్య సంగీతంలో ప్రతిశీర్షికాకూడా ఎత్తుపల్లాల్లేని మానవసమైక్యత, అనేక ప్రతిధ్వనులతో ఎలుగెత్తి చాటుతుంది" అని మెచ్చుకున్నాడు నారాయణబాబు.

"ప్రతిభ"లో బాలగంగాధర తిలక్ "మాగ్నాకార్టా"‡ తీవ్రధోరణికి చెందినదే; దేశస్వాతంత్ర్యము వచ్చిన తరువాత దానితోపాటు వచ్చిన దుష్ఫలితాలను నిరసిస్తూ అనేక యువకులీ అభ్యుదయధోరణిననుసరించి గీతాలు, నాటికలు వ్రాస్తూవస్తున్నారు; ఆనందవాణి - ఆంధ్రరిపబ్లిక్ - సారథి - గోలకొండ - కాగడా - స్వతంత్ర - మొదలైన పత్రికలలో చాల వాటిలో ఈరకపు రచనలు ప్రచురితాలవుతూ వచ్చినవని గమనిస్తాము; చాలమంది రచనలు గ్రంథరూపం దాల్చలేదనే చెప్పవలె; అయినా ఎందరెందరీ మార్గాన సంచరించి తమలోని వేదననూ, కరుణనూ గీతాలద్వారా వెలిబుచ్చినారో లెక్కలేదు; నవకుమార్ 'ఖబడ్దార్ నైజాం' - పెనుమర్తి కామేశ్వర రావు 'కబేళా సూరిశెట్టి జగ్గయ్య రైతోడా' - బాలాజీ 'ముద్దరాలు' - యర్రోజు మాధవాచార్యులు 'అద్వైతం' - ధవళా శ్రీనివాసరావు 'మతమౌఢ్యం' - వెల్దుర్తి మాణిక్యారావు 'క్విట్ ఇండియా' - శ్రీకృష్ణ 'తెలుగోడా'* - తుమ్మల వెంకట్రామయ్య 'లంగరెత్తు' - ఆంజనేయ ప్రసాద్ 'కదలండి' - ధనకుధరం వెంకటాచార్య "ప్రజాసముద్రం

---

‡ మేం మనుష్యులం
మేం మహస్సులం
గుండె లోపలిగుండె కదిలింది
తీగ లోపలితీగ సవరించి
పాటపాటకి లేచు కెరటంలాగ
మాటమాటకు మ్రోగు కిన్నరలాగ
మేం ఆడుతాం మేం పాడుతాం
మేం ఉపాసకులం మేం పిపాసువులం
భూమి అంబుల వెలుగుతెరకట్టి
తారకలగతి కొక్క శ్రుతిపెట్టి

పాట పాటకి వెండి దారంలాగ
మాట మాటకి మండు దూరంలాగ
మేం సాగుతాం మేం రేగుతాం
మేం నవీనులం మేం భావకులం
పాతలోకంగుండెలో శతఘ్ని పగిలించి
భావికాలం చంద్రకాంత శిలలకరగించి
పాటపాటకి సోకు స్వర్గంలాగా
మాటమాటకు దూకు సింహంలాగా
మేం నిలుస్తాము మేం పిలుస్తాము
మేం మనుష్యులం మేం మహస్సులం
మాకు దాస్యం లేదు మాకు శాస్త్రంలేదు
మాకు లోకం వొక గీటురాయి
మాకు కరుణ చిగురుతురాయి
* * *
మేం పరపీడన సహించం
మేం దివ్యత్వం నటించం
గాలి గుఱ్ఱపుజూలు విదిలించి
పూలవర్షం భువిని కురిపించి..
మేం నిలుస్తాము

* దీనికి మంచి ప్రచారం దేశంలో లభించినది.

పొంగింది'', ''పిడుగుదెబ్బ''- భాగి నారాయణమూర్తి 'స్వాహా' పొట్లపల్లి "జీవితము" - ఏల్చూరి 'ప్రజాశక్తి' - ఓగేటి శివరామ కృష్ణ'ముక్తేదోయ్' - గడియారం రామకృష్ణశర్మ 'అగమ్యాంధ్ర' - చిరంజీవి 'దేశం మాట్లాడింది' అన్నగేయాలూ - కొనకళ్ల వెంకటరత్నం గీతాలు - చదలవాడ పిచ్చయ్యగీతాలు - వట్టికొండవారి పదాలు - 'క్రాంతిగీతాలు' - మొదలైనవెన్నో ఈ అభ్యుదయ ధోరణికి చెందిన గీతాలై తత్కర్తలను ఈ మార్గానుయాయులనుగా తెలుపుతున్నవి.

కంభంపాటి సత్యనారాయణ "ఏం చేయాలి" (లెనిన్‌ది) - మానేపల్లి తాతాచార్య "రష్యన్ సమస్య" - నిడమర్తి ఉమారాజేశ్వరరావు 'కమ్యూనిస్టు సూత్రాలు' - గద్దె లింగయ్య "ముగ్గురు మిత్రులు" (గోర్కీది) - క్రొవ్విడి లింగరాజు 'అమ్మ' (గోర్కీది) - కంభంపాటివారి 'నేటి సోవియట్ యూనియను' - నిడమర్తి 'వింతమనస్తత్వం' (గోర్కీది) - మహీధర సోదరుల గ్రంధాలు - ప్రయాగ 'ఇటలీ కధలు' (గోర్కీది) - చెకోవ్ కధలు - త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ వారి ఆర్థిక శాస్త్రముపైన గ్రంథాలు (కర్తరామారావు) - నార్ల వెంకటేశ్వరరావుగారి "కొత్తగడ్డ" అనే నాటికల సంపుటి - అభ్యుదయ కధలు - పి. వి. రాజమన్నారుగారి "ఏమి మగవాళ్లు" అన్న నాటికల సంపుటి - కొండముది గోపాలరాయశర్మ వ్రాసిన "న్యాయం, ఎదురీత, ఏకదేశం" అన్న నాటికలు - పులుగుండ్లవారి తుఫాను - ఆత్రేయ వ్రాసిన 'N.G.O.' -ప్రగతి - 'పవిత్ర సంకల్పం' మొదలైన నాటకములు - సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు వ్రాసిన 'తెలంగాణనాటిక' - అనేక టాల్‌స్టాయి చెకోవ్ అనువాదాలు - పర్చా దుర్గాప్రసాదరావుగారి 'గెలుపు మనదే' - పాలగుమ్మి పద్మరాజుగారి 'యుగసంధి' (టూర్జెన్యోల్‌ది) మొదలైనవీ - ప్రజాశక్తి - ప్రగతి ప్రచురణలు - కళాకేళీ ప్రచురణలు - ప్రజాసాహిత్య పరిష్యత్తు ప్రచురణలు - మొదలైన పుస్తకాలెన్నెన్నో ఈ కాలాన ప్రచురితాలై ప్రజావాఙ్మయాన్ని అభివృద్ధి పరుస్తున్నవని గమనిస్తాము. ఈ ఉదాహరించిన పుస్తకాలలో కొన్ని రాజకీయసిద్ధాంతాలను సాక్షాత్తుగా ప్రచారం చేసేవి; మరికొన్ని తత్సూత్రాలనే కావ్యపరముగా అందించేవి కన్పిస్తవి. రాజకీయాలకు సాహిత్యంలో ఎంత స్థానము ఉండవచ్చుననే ప్రశ్న ఉదయించడముకన్న 'రాజకీయాలే సాహిత్యం' అనేటంతగా అవినాభావసంబంధం ఏర్పడి పోయినట్లీ రచనలు తెలుపుతున్నవి.

అభ్యుదయనాటికా రచయితలలో అగ్రగణ్యులైన నార్ల వెంకటేశ్వరరావు (ఆంధ్రప్రభ సంపాదకుడు) పి.వి. రాజమన్నారు (మద్రాసు ప్రధాన న్యాయమూర్తి) - ఆత్రేయ మొదలైనవారి రచనలలో ప్రచారధోరణి ఉన్నా కావ్యత్వం కొంత కాక పోయినా కొంత కన్పిస్తునే ఉన్నది; సుంకర సత్యనారాయణ - వాసిరెడ్డి భాస్కరరావు - బుచ్చిబాబు - శివరామం - రుక్మిణీనాథ శాస్త్రి - కవికొండల - గోపాలరాయశర్మ - కోదండరామశాస్త్రి - పంతుల - రా.సీ. ఆంజనేయశాస్త్రి మొదలైన వారెందరెందరో సమకాలిక సాంఘిక సమస్యలను సన్నివేశాలను వస్తువుగా స్వీకరించి ఈ అభ్యుదయ ధోరణిలో నాటికలు "స్కెచెస్" అనేకం వ్రాస్తూ వస్తున్నట్లు గమనిస్తాము; గేయరచనలలో సాధించని కావ్యగౌరవం కొంతవరకీ మార్గరచయితలు నాటికలలోను, బుర్ర కథలలోను, కథలలోను కొంతవరకు సాధించగలిగినారని అనవచ్చు; అభ్యుదయధోరణిలో పద్యకావ్యాలుకూడ వచ్చినవి; అందులో గంగుల శాయిరెడ్డి వ్రాసిన 'కాపుబిడ్డ' - నాగభైరవ శివరామకృష్ణ* వ్రాసిన 'విద్యుల్లత' - మొదలైనవి కొన్ని; అభ్యుదయధోరణి ఇంచుమించుగా ఈమధ్య బయలుదేరిన పద్యకవుల రచనలలోకూడ కన్పిస్తూనే ఉన్నదనవలె; ఆదృష్టివలన తత్కాలానికి సామాన్య ప్రజాదరాన్ని పొందగలుగుతున్నవే కాని యీ రచనలు కావ్యగౌరవాన్ని సంపాదింపలేక పోతున్నవని పరిశీలనమువలన తెలుస్తున్నది. ఈనాటి కథలలోకూడ ఈ ధోరణికి చెందిన భావాలు బాగా ప్రతిబింబిస్తున్న వనవచ్చు. కొడవటిగంటి కుటుంబరావు◆

---

* ఈయన 'సాహిత్యశిరోమణి'. "అభ్యుదయరచన" మనే పుస్తకమువ్రాసి ఏతన్నిర్వచనము చెప్ప ప్రయత్నించినాడు. ఈయన 'విద్యుల్లత' కభిప్రాయాన్ని ఇస్తూ విశ్వనాథ వారన్నవిదం చూడండి: "సామ్యభావమందా? అభిలాష; పూర్వాంధ్రౌన్నత్యమందా? అభిమానము, గౌరవము.. కవి కొంతమేరకవి, కొంతమేర సాంఘిక తత్త్వవాది అగుచున్నాడు. కాని వీరిలో కవి ప్రబలుడు..." అభ్యుదయరచయిత అయినా ఇతడు భావకవిగా కన్పిస్తూ ఉండడమును గుర్తింపకపోము, ఈ ఖండకావ్య సంపుటిలో! జంధ్యాల పాపయ్యశాస్త్రి గారుకూడ ఈ ధోరణికి మోజుపడినవాడేనని "అరుణకిరణాలు" విజయశ్రీ' ఇత్యాది అతని రచనలలో కన్పిస్తాడు

◆ ఇతడు (జననం 1909) నేడు ప్రసిద్ధికెక్కిన కథకులలో ఒకడు: ఇతని రచనలు 'స్కెచెస్' అనిపించుకుంటై చాలభాగము. ఇతడు వాస్తవికవాది; తీవ్రవాదుల స్నేహంకలవాడున్ను భారతి - ప్రతిభ - స్వతంత్ర - మొదలైన అనేక పత్రికలలో కథానికలు, నవలికలు వ్రాస్తూ సహాయ సంపాదకత్వాన్ని వహిస్తూఉన్న అభ్యుదయ మార్గగామి "కాలభైరవుడు - మొండివాడు - కవిరాట్టు - నిలువ నీరు - ఆడబ్రతుకు - మారుపేర్లు - కులంలేని మనిషి" - మొదలైన ఇతని పుస్తకాలు ప్రజాదరాన్ని చూరగొన్న "యువ ప్రచురణములు".

- వెం.చా.శా- (చావలి వెంకటశాస్త్రి) - కేశవస్వామి - పొట్లపల్లి రామారావు - బలివాడ కాంతారావు - రాయప్రోలు సీతారామాంజనేయశాస్త్రి - శివరాజు వెంకటసుబ్బారావు - గోఖలే - కె. లింగరాజు - చాగంటి సోమయాజులు - 'అమరేంద్ర' - తెన్నేటి సూరి - రాంషా - మొదలైన వారెందరెందరి రచనలలోనో సమకాలిక సాంఘిక సమస్యలు, సంఘర్షణలు చిత్రితములై కన్పిస్తున్నవి. వీరి నందరినీ ఈమార్గానుయాయులనే చెప్పవచ్చు.

రష్యా వ్యామోహా మొకప్రక్కన మనదేశమున ప్రబలమైవ్యాపిస్తూ నచ్చినట్లు గమనించినాముగదా; ఇలా "కమ్యూనిజము" రైతుల, కూలీల నాకర్షించి వారి నాకట్టుకొంటూ వస్తుంటే, దీన్ని ఆక్షేపిస్తూ వచ్చిన "రాడికల్ డెమొక్రెటిక్ పార్టీ" దృక్పథమంటూ ఒకటి యం.యన్. రాయ్ నాయకత్వాన (రాయిజం) బయలువెడలి విద్యావంతుల నాకర్షింప సాగినదనికూడ గమనించవలె. ఆంధ్ర ప్రాంతాన దీనికి (తెనాలి కేంద్రముగా) అబ్బూరి వరద రాజేశ్వరరావు - ఆవుల గోపాలకృష్ణమూర్తి - కె. రాధాకృష్ణమూర్తి - గోపీచంద్ - పి.వి. సుబ్బారావు - గవని వెంకటకృష్ణరావు - పద్మరాజు - మొదలైన ఉత్సాహవంతులైన సభ్యుల రచనలవలన ఈ ఉద్యమం కొంత సంచలనాన్నే కలిగించి దేశములో బలముచేకూర్చుకున్న దనవలె; తెనాలిలోని 'రాడికల్సు - విహారి' అను పత్రికలు వీరి ప్రచారానికని ఏర్పడినవి; రాడికల్సు - కమ్యూనిష్టులు వివాదపడినారు, రాజకీయంగానేకాక సారస్వతపరముగాకూడ. ఈ సిద్ధాంతములతో పాటుగా దేశములో నాస్తికమతంకూడ* ఈ కాలానికి బాగా వ్యాపింపజొచ్చినదని గుర్తించవలె; ఈ సందర్భాన్ని పురస్కరించుకొని వాఙ్మయ మపరిమితముగా పెరిగిపోయినది; "ప్రజాసాహిత్య పరిషత్తు" ప్రచురణములన్నీ రాడికల్ దృక్పధానికి సంబంధించినవే. ఈ దృక్పథముతో రచనలు సల్పిన వారిలో ముఖ్యంగా ఒక రిద్దరినిగూర్చి తెలుసుకొనవలె:

ఈ ధోరణి రచయితలందరిలో జి.వి. కృష్ణరావు గొప్పప్రతిభావంతుడు; సంస్కృతాంధ్రాంగ్లాలలో మంచి ప్రవేశము కల్గినవాడు; పద్యము - కథ - నాటిక -

---

* గోపరాజు రామచంద్రరావు మొదలైనవారిందుకు పూనుకున్నవారు.

నవల - విమర్శ మొదలైన ప్రక్రియలన్నిటిలోను సాధనచేసి గ్రంధములను ప్రచురించిన యువ సాహితీపరుడు; "శివరాత్రి - యుగసంధ్య - చైత్ర రధము - ఆదర్శ శిఖరాలు - కావ్యజగత్తు - జై గంటలు" మొదలైనవి ఈతని కృతులు. వీటినిబట్టి యితడు కవిగా, కధకుడుగా - నాటికా రచయితగా - అన్నిటినీమించి పిల్లలమఱ్ఱివారివలెనే సాహిత్యతత్త్వ విమర్శకుడుగా పేరు ప్రతిష్ఠలను గడించుకొంటున్నాడని తెలుస్తుంది. రేడియో గోష్ఠులలో పాల్గొంటూ, ఆంధ్రపత్రిక, భారతీత్యాద్యనేక పత్రికలలో తన రచనలను విరివిగా ప్రచురిస్తూ - సభలలో ఉపన్యసిస్తూ - ఇతడు నేటి ఉత్తమ యువసాహితీపరులలో ఒక డనిపించుకొంటున్నాడని గుర్తింపవలె. దృక్పధములో మార్పు నభిలషించినప్పటికీ, ప్రాచ్య సంస్కృతిని గ్రహించినవాడు కావడమువలన, ఇతడు తన రచనలలో (తదితర తీవ్రవాదుల రచనలలోవలెకాక) కావ్యత్వమును పోషించుకుంటూనే వచ్చినాడు. అందుకనే ఈధోరణివారందరిలో ఇతడు విశిష్టుడు.

'మార్క్సిజా'న్ని బాగా అర్థము చేసుకున్న యువసాహితీపరులలో కృష్ణరావు తర్వాత గోపీచంద్ ఎన్నదగిన ప్రతిభావంతుడు. ఇతడు 'ఆంధ్రదేశములో నిహిలిస్టు ఉద్యమకారకుడు, సుప్రసిద్ధుడు అయిన కీ. శే. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి కుమారుడు;' విశేషముగా చదివిన (బి. ఏ., బి. యల్) వివేకివాడు; స్నేహశీలము కలవాడు; దానితోనే అనేక యువకులను ఆకర్షించి రాజకీయ సారస్వతపథాల నడిపించినవాడు; ఆంధ్రడెమోక్రాటిక్ పార్టీ ప్రధాన కార్యదర్శియై ఎంతో కృషి చేసినాడు; న్యాయవాదవృత్తి రుచింపక పోవడమువలన ఇతనివలన సారస్వతానికి మేలే కలిగినది. తాను వాస్తవికవాది, విప్లవ తత్త్వాభిలాషి కావడమువలన ఈతని రచనలు కూడ ఆ మార్గానికి చెందినవిగానే కన్పిస్తవి. 'బూర్జువా'లను, 'కమ్యూనిష్టు' లను అధిక్షేపించడములో ఇతడు నిరంకుశుడే ననవలె. ప్రజామిత్ర - ప్రజా బంధు - విహారి - వాణి - మొదలైన పత్రిక లన్నిటిలోని తన రచనలవలన ఇతడు కధకుడుగా, నవలాకారుడుగా, విమర్శకుడుగా కీర్తి గడించినాడు. ఈమార్గ రచయితలలో గోపీచంద్ కలము అతినిశితమైనది. "ఆడమళయాళం, భార్యల్లోనే వుంది, దేశం ఏమయ్యేటట్టు, దేవుని జీవితం, ఉభయకుశలోపరి, పట్టాభి సోషలిజం, మార్క్సిజం అంటే ఏమిటి, సోషలిష్టు వుద్యమచరిత్ర, పరివర్తనం, నా క్రొత్త నవల," మొదలైన

పుస్తకాలనెన్నో ప్రచురించి రాజకీయాలలోను, సారస్వత రంగములోను మంచి పలుకుబడినే సంపాదించినాడు. ఇటీవల సినిమా రంగములోకూడ ప్రవేశించి, సినిమా కథా రచనలో, తత్సంభాషణలను రచించడములో, దర్శకత్వములో ప్రజ్ఞను ప్రదర్శిస్తూ, తన నూతన దృక్పథాన్నీ, సంస్కార వాంఛనూ వ్యక్తీకరిస్తూ ఇతడు నేడు ఖ్యాతి గడిస్తున్నాడని గమనిస్తాము.

వీరితో పాటు పాలగుమ్మి పద్మరాజు నెన్నుకొనవలె; గోదావరి జిల్లాకు చెందిన యితడు పా. ప. అనే పొడి అక్షరాలతో తన రచనలను అనేకాలను ఆంధ్ర పత్రిక - ప్రతిభేత్యాది పత్రికలలో ప్రచురిస్తూ వచ్చినాడు; రసాయనిక శాస్త్రములో ఎం. యస్సీ పట్టాన్ని పొందినవాడు కావడమేకాక, పాశ్చాత్య సాహిత్యములతో పరిచయము బాగా కల్గిఉన్నవాడు కావడాన తెలుగులో కొంత అలాంటి ధోరణులను తీసుకురా ప్రయత్నించినాడు. ఇతడు మొదట అరవిందుని ప్రభావముగలవాడైనా, రచనలనుబట్టి రాడికల్ దృక్పథము కలవాడై శాస్త్రదృష్టిని పెంపొందించుకొన్న వాడువలె కన్పిస్తాడు; గీతాలు - కథలు - నాటికలు - విమర్శలు అనేకము రచించిన వాడైనా ఇతడు ప్రత్యేకముగా రేడియో నాటికాకారులలో గణన కెక్కుతున్నాడని గమనిస్తాము.*

పై యిద్దరుముగ్గురే కాక ఇంకా పలువురీ 'మార్క్సు' సిద్ధాంతానుయాయులు రచయితలై పత్రికలలో విరివిగా వ్రాస్తున్న యువకులున్నారు. అయితే వారు ప్రాథమికావస్థలో ఉండడము గమనింపదగిన అంశము; ఎలాగైతేనేమి రష్యా వాఙ్మయ మీ కాలాన మన భాషలోకి విశేషముగా అనువదితమై వస్తున్నట్లు తెలుసు కొంటాము; ఎపుడైతే ఒక రాజకీయ పక్షమువారు తమ సిద్ధాంతములను ప్రచారము చేసుకునే నిమిత్తం వాఙ్మయాన్ని సృష్టిస్తూ వచ్చినారో అపుడే తదితర రాజకీయ పక్షాలున్ను ఆ పద్ధతి ననుసరించి తమతమ మతాలను ప్రచారం చేసుకొనడము ప్రారంభించినారు; అందుచేతనే కమ్యూనిజమే కాక, రాయిజమే కాక, గాంధీజము, సోషలిజము, ఆర్. యస్. యస్. మొదలైన రాజకీయ రంగములోని 'ఇజా'లన్నీ

* కొంతకాలము కాకినాడ కళాశాలలో ఉండి, ప్రస్తుతము భీమవరము కళాశాలలో ఉపన్యాసకుడుగా ఉన్నాడు. రేడియో నాటికల కితనికి ప్రత్యేక బహుమతులు కూడ వచ్చినవి.

సారస్వతదర్పణంలో ఈకాలానికి ప్రతిబింబించినట్లు◆ గమనించగలము. ఈ అభ్యుదయ ధోరణిలో గీతాలు, కధలూ వ్యాసాలను వ్రాస్తూ రచయితలు తమతమ 'మతా'లను ప్రచారము చేసుకొంటూ వచ్చి నారనడము తథ్యం. అందుకీ అభ్యుదయధోరణి బాగా పనికి వచ్చినదనవలె. అందుకనే దీనినంతా "ప్రచార వాఙ్మయము"ని అనవలసి వస్తున్నది. కనుకనే కర్షకులను - కార్మికులను రెచ్చ గొట్టడములో, వారిలో రాజకీయ చైతన్యము కల్గించడములో, విప్లవము సాధించడములో ఈరకపు వాఙ్మయము చాలవరకు తత్ప్రయోజనములో నెగ్గినదనవలె; దేశములో పొడసూపిన సమ్మెలు - సత్యాగ్రహాలు - ఆకలియాత్రలు - మొదలైనవన్నీ యేతత్ఫలితాలనే తెలుసుకుంటాము! ఈరకపు వాఙ్మయములో ప్రచారదృష్టే ‡ కాని శిల్పదృష్టి నశించి* పోయినట్లు కనుగొంటాము. నిజానికి విజాతీయమైన సిద్ధాంతాలు మన సంఘశ్రేయస్సుకు - దేశాభ్యుదయానికీ ఏమాత్రము

---

◆ నిమ్మరాజు చినవెంకటేశ్వర్లు ప్రకటించిన 'హితోపదేశము' ఈశ్రేణికి చెందినదే!

‡ కేవలము ప్రచారము కొరకు ప్రతిభను వ్యర్థముచేస్తూ మన వాతావరణమునకు భిన్నమైన వాటిని చిత్రించేవారిని ఆక్షేపిస్తున్న ఈ వాక్యాలు చూడండి·

"....Indian writers must write honestly, carefully and share their vision with the rest of us. I do not believe in creative writers using their gifts for propaganda . . . considering the size of India and the enormous number of fascinating subjects at their disposal, it is surprising that Indian writers have done so little to put the Indian scene on the map . . ."

- Herman Ould, International secretary of P. E. N., Free press 19-11-'45

* వస్తు వెలాంటిది చేపట్టినా, కావ్యత్వాన్ని సాధించకపోతే ఆదరం పొందజాలదని అంటున్న ఈవాక్యాలు చూడండి:-

" . . కావ్యము అమృతకలశముగాని అశనిపాతముకాదు. కవి శాంతిదూతగాని ప్రళయకారుడుగాడు. కవి సామరస్యము సంపాదించాలిగాని విద్వేషము విస్తరింప చేయరాదు. కవి సృష్టించి పాలించవలసినది ఆనంద సామ్రాజ్యమూ, ప్రేమ సామ్రాజ్యమూ కాని భూతప్రేత పిశాచభూయిష్ఠమైన రుద్రభూమికాదు...దేశాభ్యుదయ కాంక్ష నీలో ఎంతవున్నా నీవు అసలు కవివే కాకపోతే, అభ్యుదయ కవివెట్లు కాగలవు?" - తెలికిచర్ల వెంకటరత్నం (ఆంధ్రప్రభ 7-1-45)

సరిపడవనడము తథ్యము;◆ మనదేశంలో ఆధ్యాత్మికతత్వము జీర్ణించి పోయి ఉన్నది. ఇపుడు దాన్ని నిర్మూలించడము ఎవరికీ శక్యము గాదు. ఆధ్యాత్మిక వాదానికీ భౌతిక వాదానికీ సామరస్యం ఎపుడూ కుదరలేదు; అది దుస్సాధ్యమే అనిపిస్తుంది. 'కళ'పైన రాజకీయాలు పెత్తనం సాగిస్తున్నందువలన ‡ ఈకాలాన మనకు వర్గాతీతము, ఆత్మ వికాసకారకము※ అయిన సాహిత్యసృష్టి విరివిగా జరుగుటలేదనే చెప్పవలె: కేవలము పై పూతలతో, గారడీలతోకూడ తత్కాలానికి

◆ Fundamentally the Communist policy is not from the stand point of the country where it functions but from the stand point of the Russian foreign policy. I have every sympathy with Russia and the great advance Russia has made. but from many points of view I do not think a nation' policy can be bound up by the Russian policy The genaral question is whether their policy has been injurious to the cause of India."

- Pandit Nehru at Bombay, Indian Express, to 25-6-45.

‡ "సంస్కృతి సాహిత్యాభివ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఏవర్గంకాని, ప్రజా సామాన్యంకాని అనుశాసించరాదు. రాజకీయాలు, ప్రభుత్వం వీటిపై అలాంటి పెత్తనం చెలాయించరాదు..."

"రచయిత పాక్షిక అభినివేశాలకు కాని, అంధ విశ్వాసాలకుగాని తావివ్వరాదు. సాంఘిక విమర్శకుడుగా, జాతీయ సంస్కార సంపన్నుడుగా, విభిన్న సంస్కృతీ ప్రవాహ సమన్వయకారుడుగా, దైనందినం జరిగే తాత్కాలికపు నిరర్థక విభేదాలకు అతీతుడుగా నిలబడి నిర్లిప్తుడుగా పరిశీలించాలి. రచయిత సహానుభావం ప్రకటించాలి .. చూడగానే అతనికి ముందు గోచరించవలసినది మానవత్వం. ఆ తరువాతనే పార్టీ సభ్యత కనిపించాలి. అలా కాని పక్షంలో సామాజిక ఆధ్యాత్మిక ఉత్తమత్వాన్ని నిష్పాక్షికంగా అతడు చూడలేడు. దానిని లోకానికి అందించనూలేడు...

"ఆధ్యాత్మికవాదం, భౌతికవాదంమధ్య అనాదినుండి సంఘర్షణ జరుగుతూనే వస్తున్నది ఒకప్పుడు ఈ సంఘర్షణ మందంగాను, మరొకప్పుడు తీవ్రతరముగాను ఉండవచ్చు అది వేరే సంగతి అయితే, యీ సంఘర్షణ ఇంతవరకు సంపూర్ణపరిష్కారం పొందలేదు. ఇక ముందుకూడా పొందదనే నేను భావిస్తున్నాను ."

(చెక్ రచయితల కాంగ్రెసులో బెనిస్, ఇచ్చిన ఉపన్యాసంలోని భాగాలు)

- విజయప్రభ 4 జూన్ 1950.

※ "Many of our modern works take shape in our wits, not in our souls. They have technical skill, intellectual power, but do not have that inspiration, that rare adequacy of mind which is essential for great art "

-Sir S. Radhakrishnan

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

# సమన్వయ మార్గము

# 5

## జాతీయ దృక్పథము:

మనభాషలో జాతీయ దృక్పథాన్ని పెంపొందించే నిమిత్తము మొదటనుంచీ వాఙ్మయ మపరిమితముగా సృజింపబడుతూనే వచ్చినట్లు పూర్వభాగాలలో గమనించినాము. 'వందేమాతరం' ఉద్యమము మొదలుకొని 'క్విట్ ఇండియా' ఉద్యమమువరకు వచ్చిన వివిధ జాతీయోద్యమాలను పురస్కరించుకొని ఎవరెవరెలా వాఙ్మయ రంగాన కృషిచేసినది తెలుసుకొన్నాము ◆; అలాగే ఆంధ్రోద్యమమును పురస్కరించుకొని బయలుదేరిన వాఙ్మయాన్ని తత్స్రష్టలను గూర్చి కూడ పూర్వం ఉల్లేఖించుకొనే ఉన్నాము; అయితే వారిలో కొందరు ఈకాలందాకా ఉండి ఏతద్దృక్పథముతో రచనలు చేస్తూన్నవారు లేకపోలేదు; మంగిపూడి-గరిమెళ్ళ-దామరాజు-మానికొండ-గోపాలరెడ్డి-శరగోపాచార్యులు-జగ్గన్న శాస్త్రి -కొడాలి ఆంజనేయులు (కాంగ్రెసు చరిత్ర అనువాదకుడు)-ఉన్నవ-మారేపల్లి-కృత్తివెంటి ✻ అడివి-కాటూరి-వేలూరి-తుమ్మల-గొఱ్ఱెపాటి-మొదలైన వారప్పటినుంచీ

---

◆ 'నవ్యాంధ్ర సాహిత్యంలో జాతీయెద్యమాల క్రీనీడల'ని (ఆంధ్రోద్యమం ఆరంభంనుంచీ క్విట్టిండియా వరకు) శ్రీనివాస చక్రవర్తి 13,1,1949 తేదీ 'తెలుగు దేశం' అన్న పత్రికలో దీర్ఘవ్యాసాన్ని ప్రచురించినాడు; అందులో ఏివాక్యాలు కొన్ని -

. . . ఈ అర్ధశతాబ్దములో కాంగ్రెను జాతీయోద్యమ ప్రభావంవల్ల జాతీయ సాహిత్యం ఎంతో వెలువడి జాతిని ఉత్తేజితం చేసింది. 'దేశభక్తి' 'జన్మభూమి' హిమాచలోత్తుంగ శృంగం' వంటి గేయాలు 'మాలపల్లి' 'శివభారతం' ఆంధ్రప్రభ వంటి ఉద్గ్రంధాలు ఆంధ్రసాహితీ సరస్వతికి 'కొప్పులో అలంకర[illegible]''

✻ సుబ్బారావుగారు (జననము: గుడివాడలో 29-1-1904) చిన్నతనములోనే ఈయన శతావధాన అష్టావధానాలను చేయ నారంభించిన తిరుపతి వెంకటకవుల శిష్యుడు-

ఇప్పటిదాకా దేశసేవచేస్తున్న జాతీయ రచయితలే, ఈరంగాన నూతను లనేకులీ మధ్యకాలములో తయారైనవారు లేక పోలేదు; కొంత వానినిగూర్చి తెలుసుకొందాము.

మనదేశములో జాతీయోద్యమము 1942 తర్వాతనే తీవ్రరూపాన్ని ధరించినదని గమనింపవలె; దానితోపాటుగా సారస్వతరంగానకూడ జాతీయప్రబోధ మొనర్చని కవి అంటూ ఈనాడు లేక పోతున్నట్లు తెలుసుకోవలె; పైగా స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఇంక చెప్పనే అవసరంలేదు; ఎవుడైతే ఎన్నికలంటూ దేశములో జరుగవలసి వచ్చినవో అపుడు తదితర సంస్థలతో పాటు కాంగ్రెసు సంస్థకూడా ప్రచారము చేసుకోక తప్పినదికాదు; కాలానుగుణముగా బుర్రకథలకు నాటకాలకు-గీతాలకూ గౌరవం హెచ్చడమువలన ఈప్రక్రియలలో కాంగ్రెసు చరిత్రను, నాయకుల జీవితాలను, కీర్తిస్తూ అనేకులు రచనలు సలుపుతూ వచ్చినారు. "స్వాతంత్ర్యం ప్రాప్తించిన" సందర్భాన ఉత్సాహగీతాలు-జెండాపాటలు-నాయకప్రశంసలు-పద్యాలు ఆనంద సూచకముగా ఎందరెందరు కవులెంతగా వ్రాసినారో అంతులేదు. అలాగే అటుతర్వాత ఏడాదికే 30-1-'48 సంభవించిన "గాంధీ నిర్యాణము" కావ్యవస్తువుగా

---

అసహాయోద్యమములో విద్యాభ్యాసానికి స్వస్తిచెప్పి జాతీయాభిమానమును ప్రదర్శించి, వారిలో ఒకడై 'స్వరాజ్య ప్రసాదము' (1921) మొదలైన కీర్తనలూ, పద్యాలూ వ్రాసి ఆదినాలలో జాతీయ కవి అని కీర్తి గడించినాడు; శతకము, నాటకము, ఖండకావ్యము, అధిక్షేపకావ్యము- ఉపన్యాసము మొదలైన ప్రక్రియలన్నిటినీ సాధించిన విద్వత్కవి; (సరస్వతీ స్తవము-తారకశతకము-కలిప్రభావము, మొదలైనవి ప్రచురితాలు) సంస్కృతములో ఎం.ఏ., (1933) ప్యాసై శతావధాని, కవిభూషణేత్యాది బిరుదులను పొందిన ధీమంతు డితడు. "నెల పొడుపు" (1934) అనే ఖండకావ్య సంపుటి, ఉపన్యాసములు (1935) మొదలైనకొలది గ్రంధాలను, 'శారద నవ్వులతోట-కృష్ణా పత్రికలలోని ఈయన రచనలను చూచిన వారికీయన సర్వతోముఖ ప్రజ్ఞగల అసాధారణవ్యక్తి అనిపిస్తుంది సంగీతసాహిత్యాలపైన అసదృశముగా ఉపన్యసించి సభ్యులను సమ్మోహ పెట్టగలిగిన కళాభిజ్ఞుడు; మొదట భావకవిత్వాన్ని ఎగతాళిచేసిన పండితులలో ఒకడే అయినా, తాను నిర్దుష్టమైన నవ్యమార్గము ననుసరించినవాడే ఈయన. ఏమయితేనేమి ఈయన ఎక్కడా ఒక్కచోట కాలూని ఉండక పోవడముచేత ఇతనికి రావలసిన కీర్తి ప్రతిష్ఠలు రాలేదనే చెప్పవలె! వేకుమళ్ళ అచ్యుతరావుగారి వాక్యాలు చూడండి:

". . It is no matter to us whether we can call his poems romantic or classical. It is certainly classical in its style and its appreciation of the old, and romantic in the spirit of satire with which modern life is depicted. . ."

వచ్చిన సాహిత్యం అనంతమైనది; అయితే ఒకటి ఉత్సాహమును ఆనందమును పోషించినట్టిది; మరొకటి దుఃఖాన్ని, నిర్వేదాన్ని పోషించినట్టిది; ఈరెండు తరంగాలకు చకితుడుకాని మానవుడే లేడంటే కవులవిషయము ప్రత్యేకముగా చెప్పవలెనా? అలా జాతీయ వాఙ్మయాన్ని పెంపొందించిన నవ్యులలో కొందరినిగూర్చి వారి రచనలనుగూర్చి కొంత పరిశీలించుదాము. ఈనాటి కాలములో పై నుల్లేఖించిన ప్రసిద్ధులేకాదు, కవిశబ్దవాచ్యు లందరూ స్వాతంత్ర్య ప్రాప్తిపైన,గాంధీ నిర్యాణమును గురించీ కాస్తోకూస్తో వ్రాసినవారుగానే కన్పిస్తారు-ఇట్టివారిలో అన్ని మార్గాల రచయితలూ ఉన్నారని గమనిస్తాము.

## కొందరి కృషి:

ఈ సందర్భాన గుంటూరు విశ్వసాహితివారు ప్రచురించిన "అహింసాజ్యోతి" అనే వివిధకవుల ఖండకావ్య సంపుటి మార్గదర్శక మైనదనవలె. బుర్రకథలు వ్రాసిన వారిలో మునగపాటి విశ్వనాధ శాస్త్రి, ప్రయాగ నరసింహశాస్త్రి మొదలైనవార లెందరో ఉన్నారు. "కాంగ్రెసు జెండా-హరిజన విజయం-రైతు నాయకుడు-నేతాజీబోసు-ఆచార్య రంగా-ఆంధ్రకేసరి" -మొదలైన బుర్రకథలను రచించిన మునగపాటివారు, గాంధీ-పట్టాభి-బోసు-పటేల్ మొదలైన దేశనాయకుల జీవితాలను బుర్రకథలుగా (రేడియో ముఖాన చెపుతూ) ప్రయాగవారు ఖ్యాతిని గడిస్తున్నారు; 'ప్రయాగ' సంగీతములోను ప్రజ్ఞ కల్గి శ్రావ్యకంఠము కలవాడు కావడమువలన, మద్రాసు రేడియో కేంద్రములో ఉద్యోగి కావడమువలనను విశేషమైన పలుకుబడి నార్జిస్తున్నట్లు గమనిస్తా[illegible].

అనేకములీ జాతీయదృక్పధానికి చెందిన రచనలున్నవి: కొన్నిచూడండి: ప్రత్తిగొడుపు రాఘవరాజు 'బాపూజీ' 'బోసు బాబు' (హరికథలు', ఢిల్లీకోట (నాటకము) -సుందరాచారి 'బలి దానం' -పాలెపు వెంకటరత్నకవి 'బాపూజీ స్మృతికావ్యం'-వన్నెకూటి బాలసుందర[illegible]గం" - కొత్త సత్యనారాయణ చౌదరి 'బాపూజీ' అనేవీ-మిక్కిలినేని భగవంతరావు 'అజాద్ హింద్ ఫౌజు'-సంగేపు వీర్రాజు శాస్త్రి 'కాంగ్రెసు విజయం'-శేషావతారం 'అమరజీవి బాపూజీ' - శ్రీమతి రాధామోహన్

'బాపూజీ నిర్యాణము' -మొదలైన బుఱ్ఱకథ లనేకములీ శ్రేణిలోనివి; పోలూరి ఆంజనేయ ప్రసాద్ 'స్వాతంత్ర్యగీతాలు' -కవిరావ్ 'జెండాకు జోహార్లు' - కర్లపాలెం కృష్ణరావు 'జాతీయగీతములు' - ఉండేల మాలకొండారెడ్డి 'నేతాజీ' -జానానందకవి 'గాంధీ' - పూర్ణప్రజ్ఞా చార్య 'ఆత్మసమర్పణం' - పోలూరి-జ్ఞానానందకవి రామశర్మ 'బాపూజీ నిర్వాణం' - మొదలైన ఖండకావ్యా లెన్నో వెలువడినవి; అబ్బరాజు రంగారావు 'స్వాతంత్ర్య సమర'మనే నాటకము మన్నవ రామారావు 'స్వాతంత్ర్య విజయము' అనే నాటిక జాతీయ రచనలలో చేరేనే! ఏతత్కర్తలందరూ జాతీయ దృక్పధముకల్గిన వారనే విషయం విదితమౌతూనే ఉన్నదిగదా! వీరికి పేరుగాదు సేవ పరమావధి. ఇంకా దేశసేవా తత్పరులైన కొందరి సారస్వత కృషి నెన్నుకొందాము.

జాస్తి వెంకటనరసయ్య, (జననం 1910) ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యం (జననం 1913) గారలనే జంటకవులీ జాతీయ సాహిత్యరంగములో విశేషముగా కృషిచేస్తున్న నవ్యులని వారి రచనలనుబట్టి తెలుసుకొంటాము. వీరిద్దరూ గుంటూరుజిల్లా చిలకలూరిపేట హైస్కూలులో పండితులు; వీరి మధ్యనున్న మైత్రి ముఖ్యముగా ఆదర్శమైన దనవలె! కాంగ్రెసు చరిత్రను తత్సంస్థా లక్ష్యములను నిరూపిస్తూ వీరు "కాంగ్రెసు విజయము†"నే నాటకాన్ని రచించి (1946) రంగా పట్టాభీత్యాది దేశనాయకుల మెప్పుపొందినారు※ ఇదీ - "ప్రజారాజ్యం"◆ (1947)

---

† మామూలు దృశ్యములు చిత్రలేఖనమందు చూచునపుడు అమిత సౌందర్యము దాల్చును. మామూలు భావములు గద్యపద్యయుతమగు నాటకరూపమున ప్రదర్శింపబడి నపుడు ఎంతయో ఉద్రేక జనకముగా నుండును అట్టి నాటకముల ననుసరించునది బుర్రకథ. ఈరెంటిని కలిపి రాజకీయవిషయములను ప్రచారము చేయునపుడు గలుగు సౌందర్యము శ్రావ్యము రుచి సంతసము ఉద్రేకములకు అంతుండదు. ఇట్టి యత్నమున గ్రంధకర్తలు పూనుకొని జయమును పొందిరి

- డా భోగరాజు పట్టాభిసీతారామయ్య.

※ వీరు చేస్తున్నపనంతా, కాంగ్రెసుయొక్క జాతీయ విజ్ఞాన ప్రచారమందొక ఉత్తమ భాగముగా నెంచుకొన కాంగ్రెసువారందరికి నామనవి; ఇది పయోజన ప్రచారవిధానము గూడ

- ఆచార్య రంగ ('జయభేరి'కి పరిచయము)

◆ "కేవలము కలముతోటి కాక హృదయంతోటి రాసిన నాటకమిది" అని 'మాధవపెద్ది' నటశేఖరుడంటున్నాడు

అనే నీరి నాటకము మరొకటీ ఆంధ్రదేశములో పలుచోట్ల ప్రదర్శితములై తత్కర్తలకు విశేషించి కీర్తి నార్జించి పెట్టినవి; ఇనేకాక, "జయభేరి" (1949) అనే ఖండకావ్య సంపుటీ - "జాతీయ దసరా గీతములు" (1949) - "చలో ఢిల్లీ" (1946) అనే బుఱ్ఱకథ - "ఆచార్య రంగా" జీవితము (1947) - వైతాళికులు - మొదలైన పుస్తకాలను రచించి వీరిరువురూ తదేకదీక్షతో జాతీయభావ ప్రచారము చేస్తున్న దేశసేవా తత్పరులు.

వీరిద్దరిలో 'జాస్తి' ఉభయ భాషాప్రవీణుడు; వినయశీలుడు; జాతీయోద్యమ, గ్రంథాలయోద్యమ, వయోజన విద్యోద్యమాలలో విశేష కృషిచేసిన - చేస్తున్నవాడు, రెండుమారులు శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్ళి వచ్చినవాడుకూడ. "నవగీతాల"ను రచించినాడు ప్రత్యేకముగా. 'ధూళిపాళ' విద్వాన్; "మృదు స్వభావుడు. రసజ్ఞుడు' '. 'విశ్వనాథ శతకము - అహల్య - అన్వేషణము విజయ సౌధము - సాయిబాబా చరిత్ర' మొదలైన పుస్తకాలు రచించిన సాధకుడు. వీరిద్దరూ కేవల పండితులేకాక ఉత్సాహవంతులై రాజకీయ విజ్ఞానాన్నికూడ ఆర్జించిన దేశభక్తులు కావడమువలన జాతీయ ప్రబోధాన్ని సమర్థవంతంగా చేయగలుగుతున్నట్లు వీరి కృతులనుబట్టి తెలుసు కుంటాము. పద్యము - గద్యము - కీర్తన - బుఱ్ఱకథ - నాటకము మొదలైన

---

"..ప్రజా సామాన్యముయొక్క రాజకీయ జీవితమునకు పాదులుకట్టి, రూపుతీర్చి, దోహద మొనగగల భాగ్యమెట్టి గ్రంథములకు మాత్రము కలదని తలంతును."

- విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి.

వీరి దృష్టినీ ప్రబోధవిధానమునూ చూడండీ పద్యాలలో -

దీనుల నుద్ధరించుటకు దీక్షనుబూని నిరంతరంబు న
జ్ఞాన తమంబు బాపుటకు జాతికి నూతన విద్యనిచ్చి దే
శాన దరిద్రమానవుల సాయముజేసిన జీవి ధన్యుఁడౌ
మానవసేవయే జగతి మాధవసేవ గదా ! తలంపగా
బురదనుబుట్టి పంకజము వొందదె కీర్తిని కాంతిసంపదన్,
ఇరవుగ కాకిచిప్ప జనియించిన ముత్తెము మానసీయమా
తరువునబొల్చు చంపకముదాల్చును చల్లని కమ్మతెమ్మరల్
వరగుణశాలియై వరలువానికి పుట్టుక నెంచ పాడియే.

వివిధ ప్రక్రియలలోను సాధనచేస్తూ వీరు ప్రజ్ఞను గడించినారు*. జాతీయదళగా గీతావళిని వ్రాయడములో అనేకులకు మార్గదర్శకులైనారు కూడ. జాతీయ భావాలను రంగరించి తమ రచనలచే దేశీయులలోను ముఖ్యంగా విద్యార్థులలోను చైతన్యాన్ని కల్గిస్తున్న వారిలో ప్రసిద్ధులై వీరిద్దరూ కీర్తి గడిస్తున్నారు.

ఆచార్య రంగాగారి ప్రోత్సాహాన "జాతీయవిజ్ఞాన పరిషత్తు"ని ఒకటి ఏర్పాటై మద్రాసులో సభ జరిపి ఒక సంచికను ప్రచురించినది. ఏటుకూరి, పెనుమెత్స, దేశిరాజు, శేషుబాబు మొదలైనవారీ సంస్థకు చెందినవారై కొంత కృషిచేసినారు. ఇంతకు పూర్వమే శేషుబాబు (మానూరి వెంకట శేషగిరిరావు) సాధనసమితి సభ్యులై 'నిర్మాణగానమ'నే గీతావళి, 'అశోకరాజ్యము' - 'ఆంధ్రశ్రీ' అనే నాటకాలు ప్రచురించి - "జాతీయ సాహితి" అనే పేరనొక మాసపత్రికను (తెనాలినుంచి) కొంతకాలము నడిపి కొంత కృషిసల్పి ఉన్న ఉత్సాహవంతుడు; పెనుమెత్స, దేశిరాజులనుగూర్చి పూర్వము గ్రహించే ఉన్నాముకదా! ఇంక ఏటుకూరి వేంకట నరసయ్య కవిని (గుంటూరుజిల్లా పెదకూరపాడులో జననము 1-4-1911 - మరణం 10-11-1949) గూర్చి తెలుసుకొందాము.

ఏటుకూరి సహజకవి; నూటికి నూరుపాళ్లు ఆంధ్రుడు. నవ్యాంధ్ర సాహిత్య సరస్వతికి నూతనాలంకారాలను తొడిగిన 'కవిబ్రహ్మ' బిరుదాంచితుడు; పల్నాడు లోని నుడికారాలను ఏరి తన ఖండకావ్యాలలో భద్రపరుచుకొన ప్రయత్నించిన 'ఉభయ భాషా ప్రవీణుడు'; రైతుప్రీతి - రైతు నుద్ధరించ వలెననే దీక్ష ఈయనకు మెండు; 'మన ప్రాచీన వీర గాధలన్నిట్రి అందు పల్నాటి వీరచరిత్ర కొక

* పద్యంబు పదకను బరికించి చూచినా హృద్యమై పించును గద్య రచన
గద్యంబు బిగువును గాలించి చూతునా హృద్యమై మించును పద్యరీతిఁ
పద్య గద్యంబుల భావంబు చూతునా భావంబు లొందొంటఁ బడువులెత్తు
భావంబు లోకనాటు పసిగని చూతునా శైలి తనంతనే సాగి చనును

శైలి నొకసారి చూతునా సకలరసము
లుప్పతిల్లుచు నుండును నుప్పలుగను
అహహ! నరస సుబ్రహ్మణ్య కవుల కలము
దేశభక్తిని జాటుచుఁ దెజరిల్లు - పెనుమెత్స సత్యనారాయణరాజు.

రూపాన్ని కల్పింప, సమకట్టినాడు' కాని పూర్తి చేయలేదా కృతిని. "త్రివేణి *- క్షేత్రలక్ష్మి◆ మగువమాంచాల - నాయకురాలు - ప్రేమాలోకము - సిద్ధాశ్రమము - రైతు (హరికథ) - 'వీరభారతము - అలుగురాజు†" - మొదలైనవి ఉత్తమ ఖండకావ్యాలై ప్రజాదరాన్ని చూరగొని ఈకవికి విశేషకీర్తిని ఆర్జించి పెట్టినవి; 'చందమామ' పత్రికలో అనేక గీతాలను ప్రచురించి ఈయన బాలవాఙ్మయాభి వృద్ధికి ఎంతో తోడ్పడినారు; "తెల్గువెల్గులకుగా నిలువెల్లను ధారవోసి"నవాడు; "ప్రాతక్రొత్తలం దుల్లమునేర్చి దేశికవితోచిత మార్గములన్ గమిం"చినవా డితడు; జాతీయ దృక్పథ మెక్కువగా కలిగిన నవ్యులలో నెన్నదగినవాడు; జానపద సౌభాగ్యానికీ, జాతీయముల శోభకూ మురిసిపోయి తన కవితలో వాని కధిక గౌరవమిచ్చిన దేశికుడు. అయితే దేవునికి కన్ను కుట్టడంవలన మనకు లేకుండ పోయినాడు*!

పై వారేకాక ఇంకా జాతీయ వాఙ్మయ స్రష్టలనేకు లీనాటి కాలములో బయలుదేరినారు; వారిలో కొందరు జాతీయోద్యమముతో సన్నిహిత సంబంధము కలవారై ఉండడము విశేషము; గురజాడ రాఘవరావుగారనే (బందరు) సహజకవి

---

* ఇందలి "వానకారు, పెండ్లి" మొదలైన ఖండిక లనేకులకు కంఠస్థములని గ్రంధకర్తయే తెలుపుచున్నాడు 'ఆభాషణము'లలో

◆ ". . ఆయా యెడలఁ బ్రకృతి బాంధవుఁడగు కర్షకుని హృదయమంటి నడచితిని. కూలిబాబు జాలిచూపుల నోలగించితిని. ఆద్యంతములు కళాదృష్టితోఁ బ్రసంగించితిని, కాని కొన్నిపట్ల లక్ష్యమర్యాదనే యెంతయుఁ బాటించితిని . . " - 'క్షేత్రలక్ష్మి'ని గూర్చి కవి వాక్యాలు చూచినారుగ, వస్తువులో రచనలో నవ్యతను ఆశించినవాడేకాని ఈయన భాషామర్యాదను పవిత్రంగానే భావించినట్లు తెలుస్తున్నది

† " . . ఆంధ్ర సారస్వత చరిత్రలో వచనరచనా ప్రధానమైన ప్రస్తుత యుగంలో ఆంధ్ర వీరగాధ ఇతివృత్తంగాగల ఇట్టి ఉత్తమతరగతి పద్యకావ్యం ఉదయించడం మిక్కిలి హర్షింపదగిన విషయం " - ఆంధ్రప్రభ: 'వీరభారత విమర్శ '

* పల్నాటిసీమలోని రైతుల పరిభాషాపదాలకు జీవముపోసి తన కావ్యములో స్థిరముగా నిల్పినాడు. కొల్లూరు, నిడుబ్రోలు హైస్కూళ్ళలో పండితుడుగా పనిచేసినాడు చాలాకాలం. ఎంతకాలముగా సాధనచేస్తున్నప్పటికిని ఇతడు 1945 దరిమిలా మంచి ప్రచారములోనికి వచ్చిన నవ్యుడని గమనిస్తాము

"వాసుదేవ శతకము, ముకుందమాల" లు రచించడమేకాక 'నవఖాళి - స్వాతంత్ర్య పథము ◆ - బాపూజీ' మొదలైన ఖండకావ్యాలను వ్రాసిన దేశభక్తుడు. గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు, "గాంధీమహాత్ముని నిర్బంధము (హిందీ అనువాదము) - ప్రజానాయకుడు ప్రకాశం - ఆచార్యరంగా - మన రైతుపెద్ద - సరోజినీదేవి (ప్రభుత్వపు బహుమతి పొందినది) - హంపీపిలుపు మొదలైన పుస్తకాలు వ్రాసి యీ కాలానికి జాతీయ సారస్వతాన్ని సృజించిన దేశభక్తుడనిపించుకొంటున్నాడు.

కోగంటి దుర్గామల్లిఖార్జున రాయకవి జాతీయాభిమానము గల సంస్కారి; కృష్ణాజిల్లా పామఱ్ఱు హైస్కూలులో పండితుడై 'భారతీసమితి' (1945) - 'శ్రీ విఘ్నేశ్వర గ్రంథమాల'ను స్థాపించి తద్వారా విశేషకృషి చేస్తున్న ఉభయభాషా ప్రవీణుడు; ఆంధ్రపుత్ర తారావళీత్యాది పద్యాలు - మంగిపూడివారి జీవితచరిత్ర రచించి జాతీయ వాఙ్మయపథాన్ని విస్తృతంచేస్తున్న దేశసేవాపరాయణుడు.

ఈ సందర్భాన మరికొందరి కృషిని గమనించవలె, చూడండి; బండారు ఆంజనేయులుగారి 'స్వరాజ్యము' - మంచికంటి వేంకటేశ్వరరావుగారి 'నేతాజీ భారతము' - యడ్లపల్లి కోటయ్యగారి 'గాంధేయవిజయము' (నాటకము), 'ఐదెకరాలు' (కథలు) - కోగంటి అన్నపూర్ణయ్యగారు సంపాదించిన 'గాంధీస్మృతి' - సాహిత్యమండలి వారి 'జయపట్టాభి' - నెలిదండ శ్రీనివాసరావుగారి "భారత స్వరాజ్య సమర చరిత్ర" మొదలైన గ్రంథాలు, మాధవపెద్ది శేషగిరిరావుగారి పద్యాలు - రావూరు సత్యనారాయణరావుగారి గేయాలు (కృష్ణా పత్రిక - కె. సభాగారిగేయాలు - మొదలైనవీ, ఇంకా ఎన్నో జాతీయ రచనలుగా గ్రహింపదగినవి వెలువడినవి. మాగంటి బాపినీడుగారి వాఙ్మయ కృషికూడ ఏతన్ముఖమైనదనే తెలుసుకుంటాము. "నవోదయ - ఆంధ్ర రిపబ్లిక్ - ఆంధ్రరాష్ట్రం - జైహింద్ - జయ్‌భారత్ తెలుగుదేశం - మాతృసేవ - ప్రగతి - సారధి - ఆంధ్రశ్రీ - మొదలైన పత్రికలెన్నో జాతీయోద్యమ ప్రచారాని కెంతో తోడ్పడినవి. తోడ్పడుతున్నవి. ఈవిధముగా వాఙ్మయములో జాతీయ దృక్పథ మీనాడు బాగా పెరిగిపోయినట్లు గుర్తిస్తాము.

---

◆ ఈ చిన్ని పుస్తకము దేశభక్తి, కవితాశక్తి, మనోరక్తి అన్నిటికి ప్రకాశకము

- విశ్వనాథ

## నేటి స్థితి :

ఈనాటి సారస్వతలోకాన్నీ దేశస్థితినీ పరిశీలిస్తే వింతగా కన్పిస్తవి. రచయితలకు పాండిత్యముపైకన్న ప్రచారముపైనే దృష్టి ప్రబలుతున్నట్లు, ప్రజలకు బాధ్యతలపైనకన్న ప్రభుత్వములో పలుకుబడిపైనే దృష్టి హెచ్చుతున్నట్లు కనుగొంటాము; ప్రభుత్వముకూడ ప్రచారముకోసము తంటాలుపడవలసివచ్చినది. వీటికన్నిటికీ తోడుగా ప్రచారక సాధనాలైన “పత్రికలు - రేడియో - సినిమాల”నే వాటికి ప్రాబల్య మింతింతనరాక పెరిగిపోతున్నది; వీటి నాశ్రయించుకొని అనేక రచయితలు కృషిచేస్తున్నారు; వ్యావహారికభాష స్థిరపడిపోయి భాషాసాంకర్యమున కమితముగా తావిస్తున్నది; రాజకీయాలు ఆర్థిక స్థితిగతులు ముఖ్యంగా చర్చింపబడుతూవస్తున్నవి. ‘మురారాజకీయాలు - కులతత్వకక్షలు - ద్రోహ చింతనము’ లు స్వార్థపరుల వలన వర్ధిలుతూ సంఘక్షేమానికీ, శాంతికీ భంగకరము లౌతున్నవి; దేశ [illegible]ంత్ర్యం వచ్చినా స్వరాష్ట్రమురాలేదు గనుక ఆంధ్రోద్యమము తీవ్ర[illegible]స్తున్నది; ఆంధ్రదేశమంతటా, ముఖ్యముగా కళాశాలలో, ఆంధ్రాభ్యు[illegible]త్సవాలు వైభవముతో, దీక్షగా జరుగుతున్నవి; ఆంధ్ర విజ్ఞాన బీజాలను [illegible]టి రాష్ట్రసంపాదన దీక్షను పెంపొందిస్తూ అనేక పండితులు - కవులు విద్యార్థులలో నవ చైతన్యాన్ని కల్గిస్తున్నారు; సారస్వతసభలు - కవిసమ్మానాలు పలుచోట్ల జరుగుతూ ఉండడం గమనింపదగిన అంశం; హిందీ రచనలను, తదితర భాషా రచనల ననువదించ డాని కనేకులు పూర్వము కన్నా నేడు ఎక్కువగా పూనుకొంటున్నారు* ; ప్రభుత్వము కూడ ప్రాంతీయ భాషలను పోషింప బూనుకొనడం హర్షింప దగిన అంశం; ప్రచురణ సంస్థలు - పరిశోధక సంస్థలు

---

* నాగు ‘శేషప్రశ్న’ను -విద్యానాథ్ ‘బిందూర్‌ఛేలే,’ ‘అరక్షణీయ’ ‘పండిట్ జీ’ మొదలైనవాటిని - శివరామకృష్ణ ‘కాశీనాధ్’ ‘సామి’ ‘దేవర్లో’ ‘శ్రీ కాంత్’లను - శ్రీ నూరి ‘చరిత్రహీన్’ ‘వైకుంఠుని’ వీలునామాలను - అరుణ శ్రీ ‘సుమతి’ ని - నీలకంఠం ‘సుభద్ర’ను అనువదించి ‘శరత్’ ను అందించినారు పురాణం కుమార రాఘవశాస్త్రి రమేశచంద్ర దత్తు ‘ధర్మవిప్లవము’ ను, తెన్నేటి సూరి (బంకింది) ‘కృష్ణకాంత్’ ను అనువదించినారు; ముఖ్యంగా ‘దేశికవితామండలి’ కృషి ఈ సందర్భాన ఎన్నవలె. అయితే మాడపాటి హనుమంతరావు గారు, కేశవస్వామి, ‘చక్రపాణి’ (ఆలూరు వెంకట సుబ్బారావుగారు) మొదలైనవారు వీరందరి కన్నా పూర్వమే అనేక పత్రికల ద్వారా ప్రచురణల ద్వారా అనువాద సాహిత్యాన్ని విశేషమును అందించిన ప్రవీణులని గమనిస్తాము. ‘ఆంధ్రజ్యోతి’ మొదలైన పత్రికలను సంపాదకత్వాన్ని నిర్వహిస్తూ సినిమాలకు కథలు - మాటలు వ్రాస్తూ గణన కెక్కుతున్న చక్రపాణి ‘పాత మంగలి - దేవదాసు - బడదీది’ మొదలైన గ్రంథాలెన్నో రచించి కేవలము అనువాదకుడుగానే కాక స్వతంత్ర కథారచయితగా పేరుపొందుతున్నాడు

అనేకను వర్ధిలుతూ నిర్మాణాత్మకమైన కృషిచేస్తూ ఉండడము గమనింపదగిన విషయం. ఈనాటికీ సంప్రదాయ, నవ్య, అభ్యుదయమార్గముల ననుసరిస్తున్న పండితులు - నవ్యులు - ప్రచారకులుండనే ఉన్నారు. అయితే సహృదయదృష్టితో వీరందరూ ఒకరి నొకరర్థము చేసుకోగల్గుతూ ఒక సమన్వయ మార్గాన నడవబూనుతున్నట్లు గమనిస్తాము; వివిధ సాహిత్యవీధులను వాని అందచందాలను ఏతన్మార్గవర్తులను గూర్చి కొంత తెలుసుకొందాము:

## నవ్యమార్గ విస్తరణము - కొందరి కృషి :

ఈనాటికీ నవ్యసాహిత్యమార్గాన పథికులు అనేకులుండనే ఉన్నారు. వీరు కేవలము పూర్వులవలె 'ఊహాప్రేయసి' నిమిత్తము అంబరవీధులలో విహరించక అవనికి దిగివచ్చి ఆంధ్రాభిమానముతోను, దేశాభిమానముతోను సాధన చేస్తున్నట్లు గమనిస్తాము; వీరిపై అభ్యుదయ ధోరణి ప్రభావము కల్గి ఉన్నట్లుకూడ తెలుస్తుంది. అయితే, గ్రంథ ప్రచురణము బహుళముగా చేసికొని పేరు ప్రతిష్ఠల నీనాటికి గడించిన వారల్ప సంఖ్యాకులే; అట్టి వారిలో కృష్ణాజిల్లా మొవ్వ గ్రామానికి చెందిన పువ్వాడ శేషగిరిరావు (జననం:1906) గారి కాలాన ప్రసిద్ధిలోకి వచ్చిన నవ్యులలో ఎన్నదగిన ప్రతిభావంతుడు; పింగళి◆ వారి శిష్యుడై, చిన్నతనమునుంచే కవిత్వంచెపుతూ చోడవరపు జానకిరామయ్య గారిని కలుపుకొని "కవిత" (1925) అనే చిన్నపుస్తకాన్ని ప్రచురించినాడు. 1928 మొదలుగా నేటివరకు ఆంధ్రపండితుడుగా వివిధ స్థలాలలో✻ విద్యార్థులకు కవితాభిరుచిని ప్రవేశమును కలిగిస్తూ, ఒక చెంత

◆ శతవధానములోన సారవ ...ంబైన పద్యమ్ము నుడిపెడి ఫణితి నీది
తెనుగు బల్కులు తేటతేర్చి చొ...ల నింపి త్రావింపగల్గు గౌరవమునీది
క్రొత్తపొత్తుల కైతనుంగూర్చి చెలువమ్ము మిసిమి చూపించిన మెరుంగు నీది
పలుకుతో భువనంబు ఉపదను గానించి నిర్మల తత్త్వమందించు చెలువు నీది
నవ్యమైనట్టి జాతిరత్నమ్మె కాని తళుకు బెళుకైన రాళ్ళకు తడననట్టి
సుకవిభోగ్యమ్ము నైనట్టి ప్రకృతి నీది ఇంత యేటికి? మేలూన దెల్లనీది

✻ బెజవాడ హైస్కూలులో 1928 నుండి 1935 వరకు, బందరు హిందూ కళాశాలలో 15 సంవత్సరాలు, 1947 దరిమిలా విజయనగరము మహారాజావారి కళాశాలలో పనిచేస్తూ విద్యార్థులకొక వెలుగుగా నిలిచిఉన్నాడు.

సుశ్రావ్యమైన కంఠంతోను అదొక విధమైన అభినయంతోను పద్యాలనుపాడి సభ్యులను ముగ్ధులనుచేస్తూ మరొక చెంత ప్రజాదరాభిమానాలను బాగా చూరగొంటున్న ◆ "కవి పాదుషా" యితడు. గోవత్సము✻ - తాజమహలు-దారా' అనే యితని ఖండకావ్యాలు ఇటీవలనే గ్రంధాకృతిని దాల్చిన మనోహర రసవత్ఖండాలు! ఏరువాక-ఆంధ్రతేజము-దుర్గాదాసు మొదలైన వచన గ్రంధాలు వ్రాసి పాఠశాలా వాఙ్మయాభి వృద్ధికి కూడా తోడ్పడినాడు. పిళ్ళ వెంకటరత్నం కవి, అద్దేపల్లి లక్ష్మణస్వామి మున్నగువారితని శిష్యులలో ఈనాటికి పైకివస్తున్నారంటే ఇంక పువ్వాడ వారికున్న వ్యాప్తి, ప్రశస్తి వేరుగా పేర్కొనవలెనా? ప్రాచీన అధునాతన కవితారీతుల కైవసము చేసుకొన్న పండితుడై తెలుగుభాషలోని వెలుగు జిలుగులను యేర్చి కూర్చుకొన్న ప్రజ్ఞామూర్తియై చవులూరు రసవత్ ఖండికల రచించి యీకాలానికి మంచి పేరు ప్రతిష్ఠలు గడిస్తున్నాడు.

అధునాతనులలో అందులోను హైదరాబాదు ప్రాంతమున అంబటిపూడి వెంకటరత్నకవి (బి.ఏ) నెరుగనివారుండ రనవచ్చు; వేలూరివారి ప్రియశిష్యుడైన యితడు కవితలో ఎంత పలుకుగలవాడో పైకి అంత అమాయకుడుగా కన్పిస్తాడు. సంస్కృతాంధ్రాంగ్లాలలో 'మనోహర కవిత్వము' చెప్పగలిగినవాడు. 'సాహితీమేఖల'

◆ "ప్రసిద్ధులయిన నవ్యకవులలో శ్రీ శేషగిరిరావుగా రొకరు. పలుకులు మెత్తనివైనా పలుకుబడి మహాతీవ్రమైనది. తేనెకళ్ళు తేలవేసి ఆయన పద్యాలు చదువుతుంటే శ్రోతలు పరవశులౌతారు. పద్యరచనలో మంచి పనివాడు. ఆయన కావ్య పఠనం చేస్తుంటే కవీ గాయకుడూ నటుడూ కలిసి మనమీద కుట్రపన్నుతున్నారా అనిపిస్తుంది. అనుకుంటేనే వలలో పడిపోతాం" -రేడియో సమీక్షలో

✻ " . . . ఈ గ్రంధంలో మెత్తదనంకన్న గాంభీర్యం యెక్కువ. చెక్కిలిగింత కన్న పూపు యెక్కువ. పడికట్టుకన్న పరుగు యెక్కువ." (కృష్ణాపత్రిక)

ఇతను 'తందానపాట'రచించి వీరరసపోషణములో, దేశికవిత చెప్పడములోను తనకున్న ప్రావీణ్యమును ప్రదర్శించినాడు. ఈయనపై శిష్యుని పద్యము చూడండి:

"జలజలరాలు పూలవరుసన్ నిరసించు పదాల కూర్పు క్రొ
న్నెల తెలినీటి కాంతి రవణించు తుటారపు కైతనిగ్గుకో
కిల కలనిస్వనమ్ము తులకించు వికస్వరసుస్వరమ్మునీ
కలవడ పూర్వజన్మసుకృతార్ధము గాదె గురూ! ధరాస్థలిన్

అనే సంస్థను స్థాపించి అనేక యువకవులకు◆ గురువై యితడు చేసిన చేస్తున్న కృషి ఎన్నదగినది. "మైనాదేవి - మొరాన్‌కన్య✻ వత్సలుడు - దక్షిణ - చంద్రశాల - పీరాంజలి - ఇంద్రధనువు" మొదలైన నవ్యకావ్యాలను, అనేక నాటికలను, 'కథావళి'ని రచించిన యితడు సహజ కవితావేశుడు. తెలంగాణమున కవితా నిర్ఝరిణుల ప్రవహింపజేసి తేనె మాగాణము చేస్తూ అనేక సమ్మానముల పొందుతున్న కృషీవలుడు!

బెజవాడలోని వేదాంతకవికీనాడు కొంత ప్రశస్తి ఉన్నది; సహజముగా కవితావేశము కలవాడు; దానికితోడు పెంకెతనమున్ను ఉన్నవాడు. ఇతనిపేరు 'తెనుగుతల్లి' అను నాటకరచనము వలన పైకివచ్చినదనవలె. "కెరటాలు - కిరణాలు - చలో హైదరాబాద్ (నాటకం) - కవితా సంస్థానము (విమర్శ)" మొదలైన రచనలద్వారా నేటికాలాన సంచలనం కలిగిస్తున్న ప్రతిభావంతుడితడు. తెలంగాణ పోరాటములో కృషి చేసిన కవిధీరులలో ఇతనిని కూడా పేర్కొనవలె.

వారణాసి వేంకటేశ్వరులుగా రొక సాధకుడు: (జననం 1909); మాధవపెద్ది కవి ప్రభావము కలవాడై 1939 లో 'సాహిత్య కుటీరము'ను‡ స్థాపించి అనేక ప్రచురణములను తత్క్షాన వెలువరిస్తూ వచ్చిన సారస్వతసేవకుడు: 'రాధామాధవ శతకము'ను రచించిన కవియై, 'సుధాంజలి - ఆంధ్రరాష్ట్రము - రత్నసానువు - వనమాల' మొదలైన తన రసవత్ఖండకావ్య సంపుటులను ప్రచురించి భావకవితా మార్గాన్ని విస్తరిల చేసిన నవ్యుడు; "సుబాసుబోసు అంతర్ధానగాథ (బుఱ్ఱకథ) - జాతీయ గీతావళి" వ్రాసి, "ఆంధ్రశ్రీ - సేవాకుటీరము" వంటి వచన గ్రంథాలు వ్రాసి జాతీయదృష్టి ప్రజలలోను విద్యార్థులలోను ఈకాలాన కల్గిస్తున్నట్లు గమనిస్తాము.

---

◆ పులిజాల హనుమంతరావు, ధవళా శ్రీనివాసరావు మొదలైనవారు.

✻ అంబడిపూడి వెంకటరత్నంగారి కావ్యద్వయి (మైనాదేవి-మొరాన్‌కన్య) మొదటి ప్రచురణం, రమ్యంగావుంది...వెంకటరత్నంగారిది చక్కనివాణి. 'మైనాదేవి' సిపాయి విప్లవానికి సంబంధించిన కథ. రసవంతంగా చిత్రించాడు. ఈయన చాలకాలం క్రిందటనే 'ప్రణయవాహిని' అనే ఖండకావ్య సంపుటి ప్రకటించాడు. ఎన్నదగిన వ్యక్తి. -కురుగంటివారు

‡ చివుకుల ఆదినారాయణగారనే యువకవి దీనికి సహాయసంపాదకుడై కొంత సేవ చేసినాడు.

వట్టికొండ రంగకవి◆ (కృష్ణా జిల్లా వీరులపాడులో జననము 1915) మరొకడు ప్రత్యేకాభిమానముతో సంస్కృతాంధ్రాంగ్లాలలో మంచి ప్రవేశము గల్గించుకొని (బి.ఏ., ప్యాసయి) తిరువెంగళాచార్య, శివశంకరశాస్త్రి, కొడాలి సుబ్బారావుగారల ప్రభావముతో పద్యరచన - గ్రంధవిమర్శ - గేయరచనలచేయ ప్రారంభించి (1938) భారతి - ప్రతిభేత్యాది పత్రికలలో ప్రచురిస్తూ ఉండి 1943 నాటికి "విప్లవజ్వాల - మధూదయము - అరుణోదయము - అభ్యుదయకవి" అన్న ఖండకావ్యాలను గ్రంధరూపాన ప్రచురించిన నవ్యుడు; పద్యరచనములో ప్రాచీనరీతుల జ్ఞప్తికిదెచ్చు పటిమకలవాడితడని తెలుస్తుంది. భావములో అభ్యుదయ ధోరణి, ప్రచార దృష్టి కలవాడైనప్పటికీ యితడు ప్రధానముగా భావకవితామార్గము ననుసరించినవాడని రచనావిధానము తెలుపుతునే యున్నది.

నేటి ఖండకావ్య కర్తలలో జంధ్యాల పాపయ్యశాస్త్రి (కొప్పర్తిలో జననం: 4-8-1912) ప్రజాదరాన్ని చూరగొంటున్న ప్రతిభావంతుడు. సాహితీ సమితి యువ సభ్యుడు; 'కరుణశ్రీ' అనే ప్రచ్ఛన్ననామము కలవాడు. ఇతని మూర్తీ, ఇతని రచనలూ సుకుమారమైనవి.‡ 'ఈ కవి ఆర్ద్రహృదయుడనియు, కరుణరసవాదియనియు ముఖావలోకనమున గ్రహింపవచ్చును,' (తల్లావజ్ఝలవారు).. సంస్కృతాంధ్రాలలోనే కాక హిందీలోను కృషిచేసిన 'భాషా ప్రవీణుడు'✻. గుంటూరు ఎ.సి. కాలేజిలోను,

◆ 1944లో 'వ్యవసాయి'లో, 1944-46లలో ఆంధ్రప్రభలో సంపాదక సహాయ సంపాదకత్వాలను నిర్వహించీ, 1947 లో 'సారధి ఫిలిమ్సు'లో పాటలను కూరుస్తూ 1948-49 లలో తెలుగుభాషాసమితిలో కృషిచేసీ, 1950 లో "విజయప్రభ"కు సహాయసంపాదకుడుగాఉంటూ ఈతడు మంచి అనుభవాన్నే సంపాదించినాడు. అయితే వినయశీలుడు కావడమువలన రచ్చకెక్కలేదేమో అనిపిస్తుంది

‡ "... ప్రసన్న కధాకలితార్ధ యుక్తిగల పదాలు ఏర్చి కవి రసజ్ఞుల కంజలి పట్టి గిలకరించి యిట్టె విక్షేపింపగా అవి తమకు దామే ఛందస్సూత్రములో కూర్చువడి, వృత్తాలుగా గీతికలుగా రూపొందినట్లుంటాయి ఇందలి పద్యాలు . . మనం సామాన్యంగా మాట్లాడుకొనే మామూలు మాటలతోనే రసం ఉట్టిపడేటట్టు శక్తిమహితమైన గొప్ప కవిత్వం చెప్పడం ఈకవికి సహజంగా అలవడ్డ ప్రజ్ఞ . . హృద్యమైన సంభాషణశైలి" - మల్లంపల్లి. "విజయశ్రీ . ప్రస్తావన"

✻ భమిడిపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేమూరి సీతారామశాస్త్రి, కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి గారలీయనకు సంస్కృతము చెప్పిన గురువులు; శివశంకరశాస్త్రి గారి ప్రభానం ఇతనిమీద ఉన్నదని వేరే చెప్పనక్కరలేదు

గరల్సు హైస్కూలులోను కొంతకాలము హిందీ తెలుగు పండితుడుగా పనిచేసి ప్రస్తుతం అమరావతిలోని శ్రీరామకృష్ణ హిందూ హైస్కూలులో ఉంటున్నాడు. "ఉదయశ్రీ*" (రెండుభాగాలు)-"విజయశ్రీ - కరుణశ్రీ"◆ (ఖండకావ్యాలు) - కరుణామయి (నాటిక) - అరుణ కిరణాలు (గేయాలు) స్వప్న వాసవదత్తము (అనువాదము) ఈతని కృతులు. ఈతని ఖండికలు కొన్ని "రికార్డు" అయి‡ ఇతని కీనాడు మంచి కీర్తినార్జించి పెట్టుతున్నవనవలె. ఇతని రచనము శబ్దార్థ క్లిష్టముకాక, భావనవాస్తవికాన్ని వదలిన గాంభీర్యము చెంతకు బోక, ఇతని శైలి పూసెజ్జవలె మనోజ్ఞమై ప్రజల రంజిల చేస్తున్నది.§ అయితే ఇతని కవితారీతి కరుణరసపోషణానికి అనువైనట్లు మరియే యితర రసపోషణానికీకాదని గమనిస్తాము. హిందీ భాషా కవితాధోరణులను మనకు దిగుమతి చేస్తున్నవారిలో ఇతనిని కూడ చేర్చవలె. పదముతుదిని శ్రీకారం చేర్చడంలో, రీతి నాదమునే మన్నించడములో ఇతని ననుకరించే యువకులు బయలుదేరడము వలన❖ ఇతనివి విశ్వవిద్యాలయ పాఠ్య గ్రంధాలు కావడము వలన నేడితనికొక ప్రత్యేక స్థానమే లభిస్తున్నట్లు తెలుసుకుంటాము.

---

* దైన్యజీవులపై సానుభూతీ - స్వదేశం, స్వరాష్ట్రం పైన ప్రేమా - దేశ నాయకుల పైన అభిమానము - స్త్రీమూర్తిపైన అపూర్వాదరము - దోషభూయిష్ఠాలైన చారిత్రకాంశాల పైన ఉక్రోశమూ ఇందులో అంతటా పర్చిఉన్న వివిధ భావాలు. ఆర్ద్రమైన, హృదయంగమమైన యీ భావాలకు అందాలుదిద్దే శైలీ సారళ్యం ఈ కవి లేఖినిలో తొలుకాడడం గమనింపతగింది.. ఈ ఖండికలలో "..-వోద్రేకముకన్న స్వానుభవస్ఫూర్తి మిక్కుటంగా భాసిస్తోంది..."

-పిల్లలమర్రి: రేడియో సమీక్ష

◆ "...శ్రీ పాపయ్యశాస్త్రిగారికి కరుణరసం ఆత్మసర్వస్వం .. సర్వజనవేద్యంగా సుకుమార భావాన్ని స్వయంవ్యక్తంచేసే మృదుశయ్య ఈకవిది... ఆపాతమధురమైన సుకుమార పదప్రయోగ విశ్వాసం శ్రీ పాపయ్యశాస్త్రిగారికి నేటి కవులలో అగ్రతాంబూలం పూర్వకవులకంటె విశిష్టత సంపాదించి ఇస్తుంది. శాస్త్రిగారు 'తెలుగుదండి' .."

-నండూరి రామకృష్ణమాచార్య 'కరుణశ్రీ'కి ఉపశ్రుతి'

‡ పుష్పవిలాపము, అద్వైతమూర్తి, సాంధ్యశ్రీ, పోతన, నేతాజీ, రాష్ట్రసిద్ధి మహాత్ముడు, మొదలైనవి. ముఖ్యంగా, ప్రసిద్ధగాయకుడు ఘంటసాల వెంకటేశ్వరరావుగారు వీటిని పాడడం విశేషం!

§ ఇతని కవిత్వము సభారంజనము చేస్తుంది; ఇతనిది declamatary style అనీ అజ్ఞుల నలరించే నిమిత్తం ఔచితిని పాటించనిదని ఒకవిమర్శ ఉన్నది.

❖ మాలకొండారెడ్డి, బృందావనం రంగాచార్య, వానిలాల నరసింహారావు మొదలైన సాధకుల రచనలిందుకు తార్కాణాలు.

'ఆంధ్రకేసరి' జీవిత చరిత్రను పద్యకావ్యముగా సంతరించిన ముదిగొండ వీరభద్రమూర్తిగారు (సత్తెనపల్లి తాలూకా మాదలలో జననం 15-8-1908) వర్ధమాన జాతీయకవే. 'కామాక్షీకటాక్ష లబ్ధకవితావేశు' డితడు. సంప్రదాయ గౌరవముకల సాహితీ సమితిసభ్యుడు. "వేణుగోపాలశతకము, వాసవదత్త, కామాక్షీపంచశతి (మూకపంచశతికి భావానువాదము) ఆంధ్రకేసరి" మొదలైన కావ్యాలను రసవంతముగా రచించిన ధ్వనివాది. 'గుణాలంకారశయ్యాపాకాది రూపముల సరియగు విన్యాసముల' పొందించడానికి యత్నించే అల్ప సంఖ్యాకులలో ఇతడొకడని గమనిస్తాము. వస్తుసేకరణములోజాతీయదృష్టి ఎందరికైనా ఉండవచ్చు; అయితే కావ్యత్వసాధనము కొందరి సొమ్మేమరి! శ్రావ్యకంఠముతో ప్రసన్నవదనముతోను సభ్యులను సమ్మోహితులను చేస్తూ నేడు పేరు పొందుతున్న నవ్యుడితడు.

ఆంధ్రభాషా సాహిత్యాలపైన ప్రత్యేకాభిమానము కలిగి ఆంధ్ర విశ్వ విద్యాలయములో తెలుగు ఎం.ఏ. చదివి వివిధకళాశాలలలో ఉపన్యాసకులుగా ఉన్న వారిలో కొందరు నవ్యసాహిత్య వ్యాపనానికి కృషిచేస్తూ పేరు పొందుతున్నట్లు గమనించవలె.◆ వీరిలో బాలాంత్రపు రజనీకాంతరావు (జననం 1920) మంచి

◆ అట్టివారిలో దివాకర్ల వెంకటావధానిగారనేక ఖండకావ్యాలను రచించి, 'రాజసందర్శనమ' నే లఘుకావ్యాన్ని ప్రచురించి, నాటకమునుగూర్చి-ఆముక్తమాల్యదనుగూర్చి ప్రత్యేక పరిశోధనము సలిపిన పండితకవి. అయ్యంకి తాండవకృష్ణగారు స్వయముగా నటుడై ప్రదర్శనములనిచ్చి కూచిపూడివారి నాట్యకళనుగూర్చి విశేషకృషిచేసి కీర్తి గడిస్తున్నవాడు. మందలపర్తి ఉపేంద్రశర్మగారు గ్రంథాలయ, వయోజన విద్యోద్యమాలలో కృషిచేస్తూ 'తిక్కన' అనీ 'వయోజనవిద్య' అనీ గద్యనాటికలను ప్రచురించిన సాధకుడు. జంపన చంద్రశేఖరరావుగారు కొవ్వలివారితో పోటీపడి సృజించిన 'నవలిక' లసంఖ్యాకాలు. అవిగాక 'ఊర్వశి' అనే నాటికను రచించి, ఖండకావ్యము లనేకమువ్రాసి, ఇటీవలనే సినిమారంగమును ప్రవేశించినాడు. కాకర్ల వెంకటరామ నరసింహంగారు ప్రబంధాలపైన ప్రత్యేక పరిశోధనము జరిపి మొట్టమొదటగా డాక్టరు బిరుదాన్ని పొందిన మేటి; ఇటీవల భారతులలో ఖండకావ్యములను ప్రచురిస్తూ ఉన్న సాధకుడు. కొత్తపల్లి వీరభద్రరావుగారు 'పరదేశి' అనే ప్రచ్ఛన్ననామముతో కథలను వ్రాస్తూ వచ్చినాడు. పోలూరి హనుమజ్జానకి రామశర్మ, లింగిరెడ్డి రామసుబ్బారెడ్డి, దిగుమర్తి సీతారామస్వామి - భద్రిరాజు కృష్ణమూర్తి - మేడూరి ఉమామహేశ్వరం, పొట్లపల్లి సీతారామారావు మొదలైనవారు వీరిలో ఇంకా కొందరు సాధకులు బయలుదేరుతున్నారు. పోణంగి శ్రీరామఅప్పారావుగారు 'తాజమహలు - విశ్వభారతి' మొదలైన గ్రంథాలు వ్రాసి పైకి వస్తున్నాడు. పాటిబండ. పిల్లలమఱ్ఱి చేసిన కృషినిగూర్చి పూర్వం ప్రత్యేకముగా గ్రహించే ఉన్నాముగదా; పిల్లలమఱ్ఱి గ్రంథాలు భాషాప్రవీణ, విద్వాన్, బి.ఏ. తరగతులకు పాఠ్యగ్రంథాలై అతనికి కీర్తి నార్జించి పెట్టుతున్నవీ చిన్నవయసులోనే.

ప్రతిభావంతుడు; 1937 మొదలుకొని గేయాలను విరివిగా వ్రాస్తూ స్వయముగా స్వరకల్పనముచేసి వాటిని మధుర కంఠముతో ఆలపిస్తూ - రేడియోముఖాన 'రికార్డుల' ద్వారా వినిపిస్తూ - "మధుపాయి"లో (వాల్తేరు) సభ్యుడై - రేడియోలో ఉద్యోగిగా అనేక గాయకులకు మార్గదర్శియై" - గ్రీష్మము - దివ్యజ్యోతి - మేఘదూత - మధురా నగరీగాధ - మేనక - విజయవిధాత" మొదలైన గేయనాటికలను, 'చండీదాసు', 'శాఫో', 'లకుమాదేవి' అనే నాటకములను (చూ. ప్రతిభ సంపుటములు) రచించి పూ.షా అనే ప్రచ్ఛన్న నామముతో కొన్ని చిత్రరచనలను చేసీ - మంచి ప్రసిద్ధిలోకి వచ్చిన నవ్యుడు యీ "రజని"!

ఇటీవల వారిలో నండూరి రామకృష్ణమాచార్యులెన్నదగిన ఉత్సాహవంతుడు; 'ఛత్రపతి శివాజీ' అనే వీరరస ప్రధానమైన నాటకము (1947)-"తారాతోరణము"✻ నే ఖండకావ్య సంపుటి (1950)-"ధర్మచక్రమ"నే నాటకము 'కవిత్రయమ'నే విమర్శగ్రంథము-ప్రచురించిన ప్రతిభావంతుడు. ఇటీవల రేడియో నాటికల ననేకము రచించి ఏతన్ముఖమున కూడ మంచి వ్యాప్తిలోకి వస్తున్న నవ్యుడు.◆

పైవారేకాక షేక్ ఫరీదు కవి 'వేమన' అనీ-కొత్తజగ్గయ్య చౌదరి 'పన్నా, కళానిధి' అనీ-జోసఫ్ కవి 'భారవి' కన్నీటికబురు, మొదలైనవీ-వేమూరి రామనాధం 'చంద్రరేఖ' అనీ-దరిమడుగు కామయ్య 'భారవి' అనీ -ముదివర్తి కొండమాచార్యులు 'అమర సందేశం-వీరమనీడు-ధర్మదీక్ష' లనీ-అయితం కాళీ వరప్రసాదరావు 'హృదయ నివేదనమ'నీ-పల్నాటి సోదరకవులు 'పార్వతి' అనీ-దుర్భా రామమూర్తి 'స్వప్నానుభూతి

---

✻ "శైలియందును శబ్దజాలము నందును ఛందోమార్గములను క్రొత్తప్రాతల మేలు కలయికను వెలయింపవలెనను నాశయమెల్లెడలను గనుపట్టు చున్నది". . . కట్టమంచి.

'. . . ఈ కావ్యసంపుటి ఆనందకరంగా వున్నదనడంలో అతిశయోక్తి లేదు. భాష మధురంగావుంది శైలిమంజులంగావుంది. భావాలు చాలవరకు పాతవే అయినా ప్రదర్శనలో క్రొత్తదనం వున్నందున రసోత్పాదకంగావున్నాయి...' —భీమన్న: ఆంధ్రప్రభ

◆ ఆంధ్రుల చరిత్రను భాషాసాహిత్యములనుగూర్చి విశేషించి పరిశ్రమ చేస్తున్నవ్యక్తిఅనీ భారతీత్యాది పత్రికలలోని వ్యాసాలనుబట్టి గ్రహింపవీలౌతున్నది; పూర్వనవ్యుల కవితారీతులకు బాగా మురిసిపోయిన యితడు వాటికే వశుడైపోయి నట్లు కన్పిస్తాడు తన ఖండ కావ్యాలలో; 'కరుణశ్రీ' ప్రభావమున్ను కొంతకన్పిస్తుందీతని పద్యరచనావిధానములో.

కర్ణుడు, త్యాగము' లనీ అంబటిపూడి సత్యనారాయణ 'త్రివళి' అనీ- కె.అన్నమ రాజశర్మ 'కవి విపంచి' అనీ-కొండూరి నరసింహం 'సారంధ' అనీ -వానమామలై వరదా చార్యులు 'మణిమాల' అనీ - గడియారం రామకృష్ణ శర్మ 'అలంపూరు శిధిలము' లనీ-గార్లపాటి రాఘవరెడ్డి 'పరిదేవనము' నీ -తలమర్ల కళానిధి 'మల్లెపూల' నీ-దూపాటి వెంకట కృష్ణ రాఘవాచార్యులు 'ప్రసూనాంజలి' అనీ-కొండూరు వీరరాఘవాచార్యులు 'తోరణమ'నీ -సున్నం వీరరాజ కవి 'యక్షప్రవాసము' అనీ - జంపాల వేంకట నృసింహం 'ఆమనిపూల'నీ -కాజరాధాకృష్ణశాస్త్రి 'కవిత' అనీ- గోనుగుంట పున్నయ్య 'స్వప్న సందేశము' అనీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి 'అపశ్రుతి' అనీ-పులివర్తి శరభాచార్య ఖండకావ్యాలు-ఎక్కిరాల కృష్ణమాచార్య "అర్పణ, ఋతుగానము◆"లనీ, బూదరాజు రాధాకృష్ణ 'అశ్రుధారల'నీ ఉత్పల సత్యనారాయణా చార్య "ఉత్పలిని, విషబిందు, గాంధారి. కచుని వీడ్కోలు"లనీ-చక్కని ఖండకావ్యాలను వ్రాసి నవ్యకవితా మార్గాన్ని యధా శక్తిగా విస్తృతము చేస్తున్నారని గమనిస్తాము; గాఢమైన ఆంధ్రాభిమానముతో, జాతీయాభిమానముతోను అనేకులు రచనలు సలుపుతున్నారీ కాలాన. ఈ సందర్భాన క్రొవ్విడి వెంకటరత్నశర్మ వ్రాసిన 'ఆంధ్రస్మృతి', బోడేపూడి వెంకటరావు వ్రాసిన 'ఆంధ్రతేజము' చిట్టెపు వేమారెడ్డి వ్రాసిన 'కొండవీటి రెడ్డి సామ్రాజ్యము' - రాయప్రోలు సుబ్రహ్మణ్యము రచించిన 'కొండవీడు' - లెన్న దగినవి; వర్ధమాన ఖండకావ్య రచయిత లనేకులీనాడు సాధన చేస్తున్నవారు✻పత్రికల ద్వారా ప్రచురణముల ద్వారాబయటికి వస్తున్నారు; అయితే

---

◆ "... ఈకావ్యమునందు వేదవిషయములు వైద్యవిషయములు కావ్యమునకు తగినన్ని యున్నవి... ఇదియేదోవేదకాలపుటాత్మ తన సనాతనత్వము నిలుపుకొనుటకు జన్మించినట్లున్నది. .. ఇతనికి ప్రౌఢ మార్గము చాలదూరము వచ్చినది. . ." విశ్వనాధవారి పీఠిక

✻ పంగనామముల వేంకటేశ్వరప్రసాదరావు-అడపా రామకృష్ణ రావు-బంకుపల్లి రామజోగారావు-జోస్యము జనార్దన శాస్త్రి-దేశిరాజు వెంకట రమణరావు-గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి-దండిపల్లి వెంకట సుబ్బాశాస్త్రి-భోయి భీమన్న-కొమరవోలు వెంకట సుబ్బారావు-భట్టిప్రోలు కృష్ణమూర్తి-వావిలాల రామమూర్తి-అయాచితుల హనుమచ్ఛాస్త్రి-ఎ.యల్.వి. చలపతిరావు-పోవూరి సీతారామాంజనేయశాస్త్రి -జమదగ్ని శర్మ-పెండ్యాల సత్యనారాయణ - 'స్వైరవిహారి'-తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు-మాడభూషి శ్రీనివాసాచార్య-కోదాటి నారాయణరావు- పి.వి.నరసింహారావు-హరిరామలింగశాస్త్రి-కొండపల్లి గోపాలరావు-ఆకెళ్ల సుబ్రహ్మణ్యశర్మ-ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్య మొదలైననా రెందరో సాధనచేస్తూ ఆశ కల్పిస్తున్నారు. మాచిరాజు దేవీప్రసాద్ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రులు "పారడీ కవులై" సాధన చేస్తున్నారు.

వారితో చాలమంది రచనలకు రూపురేఖలు నిర్దిష్టము లైనవింక చేకూరలేదనే చెప్పవలె; ఈవిధముగా నేటికీ నవ్యసాహిత్య మొకప్రక్క వర్ధిలుతునే ఉన్నట్లు గమనిస్తాము.

## సంప్రదాయ మార్గము :

ఈ మధ్యకాలములో పశ్చిమ వస్తుజాలముతో ఎన్నెన్ని నవ్య మార్గము లేర్పడి అనేకులను ఆకర్షిస్తున్నప్పటికీ ఈనాటికీ సంప్రదాయ మార్గ మొకప్రక్క విశేషాదరాన్ని పొంది విస్తృత మౌతున్నట్లు గమనిస్తాము; అంటే వేదములపైన* ప్రామాణిక బుద్ధి, పురాణము లంటే అభిరుచి, సంస్కృతభాషపైన గౌరవము లాక్షణికమతముపై దృష్టి మొదలైన వాటిని వీడనటువంటి పండితులీ సంప్రదాయ మార్గమును నేడు 'రాజమార్గము'గా చేయ యత్నిస్తున్నారు. దేశములో ఆముష్మిక చింత నశించిపోకుండ రక్షించేటందుకు ప్రయత్నాలు నేడు కొనసాగుతునే ఉన్నవి. నిజమునకెన్ని పడమటిగాలులు వీచినా సంచలింపని దృఢచిత్తులు లేకపోలేదని దీనివలనబుజువవుతున్నది. విశేషమేమంటే మొదటకొంతకాలము నవ్యమార్గవర్తులై ప్రసిద్ధులైన వారీనాటికి వయసుమీరుతున్నకొలది పూర్వ భ్రాంతినివీడి, వెకిలితనాన్ని మానివేసి, త్రికరణశుద్ధిగా సంప్రదాయ మార్గమునమసరించి వైదిక మతోద్ధరణ దీక్షతో ఉద్గ్రంధరచనము చేయబూనుకుంటున్నారు; 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము' నిర్మిస్తున్న విశ్వనాధ సత్యనారాయణ గారు దేవీ భాగవతము నిర్మిస్తున్న నోరి నరసింహ శాస్త్రి గారలట్టి కవిసమ్రాట్టులు;

నవ్యసాహిత్యాన్ని విశేషముగా సృజించిన సాహితీసమితీయులే ఈనాడు సంప్రదాయవాదులు కావడము గమనింపదగిన అంశం! సాహితీసమితి కొంతకాలము 'పరకాయ ప్రవేశము' చేసి, అనేక సంస్థలకు (నవ్యసాహిత్య పరిషత్తు మొదలైనవి) వికాసము చేకూర్చి తరువాత (1943 నుంచి) స్వస్వరూపముతో ఉన్మేషముపొంది

---

* వినయాశ్రమమువారు ఆమధ్య బంకుపల్లి మల్లయ్య శాస్త్రి, రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి గారలు శ్రమపడి వ్రాసిన తెలుగు తాత్పర్యములతో కూడిన ఋగ్యజుస్సామవేదములను ఆంధ్రవేదమాలిక పేర ప్రచురించినారు.

పలుచోట్ల సమావేశాలను జరిపి* యువకవులను, ప్రసిద్ధ కవి పండితులను కూడ గెట్టుకొని సంప్రదాయసిద్ధమైన సాహిత్య మార్గమునుతీర్చి వివిధ కావ్యమణి గొప్పనులతో దేదీప్యమానము చేస్తున్న విషయము మరువరానిది.

విమర్శకులలో కురుగంటి సీతారామభట్టాచార్యులు, పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, జమ్మలమడక మాధవరామశర్మగారలు తమ వ్యాసములద్వారా, ఉపన్యాసముల ద్వారా, విమర్శ గ్రంధాల ద్వారా సంప్రదాయమునే ప్రబోధిస్తున్నారు; ఇదే మార్గములో పలువురు పండితులు సంస్కృతసాహిత్య గ్రంధముల నాంధ్రీకరిస్తున్నారు. సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి, చలమచర్ల రంగాచార్యులు, జమ్మలమడక మాధవరామశర్మ◆వేదుల రామశాస్త్రి‡గారలు మొదలైనవారట్టివారు.§

* సాహితీ సమితి జరిపిన సమావేశాలను స్థలాలను తదధ్యక్షులను ఈక్రింది పట్టికలో చూడండి:

| | | | | |
|---|---|---|---|---|
| రజతోత్సవము | | 1946 | గుంటూరు | మొక్కపాటి |
| అనంతర ప్రథమ సమావేశము | | 1946 | తెనాలి | కురుగంటి |
| ద్వితీయ | " | 1947 | అమరావతి | తల్లావజ్ఝల |
| తృతీయ | " | 1947 | గుంటూరు | వల్లభజోస్యుల |
| చతుర్థ | " | 1948 | ఒంగోలు | అడివి |
| పంచమ | " | 1949 | ఏలూరు | నండూరి |
| షష్ఠ | " | 1951 | గుంటూరు | రాయప్రోలు, దేవులపల్లి |

రజతోత్సవానంతర ప్రథమసమావేశపు సంచిక కూడ వెలువడినది, అధ్యక్షుల ఉపన్యాసములలో నేమి, సభ్యులరచనలలో నేమి సంప్రదాయమువైపే మొగ్గు హెచ్చుగా కన్పిస్తున్నది.

◆ రసగంగాధరమునే కాక ఇటీవల ప్రతాపరుద్రీయమును కూడ నాంధ్రీకరించిన సాహిత్యవిద్యాప్రవీణుడు; భాషాప్రవీణుడు, ఆలంకారికుడు గానే కాక, ఈయన విద్యార్థులకు సాహిత్యాచార్యుడు గాను, సంస్కృతాంధ్రాలలో అనర్గళమైన ఉపన్యాస పటిమకలవాడుగాను ప్రసిద్ధి కెక్కుతున్నాడు; ఈయన వివిధపత్రికలలో వ్రాసిన సాహిత్య వ్యాసములు రేడియో ప్రసంగములు, పీఠికలు కూడ ఘన పాండితికి నిదర్శనములు! ఇటీవల ప్రభుత్వపు బహుమతి పొందిన విమర్శకోత్తముడు

‡ అప్పకవీయ వివరణమనే గ్రంధమును రచించిన విద్వత్కవి. కొవ్వూరు సంస్కృత కళాశాలలో సాహిత్యాచార్యుడు.

§ బులుసు వెంకటరమణయ్యగారు 'రసార్ణవసుధాకరము' - 'కువలయానందసారము' - 'బాలావ్యాకరణటీక' మొదలైనవి రచించినాడు. కంభంపాటి సుబ్రహ్మణ్య శాస్త్రిగారినికూడ ఈ సందర్భమున పేర్కొనవలె.

సంస్కృతపురాణములను, కావ్యముల ననువదిస్తూ, శతకములను వ్రాస్తూ◆ అనేక పండితకవులు వివిధ ప్రాంతాలలో ఈమార్గాన కృషి చేస్తున్నారని గమనిస్తాము: వేపకొమ్మ ఆది శేషయ్యగారు కురంగీకిరాతము - గుఱ్ఱం సుబ్బరామయ్యగారు 'మేఘసందేశము', దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు భక్తకల్పద్రుమము, సువర్ణమేఖల, మేఘసందేశములు మొదలైనవి-గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యముగారు 'అమరుకము, ఋతుసంహారములు' - ఆకిలి శ్రీరామ శర్మగారు 'కుందమాల, ఉన్మత్త రాఘవము'లు - భారతుల మార్కండేయశర్మగారు ప్రతిమానాటకము-పుటుంబాక శ్రీకృష్ణయ్యగారు 'కొండవీటివిజయము' - స్వయంపాకుల వెంకటరామశర్మ గారు 'సేవ్యసేవకోపదేశము' - పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రిగారు 'రత్న పాంచాలిక' -ఉప్పల నరసింహశర్మగారు 'మంగళగిరి మాహాత్మ్యము'- రామావఝల కొండయ్యగారు 'వామనపురాణము' (అనువాదము)- ముదిగొండనాగవీరయ్యశాస్త్రిగారు 'శివపురాణము'✻ - మహేంద్రవాడ వీరగణపతిశాస్త్రిగారు 'భృగుసంహిత' - పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు‡ 'కంబరామాయణము' (అనువాదము) - పులుగుండ్ల నరసింహ శాస్త్రిగారు క్షేమేంద్రుని దర్పదళనము - పుల్లాపంతుల వెంకటరామశర్మగారు 'భారతశ్రీనాధీయము' - మేడిచెర్లఅంజనేయమూర్తిగారు§ 'నమోవాకము' (నమకమునకు పద్యానువాదము) - గుదిమెళ్ళ రామానుజాచార్యులు

◆ 'త్రిపురాంతక శతకము" 'శ్రీ సీతారామశతకము'ల వ్రాసిన పాలుట్ల పాలంకయ్య గారట్టి వారిలో ఒక సాధకుడు!

✻ ...రసవంతమై నిర్దుష్టమై ధారావాహికగా ప్రవహించు శైలిలో శివపురాణమును రచియించుట తమకు దక్కినది . . . ఈ శతాబ్ద పూర్వార్ధమున వెలువడిన యుత్తమ గ్రంధములలో తమ శివపురాణమొకటి. - కురుగంటివారు

‡ ఈయనది చిత్తూరుజిల్లా పూతలపట్టు గ్రామము; శబ్దార్థకల్పకము - లక్షణ శిక్షణము - త్రివర్గము - సూక్తిసుధ - కుమారసంభవము - తెనుగు సందేశములను గ్రంధములను రచించిన "విద్వత్కవి తిలకుడు."

కల్లూరి చంద్రమౌళిగారు 'రామాయణసుధ' అను గ్రంధమును ఇటీవలనే వ్రాసి సంప్రదాయప్రీతిని వెలిబుచ్చిన వ్యక్తి.

§ వాత్స్యాయన కామసూత్రములకు ఆంధ్రతాత్పర్యము వ్రాసినాడు. దీనికి గల జమ్మలమడకవారి పీఠిక ఉదాత్తమైనది.

'విద్యాధిప సుదర్శన విలాసములు'- గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రిగారు◆(జననం 1913) 'శ్రీ, విద్యాశంకరలీల, శ్రీ విద్యాశంకర విజయము, ఆశ్వినమాహాత్మ్యము, వైశాఖ మాహాత్మ్యము, అనురుకము- కృష్ణమహస్సు, మొదలైన పద్యకావ్యాలు 'కుందమాల, సవిమాయ'లనే నాటకాలు - గోరుగంతు సూర్యనారాయణ శర్మగారు 'శంకర విజయము' - శిష్టా లక్ష్మీ కాంతశాస్త్రిగారు 'వీర విహారము' - ఉప్పల వెంకటకవి 'శ్రీకృష్ణగీత' - తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారు 'కాకానిమల్లీశ్వర మాహాత్మ్యము' - రామనారాయణ శాస్త్రి గారు కల్యాణ కైవర్తము - విశ్వనాథ లక్ష్మణకవులు‡ 'విక్రమాంక దేవచరిత్రము'- కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తిగారు (జననం 1905) "కృష్ణాభ్యుదయము, పరమశివానందలీలలు, - ఉత్తరలీలలు" మొదలైనవి- తిరుపతి వేంకటేశ్వరులుగారు "అష్టావక్ర చరిత్రము, (పద్యకావ్యము)కుందమాల, ... నాటకములు, ఆత్మోపహారము (శతకము) అహల్యాగౌతములు (పద్య కావ్యములు) శ్రీమహర్షి జీవిత కథామృతము (వచనము) మొదలైనవి - శంకర నారాయణగారు 'గీతాభ్యుదయము, - కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులవారు '...మాహాత్మ్యము' - మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు "'రత్నావళి ...నాటిక (నాటకములు)సిద్ధదర్శన సంగ్రహము; పతంజలి చరిత్ర (వచనములు) ...'' - రాయసం శేషగిరిరావుగారు 'నాదేశ్వరి'✻మొదలైన గ్రంధాలను రచించి సంప్రదాయమార్గమును తీర్చిదిద్దుతున్నారు.

◆ కేశవభొట్ల ప్రభాకరశాస్త్రిగారనే సోదరుని కలుపుకొని కొన్నాళ్ళు ఈయన గ్రంధ రచన చేసినాడు; తరువాత వీరు విడిపోయినారు నాళం కృష్ణరావుగారిచే సంపాదితమైన "...ములు, తెలుగు జాతీయముల'నే గ్రంధాలకు ఈ సోదరులు చక్కని ... పెట్టినట్లు కనుగొంటాము.

‡ ... లు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాధ రావుగార్లు సుప్రసిద్ధ ...గ్రంథం బిల్హణుని విక్రమాంకదేవ చరిత్రను తెనుగులోకి పరివర్తనం చేసినారు. ...గా చేయుటంచేత మాతృకలోఉండే క్లిష్టతాది గుణాలు పరివర్తనంలోకి ... విశ్వనాథరావుగారు అచ్చాంధ్రమందు చక్కని పండితుడు. ఈ కాలంలో ఇట్టి ... చాలా అరుదు. పై చూపులకు లోన సమర్థుడని తోపజేయడు. నిగర్వి. ఈ విక్రమాంక దేవచరిత్రమును తిరుపతి వేంకటేశ్వరులు గద్యంగా రచియించినారు, కాని యీ ... విశిష్టత కలది. - కురుగంటివారు

✻ ఇందు నాదవిద్యారహస్యము అంతర్నిహితమైయున్నది- డాక్టరు చిలుకూరి

# విజ్ఞానవ్యాప్తి - కళా వికాసము:

ప్రజలలో విజ్ఞానమును పెంపొందించవలెననే దృష్టితో ప్రతిభావంతులైన విద్యా శాస్త్రవేత్తలనేకులు పత్రికలద్వారా, రేడియో ద్వారా తమతమ పరిశోధనమును, కళాఖండాలను విరివిగా అందజేస్తూ ఈ కాలాన ఎంతో తోడ్పడుతున్నారు. ఈనాడు ప్రజ శాస్త్రవికాసమును విజ్ఞాన విశేషమును చూడకుండా ఉంటే ప్రయోజనము లేదు. ఎప్పటి కప్పుడు ప్రపంచపు స్థితిగతులనుగూర్చి వైజ్ఞానికాభివృద్ధిని గూర్చి తెలుసుకొనడమెంతో అవసరము, ఈనాటి మానవునికి, ఈవిధముగా ప్రజలలో సర్వతోముఖ విజ్ఞాన వికాసము కల్గించేందుకు తోడ్పడుతున్న కొందరినిగూర్చి దిఙ్మాత్రముగా తెలుసుకొందాము:

రాజకీయార్థిక వాణిజ్యాది విషయాలపైన పత్రికా వ్యాసాలు వ్రాస్తూ విజ్ఞానమును బహుళముగా అందిస్తున్న వారిలో మామిడిపూడి వెంకటరంగయ్య (చూ. భారతులలో భూప్రదక్షిణ మిత్యాది రచనలు), కపిల కాశీపతి, మాడపాటి హనుమంతరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, బూర్గుల రామకృష్ణరావు, బారు గోవింద రావు, చావలి వెంకట హనుమంతరావు, వేదుల జగన్నాథం, వావిలాల గోపాలకృష్ణయ్య, పండితారాధ్యుల నాగేశ్వర రావు, కాశీనాధుని పూర్ణ మల్లిఖార్జునుడు వేమూరి రామనాథం, సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ, అజ్జరపు వెంకటరమణరావు, భాస్కర్ల సూర్యనారాయణమూర్తి, కె. సన్యాసయ్య, ఏడిద కామేశ్వర రావు గారలు మొదలైన వారెన్నదగినవారు; సంగీత, నాట్య, భౌతిక, ఖగోళ, భూగోళ, జ్యోతిష శాస్త్రములలో విశేష పరిశ్రమచేస్తూ తద్విజ్ఞానమును తమ రచనలద్వారా లోకానికి అందిస్తున్న వారిలో విస్సా అప్పారావు*, ఆమంచర్ల గోపాలరావు, పుచ్చా సుబ్రహ్మణ్య శాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వసంతరావు వేంకటరావు◆, జయంతి ధర్మతేజ,

* ఈయన సంగీతముపై విద్వద్వ్యాసములు వ్రాయడమేకాక "త్యాగరాయ కీర్తనల'ను, "క్షేత్రయ్య పదముల"ను సంపాదించి ఇటీవల ప్రచురించి ఆంధ్రజాతికి మహోపకృతి గావించినాడు. కల్లూరి వీరభద్రశాస్త్రిగారి వ్యాఖ్య నెన్నవలెకూడ!

◆ 'మా రేలోకం' - 'జగత్తు - జీవము' మొదలైన గ్రంధాలువ్రాసి, ప్రభుత్వపు బహుమతి పొందిన తెలుగుభాషా సమితి ఉద్యోగి.

గమనింపతగింది. ఈ సందర్భాన హరికథలను వ్రాసి తత్ప్రక్రియకు పితామహుడైన విద్వత్కవి, బహుభాషా పండితుడు ('ఒమరుఖయామ్' అనువాదకుడు) బహు గ్రంథకర్త, ఆదిభొట్ల నారాయణ దాసుగారి కృషి స్మరింపదగినది.

చారిత్రక విషయ మీమాంసలు చేస్తూ వస్తున్నవారిలో మల్లంపల్లి త్యాదులు కాక ఓరుగంటి రామచంద్రయ్య,* ఆదిరాజు వీరభద్రరావు, విష్ణుభొట్ల సూర్య నారాయణ, రామచంద్రుని వెంకటప్ప, కె. వెంకటాచార్య, మామిడిపూడి వెంకటేశ్వర్లు, కొడాలి లక్ష్మీనారాయణ,◆ మొదలు గాగల నవ్యులు కొద్దిమంది చారిత్రక విమర్శలు వ్రాస్తున్నట్లు కనుగొంటాము.

ఆంధ్రభాషలోని మాండలికాలను, ప్రాచీనకవి ప్రయోగాలను, శబ్దార్థ విచారమును, ప్రాచీన నవీన కవితారీతులను, గూర్చి కృషిచేస్తూ కొందరు నేడు విమర్శవీథిని విశాలము చేస్తున్నారు. వెనుకటి తరము వారిలో చిలుకూరి నారాయణ రావు, కోరాడ రామకృష్ణయ్య, బండారు తమ్మయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి† (జననం 1894) గిడుగు వెంకటసీతాపతి, వేటూరి ప్రభాకరశాస్త్రి,§ మున్నగు వారిప్పటికీ పత్రికలలో వ్రాస్తూనే ఉన్నారు; నవ్యులలో నిడుదవోలు వెంకటరావు4. దేవరపల్లి

‡ టి.యిన్. సి. వెంకటనారాయణాచార్యులు 'శతరాగరత్న మాలిక' అనీ ఓగిరాల వీరరాఘవశర్మ గారు 'దేవీగానసుధ' అనీ కీర్తనలను రచించి ప్రసిద్ధి కెక్కుతున్న వాగ్గేయ కారులు; బాలమురళీకృష్ణ కూడ కొన్ని కీర్తనలను ఇటీవల రచించి మంచి ప్రచారములోనికి వస్తున్నాడు.

* ఈయన నవ్యకవికూడ, ఆంధ్రవిశ్వవిద్యాలయము విద్యార్థులకని వ్రాసిన ఆంధ్రుల చరిత్ర (ఎట్లాగైతేనేమి) ఇటీవల ప్రచురితమై ఆంధ్రప్రభను చాటినట్టిదిగా తెలుసుకుంటాము. డాక్టరు బిరుదాన్ని కూడ పొందినా డీతడు.

◆ ఈయినది గుంటూరుజిల్లా మోపఱ్ఱుగ్రామము; 1933 నుంచి తదేకదీక్షతో పరిశోధనము చేస్తూ అనేక గ్రంథాలను, వ్యాసాలను ప్రచురించిన నవ్యుడు 'భారతనిధు షీరత్నములు, గ్రంథాలయచరిత్ర, ఆంధ్రదేశ గ్రామచరిత్ర, నాగార్జున చరిత్ర, ప్రాచీనయోగులు, రైతుచరిత్ర, రామాయణ విమర్శనము' మొదలైన వీయన గ్రంథములు.

† "చేమకూరవారి సారంగధరుకు" జితకాశిలనీ, "హరిశ్చంద్ర ద్విపద, శృంగార నైషధా సుక్తిమాల్యదావ్యాఖ్యాన విమర్శలు, చాటు పద్యరత్నాకరము" ప్రచురించిన విమర్శ కాగ్రేసరుడు. తిరుపతి వెంకటకవుల శిష్యుడు.

§ ఇటీవలనే ఈయన మరణించి విమర్శలోకానికి తీరని నష్టము కల్గించినాడు.

4. ఈయన మద్రాసు ఆంధ్రపరిశోధన శాఖలో ప్రధానాచార్యుడు. వీరశైవవాఙ్మయ మును గూర్చి విశేషముగా పరిశ్రమచేసినవాడు, త్రిపురాంతకోదాహరణాన్ని సంపాదించి మంచి పీఠిక వ్రాసిన పండితుడు; ప్రభుత్వ బహుమతి పొందిన విమర్శకోత్తముడు.

వెంకటకృష్ణారెడ్డి, బులుసు వెంకట రమణయ్య◆, కొణిదెన బాలకృష్ణయ్య, చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్, బసిరెడ్డి ఈశ్వరరెడ్డి, సరిపెల్ల విశ్వనాధశాస్త్రి, తిమ్మావఝుల కోదండరామయ్య, 'శ్రీవాత్సవ' బొడ్డపాటికుటుంబరాయ శర్మ, గరికపాటి కృష్ణమూర్తి, రావూరి దొరసామిశర్మ, నేమాని భారతీరత్నాకరాంబ, ఏలూరిపాటి రామభద్ర చయనులు, హోసూరు నంజుండరావు, చిలుకూరి పాపయ్య శాస్త్రి, బులుసు వెంకటేశ్వర్లు, దేవులపల్లి రామానుజరావు✻, కోటమర్తి చినరఘుపతి, టేకుమళ్ళ కామేశ్వరరావు§, వెల్లలూరి వెంకటారాఘవశర్మగారలు మొదలైనవారెందరో

---

◆ జననం 1907, గొప్పవ్యాఖ్యాత; మనుచరిత్ర - ప్రౌఢవ్యాకరణములకు వ్యాఖ్యలు రచించినాడు. పాండురంగమాహాత్మ్యాది గ్రంధాలకు టీకలు రచించినాడు.

✻ హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్ర సారస్వత పరిషదుపాధ్యక్షుడై విజ్ఞానవ్యాపనమున కమితముగా పాటుపడుతున్న విద్యావంతుడు (బి.ఏ., ఎల్.ఎల్.బి). కురుగంటి, రాయప్రోలు వారల ప్రభావముకల్గి, సాధనసమితి సోదరవర్గములోచేరి, విమర్శకుడుగాను కవిగాను ఇతడు చేస్తున్న కృషి విశేషమైనది! "ప్రమోదకుమారుడ"నే ప్రచ్ఛన్ననామముతో ఖండికలనేకము పత్రికలలో ప్రచురించిన భావుకుడు; "నవ్యకవితానీరాజనము" (సాధన సమితి ప్రచురణము) అనే విమర్శ గ్రంధముద్వారా - 'నైజాములో సారస్వతసేవ, స్త్రీలపాటలు, ఆదిసునివాసులు, ఆంధ్రనాయకులు, ప్రపంచ రాజకీయోద్యమాలు" మొదలైన అసంఖ్యాక వ్యాసాలద్వారా - ప్రధానముగా విమర్శకుడుగానే పేరుపొందుతున్నట్టు గమనిస్తాము; 'శోభ' అనే సారస్వత మాసపత్రిక పెట్టి తత్సంపాదకుడై చక్కగా నడుపుతూ, "గోలకొండపత్రికా ' నిర్వహణములో ఒకడై చేస్తున్న కృషి విస్తారమైనది. మునిమాణిక్యము వారి ఈ మాటలు చూడండి. "రామానుజరావు పండితుడని, గంభీరుడని, ప్రసంగ కుశలుడని నాకు అభిప్రాయం కలిగింది.... పొట్టివాడే అయినా తనకంటే చాలా పొడుగైనవాళ్ళ ఎదుట నిరారుగా నిలబడేశక్తి ఈయనకు ఉంది... సాంఘిక విషయాలలోనో, సాహిత్య విషయాలలోనో ఈయన శాసనకర్త కాగలడు .. " - (కృష్ణాపత్రిక) 19-3-1949.

§ ఈయన భారతి 13వ సంపుటములో వ్రాసిన వ్యాసాలు, "వాడుకభాష రచనకి కొన్ని నియమాల"ని వ్రాసిన పుస్తకము గమనింపదగినవి త్రిలిఙ్గ పత్రిక"లో ఈయన 'మాండలిక తెలుగుపదములను క్రమముగా ప్రచురిస్తున్నాడు; 'ఆంధ్రప్రభ' ఇటీవల వివిధ మాండలికాలనుగూర్చిన వ్యాసములను ప్రచురించి కొంత దోహదము చేసినది; గిడుగు సీతాపతి, ఓగిరాల సుబ్బారావు, పిల్లలమర్రి హనుమంతరావు, నాయనికృష్ణకుమారి, భద్రిరాజు కృష్ణమూర్తి మొదలైనవారి వ్యాసాలు ఏతన్ముఖమైనవి

వ్యాసాలనువిరివిగావ్రాస్తూ వివిధ పత్రికలముఖానఅందిస్తున్నారు‡ ఈ మార్గానకూడ నోరి - విశ్వనాధలు* ఎన్నదగిన కృషి చేస్తున్నారు. శిష్టా రామకృష్ణశాస్త్రిగారి "విమర్శ వ్యాసములు - నాటకవిమర్శన"ములు - కాశీనాధుని నాగేశ్వరరావుగారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'- వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'తెలుగు మెఱుగులు, - పిల్లలమఱ్ఱివారి "సాహిత్యసమాలోచనము, సాహిత్యసంపద, సాహిత్య సమీక్ష"లు జి.వి.కృష్ణరావుగారి "కావ్యజగత్తు, జేగంటలు" - చాగంటి శేషయ్యగారి "ఆంధ్రకవితరంగణి" - భూపతి లక్ష్మీనారాయణరావు గారి "భారతము - తిక్కన రచన' - కోరాడవారి 'దక్షిణదేశ భాషాసారస్వతములు - దేశి' - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి (జననం 1920) 'ఆంధ్రరచయితలు' మొదలైన విటీవల కాలములో వెలువడి భాషాసాహిత్య చరిత్రలు విమర్శ గ్రంధములులేని లోపమును కొంతవరకు తీరుస్తున్నవి.

## కొన్ని ప్రచారక పరిశోధక సంస్థలు:

ఈ కాలానికీ కొన్ని ప్రచారక పరిశోధక సంస్థలద్వారా నిఘంటురచన, విజ్ఞానసర్వస్వ నిర్మాణము, కళాప్రచారము, లోకప్రక్క .సాగుతున్నవి; "హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు" అనే ఒక విద్వత్సంస్థ◆ నిజాము ప్రభుత్వాదరాన్ని సంపాదించి, మొదట విజ్ఞాన సర్వస్వ నిర్మాణయత్నము కొంత గావించినట్లు

‡ ప్రాచీన ఆంధ్రకవుల జీవిత కవితావిశేషాలను మేళవిస్తూ 'గొప్పవారితో గుసగుసలు'అనే పేర కీ శే. వారణాసి శ్రీనివాసరావుగారు రచించిన గ్రంధములోని కొన్ని భాగాలు ఆంధ్రవార పత్రికాముఖాన వెలువడినవి. నోరి వ్రాసిన వ్యాసములు ప్రాచీననవ్యసాహిత్య తత్వములనెరుగుటలో ఎంతగానో ఉపకరిస్తవనడము సత్యము.

* 'నన్నయ్యగారి ప్రసన్న కధాకలితార్ధయుక్తి' ని గూర్చి భారతులలో వ్రాసిన వ్యాసపరంపర దాని కదేసాటి

◆ రాయప్రోలువారి ఆధ్వర్యాన, ఖాసింఖానుగారు కార్యదర్శిగా ఈ సంస్థ ప్రారంభమై ప్రధమసమావేశాన్ని మహావైభవముగా 1943 డిసెంబరులో రాధాకృష్ణపండితుని అధ్యక్షతక్రింద జరిపినది: తత్సమావేశములో పండితులు చదివిన పరిశోధక వ్యాసములన్నీ - ఒక సంచిక రూపమున ప్రకటితమైనవి. ఈ సంస్థ ప్రచారముకన్న, పరిశోధనముపైనే దృష్టిపెట్టుకున్నది కావడము విశేషము! కురుగంటివారు ప్రస్తుతము దీని కార్యదర్శి; ఉస్మానియా విశ్వవిద్యాలములోని తాళపత్ర గ్రంథపరిశోధనమునందున్నాడీయన ఇపుడు.

కనుగొంటాము. ఖాసింఖానుగారి "ఖుర్ ఆన్ షరీపు - కథానికా రచనలు -" కురుగంటివారి "ఆదర్శప్రభువు -A Hand Book of Telugu Literature, కొందరు తంజావూరు కవులు, పండితులు - నవ్యాంధ్ర సాహిత్య వీథులు', (ద్వితీయ ముద్రణము) - తిరువేంగళాచార్యులవారి 'ఆంధ్రధ్వన్యాలోకము' డాక్టరు టోపాగారి 'ఇస్రారెహయాత్' (వేమనతత్త్వము) లను ప్రచురించి ఈ సంస్థ చేస్తున్న కృషి ఈ సందర్భాన గమనింపతగినది.

ఆంధ్రసాహిత్య పరిషత్తువారు జయంతి వారి యాజమాన్యాన "సూర్య రాయాంధ్రనిఘంటువు" (కొన్ని సంపుటాలను,) వావిళ్ళవారు బులుసు వేంకటేశ్వరులు గారి సంపాదకత్వాన "వావిళ్ళ నిఘంటువు" (మొదటి భాగమును), దేవిడీ జీమీందారు గారు 'ఆంధ్రవిజ్ఞానము' (పది సంపుటాలను) యీ మధ్య వెలువరించినారు.

ప్రభుత్వపు ప్రోత్సాహముతో బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్వర్యాన - స్వాతంత్ర్యం లభించిన తర్వాత -(10-10-1947)మద్రాసులో 'తెలుగు భాషాసమితి' అని ఒక సంస్థ ఏర్పడి 'తెలుగు విజ్ఞాన సర్వస్వము' ను నిర్మించడానికి యత్నిస్తూ ఇటీవలనే "పరిచయ సంపుటి"ని ప్రకటించినది.

ప్రజాస్వామ్యములో తెలుగుభాషాసాహిత్య ప్రచారము చురుకుగా చేస్తున్న సంస్థలలో హైదరాబాదులోని 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' ◆ ఎన్నదగినది. నిజాము రాష్ట్రములోను బయటనూ అనేక శాఖలను (180) స్థాపించి, పరీక్షలను ఏర్పరిచీ, గ్రంథాలను ప్రచురిస్తూ,✻ మహాసభలను హైదరాబాదు, ఓరుగల్లు, నల్లగొండ,

---

◆ "తొలిసారి బూర్గుల రంగనాధరావుగారు, భాస్కరభట్ల కృష్ణరావుగారలలో సంచలనము కలిగి వారలు, మందుముల రామచంద్రరావు, సురవరం ప్రతాప రెడ్డి, బూర్గుల రామకృష్ణ రావు, బుక్క పట్టణం రామానుజాచార్యులగారలతో సంప్రదించి మొట్ట మొదటిసారిగా స్వభాను వైశాఖ శు లు నాడు శ్రీలోకనంది శంకరనారాయణ రావు గారి అధ్యక్షతలో సమావేశము నేర్పాటు జేసి మన పరిషత్తున కోరూపము నొసగినారు..." పులి జాల హనుమంతరావు [సారధి : 6-2-1949] ఈ పరిషత్తునకు బిదురు వేంకటశేషయ్యగారు ప్రధమ కార్యదర్శియై సేవచేసినాడు. ప్రస్తుతము పర్సా వేంకటేశ్వరరావుగారి ఆధ్వర్యాన మంచి కృషి చేస్తున్నది.

✻ సన్నిధానమువారి 'కావ్యాలంకారసంగ్రహము' - - ఖండవల్లి బాలేందు శేఖరంగారి ఆంధ్రులచరిత్ర, - - అలంపూరు శిథిలములు ఈ పరిషత్పక్షాన వెలువడినవి.

మహబూబునగరము, తూపురాన్, మంచిర్యాలలలో నిర్వహించీ, వయోజనవిద్యా - గ్రంధాలయోద్యమాల ప్రాముఖ్యాన్ని గుర్తించీ, బహుముఖాల కృషిచేస్తూ ప్రజలలో మంచి సంచలనము కల్గిస్తున్నట్లు కనుగొంటాము.◆ ఈ సందర్భాన తత్సంస్థా కార్యదర్శి, ఉత్సాహవంతుడు, కవి, అయిన పులి జాల హనుమంతరావుగారి కృషి ఎన్నదగినది!✻

ఇంక "ఆంధ్రచంద్రికా గ్రంధమాల" అంటూ హైదరాబాదులోనే ఇటీవల ఒకటి ఏర్పడి ఖండవల్లి బాలేందు శేఖరంగారి 'విస్మృత సామ్రాజ్యములు' మాడపాటి హనుమంతరావుగారి 'తెలంగాణా ఆంధ్రోద్యమము' ఖండవల్లి లక్ష్మీ రంజనము† గారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము'లను ప్రచురించి ప్రజలలో విజ్ఞానవ్యాప్తికి§ కృషి చేస్తున్నది. ఇల్లా ఎన్నెన్ని సంస్థలో బయలుదేరు తున్నవీనాడు.

◆ "The Parishad workers, have carried the message of love and learning into each village and each hut in Telangana like the Sun's rays. They have achieved a commendable task in educating the masses, on a scale hitherto unknown." - Education Minister of the State

✻ ఇతనికి చండూరులో గొప్ప సమ్మానం జరిగింది; "భాగ్యనగర్" పత్రిక ప్రత్యేక సంచిక ప్రచురించినది.

† ఉస్మానియాలో ఆంధ్రశాఖాధ్యక్షుడు.

§ విజ్ఞానాభివృద్ధికోసమని ఇంకా ఎందరో కృషిచేస్తున్నారు. కాళీపట్నం కొండయ్యగారు 'విజ్ఞానమ'నే (పత్రిక) ద్వారా, 'విశ్వరూపమ'నే గ్రంథమును ప్రకటించీ కొంత కృషి సల్పినవ్యక్తి. గోటేటిజోగిరాజుగారువ్యావసాయకగ్రంథాలను, యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు పశువైద్యముపైన, కొమఱ్ఱాజు అచ్చమాంబగారు ప్రసూతి వైద్యముపైన, పుస్తకాలను ప్రచురించినారు. "గ్రంథాలయశాస్త్రప్రథమ పాఠములు గ్రంథాలయ సూత్రాలు, గ్రంథాలయ ప్రచారం: విజ్ఞానవ్యాప్తి, తెలుగుపుస్తకాలు: వర్గీకరణం" మొదలైన పుస్తకాలను రచించి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకార్యదర్శి పాతూరి నాగభూషణముగారు ప్రచురించినారు; కొడవటిగంటివారు హోమియో వైద్యముపైన కొన్ని వ్యాసాలను ప్రచురించినారు; వయోజనవిద్య విషయాలపై గాడిచెర్లవారికృషిగమనింపతగింది; వేలూరివారు, గొబ్బూరివారు చేస్తున్న శాస్త్ర విషయక పరిశోధనం (వారి వారివ్యాసాలనుబట్టి) గొప్పదనే చెప్పవలె; పత్రికలద్వారా ఖాసా సుబ్బారావు - రామచంద్ర - శ్రీనివాస చక్రవర్తి నాట్యశాలకర్త - నరసింహారావు - విశ్వం - సహజానంద - రాధాకృష్ణ - గారలు మొదలైనవారు చేసిన చేస్తున్న బహుముఖసాధన చాలవరకు పత్రికలలోనే నిలిచిపోతున్నది; ఇటీవల చిర్రావూరివారి 'ఆదిమవాసులు' అనే గ్రంథం ప్రకటితమై విజ్ఞానాన్ని పెంపొందిస్తున్నది; ఆధ్యాత్మిక జ్ఞానాభివృద్ధికోసం

ప్రజలలో విజ్ఞానవ్యాప్తికీ, కళావికాసానికీ స్వాతంత్ర్యం లభించిన తరువాత ఏర్పడిన ప్రజా ప్రభుత్వం సకలవిధాల ప్రోత్సహింపజూస్తున్న దనవలె; ఆస్థాన కవులను‡ నియమించి, ఉత్తమగ్రంథాలకు బహుమతులనిస్తూ, రేడియో ద్వారా కళాకారులకు మంచి దోహదము చేకూరుస్తూ ఇంకా ఎన్నో విధాల సహాయపడుతున్నది.

ఈనాడు ప్రచారకసంస్థలైన పత్రికలు - రేడియో - సినిమాలే* రచయితల నందరినీ అత్యంతముగా ఆకర్షిస్తున్నట్లు కనుగొంటాము; వినోదము ద్వారా విజ్ఞానాన్ని పెంపొందించడం వీని లక్ష్యమనవలె◆. ఇటీవల రానురాను ప్రజలలో చదివే ఓపిక క్షీణిస్తున్నందువలన కాబోలు, చూచేందుకూ వినేందుకు అనువుపడే సినిమాలు, రేడియో (ప్రభుత్వపు ప్రచారకసంస్థ) లనేవి ప్రజాదరాన్ని చూరగొంటున్నవి! ఇవి విజ్ఞాన వ్యాప్తికీనాడు అత్యంతముగా దోహదము చేస్తున్నట్లు గమనిస్తాము. ప్రతిభావంతులైన వారనేకులీ సంస్థలలో ఉద్యోగులుగా చేరి కృషి చేస్తున్నారు; రేడియోవారు అత్యంతాకర్షవంతాలైన కార్యక్రమాలను ఏర్పరుస్తూ, దేశములోని

---

బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు ప్రచురిస్తున్న గ్రంథాలు, బిదురు వెంకటశేషయ్యగారు ప్రచురిస్తున్న 'మేధావి' అనే మాసపత్రిక, రామకృష్ణ మఠమువారి ప్రచురణలు, నిర్వికల్పానందస్వామివారి వ్యాసములు, శివానందుని గ్రంథాలు, అరవిందుని గ్రంథాలు ఎక్కువగా తోడ్పడుతున్నవి. దౌలతాబాదు గోపాలకృష్ణరావుగారి "యోగ సంకలనము" మొదలైన గ్రంథాలెన్నదగినవి. అబ్బాస్ - కరాకా వ్రాసిన ఆంగ్ల గ్రంధా లనువదితాలౌతున్నవి.

‡ నవ్యాంధ్ర కవితాపితామహులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రప్రథమాంధ్రాస్థానకవియై అసమానగౌరవాన్ని అఖండ సమ్మానాన్ని పొందినాడు. ఆయన కీర్తిశేషుడైన తర్వాత ఇపుడు కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారా పదవి నలంకరించి నవ్యాంధ్ర సాహిత్య సామ్రాజ్యాన్ని ఏలుతున్నాడు!

* సముద్రాల రాఘవాచార్యులు, బలిజేపల్లి లక్ష్మీకాంతం, తాపీధర్మారావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, పింగళి నాగేంద్రరావు, గోపీచంద్, చక్రపాణి, కొండముది గోపాలరాయశర్మ, జంపన చంద్రశేఖరరావు, డి.వి. కృష్ణమూర్తి, శివశంకరశాస్త్రి, ముక్కపాటి నరసింహశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన వారలు "సినిమాల" నాశ్రయించిన కవులు!

◆ బాలవిజ్ఞానాభివృద్ధికోసం పాటుపడుతున్న న్యాయపతి రాఘవరావు, కామేశ్వరమ్మ (చూ. బాలపత్రిక) - మాగంటి బాపినీడు, గిడుగు వెంకటసీతాపతి, చింతా దీక్షితులుగారల కృషి గమనింప తగినది.

కళాకారులను, విద్యాధికులను ఆదరిస్తూ వానిలో పాల్గొనజేస్తూ ప్రజలకు విజ్ఞాన వినోదములను విశేషముగా కల్గిస్తున్నారు; ఆంధ్రులకు మద్రాసు (16-17-1938 తేదీ నాడేర్పడినది) - ఢిల్లీ (ఆమధ్య కొంతకాలము) - హైదరాబాదు (1940?) - విజయవాడ (డిసెంబరు 1948 నుంచి) రేడియో కేంద్రాలు తెలుగులో కార్యక్రమాలను ప్రసారం చేసేవి ఏర్పడినవి. కపిల కాశీపతి✻ - డి. అయ్యగారి వీరభద్రరావు - ఆచంట జానకిరాం - సోమంచి యజ్ఞన్నశాస్త్రి - బాలాంత్రపు రజనీకాంతరావు - శివరాజు వెంకటసుబ్బారావు◆ - పన్యాల రంగనాధరావు‡ - యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ) - భాస్కరభొట్ల కృష్ణరావు - దుర్గాచలం - కేశవపంతుల నరసింహశాస్త్రి - వింజమూరి శివరామరావు§ - జనమంచి రామకృష్ణ - రుక్మిణీనాథశాస్త్రి

✻ ఈయన రేడియో (వార్తా) సంస్థద్వారా (Sound Journalism) వ్యావహారిక భాషకొక నూతన స్వరూపాన్ని సాధించినవ్యక్తి. 'తెలుగు వెలుగులు', 'నమస్కారం' మొదలైన అనేక నాటికలను రచించి 'టైమ్‌ప్లే' అన్న ప్రక్రియ తెచ్చి పెట్టిన ప్రతిభావంతుడు;

◆ బుచ్చిబాబు (జననం 1917) అనే ప్రచ్ఛన్న నామముతో వివిధ పత్రికలలో (1939 మొదలుగా) కథలు, నాటికలు అనేకం రచిస్తూ ఉన్న ఈయన ఒక కళాశీలి; ఉత్తమ చిత్రకారుడు; నటుడు; ఆంగ్ల సారస్వతాన్ని అవలోడనముచేసిన (ఎం.ఏ.) విద్యావంతుడు. బెట్రెండు రసెల్, సోమర్ సెట్ మాం, హక్స్లీ మొదలైనవారిచే ప్రభావితుడైన ప్రజ్ఞావంతుడు; 'బుచ్చిబాబు కథలు' మొదలైనవి - ఒమర్, తిష్య రక్షిత, దారినపొయ్యేదానయ్య, రాయల కరుణకృత్యం, - తీసినతెర' మొదలైన నాటికలు - 'ఆత్మవంచన' అనే నాటకం -'చివరకు మిగిలేది' అనే నవల (నవోదయలో ప్రకటితము) - మొదలైనవితని రచనలు ప్రజాదరాన్ని చూరగొన్నవి: ఇతనిని గూర్చిన ఈ వాక్యాలు చూడండి: " .జీవితంలోని సుఖదుఃఖాలుచూచి కవి హేళన చేసినపుడు అతనితో మనం కోపగింపకుండా ఉండలేము. కాని కోపాన్నీ తాపాన్నీ పోగొట్టి నవ్వి నవ్వించడం గొప్ప శిల్పి అయినరచయితకే చేతనవుతుంది. అలాంటి శిల్పం బుచ్చిబాబు చేతుల్లో ఉంది "

- శ్రీవాత్సవ - (వికృతి ఆంధ్ర ఉగాది సంచిక)

‡ విశాఖపట్నంవాడై ఇతడు వేషభాషలలో అచ్చము భావకవి అనిపించుకొంటూ, అనేక కథలను, నాటికలను, గేయాలను, పద్యాలను వ్రాసి, నియమంగా అన్ని పత్రికలలోనూ ప్రకటిస్తూ చిన్నపుస్తకాలను కొన్ని ప్రకటిస్తూవచ్చిన ఉత్సాహవంతుడు; ఇతని 'పారిజాతం, వరూధిని, భావకవి, నిత్యకృత్యం, తపస్విని," మొదలైన నాటికలు - సంగీతరూపకాలు (జ్ఞానభిక్ష - స్వప్న రాధికలు) అనేకము ప్రసారితాలైనవి!

§ ప్రసిద్ధ నవ్యుడైన కృష్ణశాస్త్రిగారిమేనల్లు డితడు; పిఠాపురం దగ్గర చంద్రపాలెం ఇతని జన్మ (1909) స్థలము; తన పదోయేటనుంచే కవిత్వం చెప్పడం సాధన చేస్తూ వచ్చిన ఈ ప్రతిభావంతుడు పద్యాలు - గేయాలు - నాటికలు - విమర్శలు రచిస్తూ వివిధ పత్రికలలో

- ప్రయాగ నరసింహశాస్త్రి మొదలైన లలిత కళాసాధకులీ సంస్థలో ఉద్యోగులై నాటికలు కథలు ('స్కెచెస్') మొదలైనవి స్వయముగా రచించి ప్రసారముచేస్తూ కళా వికాసానికి ఎంతగానో తోడ్పడుతున్నారు; కురుగంటివారు, మొహమ్మద్ ఖాసింఖాన్ గారలుకూడ తదుద్యోగులై అనేక నాటికలను రచించినారని గమనిస్తాము✻. అంతేకాక అప్పుడప్పుడు కవి సమ్మేళనాలను, సాహిత్య గోష్ఠులను◆, విషయ చర్చలను, గ్రంథ సమీక్షలను, వార్తా సమీక్షలను, ప్రసంగాలను ఇంకా అనేకాలను ఏర్పరుస్తూ - గ్రామస్థులకు, స్త్రీలకు, విద్యార్థులకు, బాలబాలికలకు ప్రత్యేక కార్యక్రమాలను ఏర్పరుస్తూ ఈ రేడియో కేంద్రాలు సాధిస్తున్న విజ్ఞానవ్యాప్తీ, కల్గిస్తున్న కళావికాసము ఇంతింతగాదు; ఈ విధముగా 'రేడియో వాఙ్మయం' ఈనాడు ప్రజలలో విజ్ఞానబీజాలను నాటుతూ వినోదాన్ని చేకూరుస్తూ విస్తారముగా పెరిగిపోతున్నట్లు తెలియవలె;‡ ఎలాంటి భేదాలు లేక అన్ని మార్గాల వారికీ ఈ సంస్థ సమానావకాశాలిస్తూ

---

ప్రచురిస్తూ ఉత్తమ భావుకుడుగా ప్రసిద్ధిలోకివచ్చినాడు. కొంతకాలము 'జ్వాల' పత్రికలోను 'నవోదయ'లోను పనిచేసి, ప్రస్తుతం విజయవాడ రేడియో కేంద్రములో ఉంటున్నాడు. 'అమరుకము'ను రసవచ్ఛైలిలో అనువదించి, 'రజకలక్ష్మి, విజయపతాక, కళోపాసన, విశ్వామిత్ర''లనే రూపకాలను రచించి భిన్న స్థలాలలో ఆడించిన యితని శక్తిసామర్థ్యాలు మెచ్చదగినవి; మపాసా - గోర్కీల కథలను అనువదించి ప్రత్యేకముగా 'ఆకలి కథలు' రచించి ఆధునిక కథానికారచయితలలోను గణనకెక్కుతున్నాడు. అన్నిటినీమించి రేడియోనాటికలను రచించడములో ఈ 'గౌతమి'ది అందెవేసినచేయి అనవలె; నవ్యాంధ్రకవులలో అనేకుల కాప్తమిత్రుడై ఇతడు "సాహిత్యంకోసం జీవించే కళామయు''డనిపించుకొంటున్నాడు.

✻ భాస్కరభొట్ల కృష్ణరావుగారనే యువరచయిత అత్యుత్సాహవంతుడైన నవ్యుడు; స్నేహపాత్రుడు; ఉత్తమ కథారచయితగా పేరుపొందుతూ అనేక కథలను పత్రికాముఖముగాను, రేడియోద్వారా అందిస్తూ, హైదరాబాదు రేడియో కేంద్రములో మొదటినుంచీ ఆంధ్రశాఖను నిర్వహిస్తూ అనేకుల నాకర్షించి ఇతడు చేస్తున్న కృషి ఎన్నదగినది!

◆ "ఏది హాస్యం - సజీవరచన - కవితావస్తువు - నాటకరచన - ధ్వని'' - మొదలైనవి. ఇవి పత్రికలలో ప్రచురితమైనవి!

రేడియోలో ప్రసారితాలైన ప్రసంగాదికాలు అల్పసంఖ్యాకాలు గాలికి పోకుండా మళ్ళీ పత్రికల ముఖముగా వెలువడుతూ ఉండడంవలన ఈ రకపు వాఙ్మయ స్వరూపం కొద్దిగా కన్పిస్తున్నది

‡ రజనీ, సీతాఅనసూయలు, సూర్యకుమారి, ఘంటసాల, మందపాటి వెంకటరాజు, బొడ్డుపల్లి రవీంద్రనాథ్, యం. యస్. రామారావు, రాజేశ్వరరావు, బాల సరస్వతి, మల్లాది అన్నపూర్ణ, మాధవపెద్ది రామస్వామి మొదలయినవారు భావగీతాలను రేడియోలో ఆలపిస్తూ నవ్య కవులకు వ్యాప్తి చేకూరుస్తున్నారు;

చక్కని సమన్వయాన్ని సాధిస్తూ ఉండడం మెచ్చదగిన అంశం! అయితే ఏమి లాభం? చాలవరకీ వాఙ్మయం కంటికి కనపడక గాలికే పోతున్నది.

## ముగింపు:

నేటి కీ విధముగా కవులు, పండితులు, పరిశోధకులు, ప్రచారకులు, సంస్థలు అత్యుత్సాహముతో కృషిచేస్తూ వివిధ సాహిత్య వీధులను విశాలము చేస్తున్నారు◆. అన్ని మార్గములు సమన్వయమనే మహాకూడలిలో కలసి పోతున్నవి!

ఈ కాలానికి రాయప్రోలువారు 'వనమాల' రచించి నప్పటికీ ముఖ్యముగా "మాధురీ దర్శనము" చే లాక్షణికుడై పోతున్నాడు; ఉత్తమ కథకుడైన మునిమాణిక్యం హాస్యముపైన ప్రత్యేకకృషి చేస్తున్నాడిటీవల; ప్రసిద్ధ నాటికాకారుడైన భమిడిపాటి 'త్యాగరాజచరిత్ర గ్రంథించినాడుటంగుటూరి ప్రకాశంగారి స్వీయచరిత్ర ఎన్నదగినది. రసహృదయుడైన పింగళి ఇన్ని సంవత్సరాలు మౌనంగా ఉంటూ ఇటీవల "మధురపండితరాజము"ను ప్రసన్న గంభీర శైలిలో అందించడము విశేషము; దేవులపల్లి నూతన పరిణామమువచ్చి ఉన్మేషము పొందుతున్నాడు.

అన్ని నూతన ప్రక్రియలలోను నేటికి మన నవ్యులు సిద్ధహస్తులనిపించు కొంటున్నారు. అన్నిటికన్నా ముఖ్యముగా నేడు మనకు ఉత్తమ స్వతంత్ర నవలలు లేని లోపమును అడివి - నోరి - విశ్వనాథలు - ఉత్తమ చారిత్రక ప్రబంధములులేని లోపమును దుర్భాక - గడియారములు తీర్చిన విషయము మరువరానిది.

---

◆ విద్వత్కవి మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు, కోట సుందరరామశర్మ, రెడ్డి భీమరావు, అమ్మిశెట్టి లక్ష్మయ్య, కోటమర్తి నాగేశ్వరశర్మ, మొదలైన సంప్రదాయ మార్గానుయాయులు ముద్దా విశ్వనాథం, క్రొవ్విడి లక్ష్మన్న, బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం, మొదలి వేంకటసుబ్రహ్మణ్యశర్మ, ఘట్టి ఆంజనేయశాస్త్రి, ఇల్లిందల సరస్వతీదేవి, గోళ్ళమూడి లక్ష్మీనారాయణ, మృత్యుంజయశర్మ, ధరణికోట శ్రీనివాసులు, టి గంగాధరరావు, సాళ్వ కృష్ణమూర్తి, చివుకుల సీతారామశాస్త్రి, ఆరవి, మొదలయిన కథాకారులు, నవ్యులు - ని డి ప్రసాదరావు, ఇలింద్ర రంగనాయకులు, రావూరి సత్యనారాయణరావు, తెన్నేటి సూరి మొదలయిన యువనవలాకారులు - గుళ్ళపల్లి నారాయణమూర్తి, కొప్పరపు సుబ్బారావు, కణ్వశ్రీ, అయ్యగారి విశ్వేశ్వరరావు, ఆత్రేయ, గోపాలరెడ్డి (రవీంద్రుని అనువాదకుడై), మొదలైన నాటకకారులు ఇంకా ఎంతెంత మందో కృషీవలురు అన్ని ప్రాంతాలలోను ఈనాడు చేస్తున్న సాధన బహుముఖమైనది!

విశ్వనాధవారు వ్రాసిన 'వేయిపడగలు' - ఏకవీర - చెలియలికట్ట - బద్ధనసేనాని - మాబాబు - జేబుదొంగలు - కడిమి చెట్టు - ధర్మ చక్రము - వీరవల్లడు - స్వర్గానికి నిచ్చెనలు' అనునవి - అడివివారు రచించిన 'నారాయణరావు - హిమబిందు - తుఫాను - కొనంగి - గోన గన్నారెడ్డి - నరుడు - అంశుమతి - అడివి శాంతిశ్రీ - మధురవాణి' అనునవి, నోరివారు నిర్మించిన 'నారాయణభట్టు - రుద్రమదేవి - మల్లారెడ్డి' అనునవి శరపరంపరలవలెవచ్చి నవ్యాంధ్రసాహిత్య సరస్వతికి శిరోలంకారములై విరాజిల్లుతూ ఆంధ్రుల చరిత్రను, సంఘజీవితమును, ఆచార వ్యవహారములను (శాతవాహనుల కాలమునుండి నేటిదనుక) పారజూచినవైనవి. వీరందఱు సంప్రదాయవాదులైన ఉత్తమ ద్రష్టలు కావడము గమనింపదగిన అంశం!

మద్రాసు, ఆంధ్రవిశ్వవిద్యాలయములవారు - తిరుపతిలోని ప్రాచ్య పరిశోధకసంస్థవారు ఇటీవల కొన్ని ప్రాచీనగ్రంథముల పరిష్కరించి ప్రకటించి కొంత సేవచేసినారు; ఎవరెవరెలాకృషి చేస్తున్నప్పటికీ శాస్త్ర దృష్టి ప్రబలుతున్న ఈకాలాన మనకు తత్సంబంధమైన కృషి విరివిగా సాగుటలేదనే చెప్పవలసి ఉన్నది. అయితే అన్ని మార్గాలలోను కృషీవలురు సాధనచేస్తూ ముందుకువస్తూ ఉండడముచేత, ముందుముందట్టిలోపములు పూరితములు కాగలుగు సూచనలగుపిస్తున్నవి. ఇందుకు ప్రజాప్రభుత్వపు టాదరాభిమానములు దోహదము చేయగలవని విశ్వసింపవచ్చును!

ఈనాడు హిందీ భాషామార్గము మనకు దేశమార్గముగాను, ఇంగ్లీషు భాషామార్గము ప్రపంచ మార్గముగాను ఏర్పడి ఉన్నవి. అందుచేత ప్రజా ప్రభుత్వ సహాయమువలన ప్రోత్సాహమువలన అనతి కాలములో తదితర ప్రాంతీయభాషా సాహిత్య వీధులతోపాటు నవ్యాంధ్రసాహిత్య వీధులున్ను దేశమార్గముతోను, ప్రపంచ మార్గముతోను కలిసిపోయి వ్యాప్తినందగల సూచనలగుపిస్తున్నవి; ప్రజల ఆదరమువలన పండితుల కృషివలన, ప్రభుత్వపు పూనికవలన, మన సాహిత్య విపణి వీధులలోని దివ్యకావ్యరత్నములు అన్ని ప్రాంతములకు పయనించి ముందు భారత సాహిత్య పథమును, ఆ పిమ్మట ప్రపంచ పథమును దీప్తిమంతములుగా చేయ గలుగుగావుత!

# అనుబంధము

## నవ్యసాహిత్య పరిషత్తు

### సప్తమ వార్షికోత్సవము

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షోపన్యాసము

సహృదయులకు నమస్కారములు. సహృదయులనగా పూర్వకావ్యములు చదివి వానియొక్క నిత్యమననము చేత సారస్వతసౌందర్యము గ్రహించినవారు. ఒక సారస్వతములోని సౌందర్యము గ్రహించుట కా సారస్వతముతో బహు పరిచయ ముండవలెను. శబ్దార్థ మాత్ర పరిజ్ఞానము కావ్యరస మాస్వాదించే శక్తియివ్వదు. ఒక సానుభూతితో కావ్యం చదవాలి. పూర్వ కవుల సుచరిత పథాలని జాగ్రత్తగా పరిశీలించాలి. సౌందర్య మన్నది భావంలోనే ఉండనక్కరలేదు. ఒక వృత్తభేదంలో ఒక చిన్న సమాసంలో నుడికారంలో కూర్పులో ఒక చిన్నమాటలో ఉండవచ్చు. పరిత జాగ్రత్తగా ఉండకపోతే యిటువంటి సౌందర్యాలు గ్రహించ లేకపోతాడు. ఈ సౌందర్యోపాసనకి మార్గం పూర్వకావ్యాలని, పూర్వకవులని మిక్కిలిగా చదివి మననం చేయడం."వేయిమందిలో ఒకడు సిద్ధికోసం ప్రయత్నిస్తాడు; అట్లాంటి వేయిమందిలో ఒకడు నన్ను పొందుతా" డన్నాడు భగవంతుడు గీతలలో. సరిగ్గా రసజ్ఞత్వంగూడా అట్లాంటిది. వెయ్యిమంది కావ్యాలు చదివితే ఒకడి కెనడికో రసజ్ఞతాబుద్ధి కలుగుతుంది. అటువంటి వెయ్యిమందిలో ఎవడికో సంపూర్ణమైన రసస్వరూపం సాక్షాత్కరిస్తుంది. ఈ రసము కావ్యవస్తువులో ఉంటుంది. ఉండి కవిచేత కావ్యమంతటా వెదజల్ల బడుతుంది. ఆశ్వాసాలుగా విభజించటంలో, కథని పంచటంలో, కల్పనలు చెయ్యటంలో, పాత్రపోషణంలో, ఔచిత్యంలో, అలంకారాలలో, నుడికారంలో, శబ్దములలో, ప్రతిచోటా యీ రసం ఉంటుంది. ఇన్ని విషయాలలో ఒకానొక విషయమందు ఒక్కొక్కపుడు రస సన్నిధానం లేకపోవచ్చు. అందుచేత ఆ కావ్యంలో రసం లేదనటానికి వీల్లేదు. ఒక్కశబ్దంయొక్క ఔచిత్యం చూస్తే అది బహుముఖాలుగా ఉంటుంది. వ్యాకరణ సంబంధమైన సంస్కారౌచిత్య మొక్కటే

ఔచిత్యంకాదు. అది ఉచిత స్థానమందు ప్రయోగింపబడుట కూడా ఔచిత్యం. ఆశబ్ద మందు వ్యంజకత్వం ఉండటం ఒక ఔచిత్యం. ఒక శబ్దమందు వ్యంజకత్వౌచితి ఉండి, పాత్రౌచితి ఉండి, వ్యాకరణసుష్ఠుత్వం ఉండదు. ఆ శబ్దం రసస్ఫోరక మవుతుందా కాదా అని విచారణ. ఈపట్టు నవ్యసాహిత్యానికి శంకుస్థాపన. ఇందులో రెండువాదాలు ఉన్నవి. ఆశబ్ద మీ ప్రకారం చ్యుతసంస్కృతి అయినా రస పరిహరణీయం; అని ఒకవాదన. రెండవవాదన: అది వర్తిమత్తు, అది చ్యుత సంస్కృతియే కాదు. శిష్ట వ్యవహారము, వ్యవహార మనాదిసిద్ధంగా వైయాకరణులు స్వీకరిస్తూ వచ్చారు. వార్తిక కారుడైనటువంటి కాత్యాయనుడు శిష్టవ్యవహారవాది. మీ వ్యాకరణాలల్లో ఉన్న నిపాతలు; పృషోదర త్వాత్సాధువులు, శిష్ట వ్యవహారాన్నే సూచిస్తున్నవి. ఇవిగాక ఆంధ్రంలో ఉన్నకవులు అందరూ అపాణినీయాలైనా శిష్ట వ్యవహృతములైన శబ్దాలను పరంపరగా వాడారు అని రెండవవాదన. అయితే సంస్కృత కావ్యాలొక్కటే కావ్యాలుగా పరిగణింప దగ్గరోజులు ఉన్నవి. కొన్నాళ్లు ప్రాకృతభాషాకావ్యాలనే తిరస్కరించారు. దేశభాషలైన వికృతిభాషా కావ్యాలు మరీ నిరసింపబడ్డయి. అసలు రసానికి దేశభాష మూలకందం. అందుకనే ఆచార్యుడు "స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః" అన్నాడు. హృదయావధికమైన రసము పుట్టవలెనంటే దేశభాషలోని అచ్చమైన నుడికారంతోగాని పుట్టదు. కనుక వికృతిభాషావాక్యాలు రసస్వరూపాన్ని తేలిగ్గా అందించేవి గనుక సత్పురుషులు వానియందు రసప్రలుబ్ధధీకు లవుతున్నారు. కాని మీ భాష దేశభాష కాదు, ఇది అపభ్రంశం, నింద్యగ్రామ్యం. ఇది రసభంజకం గాని రసప్రేరకం కాదు అనవచ్చును. ఆలంకారికులు అర్థాన్ని అనుసరించి గ్రామ్య మంటారు - వ్యాకరణ రీతిగా అపభ్రంశమైతే చ్యుత సంస్కారం అంటారు. చ్యుతసంస్కారమూ గ్రామ్యమూ ఒకటికాదు. అవి రెండూ ఒకటిచేయటం భాషను మేకుబందీ చేసి బిగించటం. అసలు యీభాషే వికృతిభాష. తద్భవదేశ్య భాషలు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు జీర్ణించుకునే భాషలు. ఒక కాలంనాటికయిన వ్యత్యయాలు మేము పట్టీలు వ్రాసి అట్టిపెట్టాము, ఇక వ్యత్యయం జరుగకూడదు అని చుట్టూ నాలుకట్టడానికి హేతు వేమిటి? ఆ కట్టినవాళ్ల అధికారవాంఛా? ఈ భాషలో

యింకా వ్యత్యయాలు రావటానికి వెసులుబాటు లేకపోవటమా ? ప్రావాహికమైన భాషలో మాట్లాడుతున్న కొద్దీ రకరకాల మార్పులు వస్తవి. రసస్ఫోరకంగా ఒక విశిష్టమైన అర్థం యిచ్చేటట్లు మారుతుంది. ఒకశబ్దం మారుతుంది. అది మీ సూత్రానికి భిన్నంగా ఉంటుంది. ఆశబ్దాన్ని వదిలిపెడితే దానిలోఉన్న మహార్థం తప్పించుకుపోదు. పేదవాడు బిచ్చమడుగుతూ "బాబులారా ! ధర్మచెయ్యి దాగదు" అంటాడు. ఈ ధర్మచెయ్యి తప్పుసమాసం. కాని యిందులో వున్న విశిష్టమైన అర్థం మరియే యితర శబ్దంచేత సంపాదిస్తాము? ఇంకొక సుష్ఠుశబ్దం దీని బదులు వేస్తే అర్థచ్ఛాయలో దీనికీ దానికీ భేదం ఉంటుంది. కనుకనే సాహిత్య మీమాంసకులైన మహాకవుల ప్రయోగాలకును, భాషా మీమాంసకులైన వైయాకరణుల సూత్రాలకును భేదం కనిపించటం. ఈ భేదజ్ఞానం ఆంధ్రంలో శ్రీ గురజాడ అప్పారాయోపజ్ఞకం. ఆయన దీన్ని రెండు మార్గాలుగా ప్రవహింపచేశారు. ఒకటి కావ్యరచన; రెండవది వ్యవహార భాషావాదం. ఈ రెండు మార్గాలు ఱెక్కలు చాచి బాగా విజృంభించినై. వీనిలో అనేక శాఖోపశాఖలుగూడా పుట్టినై. అప్పారావుగారు మహాశిల్పి, సంఘసంస్కర్త. వాడుకభాషలో వ్రాసినపాటలు రమ్యమైన కధాసృష్టికలవి. పండితులు విని భావం బాగా ఉంది, భాష బాగులేదు అంటారు. భాష బాగులేకపోతే భావం యెల్లా స్ఫురిస్తుంది? వారి ఉద్దేశ్యం భాష బాగా లేదని కాదు. వారి ఉద్దేశం ప్రకారం చ్యుత సంస్కారాలైన శబ్దాలు ప్రయోగించారని. వచ్చుచున్నాడు, వస్తున్నాడు - ఈ రెండు శబ్దాలకీ అర్థభేదంలేదు. ప్రకృతిప్రత్యయ వివరణం చేస్తే మొదటిది లొంగుతుంది, రెండవది లొంగదు అని వివాదపెట్టవచ్చును. ఇంకొక సూత్రం కల్పించుకుంటే ఆ వాదనే ఉండదు. అసలు శబ్దం చ్యుతసంస్కారం అవుతుంది అనడానికి సంస్కృతభాషలో ఉన్న సంప్రదాయం తెలుగులో అంతగా పట్టదు. సంస్కృతంలో సర్వశబ్దాలూ వ్యుత్పన్నాలు. తెలుగులో వికృతులు దేశ్యాలు. ఉయ్యేల పయ్యెద మొదలయిన అల్పసంఖ్యాకములైన కొన్ని శబ్దాలకు మాత్రమే వ్యుత్పన్నత కలిగించేందుకు ప్రయత్నం చేయబడ్డది. ఆంధ్రభాష ప్రావాహికం. ఇటువంటి భాషకు లక్షణ నియామకం కన్న లక్ష్యశరణ్యాత్వం యెక్కువ యోగ్యంగా కనిపిస్తున్నది. ఏ భాషైనా సజీవమై ఉంటే పండితపామరులు అందరిచేతా

మాట్లాడబడుతూంటే తలా ఒకచోటా, తలా ఒకమార్పూ పొందుతుంది. భిన్నవర్ణాల నాశ్రయించి, భిన్నసంఘమర్యాదల నాశ్రయించి, భిన్నప్రాంతాల నాశ్రయించి సజీవభాషలో భిన్నత్వ మేర్పడుతుంది. వీటి అన్నింటిలో అనుస్యూతమై ఒక భాషయొక్క యేకాకారం కనబడుతూనే ఉంటుంది. ఆ యేకమైన ఆకారం చెడితే భాష చెడ్డట్టుగాని లేకపోతే చెడ్డట్టు కాదు. కొందరు అతివాదులు వ్యవహార భాషలో యింగ్లీషువాక్యవిన్యాసాన్ని తర్జుమాచేస్తున్నారు. భాష చెడటం యిక్కడ. వాడుక భాషాశబ్దా లుపయోగిస్తే భాష చెడదు. అది గ్రాంధికభాష కాకపోవచ్చును. ఆంధ్ర భాషయే. ఈప్రాంతీయాలు, ఈ నిమ్నజాతులు వాడే శబ్దాలు, ఉత్తమకావ్యమైన నాటకంలో పాత్రౌచితికోసం వాడబడవచ్చునుగదా! మరి ఆ శబ్దాలు రసహేతువులుగా! అది నిష్పత్తి చేసే రసంయొక్క స్వరూపం వేరు కావచ్చును. వానియందలి భాషాత్వం తొలగిపోవటంలేదు. అట్టే మాట్లాడితే భాషాత్వం వానియందే ఉంది.

సంస్కృతం కూడా మాట్లాడబడే రోజుల్లో యీ ప్రాంతీయ భేదాలచేత భిన్న ప్రాకృతాలూ, పాళీ మొదలైన భాషలనూ కన్నది. హిందీ వ్రజభాష ఖడీబోలీ రెండుగా నైనది. ఏభాషకైనా యీ దశలు తప్పవు. పైగా యీ ఉద్యమం చాలా మంచిది. ఎందుచేతనంటే పండితులు రసము ధ్వని మొదలైన లాక్షణిక గుణాలు మరచిపోయి ఒక్కశబ్దసాధుత్వాన్ని పట్టుకొనే వ్రేలాడుతున్నారు. అందుమూలంగా నీరస గ్రాంధికంలో గ్రంధాలు కుప్పతెప్పలుగా బయలుదేరినై. వాడుకభాషలో వ్రాస్తే ఒక వ్యాకృతమైన శబ్దంయొక్క స్వరూపం వెనుక దాక్కోడానికి వీల్లేదు. రసంలేని వ్రాత వ్రాస్తే వాని స్వరూపం వెంటనే తెలుస్తుంది. దేశంలో రసబుద్ధి మళ్లించటానికైనా వాడుకభాష అవసరం.

అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగా రందుకున్నారు. ఆయన చేసిన పని చాలా గొప్పది. ఆరోజులలో పండితులు అప్పారావుగారి కావ్యాలల్లో ఉన్న అందం చూడకుండా నిందించారు. సుబ్బారావుగారు వారి గీతిమాత్రత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి భాషను గుఱించి మాట్లాడటానికి వీలులేకుండా చేసి ఆ మార్గంలో ఉన్న కొత్తదనం పండితులచేత

గూడా కొత్త దనమని ఒప్పించారు. మన పూర్వసాహిత్యంలో ఒక్క ప్రబంధాలే కావు. స్తోత్రాలు, శతకాలు, చాటువులు, యక్షగానాలు, దరువులు, ఉదాహరణాలు, లక్షోపలక్షలు కలవు. దేశము వాని నన్నింటినీ మఱచిపోయి ఒక్క మార్గకవితలోని ప్రబంధాలు మాత్రమే, అక్కడి వర్ణనలు మాత్రమే భాషా, సాహిత్యమూ అనుకుంది. అప్పారావుగారు గాని, సుబ్బారావుగారు గాని చేసినదియేమనగా, రసపు గూళ్లైన అనేక దేశీయశబ్దాలను నుడికారాన్నీ రసవ్యంజకంగా కథలలో అతికి "అబ్బాయి! భాష కాయువుపట్టు యిల్లా ప్రయోగింపబడే శబ్దం. ఇది దేశీయమైన శబ్దం. జాతియొక్క హృదయం యీ శబ్దంలో ఆడుతోంది" అని చూపించారు. చాలామంది ఒప్పుకొన్నారు. రసనిష్ఠకలవాడు రసాభివ్యంజకంగా ఉన్నదాన్ని యెప్పుడూ ఒప్పుకుంటాడు. శబ్దనిష్ఠకలిగి రసాన్ని గురించి వివరించేవాడు యెల్లా ఒప్పుకొంటాడు?

ఈ కవితామార్గం క్రమంగా విజృంభించింది. క్రొత్త సిద్ధాంతాల మీద గాలి తిరిగింది. కాని కొందరికి పూర్వకావ్యాలలోని భాషమీద మోజుపోలేదు. అందుచేత యీ కవితాస్రవంతి రెండు మార్గాల ప్రవహించింది. అబ్బూరి రామకృష్ణ రావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు మొదలైన ప్రముఖులు గ్రాంథికభాషలో క్రొత్తకావ్యాలు వ్రాశారు. అడివి బాపిరాజుగారు, నండూరి సుబ్బారావుగారు, కవి కొండల వెంకటరావుగారు గేయాలు వ్రాశారు. కాని వీరిలో యెవరి వ్యక్తిత్వం వారికే ఉన్నది. అడివి బాపిరాజుగారికి కూర్ల్రే దొరగారి శిష్యత్వంవల్ల జానపద గీతరచన, చిత్రకళ అభ్యాసమైంది. ఈ వాడుకభాషావాదంలో అనేక పిల్ల సమేరీలు పుట్టినై.

కాల్డ్వెలు గ్రామరు చదివి ద్రావిడభాషల సంప్రదాయం, తెలుగుకి వాటితో గల సంబంధం; ఇదొకవైపున భాషాశాస్త్రమని పేరుతో బయలుదేరింది. ఈ భాషా శాస్త్రానికి అచ్చంగా శ్రీ గిడుగురామమూర్తిపంతులుగారు ఆచార్యుడైనాడు. ఆంధ్ర భాషలో వారు చూడని గ్రంథంలేదు. వారు మథించని శబ్దం లేదు. ఆయనముందర రాతికోటలు బాంబులు పడి పగిలినట్లయినవి.

ఈ మహాపురుషుడు ఈనాడు తన శరీరంచేత లేక, ఆత్మశక్తిచేత మాత్రమే ఈ పరిషత్తును పాలిస్తున్నాడు.

శ్రీగురుజాడ అప్పారావుపంతులుగారు తీసిన నూత్న కావ్యమార్గం వెయ్యిమంది పోషిస్తూవస్తే, వారు తీసిన వ్యావహారికభాషావాదం శ్రీరామమూర్తి పంతులుగా రొక్కడువెయ్యిమంది పెట్టుగా పోషించారు.

మన భాషలో ఇద్దరే వాగనుశాసనులు, నన్నయభట్టుగారును, గిడుగు రామమూర్తి భట్టు గారును.

ఈ మహోద్యమాన్ని వారి దివ్యాత్మ పాలిస్తున్నది.

ఈ శబ్దవ్యుత్పత్తివ్యవహారంలో జోక్యం కలిగించుకుంటూ ప్రధానంగా ఆంధ్రచరిత్ర పరిశోధన మొదలుపెట్టి శ్రీకొమర్రాజు లక్ష్మణరావుపంతులు గారు నవ్యసాహిత్యంలో మరియొక బావుటా లేవతీశారు. శ్రీచిలుకూరి వీరభద్రరావు పంతులుగారు కూడా అనాటివారే.

ఈ నవ్యసాహిత్యం ఒక్క కావ్యనిర్మాణానికే సంబంధించింది కాకుండా బహుమార్గాల వెలిసింది. ఒకటి గ్రాంధికభాషలో మేళవించిన నూత్న కావ్యనిర్మాణం. రెండవది క్రొత్త వృత్తాలతో వాడుక భాషలో వ్రాసినగేయాలు. మూడవది శిల్పము. నాల్గవది భాషాశాస్త్రం, ఐదు చరిత్రపరిశోధన. ఈమార్గాలల్లో పరిశ్రమలుచేస్తున్న అందరూ ఆంతరంగికంగా సానుభూతితో ఒకరియెడల ఒకరు భ్రాతృభావంతో మెలుగుతూవచ్చారు. ఒక గేయకవి, ఒక భావకవీ భావానికి ప్రాధాన్య మిచ్చి ఒకరి కొకరు యిద్దరూ కవులుగానే పరిగణించుకొన్నారు. చిత్రకారుడైన స్నేహితుడితో శిల్పము కళ అన్నశబ్దాలు సమానాధికరణాలుగా చూసుకున్నారు. భాషాతత్త్వ శోధకులు యీకవులకు ఆలవాల మైనారు. చరిత్రపరిశోధన యీమహోద్యమాని కెంతో సహాయ్యంచేసింది. ఈ భావకత్వానికి ఆంగ్లేయసారస్వతం గొప్పదోహదమైంది. కవుల నాదరించి అగ్రహారా లిచ్చే దాతలులేరు. ఎవనిజీవిక వాడు చూచుకోవలసి వచ్చింది. అందుచేత కవికి ఖండకావ్యం తేలిక యిచ్చింది. ఈ ఖండకావ్యనిర్మాతలలో ప్రాథమికులలో కొందరు కీర్తిగడించినవారు, కొందరు ఒకటి రెండు వ్రాసి ఉపసంహరించుకొన్నవారు కూడాగలరు. శ్రీ బసవరాజు అప్పారావుగారి వాణి ఆ రోజులలో మధురంగా వినిపించినవానిలో ఒకటి. ఆయన పలుకుబడి గుండెకు

సూటిగా ఉండేది. అయన కొన్ని కావ్యాలలో హృదయమే మాటల్లే పెట్టేవాడు. Wordsworth కవివలె ఒక ఆవేశం వస్తే దివ్యంగా పాడి తక్కినప్పుడు భౌమంగా వ్రాసేవాడు. ఒకటి రెండు వ్రాసి యుపసంహరించుకొన్న వారిలో నే నెరిగియున్నది, వింజమూరి రంగాచార్యులుగారే. ఇటువంటివారు దేశములో ఇం కెంత మందియో ఉండవచ్చును. ఇది యంతయు నవ్యసాహిత్యంయొక్క ప్రథమదశ.

రెండవదశ యింతకన్న పరిపుష్టమైనది. కవితా మార్గములో శ్రీ శివశంకర శాస్త్రిగారు నిర్మించిన సాహితీసమితి బయలుదేరినది. అందులో క్రొత్తకవులు పుట్టుటయేకాక సాహిత్యశాఖలో భిన్నకావ్యాలు బయలుదేరినవి. చిన్నకథకు ఒక ఆకార మేర్పరచినది సాహితీసమితి. కీర్తిశేషుడు చామర్తి రాజశేఖరరావు, విరాగియై యెచటికి పోయెనో తెలియని కొడవటిగంటి వేంకటసుబ్బయ్య, నోరి నరసింహశాస్త్రి, శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణ శాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులు గార్లు సాహితీసమితిని ప్రకాశింపజేసిరి. మునిమాణిక్యం నరసింహారావు, చింతా దీక్షితులుగార్లు అచ్చముగా చిన్నకథనే అవలంబించారు. చిన్నకథలో వారిద్దరికీ చెరొకమార్గంలో సిద్ధి లభించింది. ఆంగ్లేయ సారస్వతంలో 'గ్రే' యెటువంటి స్థానాన్ని సంపాదించుకొన్నాడో వేదులకవి అట్లాంటిది సంపాదించుకున్నాడు. శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రిగార్లు కథలూ, పద్యాలూ, రెండూవ్రాసి నూతనసారస్వతానికి వన్నెతెచ్చారు. కృష్ణశాస్త్రిగారు సాహితీసమితి మనిషేఅయినా, ఆయన వేటే వ్యక్తిత్వం తెచ్చుకున్నాడు. అప్పుడు గేయాలు వ్రాసినవారిలో నూతక్కి రామశేషయ్యచౌదరిగా రొకరు, కాపుపెండ్లి అని మఱికొన్ని యితరగీతాలు వ్రాసి చక్కని సంస్కారబుద్ధి అన్ని విధాలా చూపించారు. ఇట్లా యీసాహితీసమితి యిక్కడ నడుస్తోంటే తక్కిన తెలుగుదేశంలో కవులెవళ్ళూ లేకపోలేదు. పాతూరి అంజయ్యగారని ఒకాయన కృష్ణాపత్రికలో చాలా మధురమైన గీతాలు వ్రాస్తూ ఉండేవాడు. ఆయన యేమైనాడో తెలియదు. శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు రాయప్రోలు సుబ్బారావుగారి ప్రథమదినములలో కవిత్వంకూడా వ్రాసేవారు. వారి శమీపూజ, పెనుగొండ పాట మొదలైనవి తెలుగులో చావవు. అటువంటి గొప్ప మేధావి కవిత్వాన్ని వదలివేసె నవగా ఆంధ్రసరస్వతి దుఃఖించాలిసిన విషయం.

స్వంతకావ్యాలు యెక్కువ వ్రాయలేదు కాని శాలివాహన సప్తశతి తెలిగించటం మాత్రం గొప్పపని చేశారు. ఈ రోజులలో కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారము వ్రాసి విమర్శపథాలలో గొప్పదృక్పథం కలిగించి నవ్య సాహిత్యానికి క్రొత్తబోదెలు త్రవ్వారు. వారి ముసలమ్మ మరణమను కావ్యము, అర్థశాస్త్రాంకిత పద్యాలు, వారి కవితాస్రవంతియొక్క యచ్ఛత్వాన్ని లోకానికి చెప్పి చూపినవి. ఆ రోజులలో సెట్టి లక్ష్మినరసింహంగారు మొదలైన వారు యితరజిల్లాలలో కవితారచన చేశారు. పింగళి లక్ష్మికాంతం. కాటూరి వేంకటేశ్వరరావులు సన్ననితియ్యని మార్గంలో వ్రాస్తూ ఉండేవారు. కొడాలి ఆంజనేయులుగారు ఒక మధురకవితను సాగించేవారు. పెనుమర్తి వెంకటరత్నంగారు కూడా చిన్నతనంలో చక్కని కవిత్వం వ్రాసినా యెంతో వృద్ధికి రావలసిన వాడైనా, కాలంచేశాడు.

ఇక మూడవదశ : సాహితీసమితిలో కొందరు వ్రాయటం మానుకొన్నారు. సెట్టి లక్ష్మినరసింహం గారు మొదలైనవారు గ్రాంధికంలో చేరారు. కాని కొందరు రచయితలు సారస్వతం వెంట వస్తూనే ఉన్నారు. రాయప్రోలు సుబ్బారావుగారు చాలా రోజులు వ్రాయటం మానివేశారనుకున్నాం. వ్రాస్తూనే ఉన్నారట. ప్రకటించలేదు. మళ్ళీ వారు కావ్యప్రపంచాన్ని రమ్యాలోకం చేశారు. శివశంకరశాస్త్రి గారిజీవితానికీ సాహిత్యానికి లంకె. వేదులవారివ్రాయడం మందగించింది. కృష్ణశాస్త్రిగారు యీ దశలో ఒక క్రొత్తమార్గం యేర్పరిచారు. ఇంగ్లీషుభాషకీ తెలుగుభాషకీ ఒక గొప్పభేదం ఉంది. ఇంగ్లీషుభాషలో అనేక శబ్దాలకు లాక్షణికార్థం ఉంటుంది. పైగా వాటికి లాక్షణికార్థం ప్రధానం. మన భాషలో అల్లాంటి శబ్దాలు తక్కువ కనుకనే యింగ్లీషు కవిత్వం సులభంగా కవిత్వం అనిపిస్తుంది. అనేకమంది యింగ్లీషు భావాలను మక్కికి మక్కిగా తెలుగుచేసి అన్నముకాకుండా, గంజి కాకుండా చేస్తారు. కృష్ణశాస్త్రిగారు అట్లా కాకుండా ఇంగ్లీషు భావాలను తెలుగులో యిల్లా చెబితే బాగానే ఉందిరా' అనేటట్లు వ్రాశారు. ఆయనది ఒకమార్గం. ఆమార్గ మాయనదే. దానిని గురించి సవిస్తరంగా చెప్పాలి అంటే యిది సమయం కాదు. ఈదశలో చిత్రకళలో గొప్ప పరిణామం జరిగింది. బందరు ఆంధ్రజాతీయకళాశాలలో ప్రమోదకుమార చటర్జీగారిక్రింద బాపిరాజు, కౌతాసోదరులు, ఇతర విద్యార్థులు, అభినవ కళావిన్యాసాల

నభ్యసించారు. రాజమహేంద్రవరములో దామెర్ల రామారావుగారి స్కూలు గొప్ప వికాసం తెచ్చినది. రామారావుగారు చిన్న వయస్సులో పోయినను తనకొక స్వంత Technique ఏర్పాటు చేసికొని పోయినారు. బాపిరాజు గారి బొమ్మలు Holland లోగూడా కీర్తిపొందినవి. కౌతాసోదరుల ప్రశస్తిగూడా పాశ్చాత్యదేశములకు ప్రాకింది. చిత్రకళలో యీ వంగీయ సంప్రదాయముతో, అజంతాయెల్లోరా గుహల శిల్పాదర్శము లతో బౌద్ధమత సంప్రదాయములు బలిసి అవి నెమ్మదిగా కవిత్వములోనికి ప్రాక నారంభించినవి. చరిత్రలో మల్లంపల్లి సోమశేఖరశర్మ, భావరాజు కృష్ణరావు, డాక్టరు నేలటూరి రమణయ్యగార్లును యితర ప్రముఖులును బహుపరిశోధనలుచేసి ఆంధ్రచరిత్రవిషయములను ప్రకాశింపచేసిరి. ఈఉద్యమములో యెవరికి వారుగా యెప్పుడును లేరు. ఈ సోమశేఖరశర్మప్రభృతులు లక్ష్మణరావుపంతులుగారి శిష్యులై వారి యుద్యమమును సాగించినవారు. డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు భాషాశాస్త్రమునందు రామమూర్తి పంతులు గారి శిష్యులై ఆంధ్రవాఙ్మయ చరిత్ర అనే మహాగ్రంధాన్ని నిర్మించారు. గేయాలల్లో బాపిరాజుగారి చేయి యెప్పుడూ ఊరుకోలేదు. అది ఊరుకునే చెయ్యేకాదు. ఈసమయంలోనే దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు భారతి పత్రికను స్థాపించినారు. అది నవ్యసాహిత్యానికి అనాటినుండి ఈనాటివరకు అండగా నిలుచుంది. నవ్యసాహిత్యం తక్కిన తెలుగు దేశపు అనేక సంస్థలతోపాటు శ్రీ పంతులుగారి యందు కృతజ్ఞతాభావం వహించియే ఉంది.

ఇక్కడ ఇంకొక విషయము చెప్పవలయును. నవ్యసాహిత్యము యొక్క యీదశలోనే దువ్వూరి రామిరెడ్డిగారి సరస్వతి వికాసం పొందింది. దానికి డా.కజిన్సు, రామలింగారెడ్డిగార్లు ఇచ్చిన ప్రోత్సాహం సానుకూలపడ్డది. రామలింగారెడ్డిగారు భాషలో కొందరు యువకులలో ప్రారంభమునుండి ఒక గొప్ప మూలశక్తిగా పనిచేశారు. వారి తెలుగు ఆర్థికశాస్త్రము, కవిత్వతత్త్వ విచారం, నవ్యసాహిత్య భావాలకు ఎంతైనా ప్రోత్సాహమిచ్చినై. అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, పింగళి - కాటూరు కవులు వారి ప్రోత్సాహం పొందినవారే. వారిని ఆదర్శంగా ఉంచుకొని వ్రాసినవారే. ప్రధానముగా పింగళి,

[illegible] శ్వరావు పంతులు గారి ప్రోత్సాహం. సారస్వతంలో [illegible] పరోక్షగురుత్వం. ఈరోజులలో వెంపటి [illegible] నాథం గారు యింగ్లీషులోనే కవిత్వం వ్రాసి అది [illegible] దశలో Non Co-Operation movement చరమదశ [illegible] గీతాలు ప్రబలినవి. కొన్ని స్థలాలల్లో ఆంధ్రరత్న దుగ్గిరాల [illegible] విజృంభించింది. జాతీయగీతాలు ఎంతమందైనా [illegible] గీతాలల్లో నాటుకభాషలో వ్రాసినవానిలో గరిమెళ్ల సత్య [illegible] గీతాలు తెలుగుజాతిని మేల్కొలిపినవి. ఈకాలంలోనే త్రిపురనేని [illegible] పురాణం వెలువడింది. వారిశిష్యులు చాలామంది [illegible] గ్రాంథిక భాషాజ్ఞానం బాగా కలవారు. వైదర్భీరీతిలో చక్కగా [illegible] నవ్యసాహిత్యం యెల్లా అవుతుందీ అంటే సాహిత్యా [illegible] సంప్రదాయాలల్లో యెదురుతిరిగి నవ్యత్వం కోరటం మూలంగా వారిదీ [illegible] పుష్టింటి.

[illegible] దశ - ఈదశలో క్రొత్తకవులు చాలామంది పుట్టారు. జాషువాకవి [illegible] గీతానికి రుబాయీ రుబాయీ మొదలుపెట్టాడు. ఐదవదశనాటికి తనకు వేరే [illegible] నిర్మించుకో బోయే శ్రీరంగం శ్రీనివాసరావు గ్రాంధికభాషలో పద్యాలు వ్రాయటం మొదలుపెట్టాడు. కొంపల్లె జనార్దనరావుగారు ఉదయిని ప్రారంభించాడు. పురిపండా అప్పల స్వామి, శ్రీరంగం నారాయణబాబు, కాళూరి నరసింహారావుగార్లు మొదలైనవారు విశాఖపట్నం నుండి, సహదేవ సూర్యప్రకాశరావు ప్రభృతులు రాజమహేంద్రవరమునుండి కొత్తరచనలు చేశారు. శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు భాషాతత్వశాఖకు 'ప్రతిభ'తో కవిత్వానికీ చాలా సాహాయ్యం చేశారు. శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు వెనుకటి దశలో జయంతి పత్రిక పెట్టి భావకవిత్వానికి ఒక విధంగా ఆచార్యులు కావడమే కాకుండా యీ దశలో త్రివేణి అను ఆంగ్లేయ మాసపత్రికతో యీ ఆంధ్ర నవ్యసాహిత్యానికి యితర దాక్షిణాత్య సాహిత్యాలతో సంబంధ బాంధవ్యాలు కలపటం ప్రారంభించారు. ఈ దశలోనే పెమ్మరాజు లక్ష్మీపతి, నఝుల కాళిదాసుగార్ల మధుర కవిత్వంగూడా వినిపించింది.

ఇకనైదవదశ. ఇది ప్రస్తుతదశ. ఇందులో జాషువగారి మధుర కోకిలత్వం స్థిరపడ్డంది. శ్రీరంగం శ్రీనివాసరావుగారి ముక్తకంఠం విడివడ్డది. ఆయన చాలా క్రొత్తదైన ఒకమార్గం నవ్యసాహిత్యంలో సృష్టించాడు. విశ్వభారతిలో చదువుకొని వచ్చిన మల్లవరపు విశ్వేశ్వరరావుగారు కళ్యాణ కింకిణితో గోపాల రెడ్డిగారి పెళ్లి చేయించారు. తెనాలి ప్రాంతాలలో కమ్మవారిలో చక్కని భాషాజ్ఞానం కలిగి సాధువైన మార్గాన కవిత్వం వ్రాసేవారు బయలుదేరారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరి, ఏటుకూరి లక్ష్మీనరసయ్య, బోడేపూడి వెంకటరావు, వాశిరెడ్డి వెంకట సుబ్బయ్య గార్లు తమ క్రొత్త రచనలతో తెలుగుభాషకు సొంపులు దిద్దుతున్నారు. శ్రీ కృష్ణశాస్త్రి గారు అప్పటికీ యిప్పటికీ అటు భావగీతాలు, ఇటు చిన్ని నాటకాలు, ఆకలి పాటలు, భక్తిగీతాలు వ్రాస్తూనేయున్నారు. చింతా దీక్షితులుగారు కూడా కథలు వ్రాయటం మానివేశారు.

నవ్యసాహిత్యము యొక్క యీ చివరి రెండుదశలలోను ఒక శక్తిమంతమైన వాడుకభాషరచన గలిగిన ఒకగద్యరచయిత పిడుగువలె ప్రవర్తించాడు. ఆయన భావాలు నచ్చనివాళ్లు చాలామంది ఉన్నారు. ఆధునిక సారస్వతమంటే ఆయన పేరెత్తకుండా వీలులేదు. ఆయన నవలలు, నాటకాలు, కథలు వ్రాశారు, ఆయన పేరు గుడిపాటి వెంకటచలంగారు. ఆయన తెలుగు ప్రబంధాలు చదువుకో లేదంటారు. ఇంగ్లీషు చదువుకున్నాడు. ఆయన వ్రాసేవన్నీ యింగ్లీషు భావాలే. కాని ఆయనమాత్రం అచ్చమైన తెలుగువాడి నోట, వాడిహృదయంలో నుంచి వచ్చేభాష. ఆయన వ్రాసే ప్రకృతివర్ణనలు తెలుగుదేశంలో నువ్వూ నేనూ చూచేవి. ఆయన భాషనుగురించి ఆయన భావుకవిత్వాన్ని గురించి నేనెంతైనా పొగుడుతాను. కాని ఆయన సిద్ధాంతాలు నా మనస్సుకి వేరుగా ఉంటవి.

ఎడతెగకుండా రెండు మూడు సాహిత్యదశలనుండీ వ్రాస్తూఉన్నవారు కవికొండల వెంకటరావుగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, ఒక కాలంలో వ్రాసి మానివేసిన పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారిని గురించి కొంచెం చెప్పి వీరు ముగ్గురినీ గురించి చెబుతాను. ఆదినారాయణ శాస్త్రిగారు పండితులు, వాడుక భాషావాదులు. తెలుగు కవులను గురించి

మెచ్చుకొనే ఒకగీతం వ్రాశారు. ధృతరాష్ట్రుని విషాదమని ఒక గేయం వ్రాసారు. కాని జైనుల అర్థశాస్త్రకథలు అని వ్రాసారు. ఆ కథలలో ఉన్న వాడుకభాష, దానికదే సాటి. అవియింకా వ్రాసి పుస్తకరూపంగా ప్రకటిస్తే సంస్కృతంలో ఆచార్యదండికేస్థానం ఉందో వాడుకభాషలో ఆదినారాయణ శాస్త్రిగారి కాస్థానం ఉంటుంది. కవి కొండల వెంకటరావుగారు వ్రాయని పద్ధతిలేదు. ఆయన కవిత్వంలో గొప్ప ప్రకృతి పరిశీలన ఉంటుంది. గోదావరిజిల్లా పాటకజనం యాస ఉంటుంది. సూక్ష్మతమమై గ్రహించ రాని భావుకత్వం ఉంటుంది. వేలూరి శివరామశాస్త్రిగారు గొప్ప పండితులు. చిన్న కథలు, కవిత్వం, అవ్యవహితంగా వ్రాసినవారు. వారి కథలలో గొప్పతరగతికి చెందిన కథలు చాలా కలవు. నవ్యసాహిత్యంలో ఆయన దూరంగా ఉండి ఆయనకూ యితరులకూ కూడా తెలియకుండా గొప్పభాగస్వామి అయినాడు. అది ఆయన వలదన్నా పోయేది కాదు. ఈ రీతిగా వారికి తెలియకుండా నవ్యసాహిత్యంలో పాళ్లు పెట్టుకున్నవారు చాలామంది ఉన్నారు. మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకర శాస్త్రులు గార్లు చేసిన పరిశోధన నవ్యసాహిత్యానికే చెందుతుంది. పింగళి లక్ష్మీకాంతంగారి సౌందరనందం నవ్య సాహిత్యానికే చెందుతుంది. ఇది ప్రమోద కుమార ఛటర్జీ శిల్పపుటొత్తిడి. అదే ఆకృతికట్టి శ్రీముట్నూరి కృష్ణారావుగారి ప్రభావముతో కలిసి సౌందరనందంగా మూర్తికట్టింది. కాటూరి వెంకటేశ్వరరావుగారు యీ పరిషత్తులో ప్రత్యక్షసభ్యుడు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంఘసంస్కారమూ, ఆంధ్రరాష్ట్రమూ యీ రెంటినీ కలిపి వ్రాసిన కథలూ వ్యాసాలు భాషాదృష్టితో చూస్తే వాడుకభాషకి క్రొత్త అలంకారాలు. ఆదినారాయణశాస్త్రి గారి అర్థశాస్త్రకథల్లో భాషకు, కథ చెప్పటంలో ఉన్న ఒడుపుపుల్ల ఒక గొప్పదశవస్తే, వీరికి పలుకుబడి సొగసుచేత ఒక గొప్ప వస్తుంది.

వీరుకాక హైదరాబాదునుండి సురవరము ప్రతాపరెడ్డిగారు, వారి గ్రంధాలు వారి వ్యాసములచేత కొంత పరిశోధన చూపించారు. నిజాం రాష్ట్రములో వారు యీ ఉద్యమానికి లంకెగా ఉండి పనిచేస్తున్నారు, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి జాతక కథలు మరొక నవ్యసాహిత్య గ్రంథం. ఈ కాలానికి లక్షణంగా ఉన్న ప్రణయ

కవిత్వం కంటె ఒక విశిష్ట లక్షణము గల ప్రణయకవిత్వం వ్రాసినవాడు నాయని సుబ్బారావు. ఆధునికులలో చాలామంది రచనను తిక్కన రచనవలె ఉందని చాలామందిని చాలామంది పొగిడారు. వారెవ్వరిలోను తిక్కన అక్షర విన్యాస వైఖరి లేదు. ఒక్క నాయని సుబ్బారావు లోనే ఉన్నది. ఇల్లా కావ్యనాటకాదులు వ్రాసినవారే కాక యితర రచనలతో నవ్యసాహిత్యాన్ని పోదిచేసినవారున్నారు. గొబ్బూరి విజయ రాఘవానందరావు గారు తమ ఖగోళశాస్త్ర పరిశోధనవల్ల నవ్యసాహిత్యానికి చేసిన మేలు మరువతగినది కాదు. వారీనవ్యసాహిత్య మహాకాశంలో ఒక చంద్రునివలె ప్రకాశిస్తున్నారు. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాకరణం నవ్యసాహిత్య వ్యాకృతి.

వఝుల చినసీతారామశాస్త్రిగారు గ్రాంధికవాదులు. వారిని నవ్యసాహిత్యంలో చేరిస్తే వారికేం కోపం వస్తుందో ! అయినా నేనంటే వారికి దయగనుక సాహసించి అంటున్నాను. వారి వ్యాకరణ పారిజాతం నవ్యసాహిత్యంలోనే చేరుతుంది. ఇన్ని గ్రంధాలూ నవ్యసాహిత్యంలో యెల్లాచేరుతవీ అంటే నవ్యసాహిత్య మంటే నిర్వచనం చెబితే తేలుతుంది.

సాహిత్యమంటే ఒక జాతియొక్క సంస్కారం. మనజాతి పూర్వం ఒక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాదినుండి కాలనిర్ణయంలో భిన్న రాజచరిత్ర నిర్ణయంలో, సంఘ ధర్మ నీతులలో, ఆర్థిక రాజకీయాలల్లో సారస్వతపథాలల్లో ఒక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాల మీద మన జాతి నడిచింది. ఇవ్వాళ ఆంగిలేయులు మన్ని ఆక్రమించటం చేత ఆ మహాసంస్కారంమీద అభిమానం పోయింది. పాశ్చాత్య దేశీయుల సంస్కారం మీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్రనిర్మాణం, సృష్ట్యాదికాల నిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, వీటిని యేయే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం.

ఇప్పుడు పాశ్చాత్య సారస్వత ప్రభావంచేత మనదేశంలో క్రొత్తగా పుట్టిన కావ్యభేదాలను గురించి చెబుతాను. మొట్ట మొదటిది ఖండకావ్యము. ఇది వ్రాయని

మొదటిది కవిత్వము. ఇందులో ఉత్కృష్టమైన ప్రసిద్ధిచెందిన వాళ్లనిగూర్చి యిదివరకే చెప్పాను. రెండవది నవల. ఇందులో ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లి, అడివి బాపిరాజుగారి హిమబిందు, నారాయణరావులు చెప్పదగినవి. విశ్వనాథశాస్త్రి, త్రిపురారి దక్షిణ వీరరాఘవస్వామిగార్లు, యింకను మరికొందరు, బెంగాలీనుండియో, హిందీనుండియో తర్జుమాలు చేసిరి. తర్జుమాలు చేసినవారు కూడా సాహిత్యానికి దోహదం చేసినవారు.

ప్రస్తుత రాజకీయ పరిస్థితులను గురించి నార్ల వేంకటేశ్వరరావు, గోపీచంద్, మామిడిపూడి సత్యనారాయణ శాస్త్రి ప్రభృతులు తెలుగులో గ్రంథములు వ్రాసి ఆధునాతన యుగధర్మాలను ప్రకటింప జేసినవారు.

మూడవది నాటకం. నాటకం మనదేశానికి క్రొత్తగా వచ్చింది కాదు. కాని పాశ్చాత్యుల చేత ఆకారం చాలా మార్చుకుంది గనుక దాన్నిగూడా చెప్పుతున్నాను. నోరి నరసింహశాస్త్రిగారి సోమనాథ విజయం, ఉన్నవ లక్ష్మీనారాయణగారి నాయకురాలు, అబ్బూరి రామకృష్ణారావుగారి నదీసుందరి, వేలూరి చంద్రశేఖరముగారి కాంచనమాల - వీనిలో చెప్పదగినవి. ఈ చంద్రశేఖరముగారు కవిత్వంకూడా వ్రాశారు. అది యెక్కువ ప్రకటించలేదు. అప్రకటితములైన వానిని నేనొక స్నేహితునివద్ద చూచాను. భాష అడివిగా ఉన్నది. భావం లోకోత్తరంగా ఉన్నది. కొన్నైటి వచనరచనవలె మెరుగుబెట్టని భాషలో హృదయమును కొల్లే భావాలు ఆయన చెప్పారు. నేను చూచిన రెండుమూడు గీతాలమీదనే యీ అభిప్రాయం. అన్ని గీతాలు యిట్లే ఉన్నవని నేను చెప్పలేను.

చిన్నకథ నాల్గవది. ఇందులో నిష్ణాతలు కొందరిని పూర్వము పేర్కొన్నాను. మిగిలినవారు వెంపటి నాగభూషణం, మల్లాది రామకృష్ణశాస్త్రి, కరణం శ్రీనివాస శిరోమణి, కొడవటిగంటి కుటుంబరావు ప్రభృతులు. వీరుకాక చాలామంది ఉన్నారు. ఈ కథావాఙ్మయంలో అడివి బాపిరాజుగారికి కూడా గొప్ప స్థానం ఉంది. ఆయన అనేక చిన్న కథలు వ్రాశాడు. ఆకథలన్నీ చిత్రకళావిజ్ఞానం చేత నిండి ఒక ప్రత్యేక వైశిష్ట్యాన్ని తెచ్చుకొన్నై. ఐదవది గేయాలు. ఇందులో మఖల బాపిరాజు గారికి

గొప్ప స్థానము కలదు. నండూరి సుబ్బారావు, నూతక్కి రామశేషయ్య చౌదరి, చిరుమామిళ్లపార్థసారధిగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వీరందరూ వ్రాసిన గేయాలు నవ్యసాహిత్యానికి అలంకారాలు.

ఆరవది చిన్ననాటకం, విశ్వనాథ కవిరాజుగారు, మల్లాది అవధానిగారు పి.వి.రాజమన్నారుగారు మొదలయినవారు దీనికి దోహదం చేశారు.

ఏడవది హాస్యరచన. ఇది యీ తెలుగుదేశములో ఒక్కనిదే సొత్తు. ఆ హాస్య మొక్కొకపుడు చిన్ననాటకం, ఒక్కొక్కపుడు చిన్నవ్యాసం, ఒక్కొకపుడు ఉపన్యాసం; రాజమహేంద్రవరములో ఆ పురుషుడు నిలుచుంటే చాలు, సభంతా చప్పట్లతో మ్రోగిపోవును. నవ్యసాహిత్యశాఖల్లో యేపనైనా ఒకడు చేసింది యింకొకడు చేశాడుకాని యీ భమిడిపాటి కామేశ్వరరావుగారు చేసిన హాస్యరచన మరియొకడు చేయలేదు. ఆయన హాస్యంలో నిగూఢంగా బోలెడంత ఆక్షేపణ ఆంధ్రాభిమానం, వ్యక్తిగతములైన వికారాలు, తెలుగువాళ్ల మాటల్లో ఉండే వెక్కిరింపు, ఎన్నో నిగూఢంగా ఉంటై. అచ్చంగా ఆయన హాస్యకారుడు అనుకున్నవాడు తెలివితక్కువవాడు.

క్రొత్తకవిత్వంలో హాస్యం కలిపి చమత్కారంగా వ్రాసి ఆ పద్యాలు సభలో నిలుచుండి దివ్యకంఠంతో పాడుచున్నవాడు మాధవపెద్ది బుచ్చిసందరరామశాస్త్రిగారు. ఈ క్రొత్తకవులందరికీ 'పారడీలు' వ్రాసి, ముట్నూరి కృష్ణరావుపంతులుగారి, కాటూరి వేంకటేశ్వరరావుగారి ప్రోత్సాహంతో ఆపారడీకి ఒకకళ తెచ్చినకవి జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రిగారు. ఒకరకపు హాస్యరచనలో బందరు నివాసియై కీర్తిశేషుడైన వెల్లటూరి స్వామినాధంగారన్నాయన పద్యములు చాలా వైశిష్ట్యం కలవి. 'నారాజు' వ్రాసికీర్తితెచ్చిన పింగళి నాగేంద్రరావుగారుకూడ యిటువంటి పద్యాలు వ్రాశారు. నవ్యసాహిత్యచాటు పద్యమణిమంజరి అని ఒకటి అచ్చువేసి యిటువంటివన్నీ సంకలనము చేయవలసిన బాధ్యత యెవరిమీదనో ఉంది.

వీరందరూ నవ్యసాహిత్య నిర్మాతలు, వీరిలో కొందరు కొందరు మహానుభావుల చేయూత లేకుండా యీకార్యం చేయలేక పోయేవారు. కొందరు కవులగీతాలు కొంద రాలపించి ప్రాశస్త్యం తెచ్చినవారున్నారు. బెల్లంకొండ రాఘవరావు

గారు, నూతక్కిరామశేషయ్య చౌదరి, కాటూరి వెంకటేశ్వరరావు, చిరుమామిళ్ళ పార్థ సారధి, చిరుమామిళ్ళ శివరామ కృష్ణ ప్రసాద్ మొదలైనవారు తాము కవులై ధన వంతులై యితర పేదకవులకు సహాయంచేసి నవ్యసాహిత్యానికి ద్విధోపకారం చేసిన వారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్ళు కృష్ణశాస్త్రిగారి, బాపిరాజుగారి పాటలు పాడి నవ్యసాహిత్యసభలు ప్రకాశింప చేసినవాళ్ళు. తన నేర్పిన భరతనాట్యం చేత బి.వి. నరసింహారావుగారు, కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావుగార్ల పాటలు పాడి నవ్యసాహిత్యాన్ని విస్తరింప చేసినవాడు. రాయలసీమలో చిలుకూరి నారాయణరావుగారి శిష్యులుగా కొందరు మధురకవు లున్నారు. చిన్నకథలు వ్రాసినవారున్నారు. నంద్యాలలో కొంచరిని చూచితిని. వారిపేర్లు జ్ఞాపకములేదు. పుట్టపర్తినారాయణాచార్యులుగారు తన కవిత్వం చేతా విమర్శనచేతా రాయలసీమలో నవ్యసాహిత్యోద్యమానికి దోహదం చేస్తున్నారు.

ఈ నవ్యసాహిత్యంయొక్క అభిమానులు తెలుగుదేశములో ఒక కొసనుండి ఇంకో కొసవరకు వ్యాపించిఉన్నారు. మద్రాసులో వింజమూరి గోవిందరాజాచార్యులు గారు, నెల్లూరులో తూములూరి శివరామయ్యగారు, ఒంగోలులో నాయని నరసింహారావు నాయుడుగారు, బాపట్లలో వెలగపూడి సుబ్బారావు, మాధవపెద్ది కాళిదాసుగార్లు ఇట్లా ఆయాగ్రామాలలో వారే కాక, ఇంకా ఎంతోమంది, మఱింకా చాలా గ్రామాల్లో ఇంకెందరో కలరు. అందరిపేర్లూ చెప్పటానికి వ్యవధిచాలదు. ఇది ఈ పరిషత్తు యొక్క పరిణాహమును తెలియ చేస్తుంది.

ఈ ఉద్యమం ఒక ప్రాంతానికి చెందిందిగాదు. ఒక తెలుగు దేశానికి సంబంధించింది కాదు. భారతదేశంలో ప్రతి రాజధానిలో యీ ఉద్యమం ఉంది. బెంగాలులో దీని కౌత్కృష్ట్యం ప్రాప్తించింది. హిందీలో ప్రేమచంద్ మొదలైనవారు మహాకవులుగా పరిగణింప బడుతున్నారు. ఇంగ్లీషులో ఉన్న పి.ఇ.యన్. పత్రిక, హిందీలోని 'హంస' పత్రిక యీమహోద్యమానికి భారతదేశం మొత్తంమీద యేకీభావం తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నవి. నాలుగు సంవత్సరాల కొకసారి అయినాసరే, ఒక సంచికవేసి నవ్యసాహిత్యంలో తామున్నామని చూపించతలచుకొన్న యువకు

లున్నారు. ఆ రేడ్లక్రింద ప్రకటింపబడిన వైశాఖి, యేడాదిక్రింద నిజాం రాష్ట్రమునుంచి వచ్చిన కిన్నెర యీ యుద్యమములోని అంతర్వేణికలు.

ఇవన్నీ నవ్యసాహిత్యంలోని ఘట్టాలు. ఈమహాస్వరమంతా యేకముఖంగా పనిచేస్తోంది. వీరందరూ నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యులుకారు. కొందరగుటకు ఒప్పుకోరు. ఏత దభిముఖంగా నడుస్తున్నామనే అంగీకరించరు కొందరు. అయినా ఎక్కడ ఉన్నా ఇది ఒక మహాసౌభ్రాత్రతాపేక్షి. నవ్యసాహిత్యానికి ఒకపరిషత్తు యేర్పరచి యీ పర్యాలోచన చెయ్యటం యీ పరామర్శ జరపటం, యేడాది కేడాదికీ యీ కళ్యాణాలు చెయ్యటం కొందరే పూనుకున్నారు. అంతమాత్రాన ఇది యేకదేశవిషయం కాదు.

ఈనవ్యసాహిత్యంయొక్క భవిష్యత్తు యేమిటో చెప్పటం సాధ్యంకాదు. దీని భవిష్యత్తంతా రాచకీయంమీద ఆధారపడి ఉంది. స్వరాజ్యంవస్తే దాని స్వరూపం యెట్లా ఉంటుందో? ఇంగ్లీషుచదువు నిలుస్తుందో నిలవదో! రాజ్యాంగం కాంగ్రెసు చేతుల్లో ఉంటుందో, సామ్యవాదుల చేతుల్లోఉంటుందో? విశ్వవిద్యాలయాల చదువులలో సంస్కృత దేశభాషలకు ప్రాధాన్యం వస్తుందో రాదో? ఇందులో యేది యెట్లా జరిగినా, నవ్యసాహిత్యం అట్లాంటి మార్పుపొందుతుంది. తక్కిన భావాలెట్లా ఉన్నా క్రొత్తగా తెచ్చుకొన్న కావ్యభేధాలు సారస్వతంలో నిలుస్తవి. ఏది ఎట్లాఉన్నా రచయిత లందరూ ఒక విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. భావం నీయిష్టం వచ్చినట్లు చేసుకో. ఆభావానికి అమలు ఉన్నన్నాళ్లు ఆభావం అమలులో ఉంటుంది. భాషమాత్రం అచ్చంగా నీ తెలుగుభాష వాడు! నుడికారంలో, ప్రయోగించడంలో, తెలుగుపుస్తకంలో తెలుగు కాని పోకడ పోవద్దు. ఇది ఒక్కటే లక్ష్యంగా పెట్టుకుంటే నవ్యసాహిత్యానికి భయం లేదు.

వినోదాన్ని - అదికూడా ఒక పక్షమువారికి* కల్పిస్తూ - ఉన్నదేకాని ఈ అభ్యుదయ వాఙ్మయం◆ శాశ్వత స్పందంకల్గించేదిగా లేదనడము యధార్థ విషయము.

ఈవిధముగా ఈదశవర్ష (1940-1950ల మధ్య) కాలములో విజాతీయ ధోరణులు నవ్యాంధ్ర సాహిత్యములో పొడచూపుతూ వచ్చి పండితలోకములో పెద్దకలవరాన్నే కల్గించినవి. దేశ స్వాతంత్ర్యం లభించిన (1947) తరువాత - అంటే ఈమూడు నాల్గు సంవత్సరాలలోను వెలువడిన సారస్వతముకూడ చాలవరకు విప్లవభావాలను పోషించేదిగా ఉన్నదనే తెలుసుకుంటాము; అర్థకామాల కధిక గౌరవం సంఘంలో నేడు లభించడంమూలాన వాఙ్మయములోను ఆ భావాలే విరివిగా పోషింపబడుతూ వస్తున్నవి. కొద్దికాల మిటీవల కాగితము కరువు కారణముగా గ్రంధ ప్రచురణము బహుళముగా సాగకపోయినప్పటికీ కుక్కగొడుగులవలె ఎన్నెన్ని పత్రికలో (మఖలో పుట్టి పుబ్బలో అంతరించినవి) వెలసి నవ్యుల ననేకుల బులపాటమును తీరుస్తూ వస్తున్నవి. దేశములో శాంతి నేటికీ ఎలా యింకా స్థిరపడలేదో అలాగే సారస్వతరంగానకూడ స్వాస్థ్యము కుదరలేదనే చెప్పవలె. స్వాతంత్ర్యానికీ స్వేచ్ఛకూగల అంతరాన్ని గుర్తించలేక ప్రజలు విచ్చలవిడిగా విశృంఖలంగా ప్రవర్తిస్తున్నారు. సంఘములో వర్గవైమనస్యాలు పెచ్చుపెరిగి పోతున్నవి; నీతి నియమాలను పాటించడముగాని, వయసుకు-విద్యకు-హోదాకు గౌరవం ఇవ్వడము గాని సుతరాము గిట్టని వ్యక్తిస్వాతంత్ర్యం హెచ్చిపోతున్నది. వీటికి

---

* 'ఆంధ్రప్రభ' 1947 జనవరి 21వ తేదీనాడు అభ్యుదయ సాహిత్యముపైన సంపాదకీయ వ్యాసము వ్రాసినది; అందులో విశ్వనాధ సత్యనారాయణగారి 'వీరవల్లడ'నే నవలపైన తీవ్ర విమర్శఉంది; చాతుర్వర్ణ్యమును గూర్చిన సంప్రదాయ సిద్ధమైన చిత్రణ మున్నందుకు ఎంత ఉక్రోషము వెళ్ళగ్రక్కుతున్నదీ వ్యాసం! ఈవ్యాసాన్ని బట్టి బ్రాహ్మణులపైన కత్తి కట్టడమే 'అభ్యుదయ' మార్గలక్ష్యమనీ, బ్రాహ్మణేతరుల ఉద్యమమిా అభ్యుదయోద్యమమనీ అనుకోడానికి వలను పడుతున్నది. సంఘములోని బ్రాహ్మణాధిక్యాన్ని నిరసించే నాగరిక దినాలుగదా ఇవి!

◆ "With regard to progressive literature, my own impression is that it occasionally errs against good taste (not morality).

-Prof. Mahammad Sadiq, "20th century Urdu Literature"

తగినట్లుగా కామపరములైన పత్రికలు బయలుదేరి, పుస్తకాలు ప్రచురితాలౌతూ ఈకాలానికి సారస్వతరంగం అధోగతి పాలవుతున్నట్లు గమనిస్తాము;* అయితే సంప్రదాయవాదులు,కళావిదులు అయిన వారొకవైపు నుంచి నరుక్కొని వస్తున్నారనే విషయాన్ని ముందు గమనిస్తాము.కనుక ఇప్పటికి నిరాశ కల్గుతున్నా కొంత ధైర్యం వహించడానికి అవకాశము లేకుండా పోలేదు!

---

* 'రూపవాణి, తెనుగుసినిమా, సావిత్రి, సూర్యప్రభ' మొదలైన సినిమా పత్రికలూ, 'జ్యోతి, రేరాణి, అభిసారిక, మోహిని' మొదలైన కామపరములైన పత్రికలూ (వీటికి తెనాలికేంద్రము!) అనేకము బయలుదేరి ఈనాటి యువతీయువకుల చిత్తాలను ఆకర్షిస్తూ మోహపెట్టుతున్నవి; ఇవేకాక తుచ్ఛకామాన్ని పోషించే గ్రంథాలు అనంతముగా ప్రచురితమౌతూ విలాసవినోదాలతో కాలాన్ని వ్యయపరిచే బాధ్యతారహితులు, నిర్వ్యాపారులు అయిన ఆసాములను, ముఖ్యముగా విద్యార్థులను ఆకర్షించి వారిని కామానికి బానిసలుగా చేసుకొంటున్నవి!